## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ సప్తగిరి వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సప్తగిరి వెబ్ సైట్: https://www.scribd.com/search?query=sapthagiri
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## సప్తగిరి వారి వెబ్ సైట్

## https://www.scribd.com/search?query=sapthagiri



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



ఈతని మూలమెపో యిలఁగల ధనములు
యీతఁడు మాకు గలఁడు యెంత లేదు ధనము.

విరతి మాధనము, విజ్ఞానమే ధనము
మరిగిన తత్త్వమే మా ధనము
పరము మా ధనము, భక్తే మా ధనము మా-
కరిరాజ వరదుఁడే కైవల్యధనము.

శాంతమే మా ధనము, సంకీర్తనే ధనము
యెంతైనా నిశ్చింతయే ఇహధనము
అంతరాత్మే మా ధనము, హరిదాస్యమే ధనము
యింతటా లక్ష్మీకాంతుఁ డింటి మూలధనము.



ఆనందమే ధనము, ఆచార్యుడే ధనము
నానాఁట బరిపూర్ణమే ధనము
ధ్యానమే మాధనము దయే మా ధనము
పానిన శ్రీవేంకటాద్రి పతియే మా ధనము.

--అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన : 457,
రాగం : బౌళి, సంపుట : 2 (1981)




## ఉద్ధరణ

సప్తగిరి ప్రతి సంచికా ఎంతో బావుంటోంది. ప్రతి నెలా పత్రిక కోసం ఎంతో ఎదురు చూస్తుంటాము. తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఎన్నో పథకాలు చేపట్టి భక్తులకు, యాత్రికులకు ఎంతో సేవ చేస్తున్నారు. అదేవిధంగా దేశంలోవున్న జీర్ణదేవాలయాల ఉద్ధరణ కోసం ఏదైనా పథకం చేపడితే ఎంతో బావుంటుంది. దేశంలో ఎన్నో పురాతన ఆలయాలు దిక్కులేక శిథిలమై పోతున్నాయి. అలాంటి ఆలయాలకు తి.తి. దేవస్థానం చేయూత నివ్వటం ఎంతైన అవసరం. వనాభివృద్ధి పథకం, నిత్యాన్నదాన పథకంలా ఈ పథకాన్ని కూడ కొనసాగించాలని మా హృదయపూర్వక విన్నపం.

బి.వి. సుధాకరరావు గత్పలవలస
బి.వి. సుభాషిణి ,,
బి.వి. సరోజ ,,
బి.వి. తపస్వి ,,
బి.వి. తేజస్వి ,,
బి.వి. శాండిల్య మహాముని ,,

## బాధ

93 నవంబరు సప్తగిరి సంచిక చాలా బావుంది. అయితే ముఖచిత్రాన్ని రంగుల్లో వేయకపోవడం మాకు చాలా బాధ కలిగించింది. ఇన్ని రోజులు రంగుల్లో వేసి ఇప్పుడు ఎందుకు మానివేశారో తెలియదు. శీర్షికలన్నీ చాలా బావున్నాయి. ముఖ్యంగా ద్వారం వి.జె. లక్ష్మిగారి శ్రీకృష్ణగాన తరంగిణి వ్యాసం చాలా బావుంది. రచయిత్రికి ప్రచురించిన మీకు మా ధన్యవాదాలు.

కె. జయలక్ష్మి పీలేరు
కె. సుభద్ర ,,
కె. వసంత ,,
కె. నాగమణి ,,
కె. నీలవేణి ,,

## బావుంది

93 నవంబరు సప్తగిరి సంచిక చాలా బావుంది. ముఖ్యంగా మన దేవాలయాలు శీర్షికలో మీరు ప్రచురించిన వ్యాసం మరీ మరీ చదువుకున్నాం. ఈ శీర్షిక క్రింద మీరు దేశంలో వున్న ఎన్నో దేవాలయాల గురించి మాకు తెలియజేయటం చాలా ఆనంద దాయకం. ప్రతినెలా మన దేవాలయాలు వ్యాసాల్ని చించి బైండు చేయించుకుంటున్నాము.

ఎ. గోపాలరాజు నర్సాపురం
ఎ. భాస్కరరాజు ,,
ఎ. రవివర్మ ,,
ఎ. సుమతి ,,

## రామాయణం

సప్తగిరిలో ధారావాహికంగా మీరు ప్రచురిస్తున్న రావులవారి రామాయణం చాలా బావుంటోంది. పత్రిక రాగానే ముందు రామాయణమే చదువుకుంటున్నాం. ప్రతినెలా మరిన్ని ఎక్కువ పద్యాలు వేయువలసిందిగా మా కోరిక. అదే విధంగా పత్రికలోని అన్ని శీర్షికలు బాగున్నాయి. నవంబరు నెలలో కవరు పేజి ఎందుకు రంగుల్లో వేయలేదో అర్థం కావడంలేదు.

బి. రాధ చిత్తూరు
బి. రామకృష్ణారెడ్డి ,,
బి. సరస్వతి ,,
బి. లక్ష్మమ్మ ,,

## ఓంకార నాదం

ఇటీవల సప్తగిరిలో మీరు ప్రచురించిన ఓంకార నాదం కథ చాలా బావుంది. ప్రతి సంచికలోను బాలప్రబోధం కథలు కనీసం నాలుగు అయినా ప్రచురించండి. ఈ కథలు చిన్నపిల్లలేకాక పెద్దలు కూడ చదువుతారు. శీర్షికలన్నీ బాగున్నాయి.

డి. రాఘవేంద్ర బనగానపల్లి
డి. చంద్రకుమార్ ,,

❀❀❀

# శుభాకాంక్షలు

## 1994

మా పాఠకులకు, ఏజెంట్లకు, రచయిత(త్రు)లకు అందరకీ--

## నూతన సంవత్సర శుభాకాంక్షలు

అందరికీ ఆ సప్తగిరీశుడు ఆయురారోగ్య ఐశ్వర్య ఆనందాలు ప్రసాదించాలని ప్రార్థిస్తూ-






గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త - సంపాదకులు
కాటపాటి సుబ్బారావు, ఎమ్.ఎ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
పి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జాలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340

విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# ఈ సంచికలో.... జనవరి 1994

సంపుటి 24 సంచిక 8




హిందువుల పండుగల్లో పెద్ద పండుగ, పెద్దల పండుగ సంక్రాంతి. సూర్యాది గ్రహ రాశుల అంతర గమనం సంక్రాంతి అని చెప్పబడింది. సూర్యుడు ఒక రాశి నుండి ఇంకో రాశిలోకి ప్రవేశించడాన్ని 'సంక్రమణం' అంటారు.

సూర్యుడు ప్రతినెలా ఒక్కో రాశిలోకి ప్రవేశిస్తుంటాడు. కాబట్టి ప్రతినెలా ఒక సంక్రమణం అంటే సంక్రాంతి వస్తుంది. కానీ అన్ని సంక్రాంతుల్లోకి సూర్యుడు పుష్యమాసంలో మకర రాశిలోకి ప్రవేశించడంవల్ల ఏర్పడే మకర సంక్రమణమే (మకర సంక్రాంతి) ప్రాధాన్యం వహించింది.

"కాలే పాత్రే తథా దేశే
ధనం న్యాయాగతం తథా
యద్దత్తం బ్రాహ్మణశ్రేష్ఠే
స్తదనన్తం ప్రకీర్తితమ్"

అని దానం గూర్చి చెప్పబడింది. అనగా తగుకాలమున, దేశమున, పాత్రమున, న్యాయాగత ధనమును దానం చేస్తే అనంత ఫలప్రదమని విష్ణు ధర్మోత్తర పురాణ వచనం.

ద్వాదశ సంక్రాంతుల్లో ఒక్కొక్క సంక్రాంతికి దానం చేయవలసిన వస్తువుల్ని గూర్చి వ్రత గ్రంథాల్లో చెప్పబడింది.

మేష సంక్రాంతికి పొట్టేలు, వృషభ సంక్రాంతికి గోవులు, మిథున సంక్రాంతికి ఆహారపదార్థాలు, వస్త్రాలు; కర్కాటక సంక్రాంతికి గో, ఘృత దానాలు; సింహ సంక్రాంతికి బంగారు చేర్చిన వాహనదానం; కన్యా సంక్రాంతికి వస్త్రాలు; వృశ్చిక సంక్రాంతికి వస్త్రాలు లేక గృహదానం, ధనుస్సంక్రాంతికి వస్త్ర వాహనాలు; మహా సంక్రాంతికి సమిధలు, అగ్ని; కుంభ సంక్రాంతికి ఆవులు, నీళ్లు, గడ్డి; మీన సంక్రాంతికి పూలు - దానం చేయాలని శాస్త్ర వచనం.

వీటిలో ముఖ్యమైన మకర సంక్రాంతికి ప్రత్యేకంగా మరికొన్ని దానాలు చెప్పబడ్డాయి. సంక్రాంతికి నువ్వుల దానం ప్రశస్తమైంది. ఈ నువ్వుల పంపకం శని ప్రీత్యర్థమనీ, శని ప్రభావ పరిహారార్థమనీ అభిప్రాయాలున్నాయి.

కొందరు నువ్వులు, చక్కెర, పప్పులు కలిపి దానంచేస్తే, ఇంకొందరు తెల్లనువ్వులు, బెల్లంపొడి, శనగపప్పు, కొబ్బెరముక్క, వేరుసెనగ గింజలు కలిపి దానం చేస్తారు. ఈ

# భక్తి గేయము



సాకీ: ప్రభో! దీనశరణ్యా! శ్రీనివాసా!

పల్లవి: తిరుమల గిరిపై ఠీవిగ నిలిచిన
సదమల హృదయా సనాతనా
కరుణను గనుమా ఘనాఘనా
తిరుమల॥

కాల చక్రమును గడియారమున
గ్రహముల త్రిప్పెడి శక్తివి నీవే
పగలు రేయి కాలము నీవై
నిరతము గాంచెడు సాక్షివి నీవే!
తిరుమల॥

అణువణువులలో వెలసిన దేవా
విశ్వము కుక్షిలో దాచిన దేవా
ఈ కలిలోన వేంకటపతివై
సాకారమున వెలసిన దేవా
తిరుమల॥

రచన
ఎమ్.జె. భాస్కరరావు

చంద్రశేఖర్

మిశ్రమానికి 'నగెళ్ళు' అని పేరు. ఈ మిశ్రమాన్ని పాత్రలో పోసుకుని పంచదారతో చేసిన బొమ్మలు, చెరకు ముక్కలు, అరటి పండ్లు కూడా కలిపి ఇంటింటికి తీసుకెళ్లి పంచుతారు.

కొన్ని ప్రాంతాల్లో నువ్వులు పొట్టుతీసి, కొబ్బెర, బెల్లం ముక్కలు వేసి పంచిపెడతారు. లేదా నువ్వుల్ని చక్కెరపాకం పట్టి ఆ పాకాన్ని పుష్పాకృతిలో ఉండేలా అచ్చు పోసి దానం చేస్తారు. నువ్వులు పంచుతూ 'నువ్వులు తిని నూరేళ్లు జీవించు' అని చెబుతారు.

నువ్వులేకాక నెయ్యి, కంబళ్లు, భూ, గో సువర్ణదానాలు కూడా సంక్రాంతికి ముఖ్యమైనవే. నెయ్యి, నువ్వులు ఉష్ణకారకాలు కాగా కంబళి 'ఈ బలవంతం న బాధతే శీతః' అన్నట్లు చలిబాధనుండి రక్షిస్తుంది. నెయ్యి ఉష్ణమే కాక మంచి తేజస్సును, ఓజస్సును కలిగిస్తుంది.

'శివరహస్యం' అనే గ్రంథంలో నువ్వులేకాక ఆవాలు కూడా దానం చేయాలని చెప్పబడింది. సంక్రాంతనాడు తమలపాకులు దానం ఇవ్వడంవల్ల కలిగే సత్ఫలితాల్ని గూర్చి శ్రీకృష్ణుడు ధర్మరాజుతో చెప్పినట్లు 'వాయుపురాణం' వల్ల తెలుస్తుంది.

బౌద్ధ సాహిత్యంలో కిచిడి ధాన్య దానం గూర్చిన ప్రస్తావన కన్పిస్తుంది. కొన్ని ప్రాంతాల్లో సంఖ్యకు ప్రాధాన్యమిచ్చి దానం చేయడం ఆచారం. ఏదైనా వస్తువును కాని, పూలను గాని, పండ్లనుగాని ఒక నిర్దుష్ట సంఖ్యలో దానం చేస్తారు. కొన్ని చోట్ల దానం చేయాల్సిన మనుష్యుల సంఖ్యకు ప్రాధాన్యం కన్పిస్తుంది.

ఆహార ధాన్యాదులు, వస్త్రాదులు దానం చేయడంవల్ల కలిగే సత్ఫలితాల్ని గూర్చి కొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. ద్రౌపది పూర్వ జన్మలో చేసిన వస్త్రదానం వల్లనే ఆమెను శ్రీకృష్ణుడు వస్త్రాపహరణ సమయంలో ఆదుకున్నాడనే కథ అందరికీ తెలిసిందే. అలాగే శ్రీకృష్ణుని పెంచినతల్లి యశోద వల్ల చిలికి వెన్న అందరికీ పంచి పెట్టడం వల్లనే ఆమెకు

శ్రీకృష్ణుడిలాంటి కొడుకు లభించాడని ఒక కథ ప్రచారంలో ఉంది. ద్రోణాచార్యుడి భార్య అయిన కృపి చేసిన దానాల ఫలితంగానే ఆమెకు మేటి వీరుడనిపించుకున్న అశ్వత్థామ పుత్రుడయ్యాడని మరో ఐతిహ్యముంది.

ఉపనిషత్తుల్లో సంక్రాంతి కాలం దానాదుల కాలమని పేర్కొనబడడం చేత కూడా ఈ పండుగ దానాలకు ప్రసిద్ధి పొందింది. సంక్రాంతికి రైతుల పంటలు ఇంటికి చేరి చేతినిండా ధాన్యం గలగల లాడుతుంటుంది. అందుకే ఆ సమయంలో పల్లె కళాకారులు, దాసర్లు, జంగమలు అందరూ ఇంటింటికీ తిరిగి దానం స్వీకరిస్తూ ఉంటారు. సంక్రాంతికి గుమ్మడి కాయలెక్కువగా పండుతాయి కాబట్టి 'కూష్మాండదానం' కూడా సంక్రాంతి దానాల్లో ముఖ్యమైందే.

కలిమికి, పుష్కలత్వానికి మారుపేరైన సంక్రాంతి పండుగనాటి దానం అన్ని విధాలా ప్రశస్తి పొందింది.

"దానం దేవాః ప్రశంసన్తి
మనుష్యాశ్చ తథా ద్విజాః
దానేన కామానాప్నోతి
యాన్యాంశ్చిన్మనసేచ్ఛతి."

అని శాస్త్రవచనం. దానం చేయడాన్ని దేవతలు, మనుష్యులు ప్రశంసిస్తారని, దానం చెయ్యడం వల్లనే మానవులు తమ కోరికలను నెరవేర్చుకోగలుగుతున్నారని చెప్పబడింది.



# గొంతెత్తి ఒకసారి

శ్రీ మద్దేల పుల్లయ్య



గొంతెత్తి ఒకసారి గోవిందయని అంటే
చింతలన్నీ బాపు శ్రీ వేంకటేశుండు ॥గొం॥

కోరి కొల్చెడి వారి కొంగుబంగారమ్మతడు
సేవించు నిజభక్త చింతామణీతండు
కామితార్థము లిచ్చు కల్పవృక్షమ్మితడు
అమృతము వర్షించు కామధేను వితడు ॥గొం॥

భక్తి యొక్కటె ప్రజల వాంఛించు నీతండు
భక్తి దానము కోరి ముక్తినైన నొసగు
భక్తవత్సలుడని వాసి గాంచినవాడు
వైకుంఠమును వీడి వేంకటాద్రి యందుండు ॥గొం॥

మీన కమఠ కోల శ్రీ నృసింహ వటువు
భృగురామ రఘురామ కృష్ణుండు బుద్ధుండు
మున్ను తొమ్మిది రూపముల దాల్చినతండు
విష్ణుయశునిగ పుట్టు విష్ణుండు నీతడే ॥గొం॥



'చంద్రశేఖర్'

# గురువు మాట

— శ్రీ బెహర ఉమామహేశ్వరరావు

యోగీంద్రస్వామి దేశసంచారం చేస్తున్నాడు. ధవళేశ్వరం అడవులలో ఆశ్రమం కట్టడానికి యోగ్యమైనదని అతని శిష్యులు చెప్పారు. ఆ ప్రాంతం ప్రశాంతంగా వుందని గ్రహించాడు యోగీంద్రస్వామి. ఆశ్రమ నిర్మాణం జరిగింది.

అనేకమంది భక్తులు ఆశ్రమానికి వస్తూండేవారు. అతని ఉపన్యాసములు విని, భక్తిని, జ్ఞానాన్ని పెంపొందించుకునేవారు. ఈ విధంగా రద్దీ పెరిగింది. వచ్చిన యాత్రికులు స్వామికి కానుకలు సమర్పించుకోవడం ప్రారంభించారు. ఆ ధనంతో పర్ణశాలలకు బదులు శాశ్వత భవనాలు నిర్మాణం అయ్యాయి. రాజోద్యోగులు కూడా అతని శిష్యులుగా మారారు. అనేకమైన ఆలయాలు, విద్యాలయాలు ప్రారంభించారు. భక్తులు ఇచ్చిన కానుకలు విలువ కోట్లాది రూపాయలు అయింది. అంతేకాదు రోజు రోజుకు పెరగసాగింది.

ఒకసారి యోగీంద్రస్వామి గురువుగారైన చిన్మయానందస్వామి అక్కడికి వచ్చారు. ఆ ప్రాంతం అంతా దర్శించారు. యోగీంద్రస్వామి తన గురువు పాదములు కడుగుతూ, "మీ దగ్గర సంపాదించిన జ్ఞానం ప్రజలకు అందించి, వారిచ్చిన కానుకలు స్వీకరిస్తూ ఈ ప్రాంతంలో భక్తి, జ్ఞానం, నా కృషితో ప్రచారం చేసాను" అని గర్వంగా చెప్పాడు.

గురువు అయిన చిన్మయానందస్వామి చిన్న నవ్వు నవ్వాడు. యోగీంద్రుడికి ఆ నవ్వులో గల అర్థం తెలుసుకోవాలని అనిపించింది. "గురుదేవా! మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు.

"శిష్యా! యోగులకు ధనం మీద ఆశ కూడ నిది. ఫలితం ఆశించని జ్ఞాన బోధన చేయాలి" అన్నాడు చిన్మయానందుడు.

భక్తి, జ్ఞానం, అన్నీ ధనంతో కూడి ఉన్నాయి. మీకు తెలియనిదా?" అన్నాడు యోగీంద్రుడు.

"ఆ విషయం, తొందరలో నీకు అర్థంకాగలదు" అంటూ చిన్మయానందుడు కదిలాడు.

కొద్దిరోజుల తరువాత, యోగీంద్రుని శిష్యులలో స్పర్థలు కలిగాయి. వారు అక్కడగల ధనం కోసం, సంపదలకోసం తగవులాడడం ప్రారంభించారు. భక్తికి బదులు ద్వేషాలు మనసులలో పెరిగాయి. సంపదల కోసం బందిపోట్లు అచట సంచరించసాగారు. ఈ విషయం కొత్వాలుకు తెలియజేసారు. భక్తులకు అక్కడ ప్రశాంతతకు బదులు భయం చోటుచేసుకుంది. చిన్మయానంద స్వామి మరల ఆశ్రమానికి వచ్చారు. యోగీంద్రుడు గురువుగారి పాదాలపై పడి, "గురుదేవా! నన్ను రక్షించండి. ఈ ప్రాంతాన్ని కాపాడండి" అని ప్రాధేయపడ్డాడు. చిన్మయానందుడు నవ్వుతూ, "శిష్యా! ఈ ప్రాంతాన్ని మన చక్రవర్తికి దత్తత ఇచ్చిన నీ కోరిక తీరగలదు" అని బోధించాడు. గురువుమాట ప్రకారం అంతా చక్రవర్తికి అప్పగించాడు. మనసులో భారం తీరింది. గురువువెంట హిమాలయాలకు బయలుదేరాడు యోగీంద్రస్వామి.





# శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలలోని మానసిక ప్రవృత్తులు

శ్రీమతి ఎస్. ఉమాదేవి



వ్యాసో నైగమచర్చయా
మృదుగిరా వల్మీకజన్మా మునిః
వైరాగ్యే శుక ఏవ భక్తి
విషయే ప్రహ్లాద ఏవ స్వయం
బ్రహ్మానారద ఏవ చా-
ప్రతిమయోః సాహిత్య సంగీతయోః
యో రామామృతపాననిర్జిత
శివస్తం త్యాగరాజం భజే.

ఆగమ విషయ చర్చయందు వ్యాసుని వంటివాడు, మృదువైన మాటలు చెప్పుట యందు వాల్మీకి మహర్షి వంటివాడు భక్తి విషయములో ప్రహ్లాదునితో సమానుడు, రామ నామామృత ఆస్వాదనము నందు శివునితో సమానుడు అయిన శ్రీ త్యాగరాజునకు నమస్కరించుచున్నాను.

సంగీత త్రిమూర్తులలో ఒకరైన శ్రీత్యాగరాజస్వామి యొక్క ముఖ్య శిష్యులు శ్రీ వాలాజీపేట వెంకటరమణ భాగవతార్ తన గురువుయొక్క గొప్పతనమును వర్ణించుచూ రాసిన శ్లోకమిది.

శ్రీ త్యాగరాజస్వామి రామునిపై అనేక వేల కీర్తనలను వ్రాసిరి. అందు కొన్ని భక్తిపరముగాను, కొన్ని మనః పరముగాను లోకపరముగాను కలవు.

శ్రీ త్యాగరాజు రామ సందర్శనము కొరకై పరితపించుచూ మానసికముగ అనేక పరివర్తనలు చెంది చివరికి రామానుగ్రహపాత్రుడైనాడు. ఈ స్థితులను ఔత్సుక్యము, దైన్యము, రోషము, వితర్కము, నింద, స్వయోగ్య కదనము, భగవదను భవము, తాదాత్మ్య స్థితులుగా వర్ణించవచ్చును.

## ఔత్సుక్యము

ఔత్సుక్యమనగా సన్నిహిత భావము. ఈ స్థితియందు త్యాగరాజు రామునితో దర్శనము కొరకై బ్రతిమాలుతూ రాముని దృష్టి తనపై పడవలెనని కోరును. ఈ భావమును ఆయన వాచస్పతి రాగమునందలి 'కంటజూడుమీ ఒక పారి క్రీగంట జూడుమీ' అను కీర్తన యందు వివరించిరి. 'ఎన్నడు జూతునో ఇనకుల తిలకా' అని రాముని చంద్రబింబము వంటి రాముని ముఖము చూడవలెనని ప్రాధేయపడిరి. ఈ కీర్తన కళావతి రాగములో రచించిరి. 'రామా! కోదండరామా!' అను భైరవి రాగ కృతిలో 'రామానీకొక మాట నాకొక మాట 'అని రామునితో సంభాషించవలెనని, 'సార్వభౌమ సాకేత రామ మనసార బల్కరాదా' అను కీర్తన యందు మనసార రామునితో మాట్లాడవలెనని ప్రార్థించిరి. 'సుధామాధుర్య భాషణ' అను సింధురామ క్రియరాగ కీర్తనలో రాముని మాటలు అమృతము వంటివని వర్ణించుచూ రామ కథామృతమును త్రాగి, దివ్యమైన రామ నామమును కీర్తించి తృప్తి నొంది యున్న త్యాగరాజు రామదివ్య సాక్షాత్కారమునకై పరిపరి విధముల ప్రార్థించిరి.

# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం



శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి, శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.



శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.



శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి!
-శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం



శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.



శ్రీ అగస్త్యేశ్వరాలయం-తొండవాడ.
కల్యాణి తటాన ఉన్న పురాతన దేవాలయం



శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా వెలకొన్న దేవాలయం





బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6గం॥కు, 10గం॥కు
సాయంత్రం: 3గం॥కు




టిక్కెట్టు వెల:
పిల్లలకు: రూ. 10/-
పెద్దలకు: రూ. 20/-
ప్రతిచోటా ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR_

## నిర్వేదము

సన్నిహిత భావముతో రాముని పొగడి ఎంత బ్రతిమాలినను త్యాగరాజునకు రామదర్శన భాగ్యము కలుగక పోవుటచే విచారము కలిగినది. ఇట్టి పరిస్థితిని నిర్వేదమనవచ్చును. 'చలమేలరా' అను కీర్తనలో నిన్ను ప్రేమించి భక్తితో ఆరాధించుచున్న నాపై నీకు దయ కల్గదేమని బాధను వ్యక్తపరచిరి. 'తొలినే జేసిన' అను కీర్తనలో పూర్వజన్మలో నేను చేసిన పాపమువలన ఇట్టి కర్మ ననుభవించుచున్నానని నిందించుకొనిరి. 'తొలిజన్మమునచేయు' అను కీర్తనలో రామునిపై భక్తి కలిగి రాముని కీర్తించుట ఆరంభించిన సమయమున వర్జకాలమేమో అని అందువలననే ఇన్ని ఆటంకములు కల్గుచున్నవని సందేహము కల్గి బాధపడిరి.

## దైన్యము

తర్వాత త్యాగరాజ స్వామి దైన్యముగా తన బంధుమిత్రాదుల వలన కలిగిన ఇబ్బందులను అనేక కీర్తనలలో వ్యక్తపరచిరి. నీ భక్తుడనై నేను నీకు పరితపించుచూ, నీవు ఎప్పుడు అనుగ్రహించెదవో అని ఎన్నాళ్లు ఎదురుచూచెదను. నీ భక్తుడిట్లు ఎదురు చూచుట నీకు చులకన కదా అని దీనముగా ప్రార్థించుచూ కాపి రాగములో 'ఎన్నాళ్లు నీ దోవ చూతు రామ ఏమని నే ప్రొద్దు త్రోతు' అని బాధను వ్యక్తము చేసిరి.

## రోషము

త్యాగరాజస్వామి రాముని దర్శనమునకై సాత్వికముగా, జాలిగా, దీనముగా ప్రార్థించి రాముని దర్శనము దొరకక పోవుటచే రోషమును ప్రదర్శించిరి. కాంభోజి రాగములో మరిమరి నిన్నే మొరలిడ 'నీ మనసున దయ రాకున్నదే' అని అమీర్ కల్యాణిలో 'మానములేదా' అను కీర్తనలో కానము రానీవలె నిర్మోహిని, అని, అయోధ్యానగర పాలకులెవరూ ఇతరుల దుర్బోధలు వినిరే అని శుద్ధ సావేరి రాగములో 'నీకెవరి బోధన' అను కీర్తన ద్వారా తనకు కల్గిన రోషమును వ్యక్తపరచిరి.

## వితర్కము

ఈ స్థితిలో త్యాగరాజునకు తన భక్తిపై తనకు అనుమానము కల్గను ఎన్ని విధముల ప్రార్థించినను శ్రీరామచంద్రుడు చలించక పోవుటచే త్యాగరాజు నేను నిజముగా భక్తు లను బ్రోచునట్టి రామునే పూజించుచుంటినా అని అనుమానముతో వకుళాభరణమునందు ఏ రాముని నమ్మితినో నేనే పూం పూజ చేసితినో అని వాపోయిరి.

## నిందస్తుతి

రామునిపై త్యాగరాజునకు కోపము కల్గి ఏమి చేయలేక నిందాపూర్వకముగా స్తుతించును. సావేరి రాగములో దరిదాపు లేక వేడితే అను కీర్తనలో కరిధనములు కల్గితే కరుణించి బ్రోతువేమో అని పల్కిరి. నిన్ను శరణన్న విభీషణునికి లంకారాజ్యము నొసగితివి. సీత వద్దకు రాయబారిగా వెళ్లినందులకు ఆంజనేయునికి బ్రహ్మపదవి నొసగితివి. నిన్నే సేవించుచున్న నన్ను పట్టించుకొనకున్నావు అని చేసినదెల్ల మరచితివో అను తోడి రాగ కీర్తనలో రాముని దెప్పి పాడివిరి. తన కంటి చూపుతోనే రావణ సంహారము చేయ గల్గినది సీత అట్టి మా జానకి చెట్టబట్టగ మహారాజువైతివి అని కాంభోజ రాగ కీర్తన ద్వారా హేళన చేసిరి. భక్తులగు వారు నిన్ను



అడిగి సుఖములెవరు అనుభవించిరి అని మధ్యమావతిలోను, దేవకి వసుదేవులు భగవంతుడే పుత్రుని పొందవలెనని కోరగా అట్లే యని వరమిచ్చి జననమందు వారికి కారాగార ప్రాప్తి కలుగజేసితివి అని సాధించేనే అను ఆరభి రాగ పంచరత్న కీర్తన ద్వారా రాముని నిందా రూపమున స్తుతించిరి.

## స్వయోగ్య కథనము

భగవంతుని నిందారూపముగా స్తుతించి నప్పటికి ఫలితము లేక త్యాగరాజు కొన్ని కీర్తనల ద్వారా తన యోగ్యతను తెలుపుకొనిరి. పేరాసతో నేను అడ్డ త్రోవ పట్టలేదు పాలముంచినా, నీట ముంచినా నీవే గతి యని నమ్మితిని అని శ్రీరంజని రాగములో భువినిదాసుడని పేరాసచే అనే కీర్తన ద్వారా వ్యక్తము చేసితిరి.

## భగవదనుభవము

త్యాగరాజ స్వామికి రామసందర్శ నాభిలాష కొరకు కల్గిన ఔత్సుక్య నిర్వేద దైన్యాది మానసిక పరివర్తనల పిమ్మట రాముని దర్శించినట్లు సంభాషించినట్లు తన భగవదనుభవమును కొన్ని కీర్తనల ద్వారా కన్నులకు కట్టినట్లు వివరించిరి. సీతా లక్ష్మణులతో కూడిన కోదండరాముని నా ప్రాణనాథాయని సంబోధించుచూ మోహన రాగములో నన్ను పాలింపనడచివచ్చితివో అని, శ్రీనాథబ్రహ్మాదులకు కూడా దొరకని నీసేవా భాగ్యము నాకు కల్గినది అని ఏనాటి నోము ఫలమో అని భైరవి రాగము కృతిద్వారా భగవదనుభవము తెలిపిరి.

## తాదాత్మ్యస్థితి

భగవంతుడు అన్నెము పున్నెము తెలియని పసివారికి, అంత్యదశలో ఉన్న జ్ఞానులకు కన్పించును. ఈ ఇద్దరు బాహ్య ప్రపంచమునకు దూరముగా ఉందురు. త్యాగరాజ స్వామి ఇట్టి అతీత స్థితికి చేరుకున్న పిమ్మట శ్రీరామునితో తాదాత్మ్యస్థితిని పొందినట్లుగా కొన్ని కీర్తనలలో సూచించిరి.

నిరంతరము రామనామము జపించుటచే నా మనస్సు నిర్మలమైనది. పరమాత్మ

జీవాత్మ ఒక్కటియే అనెడి తత్త్వ నిశ్చయమే జ్ఞానము. అదియే అద్వైత స్థితి. అట్టి 'జ్ఞానమొసగరాదా' యని రాముని పూర్వికల్యాణి రాగములో స్తుతించిరి. భగవంతుని కీర్తించుట యందలి ఆనందపారవశ్యము వర్ణించుచూ 'ఇంతకన్నానందమేమో ఓరామరామ' అని బిలహరిలో పాడిరి. త్యాగరాజస్వామి వసంతరాగములో నాదలోలుడై బ్రహ్మానంద మందవే అని పాడిరి. ఈ కీర్తనలో సప్తస్వరములు వాటి భేదములతో కూడిన రాగములు వాటి వివరములను తెలిసికొని చిత్తశుద్ధిగా ఈశ్వరార్పణగా నాదోపాసనచేయు వారికి ఆ స్వరదేవతలు అమృతఫలముల నిత్తురని తెలిపిరి. నాదోపాసన మొనర్చి యేయే స్వర విన్యాసములతో పరమాత్మను కీర్తించినచో ఈశ్వర సాక్షాత్కారము లభించునో అట్టి స్వరసంకేతములతో సామగానము చేసిరో అట్టి విధులకు మ్రొక్కెద అని మాయా మాళవ గౌళరాగములో పాడిరి. బ్రహ్మవిష్ణు శివాదులు సైతము నాదోపసన చేసిరనియూ, తాను గూడ బ్రహ్మతత్త్వమును రాగలయాది రూపముగా భావించి భజించితినని చెప్పుచూ 'ఆనందసాగరమీద నీదేహము భూభారమె రామ' అని గరుడ ధ్వని రాగములో కీర్తించి బ్రహ్మానందసాగరమున ఓలలాడిరి.

త్యాగరాజస్వామి స్వరలయాది రాగములను తెలిసిన జన్మాంతర యోగసిద్ధుడు. సంస్కార సంపన్నుడు. గిరిపై నెలకొన్ని రాముని గురి తప్పక గంటె ననుచు రామానుగ్రహమును అనుభవించిన ధన్యమూర్తి. రామ తారక మంత్రవేత్త. రామనామామృతరసాస్వాది. రామభక్తి స్వామ్రాజ్యమున రహిమీర విహరించిన రసజ్ఞుడు. శ్రీరామ సాక్షాత్కారమును పొంది రామునితో అద్వైత సిద్ధిని పొందిని నాదయోగసిద్ధుడు.

రామభక్తి స్వామ్రాజ్యం
ఏ మానవుల కబ్బెనో మనసా
ఆ మానవుల సందర్శనం
అత్యంత బ్రహ్మానందమే మనసా.





# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం
## తిరుచానూరు
### నిత్యపూజానివేదనలు

సుప్రభాతం: ఉ. 5-00 గం. నుండి 5-30 గం. వరకు
సహస్రనామార్చన: ఉ. 5-30 గం. నుండి 6-00 గం. వరకు
శుద్ధి, మొదటిగంట: ఉ. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: ఉ. 6-30 గం. నుండి 11-30 గం. వరకు
శుద్ధి, రెండవగంట: ఉ. 11-30 గం. నుండి 12-00 గం. వరకు
సర్వదర్శనం: మ. 12-00 గం. నుండి సా. 6-00 గం. వరకు
శుద్ధి, మూడవగంట: సా. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: సా. 6-30 గం. నుండి రాత్రి 8-45 గం. వరకు
శుద్ధి రాత్రి 8-45 గం. నుండి 9-00 గం. వరకు
ఏకాంతసేవ: రాత్రి 9-00 గం. నుండి 9-30 గం. వరకు

### శుక్రవారాలలో

అభిషేకం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(రూ. 100-00 టిక్కెట్‌తో ఒక్కరికి మాత్రమే ప్రవేశం)*
అభిషేక దర్శనం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(ఒక్కొక్కరికి రూ. 5-00 టిక్కెట్)*

### ఆర్జిత సేవలు

| | | | |
|---|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం | ... | రూ. | 63-00 |
| గజవాహనం | ... | రూ. | 32-00 |
| తిరుప్పావడ | ... | రూ. | 3000-00 |
| డోలోత్సవం | ... | రూ. | 150-00 |

### ఆర్జిత ప్రసాదాలు

| | | | |
|---|---|---|---|
| దోసె | ... | రూ. | 100-00 |
| దధ్యోదనం | ... | రూ. | 75-00 |
| పులిహోర | ... | రూ. | 100-00 |
| పొంగలి | ... | రూ. | 200-00 |
| చక్కెర పొంగలి | ... | రూ. | 200-00 |
| కేసరి బాత్ | ... | రూ. | 300-00 |
| శాకరిబాత్ | ... | రూ. | 250-00 |
| సీరా | ... | రూ. | 400-00 |

ఇవేగాక, భక్తాదులు రూ. 1-50 టిక్కెట్‌తో తమ
గోత్ర, నామాదులతో అమ్మవారికి అష్టోత్తరశతనామ పూజ చేయించవచ్చును.




వృక్షజాతి ప్రాణికోటికుపకరించునట్లు మరే జాతియు నుపకరించదనవచ్చును. గొడ్డలి వేబట్టి తన్ను నరుక వచ్చిన వానికిని నీడనిచ్చి సేదదీర్చి కాపాడునది చెట్టు. అవి యెవరికపకారము చేయవు. ఏకాంతముగా నుండును. శీత వాతా తప వర్షము నుండి రక్షించును. అడిగినవారికి పట్ట బంక చివురు తేనె పూలు తేనె పండ్లు అందిం మచున్నవి. సువాసనను వెదజల్లుచున్నవి. వ్రేళ్ళవల్ల బూడిదవల్ల ఉపయోగములెన్నియో యున్నవి.

మూలత్వక్సార నిర్యాస
నాది స్వరసపల్లవాః
క్షీరాః క్షీరఫలం పుష్పం
భస్మ తైలాని కంటకాః.
పత్రాణి శుంగాః కందాశ్చ
ప్రరోహా శ్చోపకారకాః
పశ్యైతాన్ మహాభాగాన్
పరార్థై కాంత జీవితాన్.
వాతావర్షాతపహిమాన్
సహంతో వారయంతి నః.

--భాగవతము

కావున శ్రీకృష్ణుడు -- తాము ఎండ, గాలి, వాన మొదలగు వాని వల్ల గలుగు కష్టముల నోర్చుకొనుచు పరుల కుపకారము చేయుటకే పుట్టినట్టి వృక్షముల జూడుడ నెను. ఈ భావమునే బమ్మెర పోతన రమణీయముగా దెలియజెప్పెను.

అపకారంబులు సేయవెవ్వరికి
నేకాంతంబు నందుండు నా
తప శీతానిల వర్షవారకములై
త్వ గ్గంధ నిర్యాన భ
స్మపలాశాగ్ర మరందమూల
కుసుమ చ్ఛాయా ఫల శ్రేణి చే
నుపకారంబులు సేయు నర్థులకు
నీ యుర్వీజముల్ గంటిరే.

దయామయుని దగ్గరకు వచ్చు యాచకులు మనోరథముల దీర్చుకొనునట్లు ఈ చెట్లనాశ్రయించినవారు వాన ఎండ మొదలైన బాధలనుండి రక్షింపబడుచు సుఖపడు చున్నారు. వీనిజన్మ పరులకుపకరించుటకే--

పత్ర పుష్ప ఫల చ్ఛాయా
మూల వల్కల దారు భిః
గంధ నిర్యాస భస్మాస్థి
ప్రరోహా శ్చోపకారకాః.

పరోపకారమునకు పాటుపడక స్వార్థమునకు స్వలాభమునకు ప్రవర్తించుచు మానవుడు వృక్షములకంటెను అధముడు జడుడనుటలో సందేహమే మున్నది? ఇటువంటి వృక్షము భూతలముపై నెప్పటినుంచి యున్నవో కాలావధిని నిర్ణయించుటఎవరికి సాధ్యపడదు. వేద మంత్రములలో వృక్ష విషయములుండుటవల్ల సృష్ట్యాదినుండి యున్నట్లే చెప్పవచ్చును.

యథా వృక్షస్య సంపుష్పితస్య
దూరాద్గంధో వా త్యేవం
పుణ్యస్య కర్మణో
దూరాద్గంధో వాతి.

అను మంత్రము పుణ్యకర్మకు పుష్పిత వృక్షము నుపమానముగా జెప్పినది. ఇంకను స్వస్తి తేఽస్తు వనస్పతే - ఓ వృక్షమా! నీకును నాకును శుభము గలుగవలె. ప్రార్థించుట కనుపించును. నమో వృక్షేభ్యః - వృక్షాణాం పతయే నమః - వృక్షముకు వృక్షపతికి నమస్కారము. (యజుర్వేదము) ఇంక అశ్వత్థాదివృక్షముల నామము వేదముల గనుపించుచున్నవి. అశ్వత్థేపో నిషదనం పర్ణేవో వసతిః కృతా. అయితే యేదో పురాణములో మాత్రము ఒకప్పుడు గరుత్మంతుడు అమృత కలశమును దెచ్చుచుండగా దాని నుండి కొన్ని బిందువులు క్రిందబడగా వృక్షముత్పత్తియైనట్లు వ్రాయబడినది.

ఇది విశ్వసనీయము కానేరదు. ఈ సంఘటనకు మునుపే వృక్షములున్నవనుట యధార్థము. ఇంక పాశ్చాత్యులు సృష్ట్యాదిలో ఆకాశమధ్యమున నొకతల్లి చెట్టు పుట్టి దాని సంతానము వాతక పక్షిద్వారా వర్షముతో భూతలము పైకి దేబడినట్లు నమ్ముచున్నారు. దాని విత్తనమే భూమిలో బడి చెట్టుగ మొలచి ఆకులు పూలు పండ్లు ప్రాణికోటికిచ్చుచున్నట్లు పశువులకు మేత మానవులకు ధాన్య కందమూల ఫలాదుల సమర్పించుచున్నవని కూడ దృఢముగా విశ్వసించుచున్నారు. ఈ తత్త్వమును గ్రహించిన తరువాత వృక్షబీజములలోనేదో యొక విధమైన భగవచ్ఛక్తియుండుటవల్లనే అవి ఈ జీవరాసుల ప్రాణముల గాపాడుచున్నవని గ్రహించిరి.

వృక్షములలోను - మానవుల్లో, పశువుల్లో, పక్షుల్లో నున్నట్లు ప్రాణముందని రక్తనాళము నరములు వున్నవని కరెంటు షాకుచే చెట్లు ముడుచుకొనునని పశువుల దేహముననుండు భాగములన్నియు వృక్షములలో నున్నవని ఈ విషయము నెవరు నెరుగరని 20 యేండ్లు పైగా పరిశోధించి తత్ఫలితమును ప్రొఫెసర్ జగదీశచంద్రబోసు

వెల్లడించి లోకము నాశ్చర్య పరవశముగావించి యఖండ యశస్సు నార్జించెను.

"వృక్షములలో ప్రాణమున్నది. పంచ జ్ఞానేంద్రియములున్నవి. సుఖ దుఃఖాను భూతియుగలదు" అను విషయమును స్థిర పరచుటకు మన మహర్షులు వ్రాసిన గ్రంథ మునుండి ప్రమాణముల జూపవచ్చును.

వృక్షగుల్మం బహువిధం
తత్రైవ తృణజాతయః
తమసా ధర్మ రూపేణ
శబ్దితాః కర్మ హేతునా
అంతస్సంజ్ఞా భవంత్యేతే
సుఖ దుఃఖ సమన్వితాః.

నానా విధములగు వృక్ష గుల్మా తరుజాతులు సుఖ దుఃఖములలో గూడియుండినని అంతస్సంజ్ఞ గలిగినవని కర్మ హేతువైన అధర్మ పాపములో శబ్దించు చుండునని చక్రపాణి దత్త రచించిన ఆయుర్వేద దీపిక యను చరక సంహితా వ్యాఖ్యానమున దీర్ఘంజీవిత మను సూత్ర స్థానము ప్రథమోధ్యాయమున చెప్పబడినది.

మహాభారత మోక్ష ధర్మపర్వమున సుఖ దుఃఖముల ననుభవించుటవల్లను నరకిన చిగిర్చుటవల్లను, వృక్షములలో ప్రాణమున్నదని, వానిలో చైతన్యములేదని చెప్ప వీలుపడదని చెప్పబడినది.

సుఖ దుఃఖయోశ్చగ్రహణాత్
ఛిన్నస్యచ విరోహణాల్
జీవం పశ్యామి వృక్షాణాం
అచైతన్యం న విద్యతే.

వృక్షములకు కరచరణములేగాక నేత్రేంద్రియమున్నట్లు మహాభారతముననే కనిపించుచున్నది.

వల్లీ వేష్టయతే వృక్షం
సర్వత శ్చైవ గచ్ఛతి
న హ్యదృష్టేశ్చ మార్గోఽస్తి
తస్మాత్పశ్యంతి పాదపాః

ఒక గొట్టముగుండా నీరు పీల్చిన పైకి వచ్చునట్లు వృక్షమును వ్రేళ్ళతో నీటిని పీల్చు కొనును.

వక్త్రేణోత్పలనాళేన
యథోర్ధ్వం జల మాదదేత్
తథా పవనసంయుక్తః
పాదైః పిబంతి పాదపః.

వృక్షాదులలో ఆకలి దప్పి నిద్ర మున్న గునవి ఉన్నట్లు తెలియుచున్నది.

ఇంద్రజిత్తు ప్రయోగించిన సమ్మోహనాస్త్రములో వానర సైన్యమంతయు లక్ష్మణునితో సహా మూర్ఛిల్లినప్పుడు సుషేణుడు హనుమంతుని చూచి సౌమ్య శీఘ్రమిత గత్వా శైల మోషధిపర్వతమ్, ఓషధి మానయ. విశల్య కరణీం... సౌవర్ణకరణీం చాపితథా సంజీవనీమపి. సంధానకరణీ చాప గత్వా శీఘ్ర మిహానయ- సంజీవనార్థం వీరస్య లక్ష్మణస్య మహాత్మనః- (వా.రా.యు. 102) ఆంజనేయా! నీవు ఓషధి పర్వతమునకు పోయి విశల్యకరణీ సంధానకరణీ సౌవర్ణకరణీ సంజీవకరణీ అను ఓషధులదెమ్మనెను. హనుమంతుడా పర్వతమునకు పోయినపుడు ప్రదీప్తసర్వోషధి సంప్రదీప్తం దదర్శ సర్వేషధి పర్వతేంద్రం. ఓషధులన్నియు దేదీప్యమానముగా వెలుగుచుండెను. దీనినిబట్టి ఆ మూలికలకు స్వయం ప్రకాశమున్నదని తెలియుచున్నది. అంతేగాక ఇంకొక విచిత్రము జరిగినది. మహౌషధ్యస్తత స్సర్వాస్తస్మిన్ పర్వతసత్తమే. విజ్ఞాయార్థిన మాయాంతం తతో జగ్మురదర్శనమ్. అంతకుముందు ప్రకాశించుచుండిన ఓషధులు హనుమంతుని చూడగనే భయపడి తమ ప్రకాశమును ఉపహరించుకున్నవి.

అంతర్హితాశ్చౌషధీస్తు
తతో విజ్ఞాయ మారుతిః
ఉద్బబర్హ గిరిం క్రోధాత్
శతయోజనమండలమ్.

అప్పుడాంజనేయుడు మండిపడి పర్వతమునే పెకలించుకొని పోయెను. దీన్ని బట్టి మూలికలు స్వయముగా ప్రకాశించునని ప్రకాశమునుప సంహరించుకొనునని వానికి చక్షురింద్రియముందని చెప్పవచ్చును.

వృక్షములకు సంవేదన జ్ఞానమున్నట్లు మహా భారతానుశాసనపర్వమును బట్టి తెలియుచున్నది. కాశీరాజ దేశంలోని బోయవాడొకడు వేటలాడబోయి విషబాణమునొక దానిని గురిబెట్టి విడువగా అది గురి తప్పి ఒక వృక్షమును దాకెను. వెంటనే పూలతో, కాయలతో నిండిన ఆ చెట్టు నిలువున ఎండిపోయినది. పూవుల గాయల బెరిగిన యా వృక్షము శుష్కమయ్యె నా విషయమున ధాత్రీవర!-

సృష్టిలోని ప్రాణికోటి అంతయు తమ జాతిని సంతానవృద్ధిచేత పెంపొందించుకొనును అను విషయము ఇప్పటి పాశ్చాత్య వైజ్ఞానికులే గనుగొనినట్లు చాటుచున్నారు. వృక్ష సంతాన విషయము హారీత సంహితలో హారీతా త్రేయ సంవాదమున స్పష్టమగుచున్నది.

హారిత ఉవాచ:
సంయోగేన వినా ప్రాజ్ఞ
కథం గర్భే ప్రజాయతే,
సంయోగేన వినా పుష్పం
ఫలం తావత్ కథం భవేత్
వృక్షపన్న కథం స్త్రీణాం
ఫలోత్పత్తిః ప్రదృశ్యతే
ఏతత్పృష్టో మహాచార్యః
ప్రోవాచ ఋషిపుంగవః.

ఇంతటి మహాసమస్యకు ఆత్రేయ మహర్షి ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

వీరుధానాం వల్లీనాం
స్థావరాణాం చ పుత్రక
తత్ర ధాతుమయం బీజం
సహ యోగేన వర్తతే
న బిన్నదృష్టి స్తస్త్యైహ
దృశ్యతే శ్రుణు పుత్రక
స్థావరాణాం హి సర్వేషాం
శివశక్తిమయం విదుః
నిశ్చలోఽపి శివోజ్ఞేయో
వ్యాప్తశక్తి ర్మహామతే
తత్ర స్త్రీ పురుష గుణా
వర్తంతే సమయోగితః
ఆప్తమ పుష్పం ఫలం తద్వత్
బీజం శుక్రమయం విదుః
స్త్రీణాం రజోమయో చేతో
బీజాద్యామింద్రియం నరే

# నిత్యాభిషేకం

తిరుపతి కపిలతీర్థంలోని శ్రీ కపిలేశ్వరస్వామివారికి నిత్యాభిషేకం సేవను నూతనంగా ప్రారంభించారు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు సంవత్సరానికి రు.42-00లు చెల్లించాలి.

శాశ్వతంగా చేయించదలచుకున్న వారు రు. 500 + 42 లు చెల్లించాలి.

సంవత్సరానికి రెండు పర్యాయములు, ఇద్దరు వ్యక్తులను ఈ సేవను దర్శించటానికి అనుమతిస్తారు.

---

దాయ సంతోషాల పరవళ్ళతో పరవశింపజేసే పండుగ మకర సంక్రాంతి. సూర్యుడు మేషం మున్నగు పన్నెండు రాశుల్లో, ఒక్కొక్క రాశిలో ఒక్కో నెలలో ప్రవేశించడాన్ని "సంక్రమణం" లేక "సంక్రాంతి" అంటారు. ఇలాంటి సంక్రాంతులు సంవత్సరానికి పన్నెండు. సూర్యుడు మకరరాశిలో (పదవ రాశిలో) ప్రవేశించిననాడు "మకర సంక్రాంతి".

"తత్ర మేషాదిషు ద్వాదశరాశిషు క్రమేణ
సంచరతః సూర్యస్య పూర్వస్మాద్రాశే రుత్తర
రాశౌ సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః."
--జయసింహ కల్పద్రుమః

ఈ మకర సంక్రమణానికి వెనుక 20 ఘడియలు ముందు 20 ఘడియల కాలం "అయన" పుణ్యకాలం అని నారాయణభట్టు రచించిన "ధర్మప్రవృత్తి" నిర్ణయం. ఈ పుణ్య కాలంలో చేసే స్నాన దానాలు కోటిరెట్ల పుణ్యం అందిస్తాయని దేవీపురాణ ప్రవచనం. మకర సంక్రాంతి నాడు చేసిన దానం నూరు కోట్ల రెట్లు పుణ్యప్రదమని ఆదిత్య పురాణ ప్రబోధం. అందుకే ఉత్తరాదివారు ఈ రోజు కంబళ్ళు దానం చేస్తారు.

"సంక్రాంతౌ యాని దత్తాని
హవ్య కవ్యాని దాతృభిః,
తాని నిత్యం దదాత్యర్కః
పునర్జన్మని జన్మని."

"సంక్రాంతి నాడు దాన శ్రాద్ధాదులు చేస్తే సూర్య భగవానుడు అనంతమైన పుణ్యాన్ని జన్మ జన్మలకూ అందిస్తాడని" స్కందపురాణం సంక్రాంతి వైశిష్ట్యాన్ని నొక్కి వక్కాణించింది. మకర సంక్రాంతి నాడు పితృతర్పణాదులను నిర్వహిస్తే పుణ్యలోకాలు లభిస్తాయని ధర్మ వేత్తలందరూ ఏకగ్రీవంగా నిర్ణయించారు.

మకర సంక్రాంతి నుండి సూర్యుడు ఉత్తరాభిముఖంగా ప్రయాణం కొనసాగిస్తాడు. అంటే..... ఆరు మాసాల దక్షిణాయనం ముగిసి ఆరుమాసాల ఉత్తరాయణం ఆరంభమన్నమాట! ఈ కాలం పుణ్యాల నందనం. అందుకే ఈ అయనంలో మరణించిన వారికోసం స్వర్గద్వారాలు తెరచి వుంటాయని పురాణాల ప్రబోధం. ఈ ప్రబోధాన్ని అనుసరించే మకర సంక్రాంతి నాడు ముంగిళ్ళలో "స్వర్గద్వారాల ముగ్గు" వేస్తారు.

"అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః
షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛంతి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః."
-- భగవద్గీత : 8-24

ఉత్తరాయణానికే "అర్చిరాది మార్గం" అనీ, "దేవయానం" అనీ పేర్లు. ఇది ముక్తి పథం, వెలుగుల బాట. దక్షిణాయనానికే "ధూమాది మార్గం" అనీ, "పితృయానం" అనీ నామాంతరాలు. ఇది పునర్జన్మానికి సోపానం. .. చీకటిదారి!

సద్బ్రాహ్మణులకు కూష్మాండదానం ఈ పండుగలో విశేషం. సాయంత్రం క్రొత్త బట్టలు కట్టుకోవడం, పెద్దలకు అభివందనం చేయటం అనుస్యూతంగా వస్తున్న ఆచారం. అందుకే మకర సంక్రాంతికి "మ్రొక్కుల పండుగ" అని మరో పేరు. రాయలసీమ వాసులు దీనిని "పసుల పొంగలి"గా జరుపుకుంటారు. క్రొత్త కుండలు కొంటారు.. .. పొంగలి చేసుకుంటారు.

### రైతుల పండుగ

మూడవనాడు "కనుము పండుగ". ఇది పూర్తిగా రైతులపండుగ. వారికి జీవమూ జవమూ అయిన పశువుల్ని శుభ్రంగా కడిగి కొమ్ములకు రంగులు పూసి సింగారిస్తారు. పసులకొట్టంలో పాలపొంగలి వండి దేవతలకు నివేదించి పసుపు కుంకుమలతో కలిపి పొలాల్లో వెదజల్లుతారు. ఇదే "పొలి చల్లడమంటే"!

ఊరి పొలిమేరల్లో జరిగే ఎడ్ల పందాలు, కోడిపందాలు, పొట్టేళ్ళ పోటీలు మొక్కవోని పౌరుషానికి ప్రతిబింబాలు. తమిళనాడులో పోట్లగిత్తల కొమ్ములకు డబ్బులు కట్టి పరుగెత్తిస్తారు. ఆ గిత్తల పొగరు అణిగించి వాటి కొమ్ములకు కట్టిన డబ్బులు విప్పుకొని వచ్చే పోటీలు ఉత్సాహభరితంగా సాగుతాయి. సాయంత్రం పశువుల్ని అలంకరించి డప్పుల్తో ఊరేగిస్తారు.

### ముత్యాల ముగ్గులు

ఈ పండుగ నెలరోజులూ నెలతలందరూ ముంగిళ్ళలో తీర్చిదిద్దే ముత్యాలముగ్గులు కమనీయ కళాసృష్టికీ ఆరోగ్య దృష్టికీ అందమైన ఆనవాళ్ళు.









(గత సంచిక తరువాయి)

“వానరేశ్వర! ఎటుగ వపజయ మెపుదు
చెవుల నిడవైతి వేను వచించు నుదులు
చొప్పడ వికమే మందిన శుభ సుఖాలు”
తీసికొనగ ప్రాణము లామె దీక్షబూనె.

ఖిన్ను డయ్యె వారలను సుగ్రీవు డరసి
ప్రక్క నిలిచె సౌమిత్రితో రామవిభుడు;
ఊరడించెను హనుమంతు డువిదగాంచి
“శోక మందగ తగదమ్మ సుదతి! నీకు

వాలి నయనాలలోన ప్రాణాలు నిలిపి
ఎవరిదశను సుగ్రీవుతో చెప్పె నిటులు;
పిలిచి నిజసమీపమునకు ప్రేమమీర
“అంగదుడు పంచమప్రాణ మగును నాకు.

అరయగా అన్నదమ్ముల మయ్యు మనము
విదివిలాసాన కలసి జీవింప లేదు;
అనుజ! సుగ్రీవ! ఇతడు నా కౌరసుండు
ప్రాణసము డంగదుండు; కాపాడు మితని.

# రావుల రామాయణము

మానవులు తా మొనర్చు కర్మముల బట్టి
పుణ్యపాప ఫలమ్ములు పొందు మంద్రు;
జగతి నెవ్వని దేహంబు శాశ్వతంబు?
సత్కృతులు సల్ప కాంతురు జనులు మేలు.

వాలి కిప్పుడు ప్రేతకృత్యాలు జరుప
అంగదున కాజ్ఞ నొసగుమో అతివమిన్న!
చింతవిడనాడి కపికులశ్రేయ మెంచి
పట్టభద్రు కావింపుము వాలిసుతుని.

శ్రద్ధగా అనింద్యగుణ ప్రశస్త తార
ఆలకించి పలికె నిట్టు లతనితోడ
“వీరుడగు వాలితో పోయె విభవ మెల్ల
భారమెల్ల సుగ్రీవుపై బడియె నిపుడు.”

తార సూక్ష్మార్థము లెరుంగు ధర్మమందు
ఈమె కీడును ముందె గ్రహించి చెప్ప
అనఘుడగు రాముకార్యంబు నాచరింప
అఖిల సుఖముల శుభముల నందగలవు.

ఇదిగో దివ్యకాంతిమయంబు హేమమాల
కంఠమున దాల్చు మిప్పుడె; కాంతి వీడు
నేను మరణింప” అని పల్కి దాని నొస్థగ
దీను డగుచు సుగ్రీవుడు తీసికొనియె.

కాంచి సుతు నతుల కనకాంగదుని వాలి
“కాలగతి నెరింగి సహనశీలి వగుచు
కొలువు మీవు సుగ్రీవుని, కూర్మి నతడు
మంచిచెడ్డల నరసి రక్షించు” ననియె.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి



ాణములు వీడగా వాలి బాణహతుడు
కటా! కిష్కింధ యెల్ల శూన్యముగ తోచె
రము కాంతివిహీనులై కపులు చేరి
వరు మా కిక దిక్కని ఏడ్చిరంత.

రమదుఃఖభరిత తార పలికె నిట్లు
పీరమరణ మీవు కనంగ విధివిధాన
ారుణంబగు రీతి వైధవ్యమంది
ాత్త్వికాభిజన ప్రియ! చావనైతి."

ంతి చెడిన కాంత విలపింప మృతుని దరిని
విసుటుండు సుగ్రీవుడు ప్రథితయశుని
ర్వలక్షణు శ్రీరామచంద్రు గాంచి
ప్పె నమితవ్యథాకుల చిత్తు డగుచు.

వ! భవదీయ సత్యప్రతిజ్ఞ కతన
లిగె నున్నతరాజ్యభోగాలు నాకు
ని మా అన్న మరణమ్ము కలుగ జేసె
ఃఖ మాత్మకు నయ్యది దుర్భరంబు.

యి వేకూర దీరాజ్య మేం నాకు
ఘోరతరమైన పగయును క్రోధమూని
హతు వైతి కూలగ వాలి భూతలాన
ష్టుడను కంటి దుస్సహదుఃఖబాధ.

రయ నత డనిందితుడు మహాగుణుండు
ాతృవధకు పూనక నన్ను పట్టి విడిచె;
నుమతింపుము మరణింతు నగ్ని జొచ్చి
తను వెదుక వానరవ్రాత మేగు."

ామచంద్రుడు సుగుణాభిరాము డంత
ాంత్వనములు వచించి విషాదమందు
ార నూరడింపగ చెంత జేర ఆమె
రిఘిని పల్కె; ఓరిమి నిస్తులంబు.

ప్రవిమల వర బాణాసన బాణపాణి!
ాల్చి దివ్య సుందరమగు తనువు నీవు
ష్ట రక్షణంబును దుష్ట శిక్షణంబు
లిపెదవు; మహత్త్వంబన్న కలదె వేరు?

తివియోగజనితదుఃఖ భారమేను
నకులాంబుధిసోమ! వహింపజాల;
రుణ దొలకంగ నను గూర్చి శరముతోడ
ఘ్రముగ పతి చెంతకు జేర్చుమయ్య!

దితమే నీకు శ్రీరామ! విరహబాధ
వ! దోషముకాదు వధింప నన్ను

దార దానము మేలు; వేదాలు తెలుపు;
వీరు జంపిన దోషంబు వెడలు నీకు."

వీర సతిని తారను రాము దూరడించె
"కనగ సృష్టించె ధాత లోకాలనెల్ల
ప్రాణుల సుఖము దుఃఖమ్ము బ్రహ్మవశము
ముదము గాంచుము రాజ్య మంగదుడు
చేయు."

రాముడు వచించె నవటి వారలను గాంచి
"కాల మేతేర వాలి స్వర్గస్థు డయ్యె
మృతునకు మనదు శోకమ్ము మేలుకాదు
చేయగా ప్రేతకార్యమ్ము శ్రేష్ఠ మింక.

పరమదుఃఖభరాన వానరగణమ్ము
జరిపె దహనసంస్కారము శాస్త్రవిధిని
ప్రథితు లక్ష్మణాన్వితు రఘురాము నరసి
అంజనాపుత్రు డనె భక్తి నంజలించి.

"దేవ! నీ దయచేత సుగ్రీవు డిపుడు
వానరుం రాజ్య మేలెడు భాగ్యమందె,
బహువిధోద్యాన సౌందర్య భాసురమ్ము
రామచంద్ర! కిష్కింధకు రమ్ము కరుణ."

క్షోణి విభుడు రాముండు సుశ్లోకు డనియె
పితృవచన పాలనాదృఢ వ్రతుడ నైతి
గడువు పదునాలుగబ్దాలు గడచువరకు
చొర దలంప గ్రామము కాని, పురము కాని.

సుందరంబగు కిష్కింధ జొచ్చి మీరు
శీఘ్ర మభిషిక్తు సుగ్రీవు జేయు డనుచు
వీరు సుగ్రీవు కనుగొని వేదవేత్త
సకలధర్మవిదుడు రామచంద్రు డనియె.

"అంగదుని నిల్పు యౌవరాజ్యంబు నందు;
వానకారు యుద్ధమునకు పనికిరాదు
స్వీయకపిరాజ్యపదవిని స్వీకరించి
నాల్గునెల లేగ చనుదెమ్ము నన్ను చూడ."

రమ్యమైన కిష్కింధకు రామునాజ్ఞ
అరిగి హర్షాన వెంట వానరులు రాగ
వేడ్కలొదవ సుగ్రీవుడు విభుత దాల్చి
అంగదుని జేసె యౌవరాజ్యాభిషిక్తు.

ప్రస్రవణ మను గిరిశిఖరమ్మునందు
రమ్యతరమైన గుహలోన రాము డుండె;

బహువిధంబులు సెలయేళ్ళు పక్షితతులు
సరసలతలు వృక్షంబులు వరలు నచట.

శైలశిఖరాన వెలయు విశాలగుహను
కాపురం బుండియును గూడ కలుగదయ్యె
రామునకు సుదుఃఖితునకు రాత్రులందు
సీత జ్ఞప్తికి వచ్చుటచేత సుఖము.

అగ్రజుని గని లక్ష్మణుం డనియె నిట్లు
"ధర్మ పరత నధికుడవు కర్మఠుడవు
రావణుడు లెక్కయే నీకు రణములోన
తీవ్రదుఃఖము తగదు సాధింప జయము?

త్వరితగతి శరత్కాలము వచ్చినంత
దక్షుడవు నీవు తీవ్రయత్నమ్ము సలిపి
పడయ గలవు జానకిని రావణుని దునిమి
రామ! మేలుకొల్పుము నీ పరాక్రమమ్ము."

సంతసము కలిగింప ఆ సరసవాక్కు
రాముడు వచియించె శుభకరంబు హితము
"తమ్ముడా! నీవు మిగుల ప్రోత్సాహ మొసగ
కంటి విపులతేజంబు శోకమ్ము విడిచి.

వేచియుందు శరత్తుకై; ఆచరించు
ప్రత్యుపకృతి సుగ్రీవుడు పరమభక్తి"
అనుజు డనియె: "తీర్చునతండు తనదు బాస
ధృతిని నాల్గుమాసాలు ప్రతీక్ష సేయ."

అచట కిష్కింధ సుగ్రీవు డలరుచుండె
ప్రమదలను కూడి యాడుచు ప్రత్యహంబు
చిత్తముల బట్టి చేయు సచివుల దయకు
రాజకార్యాలు విడిచి మర్కటవిభుండు

అహరహంబును సుగ్రీవు డర్కజుండు
కామభోగమ్ములందు మగ్నమతి కాగ
ధర్మవేత్తయు అర్థతత్త్వజ్ఞుడైన
ఆంజనేయుడు విహిత వాక్యాల ననియె.

ప్రాప్త మయ్యెను రాజ్యము భవ్యభంగి
మిత్రునకు సల్పు సాయమే మిగిలి పోయె;
దాటె దాని నొనర్చెదు తరుణ మిపుడు
కీడు కలుగ దేరికి మిత్రకృతులు చేయ.

కార్య మొనరింప వేడ డా కాలవేత్త
రామచంద్రుండు, నీవె తీర్పంగ వలయు;
అఖిలవానరకోటి కీ వాజ్ఞ నొసగ
వెదుక గలరయ్య వైదేహి వివిధదిశల.

(సశేషం)



మన ఆర్ష గ్రంథములలో విష్ణు భగవానుదు ముఖ్యముగ త్రివిధ రూపములలో భావించబడచున్నాదు. 1. పర విష్ణువు, 2. మహా విష్ణువు మరియు విష్ణువు. నారద పురాణములో ఈ విధముగ నభివర్ణన గలదు.

విష్ణోస్తు త్రీణి రూపాణి
పురుషాఖ్యాన్యతో విదుః
ఏకం తు మహతః స్రష్ట
ద్వితీయం త్వండ సంస్థితమ్
తృతీయం సర్వభూతస్థమ్
తాని జ్ఞాత్వా విముచ్యతే.

విష్ణు భగవానునికి త్రివిధ రూపములు గలవు. విద్వాంసులు ఆయనను పరమ పురుషుడని తెలుపుచున్నారు. భగవానుని ప్రథమ రూపము మహత్తత్వస్రష్ట. ద్వితీయ రూపము. బ్రహ్మాండములో అంతర్యామి రూపములో విరాజిల్లుచున్నది. తృతీయ రూపము సమస్త చేతన ప్రాణులలో నున్నది. విష్ణు భగవానుని ఈ త్రివిధ స్వరూపములను తెలిసికొనిన వాదు ప్రకృతి బంధనము నుండి విముక్తి బొందినవాదు.

*1. ప్రథమం మహతః స్రష్ట :*

విష్ణు భగవానుని ప్రథమ స్వరూపము మహత్తత్వ స్రష్ట స్వరూపము. మనువు ఈ క్రింది విధముగ నుదహరించినాడు.

తతః స్వయం భూర్భగవా
నవ్యక్తో వ్యంజయన్నిదమ్
మహాభూతాది వృత్తౌజాః
ప్రాదురా సీత్తమో మదః.

--మనుస్మృతి 1-6.

మహా ప్రాణులతో ప్రారంభించిన సంపూర్ణ సృష్టిని ప్రకాశములోనికి తెచ్చి అప్రతిహత సామర్థ్య సంపన్నుడైనట్టియు, తమోనాశకుడైనట్టి స్వయంభు మరియు నవ్యక్త భగవానుదు స్వయముగ ప్రత్యక్షమగును.

పరమాత్మ మహిమను వర్ణించుచు వేదాంత దర్శనమునందిట్లు గలదు.

అక్షర మంబరాంత ధృతేః 1-3-10. క్షరితం కానట్టి అవినాశి బ్రహ్మ ఆకాశ పర్యంతం సంపూర్ణ ప్రపంచము నంతయు నావరించియున్నాదు. "సా చ ప్రశాసనాత్. 1-3-11. అనగా ఆ అక్షర పురుషునకు సర్వప్రాణువును శాసించు నధికారము గలదు." స్వయముగా గీతావక్తయైన శ్రీకృష్ణ పరమాత్ముదు విశ్వోత్పత్తి ప్రసంగములో నీ విధముగ నభివర్ణించినాదు.




మమ యోని ర్మహద్బ్రహ్మ
తస్మిన్ గర్భం దదామ్యహమ్
సంభవ స్సర్వ భూతానాం
తతో భవతి భారత.

--గీత 14-3.

భరత వంశ అర్జునా! విశ్వోత్పత్తికి మూలకారణము మహద్బ్రహ్మ. అవ్యాకృత మూల ప్రకృతి అందులో నేను బీజరూపమున నుందును. ఆ మూల ప్రకృతి వలననే సర్వప్రాణులుత్పన్నమగు చున్నవి.

*2. ద్వితీయం త్వండ సంస్థితమ్ :*

విష్ణు భగవానుని ద్వితీయ స్వరూపము సర్వ బ్రహ్మాండమునందంతయు వ్యాపించి నది. అనగా తత్ సృష్ట తదేవానుప్రావిశత్ ఈ శ్రుత్యనుసారం విశ్వస్రష్ట భగవాన్ విష్ణువు విశ్వపాలనమునకై నంతర్యామి రూపములో బ్రహ్మాండమునందు ప్రవేశించెను.

*3. తృతీయం సర్వభూతస్థం :*

విష్ణు భగవానుని తృతీయ స్వరూపము వ్యష్టి బ్రహ్మాండమునందు మరియు సమస్త ప్రాణులలో అంతర్యామి రూపమున విరాజిల్లు

చున్నాడు. ఉపనిషన్మంత్రమైన "య ఆత్మాని తిష్ఠన్ ఆత్మనోంతరో యమాత్మాన వేద యస్యాత్మా శరీరం" పై మంత్రమున భగ వాన్ విష్ణువు ఆత్మరూపములో శరీరము నందు గలడని ప్రతిపాదించబడియున్నది.

ఈశ్వర స్సర్వభూతానాం
హృద్దేశేర్జున తిష్ఠతి.

--గీతావచనము 18-61

విష్ణుభగవానుని పై త్రివిధ స్వరూపము లను తెలిసికొనిన జ్ఞాని ప్రకృతి బంధనము నుండి విముక్తి పొందగలడు. వివేకి, జిజ్ఞా సువైన భక్తుడు విష్ణు భగవానుని త్రివిధ స్వరూపములను శ్రవణ, మననము గావించి భగవత్సాన్నిధ్యము పొందవలయును.

భగవానుని ప్రథమ స్వరూపమునందు మహా ప్రళయమునందు కూడ నష్టము కానిది. మరియు మిగిలిన రెండు స్వరూపములు మహావిష్ణువు, విష్ణువు త్రిగుణాత్మక ప్రకృతి తోపాటు వ్యాపక రూపమునకు సంబంధించి నది. జన్మించినవాడు మరణించక తప్పదు. అత్యంతిక ప్రళయంలో బ్రహ్మాండ సహిత మహావిష్ణువు తనకంటె నధికుడైన నక్షర పురుష పరమాత్మయందు లయమగుట స్పష్ట ముగ నభివర్ణితమైనది.

నారాయణశ్చ శంభుశ్చ
సంహృత్యం స్వగణాన్ బహూన్
శుద్ధ సత్త్వ స్వరూపేచ
కృష్ణం లీనశ్చ నిర్గుణే
మహావిష్ణో విలీనాశ్చ
తే సర్వే రుద్ర విష్ణవః
మహావిష్ణు ప్రకృత్యాంచ .
సా చైవ పరమాత్మనః.

--బ్రహ్మ వైవర్త పురాణం
--ప్రకృతి 54/13-14.

నారాయణుడు మరియు శంభు (అహం కార తత్త్వము) వలన ఉత్పన్నమైన పంచత న్మాత్రలు, పంచ మహాభూతములు దశేం ద్రియములు మరియు మనస్సు మొదలగు ప్రకృతి తత్త్వము లన్నియు కలసి శుద్ధ సత్త్వ స్వరూపమైన నిర్గుణ పరమాత్మయందు లీన మగును.

ప్రళయక్రమము ఈ విధముగ కలదు. అనంత బ్రహ్మాండమునందు వ్యాపకమైన పరా ప్రకృతి రుద్ర విరాడ్రూపక చైతన్య మహా విష్ణువునందు విలీనమగును. మహావిష్ణువు ప్రకృతిలో విలీనమగును. ప్రకృతి అక్షర ఆత్మయందు ఆశ్రయం పొందును. దేవీ భాగవతము స్కంధము 9/3/4-5 మహా విష్ణువునకు మహావిరాట్ నామమిచ్చుట ఈ విధముగ చెప్పబడినది.

స్థూలాత్ స్థూల తమః సోఽపి
నామ్నాదేవో మహావిరాట్
పరమాణు ర్యథా సూక్ష్మాత్
పరః స్థూలాత్ తథా హ్యసౌ
తేజ సా షోడ శాంశోఽ యం
కృష్ణస్య పరమాత్మనః
ఆధారః సర్వ విశ్వానాం
మహావిష్ణుశ్చ ప్రాకృతః

సమస్త బ్రహ్మాండాత్మక ప్రకృతి శ్రీ మహావిష్ణువు శరీరం స్థానీయమైనది మరియు అంతరాత్మ ప్రకృతి అంతర్యామి యైనం దున ప్రాకృతమనబడును. శ్రీ మహా విష్ణువు తేజమునందు అనగా ఐశ్వర్యము, ప్రభుత్వం, యశస్సు, సంపద, జ్ఞాన వైరా గ్యము శ్రీకృష్ణ పరమాత్మ పదునారవ కళ. సంపూర్ణ బ్రహ్మాండ ఆధారభూతమైన మహా విష్ణువు ప్రకృతి అంతరాత్మయైనందున ప్రాకృ తమని పిలువబడును.

సర్వేషాం పరమాత్మాచ
సచ్చిదానంద రూపధృక్
బ్రహ్మాదయశ్చ తస్యాం
శాస్త స్యాంశ్చ మహావిరాట్
తస్యాంశశ్చ విరాట్ క్షుద్రః
నైవేయం ప్రకృతిః పరాః
బ్రహ్మాదీ తృణ పర్యంతం
సర్వ ప్రాకృతికం భవేత్
యద్యత్ ప్రాకృతికం సృష్టం
సర్వం నశ్వరమేవచ.

--దేవీభాగవతము 9-8-79/82

అనగా సచ్చిదానంద స్వరూప పరమా త్మయే సర్వప్రాణులకు స్వామి. మహావిరాట్ మరియు బ్రహ్మాది, సర్వాది దేవతలు ఆయన అంశ స్వరూపములే. బ్రహ్మాండమునందు వ్యాపించిన విరాట్ స్వరూపము పరాప్రకృతి కూడ ఆ విష్ణు పరమాత్మ అంశ మాత్రమే. ఈ బ్రహ్మాండమునందు బ్రహ్మ మొదలుకొని తృణ పర్యంతముండు సర్వ పదార్థము లన్నియు ప్రకృతి జన్యములే.

ఉపనిషత్తులు పురాణములు, తంత్ర ములు మరియు సంహితలు యందు బ్రహ్మకు రెండు స్వరూపములు కలవని చెప్పబడినవి.

1. శబ్ద బ్రహ్మ, 2. పర బ్రహ్మ.

శబ్దబ్రహ్మయందు నిష్ణాతులైనవారు ఓంకార పర బ్రహ్మము బాగుగ తెలిసికొన్న వారగుదురు. భగవద్గీతయందు పదునైదవ నధ్యాయమునందు భగవానుడు క్షర, అక్షర మరియు ఉత్తమ పురుషుల వర్ణనము కలదు.

ఊర్ధ్వమూల మధశ్శాఖం
అశ్వత్థం ప్రాహురవ్యయమ్.

--భగవద్గీత 15-1.

ఈ ప్రపంచము రూప వృక్షమునకు మూలము, పై భాగవునను శాఖలు క్రింద కలవు. అనగా ఈ ప్రదేశము అక్షర స్వప్న మైనందున ఆత్మ తన వాస్తవిక స్వరూపజ్ఞా నమును మరచి మాయిక తనువు, మనస్సు ధనములను సత్యములని దలంచి మాయిక దేవ తోపాసనలలో నిమగ్నమగును.

ఈ విధముగ భగవంతుడు క్షర పురు షుని గుహ్యతమ శైలిని వర్ణించి ఈ ప్రపంచ వృక్షమును అసంగము అనాసక్తిరూపమనెడు దృఢ శస్త్రముతో ఛేదించవలయునని చెప్పబ డినది. పంచమాత్ర స్వరూప ప్రణవాక్షరం 'ఓం' క్షరమైనది యెందులకనగా శాస్త్రము లందు అక్షర స్వరూపమునకు నాద బిందు కళలకు అతీతముగ చెప్పబడినది.

ప్రణవాక్షర మాత్రం హి
తన్నజా సీహి భోమునే
అమాత్రం శబ్దరహితం
స్వర వ్యంజన వర్జితమ్
బిందునాద కళాతీతం
బ్రహ్మాక్షర ముదాహృతం.

--పురాణసంహిత 22-45

శంకరుడు ద్వైపాయన వ్యాసునకు అక్షరబ్రహ్మ స్వరూపమును గురించి వివరించుచు మహర్షీ ప్రణవాక్షరమును 'ఓం'కారమును అక్షర బ్రహ్మంగా భావించుట మీవంటి జ్ఞాన స్వరూపులకు తగదు. స్వర, వ్యంజన శబ్ద మాత్ర నాద బిందు కళలకు రహితమైనది అక్షరబ్రహ్మ.

ప్రజపన్ పంచవక్త్రేణ
బ్రహ్మ జ్యోతి స్సనాతనమ్
సత్యస్వరూపం శ్రీకృష్ణం
పరమాత్మన మీశ్వరం.

--దేవీభాగవతం 9-2-86.

ఇత్యుక్త్వా తస్య కర్ణేన
మహామంత్ర షడక్షరం
త్రికృత్యశ్చః ప్రజజాప
వేదాంగం ప్రవరం వరం
ప్రణవాది చతుర్థ్యంతం
కృష్ణ ఇత్యక్షర ద్వయం
వహ్నిజా యాంత మిష్టంచ
సర్వ విఘ్నహరం పరా.

--దేవీభాగవతం 9-3/26-27

శ్రీ మహావిష్ణువునకు పై విధముగ ననేక వరదానములనిచ్చి శ్రీకృష్ణుడాయన కర్ణములలో మూడు పర్యాయములు షడక్షర మంత్రోచ్చారణ గావించెను.

ఈ ఉత్తమ మంత్రము వేదమునకు ప్రధానాంశము. మంత్రాదియందు ఓంకార స్థానము కలదు. మధ్య చతుర్థీవిభక్తితో పాటు 'కృష్ణ' రెండక్షరములు కలవు. అంత్యమున అగ్నిపత్నియైన స్వాహాదేవి సమ్మిళితమైనది. ఈ విధముగ "ఓం కృష్ణాయ స్వాహా" అనునది మంత్రస్వరూపము. ఈ మంత్ర జపోచ్చారణవలన సర్వ విఘ్నములు తొలగించబడగలవు.

అక్షర మరియు క్షరోపాసన ఫలమును ఉపనిషత్ శైలిలో భగవానుడు గీతలో ఈ క్రింది విధముగ నుపదేశించినాడు.

శుక్ల కృష్ణే గతా హ్యేతే
జగతః శాశ్వతేమతే
ఏకయా యా త్యనావృత్తి
మన్యయా వర్తతే పునః.

--8-26

సృష్టి ప్రారంభకాలమునుండి ద్వివిధ ఉపాస్య స్వరూపముల వలన శుక్లగతి మరియు కృష్ణ గతులున్నవని తెలియుచున్నది. శుక్ల గతిని పొందిన ఆత్మ భవసాగర విముక్తుడు కాగలడు. కృష్ణగతిని పొందిన ఆత్మ తిరిగి భవ సాగరమునకు వచ్చును. తనమాతయైన దేవహూతికి కపిలుడు భక్తి యోగము నుపదేశించుచు ఈ విధముగ "భక్త జనులు నా సేవా రహిత సాలోక్యము సార్ష్టి, సామీప్యము, మరియు సాయుజ్యమనబడు ముక్తులనిచ్చినను వాటిని గ్రహించరు."

సాలోక్య సార్ష్టి సామీప్య
సారూప్య కత్వ మప్యుత్
దీయమానం నగృహ్ణంతి
వినా మత్సేవనం జనాః.

--శ్రీమద్భగవద్గీత 3-29-13

విష్ణు భగవానుని త్రివిధ స్వరూపములను తెలిసికొని నారాధించి శుక్లగతిని పొంది మానవుడు ప్రకృతి బంధనము నుండి విముక్తి బొందుట శ్రేయాదాయకం.



దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయ కళ తిరుపతి

# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

తరించండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





'చంద్రశేఖర్'




తైత్తిరియోపనిషత్ శిక్షావల్లిలో 11వ అనువాకములో అందరు అనుసరించదగిన సూక్తులు కలవు. సమావర్తన కాలంలో వేదాధ్యయనము పూర్తి అయిన పిమ్మట గురువు తన శిష్యునికి ఉపదేశము చేయుచు--

దేవ పితృ కార్యాభ్యాం
న ప్రమదితవ్యమ్
మాతృదేవో భవ పితృదేవో భవ
ఆచార్యదేవో భవ అతిధిదేవో భవ

అని చెప్పుట కలదు. అనగా దేవతల - పితరుల కార్యాలను చేయుట మానవద్దు. తల్లి తండ్రి గురువు అతిధులను దేవతలతో సమానముగా పూజించు అని అర్ధము. అట్లు చేయుటవలన వారి ఆశీర్వాదము నీకు లభించును అని.

## మాతృదేవో భవ

యం మాతాపితరౌ క్లేశం
సహేతే సంభవే నృణామ్
న తస్య నిష్కృతిః శక్యా
కర్తుం వర్షశతై రపి.

మనిషికి జన్మనిచ్చి అతని పాలన, పోషణ నిమిత్తం తల్లిదండ్రులు పడు కష్టమునకు ఎన్నివందల జన్మలనెత్తినా వారి ఋణము తీర్చుకొనుట కష్టము. కాబట్టి తల్లిని దేవతలాగా పూజించి ఆమె చెప్పు నీతి వాక్యములను ఆచరణలో పెట్టవలెను. వాల్మీకి రామాయణంలో కూడ శ్రీరాముడు తండ్రి ఆజ్ఞతో వనవాసమునకు పోవు సందర్భమున లక్ష్మణుడు కూడ వనమునకు పోవుటకు నిశ్చయించుకొని తన తల్లియైన సుమిత్ర వద్దకు వచ్చి ఆశీర్వదించమని కాళ్లపైబడి నమస్కరించెను. అప్పుడు ఆమె కుమారుడు అరణ్యవాసమునకు పోవుచున్నాడని దుఃఖించక ఈ విధముగా ఆశీర్వదించి పంపెను.

రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి
గచ్ఛ తాత యథాసుఖమ్.

అనగా నాయనా! అరణ్యవాస కాలంలో శ్రీరామచంద్రునే నీ తండ్రి దశరధునిగా భావించు జనకరా[illegible]ని సీతను నన్నుగా భావించు ఆ అటవీ ప్రాంతమును అయోధ్యగా భావించు సుభంగా వెళ్ళిరా నాయనా! అని దీవించెను.

మాతా పితరుల భక్తియందు గణపతిని ప్రథమంగా పేర్కొనవచ్చును. ఒకసారి కైలాసంలో దేవతలు మునులు పరమేశ్వరుని ప్రార్ధించి విఘ్నముల కొక్కని అధిపతిగా మాకు అనుగ్రహించమని కోరిరి. వారి ప్రార్ధనవిని మహేశ్వరుడు కుమారస్వామిని గణపతిని పిలిచి మీ ఇద్దరిలో ఎవరు ముందుగా భూప్రదక్షిణ చేసి వచ్చెదరో వారికి విఘ్నేశాధి పత్యము ఇచ్చెదను అని పలికెను. అది విని కుమారస్వామి వెంటనే నెమలి వాహనమెక్కి భూప్రదక్షిణమునకు బయలుదేరి పోయెను. కాని గణపతి కొంతసేపు ఆలోచనచేసి తర్వాత తన తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులకు 3 సార్లు ప్రదక్షిణచేసి భక్తితో నమస్కరించి నిలబడెను. పరమేశ్వరునికి ఎంతో సంతోషము కలిగెను. కాని వినాయకుని ఇంకా పరీక్షించదలచి "కుమారా! నీవు భూప్రదక్షిణ చేయుటకు ఇంకా బయల్దేరనేలేదు కారణము ఏమి?" అని అడిగెను. అంతట

గణపతి తల్లిదండ్రులకు నమస్కరించి తండ్రీ మాతాపితరులకు 3 సార్లు ప్రదక్షిణచేసిన అది భూప్రదక్షిణతో సమానమగును అని శాస్త్రములలో చెప్పబడినది. కాబట్టి నేను అట్లే చేసితిని మరియు:-

తయేవ హి త్రయో లోకా
స్తఏవ త్రయ ఆశ్రమాః
తయేవ హి త్రయో వేదా
స్తఏవోక్తా స్త్రయోఽగ్నయః.

--తల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురు 3 లోకాలు, 3 ఆశ్రమాలు, 3 వేదాలు, 3 అగ్నులతో సమానము అని బదులు పలికెను.

3 లోకాలు : భూలోకము, భువర్లోకము, సువర్లోకము.

3 ఆశ్రమములు : బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థము.

3. వేదాలు : ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము.

3. అగ్నులు : గార్హపత్యాగ్ని, దాక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని.

--అంతట పరమేశ్వరుడు ఎంతో సంతోషించి గణపతిని విజేతగా ప్రకటించి విఘ్నేశాధిపత్యము ఇచ్చి పంపెను.

పురాణములలో తల్లిని దేవతగా భావించి పూజించినవారు ఎందరో కలరు. ధ్రువుడు, పాండవులు, శ్రవణకుమారుడు, పండరి మొ॥.

ఉపాధ్యాయానాం దశాచార్యః
ఆచార్యాణాం శతం పితా
సహస్రం తు పితుర్మాతా
గౌరవేణాతిరిచ్యతే.

--పదిమంది ఉపాధ్యాయులకంటే ఆచార్యుడు, వందమంది ఆచార్యులకంటే తండ్రి, వెయ్యిమంది తండ్రులకంటే తల్లి గౌరవనీయురాలు, పూజ్యురాలు అని శాస్త్రము కలదు.

కౌశికుడను ఒక బ్రాహ్మణుడు ఒక చెట్టు క్రింద కూర్చుని తపస్సు చేయుచుండెను. ఆ సమయమున ఆ చెట్టుపై ఒక కొంగ కూర్చుని కౌశికునిపై రెట్టవేసెను. వెంటనే కౌశికుడు కన్నులు తెరచి క్రోధముతో ఆ కొంగను మాసెను. ఇతని క్రోధాగ్ని వల్ల

ఆ కొంగ వెంటనే భస్మమై పోయెను. ఈ సంఘటనతో అతనికి తను గొప్ప తపస్వి నను గర్వము బాగా ప్రబలి పోయెను. ఒకనాడు అతడు భిక్షాటనకై బయలుదేరి ఒక ఇంటిముందు నిలబడి భవతి భిక్షాం దేహి అని అరచెను. ఆ ఇంటిలోని ఇల్లాలు బ్రాహ్మణుని చూసి ఇప్పుడే వచ్చెదను అని చెప్పి లోపలికి వెళ్ళిపోయెను. ఆ బ్రాహ్మణుడు చాలసేపు అక్కడే వేచి యుండెను. ఇంతలో ఆ గృహిణి భిక్ష తీసుకొని రాగా కోపముతో ఇంత ఆలస్యమగుటకు కారణ మేమి? మావంటి తపస్సంపన్నుల క్రోధాగ్నికి భస్మమై పోదలచితివా? అనగా అమె నవ్వుతూ ఓ బ్రాహ్మణుడా! నీ క్రోధానికి భస్మమైపోవుటకు నేను కొంగను కాను అని చెప్పెను. అది విని బ్రాహ్మణుడు ఎంతో ఆశ్చర్యపోయెను.. నిన్న జరిగిన ఈ సంఘటన ఈమె కెలా తెలిసింది అని ఆలోచించుచుండగా ఆమె మరల ఇట్లు పలికెను. ఓ బ్రాహ్మణుడా! నేను సదా నా పతిని సేవించుచుండు భాగ్యమున నీ సంగతి అంతా దివ్యదృష్టితో గ్రహించగలిగితిని. నీకు జ్ఞానోదయము కలుగుటకు నీవు మిధిలా నగరమునందున్న ధర్మవ్యాధుని వద్దకు పోవలసింది అని చెప్పెను. అది విని అతడు ధర్మవ్యాధుని వెదకుచూ మిధిలానగరమునకు వచ్చి అక్కడ అతనిని కనుగొని నమస్కరించి నిలబడెను. ధర్మవ్యాధుడు బ్రాహ్మణుని చూసి అతని పూర్వ వృత్తాంతమంతయు తపస్సు చేయుట మొదలుకొని పతివ్రత అయిన స్త్రీ వద్ద జరిగిన వృత్తాంతము వరకు అతనికి తెలియజేసెను. అతడు మిగుల ఆశ్చర్యపడి మహానుభావా! మీవద్ద ధర్మ రహస్యము తెలుసుకొనగోరితిని. నా అహంకారమంతయు నశించినది. నన్ను అనుగ్రహించండి అని ప్రార్థించెను. అప్పుడు ధర్మవ్యాధుడు తల్లిదండ్రులు నాకు ప్రత్యక్ష దేవతలు వారిని సదా సేవించుచుండుటవలన నాకు ఈ దివ్యజ్ఞానము లభించినది అని చెప్పెను.

పితా మాతా చ భగవ
న్నేతౌ మద్దైవతం పరమ్
యద్దైవతేభ్యః కర్తవ్యం
తదేతాభ్యాం కరోమ్యహమ్.

--నా తల్లిదండ్రులను దేవతలతో సమానంగా పూజిస్తాను. దేవతలకొరకై ఏమి చేయాలో అది నేను నా తల్లిదండ్రుల కొరకై చేసెదను అని చెప్పెను. తర్వాత "మీకు నా ప్రత్యక్షదైవములైన తల్లిదండ్రులను చూపిస్తాను రండి" అని ఆ బ్రాహ్మణుని వెంటబెట్టుకొని తల్లిదండ్రులవద్దకు వచ్చెను. ఆ బ్రాహ్మణుడు అతనికి మాతాపితరుల యందు గల భక్తికి సంతసించి కొంత కాలము అతనివద్ద జ్ఞానవిద్యను గ్రహించి అహంకార రహితుడై తన గ్రామమునకు వెడలిపోయెను.

## పితృదేవో భవ

ఒకసారి వాజశ్రవుని పుత్రుడు గౌతముడు విశ్వజితోయాగము చేసెను. ఆ యాగములో తన ధనమంతా దానధర్మములు చేసి ఇంకా తనవద్దనున్న గోధనమును కూడ బ్రాహ్మణులకు దానము చేసెను. అది కూడ అయిన తర్వాత ఇంక శక్తిలేని పాలు ఇవ్వలేని ముసలితనముతో బాధపడుతున్న ఆవులను కూడ బ్రాహ్మణులకు దానముగా ఇచ్చుచుండెను. ఆ సమయమున అతని కుమారుడు నచికేతుడు తనతండ్రి చేయు దానమువలన సద్గతి కలుగదని దీనిని ఎలాగైనా నిరోధించవలెనని భావించి తండ్రి వద్దకు వచ్చి "నాన్నా! నన్ను ఎవరికి దానమిస్తావు" అని అడిగెను. క్షణము తీరికలేకయున్న అతని తండ్రి కుమారుని మాటలను లెక్క చేయక ప్రక్కకు త్రోసివేసెను. అంతటితో ఆగక నచికేతుడు మరల మరల తండ్రిని కస్మైమాం దాస్యసీతి" నన్ను ఎవరికి ఇస్తావు అని అడిగెను. అసలే కోపం విరాకుతో ఉన్న అతని తండ్రి వెంటనే "మృత్యవే త్వా దదామీతి" నిన్ను మృత్యువుకి ఇచ్చాను ఫో! అని చెప్పెను. వెంటనే నచికేతుడు యమలోకమునకు పయనమై పోయెను. అక్కడ 3 రోజులు ఉపవాసముతో గడపి యముని సంతోషపరచి అతని ద్వారా 3 వరములను సంపాదించుకొని తిరిగి తండ్రివద్దకు వచ్చెను.

శాన్తసంకల్పః సుమనా యథా
ద్వీతమన్యుర్గౌతమో స్యాభి మృత్యో
త్వత్ప్రసృష్టం మాభివదేత్ప్రతీత
ఏతత్ త్రయాణాం ప్రథమం వరం వృణే.

--హే మృత్యుదేవతా (యమరాజా) నా తండ్రి నేను యమలోకం వెళ్ళినందుకు కోపగించుకొనక శాంతమనస్సుతో నన్ను ఎప్పటివలె ఆదరించవలెను. ఇది నా మొదటి వరం అని కోరెను.

ఈ వ్యాఖ్యానము వలన నచికేతుని విచిత్ర పితృభక్తి వెల్లడి అగుచున్నది. తండ్రి యొక్క ఆజ్ఞతో యమలోకం వెళ్ళి అక్కడ తండ్రికి సద్గతి, శాంతము, ప్రసన్నత కోరుకొని ఆత్మజ్ఞానమును కూడ సంపాదించి తిరిగి వచ్చెను.

వనవాసకాలములో రాముడు పడుచున్న బాధలను చూసి దుఃఖితుడై లక్ష్మణుడు కైకేయిని, దశరధుని కఠినమైన మాటలతో నిందించెను. కాని రాముడు మాత్రం తనకెన్ని కష్టములు కలిగినా పితృభక్తిని మరచిపోలేదు. అంతేగాక లక్ష్మణుని సమాధాన పరచుచూ ఇట్లు చెప్పెను.

గురుశ్చ రాజా చ పితా చ వృద్ధః
క్రోధాత్ ప్రహర్ష దథవా పి కామాత్
యద్ వ్యధిశేత్ కార్యమవేక్ష్య ధర్మం
కస్తం న కుర్యా దనుశంసవృత్తిః.

--లక్ష్మణా! మహారాజు (దశరథుడు) మనకు రాజు, గురువు, తండ్రి అందువల్ల ఆ వృద్ధ మహానుభావుని మనం గౌరవించాలి. వారు కామ క్రోధ మోహంతో ఏమి ఆజ్ఞాపించిరో దానిని అనుసరించుటయే మన ధర్మము. దానికి విరుద్ధంగా క్రూరము, హీనము అయిన ఆచరణతో తండ్రి ఆజ్ఞ పాలించని వాడు దుర్మార్గునిగా పేరు పొందును.

అదే విధముగా తన తల్లితో రాముడు ఇట్లు పలికెను.

నాస్తి శక్తిః పితుర్వాక్యం
సమతిక్రమితుం మమ,
ప్రసాదయే త్వాం శిరసా
గన్తు మిచ్ఛామ్యహం వనమ్.

--అమ్మా! నీ పాదములకు నమస్కారిం

చుచున్నాను. నాకు తండ్రియొక్క ఆజ్ఞను ధిక్కరించు శక్తి లేదు. కాబట్టి వనమునకు పోవుటకు అనుజ్ఞ నొసంగుము అని ప్రార్థించెను.

తండ్రినే దైవంగా భావించిన వారు మన పురాణములలో ఎంతో మంది కలరు. అందు ముఖ్యముగా భీష్ముడు తండ్రికొరకై రాజ్యాధికారమును త్యజించి ఆజన్మ బ్రహ్మచారియై లోక ప్రసిద్ధమైన కీర్తిని పొందెను. అలాగే తండ్రి ఆజ్ఞతో తన తల్లినే సంహరించి తండ్రిని సంతోషపెట్టి ఆయన ద్వారా తిరిగి తన తల్లిని బ్రతికించుకొన్న పరశురాముడు పితృభక్తిలో ఎంతో కీర్తి పొందెను. ఇంకా సాగర పుత్రులు, మృకండుముని మొదలైన వారు తండ్రి ఆజ్ఞను పాలించి కీర్తి గడించిరి.

## ఆచార్యదేవో భవ

తే తమర్చయన్త స్త్వం హి నః
పితా యోఽస్మాక మవిద్యాయాః
పరం పారం తారయసీతి నమః
పరమ ఋషిభ్యో నమః పరమ ఋషిభ్యః.

--విద్యారూప నౌక ద్వారా అవిద్య కారణమున జరుగు పనులను దాట శక్యమగునట్లు చేయు ఆచార్యులకు పదే పదే నమస్కరించుచున్నాను అని భావం.

ఇక్కడ శ్రీకృష్ణుడు సర్వ విద్యలకు మూలకారణుడైనప్పటికిని కాశ్యపగోత్రజుడైన సాందీపని యొక్క ఆచార్యత్వమున గురుకులంలో విద్యాభ్యాసము చేసెను. గురువు లేని విద్య గుడ్డి విద్య అని సర్వజనులకు ప్రభోదించుటకై ఆచార్యుని పరమాత్మగా భావించి శ్రీకృష్ణుడు స్వయంగా విద్యాభ్యాసమును కొనసాగించెను.

బలరామకృష్ణులు గురుకులంలో ఉండి ఆచార్యుని వద్ద విద్యాభ్యాసమును పూర్తిచేసిరి. తదనంతరం గురుదక్షిణగా ఏమి కావాలని గురువుని అడుగగా ఆయన శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్మ అని తెలుసుకొన్నవాడై ఎప్పుడో 12 సం॥ల క్రిందట సముద్ర స్నానమునకు వెళ్ళి మరణించిన తన కుమారుని తీసుకొనివచ్చి గురుదక్షిణగా సమర్పించి పుత్రశోకమునుంచి విముక్తి కలిగించమని కోరెను. బలరామకృష్ణులు అట్లే అని బదులుపలికి వెంటనే యమలోకమునకు పోయిరి. అచ్చట యమునితో వాగ్వివాదముజరిపి. పోరాడి గురుపుత్రుని బ్రతికించి తీసుకొనివచ్చి గురుదక్షిణగా సమర్పించిరి.

గురువునే దైవంగా భావించినవారు మన పురాణములలో ఎంతోమంది కలరు. ఆరుణి, ఉపమన్యు, ఉదంకుడు, ఏకలవ్యుడు, అర్జునుడు మొదలగువారు గురుభక్తిని ప్రదర్శించి ఎంతో కీర్తి గడించిరి.

బృహస్పతి, శుక్రాచార్య, ద్రోణాచార్య, కృపాచార్య, గర్గాచార్య, రామానుజాచార్య, శంకరాచార్య, మధ్వాచార్య, నింబార్కాచార్య మొదలైనవారు ఆచార్యవృత్తిలో ఎంతో కీర్తి గడించిరి.

## అతిథిదేవో భవ

తిస్రో రాత్రి ర్యదవాత్సీగృహే
మేఽనశ్నన్ బ్రహ్మన్నతిథి ర్నమస్యః
నమస్తే స్తు బ్రహ్మన్ స్వస్తిమేఽస్తు
తస్మాత్ ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ.

--నచికేతుడు యమలోకం చేరుకొని అక్కడ యమధర్మరాజు లేకపోవుట చేత 3 రాత్రులు అతని గుమ్మమువద్దనే గడిపెను. పిమ్మట యమధర్మరాజు తనలోకమునకు తిరిగివచ్చి నచికేతునిచూసి "మీరు నాకు నమస్కార యోగ్యమైన అతిథులు. నా ఇంటివద్ద 3 రాత్రులు భోజనము లేకుండా ఉన్న కారణంగా మీకు 3 వరములను ఇవ్వ సంకల్పించితిని కోరుకొనుము" అని పలికెను.

ఈ వృత్తాంతము వలన యముని యొక్క మనోభావము వ్యక్తమగుచున్నది. అతిథిని దేవస్వరూపముగా పూజించుటకు ఉత్తమమైన ఉదాహరణ ఈ వృత్తాంతము.

భారతీయ సంస్కృతిలో అతిథి పూజ ఎంతో మహత్వము కలది. అతిథిగా ఇంటికి వచ్చిన వ్యక్తికి సమయానుకూలమును బట్టి ఏమీ దొరకక పోయినచో కనీసం ఆ వచ్చిన అతిథిని ప్రేమతో ఆదరపూర్వకముగా పలకరించి సంతోషపెట్టవలెను.

తృణాని భూమి రుదకం
వాక్ చతుర్థీ చ సూనృతా.
సతా మేతాని గేహేషు
నోచ్ఛిద్యన్తే కదాచన.

--ఇంటికి వచ్చిన అతిథికి కాళ్ళు కడుగుకొనుటకు నీటిని ఇచ్చి, ఆసనమును చూపి, కుశలప్రశ్నలు మృదుభాషణలతో సంతోషపెట్టవచ్చును. ఎందుకంటే ఏదైనా వస్తువును అతిథి కొరకై సేకరించుటకు కొంత వ్యయప్రయాసలు తప్పవు. కానీ పైన చెప్పినదానికి వ్యయప్రయాసలతో పనిలేదు. కాబట్టి అందరు చేయగల సులభమైన పద్ధతి. ఆ తర్వాత మన తాహతును బట్టి అతిథిని భోజనాదులతో సంతోషపెట్టవచ్చును. ముఖ్యముగ అతిథిని నిరాకరించుట కూడదు.

అతిథి సేవలో శిబిచక్రవర్తి అతిథి రూపంలో వచ్చిన పక్షుల కొరకై తన దేహము అర్పించుట, విదురుడు అతిథిగా వచ్చిన శ్రీకృష్ణుని పూజించుట, రంతిదేవుడు ఆకలిగొన్న అతిథిని సత్కరించుట, శ్రీకృష్ణుడు అతిథిగా వచ్చిన కుచేలుని ఆదరించుట, అంబరీషుని అతిథిపూజ వీటిని గురించి మన పురాణములలో విపులముగా తెలుపబడినది. ధర్మశాస్త్రములలో అతిథి యజ్ఞమునకు మహత్వపూర్ణమైన స్థానము గలదు. కాబట్టి ప్రతి మనిషి తల్లి, తండ్రి, గురువు, అతిథులను పూజించవలెను.





# శ్రీ గోదాదేవి వైభవం

— శ్రీ పి.ఎస్.ఎస్.ఆర్. శ్రీనివాసన్




దేవస్య మహిషీం దివ్యా
మాదౌ గోదా ముపాస్మహే,
యన్మౌ విమాలికాం ప్రీత్యా
స్వీకరోతి స్వయం ప్రభుః.

--శ్రీ భట్టర్

ఏ యువతి శిరమందు ముడిచి విడిచిన పూలమాలికను ప్రభువగు శ్రీమన్నారాయణుడు తానయి ప్రేమతో స్వీకరించెనో ఆ దేవదేవుని దివ్యమహిషియగు శ్రీగోదాదేవిని సేవించెదను.

ఆళ్వారాచార్య పరంపరలో అగ్రగణ్యమై సకల చేతనోజ్జీవనమున కై తాను భూమియందవ తరించిన జగజ్జనని భూదేవి యంశ భూత ఈ గోదాదేవి. ఈమెకు 'ఆండాళ్' అనియు, 'ఆముక్తమాల్యద' అనియు, 'శూడి కొడుత్తనాచ్చియార్' అనియు ప్రసిద్ధ నామములు గలవు. దేహాత్మాభిమానులగు సంసారి చేతులకును, ఆత్మ స్వరూప జ్ఞానముగల ఋషులకును గులకరాతికి కులపర్వతమునకు గల యంతరము కలదు. అట్టి ఋషులకును ఆళ్వారులకును అంతటి వాసి కలదు. ఆ యాళ్వారులకును పెరియాళ్వారులకును అంతటి తారతమ్యము కలదు. ఆ పెరియాళ్వారులకును గోదాదేవికిని అంతటి భేదము కలదని పూర్వుల నానుడి కలదు. అట్టి గోదాదేవి వైభవమును సమగ్రముగ తెలుప నెవరి తరము?

శుచిమాసి పాండ్యభువి పూర్వఫల్గునీ
ఘనభేన వీన తులసీ వనాంతరాత్
ఉదితాముదారగుణ రంగనాయక
ప్రియవల్లభాం వసుమతీ ముపాస్మహే.

పాండ్యదేశమునందు ఆషాఢ మాసమున పూర్వ ఫల్గుణీ నక్షత్రమున తులసి వనమున అవతరించినదియు అనంత కల్యాణ గుణములు గల శ్రీరంగనాథునకు ప్రియ వల్లభయునునగు భూదేవి అంశభూతమైన గోదాదేవి నుపాసించెదను.

నీళాతుంగ స్తనగిరితటే
సుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతి

శతశిరస్సిద్ధ మధ్యాపయంతీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి
నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇద మిదం
భూయ ఏ వాస్తు భూయః.

నీళాదేవి యొక్క ఉన్నతములగు కుచగిరి తటములందు నిద్రించువాడును, ఆయమ ముడిచిన పూలమాలచే గట్టబడిన వాడును అగు శ్రీకృష్ణుని మేలుకొలిపి యనేక వేదాంతములందు బ్రతిపాదింపబడిన తన పారతంత్ర్యమును నివేదించుకొని యనుభవించిన శ్రీగోదాదేవిని కాలతత్త్వమున్నంత వరకును నాశ్రయించెదను గాత.

అంచలు విహరించు శ్రీ విల్లిపుత్తూరు నందు శ్రీగోదాదేవి యవతరించిన దెట్టు లనిన:- జనకరాజ యజ్ఞశాలకయి భూమిని నాగటితో దున్నునపుడు నాగటిచాలునందు సీతాదేవి అవతరించిన విధముగనే నిష్కళంక భక్తాగ్రేసరుడైన శ్రీ విష్ణుచిత్తులు (పెరియాళ్వారులు) పూలతోటలో తులసి చెట్లకు పాదులు త్రవ్వుచుండగా ఒక తులసి పాదుయందు మన్నులో భూదేవ్యాంశమున శ్రీగోదాదేవి ఆవిర్భవించెను.

ఈ విషయమును దివ్యసూరి చరిత్రము నందు క్రింది విధముగ వర్ణింపబడినది.

స విష్ణుచిత్త స్తులసీవనావనిం
ఖనిత్రవక్త్రేణ నిఖాతయన్ కదా
శుభే ముహూర్తే శుచి మాసి ఫల్గునీ
ప్రతీత తారే తులసీ వనాంతరే
భువో భవత్కాంచనబాలకన్యకాం
భూమ్యంశకాం వీక్ష్య విసిష్మయే ముదా.

ఆ విష్ణుచిత్తులు తులసితోటలో భూమిని పలుగుతో త్రవ్వుచుండగా కలియుగమునందు ఆషాఢమాసమున పూర్వఫల్గుని యనెడి ప్రసిద్ధమగు నక్షత్రమున శుభలగ్నమున తులసీ వనములో భూమియొక్క యంశమున గానవచ్చిన బంగారుబొమ్మ వంటి బాలికను ఆండాళును చూచి విస్మయమును సంతోషమును చెందిరి.

అనంతరము శ్రీవిల్లిపుత్తూరునకు నిర్వా

హకులైన శ్రీవిష్ణుచిత్తులు కన్నియనెత్తి విస్మితులయి 'రోలం బాలిక' అనగా తుమ్మెద రెక్కలవంటి కురులు కలదనెడి పేరుపెట్టి నల్లారుముద్దుగా పెంచుచుండెను.

శ్రీవిష్ణుచిత్తులు తమ కిష్టదైవమగు శ్రీవటపత్రశాయికి తాను వేసి పెంచిన పూలతోట లోని వివిధములగు పూలతో మాలికలు గట్టి నిత్య మర్పించుచుండెడివారు. ఇట్లు స్వామి కని కట్టియుంచిన మాలికలను నాళ్వారులు లేని సమయము చూచి ఆండాళ్ళు, తల దువ్వుకొని, చీరెగట్టి, సొమ్ములు పెట్టుకొని తలలో ఆపూల మాలికలను ముడిచికొని నేనతనికి తగుదునా, తగనా యని తన సొగసును అద్దమున జూచుకొను చుండెను. ఈ విధముగా చాలాకాలము గడచిపోయినది. పూలమాలలు తాను ధరించుకొని నలగకుండ ఎప్పటియట్ల యెత్తి యుంచుమండ ఒకనాడు దైవికముగ నాళ్వారుల కంట బడెను. పరమభక్తుడగు నాళ్వారులా బాలిక చేసిన కార్యము భగవదపచార కారణ మని తలచి కటకటంబడి 'అయ్యో! ఎంతటి అకార్యమొనరించితివే బిడ్డా! పెరుమాళ్ళకు ముందుగా సమర్పింపక పెట్టుకొనవచ్చునా! పరమాపరాధము కాదా!' యని మందలించి ముగ్ధయగు నామెను మరేమియు ఆనజాలక ఆనాడు పూలమాలలను స్వామికి సమర్పింపక మానివేసెను. ఆనాటి రాత్రి పెరుమాళ్ళు ఆళ్వారుల స్వప్నమందు సాక్షాత్కరించి 'ఈనాడెప్పటివలె పుష్పమాలలు మాకు సమర్పింపక మానితివేల?' యని ఎలుగునివానివలె అడిగెను. స్వప్నములోనే ఆళ్వారులు 'స్వామీ! నాబిడ్డ పసిది. అభము శుభమెరుగని ముద్దరాలు. దేవరకని కట్టియుంచిన పూలచెండ్లను బాల్యచాపల్యమున తన జడలో ముడిచికొనినది. అట్టిది దేవరవారికెట్లు సమర్పించి మహాపరాధ మొడిగట్టుకొనగలను? తెలియని కాలమందు జేసిన యపరాధము నెట్లు బాపు కొనగలనో? ఉపాయ మెరుగక పరితపించు నేను తెలిసి తెలిసి యెట్టు లీ బాలిక తలలో ముడిచి తీసిన పూలమాలలు సమర్పింప మనసెట్లు వచ్చును? గాన ఏమియు తెలియని బాలిక గావించిన తప్పు సైరించి దేవరవారు కటాక్షింపక యున్న గత్యంతరమేమి యని దుఃఖపడుచు విన్నవింపగా 'ఓయీ ఆళ్వారులు! మాకా బాలిక కురులందు ముడిచి విడిచిన మాలికయే యెక్కువ ఆమోదకరమైనది సుమా. అంతకుమించి ప్రీతి జనకమైనది మరి యన్యము కాదని పెలవిచ్చి యంతర్ధానము చెందెను.'

అంత మేలుకొని ఆళ్వారులు పరమాద్భుత రససాగర నిమగ్నులై అది మొదలా బాలిక నీళాదేవియో, భూదేవియో, శ్రీదేవియో యయి యుండునని విశేష ప్రతిపత్తి గలిగి తన కట్టి మహనీయ భాగ్యశాలిని తనయ కావుట కమితానందము జెందిన వాడయ్యెను.

లోకమున స్వామికి సమర్పించిన పిమ్మట భగవత్ప్రసాదముగా స్వామి ధరించి యనుగ్రహించిన చందన మాలికాదులను భక్తులు గ్రహించుట కలదు గాని యొక ముద్దరాలి కొప్పున ముడిచి యిడిన పూలమాలలను భగవంతుడు స్వీకరించుటిదివరకెన్నడు విన్నది కన్నది కాదు. కావున నిట్టి యపూర్వ వైభవ సమృద్ధికి గుర్తుగా 'ఆముక్తమాల్యద' శూడికొడుత్త నాచ్చియారని ప్రఖ్యాతి గాంచెను.

పువ్వు పుట్టగనే పరిమళించు ననెడి సామెత ఈమె యందే సార్థకమైనది. దివ్య సుగంధముతో మొలక లెత్తు తులసివలె ఈ దేవి పరమభక్తి మూర్తియయి యవతరించుటచే నామె బాల్య కౌమార యౌవనాది దశలవలె నాదినమున కాదినము యొక వింత ఛాయతో నభివృద్ధి గాంచుచు పరభక్తి పరజ్ఞాన పరమభక్తి గలిగి యలరారుచుండెను. తక్కిన యాళ్వారుల కంటే నీయమకు భగవంతుని యందలి ప్రేమ అత్యంత గాఢమై, విలక్షణమై, యద్వితీయమై యుండెను. భగవంతుని క్షణ మెడఁ బాసిన అది దుస్సహ వేదనాకరమై యుండెను. కంటికి రెప్పలడ్డు ముగజేసె విధాత క్రూరుడై యని యను తపించుచుండెడిది.

శ్రీకృష్ణ విరహము నోర్వజాలక గోపిక, లోపికలు లేని వారై 'దుష్టకాళియ! తిష్ఠాత్ర కృష్ణోహమితి చాపరా' (యష్టకాళియుడా! నిలు, నిలు నేను గృష్ణుడనని') యొకటి యనెను. యన్నట్లు కృష్ణాను కరణము చేసి, యసురులు దేహములందు నిలుచు నట్లు లొనరించిన విధమున నీమెయు దాను నొక గొల్ల పడుచుననియు, విల్లి పుత్తూరు నందున్న కన్నెలు తన తోడి గోపికలనియు, అందు వేంచేసియున్న శ్రీ వటపత్రశాయియే నందమందిరమున వేంచేసియున్న యశోదా కిశోరంబగు శ్యామసుందరుడనియు భావించి గాఢమగు భావనా విశేషమున దాను గొల్ల కట్టు, గొల్లమాట సర్వము నచ్చపు గోపికయై మార్గశిరమాసమున నోము నోచియు, కామ భజనాదు లొనరించియు 'తిరుప్పావు, నాచ్చియార్ తిరుమెళి' యనెడి దివ్యప్రబంధము లను తమిళభాషయందు గృపచేసి చేతనుల నుజ్జీవింప జేసెను. ఇట్టులీ యనన్య భక్తి మతి పెద్దదై పెండిలికి దగిన ఈడు కల దగుట జూచి ఆళ్వారుయ తగిన వరుడు లభింపక విచారమును బొంది పరిపరి విధముల బరితపించుచు వ్యాకులిత మనస్కులై యుండిరి.

తన తండ్రి తన పెండ్లి విషయమై యేమియు దోపక దిగులొంది యుండుట గాంచి శ్రీ గోదాదేవి అప్పా! మీరేదియో యొక తీరున నున్నారేల? అని ప్రశ్నింపగా ఆళ్వారులు 'అమ్మా! నీకు తగిన వరుడెవ్వరా యనియే నా విచారము' అనిరి. దానికి 'ప్రాకృతులగు మనుష్యులకు నన్నిచ్చెదవేమో! అటులయిన నొక క్షణమైన బ్రతుకజాలను' అని చెప్పగా 'మరి యెవరికిత్తునమ్మా' యని ఆళ్వారులనగా సర్వజగన్మోహనమూర్తి యగు శ్యామసుందుని శ్రీహరినిగాని ఇతరుల నేను మనస్సునందయిన తలచుదానను గాను' అని చెప్పినది. అపుడాళ్వారులు అది యెట్టు పొసగును తల్లీ! ఆ ప్రభువున కెట్లీయగలననగా నూట ఎనిమిది దివ్యదేశములయందలి పెరుమాళ్ళ వైభవము వేర్వేరుగా తనకు వివరింపుమనియు వారిలో నచ్చిన వారిని తాను వరింతునని తెలిపెను.

ఆ మాటలాలించి యాళ్వారులు మొట్ట

మొదట తమరున్న శ్రీవిల్లి పుత్తూరులో వేంచేసియున్న శ్రీవటపత్రశాయి వైభవము వర్ణించిరి. అంత పాండ్యమండలమందలి దివ్య దేశములందు వేంచేసియున్న యర్చామూర్తుల వైభవమును, మలనాడునందు దివ్య సన్నిధులందు విజయము చేసిన శ్రీమూర్తుల వైభవమును, ఉత్తరదేశ దివ్యస్థలములందున్న స్వామి వైభవమును, శ్రీనివాసమూర్తి వైభవము మున్నగు తొండమండలమందలి స్వాముల వైభవమును శ్రీరంగనాథుడు మొదలగు జోరమండలమున వేంచేసియున్న యర్చామూర్తుల వైభవమును, వనభూమీ ధరమున నెలకొనియున్న సుందరరాజ వైభవమును విశదముగ కీర్తించి తెలుపగా ఆండాళ్ళు విని, తనువున బులకలెగయ, కనుల ఆనందాశ్రువులు జడిగొన, శ్రీరంగ రాజ కురుల సౌరు, మోముగోము, కనుల సోయగము విని మిగుల బ్రేమమున బరవశమై మోహ సముద్రమున మునిగెను.

హృదయము ద్రవించి కందొవ లానందాశ్రువులకు గందువలయి స్రవింప, భూలోక వైకుంఠమగు శ్రీరంగమున వేంచేసి శృంగార సీమ యనం దగిన యొయ్యారి రంగని యందు బద్ధానురాగము కలదయి యెట్టులెట్టులో దినములు గడుపుచుండుటగాంచి 'గోదకు గెవెల కుఱ్ఱడే ఈడు జోడైన వరు' డని నిశ్చయించి, యది యందని పండ్ల కఱ్ఱులు సాచుట కదా యని తలచి నిస్పృహ నంది చేయునది యేమియు దోపక విచారముతో గన్ను మూసినంత శ్రీరంగనాథుడాళ్వారులకు సాక్షాత్కరించి 'మీ కూతును గోదను శ్రీరంగమునకు గొనిరండు. మేమే యుచిత రీతి నా కన్నియ పాణిగ్రహణ మొనరించెద' మని యానతిచ్చి యంతర్ధానమయ్యెను. ఆళ్వారులా కలగని యానంద సనిమగ్నులై యుండ శ్రీరంగనాథుడు తన పెద్ద యర్చకునకు గలలో గానుపించి 'ఓయీ! నీవు మా ఛత్రచామర తాలవృంతాది సకల పరిజన పరిచ్ఛదములతో శ్రీవిల్లిపుత్తూరునకు బొమ్ము. అందు విష్ణుచిత్తులగు మహాభాగవతులు గలరు. వారిని వారి కుమార్తెతో రావలసిన' దని మా యాజ్ఞ దెలిపి తోడుకొని రమ్ము యని యాజ్ఞాపించి పంపిరి.

శ్రీరంగపతి పరిడవముతో నర్చకుడు భగవదాజ్ఞానుసారముగ శ్రీవిల్లిపుత్తూరున కేగి, యాళ్వారులను జూచి శ్రీ రంగనాథుని యాజ్ఞను తెలిపి ప్రయాణమును చేయుడని విన్నపము చేసెను. ఆళ్వారులు శ్రీరంగనాథుని యాజ్ఞను విని విస్మయానందముల నార మునిగి, తన కూతున కా వృత్తాంతమును నెఱిగించి సముచిత రీతి గైసేసి యాండాళు నొక మణిమయ స్వర్ణ శిబిక యందుంచుకొని రంగనాథుని గాక మఱెవ్వరిని గన్నెత్తి చూడనని పతినపట్టిన యనన్య ప్రేమ మూర్తియగు నా లజ్జావతి పరులకు గానరాకుండ బల్లకి చుట్టునొక పట్టుతెర గట్టించి యఖిల దివ్య వాద్యములతో శ్రీరంగమునకు బయనమై పోయిరి.

శ్రీరంగ దివ్యదేశమును జేరజని తమ రాక యెల్లరకు దెల్లమగునట్లు వివిధములగు బిరుదులతో దిరుచ్చిన్నము లూదుచు శ్రీరంగధాముని కల్యాణ మంటపమును బ్రవేశించి తెరదీసిరి. అంత మబ్బుల చాటునుండి తళుక్కున వెలువడిన మెఱపు తెఱగున నెల్లరు గనుచుండ శ్రీగోదాదేవి కటితలమున గట్టిన బంగరు సరిగంచుల పట్టు చీరెయు, దుఱుమున ముడిచిన విరుల సరమును నుదుట దిద్దిన కస్తురి తిరునామములు, వీనుల కెగ్రబ్రాకు వాలుగల నేలవాలు గనుల సోయగము నపూర్వ శోభాసదనమై పిడికిట నడగు నెన్నడు మసియాడ, జక్కువలె నిక్కునొక ప్రక్కకుండు పదముల ఘల్లు ఘల్లుమని మ్రోయ కరముల కనక మణి కంకణముల కలకల ధ్వనులు మొఱయ నంచల బెడగడచు నొయ్యారంపు నడకలతో శ్రీరంగనాథునంతికమున కేతెంచి లోన జొచ్చి యాభువన మోహన దివ్యమూర్తిని కన్నుల కఱవు తీర సేవించి ప్రియతముని శ్రీపాదముల సేవించు భాగ్యమబ్బె కదా యని యత్యంతానందమును జెంది నాగపర్యంకము మీదికెక్కి శ్రీరంగనాథుని శ్రీపాద పద్మ రేఖ యందంతర్ధానమును జెందెను.

ఇట్టి యపూర్వ మహదాశ్చర్యకర సన్నివేశమును గాంచి యాళ్వారుల శిష్యులగు శ్రీవల్లభ దేవరాయలు మున్నగు వారెల్లరును విస్మయమును చెందిరి. ఆళ్వారులు శ్రీరంగనాథుని పరమానుగ్రహ పాత్రురాలయినది గదా తన బిడ్డయని యానందమును, అట్టి భాగవతాగ్రగణ్యయగు సాధుశీల విరహమున కపరిమిత పరితాపమును చెందిరి.

శ్రీరంగనాథుడాళ్వారుల బిలువబంచి మామగారూ! అని పిలిచి 'తొల్లి పాల వెల్లి తన కూతు లచ్చిని నాకు నిచ్చి మామ యయ్యెను. నేడు మీరట్టులే మీ కన్యారత్నము గోదను నాకు గన్యాదాన మొనరించి మామ గారైతిరి' అని మిగుల సంతోషముతో జెప్పి, శ్రీ శఠగోపము తీర్థప్రసాదములు మున్నగు కోవెల మర్యాద లతిప్రీతి ననుగ్రహించి, ఇక మీరు శ్రీ విల్లిపుత్తూరున కేగి యందు శ్రీవటపత్రశాయిగా వేంచేసియున్న మమ్ము నెప్పటివలె బుష్పమాలా సమర్పణ కైంకర్యమున సేవింపుడని యాజ్ఞాపింప నాళ్వారులు ప్రీతి విషాదములు డెందమున సందడింప శ్రీవిల్లి పుత్తూరునకు బోయి పూర్వమువలె గైంకర్య మొనరించుచు నుజ్జీవించిరి.

గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
నరపతి పరిక్లుప్తం శుల్క మాదాతుకామః
శ్వశుర మమరవంద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి.

అని నేటికిని సర్వజనుల నతి నుతులకు బాత్రులైరి.

కర్పూర నీరాజన మివ్వరె
కలికి శ్రీరంగ నాయికకి
నేర్పుతో మీరలు పాటలు పాడరె
నీరజకుల శుభదాయికకి॥

తిరువిల్లీపుర తులసీవనమున
తీరుగ నోద్భవించి
పెరియాళ్వారుల ప్రియపుత్రికయై
పెంపొందిన మన చెలియకును॥

ముప్పది పాశుర మతిమోదమ్మున
ముద్దుల రంగని పాడుచును
ఒప్పుగ రంగని వరియించిన
మన వనజ దళేక్షణ రాణికిని॥



# గృహాలంకరణలో రంగవల్లులు

డాక్టర్ టి.ఆర్. కృష్ణన్



ముగ్గుల రచన ఒక ప్రత్యేక కళ. ఇది చతష్షష్టి కళలలో ఆరవదియగు "తండుల కుసుమ బలివికారము" అని బియ్యపుపిండి, పూవులు మొదలగు వానితో భూతతృప్తి కొరకు పెట్టెడిముగ్గులు, ప్రత్యేక కళగా పేర్కొనబడినది. చిత్రలేఖనమందు ఈ ముగ్గుల రచన ఇమిడియుండుటేగాక, చిత్ర లేఖనమునకు గల లక్షణములే దీనికి కూడ గలవు.

గృహాలంకరణ కొరకు గోమయము, గుల్లముగ్గు, పసుపు, పసుపు + సున్నము కలుపగా వచ్చిన పారాణి లేక కుంకుమము ఎక్కువగ వాడుచుందురు. హిందువులలో ఆధ్యాత్మిక, ఆరోగ్య దృష్టిలేని విద్యగాని, కళగాని, తుదకు ఎట్టి సాంప్రదాయముగాని లేదు.

గోమయము, పసుపు, సున్నము, కుంకుమము గృహాలంకరణమునందు వాడు చున్నారు. గృహిణి అలంకరణమునందు గోమయమునకు బదులు కాటుక, పసుపు, సున్నమునకు బదులు గంధము వాడుచుం డుట చూచుచుందుము. వివాహములం దలంకరించు "నాకబలి" పట్టు కూడ గోమ యముతో స్థలమును శుభ్రపరచి, పసుపు, సున్నము లేక వరిపిండి (బియ్యపుపిండి) కుంకుమము లేక (పారాణి పొడి)లతో చిత్రిం తురు. నాకబలి పట్టుపై పెట్టు సజ్జ కూడ నలుపు, తెలుపు, ఎరుపు రంగుల తోనే లేపనము చేయుదురు. వివాహము నందు తయారుచేసిన మాంగల్యము, వెండి (తెలుపు)తో చేసిన మట్టియలు, నల్లపూసలు (నలుపు) విధిగ గృహిణి అలంకరించుకొని ముత్తైదువుగా జీవితాంతమువరకు యుండ వలెనని తలంపుతో అలంకరించుచున్నారు.

పై విషయముల సమన్వయించి చూచిన సున్నము, పసుపు, కుంకుమ, గోమయము లందు ఆరోగ్యసూత్రములే కాక ఆధ్యాత్మిక భావములు కూడ ఇమిడియున్నట్లు తెలియు చున్నది.

హిందువులలో "చక్రహస్తుని ప్రకటించు చదువే చదువు" అన్నట్లు ఆధ్యాత్మిక, ఆరోగ్య దృష్టి లేని విద్యగాని కళగాని, తుదకు ఎట్టి సాంప్రదాయముగాని లేదన్నచో అతి శయోక్తి కాదు. చిత్రలేఖనము, ముగ్గుల రచనలందలి ఆధ్యాత్మిక ఆరోగ్య భావము లెట్టివి? తెలుపు పసుపు రంగులు సాత్విక మును, ఎరుపు రంగు రాజసగుణమును, నలుపు తామస భావమును తెలుపును. పై పదార్థములయందు గల రంగులలో ఈ మూడు భావములే గోచరించుచుండును.

గృహలక్ష్మి

ఈ మూడు భావములు స్ఫురించు రంగు లనే ప్రపంచ విఖ్యాతిగాంచి, హైందవ చిత్ర కళకు ఆదర్శమైన అజంతా చిత్రలేఖనమం దుకూడ ముఖ్య వర్ణములుగ వాడియున్నట్లు





పరిశోధకులు తెలుపుచున్నారు. సత్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతిని

"అజా మేకాం లోహితశుక్ల కృష్ణాం
బహ్వీం ప్రజాం జనయంతం సరూపామ్" .

స్వీకరించిన నీలమేఘ (నలుపు + ఎరుపు + తెలుపు = నీలిరంగు) శరీరుడగు పరమాత్మను చేరవలయునని తెలియచేయుచున్నవి. ఆరోగ్య ఆధ్యాత్మిక విషయముల మేళవించి, ప్రతి వ్యక్తి కొద్దియో, గొప్పయో కళా నైపుణ్యము కలిగి, చిత్ర కళాసౌధాగ్రమున నిలిచి, కళారాధన చేయవలయునని, ఋషివర్యులు

"కాలానాం ప్రవరం ధర్మ
కామార్థ మోక్షదం
మాంగల్యం ప్రథమం వైతత్
గృహే యత్ర ప్రతిష్ఠితమ్." --మార్కండేయః

అన్నారు. మన గృహిణులు ఆ సూత్రములను ఎంతవరకు పాటించుచున్నారో గమనింతము.

గోమయములో అలికిన ప్రదేశము నీడ వారిన ముదురాకు పచ్చరంగు కలిగి, చీకటిగను, తేమగను యుండును. అందుచే గోమయమెంత ఆరోగ్యకరమైనను చూడగనే మనస్సుకు చీకాకు, నిరుత్సాహము, ఆందోళన కలుగును. నీలపు ఆకాశమున తెల్లని తామరలవలె, బాగుగ నలికిన ప్రదేశమున నుంచిన ముగ్గు సాత్వికతను స్ఫురింప చేయగలదు. ఆనందమును కలుగచేయగలదు. కనుకనే "అలికిన ఇంట బలకి నా అందమ్!" అను సామెత ప్రచారములోనుండుట.

ముగ్గులనుంచు ప్రదేశమును ముందు గోమయపు నీటితో బత్తుగ కలయంపి జల్లి గాని, ఇసుకపాలు కొద్దిగ గలమన్ను, గోమయము, వరికుట్టు ఈ మూటితోను బాగుగ మర్దించిన పదార్థముతో అలికిగాని సిద్ధపరచుదురు. ఈ పదార్థములతోనే, ఈ తీరుననే మొదట అజంతా చిత్రకారులు చిత్తరువులను చిత్రించుటకు ముందు గోడల పూతపూసి, తర్వాత చిత్ర రచన చేసినట్లు పరిశోధకులు తెలుపుచున్నారు.

గోమయము ఆరోగ్యమును కాపాడు వస్తువులలో ముఖ్యమైన క్రిమిహారి. వాయు దోషములు, మశూచికాది దోషములను రానీయదు. దోమలబాధను నివారించును. గోవు వల్ల సంప్రాప్తించు ప్రతివస్తువును ఆరోగ్యప్రదము, మంగళప్రదమూను. అందువలననే--

"గోమూత్రం గోమయం
సర్పిః క్షీరం దధి చ రోచనా
షడంగ మేతత్పరమం
మాంగల్యం సర్వదా గవాం"

అని పంచగవ్య విధానము చెప్పుచున్నది. గోమూత్ర, గోమయ, గోఘృత, గోక్షీర, గోరోజనములు మంగళకరములు అన్నారు. ఎప్పటికప్పుడు వేసిన గోమయము కస్తూరితో తుల్యమని ఆయుర్వేద భిషగ్వరులందురు. గోమయమింతటి ఆరోగ్యప్రదమగు వస్తువయినందుననే మతసంబంధమగు ప్రతిక్రియయందును మొట్టమొదట "గోమయేనానులిప్య" అని వచియించడము.

ఇక పసుపునకు గుణ ప్రధానముగా "క్రిమిఘ్ని"యని పేరు. రంగు కలిగించునది కావున "వర్ణ విధాయిని", స్త్రీలకెక్కువ ప్రియమైనందున "యోషిత్ప్రియా", పసుపు గృహాలంకరణయందేగాక, గృహిణి యలంకరణమునందు కూడ విరివిగ నుపయోగించుచున్నది కదా!

ముగ్గు కూడ క్రిమిహారి, ఉష్ణమును కలుగుచేయును. కావున గృహాలంకరణయందేకాక సున్నము రూపమున తాంబూలమున లోనికి గూడ తీసికొనుచుండుట లోకవిదితము.

ఇక ముగ్గుల విషయమున-- సూత్రమునకు గ్రుచ్చబడిన ముత్యముల చేరువలె కనిపించు ముగ్గులకు ముత్యాలముగ్గులని బహుముఖములు కలిగి, కోణములు తేలునట్లు పెట్టు ముగ్గులు రత్నాల ముగ్గులని నిదానమగు కర్రలవంటిగట్ల (+ గుర్తు గాని x గుర్తుగాని) తో గుర్తులుంచి చిత్రించు ముగ్గులకు కర్రముగ్గులని, రంగులచూర్ణముతో చిత్రించు ముగ్గులకు రంగవల్లులని మొత్తము నాలుగు విధములుగ ముగ్గులు విభజింపబడినవి. వీటిలో మొదటి మూడు రకముల గృహాలంకరణమందు కనిపించును. ప్రతి

ములందు మొదట "రంగవల్యాభిరలంకృత్య" అని యనుచుందురుకదా! అనగా వ్రతముల యందు పూజాప్రదేశమునందు, దైవప్రతిష్ఠా సమయములలో, వివాహములో అయిదవరోజున నాకబలి మొదలగు వానియందు ఈ రంగవల్లులతో అలంకరించెదరు. నిదానముగ ముగ్గు వ్రరయి తీయుటకు, చిగురు కొట్టుటకు ముగ్గుగొట్టమని, చిగురు క్రరయని రెండు పరికరములు కూడ కలవు. కాని ఏ పరికరములు లేకుండ ముగ్గు బొటన వ్రేలితోను, చూపుడు వ్రేలితోను కలిపిపట్టుకొని చేతితోనే పెట్టు ముగ్గులకు పోత ముగ్గులని పేరు.

పోత ముగ్గులకు మూలము, ప్రారంభము చుక్క లేక బిందువు.ఈ చుక్కలు ముత్యాలముగ్గునందు పెట్టినవి పెట్టినట్లు కనుపించుచుండును. రత్నాల ముగ్గులందు చుక్కలు కనుపించవు. కాని ప్రతి కోణమును ఒక్కొక్క చుక్కగ పరగణింపవచ్చును. చిత్రకారుడు తాను చిత్రించు చిత్రమునకు ముందు స్థల నిర్ణయమును చేసికొనినట్లే, స్త్రీలు కూడ మొదట నియమిత ప్రదేశములో చుక్కలుంచి, వానిని నియమబద్ధముగ కలుపుచుందురు. ఈ కలుపునపుడు వారు పోత ఎచట ప్రారంభించిరో అచటికే వచ్చి ఆపు చేయు పట్టుదలతో పెట్టెడిముగ్గులనే 'పట్టు' అని యందురు. ముత్యాలముగ్గులన్నియు ఇట్టి పట్లే.

వస్తు సామ్యముతో చిత్రించు ముగ్గులు సాధారణముగా రత్నాలముగ్గులందు, వ్రర ముగ్గులందు, ఎక్కువగనుండును. ఈ ముగ్గులందు రేఖాగణిత సంబంధమగు ఆకారములు:- చదరము, దీర్ఘ చతురస్రము, డైమండ్ ఆకారము, షడ్భుజి, అష్టభుజి, త్రిభుజము, వృత్తము మొదలగు నానాకారములు కనుపించును. రేఖాగణితము యొక్క అందమును గ్రహించి, తాముంచు రత్నాల ముగ్గులందు, చుక్కల ఆధారముతో డనే మన స్త్రీలు సునాయాసముగా చిత్రింప నేర్చుట ముదావహము.

ఉత్తమ శిల్పులు, చిత్రకారులవలె పరిసరములందలి వస్తువుల రూపకల్పన చేయుటేగాక వారి కల్పన, లక్షణములు, రతులు గూడ మాడగలము.

ముగ్గులలో చుక్కలకు బదులుగ అక్షరముల ఆధారముతో చిత్రించు ముగ్గులును కలవు. "ఆంధ్ర భాష యమృత మాంధ్రాక్షరంబులు! మురువు లొలుకు గుండ్రని ముత్తియములు", అని కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారన్నట్లుగా ఆంధ్రాక్షరములే ఆంధ్రుల అపూర్వచిత్రకళా నిపుణతకు పరమ నిదర్శనములు.

అట్టి అక్షరములందలి కళానైపుణ్యమును గ్రహింపగలిగిన వారగుటవలననే, వారీమణులు జాతీయచిత్రకళకు ప్రథమసోపానమగు ముగ్గులందుకూడ అక్షరములనలంకరించి చూచువారి హృదయములనుప్పొంగ చేయుచున్నారు.

ధనుర్మాసారంభము మొదలు సంక్రాంతి వరకు రైతు ఎండల, వానలకోర్చి పండించిన పంట ఇండ్లకు చేరును. అపుడు ప్రజలు ఉత్సాహవంతులై పుష్పములవలె వికసించిన హృదయములతో నుందురు. జనుల ఈ చిత్తవృత్తిని తెలియచేయు తలంపుతోనే పుష్పగుచ్ఛ బంధమును పోలిన వికసించిన పుష్పములను, దాని సౌరభముచే నాకర్షింపబడిన కృష్ణసర్పములను వీధులయందు విధిగ ముగ్గులతో చిత్రింపుదురు. ఆ ముగ్గు మీదనే బాలికలు గొబ్బిపూజలను చేయుదురు.

గుచ్ఛబంధమును పోలిన ముగ్గులనే కాక, కుండలి నాగబంధమును పోలిన పాముల మట్టెల ముగ్గులచే కూడ ధనుర్మాసమున అలంకరింతురు. మెలికలు తిరిగియుండు ఈ పాముల మట్టెలు అప్పటి ఋతుధర్మమును తెలియచేయును. అది హేమంత ఋతువగుటచే మంచునకు, చలికి ప్రజలు పాము మెలికలు తిరిగినట్లు పెనవేసుకుని పోవుదురని స్ఫురింపచేయును. పై కనబరచిన విధముల ముగ్గులే కాకుండ ఇంకను అనేకములగు బంధకవిత్వ చిత్రములును ముగ్గులలో కలవు. సారస్వతమునకును చిత్ర లేఖనమునకను గల సంబంధమేకాక ఒక కళకు మరియొక కళకు గల సంబంధమెట్టిదో ఈ ముగ్గులయందలి విశేషముల ఋజువు పరచును.

ధనుర్మాసము నెలరోజులూ వీధులలో పై ముగ్గులనేగాక తమ కళానైపుణ్యము ఉట్టిపడునట్లు అనేకరకముల చిత్ర విచిత్రములగు ముగ్గులతో నలంకరింతురు. ఆ సమయము దక్షిణాయనము కాన ఆ వాతావరణము రోగవ్యాప్తికి దోహదమిచ్చునదిగా నుండును. సాధారణ వ్యాధులేకాక సాంక్రామిక రోగములకును చక్కని అనుకూలము. కాన ఈ అనారోగ్యవాతావరణజన్యక్రిములసంహరించు తలంపుతోనే వీధులను గోమయచర్చిత మొనర్చెదరు. ముగ్గులందు మగువలకు అది ముగ్గుల పండుగ కాగా బాలికలకు గొబ్బిపండుగ. ఇరువురకు గోమయమే ముఖ్య పాత్రముగ నిలచినది.

ధనుర్మాసమునందు ఇండ్లు వాకిండ్లు దులిపి వెల్ల (సున్నము) వేయించు గృహలక్ష్ములు కొందరు, జేగురుతోను, సుద్దతోను గోడలకు కూడ పట్టీల నలంకరించు వైష్ణవాంగనలు కొందరు, ఎవరిశక్తి కొలది వారు నలంకరించి, గుమ్మములకు పసుపుపూసి, ముత్యములవంటి ఎరుపు, తెలుపు చుక్కలుంచి, గృహమునంతయు పరిశుద్ధమొనర్చి, ఆరోగ్యకారియగు ఉత్తరాయణమును [illegible] లందరు ఆహ్వానించెదరు.

ఆరోగ్యప్రదమగు మకర సంక్రమణము ప్రవేశించగనే దక్షిణాయనమందలి అనారోగ్య ప్రకృతిని రథమెక్కించి సాగనంపునట్లు, భోగి, సంక్రమణము, కనుమలుగడచిన తర్వాత ముక్కనుము రోజున రథము పెట్టి బైటకు లాగినట్లు ముగ్గు క్రరతో రథమును లాగి వేసెదరు.

కవుల రచనలందు, చిత్ర కారుల చిత్తరువులందు, పరిసరముల ప్రభావము వారి వారి రచనలందు, చిత్తరువులందు గోచరించునట్లే స్త్రీలు పెట్టు ముగ్గులందును వారి పరిసరముల నెక్కువగా నుండునవి, వారికెక్కువగా అవసరమగు వస్తువులే కనుపించును. ఉదాహరణకు:- గాజులమలారం, పెళ్ళి అరుగు, తులసికోట, [illegible], తీగలపందిరి, పారిజాతము, [illegible], కుట్టుడాకు, గోక్షణము, [illegible], పీట, ఊయల, గుమ్మడిపండు, మారేడుదళము, కల్యాణమండపము, చిడతలు, సాలెగూడు, తేలు, తాబేలు, రథము, దర్భముడి, స్వస్తిక, నిమ్మగుత్తి మొదలగునవి.

గృహాలంకరణమందే ఈ ముగ్గు కళ వికసించుచున్నది. స్త్రీల సంస్కృతి, సభ్యతలకు, విజ్ఞానమునకు, కల్పనాశక్తికి ఎప్పుడైనా ఈ కళలు నిలపెల్లుచున్నవి అనుట నిస్సందేహము.





# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కాముకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడ ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నైనా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాలకోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః ।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః ।

— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీతమైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

'చంద్రశేఖర్'

# తలకోన సిద్ధేశ్వర స్వామి పుణ్యక్షేత్రం

శ్రీ వై. ఫజులుల్లా

అన్నపూర్ణయని పేరు పొందిన ఆంధ్ర దేశము దక్షిణభాగమునందున్న పేరెన్నికగన్న పర్వతరాజములలో అగ్రగణ్యమైనది శేషాచల పర్వతం. శేషాచల పర్వతం తలభాగాన ఉన్న ఈ కోననే తలకోన అంటున్నారు. ఈ పర్వత వైభవము ప్రపంచమున మరి ఏ పర్వత శిఖరానికి లేదు. ఎందుకంటే ఈ శేషాచల పర్వతము తనపైన సాక్షాత్తు కలి యుగ వైకుంఠాన్ని మోస్తున్నది. ఈ శేషాచల పర్వతం క్రింద వెలసినదే ఈ తలకోన.



94 మార్చి 10 మహాశివరాత్రి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.
సం॥

భౌగోళికంగా ఈ పుణ్యక్షేత్రం ప్రశాంతమైన చిత్తూరుజిల్లాలో ఎర్రావారిపాళెం మండలం నెరబైలు గ్రామ సమీపంలో వుంది. ఆహ్లాదంగా, ఆకర్షణీయంగా నున్న దట్టమైన అరణ్యప్రాంతంలో ఎంతో సుందరంగా నెలకొనివుంది శ్రీ తలకోన సిద్ధేశ్వరస్వామి దేవాలయం.

పూర్వము ఈ ప్రదేశ సమీపమున కుమారధార అన్న పేరుగల ఆశ్రమముండేదట. పరమపావనము మిగులతేజోవంతము అయిన ఈ ఆశ్రమమందు తారాకాసుర సంహారి కుమారస్వామి లోక కళ్యాణార్థము శివుని గూర్చి ఘోర తపస్సు చేసినాడట. శివుడు కుమారస్వామికి దర్శనభాగ్యమును కలుగజేసినపుడు తలకోన అరణ్య గుహలలో తపమాచరించుచుండిన త్రికాల వేద్యులు, దైవజ్ఞులు, పుణ్యధనులు అయిన సిద్ధ పురుషులు దేవదేవుని ఆగమనమును గ్రహించి పరుగు పరుగున ఆటవేతెంచి కోటి నక్షత్రముల కాంతితో ఆ అరణ్య మధ్యంబున వెలిగిపోతున్న




కైలాసగిరి నివాసుని దివ్యమంగళ రూపాన్ని తనివితీరా దర్శించుకొని తిరిగి మరోజన్మ ములేని మహోన్నత స్థితిని ఈ జన్మాన పొంది బ్రతుకును ధన్యం చేసుకున్నారట.

పరమేశ్వరుడు తిరిగి కైలాసమునకు వెళ్ళు వేళ ఆట చేరిన సిద్ధపురుషులందరూ స్వామి వారి దివ్యమంగళ దర్శన భాగ్యము తమకు ఎల్లవేళలా కలుగజేయవలనని కోరగా కరిగిపోయిన శివుడు కాదనలేక తన సహధ

ర్మ వారి శక్తి స్వరూపిణి జగన్మాత అయిన పార్వతీదేవి సమేతంగా ఇటవెలసి ఈ తలకోన ప్రాంతమునే తన మరోకైలాసం చేసుకొన్నాడట. సిద్ధ పురుషుల తపస్సు వలన ఉద్భవించినం వలన ఇట వెలకొన్నందున పరమశివునికి సిద్ధేశ్వరనామము కలిగినది.

మూడుశతాబ్దములకు ముందు అప్పం స్వామి దీక్షితులు అనబడె గొప్ప యోగీంద్రుదు ఈ శివరూపమునకు సమీపములో నున్న భయంకరమైన పర్వత గుహలోనికి వెళ్ళి సుమారు 30 సం||ల కాలంపాటు అత్యంత నియమనిష్టలతో గొప్ప తపమాచరించిరి. అనంతరం శివలింగం ఎదుట శ్రీ చక్రమును ప్రతిష్ఠించిరి. అంతటితో ఆగక సమీపగ్రామమైన నెరబైలు ప్రజల సహాయ సహకారములను స్వీకరించి అత్యంత వైభవములో ఆలయ నిర్మాణము దిగ్విజయముగా చేసి దీక్షితులవారు తమ జన్మను చరితార్థం చేసుకున్నారు.

గర్భగుడి అంతర్భాగంలో శివలింగమున కొకవైపు సిద్ధ మహాగణపతి, మరోవైపు సుబ్రహ్మణ్యస్వామి వెలసి ఉన్నారు. శక్తి స్వరూపిణి అయిన పార్వతీమాత సిద్ధేశ్వరి అమ్మవారుగా స్వామివారికి ఉత్తరభాగమున కొలువై ఉంది. నందీశ్వరుడు స్వామి వెలసిన మండపము ఎదుట కొలువై ఉన్నాడు. ఆలయం ఎదుట సుందర బృందావనము, ఆలయ మధ్యంబున ధ్వజస్తంభము, ఆలయమునకు ముందు ఓ మహాద్వార మండపము, వెనుక మరో మహాద్వార మండపము దక్షిణ దిశన బ్రహ్మోత్సవ యజ్ఞశాల చుట్టు పరివృత్తమై ప్రాకారములు ఉత్తర దిశన తలకోన సిద్ధ గంగానదీ ప్రవాహం పరివ్యాప్తంగా నున్నాయి. ఆలయమునకు తూర్పుదిశగా సుమారు మూడు కిలోమీటర్ల దూరమున నున్న శేషాచల పర్వతము నుండి దూకే ఝరి బహుసుందరంగాను కదు రమణీయుంగాను ఉన్నది. ఎంతటి పాప పంకిలమైన బ్రతుకులైనా ఈ ఝరిలో అభ్యంజన మాచరించిన ప్రక్షాళనమై పునీతమగునని సిద్ధ పురుషులవాక్కు. అందువలన ఈ క్షేత్రాన్ని దర్శించడానికి వచ్చిన అందరు తప్పక ఝరికి వెళ్ళి అచట స్నాన మాచరిస్తారు. ఆలయం నుండి ఝరివరకు రహదారి కిరువైపుల ఉన్న అరణ్యశోభ అత్యంత హృదయంగమంగాను మనోరంజకంగాను ఉన్నది.

మహా శివరాత్రికి ఈ ఆలయమందు స్వామివారి బ్రహ్మోత్సవములు అత్యంత వైభవోపేతముగా జరుగుతాయి. భక్తులకు కైలాసశోభను కళ్ళెదుట నిలుపుతాయి. ఈ మహోత్సవకాలమునందు ప్రారంభదినాన గణపతి పూజ ధ్వజారోహణము ఉండును. రెండవరోజున స్వామివారికి మహాన్యాసరుద్రాభిషేకములు సిద్ధేశ్వరీ అమ్మవారికి లలిత సహస్రనామపూజ నవగ్రహములకు శాంతిహోమము, బలిహారములు ఉండును. మూడవరోజున కళాహోమము శాంతిహోమము, కలశ పూజలు నిర్వహించబడును. ఆ రోజు రాత్రి నందీశ్వర వాహనంపై స్వామివారి నెరబైలు గ్రామ మెరవణి ఉత్సవం ఉండును. నాల్గవరోజున మహాశివరాత్రి మహాభిషేకము సంతానార్థమై స్త్రీలు వరపడడము, రుద్రాభిషేకములు మరియు సకల భక్తకోటికి స్వామివారి దర్శనభాగ్యము ఉండును. మధ్యాహ్నము మూడుగంటలపై నుండి స్వామివారి కళ్యాణోత్సవము సాయం సంధ్యన 6 గంటల అనంతరం స్వామిని నందివాహనారూఢుని చేసి ఊరేగించడము ఉండును. రాత్రి పది గంటలకు లింగోద్భవ పుణ్యకాలమందు మహాన్యాసపూర్వక ఏకాదశ పారాభిషేకములు విశేషపూజలు నిర్వహించబడును. ఐదవ రోజు ఉదయం మహాభిషేకము, కలశోద్వాసన కుంభాభిషేకము పూర్ణాహుతి, శాంతిహోమము తీర్థప్రసాదస్వీకరణము మరియు మంగళహారతి ఉండును. మధ్యాహ్నము ఒంటిగంటపైన సిద్ధాహుతి ఆగమనము వర పడిన స్త్రీలకు ప్రసాదములను వొసగుట మహామంగళ హారతి ఉండును. నాల్గవరోజున రాత్రి జాగరమున్న భక్తులు ఉదయమున స్నానమాచరించి సకల మహాసిద్ధులకు సంప్రీతిగా సంతర్పణలు గావించి సతీసమేతముగా అప్పట వెలసిన గంగాధరునికి అర్చనలు జరిపి ఆపై రాత్రి అచట నిలువకుండా అందరూవెళ్ళి పోవుదురు. పండుగ దినములందు నారికేళాది ఫలములను దేవతలకు నైవేద్యముగా సమర్పించిన అనంతరము వానిని వారు ఆరగించుట కొరకు తలుపులు మూసుకొని వెలుపలికిరావడము జరుగుచున్నది. అలాగుననే ఇట వెలసిన సమస్త దేవతలకు నైవేద్యం సమర్పించిన అనంతరం అచ్చట ఉండుట యుక్తము కాదని భక్తకోటి ఆరాత్రి అచ్చట ఉండకుండా వెళ్ళిపోవుదురు.

తలకోన ప్రాంతంలో ఉన్న కొండలు కోనలు అత్యంత రమణీయంగా, శోభాయమానంగా వుంటాయి. ఈ అడవులు సకల వనమూలికలతో ఆయుర్వేద వైద్యశాలల్లా ఉన్నాయి. ఈ ప్రదేశం జలపాతములతో సెలయేళ్ళతో సతతము హరితమైన సుందర వనసంపదతో మానవులకు నయనోత్సవాన్ని కలుగజేస్తున్నది.

ఏ దేవతలకు వొరవడినా బిడ్డలు కలుగనపుడు ఈ తలకోనలో వెలసిన శ్రీ సిద్ధేశ్వరస్వామిని కొలువగా బిడ్డలు కలిగిన సందర్భాలు అనేకములు. ఆ దేవదేవుని వరానపుట్టిన సంతానము సిద్దయ్య, సిద్దమ్మ, సిద్దేశ్వరి, సిద్దమనాయుడు, సిద్దరామిరెడ్డి, సిద్దగంగులు వంటి పేర్లతో (నేడు) పిలువబడుచున్నారు.

తలకోన పుణ్యక్షేత్రం భూలోకమున కైలాసంగా భాసిస్తూ పాపహృదయాలను ప్రక్షాళనం చేస్తూ కలియుగ కైలాసంవలె నిలుస్తున్నది.



మిత్రమా!

ఇటీవల ఒక మహాద్భుతం జరిగింది. ఈ అద్భుత సంఘటన తెలుసుకున్న తరువాత మీరు నవ్వినా సరే. లేక - ఆశ్చర్యపడి మెచ్చుకున్నా సరే. యథార్థం యథార్థమే.

ఇటీవల విదేశాలలో ఉండే మా అబ్బాయి, పిల్లలు వచ్చారు. వాళ్ళు వచ్చినప్పుడు ఏదో పుణ్యక్షేత్రానికి వెళ్ళి స్వామిని దర్శించి రావడం పుణ్యంగాను, పురుషార్థంగాను భావిస్తాం మేము. ఈసారి మా ప్రయాణం తిరుమలకి. సాయంకాలం హైదరాబాద్‌లో బయలుదేరి మరుసటి రోజు పొద్దున తిరుపతికి చేరాము. ప్రయాణం బాగా జరిగింది. తిరుపతి చేరగానే టాక్సీ ఎక్కి కొద్ది సేపట్లో కొండపైకి తిరుమల చేరినాము. మొదటే ఏర్పాట్లు ఉన్నాయి కాబట్టి ఆలస్యంకానీ, ఇబ్బందికానీ లేక వసతీ, భోజనాలు చక్కగా జరిగాయి. మా అన్నగారు మొదలైనవారు విశ్రాంతి తీసుకున్నారు. పిల్లల గలగల వినిపిస్తూనే ఉంది.

# దర్శనప్రదాత

శ్రీ ఎమ్. కులశేఖరరావు



> శ్రీవారి లీలా అనుభవాన్ని రచయిత లేఖారూపంలో రాశారు. పాఠకులకు ఇది నచ్చుతుందని భావిస్తున్నాం.
>
> సం॥

సాయంకాలం అయిదయింది. కళ్యాణ కార్యక్రమం మరుసటి రోజుంటుంది. మా అన్నగారు దేవాలయం వైపు వెళదాము, అవకాశం ఉంటే టికెట్టుకొని ఈ పూట స్వామి వారిని దర్శించుకొందాము అని అన్నారు. ఈ ప్రతిపాదన అందరికీ నచ్చింది. అందులోనూ మా అబ్బాయి ప్రభు వెంటనే సిద్ధమైనాడు. మిగిలినవారు త్వరత్వరగా రెడీ అయిపోయినారు.

స్వామివారిని దర్శించడానికి వైకుంఠ ద్వారం నుంచి వెళ్ళాలి. ఆరు గంటలకి మేమక్కడికి చేరుకొన్నాం. మైకులో అన్నమాచార్య కీర్తనలు, మీరా భజనలు వినిపిస్తూనే ఉన్నయి. గేటు దగ్గర లోపలికి వెళ్ళే జనంతోపాటు ఇద్దరు దేవస్థానం ఉద్యోగులు కూడా ఉన్నారు. మా అన్నయ్య వారి దగ్గరకు వెళ్ళి టిక్కెట్లను గురించి వాకబు చేసి మాకు వార్త చెప్పినారు. చాలా నిరుత్సాహమే కలిగింది. టికెట్లు 9 గంటలకు గాని ఇవ్వరట. దాని తరువాత మరో రెండు గంటలకి మాకు దర్శనం లభించవచ్చు. ఈ నాలుగైదు గంటలు వేచి ఉండడం కష్టమే. అప్పుడే మా ప్రభు ఎప్పుడొచ్చినా ఇంతే అని విసుక్కుంటూనే ఉన్నాడు.

మా బేబి రమణ మేం నిలబడ్డ కొద్ది




దూరంలో ఎవరితోనో ఇంగ్లీష్‌లో గబగబా మాట్లాడేస్తున్నది. ఆయన నడి వయస్సు మనిషి. తిరు చూర్ణంతో ముఖం ప్రకాశంగా ఉన్నది. తెల్లటి ధోవతి కట్టుకొని, నడుముకు అంగవస్త్రం బిగించినాడు. ప్రసన్నంగా బేబీతో మాట్లాడుతున్నాడు. కొద్దిసేపయిన తరువాత రమణ అక్కడనుంచే డాడీ! ఇటు [illegible] అంటే నేను వెళ్ళాను. తాను ఆ [illegible] మాట్లాడిన విషయం చెప్పింది. ఆయన [illegible] 15 మందికి టిక్కెట్లు ఉన్నాయట. కానీ వాళ్ళు నలుగురే ఉన్నారు. మిగిలినవారు ఎవరైనా రావచ్చు. మమ్మల్ని రమ్మని ఆయన ఆహ్వానం. మా అన్నగారు, పక్కన ప్రభు ఈ ప్రస్తావన విన్నారు. ఎగిరి గంతేసినంత పని చేశారు సరే. వాళ్ళు నలుగురు, మేం పదిమంది వైకుంఠం దారిలో ప్రవేశించాం. గబగబా నడుస్తున్నాం. జనం లేరు కాబట్టి, మా ఆవిడ నడకలో మమ్మల్ని అందుకోలేక వెనకపడుతూ ఉన్నది. ప్రభు ఆ వ్యక్తితో ఆయిని

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- ❋ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- ❋ మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- ❋ శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- ❋ స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ❋ ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ❋ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః' అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- ❋ తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- ❋ తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- ❋ సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- ❋ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- ❋ శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- ❋ విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- ❋ మాంసాహారాన్ని భుజించకండి.
- ❋ ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- ❋ పొగత్రాగకండి.
- ❋ వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- ❋ శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ❋ ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- ❋ వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- ❋ శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- ❋ శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ❋ ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ❋ ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయ్వార్తత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ❋ తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజే.

వివరాలు కనుక్కుంటున్నాడు. కొద్దినిమిషాల్లోనే స్వామి ఆలయంలో ప్రవేశించాము. మామూలుగా అయితే స్వామిసన్నిధి చేరడానికి ఒక అరగంటైనా పడుతుంది. కానీ కొద్ది నిమిషాల్లోనే స్వామి సాన్నిధ్యంలో ఉన్నాం. మేం పదిమంది తప్పితే జనం లేరు. దేదీప్యమానంగా వెలిగి పోతున్నాడు స్వామి. ఆయన దర్శనం కనుల పండుగగా ఉంది. ఇవాళ దర్శనం అవుతుందో, కాదో అనే నిరాశతో ఉన్న మాకు ఈ తరుణం విశేషంగా భాసించింది. కొద్ది నిమిషాలు ఆనందంగా గడచినవి. శంఖు చక్రాదులతోను, అమూల్యాలంకారాదులతోను భాసించే స్వామి వారిని తనివితీరా దర్శించినాము.

ఇంకా గర్భాలయం నుంచి బయలుదేరే సమయం వచ్చింది. అంతమంది వెనుకకు తిరిగి మళ్ళీ మళ్ళీ చూస్తూ, బయటకు వచ్చినాము. మమ్ములను తీసుకొని వెళ్ళిన వ్యక్తి మాతోనే ఉన్నట్లున్నాడు తిరిగి వచ్చేటప్పుడు కూడా. గుడి బయటకు వచ్చి, ఆయనకు నమస్కరించి, కృతజ్ఞతలు చెప్పుకోవాలని నా భావం. నేను వెనుకకు తిరిగి ఆయన కొరకు చూశాను. ప్రభు, రమణ, మా అన్నగారు గూడా అదే స్థితిలో ఉన్నారు. ఆయన బయటకు వచ్చినాడా, లోపలనే ఉన్నాడా? మాకు తెలియలేదు. ఆయన అనుచరులు కూడ ఒక్కరైనా కనిపించలేదు. ఆ పరిసరాల్లో ఎంత వెతికినా ఆయనకానీ, ఆయన అనుచరులుకానీ కనిపించనే లేదు. ఎటు అదృశ్యమైనారో, ఎటు వెళ్లినారో ఏమి అద్భుతం. స్వామి వారే వచ్చి, తన దర్శనమిప్పించి, అదృశ్యమైనారా! మాకెవ్వరికీ తెలియనే లేదు. ఆయన అనుగ్రహం కలిగితే ఎన్ని అద్భుతాలైనా ఇట్లే జరుగుతాయి కాబోలు.



# పురుషోత్తముని పూజకు పూలు

శ్రీ ఎస్. నాగరాజ్



"పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి"-- ఇది గీతాచార్యుడు నుడివిన వాక్యము. భక్తితో అర్పించు నాల్గింటిలో పుష్పము కూడ ఒకటి. అంటే భగవంతునికి ప్రీతిపాత్రమైన వాటిలో పుష్పము కూడ ఒకటి. అందులకే పురందరదాసుల వారు--

"హువ్వ తరువరమనెగె హుల్ల తరువ
అవ్వ! లహుమీరమణ ఇవగిల్ల గరువ!
పరి పరియ పుష్పగళ పరమాత్మ గర్పిసి
పరిపూర్ణనెందు పూజెయను మాడె!
సరసి జాక్షను సరసదిందలి
సరిభాగ కొడువ తన్నరమనే యోళగే.

(గర్వ రహితుడైన లక్ష్మీకాంతుడు భక్తు లర్పించిన పుష్పములను (భక్తితో) గ్రహించి వారికి వలసినంత (గడ్డిని) ఆహారమును ఇస్తాడట. పరిపూర్ణుడైన పరమాత్ముని పరి పరిపుష్పములచేత పూజించేవారికి సంతోషముతో తన మందిరములో సగ భాగమును ఇస్తాడట.)

అందులకే మహాకవి పోతన కూడ "కమలాక్షు నర్చించు కరములు కరములు" అంటాడు. లేకపోతే తరుశాఖలే అని కూడ చెప్పుతాడు. అంతేకాక త్యాగరాజ స్వామివారు కూడ ఒక కృతిలో--

"సరసీరుహ పున్నాగ చంపక పాటల కురవక
కరవీర మల్లికా సుగంధరాజ సుమముల్
ధరణిని యొక పరియాయము ధర్మాత్ముని
సాకేత పురవాసుని శ్రీరాముని పరిత్యాగరాజ
నుతుని
తులసీ దళములచే సంతోషముగా పూజింతు."

అందులకే సర్వ సామాన్యముగా పూజా సమయములో--

"మల్లికాది సుగంధీని మాలత్యాదీని వై ప్రభో
మయాహృతాని పూజార్థం పుష్పాణి
ప్రతిగృహ్యతామ్."

-- అనే శ్లోకాన్ని చెబుతారు.

ప్రకృతిలో రంగురంగుల పువ్వులు సువాసన గలిగిన పువ్వులు మనకు లభించుచున్నవి. అయినను, సుగంధ యుక్తమైన తెల్లటి పుష్పములంటే భగవంతునికి విశేషమైన ప్రీతి యట.

"పారిజాతస్య పుష్పేషు
ఆంజనేయస్తు దాక్షేయః
సౌగంధికే భీమసేనః
శ్వేతపుష్పేషు శంకరః
పున్నాగ పుష్పేషు గరుడః

పారిజాత పుష్పములో ఆంజనేయుడుంటాడట. 'పారిజాత తరుమూలవాసినమ్ భావయామి.....' కల్హార పుష్పములో భీమ

చదవండి! చదివించండి!!

# సప్తగిరి

## చందాదారులకు మనవి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్యాత్మిక సచిత్ర మాస పత్రిక 'సప్తగిరి'. తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఆంగ్లం మున్నగు ఐదు భాషల్లో విడి విడిగా నెల నెలా వెలువడుతున్న పత్రిక 'సప్తగిరి'. ఆధ్యాత్మిక వ్యాసాలు - పండుగలు - పిల్లల కథలు - వేంకటేశ్వర లీలలు - మన దేవాలయాలు ఇలా ఎన్నో విషయాలతో, విశేషాలతో మీ ముందుకు వస్తున్న పత్రిక. 'సప్తగిరి.'

### మీరు 'సప్తగిరి' పత్రిక కొత్త చందాదారునిగా నమోదు చేయించుకోదలచారా?

అయితే క్రింది సూచనలను జాగ్రత్తగా గమనించండి.

1. సంవత్సర చందా రు. 24-00లు మాత్రమే.
   ఈ చందాను ఎన్ని ఏండ్లకైనా ముందుగనే కట్టవచ్చును.
2. తమ చందా మొత్తాన్ని "ఎడిటరు, సప్తగిరి, తి.తి. దేవస్థానములు, తిరుపతి" వారి పేర మనియార్డరు గానీ, డిమాండు డ్రాఫ్టుగానీ, పోస్టలు ఆర్డరు గానీ పంపవచ్చును. (చెక్కులు అంగీకరింపబడవు).
3. మీకు ఏ భాషా సప్తగిరి కావలెనో స్పష్టంగా రాయండి.
4. మీ పూర్తి చిరునామాను విడి విడి అక్షరాలలో స్పష్టంగా రాయండి.
5. చందా పంపిన మరుసటి నెలనుండి మీకు సప్తగిరి పంపబడుతుంది.
6. చందా మొత్తాన్ని పంపిన 30 రోజులలోగా మీకు సప్తగిరి రానిచో, ఎం.ఓ. రసీదు నంబరు లేదా డి.డి. నంబరు, పంపిన తేదీ వగైరా వివరాలతో, మీ పూర్తి చిరునామాతో స్పష్టంగా రాయండి.

### మీరు ఇంతకు ముందే చందాదారులా? అయితే క్రింది సూచనలను గమనించండి.

1. మీ చందా ముగియుటకు ఒక నెల ముందుగానే సప్తగిరి పత్రికలో తెలియజేస్తున్నాం.
2. మీ చందా ముగిసిపోయే నెలకు - ఒక నెల ముందుగనే చందా మొత్తాన్ని పంపి మీ చందాను పునరుద్ధరించుకోండి.
3. **మీ చిరునామాలో మార్పుగాని, మీరు చందా పంపటంగాని చేసేటప్పుడు, మీ చందా నంబరుతో కూడ పూర్తి చిరునామాను తెలపండి.**

సేను డుంటాడట. పున్నాగ పుష్పాలలో గరుడుడుంటాడట. తెల్లటి పుష్పాలలో శంకరుడుంటాడట. దేవతా సాన్నిధ్యములగు ఈ పుష్పములంటే అమరవంద్యునకు ఇష్టమేకదా!

అందులకే పురందరదాసు శ్రీవేంకటేశ్వరునికి సుప్రభాత గీతాన్ని పాడుతూ--

"ఏళయ్యా బెళగాయితు.....
ఏళు శ్రీ గిరి యొడయ వేంకటేశ
అరళు మల్లిగె జాజి పరిమళద పుష్పగళ
సురరు తందిహరయ్య సుజనరొడయ
అరవింద లోచననే కోళి కూగితు కేళు
పురందర విఠలనే బెళగాయితు."

దేవదేవుడైన శ్రీగిరి వేంకటేశ! వికసించిన పరిమళ యుక్తమైన మల్లెజాజులు మొదలగు పుష్పములను దేవతలు తెచ్చి నీముందర నిలబడినారయ్యా! కోడికూయు మన్నది, పురందరవిఠల తెల్లవారినది లెమ్మి.

మహనీయులందరూ ఈ విధంగా భక్తితో పుష్పాలు భగవంతునికి అర్పించినారు. అంతేకాకుండా పుష్పాలలో లక్ష్మిసాన్నిధ్యముండునని చెప్పుదురు. కాబట్టి లక్ష్మిపతిని వాటిచే పూజిస్తే ఎంతో సంతోషిస్తాడట.

అయితే పై పుష్పాలతో అర్పించేది భౌతికమైన బాహ్యపూజ. అయినప్పటికి ఇది మానసిక పూజకు తొలిమెట్టు అని చెప్పవచ్చును. సర్వేశ్వరుని హృదయపీఠముపైనుంచి అర్పించే పుష్పాలు వేరు. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు, ఆదిమధ్యాంత రహితుడు, కొండంత దేవుడైన దేవునికి కొండంత పూల నెక్కించలేము కదా! అందులకే పురందరదాసు--

"హేగె మెచ్చిసలి సలిసిన్న
నాగ శయననే నారదవంద్యనె
పుష్పవ తందునిన గర్పిసువెనెనె
పుష్పపల్లవిసిదే పొక్కళలి."

(దేవ ఏ రీతిగా నిన్నర్పించి మెప్పింవను. పుష్పాలతో పూజిస్తామంటే ముందే నీ నాభినుంచి పుష్పము పుట్టింది. ఇంకే పుష్పముతో పూజింతునయ్యా!)

ఇదే భావాన్నే అన్నమాచార్యులవారు కూడ "ఇంతకంటే నేమి సేసేమిదే మా

మానసపూజ. ధర మాలాకారుని పూదండలే మీకు పువ్వులు"-- అని అంటారు. ఒక వేళ పూజిస్తామంటే సువాసన రహితమైనది, మైల చెందిన పుష్పాలనెట్లు నీకు సమర్పించుదునయ్యా అంటాడు. అందులకే ఒక భక్తుడు "తుమ్మి పువ్వులు తెచ్చి నీకు తృప్తిగా పూజసేస్తమంటే, కొమ్మ కొమ్మకు కోటి తుమ్మెద లెంగిలంటున్నాయ లింగ" అని అంటాడు. సువాసన కలిగిన పుష్పములంటే మంచి మనస్సు అని అర్థము. పుష్పములను సుమములు అని కూడ అంటారు. సుమనస్ అంటే తెల్లటి నిర్మలమైన మనస్సుని, ప్రీతి, విశ్వాసము కలిగినదే సువాసన అని అర్థము. అందులకే వాసనలేని పువ్వు, బుధ వర్గములేని పురంబు...... అను పద్యంలో కూడ సువాసన గలిగిన పుష్పాలే పూజకు ముఖ్యమని స్ఫురిస్తుంది. అయితే ప్రకృతి మనకు రకరకాల పుష్పాల నిస్తున్నది. వాటితో భగవంతుని పూజిస్తున్నాము. అయితే ఆధ్యాత్మికపరంగా పరిశీలించి చూస్తే మహాభారతములో-- "భావాష్ట పుష్ప విధినా హరి మర్చయామి". సత్త్వగుణముచే భగవంతుని ఎనిమిది రకాల భావాష్ట పుష్పములతో పూజించుట. ఎనిమిది రకాల సద్భావన మనసులో కలిగియుండుటే భావాష్ట పుష్పములు. ఆ మనస్సునే భగవంతుని కర్పించుట. ఇది పెద్దల సమ్మతము. అవి ఏవనగా--

"అహింసా ప్రథమం పుష్పం,
పుష్ప మింద్రియనిగ్రహః
సర్వభూతదయా పుష్పం,
క్షమాపుష్పం విశిష్యతే
జ్ఞానపుష్పం, తపఃపుష్పం,
ధ్యానపుష్పం చ సప్తమమ్
సత్యం చైవాష్టమం పుష్పం,
ఏభి స్తుష్యతి కేశవః"

అహింసా, ఇంద్రియ నిగ్రహము, దయ, క్షమ, జ్ఞానం, తపస్సు, ధ్యానం, సత్యం-- ఈ ఎనిమిది పుష్పములచే భగవంతుని మనస్ఫూర్తిగా అర్చించు.

బ్రహ్మాండాన్ని సృష్టించి, బ్రహ్మలో నుండి దేవతలనంతా సృష్టించి, పాలించే వాడే, ప్రళయకాలములో బ్రహ్మతో సహా బ్రహ్మాండాన్ని తనలో దాచుకుంటాడు. అయినను ఇతనికి బ్రహ్మహత్యా దోషము లేదు. అహంకారులైన కంస డిబికులను చంపినాడు. కాబట్టి ఇతనికి నిర్మత్సరముతో ధర్మ పుష్పాన్ని ఘన భక్తితో అర్చించిన పరబ్రహ్మ స్వరూపుడైన గోపాల విఠలుడు సంతసించును.

"ఎరడెంటు సాసిర అరసి యర కూడ
పరిపరి క్రీడెయు మాడి నోడిచెల్వ
తరుళ తనది హన్నెరడు సాసిరమంది
పరిణామ మమాడిదవర బ్రహ్మచారి ఎందు
సరి హోగువుదే ఇంథ చరియ మనుజరింద
హరిగె ఇంద్రియ నిగ్రహ స్థిర పుష్పవెంతెందు
అరిదు అర్పిసువ జీవరిగె తేపిసదు
పరమదయాళు గోపాల విఠల తన్న
అరిదంతె ఫలవీవా శరణ జనకె."

(పదునారు వేలమంది స్త్రీలతో విచిత్ర క్రీడలాడిన శ్రీహరిని ఇష్టమెచ్చినట్లు మాట్లాడక, ఇంద్రియ నిగ్రహ పుష్పమును తెలిసి అర్చించిన వాళ్ళకు అనుగ్రహించును.)

"భూత దయాపుష్ప భూతేశ గల్లదే
భూతాధారది ఇప్ప భూతరిగె థరవే
నీతిలి త్రివిధ జీవరిగె తా తప్పదె
ప్రీతిలి ఉణిసి అజాత నాగి ఇప్ప
మాతు మాతిగె అనంత కర్మంగళు
జ్ఞాత లిల్లదె మాళ్ప జీవరిగె ఇదుసల్ల
భూ తరుగళ గతి తా తిళిదు త్రివిధరిగె
నోత ఫలవిత్తు సమనాగి ఇప్పవ నెందు
ఈ తెరది తిళిదు నీ భూత దయాపుష్ప
ప్రీతి యలి అర్పిసన్యథా చింతి సదే
దాత నమ్మ గోపాల విఠల
పోతె నెంద బళిక సలహదె బిడను."

(త్రివిధ జీవులకు వారి వారి యోగ్యతానుసారము ఫలాన్నిస్తూ, చేతనా చేతన పదార్థములలో సమానముగా నుండే వానికి, నేను అల్పుడను, అశక్తుడను, అజ్ఞానినని తెలిసి భూత దయా పుష్పాన్ని సమర్పించు.)

"దమ జ్ఞాన ధ్యానవ సమీ చీన పుష్పవు
రమె ఈశ గల్లిదె శ్రమిసో జీవరిగె ఇల్ల
పమన కండరె అంజో భ్రమణ జీవరిగె
దమ ఎంబ పుష్పవు ఎంతుఉ దొరయువుదయ్యా
మమతి జడదల్లి నిమిష బిడదె ఇద్ద
హమ్మతి జీవనిగె జ్ఞాన పష్పవు ఎంతో
క్షమసి నోడలు ధ్యాన పుష్ప వెంబోదు అంతు
నిమిత్యమాత్రవు ఇదు నీచ జీవరిగె యిల్లి
సమ్మతిసి నోడివు సర్వోత్తమ నల్లవె
నిమిష బడదె యిప్పవెందు చింతనెమాడి
దమ జ్ఞాన ధ్యాన పుళ్ళవ నాగువ నా జీవ
సుమన సరొడెయ గోపాలవిఠలను
నమిసి మెచ్చి దంగె నరిసువాని దరా."

(ఐహిక వాంఛల యందాసక్తిని వదలి, సర్వేశ్వరుని యందే మనసునిల్పి, జ్ఞానముచే సర్వోత్తముడు శ్రీహరియని తలచుటే జ్ఞానీ పుష్పము, నిమిషమైనను వృథా చేయక శ్రీహరి యందే మనసు నింపుట ధ్యాన తపోపుష్పము. ఈ పుష్పములను దేవునకర్పించు).

"భేద ఎల్లది పష్ప ఇప్పవు హరియల్లి
సాధి సర్పుసు గోపాల విఠల ఒలివా."

(ఈ భావాష్ట పుష్పములను తెలిసి భగవంతునికి అర్పించిన వారికి అతని విశేషానుగ్రహమగును.)

అందులకే మహాభక్త శిఖామణి అన్నమాచార్యులుకూడ తమ జ్ఞానామృతమును 32 వేల సంకీర్తనలద్వార మనకందించి, చివరికి ఆ కీర్తన పుష్పాలను సర్వేశ్వరుడగు శ్రీ వేంకటేశ్వరునికి అంకితము చేసినారు.

"దాచుకో నీ పాదాలకు
దగ జేసిన పూజలివి
పూవి నీ కీరితి రూప
పుష్పము లివి యయ్యా"



# తిరుపతి శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవ క్రమము





| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 11-3-94 | శుక్ర | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 12-3-94 | శని | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 13-3-94 | ఆది | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 14-3-94 | సోమ | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 15-3-94 | మంగళ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 16-3-94 | బుధ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 17-3-94 | గురు | హనుమద్వాహనం సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 18-3-94 | శుక్ర | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 19-3-94 | శని | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 20-3-94 | ఆది | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

# ధర్మకర్తలమండలి నిర్ణయాలు

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తలమండలి సమావేశం నవంబరు 25 గురువారంనాడు తిరుమలలో జరిగింది. ఈ సమావేశానికి ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి అధ్యక్షత వహించారు. సమావేశ వివరాలను నవంబరు 26 శుక్రవారంనాడు తి.తి.దే. అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి విలేకరులకు తెలిపారు.

* తిరుమల శ్రీవారి పుష్కరిణిలో నీటిని శుద్ధిచేసేందుకు 26.50 లక్షల రూపాయల వ్యయంతో పరికరాలను కొనుగోలు చేయాలని తీర్మానించారు.
* తిరుమలలోని లడ్డూ కౌంటర్ వద్ద అయిదున్నర లక్షల రూపాయల వ్యయంతో రాళ్ళు పరిచే కార్యక్రమాన్ని చేపట్టామని తెలిపారు.
* 1994 జనవరి 1న శ్రీవారి దర్శనార్థం వచ్చే భక్తుల్లో 25వేల మందికి ఉచిత భోజన సౌకర్యం కల్పించాలని తీర్మానించారు.
* తిరుపతి భూగర్భ డ్రైనేజి పథకం అమలుకోసం ప్రతినెలా 25 లక్షల రూపాయలు ఇవ్వాలని తీర్మానించారు. ఇందుకుగాను ఈ ఏడాది 158.22 లక్షల రూపాయలు కేటాయించామని తెలిపారు.
* చిత్తూరుజిల్లా కుప్పం, కడపజిల్లా పులివెందుల, ఎర్రగుంట్ల తదితరమైన తొమ్మిదిచోట్ల కళ్యాణ మండపాలు నిర్మించాలని తీర్మానించారు. ఈ కళ్యాణమండపాల నిర్మాణానికి రు.10 వేలు మించిన విరాళాలు ఇచ్చిన వారి పేర్లను మండపంలో రాయించాలని తీర్మానించారు.
* తి.తి.దే. ఉద్యోగులకు 15 రోజుల వేతనాన్ని బ్రహ్మోత్సవ బహుమతిగా ఇవ్వాలని తీర్మానించారు.

ఈ సమావేశంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి కూడ పాల్గొన్నారు.





## 15వ పురాణ ప్రబోధ పరీక్షలు

తిరుమల తిరుపతి దేవస్థానం, ధర్మప్రచార పరిషత్ వారు నిర్వహించే 15వ పురాణ ప్రబోధ పరీక్షలు 1994 ఫిబ్రవరి 6న నిర్వహిస్తారని ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి, తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ బి. వెంకట్రామయ్య తెలిపారు. రాష్ట్రంలోని అన్ని పాఠశాలల విద్యార్థినీ విద్యార్థులు ఇందులో ఉత్సాహంగా పాల్గోవాలని వారు కోరారు.

# ఎవరు గొప్ప?

శ్రీ లోకా జగన్నాథశాస్త్రి

బాలలూ! ఒకసారి ఏమయ్యిందో తెలుసా? ప్రకృతి పరవశించి తన సౌంద ర్యాన్నంతా ప్రపంచానికి బహూకరించి, ఆహ్లా దాన్ని కల్గించే వసంత ఋతువది. వైశాఖ మాసంలో ఒక మిట్ట మధ్యాహ్నం వేళ నైమి శారణ్యంలో సాధుపుంగవులంతా ఒకచోట సమావేశమయ్యారు. అనేకానేక ముఖాలుగా ఆధ్యాత్మిక చర్చ వారిమధ్య కొనసాగుతోంది. అలాంటి సమయంలో వారికొక సందేహం కలిగింది. ఈ సకల చరాచర జగత్తులోకెల్లా అత్యంత గొప్పదైన పదార్థమేది? లేదా మహా గొప్పవాడు ఎవరు? అని అప్రయత్నంగా వారి చర్చ అటువైపు మళ్లింది.

ఒక జడధారి పైకి లేచి "అయ్యా! ఈ జగత్తులో ఉండే సకల జలరాసులను, అనేక గిరి పర్వతములను, ప్రాణకోటిని, వృక్ష లతా గుల్మాదులను తనపై భరిస్తూ, చరాచర ప్రాణకోటి మనుగడకు హేతుభూతమై నిల్చి యున్న ఈ 'భూమి' చాలా గొప్పది" అని సిద్ధాంతీకరించి కూర్చున్నాడు.

ఇంకొక మునివర్యుడు లేచి "మహాశ యులారా! ఇంతటి భూమికీ ఆధారము ఆదిశేషుడు. అటువంటి ఆదిశేషుడు లేక భూమి ఈ జగత్తు నెట్లా భరించకల్గుతుంది?! కనుక భూమి కన్నా కూడా శేషుడే మహా గొప్పవాడు" అని వాదించి కూర్చున్నాడు.

వేరొక ముని లేచి అయ్యలారా! "ఈ భూమిని భరించువాడు, మహా బలవంతుడు అయిన శేషుని తన చేతికి కంకణంగా శివుడు కట్టుకుని ఉన్నాడు. కనుక భూమికన్నను, శేషుని కన్ననూ, పరమశివుడు ఈ ప్రపం చంలోకెల్లా గొప్పవాడు" అని తన తర్కాన్ని వినిపించి కూర్చున్నాడు.

మరొక సాధువు లేచి "ఆర్యర్షులారా! పరమశివుడంతటివాణ్ణి సకుటుంబసమేతంగా తనమీద భరింపజేసుకున్న కైలాసపర్వతము యొక్క గొప్పతనము ఊహించ నలవికానిది. కాన కైలాస శిఖరమే పైన చెప్పినవాటన్నిం టికన్నా మహోత్తమమైనది" అన్నాడు.

వెంటనే మరొక ఋషి అందుకుని "స్వాములారా! పరమశివుణ్ణే భరించ కల్గి నది కదా! కైలాస పర్వతము. అటువంటి కైలాసాన్నే తన వీపున కెత్తుకున్నాడు ఒక సారి దశకంఠుడైన రావణుడు. కనుక రావ ణాసురుడే మిక్కిలి గొప్పవాడని" ఆయన వాదించసాగాడు.

అతని వాదనను ఖండిస్తూ మరొక యోగి లేచి "ఆగవయ్యా! అంతటి బలపరా క్రమములు కల్గిన ఆ రావణుని మహాగొప్ప వాడైన వానరేంద్రుడు 'వాలి' తన తోక చేత ఝాడించి పారేశాడు. నీకు గుర్తు లేదేమో. కనుక వాలిని మించిన గొప్పవాడు ఎవరూ లేరు" అంటూ తన వాదనను సమర్థించుకు న్నాడు.

అటు పిమ్మట ఒక కమండల హస్తుడు పైకి లేచి, "ఆర్యులారా! మీరింతవరకూ చెప్పిన రావణుని, వాలిని కూడ రామ బాణము బలి తీసుకుంది. కనుక ఆ బాణమే చాలా గొప్పది" అన్నాడు.

తర్వాత ఒక ఊర్ధ్వపుండ్రధారి లేచి మునివర్యులారా! వాలితో సహా రావణ కుంభకర్ణాది రాక్షస వీరులను మట్టుబెట్టిన దివ్యమైన ఆ రామబాణము అమరి ఉండినది శ్రీరామచంద్రుని చేతిలోనే. కాబట్టి దేవదేవు డైన ఆ శ్రీరాముడే అందరికన్నా గొప్పవాడు అని తన ప్రసంగాన్ని వినిపించాడు.

చివరలో కూర్చునివున్న నిరాడంబర వేష ధారి ఒక యోగి సత్తముడు లేచి, గొంతు సవరించుకుని ఇట్లా అన్నాడు. మహానుభా వులారా! రామచంద్రుడంతటివాడు నిర్మల వైరాగ్య భక్తి ప్రపత్తులతో భజనచేస్తే, భాగవ తోత్తముల హృదయ కమలములలో బందీగా మారుతున్నాడు. కనుక ఈ సకల చరాచర జగత్తున కంతటికి 'భక్తి' తప్ప గొప్పదైన పదార్థమేదీలేదు. 'భక్తునికి మించి గొప్పవాడు లేడు' అని నిర్ధారించినాడు.

జరిగిన చర్చల సారాంశాన్ని విజ్ఞులైన శ్రోతులిలా గానం చేస్తూ సాయంకాల కృత్యా లకుద్యుక్తులైనారు. ✿



## తిరుమల తిరుపతి దేవస్థానముల
# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ఇచ్చిన వరం. ఆ అడవుల్ని రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అడవుల విభాగం వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

### వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

సౌకర్యాలు :

* వృక్షసంపదకు దాతపేరును లేదా దాత సూచించిన వారి పేరును పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.15,000/-.

### వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచటానికి నిర్దేశించిన పథకం.

సౌకర్యాలు :

* దాతపేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను వితరణ చేస్తారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.10,000/-.

### స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 సస్యజాతి మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

సౌకర్యాలు :

* ఈ పొదకు దాత పేరును పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.2,000/-.




## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరును ప్రదర్శిస్తారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అభయారణ్యా వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల సస్యజాతి మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కవద్ద దాత పేరును ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్‌రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటటం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరును వృక్షం వద్ద ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వన సంపదను రక్షించేందుకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

**కార్యనిర్వహణాధికారి**

Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D Press
by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



8. In France, about 1886, with her brother Mattéo Alfassa

*Heirs of their past, their future's discoverers,*
*Electors of their own self-chosen lot,*
*They waited for the adventure of new life.*

SAVITRI



నీ వేలికవు మాకు, నీ దాసులము నేము
ఆవల నితరుల నేమడుగఁ బొయ్యేమా

పసురమై వుండి యిచ్చీఁ బక్కనఁ గామధేనువు
యెసఁగి మానై వుండి యిచ్చీఁ గల్పవృక్షము
వెస రాయై వుండి యిచ్చీ వేడుకఁ జింతామణి
మసలని శ్రీపతివి మాకు నిచ్చేటరుదా!



గాలి యావటించి యిచ్చీఁ గారుమేఘము మింట
వీలి జీర్ణమై యిచ్చీ విక్రమార్కునిబొంత
కాలిన పైంచై వుండి కప్పెర దివ్యాన్న మిచ్చీ
మైలలేని శ్రీపతివి మాకు నిచ్చుటరుదా.

అండనే కామధేనువ వాశ్రితచింతామణివి
పండిన కల్పకమవు భక్తులకెల్లా
నిండిన శ్రీవేంకటేశ నీవు మమ్ము నేలితివి
దండిగా నమ్మితే నీవు దయఁ జూచుటరుదా.

--అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన : 455,
రాగం : లలిత, సంపుట : 1 (1980)

# తిరుపతి శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవ క్రమము





| తేదీలు | వారము | పగల్లు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 11-3-94 | శుక్ర | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 12-3-94 | శని | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 13-3-94 | ఆది | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 14-3-94 | సోమ | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 15-3-94 | మంగళ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 16-3-94 | బుధ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 17-3-94 | గురు | హనుమద్వాహనం సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 18-3-94 | శుక్ర | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 19-3-94 | శని | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 20-3-94 | ఆది | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |




గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యస్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త - సంపాదకులు
కాటుపాటి సుబ్బారావు, ఎమ్.ఎ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# ఈ సంచికలో.... ఫిబ్రవరి 1994

సంపుటి 24 సంచిక 9



ముఖచిత్రం : జగద్గురు శ్రీశ్రీశ్రీ కంచి శంకరాచార్య
2వ కవరుపేజి : బెంగుళూరులో జరిగిన సుదర్శనయజ్ఞం దృశ్యాలు.
3వ కవరుపేజి : శ్రీ గోవిందరాజస్వామివారి తెప్పోత్సవం.
4వ కవరుపేజి : శ్రీ పురందరదాసులు.

# సంపాదకీయం

"తాపసులకంటే, జ్ఞానులకంటే, కర్మిష్ఠులకంటే కూడ యోగి సర్వశ్రేష్ఠుడు. అలాంటి పరమయోగి కోటాను కోట్లమందిలో ఏ ఒక్కరో వుంటారనీ, వారిని వరదైవంగా భావించి సేవించి తరించవలసింది" అని నరునికి నారాయణుడిచ్చిన గీతా సందేశం.

ఇలా గీతాకారుడు పేర్కొన్న 'పరమయోగి'కి సరైన దృష్టాంతంగా ఇటీవలికాలంలో శ్రీకంచి కామకోటి పరమాచార్యులవారు దర్శనమిస్తారు.

పురాతన పుణ్యక్షేత్రమైన కాంచీనగరంలో శ్రీ కామకోటి పీఠాధిపత్యాన్ని చిరుప్రాయంలోనే స్వీకరించి, నిండుగా నూరేండ్లపాటు ఆధ్యాత్మిక తేజస్సుతో, "నడిచేదేవుడు"గా విరాజిల్లిన దివ్యమూర్తి, మహాయోగేశ్వరేశ్వరుడు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీమహాస్వామివారు.

అందుకే వారి దివ్య సమ్ముఖం ఒక పవిత్ర తీర్థంగా, పుణ్యక్షేత్రంగా భాసిల్లి, అనునిత్యం వారి కరుణార్ద్ర దృక్కులతో పునీతులైన ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, తత్త్వవేత్తలు, కవులు, గాయకులు, రాజకీయవేత్తలు.... ఇలా ఎందరెందరో కనుపిస్తారు.

ఆయా వ్యక్తులకు వారివారి ఇష్టదైవాలను తనలో దర్శింపజేస్తూ, భక్తలోకంచేత 'నడుస్తున్న దేవుడు'గా కీర్తింపబడ్డ శ్రీ కంచి పెద్దస్వామివారు పరబ్రహ్మస్వరూపమే.

కేవలం హిందూమత పీఠాధిపతిగా తనదగ్గరికి వచ్చిన వారందరినీ కుల, మత, వర్గ, వర్ణ, దేశ, భాషా వివక్షత లేకుండా అన్నివిధాలా, తమ ఉపదేశ స్రవంతిద్వారా సేదదీర్చి, చల్లని చూపులతోను, చేతలతోను అందరినీ ఆశ్వాసించి ఆదుకొని అనునయించిన మహామహిమాన్విత మూర్తి శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరులు.

దేశమంతటా శైవ వైష్ణవ ఆలయాల నెన్నింటినో సముద్ధరించారు. ధర్మసంస్థల్ని స్థాపించారు. వేదశాస్త్రాగమసభల్ని నిర్వహించారు. తద్వారా ధర్మాన్ని సముద్ధరించి ధర్మాచార్యులుగా కీర్తి వహించారు. కేవలం తాము మాత్రమేగాక మరెందరో మహనీయులను ధర్మప్రచారానికి ప్రేరేపించిన సాక్షాత్ ధర్మదేవత శ్రీ మహాస్వామివారు.

కేవలం ధర్మ ప్రచారమేకాదు, దేశ క్షేమాన్ని కూడ కాంక్షించి జాతిపిత మహాత్మాగాంధీగారి స్వాతంత్ర్యోద్యమాన్ని సమర్థిస్తూ తమ ఆశీస్సులందించిన, ధార్మిక స్వాతంత్ర్య దీక్షాపరులు, సముజ్జ్వలిత ధార్మిక చైతన్య దీప్తి శ్రీ చంద్రశేఖరేంద్రభగవత్పాదులు.

దరిద్రనారాయణులన్నా, దీనజనులన్నా శ్రీస్వామివారికి అత్యంత ప్రేమ, కరుణ. దేశం నలుమూలలా దీనజన సేవాకార్యంగా వారు ప్రారంభింపజేసిన పిడికెడు బియ్యపు దానకార్యక్రమం ఎందరికో ఆకలి తీరుస్తున్నది.

దైవకటాక్షమునకు దారిచూపని జీవిత క్షణములుగానీ, కార్యములుగానీ వ్యర్థములు-- అని వక్కాణిస్తూ పరమాచార్యులవారు ఆశీర్వదించి ఏర్పాటు చేయించిన ధ్యానం, జపం, సామూహిక వార భజనలు వంటి కార్యక్రమాలు ఎందరికో జీవిత సమస్యల నెన్నింటినో పరిహరిస్తూ చిత్తశాంతిని చేకూరుస్తున్నాయి.

ఇలా నూరేండ్లపాటు ఒకవైపు జగద్గురు పీఠాన్ని నిర్వహిస్తూ, మరోవైపు జగత్కల్యాణం కోసం ఎన్నో మానవసంక్షేమ, దేశసంక్షేమ కార్యక్రమాలను ఆచరింపచేస్తున్నా వారు సుదీర్ఘంగా సంభాషించిన సన్నివేశాలు అతి తక్కువ. అలాంటి మహామౌని సన్నిధిలో, వారి మౌనార్ద్ర దృక్కులతోనే, వారిని దర్శించిన శిష్యులు భక్తులు, ఆశ్రితులు... ఇలా ఎందరికో ఎందరెందరికో సంశయ నివృత్తి కలిగేది. సందేహాలు పరిష్కారమయ్యేవి. ఇష్టార్థ సిద్ధి జరిగేది.

ప్రత్యక్షదైవంగా, సద్గురువుగా, ఆపద్బాంధవుడుగా, యోగీశ్వరేశ్వరుడుగా, ఆధ్యాత్మిక జ్ఞానభాండారముగా, మూర్తీభవించిన ధర్మదేవతగా.....ఇలా ఎందరికో ఎన్నో విధాల దర్శనమిస్తున్న ఆ పరమమౌని ఇటీవల గంభీరమైన అనంతమైన మహామౌనచైతన్యంలో లీనమయ్యారు. అలా ఆ 'నడుస్తున్నదేవుడు' నిర్గుణ నిరాకార పరబ్రహ్మ తత్త్వంలో తాదాత్మ్యమయ్యారు.

బాహ్యదృక్కులకు స్థూలరూపంతో దర్శనమిస్తున్న ఆ గురుతత్త్వం తేజోరూపంగా అఖండమండలమంతా వ్యాపించి సర్వేసర్వత్రా ప్రకాశిస్తున్నది. త్రిమూర్త్యాత్మకమైన ఆ అఖండ పరబ్రహ్మతత్త్వం ఉపదేశించి చూపిన వెలుగుబాటలో చక్కగా సాగిపోదాం. మనలను మనం ఉద్ధరించుకొందాం.

అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్,
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః




ఉత్తరాయణ పుణ్యకాలంలో సూర్యుని గమనం దక్షిణ దిశనుండి ఉత్తరదిక్కుకు మారే పర్వదినమే రథసప్తమి. మాఘశుద్ధ సప్తమినాడు సర్వజగద్రక్షకుడైన సూర్యభగవానుని ప్రత్యేకంగా పూజించడం సంప్రదాయం.

'సప్త' అనే పదం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. 'సప్త' అంటే ఏడు. సూర్య రథానికి ఏడు గుర్రాలున్నాయని అందుకే సూర్యుని 'సప్తాశ్వరథి' అని అంటారని కొందరి అభిప్రాయం.

" సప్తాశ్వరథ మారూఢం
ప్రచండం కశ్యపాత్మజమ్
శ్వేతపద్మధరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్."

అనే శ్లోకం ఈ అభిప్రాయాన్ని ధృవీకరిస్తుంది.

సూర్యుని రథానికి ఒకే గుర్రం ఉందని, దానిపేరే 'సప్త' అని మరికొందరు చెబుతున్నా సూర్యుని రథానికి ఏడు గుర్రాలు, సూర్య కిరణాలకు ఏడు రంగులు ఉన్నాయని అందుకే సప్తమి తిథి సూర్యునికి ప్రీతికరమైందని అనేకులు విశ్వసిస్తారు. మాఘశుద్ధ సప్తమినాడు సూర్యభగవానుడు మొట్టమొదటిసారిగా భూమిమీద సాక్షాత్కరించడం వల్ల ఆ సప్తమి ఎంతో పవిత్రమైందని చెబుతారు.

> 94 ఫిబ్రవరి 17 రథసప్తమి సందర్భంగా ఈ ప్రత్యేక వ్యాసం ప్రచురిస్తున్నాం
>
> సం॥

మాఘశుద్ధ సప్తమినాడు సూర్యోదయాత్పూర్వమే జిల్లేడు లేదా బదరీ పత్రాలను అక్షతలతో లేదా రేగుపళ్ళతో తలమీద, భుజాలమీద ఉంచుకుని స్నానం చేయడం విధిగా పాటిస్తారు. ఈ స్నానం కూడా గంగాది మొదలైన పుణ్యతీర్థాల్లో చేసినట్లైతే ఏడు జన్మల పాపం హరించబడుతుందని పురాణాల్లో చెప్పబడింది.

రథసప్తమీ వ్రతాచరణవల్ల సత్సంతానం, ఆయురారోగ్యాలు లభిస్తాయని నమ్మకం. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని సూర్యుడు ఆరోగ్యప్రదాతగా కొలువబడుతున్నాడు. సూర్య కిరణాల్లోగల విటమిన్ డి వల్ల రికెట్స్‌వ్యాధి నయమవుతుంది.

సూర్యారాధన ప్రాచీనకాలంనుండి



## భక్తి ద్వారా ముక్తి

శాస్త్ర చోదిత కర్మలను మనం విధిగా చేయవలసి ఉంది. ఇది అవసరమా, అనవసరమా అన్న ప్రశ్నలకు తావులేదు. ఇలా కర్మానుష్ఠానం చేసిన తర్వాత క్రమంగా మనకున్న రాగద్వేషాలు క్షీణించి, చిత్తశుద్ధి ఏర్పడి, మనస్సు సమాహితమై ఈశ్వరానుసంధాన పటిష్ఠమవుతున్నది. ఇదే భక్తి. ఇది రెండవ స్థితి. భక్తి పెరిగితే జ్ఞాన ప్రాప్తి. అది చరమస్థితి.

అందుచేత భక్తిని వదలి ముక్తికోసం ప్రత్యేకం పాకులాడవలసిన పనిలేదు. మనలోని భక్తే తుదకు ముక్తిని అందిస్తుంది. భక్తి కోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తే చాలు. అందుకే మహానుభావులందరూ భక్తి ప్రాధాన్యాన్ని ఉద్ఘాటిస్తూ "భక్తి భిక్షను పెట్టవే" అని అమ్మవారిని ప్రార్థిస్తూ ఉంటారు. ఆ భక్తి మనకు లభించిందంటే ముక్తి కరతలామలకమే.

## ధర్మం తార్కికం కాదు

ధర్మం సనాతనం. అది పరిణామబద్ధం కాదు. అందులో ఏ కొంచెం మార్పు వచ్చినా ఈ విశ్వానికే ఆపత్తు వస్తుంది.

అన్ని ధర్మాలకూ వేదాలే మూలం. 'వేదోఖిలో ధర్మమూలం'. వేదాలు అపౌరుషేయాలు. వాటి కర్తలను మనం ఎరగం. ఈ ధర్మశాస్త్రాలను వ్యక్తిగతంగా కాని పరిసరమూలకంగా కాని, సామాజిక వ్యవస్థలద్వారా గాని మార్పు చెయ్యడానికి వీలులేదు. మార్పుచేస్తే ధర్మమే అస్థిరమై పోతుంది. అందుచేతనే అది సనాతన ధర్మ మన్నారు.

శ్రీరాముడు మాటిమాటికీ "ఏష ధర్మ స్సనాతనః" అనడం అందుకే. ధర్మంలో తర్కానికి తావులేదు. "తర్కో అప్రతిష్ఠః" (తర్కం స్థిరత్వం లేనిది) ధర్మం తార్కికం కాదు, కర్తవ్యం.

--కంచిపరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి

సేకరణ : శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారి "నడిచేదేవుడు" గ్రంథం నుండి.

ఉన్నట్లు తెలుస్తుంది. అధర్వణ వేదం, బృహత్సంహిత, సుప్రభేదాగమమం మొదలైన ప్రాచీన గ్రంథాల్లో సౌరప్రతిమా లక్షణం వివరించబడింది. గుప్తులు, శాలంకాయనులు, చాళుక్యులు సూర్యుని ఆరాధించినట్లు తెలుస్తుంది. శాలంకాయనులు సూర్యుని చిత్రరథస్వామిగా కొలిచేవారు. పెదవేగి అనే పట్టణంలో వీరు సూర్యునికొక ఆలయం స్థాపించినట్లు చారిత్రక ఆధారాలవల్ల తెలుస్తుంది.

ఆదికావ్యమైన వాల్మీకి రామాయణంలో రావణ వధకు ముందు అగస్త్యుడు శ్రీరామచంద్రునికి 'ఆదిత్య హృదయం' బోధిస్తాడు.

సర్వదేవాత్మకో హ్యేష<br>
తేజస్వీ రశ్మి భావనః<br>
ఏష దేవాసురగణాన్<br>
లోకాన్పాతి గభస్తిభిః.<br>
. . . . . . . . . . . . . . . . . .<br>
పూజయస్వైన మేకాగ్రో<br>
దేవదేవం జగత్పతిమ్,<br>
ఏతత్త్రిగుణితం జప్త్వా<br>
యుద్ధేషు విజయిష్యసి.

అంటే -- ఇతడు సమస్త దేవతలకు ఆత్మభూతుడు. తన తేజస్సుచే ఇతర తేజస్సులను తిరస్కరించువాడు. కిరణములు కలవాడు. తన కిరణములచే దేవ, అసుర గణములను, లోకములను పాలించువాడు. నీవు ఏకాగ్రచిత్తుడవై దేవదేవుడు, జగత్పతి అయిన వానిని ఈ స్తోత్రంతో పూజించుము. దీన్ని మూడుసార్లు జపిస్తే యుద్ధాల్లో జయం పొందగలవు అని అర్థం. సూర్య స్తోత్రమైన ఈ ఆదిత్యహృదయం ఎంతో ప్రసిద్ధి పొందింది. నేటికీ పలువురు సూర్యోపాసకులు ఈ స్తోత్రాన్ని నిత్యం పారాయణం చేస్తుంటారు.

ఋగ్వేదంలో, యజుర్వేదంలో, ఉపనిషత్తుల్లో రామాయణ, భారత, భాగవతాది పురాణాల్లో, మార్కండేయ, మత్స్య, బ్రహ్మాండ, భవిష్యాది పురాణాల్లో, కావ్యాల్లో సహితం సూర్యుని ప్రస్తావన ఉండడం సూర్యారాధన యొక్క ప్రాచీనతను తెలియజేస్తుంది.

రామాయణంలో రాముడు సూర్యవంశానికి చెందినవాడు. సుగ్రీవుడు సూర్యపుత్రుడు. హనుమంతుడు సూర్యుని శిష్యుడు.

భారతంలో కర్ణుడు సూర్యాంశ సంభూతుడు. పాండవులకు అక్షయపాత్రను ప్రసాదించిందీ సూర్యుడే.

సత్రాజిత్తుకు శమంతకమణిని ప్రసాదించిన సూర్యుడు ద్వాదశాత్మజుడు, గాయత్రీ మంత్రానికి అధీశ్వరుడు.

శ్రీనాథుడు గాయత్రి మంత్రానికి అధీశ్వరుడైన సూర్యునికి తపనుడు, సహస్రాంశుడు, వికర్తనుడు మొదలైన ఎన్నో పేర్లున్నాయని పేర్కొన్నాడు.

పేతుఁడై యుర్కుఁ డొసఁగు<br>
సేవకుల కాయురారోగ్య ధీ<br>
వివేక భాగ్య సౌభాగ్య<br>
వైభవ ప్రాభవములు

అంటూ శ్రీనాథుడు హరవిలాసంలో పేర్కొన్నాడు.

ఇలా సూర్యుని ప్రాచీనకాలంనుంచీ ప్రతినిత్యం పూజిస్తున్నా మాఘశుద్ధ సప్తమినాడు సూర్యజయంతి అని ప్రత్యేకంగా పూజించి పండుగ జరుపుకోవడం ఆచారం.



తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మ ప్రచారపరిషత్, చిత్తూరుజిల్లా శాఖ ఆధ్వర్యంలో ఇటీవల నారాయణవ నంలోని అవినాక్షమ్మ దేవాలయం లోను ఐరాలమండలం గుండ్లపల్లి లోని శ్రీభగవాన్ రామతీర్థసేవాశ్ర మంలోను, నగరిమండలం మునగమా కులకొత్తూరులోని శ్రీపట్టాభిరామస్వా ములవారి దేవస్థానంలోను, పుత్తూరు లోని శ్రీసదాశివాలయంలోను, ఎర్రా వారిపాళెంమండలం ఎనుములవారిపల్లి శ్రీరామాలంలోను, బంగారుపాళెం లోని శ్రీశక్తిదేవాలయంలోను, వడ మాలపేట మండలం బొమ్మరాజుపు రంలోని శ్రీకృష్ణభజనమండపంలోను, చంద్రగిరిలోని శ్రీరామభజనమంది రంలోను, పైడి పల్లిలోని శ్రీరామాలం లోను, రేణిగుంటమండలంలోని తాత య్యకాల్వలోని శ్రీరామాలయంలోను, బంగారుపాళెం మండలం పాలేరులోని శ్రీకోదండరామాలయంలోను, పలమ నేరులోని శ్రీసీతారామాంజనేయ స్వామి దేవస్థానంలోను, వెదురుకు ప్పంమండలం ఎల్లారెడ్డి కండ్రిగలోని శ్రీకృష్ణ భజనమందరంలోను, వెదురు కుప్పంమండలం ఎల్లారెడ్డి కండ్రిగలోని శ్రీకృష్ణ భజనమందిరంలోను, చిన్నగొ ట్టిగల్లు మండలం రంగన్నవారిగడ్డలోని శ్రీచౌడేశ్వరి అమ్మవారి దేవాలయం లోను, తవణంపల్లి మండలం ముట్టు కూరు శ్రీధర్మరాజుల దేవస్థానం లోను, కమ్మపల్లిమండలం కుప్పంబా దురులోని శ్రీవిఘ్నేశ్వరస్వామి దేవా లయంలోను వెదురుకుప్పంమండలం లోని మాంచేడు హరిజనవాడలోను ధార్మికప్రవచనాలు, భజనలు, హరి కథలు, కుంకుమపూజలు జరుపబ డ్డాయి. పై కార్యక్రమాల్లో ఆయా

గ్రామప్రజలేగాక చుట్టుప్రక్కల గ్రామా లప్రజలు కూడ పాల్గొన్నారని, దేవ స్థానం, ధర్మప్రచారపరిషత్ వారు




ఏర్పాటుచేసిన ఈ ధార్మిక కార్యక్రమా లపట్ల చాలామంది ఆకర్షితులై రావడం జరిగిందని చిత్తూరుజిల్లా శాఖ ఆర్గనై జరు డా॥ రోశిముని తెలియజేశారు.

ఇవేగాక ఇటీవల తలకోనలో హరి కథలతోపాటు శ్రీవేంకటేశ్వర వైభవం, బ్రహ్మోత్సవాలు, చలనచిత్ర ప్రదర్శన మున్నగు దృశ్యశ్రవణ కార్యక్రమాల ద్వారా కూడ ధర్మప్రచార కార్యక్ర మాలు జరిగాయి. పై ధార్మిక కార్యక్ర మాలన్నీ ధర్మప్రచారపరిషత్ చిత్తూరు జిల్లా శాఖ ఆర్గనైజరు పర్యవేక్షణలో జరిగాయి.

## పొర్లు దండాలతో కొండపైకి

భక్తులు తమ ఇష్టానుసారం తిరు మలస్వామివారికి మొక్కులు చెలిస్తుం టారు. అందుకే తిరుమలవెంకన్నను 'మొక్కుబళ్లదేవుడు' అని అంటారు.

94 జనవరి 8న తిరుమల తిరు పతి దేవస్థానంలోని తిరుమల వైకుంఠం క్యూకాంప్లెక్సులో పనిచేస్తున్న శ్రీబా లాజీ పొర్లుదండాలతోనే తిరుపతినుంచి తిరుమలకు కాలినడకదారిలో వెళ్లి తన మొక్కును చెల్లించుకున్నాడు. తెల్లవా రుజామున 3 గంటలకు తిరుమల అలిపిరినుండి దొర్లడం ప్రారంభించి సాయంత్రం 4 గంటలకు శ్రీవారి ఆలయం మహాద్వారం చేరుకున్నాడు. ఇదికాక శ్రీబాలాజీ తిరుమలకు 108 శనివారాలు దీక్షతో నడచి వెళ్లాలని మొక్కుకొని, ఇప్పటికే 72 శనివా రాలు పూర్తి చేశాడని తెలిపారు.





పైన: తిరుమలయాత్రా దీక్షాపరులైన శ్రీ గోవిందనామమాల వ్రత భక్తులు చేస్తున్న హోమదృశ్యం.

ప్రక్కన: రాజమండ్రిలో ఇటీవల జరిగిన కుంకుమపూజాదృశ్యం.

క్రింద: పార్వతీపురంలో ఇటీవల జరిగిన ధార్మిక కార్యక్రమంలో పాల్గొన్న పండితప్రముఖులు.















(గత సంచిక తరువాయి)

శాసన మిడి సుగ్రీవుడు శౌర్యశాలి
వెంటనే సర్వసైన్యము బిలువ నంపి
సంతసిల్లుచు తనదు నాజ్ఞలకు తానె
కాంచనేగెను కామసుఖమ్ము మరం.

మొయిలు మృగవిహంగాదులు పూలు లతలు
సలిలపూరాలు శైలదృశ్యాలు కనుచు
కామశోకకర్శితుడైన రామవిభుడు
చింతనందె నీ రీతిని సీత దలచి.

ఏగుదెంచె శరత్కాల మిపుడు సౌమ్య!
కదనతలమున కురుకంగ కాల మిదియె
కాముకుండు సుగ్రీవుడు కానరాడు
చెప్పు మతనితో నీవు కిష్కింధ కేగి.

పనులు దీరంగ చేసిన బాస తప్పి
తేలియాడుచు భోగాల, దీను నన్ను
మరచితివి; నీదు ధర్మము నెరపకున్న
అగ్రజుం డేగు దారినే యరుగ గలవు."

# రావుల రామాయణము

"తనివి తీరంగ విరులను తరుల గనుచు
పక్షిజాతుల మధుర రవాలు వినుచు
మున్ను పొందెడిదానవు ముదము సీత!
ఈ వియోగ మే గతి భరియింతు వీవు?"

భ్రాత సౌమిత్రి జాలితో పలికె నిట్లు
"దైన్యమును చేరగానీక ధైర్య మొప్ప
స్వీయబలమున కార్యము చేయదగును
వశపరచుకొన సీత నెవ్వాని వశము?"

అనియె రాముడు తమ్మున కప్పు డిట్లు
చల్లచల్లగ నెల్లెడ జలము గురిపి
సస్యములశ్యామల మొనర్చి సర్వధరణి
అరిగె మేఘంబు లెటకొ అంబరము వీడి.

రామవిభుక్రోధమునకు సంభ్రమము నొంది
రాజపుత్రుడు సౌమిత్రి తేజమలర
పలికె "సుగ్రీవు గావింతు బాణహతుని
అవనిజాన్వేషణ యొనర్పు అంగదుండు."

"నీవు పరమకృతఘ్ను సుగ్రీవు జంపు
పాపకృత్యమొనర్పంగ పాలుపడకు;
ధీయుతుండవై లక్ష్మణా! తెలియ జెప్పు
సౌమ్యగతి" నంచు శ్రీరామచంద్రు డనియె.

కాముకుండైన క్రోధను రామవిభుని
అతులకోపంబు లక్ష్మణుం డంది వనియె
వనచరపురంబునకు మేటిధనువు దాల్చి
అతని గని కపులెల్ల భీతాత్ము లైరి.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి



'చంద్రశే

భీషణంబుగ వచియించె రోష మంది
మిత్రు నంగదు గాంచి సుమిత్రసూతి
వానరాధిపతికి తాను వచ్చె ననుచు
శీఘ్రమే లోనికిం జని చెప్ప మంచు.

స్వీయ పత్నియౌ రుమను విశేషసక్తి
మాపు తారను జతగూడి సుప్తిగాంచు
విభుడు రయమున మేల్కాంచె వికలమతులు
కపులు చేసెడు ధ్వనికి లక్ష్మణుని మ్రోల.

తనదు తల్లి తారకు పినతల్లి రుమకు
వాలిసుతుడు లక్ష్మణు రాక వడిగతెలిపె
విభుడు లేవంగ సచివులు వేడుకొనిరి
సరసనమ్మిత్రు సౌమిత్రి శాంతపరుప.

కోపహేతువు నూహింప గోర విభుడు
హనుమ సచివమధ్యంబున అనియె నిట్లు
"లభ్య మీ శరత్కాలము; లక్ష్మణుండు
కినుక బూనియుండు వెడలకునికి నీవు.

ప్రతిన విస్మరించిన అపరాధి వీవు
సముచితంబు కుపితుని ప్రసన్నుజేయ
ఇంద్రసమతేజు శ్రీరామచంద్రుశక్తి
ఎరుగవే మున్ను? దాటకు మితని ఆజ్ఞ."

భూతలస్వర్గముగ దోచు భూరిపురిని
దివ్యమైన సుగ్రీవు మందిరము చేరి
వీర సౌమిత్రి మ్రోగింప వింటినారి
శౌర్యశాలి కపీంద్రుడు సంచలించె.

తత్క్షణంబె సుగ్రీవుడు తార నంపె
సాంత్వనోక్తుల ఆతని శాంతపరుప
చూడ నిజము మహాత్ములు చూప రెపుడు
కోమలుల పట్ల దారుణ క్రోధ మనుచు.

"ఎవరు గావించి రపచార మిపుడు మీకు?
ఎవ్వని తరంబు మీమాట కెదురుచెప్ప"
వనిత యిటు పల్క సౌమిత్రి వ్రతపరుండు
అతిమనోజ్ఞ ధర్మయుత వాక్యంబు లనియె.

"మదనమోహితుండైన నీ మరది మగడు
పానలోలుండు చేసిన ప్రతిన మరచె;
తరుణి! వీడంగ మిత్రుని ధర్మపరుని
అర్థ కామ ధర్మములతో నంతరించు.

తోడనే తార సౌమిత్రితో వచించె
"లక్ష్మణా! ఆగ్రహింప కాలమ్ముకాదు
మీదుమిక్కిలి నమ్ముడౌ మిత్రుపైన
దోషమయము, సత్త్వమ్మును దొలచు కినుక.

కాంచితిని నేను దేహజకామబాధ
తీవ్ర మర్కజకామము తెలియు నాకు
నే నెరుగుదు నీ ఇంద్రియనిగ్రహమ్ము
కామము నెరుంగ కోపము కలుగ దింత.

కామవశుడు వివేకము గాంచలేడు
పరమఋషు లెందరో కామవశులుకాగ
నీవు భ్రాతను కపిని మన్నింప లేవె?
సహజచపలు డొనర్చె దుష్కర్మ మనుచు.

కాముకుం డయ్యు పంపెను కపుల బిలువ
సీతకోస మన్వేషణ చేయ దలచి;
రమ్ము లోనికి, మిత్రదారలను జూడ
తప్పగా దుత్తమచరిత్ర! తలపబోకు."

అచట అభ్యంతరగృహాన అరసె నతడు
స్వర్ణపీఠిని సుందరీసహితు డగుచు
కూరుచుండ సుగ్రీవుడు కొమరుమిగుల
ఆగ్రహవశుండు లక్ష్మణుం డనియె నిట్లు.

"రాజ్య సుఖమొంది గుణశాలి రామువలన
బాస మదిలో దలంపని పాతకుడవు
మూర్ఖతను వాలిమార్గాన పోదలంప
నిశితశరమున నీల్గుదు నిముస మందె."

త్రాస సంభ్రాంత చిత్తయై తార పలికె
"పురుషపుంగవ! మీ మేలు మరువలేదు
దీర్ఘకాలము కామసంతృప్తి కనక
దేహధర్మము నాతండు తీర్చుకొనియె."

రాజ్యరమను రుమను నన్ను రాముకొరకు
వీడు సుగ్రీవుడు నిజంబు; నేడె వచ్చు
కదన రంగమ్మునం దూక కపిగణంబు
వాలి తెలిపెను రావణువార్త రెన్నొ."

మహిత మృదుల మానసుని లక్ష్మణుని గాంచి
ప్లవగపతి పల్కె నిట్టులు భయము గదుర
పృథ్వి శైలసహితము కంపింప జేసె
విభుని శ్రీరామచంద్రుని వింటిమోత.

రామచంద్రుండు సత్యపరాక్రముండు
రావణాసురు వధియించి రణమునందు
సీత బడయు; సాయము నేను చేయు
టెంత?
అతని వెనువెంట చనుటె భాగ్యమ్ము నాకు."

లక్ష్మణుడు శుభలక్షణలక్షితుండు
"విజయ మందును మా భ్రాత వీర్యశాలి
సాయ మొనరింప నీవు నిస్సంశయముగ
నే ననిన మాటలన్ని మన్నింపు" మనియె.

వానరపతి సుగ్రీవుడు పజ్జ నున్న
సచివు హనుమంతు నరసి శాసనము చేయ
వనగిరి సముద్ర పర్యంత వసుధ వెలయు
క్రోతు లెల్లరు వచ్చిరి కోట్లకొలది.

మిత్రులగు అర్కజుండు సుమిత్రసూతి
బయలుదేరగ శిబికపై వానరాళి
కదలె ప్రస్రవణంబను గ్రావమునకు
రాము జేరంగ నతని కార్యంబుకొరకు.

రామచంద్రుడు పరమధర్మజ్ఞు డపుడు
చరణముల వ్రాలు సుగ్రీవు శిరము నెత్తి
కౌగిటను బట్టి మిక్కిలి కరుణ జూపి
కూరుచుండగ జేసి వాక్రుచ్చె నిట్లు.

కాల మెరిగి ధర్మార్థ కామాల నెవడు
తగినరీతి చరించు నతండె రాజు
కామలోలుపు బ్రదుకు వృక్షంపుకొనను
నిదురజెంది మేల్కొనుటయే నేలబడగ.

శాత్రవుల జంపి సఖులను సంగ్రహించు
ప్రభుడు నిజధర్మ మొనరించు రమ్యయశుడు
అదను వచ్చెను సీతను వెదుక నిదిగొ
శత్రుసూదన! కపులతో సంప్రదించు."

"నీ యపారకృపను నాకు శ్రీ యు గీర్తి
పరగ వానరరాజ్యసంప్రాప్తి గలిగె
నీదు పదపద్మసన్నిధి నిలుపగలరు
కామరూపులు సీతను రామచంద్ర!"

ప్రాంజలించి సుగ్రీవుడు పలుకనట్లు
రాము డనుపమకరుణాంతరంగు డగుచు
వానరేంద్రుని కౌగిట పట్టి పలికె
కదనమున గూల్తు రావణు ఖలు" నటంచు

వానరులు లక్షలును కోట్లు వచ్చిరంత
ధీరవర్యులు పెనుధూళి దిశల గ్రమ్మ
ప్రార్థన మొనర్చె కపిరాజు రాము నరసి
ప్రాజ్ఞులగు వారికి తగిన ఆజ్ఞ నొసగ.

భీమవిక్రము డతనితో రాము డనియె
"తెరవ బ్రతికియున్నదొ లేదొ తెలియవలయు
రావణుని దేశ మెరిగి కర్తవ్య మవల
చేయుదము వీర! యోచనచేసి మనము."

(సశేషం)

# సర్వపురక్షేత్ర మాహాత్మ్యము

శ్రీమతి ఎం. పద్మకుమారి



తెలుగు వాఙ్మయంలో కవిసార్వభౌములు ముగ్గురు. వారు శ్రీనాథుడు, కూచిమంచి తిమ్మకవి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. వీరిలో తిమ్మన సుమారు 16 పద్యకృతులు వ్రాసి పోతన-శ్రీనాథులవలె పేరుగాంచినవాడు. పోతనవలె తన కావ్యాలు భగవంతునకే అర్పించిన ఘనుడు. ప్రస్తుత క్షేత్ర మాహాత్మ్యము కూడ అంతే. శ్రీ భావ నారాయణస్వామికి అంకిత మిచ్చినాడు. భావ నారాయణస్వామి కాకినాడకు సమీపములో సర్పవరము (సర్పపురము) అను గ్రామములో వెలిసియున్నాడు. దేవర్షి అయిన నారదుడు ఈ దేవునిక్కడ ప్రతిష్ఠించినట్లు తెలియుచు న్నది. ఈ క్షేత్ర వైభవము బ్రహ్మవైవర్త పురాణమునందు తెలుపబడినది.

కవిసార్వభౌముడైన కూచిమంచి తిమ్మ కవి ఈ క్షేత్ర విశేషములను లోకానికి వెల్లడించిన ఘనుడు. నన్నయ కాలమునుండి నేటివరకు విస్తరించిన సర్వాంధ్ర సాహిత్య ప్రక్రియలలో పద్యకావ్యములకు పట్టాభిషేకము జరిగినదనుట నిర్వివాదమైన విషయము. అందుకు కారణము ఛందోబద్ధమైన పద్యకావ్యములకు రాజాశ్రయము లభించుట, కవులు తమ అభిరుచులను ప్రభువుల అభిరుచులను జోడించి పద్య కావ్యములు రచించుట జరిగినది. రచనలను బట్టి కవులకు సన్మానములు, ఓరుదులు లభించినమాట నిజమే. అయితే అట్టి సన్మాన ఓరుదులకు ఆశపడక దైవ సన్నిధిని కోరినవాడే ఈ తిమ్మకవి.

18వ శతాబ్దములో ఆంధ్ర కవులలో గణనీయమైన వ్యక్తిత్వముగలవాడితడు. తిక్కన సోమయాజివలె తన కృతులను హరిహరనాథునకు అంకితమిచ్చినాడు. తిక్కనవలె శివకేశవులకు అభేదము కల్పించి యున్నాడు.

# వేదం -- రామనామం

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగ అవతరించినందున రామాయణరూపం దాల్చిన వేదసారం రామనామంలో అణగి వుంది. ఆ రామనామం చిత్తమాలిన్యాన్ని పోగొట్టి వేరొక దానిపై ఆశ కలుగనీయక సదా ఆనందంగా వుండేటట్లు చేస్తుంది.

--కంచిపరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి

సేకరణ : శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారి "నడిచేదేవుడు" గ్రంథం నుండి.

అంతేకాక స్వతంత్రముగ రచన సాగించిన సాహిత్యమూర్తి. కొన్ని కావ్యములకు మూలములు గలవు. కొన్నింటికి లేవు.

ఈ సర్పపుర క్షేత్రము భూలోకములో వెలసినట్టి పుణ్యక్షేత్రములలో ఒకటి. కూచిమంచి తిమ్మకవికి విష్ణుమూర్తి కలలో కనిపించి "ఎన్నో సత్కృతులు వ్రాసి శంభున కర్పించిన ఘనుడవు. ప్రతిభతో నాకొక కృతి యిమ్మని స్వప్నమున కోరినట్లు కవియే" చెప్పుకొన్నాడు. తిమ్మకవియు భగవంతుని కోరిక మేరకు ఈ కథకు ఆధారమగు మూలము బ్రహ్మవైవర్త పురాణమునుండి గ్రహించినట్లు వెల్లడించినాడు.

అంబరీషుడను రాజు నిండుసభదీర్చి యుండగా వసిష్ఠమహాముని అచటి కరుదెంచెను. అప్పుడు మహర్షికి ఉచితాసనమిచ్చి హితగోష్ఠి ప్రసంగమున "సర్పపురమనేది? భావనారాయణుడెవరు? ఎట్లు వెలిసెను? ఆ దేవుని ఎవరు ప్రతిష్ఠించిరి? అచటి పుణ్య సరోవరము లెవ్వి? ఆ తీర్థస్నాన ఫలమేమి? మీవలన వినగోరుచున్నాను" అనుగ్రహింపుమని వేడుకొన్నాడు.

వసిష్ఠుడు అంబరీషమహారాజునకు చెప్పిన సర్పపురమాహాత్మ్య కథ పూర్వకాలమున శౌనకుడు నైమిశారణ్యమున గాలవ, కౌశిక, ఉద్దాలక, శాండిల్యాది మునీంద్రులకు చెప్పెను. గోదావరికి తూర్పున తుల్యభాగమునకు పశ్చిమమున, వారణాసికి క్రోసెడు దూరమున సర్పపురమను క్షేత్రముగలదు. దీనిని దర్శించిన వారు ముక్తులగుదురు. ఇచట అనంత సరస్సు, నారద సరోవరము, ముక్తికాసారము అను మూడు నామములతో ఒక గుండము గలదు. దానిని నారదుడు ప్రతిష్ఠించెను. ఇచటనే శ్రీ భావనారాయణుడు దేవపూజ్యుడై వెలిసెను. దీనిని 335 గద్య పద్యములలో మూడు ఆశ్వాసములు గల క్షేత్ర మాహాత్మ్యముగా కూచిమంచి తిమ్మకవి తీర్చిదిద్దినాడు.

పూర్వకాలమునుండి ఈనాటి వరకు లోకములో సవతిపోరు ప్రసిద్ధమే. అట్టి కథలలో గంగాగౌరీ కద్రూవినతలు ప్రసిద్ధులు. కద్రువ కుమారులు తన మాట వినక మడిసిరి. ఆమె కొడుకులలో ఒకడు 'అనంతుడ'ను వాడు అందరివలెగాక శ్రీహరిని గూర్చి తపస్సుచేసి, హరిని ప్రత్యక్షము గావించుకొనెను. వరము కోరుమనగా "మీకు నేను నిత్యము శయ్యమగునట్లు వరము నిమ్మని కోరినాడు." విష్ణుమూర్తి ఈ స్థలమునే వరము ప్రసాదించినాడు. అందువలననే దీనికి "అనంత సరస్సు" సర్పవరము (పురము) అని నామము కల్గినది.

నారద సరోవరమనగా బ్రహ్మదేవుడు కొలువుండగా ఆ సభలో సకల చరాచర జీవరాశియు తిరిగి తిరిగి జననమును, మరణమును పొందుననియు, పాపమార్గము నవలంబించు జనులుందురనియు, రమాపతిని, ఉమాపతిని కొలిచిన నరుడు సుఖములు పొందుననియు చెప్పెను. ఈ మాటలు నారదుడు విన్నాడు. వెంటనే లేచి దేవా! నీవు చెప్పినది నిజము. కాని నేను విష్ణుమాయను అతిక్రమించి సుఖముగా నున్నాను అని గర్వోక్తులాడెను. సభలోని వారందరు తలలు దించుకొనిరి. వెంటనే బ్రహ్మ నారదుని నీవు భూలోకమున స్త్రీవై జన్మింపుమని శపించెను. శాపగ్రస్తుడైన నారదుడు లేచి నాయనా! నేను నీ పుత్రుడను, కరుణింపుమని వేడుకొనెను. బ్రహ్మ దయతో బిడ్డా! నీవు వందమంది సుతులను కని శాపవిముక్తిని గాంచ గలవని పలికెను. అందువలన నారదుడు భూలోకములో సర్పవరమున ఈ కాసారములో స్నానమాడి శాపవిముక్తిని పొందెను. కావున నారద సరోవరమని దీనికి నామము కల్గెను.

నారదుడు భూలోకములో స్త్రీగా మారి సుదతియను పేరున చంద్రవంశపు రాజగు వీరబాహుని జ్యేష్ఠ పుత్రుడు నికుండమహారాజునకు భార్యయయ్యెను. కొన్నాళ్లు సుఖజీవనము గడపిన తర్వాత నూర్గురు పుత్రులు గల్గిరి. అందరును మిక్కిలి బలశాలులు. నికుండరాజు శత్రువగు రిపుంజయుడను రాజుతో యుద్ధము జరిగి, దైవబలము లేక రణరంగమున ఇతడు పుత్ర మిత్రులతో సహ వీరస్వర్గము పొందెను. సుదతి దిక్కులేనిదై ఏడ్చుచు ఆకలి దప్పులతో వనమున తిరుగుచుండెను. కొంతసేపటికి ఒక మామిడి చెట్టు కన్పించెను. పండ్లు కోయబోవగా అవి ఆమెకు ఎంతకును అందవయ్యెను. చెట్టు కొమ్మలు ఎత్తున ఉన్నందున, తన పుత్రుల కళేబరములను తెచ్చి ఒక దానిపై ఒకటి పేర్చి, వాటిపై నెక్కి పండ్లు త్రెంపబోయెను. అంతలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు (విష్ణుమూర్తి) కనిపించి అమ్మా! నీవు ఈ చెరువులోనున్న కాసారములో స్నానమాడి రమ్ము. నీకు అవి లభింపగలవని చెప్పి అదృశ్యమయ్యెను. సుదతి సర్పపురమున గల అనంత సరస్సులో స్నానమాడిన వెంటనే "నారద" రూపము దాల్చెను. కావున దీనికి నారదకుండము అని పేరు గల్గెను.

నారదుడు ఇచటనే గల శ్రీ భావనారాయణ స్వామిని పూజించి తన తప్పు క్షమించుమని వేడుకొనెను. బ్రహ్మ కూడ కరుణించెను నారదుడు విష్ణుమూర్తిని ఈ ప్రాంతమున నిలిపి పూజలు ఆరంభించెను. కావుననే ఈ క్షేత్రమును దర్శించినవారు పావనులగుదురని పురాణ గాథ.



ప్రపంచం ఉద్భవించినది మొదలు నేటి వరకు ప్రజల ప్రత్యక్షదైవం, తన వెలుగు కిరణాలను భూమిపై ప్రసరింపజేసి ప్రాణికోటిని సంరక్షించి, చీకటిరేఖలను రూపుమాపి, ఆరోగ్యప్రదాతగను, మనకు కనుపించు ఆ మహోన్నత స్వరూపుడే సూర్యభగవానుడు. వైదికయుగం నుండి, వేదాలలోను, పురాణేతిహాసాలలోను, రామాయణ, భారత భాగవతాది గ్రంథాలలోను, హవిస్సులను గైకొని ఆదిదేవతగా, ఆరాధనీయుడైన శక్తిమంతుడు సూర్యుడు. స్థూలంగా చెప్పవలెనన్న సకలదేవతలకు ఆద్యుడు, పూజ్యుడగు ఈ సూర్యదేవుడు త్రిమూర్తి స్వరూపుడు. ఆకాశవీధిని విడిది గృహంగా కల్గిన జగన్మోహనాకారుడే మన సూర్యనారాయణుడు.

# సూర్యప్రస్తుతి

— కుమారి గాండీవరం సౌభాగ్యం



నిర్వచనం :

సూర్యుని గురించి పలువురు పలురకాలైన నిర్వచనాలనొసంగిరి. "సరతి చరతీతి సూర్యః" 'సృ గతౌ' సంచరించువాడనే అర్థమున, 'సువతి ప్రేరయతి వ్యాపారేష్వితి సూర్యః' అంటే వ్యాపారములయందు ప్రేరేపింపువాడనియు "భాసం కరోతి భాస్కరః" అంటే కాంతిని కలుగజేయువాడనియు, "దివా దినం కరోతీతి దివాకరః" అనిన పగలు జీవులను వ్యాపారవంతులను చేయువాడనియు అమరకోశకారుడు అమరసింహుడు వక్కాణించియున్నాడు.

సూర సూర్యార్యమాదిత్య
ద్వాదశాత్మ దివాకరాః,
భాస్కరాహస్కర బ్రధ్న
ప్రభాకర విభాకరాః

వ్యుత్పత్తి : జగత్తున ఎల్లలోకములకు సూర్యుడు తన దివ్యశక్తిచే జ్యోతిని ప్రకాశింపజేసి మానవాళిని మేల్కొల్పడానికి తనకిరణరేఖల ప్రభావమని తెలియుచున్నది.

"అరుణోదయం బెరుపు, అర్కమండల మెరుపు, ఫణి ఫణాదులు ఎరుపు, అగ్ని ఎరుపు"-- అని లోకోక్తి తెలుపుచున్నది.

సూర్యుని వివిధ నామములు

సాధారణముగా లోకమునందరి ప్రజలు తమ బిడ్డలకు ముద్దుగాముచ్చటగా కొన్ని పేర్లను బెట్టి ఆపేర్లతో పిలుచుచుందురు. సామాన్య మానవులైన మనమే ఆ విధంగా మన నామధేయాలను అనేక రూపాలతో పిలిపించుకుంటుంటే ఎల్ల జగత్తును తన కిరణ సమూహంతో వెలిగింపజేసే ఆ దివ్య మణికి అసంఖ్యాకముగా నామధేయములున్న వనుటలో అతిశయోక్తి లేదు. సూర్యునికి సంబంధించిన నామధేయములీ క్రిందివిధముగా నున్నవి.

> 94 ఫిబ్రవరి 17 రథసప్తమి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.
> సం॥

అర్కుడు, ఆదిత్యుడు, తీక్ష్ణకరుడు, క్రాంతదర్శి, ప్రభాకరుడు, భానుడు, భాస్కరుడు, మార్తాండుడు, రవి, దినకరుడు, దివాకరుడు, సూరి, సూరీడు, సూర్యుడు, సూర్యనారాయణుడు, సూర్యభగవానుడు, పద్మబాంధవుడు, హిరణ్యగర్భుడు అని అనేక విధములుగా ఆ దేవదేవుని భక్తజనులు కీర్తించుచున్నారు. ఓ ప్రదేశంలో 'సూర్యదేవ్' అనే నామం తరచు కనబడుతుంది. 'ఆదిత్య' బిరుదం రాజవంశాలలో వ్యాప్తిగా ఉండేది. ఋగ్వేదంలో వర్ణింపబడిన మిత్రుడే తరువాత సూర్యుడుగా, పూషగా, ఆదిత్యుడుగా అధర్వవేదంలో అభివర్ణింపబడ్డాడు.

# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం



శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి, శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.

శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.

శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి!
- శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం



శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.

శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా నెలకొన్న దేవాలయం

శ్రీ అగస్త్యేశ్వరాలయం - తొండవాడ.
కళ్యాణి తటాన ఉన్న పురాతన దేవాలయం





బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6 గం॥కు, 10 గం॥కు
సాయంత్రం: 3 గం॥కు



టిక్కెట్టు వెల:
పిల్లలకు : రూ. 10/-
పెద్దలకు : రూ. 20/-
ప్రతిచోటా ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR_

## సూర్యనామ వ్యుత్పత్తి

సూర్యుడు సప్త కిరణాల గల్గినవాడు. ఈతనికి ఏడు రశ్ములు గలవు. ఈ కిరణాలకు 'వృష్టివని' అని పేరు. ఈతని నామము లలో ప్రాముఖ్యత వహించినవి మరికొన్ని గలవు. అత్యంత శీఘ్రగతిలో నడిచేవాడు గనుక 'తరణి' అనియు, లోక ప్రజలందరికిని దర్శనీయుడు కనుక విశ్వదర్శితుడని, దివ్య ప్రకాశాన్ని ప్రసాదించుటచేత 'జ్యోతిష్క్రతు' డని పిలువబడుతున్నాడు (శుక్ల యజుస్సం హిత 33-36) ఇతడు భాగ్యప్రదాత, అన్న ప్రదాత కూడా.

'అదితి' కశ్యపుని సహధర్మచారిణి. ఈమె సూర్యుని గూర్చి తపము చేయగా 'సుషుమ్న' అను కిరణప్రభావంచే జన్మించిన బాలుడే మార్తాండుడని, ఈ తేజస్సునకు తాళలేక దానవసంహారం జరిగినదని మార్కం డేయ పురాణం దెల్పుచున్నది.

బ్రహ్మాండము మృతినొందినపుడు (రెండు శకలములైనపుడే) జన్మించెను కనుక మార్తాండుడని మత్స్యపురాణం తెలుపుచు న్నది.

విశ్వకర్మ తపోనిష్ఠా గరిష్ఠుడై యున్న సమయంబున కామరూపిణియగు 'సురభి' యనునొక కన్యనుగాంచి కామమోహితడై యున్న సమయంబున బ్రహ్మవచ్చి 'మార్తో భవ' అని ఆ కన్య నిచ్చెను. కనుక వానికి మార్తాండుడను నామమేర్పడినది.

## సూర్యుని పుట్టు పూర్వోత్తరాలు

సృష్టికి మూలపురుషుడగు శ్రీమన్నా రాయణుని అంశలో సూర్యుడుద్భవించినట్లు భగవద్గీత ఈ క్రింది పద్యమున పేర్కొం టున్నది.

అనాది మధ్యాంత మనంతవీర్య
మనంత బాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్.

--శ్రీమద్భగవద్గీత

విశ్వరూపసందర్శన యోగః -- శ్లో.19

**ఓ దేవా! ఆది మధ్యాంత రహితుడవై,** అపరిమిత పరాక్రమశాలివై, నిప్పు ముఖము నందు గల్గి ఈ యెల్ల లోకములను నీ కాంతిచే, దపింప జేయువాడవుగా నా కగ పడుచున్నావు అని అర్జునుడు పరమాత్మ కన్నులలో సూర్యచంద్రులను దర్శించియు న్నాడు.

బహుశా సూర్యదేవునికి పుట్టుక పర మాత్మలో లీనమైయున్నట్లు తెలియుచున్నది. అట్టి ఈ సూర్యుడే స్థావరజంగమ జగత్తునకు ఆత్మ (7-5) అని శుక్ల యజుస్సంహిత తెలపుచున్నది.

హవిర్భాగములను సురులకందకుండా నసురులే యపహరించు చుండిరి. అందు వలన దేవతలు భయభ్రాంతులైరి. దేవత లను రక్షించుటకై 'కశ్యపుని' ధర్మపత్నియగు 'అదితి' సూర్యునారాధించెను. సూర్యుడు ప్రత్యక్షముకాగా 'నీ యంశమున నాకు పుత్రు డుదయించి దేవతలను రక్షింపవలయున'ని యామె కోరెను. ఆ దివ్యకిరణ ప్రభావంతో 'సుషమ్న' అను రశ్మి అదితి గర్భమున ప్రవే శించి 'మార్తాండుడ'య్యెనని మార్కండేయ పురాణము దెల్పుచున్నది. ఒక్కమాటలో చెప్పవలయునన్న అదితికశ్యపుల కుమారుడే సూర్యభగవానుడు.

## సూర్యుని కుటుంబం : సంతతి

సూర్య కుటుంబమనగా గ్రహమండలము లేదా నక్షత్ర సముదాయముతో కూడిన సూర్యుడని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. కాని సూర్యుడు విష్ణు స్వరూపుడని ఆతని తేజము విష్ణు తేజమై ప్రజ్వరిల్లుచున్నదని పురాణ ములు ఘోషిల్లుచున్నవి. త్వష్ట్ర ప్రజాపతి సూర్యుని సానపట్టగా రాలిన పొడి శంకరు నకు త్రిశూలమును, విష్ణువునకు చక్రమును, కుమారస్వామికి శక్తియును మరియు అనేక దివిజులకు ఆయుధములుగా తయారయ్యె నని విష్ణుపురాణము (పు.79) తెలుపుచు న్నది. అట్టి సూర్యుడే విశ్వకర్మ కమార్తె యగు సంజ్ఞను వివాహమాడెను. సంజ్ఞా సూర్యుల రథమెక్కి మేరు పర్వతము చుట్టు తిరుగుచుండురు. సూర్యుని రథసారథి అనూరుడు. సప్త రథాశ్వరూఢుడగు సూర్యభ గవానుని యొద్ద హనుమంతుడు, యాజ్ఞవ ల్క్యుడు వేద శాస్త్రముల నభ్యసించిరి.

సూర్యునికి గల్గిన సంతతి ఈ క్రింది విధముగా జెప్పబడినది.

## శ్రాద్ధ దేవుడు

సూర్యునికి సంజ్ఞయందు జన్మించిన కుమారుడు శ్రాద్ధదేవుడు (వైవస్వతుడు) పుట్టి మనువయ్యెను.

## యముడు

సంజ్ఞ సూర్యప్రభావ తేజస్సును జూడ జాలక కన్నుల మూసి కొనుటచే సూర్యునికి కోపమువచ్చి "నీకు నఖిలజనైక సంయమ

---

## రెండు నిమిషాలు నాకు దానమివ్వండి

"మీరందరూ నావద్దకు అనేక కానుకలు తీసుకుని వస్తున్నారు. పుష్పఫలాదులు తెస్తున్నారు. ధనమిస్తున్నారు. వీటిని నేను కోరడం లేదు. దినానికి రెండు నిమిషాలు మాత్రం నా కివ్వండి. ఆ రెండు నిమిషాలు నిశ్చలమైన భక్తితో పరమేశ్వరుని ధ్యానించండి. అదే నాకు అత్యంత ప్రీతికరమైన కానుక. దినమంతా మీరు లౌకిక వ్యాపారాలతో గడుపుతారు. రెండు నిమిషాలు ఈ బీద సన్యాసికి దానమివ్వలేరా? నాకు కావలసినదంతే."

--కంచిపరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి

సేకరణ : శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారి "నడిచేదేవుడు" గ్రంథం నుండి.



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం
## తిరుచానూరు
### నిత్యపూజానివేదనలు

సుప్రభాతం: ఉ. 5-00 గం. నుండి 5-30 గం. వరకు
సహస్రనామార్చన: ఉ. 5-30 గం. నుండి 6-00 గం. వరకు
శుద్ధి, మొదటిగంట: ఉ. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: ఉ. 6-30 గం. నుండి 11-30 గం. వరకు
శుద్ధి, రెండవగంట: ఉ. 11-30 గం. నుండి 12-00 గం. వరకు
సర్వదర్శనం: మ. 12-00 గం. నుండి సా. 6-00 గం. వరకు
శుద్ధి, మూడవగంట: సా. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: సా. 6-30 గం. నుండి రాత్రి 8-45 గం. వరకు
శుద్ధి రాత్రి 8-45 గం. నుండి 9-00 గం. వరకు
ఏకాంతసేవ: రాత్రి 9-00 గం. నుండి 9-30 గం. వరకు

### శుక్రవారాలలో

అభిషేకం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(రూ. 100-00 టిక్కెట్‌తో ఒక్కరికి మాత్రమే ప్రవేశం)*
అభిషేక దర్శనం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(ఒక్కొక్కరికి రూ. 5-00 టిక్కెట్)*

### ఆర్జిత సేవలు

| | | |
|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం | ... | రూ. 63-00 |
| గజవాహనం | ... | రూ. 32-00 |
| తిరుప్పావడ | ... | రూ. 3000-00 |
| డోలోత్సవం | ... | రూ. 150-00 |

### ఆర్జిత ప్రసాదాలు

| | | |
|---|---|---|
| దోసె | ... | రూ. 100-00 |
| దధ్యోదనం | ... | రూ. 75-00 |
| పులిహోర | ... | రూ. 100-00 |
| పొంగలి | ... | రూ. 200-00 |
| చక్కెర పొంగలి | ... | రూ. 200-00 |
| కేసరి బాత్ | ... | రూ. 300-00 |
| శాకరిబాత్ | ... | రూ. 250-00 |
| సీరా | ... | రూ. 400-00 |

*శుక్రవారం గాక, భక్తాదులు రూ. 1-50 టిక్కెట్‌తో తమ గోత్ర, నామాదులతో అమ్మవారికి అష్టోత్తరశతనామ పూజ చేయించవచ్చును.*

నుడైన సుతుడు పుట్టునని భార్యతో" ననెను. అందువలన నామెకు యముడుద్భవించెను.

**యమునానది (స్త్రీ)**

సంజ్ఞ సూర్యుని ప్రేరణమున చంచలదృష్టితో జూచుటచే విలోలితయైన కుమార్తెను గన్నది. ఆమెయే యమున.

**శని, సావర్ణి, శమనుడు**

సంజ్ఞ సూర్యునికి భయపడి 'ఛాయ'ను వీని కడనుంచి ఉత్తర కురు దేశములకేగి బడబ రూపముగ నుండెను. సూర్యునికీ విషయము దెలియక ఛాయను మోహించెను. సూర్యుని అంశలో ఛాయకు శని, సావర్ణి, శమనుడను పుత్రులు కల్గిరి.

**తపతి (స్త్రీ)**

ఛాయకు సూర్యునివలన జన్మించిన పుత్రి.

**సుగ్రీవుడు**

ఒకనాటి మలిసంధ్యా సమయమున సూర్యుడు వచ్చుచున్న మార్గమునందొక స్త్రీ రూపమున నున్న 'ఋక్షవిరజు'ని జూచెను. చూచిన తోడనే ఇతనికి చిత్త చాంచల్యతచే రేతః పతనమయ్యెను. అది ఆ స్త్రీ కంఠమున బడి సుగ్రీవుడదయించెను.

**కర్ణుడు**

దుర్వాస మహర్షి మంత్ర బలముచే కన్యకయగు కుంతి సూర్యుని ప్రార్థించి సద్యోగర్భమున గవచ కుండలములతో 'కర్ణుని'కి జన్మనిచ్చి కన్యాత్వ దూషితము కాని వరమును బొందెను.

-- మహాభారతం -- కర్ణపర్వ ఆ.5

**అశ్వినులు**

యముడు తన సవతి తల్లి యగు ఛాయ తనను సరిగా ఆదరించుట లేదని తండ్రియగు సూర్యునితో దెల్పెను. సూర్యుడు ఛాయను జేరి యామె వృత్తాంతమును గైకొని సంజ్ఞ బడబ రూపమున నుండుట ఎరిగి తానును అశ్వరూపముదాల్చి యామె కడకేగెను. సంజ్ఞ

(33వ పేజీలో)

# ఆదివార వ్రత మహత్వం

శ్రీ కావలిపాటి సూర్యప్రకాశరావు



సూర్యుడు సమస్త ప్రాణికోటికి - చెట్లకు ప్రాణదాత అన్న సంగతి అందరికీ తెలిసిందే కదా! భూగోళానికి అనేక లక్షల మైళ్ల దూరంవున్నా తన కిరణ ప్రసారముచే శక్తిని అందిస్తున్నాడు. ఇవన్నీ విజ్ఞానశాస్త్రం ఋజువు చేసినవే.

ఎక్కువగా మంచుకురిసే దేశాల్లో - సూర్యుడు కనబడిన రోజున పండుగ చేసుకుంటారు. సూర్య నమస్కారాలు చేస్తూ ఆరాధించిన సాంబుడనే కవికి కుష్ఠురోగ వ్యాధి నివారణమైంది అని చరిత్ర చెబుతుంది. పురాణాల్లో - 'ఆదిత్య హృదయం' అనే స్తోత్రాన్ని బ్రహ్మాస్త్రానికి జోడించి ప్రయోగిస్తేనేగాని రావణాసురుదు చావలేదు. ప్రపంచంలో అన్నిచోట్లా ప్రజలు ఏదోరకంగా సూర్యుడ్ని ఆరాధిస్తూనే వున్నారు అన్ని యుగాల్లో. అంతెందుకు - మనిషికి సంతోషం వస్తే 'అహో!' అంటాడు. అహ అంటే సూర్యుడనే అర్థం వుంది. అహః స్కర - భాస్కరా. సూర్యుని అనుగ్రహం వల్లనే శమంతకమణి ప్రతిరోజూ బారెడు బంగారాన్ని ఇచ్చేది.

వీటిని బట్టి చూస్తుంటే ఆరోగ్యానికి, ఐశ్వర్యానికి, శత్రు నాశనానికి సూర్యుని శక్తి అనుగ్రహం అవసరమని తేలుతోంది.

పూర్వం ఒక పెద్దావిడ ప్రతి ఆదివారం పొద్దుటే లేచి స్నానం చేసి శుచిగా తయారై - తన ఇంటికి పక్క ఇంటి నుండి తెచ్చిన ఆవుపేడతో అలికి సూర్యుణ్ణి - భగవంతుణ్ణి పూజించి - వంటచేసి వారికి నైవేద్యము పెట్టి తర్వాత తాను తినేది. ఇలా ఆవిడ చేస్తూండడంవల్ల ఆ ఇంట్లో అందరూ సుఖంగా, సంతోషంగా వుంటున్నారు.

ఇదంతా పక్క ఇంటి ముసలమ్మ గమనిస్తూ వుండేది. నెమ్మదిగా అసూయ ఆమెను ఆవేశించింది. "నా ఆవుపేడ కదా ఈ భాగ్యానికి కారణం - అది అందకుండా చేస్తే నా కళ్లు చల్లబడతాయి" అని ఆలోచించి తన ఆవును ఇంట్లో కట్టేసుకుంది.

భక్తురాలైన పెద్ద ఆవిడ మామూలుగా గోమయం కోసం చూస్తే - ఆవు దొడ్లో లేదు. పొద్దుటే పక్కవాళ్లని లేపడం దేనికి అని ఆవేళ ఇల్లు అలకలేదు. అలకని ఇంట్లో వంట చెయ్యడం ఇష్టంలేక ఆవేళ దేముళ్లకు నైవేద్యం లేదు. ఆవిడ భోజనం చెయ్యలేదు. నీరసం వచ్చి పడుకుంది. ఆమె నిష్ఠకి, అచంచలమైన భక్తికి ఆ రాత్రి నిద్రలో భగవంతుడు ఆమెకు కనపడి 'ఏం అవ్వా! వంట ఎందుకు చెయ్యలేదు! నాకు నైవేద్యం నాగా పడిపోయిందే?' అని అడిగాడు. 'ప్రభూ! గోమయం దొరక్క ఇల్లు అలకలేదు. పరిశుభ్రం లేని చోట వంట చెయ్యడం మంచిదికాదు. ఆ కారణంచేత పొయ్యి అంటించలేదు. ఇంక ఏదైనా నైవేద్యం పెడదామంటే నా దగ్గర ఇంకేమీ లేవు. మన్నించండి దేవరా!' అని దీనంగా తన బాధను వెల్లడించింది.

"ఈ రోజుకి ఫర్వాలేదు - మరి రేపు!" అని భగవంతుడు అడగగా-- "రేపు ఇంతే!" స్వామి అని అవ్వ చెప్పగా "సరే నీ పట్టుదలకు ప్రశంసనీయము. మహా మహా వేదాంతులు ఆచరణలో పెట్టలేనివి క్రియా రూపకంగా చేసి చూపించావు. కనుక నీకు ఒక గోవును బహూకరిస్తున్నాను. వెళ్లి నీ దొడ్లో చూసుకో!" అని అనంతుడు అంతర్ధానమైనాడు.

సంతోషం ఉండబట్టలేక ఆమె అప్పుడే లేచి వెళ్లి పెరటి ఆవరణలో పరికించింది.

# స్వకర్మానుష్ఠానం

స్వకర్మానుష్ఠానానికి మించిన ఈశ్వరపూజా, ఈశ్వరారాధనమూ లేదు. ఎవరి వంతుకు వచ్చిన కర్మలను వారనుష్ఠిస్తూ తద్ద్వారా ఈశ్వరార్చన పరులై శ్రేయం సంపాదించుకొనాలి.

తనను ఉద్ధరించుకున్న వాడే ఎదుటివారిని ఉద్ధరించగలడు.

దుస్సాంగత్యమనే వ్యాధికి చికిత్స సత్సాంగత్యం.

ప్రతికర్మకూ ప్రత్యేకమైన కాలమూ, మంత్రమూ, దేవతా, ద్రవ్యమూ ఉన్నాయి. అన్నిటికీ పరమతాత్పర్యం పరమేశ్వరార్పణం.

--కంచిపరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి

సేకరణ : శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారి "నడిచేదేవుడు" గ్రంథం నుండి.

ఆశ్చర్యం! కామధేనువులా ఒక ఆవు, అందమైన దూడతో సహా కనబడ్డాయి. దణ్ణం పెట్టి వాటిని కట్టేసి మేత, నీరు సదుపాయములు చేసింది.

ఇంకా విచిత్రం. దాని గోమయం బంగారపు ముద్ద. ఈ వింత ఆ పెద్దావిడ గమనించలేదు చీకట్లో.

ఇదంతా పక్కన ఉన్న చుప్పనాతి పెద్దమ్మ కనిపెడుతోంది. ఆమె ఈర్ష్యతో ఉడికిపోయి వెళ్లి గుట్టుచప్పుడు కాకుండా ఆ గోమయాన్ని ఎత్తుకుపోయి - ఆ స్థానంలో తన ఆవుపేడని వుంచి చక్కా పోయింది.

పాపం! ఆ అమాయికపు ఆవిణ్ణి ఇలా మోసం చేసింది. అయితే కర్మసాక్షి కళ్లు కప్పగలదా! ఆ సాయంత్రం తుఫాను సృష్టించాడు. భక్తురాలు ఆవుని ఇంట్లో కట్టేసుకుంది. ఉదయమే లేచి చూసేసరికి ఆవు వెనుక బంగారపు ముద్ద కనబడింది పేడ బదులు. ఆమె ఆనందానికి అవధులు లేవు. ఇలాంటి ఆవును దొడ్లో కట్టకూడదు అని ఆరోజునుంచి ఇంట్లోనే కట్టేసుకుంటోంది.

పక్కన ఉన్న టక్కరి పెద్దమ్మ ఆటకట్టింది. అసూయ తలకెక్కింది. "తనకు లేకపోతే మానె, - పక్క వాళ్లు ఎందుకు బాగుపడాలి?"

ఆ దేశపు రాజుగారి దగ్గరకెళ్లి - శూర్పణఖలా ఆ ఆవు గురించి-- "రాజా! ఇలాంటి ఆవు మీ ఆస్థానంలో వుంటే ఆ ధనంతో ప్రజలకు ఉపయోగపడే పనులు చేయించవచ్చును. ఆ పిచ్చి పెద్దమ్మ రోజూ వచ్చే బంగారాన్ని ఏం చేసుకుంటుంది దాచుకోవడం తప్ప!" అని విషపు ఆలోచన ఎక్కించింది. బంగారం అంటె ఎవరికి ఆశ పుట్టదు! వెంటనే ఆ రాజు నౌకర్లని పంపి ఆ ఆవుని దూడతో సహా తోలుకురావల్సిందిగా ఆజ్ఞాపించాడు.

రాజు తలచుకుంటే అడ్డేముంది? బంగారం మీద భ్రమకొద్ది రాజుగారు ఆవును తన పడకగది పక్కనే కట్టేయించుకున్నాడు. రాత్రి సరిగ్గా నిద్ర పట్టలేదు అయ్యగార్కి. తెల్లవారుతుండనగా లేచి ఆవుదగ్గర కెళ్ళి చూసాడు.

మామూలు పేడ, మురికి కంపుతో ఆ స్థలం అసహ్యంగా కనపడింది. రాజుగారు కోపంతో చిత్తగించారు. వెంటనే ఆ గోవును పెంచుతున్న పెద్దావిణ్ణి పిలుచుకు రమ్మని భటుల్ని పంపాడు. ఆవిడ వచ్చి నమస్కరించింది.

నీ పక్కన వుండే ముసలమ్మ మాటలు నమ్మి నీ ఆవుని తెప్పించాను. నిన్ను అడగకుండా చేసిన పనికి మన్నించు. పొరపాటు నాదా? మాయ మాటలు చెప్పిన ముసలమ్మదా? నిజం చెప్పు? అని గౌరవంగా అడిగాడు.

జరిగినది జరిగినట్లుగా నిజం చెప్పింది. గత ఆదివారం రాత్రి భగవంతుడు తనకు కలలో కనపడి "శ్రద్ధగా ఆదివారపు వ్రతము జేసినవార్కి ఆరోగ్యము, ఐశ్వర్యము, శత్రు విజయము చేకూరుతాయి. అంత్యమందు శివ సాయుజ్యము లభిస్తుంది అని శలవిచ్చాడు" రాజా!

అంతా విన్న రాజుగార్కి ఆమెయందు గౌరవం పెరిగింది.

"నీ తిండికి, ఆవుల మేతకి లోటు లేకుండా జరగడానికి ఐదు ఎకరాల వరి పొలం నీకు దానం ఇస్తున్నాను" అని చెప్పి మంత్రికి ఆజ్ఞ జారీ చేసాడు అది వెంటనే అమలుపర్చమని.

పక్క పెద్దమ్మని పిలిపించి సంజాయిషీ అడిగాడు. ఆమె మాటలు రాక రాజుగారి కాళ్లమీద పడింది. ఈ నీ పొరుగు పిశాచికి తగిన శిక్ష విధిస్తాను. మవ్వేమంటావు తల్లీ! అని అడిగాడు అసలు అవ్వని. "వద్దు ప్రభూ! అపకారికి ఉపకారము చెయ్యమని పెద్దల మాట! కనుక ఆమె బ్రతికి వున్నంతకాలమూ నా గోవుకు సేవ చెయ్యమనండి. అది ఆమె ఇహ పరాలకు మేలు చేస్తుంది" అని చెప్పింది.

రాజుగారు ఆమె ఔదార్యానికి మెచ్చుకొని పొరుగు ఆమెతో "నిన్ను దయ తలచింది. కాని నువ్వు ఇక పొరపాటు చేస్తే మాత్రం నేను దయ తల్చను. పుర్రె ఎగిరి పోతుంది. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

అప్పటినుంచి ఆయన ప్రతి ఆదివారం శ్రద్ధగా ఆదివారపు వ్రతం తాను చెయ్యటమే కాకుండా ప్రజలు వినేలా దండోరా వేయించాడు. ఇలా "ఆదివారపు వ్రతం చేసుకోండి. ఫలితము ప్రత్యక్షంగా కనబడుతుంది. దాని వల్ల ఇహమందు సర్వ సౌఖ్యాలు, ఆరోగ్యం, సంపదలు కలుగుతాయి. పరమందు మోక్ష ప్రాప్తి. ఇది నా సూచన."

మంచి సలహా ప్రజలు ఎప్పుడూ వింటారు.






దేవతలకు రాజు దేవేంద్రుడు. ఆయన రథాన్ని తోలే వ్యక్తి పేరు మాతలి. అతని కూమార్తె గుణకేశి అందాలరాశి. మాతలి ఆమెకు అనురూపుడైన వరునికోసం అన్వేషిస్తూ సుముఖుడనే పేరుగల నాగరాజ కుమారుడు తన కూతురికి అన్నివిధాలా తగిన వరుడని నిశ్చయించాడు. ఆ సుముఖుడు ఆర్యకుడనే నాగరాజుకు మనుమడు. మాతలి ఆర్యకుణ్ణి దర్శించి తన అభిప్రాయాన్ని వెల్లడించాడు. అతని కోరికను అంగీకరించలేక నాగరాజు "మాతలీ! ఈ సుముఖుని తండ్రి అయిన చికురుణ్ణి గరుత్మంతుడు చంపాడు. అంతేగాక ఒక నెల దినాల్లోగా ఈతణ్ణి కూడ సంహరిస్తానని చెప్పి వెళ్లాడు. గరుత్మంతునిచేత వీనికి ఎలాగూ చావు తప్పదు. కాబట్టి అల్పాయుష్కుడైన నా ఈ మనుమణ్ణి అల్లునిగా చేసికొంటే నీకూతురికి వైధవ్యమూ, మనకు మనోవేదనా తప్ప ఒరిగేదేముంది" అని విన్నవించాడు. ఆ మాటలకు మాతలి నిరుత్సాహపడకుండా ఆర్యకునితో ఇలా అన్నాడు. "నాగరాజా! నేను దేవేంద్రుణ్ణి ప్రార్థించి ఆయన దయతో ఈ సుముఖునికి దీర్ఘాయువును ఇప్పిస్తా. ఆ తర్వాతనే వివాహం చేద్దాము. అధైర్యపడవద్దు."

ఈ విధంగా ఆర్యకునికి ధైర్యం చెప్పి సుముఖుణ్ణి వెంటబెట్టుకొని ఇంద్రుని దగ్గరికి వెళ్లాడు. మాతలి అదృష్టవశంతో ఆ సమయంలో దేవేంద్రుడు - శ్రీ మహావిష్ణువు ఒకేచోట ఇష్టాగోష్ఠితో వినోదిస్తూ వున్నారు. మాతలి వారికి నమస్కారం చేసి "మహాత్ములారా! నా కూతురైన గుణకేశినికి నాగరాజ కుమారుడైన ఈ సుముఖుణ్ణి వరుడుగా నిశ్చయించాను. దురదృష్టవశాత్తూ ఇతణ్ణి ఒకనెలలోగా చంపుతానని వైనతేయుడు నిశ్చయించాడట. మీరు దయతో ఇతనికి సంపూర్ణాయుష్షును ప్రసాదించి రక్షించాలని ప్రార్థిస్తున్నాను" అని మనవి చేశాడు. విష్ణుదేవుని అనుమతి తీసుకొని దేవేంద్రుడు మాతలి కోరికను మన్నించి సుముఖునికి దీర్ఘాయువును దయచేశాడు. అందుకు మాతలి ఎంతో సంతోషించి గుణకేశినికి - సుముఖునికి అత్యంత వైభవంగా వివాహం జరిపించాడు.




గరుత్మంతుడు ఈ సమాచారమంతా విన్నాడు. అతనికి పట్టరాని కోపం కట్టలు తెంచుకొనింది. సరాసరిగా దేవేంద్రుని దగ్గరకు వచ్చి విష్ణుదేవుని సమక్షంలోనే తీవ్రస్వరంతో "దేవేంద్రా! అదితి కుమారుడవు నీవైతే వినత కుమారుణ్ణి నేను. మనం ఇద్దరమూ కశ్యపుని బిడ్డలమే. మనమిద్దరమూ రాక్షసుల్ని

చదవండి! చదివించండి!!

# సప్తగిరి

## చందాదారులకు మనవి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్యాత్మిక సచిత్ర మాస పత్రిక 'సప్తగిరి'. తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఆంగ్లం మున్నగు ఐదు భాషల్లో విడి విడిగా నెల నెలా వెలువడుతున్న పత్రిక 'సప్తగిరి'. ఆధ్యాత్మిక వ్యాసాలు - పండుగలు - పిల్లల కథలు - వేంకటేశ్వర లీలలు - మన దేవాలయాలు ఇలా ఎన్నో విషయాలతో, విశేషాలతో మీ ముందుకు వస్తున్న పత్రిక 'సప్తగిరి.'

**మీరు 'సప్తగిరి' పత్రిక క్రొత్త చందాదారునిగా నమోదు చేయించుకోదలచారా?**

అయితే క్రింది సూచనలను జాగ్రత్తగా గమనించండి.

1. సంవత్సర చందా రు. 24-00లు మాత్రమే. ఈ చందాను ఎన్ని ఏండ్లకైనా ముందుగనే కట్టవచ్చును.
2. తమ చందా మొత్తాన్ని "ఎడిటరు, సప్తగిరి, తి.తి. దేవస్థానములు, తిరుపతి" వారి పేర మనియార్డరు గానీ, డిమాండు డ్రాఫ్టుగానీ, పోస్టలు ఆర్డరు గానీ పంపవచ్చును. (చెక్కులు అంగీకరింపబడవు).
3. మీకు ఏ భాషా సప్తగిరి కావలెనో స్పష్టంగా రాయండి.
4. మీ పూర్తి చిరునామాను విడి విడి అక్షరాలలో స్పష్టంగా రాయండి.
5. చందా పంపిన మరుసటి నెలనుండి మీకు సప్తగిరి పంపబడుతుంది.
6. చందా మొత్తాన్ని పంపిన 30 రోజులలోగా మీకు సప్తగిరి రానిచో, ఎం.ఓ. రసీదు నంబరు లేదా డి.డి. నంబరు, పంపిన తేదీ వగైరా వివరాలతో, మీ పూర్తి చిరునామాతో స్పష్టంగా రాయండి.

**మీరు ఇంతకు ముందే చందాదారులా? అయితే క్రింది సూచనలను గమనించండి.**

1. మీ చందా ముగియుటకు ఒక నెల ముందుగానే సప్తగిరి పత్రికలో తెలియజేస్తున్నాం.
2. మీ చందా ముగిసిపోయే నెలకు - ఒక నెల ముందుగనే చందా మొత్తాన్ని పంపి మీ చందాను పునరుద్ధరించుకోండి.
3. మీ చిరునామాలో మార్పుగాని, మీరు చందా పంపటంగాని చేసేటప్పుడు, మీ చందా నంబరుతో కూడ పూర్తి చిరునామాను తెలపండి.

చంపుతున్నాము. నీవు నాకంటే ఏ విధంగా గొప్పవాడవో చెప్పు. నేను ఈ సుముఖుణ్ణి చంపాలని వుంటే నీవు వానికి దీర్ఘాయుష్షును ప్రసాదించి నాకు అడ్డుపడవచ్చునా?" అని గద్దించి ప్రశ్నించాడు. అందుకు ఇంద్రుడు "గరుత్మంతా! సుముఖునికి ఆయువును ప్రసాధించడంలో నా పాత్రేకాదు విష్ణుదేవుని ప్రమేయం కూడ వుంది. ఈ విషయంలో నామీద కోపపడవద్దు" అని వివరించాడు. ఆ మాటలకు గరుత్మంతుడు చాల బాధపడి "నీవూ, విష్ణువూ ఇద్దరూ కూడ నా గొప్పతనాన్ని గుర్తించలేక నన్ను అల్పుడుగా లెక్కకట్టారు. నేను తలచుకొంటే నా ఒక్క ఈకచేతనే సమస్త దేవతల్నీ భరింపగలను. నా సామర్థ్యాన్ని లక్ష్యపెట్టక నన్ను ఈ విధంగా అవమానించావు" అంటూ కళ్లల్లో నిప్పులు కురిపించాడు.

గరుత్మంతుని మాటలకు విష్ణుమూర్తి చాల కోపగించుకొని నవ్వుతూ "మూర్ఖుడా! నీవు నీ బలంతో నన్ను మోస్తున్నానని అంటున్నావు. కానీ నేనే నిన్ను నడుపుతూ వున్నాను. ఈ సత్యాన్ని గుర్తించకుండా గర్వంతో ఎగిరెగిరి పడుతున్నావు. ఇంత పొగరు పనికిరాదు" అని అంటూ విష్ణుదేవుడు తన చేతిని గరుత్మంతుని వీపు మీద మోపాదు అంతే. ఆ భారాన్ని మోయలేక రెక్కలు టప టప కొట్టుకుంటూ, ముక్కుపుటాలు తెరుస్తూ క్రిందపడి పెద్దగా అరచాడు. గరుత్మంతుని దైన్యావస్థను చూచి విష్ణువు దయతో అతణ్ణి లేవనెత్తి, భయాన్ని పోగొట్టి ఓదారుస్తూ "గరుత్మంతా! అహంకారమూ, పొగరుబోతు తనమూ, ఎంతటి గొప్ప వాడికైనా పనికిరావు. ఇకమీద బుద్ధి కలిగి బ్రతుకు"-- అని హెచ్చరించి పంపాదు.

కాబట్టి "పిల్లలూ! ఈ కథ ద్వారా మనం నేర్చుకొనవలసిన నీతి ఏమంటే అహంకారం ఎంతవారికైనా అనర్థాన్ని కలిగిస్తుందనే కదూ!"



# ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్

శ్రీ సూరుమంచి సాంబశివశర్మ

మానవునకు ఎంత ఐశ్వర్యమున్నను ఆరోగ్యములేనిదే సుఖశాంతులు లభించవు. శాంతి లభించుటకు ఆరోగ్యము ముఖ్యము. పూర్వ జన్మములందు చేసిన దుష్కృతములు వ్యాధులరూపమున బాధించుననియు, అట్టి వ్యాధులు నివారించుటకు సూర్యుని ఉపాసించవలెనని శాస్త్రములు చెప్పుచున్నవి.

పూర్వజన్మకృతం పాపం
వ్యాధిరూపేణ బాధతే,
తచ్ఛాంతి రౌషధైర్దానై
ర్జపహోమ సురార్చనైః.

పూర్వజన్మలలో తానొనరించిన దుష్కృతములు వ్యాధుల రూపమున బాధించును. అట్టి దుష్కృతములు నశించి ఆయురారోగ్య భాగ్యములు లభించుటకు, ఔషధములు సేవించుట, దానము, జపము, హోమము, దేవతా పూజలాచరించి నలుబదిరోజులు అరుణములో చెప్పబడిన ప్రకారము సూర్యారాధన చేయవలెను.

సూర్యభగవానుడు కంటికి కనిపించు ప్రత్యక్షదైవము. భగవంతుడు సృష్టిని ప్రారంభించుచు ఈ సూర్యుని మొదట సృజించెనని యజుర్వేదము ఆరణ్యకములో చెప్పబడినది.

అంజలినా పురస్తా దుపాదధాత్
ఏవాహ్యేవేతి ఆదిత్య ఉపతిష్ఠత్
సా ప్రాచీదిక్ అథారుణః
కేతుర్దక్షిణత ఉపాదధాత్
ఏవాహ్యేవేతి తతోవా అగ్నిరుదతిష్ఠత్
సా దక్షిణా దిక్.

అని భగవంతునిచేత సూర్యుడు మొదట సృజింపబడెను. అందుచేతనే మన పూర్వులు "గ్రహాణామాదిరాదిత్యః" అని పలికిరి. గ్రహములలో మొదటి గ్రహము సూర్యగ్రహము. పూర్వులు "ఆదిదేవ నమస్కారః" అనిరి. ఓ సూర్యభగవానుడా నీవు ఆది దేవుడవు. నీకు నమస్కారము. నీవు మా ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతిక తాపత్రయములను పోగొట్టి మమ్ములను కాపాదుమని ప్రార్థింతురు. ఈ సూర్యుడు--

ఉదయం బ్రహ్మ స్వరూపం
మధ్యాహ్నే తు మహేశ్వరః,



అస్తమానే స్వయం విష్ణుః
త్రయీమూర్తిర్ దివాకరః.

కర్మ సాక్షి యైన సూర్యుడు ఉదయం బ్రహ్మ స్వరూపునిగాను, మధ్యాహ్నం మహేశ్వర స్వరూపునిగాను, సాయం సమయమున విష్ణు స్వరూపునిగాను మన పూర్వులు వర్ణించిరి. ఈ సూర్యునికి పన్నెండు నామములు కలవు. ఈ నామములను ప్రతివారు పఠించి సూర్య నమస్కారములు చేయుట ఆచారములో నున్నది.

ఓం మిత్రాయ నమః
ఓం రవయే నమః
ఓం సూర్యాయ నమః
ఓం భానవే నమః
ఓం ఖగాయ నమః
ఓం పూష్ణే నమః
ఓం హిరణ్యగర్భాయ నమః
ఓం మరీచయే నమః
ఓం ఆదిత్యాయ నమః
ఓం సవిత్రే నమః
ఓం అర్కాయ నమః
ఓం భాస్కరాయ నమః.

దీర్ఘవ్యాధులచేత బాధలనుభవించువారు సూర్య నమస్కారములు చేసినను, అశక్తులు సూర్య నమస్కారములు చేయించుకొన్నను వ్యాధి నివారణయై ఆయురారోగ్య భాగ్యములు లభించును. సూర్యారాధనచేసి ధర్మ

రాజు అక్షయపాత్రను పొందెను.. సత్రాజిత్తను రాజు సూర్యుని తపముచే మెప్పించి శమంతకమణిని పొందెను.

సూర్యుని అనుగ్రహమును పొంది ఆంజనేయుడు వ్యాకరణమును నేర్చుకొనెను. శ్రీరాముడు, రావణుని సంహరింపబోవుటకు ముందుగా, అగస్త్యమహర్షివలన ఆదిత్య హృదయమును ఉపదేశముపొంది, మూడు మారులు పఠించి సూర్యానుగ్రహమును పొంది రావణుని సంహరించెను. కుంతి, సూర్యుని ఉపాసించి, సహజ కవచ కుండలశోభితుడగు కుమారుని పొందెను. ఈవిధముగా ఎందరో సూర్యదేవునారాధించి వారి వారి అభీష్టములను నెరవేర్చుకొనిరి. సూర్యుని ఆరాధించుటవలన ఆత్మశక్తి పెరుగును. "ఆత్మప్రభావశక్తిశ్చ పితృచింతా రవేః ఫలమ్" -- ఆత్మకారకుడు సూర్యుడు. ఆత్మశక్తిని పెంపొందింపజేయువాడు సూర్యుడు, పితృకారకుడు సూర్యుడు. సూర్యారాధనవలన ఆత్మ జన్యదోషములు నశించి అజ్ఞానము తొలగి జ్ఞానము కలుగను. సూర్యోపాసనచేత ఈ క్రింది దీర్ఘవ్యాధుల నివారణయగునని మహాసౌరములో చెప్పబడినది.

కుష్ఠు, అపస్మారము, హృదయరోగ బాధ, ఉదరము, గుల్మము, భూర్గుతార్షము, రక్తరోగము, జలోదరము, భగంధరము, పాండురోగము, కాస, శ్వాస, స్ఫోటకము, అజీర్ణము, శిరోరోగము, ప్రమేహము మొదలగు రోగములు నశించి దీర్ఘాయుర్దాయము కలుగును. గుండెనొప్పితో బాధపడువారు ఈక్రింది సూక్తమును పఠించినచో హృదయవ్యాధి నివారణయగునని కర్మవిపాకము చెప్పుచున్నది.

పరహృదయ పీడాకరో
హృద్రోగే చ జాయతే.

ఇతరుల మనస్సునకు బాధ కలిగించువారికి హృదయవ్యాధి కలుగును. ఆ వ్యాధి నివారణకు "ఉద్యన్నద్యేతి" సూక్తమును పఠించవలెను.

**సూక్తము**

ఉద్యన్నద్య మిత్ర మహః
ఆరోహన్నుత్తరాం దివం
హృద్రోగం మమ సూర్య
హరిమాణం చ నాశయ
శుకేషు మే హరిమాణం
రోపణాకాసు దధ్మసి
అథో హారిద్రి వేషు మే
హరిమాణం నిదధ్మసి
ఉదగా దయ మాదిత్యో
విశ్వేన సహసా సహ
ద్విషంతం మహ్యం రంధ
యన్మో అహం ద్విషతే రథం.

ఈ సూక్తమును పఠించి ఆదివారము గోధుమలు, ఎర్రని వస్త్రము, ఎర్రని ఫలము తాంబూల దక్షిణ, రాగిపాత్ర, సూర్యుని ప్రీతికి దానము చేయవలెను. సూర్యజపముచేసి సూర్య మంత్రమును అర్చించవలెను. సూర్య అష్టోత్తర శతనామములతో ఎర్రని పుష్పములతో సూర్యుని పూజించవలెను. సూర్యునికి ప్రీతియైన గోధుమ క్షీరాన్నము, అరటిపండ్లు, ఆవుపాలు నివేదన చేయవలెను. సూర్యమంత్రముచేత తెల్ల జిల్లేడు సమిధల చేత సమస్తవ్యాధులు నివారించుటకు ఆవు నెయ్యితో హోమము చేయవలెను. సూర్యుని ద్వాదశ నామములతో పన్రెండుసార్లు సాష్టాంగ నమస్కారములు చేయవలెను. "నమస్కార ప్రియో భానుః" శీఘ్రముగా వ్యాధులు నివారణమగుటకు నలుబది రోజులు లేక ఇరువది రోజులు శక్తిలేని వారు పన్రెండు రోజులు మహాసౌరము, త్రిచ, అరుణములతో సూర్య నమస్కారములను చేయించి తీర్థము స్వీకరించవలెను.

మాఘశుద్ధ సప్తమి రథ సప్తమి. సూర్యునికి ప్రీతియైన దినము. ఈ రోజు తెల్ల జిల్లేడు ఆకులు హృదయము, భుజములు శిరస్సు, మెడయందు ధరించి రక్త చందనము అరగదీసి ఆ గంధమును రాగిపాత్రలో నుంచి జలమును పోసి ఆ నీటితో స్నానమాచరించి త్రిమూర్త్యాత్మక స్వరూపుడైన భాస్కరుని ఎర్రని పుష్పములతో అర్చించి ఆవుపాలతో తయారుచేసిన క్షీరాన్నమును నివేదన చేయవలెను. సూర్యదేవుని సంవత్సరము ఉపాశించవలెనని యజుర్వేదము తెలుపుచున్నది.

"సంవత్సర మేత ద్వ్రతం చరేత్
దౌవా మాసౌ నియమస్సమాసేన
తస్మి న్నియమవిశేషాః
బ్రహ్మచర్యేణ తపసైవ దేవాః".

అను వేదప్రమాణము ననుసరించి, నియమము కలవారై, సంవత్సరము సూర్యుని ఉపాసించిన, భాస్కరుడు సమస్తవ్యాధులను నశింపజేసి, ఆరోగ్యమును అనుగ్రహించును. ఇదివరలో చెప్పిన సూర్యుని ద్వాదశ నామములతో నమస్కారములను చేసికొనవచ్చును.

ఈ చెప్పబోవు మంత్రములతో కూడ సూర్య నమస్కారము లాచరించవచ్చును.

ఓం భూర్భువః స్వః
ఓం హ్రాం ఉద్యన్నద్యమిత్రమహః
హ్రాం ఓం మిత్రాయ నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రీం ఆరోహన్నుత్తరాం దివం
హ్రీం ఓం రవయే నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువవః స్వః
ఓం హ్రైం హరిమాణంచనాశయ
హ్రైం ఓం భానవే నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రౌం శుకేషు మే హరిమాణం
హ్రౌం ఓం ఖగాయ నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రః రోపణాకాసు దధ్మసి
హ్రః ఓం పూష్ణే నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రాం అథో హారిద్రవేషు మే
హ్రాం ఓం హిరణ్యగర్భాయ నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రీం హరిమాణం నిదధ్మసి
హ్రీం ఓం మరీచయే నమః
నమస్కారం సమర్పయామి
ఓం హ్రూం ఉదగాదయమాదిత్యః
హ్రూం ఓం ఆదిత్యాయ నమః

నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రైం విశ్వేన సహసా సహ
హ్రైం ఓం సవిత్రే నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రైం విశ్వేన సహసా సహ
హ్రైం ఓం సవిత్రే నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రౌం ద్విషంతం మహ్యం రంథయన్
హ్రౌం ఓం అర్కాయ నమః
నమస్కారం సమర్పయామి
ఓం భూర్భువః స్వః
ఓం హ్రః మో అహం ద్విషతే రథం
హ్రః ఓం భాస్కరాయ నమః
నమస్కారం సమర్పయామి.

ఈవిధముగా సూర్యునకు సాష్టాంగ నమస్కారములు చేసిన భగవదనుగ్రహము కలుగును.

రక్తాంబరం రక్తవర్ణం
రక్తనేత్రాబ్జ యుగ్మకమ్,
ఛాయాశక్తి సహాయుక్తం
ఘృణి స్సూర్యమహం భజే.

వినతాతనయో దేవః
కర్మసాక్షి సురేశ్వరః
సప్తాశ్వ సప్తరజ్జుశ్చ
అరుణోమాం ప్రసీదతు

ఉదయగిరి ముపేతం
భాస్కరం పద్మహస్తమ్,
సకల భువన నేత్రం
నూత్న రత్నోపధేయమ్.

తిమిరకరి మృగేంద్రం
బోధకం పద్మినీనామ్,
సురవర మభివంద్యం
సుందరం విశ్వరూపమ్.

ఈ విధముగా హరిహర బ్రహ్మాత్మక స్వరూపుడగు సంజ్ఞాఛాయోషాసమేత శ్రీసూర్యనారాయణుని అనన్యభక్తితో నారాధించి సమస్త వ్యాధులు నశింపచేసికొని, ఐహికాముష్మిక సుఖములను పొందవచ్చును. అందువల్లే మన పూర్వులు "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అనిరి. ★

# శ్రీ వేంకటేశ్వర నుతి

"జీవి"



దండమయా దయామయా
ఏడుకొండలవేంకయా
ఎపుడు నిన్ను గొలుతునయా
నన్ను కరుణ నేలుమయా.

కండ బలము లేదయా
కొండ లెక్క లేనయా
రద్ది మెండుగ నుండెనయా
బస్సు లెక్క లేనయా.

ఆలు బిడ్డ లుండిరయా
వారి నెట్లు తెత్తునయా
దయను జూపి యేలు మయా
దరిని జేర్చు కోవయా.

శక్తి యుడిగి పోయెనయా
ఆశ నిలిచి యుండెనయా
భక్తి తరుగు చుండెనయా
ముక్తి గోరు చుంటినయా.

కోర్కె లేమి యెక్కువయా
ముదుపులేమి తక్కువయా
మ్రొక్కు కొనుచు నుందునయా
చిక్కుల నన్ను బెట్టకయా.

ఆపదలను భక్తులుండ
ఆదు కొనగ రావయా
వడ్డి తోడ ముడుపు గొనుచు
భక్తి తతుల బ్రోవుమయా.

నీవు ధనము నిచ్చితివయా
బదులు గుడులు వెలసె నయా
పెక్కు కళల నభ్యసించి
పెక్కురు యశము నందిరయా.

తండ్రి యొక్క చోట నయా
తల్లి మరొక చోట నయా
బిడ్డ లెటుల జూతురయా
భక్త తతికిది పరీక్షయా.

అల్ప జ్ఞానుడగుటయా
తోచి నటుల కోరితయా
దాసుల దోస మంతయును
దండమిడగ జెల్లునయా.



మేషరాశి
*(అశ్వని, భరణి, కృత్తిక-1)*
*(ఏప్రిల్ 14 - మే 15 తేదీల మధ్య జన్మించినవారు)*

ఈ సంవత్సరం ఈ రాశివారికి ఆరంభంలో అంతా అనుకూలంగా కనిపిస్తుంది. వృత్తి వ్యాపారాలు సాఫీగా నడుస్తాయి. బంధుమిత్రుల సహాయం, మాట సాయం లభిస్తాయి. ప్రయాణాలు కూడా ఫలిస్తాయి. కాని గురు శనులు మంచి ఇళ్లలో ఉన్నా వేధ కారణంగా పూర్తిగా శుభఫలాలు ఇవ్వలేరు. సంవత్సరంలో మధ్యకాలంలో రాహుకేతులు ఇళ్లుమారుతారు. అయినా పెద్దగా ఉపకారము లేదు. కాని జూన్ జూలై నెలల తర్వాత కుటుంబంలో సుఖ శాంతి వాతావరణం, ఇంట్లో శుభకార్య ప్రయత్నాలు, సంతానానికి విద్యా వివాహాది రంగాల్లో ప్రగతి వంటి శుభఫలాలు కనిపిస్తాయి. సంవత్సరం ఫిబ్రవరి భాగంలో కోర్టు వ్యవహారాలు కొంత త్రిప్పట కలిగిస్తాయి. లేదా ఆఫీసులో వాతావరణం అనుకూలంగా ఉండదు. కాని ఫర్వాలేదు. మొత్తంమీద ఈ రాశివారికి సంవత్సరం మొదటి భాగం బాగా గడిచి, రెండవ భాగంలో సమస్యలు, ఖర్చు, వెచ్చాలు వంటి ఫలితాలు కనిపిస్తాయి. సంవత్సరం చివరకు అన్నీ సర్దుకొంటాయి.



వృషభ రాశి
*(కృత్తిక 3, రోహిణి, మృగశిర 2)*
*(మే 16 - జూన్ 15 మధ్య తేదీలలో జన్మించినవారు)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం అంత అనుకూలంగా కనిపించదు. ముఖ్యమైన గ్రహాలేవీ అనుకూలంగా లేవు. వ్యవహార రీత్యా ఒడిదుడుకులు, వ్యర్థ ప్రయాణాలు, ఖర్చు కనిపిస్తాయి. జూన్-జూలై నెలలు దాటాక కొంతవరకు ఈ చికాకులు తగ్గి సానుకూలమైన కాలం వచ్చినట్లుంటుంది. సంవత్సరం ముగిసే కాలానికి రాను రాను బాగుంటుంది. విద్యార్థులకు కష్టపడి చదవవలసే కాలం. లాయర్లకు పని జాస్తిగా ఉంటుంది. కోర్టు కచేరీ వ్యవహారాలు వేగంగా ముగియవు. వ్యాపారస్థులకు లాభాలు మందకొడిగా ఉన్నా మొదట్లో ఉన్న ఉత్సాహం సంవత్సరంలో మొదటిభాగం కన్న రెండవ భాగంలో కొంత తగ్గుతుంది. సెప్టెంబరు నుండి కొంతవరకు అన్నిటా ఆశాజనకంగా ఉంటుంది. వివాహ వయస్సులో ఉన్నవారికి ఈ సంవత్సరం ఆశాభంగంగానే ఉంటుంది. ఇంట్లోవారికి, తనకూ కూడ ఆరోగ్యం అంతగా బాగుండదు. సంవత్సరం చివరి భాగంలో పుణ్యయాత్రలు, ప్రయాణమూలకంగా స్వల్ప లాభాలు కనిపిస్తాయి.



మిథునరాశి
*(మృగశిర 2, ఆరుద్ర, పునర్వసు 3)*
*(జూన్ 16-జూలై 16 మధ్య జన్మించినవారు)*

ఈరాశి వారికి ఈ సంవత్సరం పట్టినదల్లా బంగారమన్నట్లు రూపిస్తుంది. ఆరోగ్య సుఖం, ధనమానాభివృద్ధులు, వృత్తి వ్యాపారాలలో మంచి ప్రోత్సాహం, అనుకున్న రీతిలో అన్ని పనులు సక్రమంగా నెరవేరడం వంటి సత్ఫలితాలెన్నో కనిపిస్తాయి. విద్యార్థులు సుఖంగా విజయమందుతారు. వివాహ యోగ్య వయస్కులకు వివాహ సంబంధాల సమకూరుతాయి. ఉత్సాహంగా కాలం గడుస్తుంది. సంవత్సరం మధ్యకాలంలో కొన్ని అననుకూలమైన పరిస్థితులు, అక్కరమాలిన స్నేహసంబంధాలు, తన్మూలంగా ఖర్చు వెచ్చాలు ఏర్పడతాయి. కాని తర్వాత ఇవి వేగంగానే సర్దుకొంటాయి. సంవత్సరంలో రెండవభాగం లాయర్లకు, రాజకీయవాదులకు, ఉపాధ్యాయవృత్తిలో ఉన్నవారికి మంచి అనుకూలమైన కాలం ఏర్పడుతుంది. సంతానానికి సుఖ సంతోషాలు, వారివల్ల ఆనందం కలుగుతాయి. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. పెద్దల స్నేహం, సహాయలాభం కూడ కనిపిస్తాయి. అన్ని విధాలా శుభకాలం.



కర్కాటక రాశి
*(పునర్వసు 4, పుష్యమి, ఆశ్లేష)*
*(జూలై 17-ఆగష్టు 16 తేదీల మధ్య జన్మించినవారు)*

1994లో

డా॥ ముట

ఈరాశివారికి అష్టమ శనివల్ల చాలా విషయాలలో ఆటంకాలు, అనారోగ్యం, బంధువులతో విరోధం వంటి అనిష్ట ఫలాలు కనిపిస్తాయి. ఇవి సంవత్సరం రెండవ భాగంలో ఎక్కువగా ఉంటాయి. ఉద్యోగ వృత్తులలో ఉన్నవారికి బదిలీలు, అధికార వర్గంతో పేచీలు ఏర్పడతాయి. అక్టోబరు నుండి సంవత్సరం ఆఖరు వరకు ఏ వ్యవహారంలో నిలకడ, ఉత్సాహం గోచరించవు. నూతన ప్రయత్నాలకు ఇది కాలం కాదు. విద్యార్థుల సంవత్సరం పూర్వ భాగంలో విజయావకాశాలు ఎక్కువగా పొందుతారు. స్వతంత్ర వృత్తిలో ఉండేవారికి ఈ సంవత్సరమంతా అనిశ్చిత స్థితిలోనే నడుస్తుంది. లాయర్లు, ఉపాధ్యాయులు, రాజకీయవాదులు శ్రమ మీదగాని లాభాలు గడించి, సుఖశాంతులు సంపాదించలేరు. వివాహం వెనకపడుతుంది. ఇంట్లో బంధుమిత్రుల తాకిడి జాస్తి. ఖర్చు

కూడ అలాగే ఉంటుంది. ఈ రాశివారు శనికి జపమో, రుద్రాభిషేకమో చేయించి సుఖశాంతులు పొందవలెను.



## సింహరాశి

(మఖ, పుబ్బ, ఉత్తర 1)

(ఆగష్టు 17 - సెప్టెంబరు 16 మధ్య జన్మించినవారు)

ఈ సంవత్సరం ఈ రాశివారికి మంచి చెడ్డలు మిశ్రమంగా అనుభవానికి వస్తాయి.

# రాశిఫలాలు

సంగమేశం

సంవత్సరంలో మధ్యభాగం చాలా అనుకూలంగా కనిపిస్తుంది. వృత్తి వ్యాపారాలు లాభిస్తాయి. ప్రయాణాలు సుఖంగా గడుస్తాయి. తిరిగి సంవత్సరం ఆఖరున కొంత అనుకూలంగా కనిపిస్తుంది. ఈ రాశివారికి జూలై ఆగష్టు ప్రాంతాలలో ఉద్యోగలాభం, వృత్తిలో విశేష ప్రోత్సాహం కనిపిస్తాయి. వివాహానికి ఆటంకాలున్నా, అనుకూల సంబంధాలు కుదిరి సంవత్సరాంతానికి ఆ ప్రయత్నాలు ఫలించవచ్చును. రాజకీయవాదుల ఫలితాలు మధ్యరకంగా ఉంటాయి. చొరవ గలవారు బాగా రాణిస్తారు. విద్యార్థులు సంవత్సరం రెండవ భాగంలో విజయావకాశాలు ఎక్కువగా పొందగలరు. వ్యాపారస్థులకీ సంవత్సరం పెద్దగా అనుకూలమనిపించదు. సర్వీసులో ఉన్నవారు, కార్ఖానాల్లో పనిచేసేవారు కొంత వరకు ధనాదాయం పొంది సంతోషిస్తారు.



## కన్యారాశి

(ఉత్తర 3, హస్త 4, చిత్త 2)

(సెప్టెంబరు 16 - అక్టోబరు 16 మధ్య జన్మించినవారు)

ఈ రాశివారికి ఈ సంవత్సరం చాలా వరకు విజయావకాశాలు ఎక్కువగా కనిపిస్తాయి. కోర్టు కచేరీ వ్యవహారాలు లాభసాటిగా ముగుస్తాయి. వృత్తి వ్యాపారాలలో ధనాదాయం బాగుంటుంది. వివాహ సంబంధాలు కలిసివస్తాయి. విద్యార్థులకు జయావకాశాలు మెండుగా ఉంటాయి. సంవత్సరము రెండవభాగంలో ఇంట్లోను, వంట్లోను కూడ అనారోగ్యపు బాధలు, తన్మూలకంగా ఖర్చులు కనిపిస్తాయి. అక్టోబరు ప్రాంతంలో ఆరోగ్యం భద్రంగా చూసుకోవాలి. లాయర్లకిది మంచి కాలం. రాజకీయవాదులు కూడ కొంతవరకు జయలాభాలు, పలుకుబడి సంపాదించగలరు. సంవత్సరాంతలో స్వప్రయోజకత్వంతో చాకచక్యంగా వ్యవహరించి కార్య సాధన చేసుకోవాలి. మాట మంచి ఎక్కువగా ఉపకరిస్తుంది. మొత్తం మీద ఈ రాశివారికి ఇష్టఫలాలే ఎక్కువగా కనిపించగలవు.



## తులారాశి

(చిత్త 2, స్వాతి, విశాఖ 3)

(అక్టోబరు 16 - నవంబరు 15 మధ్య జన్మించినవారు)

ఈరాశివారికి ఈ సంవత్సరం చాలా సమస్యలతో గడ్డుగా గడుస్తుంది. ఏదీ కలసిరాదు. అన్నీ ఆటంకాలతో, ఆలస్యమౌతూ ఉంటాయి. శనిగ్రహం కొంతలో కొంత సాయపడుతూ ఉన్నా తక్కిన గ్రహాలు ఆటంకదాయకంగా ఉంటాయి. వేధ గోచారంవల్ల పెద్ద గ్రహాలు అనుకూలంగా ఉన్నా పెద్దగా చికాకులు కల్పించలేదు. సంతానమూలకంగా సమస్యలుంటాయి. ఇంట్లో అప్పుడప్పుడు అనారోగ్య బాధలు గోచరిస్తాయి. బంధుమిత్రుల సహాయం అంతంతగా ఉంటుంది. వ్యయం జాస్తిగా కనిపిస్తుంది. ప్రయాణాలు ఫలించవు. ఏదో విధంగా కాలం గడిచి నట్లుంటుందికాని ఉత్సాహకరంగా ఉండదు. వీరు గురు రాహు గ్రహాలకు శాంతి చేయించుకోవడం మేలు. నూతన వ్యాపార ప్రయత్నాలు ఈ సంవత్సరం వాయిదా వేయవలసి వస్తుంది. వివాహ ప్రయత్నాలు కూడ వాయిదా పడతాయి.



## వృశ్చిక రాశి

(విశాఖ 4, అనూరాధ, జ్యేష్ఠ)

(నవంబరు 16-డిసెంబరు 15 మధ్య జన్మించినవారు)

ఈ సంవత్సరం ఈ రాశివారికి అన్ని విధాలా ఆటంకమయంగా, నిరుత్సాహంగా గడుస్తుంది. అన్ని విషయాలలోను అపజయంగానే కనిపిస్తుంది. శత్రువుల తాకిడి ఎక్కువగా కనిపించినా, చివరకు వారే ఓడిపోయి శాంతిస్తారు. సంవత్సరం మధ్య కాలంలో కొంత అనుకూలంగా ఉన్నట్లు కనిపించినా అది నిలకడగా ఉండదు. ఆరోగ్య విషయంలో కూడ అర్ధాష్టమ శని ప్రభావం కనిపిస్తుంది. ఇంట్లో వారికి కూడ ఆరోగ్యపు తొందరలుంటాయి. బంధువర్గానికి కూడ అంత బాగుండదు. సంవత్సరం చివరి మాసాలు తిరిగి బాగుంటాయి. అప్పటికి చికాకులన్నీ తొలగిపోయి నూతనోత్సాహం కనిపిస్తుంది. అంతవరకు వాయిదా పడిన

వ్యవహారాలన్నీ అప్పుడు జయ ప్రదంగా ముగుస్తాయి. మొత్తంమీద ఈ రాశివారికి ఈ సంవత్సరంకంటె వచ్చేసంవత్సరం అన్ని విధాలా ఆశాజనకంగా ఉంటుంది.



ధనూరాశి

*(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1)*

*(డిసెంబరు16-జనవరి 14 మధ్య జన్మించినవారు)*

ఈ సంవత్సరము ఈ రాశివారికి అన్ని విధాలా సుయోగ్యమైన కాలం. ఏ పని తల పెట్టినా సుకరంగా సునాయాసంగా లాభ ప్రదంగా ముగుస్తుంది. అన్ని రంగాలలోను జయం లభిస్తుంది. విద్యార్థులు సంతోషంగా పరీక్షలలో నెగ్గుతారు. వివాహ యోగ్య వయస్కులైనవారికి తగిన సంబంధాల సమకూరుతాయి. విద్యా వైజ్ఞానిక రంగాలలో పనిచేసేవారు, లాయర్లు, వ్యాపారస్థులు, రాజకీయవాదులు కూడ మంచి అభివృద్ధి సాధిస్తారు. సంవత్సరాంతంలో ఈ రాశివారికి అన్ని విధాలా మరింతగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. డాక్టర్లకు సంవత్సరపు మధ్యకాలంలో ప్రాక్టీసులో ధనలాభం, పేరు ప్రసిద్ధులు కూడా కలుగుతాయి. సంవత్సరమంతా ఇంట్లోను ఒంట్లోను కూడా ఆరోగ్యకరంగా ఆనందదాయకంగానే గడుస్తుంది. కాని సంవత్సరం మొదటి భాగంలో కొంచెం ఒడిదుడుకులుంటాయికాని అవి లెక్కలోకి రావు. అంతా యధా లాభంగానే గడిచిపోతుంది.



మకర రాశి

*(ఉత్తరాషాఢ 3, శ్రావణం, ధనిష్ఠ 2)*

*(జనవరి 15-ఫిబ్రవరి 12 మధ్య జన్మించినవారు)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలాలు అనుభవానికి వస్తాయి. సంవత్సరం మొదటి భాగం కంటె రెండవ భాగం క్లిష్టంగా కనిపిస్తుంది. వృత్తి వ్యాపారాలలో సమస్యలు, ఆర్థికంగా కష్టనష్టాలు, ఆరోగ్యం విషయంలో కొంచెం తొందరలు అన్నీ ఒకటి తర్వాత ఒకటిగా వచ్చి నిరుత్సాహ పరుస్తాయి. వ్యాపారస్థులకు, బయటికి లాభ సాటిగా కనిపించినా, నికరంగా సంతృప్తి కలుగదు. ఉద్యోగస్థులకు ఆఫీసులో సమస్యలు తలెత్తుతాయి. కాని పెద్దగా నష్టం కలుగదు. ఈ శనిగ్రహం స్వక్షేత్రంలో రెండవ ఇంటిలో గురుదృష్టిలో ఉన్నందున ఏలినాటి శనికాలం ముగిసి పోతున్నందున ఈ రాశివారు ఓపికతో ఈ సంవత్సరం గడిపితే వచ్చే సంవత్సరం అన్ని విధాలా ఆనుకూల్యాలు అనుభవించగలరు. సంతాన విషయంలోను కుటుంబ సౌఖ్యంలోను మాత్రం ఏ విధమైన చికాకులు ఉండవు. అంతా తృప్తిగానే ఉంటుంది.



కుంభరాశి

*(ధనిష్ఠ 2, శతభిషం, పూర్వాభాద్ర 3)*

*(ఫిబ్రవరి 13 - మార్చి 15 మధ్య జన్మించినవారు)*

ఈరాశివారికి ఈ సంవత్సరం రెండు వంతులు శుభప్రదంగా గడుస్తుంది. జన్మ శని వల్ల ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా ఉండదగిన కాలం. తక్కిన విషయాలలో సమస్య లేవీ పెద్దగా బాధించవు. విద్యార్థులు కష్టపడి చదివి జయలాభాలు పొందగలరు. వివాహ ప్రయత్నాలు కూడ కలిసి వస్తాయి. సంతానానికి సుఖ సంతోషాలు, వారి మూలంగా సంతృప్తి కలుగుతాయి. ఉద్యోగులకు ప్రయాణాలు, బదిలీలు ఉన్నా లాభసాటిగానే ఉంటాయి. దీర్ఘ యాత్రాదికం కూడ కలిసివస్తుంది. అక్టోబరు నుండి సంవత్సరాంతం వరకు అన్ని రంగాలలోను అంతకంత మేలనిపిస్తుంది. గౌరవాదరాలకు లోటులేదు. బంధుమిత్ర సహాయం బాగా లభిస్తుంది. అయితే అన్ని రంగాలలోను ఏదో ఆలస్యం, ఏదో లోపం ఉన్నట్లు కనిపిస్తూ ఉంటుంది. ఈ అసంతృప్తి శని గ్రహానికి జపశాంతులు చేయించి నివారించుకోవలెను.



మీనరాశి

*(పూర్వాభాద్ర 4, ఉత్తరాభాద్ర, రేవతి)*

*(మార్చి 16 - ఏప్రిల్ 14 మధ్య జన్మించినవారు)*

ఈ రాశివారికి ఏలినాటి శని ప్రారంభమైంది. గోచారంలో అక్టోబరు వరకూ గ్రహాలేవీ అంతగా అనుకూలంగా లేవు. వేధ గోచారంవల్ల శని గురుల ప్రభావం అంతగా కనబడదు. కాని పెద్దగా అనుకూల ఫలాలు ఆశించడానికి తగిన కాలం కాదు. ఇంట్లో ఆరోగ్య విషయంలో తొందరలుండవు. కాని బయట పేచీలు, లావాదేవీలు ఉంటాయి. ప్రయాణాలు తరచు. ప్రమాదాలు రాకుండా చూసుకోవాలి. సంవత్సరాంతంలో ఆర్థికంగా కూడ చికాకులు కలుగవచ్చును. మాట నేర్పుతో వ్యవహారాలు నడపుకోవాలి. లేకపోతే అనవసరపు జగడాలు వ్యర్థంగా ఖర్చులు కలుగుతాయి. మార్చి, జూన్, డిసెంబరు నెలలు కొంత సాఫీగా అనుకూలంగా గడుస్తాయి. కొందరికి కోర్టు కచేరీ, దాయాది తగవులలో జయం లభించవచ్చును. సంవత్సరం ఆఖరున అంతా సవ్యంగా గడుస్తుంది.



తిరుమల తిరుపతి దేవస్థానముల

# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ఇచ్చిన వరం. ఆ అడవుల్ని రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అడవుల విభాగం వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

## వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

సౌకర్యాలు :

* వృక్షసంపదకు దాతపేరును లేదా దాత సూచించిన వారి పేరును పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.15,000/-.

## వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచటానికి నిర్దేశించిన పథకం.

సౌకర్యాలు :

* దాతపేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను వితరణ చేస్తారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.10,000/-.

## స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 సస్యజాతి మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

సౌకర్యాలు :

* ఈ పొదకు దాత పేరును పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.2,000/-.




## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరును ప్రదర్శిస్తారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అభయారణ్య వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల సస్యజాతి మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కవద్ద దాత పేరును ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్ రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటటం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరును వృక్షం వద్ద ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వన సంపదను రక్షించేందుకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

కార్యనిర్వహణాధికారి

# ప్రాచీన భారత దేశము - వైమానిక కళ

—— శ్రీ ఎ. రామసుబ్బారెడ్డి




వర్తమాన కాలమున మన ప్రాచీనులు తెలిపిన వైమానిక విద్యను గూర్చి మనమంతా మరచిపోయినామనే చెప్పవచ్చు. కాసింత శ్రద్ధ కలిగి ఆ విద్యను పరిక్షిస్తే అంతటి ఔన్నత్యమున మన పూర్వులు ఉండినారా ఏమి? అనే అనుమానము కలుగక పోదు. విమానాన్ని కనిపెట్టినవారు పాశ్చాత్యులని చెప్పుకుంటారు. దేనికంటే దాని ఆవిష్కరణ ఆధునిక యుగమున వారే చేశారు కనుక.

భరద్వాజమహర్షి వ్రాసిన "యంత్ర సర్వస్వము" అను ప్రాచీన గ్రంథమున విమానమును గూర్చిన పూర్తి సమాచారమును గాంచగలము. మన ప్రాచీనులు ప్రయోగాలు గావించి పొందినంత ఫలితాన్ని నేడు పాశ్చాత్యులుగూడా ప్రయోగాలు జరపలేదనవచ్చు.

ఈ 'యంత్ర సర్వస్వము' అను గ్రంథము నేడు 'బడౌదా' (బరోడా) యందలి రాష్ట్ర పుస్తకాలయమందు హస్త లిఖిత గ్రంథ రూపమున మనకు దర్శనమిస్తుంది. అందు కొంత భాగము శిథిలమై పోయింది. అందు బోధానంద మహర్షి వ్రాసిన అంశములను గూడా జోడించియున్నారు. దానిముందు ప్రకరణమునందు ప్రాచీన విజ్ఞాన విషయాల గూర్చిన ఏబది (50) గ్రంథముల సూచికను గూడా ఇవ్వడము జరిగింది. అందు అగస్త్యకృతమైన 'శక్తి సూత్రము' ఈశ్వరకృతమైన 'సౌదామనీ కళ', భరద్వాజకృతమైన "అంశుమత్తంత్రము" ఆకాశ శాస్త్రము, 'యంత్ర సర్వస్వము', శకటాయన కృతమైన 'వాయుతత్త్వ ప్రకరణము', నారదకృతమైన 'వైశ్వానర తంత్రం', 'ధూమ ప్రకరణము' ఇత్యాదివి గలవు.

వృత్తికారుడైన బోధానందుడు ఇట్లా వ్రాస్తాడు--

నిర్మథ్య తద్వేదాంబుధిం
భారద్వాజో మహామునిః,
నవనీతం సముద్ధృత్య
యంత్రసర్వస్వ రూపకమ్

ప్రాయచ్ఛత్ సర్వలోకానా
మీప్సితార్థ ఫలప్రదమ్,
తస్మిన్ చత్వారింశతి-
కాధికారే సంప్రదర్శితమ్.

నానా విమాన వైచిత్ర్య-
రచనా క్రమ బోధకమ్,

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- ❈ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- ❈ మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- ❈ శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- ❈ స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ❈ ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ❈ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- ❈ తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- ❈ తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- ❈ సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- ❈ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- ❈ శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- ❈ విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- ❈ మాంసాహారాన్ని భుజించకండి.
- ❈ ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- ❈ పొగత్రాగకండి.
- ❈ వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- ❈ శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ❈ ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- ❈ వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- ❈ శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- ❈ శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ❈ ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ❈ ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ❈ తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజే.

అష్టాధ్యాయై ర్విభజితం
శతాధికర ణాన్వితమ్.

సూత్రైః పంచశతైర్యుక్తం
వ్యోమయాన ప్రధానకరమ్
వైమానికాధికరణ
ముక్తం భగవతా స్వయమ్.

అనగా-- భరద్వాజ మహర్షి వేదరూపిణియైన సముద్రమును మధించి యంత్రసర్వస్వమను వెన్నను చిలికియున్నాడు. అది మానవమాత్రులకు కోరిన ఫలితాన్ని ఒసుగుతుంది. అందు 40వ ప్రకరణమందు వైమానిక ప్రకరణమని ఉల్లేఖించి అందులో విమాన విషయాలను ఎనిమిది అధ్యాయాలుగా విభజించి వంద ప్రకరణములు ఐదువందల సూత్రములను తెలిపియున్నాడు. అందున విమాన విషయమే ప్రధానమైనది.

"భరద్వాజ మహర్షి విధిపూర్వకముగా, మంగళాచరణము గావించి రెండవ శ్లోకమున విమాన శాస్త్రమున పూర్వాచార్యులను, వారిచే లిఖించబడిన గ్రంథముల పేర్లను వివరించి యున్నాడు. విశ్వనాథుని అభిప్రాయాను సారము వారి పేర్లు ఇవి-- నారాయణుడు, శౌనకుడు, గర్గుడు, వాచస్పతి, చాక్రాయణి, ధుండీనాథుడు అని ఈ ఆరుగురు గ్రంథకారులూ, విమాన చంద్రిక, వ్యోమయాన తంత్రము, యంత్రకల్పము, యానబిందు, ఖేటయాన ప్రదీపిక, వ్యోమయానార్క ప్రకాశము, అను గ్రంథములు వరుసగా వారు రచించియున్నారు."

విమానమునకు నిర్వచనమునుగూడా తెల్పియున్నారు--

విమాన రహస్యాలను తెలుసుకున్నవాడే దానిని నడిపే అధికారము కలిగియుంటాడు. శాస్త్రమందు తెలియచేసినన్ని వైమానిక రహస్యాలు విమానచోదకులకు కరతలామలకముగా ఉండవలెను. అప్పుడే వారిని మంచి చోదకులని చెప్పడము జరుగుతుంది. విమానమును నిర్మించుట, నేలనుండి ఆకాశమునకు తీసుకవెళ్లుట, నిలుపుట, ముందుకు నడిపించుట, వంకరటింకరగా వేగముగా నడిపి వలయాకారముగా తిరిగివచ్చుట, విమానవే

గాన్ని తగ్గించుట, అధికము చేయుట మొదలైన కృత్యాలు అనుభవములేనిదే విమానమును నడుపుట అసంభవమని మనకు ఆ సూత్రాల ద్వారా విదితమౌతుంది.

విశ్వకర్మ, ఛాయాపురుషుడు, మను మయ దానవుడు మొదలైన విమాన శాస్త్రకారులు వ్రాసిన శాస్త్రాలను పరిశోధించుటచేత ఆయా ధాతుక్రియలు ఏది సామర్థ్యము కలిగియున్నదో అవగాహన చేసుకొని ఇచ్ఛాసారముగా నూతన విమానమును నిర్మించవలెను.

"గూఢము" అను ఐదవ రహస్యము వాయుతత్త్వ ప్రకరణమందు తెలిపినట్లు, వాత స్తంభమందలి 8వ ప్రకరణమున, మార్గ యాస, వియాస, ప్రయాస, ఇత్యాది వాయుశక్తులద్వారా సూర్యకిరణాలయందుగల అంధకారశక్తిని ఆకర్షించి విమానమునకు ఆ శక్తిని సంధాన పరచుటచేత విమానము కనుపించకుండా పోతుంది.

అపరోక్షమనే 9వ రహస్యానుసారం శక్తి తంత్రమందు వివరించిన రోహిణీ విద్యుత్ (ప్రత్యేకమైన విశిష్టతగల విద్యుత్తు)ను వ్యాప్తి చేయుటచేత విమానమునకు ఎదురుగా వచ్చునటువంటి వస్తువులను ప్రత్యక్షముగా చూడగలుగతాము.

"సర్పగమన"మను 22వ రహస్యానుసారము, దండ, వక్ర మొదలైన ఏడు రకాలైన వాయు కిరణాల శక్తుల నాకర్షించి విమానమందలి ముఖమునందుగల వంకర కలిగిన విసరివేయబడే కేంద్రమును దాని ముఖమందు నింపి, ఆ తరువాత లాగుట చేత ఉత్పత్తి అయ్యే శక్తి గల నాళమందు ప్రవేశపెట్టి 'మీట'ను గట్టిగా అదిమిన విమానమార్గము సర్పముతో సమానముగా వంకర టింకరగా సాగును.

"పరశబ్దగ్రహక్" అను 25వ రహస్యానుసారము, 'సౌదామినీకళ' యందు తెలుపబడిన నియమానుసారము, విమానమందుగల శబ్దగ్రహణ యంత్రముద్వారా ఇతర విమానమందలి యాత్రికుల సంభాషణను, మరియు ఇతర శబ్దాలను మనము ఆకర్షించవచ్చు.

## ప్రేమలేని బ్రతుకు ఎడారి

విశ్వప్రేమకు బాహ్యరూపం అహింస. తోడి మానవులనే కాదు పశుపక్ష్యాదులను కూడా మనం ప్రేమించాలి. ప్రేమలేని బ్రతుకు ఎడారివంటిది.

## హిందూ వివాహం

అవివాహిత అయిన కన్య ఈశ్వరుణ్ణే భర్తగానూ, వివాహిత అయిన పిమ్మట భర్తనే ఈశ్వరుడుగాను ఎంచుకోవాలి అన్నారు. మన మతంలో వివాహం కేవలం ఒడంబడిక contract కాదు. ఆత్మోన్నతికి ఏర్పడిన సంస్కారం.

--కంచిపరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి

సేకరణ : శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారి "నడిచేదేవుడు" గ్రంథం నుండి.

"రూపాకర్షణము" అను రహస్యము ద్వారా రూపాకర్షణ యంత్రముచేత ఇతర విమానమందలి వస్తువులను మనము చూడవచ్చు.

"దిక్ ప్రదర్శనమను 2వ రహస్యానుసారము విమానముఖకేంద్రమునగల కీలు (బటన్)ను పనిచేయించుటచేత దిశాంపతి అను పేరుగల యంత్రమందలి నాళములోని సూరి (సూచిక) ద్వారా ఇతర విమానములు పయనించే దిశను తెలుసుకోవచ్చు."

"స్తబ్దకము" అను 31వ రహస్యానుసారం విమానమునకు కుడి పార్శ్వమునగల "సంధిముఖమను" నాలము ద్వారా అపస్మారమను ధూమమును స్థంబన యంత్రముద్వారా ఇతర విమానముపైకి వ్యాపింప చేయుటచే ఆ విమానమందలి సర్వజనులు మూర్ఛితులై పోతారు.

కర్షణమను 32వ రహస్యము చేత తన విమానమును నాశనము చెయ్యాలని వచ్చునట్టి శత్రువిమానమును, తన విమాన ముఖమందలి 'వైశ్వానర'మను నాలమందలి 'జ్వాలిని'ని (ఒకరకమైన వాయువు) రగిలింప చేసిన 87 లింగ ప్రమాణములు (లింగమనగా డిగ్రీలవలె కొలమాపకము) వేడితో తిరిగేటటువంటి రెండు 'బటన్స్'లను పని చేయించి శత్రువిమానముపై గోళాకారముగా ఆ శక్తిని వ్యాపింపచేయుట చేత శత్రువిమానము నాశనమైపోతుంది.

ఈ విమానప్రకరణమందు తెలిపిన గ్రంథములు, గ్రంథకర్తల నామములచేత మనకు తెలియవచ్చేదేమంటే-- మన పూర్వీకులు విమానశాస్త్రమందు అత్యంత నైపుణ్యముగల వారని తేటతెల్లమౌతుంది. నేటి వర్తమానకాలమున వైజ్ఞానికులు ప్రయోగించే ప్రక్రియలన్నింటిని ప్రాచీనకాలమున మన పూర్వీకులు చేసి చూసినవేనని గూడా తెలుస్తుంది. దుర్భిణీ వంటి దూరదర్శన యంత్రము ప్రాచీనులకున్నట్లు పైన తెలిపిన 9వ రహస్యముద్వారా అవగతమౌతూఉంది. 25వ రహస్యముద్వారా వైర్‌లెస్, రేడియో యంత్రాలు గూడా ఉన్నట్లు తెలుస్తూ ఉంది. నేటి వైజ్ఞానికులవలెనే దూరమునుండియే శత్రువులయొక్క విమానములను పసిగట్టవచ్చునని 28వ రహస్యము తెలియచేస్తూ ఉంది. వారు వాయు బాంబులద్వారా శత్రువుల సంహరించేవారని 32వ రహస్యము తెలియచేస్తుంది. నేడు టెలిఫోన్‌లో మాట్లాడేవారి రూపాన్ని చూడగలిగినట్లు ఆనాడు వారు ఇంతకంటే చక్కగా చూడగలిగేవారని 26వ రహస్యము ద్వారా తెలుసుకోవచ్చు.



దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయకళ తిరుపతి

# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

తరించండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయకళ
## తిరుపతి
## SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

దర్శించండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

దర్శించండి!

ప్రవేశ రుసుము
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుండి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





(16 వ పేజీ తరువాయి)

సూర్యుని (భర్తను) గుర్తించినది. వీరి కల యిక వలననే అశ్వినులు బుట్టిరి.

### మిత్రా వరుణులు

వీరిరువురు ఆదిత్య పుత్రులుగను (3-33) చిరజీవనానికై జ్ఞాన జ్యోతినిచ్చే వారుగాన (3-33), ఈతి బాధల, భయం లేకుండా ప్రజలను పాలించే వాళ్ళుగాను (3-31) శుక్ల యజుస్సంహిత - పు. 249 - ఆర్ష విజ్ఞాన సర్వస్వము ఒలో వర్ణింపబడ్డారు.

### సూర్యుని మహిమలు

సూర్య భగవానునికి సహస్ర కిరణములు గలవని వేద శాస్త్రమేలలో ఒక వర్ణన గలదు.

సుషుమ్నో హరికేశశ్చ
విశ్వకర్మా తథైవ చ
విశ్వవ్యచాః పునశ్చాన్యః
సంపద్వసు రతః పరః
స్వరాడన్యః ప్రకీర్తితః.

--కూర్మ పురాణము

సూర్య రశ్మి మహిమను, దాని ప్రభావ మును గూర్చినది పై శ్లోకము.

'ఆరోగ్యం భాస్కరాధీనం' అని ఆర్యోక్తి. ప్రాణికోటికి ప్రధానమైన ఆహారం కూడా భాస్కరాధీనమే. అందుకే ప్రభాకరుణ్ణి 'ప్రాణదాత'యని ప్రజలు ఆయన మహిమను ఘనపరిచిరి.

అరణ్యవాస సమయమున ధర్మజుడు సూర్యునారాధించగా ప్రత్యక్షమై నొక స్థాలి (అక్షయపాత్ర) నిచ్చెను. ఈ పాత్రలో వండిన సర్వవిధ పదార్థములును ఎంతమంది కయినా సరిపోవడం దీని ప్రత్యేకత.

--మహాభారతం

సత్రాజిత్తు తపమునకు ఆనందించి సూర్యభగవానుడు 'శ్యమంతకమణి'ని ప్రసా దించాడు. దీనిని ధరించిన సత్రాజిత్తును దూరంనుంచి దర్శించి సూర్యుడే వస్తున్నాడని ద్వారకావాసులంతా భ్రమపడిరి. శ్రీకృష్ణుడు ఈ మణి విషయార్థమై నీలాపనిందలకు గురి యైనాడు. ఈ మణిని పూజించేవారికి రోజుకి ఎనిమిది బారువుల బంగారాన్ని ఇస్తూఉండేది.

శ్రీరాముడు సూర్యమంత్రోపాసన మొనర్చి రావణుని సంహరించుట సూర్యభగ వానుని మహిమయే. సూర్యనారాయణుడు శ్రీమన్నారాయణుడే.

సూర్యభగవానుణ్ణి ఆరాధించి శారీరక స్వస్థత బొందిన కవివర్యులెందరో నున్నారు. 'సూర్యశతకము'ను రచించి సూర్యారాధన చేసిన మయూరకవికి 'కుష్ఠువ్యాధి' నయ మైంది.

### సూర్యస్తుతి

అరణ్యవాస సందర్భమున రఘురాము నకు అగస్త్యమహర్షి ఉపదేశించిన సూర్యస్తో త్రమే 'ఆదిత్య హృదయం' ఈ మంత్రాన్ని రాముడు స్తుతించాడు. ఈ మంత్ర ప్రభావం సూర్యదేవతల్ని స్తుతించినట్టే. మనవేదాల్లో ప్రతివేయి మంత్రాల్లోను 3/4 వంతు భాగం భాస్కరునికి అంకితమైనవే. మనవి వ్యావసాయిక దేశం. కనుక దైవ సహాయం అవసరం. కాబట్టి రైతుబిడ్డ పగటి ప్రత్యక్ష దైవమైన బాలభానుణ్ణి ప్రస్తుతిస్తాడు.

### వేదాలలో

సూర్యునివలన మనకు తొలి, మలి సంధ్యలు ఏర్పడుతున్నాయి. ఈ సమయాన్నే 'సంధ్యా సమయం' అంటారు. ఈ సమ యంలో ప్రకృతి తన అంద చందాలను ద్విగుణీకృతం చేస్తుంది. ఈ విషయాన్ని గూర్చి 'షడ్వింశ బ్రాహ్మణం' లో తెలియప రచ బడింది. పగటికిని, రాత్రికిని సంధికాలం కనుక సంధ్యాకాలమని పేరు.

1. ఉషస్సు ననుసరించి ఉదయించే సూర్యుడు ఋగ్వేదంలోని పది సూక్తాల్లో వర్ణింపబడ్డాడు.

2. కృష్ణయజుర్వేదంలో 15 అధ్యాయా లలో చెప్పబడ్డ దేవత సూర్యుడు.

3. సామ వేద సంహితలో 'విభ్రాట్' అనే ఋషి సూర్యుని ప్రార్థించిన విధానంలో ముఖ్యమైనది "అందమైన ఏడు గుర్రాలు లాగే రథం మీద కూర్చుని సూర్యుడు యజ్ఞ గృహానికి వస్తాడు. అందరు ఆతనికి హవిస్సు లను అందియ్యాలి."

4. సూర్యుణ్ణే పూషగా, ఆదిత్యుడుగా అధర్వణవేదంలో అభివర్ణిస్తూ, ఇంద్రాది దేవ తలలాగా, ఈయన ధనాన్ని ఇచ్చే దేవతగా వర్ణింపబడ్డాడు. (1-2-4)

### భగవద్గీతలో

ఉపనిషత్తుల సారాంశమైన భగవద్గీత యందు సూర్య ప్రకాశస్తుతి యుండుట గమనార్హము.

యథా ప్రకాశయ త్యేకః
కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం
ప్రకాశయతి భారత.

--భగవద్గీత (13-34)

సరికొండ లక్ష్మీ నరసింహరాజు రచిం చిన 'గృహరాజ శతకము'న సూర్యస్తుతి అత్యంత ప్రాధాన్యత వహించినది. సూర్యుడు జగద్రక్షణ కర్తయై ద్వాదశరూపముల జగత్పా లనాసక్తుడై యుండునని కీర్తించెను.

### సూర్యోపాసన

ప్రాచీన మంత్ర ద్రష్టలగు కొందరు మహర్షులు ఋగ్వేద సంహితలో సూర్య పరములయిన 60 1/2 ఋక్కులను "మహా సారము" అను పేర సేకరించిరి. వారు ఆరోగ్యము కొరకై సూర్యుని జపించి నమ స్కరించు చుండిరి. 'సూర్యారాధన - వ్యాధి నివారణ'కు మార్గమని వారుపదేశించిరి. ఈ ఉపవాసనా విధానము మంత్రాలద్వారా వ్రతా లద్వారా సిద్ధించునని ఆర్యులు వ్యక్తపరచిరి.

### మంత్రాలు

సర్వదేవతా మంత్రాలలో సూర్యదేవు నిదే అగ్రతాంబూలం. ఏ దేవతను ప్రార్థిం చినా ఆద్యుడు సూర్యనారాయణుడు కనుక ఆ మంత్రశక్తి సూర్యునికి చేరునన్న విష యాన్ని ఆర్యులు వక్కాణించియే యున్నారు. ముఖ్యంగా నవగ్రహాలలో సూర్యుని ప్రప్రథ మంగా స్తుతించారు.





ఓం ఆదిత్యాయ చ సోమాయ
మంగళాయ బుధాయ చ,
గురు శుక్ర శనిభ్య శ్చ
రాహవే కేతవే నమః.

సూర్యుని స్తుతించునపుడు హరిహర బ్రహ్మ స్వరూపుడని నిర్ధారణ యైనది. అందులకు తగిన శ్లోకం స్తోత్రమై అలరారుచున్నది.

బ్రహ్మస్వరూప ఉదయే
మధ్యాహ్నే తు మహేశ్వరః,
అస్తమానే స్వయం విష్ణు
స్త్రయీమూర్తి ర్దివాకరః.

పరబ్రహ్మ స్వరూపుడై జగత్తును పాలించు జగచ్చక్షువు, జగద్రక్షకుడు, ప్రత్యక్ష బ్రహ్మ, బ్రహ్మాండమునంతటిని ప్రకాశింపజేయు నీ సూర్య భగవానుడు దేవాది దేవుడు.

బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ
ఈశ్వరశ్చ సదా శివః
పంచ బ్రహ్మమయాకారాః.

### వ్రతాలు

భూమండలమున జనులు అనేక వ్రతాలు, పూజలు, నోములు సద్భక్తితో చేయుచుందురు. అసలు వ్రతమనగా ఒక మండలము. అంటే 41 రోజుల కాలము. అతి నిష్ఠా గరిష్టులై, అత్యంత భక్తి భావములతో ఉపవాసముండి వ్రతదీక్షను ప్రారంభింతురు. ముఖ్యంగా సూర్యవ్రతం భయ, రోగ నివారణకై చేయుట లోకవిదితమే.

### వ్రత ధ్యానమ్

ధ్యాయే త్సూర్య మనంత కోటికిరణం
తేజోమయం భాస్కరమ్
భక్తానా మభయప్రదం దినకరం
జ్యోతిర్మయం శంకరమ్.

ఆదిత్యం జగదీశ మచ్యుత
మజం త్రైలోక్య చూడామణిమ్,
భక్తాభీష్టవరప్రదం దినమణిం
మార్తాండ మాద్యం శుభమ్.

### ఉత్తరాయణ ప్రాశస్త్యం

అయనములు రెండు రకాలున్నాయి. ఆంధ్ర దేశానికి చాంద్రమానం, తమిళ దేశానికి సౌరమానం వ్యవహార సిద్ధంగా వర్తిల్లుచున్నవి. సూర్యుడు ఏ రాశిలో ప్రవేశిస్తే ఆ రాశితో ఆ నెల ప్రారంభమవుతుంది. మకర రాశికి ప్రవేశించినప్పటినుండి కర్కాటకరాశికి వచ్చేంతవరకు అంటే, సూర్యుడు భూగోళానికి ఉత్తర దిక్కున సంచరించే కాలం ఉత్తరాయణం, అప్పటినుండి మరల తిరిగి మకర ప్రవేశం అయ్యేవరకు దక్షిణాయనకాలం అంటారు. ఆ రోజే మకర సంక్రాంతి. దీనికి మరొక పేరు పెద్ద పండుగ, పెద్దల పండుగ యని నామధేయములు గలవు.

కురుపితామహులైన భీష్మాచార్యుల వారు తన తండ్రియగు శంతనుని వద్ద 'స్వచ్ఛందమరణం' నొందేటట్లు వరమును పొందినాడు. మహాభారత సంగ్రామ సమయంలో భీష్ముడు శరతల్పగతుడై ఉత్తరాయణ సామీప్యమందు అర్జునునితో దెల్పిన మాటలు--

రవి గొల్చి యుత్తరాయణ
మవు నంతకు నంప పాన్పు నందిట్లు
మహోత్సవ లీల నిలుత నాకీ
దివసంబుల జేయవలయు
దృఢతరరక్షన్.

అనుటలో ఉత్తరాయణానికెంతటి ప్రాధాన్యత నిచ్చిరో తెలియుచున్నది. వైకుంఠ ఏకాదశినాడు వైకుంఠంలో ఉత్తరద్వారం తెరుస్తారు. ఒక్కమాటలో చెప్పవలయునన్న "ఉత్తరాయణం విష్ణుగతి".

ఉత్తరాయణ పుణ్యకాల కర్త, మహాపురుషుడును అయిన సూర్యభగవానుడు పుష్యమాసమున 'భగుడు' అనే పేరుతో పిలువబడుతున్నాడు. స్ఫూర్జుడు, అరిష్టనేమి, ఊర్ణుడు, ఆయువు, కర్కోటకుడు, పూర్వజిత్తి అను పరివారమునగు నామ ధేయములతో విలసిల్లు శ్రీ సూర్యభగవానుడు లోకమునందెల్లవారికిని చిత్కళారూపమున నానందింపజేస్తూ జ్యోతిర్ధాముడై వెలుగొందుచు, తన కిరణాళినే ఆశీస్సులుగా కురిపించుచున్నాడు.



# శ్రీ లక్ష్మీ భూ చెన్నకేశవస్వామి దేవాలయం, అవుకు

శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్య

కర్నూలు జిల్లాలోని ప్రసిద్ధిగాంచిన వైష్ణవాలయాల్లో అవుకు గ్రామంలోని భూలక్ష్మి చెన్నకేశవాలయం ఒకటి. వైష్ణవ సాంప్రదాయంతో వెలసిన ఈ దేవాలయం ఊరికి పశ్చిమాన సువిశాలంగా వున్న ఎత్తైన ప్రాకారాలతో ప్రకృతి రామణీయకశోభతో విరాజిల్లుతోంది.

పూర్వము కళాపూర్ణోదయ గ్రంధంలో వివరించబడిన రీతిగా, నంద్యాల తిమ్మ రాజు గారి పాలనలో (1666-1673) అవుకు గ్రామమున తిమ్మరాజు చెరువు నిర్మించిరి. ఇది గ్రామానికి 5 కిలోమీటర్ల దూరమున దక్షిణాన గలదు. ఈ చెరువు నిండినచో 3 సంవత్సరములు వర్షాభావము అయిననూ వరిపంటపండునని ప్రతీతి.

ఈ చెరువు నిర్మాణము పరిశీలించిన ఆ నాటి రాజుల కళావైభవము వారి పనితీరుపట్ల శ్రద్ధ, రాజ్య నిర్వహణ ధర్మమునందాసక్తి వెల్లడియగును. ఈ చెరువులోని జల పుష్పముల ఫలితములనుభవించి స్వామివారి పల్లకి మోయుట బోయీలకు ఆచారం.

ఈ స్వామి మూలవిరాట్ రాజుగారికి కలలో కనబడి దేవాలయం నిర్మించమని తెలుపగా (నంద్యాల చిన కృష్ణమరాజు గార్కి 1511-1540) కడపజిల్లాలోని తల మంచి పట్నంనుండి రాతిని తెప్పించి నిర్మించిరట.

కాసుల రంగమ్మ కుమార్తె మహానంద సాని ఎకరము 96 సెంట్ల పొలములో పండే వరిధాన్యము తిరుణాల సందర్భములో సంతర్పణ మరియు పేదలకు అన్నదానమునకై స్వామిపేర పెట్టింది. (1909 జూలై 15 తేది నుండి అమలు) అది ఈ నాటి వరక కొనసాగుచున్నది.

లక్ష్మీ భూ చెన్నకేశవస్వామి తిరుణాల



ప్రతి ఏడు వైశాఖ మాసమున 9 దినములు వాహనములు రథోత్సవముతో సహా కన్నుల పండువగా జరుగును. ఎడ్లపందెములు వీనిలో భాగముగా నిర్వహించుట నేటికిని జరుగుచున్నది. గ్రామీణ ప్రాంతములో భక్తి శ్రద్ధలు ఉట్టి పడే విధంగా జరుగుచున్నది. వసంతోత్సవము పారువేట ధనుర్మాసము, సంక్రాంతి పర్వ పూజలయందు ప్రజలు భక్తి శ్రద్ధతో పాల్గొంటారు. శ్రీవారి అమ్మవారి విగ్రహములు పంచలోహ విగ్రహములు చూపురులకు ఆనందాన్ని కలిగిస్తున్నాయి (దాదాపు 50, 60 కేజీల బరువు) శ్రీవారి ఆలయము గోపురము శిథిలావస్థలో నున్నాయి. అక్కడ ఉన్న మండపములు ప్రాచీనకట్టడములు పాలకవర్గము శ్రద్ధవహించి పునర్నిర్మాణమొనరించిన శ్రీవారికి ఎనలేని శోభ చేకూరును. అర్చనలు నిత్యపూజా కైంకర్యములు విశేష ఉత్సవాలు గ్రామప్రజల ఆదరాభిమానములలో జరుగుచున్నవి.



# సత్సంగ మహిమ

శ్రీ శంకర్రప్రియ

సత్సంగ మనగా సజ్జన సాంగత్యము! అది సంసార సాగరమును దాటించే నౌక! భవ రోగమును పోగొట్టే ఔషధము.

ఒక్క ఘడియ (60 విఘడియలు, 24 నిమిషములు) సత్సంగ మహిమకు, పలు సంవత్సరముల తపో మహిమ సమానము కాదంటారు. ఈ సందర్భముగా ఒక ఇతిహాసమును పేర్కొనవచ్చును.

ఒకసారి రాజర్షి విశ్వామిత్రుడు - ఒక యజ్ఞమును నిర్వహించెను. అప్పుడు బ్రాహ్మణులకు, సాధువులకు దానము చేసెను. వారిలో వసిష్ఠ మహర్షికి - ద్వాదశ (12) సంవత్సరముల తపఃఫలమును ధారపోసెను.

మరియొకసారి, బ్రహ్మర్షి వసిష్ఠుడు ఒక యజ్ఞమును నిర్వహించెను. అప్పుడు విశ్వామిత్ర మహర్షికి తగిన దానమును ఇవ్వవలెనని సంకల్పించెను. తదనుగుణముగా ఒక్క ఘడియ సజ్జన సాంగత్యములో పావు ఘడియ (15 విఘడియలు, 6 నిమిషములు) సత్సంగ ఫలమును ధారపోసెను. అందుకు, విశ్వామిత్రుడు అవమానముగా భావించి, కోపోద్రిక్తుడయ్యెను.

అంత వసిష్ఠుడు "రాజర్షీ! మీరు నాకొసగిన తపః ఫలమును మరచిపోలేదు. అద్దానికన్న నేనొసగిన సత్సంగ ఫలము కోటిరెట్లు అధిక ఫలమున కల్గియున్నది" అనగా, విశ్వామిత్రుడు "బ్రహ్మర్షీ! నా యొక్క ద్వాదశ సంవత్సర తపః ఫలముతో, మీ యొక్క పావు ఘడియ సత్సంగ ఫలము సమానమౌనా!" అంటూ, వసిష్ఠుడు గాని, ఋషి బృందము గాని, ఏమి చెప్పినను వినలేదు.

మహర్షులప్పుడు ధర్మ నిర్ణేతలుగా సూర్యుడు, వాయువు, ఆదిశేషుడు, అగస్త్యుడు... మున్నగు వారిని నియమించిరి. వారిని ఆహ్వానించుటకు విశ్వామిత్రుడు వెళ్ళడం సముచితమని చెప్పిరి.

విశ్వామిత్రుడు -- ధర్మనిర్ణేతలను పిలుచుటకు బయల్దేరెను. వారికి జరిగిన వృత్తాంతమును విన్నవించి, దయచేయవలసిందిగా కోరెను.

అంత వారు - తమ విధ్యుక్త ధర్మము నుండి వచ్చుటకు ఏదైన ఉపాయమును చెప్పమనిరి. అప్పుడు, వారికి ఏమి చెప్పలేక విశ్వామిత్రుడు తిరిగి వచ్చెను. తదుపరి, ధర్మ నిర్ణేతలను తీసుకొని వచ్చుటకు వసిష్ఠుని పంపిరి.

వసిష్ఠుడు - ధర్మనిర్ణేతలను పిలుచుకకు వచ్చుటకు బయల్దేరెను.

సూర్యుని వద్దకు వసిష్ఠుడు వెళ్ళి చెప్పగా, "బ్రహ్మర్షీ! నేను జ్యోతిశ్చక్రరాశిలో సంచరించుచున్నాను. అందువలన నేను వచ్చినచో, లోకమునకు వెలుగు లేకుండా పోవును. కావున దీనికి ఏదైన ఉపాయమును మీరే చెప్పండి!" అనెను. అంత వసిష్ఠుడు - పావు ఘడియ సత్సాంగత్య ఫలమును అభిమంత్రించి, 'జపమాల'ను సమర్పించెను. అది సూర్యునివలె ప్రకాశించుచుండెను.

వాయువువద్దకు వసిష్ఠుడు వెళ్ళి చెప్పగా, "బ్రహ్మర్షీ! నేను జీవులకు ప్రాణప్రదముగా నున్నాను అందువలన, నేను వచ్చినచో లోకము నశించి పోవును. కనుక, దీనికి ఏదైన ఉపాయమును మీరే చెప్పండి!" అనెను. అంత, వసిష్ఠుడు - పావు ఘడియ సత్సాంగత్య ఫలమును అభిమంత్రించి, 'విసనకర్ర'ను సమర్పించెను. అది వాయువువలె వీచుచుండెను.

ఆదిశేషుని వద్దకు వసిష్ఠుడు వెళ్ళి, చెప్పగా "బ్రహ్మర్షీ! నేను భూమిని శిరస్సుపై ధరించి యున్నాను. అందువలన నేను వచ్చినచో భూతలము తలక్రిందగును. కావున దీనికి ఏదైన ఉపాయమును మీరే చెప్పండి!" అనెను. అంత, వసిష్ఠుడు - పావు ఘడియ సత్సాంగత్య ఫలమును అభిమంత్రించి, 'యోగ దండము'ను సమర్పించెను. అది ఆదిశేషుని వలె భూమిని ధరించి యుండెను.

అగస్త్యుని వద్దకు వసిష్ఠుడు వెళ్ళి చెప్పగా, "బ్రహ్మర్షీ! నేను శివుని ఆజ్ఞను శిరసావహించి, దక్షిణ భూభాగము నందున్నాను. అందువలన నేను వచ్చినచో, ఉత్తరమువైపునకు భూమి వంగిపోవును. కావున, దీనికి ఏదైన ఉపాయమును మీరే చెప్పండి!" అనెను. అంత వసిష్ఠుడు పావు ఘడియ సత్సాంగత్య ఫలమును అభిమంత్రించి, 'కమండలము'ను సమర్పించెను. అది అగస్త్యునివలె భూమిని యథాస్థితిగా నుంచెను.

వసిష్ఠమహర్షి-- సూర్యుడు, వాయువు, ఆది శేషుడు, అగస్త్యుడు మున్నగువారిని వెంటబెట్టుకొని వచ్చుచుండెను.

విశ్వామిత్ర మహర్షి వారిని చూచి, దిగ్భ్రాంతి చెందెను. అప్పుడు సజ్జన సాంగత్యము యొక్క గొప్పతనమును గుర్తింపగలిగెను.

సత్సంగ మహిమను-- ధర్మనిర్ణేతలు, ఋషి బృందము కొనియాడిరి.

సత్యసూక్తి ఘటించు, ధీ జడిమ మాన్పు
గౌరవ మొసంగు జనులకు, కలుష మడచు
కీర్తి ప్రకటించు, చిత్త విస్ఫూర్తి చేయు
సాధు సంగంబు సకలార్థ సాధనంబు.

--శ్రీ భర్తృహరి సుభాషితమ్.



# కాకతీయ రాజులనాటి శాసన విశేషాలు

మూలం : డా॥ ఎ.కె.వి.ఎస్. రెడ్డి

అనువాదం : జి. శ్రీమతి

కాకతీయరాజులు ప్రథమదశలో కల్యాణ చాళుక్యులకు సామంతరాజులుగా సేవచేశారు. మొదటి కాకతీయరాజులలో బేత I (క్రీ.శ. 999-1052), ప్రోల I (క్రీ.శ. 1053-1075) శక్తిమంతులైనవారు. ప్రోల I త్రైలోక్యమల్లదేవనుంచి శాశ్వత కట్టుబడి ఇనాముగా 'అనుమకొండ' విషయను సంపాదించాడు. బేత II (క్రీ.శ. 1075-1108), ప్రోల I తర్వాత రాజై 'సబ్బిమండలం' ప్రాంతాన్ని పొందాడు. ప్రోల II క్రీ.శ. 1117 నుంచి క్రీ.శ. 1157 వరకు పరిపాలించి గొప్ప రాజుగా పేరు పొందాడు. ఈ వంశంలో రుద్రదేవ (క్రీ.శ. 1156-1195) మొదటి సార్వభౌముడు. ఇతడు మొత్తం తెలంగాణా ప్రాంతాన్ని తనపాలనలోకి తెచ్చాడు. ఇతని కాలంలోనే మొట్టమొదటిసారిగా 'ఓరుగల్లు' (వరంగల్) రాజధాని అయింది

ఇతడు, కొంతకాలం మాత్రమే పరిపాలించిన మహాదేవ (క్రీ.శ.1195-99) తర్వాత అధికారంలోకి వచ్చాడు. ఇతని తదనంతరం ఇతని కుమారుడు 'గణపతి' (1199-1262) అధికారంలోకి వచ్చాడు. పలువిధాల పరిశీలించిన, కాకతీయ గణపతి యొక్క పరిపాలన చాలా కాలం కొనసాగడమే గాక, ఈ కాలంలోనే అనేక ముఖ్య సంఘటనలు సంభవించడం కూడ చెప్పుకోదగ్గ అంశం. వెలనాడు, కర్మరాష్ట్రాన్ని కలిగివుండే తీరాంధ్ర ప్రాంతాన్ని క్రీ.శ. 1209లో జయించడమే గాకుండా, చోళ, కళింగ రాజ్యాలపై జరిగిన దండయాత్రలు కాకతీయులను గొప్పవారిగా నిలబెడతాయి. ఇతనియొక్క దండయాత్రలు రాయలసీమకు చెందిన తెలుగు చోళరాజులమీద మరియు వైదుంబులమీద విజయవంతమవడమే గాకుండా, గణపతి యొక్క సేనాని అయిన 'గంగయసాహిని' అధీనంలో 'మార్జవాడి' ప్రాంతాన్ని కడప, చిత్తూరు జిల్లాలలోని కొన్ని భాగాలను వుంచడమైనది.

రుద్రమదేవి తన తండ్రి అయిన గణపతి దేవుని తర్వాత క్రీ.శ 1262లో కాకతీయ సింహాసనాన్ని అధిష్ఠించింది. ఈమె తన పాలనా కాలంలో రాజ్యంలోనేగాక, బయట నుంచి కూడ ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. ఈమె పాలనలో గోదావరి నది, తూర్పు గంగ కాకతీయ రాజ్యానికి సరిహద్దుగా నిలిచింది. తెలంగాణాలోని ఉత్తరభాగాలు యాదవరాజుల పాలనలోకి వచ్చాయి. రుద్రమదేవి జీవితం, కాయస్థ రాజైన అంబదేవునితో పోరాడే సమయంలో ముగిసింది. అంబదేవుడు ఒకప్పుడు కాకతీయులకు నమ్మకమైన రాజు, ముస్లింల దండయాత్రలు ఉలుఘ్‌ఖాన్‌తో మొదలై కాకతీయుల రాజ్యం అంతమైంది. ముస్లింల దండయాత్రలలో ప్రతాపరుద్రుడు బందీయై, ఢిల్లీకి తీసుకొని వెళ్ళే మార్గంలో తనువు చాలించాడు.

ఆంధ్రదేశ పరిస్థితులను క్రీ.శ. 1000 నుంచి పదునాలుగవ శతాబ్దం మధ్యకాలం వరకు పరిశీలించిన కాకతీయరాజులు మత సంబంధ విషయాలకు అధిక ప్రాధాన్యతనిచ్చి తమదంటూ ఒక గొప్పపేరు తెచ్చుకున్న వారుగా కనబడుతున్నారు. వీరు పలు కళాముఖ కేంద్రాలను వివిధ ప్రాంతాల్లో స్థాపించారు. ద్రాక్షారామం, అమరావతి, విజయవాడ, నాదెండ్ల, మల్లేశ్వరం, ఆలంపురం, శ్రీశైలం, ఓరుగల్లు ముఖ్యమైన ప్రాంతాలు. వీరశైవమతం కర్నాటక రాజ్యంలో విజయవంతమైనప్పటికీ అది అప్పట్లో ప్రబలమైనటువంటి కలాముఖ దేవాలయాల పరిధిలోనికి చోటుచేసుకోలేదు.

ఏది ఏమైనప్పటికీ, బసవబోధలు ప్రజా





# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కామునొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు. ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడ ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాలకోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః।

— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీతమైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

'చంద్రశేఖర'

మోదం పొంది, శ్రీశైలం కర్నాటకలోని వీరశైవులకు ప్రధానకేంద్రమైంది. పలు శాసనాలు, వివిధ గ్రంథాలు పరమభక్తులైన, వీరభద్రులైన మైలార భటులను, వీరముష్టిలను గూర్చి తెలియచెపుతున్నాయి. వీరు శివ సాయుజ్యం కొరకై తమ తలలను కూడ అర్పించేవారు. ఆంధ్రదేశమంతటా మిక్కిలి సంఖ్యలో ఆక్రమించివున్న వీరగల్లులు శివభక్తుల త్యాగాలను గురించి వివరిస్తున్నాయి. "కాపాలిక" తెగలకు శ్రీశైలం ప్రధానకేంద్రం. వీరు పూజించే దైవం "భైరవుడు". మైలార భటులు, వీరముష్టిల యొక్క అలవాట్లు, భైరవుణ్ణి కొలిచే కాపాలికలతో సంబంధం కలిగి, మంచి గుర్తింపు పొందారు. ఈ కాలంలో ఎక్కువగా దేవాలయాలు వీరభద్ర, భైరవులకు సంబంధించినవే మనము చూడవచ్చును.

వైష్ణవమతం క్రమంగా క్రీ.శ. 1000 నుంచి శ్రీకాకుళం, సింహాచలం, బాపట్ల, తిరుపతి, నందలూరు మొదలగు ప్రదేశాలలో అభివృద్ధి చెంది, అవి ముఖ్య కేంద్రాలైనాయి. ముఖ్యమైన శక్తిపీఠాలు గల ప్రదేశాలుగా శ్రీశైలం, అలంపురం, త్రిపురాంతకం, పిఠాపురం అభివృద్ధి చెందాయి. గ్రామదేవతలైన గంగమ్మ, ఎరుకలమ్మ, ఎల్లమ్మ అచ్చట పూజింపబడేవారనడానికి నిదర్శనముగా, శాసనాధారాలు సైతం కనబడుతున్నాయి.

కాకతీయరాజులు ముఖ్యంగా ప్రతాపరుద్ర II కాలంలో, గ్రామదేవతలైన ఏకవీర, మహురమ్మ, కాకతియలను పూజించేవారని తెలుగులో వ్రాయబడిన 'క్రీడాభిరామం' చెపుతోంది. జైనమతం కూడ విశిష్టారాధనలు అందుకునేది. తెలంగాణకు మరియు రాయలసీమకు చెందిన ముఖ్యావిశేషాలు కూడ కొన్ని తెలుస్తున్నాయి. వర్తకసంఘాలు అనగా 'నకరం' ప్రత్యేకంగా దైవారాధనలు గావించేవారు. నగరేశ్వర, నకరేశ్వరాలకు దేవాలయాలు సైతం నిర్మించారని తెలుస్తోంది.

ఆ కాలంలోని సాంఘిక, ఆర్థిక అంశాలను పరిశీలిస్తే, కాకతీయరాజులు ముఖ్యంగా భవననిర్మాణాలను ఎక్కువగా గావించేవారనడంలో ఏమాత్రం ఆశ్చర్యం లేదు. ముస్లింల దండయాత్రలవల్ల పలు కట్టడాలు నాశనమవడమే గాకుండా కాకతీయ సామ్రాజ్యమే పతనమైంది. కాకతీయుల కాలంనాటి శాసనాలను వారు నిర్మించిన వాస్తు నిర్మాణాల ద్వారా పరిశీలిద్దాం.

కాకతీయరాజులు ప్రథమదశలో జైనమతాన్ని ఆదరించారు. కరీంనగర్ జిల్లా 'శనిగరం'లో లభించిన క్రీ.శ. 1051 కాలంనాటి శాసనం బట్టి, కాకతీయ బేత I యొక్క ప్రెగ్గడ (మంత్రి) శనిగరలోని "దుద్దమల్ల జనాలయా'న్ని మరామత్తు గావించినట్లు తెలుస్తోంది. ఈ శాసనం భీమేశ్వరాలయం సమీపంలోని రాతిమీద చెక్కబడి ఉంది. "దుద్దమల్ల జనాలయం" వేములవాడ చాళుక్యరాజైన "యుద్ధమల్ల" కాలంలో నిర్మించబడి ఆయనపేరు మీదుగా వెలుగులోనికి వచ్చింది.

మరియొక శాసనం క్రీ.శ. 1082కు వరంగల్ జిల్లా బానాజీ పేటకు చెందింది. విక్రమల్ల జనాలయానికి స్థలం బేత II చేత ఇవ్వబడినట్లు, ఉగ్రవాదికి చెందిన రాజుచేత ఆలయం నిర్మించబడినట్లు చెపుతోంది. ఈ శాసనం కలిగివున్న స్తంభాన్నొక దానిని ఆ గ్రామంలో మనము చూడవచ్చును.

వరంగల్ జిల్లాలోని శనిగరం గ్రామంలో క్రీ.శ. 1053కి చెందిన శాసనం, శివునికై ఆలయమొకటి నిర్మించబడినట్లుగా చెపుతోంది. ఆ ఆలయం పేరు 'మధుపేశ్వర'. ఈ ఆలయం నిర్మించిన స్థలంపేరు ఖండి శనిగరం. ఈ ఆలయాన్ని నిర్మించిన ప్రెగ్గడ మధుపయ్య పేరు మీదుగా "మధుపేశ్వర" అనే పేరు స్థిరపడింది. కాకతీయ ప్రతాపరుద్ర కొంతభూమిని ఈ దేవాలయ నిర్వహణకై దానంగా ఇచ్చాడు. ఇందుకు సంబంధించిన శాసనం మనమీ గ్రామంలోని స్తంభంమీద చూడవచ్చును. మరియొక ముఖ్యాంశ మేమనగా, జైనాలయాలు ఆ శాసనంలో చెప్పబడినవి ప్రస్తుతం కూడ మనము చూడవచ్చును. వరంగల్ జిల్లాలోని కుమారపల్లెకు చెందిన క్రీ.శ. 1079 నాటి శాసనం, కాకతీయ బేత II చేత బేలేశ్వర, ప్రోలేశ్వర దేవుళ్లకు ఇవ్వబడిన దానం గురించి తెలియచెపుతోంది. బహుశా బేలేశ్వర, బేత I లేక బేత II తర్వాత నిర్మించబడివుండవచ్చును. అలాగే ప్రోలేశ్వర, ప్రోల I తర్వాత నిర్మించబడి వుండవచ్చును. వీరందరూ కూడ కాకతీయ వంశానికి చెందినవారే. ఈ శాసనం ఆ గ్రామంలోని 'మాల పోచమ్మ' దేవత ఆలయం సమీపంలో వుంది.

అదే రాజు కాలంలోని మరియొక శాసనం క్రీ.శ. 1090 నాటికి చెందింది, అనుమకొండలోని 'ఉమాబేలేశ్వర' ఆలయం గూర్చి తెలియచేస్తోంది. ఈ పేరు కూడ ఆ ఆలయానికి బేత I లేక బేత II తర్వాత వచ్చి వుండవచ్చును. ఈ శాసనం చెక్కబడిన స్తంభాన్ని వరంగల్ జిల్లాలోని ఖాజీపేటలోని దర్గాలో చూడవచ్చును.

ఏకాలంనాటిదో తెలియని ఒక శాసనాన్ని మనము హనుమకొండ రికార్డులలో చూడవచ్చును. ఈ రికార్డులను బట్టి వరుణ విగ్రహం, బేత II చేత ఆ గ్రామంలోని చెరువు ఒడ్డున నిర్మించబడినట్లు తెలుస్తోంది. ఇక్కడ గమనించాల్సిన విషయమేమనగా చెరువు ఒడ్డున 'వరుణ' లేక 'గంగ' విగ్రహాలు ప్రతిష్ఠించుటవల్ల ఆ దేవతలు అధికంగా నీటిని ఇస్తారని తెలుస్తోంది.

బేత II తర్వాత దుర్గరాజ సింహాసనాన్ని అధిష్ఠించి బహుకొద్దికాలం అనగా ఎనిమిదేళ్లు మాత్రం పరిపాలించాడు. (క్రీ.శ 1108-16) అతని తర్వాత అతని చిన్న సోదరుడు ప్రోల II నలభై ఒక్క సంవత్సరాలు పరిపాలించాడు (క్రీ.శ. 1116-57). ఇతని పాలనలో పలు దేవాలయాల నిర్మాణం జరిగింది. జైనమతం రుద్రకాలంలో కూడ పోషించబడింది. వరంగల్ జిల్లాలోని 'మ'టేడు'కు చెందిన క్రీ.శ. 1120 కాలంనాటి శాసనం ఆ గ్రామంలో 'మల్లేశ్వరాలయం' నిర్మించబడినట్లుగా చెపుతోంది. ఇదే శాసనం కేశవ, వినాయక ఆలయాలు కూడ వుండేవని చెపుతోంది. ఈ శాసనాన్ని కలిగివున్న రాతి పలక విష్ణుదేవాలయానికి ముందు దొరికింది. బహుశా రికార్డులలో తెలిపిన 'కేశవ' ఇదే అయివుండవచ్చును. మరియొక శాసనం వరంగల్ జిల్లాలోని గోవిందపురానికి చెందిన

## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు- ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయటం వలన ఉపయోగం వుండదు.
- రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

**సంపాదకులు**
**సప్తగిరి**
**తి.తి. దేవస్థానములు**
**తిరుపతి - 517 507**

## రచయితలకు గమనిక

'సప్తగిరి'లో సమీక్ష చేయుటకు రచయితలు తమ గ్రంథాల్ని రెండు ప్రతులుగా పంపవలెను. లేనిచో సమీక్ష చేయబడవు

'సంపాదకులు'

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

క్రీ.శ. 1122 నాటి శాసనం, నాగదేవ 'పర్శ్వజినేశ్వర' విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు, ఆ విగ్రహం కొరకై ఆలయాన్ని నిర్మించి నట్లుగా కూడ తెలుస్తోంది. ఈ శాసనాన్ని రాతి స్తంభంమీద అదే గ్రామంలోని చెరువు ఒడ్డున చూడవచ్చును.

మరియొక శాసనం వరంగల్ జిల్లా గూడురుకు చెందిన క్రీ.శ. 1124కు సంబంధించినది తెలియచేస్తున్న విషయమేమనగా, మిరియాల కుటుంబానికి చెందిన మల్ల అనే సామంతరాజుచేత, మల్లేశ్వరాలయం 'గుముడూరు' గ్రామంలో నిర్మించబడింది. 'మల్ల' తదనంతరం ఆ స్వామికి 'మల్లేశ్వర' అనే పేరు స్థిరపడినట్లు స్పష్టంగా తెలుస్తోంది.

ప్రసిద్ధికెక్కిన వేయిస్తంభాల ఆలయ శాసనం క్రీ.శ. 1163 కాకతీయ రుద్రకు చెందినది తెలియచెపుతున్న విషయమేమనగా, రుద్రేశ్వరాలయం రుద్ర చేత నిర్మించబడినట్లు, తర్వాత ఆ స్వామికి రుద్రేశ్వర పేరు ధృవపడినట్లు, ఈ దేవాలయం 'అనుమకొండ'లో నిర్మించబడినట్లు తెలుస్తోంది. మరియు ఈ శాసనంద్వారా తెలుస్తున్న విషయాలేమనగా, అదే దేవాలయంలో వాసుదేవ, సూర్యవిగ్రహాలు ప్రతిష్ఠించబడినాయి. శాసనంలో తెలుపబడిన 'రుద్రేశ్వరాలయం' నేడు 'వేయిస్తంభాలగుడి'గా ప్రసిద్ధికెక్కింది. ఈ దేవాలయానికి దక్షిణంగా వున్న మండపం మూడువందల స్తంభాలను కలిగివుంది, అవి కూడ జీర్ణావస్థలో ఉన్నాయి. ఈ దేవాలయం 'త్రికూట' వర్గానికి చెందింది. కాకతీయుల కాలానికి చెందిన దేవాలయాలు మూడు గర్భగుళ్లను కలిగి, ఒక్కొక్కటి ప్రత్యేకంగా అంతరాళను కలిగివుండి, గర్భగృహం సాధారణంగా రంగమండపాన్ని కలిగి ఉంటుంది. 'త్రికూట'కు చెందిన ఆలయాలలో మూడు రకాల దేవుళ్లుగాని, లేక ఒకే స్వామికి చెందిన మూడు రూపాలుగాని ఉంటాయి. అనగా ఒక గర్భగుడిలో శివుడు, మరియొక దాంట్లో, విష్ణువు, వేరొక దాంట్లో సూర్యభగవానుడు నెలవై ఉంటారు. (బ్రహ్మను సూర్యునిగా భావించారు.

(సశేషం)



# చిత్రకూటం

మేజర్ షేక్ మౌలాలీ

విశ్వసాహిత్యంలో శ్రీమద్రామాయణం విశిష్టమైనది, మహత్త్వపూర్వమైనది. రామాయణంలో చిత్రకూటానికి విశేషప్రాతినిధ్యం ఉంది. ఈ పుణ్యస్థలిని "బ్రహ్మపురి, సీతాపురి" అని కూడా అంటారు.

రామలక్ష్మణులు శృంగిబేరపురం వద్ద ఒక వటవృక్షం క్రింద జటామంగలధారులయి తాపసరూపం ధరించారు. తదనంతరం శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితంగ గుహుని సహాయంతో గంగను దాటి వత్స దేశంలో ప్రవేశించి, తీర్థరాజమైన ప్రయాగన సేవించి, ప్రక్కనేగల భరద్వాజమహర్షి ఆశ్రమాన్ని దర్శించుకున్నాడు. శ్రీరాముని, సీతను, లక్ష్మణుని ఆదరించిన భరద్వాజుడు "రామచంద్రా! సతతం మధుర పుష్ప ఫలములతో అలరారే రమణీయ ప్రదేశమైన చిత్రకూటంలో మీరు వసించండి. అక్కడ సీతాసహితంగ నీవు విహరించు. మీకు మహదానందం కలుగుతుంది!" అన్నాడు.

మధు మూలఫలోపేతం
చిత్రకూటం వ్రజేతి హ
నానా నగ గణోపేతః
కిన్నరోరగ సేవితః.

"పుణ్యశ్చ రమణీయశ్చ
బహుమూల ఫలాయుతః,
చరతః సీతయా సార్ధం
నన్దిష్యతి మనస్తవ.

మహర్షి ఆజ్ఞానుసారం శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలిసి చిత్రకూటానికి తూర్పునగల వాల్మీకిమహర్షిని దర్శించుకొని, ఆ తదుపరి పశ్చిమంగా ప్రయాణం సాగించి పావన మందాకినీనదీ తీరాన ఆశ్రమం నిర్మించుకొని వసిస్తుంటారు. శ్రీరాముని అనుజ్ఞ ప్రకారం లక్ష్మణస్వామి పర్ణకుటి, యజ్ఞవేదితో సహా నిర్మిస్తాడు.

తస్య తద్వచనం శ్రుత్వా
సౌమిత్రి ర్వివిధాన్ ద్రుమాన్,
ఆజహార తతశ్చక్రే
పర్ణశాలా మరిందమః.

నలువైపుల గగనచుంబిత పర్వత శ్రేణులతో, సతత హరిత వృక్షజాలంతో, కలకల నాదంతో ప్రవహించే సెలయేళ్ళతో, కోకిలమ్మ మధుర కంఠలహరులతో, మయూరాల నాట్య భంగిమలతో, చెంగు చెంగున పరుగులిడే అమాయక హరిణ సమూహములతో, పలువిధముల వానరయూథముల కిచకిచలతో చిత్రకూటం నిత్యశోభలీనుతూ దేశదేశాల నుండి యాత్రికులను ఆకర్షిస్తుంటుంది. ఇక్కడి రమణీయ ప్రకృతి, తాపసిక వాతావరణం ఆనందమయకోశం వైపు జీవులను నడిపిస్తుంది.

## శ్రీరామ ఘాట్

దశరథుని దహన సంస్కారములనంతరం భరతుడు పట్టాభిషేక సామగ్రికి ప్రదక్షిణచేసి, శ్రీరామునకు రాజ్యం అప్పగించే కోరికతో చిత్రకూటం వచ్చి, శ్రీరాముని పాదములాశ్రయించాడు. శ్రీరాముని తిరిగి


శ్రీరామఘాట్



అనసూయాశ్రమము.

వచ్చి రాజ్యభారం వహించవలసినదిగా భరతుడు వేడుకున్నాడు. తండ్రి మరణవార్త వినిన రాముడు దుఃఖించి, తమ్ములతో కలిసి ఇక్కడ మందాకిని, పయస్విని నదుల సంగమంలో తండ్రికి జలాంజలిదానం, పిండదానం వదలి తండ్రి అస్తికలను నిమజ్జనం చేశాడు.

తతో మందాకినీ తీరం
ప్రత్యుత్తీర్య స రాఘవః,
పితుశ్చకార తేజస్వీ
నిర్వాపం భ్రాతృభిస్సహ.

ఈ సంగమస్థలిని శ్రీరామఘాట్ లేక శ్రీరాఘవ ఘాట్ అంటారు. యాత్రికులందరు ఈ ఘాట్‌లో స్నానంచేసి, యజ్ఞవేది తదితర ఆలయాలను దర్శిస్తారు.

శ్రీరామ ఘాట్ ఒడ్డున మందాకినికి పశ్చిమంగ ఒక శివాలయం ఉంది. దానికి పశ్చిమంగ 'యజ్ఞవేది' ఉంది. ఇక్కడ బ్రహ్మ యజ్ఞం చేసినట్లు చెప్పబడుతుంది. మహర్షి వాల్మీకి, శ్రీరాముడు వసించిన కటీరమునకు అనురూపంగ వేదిస్థలి, చైత్యముల, ఆయతనములు నిర్మించుకున్నట్లు వర్ణించాడు--

వేదిస్థల విధానాని
చైత్యా న్యాయతనాని చ,
ఆశ్రమస్యానురూపాణి
స్థాపయామాస రాఘవః.

యజ్ఞవేదికి ప్రక్కనే సీతారాముల పర్ణకుటి ఉంది. ఆ కుటీరం స్థానంలో ప్రస్తుతం సీతారాముల ఆలయం వెలసింది. ఈ ఆలయ దక్షిణభాగంలో లక్ష్మణస్వామి ఆలయం నిర్మించబడింది. దానికి దక్షిణంగ భరతునకు, శ్రీరాముడు పాదుకలు ప్రదానం చేసిన ప్రదేశంలో భరతుని కోవెల నిర్మించబడింది. ఇక్కడే సీతమ్మ, లక్ష్మణస్వామి తులసివనం పెంచినట్ల చెప్పబడుతుంది. మహాకవి తులసీదాసుకు ఆంజనేయుని ప్రేరణవలన సీతారామలక్ష్మణుల దర్శనం ఇక్కడ అయిందని ప్రతీతి. అప్పుడు తులసీదాసు చందనం తీసి స్వయంగ శ్రీరామునకు సమర్పించుకున్నట్ల తానుగా చెప్పుకున్నాడు.

చిత్రకూట కే ఘాట్ పర్
భయీ సంతన కే భీర్
తులసీదాస చందన ఘిసై
తిలక్ దేత రఘువీర్.

సీతారామలక్ష్మణుల దర్శనం కలిగిన చోట తులసీదాసు దేవాలయం నిర్మించబడింది.

## స్ఫటిక శిల

శ్రీరామఘాట్‌కు నైరుతిదిశలో పావన మందాకిని తీరంలో అత్రి అనసూయల ఆశ్రమం ఉంది. అదే మార్గంలో జనకతనయ వైదేహి స్నానమాచరించిన 'జానకీ కుండ్' ఉంది. దాని సమీపంలో సీతారాములు విశ్రమించిన స్ఫటికశిల ఉన్నది. ఈ శిలమీద కూర్చొని శ్రీరాముడు సీతమ్మను వివిధ పుష్పములతో అలంకరించినట్లు శ్రీరామ చరిత మానస్‌లో వర్ణించబడింది.

ఏక్ బార్ చుని కుసుమ సుహాయే
నిజకర భూషణ రామ్ బనాయే,
సీత హి పహిరాయే ప్రభు సాదర్
బైఠే ఫటికశిలా పర్ సుందర్.

కాకాసురుడు సీతమ్మను ఇక్కడే గాయపరిచాడని ప్రతీతి. సీతారాముల పదచిహ్నములుగా చెప్పబడుతున్న కొన్ని గుర్తులు స్థానికులు ఈ స్ఫటికశిలమీద చూపిస్తారు.

ప్రక్కనే శివ, ఆంజనేయమూర్తులు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి.

## కామదగిరి

శ్రీరామఘాట్‌కు పశ్చిమంగా రెండు కిలోమీటర్ల దూరంలో 'కామదగిరి' అనే కొండ ఉంది. ఇది చాల మహత్తుగలదిగా పేర్కొనబడింది. ఈ కొండమీద సీతారామలక్ష్మణులు కొంత కాలం విహరించారని ప్రతీతి. ఇప్పటికి కూడా సీతారామలక్ష్మణులు ఇక్కడ విహరిస్తుంటారని ధార్మికుల విశ్వాసం. ఈ కొండకు ప్రదక్షిణచేస్తే సీతారామలక్ష్మణులకు పరిక్రమచేసినట్లవుతుందని ఆస్తికజనుల ప్రగాఢ విశ్వాసం. ఈ పరిక్రమ కొలత ఐదుకిలోమీటర్లు ఉంటుంది. ప్రతి-యాత్రికుడు ఈ కొండకు ప్రదక్షిణం చేస్తాడు. కామదగిరి ప్రదక్షిణం చేస్తేనే చిత్రకూటం యాత్ర సఫలమవుతుంది. ఈ కొండమీదకి ఎవ్వరు ఎక్కరు. ప్రదక్షిణ చేసే సమయంలో ఎందరో యోగులు, మహర్షులు ధ్యానమగ్నులై దర్శనమిస్తారు.

కామదగిరి పరిక్రమ విశేషఫలదాయకమైనదిగా భావింపబడుతుంది. ఆశ్వయుజ పూర్ణిమనాడు ప్రదక్షిణం చేస్తే అత్యుత్తమ ఫలప్రదంగ పేర్కొనబడుతుంది.

## హనుమాన్ ధారా

శ్రీరామఘాట్‌కు దక్షిణదిశలో ఐదు కిలోమీటర్ల దూరాన మందాకిని తూర్పు ఒడ్డున ఒక కొండ ఉంది. ఇక్కడ కొన్ని కోట్ల సంవత్సరాల నుండి ఒక జలధార ప్రవహిస్తోంది. ఇక్కడ విచిత్రమేమంటే 25 సెం.మీ. పరిధితో (లావుగా) పైశిలలో నుండి క్రింది శిలలోనికి చాలా వేగంతో నీరు ప్రవహిస్తుంటుంది.

ఈ జలధార ఎక్కడనుండి ప్రవహిస్తుందో ఎన్ని శాస్త్రీయ ప్రయోగాలు చేసినప్పటికి ఆధారాలు లభ్యపడలేదు. ఈ ధారను 'హనుమాన్‌ధారా' అంటారు. ఈ కొండమీద సీతమ్మ మహర్షులను సేవించినట్లు చెప్పబడుతుంది. ఇక్కడ పంచముఖ ఆంజనేయ, కార్తికేయ, 29 కపాలములతో అలంకరించుకున్న శంకర, అత్రి, అగస్త్య, సుతీక్ష్ణ, శరభంగ, వాల్మీకి మూర్తులున్నాయి. చాలా తాపసిక గుహలు ఈ కొండచుట్టూ కానవస్తాయి.

## అన్య దర్శనీయ క్షేత్రములు

గుప్త గోదావరి గుహలు చిత్రకూటంలో ఒక విశిష్ట రమణీయ ప్రదేశం. ఇక్కడి గుహలలో సీతారామలక్ష్మణులు విహరించారని ప్రతీతి. ఇక్కడి ప్రాకృతిక శోభ భారతదేశంలో అన్యత్ర దుర్లభం. కామదగిరికి పశ్చిమంగ 10 కి.మీ. దూరంలో భరతకూపం ఉంది. శ్రీరాముని అయోధ్యకు తీసుకొనిపోయి రాజ్యాభిషేకం చేయించాలనే కోరికతో భరతుడు అనేక తీర్థముల జలం తెప్పించాడు. వనవాసం గడువు పూర్తికానిదే తిరిగివచ్చేది లేదని రాముడు ధృవీకరించగా, భరతుడు తెప్పించిన తీర్థజలం ఈ బావిలో పోయించినాడని స్థానికుల కథనం. కనుకనే దీనిని 'భరతకూపం' అంటారు. దీని తీర్థం సేవిస్తే భారతదేశంలోని సకల తీర్థములను సేవించిన ఫలం ప్రాప్తిస్తుందని ఆస్తికజనుల నమ్మకం. గాయత్రి శక్తిపీఠం, తపోవనం, శబరి ఆశ్రమం మొదలైనవి తప్పక దర్శిం

శ్రీ సీతారామలక్ష్మణ ఆలయములు.



## విజ్ఞప్తి

# శ్రీవారి ఆలయం, తిరుమల.

తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీవారి ప్రసాద పణ్యారములు, ఆర్జిత చేరుపులు, పడుల ధరలు 27-7-92 నుండి ఈ క్రింది విధంగా వుంటాయి.

భక్తులు ఈ విషయాన్ని గమనించి ఆ యా మొత్తాలు చెల్లించ వలసిందిగా విజ్ఞప్తి.

| | | | |
|---|---|---|---|
| 1. | పొంగలి | $\frac{1}{4}$ పోల | రు. 225-00లు |
| 2. | చక్కెర పొంగలి | ,, | రు. 250-00లు |
| 3. | పులిహోర | ,, | రు. 200-00లు |
| 4. | దధ్యోదనం | ,, | రు. 100-00లు |
| 5. | శాకరి బాత్ | ,, | రు. 250-00లు |
| 6. | సీరా | ,, | రు. 450-00లు |
| 7. | పాయసం | ,, | రు. 225-00లు |

వతగినవి. చిత్రకూటం సర్వత్ర రామనామ స్మరణ ధ్వనిస్తూ, స్పందిస్తూ ఉంటుంది.

### ప్రశస్తి

వాల్మీకి మహర్షి శ్రీరాముని అప్రమేయ తత్త్వాన్ని మారీచునిచేత "రామో విగ్రహవాన్ ధర్మః" అని కీర్తింప చేస్తాడు. శ్రీ రామావతారం 'అనుష్ఠానావతారం'గ ప్రస్తుతింపబడుతుంది. ఆత్మధర్మ ప్రచారమే శ్రీరామావతార వైశిష్ట్యం, వల్కలములు, జడలు ధరించిన రాముడు వనవాస సమయంలో ఎందరో మహర్షులకు దర్శనమిచ్చి, వారిని సేవించి వారందరిని ఉద్ధరిస్తాడు. మహర్షులంతా శ్రీరాముని రాకను ఎదురుచూస్తుంటారు. శ్రీరామ దర్శనానంతరం చాలమంది మహర్షులు మోక్షప్రాప్తి నొందుతారు.

చిత్రకూటం ఆదినుండి తాపసిక కేంద్రం, మహర్షులకు నిలయం. పర్వతశ్రేణులను చీల్చుకుంటూ పావన మందాకిని స్వచ్ఛందగ ముందుకు సాగుతుంటుంది. ఇక్కడి రమణీయ ప్రకృతిని కవి వాల్మీకి--

> నానామృగగణై ర్ద్వీపితరక్ష్వృక్షగణైర్వృతః
> అదుష్టై ర్భాత్యయం శైలో
> బహుపక్షి సమాకులః.

అని వర్ణించాడు.

ఇక్కడగల పలురకాల వానరములు యాత్రికులకు చాల సన్నిహితంగ వస్తాయి. వీటి ప్రవర్తన చాల సాత్త్వికంగ, సాధుయుక్తంగ ఉంటుంది. వీనిని చూడగనే, 'అంజనానందనం', 'ప్రసన్నాంజనేయం' సూక్తులు స్మృతికి వస్తాయి. చిత్రకూటమంతా 'సీతారామమయం'గ ధ్వనిస్తూ ఉంటుంది. ప్రతి ఇంట, ప్రతి నోట "సీతారామ్, సీతారామ్ సీతారామ్ జయ సీతారామ్!" మంత్రం పల్లవితమవుతూ ఉంటుంది. ఆనాడు శ్రీరామునితో ఇక్కడగల మహర్షులందరు ఏకకంఠంగ "నగరంలో కాని, అడవిలోకాని, నీవే మా సంరక్షకుడవు" అన్నారు.

> నగరస్థో వనస్థో వా
> త్వం నో రాజా జనేశ్వరః

మహర్షుల బాధలు విని రామచంద్రుడు రాక్షస సంహారం చేసి వారికి ఆనందం చేకూరుస్తానన్నాడు. "రామ ఏవ పరంబ్రహ్మ, రామ ఏవ పరంతపః!" అనే ఆనాటి మహర్షుల భావన ఇప్పటికి ఇక్కడ అణువణువున ప్రతి స్పందిస్తుంటుంది.

### వసతులు

చిత్రకూటం అలహాబాదుకు నైరుతి దిశలో సాగర్‌రోడ్డుమీద 127 కిలోమీటర్ల దూరంలో ఉంది. రైలు లేక బస్సు ప్రయాణంలో 'కర్వీ' అనే గ్రామంలో దిగి దక్షిణంగ 10 కి.మీ. వెళితే చిత్రకూటం వస్తుంది. కర్వీనుండి ప్రతి అయిదు నిమిషములకు బస్సు లేక వ్యానులో చిత్రకూటం వెళ్ళవచ్చు.

'చిత్రకూటం'కు "చిత్ర విచిత్రముల కలయిక" అని అర్థం. రామాయణంలో చిత్రకూట కథా ఘట్టం చాల ముఖ్యమైనది. ప్రాదేశికంగ కూడ చిత్రకూటం ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌ల కూడలిలో ఉంది. సగం క్షేత్రం ఒక రాష్ట్ర పరిధిలో ఉంటే మిగతా సగభాగం మరో రాష్ట్రంలోకి వస్తుంది. ఇరు రాష్ట్రముల వసతి గృహాలు ఇక్కడ ఉన్నాయి. చిత్రకూటం తిరిగి చూడటానికి కనీసం రెండు రోజులు పడుతుంది. యాత్రికుల సౌకర్యార్థం ఇక్కడ చాలా ధర్మశాలలున్నాయి. దసరా, దీపావళిలలో విశేష ఉత్సవాలు జరుగుతాయి. వసంత నవరాత్రులు ఎంతో ఘనంగ జరుపుకుంటారిక్కడ. శ్రీ మద్రామాయణంలో శ్రీరామ వనగమనం వసంత నవరాత్రులలోనే మొదలవుతుంది. కనుక చైత్రమాసంలో శ్రీరాముడు, సీతమ్మతల్లి, లక్ష్మణస్వామి చిత్రకూటానికి తరలి వస్తారని ఇక్కడ ఆబాల గోపాలం భావించి ఆనందోత్సవాలలో తన్మయులవుతారు.

వనవాస సమయంలో శ్రీరాముడు సీతమ్మకు చిత్రకూటం రమణీయ శోభను గూర్చి వర్ణించి చెపుతాడు. చిత్రకూటం ఇప్పటికి అలాగే ఉంది.

> బహు పుష్పఫలే రమ్యే
> నానా ద్విజగణాయుతే,
> విచిత్ర శిఖరే హ్యస్మిన్
> రతవా నస్మి భామిని.



దైవతత్త్వాన్ని దర్శించడానికి మన ప్రాచీన మహర్షులెందరో ఎన్నో మార్గాలు వేశారు. వాటిల్లో భక్తి, జ్ఞాన, వైరాగ్యములు తిన్నని మార్గాలు. వీటినుండి పయనించు పథికులు దారితప్పక నిరాటంకముగా యాత్ర కొనసాగించి ఆ దైవతత్త్వాన్ని దర్శిస్తారు. ఈ త్రివిధ మార్గాల్లో భక్తి మార్గం చాలా ప్రాశస్త్యం వహించింది. ఈ మార్గాన జ్ఞాని, అజ్ఞాని, భిక్షకుడు-- పుడమిఱేడువరకు కుల, మత, లింగ వయోభేదాలు లేకుండా యాత్రసాగించి తుదకు చిత్స్వరూపమైన దైవ తత్త్వాన్ని సందర్శించి జననమరణదారుణ కరాళ దంష్ట్రలనుండి తప్పించుకొని జన్మ రాహిత్యం పొందుతారు.

ఈ మార్గంలో జ్ఞాననౌకలు గాని, వైరాగ్య బృహత్పోతములు (పెద్ద ఓడలు) గాని సంసార సాగర సంతరణానికి అవసరం ఉండవు. కేవలం భక్తియే సంసారసాగర సముత్తరణైక నౌకగా వ్యవహృతమౌతుంది. ఆదిశంకరులవారు "భక్తిరేకా భవార్ణవనౌకా" అని వ్రాశారు. అనగా భక్తి ఒక్కటియే భవసాగర తరణంచేసే నౌకయని భావం. ఈ మార్గంలో పయనించు భక్తులకు ఎండమావు లడ్డంకులు కావు. అథవా దృగ్గోచరమైనను అవి మిథ్యయని గుర్తించబడి వారిని ఆశా పాశబద్ధుల జేయజాలవు.

భక్తి అంటే దైవతత్త్వంమీద దృఢమైన, నిశ్చలమైన నమ్మకభావం. ఈ సకల చరా చర సృష్టియంతయు సర్వేశ్వరుని లీలతో జరిగి, పెరిగి, విరిగిపోవుచున్నదని దృఢమైన నమ్మకభావానికే మారుపేరు భక్తి. విక సించే కుసుమాలను తిలకించినా, మనస్సుకు ఆనందాన్ని సమకూర్చే మకరంద సుగం ధాన్ని ఆఘ్రాణించినా, తత్శిఖరాగ్రాలనుండి మహావేగంతో, కలకలధ్వనులతో ప్రవహించే నిర్ఝరుల నిరీక్షించినా, గంభీరంగా ప్రవహించే నదీమతల్లులను తిలకించినను, సుఖదుఃఖాల్లా నిరంతరం తరంగితమయ్యే సాగర తరంగాల నాలోకించినా, నిశీథ సమయంలో నిశ్చలస మాధిలోనున్న యోగి పుంగవుల హృదయ జ్యోతుల్లా ప్రకాశించే తారావళిని చూచినను, అంతా దై[illegible] [illegible] భక్తి.

అట్టి భక్తి నిండిన డెందాలకు అణువు మొదలు బ్రహ్మాండమువరకు సమస్త సృష్ట్యం తయు దైవమాయగా గోచరిస్తుంది. అపుడే అహంభావమంతరించి కర్తృత్వభావ మేఘాల నుండి ముక్తమై హృదయాకాశం సునిర్మలమై విరాజిల్లుతుంది. "నే"ననే భావం నశించిన భక్తులు పరమాత్మలో ఐక్యమై పోతారు. భక్తులెప్పుడు తమను నిమిత్త మాత్రులమని భావిస్తారు. అయినా తమకు భగవంతునిచే ఆదేశింపబడిన కార్యకలాపాలను నిర్విఘ్నంగా నెరవేర్చడానికెన్నడు వెనుదీయరు. మహావీ రుల్లా సాహసంతో ముందుక అడుగిడి ఏత్ర స్థైర్యంతో, ఉత్సాహంతో, ధైర్యంగా శక్తివంచన లేకుండా జీవితయాత్ర సాగిస్తూ ఉంటారు. ఎన్ని అవాంతరాలొచ్చినా, ఎన్ని బాధల వాటి [illegible] ఆపదలు ఎదురైనా వాటికి గురిగాక నిశ్చలంగా [illegible] బింబాలు హృదయాకాశాల్లో దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉంటాయి. అటువంటి భక్తులు దుష్టులతో, దుర్మార్గులతో, అహంకారులతో, మూఢులతో, మూర్ఖులతో, నీతిబాహ్యులతో, వంచకులతో, తెలిసీ తెలియక సర్వజ్ఞుల మను




కొనే అజ్ఞానులతో అందరితో కలిసి మెలసి సంచరించినావారు మాయా వాగురి (వలలో) చేపల్లా చిక్కక నదీజలంలా తమ లక్ష్యస్థాన మైన భగవత్సాగరంలో తాదాత్మ్యత చెంది తరించిపోతారు.

జీవిత మరుభూమి దిరుగు పాంథులకు భక్తి పీయూష వర్ష సదృశ్యమైనది. ప్రాపంచక విషయవాంఛా వాయుతరంగాలకు కలత

చెందని దివ్యజ్యోతియే భక్తి.

అంచేతనే భాగవతకారుడు "దైవత్త్వము చాలదు భక్తి చాలిన క్రియన్" అని వ్రాశాడు. భక్తి నిండిన డెందం నిర్మల సరోవరంలాంటిది. దాన్నుండి భావ ప్రవాహాలుద్భవిస్తాయి. అవి విశాల మానవ సమాజ హృదయ క్షేత్రాల్లో ప్రవహించి సారవంతం చేస్తూ నానానేక మనో శాకుంతసంతములకు ఆశా పిపాస దీర్చి అంతమున అనంత దైవ జలధిలో కలసిపోతాయి.

ఈ భక్తిమార్గం స్థూలంగా ద్వివిధాలు.

1. నిర్గుణ భక్తి, 2. సగుణ భక్తి

*1. నిర్గుణ భక్తి :* అణువు మొదలు బ్రహ్మాండము వరకు నామరూప రహితంగానూ, ఆదిమధ్యాంతశూన్యంగాను, సర్వవ్యాప్తి చెంది ఇందుః గలడందులే దని సందేహం లేకుండా యెందెందు వెదకి చూచిన అందందే పరిశుద్ధమై, నిత్యమై, సత్యమై, అనంతమై, అమృతమై, అవ్యయమై, అనాదినిధనమై, బుద్ధమై, నిర్వికల్పమై, అర్థవంతమై, సమస్తమున కాలవాలమై సర్వచరాచర ప్రపంచానికి స్థానభూతమై సమస్తము తానెయైన అఖండశక్తి నారాధించు పద్ధతియె నిర్గుణభక్తి. ఏతద్భక్తి సంపన్నులు -- కొదమకోయిల కంఠకోమల నిస్వనంలో భగవతమృత గీతికల నాలపిస్తారు. ప్రకృతిని శోభింజేయు పాదపములయందు పరమశాంతిని దర్శిస్తారు.

*2. సగుణ భక్తి :* ఇది నిరాకార నిఖిలేశుని నానా విధ నామరూపాంలో దర్శించి స్తుతించి తరించేది. చతుర్భుజుడనియు, చతుర్ముఖుడనియు, త్రిలోచనుడనియు, సహస్రాక్షుడనియు, గజచర్మాంబరధారియనియు, కనకాంబరధారియనియు, కైలాసవాసుడనియు, శేషాచలవాసుడనియు, వైకుంఠవాసియనియు విభిన్నరీతులుగా సగుణభక్తులు దైవాన్నారాధిస్తారు. కవులు ఈ సాకార పరమేశ్వరుని అనేక వర్ణనలతో వర్ణించి స్తుతిస్తారు. ఇన్ని భేదాలుగా వర్ణించినను భగవతత్త్వము ఒకటేనని గమనించాలి. నదీ జలాన్ని బంగారు ఓంటెంతో ముంచుకొ

న్నను, స్టీలు కడవలతో నింపుకొన్నను, ప్లాస్టిక్ పాత్రలలో పట్టుకొన్నను, మృణ్మయ భాండములలో ముంచుకొన్నను, అందలి జలం ఆ యా పాత్రల పరిమాణంలో నుండినను అన్నిటియందున్న జలతత్త్వం ఒకటేగదా! సర్వ దేవనమస్కారాన్ కేశవంప్రతిగచ్ఛాతి అనునట్లు విభిన్న నామరూపాలతో ప్రవహించిన నదులన్నీ సాగరంలో లీనమైనట్లు సమస్త దైవస్తుతులన్నీ సృష్టికర్తకే చెందుతాయట.

ఎవరే విధంగా భజిస్తే నేనావిధంగానే భజింపబడగలనని భగవంతుడే స్వయంగా చెప్పినాడని వేదవ్యాసుడు వ్రాశాడు.

"శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాద సేవనం
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మ నివేదనం."

అను తొమ్మిది మార్గాలు కల్పించబడ్డాయి. భగవత్కథాశ్రవణమువలనగాని, విష్ణుస్తోత్రంతోగాని, భగవన్నామ సంస్మరణతోగాని, భగవత్పాద సేవనంతోగాని, పూజలతోగాని, నమస్కారములతోగాని లేక దాస్య పద్ధతితోగాని, స్నేహభావంతోగాని, ఆత్మ నివేదనతోగాని భగవంతుని ఆరాధించి తరించగలరు. ఒక నిర్దిష్ట స్థలానికి రైలుమార్గంద్వారాను, బస్సుమార్గంద్వారాను, పడవ మార్గంగాను, విమానమార్గంగాను, కాలినడక ద్వారాను చేరగలుగునట్లు భక్తులు విభిన్న మార్గాలుగా భగవదద్ధర్శన లక్ష్యాన్ని సాధించగల్గుతారు.

కుమ్మరివాడు తన ఇష్టమొచ్చిన రూపాన్నిచ్చి కుండలుచేయునట్లు భక్తులు తమతమ భావరూప కల్పనాభాండములతో భగవత్స్వరూపజలాన్ని గ్రహించి భగత్తృష్ణానివృత్తిచెంది ధన్యులౌతారు.

పాణిని మహాశయుడు వ్రాసిన ప్రకారం-- క్లేశ కర్మములనుండియు, కర్మ ఫలమునుండియు, ప్రాపంచిక విషయ వాసనాతతుల నుండియు ముక్తినిగా ఈశ్వరుని భావిస్తారు భక్తులు. వీరు భక్త్యౌషధసేవనా విశేషంతో దుశ్చరితవ్యాధులనుండి రక్షించబడి శాంతి స్వస్థతను పొందగల్గుతారు.

మానవుడు తన దుశ్చరిత్రనుండి తొలంగనంతవరకు శాంతిని పొందజాలడు. దోషభూయిష్టమైన ప్రవర్తన - తృష్ణావశవర్తియై ప్రవర్ధమానమౌతుంది. కనుక "తాంతృష్ణాం పరిత్యజన్ ప్రాజ్ఞః సుఖేనైవోప భోగ్యతే" అనునట్లు ప్రాజ్ఞులు అట్టి తృష్ణను త్యజించి సుఖాన్నే పొందుతారు. అట్టి భక్తివలన ఆదర్శం ప్రకాశిస్తుంది. ఆడంబరం అంతరిస్తుంది. నిరాడంబరత వృద్ధి చెందుతుంది. ఆశాతంతువులు తెగిపోతాయి. అహంభావం అమానుషత్వం, అవినీతి, అలసత్వం, అక్రమప్రవర్తన, అసురభావం మొదలైన దుర్గుణాలన్ని నిర్మూలించబడతాయి. సహానుభూతి, సామరస్యం, సాదర్యభావం, సంఘీభావం, విశ్వాసం, వినయవిధేయతలు, కర్తవ్య భావం, ధర్మబద్ధత్వం, వంటి నిర్మల భావాలంకురిస్తాయి.

క్షీరనీర మిశ్రమమునుండి హంసరే విధంగా నీటిని వేరుచేసి క్షీరమును మాత్రమే గ్రహిస్తాయో ఆదే విధంగా భక్తులు కూడా చెడ్డనొదలి మంచినే స్వీకరిస్తారు. వారు స్వచ్ఛందపథంలో తమ జీవిత రథాలను నడుపుకో గల్గుతారు. ఇంద్రియాలనే గుర్రాలను మనస్సనే పగ్గాలతో బుద్ధిబలంతో బిగియబట్టి సక్రమమార్గాలలో చక్కగా నడిపించుకోగల్గుతారు. పరోపకారార్థం వృక్షాలు ఫలించునట్లు మరియు నదులు ప్రవహించునట్లు లోకకళ్యాణార్థమే పంచభూతాలు తమ కర్తవ్యాలను నెరవేరుస్తు భగవదాజ్ఞకులోనై సంచరించునట్లు భక్తులు కూడా సత్ప్రవర్తనా కర్ణధారులై తమజీవితనౌకలను దరి జేర్చుకొనగల్గుతారు. నిజంగా భక్తి యమ, నియమములను తటద్వయ మధ్యమ్ముగా ప్రవహించు ఒక మహానది వంటిది. భక్తులు సర్వావస్థలయందును పరతత్త్వమహత్త్వ తత్త్వాన్ని ధ్యానించి తరిస్తారు.

భక్తులు భజనులతో, పుణ్యకథా శ్రవణముతో, పూజలతో, పుణ్యకార్యాచరణలతో, పులకితగాత్రులై ప్రతికార్యం భగవంతునిచేతనే చేయించబడుచున్నదని ఆతని ఆజ్ఞమేరకే చేస్తున్నానని తలంచి భగవద్రూప సందర్శనంచేస్తూ సాగర సంగమమయ్యే నదుల్లా అయిపోతారు. కీటకం భ్రమర ఝుంకారంతో భ్రమరమైనట్లు భక్తులు భగవన్నామ సంస్మరణతో జగన్నాధునిగానే మారిపోతారు. అపార పారావారం నుండి అసంఖ్యాకతరంగాలుద్భవించి దానియందే మరల లయమై పోవునట్లు భక్తులు భక్తిసాధనతో భగవంతునిలో ఐక్యమైపోతారు. ఇట్టి భక్తులకు ఉదాసీనతగాని, వ్యధలుగాని, సుఖదుఃఖాలుగాని, మానావమానాలుగాని, ఉచ్చనీచతలుగాని, శుభాశుభములుగాని, అడ్డు రావు. ఎన్ని వలలు పన్నినను, ఎన్ని ఆనకట్టలు కట్టినను నదుల జలం సముద్రాన్ని చేరినట్లు భక్తుల ఆత్మలు పరమాత్మను కలుసుకుంటాయి. కనుక భక్తి సంసారసాగర సముత్తరణైక నౌకయని చెప్పవచ్చు. భక్తి నిజంగా భవకాంతార దవానలం. దైవతత్త్వ సాధసోపానం.



## ఆ తిరుమలేశుడే

కరుణ చిలికెడి వాడు
శరణు చూపెడి వాడు
జగము కాచెడి వాడు
అఘము బాపెడి వాడు
ఆ తిరుమలేశుడే!
ఆ శ్రీనివాసుడే!

మనల బ్రోచెడి వాడు
చెడును మాపెడి వాడు
వరము లొసగెడి వాడు
అభయ మిచ్చెడి వాడు
ఆ తిరుమలేశుడే!
ఆ శ్రీనివాసుడే!

శ్రీ కె. రఘుపతి



# వార్తాలహరి



## రావుల పదవీ విరమణ

తిరుమల తిరుపతి దేవస్థానం పౌర సంబంధాధికారి డా॥ రావుల సూర్యానా రాయణమూర్తి డిసెంబరు 31 శుక్ర వారంనాడు పదవీవిరమణ చేశారు. శ్రీ రావుల 1964 జిల్లా పౌరసంబంధాల అధికారిగా నియమితులై అంచెలంచె లుగా రాష్ట్రసమాచారశాఖలో అదనపు సంచాలకులుగా నియమితులయ్యారు. అనంతరం తి.తి. దేవస్థానంలో పౌర సంబంధాధికారిగా దాదాపు 15 సంవ త్సరాలపాటు పనిచేశారు.

పౌరసంబంధాధికారి పదవిలో వుంటూనే శ్రీరావుల అమెరికాలోని యూనివర్శిటీనుంచి డాక్టరేటు పట్టం పొందారు. దాదాపు 15 గ్రంథాల్ని రచించారు. భగవద్గీతకు వ్యాఖ్యానం వ్రాశారు. సరళశైలిలో వారు వ్రాసిన రామాయణం సప్తగిరిలో సీరియ ల్‌గా ప్రచురితమవుతున్నది. మృదు భాషి, స్నేహశీలి అయిన రావులవారు తి.తి.దే.కు చేసిన సేవల్ని ఎందరో కొనియాడారు.

## కొత్త ఛీఫ్ ఇంజనీర్

తిరుమల తిరుపతి దేవస్థానంలో సూపరింటెండెంట్ ఇంజినీరుగా పని చేస్తున్న శ్రీ ఆంజనేయులునాయుడు తి.తి.దే. ఛీఫ్ ఇంజినీరుగా డిసెంబరు 30 గురువారంనాడు పదవీ బాధ్య తలు స్వీకరించారు. వీరు 1960లో తి.తి.దే.లో అసిస్టెంటు ఇంజినీరుగా ప్రవేశించారు. 1969లో డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా, 1983లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా, 1990 లో సూపరింటెండెంట్ ఇంజినీరుగా ప్రమోషను పొందారు. ప్రభుత్వం నుంచి డెప్యుటేషన్‌మీద రావటం కాక తొలిసారిగా తి.తి.దేవస్థానంలో వీరు ఛీఫ్ ఇంజనీరు పదవి చేపట్టారు.

## శ్రీవారికి 25 లక్షలు

తిరుమల శ్రీవారికి కానుకగా ఓ అజ్ఞాతభక్తుడు 25 లక్షల రూపా యలను డిసెంబరు 31 శుక్రవారం నాడు హుండీలో వేశాడు. శుక్రవారం మధ్యాహ్నం పరకామణి లెక్కింపులో ఈ విషయం తెలిసింది.

## జనవరి 1న

1994 జనవరి 1 శనివారం నూతన సంవత్సరం సందర్భంగా తిరుమల భక్తు లతో నిండిపోయింది. తిరుమలేశుని దర్శించటానికి వచ్చిన భక్తుల సౌక ర్యార్థం తి.తి. దేవస్థానం అధికారులు విస్తృతమైన ఏర్పాట్లు చేశారు. శుక్ర వారం అర్ధరాత్రినుంచీ శ్రీవారి దర్శనం ప్రారంభమైంది. జనవరి 1 సాయంత్రా నికి ప్రత్యేక ప్రవేశంద్వారా దాదాపు 25,000 మంది, సర్వదర్శనంద్వారా 40 వేల మంది శ్రీవారిని దర్శించుకు న్నారు. శ్రీవారికి హుండీద్వారా 29 లక్షలు ఆదాయం వచ్చింది. గత సంవ త్సరం జనవరి 1న శ్రీవారికి దాదాపు 22 లక్షలు ఆదాయం వచ్చింది.

## శ్రీవారికి స్వర్ణ ఖడ్గం

తిరుమల శ్రీవారికి మస్కట్‌లోని ఓమెన్‌లో స్థిరపడిన ప్రవాస భారతీ యుడు కల్నల్ ఎస్.బి. నాయర్ 39.8 లక్షల విలువచేసే బంగారు ఖడ్గాన్ని (సూర్యకటారి) బహూకరిం చారు. జనవరి 5 బుధవారంనాడు తిరుమల శ్రీవారి రంగనాయకమండ పంలో శ్రీనాయర్ ఈ ఖడ్గాన్ని తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్. ఎన్.మూర్తికి అందజేశారు. తన మను మడు గౌతమ్‌సునీల్ పుట్టినరోజు సంద ర్భంగా ఈ ఖడ్గాన్ని ఆయన శ్రీవారికి సమర్పించారు.

ఈ ఖడ్గం పూర్తిగా 22 క్యారెట్ల బంగారంతో తయారుచేశారు. ఇందులో 36.7 క్యారెట్ల వజ్రాలు, 52.7 క్యారెట్ల కెంపులు, 81.8 క్యారెట్ల పచ్చలు పొందు పరచబడ్డాయి. ఈ ఖడ్గం 3 అడుగుల పొడవు 24211 గ్రాముల బరువు వుంది. దీన్ని ప్రతిశ గురువారం శ్రీవారికి అలంకరిస్తారు.

## శ్రీవారికి హారం

తిరుమల శ్రీవారికి మద్రాసు మైలాపూరుకు చెందిన శ్రీ హరిదా స్గిరి స్వామీజీ రు.29 లక్షల విలు వైన సాలగ్రామ బంగారు హారాన్ని బహూకరించారు. జనవరి 6 గురు వారంనాడు ఆ హారాన్ని తి.తి.దే. తరపున కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి స్వీకరించారు. అయిదు కిలోల బంగారంతో ఈ హారం రూపొందింది. అనంతరం ఈ హారాన్ని పళ్ళెంలో వుంచి నాలుగుమాడ వీధుల్లో ఊరేగించారు. శుక్రవారం అభిషే కానంతరం స్వామివారికి ఈ హారాన్ని అలంకరిస్తారు.



Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press
by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



ఎటిఁగితి నమ్మితి నితఁడు దయానిధి!
మఱఁగులు మొరఁగులు మరి యిఁక లేవు

వేదోద్ధరణుఁడు! విశ్వరక్షకుఁడు!
ఆదిమూర్తి! శ్రీ అచ్యుతుఁడు!
సోదించి కొలిచితి సుముఖుఁడై మమ్మేలె
యే దెస మాపాల నితఁడే కలఁడు!

పరమపురుషుఁ డాపన్నివారకుఁడు!
హరి శాంతుఁడు! నారాయణుఁడు!
శరణంటి మితఁడు చేకొని కాచెను
తరవాతి పనులఁ దప్పఁ డితఁడు.



హృదయాంతరంగుఁడు! యీశ్వరేశ్వరుఁడు!
ఇదివో శ్రీ వేంకటేశ్వరుఁడు!
వెదకితి మీతఁడు విడువఁడు మమ్మిఁక
తుదకును మొదలికి దొరకినవాఁడు!

--అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన : 502,
రాగం : శ్రీరాగం, సంపుట : 2 (1981)



చదవండి! చదివించండి!!

# సప్తగిరి

## చందాదారులకు మనవి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్యాత్మిక సచిత్ర మాస పత్రిక 'సప్తగిరి'. తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఆంగ్లం మున్నగు ఐదు భాషల్లో విడి విడిగా నెల నెలా వెలువడుతున్న పత్రిక 'సప్తగిరి'. ఆధ్యాత్మిక వ్యాసాలు - పండుగలు - పిల్లల కథలు - వేంకటేశ్వర లీలలు - మన దేవాలయాలు ఇలా ఎన్నో విషయాలతో, విశేషాలతో మీ ముందుకు వస్తున్న పత్రిక 'సప్తగిరి.'

### మీరు 'సప్తగిరి' పత్రిక కొత్త చందాదారునిగా నమోదు చేయించుకోదలచారా?

అయితే క్రింది సూచనలను జాగ్రత్తగా గమనించండి.

1. సంవత్సర చందా రు. 24-00లు మాత్రమే.
   ఈ చందాను ఎన్ని ఏండ్లకైనా ముందుగనే కట్టవచ్చును.
2. తమ చందా మొత్తాన్ని "ఎడిటరు, సప్తగిరి, తి.తి. దేవస్థానములు, తిరుపతి" వారి పేర మనియార్డరు గానీ, డిమాండు డ్రాఫ్టుగానీ, పోస్టలు ఆర్డరు గానీ పంపవచ్చును. (చెక్కులు అంగీకరింపబడవు).
3. మీకు ఏ భాషా సప్తగిరి కావలెనో స్పష్టంగా రాయండి.
4. మీ పూర్తి చిరునామాను విడి విడి అక్షరాలలో స్పష్టంగా రాయండి.
5. చందా పంపిన మరుసటి నెలనుండి మీకు సప్తగిరి పంపబడుతుంది.
6. చందా మొత్తాన్ని పంపిన 30 రోజులలోగా మీకు సప్తగిరి రాకపోతే, ఎం.ఓ. రసీదు నంబరు లేదా డి.డి. నంబరు, పంపిన తేదీ వగైరా వివరాలతో, మీ పూర్తి చిరునామాతో స్పష్టంగా రాయండి.

### మీరు ఇంతకు ముందే చందాదారులా? అయితే క్రింది సూచనలను గమనించండి

1. మీ చందా ముగియుటకు ఒక నెల ముందుగానే సప్తగిరి పత్రికలో తెలియజేస్తున్నాం.
2. మీ చందా ముగిసిపోయే నెలకు - ఒక నెల ముందుగనే చందా మొత్తాన్ని పంపి మీ చందాను పునరుద్ధరించుకోండి.
3. మీ చిరునామాలో మార్పుగాని, మీరు చందా పంపటంగాని చేసేటప్పుడు, మీ చందా నంబరుతో కూడ పూర్తి చిరునామాను తెలపండి.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకు సెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్‌ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.




గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రమరణకర్త - సంపాదకులు
కాటపాటి సుబ్బారావు, ఎమ్.ఏ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఏ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఏ.,
ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# ఈ సంచికలో.... మార్చి 1994

సంపుటి 24 సంచిక 10



ముఖచిత్రం : శివపార్వతులు — చిత్రం--జగదీష్
2 వ కవరు పేజీ : శ్రీనివాసమంగాపుర ఆలయం
3 వ కవరు పేజీ : నాగలాపురం శ్రీ వేదనారాయణస్వామి ఆలయం
4 వ కవరు పేజీ : నందివాహనోత్సవం (కపిలేశ్వరాలయం)

# సంపాదకీయం

శివరాత్రి అనగానే మనకు జ్ఞాపకం వచ్చేది దేవాలయాలు, దర్శనాలు, ఉపవాసాలూ, జాగరణలూ, నందనారు, చిరుతొండనంబి, సిరియాళులవంటి భక్తుల జీవితాలు. విష్ణుభక్తుల పరంగా చూస్తే ఇలాంటి కథలే కొద్ది మార్పులతో కన్పిస్తాయి. ఇక పూర్తిగా శివభక్తులను గూర్చి ఆలోచిస్తే కన్పదేవాళ్ల సంఖ్య హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, రావణుడు, కుంభకర్ణుడు, వృత్రాసురుడు, భస్మాసురుడు, బాణాసురుడు ఇలా ఎందరెందరో. వీరంతా బ్రహ్మనో భోలాశంకరుణ్ణో ప్రార్థించి వరాలు పొంది లోక భయంకరులన్పించుకుంటే రెండో ప్రక్కన దేవగణమంతా మహావిష్ణువు వెనకచేరి అవకాశం దొరికినప్పుడల్లా వాళ్లని, అంటే రాక్షసులను అణగదొక్కాలని ప్రయత్నించారు. ఇలా ఈ దేవరాక్షస వైమనస్యం యుగయుగాలుగా సాగుతూనే వుంది. మరి ఆధునిక సమాజంలో కొట్టుమిట్టాడుతున్న మానవుడు పైవాటినుంచి తెలుసుకోవలసిన, అనుసరించి ఆచరించవలసిన చైతన్యదీప్తి ఏదైనా వున్నాదా?

ఒక తండ్రి బిడ్డలే అయినా, అంగబలం, అర్థబలం ఎక్కువగా వుండి అజ్ఞానంతో బుద్ధిబలంమీద శ్రద్ధలేనివారు ఒకవర్గంగా, ఏమి ఉన్నా లేకపోయినా బుద్ధే బలంగా గలవారు మరొక వర్గంగా గిరులు గీసుకొని శత్రు భావంతో అగ్నిగుండాలను ఆవిష్కరించుకుంటున్నప్పుడు తమ ప్రత్యర్థి సమాజాన్ని వంచి, చేజిక్కించుకోవటమో, తుంచి నాశనం చేయాలని ప్రయత్నించటమో జరుగుతుండే తప్ప సమాజంతో రాజీపడటమంటూ వుండనే ఉండదు. అన్ని ప్రాణుల మాదిరి తమ ఆటకు కూడా ముగింపు ఉంటుందని వాళ్లకీ తెలిసినా ప్రతీకారం కోసమే బ్రతుకుతారు తప్ప వేరే ధ్యాస ఉండదు. ఆ వరమిచ్చే దేవతకు కూడా ఈ సంగతి తెలుసు కనుక వాడి చావు వాడే కోరుకునే వరమిచ్చి చేతులు దులుపుకోవటం జరుగుతుంది. అందుకు ఫలానా రాక్షసుడు తపస్సు చేస్తున్నాడంటే పరుగెత్తుకు వచ్చి వరం ప్రసాదించిన ఏ వేల్పూ రక్షించేందుకు ముందుకు రాదు. అయినా రాక్షస నాయకుల ఉగ్రత, వ్యగ్రత, ఔద్ధత్యం తరతరాలుగా సాగుతూనే వచ్చింది. దేవతలకు మంత్రబలమే తప్ప మరో బలంలేదు కనుక మహావిష్ణువును శరణుపొంది వాళ్లపదవులూ కాలం వెళ్లదీసుకోవటం జరుగుతున్నది.

ఇదీ దేవదనుజవైరుధ్య విశ్లేషణం.

మరి రాక్షసులంతా పాపిష్టివాళ్లైతే, ప్రతి కథలోనూ వాళ్లను ఆకాశానికెత్తి అలా క్రిందకు వదిలేయుటమెందుకూ!

ఇక్కడే ఉన్నది విశేషం. మంచి చెడ్డలు రెండూ మనఃకృతాలు, మనో విచేష్టితాలు. అనకూడదు కానీ, అటు దేవతలవీ, ఇటు రాక్షసులవీ సగం సగం పుణికి పుచ్చుకొని మధ్యే మార్గంలో బ్రతుకు వెళ్లదీస్తున్నది మానవులే. కనుక ఏమైనా నేర్చుకోవాల్సిన అవసరం ఈ ఆధునిక జనాళికి ఎంతైనా ఉంది.

మన పురాణ కథలో క్రింది విషయాలు స్పష్టంగా కన్పిస్తాయి. సురలైనా, అసురులైనా ఇద్దరికీ కామగమనం, కామరూపం, పరకాయప్రవేశంలాంటి శక్తులు సమంగా ఉన్నాయి. రాక్షసులలో లక్ష్యం, దీక్ష, కష్టాలను సహించగల శక్తి, అన్నిటికి మించి కఠోరమైన క్రమశిక్షణ ఉండటం వల్ల లోకభయంకరులు కావటంచేత, వాళ్లను జయించలేక, మహావిష్ణువును ప్రతిదానికి శరణువేడాల్సి వచ్చేది. మనం మన ఇళ్ళల్లోనికి అడుగుపెట్టినంత అవలీలగా రాక్షసులం దరూ స్వర్గంలో అడుగుపెట్టినవాళ్లే. లోక కంటకులని పేరు తెచ్చుకున్నా, తమ తమ రాజ్యాలను శోభాయమానంగా చేసుకున్నారు. లంకానగర శోభ, తీరు ఆంజనేయస్వామినే ముగ్ధుణ్ణి చేశాయికదా! రాక్షసులందరూ యుద్ధాలు చేస్తున్నా వాళ్ళ అంతరాంతరాలు శాంతినే కోరాయన్న దానికి కూడా సాక్ష్యాలున్నాయి.

హిరణ్య కశిపుని దృష్టిలో, జీవితబంధం, బాటసారులు మంచినీటి బావి దగ్గర చేరి, చీలటం లాంటిది. వృత్రాసుర, బలిచక్రవర్తుల దృష్టిలో, జీవి కాలానికి బానిస. కనుక అహంకరించినవాడు అధఃపతనం పొందుతాడని, సుఖదుఃఖాలు, మానావమానాలు శత్రుమిత్రులు - అన్ని విషయాలలోనూ సమదృష్టితో, ఏ చెట్టు తొర్రలోనో కూర్చొని శివ, శివ అంటూ కాలక్షేపం చేయటం రావణునికి గల తాత్త్విక దృక్పథం.

(48వ పేజీలో)

# తిరుమల క్షేత్రము -- మహాశివరాత్రి పర్వము

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

పరమాత్ముడు పరమపురుషుడు
పరికింపగ కృపాలుడు
తిరువేంకట విభుడు కాక
మరి దేవుడు కలడా!

అని ప్రసిద్ధికెక్కిన భక్తప్రియుడైన దేవుడు ఎక్కడైనా వున్నాడా! అంటే లేదు, లేదు, లేనే లేదని ఘంటా పథంగా చెప్ప వచ్చు. ఎందుచేతంటే ఈ కోనేటిరాయడు కోరి ఏలునట్టి కులదైవం! ఈ తిరుమల సన్నిధి తరగని పెన్నిధి! దప్పి దీర్చే కాలమేఘం! భావించేవారి పాలి పారిజాతం! కాచి రక్షించే చింతామణి! కోరికలు తీర్చే కామధేనువు! చెడనీక బ్రతికించే సిద్ధమంత్రం! పాయక వెంట దిరిగే ప్రాణ బంధువు!

అందువల్లే భూలోకవైకుంఠమైన వేంకటాచల క్షేత్రంలో ఘనవేంకటేశుడు స్వయంభువై వెలసిన నాటినుండి బ్రహ్మాది దేవతల నుండి సామాన్య పసులకాపరియైన గోపాలునివరకు శ్రీస్వామివారికి సేవచేశారు. ఇష్టార్థసిద్ధిని పొందారు. అప్పటినుండి ఎందరో ఎందరెందరో భక్తులు తిరుమల క్షేత్రాన్ని దర్శిస్తూ వున్నారు. మొక్కులు చెల్లించుకుంటూనే వున్నారు. "నీటి కొలది తామర" అన్నట్లుగా భక్తులందరి కోరికలను తీర్చి అందరినీ ఆనందిరపజేస్తూ 'కలౌ వేంకట నాయకః' అనే ప్రసిద్ధిపొందిన దేవుడు ఈ ఆనందనిలయుడు.

> మార్చి 10వ తేదీ 'మహాశివరాత్రి' పర్వదిన సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.
>
> సం||

మొట్టమొదట శ్రీవైకుంఠాన్ని వదలి భూలోకానికి వచ్చి, లక్ష్మికోసం వెదకి, వెదకి వేసారి పుట్టలో దాగివున్న శ్రీనివాసునకు బ్రహ్మదేవుడు గోవుగాను, శివుడు దూడగాను మారి పాలుగార్చి సేదదీర్చి సేవచేశారు. ఆ తర్వాత మరికొంత కాలానికి బ్రహ్మరుద్రులిరువురూ పెళ్లిపెద్దలై పద్మావతీ శ్రీనివాసులకు ఘనంగా కల్యాణం జరిపించారు. వెంకటేశుడు, తనకు సేవచేసిన బ్రహ్మదేవునకు, శివునకు ఘనంగానే వరాల నిచ్చి సత్కరించాడు.

శ్రీనివాసుడు నిత్యం బ్రాహ్మ ముహూర్తంలో తనను అర్చించడానికి బ్రహ్మదేవునకు అనుమతించాడు. ఈ అర్చన ఆనాటినుండి 'బ్రహ్మారాధన'గా ప్రసిద్ధి గాంచింది. నేటికీ ఏకాంతసేవానంతరం అర్చకులు, బ్రహ్మదేవుడు వచ్చి శ్రీ వేంకటేశ్వరుణ్ణి అర్చించడానికిగాను ఒక పెద్ద బంగారు గిన్నెతో నీళ్లుపెట్టి, బంగారు వాకిళ్లు మూసి వెళతారు. ఆ తర్వాత బ్రహ్మాదిదేవతలు వచ్చి శ్రీస్వామివారిని అర్చించి వెడతారని ప్రతీతి! ఆ తర్వాతి సుప్రభాతసేవలో బ్రహ్మ



అర్చించి మిగిల్చి వెళ్లిన తీర్థాన్ని భక్తులకు 'బ్రహ్మతీర్థం'గా ఇవ్వటం జరుగుచున్నది.

అంతేగాక బ్రహ్మదేవుడు శ్రీనివాసునకు చేసిన ఉత్సవాలు 'బ్రహ్మోత్సవాలు'గా ప్రసిద్ధిచెంది, కలియుగాంతంవరకు నిరాఘాటంగా కొనసాగుతాయని స్వామివారు వరమిచ్చారు. అలనాటి తొట్ట తొలి బ్రహ్మోత్సవంలో బ్రహ్మ ఆనందనిలయంలో వెలిగించిన 'బ్రహ్మ అఖండం' అనే దీప ద్వయం వెలుగుతూన్నంతవరకు, ఈ భువిపై శ్రీ వేంకటేశ్వరుడు దర్శనమిస్తూ భక్తుల కోరికలు తీరుస్తూ వుంటానని కూడ వరమిచ్చాడు.

అలాగే పరమశివునకు కూడ తగిన స్థానమిచ్చి గౌరవించాడు తిరుమలస్వామి. తాను నెలకొనివున్న వేంకటాచల క్షేత్రానికి పాలకుడుగా శివుణ్ణి నియమించాడట! ఆ నాటి నుండ రుద్రుడు సంపూర్ణమైన కళలతో ఒక గొప్ప గండశిలగా ఆవిర్భవించి తిరుమల ఆలయంచుట్టూ తిరుగుతూ (దొర్లుతూ) కాపలా కాసేవాడు.

ఈ క్షేత్రపాలకుని గూర్చి వ్యవహారంలో ఒక గాథ ఇలా వినవస్తున్నది. పూర్వం శ్రీ స్వామివారి కైంకర్యపరులగు అర్చకులు పూజా కార్యక్రమాలు అన్నీ ముగిసిన తర్వాత ఆలయ తాళం చెవులను క్షేత్రపాలకుడైన రుద్రునిమీద ( గుండుమీద) ఉంచి 'ఆలయసంరక్షణభారం మీదే స్వామీ' అని నమస్కరించి తిరుమల కొండదిగి వెళ్లేవారు. (ప్రాచీన కాలంలో రాత్రి కొండపై ఎవ్వరూ ఉండేవారు కాదు). మళ్లీ మరునాటి ఉదయం వచ్చిన అర్చకులు యథాక్రమంగా ఆ రుద్రునకు నమస్కరించి బీగాలగుత్తిని గైకొని ఆలయద్వారాలు తెరచి శ్రీస్వామివారి పూజకు ఉపక్రమించేవారట. ఇలా సాగుతూ వుండగా ఒకనాడు, ఆలయం చుట్టూ తిరుగుతూ కాపలాకాస్తూవున్న ఈ గుండు క్రింద పడి ఒకపిల్లవాడు మరణించాడు. భక్తులకు మళ్లీ ఇలాంటి ప్రమాదం, విపత్తు కలగకుండా శ్రీస్వామివారి ఆదేశంతో, తపశ్శక్తి సంపన్నులైన అర్చకస్వాములు, మహర్షులు ఈ క్షేత్రపాలక గుండును సమీపంలో వున్న గోగర్భ (పాండవ) తీర్థానికి తరలించారట. కాని రుద్రాంశ కలిగిన ఆ శిల యొక్క చిన్న భాగాన్ని మాత్రం ఆలయంలో ప్రతిష్ఠించారు. ప్రస్తుతం తిరుమల ఆలయంలో ధ్వజస్తంభ బలిపీఠాలకు ఈశాన్యదిశను నాలుగు అడుగుల సమీపంలో క్షేత్రపాలకుడిగా చెప్పబడుతున్న క్షేత్రపాలక శిలను భక్తులు తిలకించవచ్చును.

ఆ నాటినుండి నేటివరకు, ఇప్పటి వరకు శ్రీస్వామివారి అర్చకులు ఆలయం తాళం చెవులను గైకొని తెల్లవారుజామున ఆలయం ప్రవేశించినపుడు, ఆలయంలో వున్న ఈ క్షేత్రపాలక శిలకు తాకించి నమస్కరించి ధ్వజ స్తంభ బలిపీఠాలకు ప్రదక్షిణంగా లోపలికి ప్రవేశిస్తారు. అన్ని పూజాకార్యక్రమాలు ముగిసిన తర్వాత బంగారు వాకిళ్లు మూసి, ఇంటికి వెళ్లే సమయంలో అర్చకులు తాళం చెవులను మళ్లీ ఈ క్షేత్రపాలకునికి భక్తితో తాకించడం నేటికి విధిగా జరుగుతున్న ఆలయ సంప్రదాయం.

తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రతిరోజు మూడు పూటలా నివేదన జరుగుతుంది. ఈ మూడుపూటలా నివేదనానంతరం ఆలయంలోవున్న క్షేత్రపాలకుడైన రుద్రునకు 'బలి'గా అన్నాన్ని మంత్రపూర్వకంగా సమర్పించడం జరుగుతుంది.

ఇలా ప్రతిదినం ఆలయంలోని క్షేత్రపాలకునికే గాక ప్రతి సంవత్సరం మహాశివరాత్రి పర్వంనాడు గోగర్భ (పాండవ) తీర్థంలో పూర్ణాంశంతో వెలసిన క్షేత్రపాలకుడైన రుద్రునకు (క్షేత్రపాలకగుండు) అభిషేకాలు, అర్చనలు, నివేదనలు ఘనంగా నిర్వహింప బడుతున్నాయి.

ప్రతి సంవత్సరం మాఘమాసంలోని 'మహాశివరాత్రి' పర్వంరోజు మధ్యాహ్న సమయంలో ఆలయ అధికారులు, అర్చకులు, వేదపండితులు తిరుమల వాసులు, యాత్రికులు పూజాద్రవ్యాలతో, మంగళవాద్య పురస్సరంగా బయలుదేరి క్షేత్రపాలకుడైన రుద్రుడు పూర్ణాంశతో 'క్షేత్రపాలకగుండు'గా వెలసిన గోగర్భ తీర్థానికి తరలివెళ్తారు. అక్కడ వేద పండితులు నమక చమకాలను పఠిస్తూ వుండగా, మంగళవాద్యాలు మోగుతూ వుండగా క్షేత్రపాలక గుండుకు శుద్ధజలం, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచామృతాలతో ఏకాదశ రుద్రాభిషేకాన్ని అత్యంత ఘనంగా నిర్వహిస్తారు. అభిషేకం పూర్తి అయిన తర్వాత ఆ గుండుకు వెండితో తయారు చేసిన కండ్లను, నామాలను (ఊర్ధ్వ పుండ్రాలను) అతికిస్తారు. (వైష్ణవక్షేత్రం కాబట్టి, ఇక్కడి క్షేత్ర సంప్రదాయం ప్రకారం శివునకు నామం పెట్టడం ఆచారం.) ఆ తర్వాత పూలమాలలతో అలంకరించి ధూప

గోగర్భతీర్థంలోని క్షేత్రపాలక గుండు



దీప అర్చనలతో శాస్త్రోక్తంగా పూజిస్తారు చివరగా వడపప్పు, పానకం, కొబ్బరికాయలు, పండ్లు, పులి హోర మున్నగునవి నివేదన చేసి ఘనంగా కర్పూర నీరాజన మిస్తారు. ఇలా పరమశివునకు ఆరగింపు అయిన ప్రసాదాలను స్థానీయమైన సంప్రదాయం ప్రకారం అర్చకులు, అధికారులు స్వీకరించిన తదుపరి, అచ్చట చేరివున్న భక్తులకు, యాత్రికులకు ప్రసాదవితరణ జరుపబడుతుంది.

ప్రతి సంవత్సరం మహాశివరాత్రి పర్వం నాడు తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మ ప్రచార పరిషత్ వారు ఈ గోగర్భ తీర్థంలోని క్షేత్రపాలక గుండు వద్ద శివునికి సంబంధించి కథా కాలక్షేపాన్ని జరిపిస్తూన్నారు.

ఆ తర్వాత ఆలయ అధికారులు, అర్చకులు, వేదపండితులు మంగళవాద్యపు రస్సంగా తిరుమల శ్రీవారి ఆలయాన్ని చేరు కొంటారు.

తిరుమలకు విచ్చేసే యాత్రికులు శ్రీస్వామివారి ఆలయానికి సమీపంలోనే వున్న గోగర్భ తీర్థానికి వెళ్లినప్పుడు ఈ క్షేత్రపాలకుణ్ణి తిలకించవచ్చును.

పూర్వం పాండవులు ఈ తీర్థంలో కొంత కాలం వుండినారట. అందువల్లే ఇది పాండవ తీర్థమని కూడ పేరు పొందింది. ఇటీవల శ్రీ సద్గురు మళయాళస్వామివారు కూడ ఈ తీర్థంలో తపస్సు చేశారు. వారి ఆశ్రమం ఇక్కడ ఈ తీర్థానికి వెనుక భాగంలో వైభవంగా నిర్మింపబడింది.

ఇలాగ ప్రతి సంవత్సరం మహాశివరాత్రినాడు తిరుమల క్షేత్రపాలకుడైన రుద్రునకు ఘనంగా అభిషేకార్చనలు జరుగుతున్నై. ఇంతమాత్రమేగాక ఈ క్షేత్ర పరిధిలోనే, ఈ వేంకటాచల పర్వతసానువుల్లోనే, శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయానికి తూర్పున 15 కి.మీ. దూరంలో శ్రీ కపిలేశ్వర క్షేత్రం, పశ్చిమాన 20 కి.మీ. దూరంలో తలకోన శ్రీ సిద్ధేశ్వర క్షేత్రం అనే అత్యంత ప్రాపినమైన శైవక్షేత్రాలు నెలకొనివున్నాయి. ఈ క్షేత్రాలు నిరంతరం భక్త జనసందోహంతో సందడిగా వుండటమేగాక మహాశివరాత్రి పర్వదిన సందర్భాల్లో విశిష్టోత్సవాలతో వైభవంగా విరాజిల్లుతున్నాయి కూడ.

పూర్వం యాత్రికులు తొలుత వేంకటాచల క్షేత్రమూలంలోగల కపిలేశ్వరుని దర్శించిన తర్వాతే తిరుమల నెక్కేవారట. ఈ కపిల తీర్థ మహత్యాన్ని గూర్చి శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలో గొప్పగా వర్ణించబడింది. లోకకల్యాణం కోసం వేంకటేశ్వరునకు పద్మావతిని ఇచ్చి వివాహం చేయమని ఆకాశరాజును అడగటానికి నారాయణ వరం వెళుతూ వకుళమాలిక, ఈ కపిలతీర్థంలో స్నానమాడి, తన ఈ ప్రయత్నం నెరవేరేటట్లుగా అనుగ్రహించవలసిందని శ్రీకామాక్షీసమేత కపిలేశ్వరస్వామిని ప్రార్థించిందట!

తిరుమల శ్రీనివాస ప్రభువులవారి పర్యవేక్షణలోనే వున్న ఈ కపిలతీర్థం నిత్యం అభిషేకార్చనలతో, పూజానివేదనాదులతో భక్తుల రద్దీతో కోలాహలంగా వుంటుంది. ప్రతి మహాశివరాత్రి పండుగకు కపిలతీర్థంలో వారం రోజులపాటు కపిలేశ్వరస్వామివారికి బ్రహ్మోత్సవాలు వైభవంగా జరుపబడుతున్నాయి.

జగత్ప్రభువైన శ్రీనివాసచక్రవర్తి మహోన్నతులైన బ్రహ్మదేవుణ్ణి, పరమశివుణ్ణి అనుగ్రహించడం మాత్రమేగాక, అజ్ఞానంవల్ల తన శిరస్సుమీద కర్రతో తాడించి, పరమభీతితో, పశ్చాత్తాపంతో సాగిల పడిన పసులకాపరియైన గొల్లని బత్తికి కూడ పొంగిపోయిన కరుణామయుడు తిరుమల గోవిందుడు. ఈ గొల్లని కొక్కనికేగాక, కలియుగాంతం వరకు పారంపర్యంగా ఆతని వంశజునికి ప్రతిదినం తొలిదర్శన భాగ్యాన్ని అనుగ్రహించిన భక్తప్రియుడు! ఆశ్రితవత్సలుడు! వరాలరాయుడు! ఈ కొండలరాయుడు!! అందువల్లే అందరి చేతా--

వృషశైలాధిప ఏవ దైవతం నః!
వృషభాద్రీశ్వర ఏవ దైవతం నః!
ఫణి శైలాధిప ఏవ దైవతం నః!
భగవాన్ వేంకట ఏవ దైవతం నః!!

అని అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు సాటిలేని మేటిదేవుడుగా కీర్తింపబడినాడు. భక్తులపాలిటి కొంగుబంగారమై అను



నిత్యం కన్నులపండువుగా దర్శనమిస్తూ, లక్షలాది భక్తులను తన కడగంటి చూపులతో సంపూర్ణంగా అనుగ్రహిస్తున్న ఆశ్రియఃపతి దివ్యమంగళముఖారవిందాన్ని ఒక్కసారి మన సారా స్మరిద్దాం.

హైమోర్ధ్వపుండ్ర, మజహన్మకుటం! సునాసం!
మందస్మితం! మకరకుండలచారుగండమ్!
బింబాధరం! బహుళదీర్ఘకృపాకటాక్షం!
శ్రీ వేంకటేశముఖ మాత్మని సన్నిధత్తామ్!!

తెల్లని నామం, పాయనికిరీటం, సాగసైన నాసిక, తొలుకాడేచిరునగవు, మకర కుండలాల కాంతితో నిగనిగలాడే చెక్కిళ్లు, కళకళలాడే దొండపండువంటి పెదవులు, మిగుల నిడుదలై దయతోగూడి కాంతులీనే కడగంటి చూపులు కలిగి ప్రకాశిస్తూ వున్న శ్రీవేంకటేశుని వదనబింబం నా మనస్సులో నిరంతరం నెలవుకొని ఉండుగాక!!!





ఉయ్యాల వాడలో భజన

## కర్నూలు జిల్లాలో

కర్నూలు జిల్లా ధర్మప్రచార పరిషత్తు వారి ఆధ్వర్యంలో జనవరినెలలో ఎట్టిగుంట్ల, బొల్లవరం, ఉయ్యాలవాడ గ్రామాల్లో ధార్మిక ఉపన్యాసములు, భజనలు, హరికథలు జరిగాయి. ప్రతి శుక్రవారం గ్రామాల్లో జరిగే కుంకుమార్చన కార్యక్రమంలో స్త్రీలు ఎంతో భక్తి శ్రద్ధలతో పాల్గొన్నారు.




మరియు పట్టణంలోని కృష్ణానగర్ శ్రీనివాస మందిరంలో శ్రీ డి. హయగ్రీవాచార్యులు, శ్రీ టి. శ్రీనివాసులు, శ్రీ హెచ్. హీరాలాల్ ధార్మిక ప్రసంగాలు చేశారు. శుక్రవారంనాడు నిర్వహించిన కుంకుమపూజ కార్యక్రమంలో మహిళలు విశేషంగా పాల్గొన్నారు. ప్రతి దేవాలయంలో స్త్రీలను వారానికోసారి సమావేశపరచి, సత్సంగము నిర్వహించడం, భగవదారాధన, గీతాపారాయణము, లలితాసహస్ర నామ పారాయణము నిర్వహించిన మంచి చైతన్యం కల్గుతుందని, పరస్పర అనురాగము, ఐకమత్యం విలసిల్లుతాయని పరిషత్తు ఆర్గనైజరు వై. సూర్యచంద్రారెడ్డి అన్నారు.

మండపాకలో ఇటీవల జరిగిన తి.తి.దే. అన్నమాచార్య ప్రాజెక్టువారి కచ్చేరి



## గోవిందమాల దీక్షావ్రతం

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచారపరిషత్, తూర్పు గోదావరిజిల్లా శాఖ ఆధ్వర్యంలో సామర్లకోట మండలం జి. మేడపాడు గ్రామంలో 2-2-94న 60 మంది భక్తులు గోవిందమాలాధారణ చేశారు. గీతాశ్రమవాసులు శ్రీ కృష్ణానంద స్వామివారు ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షించారు. జిల్లాశాఖ పరిషత్ ఆర్గనైజర్ శ్రీ బి. దుర్గేశ్వర ప్రసాద్ గోవింద మాలాధారణ తద్వారా వ్యక్తి ధార్మిక విలువలు పెంపొందించుకొని ఇహపర సౌఖ్యము పొందగలరన్న లక్ష్యంగా తి.తి.దే. వారు ఇట్టి దీక్షకు ప్రచారం చేస్తున్నారని తెలిపారు.

21 రోజుల దీక్షలో నిత్యం గీతా పారాయణ, విష్ణు సహస్రనామపారాయణ, గోవిందనామాలతో పసుపు వస్త్ర ధారణ గావించిన ఈ 60 మంది భక్తులు 23-2-94న తిరుపతి చేరుకున్నారు. తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ బి. వెంకట్రామయ్య గోవిందమాల గురించి ప్రసంగించారు. 24న తిరుమలలో ఈ బృందం వారిచే ఆస్థానమండపంలో సంకీర్తన నిర్వహించారు.



# సంగీత శిరోమణి రామస్వామి దీక్షితులు

శ్రీమతి ద్వారం వి.జె. లక్ష్మి

గాంధర్వం చ కవిత్వం చ
దాతృత్వం బలశాలితా
అభ్యాసేన న లభ్యతే
చత్వార సహజగుణాః"

సంగీతం, కవిత్వం వంటి కళలూ, దాన గుణం, దృఢత్వం ఈ నాలుగు శక్తులూ సహజంగా జన్మతః రావలసిన గుణాలనీ, కేవలం అభ్యాసం వల్ల వచ్చేవికావని ప్రాచీనులైన మన లాక్షణికులు చెప్పియున్నారు. ఐతే భాగ్యశాలియైన, సుందరమైన మన భారతీయ సంగీతవనంలో వికసించిన వాగ్గేయకార, సంగీతజ్ఞ, లక్షణకారపుష్పాలెన్నో! ఎందరో మహానుభావుల సంగీత సేవ వలన ఈనాడు మనకు మిగిలిన ప్రపంచ దేశాలన్నింటికంటే ఉత్కృష్టమైన సంగీత రచనలతో నిండియున్న సంగీత ఖజానా ఉంది. వైవిధ్యమైన మార్గాల్లో ఆయా వాగ్గేయకారులు చేసిన సంగీత సేవవల్ల మన జాతి సంపద సుసంపన్నమై, చరిత్రలో చిరస్థాయిగా నిలిచింది.

సంగీత చరిత్రలోనే అతి పెద్దదైన రచన ఐన అష్టోత్తరశత (108) రాగతాళమాలికను రచించి, వాసిగాంచిన రామస్వామి దీక్షితుల వర్ధంతి (మహాశివరాత్రిదినం) సందర్భంగా, ఆయన కర్ణాటక సంగీతానికి చేసిన సేవ, శ్రీ వేంకటేశ్వరస్వామివారి కరుణాకటాక్షాలు పొందిన సంఘటనతోబాటు వారి జీవిత విశేషాలను, సంగీత రచనలోని ప్రత్యేకతలనూ స్మరించుకుందాం.

## సంగీత కుటుంబం

తాను స్వయంగా ఉత్తమ స్థాయికి చెందిన వాగ్గేయకారునిగా గుర్తింపుపొందిన రామస్వామి దీక్షితులు తన సత్సంతానం వలన కూడా ఖ్యాతి గడించిన మహాభాగ్యశాలి. సంగీత త్రిమూర్తులుగా మనం కొలిచే త్యాగరాజస్వామి, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామా శాస్త్రులలో రెండవవారైన ముత్తుస్వామి దీక్షితులు (క్రీ.శ. 1776-1835) ను ప్రథమ సుపుత్రుడుగా పొందిన అదృష్టవంతుడైన తండ్రి రామస్వామి దీక్షితులు.

> 'మహాశివరాత్రి' నాడు రామస్వామి దీక్షితుల వర్ధంతి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.
>
> సం॥

సంగీత వాగ్గేయకారుడైన చిన్నస్వామి దీక్షితుల (క్రీ.శ. 1778-1823) ఈయన రెండవ కుమారుడు. ఈయన రచించిన తోడి 'గానలోల కరుణాలవాల' వంటి కృతులు సుపరిచితాలే.

వయోలిన్ వంటి పాశ్చాత్యవాద్యాన్ని కర్ణాటక సంగీతానికి పరిచయం చేసి, ఆ వాద్యం నేడు సంపాదించుకున్న ప్రాముఖ్యతకి, పొందిన ప్రధానవాద్యస్థానానికి బీజం వేసిన బాలుస్వామి దీక్షితులు (క్రీ.శ. 1786-1858) కూడా ఈయన సుపుత్రులే. రామస్వామి దీక్షితులు మణలిలో నివసించినప్పుడు జార్జ్ అనే బ్యాండ్‌మాస్టర్ వద్దకు తన కుమారుడైన బాలుస్వామిని పంపి, వాయులీనవాదనా విధానాన్ని, ప్రత్యేకతలను నేర్పించారు. కర్ణాటక సంగీతబాణీకు వయోలిన్



వాద్యాన్ని మలచిన ఖ్యాతి, వీరిద్దరికే దక్కు తుంది.

ఈ విధంగా తన బిడ్డలకు కూడ సంగీతపు ఆస్తిని అందించిన భాగ్యశాలి, రామస్వామి దీక్షితులు, ఈయన కాంచీపురానికి సమీపానగల 'విరించీపురం' గ్రామంలో వెంకటేశ్వర దీక్షితులు భాగీరథీ అమ్మ పుణ్యదంపతులకు క్రీ. శ. 1735లో జన్మించారు. కాశ్యపస గోత్రం, ఆపస్తంబ సూత్రానికి చెందిన వడదేశత్తు వడమాల్ అనే తెగలోని తమిళ బ్రాహ్మణుడీయన. దైవానుగ్రహంవల్ల పుట్టుకతోనే ఈయన ఏకసంథాగ్రాహి. తంజావూరుకు చెందిన చౌకమ్ వీరభద్రయ్య, తిరువడమరుదూర్‌కు చెందిన వెంకట వైద్యనాథ దీక్షితులు వద్ద విద్య నభ్యసించారు. వెంకట ముఖి రచించిన 'చతుర్దండి, ప్రకాశికను' క్షుణ్ణంగా నేర్చుకున్నారు. చిన్నతనంలోనే తెలుగు, తమిళ, సంస్కృత భాషల్లో ప్రావీణ్యం సంపాదించి, సంగీత రచనలను ప్రారంభించారు.

రచనలు:

అష్టోత్తరశత (108) రాగతాళమాలిక:- 'నాటకాది' విద్యల అనే 108 వివిధ రాగాలతో, 108 వేర్వేరు తాళాలతో కూర్చబడిన ఒకే ఒక అతిపెద్ద రాగతాళమాలిక ఇది. దీనిని గానం చేయడానికి కనీసం 2 గంటలు సమయం పడ్తుంది. ఇందులో ముందుగా సూళాది సప్త తాళాలు, తర్వాత ప్రాచీన 108 తాళాలలోని కొన్నింటితోపాటు లాలి, లక్షణ, శ్రీమత్కీర్తి, అక్షర, కళ, శ్రీ అనే నూతనమైన తాళాలు కూడా ఉపయోగించబడ్డాయి. ఇటువంటి అద్భుతమైన రచన చేసినందుకు వెంకట కృష్ణ ముదలియార్ శ్రీరామస్వామి దీక్షితులను కనకాభిషేకంతో సన్మానం చేశారు.

హంసధ్వని - రాగ ఆవిష్కరణ

చందసేళ అనే ప్రబంధ రచనతో హంసధ్వని రాగస్వరూపాన్ని ఆవిష్కరించి, దానిని సంగీతలోకంలో వ్యాపింపచేసిన ఘనత రామస్వామి దీక్షితులకే దక్కింది. ఈనాడు జరుగుతున్న సంగీత కచేరీల ముందు భాగంలో హంసధ్వని అతి తరచుగా విన్పిస్తుందంటే అతిశయోక్తి కాదేమో-

ప్రబంధము -- మధ్యతాళము

ఇందులో హంసధ్వని 'ఉపాంగ' రాగమనే లక్షణమూ, శ్రీరంగప్రబంధమని కూడా చెప్పబడ్డాయి. జతిశబ్దాలు చాలా ఆకర్షణీయంగా విన్పిస్తాయి. చిన్నదైనది, అందమైనదీ ప్రబంధ రచన.



రామస్వామి దీక్షితుల రెండవకుమారుడైన చిన్నస్వామి దీక్షితులకు కంటిచూపు పోయింది. ఆ సమయంలో వారు తిరుపతికి వెళ్ళి, శ్రీ వేంకటేశ్వరస్వామివారినే నమ్ముకొని, కీర్తనం చేస్తూ 48 రాగాలతో కూడిన 'మనసా వేరితరుల' అనే రాగ మాలికనూ, 'వేగవాహిని' రాగంలో 'ఇంకా దయరాకున్నను' అనే కృతినీ ఆ స్వామిపై రచించి, ప్రార్థించగా, స్వామి కరుణాకటాక్షంవల్ల, చిన్నస్వామికి పోయిన కంటిచూపు తిరిగి వచ్చింది. ఈ సంఘటనను రామస్వామి దీక్షితుల నిజభక్తికీ, భక్తరక్షకుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి కరుణకు మరో నిదర్శనంగా పేర్కొనవచ్చును.

ఈ సంఘటనలో రామస్వామి దీక్షితులు రచించిన 'ఇంకా దయరాకున్నను'-- వేగవాహిని రాగంలో మొట్టమొదటి కృతికావటం సంగీతపరంగా మరో విశేషం. ఇందులో పల్లవితో బాటు 3 చరణాలూ, ప్రతి చరణానికి కొంత మధ్యమ కాల సాహిత్యంతోబాటు అందమైన స్వరసాహిత్యం కూడా ఉండడం ప్రశంసనీయమైన రచనా విశేషం. ఈ కృతి సాహిత్యాన్ని పరిశీలిద్దాం.

ఇంకా దయరాకున్నను హరిహరి
యేమని యిక దెలుపుదునయ్యా హరిహరి

పంకేరుహలోచన శేషాచల
భవ్య భవన శ్రీ వేంకటరమణా

కరిరాజేంద్రుడు మకరిచేత పలు
గాసిజెంది నీ శరణాగతియని
మొఱలు బెట్టు చుండగ వేవేగమె
మొసలిద్రుంచి బ్రోవగ లేదా

ధరణీధర నీ దివ్యనామ కీర్తనము
లెప్పుడును సేయుచు పిలువగ
కరుణాకరుడైయును విని
వినములుగాకుండుటకాశ్చర్యమయ్యెడిని.

పుట్టుచీకు ధృతరాష్ట్రునిపయి దయ
బొడమి నీదు విశ్వరూప మగపడ
నెట్టనదృష్టుల నొసగి భరించిన
నీలమేఘ గాత్రుడు గావా.

మట్టుమీరునీ కలికాలంబున
మనుప నీవె ప్రత్యక్షదైవమని
గట్టిగ నెరనమ్మితి ముమ్మాటికి
కన్నులొసగి మన్ననముబ్రోవగ

అలనాడల ద్రౌపది నా సభలో
అభిమానము గాచుటకై యక్షయ
వలువలొసంగి సంరక్షణ జేసిన
వరవెంకటకృష్ణుడు నీవే
సలలితముగ కోరిక లీడేర్చుచు
సద్భక్తుల నెలమిని పాలింపుచు
వెలయుదు విలసల నలమేలు
మంగతో వేదవేద్య వెంకటరమణా యిటు.

(39వ పేజీలో)

# సప్తాంగ యోగము

— శ్రీ యస్. రామకృష్ణారెడ్డి




వేదాంతములైన ఉపనిషత్తుల్లోని యోగ సూత్రాలను సేకరించి మొదట పుస్తకరూపం కల్పించిన మహాయోగి పతంజలి మహర్షి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులను అష్టాంగములతో కూడినది రాజయోగము. అన్ని యోగములలో రాజయోగమే ఉత్తమము. సామాన్య మానవుడు మొదట హఠయోగము నభ్యసించి, ఈ హఠయోగమనే నిచ్చెనతో రాజయోగమనే మహావృక్షాన్ని అధిరోహించ వచ్చునని హఠయోగ ప్రదీపిక యను యోగ గ్రంథమున చెప్పబడియున్నది. కాబట్టి రాజయోగ సాధనోపకరణమైన హఠయోగం గురించి తెలుసుకోవడమే ఈ సప్తాంగయోగము. చిత్తవృత్తులను నిరోధించడం ద్వార సమాధిని సాధించడం రాజయోగ పరమావధి. అయితే ఇంద్రియాలను జయించి, తద్వార మనసును వశపరచుకొని సమాధిని సాధించడం హఠయోగలక్ష్యం.

పదునారవ శతాబ్దమునకు చెందిన శ్రీ ఘేరండమహాముని విరచితమైన ఘేరండ సంహితయమను హఠయోగ గ్రంథమున ఈ సప్తాంగ యోగము సవివరంగా చెప్పబడియున్నది. చండకాపాలి అను శిష్యుడు గురువు గారైన శ్రీ ఘేరండమునిని సామాన్య జనోపయోగమైన హఠయోగమును గూర్చి తెలియ జేయుమని సవినయంగా ప్రశ్నించగా, దయామయుడైన గురువు శిష్యవాత్సల్యంతో చెప్పిన సమాధానములే ఈ సప్తాంగయోగము. ఏడు అంగములతో కూడి యుండుటచే సప్తాంగ యోగమని, శరీరమునకు సంబంధించి దగుటచే ఘటస్థయోగమని చెప్పబడినది. ఘట మనగా కుండ. మనశరీరం భగవంతుడనే కుమ్మరివాడు చేసిన పచ్చికుండ. ఈ పచ్చి కుండవంటి శరీరాన్ని హఠయోగమనే అగ్నిలో ఏడు విధములైన పద్ధతులలో కాల్చినప్పుడే గట్టిపడి జీవితకాలం మనగలుగుతుంది.

శోధనం దృఢతాచైవ
స్థైర్యం ధైర్యం చ లాఘవమ్,
ప్రత్యంక్షం చ, నిర్లిప్తం చ
ఘటస్య సప్తసాధనమ్
(ఘే.సం.ప్ర.ఉ. 9)

1. శోధనం - శుభ్రత, 2. దృఢత - గట్టితనం, 3. స్థైర్యం - నిశ్చలత, 4. ధైర్యం - ధీరత్వము, 5. లాఘవం - తేలిక, 6. ప్రత్యక్షం - అనుభవం, 7. నిర్లిప్తం - ఏకాంత వాసము, అనునవే సప్తాంగములు. పై ఏడు ప్రక్రియలను ఈ క్రింది ఏడు పద్ధతులతో సాధించవచ్చును.

షట్కర్మణా శోధనం చ
ఆసనేన భవే ద్దృఢమ్
ముద్రాయ స్థిరతాచైవ
ప్రత్యాహారేణ ధీరతా
ప్రాణాయామా ల్లాఘవం చ
ధ్యానా త్ప్రత్యక్షమాత్మనః
సమాధినా నిర్లిప్తంచ
ముక్తి రేవ న సంశయః
(ఘే.సం.ప్ర.ఉ. 10,11)

1. ధౌతి, 2. బస్తి 3. నేతి, 4. లౌలికి, 5. త్రాటకం, 6. కపాలభాతి అను షట్కర్మలచేత మొదట శరీరమును శుభ్రపరచాలి. అప్పుడే మిగిలిన సాధనలు సత్ఫలితాన్నిస్తాయి. రెండవ ప్రక్రియ ఆసనం. దీనివల్ల శరీరానికి ధృఢత్వం కలుగుతుంది. మూడవదైన ముద్రలచే స్థిరత్వము నాల్గవదైన ప్రత్యాహారంచేత ధీరత్వము సిద్ధిస్తాయి. ఇక ఐదవదైన ప్రామాయామం వల్ల శరీరానికి తేలికదనం, దానివల్ల జీవిత ప్రమాణం పెరుగుతుంది. ఆరవదైన ధ్యానం వల్ల ఆత్మ ప్రత్యక్షము, ఏడవదైన సమాధివల్ల మోక్షము లభిస్తాయి.

రాజయోగం, హఠయోగం, మంత్ర యోగం, తంత్రయోగం, లయయోగం, జ్ఞాన

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- ❊ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- ❊ మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- ❊ శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- ❊ స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ❊ ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ❊ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః' అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- ❊ తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- ❊ తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- ❊ సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- ❊ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- ❊ శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- ❊ విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- ❊ మాంసాహారాన్ని భుజించకండి.
- ❊ ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- ❊ పొగత్రాగకండి.
- ❊ వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- ❊ శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ❊ ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- ❊ వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- ❊ శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- ❊ శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ❊ ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ❊ ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ❊ తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి **పూజకే.**

యోగం, కర్మయోగం, భక్తియోగం అను పలువిధములైన యోగ విద్యలుండగా, ఏ యోగవిద్యతో సమాధిని సాధించవచ్చునని సామాన్యునికి సందేహం కలగడం సహజం. అప్పుడు పిపాసి సద్గురువును ఆశ్రయించాలి. అతనిపై పరిపూర్ణమైన విశ్వాసముంచి, అతడు ఉపదేశించిన మార్గదర్శక సూత్రాల్ని అభ్యాస వైరాగ్యములతో అభ్యసిస్తూ అంతిమలక్ష్యం సాధించవచ్చు. సమాధి అను చివరి మెట్టు సాధించకనే అభ్యాసి అకాలమరణం పొందినచో, అతడు మఱుజన్మలో తన యోగాన్ని ఆగిపోయిన దగ్గరనుండే ఆరంభించి చివరకు జన్మ రాహిత్యాన్ని పొందగలడు అని భగవద్గీతలోనూ చెప్పబడింది.

ఏ యోగవిద్యకైన అంతిమ లక్ష్యం సమాధిని సాధించడం. మనసును శరీరంనుండి వేరుచేసి పరమాత్మ స్వరూపమైన ఆత్మలో లయం చేయడమే సమాధి. ఇది జాగ్రత్త, స్వప్న, నిద్రావస్థలకు అతీతమైనది. ఈ బ్రహ్మానందానుభూతి, అనుభవైక వేద్యమేగాని అనిర్వచనీయం.

అంగవైకల్యం కలగిన సామాన్య మానవుడు హఠయోగంతో సాఫల్యాన్ని సాధించలేనప్పుడు భక్తియోగంతో సమాధిని సాధించవచ్చునని సప్తాంగయోగ సారాంశము.

స్వకీయే హృదయేధ్యాయే<br>
దిష్టదేవ స్వరూపకమ్,<br>
చింత యేద్భక్తి యోగేవ<br>
పరమాహ్లాద పూర్వకమ్<br>
ఆనందాశ్రు పులకేన<br>
దశాభావః ప్రజాయతె<br>
సమాధిః సంభవేత్తేన<br>
సంభవేచ్ఛ మనోన్మణీ (ఘే.సం.స.ఉ. 13.4)

అభ్యాసి తన హృదయంలో ఇష్టదేవతా స్వరూపాన్ని భావించాలి. పరిపూర్ణమైన భక్తి భావంతో చింతన చేయాలి. అపుడు ఆనందాశ్రువులు కలిగి మనసు మైమరచి సమాధి స్థితిని చేరుకుంటుంది. సప్తాంగములతో కూడిన హఠయోగం కన్న భక్తి యోగమే భగవంతుని చేరుకోవడానికి అత్యుత్తమ మార్గమని, ఇదే అందరికీ అభిలషణీయమని అభిప్రాయము.



# నీ సేవ యేరీతి చేసేదయా

రాగం : సారమతి

—— అవధూత దత్తపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ

పల్లవి : నీ సేవ యేరీతి చేసేదయా
నా దేవ ఇవ్వంత అవకాశమీవా

అనుపల్లవి : ఓ పార్వతీశా! ఓ కామనాశా!
హాలాహలోద్రేకహర కంఠదేశా

చరణం : జడకట్టి ముడిపడ్డ నీ కొప్పు జూచి
ఆ చిక్కు విడదీసి సరిదిద్దబోతే
ఏ పాయలోగాని పెనునీటి పరవళ్ళు
పొంగెత్తె నేనేమి యిక చేతును.....



నెట్టాన నీ కంఠహారాలు ముడుతెత్త
గమనించి నే చిక్కు సవరించ బోగా
ఈ పాము హారాలు కస్సంచు బుస్సంచు
అదిలించి బెదిరించి తెగ నవ్వెనే



పాదాల నొత్తంగ పడిగాపు నేనుండ
ఈ దేవ మకుటాగ్ర సమ్మర్దంబూ
ఏ నాటికే తగ్గదేమందును
వేయాను సందైన లేదెందును



ఈ చూపు లోద్రిప్పి నీ రూపు కనబోగ
యే రూపు లేకుండి మిరుమిట్లులై
ఇక నేను నీలోన కలబోత ఐపోయి
శ్రీ సచ్చిదానంద మై పోదునే.

'చంద్రశేఖర్'

# శ్రీ రామలింగేశ్వరస్వామి - కీసరగుట్ట

**శ్రీ మునుగోటి యాదయ్య**

ప్రాచీన కాలంలో మానవుడు ఆధ్యాత్మిక చింతన కొరకు రమణీయ ప్రకృతికి ఆలవాలమైన కొండ గుహలను, అడవులను ఎంచుకొని ఆశ్రమాలు నిర్మించుకొని తపస్సు చేస్తుండేవాడు. కాలక్రమమున ఆ ప్రాంతాలు క్షేత్రాలుగాను, ఆ ఆశ్రమాలు దేవాలయాలుగాను వెలసినవని మనం భావించవచ్చును. ఆ కోవకు చెందిన పుణ్యక్షేత్రం శ్రీ రామలింగేశ్వరస్వామి కీసరగుట్ట ఒకటి.

హైదరాబాద్‌కు 35 కి.మీ. దూరంలో నున్న ఈ క్షేత్రం చారిత్రాత్మకంగా ప్రసిద్ధి చెందినది.

### చారిత్రక ప్రాశస్త్యం

క్రీ.శ. 4,5 శతాబ్దాలలో కీసరగుట్ట ప్రాంతమును విష్ణుకుండినుల వంశం రాజధానిగా చేసుకొని పరిపాలించినట్లు పురాతత్త్వ శాఖ త్రవ్వకాలవల్ల తెలుస్తుంది. ఇచ్చట లభ్యమైన బుద్ధుని విగ్రహావశేషాలాధారంగా ఇచ్చట బౌద్ధమతం వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తుంది. తానీషా వద్ద మంత్రులుగా వున్న అక్కన్న, మాదన్నలు తమ స్వస్థలమైన ఓరుగల్లుకు ప్రయాణము చేయుచున్న కాలంలో మార్గమధ్యమున అనేక శివాలయములను కట్టించిరి. శివభక్తుడైన మాదన్నమంత్రి ఈ క్షేత్రమును దర్శించి స్వామిని సేవించిరి. ఔరంగజేబు వీరిని హత్య జేయుటచే ఈ ఆలయముల నిర్మాణము నిలిచిపోయినట్లు తెలుస్తుంది. అత్యంత నైపుణ్యంగల వాస్తు శాస్త్రకారులచే నిర్మించబడిన ఈ దేవాలయంలో హిందూ మహమ్మదీయ సాంప్రదాయముల సమ్మేళనం ఉన్నట్లు కనపడ్తుంది.

ఈ పర్వతానికి క్రింది భాగంలో కొన్ని ఇటుకలు పురాతన భవన శిథిలములు అచ్చటచ్చట బయల్పడుచున్నవి. ఈ క్షేత్రంపై గల పెద్దబండను గోపరాజులకోట లేక గోన బుద్ధా రెడ్డిబండ అని వ్యవహరింతురు. దీనిని బట్టి ఈ ప్రాంతాన గోంక నాయకులు కోటను కట్టిరని ఊహింపవచ్చును. చరిత్రాంశములను బట్టి చూచిన 12వ శతాబ్దాన భవనములు, కోటలున్నట్లు తెలుస్తుంది. కానీ ఈ క్షేత్రం త్రేతాయుగం నుండి వెలసిల్లినదనియు, దివ్యక్షేత్రమనియు తెలుస్తుంది.



### నామప్రశస్తి

అరణ్యవాస నిమిత్తమై వెళ్ళిన శ్రీరామలక్ష్మణులు దండకారణ్యంలో నివసించుచుండిరి. ఒకప్పుడీ ప్రాంతమంతయు దండకారణ్యంగా చెప్పబడుచుండెను. కొమరవెల్లి, కొలనుపాక, పాలకుర్తి, కీసరక్షేత్రాలు, దండకారణ్యంలో ఉన్నట్లు భావింతురు. శ్రీరామచంద్రుడు రావణ సంహారం తర్వాత అయోధ్యకు తిరిగి వెళ్తు మార్గమధ్యమున ఇక్కడి ప్రకృతి రామణీయకతకు పులకించి బ్రహ్మహత్యా పాతక నివారణార్థం (బ్రాహ్మణుడైన రావణాసురుని హతమార్చినందుకు) శివుని పూజించి ఇక్కడొక శివలింగాన్ని ప్రతిష్ఠించాలనుకున్నాడు.

మరొక కథ శ్రీరామచంద్రమూర్తి లంకకు బయలుదేరి పోవుచు, అఖండ గోదావరిని దాటి ఈ మార్గాన పోవుచున్నప్పుడు ఈ పరిసర ప్రాంతమును పరికించి ఇచ్చట శివలింగం ప్రతిష్ఠచేయసంకల్పించి వాయుసుతుని కాశికి వెళ్ళి ఒక జ్యోతిర్లింగం తీసుకురావల్సిందిగా శ్రీరాముడు కోరాడు.

అప్పుడు అంజనీసుతుడు వారణాసికి వెళ్ళి సమయాభావంవల్ల 101 లింగములను తీసుకొని వచ్చుచున్న సమయమున ఇటు

ముహూర్త సమయం మించి పోవుచున్నదని రాముడు సంకల్పించి సైకత లింగమును తయారుచేసి ప్రతిష్ఠింపబోగా శివుడే స్వయంగా ప్రత్యక్షమై రామచంద్రునికి ప్రతిష్ఠకై లింగమును ఇచ్చెను. రాముడు యథావిధంగా ఆ లింగాన్ని ప్రతిష్ఠించెనట. ఇంతలో వాయుసుతుడు లింగ ప్రతిష్ఠ జరిగి పోవుట గమనించి కినుక చెంది తాను తెచ్చిన 101 లింగములను చెల్లా చెదురుగా తోకతో విసిరివేసెను. అందుకు నిదర్శనముగా నేటికి అనేక శివలింగములు అక్కడక్కడ పడి ఉన్నాయి. హనుమంతుని అలుకను గమనించిన శ్రీరామచంద్రమూర్తి అతనిని ఓదార్చి సంతృప్తి పరచెను. ఈ క్షేత్రం పేరుతో ప్రఖ్యాతి గాంచిన క్షేత్రానికి 'కేసరిగిరి' అని నామకరణం చేసెను. కేసరి అనగా ఆంజనేయుడు. గిరి అనగా గుట్ట. ఈ కేసరిగిరి రానురాను కీసరగుట్టగా మారింది.



### స్వామి మహిమలు

ఈ క్షేత్రమునందలి లింగం శ్రీరామచంద్ర ప్రతిష్ఠితం. పశ్చిమాభిముఖంగా ఆలయం ఉండుట యొక్క వైశిష్ట్యం.

శ్రీరామ లింగేశ్వరుని గుడిలో ఆశ్చర్యకరమైన విషయమేమనగా దేవుని శత సహస్రాది ఘటాభిషేక జలం ఏమగునో ఎటు పోవునో ఇంతవరకు ఎవ్వరు కనుగొనలేక పోయినారు.

రాత్రి సమయమున దేవాలయ మండపంలో కూర్చుని నిశ్చలంగా ధ్యానిస్తే నటరాజ నర్తన ధ్వనులు వినిపిస్తాయి. సంతానం లేని వారికి సంతానం కల్గునని దీర్ఘ వ్యాధులున్న వారికి మ్రొక్కగానే వ్యాధి నయమగునని భక్తుల నమ్మకం.

### దర్శనీయ స్థలాలు

ఈ గుట్ట సమీపంలో రెండు పెద్ద ఆలయములను అక్కన్న, మాదన్నలు నిర్మించినట్లు తెలియుచున్నది. స్వామి వారి ఎడమ ప్రక్క పుష్కరిణి ఉంది. రెండు కొండల నడుమ తెల్లతామర కొలను ఉంది. దేవాలయానికి మరో ప్రక్కన సీతమ్మ గుడి ఉంది. ఇందులో మహిషాసురమర్దిని విగ్రహం ఉంది. గుడికి ఫర్లాంగు దూరంలో చిన్నరాతి మండపంలో బుద్ధ విగ్రహం ఉంది. పాలబుగ్గ, కాశిబుగ్గ అనే నీటి బుగ్గలు కలవు. ఏకశిలా స్తంభంపై మత్స్య, కూర్మ, వరాహ, వినాయక, ఆంజనేయ విగ్రహములు చెక్కబడి ఉన్నవి. ఈ విజయ స్థూపం రెడ్డిరాజుల విజయ చిహ్నంగా గోనకోటారెడ్డి నెలకొల్పినట్లు తెలుస్తుంది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆధ్వర్యంలో ఒక వేదపాఠశాలను నడుప బడుచున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి గురుకుల పాఠశాల స్థాపించబడింది.

### బ్రహ్మోత్సవాలు

ప్రతి సంవత్సరము మహాశివరాత్రి పర్వదినం నాడు శ్రీ భవానీ రామలింగేశ్వరస్వామి దేవాలయంలో ఆరుదినములు బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు. ప్రతి నిత్యం అభిషేకములు, వ్రతములు, పూజలు నిర్వహిస్తారు. ఈ ఉత్సవాలకు దాదాపు మూడు లక్షలకు పైగా భక్తులు వస్తారు. శ్రావణ, కార్తీక మాసాలలో నెల మొత్తం పూజలు జరుపుతారు. శివరాత్రి దినమునకు ముందే గ్రామప్రాంతాలనుండి ఎడ్లబండ్లపై ఎక్కువగా వస్తారు.




### అభివృద్ధి

కీసరగుట్ట దేవాలయ పునర్నిర్మాణానికి ఆలయ అభివృద్ధికి 1978లో 12 లక్షల రూపాయలను కామన్ ఫండ్‌నుండి మంజూరుచేసి కార్యక్రమములు చేపట్టినారు.

ప్రతి ఏటా శివరాత్రి బ్రహ్మోత్సవాలకు ఒక కమిటి మరియు ప్రభుత్వ సహకారంతో అన్ని శాఖల అధికారులు ఘనంగా ఉత్సవాలు నిర్వహిస్తారు. పారిశ్రామిక ప్రదర్శనలు, క్రీడలు నిర్వహిస్తారు. ఇటువంటి రామలింగేశ్వరులను పూజించి తరించండి!



దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయకళ తిరుపతి

# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

దర్శించండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం ఆలయకళ ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.









(గత సంచిక తరువాయి)

"వివిధదేశాల గ్రుమ్మరి విశదభంగి
తెలిసికోదగు దేవి వైదేహి జాడ
తిరిగి రండు మీ రొక నెల తిరుగకుండ"
అనుచు కపులకు సుగ్రీవు డాజ్ఞ నిచ్చె.

ఆంజనేయుని సుగ్రీవు డరసి అతని
ప్రతిభయును విక్రమము మెచ్చ రాము డిచ్చె
స్వీయనామాంకిత మ్మంగుళీయకమ్ము
ఆనవాలుగ జూపింప అవనిసుతకు.

రక్తమయమయ్యె గుహ వత్సరమ్ము గడువ
భ్రాతృమరణ మూహించి విభ్రాంతి నంది
చేరి కిష్కింధ రాజ్యముచేయుచుంటి
దోషమనుమాట లేక మిత్రులను గూడి.

దుందుభి దునిమి విజయదుందుభిని చఱచి
వచ్చి వ్రాలెను మా అన్న వాలి పురికి
తరిమి కొట్టెను దుష్టు డాతండు నన్ను
ఎంత చెప్పిన వాస్తవ మెరుగ డయ్యె.






# రావుల రామాయణము




దిశల కేగిరి వానరాధిపులు వేగ
రామకార్యార్థసిద్ధి కారాటపడుచు
రాము డడిగె "సఖా! వివరాలు చెప్ప
తెలిసె నెట్టులు నీ కుర్వితల మదెల్ల!"

ఆతనికి మ్రొక్కి సుగ్రీవు డనియె నిట్లు
"వినుము చెప్పెద రామ! తద్వృత్త మెల్ల
కలిగె దుందుభి అనెడు రాక్షసునితోడ
మున్ను వాలికి వైరమ్ము ముదిత కతన.

వారి కొకనాడు జరిగిన పోరిలోన
రాక్షసుడు పారి మలయపర్వతము దరిని
దూరె గుహను; అన్న నిలుప ద్వారముకడ
కనులు కాయలు కాయగ కాచియుంటి.

వేగమున పారు మమ్ముల వెంబడించి
వివిధదిశలను తిరిగిన వీడకున్న
వాలికి మతంగు డిడిన శాపంబు హనుమ
చెప్పగా ఋశ్యమూకము చేరినాము.

కాన ధరణీమండల మెల్ల కాంచినాడ
అట్టు లుపయోగపడెను స్వీయానుభవము;
జనకజాన్వేషణార్థము చనిన కపులు
రాదొడంగిరి శ్రమలు వ్యర్థములు కాగ.

వానరేశుడు సుగ్రీవు డానతీయ
కాలవిజ్ఞుడు ప్రాజ్ఞుడు కపివరుండు
హనుమ అమితబలుండేగె జనకదుహిత
వెదుక తారాంగదాదులు వెంటరాగ.




డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి







వేళ్లు దుంపలు ఫలములు నీళ్లు లేని
విపినసీమల నెల్లను వెదకి వెదకి
వీరు లావల నేగిరి వింధ్యగిరికి
నిర్భయులు వారి శ్రమము వర్ణింపదరమె?

అలసిన కపుల నోదార్చె నంగదుండు
"గహన వీథుల సెలయేళ్ల గుహల గిరుల
కలయ వెదుకంగ కాలమ్ము గడచిపోయె
విడిచి నిద్ర యాహారంబు వెదకుటొప్పు."

జానకీదర్శనాకాంక్ష సందడింప
ఆంజనేయాది కపులు వింధ్యాద్రి నెల్ల
వెదక జొచ్చిరి, దాహమై బిలము గాంచి
దుర్గమంబగు దాని ముందునకు చనిరి.

కటిక చీకటి నచ్చట కదల లేక
కోలు పోయిరి ఆశ ప్రాణాలపైన
అంత కనబడె నొక కాంతిమంత మడవి
తపము సాగించు చుండెను తన్వి యొకతె.

ఆ తపస్విని గని యనె హనుమ యిట్లు
"చొరగ దాహమై సలిలంబుకొరకు మేము
భీతియొదవించె తిమిర సంవృత బిలంబు
పాదలు నద్భుతదృశ్య సంపదల నిద్ది.

పురమిది సమస్త వస్తు సమ్మోహకమ్ము
తపమున ఘటిల్ల జేసిన ధన్యు లెవరొ
తెలియ జెప్పుము మాకు సాధ్వీమతల్లి!"
అనిన న త్తపస్విని వారి కనియె నిట్లు.

"మయుడు దానవశ్రేష్ఠుడు మాయచేత
దీని నిర్మించి వసియించె దివిజవనిత
హేమయనుదానితోడ ననేకసమలు
ఆమె సఖిని స్వయంప్రభ యనెడు దాన.

కాంచన వనంబు హర్మ్యంబు కాంచు డదిగొ
నిర్మలోదకములు గ్రోలి నిర్భయముగ
ఫలములును మూలములు తిని పలుకుడయ్య
ఎందులకు వచ్చినారొ మీ రెల్ల రిపుడు."

"తల్లి సీతమ్మ వెదకు యత్నమ్ములోన
తిరిగి తిరిగి దగంగొని తీర్చుకొనగ
వచ్చినార మిచ్చటికి మీ పరమకరుణ
తీరె ఆకలి దప్పు లాతిథ్య కలన."

అట్లు వచియించి హనుమంతు డామె కనియె
"కాంత! సుగ్రీవు డిచ్చిన గడువు ముగిసె
దుర్గమంబగు గుహలోన దూరి నంత
మమ్ము దాటించు బిలము నీ మహిమచేత."

ముదిత చెప్పగ కన్నులు మూసికొనిరి
ఎటులు బయలు చేర్చెనొ ఆమె ఎరుగ రెవరు
చింత నొందిరి వింధ్యకు చేరివారు
అంగదుడు తాల్తు ననె నిరాహారదీక్ష.

సలుప నెంచ ప్రాయోపవేశంబు నతడు
వానరవరుండు తారుడు పలికె నిట్లు
"భీతివీడి ప్లవగులార! బిలము చేర
జీవనమ్ములు సాగును స్వేచ్ఛమీర.

ఆంజనేయుడు ధర్మవాక్య మిటు పల్కె
"మనకు సుగ్రీవు వీడ క్షేమంబు కాదు
బిలమునం దాగి ప్రాణాల వెలయ గలమె?
బిలము భేదించు సౌమిత్రి సులభ గతిని."

"అన్న జీవింపగా కూడె నతని సతిని
రామకార్యము మరచెను కామవశత
అట్టి సుగ్రీవు నమ్మ శక్యమ్ము కాదు
అరయ ప్రాయంబు శ్రేయ" మం చంగదు డనె.

సర్వకపులు దీక్ష వహించు సమయమందు
సంతసంబున గృధ్రరాజంబు వచ్చి
కడుపు నిండంగ భక్షింతు కపుల ననగ
అంగలార్చె నీ తీరున అంగదుండు.

"కాలుడే సీత సాకున కపుల జేరె
ఆమె కొరకె జటాయువు అసువు వీడ
స్వర్గము లభించె; మనకేల భయపడంగ
విధివశమ్ములు బాధలు వేయునేల?"

అనుజుడగు జటాయువు గూర్చి అటులు విన్న
భవ్యుడగు గృధ్రరాజు సంపాతి వేడె
కరుణతో దింప శిఖరిశృంగంబు నుండి;
అంగదుడు వృద్ధు కోరిక నపుడు తీర్చె.

వానరుల నోట సంపాతి పక్షిరాజు
భ్రాతృమరణవార్తను విని వ్యథను చెంది
తన అనుగుతమ్ముడె జటాయు వనుచు నుడివి
కనుల బాష్పాలు రాలగ అనియె నిట్లు.

"వృత్తు వధకు వైళమ నభోవీథి వేగ
సూర్యకిరణాల కెంతయు స్రుక్కి కూడ
కప్పితి జటాయువును పయి రెక్కలను నేను
పక్షములు దగ్ధములు కాగ పడితి గిరిని.

కూలి యిటులుంటి ఈ వింధ్య కుధరమందె
ఎరుగ నా జటాయువు జాడ నింతవరకు
రావణుని, భ్రాతృమరణకారకుని నేను
ప్రాణములు తీయ ముదిమి భారమున తగను."

ఆలకించి ఆ సంపాతి జాలి గాథ
అనియె నిట్లు మహాప్రాజ్ఞు డంగదుండు,
"దయను రావణ రాక్షస స్థావరంబు
ఎచట నున్నదొ సంపాతి! ఎరుగ చెపుము."

పలికె నీ భంగి సంపాతి భవ్య బుద్ధి
"అతివ వైదేహి హరణ మే నరసినాడ
అధిక శోకాకులమనస్క అంబరాన
ఆమె "రామ! లక్ష్మణ!" అని అరచె నపుడు.

ధనపతి యగు కుబేరుని తమ్ము డతడు
కాపురము రావణునకు లంకాపురమ్ము
సంద్రమును యోజనశతమ్ము దాట వలయు
వెలయు నద్దాని నిర్మించె విశ్వకర్మ.

దివ్యదృష్టి కంటిని సీత దీనురాలి
యత్న మొనరింప, రాగల రామె జూచి
వానరులు మీరు దాటుడు వార్ధి నెట్లొ
ప్రతికృతి జరుగగా నాదు భ్రాతృవధకు."

వేగిరమె సాగరము చేర వీరకపులు
పలికె నర్థ భరితముగ వాలిసుతుడు
"కార్యసిద్ధికి వార్ధిని క్షణములోన
దాట నర్హు డెవండొ ముందరకు రండు."

వారి వారి గమనశక్తి బలుక కపులు
జాంబవంతు డనె కని అంజనసుపుత్రు
"ప్రాకటగుణాఢ్య! వానరలోకవీర!
ఊరకుంటివి నీ వేమి కారణమ్ము?

వాయుసుతుడవు నీవ కాపాడవలయు
దుముకుటయు దాటుటయు మహాత్మునకు నీకు
జన్మ సిద్ధగుణంబులు సత్త్వమూర్తి!
విక్రమ విజృంభణము చూపి వేగ చనుము.'

(సశేషం)



# కాకతీయ రాజులనాటి శాసన విశేషాలు

శ్రీ ఎ.కె.వి.ఎస్. రెడ్డి
అనువాదం : జి. శ్రీమతి

(గత సంచిక తరువాయి)

అదియే 'త్రిమూర్త్యాత్మక' అన్ని దేవుళ్లను సమానంగా పూజించేవారికి 'త్రికూటాలయాలు బాగా ఆకర్షిస్తాయి. కాకతీయరాజులు త్రికూటాలయాలపట్ల మక్కువ చూపేవారని ఆ కాలంనాడు వారిచేత చెక్కించబడిన శిలాశాసనాలు, దేవాలయాలు చెపుతున్నాయి. వారిచే చెక్కించబడిన శాసనమొకటి 'తరికూటాలాయాని', 'త్రేతాగ్నుల'తో పోల్చుతోంది. (ప్రాసాద-త్రితయం-అభాత్-త్రికూట తుంగం త్రేతాగ్ని - ప్రతిమాం).

త్రికూటాలయాలు అసలు ఏ విధంగా మొదట నిర్మించబడి, పరిణితి చెందిందో ఆ విషయాలన్నీ ఈ చిన్న వ్యాసంలో వివరించ లేము. ఈ సందర్భంగా శ్రీ ఎమ్. రాధాకృష్ణ శర్మ గమనించిందేమనగా "త్రికూటాలయాలు ప్రథమంగా ఇక్ష్వాకు వాస్తునిర్మాణాల సంప్రదాయానికి చెందినవి. త్రికూటాలయాలు ఇటుకతో కట్టిన కట్టడాలు, పొడవైనటువంటి దీర్ఘచతురస్రాకారాన్ని పోలిన గర్భగుడి కలిగి, ముందువైపు పొడవైనటువంటి పై కప్పు కలిగి రెండువైపులా చిన్న ఆలయాలు కలిగి ఉంటాయి."

త్రికూట దేవాలయాల పరిణామంలో విజయవాడలోని అక్కన్న, మాదన్న గుహలు మరియు మొగలిరాజపురం గుహనెం.4ల ప్రణాళికలు ఇమిడి ఉన్నాయి. కల్యాణ చాళుక్యుల కాలంలో ఈ త్రికూట వర్గానికి చెందిన దేవాలయాలు సాధారణమైనవి. హేరలహల్లిలోని "సోమేశ్వరాలయం", బలగాంవే లోని 'కేదారేశ్వరాలయం', మగలలోని 'వేణుగోపాలస్వామి ఆలయం', నీలగుండ లోని 'భీమేశ్వరాలయం' మొదలైనవి కల్యాణ



చాళుక్యులచేత నిర్మించబడిన మూడు గర్భ గుళ్లుగల ప్రణాళికకు నిదర్శనంగా నిలచి ఉన్నాయి.

ఆ తర్వాత కల్యాణ చాళుక్యులు, హోయసాలులు పలు త్రికూటాలయాలను నిర్మించారు. మొట్ట మొదటగా త్రికూటాలయాలను నిర్మించాలనే ఆలోచన కలిగిన రాజులు హోయసాలులు. అంతకు మునుపు ఈ త్రికూట దేవాలయాలు వున్నప్పటికీ వాటి నిర్మాణం చేసిన ఘనత, చరిత్ర ఆధారాన్ని బట్టి చూస్తే హోయసాలులకే దక్కింది.

హోయసాలుల త్రికూటాలయాలు మూడు రకాలుగా విభజింపబడి ఉన్నాయి.

1. ప్రత్యేకంగా విష్ణువు కోసం నిర్మించిన ఆలయాలు.
2. శివుని కొరకై నిర్మించిన ఆలయాలు.
3. శివ, విష్ణువులు ఒకే ఆలయంలో నెలకొని వుండి, కొన్నిసార్లు మరియొక దైవం కూడి ఉంటాడు.

పై మూడు వర్గాలకు చెందిన ఆలయాలలో విష్ణువుకోసం నిర్మించబడిన ఆలయాలు ఎక్కువ సంఖ్యలో నెలకొని వుండడమే గాక, వాస్తు నిర్మాణరీత్యా కూడ ఉత్సుకతను రేకెత్తిస్తున్నాయి. ఇంకొక ఆసక్తికరమైన అంశమేమనగా, కాకతీయుల కాలానికి చెందిన త్రికూట దేవాలయాలను మనము రెండువర్గాలను మాత్రమే చూడవచ్చును.

1. మొదటి వర్గానికి చెందిన త్రికూటాలయాలు శివ, విష్ణు, సూర్య భగవానునికి చెందినవి.
2. శివునికి మాత్రం చెందిన ఆలయాలు. హోయసల రాజుల కాలంలో విష్ణువుకు మాత్రమే నిర్మించిన ఆలయాల

గురించి మనకు శాసనాధారా లెక్కడా లేవు.

క్రీ.శ. 12 వ శతాబ్దానికి చెందిన "పంచదేవత" దేవాలయాల గురించి ఒక చోట మాత్రమే ప్రస్తావించబడివుంది. క్రీ.శ. 1179 అనంతపురం జిల్లా, మలయనూరుకు చెందిన శాసనం తెలుపుతున్న విషయమేమ నగా, హోంజేరు ప్రభువైన త్రిభువన మల్ల మల్లిదేవ చోడమహారాజ రాణి అయిన లక్ష్మీ దేవి, మల్లికార్జునదేవ, లక్ష్మణేశ్వరదేవ, ఇరుం గోశేశ్వరదేవ, మహాదేవేశ్వరదేవ మరియు సూర్యదేవుళ్లను ప్రతిష్ఠగావించి, వారికి దేవా లయాలను 'సిరెనాడు' లోని మలయనూరు గ్రామంలో నిర్మించింది. ఈ దేవాలయాలే శాసనంలో "పంచదేవత దేవాలయం"గా వర్ణిం చబడింది. ప్రస్తుతం "ఐదు దేవరగుడి"గా ప్రసిద్ధికెక్కింది. ఇది కన్నడ పదం.

రుద్రకాలానికి చెందిన క్రీ.శ. 1171వ నాటి శాసనం, గంగాధర చేత నిర్మించబడిన పలుదేవాలయాల నిర్మాణాన్ని గూర్చి తెలియ చేస్తోంది. గంగాధర "సబ్బినాడు" ప్రాంతాన్ని పాలించేవాడు. "సబ్బినాడు" ప్రాంతం క్రింద హిండింబాచల, నగరూరు, అనుమకొండ మొదలగు ప్రాంతాలు వస్తాయి. అతనిచేత నిర్మించబడిన దేవాలయాలలో ఒకటి అనుమ కొండలో నిర్మించబడిన "త్రికూటాలయం". ఈ దేవాలయంలోని దైవమైన శివుడు, రుద్రే శ్వర అని పిలువబడుతున్నాడు. బహుశా కాకతీయరాజైన రుద్ర I తర్వాత ఆ పేరు స్థిరపడి వుండవచ్చును. చతుర్వింశతి రూపా లకు చెందిన ఇతర ఆలయాలు ప్రసన్నకేశవ, పున్నేశ్వర, కేశవ, భీమన, కటేశ్వర, అచ్యుత మొదలైనవి నిర్మింపబడినాయి. ఈ కాలంలో విష్ణువు రూపంలో బుద్ధుని కూడ పూజించేవా రని తెలుస్తోంది. ఈ దేవాలయాలు వివిధ ప్రదేశాలలో నెలకొని ఉన్నాయి. ఈ శాసనం చాలా ముఖ్య విశేషాలైన దేవాలయ నిర్మాణ విశేషాలను, రుద్ర కాలానికి సంబంధించిన విషయాలను తెలియచెపుతోంది. ఈ శాసనం వలన మనకు తెలిసే రెండవ అంశమేమనగా, గవర్నర్ హోదాగల వ్యక్తిచేత అరుదుగా వివిధ ప్రదేశాలలో ఆలయాలు నిర్మించబడేవి.

ఈ శాసనం వల్ల మనకు ఖచ్చితంగా తెలుస్తున్న మూడవ అంశమేమనగా, విష్ణువు రూపంలో బుద్ధుడు చాలాకాలంగా పూజింప బడుతున్నాడు.

ఈ శాసనం వల్ల మనకు తెలిసే నాలు గవ విషయమేమనగా, చతుర్వింశతి అనేదాన్ని బట్టి విష్ణువు వేయిరూపాల్లో కొనియాడబడే వాడని తెలుస్తోంది. ఆ వేయిరూపాలలో 24 వర్గమైన (చతుర్వింశతి) అనగా కేశవ, అచ్యుత, గోవింద మొదలైన ముఖ్యమైన రూపాలు ప్రతిరోజు భక్తులు తమ నిత్యపూజా విధానంలో కొనియాడబడేవారు. మహావిష్ణు వుకు చెందిన ఇరవై నాలుగు రూపాలైన చతుర్వింశతిని మనము వైష్ణవాలయాలలో చూడవచ్చును. కర్నాటకలోని కొన్ని విష్ణ్వాల యాలలో, హొయసల కాలానికి చెందిన 24 విష్ణువు రూపాలైన చతుర్వింశతిని చూడవ చ్చును. కొన్ని విగ్రహాలు స్థానక భంగిమలో దర్శనమిస్తున్నాయి. ఆ విగ్రహాలన్నీ నాలుగు చేతులను కలిగి, కిరీట మకుటం మరియు ఇతర ఆభరణాలతో అలరారుతూ పద్మాస నంలో దర్శనమిస్తున్నాయి. విష్ణువు ఆయు ధాలైన శంఖం, చక్రం, గద, పద్మం నాలుగు చేతుల్లో నెలవై, ఒక్కో చిత్రంలో ఒక్కో స్థానంలోకి మార్పు చెందుతూ చతుర్వింశతి రూపాల్లో మనకు దర్శనమిస్తున్నాయి.

వరంగల్ జిల్లాలోని ఆకునూరు గ్రామం లోని ఒక శాసనంద్వారా తెలుస్తున్న విషయ మేమనగా, రుద్ర I చేత అంగరంగ భోగ నిర్వహణకై రుద్రేశ్వరాలయానికి దానశాసనం గావించినట్లు సిపాయిలచేత ఆ గ్రామంలో రుద్ర పేరు మీదుగా ఆ ఆలయం నిర్మిం చబడినట్లు తెలుస్తోంది. ఈ శాసనం శివాల యానికి ముందువైపు ఒకరాతిమీద చెక్కబడి ఆ ప్రాంతంలో కనబడుతోంది. ఈ శాసనం క్రీ.శ. 1172కు చెందింది.

కాకతీయరాజుల కాలంలో నాలుగు దేవా లయాలు శివునికోసమై వరంగల్ జిల్లాలోని బెక్కల్లులో నిర్మించబడ్డాయి. క్రీ.శ. 1176కు చెందిన శాసనం ఒక స్తంభం మీద చెక్క బడి శివాలయానికి సమీపంలో కనబడు తోంది. ఈ శాసనం మనకు తెలియచె పుతున్న విషయమేమనగా, కాకతీయ రుద్ర చేత రాజ్యం పాలించబడుతున్న రోజుల్లో మల్లిరెడ్డిచేత మల్లిఖార్జునస్వామికి ఆలయం నిర్మించబడింది. శాసనంలో చెప్పబడిన మల్లి కార్జునాలయం ప్రస్తుతం వున్న శివాలయమే అయి వుండవచ్చును. మల్లిరెడ్డి తదనంతరం ఆ దేవాలయానికి ఆ పేరు ఏర్పడింది.

అదే ప్రదేశంలో క్రీ.శ. 1195కు చెందిన శాసనం దేవాలయమొకటి శివునికై నిర్మించ బడినట్లు, ఆ నిర్మాణం రాజ కుటుంబానికి చెందిన రాజుచేత జరిగినట్లు తెలుస్తోంది. ఇదే శాసనం వివరిస్తున్న విషయమేమనగా, మరి రెండు దేవాలయాల నిర్మాణం జరిగినట్లు ఒకటి గొయ్యేశ్వర, ఇంకొకటి బయ్యేశ్వర పేరుతో అదే గ్రామంలో రామేశ్వరాలయా నికి సమీపంలో నిర్మించినట్లు తెలుస్తోంది. కాకతీయ రుద్ర, సామంతరాజైన గొయ్యర వుతు, బయ్యరవుతు పేరుమీదుగా జరిగిందని తెలుస్తోంది. ఈ శాసనాన్ని ఆ గ్రామంలోని శివాలయం లోపలి గోడమీద చూడవచ్చును.

వరంగల్ జిల్లా, యల్లంపేటకు చెందిన క్రీ.శ. 1101 శాసనం (1178-79) పేరమ రెడ్డి, శ్రీ విశ్వనాథాలయాన్ని నిర్మించినట్లు చెపుతోంది. పాడుబడిన శివాలయం ప్రక్కన గల రాతిమీద ఈ శాసనం చెక్కబడివుంది.

క్రీ.శ. 1181 వరంగల్ జిల్లా, మొరిపి రాలకు చెందిన కాకతీయ రుద్రకు చెందిన శాసనం చెపుతున్న విషయమేమనగా, ప్రోల రెడ్డి శివాలయాన్ని నిర్మించినట్లు, అతని తర్వాత ఆ స్వామి ప్రోలేశ్వర అయినట్లు తెలు స్తోంది. ఆ గ్రామంలోని రోడ్డు ప్రక్కవున్న ఒక స్తంభంమీద ఈ శాసనం చెక్కబడివుంది.

క్రీ.శ. 1195 పిల్లలమర్రికి చెందిన శాసనం, నరిసిరెడ్డి అనే అతడు కామే శ్వర, కాచేశ్వర, నామేశ్వర దేవుళ్లను ప్రతి ష్ఠించినట్లు, (అతని తండ్రి, తల్లి పేరు మీదుగా, అతని పేరు మీదుగా) ఆ ఆల యమే త్రికూటాలయంగా ప్రసిద్ధి పొందింది. ఆ గ్రామంలోని ఒక రాతిమీద ఈ శాసనం చెక్కబడివుంది.

(29వ పేజీలో)

భగవంతుని యందు దృఢమైన భక్తి, మానవుని శ్రేయస్సుకు ముఖ్యమైనదని సర్వ శాస్త్రములు తెలుపుతున్నవి. ముక్తి కిదే ముఖ్య సాధనమని--

శాస్త్రేష్వియానేవ సునిశ్చితో నృణాం
క్షేమస్య సమ్యగ్విమృశేషు హేతుః,
అసంగ ఆత్మవ్యతిరిక్త వస్తుని
ధృఢా రతిర్బ్రహ్మణి నిర్గుణే చ యా.

అనే శ్లోకం వల్ల తెలుస్తుంది.

ఈ భక్తి సిద్ధాంతాన్ని త్రిమతాచార్యులే సముతోను స్నేహంతోను కొలవడమే భక్తి. దీనివలననే ముక్తి యని శ్రీ మధ్వాచార్యులు అంటారు. అంతేకాకుండా "ముక్తిర్నైజసుఖా నుభూతి రమలా భక్తిశ్చ త్సాధనమ్" మోక్షము సుఖానందమునకు భగవంతుని యెడల చేయు అమల భక్తియే సాధనమని శ్రీవ్యాసతీర్థులు అంటారు.

భక్తి అను పదము 'భజసేవాయాం' అనే ధాతువు నుండి వచ్చినదని ఆర్యుల మాట. అనగా భజించుట. భక్తి నవవిధము లని భాగవతమువలన తెలియుచున్నది. అవి పురందర విరల పరమాత్మ సిద్ధ కురుమ ధ్వమత; శృతిస్మృతి యేళు శుద్ధ" అని అంటారు. అయితే నారద భక్తి సూత్రము లలో భక్తి పదుకొండు విధములుగా చెప్పబ డింది. ప్రసిద్ధ వాగ్గేయకారుడగు అన్నమయ్య "దరిశనముల మిము నానావిధులను తలపుల కొలది భజింతురు" అని అంటారు. ఏది ఏమైనప్పటికి నవ విధ భక్తి జన ప్రచారంలో ఉన్నది. దీనితో భగవదనుగ్రహాన్ని, శాశ్వత మోక్ష పదవి అందుకొనవచ్చునని ప్రహ్లాదుని అభిప్రాయము. ఇట్లు ఎందరెందరో కొలిచి

# శ్రవణ భక్తి

—శ్రీ ఎస్. నాగరాజ్




కాక అనేకులు ఒప్పుకున్నారు. "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని శ్రీశంకర భగవత్పాదులంటే, శ్రీ మద్రా మానుజాచార్యులు "తత్ర భక్తిర్నామ నిరవధి కానంత అనవద్య కళ్యాణగుణత్వ జ్ఞానపూ ర్వకః, స్వస్వాత్మాత్మీయ సమస్తవస్తుభ్యః అనేక గుణాధికః, అంతరాయసహస్రేణాప్యప్రతిబద్ధః నిరంతర ప్రేమప్రవాహః" అని అంటారు. ఇక "మాహాత్మ్య జ్ఞాన పూర్వస్తు సుధృఢః సర్వతో ధికః, స్నేహోఽ భక్తిరితి ప్రోక్త స్తయా ముక్తి ర్న చాన్యథా" భగవంతుని మాహాత్మ్య జ్ఞాన పూర్వకముగా తెలుసుకొని ధృఢమైన విశ్వా

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం ఆత్మనివేదనమ్" --

దీనినే పోతన ఆంధ్రీకరిస్తూ-- "తను హృద్భా షల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱుక యున్ సంకీర్తనలో చింతనం బనునీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి సజ్జనుడైయుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా!" అని అన్నాడు. ఇక కన్నడములో పురందరదాసుకూడ-- "హరి కథా శ్రవణవు, హరినామకీర్తనె, హరిస్మరణె; హరిపాదసేవనే, హరిపూజె, ముక్తపథతత్త్వ; మోక్షాన్నందు కొన్నారు.

అయితే నవవిధములుగా కొలుచు టెట్లు? అది సాధ్యమా? అది ముఖ్యమా? అని మనలో మనం ప్రశ్నించుకొనిన-- ముఖ్యమే. అవి ఒక దానితో ఒకటి ముడి పడియున్నవి. నవవిధములలో ఏ ఒకటి ఆచరించినను తద్వార మిగిలిన ఎనిమిది రకాల భక్తి అదంతటదే సాగును.

నవవిధ భక్తిలో మొదటిది శ్రవణము అంటే వినడము. భగవంతుని గురిం మాహాత్మ్య జ్ఞానపూర్వకముగా పెద్దలవల్ల శ

*Statement about ownership and other particulars about*

**S A P T H A G I R I**

(MONTHLY)

FORM IV

*See Rule 8*

| | | |
|---|---|---|
| 1. Place of Publication | ... | TIRUPATI |
| 2. Periodicity of its Publication | ... | Monthly |
| 3. Honorary Editor | ... | Sri D.V.L.N. Murthy, I.A.S.<br>Executive Officer, TTD. |
| 4. Printer's Name | ... | Sri M. Vijayakumar Reddy, L.P.T. |
| Whether citizen of India | ... | Yes |
| Address | ... | Manager, T.T.D. Printing Press,<br>Tirupati |
| 5. Editor & Publisher's Name | ... | Sri K. Subba Rao, M A |
| Whether citizen of India | ... | Yes |
| Address | ... | Editor, Sapthagiri<br>T.T.D. Journal, Tirupati |
| 6. Name and addresses of individuals who own the Newspaper and partners or shareholders holding more than one per cent of the total capital | | Board of Trustees represented by the Executive Officer on behalf of T.T.D., Tirupati |

*I, K. Subba Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

TIRUPATI

*Date: 28-2-1993*

*(Sd.) K. SUBBA RAO,*
*Signature of the publisher*

ణము చేసినపుడు లేదా తెలుసుకున్నప్పుడు కీర్తన స్మరణాదులు, అదంతటదే ఆచరించుటకు వీలు కలుగును. క్రియాత్మకంగా మనమెన్ని సత్కర్మలను చేసినప్పటికిని దాని తర్వాత ఆ కర్మలకు తగిన శ్రవణము తప్పనిసరిగా ఉండే ఉంటుంది. ఉదాహరణానికి శ్రీ సత్యనారాయణ వ్రతముకాని, వరసిద్ధి వినాయక వ్రతముకాని మరే వ్రతములను చేసినప్పటికిని చివరిలో అద్దానికి సంబంధించిన కథాభాగాన్ని ఆచార్య ముఖేణ శ్రవణము చేస్తూ, తద్వార విన్నవారికి కూడ పుణ్యము వస్తుందనే ఫలశ్రుతిని వింటున్నాము.

అయితే శ్రవణ భక్తి కెందు కింత ప్రాధాన్యమనిన--

జ్ఞానం యదా ప్రతినివృత్త గుణోర్మిచక్ర
మాత్మ ప్రసాద ఉభయత్ర గుణేష్వసంగః,
కైవల్య సంభృత పథస్త్వథ భక్తియోగః
కో నిర్వృతో హరికథాసు రతిం న కుర్యాత్.

భగవంతుని చరిత్రను వినుటచే మనస్సు ప్రసన్నమగును. షడూర్ములు అనగా ఆకలి, దప్పిక, శోక, మోహ, రాగ, ద్వేషాది బాధలు దూరమగును. క్షణిక సుఖమునందు విరక్తి పుట్టును. మోక్షానికి వలసిన జ్ఞానాన్ని కలిగించి దైవమందు భక్తిని పుట్టిస్తుంది. కనుక నిటువంటి కథాశ్రవణము నెవరు చేయకుందురు!

పిబంతి యే భాగవత ఆత్మనః సతాం
కథామృతం శ్రవణపుటేషు సంభృతమ్
పునంతి తే విషయవిదూషితాశయం
వ్రజంతి తచ్చరణ సరోరుహాంతికమ్.

భాగవత కథా శ్రవణముచే చెవులు పవిత్రములగును. కలుషిత మనస్సు శుద్ధమగును. భగవత్పాదారవింద ప్రాప్తికల్గును.

అంతేకాదు భాగవతంలోనే శ్రవణ భక్తి ప్రాశస్త్యాన్ని గూర్చి ఇట్లున్నవి.

నివృత్తతర్షై రుపగీయమానా
ద్భవౌషథా చ్ఛ్రోత్రమనోభిరామాత్
క ఉత్తమశ్లోక గుణానువాదాత్
పుమాన్ విరజ్యేత వినా పశుఘ్నాత్.

విషయాసక్తరహితునికి ఈ చరిత్ర శ్రవణము రుచిస్తుంది. సంసారమహారోగానికి దొక దివ్యౌషధము.

కో నామలోకే పురుషార్థసారవిత్
పురా కథానాం భగవత్కథాసుధామ్,
ఆపీయ కర్ణాంజలిభి ర్భవాపహా
మహో విరజ్యేత వినా నరేతరామ్.

ఎల్లప్పుడు కథాశ్రవణాన్ని చేయుటయందాసక్తులై యుందురు. ఇతరులకది రుచించదు.

శ్రీమద్భాగవతే మహాముని కృతే
కింవా పరై రీశ్వరః
సద్యో హృద్యవరుధ్యతే త్ర కృతిభిః
శుశ్రూషుభి స్తత్క్షణాత్.

అంతేకాదు భాగవత శ్రవణంచే మానవుడు నిర్మత్సరుడగును. అంతేకాకుండా ఆధ్యాత్మికము, ఆదిభౌతికము, ఆది దైవికము అనే త్రివిధతాపములు నాశనమగును. అంతేకాకుండా శ్రీహరి వారి హృదయంలో నుండి జ్ఞానానందాన్ని ప్రసాదిస్తాడు.

శ్రీమద్వాల్మీకి రామాయణమున కూడ--

యః కర్ణాంజలి సంపుటై
రహరహ స్సమ్యక్పిబత్యాదరాత్,
వాల్మీకే ర్వదనారవిందగలి తం
రామాయణాఖ్యం మధు
జన్మవ్యాధి జరావిపత్తి

మరణైరత్యంతసోపప్రదమ్
సంసారం స విహాయ గచ్ఛతి
పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్.

వాల్మీకి మహర్షి ముఖమునుండి జాలువారిన రామాయణమనే తేనెను చెవులనెడి దోసిళ్ళతో త్రాగిన లేదా వినిన ఏ వ్యాధులుకాని జననమరణములు కాని లేకుండ అత్యంతానందమును కలిగి యుండుటయే కాక శాశ్వతమైన విష్ణుపదం కలుగుతుందని ఫలశ్రుతి.

అదే విధంగా శ్రవణ మహత్త్వాన్ని గూర్చి భారతంలో కూడ "ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు, నర్థార్థులకు విపులార్థములును, ధర్మార్థులకు నిత్య ధర్మ సంప్రాప్తియు, వినయార్థులకు మహావినయమతియు బుత్రార్థులకు బహుపుత్రసమృద్ధియు, సంపదర్థుల కిష్టసంపదలును గావించు నెప్పుడు భావించి వినుచుండువారల కిమ్మహాభారతంబు" అట్లే ఆంధ్ర మహా భాగవతంలో పోతన కూడ--

భవములకు మందు చిత్త
శ్రవణానందము ముముక్షు జనపదము హరి
స్తవము పశుఘ్నుడు దక్కను
జెవులకు దనివయ్యే వనెడి చెవటియు గలడే.

అంతేకాకుండా ఈ శ్రవణభక్తి ప్రాశస్త్యాన్ని పోతన తన కృతిలో పలు సందర్భాలలో నిట్లు చెప్తాడు.

భూషణములు సెవులకు బుధ
తోషణములనేక జన్మ దురి తౌఘవివి
శ్శోషణములు మంగళ తర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్.

అనియు, "ఏనీ గుణములు కర్ణేంద్రియంబులు సోక దేహతాపంబుదీఱి పోవు" అనియు "ప్రాణేశ! నీమంజు భాషలు వినలేని కర్ణ రంధ్రంబుల కలిమి యేల" అనియు చెప్పుచూ శృంగార భక్తి పరవశత్వంచే వచ్చిన గోపికలను ఇంటికి వెళ్ళండని కృష్ణుడు వాళ్ళతో అన్నప్పుడు వారు అతనితో తమ మనోభిప్రాయాన్ని తెలియపరుస్తూ "నీ పాదకమలంబు" అను పద్యంలో "నీ వాగమృత ధార నిండ గ్రోలగ గాని చెవులన్య భాషలు చేరి వినవు" అని గట్టిగా తన మనోభిప్రాయాన్ని తెలియపరుస్తూ మరొకచోట 'విష్ణు నాకర్ణించు వీనులు వీనులు' అని అంటాడు.

ఇదే అభిప్రాయాన్ని పలువురు కవులు భక్తులు తమ వాఙ్మయంలో వెలిబుచ్చారు. శ్రీపాదరాయలు "విశాల కర్ణకే భూషణ విష్ణుకథేయు" కర్ణములకు భూషణము విష్ణు కథలు వినడం అని అంటారు. సంస్కృతములో ఒక సుభాషితం కూడ "శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన" అని అంటుంది. అట్లు శ్రవణము చేయని చెవులను గురించి చెప్పుచూ "సంతత సిరికృష్ణన చరితేయు కేళదవ జడమతి కివుడనో ఎందేందిగూ" కృష్ణుని చరిత్రను విననివాడు జడమతి చెవిటివాడే అని వ్యాసతీర్థులు ఒక కీర్తనలో అంటారు. పురందరదాసులవారు నానిన్నొ ళన్యబేడువుదిల్ల అనే కీర్తనలో 'కర్ణగీతంగళ కేళలి' నా చెవు ల్లెల్లప్పుడు నీ పాటలనే విననీ అని అంటారు. ఈ సందర్భంలో మాండూక్యోపనిషత్తులో 'భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః' అనే వాక్యము కూడ గుర్తుకొస్తుంది.

శ్రవణ మాహాత్మ్యాన్ని గూర్చి చెప్పుచూ "శ్రవణ దింద్హోయితు బ్రహ్మత్య పాతకవు, స్మరణెయింద్హోయితు సేరిద్దపాపవు, ఎల్లిద్ద జామిళ ఎల్లిత్తు వైకుంఠ కొట్టాతనే బల్ల పురందరవిఠల" శ్రవణము వలన బ్రహ్మహత్యాపాపము స్మరణవల్ల చేసిన పాపములు దూరమగును. దీనికి అజామిళుడే సాక్షి. అంతేకాకుండా--

అడి బిడదె భాగవత మిక్క పురాణాది
నుడినె కిలిగొట్టు హాహా ఎనుతలి
ఒడనాడనే హరి మహిమే యలి ఇద్దు మారిగళ
అడిమాడి ఆద్యంతకాల సుఖిసువ నిత్య
భక్తి యలి నడివరివరే సుగుణరో
ముక్తియను బయసి మురారాతియ చరణదల్లి

ఎల్లప్పుడు భగవంతుని మహిమలను తెలిపే, భాగవతాది పురాణములను చెవులతో వింటూ 'హాహా' అని ఆనందించుచు భక్తితో ముక్తిని కోరే వాళ్ళే సుగుణవంతులని విజయదాసు ఒక కృతి చెప్పారు.

"శ్రవణమన కానంద వీవుదు భవజనిత దుఃఖగళ కళెవుదు, వివిధ భోగ గళిహపరం గళతిత్తు సలహోవుదు భువనపావన నేనిప లకుమాధవన మంగళ కథేయు పరమోత్సవదికి విగొట్టాలిపుదు భూసురరుదినదినది"-- వీనులకు విందు మనకానందము భవజనిత దుఃఖదూరము వివిధ భోగములిహపరంబులలో కలుగు భువన పాలకుడగు లక్ష్మీధవుని పరమ మంగళ చరితమును దినదినము విని ఆనందింపుడని శ్రీ జగన్నాథదాసు అన్నారు.

## నిత్యాభిషేకం

తిరుపతి కపిలతీర్థంలోని శ్రీ కపిలేశ్వరస్వామివారికి నిత్యాభిషేకం సేవను నూతనంగా ప్రారంభించారు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు సంవత్సరానికి రు.42-00లు చెల్లించాలి.

శాశ్వతంగా చేయించదలచుకున్న వారు రు. 500 + 42 లు చెల్లించాలి.

సంవత్సరానికి రెండు పర్యాయములు, ఇద్దరు వ్యక్తులను ఈ సేవను దర్శించటానికి అనుమతిస్తారు.

# పర్వతారోహణము

కీ॥శే॥ ఆచార్య పింగళి లక్ష్మీకాంతం



వసుమతి నెల్లచో సపరివారముగా విహరించు
నిందిరా
రసికున కాంధ్ర కానన ధరాధర సాను
విహార లీల లిం
పొసగగ బోలు, నాంధ్రకవితోక్తుల
జేరికమై వినన్ ముదం
బెసగగ బోలు-- కోరి వసియించెను శేషగిరిన్
బ్రసన్నుడై.

ఆ పరంజ్యోతి కుపనిషదర్థమునకు
బేరుపెట్టిరి ఆంధ్రులు 'వేంకన' యని
అలజడుల వేళ 'కో' యని పిలిచినంత
'ఆ' యనుచు బల్కి వెంకన్న యాదుకొనును.

సచ్చిదానందు నిలయమ్ము సత్యలోక
మాటులోకాలపై నున్నదనిరి బుధులు;
వేంకటేశ్వరు భూతల విష్ణులోక
మాటుకొండల పైన బ్రత్యక్షమగును.

కమలబాంధవు కిరణాంకురములు శ్రీని
వాసు గోపుర శిఖర సువర్ణ కలశ
మూర్ధమును సోకి మెఱయక మున్న కొండ
చేరవలెనని సందడించెదరు జనులు.

కడచిన యాపదల్ కథలుగా సహయాత్రికుతోడ
జెప్పచున్
గడపిన వేంకటేశ్వరుని కారుణికత్వము
నుగ్గడించుచున్
గడలు ప్రతిధ్వనింప భజనల్ పచరించుచు
నేడుకొండలున్
గడియల మీద బ్రాకెదరు కంజదళాక్షుని భక్తు
లయ్యెడన్!

పోయిన ప్రాణముల్ మరలబోసి సుతున్
బ్రతికించి యిచ్చె 'నం
భా' యని యాన మోపయిన యావు నదిన్
సుడిలో మునుంగ దె
ప్పై యొక యెద్దు సేర్చెను దయానిధి వేంకట
నాయకుండు మా
నాయన యంచు మ్రొక్కుదురు నమ్మినవారు
విశుద్ధచిత్తులై.



మహాకవి ఆచార్య పింగళి లక్ష్మీకాంతం శతజయంతి సందర్భంగా మే 1934 నాటి వారి 'తిరుమలయాత్ర'లో దొరలిన పద్య సముచ్చయాన్ని ప్రచురిస్తున్నాం.

సం॥

తన తమ్ముని ప్రాణాలు కాపాడుటకు పైకెగిరిన సంపాతి తన రెక్కలను పోగొట్టుకొని ఏడ్చుచూ అనాథుడై ఒకచోట పడియుండగా-- 'అంగద జాంబవంతాది కపీశ్వరులందరు కూడ సుగ్రీవుడు తమ కిచ్చిన ఒక నెలగడువు ముగిసినదని ప్రాయోపవేశమునకు బూని సముద్రతీరంలో ఉత్తరాభిముఖులై దర్భాసనములపై పరుండి, మరణ కాలంలో భగవంతుని గుణ కథనములను గానము చేయు సంప్రదాయమున్నందున రామకథనంతా గానము చేస్తుండగా అది వినిన ఆ పక్షిరాజు తిరిగి తన రెక్కలను పొందినది. అంతే కాక తమ్ముడగు జటాయువు వృత్తాంతాన్ని కూడ తెలుసుకున్నది. తర్వాత శక్తికొలది రామసేవను చేసింది. కనుక కథా శ్రవణ మాహాత్మ్యం వలన సంపాతి తక్షణమే ప్రత్యక్షానందాన్ని ఇహంలోనే పొందాడు'.

ఇక పరీక్షిత్ మహారాజు ఏడు దినములు కూడ అహోరాత్రములు భాగవత శ్రవణాన్ని చేసి శాశ్వత మోక్షాన్ని పొందాడు. అట్లే జనక మహారాజు కూడ శతానందులచే భవిష్యోత్తర పురాణాంతర్గత వేంకటాచలమాహాత్మ్యాన్ని శ్రవణంచేసి బంధముక్తుడయ్యాడు. కాబట్టి ఏదైనా సరే మనకెంత తెలిసినప్పటికిని పెద్దలవలన వినిననే కొంత విషయము తెలియును. అందుకే వినయంగా పోతన కూడ 'విబుధ జనుల వలన విన్నంత కన్నంత తెలియపరుతు' అని అన్నాడు. అందుకే వాదిరాజస్వాములువారు కూడ 'అనుదినవు శ్రవణ మననాది సాధనమాడో, ఇన్ను సంశయవేతకో' అని అన్నారు. మహాభక్తుడు అన్నమయ్య కూడ "వినరో భాగ్యము విష్ణు కథ, వెనుబల మిదివో విష్ణు కథ" అని ఎంతో అర్థ గర్భితంగా పాడారు.

ఎందరెందరో హరికథలను, సంగీతములను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఆనందాన్ని అనుభవించుట సర్వజనవిదితమే.



# సింహశైల నృసింహస్తవము

డా॥ వారణాసి శివరామకృష్ణయ్య



శారద నాయెద మెదలుచుఁ
జారు సుధా మధుర మృదుల శబ్దఝరీమం
జీరమహిత నాదమ్ము, ప్ర
సారించును గాక, సింహశైల నృసింహా!

నేనేమి పల్కుచుంటినొ
కానీ, యెఱుఁగను, మనమ్ము కర్కశమయి, స్వా
ధీనమ్ముదప్పె, నిరతము
స్థాణుడనై యుంటి సింహశైలనృసింహా!

ఆమని రాగాఁ బ్రొద్దున
మామిడి చివురులను, మెసవి, మత్తిల్లి, పిక
స్తోమము, మేలుకొలుపులను
స్వామి, పలుకుగాదె, సింహశైలనృసింహా!

సొంపగు నీ దేహము, నై
లింపులు, మానవులు, గంధలేపనములఁ దే
లింపగ, నొప్పెద, వున్నత
ఝంపాభోగోగ్ర! సింహశైలనృసింహా!

ఓం కృతి భక్తు లొనర్పగఁ
గ్రేంకృతి కేకు లొనరింప, ఘీంకృతి కరులున్
భాంకృతి ధేనువు లీయగ
ఝంకృతి, యళు, లొసఁగు, సింహశైలనృసింహా!

కమ్మని సంపెగ వాసన
లిమ్మగఁ జిమ్మగ, మధుపము లెంతయు ఝంకా
ర మ్మొనరింపగ, నాకా
శమ్మున నోంకృతియె, సింహశైలనృసింహా!

తెలుఁగుం దేశము తూరుపు
మలుపునఁ బొలుచుఁ గమనీయ మారుతలహరీ
కలితము, చంపక చలితము
జలగళిత మచలము, సింహశైలనృసింహా!

మలపైఁ బాఱు ఝరుల గల
గలలు ఫణుల బుసబుసలు, పికమ్ముల రొదటుం
జిలుకల కిలకిలలు, వినగఁ
జలనము నొందు నెద, సింహశైలనృసింహా!

రంభా స్తంభ ఘుమఘుమలు
రంభా భంగ నటనములు, రంభా ఫల సం
రంభము, లా(మద్వార
స్తంభము లింపొందు సింహశైలనృసింహా!

శ్రీకూర్మ మన్నవరములు
శ్రీకరముగ నుభయదిశలఁ జెలఁగుచునుండం
బ్రాకట లింగమవై, ర
క్షాకరుడ వయితివి, సింహశైలనృసింహా!

అది బ్రహ్మోత్సవమా? స
మ్మదజల నేత్రములు, మధుర మర్దల రవముల్
మృదు పులకిత గాత్రమ్ములు
సదమల మోక్షములు, సింహశైలనృసింహా!

ప్రతివత్సర దివ్యోదం
చిత సురభిళ చందనాభిషేకోత్సవముం
గుతుకముతోఁ జూడఁ బ్రజలు
సతతము వచ్చెదరు సింహశైలనృసింహా!

"పూలు గొనుఁడు, కర్పూరము
చాలునె? టెంకాయ, పండ్లు చవుకయె, అగరుల్
మే" లను పలుకుల సందడి
శైలమున వినబడు సింహశైలనృసింహా!

పులినోటం దలఁబెట్టిన
తులువలు నీ సొమ్ములు గడు, దోచిరి, పిదపం
దలఁకుచుఁ బైటపడిరి, సం
చలనము గలుగంగ, సింహశైలనృసింహా!

శివరామకృష్ణ సత్కవి
శివరామ వినమ్ర కృష్ణ చిహ్నిత సుషమా
కవితాకృతి యొసఁగఁ గొనుము
స్థవిరా! మంగళము, సింహశైలనృసింహా!



# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కాచుకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బాగుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు. ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాలు కోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః ।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః ।
— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీతమైనదీ వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి
— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

'చంద్రశేఖర్'

## శ్రీనివాస తేజము

(రచయిత : ముదివర్తి కొండమాచార్యులు; వెల : 40 రూ॥ ; పుటలు : 300 ; ప్రతులకు : ఎం. కొండమాచార్యులు, 18-1-214, కె.టి. క్వార్టర్సు, కె.టి. రోడ్, తిరుపతి-517 501.)

తాళ్లపాకవారి సంకీర్తన సాహిత్యాన్ని పద్యరూపంలో అందించే మహా ప్రయత్నంలో శ్రీ ముదివర్తి కొండమాచార్యులు రచించిన 'శ్రీనివాసతేజము' అయిదవ సంపుటము. దీనిలో కవి అన్నమాచార్య, పెద తిరుమలాచార్య కృతులతో పాటుగా చిన తిరుమలాచార్యుని కృతులు కూడ గ్రహించి సుమారు 250 సంకీర్తనలకు పద్యరూప మిచ్చారు.

తాళ్లపాకవారు తెలుగులో వైష్ణవసాహిత్యాన్ని, తత్రాపి, విశిష్టాద్వైత వైష్ణవ సాహిత్యాన్ని బళ్లకెత్తేరు. ఈ కవులు భక్తులు, గాయకులేకాదు, ధర్మప్రచారకులైన ఆచార్యులు కూడ. ఈ మహా కార్యంలో ఆ కుటుంబం తన సర్వస్వాన్ని ధారపోసి శ్రీ వేంకటేశ్వరుని కృపకు పాత్రమై తరించింది.

తాళ్లపాకవారి సాహిత్యం సంగీతబద్ధం. రాగతాళలయానుగుణంగా నడిచిన ఆ సాహిత్యాన్ని, కేవలమూ ఛందోబద్ధమాత్రంగా మార్చి అందించడానికి పూనుకొన్న కొండమాచార్యుల వారి ప్రయత్నం సర్వవిధాలా జయప్రదమైనదనడానికి శ్రీనివాసతేజము అడుగడుగునా సాక్ష్యమిస్తుంది.

పాట వ్రాయాలంటే ఉన్న నియమాలు సంగీత సాహిత్యాలు రెండింటికీ సంబంధించి ఉంటాయి. పద్యరచనకు సాహిత్య నియమాలు చాలు. అంటే, ధాతురచన, రాగం, తాళం, పల్లవికి చరణాలకూ గల సూత్రాత్మకమైన సంబంధం, ఆయా చరణాల్లో సమతూకం, సామ్యం, సారూప్యంవంటి లక్షణాలెన్నో పాటలో రూపించాలి. పద్యంలో ఈ ధాతు మాతు సంబంధ సాహచర్యాదులక్కరలేదు. పద్యపునడక కూడ వేరు విధమైన తీరులో ఉంటుంది. అయితే, ఆయా విధమైన విభేదాలున్నా కొండమాచార్యులవారు తాళ్లపాకవారి సంకీర్తన సాహిత్యాన్ని పద్య రూపంలో అందించడానికి పూనుకొన్నది సాహసమేకాక, వేరు విధంగా మెచ్చుకో తగ్గదికూడ. ముందు పేజీల్లో శ్రీమల్లంపల్లి శరభయ్య గారన్నట్లు 'ఈ రచన సంగీతపు తెరతొలగించుటవలన కలిగెడి క్షతి లేదని నిరూపించుచున్నది' అంతేకాదు, "ఇదినాన్యతో దర్శనీయమైన రచనాసిద్ధి. సూక్ష్మముగా చెప్పవలెనన్నచో కిలమూరిన రాగిరేకులకు పులికాపు పెట్టినట్లు, బూజుపట్టిన తాటియాకులకు కాకరాకు పసరుపూసినట్లు, దూగరి కప్పిన అద్దమును వెలిమిడితో తుడిచినట్లు కొండమాచార్యుల పద్యరచనలో నిర్మ్రష్టమైన అన్నమాచార్యుల స్వరూపము




సరిక్రొత్తగా నిగ్గులు తేలుచున్నది" అని కూడ వ్రాశారు. వాస్తవానికి అన్నమాచార్య సంకీర్తనలు ప్రచారానికి వచ్చినది సంగీతమూలంగానే, కాని ఆ సంగీతపు సొంపునింపులలో సాహిత్యపుసౌందర్యము మరుగవుతున్న విషయంకూడ సత్యమే. ఆ సౌందర్యాన్ని నిరావరణంగా, చూపడంలో కొండమాచార్యులవారి ప్రజ్ఞ సఫలమైంది. వారు సంకీర్తనలకు పద్యరూపమివ్వడానికి సీసపద్యాన్ని వాడుకొన్నారు. అదిలయాన్వితమైన పద్యం. ఎత్తుగీతిలో పల్లవి వంటి పోలికలుండే ఛందస్సు. అవసరమైనచోట్ల పంచపాదిగానో, బహుపాదిగానో వ్రాసి మూలభావాన్ని పూర్తిగా అందించడానికి అనువైన రచన తెలుగులో మునుపు వెలసిన అనుకరణ, రచనలలో కంటె కొండమాచార్యులవారి రచనలో మూలానుకృతులు రెండింటికీగల సంబంధము మరింత సన్నిహితంగా ఏర్పడి కనిపిస్తుంది. ఉదాహరణకి క్రింది సంకీర్తన, పద్యానువాదము చూస్తే చాలు.

సామాన్యమా పూర్వసంగ్రహంబగుఫలము
నేమమునఁ బెనగొనియె నేడు నీవనక.

జగతిఁ బ్రాణుల కెల్ల సంసారబంధంబు
తగులబంధించు దురితంపుఁ గర్మమున
మగుడ మారుకు మారు మగువ నీ వురముపై
తెగికట్టె రెవ్వరో దేవుండ వనక. సామా॥

పవిలేక జీవులను భవ సాగరంబులో
ముంచఁగ లేవఁగఁ జేయు మోహదోషమున
పవిపూని జలధిలోఁ బండఁ బెట్టిరి విన్ను
వెనకెవ్వరో మొదలి వేలుపనక. సామా॥

వుండనియ్యక జీవనోపాయమున మమ్ము
కొండలను గొబల తతిగొని తిప్ప ఫలము
కొండలను వెలకొన్న కోనేటి పతి వనఁగ
నుండవలసెను నీకు నోపలే వనక. సామా॥

సామాన్యమా పూర్వసంగ్రహఫలమిది
నేమాన బెనగొనె నేఁడు విన్ను.
జగతిఁ బ్రాణులకెల్ల సంసారబంధమ్ము
తగులఁ జేసిన దురితమ్మువలన
మగుడ మారుకు మారు మగువ నీయురముపైఁ
దెగికట్టె రెవ్వరో దేవుఁ డనక
పవిలేక జీవుల భవసాగరమ్ములో
ముంచఁగ లేవఁగఁ జేయు మోహ[illegible]
పవిపూని జలధిలోఁ బండఁబెట్టి[illegible] విన్ను
వెను కెవ్వరో తొలివేలు [illegible]
జీవనోపాయమున మమ్ము[illegible] గనీక
కొండగొబలందుఁ ద్రిప్పి[illegible]ఫలముగ
పాటిగా కొండకోనేటి[illegible]ంగ
నోపలేనవ కిట్లు నీ కు[illegible]సె.

తాళ్లపాకకవులు [illegible]దువందల సంవత్సరముల క్రిందటివా[illegible]లో ఆద్యుడు సంకీర్తన సాహిత్యానికి [illegible] పెట్టి పదకవితా పితామహుడుగా, హరి[illegible]చార్యుడుగా కీర్తి వహించిన అన్నమయ్య[illegible]లో ఏ కవికీ తీసిపోని మహాకవి. [illegible]మయ్య కుమారుడు పెదతిరుమలాచార్యుడు [illegible]రామానుజ మత స్థాపనాచార్యుడు, [illegible]పండితుడు, తార్కి

కుడు కూడ. అన్నమయ్య మనుమడు చిన తిరుమలాచార్యుడు అష్ట భాషా కవిచక్రవర్తి. ఇంతగా బిరుదుగండ పెండెరా లున్నా ఈ కవు లందరూ తమ సంకీర్తన రచనల్లో వ్యావహారిక భాషనే వాడారు. అది వారి నాటి వాడుకభాష కావడంవల్ల, మాండలిక ప్రయోగాలు కూడ ఎక్కువగా ఉన్నందువల్ల వారి పదాలలోని కొన్ని పదాలు మన కర్థం కావు. ఈ సంపుటంలో శ్రీ శార్వరిగార న్నట్లు, ఆ యాసవేరు, ఆ బాసవేరు ఆ పాట బాస పామరుల నలరించిన యాస బాస. అయినా ఆ జటిలతను తొలగించి నందున కొండమాచార్యులవారి పద్యాలలో మూలకృతులను స్పష్టంగా అర్థం చేసుకో వచ్చు."

మరో విధంగా చూస్తే కొండమాచార్యులవారి పద్యాలు వెనుకటి భక్త కవులు వ్రాసిన సీస శతకాలను స్ఫురింపజేస్తున్నాయి. మూల కృతులలో భక్తి, నీతి, వైరాగ్యం, లోకయాత్ర, లోక సంగ్రహం వంటి వెన్నో వర్ణించ బడ్డాయి. అనుకృతులుగా వెలసిన ఈ సీస పద్యాలు కూడ అలాగే భక్తి, నీతి, వైరాగ్య శతకాలుగా వన్నె గడించేవిగా ఉన్నాయి. శ్రీ కొండమాచార్యులీ సంపుటంలో పాటముం దుగా ఇచ్చి, తర్వాత తాము వ్రాసిన పద్యాన్ని జతచేసి పేజీకొకటిగా చూపించారు. ప్రతి పాటకు దిగువ అది ఏ రేకులో ఎన్నవ సంఖ్యగా నున్న పదమో, ఏ సంపుటములో ఏ పుటలో నున్నదో కూడ వివరించారు. అన్నమాచార్యుల పదాలకు రేకులలో నున్న అవతారికను పూర్తిగా ఇచ్చారు. అలాగే పెదతిరుమలాచార్య, చినతిరుమలాచార్యగార్ల రచనలకు కూడ రేకులలోనున్న అవతారికలు యధాతథంగా పొందుపరచారు. ఇది చాలా ముఖ్యమైన పని. ముందు ముందీ విష యంలో పరిశోధన చేసేవారి కిది ఎంతగానో ఉపయోగపడుతుంది.

ప్రస్తుతకృతి 'శ్రీనివాసతేజము' తిరుమల తిరుపతి దేవస్థానంవారి ధార్మిక గ్రంథ ప్రకాశన సహాయనిధినుండి, ఆర్థిక సహాయమందుకొని వెలుగు చూసినది. ఈ ఉపకృతికి దేవస్థానంవారు తెలుగువారి కృతజ్ఞతకు పాత్రులు.

--డా॥ ముట్నూరి సంగమేశం



(20వ పేజీ తరువాయి)

కాకతీయ రుద్ర నుంచి పిల్లలు లేనందువల్ల, అతని తర్వాత అతని చిన్న సోదరుడు మహాదేవ రాజ్యాధికారానికి వచ్చాడు. ఇతడు చాలా తక్కువకాలం అనగా మూడేళ్లు మాత్రం పాలించాడు (క్రీ.శ. 1195-1198/99). ఇతనికి యాదవులతో వచ్చిన పోరువల్ల ఆకస్మికంగా మరణించాడు. మహాదేవ తర్వాత 'గణపతిదేవ' అధికారానికి వచ్చాడు. చాలాకాలం రాజ్యపాలన గావించిన భారతీయ రాజులలో గణపతి ఒకడు. గణపతి అరవైమూడేళ్లు రాజ్యపాలన గావించాడు (క్రీ.శ. 1199-1262). ఇతని కాలంలో పలు యుద్ధాలు సంభవించినప్పటికీ, ఇతడు దేశాన్ని శాంతి, సౌభాగ్యాలతో ఉంచాడు. చాలావరకు ఆంధ్రదేశంలోని ప్రాంతాలన్నీ ఇతని పాలనలోకి వచ్చాయి.

గణపతిదేవుని పాలన కాలంలో దేవాలయ నిర్మాణం బాగా ఉచ్చస్థితికి చేరుకుంది. ఆ కాకతీయ రాజులచేతనే కాకుండా అతని కుటుంబసభ్యులైన మేలాంబ మరియు గణపాంబచేత, అతని సామంత రాజులచేత, ప్రభుత్వ ప్రముఖులచేత కూడ దేవాలయ నిర్మాణాలు ముఖ్యంగా శివాలయాలు నిర్మింపబడినాయి. కాకతీయ గణపతి పరమ శైవమతారాధకుడు. ఆ మతాభివృద్ధికై, మతవ్యాప్తికై చెప్పుకోదగ్గ కృషి చేశాడనుటలో ఆశ్చర్యం లేదు. ముఖ్యంగా నర్మదానది ఒడ్డున నెలకొనివున్న దాహల దేశంలోని గోలకి మఠానికి చెందిన పాశుపతశైవులు సామాన్య ప్రజానీకంలో మంచి పాలకులుగా పేరు పొందారు. సాధారణంగా కళాముఖుల పేర్లు రశి, పండిత, శక్తిలతో పూర్తవుతుంది. మల్కాపురం శాసనం, కాకతీయ గణపతి గురువు విశ్వేశ్వర శంభు అని చెపుతోంది. అంతేగాక పాశుపతులచేత ప్రారంభించబడిన మఠాలు, ఆధ్యాత్మిక సంపదను గూర్చి ప్రజలకు తెలియచెపుతూ, ధార్మిక సంస్థలుగా వ్యవహరిస్తున్నాయి. మల్కాపురం శాసనం ఈ విషయానికి నిదర్శనంగా నిలుస్తోంది. పాశుపతులచేత ప్రారంభించబడిన ఈ మఠాలు గణపతి చేత ఎక్కువగా పోషించబడ్డాయని పలు శాసనాలు మనకు తెలియచేస్తున్నాయి. కరీంనగర్ జిల్లా మంతనికి చెందిన శాసనం క్రీ.శ. 1199 గణపతికి చెందినది చెపుతున్న దేమనగా, దేవాలయ నిర్మాణాలు ఈ కాలంలో ఎక్కువగా జరుగుటయే గాకుండా, కాకతీయరాజులు మత సహనాన్ని కూడ కలిగి వుండేవారు. ఈ శాసనం విశదం చేసే విషయమేమనగా, ఆరు దేవాలయాలు వేర్వేరు గ్రామాల్లో మల్లిఖార్జునసూరి పండితుని కుటుంబానికి చెందిన వ్యక్తులచేత నిర్మించబడినాయి.

ఆ దేవాలయాల వివరాలు ఇలా ఉన్నాయి.

1. గణపతీశ్వర, గణపతి తర్వాత ఈ పేరు ఏర్పడింది. కోటిపల్లి వద్ద (మల్లికార్జునపురం).
2. లక్ష్మీనారాయణ, జొన్నగ్రామం (ప్రస్తుతం పిలువబడే పేరు జనగామ, అదిలాబాద్ జిల్లా).
3. అంబనారాయణ, ఇదికూడ జొన్నగ్రామం సమీపంలో వుంది.
4. నృసింహ - సింహపురి సమీపం.
5. శివలింగం.

ఈ శాసనం చాలా ఆసక్తికరమైన అంశాలను వివరిస్తోంది. మంత్రకూటంలోని స్వామి అయిన గోపీజనవల్లభుని, రామసహాయం (రామునితో కూడి) గా మరియు మధురం త్రిభంగ్యగా వర్ణిస్తోంది. మూడు అవయవ ప్రదేశాలలోని అందమైన ఒంపువల్ల జనాకర్షణ కలిగిస్తోంది. ఇది విష్ణుకృష్ణను సూచిస్తోంది. త్రిభంగి అనే పదం చాలా విశేషార్థాన్ని చెపుతోంది. ఇది వేణుగోపాలస్వామిని సూచింపచేస్తోంది. ఈ సందర్భంలో సంస్కృత నిఘంటువుల్లో లేనివి, బ్రౌన్ యొక్క తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులో వివరిస్తున్న దేమనగా, ఈ పదంలో వుండే భంగిమ వేణుగోపాల స్వామికి చెందిన విగ్రహాలను సూచిస్తోంది. హింది, బెంగాలి, ఒరియ, అస్సామీ భాషలకు చెందిన నిఘంటువులు త్రిభంగి పదాన్ని ఈ రకంగా వివరిస్తాయి. నిలబడివున్న (స్థానక భంగిమ) విగ్రహానికి మోకాలు, నడుము, మెడదగ్గర వంగి వుంటుంది. (అనగా నిలబడి వున్న భంగిమలో) మూడు అవయవాల వద్ద వంపు ఉంటుంది. తూర్పు భారత దేశంలో విష్ణుకృష్ణ మిక్కిలి పేరొందిన ప్రతిమ.

క్రీ.శ. 1208 త్రిపురాంతకానికి చెందిన శాసనం చెపుతున్న దేమనగా, కాకతీయ గణపతి సోదరి మేలాంబిక త్రిపురాంతకాలయంలో లింగ ప్రతిష్ఠ గావించినట్లు, ఆ తర్వాత ఆ స్వామికి మైలాంబికేశ్వర పేర రూఢి అయినట్లు తెలుస్తోంది. అంతేగాక ఆమె కొంత భూమిని ఆ దేవాలయ నైవేద్య నిర్వహణకై సమర్పించారు. ఈ శాసనాన్ని ఆ దేవాలయంలోని లింగానికి ముందువైపుగల స్తంభంమీద, వంటశాలకు ఉత్తరదిశలో చూడ వచ్చును. ఈ శాసనం, క్రీ. శ. 1208 లో లింగం, మేలాంబిక చేత ప్రతిష్ఠించబడింది.

క్రీ.శ. 1214 నల్గొండ జిల్లాకు చెందిన గణపవరంలోని శాసనం, రుద్రేశ్వర స్వామి స్థాపన గణపతిపుర గ్రామంలో జరిగినట్లు తెలుస్తోంది. ఈ శాసనం కలిగి వుండే స్తంభాన్ని వేంకటేశ్వరాలయం వద్ద చూడవచ్చును. దీనినిబట్టి శాసనంలో చెప్పబడిన గణపతీపురం, గణపతివరం ఒకటే అయివుండే అవకాశముంది. ఈ శాసనం శిథిలావస్థలో వుండేందువల్ల ఇతర వివరాలేవీ తెలియడంలేదు.

క్రీ.శ. 1213 వరంగల్ జిల్లా, చిట్యాల పాడుకు చెందిన శాసనం చెపుతున్న దేమనగా, కాటయ సేనాపతి గణపతిరాజు నుంచి మాండలికాన్ని పొంది, ఒక పట్టణాన్ని నిర్మించాడు. అందు రుద్రేశ్వరస్వామిని ప్రతిష్ఠించినట్లు తెలుస్తోంది. అయితే సేనాపతి చేత నిర్మించిన పట్టణం గురించిన వివరాలేవీ మనకు తెలియడంలేదు.

(సశేషం)

☆☆☆☆☆☆☆

# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం



శ్రీ గోవిందరాజస్వామి ఆలయం! స్వామి, శ్రీరామానుజులవారు ప్రతిష్ఠించినది.

శ్రీ కోదండరామాలయం! స్వామికి వరప్రసాది అని పేరు.

శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి! -శ్రీనివాస మంగాపురం పద్మావతితో వివాహానంతరం కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం



శ్రీ కపిలేశ్వరస్వామి! తిరుపతిలోని ఏకైక శివాలయం కపిల మహర్షి అర్చించినది.

శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు శ్రీనివాసుని రాణి పద్మావతి అర్చామూర్తిగా వెలకొన్న దేవాలయం

శ్రీ అగస్త్యేశ్వరాలయం-తొండవాడ. కల్యాణి తీరాన ఉన్న పురాతన దేవాలయం





బయలుదేరు స్థలం:-
తిరుపతి తితి దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6 గం॥కు, 10 గం॥కు
సాయంత్రం: 3 గం॥కు



టిక్కెట్టు వెల:
పిల్లలకు: రూ. 10/-
పెద్దలకు: రూ: 20/-
ప్రతిచోటా ప్రత్యేక దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR

# ఎవరు గొప్ప?

— శ్రీ భైరి విశ్వనాథం

ఆ రోజు ఆదివారం బడికి శెలవు కావడం వల్ల పిల్లలంతా సాయంకాలం నాలుగు గంటలకే ఊరు చివరవున్న కోవెల ప్రక్కన ఆటకు చేరారు. దొంగాట కొంతసేపు, కోతి కొమ్మచ్చి కొంతసేపు ఆడగానే, చిన్నగా చినుకులు ప్రారంభమయ్యాయి. పిల్లలంతా పరుగెత్తుకుంటూ కోవెల లోపలికి చేరి, గర్భగుడిముందుగా వున్న గజాల తలుపుల దగ్గర నిల్చున్నారు. గడిలో వున్న శివలింగాన్ని, దాని చుట్టూ వున్న నాగాభరణాన్ని పిల్లలంతా చూస్తూ ముచ్చటపడుతున్నారు.

"ఒరేయ్ కిట్టూ! ఆ శివలింగాన్ని చూడరా! ఎంత అందంగా వుందో. తెల్లని పాలరాయి, ఎదురుగా విభూతి కట్లూ, పైని ధారాపాత్ర, నిజంగా మూర్తీభవించివున్నాడు కదూ ఈశ్వరుడు" అన్నాడు రాఘవ. ఓ




చాల్లేవోయ్! నీ డబ్బాలు ఇదేం పెద్ద గొప్ప, మా ఇంటి ప్రక్కనున్న రామాలయం నువ్వెప్పుడైనా చూశావా! అందులో సీత, రాముడు, లక్ష్మణుడు, ఆంజనేయుడు విగ్రహాలన్నీ రంగు రంగులతో కళ కళ లాడుతూ జీవకళ ఉట్టిపడుతున్నాయ్. దేవుడంటే నిజంగా అలా వుండాలి కాని ఇలా బోడి రాయిలాగానా" వుక్రోషంగా అన్నాడు కిట్టు. ఆ.... నీ దొట్టి బూటకం మాట్లే. సర్వ ప్రపంచమంతా నిండివుండే వాడూ, సృష్టి, స్థితి, లయ కారకుడూ పరమేశ్వరుడేనని మా నాన్నగారు చెప్పారు. నిజంగా ఈశ్వరుణ్ణి మించిన దేవుడే లేడట. తెలిసిందా? అన్నాడు రాఘవ. ఓ..... గొప్ప దేవుడు కాళ్ళూ చేతులూ లేని బోడి రాయి మా రాముడికన్నా ఎందులో గొప్ప మీ ఈశ్వరుడు కళ్ళెగరేస్తూ అడిగాడు కిట్టూ. ఇలా రాఘవ, కిట్టూ మా దేవుడు గొప్పంటే మా ఈశ్వరుడు గొప్పని వాదనల్లా, కేకలుగా మారి, కొట్లాటకు సిద్ధమవగానే ఆగండి! ఆ ఇద్దరిలో ఎవరు గొప్పో ఆ వస్తున్న పూజారి నడుగుదాం అని శాంత పర్చాడు రవి. అంతలో పూజారి రాగానే వాళ్ళిద్దరి వాదననూ వివరించి రాముడు, ఈశ్వరులలో ఎవరు గొప్పో చెప్పమని అయన్నడిగాడు రవి. వాళ్ళ మాటలు విన్న పూజారి చిన్నగా నవ్వుతూ "వుండండి దీపం వెలిగించి వస్తా" నని గర్భగుడిలోకి వెళ్ళి, దేవుడికి ధూప దీప నైవేద్యాలు పెట్టి వచ్చారు.

పిల్లల్ని చూస్తూ, "ఆ ఏంటీ రాముడు,

'చంద్రశేఖర'



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం
# తిరుచానూరు
## నిత్యపూజానివేదనలు

సుప్రభాతం: ఉ. 5-00 గం. నుండి 5-30 గం. వరకు
సహస్రనామార్చన: ఉ. 5-30 గం. నుండి 6-00 గం వరకు
శుద్ధి, మొదటిగంట: ఉ. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం. ఉ. 6-30 గం. నుండి 11-30 గం. వరకు
శుద్ధి, రెండవగంట ఉ 11-30 గం. నుండి 12-00 గం. వరకు
సర్వదర్శనం· మ 12-00 గం. నుండి సా 6-00 గం. వరకు
శుద్ధి, మూడవగంట: సా. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: సా 6-30 గం. నుండి రాత్రి 8-45 గం. వరకు
శుద్ధి రాత్రి 8-45 గం. నుండి 9-00 గం వరకు
ఏకాంతసేవ. రాత్రి 9-00 గం. నుండి 9-30 గం. వరకు

### శుక్రవారాలలో

అభిషేకం· ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(రూ. 100-00 టిక్కెట్‌తో ఒక్కరికి మాత్రమే ప్రవేశం)*
అభిషేక దర్శనం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(ఒక్కొక్కరికి రూ. 5-00 టిక్కెట్)*

### ఆర్జిత సేవలు

| | | |
|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం | ... | రూ. 63-00 |
| గజవాహనం | ... | రూ. 32-00 |
| తిరుప్పావడ | ... | రూ. 3000-00 |
| డోలోత్సవం | ... | రూ. 150-00 |

### ఆర్జిత ప్రసాదాలు

| | | |
|---|---|---|
| దోసె | ... | రూ. 100-00 |
| దధ్యోదనం | ... | రూ. 75-00 |
| పులిహోర | ... | రూ. 100-00 |
| పొంగలి | ... | రూ. 200-00 |
| చక్కెర పొంగలి | ... | రూ. 200-00 |
| కేసరి బాత్ | ... | రూ. 300-00 |
| శాకరిబాత్ | ... | రూ. 250-00 |
| సీరా | ... | రూ. 400-00 |

*ఇవేగాక, భక్తాదులు రూ. 1-50 టిక్కెట్‌తో తమ గోత్ర, నామాదులతో అమ్మవారికి అష్టోత్తరశతనామ పూజ చేయించవచ్చును.*

ఈశ్వరుడు దేవుళ్ళలో ఎవరు గొప్పనేదేనా మీ సంశయం" అని అడిగారు పూజారి. ఔను, ఔను ఏక కంఠంతో అన్నారు పిల్లలంతా. కొంచెం ఆలోచించి "ఏ దేవుడి గొప్పో మీకు తెలియాలంటే నా వెంటరండి" అని పిల్లల్ని వెంటపెట్టుకొని పూజారి నడక సాగించారు. పూజారి ఓ కంసాలి ఇంట్లోకి వెళ్ళారు. చీకటి పడిందేమో లైటు ముందుం చుకొని వస్తువులు చేస్తున్నాడు. పూజారిని చూడగానే నమస్కరిస్తూ, ఏంటిలా వచ్చారని అడిగాడు కంసాలి. వూరకనే అని చిరు నవ్వుతో సమాధానమిస్తూ పిల్లలవైపు తిరిగి చూడండి బాబులూ ఈయన చేస్తున్న పని రక రకాల వస్తువులు తయారుచేస్తున్నారని చెప్తూ అక్కడున్న వుంగరాన్ని తీసి ఇందేంటి? అని అడిగారు వేలికి పెట్టుకునే వుంగరం అన్నారు పిల్లలందరూ. ఔనా మరిఇదేంటి ఇంకో వస్తువుని చూపుతూ అడిగారు. అది గొలుసు చెప్పారు పిల్లలు. సరే... సరే... మరి ఇదో? మరొక వస్తువుని చూపుతూ అడిగారు పూజారి. అది తలపై వుండే నాగరం చెప్పారు పిల్లలు కదా ఇలా రకర కాల వస్తువుల్ని ఏ లోహం తో తయారు చేస్తున్నారీయన చివరిగా అడిగారు పూజారి. బంగారంతో చెప్పారు పిల్లలు. ఔను కదా బంగారు ఒకటే కాని అనేక రకాలైన వస్తువులు తయారౌతున్నాయి. అలాగేదేవుడు కూడా ఒక్కడే రాముడని, శంకరుడని, కృష్ణుడని రూపాలు వేరు. అందులో ఒకరు గొప్పని, వేరొకరు తక్కువని వుండరు అర్థమైందా? వివరించాడు పూజారి. 'అర్థమైంది' వికసిం చిన ముఖాలతో మా సమస్య తీరింది. ఇహ పోట్లాడుకోం. సెలవండీ! చెప్తూ పిల్లలంతా వెళ్ళి పోయారు పూజారి ఇల్లు చేరుకున్నారు.



# కాకతీయులనాటి బెజ్జంకి శ్రీలక్ష్మీనృసింహస్వామి గుడి

శ్రీ రేబల్లి వేంకటేశ్వర్లు

ఫోటోలు : శ్రీ ఎస్. వాసు

కరీంనగర్ నుండి హైదరాబాదు పోవు దారిలో కరీంనగర్‌కు 40 కి.మీ. దూరంలో బెజ్జంకి మండలకేంద్రం కలదు. గ్రామ సమీపమునగల విశాలమైన గుట్టపై చెక్కు చెదరక నిలిచియున్న కాకతీయులనాటి శ్రీ లక్ష్మీనృసింహస్వామి ఆలయము కలదు.

కాకతి గణపతిదేవ చక్రవర్తి సేనాధి పతి రేచర్ల రుద్రుడు క్రీ.శ. 1213 సం॥ కట్టించిన రామప్పదేవాలయ ( వరంగల్ జిల్లా శాసనములు పే.141) వాస్తు, శిల్పరీతులు బెజ్జంకి శ్రీ లక్ష్మీనృసింహస్వామి గుడి నిర్మాణములో స్పష్టముగ అగుపించుచున్నవి. రేచర్ల రుద్రుని మంత్రి కాటయ ఇచట క్రీ.శ. 1236 సం॥ శివాలయము కట్టించెను. (గుడి అవశేషములున్నవి.) (కరీంనగర్ మండల చరిత్ర పే.30). కాటయ మంత్రి వేయించిన బెజ్జంకి ధర్మశాసనము పూర్తి పాఠము లభించిన శ్రీలక్ష్మీనృసింహస్వామి గుడి వివరములు తెలిసెడివి కాబోలు. (ఇపుడు శాసనము లేదు.) రేచర్ల రుద్రుని ప్రభావమున బెజ్జంకి విష్ణ్వాలయమును శైవాభిమానులైన కాకతీయుల కాలమున కాటయమంత్రి లేక మరొకరు నిర్మించి యుందురు.



## ఆలయవాస్తు

బెజ్జంకి శ్రీలక్ష్మీ నృసింహస్వామి గుడి నక్షత్రాకారపు వేదికపై దక్షిణముఖముగ నిర్మింపబడింది. గర్భాలయము, అంతరాళము, ముఖమంటపము ఈ ఆలయమున కలవు. ముఖమండపము మధ్యన నాలుగు అలంకృత శిల్పస్తంభములతో, గుండ్రని నాట్యశిలతో రంగమండపము చూపరుల నాకర్షించును. ముఖమంటపమునకు మూడువైపుల ద్వారములు, ద్వారమండపములున్నవి. ద్వారములు, రంధ్రములున్న కిటికీల ద్వార ధారాళముగ వెలుతురు, గాలి గుడిలోనికి ప్రవేశించును. రంగమండపము, ద్వారమండపముల లోకప్పుల చతరస్రపు మూలలకు ఖాళీలు లేకుండ పేర్చిన త్రికోణ సింహలలాటముల మధ్యన ఏకశిల పద్మములు అమర్చబడినవి. గర్భాలయముపై ఒక మెట్ల గోపురము కలదు. పై వాస్తు పద్ధతులన్నియు రామప్పగుడిని పోలియున్నవి.

శివ, విష్ణు ఆలయములు ఉత్తర, దక్షిణ ముఖముగ ఉండవు. కాని హనుమకొండ వేయిస్తంభాల గుడివలె ఇచటి ఆలయము దక్షిణ ముఖముగ నున్నది. ఇది జైనమత ప్రభావముగ తలపడుచున్నది.

## శిల్పశైలి

బెజ్జంకి గుడిలో శిల్పప్రాధాన్యముగల నాలుగు అలంకృత స్తంభములకు, లోకప్పు పద్మములకు శిల్ప వివరములు స్పష్టముగ చెక్కుటకు వీలైన నల్లరాళ్లను, శిల్పప్రాధాన్యము లేని స్తంభములకు, గుడి గోడలకు ఎర్రరాళ్లను వాడినారు.

## శ్రీ మహావిష్ణువు శిల్పాలు

రంగమంటపానికి ఎడమవైపునగల రెండు అలంకృత స్తంభములపై నలువైపుల చతుర్భుజుడైన శ్రీమహావిష్ణువు అర్ధశిల్పము 14 అంగుళముల నిడివి గల స్తంభపు అడుగు భాగమున చెక్కబడినవి.

ఇది శ్రీనర్సింహస్వామి ఆలయము అనుటకు సంకేతముగా స్తంభపు ముందు భాగమున "శ్రీ యోగానర్సింహ స్వామి" శిల్పము దర్శనమిచ్చును. అంకపీఠమున అధివసించిన ఆదిలక్ష్మితో శ్రీనివాసుడు మరోవైపున



గోచరించును. భక్తజన ప్రియుడైన శ్రీహరికి ఇరువైపుల పరమభాగవతోత్తములైన ఆంజనేయస్వామి, గరుడాళ్వారులను పై శిల్పము లందు మలుచుట గమనార్హము. "కమలము రూపమున" తీర్చిదిద్దిన ఆదిశేషునిపై ఆశీనుడైయున్న శ్రీమహావిష్ణువుకిరువైపుల శ్రీదేవి, భూదేవి ఇంకోవైపు అగుపింతురు. ఆదిశేషుని కమలం వలె మలిచిన తీరు ఇచటి శిల్పుల ప్రత్యేకతను తెలుపును. నాల్గవవైపున కమలాసనుడైన త్రిముఖ బ్రహ్మ హంస వాహనముతో మనదృష్టి నాకర్షించును. దేవతామూర్తు లన్నింటికి చక్కని కిరీటము లున్నవి. ఇది కాకతీయ శిల్ప ప్రత్యేకతగా శ్రీ చలసాని ప్రసాదరావు తన గ్రంథమున తెలిపినారు.

### రామప్ప రూప శిల్పాల ప్రతిరూపాలు

కుడివైపున గం మిగిలిన రెండు అలంకృత స్తంభములపై 14 అంగుళముల నిడివి గల అడుగుభాగమున నిలువెత్తు రామప్పగుడి సుందరీమణుల ప్రతిరూపములు జీవచైతన్య ముట్టిపడు నృత్యభంగిమలలో మన దృష్టిని ఆకట్టుకొనును. ఇది రామప్ప శిల్పములకు ప్రతిరూపములే అయినను శిల్పులు కొంత స్వాతంత్ర్యము వహించుట కన్పట్టును.

మొలక్రింది భాగమున ఆకులు, విల్లమ్ములు ధరించిన ఆటవిక స్త్రీ కాలిముల్లు తీస్తున్న సేవకుడు, పైకెత్తిన చేతులను కలుపుచు నొకటి; భుజములపై నొక్కకటి; కాళ్లకు చుట్టుకొన్న 'నాగులు' గల నగ్న నాగకన్యక; యువతి కటివస్త్రము లాగుచున్న కోతి శిల్పములు రామప్ప రూపశిల్పములకు సూక్ష్మరూపములు.

### అలంకార శిల్పము

ఆరు అంగుళముల నిడివిగల స్తంభములు మధ్యభాగములపై చెక్కిన స్త్రీల కోలాటము, నృత్యము, సాగరమథనము "శిల్పములలో త్రిభంగి" సూత్రము (కాళ్లు, తల, నడుము వ్యతిరేక దిశలలో వంగి ఉండుట) పాటింపబడినది. శిల్పములు చిన్నవైనను వాని హావ భావములు స్పష్టముగ తెలియుచున్నవి.

స్తంభ పరిమాణము మించిన వృత్తాకారము, వృత్తమును మించిన చతురస్త్ర శిల్పము, దానిపై నక్షత్ర శిల్పముగల స్తంభముల పై భాగములు రంగమంటప శోభను ఇనుమడింప చేయుచున్నవి.

ముఖమంటపములోపలి గోడలకు పద్మములు, గుడి వెలుపలి గోడలకు హంసల, ఏనుగుల, సింహముల, పద్మముల వరుసలు అలంకార శిల్పములుగా వాడబడినవి.

దక్షిణముఖ ద్వారముపై మూడు ఆలయ శిఖరముల మధ్యన ఇద్దరు భక్తులు ప్రణమిల్లుచున్న శిల్పము భక్తికి ఆలయము నిలయమని తెలుపుచున్నది. ఐదు గోపురములతో తూర్పు ద్వారము పైభాగము, మూడు ఆలయ గోపురముల మధ్యన ఇద్దరు నాగకన్యల నృత్యము గల పడమటి ద్వారము ఇహపరముల సాధనకు ఆలయము సాధనమని తెలుపుచున్నవి.

కాకతీయులు గుడి వెలుపలి అలంకారానికంటె లోపలి అలంకరణకు ప్రాధాన్య మిచ్చారు. శిల్పాలు లేని ఆలయ శిఖరాలు నిర్మించారు. కనీసం నాలుగు అలంకృత స్తంభాలతో ముఖమంటపానికి అందాలు సంతరించి పెట్టారు. వీటన్నింటిని పరిశీలించిన "ఇంటి కంటె గుడి పదిలం" అన్న నాటి సామెత గుర్తుకు వచ్చును. పెళ్లిళ్లు, హరికథలు, భజనలు, ధర్మ ప్రభోదములకు ఆలయములు నేడు కూడ నిలయములై వున్నవి.

### ఆలయ విశేషములు

స్వయం వ్యక్తమైన స్వామి గర్భాలయ శిలపై శ్రీ నర్సింహావతార రూపము, ముందు స్వామి తొడపై కూర్చున్న శ్రీ లక్ష్మి యుక్త స్వామివారి విగ్రహము ప్రతిష్ఠింపబడినది. స్వయంవ్యకమైన స్వామి క్రింది భాగమున 'శ్రీ పాదములు' కూడ ఉండుట ఈ ఆలయ ప్రత్యేకతగా అర్చకులు పేర్కొనుచున్నారు.

నిత్యము ధూపదీప నైవేద్యములందు కొనుచున్న స్వామివారికి చైత్రశు॥ 7 నుండి బ॥ 7 వరకు 15 రోజులు అంగరంగ వైభవంగ బ్రహ్మోత్సవములు జరుగును. చైత్రశు॥ ఏకాదశిన జరుగు కళ్యాణము, పౌర్ణమినాటి బండ్లు, బ॥ పాడ్యమిన జరుగు రథోత్సవము ప్రజలను ఎక్కువగా ఆకర్షించును.

### ఆండాళు స్తంభము

ఆలయానికి ఉత్తరమున ఏకశి ఆండాళు స్తంభము ప్రతిష్ఠాపింపబడినది మ్రొక్కులున్నవారు ఈ స్తంభమునకు చీ కట్టించి ఒడిబియ్యము పోయు పూర్వాచారము నేటికి కొనసాగుచున్నది. గుళ్లలో స్త్రీ దేవతా విగ్రహములకు ఒడిబియ్యము పోయు ఆచారముండగా బెజ్జంకిలో ఆండాళ అమ్మవారి పేరిట వెలసిన స్తంభమునకు ఈ మర్యాదక్కుట గమనింపదగినది.

మ్రొక్కులున్నవారు దివిటీలు ముట్టించుట ఆలయ ప్రత్యేకతలతో నొకటి.

### శిల్పము బోధించు వేదాంతము

గర్భాలయము పడమటి వెలుపలి గో లపై కొన్ని మిథున శిల్పములున్నవి. శిల్పముల మధ్యనున్న ఆంజనేయస్వామి గరుడాళ్వారుల ఇరువురి చేతులలో లిం రూపమున నున్న శివుడు కన్పట్టును. శి కేశవ అభేదాన్ని తెలుపుతు ఈ శిల్పా మనకెన్నో ధర్మ సూక్ష్మములను వి పరచుచున్నవి.

కాకతీయుల కాలమున వెలసిన లక్ష్మి నృసింహస్వామి ఆలయ శిల్పము నాటి శైవ వైష్ణవ భక్తి సారూప్యమును, స్త్రీ ధరించిన పలు ఆభరణములు, కోలాట లాడు పద్ధ లు, నృత్య భంగిమలు, సం వాద్యములు మొదలగువానిని ప్రదర్శించు పూర్వకాలపు సాక్షులుగా నిలిచి యున్నవి.



# సత్సంగ ఫలం

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి



త్రిలోకసంచారి అయిన నారదునికో సమస్య ఎదురైంది. దాని పరిష్కారం కోసం ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఫలితం లేక పోవటంతో, పరమాత్ముడే గతి అనుకున్నాడు 'నారాయణతే నమో నమో...' అంటూ నేరుగా వైకుంఠపురానికి వెళ్ళాడు.

"ప్రభో, సదా నీ నామస్మరణలోనే కాలం గడుపుతున్నాను. నీవు సర్వార్చితుడవు. సర్వ లోక వ్యాప్తుడవు. నేనా, సామాన్యుడైన సన్యాసిని. ఇన్నేళ్ళు గడచినా నీ సాన్నిధ్య ఫలమేమో తెలియకున్నది. దయచేసి సత్సాంగత్య ఫలమేమో వివరించ ప్రార్థన" అన్నాడు.

నారాయణుడు చిరునవ్వు నవ్వుతూ 'నీ ప్రశ్న విచిత్రంగా వుంది. సమాధానం కావాలంటే, అదో దూరాన వున్న కంపల వద్దకు వెళ్ళండి. అక్కడ ఒక తొండ వుంటుంది. దానిని అడగండి సమాధానం లభిస్తుంది' అన్నాడా స్వామి.

నారద మహర్షి వెళ్ళి తన ప్రశ్నను వినిపించాడు. విన్నవెంటనే ఆ తొండ చచ్చిపోయింది. నారదుడు భయపడి నారాయణుని వద్దకు వెళ్ళి జరిగిన కథ విన్నవించాడు.

'ఏమి నారదా, సమాధానం దొరకలేదా?' అన్నాడు స్వామి. 'లేదు ప్రభూ' అన్నాడు.

'సరే, ఈసారి అక్కడ వున్న చిలుక వద్దకు వెళ్ళు. సమాధానం తప్పక లభిస్తుంది' అన్నాడు పరమాత్ముడు.

'నారాయణ' అంటూ చిలుక వద్దకు వెళ్ళాడు నారద మహర్షి. ఆ చిలుక పంజరంలో బంధింపబడింది. నారదుడు వెళ్ళి భయంగానే, తన ప్రశ్న వినిపించాడు. చిలుక వున్నదున్నట్లే తూలిపడి, కన్ను మూసింది. నారదుడు మళ్ళా భయపడినాడు.

మరలా నారాయణునివద్దకు వెళ్ళాడు. స్వామి నవ్వుతూ 'ఈ సారి కూడా మీకు సమాధానం లభించలేదా?' అని అడిగాడు. 'అంతా విచిత్రంగా వుంది ప్రభో' అన్నాడు.

'సరే మరో ప్రయత్నం చేయి. సమాధానం తప్పక లభిస్తుంది. అదిగో, ఆ మహారాజుకు ఇప్పుడే పుత్రప్రాప్తి కలిగింది. ఉయ్యాలలో వున్న ఆ పసిబిడ్డ వద్దకు వెళ్ళు. మీ ప్రశ్నకు సమాధానమివ్వగల ఏకైక వ్యక్తి, ఆ ముద్దుబిడ్డ మాత్రమే, వెంటనే వెళ్ళు' అని పురమాయించాడు పరమాత్ముడు.

నారదుడు కదలకుండా అక్కడేవున్నాడు, "స్వామీ, నా ప్రశ్నకు సమాధానం లేకున్నా చింతలేదు. ఇప్పుడే పుట్టిన బిడ్డ చావును చూడలేను, మన్నించండి" అంటూ తలవంచుకున్నాడు.

"ఈసారి తప్పక సమాధానం లభిస్తుంది వెళ్ళు" అంటూ అభయమిచ్చాడు స్వామి.

నారద మహర్షి రాజమందిరం చేరాడు. మహారాజు మహదానందంతో మహర్షికి స్వాగతం పలికాడు. 'నవజాత శిశువును ఆశీర్వదించండి' అంటూ విన్నవించి, మహర్షిని బిడ్డవద్దకు తీసుకుని వెళ్ళాడు. మహారాజా, ఒకమాట "నన్ను ఏకాంతంగా శిశు

వును చూడనివ్వండి" అన్నాడు. రాజు అలాగే అంటూ దూరంగా వెళ్ళి పోయాడు.

ఊయలవద్దకు వచ్చిన నారదులవారిని చూచి ఆ శిశువు చిరునవ్వు నవ్వింది.

"మహాత్మా, మీ ప్రశ్నకు సమాధానం వినండి. మొట్టమొదట మీరు ఈ ప్రశ్న అడిగినపుడు, మీ దర్శనమాత్రంతో నాకు తొండ జన్మనుండి ముక్తి లభించింది. చిలుకగా జన్మించినపుడు, మరోమారు మీ దర్శన భాగ్యం లభించింది. ఆ జన్మనుండి మోక్షం లభించి, ఇపుడు నరజన్మ ఎత్తాను. క్షణ మాత్రం తమ దర్శనం, సాన్నిధ్యం లభించి నందువల్ల నా పాపములన్నీ కరిగిపోయాయి. ఉత్తమ జన్మ లభించింది. సత్సంగం వల్ల ఇంతకంటే ఏం కావాలి?" అన్నదా శిశువు. నారదుడు ఆనంద బాష్పభరితుడయ్యాడు.

మరలా వైకుంఠవాసుని వద్దకు వెళ్ళాడు. 'ప్రభో, సత్సంగ ఫలం ఏమిటో తెలుసుకున్నాను' అంటూ నారాయణ నామస్మరణ చేస్తూ సంచారం ప్రారంభించాడు నారదుడు.

✻✻✻✻

# ఎంత నల్లనివాడవో ....

— శ్రీ రసరాజు



ఎంత నల్లనివాడవో
అంత చల్లని నీడవు.......
కొండ ఒడిలో కొలువున్నా
గుండెగుడి నీ నెలవన్నా.

ఆర్తితో నిను తలచిన చాలు
అదే పిలుపు - ఆదుకొందువు
ఆత్మలో నిను కొలిచిన చాలు
అదేపూజ అందుకొందువు
కరిని బ్రోచిన సిరిదొరా
కలియుగేశా కావరా
తిరుమలేశా... వేంకటేశా....
శ్రీనివాసా.... గోవిందా. ॥ఎంత॥

శేషగిరిపై నిలిచిన చాలు
శిఖి తానై హృదయమాడును
కోనలోపల తిరిగిన చాలు
కోకిల యై మనసు పాడును
అన్నమయలో భావనా
అభయమిచ్చే దీవనా
శేషశయనా......కమలనయనా
గరుడగమనా.... గోపాలా. ॥ఎంత॥



# బాబును బ్రతికించిన బాలాజీ

శ్రీ బి.ఇ. సంపత్‌కుమార్




నేను కడపలో 1984వ సంవత్సరంలో పనిచేస్తున్న రోజులవి. మాకు మొదట ఒక అబ్బాయి తరువాత కవలలు (మగపిల్లలు) కలిగారు. కవలలకు చి॥ అనిల్ చి॥ అరుణ్ అని పేర్లు పెట్టుకున్నాము. వాళ్ళల్లో అరుణ్‌కు సుమారు మూడునెలల వయస్సున్నప్పుడు ఉన్నట్టుండి ఒకరోజు హెర్నియా వచ్చి ఒకే విధముగా ఏడుస్తూ ఉండినాడు. డాక్టరుకు చూపించాము. వెంటనే గవర్నమెంటు ఆసుపత్రిలో చేర్చమన్నారు. ఆరోజు మధ్యాహ్నము 12 గంటల ప్రాంతములో మా బాబును చేర్చాము. డాక్టరు వెంటనే ఆపరేషను చేయాలని చెప్పారు. నేను హాస్పిటల్ సర్జన్‌తో మాట్లాడాను. ఆయన ఆపరేషన్ చేస్తానన్నారు. సాయంత్రము 6 గంటలప్పుడు హాస్పిటల్ సర్జను ఆపరేషను చేయడానికి వచ్చారు. ఆసుపత్రిలో ఆక్సిజను లేదన్నారు. ఆపరేషను చేసినా బాబు బతుకుతాడని నమ్మకము లేదు. మీ తృప్తి కోసం ఆపరేషను చేస్తామన్నారు. నాకు చాలా బాధకలిగింది. మధ్యాహ్నము నుంచి సాయంత్రం వరకు ఆక్సిజను లేదనే విషయము నాకు ఎవ్వరూ చెప్పలేదు. ప్రైవేటు ఆసుపత్రినుంచి తెచ్చుకొమ్మని కూడ ఎవరూ చెప్పలేదు. నేను ఆక్సిజను కోసం ప్రయత్నము చేస్తానన్నాను. కాని లేటవుతుంది వద్దన్నారు. నాకు డాక్టర్లపై చాలా కోపము వచ్చినది. అయినా చేయగలిగినదీ ఏమీ లేదు. "స్వామీ! ఏడుకొండలవాడా! ఈ గండం నుంచి గట్టెక్కించు స్వామి. మా బాబును బ్రతికించు స్వామీ" అని వేడుకొన్నాం. ఆ మరునాడు. మా బాబును ఆపరేషను థియేటరు లోనికి తీసుకొని వెళ్ళారు. థియేటరు బయట నేను నా భార్య ఉన్నాము. నా భార్య ఒకే ఏడుపు. ఆ సమయములో ఆపదమొక్కులవాడిని మరొక్కమారు తలచుకున్నాము. స్వామీ! మాప్రయత్నము అయిపోయినది. ఇక భారము నీదే. మా అబ్బాయిని కాపాడు. మేమంతా నీదర్శనము చేసుకుంటాము అని మనసులో అనుకున్నాను. ఆశ్చర్యము మరు నిమిషముననే ఆపరేషను థియేటరు నుంచి మా అబ్బాయిని బయటకు తీసుకువచ్చారు. ఆపరేషను చేయుటకు ముందే హెర్నియా దానంతట అదే పైకి పోయినది. ప్రస్తుతము ఆపరేషను అవసరము లేదని చెప్పారు. మా ఆనందానికి




అవధులు లేవు. కరుణామయుడు, ఆపద మొక్కులవాడు, దయా సముద్రుడు అయిన పరంధాముడు మా మొర ఆలకించినందులకు స్వామికి మనసారా మొక్కుకున్నాము. ఆ మరుసటి దినము ఆసుపత్రినుంచి డిస్చార్జి చేసారు. మరుసటి సంవత్సరము మా కుటుంబము అంతా స్వామివారి దర్శనము చేసుకున్నాము. ఇప్పుడు మా అబ్బాయిలు ముగ్గురూ స్వామివారి కరుణా కటాక్షమువల్ల ఆరోగ్యముగా ఉన్నారు.

☆☆☆☆




# శ్రీరామ రక్ష

— శ్రీ పొత్తూరి రఘువేంద్రరావు

మన హిందూ సంస్కృతిలో దేవుళ్ళు ఎందరో ఉన్నారు. శివుడు, రాముడు, కృష్ణుడు, విష్ణువు, కలియుగంలో శ్రీ వేంకటేశ్వరుడు ఎవరికి నచ్చిన రూపంలో వారు కొలుచుకుంటారు.

మా ఇంట్లో, మా తల్లిదండ్రులు ఎక్కువ దైవ చింతన గలవారు. దేవతార్చన చేయక పోయినా, దైవస్తోత్ర పరనం చేసేవారు. తను హైస్కూలులో ఉపాధ్యాయునిగా చేరక ముందు, తిరుమల దేవస్థానంలో పనిచేయడం చేతనేమో మా తండ్రి గారికి మా అమ్మకు శ్రీ వేంకటేశ్వరస్వామి మీద గురి కుదిరింది. మా ఇంట్లో అందరికీ ఆయనే ప్రత్యక్షదైవం. అటువంటి వాతావరణంలో పెరగడం వలన నాకు స్వామివారి మీద ప్రత్యేకమైన భక్తి రోజూ దైవపారాయణ చేసేవాడిని ప్రతి రెండు మూడేండ్లకోసారి తిరుపతి వెళుతుండేవాళ్లం. 1974లో విశాఖపట్నంలో ఎం. ఎస్సీ చదవడానికి వెళ్లినప్పటినుండి 1981 వరకు తిరుమల వెళ్లటం సాధ్యపడలేదు.

1979లో డెహరాడూన్‌లో డిఫెన్స్ ఎలక్ట్రానిక్స్ అప్లికేషన్ లాబ్ లో సీనియర్ సైంటిఫిక్ అసిస్టెంట్‌గా చేరాక 18 నెలల తర్వాత సీనియర్ ఆఫీసర్ గ్రేడ్ 2, ఉద్యోగాలకోసం వ్రాత పరీక్ష నిర్వహించబడ్డాయి. అందులో ఉత్తీర్ణుడనయినా, ఇంటర్వ్యూలో సెలక్టుకాలేదు. కష్టపడి చదివి, ఇంటర్వ్యూ బాగా చేసినా ఫలితం సరిగా లేకపోయేసరికి దైవం మీద నాలో ఒకరకమైన తిరస్కార భావం ఏర్పాడి, ఉదయం వేళలలో భక్తి గ్రంథాలు పరించటం మానేసాను. దానికి తోడు ఆస్తిక, నాస్తిక భావాలు తొలచటం మొదలెట్టాయి. సెలక్షన్ వస్తే తప్ప మళ్లీ దైవచింతన ఏర్పరచుకోగూడదనుకొన్నాను.

అంతకుముందు స్వామివారిమీద వున్న భక్తిప్రభావం వలననేమో, మరో ఆరునెలల తర్వాత సెలక్టయ్యాను. 1981 లో తిరుపతి వెళ్ళి స్వామివారి దర్శనం చేసుకున్నాను. అప్పటినుండి అడపాదడపా చికాకులున్నా, శ్రీ వేంకటేశ్వరునిమీద భక్తి మటుకు అలానే ఉన్నది. డెహరాడూన్‌కి దగ్గరలోని ఋషీకేష్ ఆంధ్ర ఆశ్రమంలో (తిరుమల తిరుపతి దేవస్థానం వారి) వేంకటేశ్వరుని మందిరానికి తరచు వెళుతుండేవాడిని. ఆస్వామి వారి దయవలనే 85 నవంబరు చివర, హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అయింది. కుటుంబ సభ్యులతో ఇప్పుడు ఇక్కడ సంతోషంగా కాలం గడుపుతున్నాను.

ఎంత చదువుకొన్నా, కొన్ని దౌర్బల్య పరిస్థితులలో దైవంమీద భక్తి సన్నగిల్లి తిరస్కార భావమేర్పడినా, విశాల హృదయుడు, లోకమందలి సకల జనుల యోగక్షేమాలను విచారించే శ్రీ వేంకటేశ్వరుడు మనలను దయాదృక్కులతో కటాక్షిస్తాడనే భావనకు నా అనుభవం ఒక చిన్న ఉదాహరణ మాత్రమే.

సంకట పరిస్థితుల్లో కూడ స్వామివారి మీద విశ్వాసం కోల్పోక వున్నట్లయితే అదే మనకు శ్రీరామరక్ష!

☆☆☆☆☆

(10వ పేజీ తరువాయి)

హిందోళ వసంతరాగంలోని మొట్ట మొదటి చౌకకాలవర్ణం :-

అపురూపరాగమైన హిందోళవసంతరాగంలో రూపకతాళంలో మొట్టమొదటి చౌకకాలవర్ణం రచించిన ఖ్యాతి కూడా రామస్వామి దీక్షితులకే దక్కుతుంది.

వలచి వచ్చునానుర వడిగా నన్నే యేలరా
వెలయు శ్రీపురవాసా వీరవసంత త్యాగేశ.

ఈ వర్ణం యొక్క సాహిత్యం వల్ల 'త్యాగేశ' అనే ముద్రలో కూడా రామస్వామి దీక్షితులు రచనలు చేసినట్టు దృఢమౌతున్నది.

హిందోళ రాగంలోని
ప్రాచీన అటతాళవర్ణం

హిందోళ రాగంలో మొట్టమొదటి అటతాళవర్ణాన్ని ముక్తాయిస్వరం, ఎత్తుగడస్వరాలకు సాహిత్యం లేకుండా రచించారు రామస్వామిదీక్షితులు.

రమ్మనవే త్యాగరాజ సామి నేడు
కొమ్మా మనవి చేకోవే
కోరినదిచ్చేనే - మనసు తెలిసినవాడే.

పై సాహిత్యాన్ని బట్టి రామస్వామి దీక్షితులు 'త్యాగరాజ' ముద్రలో కూడా కొన్ని రచనలు చేసినట్లు తెలుస్తున్నది.

అరుదైన సామూహిక రచన

'సామినిన్నే' అనే శ్రీరంజని రాగ ఆది తాళ వర్ణంలో ఉత్తరాంగంలోని నాలుగు ఎత్తుగడ స్వరాలూ వరుసగా రామస్వామి దీక్షితులు, శ్యామాశాస్త్రి, చిన్నస్వామి దీక్షితులు, ముత్తుస్వామి దీక్షితులచే ఒక్కొక్కటి చొప్పున రచింపబడడం చాలా అపురూపమైన సంఘటనగా చెప్పుకోవచ్చును.

సామి నిన్నే కోరి చాల మరులు కొన్నదిరా
కామితార్థములొసగి దేవర
కమలానగర విహార
తామసమిక సేయకు మ్రొక్కేర
త్యాగరాజ దయాసాగరశ్రీ.

విశాకరుండిదె కిరణాలను
పరివిరోధముగ బానుప
మనోజవేదనలన్ విరాలికొని
బలిమిన్‌సదా కలయున్ దలచి.

చిట్టస్వరాలు

1. సారెకు రామామణికి సరియిమ్ మహిమ్‌నను. --రామస్వామిదీక్షితులు

2. ఓర్పుగల నేర్పరులలో నను మేలు మేలనగ నెరతనముగల. --శ్యామాశాస్త్రి

3. స్వాంతమున భ్రాంతి గొనొకాంత నిను కాంతుడనన్ యెలమిన్ వలచె.--చిన్నస్వామి దీక్షితులు

4. నీ స్వభావ సాదరముల్ యోగ్యమౌ ననుచున్ సదా, నిదానములు చాల వినోదములుగాక మానిని బూని.

-- ఇందులో త్యాగరాజముద్ర వాడినట్లు తెలుస్తోంది.

అందమైన ప్రాసలతో రచనలు

వాశివా శివా శివా యనుచును
వర్ణింప రారా జనులార.

ఈశు సకల జగదీశు జ్ఞానాంబి
కేశు కాళహస్తీశు నామములే

హరహర పురహర శంకర గంగా
ధర శశిశేఖర సాంబసదా శివ
కరి చర్మాంబర ధర పరమేశ్వర
చిరతర మూర్త్యగు శివనామములే.

ఫాలవిలోచన పార్వతి రమణా
కాలకాలపంకే రుహ చరణత్రి-
శూలధర దేవ కాశి విభూషణ
బాలత్రిపురాంబికేశు నామములే.

పంచాక్షరమై పంచలింగమై
పంచపాపముల తొలగించి మనో-
వాంఛలిచ్చు వెంకటకృష్ణ దేవుని
వర సఖుడనతగు శివనామములే.

'వా శివా శివా శివాయనుచు' అనే పై శహనరాగ ఆదితాళకృతి అందమైన ప్రాసలతో కూర్చబడింది. దీనిని రామస్వామి దీక్షితులు శ్రీ కాళహస్తీశుని స్తుతిగా రచించారు.

'శంభో జగదీశ పాహిమాం' అనే శంకరాభరణం రాగంలోని ఆదితాళకృతి కూడ ఇటువంటిదే.

'సవ్య - అపసవ్య' పద్ధతిలో (వికటకవిలా) ఒకే విధంగా ధ్వనించే కృతి :-

ఈ కృతిలో ప్రతి ఆవర్తంలో స్వరం సాహిత్యం రెండువైపులనుండీ ఒకేలా ధ్వనిస్తాయి. ఇది 'సంగీత రచన చరిత్ర' లోనే విశేషమైన విషయం.

'సారస నయన సరసా' అనే కృతి గంగా తరంగిణి రాగం తిశ్ర ఏకతాళంలో ఈ ప్రక్రియ కనబడుతుంది.

తిరువీధుల మంగళవాద్య 'ఉత్సవపద్ధతి' :- తిరువారూరులో దేవాలయ ఊరేగింపులో వాయించవలసిన రాగాల వర్ణాల వరుసక్రమపద్ధతిని తన ఆగమశాస్త్ర పరిజ్ఞానంతో రామస్వామిదీక్షితులు ప్రవేశపెట్టారు. ఈ వరుసక్రమమే నేటికీ అమలులో ఉంది.

దేవీ ఉపాసన -- తరతరాల సంప్రదాయం :-

రామస్వామి దీక్షితుల పూర్వీకులంతా దేవీ ఉపాసన సంప్రదాయంగా కలిగినవారు. యజ్ఞయాగాదులు నిర్వహించినవారు. రామస్వామి దీక్షితుల వారి తరువాత తరాలవారు కూడా దేవీ ఉపాసననూ, అమ్మవారిపరంగా ఎన్నో సంగీత రచనలనూ చేసినవారే.

శ్యామాశాస్త్రులవారూ రామస్వామి దీక్షితులవారూ, కూడా అమ్మవారిని 'సహోదరి'గా స్తుతించిన కీర్తనను గమనిద్దాం.

ఆనందభైరవి రాగం

అంబా నీ శరణము జొచ్చితి
ఆదరింపవమ్మా
శంబరవైరిని బ్రతికించిన శివశాంభవీ
త్రిపురసుందరీ ఓ జగ.

సకలలోక జననీ నీ వని
సదా నిన్ను నే కోరితిని
ప్రకటమైన నీ మహిమలు వింటిని
పరంజ్యోతిని నిను పొడగంటిని.

॥జగదంబా॥

చక్కని బంగారు బొమ్మా నీ-
చరణములే నమ్మితినమ్మా
గ్రక్కున మనవులు గైకొమ్మా
గంగాధరు కొమ్మా మా యమ్మా.

॥జగదంబా॥

# రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు– ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయుటం వలన ఉపయోగం వుండదు.
- రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

సంపాదకులు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి - 517 507

## రచయితలకు గమనిక

'సప్తగిరి'లో సమీక్ష చేయుటకు రచయితలు తమ గ్రంథాల్ని రెండు ప్రతులుగా పంపవలెను. లేనిచో సమీక్ష చేయబడవు

'సంపాదకులు'

వేరె దైవములను యిలను
వేమరు వేడగ లేను
వీరశక్తియై వెలసియున్నావు
వెంకటకృష్ణ సహోదరి యనుచును.

॥జగదంబా॥

సంగీతపరంగా 'పపానినిస' అనే ప్రయోగం ఆనందభైరవి రాగంలో ప్రప్రథమంగా ఈ రచనలోనే కనబడడం విశేషంగా చెప్పుకొనవచ్చును.

ముద్ర :

రామస్వామి దీక్షితులు 'వెంకటకృష్ణ', 'త్యాగేశ', 'త్యాగరాజ' ముద్రలతో రచనలు చేశారు.

ఎన్నో విశిష్టమైన రచనలద్వారా సంగీత లోకంలో మంచి వాగ్గేయకారునిగా గుర్తింపుపొందిన రామస్వామి దీక్షితులు తన కుమారులకు కూడా సంగీతసంపదను వారసత్వంగా పంచి ఇచ్చిన భాగ్యశాలి. ఈయనకు తన కుమారుల తరంలోనే కాక, తరువాతి తరమైన తన మనుమలతరంలో కూడా సంగీత సేవ చేసుకునే అదృష్టం కలిగింది. 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' వంటి అమూల్యమైన గ్రంథాన్ని రచించి, ఎన్నో సంగీత విషయాలను, సంగీతజ్ఞుల, లక్షణకారుల జీవిత విశేషాలను, వాగ్గేయకారుల రచనలనూ భావితరాలవారికోసం భద్రపరచి, అందించిన శ్రీ సుబ్బరామ దీక్షితులు వీరి మనుమడే. మహాశివరాత్రి పర్వదినాన క్రీ.శ. 1835వ సంవత్సరంలో భగవదైక్యం పొందిన ధన్యజీవి రామస్వామి దీక్షితులు. ఆయన సంగీత ప్రపంచంలో భారతజాతి సంస్కృతీ చరిత్రలో కూడా చిరస్మరణీయుడు.



# ద్వాదశ జ్యోతిర్లింగములు

శ్రీ శివశ్రీ శంకరప్రియ



జ్యోతిర్లింగములు -- స్వయంభూ లింగములు!

అవి-- పరమ శివుడు స్వయముగా ప్రతిష్ఠించిన ఆత్మలింగములు! భారత జాతిలోని ఏకాత్మతకు ప్రతీకలు!

ఆసేతు హిమాచల పర్యంతమైన భారత దేశము-- సువిశాలమైనది. ఈ మనదేశము నలుమూలలా ద్వాదశ (12) జ్యోతిర్లింగములు ఆవిర్భవించాయి.

శ్రీ శివమహాపురాణము, కోటి రుద్ర సంహితలో మన "భారతము"లోని ద్వాదశ జ్యోతిర్లింగములు గూర్చి, వాటి క్షేత్రములు గూర్చి పేర్కొనబడెను.

సౌరాష్ట్రే సోమనాథం చ
శ్రీశైలే మల్లికార్జునమ్,
ఉజ్జయిన్యాం మహాకాలం
ఓంకారే పరమేశ్వరమ్.

కేదారం హిమవత్పృష్ఠే
డాకిన్యాం భీమశంకరమ్,
వారాణస్యాం చ విశ్వేశం
త్ర్యంబకం గౌతమీతటే.

వైద్యనాథం చితాభూమౌ
నాగేశం దారుకావనే,
సేతుబంధేతు రామేశం
ఘుశ్మేశం చ శివాలయే.

ద్వాదశైతాని నామాని
ప్రాతరుత్థాయ యః పఠేత్,
సర్వపాప వినిర్ముక్తః
సర్వసిద్ధిఫలం లభేత్.

సౌరాష్ట్రమున సోమనాథుడు, శ్రీశైలమున మల్లికార్జునుడు, ఉజ్జయినిలో మహాకాలుడు, ఓంకారమున పరమేశ్వరుడు, హిమాచలమున కేదారనాథుడు, డాకినిలో భీమశంకరుడు, వారణాసిన విశ్వేశ్వరుడు, గౌతమీ తీరమున త్ర్యంబకేశ్వరుడు, చితాభూమిని వైద్యనాథుడు, దారుకావనమున నాగేశ్వరుడు, సేతుబంధమున రామేశ్వరుడు, శివాలయమున ఘుశ్మేశ్వరుడు-- ద్వాదశ జ్యోతిర్లింగ మూర్తులు.

పన్నెండు జ్యోతిర్లింగములయొక్క నామధేయములను, ప్రాతఃకాలమున పఠించిన వారికి, సకల పాపములు నశించును. సమస్త సిద్ధుల లభించును. వారికి శివానుగ్రహము కలుగును.

ఈ బ్రహ్మాండమంతయు ఒక్క మహాశివలింగమే.

శివుడు-- చరాచర జీవులలో అంతర్యామిగ, సూక్ష్మజ్యోతిర్లింగ స్వరూపమున విరాజిల్లు చుండును. అట్లే మన భారతములో ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములలో, శివుడు-- ఆత్మలింగ స్వరూపమున దర్శనమిచ్చుచుండెను.

## 1. ప్రథమ జ్యోతిర్లింగము

శ్రీ సోమనాథ లింగము-- ప్రథమ జ్యోతిర్లింగము. అది గుజరాత్, జునాఘడ్


శ్రీ సోమనాథాలయం

దగ్గర, ప్రభాసపట్టన్‌లో వెలసిన శివలింగము.

శీతాంశుం దలదాల్చి, చల్లని సుధల్
 చిందించుచున్, సజ్జన
వ్రాతంబున్, కరుణింప వింపయిన
 సౌరాష్ట్ర ప్రదేశమ్మునన్
చేతోమోదముతో వెలుంగుదువటే
 శ్రీ 'సోమనాథుండ'వై
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
 జోహారు మృత్యుంజయా!

## 2. ద్వితీయ జ్యోతిర్లింగము

శ్రీ మల్లికార్జునలింగము-- ద్వితీయ జ్యోతిర్లింగము. అది మనరాష్ట్రమైన ఆంధ్ర ప్రదేశ్, కర్నూలుజిల్లా శ్రీశైలములో వెలసిన శివలింగము.

చేతుల్ మోడ్చి, యమర్త్యులెల్లరు సమ
 ర్చింపన్, మహైశ్వర్యముల్
చేతంబూని తులాద్రితుంగమగునా
 శ్రీశైల శృంగాన సం
ప్రీతిన్ విల్చు భవార్థి సేతువవు, స్వా
 మీ! నీవు 'మల్లీశ్వరా!'
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
 జోహారు మృత్యుంజయా!

## 3. తృతీయ జ్యోతిర్లింగము

శ్రీ మహాకాలలింగము-- తృతీయ జ్యోతిర్లింగము. అది మధ్యప్రదేశ్, ఉజ్జయిని దగ్గర, మహాకాళేశ్వర్‌లో వెలసిన శివలింగము.

ప్రాతర్భానుమయూఖ మాలికలు, పై
 పై బ్రాక, శిప్రానదీ
వాతంబుల్ మెయిసోక, మృత్యువుమ ద్రో
 వన్ భృత్యులం బ్రోవ, వి
ఖ్యాతింగంటి వవంతికాస్థలి "మహా
 కాళేశ్వర" స్వామివై
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
 జోహారు మృత్యుంజయా!

## 4. చతుర్థ జ్యోతిర్లింగము

శ్రీ పరమేశ్వరలింగము-- చతుర్థ జ్యోతిర్లింగము. అది మధ్యప్రదేశ్, తూర్పు నిమార్‌జిల్లా, ఇండోర్ దగ్గర, ఓంకారేశ్వర్‌లో వెలసిన శివలింగము. ఈ జ్యోతిర్లింగము రెండు మూర్తులలో విరాజిల్లుచుండెను.

(1) ఓంకారేశ్వరలింగము-- నర్మదా నదీ మధ్యమమున, మాంధాత ద్వీపములో వెలసిన శివలింగము. (2) అమరేశ్వర లింగము-- నర్మదానదికి దక్షిణ తీరము నందు అమరేశ్వర్‌లో వెలసిన శివలింగము.

ఖ్యాతంబై పరిపూతమౌ ప్రవిలస
 త్కావేరికా నర్మదా
ద్వైత ప్రాంగణ సన్నివేశమగు మాం
 ధాతృ ప్రదేశంబు నం
దో తండ్రీ! వెలుగొందుచుందువటె నీ
 'వోంకారనాథుండవై'
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
 జోహారు మృత్యుంజయా!

## 5. పంచమ జ్యోతిర్లింగము

శ్రీ కేదారనాథ లింగము-- పంచమ జ్యోతిర్లింగము. అది-- హిమాచలప్రదేశ్, హరిద్వారంవద్ద, కేదారనాథ్‌లో వెలసిన శివ లింగము.

శీతాహార్య తటాంచలమ్ముల పయిన్, సి
 ద్ధుల్ మునుల్ దేవతల్
దైతేయుల్ భజియింప, శైలతను జా
 తం గూడి, గంధర్వ సం
గీతంబుల్ విను విన్ కనుంగొనుదు శ్రీ
 "కేదారనాథేశ్వరా"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
 జోహారు మృత్యుంజయా!

## 6. షష్ఠమ జ్యోతిర్లింగము

శ్రీ భీమశంకర లింగము-- షష్ఠమ జ్యోతిర్లింగము. మహారాష్ట్ర పూనాదగ్గర, భీమశంకర్‌లో వెలసిన శివలింగము.

భూతప్రేత పిశాచదైత్య నివహం
బుల్ శాకినీ డాకినీ,
వ్రాతంబుల్ తలల్గొగ్గ, భక్తజనర
క్షా దక్ష దీక్షన్ జగ
ద్భీతింబాపెదు "భీమశంకరుడవై"
భీమాతటోద్భాసివా
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

### 7. సప్తమ జ్యోతిర్లింగము

శ్రీ విశ్వేశ్వరలింగము-- సప్తమజ్యోతి ర్లింగము. అది, ఉత్తరప్రదేశ్, వారణాసిలో వెలసిన శివలింగము.

శీతక్ష్మాధర రాజపుత్రి కరముం
జేపేత గీలించి, వి
ఖ్యాతానందవనీ విహారముల నా
హ్లాదించు స్వామిన్! నుతుల్
సేతున్, నిన్ను నవాథ నాథు, శివు, కా
శీ "విశ్వనాథేశ్వరున్"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

### 8. అష్టమ జ్యోతిర్లింగము

శ్రీ త్ర్యంబకేశ్వరలింగము-- అష్టమ జ్యోతిర్లింగము. అది మహారాష్ట్ర, నాసిక్‌వద్ద, త్రయంబకేశ్వరలో వెలసిన శివలింగము.

చైతన్యోజ్జ్వల నిత్యనిర్మల మహా
సహ్యాద్రిపై గౌతమీ
స్రోతః పూత తటావ, నిన్ కనిన వి
ఖ్యాతంబుతా పాతక
వ్రాతంబుల్, మురిపించు ముక్తిరమ;
దేవా "త్ర్యంబకేశాహ్వయా!"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

### 9. నవమ జ్యోతిర్లింగము

శ్రీ వైద్యనాథలింగము-- నవమ జ్యోతి ర్లింగము. అది రెండు స్థానములలో విరాజి ల్లుచున్నది.

ఒకటి-- బీహార్, చిత్తరంజన్ దగ్గర, దేవఘర్‌లో వెలసిన శివలింగము.

మరియొకటి-- మహారాష్ట్ర, ఔరంగాబా దుదగ్గర, పర్లివైద్యనాథ్‌లో వెలసిన శివలిం గము. ఇది "పరల్యాం వైద్యనాథంచ!" అను పురాణ వచనము ప్రకారము-- వైద్యనాథలిం గము, జ్యోతిర్లింగముగ వ్యవహరింపబడుచు న్నది.

పూతప్రజ్వలికాభిధాన పరణిం
బూర్వోత్తరన్, దేవతా
దైతేయార్చిత పాదపద్మముల నా
స్థానించి, శర్వాణి వా
క్చాతుర్యంబుల కిచ్చు మెచ్చెదవు, వి
చ్చల్ "వైద్యనాథాహ్వయా!"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

### 10. దశమ జ్యోతిర్లింగము

శ్రీ నాగేశ్వరలింగము-- దశమజ్యోతి ర్లింగము. అది-- గుజరాత్, ద్వారక వద్ద, దారుకావన్‌లో వెలసిన శివలింగము.

ఏతల్లోకము లేలు పెన్నిధివి, నీ
వే ద్వారకా సన్నిధిన్
జ్యోతిష్మన్మణి భోగి భోగములు, సం
శోభించు, వెమ్మేనితో

శ్రీశైలం మల్లికార్జునాలయ ప్రవేశద్వారం




శ్రీ రామేశ్వరస్వామి

చేతః ప్రీతిగ భుక్తిముక్తులిడవా
శ్రీ "నాగనాథాహ్వయా!"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

## 11. ఏకాదశ జ్యోతిర్లింగము

శ్రీ రామేశ్వరలింగము-- ఏకాదశ జ్యోతిర్లింగము. అది-- తమిళనాడు, కన్యాకుమారి వద్ద, రామేశ్వరములో వెలసిన శివలింగము.

ఖౌతాఘవ్రజ తామ్ర పర్ణిపతి పా
దాలంటుచోటన్, మహా
సేతూత్తంముగట్టి, బాణతతి నా
జిన్ రావణున్ ద్రుంచునా
సీతావల్లభుచే సమర్చితుడవౌ
శ్రీ "రామలింగేశ్వరా!"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

## 12. ద్వాదశ జ్యోతిర్లింగము

శ్రీ ఘుశ్మేశ్వర లింగము-- ద్వాదశ జ్యోతిర్లింగము. అది-- మహారాష్ట్ర, ఎల్లోరా వద్ద, ఘుశ్మేశ్వర్‌లో వెలసిన శివలింగము.

ఓత ప్రోతమ్ములౌ శుభమ్ములకు చే
యూతై, పరావాక్కులో
లోతై, సర్వజగద్విధాతవయి, ఎ
ల్లోరా పురిన్ ముక్తికిన్
దాతృత్వమ్ము వహించి మించితివి, గా
దా- స్వామి "ఘుశ్మేశ్వరా!"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా!

జగద్గురు శంకరభగవత్పాదుల వారు-- ద్వాదశ (పంద్రెండు) జ్యోతిర్లింగములను దర్శించారు. వాటిని, భక్తితో అర్చించి, ప్రస్తుతించారు. ఆచార్యులవారు-- భక్తమహాశయులు నిత్యము పఠించుటకుగాను సంస్కృతంలో "ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము"ను రచించారు.

ఈ స్తోత్రము-- పరమ పవిత్రమైనది. దీనిని, భక్తితో చదివిన వారికి, భారతదేశము లోని "ద్వాదశజ్యోతిర్లింగము"ల యొక్క క్షేత్రములను దర్శించుటచేత కలుగు మహా ఫలితము ప్రాప్తించుననడంలో సందేహము లేదు. అందరూ ఈ స్తవమును భక్తిశ్రద్ధలతో చదవండి. స్వామి కరుణకు పాత్రులు కండి.

ఐతిహ్యం, బనురక్త శంకర, ముదాత్తా
లోక, మీ ద్వాదశ
జ్యోతిర్లింగ మహామహేశ్వర, వర
స్తోత్రం బెవండేనియున్
ప్రాతః సంధ్యలయందు, దీని చదువన్
ప్రాప్తించు తద్ద్వాదశ
జ్యోతిర్మూర్తుల గన్న పుణ్యము, లభిం
చున్ స్వామి కారుణ్యమున్.

****

## తి.తి. దేవస్థానములకు నూతన పౌరసంబంధాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానముల నూతన పౌరసంబంధాధికారిగా శ్రీ టి. శివాజి 93 డిసెంబరు 31న పదవీ ప్రమాణ స్వీకారం చేశారు.

వీరు 1953లో జన్మించారు. నాలుగు సంవత్సరాలపాటు చిత్తూరులో న్యాయవాదిగా పనిచేశారు. 1987లో ఎండోమెంటు డిపార్టుమెంటులో అసిస్టెంటు కమీషనరుగా నియమితులయ్యారు. 6 సంవత్సరాలపాటు వివిధ ప్రాంతాలలో పనిచేసి డెప్యూటి కమీషనర్‌గా ప్రమోషను పొందారు.

## తిరుమలలో గవర్నరు

రాష్ట్ర గవర్నరు శ్రీ కృష్ణకాంత్ ఫిబ్రవరి 23 బుధవారం నాడు తిరుమలలో శ్రీవారిని దర్శించారు. వారి వెంట వారి శ్రీమతి కూడ ఉన్నారు.

గవర్నరు శ్రీ కృష్ణకాంత్‌కు తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జె. వెంకట్రామయ్య, పౌరసంబంధాధికారి శ్రీ టి. శివాజి తదితర అధికార ప్రముఖులు స్వాగతం పలికారు. ఫిబ్రవరి 24 శుక్రవారం నాడు గవర్నరు దంపతులు శ్రీవారి అభిషేక సేవలో పాల్గొన్నారు.

## శరద్ పవార్

మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ శరద్ పవార్ జనవరి 19 బుధవారం ఉదయం తిరుమలలో శ్రీవారిని దర్శించారు. బొంబాయి నుంచి ప్రత్యేక విమానంలో వచ్చిన ఆయన తమ కుటుంబ సభ్యులతో సహా శ్రీవారిని దర్శించారు. వారికి తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జె. వెంకట్రామయ్య తదితర అధికార ప్రముఖులు స్వాగతం పలికారు.

## ధర్మకర్తలమండలి నిర్ణయాలు

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి సమావేశం జనవరి 26, 27 తేదీలలో జరిగింది. ఆ సమావేశ వివరాలను అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి తిరుపతి పద్మావతి అతిథి గృహంలో జనవరి 28 శుక్రవారంనాడు విలేకరులకు తెలియజేశారు.

* తిరుపతి శ్రీ గోవిందరాజ స్వామివారి ఆలయంలో సహస్రనామార్చన సేవ రుసుమును రు.4-00 నుంచి రు.10-00 కి పెంచారు.
* అదే విధంగా అర్చనను రు.0-75 నుంచి రు.2-00 లకు, హారతిని రు.0-25 పైసల నుంచి రు.1-00 కి పెంచారు.
* తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయంలో హారతి రుసుమును రు.0-50 నుంచి 1-00 కి పెంచారు.

దాదాపు 30 సంవత్సరముల తర్వాత ఈ రుసుమును పెంచటం జరిగిందని, దీనివల్ల సంవత్సరానికి దాదాపు 4 లక్షలు ఆదాయం రావచ్చునని వారు తెలిపారు.

* స్విమ్స్ ఆసుపత్రికి అదనంగా రు.1.64 కోట్లు మంజూరు చేస్తున్నట్లు తీర్మానించారు.
* అన్నదాన పథకంలాగా ఆరోగ్య వర ప్రసాద పథకాన్ని ప్రారంభించాలని తీర్మానించారు.
* తిరుమలలో రు.30 లక్షల ఖర్చుతో శ్రీ పద్మావతీపరిణయ మండపాన్ని నిర్మించాలని తీర్మానించారు.



# వార్తాలహరి



## మెట్ల ఉత్సవం

తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి వారి గుడిలో ఫిబ్రవరి 15 మంగళవారం నాడు మెట్ల ఉత్సవాన్ని తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్. ఎన్. మూర్తి ప్రారంభించారు.

అక్కడ నుంచి భజన మండలులు భజనలు చేస్తూ ఊరేగింపుగా స్థానిక అన్నమాచార్య కళామందిరానికి చేరుకున్నారు. అక్కడ జరిగిన బహిరంగ సభలో అన్నమాచార్య కళామందిరం డైరక్టరు శ్రీ మేడసాని మోహన్, కేంద్ర గ్రంథాలయ సలహాదారుడు డా॥ రావుల సూర్యనారాయణమూర్తి, దాస సాహిత్య ప్రాజెక్టు డైరక్టర్ శ్రీ అప్పణ్ణాచార్య ప్రసంగించారు. అనంతరం శ్రీమతి గోపికాప్రసాద్ భజన మండలులకు తాళములను వితరణ చేశారు.

ఫిబ్రవరి 16 బుధవారంనాడు అలిపిరిలో మెట్ల ఉత్సవం ప్రారంభమైంది. ఈ కార్యక్రమంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి పాల్గొన్నారు. కర్నాటక రాష్ట్రానికి చెందిన వివిధ జిల్లాలనుంచి వచ్చిన భజన మండలులు భజనలు చేస్తూ శ్రీవారి దర్శనం చేసుకున్నారు. ✯

తిరుమల తిరుపతి దేవస్థానముల

# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ఇచ్చిన వరం. ఆ అడవుల్ని రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి **శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం** పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అడవుల విభాగం వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

## వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

సౌకర్యాలు :

* వృక్షసంపదకు దాత పేరును లేదా దాత సూచించిన వారి పేరును పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.15,000/-.

## వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచటానికి నిర్దేశించిన పథకం.

సౌకర్యాలు :

* దాత పేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను వితరణ చేస్తారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.10,000/-.

## స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 సస్యజాతి మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

సౌకర్యాలు :

* ఈ పొదకు దాత పేరును పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.2,000/-.




## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరును ప్రదర్శిస్తారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అభయారణ్య వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల సస్యజాతి మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కవద్ద దాత పేరును ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-.

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్ రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటటం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరును వృక్షం వద్ద ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వన సంపదను రక్షించేందుకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

**కార్యనిర్వహణాధికారి**

( 4 వ పేజీ తరువాయి)

దృషద్విచిత్రతల్పయో ర్భుజంగ మౌక్తికస్రజో-
ర్గరిష్ఠరత్నలోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః,
తృణారవిందచక్షుషోః ప్రజామహీమహేంద్రయోః
సమప్రవృత్తికః కదా సదాశివం భజామ్యహమ్.

కదా నిలింపనిర్ఝరీ నికుంజకోటరే వసన్
విముక్త దుర్మతిః సదా శిరస్థమంజలిం వహన్,
విలోల లోలలోచనో లలామభాల లగ్నకః
శివేతి మంత్ర ముచ్చరన్ కదా సుఖీ భవామ్యహమ్.

రావణబ్రహ్మ దృష్టిలో శతసహస్ర ఓంకారాలతో శివుణ్ణే తాండవమాడించిన మహాద్భుత శబ్ద నృత్య నృత్త భావ భక్తి తరంగాల విన్యాసానికి విరూపాక్షరూపం ఈ శ్లోక సముచ్చయం. మరి ఇంతటి ఉదాత్త భావుకులు లోక కంటకులవటానికి మూల కారణం-- వంత పాడినట్లు తప్పు, పంతాలు తగ్గించే దృష్టితో బోధ చేసే గురువులు దొరక్క పోవడమే.

మనిషన్నవాడు ఈ రాక్షస మనీషులనుంచి నేర్చుకోతగ్గ గుణాలు ఎన్నో వున్నాయి. వాళ్ల ఒప్పుల్ని వరించి, తప్పులనుంచి తప్పుకోగలిగితే ఆ కైలాసమైనా, వైకుంఠమైనా మన చేతుల్లోవే, చేతల్లోవే.

అసలీ పై వాళ్లందరు ఎక్కడో ఉన్నారనుకోవటమే పొరపాటేమో. రాముడైనా, రావణుడైనా, కృష్ణుడైనా, కంసుడైనా మన బుద్ధి భేద ప్రతిరూపాలే. రాముడిలా ఉండాలన్నా, రావణుడిలా మండాలన్నా వాడి రాతా మన చేతా కొంత కొంత.

ఊర్ధ్వరేతం విరూపాక్షం
విశ్వరూపాయ వై నమో నమః.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## ఆర్జిత సేవల ధరల్లో మార్పు

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి తీర్మానం నెం. 529 మేరకు తిరుమల శ్రీవారి ఆర్జిత సేవల ధరలు పెరిగాయి. ఈ కొత్తధరలు 15-8-1993 నుండి అమలులోకి వచ్చాయి.

| వ.నెం. | సేవ/ఉత్సవం పేరు | ప్రవేశం | కొత్తధర |
|---|---|---|---|
| 1. | సుప్రభాతం | ఒక్కరికి | రూ. 100/- |
| 2. | తోమాలసేవ | ,, | రూ. 200/- |
| 3. | సహస్రనామార్చన | ,, | రూ. 200/- |
| 4. | ఏకాంతసేవ | ,, | రూ. 100/- |
| 5. | ఆమంత్రణోత్సవం | ,, | రూ. 600/- |
| | ($\frac{1}{16}$ సోల ప్రసాదంతో) | | (ప్రవేశం ఒక్కరికి) |
| 6. | పూరాభిషేకం | ,, | రూ. 750/- |
| 7. | పునుగు గిన్నె | ,, | రూ. 300/- |
| 8. | కస్తూరి గిన్నె | ,, | రూ. 150/- |
| 9. | నిజపాద సేవ | ,, | రూ. 100/- |
| 10. | ప్రత్యేక కళ్యాణోత్సవం | 5 గురికి | రూ. 750/- |

గృహస్థులు పై మార్పులను గమనించి ఆ యా సేవలకు చెందిన కొత్తధరలు చెల్లించ వలసిందిగా ప్రార్థన.

కార్యనిర్వహణాధికారి

Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press. Tirupati - 517 507



పావనము గావో జిహ్వా! బ్రదుకవో జీవుఁడా!
వేవేల కితని నింక వేమారునుఁ బాడి

హరినామములే పాడి, అతని పట్టపురాణి
ఇరవై మించిన యట్టి యిందిరఁ బాడి,
సరి నిరువంకలాను శంఖచక్రములఁ బాడి
వరద కటిహస్తాలు వరుసతోఁ బాడి

ఆదిపురుషునిఁ బాడి అట్టె భూమిసతిఁ బాడి
పాదములఁ బాడి నాభిపద్మములఁ బాడి
మోదపు బ్రహ్మాండాలు మోచేవుదరముఁ బాడి
ఆదరానఁ గంబుకంఠ మంకెతోఁ బాడి.

శ్రీ వేంకటేశుఁ బాడి, శిరసుతులసిఁ బాడి
శ్రీ వత్సము తోడురముఁ జెలఁగి పాడి
లావుల మకరకుండలాల కర్ణములు పాడి
ఆవటించి యితని సర్వాంగములుఁ బాడి.



—అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన : 359,
రాగం : భూపాళం, సంపుట : 2 (1981)

దర్శించండి! తరించండి!

# తిరుపతి
# శ్రీ గోవిందరాజ స్వామి వారి బ్రహ్మోత్సవాలు



.... ముఖ్య ఉత్సవాలు ....

17-5-94 .......................... ధ్వజారోహణం
21-5-94 .......................... గరుడోత్సవం
24-5-94 .......................... రథోత్సవం
25-5-94 .......................... ధ్వజావరోహణం




గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త - సంపాదకులు
కొటపాటి సుబ్బారావు, ఎమ్.ఎ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# ఈ సంచికలో.... ఏప్రిల్ 1994

సంపుటి 24 సంచిక 11



# సంపాదకీయం



అష్టమీ, నవమీ-- అంటే అమ్మో! కష్టపుదినాలు! ఈ భావన ఇలాగే కాకపోయినా, అటు ఇటూగా ఆసేతుహిమాచలం వ్యాపించివుంది. పంచాంగాన్ని పఠించేవారు, పాటించేవారూ కూడా ఈ రెండురోజులను, చతుర్థితో కలిపి వర్జించవలసినవాటినిగా వివరించారు. ఇది అనూచానంగా అంధ విశ్వాసం అనండి, అనుభవసారం అనండి-- మొత్తంమీద వివాహాలు వినా మిగిలిన సంస్కారాలన్నీ వీటికి దూరంగా మడిగట్టుకునే నిలిచిపోయాయి.

అష్టమిన కృష్ణుడూ, నవమిన రాముడు పుట్టి సమాజాటవిలో ఒకళ్లు, సహజాటవిలో మరొకళ్లు అవస్థలపాలు కావటం బహుశా ఈ భావానికి బలమిచ్చి ఉంటుంది. నారాయణుడైనా నరలోకసంచారి యైనప్పుడు మనతో ఉండవలసిన కారణంగా మనం మనలాంటి వాళ్ళన్న భావనతో దర్శించి మన కష్టనష్టాలతో పోల్చుకుని ఇలా సానుభూతిని చూపటం సహజమైన పరిణామం.

అష్టమి ఆది, నవమి చివర మంచివన్నట్లుగానే ఈ రెండు అవతారాల వివిధ పరిణామాలు కూడా, ఇందుకు జనం అనుకోటానికి అనుకూలమైనట్లుగా వున్నాయి.

కృష్ణుడి కష్టాలతో పోలిస్తే రాముడి కష్టాలు చాల వరకు రాచబాటలో ములుకు పలుకుల్లాంటివి.

అంతఃపురంలో అల్లారుముద్దుగా ముగురమ్మల ముద్దుబిడ్డగా కన్నతండ్రి కంటిదీపంగా బ్రతకవలసి ఉన్న రాముడు అలో సీతా, లక్ష్మణా అని వారితో 14 సంవత్సరాలు అడవుల పాలుకావటం అనుకోరాని కష్టం అనిపించినా నిజానికి ఆ జనస్థానంలో సీతాపహరణ ఘట్టం వరకు జరిగిన సంఘటనలన్నీ శ్రీరామమూర్తిని మూర్తీభవించిన పురుషకారంగా, పురుషోత్తముడు కరుణావరుణాలయుడుగా నిరూపించేందుకు తోడ్పడ్డాయేకాని, ఆ కథ చదివినంత సేపు రాముడు కష్టపడుతున్నాడన్న భావనను అంతగా బయటికి కన్పడనీయవు. త్రేతాయుగ సమాజం ఆనాటి శత్రుత్వాలు కూడా వరిష్ఠ నియమ నిష్ఠా గరిష్ఠాలైనవి. శాంతి సౌశీల్య సౌభాగ్యాలు అంతటా వెల్లి విరిసి చంద్రునిలో మచ్చలా, వెల్లగోడమీది నల్ల గీతల్లా దుర్మార్గ ప్రవృత్తి అలా అలా వేలెత్తి చూపటానికి వీలైంది. అందుకే నారాయణుడుగా అనుకున్నా నరుడుగా పూనుకున్నా, శ్రీరాముడికి రావణవధే ఆ జీవనపథగమ్యం. మిగిలిన సీతాపహరణ ఘట్టం ఒక్కటే నేను మామూలు మనిషినే, దశరథుడి కొడుకుని అనిపించి నిజమే సుమా అన్నట్లు మనకు కన్పించినా ఆ విలాపకలాపలీల తాత్కాలికమై రావణవధకు సహజమైన రాచబాటను ఏర్పరిచింది. మొత్తం మీద రామ జీవితం, అవతార సమాప్తి కూడా ఆ నాటి సమాజ ప్రవత్తి కనుగుణంగానే జరిగాయి. అలా నవమి రాముని జీవితం ఉత్తమ పురుషుడుగా పురుషోత్తముడుగా నిరూపిస్తూ సాగి సాగి ఆగింది.

మరి అష్టమి కృష్ణుని జీవితం ఆనాటి సమాజం చాలా భిన్నమైనవి. త్రేత నిష్ఠ ద్వాపరాన దిగజారి నీరై పోయింది. పుట్టినది మొదలు మౌసలం తుదివరకున్న కృష్ణజీవితం పరువుగా ద్వాపరంలో మనిషికి మనుగడ కావాలంటే, ఆత్మ స్థైర్యం, ఆలోచనలతోపాటు మీకన్న నేను భిన్నం అన్నట్లు మంత్ర తంత్రాలో, మహిమలో లేకపోతే సగటు నరుడి జీవితం అడుగడుగునా అవరోధాలతో అవమానాలతో-- అనకూడదుగాని అది కుక్కచావే అన్పించేంత భయంకరంగా ఉంటుందని నిరూపించింది. అయోనిజ సీత కానివారి మధ్య ఆరాధనీయస్థానంలో పవిత్రంగా వుండి అగ్నిపునీతగా మెరుగు దిద్దుకుంటే, అయోనిజ, అగ్నిజాత అయిన ద్రౌపది ఐదుగురు పతుల ఎదుట అయినవారి మధ్య ఆర్తురాలిగా, కృష్ణుడు అప్పుడై వస్త్రరక్షణ కల్పించేవరకు మిగిలిపోవటం -- రెండు యుగాల కాలంలో సమాజంలో దిగజారిన విలువలకు నిదర్శనం. తల మునకలుగా మనిషి మనిషికీ తలకెక్కిన అహంకారం, అధికార లాలసత ద్వాపర ప్రతిబింబాలుగా నిలిచినందువల్లనే అది ఎన్ని రూపాలలో తనను ఎదుర్కొన్నదో అన్ని మార్గాలలోనూ దానిని ఎదిరించి మానవతకు మళ్లీ పట్టం కట్టేందుకు భగవానుడుగా నిరూపించుకున్న శ్రీకృష్ణుడు కూడా ఎంతో శ్రమించవలసి వచ్చింది.

నవమిరాముడు తానే ఒక సూర్యుడుగా వెలిగితే, శ్రీకృష్ణుడు నిత్య నిరంతర పరిసుప్త ప్రాణికోటి అంతర్నిహితంగా వెలిగే ఆత్మజ్యోతిగా తన అవతార ధర్మాన్ని నిర్వహించాడు. నిజానికి రాముడు చేసి చెప్పింది, కృష్ణుడు చెప్పి చేయించింది ఒకటే.

అష్టమైనా, నవమైనా ఆనాటి అవసరాల దృష్ట్యా మనిషిని కష్టాలనుంచి గట్టెక్కించేందుకు కంకణం కట్టుకొని అవతరించిన నవనీలరూపులు వారిద్దరు.

ఒకే సూర్యుడు రెండుగా మారిన ఆ అవతార ద్వయానికి ఇలా నమస్కరిద్దాం.

వందే కృష్ణౌ జగద్గురౌ




అనంతమైన కాలంయొక్క పరిమాణాన్ని గుర్తించడానికి కొన్ని యేర్పాట్లు జరుగవలసి వచ్చినది. సంవత్సర పరిమాణాన్ని తెలిపేది ఉగాది పండుగ. ఇది చైత్రశుద్ధ పాడ్యమినాడు ప్రతిసంవత్సరం వస్తుంది. దీనితోనే అనగా ఈ దినంతోనే కొత్త సంవత్సరం ప్రారంభం అవుతుంది. దీన్ని అందరూ ఘనంగా జరుపుకుంటారు.

మనది చాంద్రమానాన్ని అనుసరించిన ఉగాది. అనగా శుద్ధపాడ్యమి నుండి అమావాస్య వరకూ నెల అని పరిగణించే వారికి సంవత్సరాది అన్నమాట. ఆంధ్రులే కాక కన్నడులూ, మహారాష్ట్రులు కూడ చైత్రశుద్ధ పాడ్యమినే వారి సంవత్సరాదిగ భావిస్తారు.

బ్రహ్మదేవుడు ఈ రోజు, తిథినే, అనగా ఈ నాడే సృష్టిప్రారంభించాడని హేమాద్రి పండితుడు ఈ క్రింది శ్లోకంద్వారా తెలియ చేస్తున్నాడు.

చైత్రమాసి జగద్బ్రహ్మ
ససర్జ ప్రథమేఽహని
శుక్లపక్షే సమగ్రం తు
తదా సూర్యోదయే తథా
కాలస్య గణనా మపి.

అనగా బ్రహ్మ ఈ జగత్తునంతటినీ చైత్రమాస శుక్లపక్షం తొలిదినంలో సూర్యోదయకాలంలో సమగ్రంగా సృజించాడు. కాలముయొక్క గణనను ప్రతిమంచే ప్రారంభించాడు! అని పై శ్లోకమునకు భావము.

నిర్ణయ సింధుకారుడైన కమలాకర భట్టు అను శాస్త్రజ్ఞుడును "తత్రచైత్రశుక్ల ప్రతిపది సంవత్సరారంభః" అని పై విషయాన్నే తెలియచేశాడు.

కాల పరిగణన మనకు బ్రహ్మసృష్టితోనే ప్రారంభము కాబట్టి యుగారంభం కూడా సంవత్సరారంభతోనే ప్రారంభమైనది. అందుచేతనే ఆ దినం యుగాదియై, క్రమంగా ఉగాదిగా మారిపోయి, ఉగాది అంటే సంవత్సరాది. అనేపేరు స్థిరపడిపోయింది.

"లంకా నగర్యా ముదయాచ్చ భానోః
తస్యైవ వారే ప్రథమం బభూవ
మధో స్సితాదే ర్దిన మాస వర్షం
యుగాదికానాం యుగపత్ప్రవృత్తిః"

అని సిద్ధాంతశిరోమణిలో భాస్కరాచార్యులవారు అంటూ సూర్యుడు శుక్లపక్ష ప్రతిపత్తునాడు లంకా నగరంలో ఉదయించడంవలన ఆ నాడే యుగ, వత్సర, మాస దినాదుల ఆరంభం, అవన్నీ ఒకేసారి సంభవించినవని తెలియచేసి యున్నాడు.

ఈ ఉగాదినాడు ఆంధ్రులు మహోత్సవాన్ని చేసుకుంటారు. నాడు ఉత్సాహంతో వుంటే సంవత్సరం పొడుగునా అనగా సంవత్సరం పూర్తిగా ఉత్సాహంగానే వుంటుందనీ, ఆ రోజు సంతోషంగా వుంటే సంతోషంగా వుంటారనీ, దుఃఖంగా వుంటే సంవత్సరం పూర్తిగా దుఃఖంగానే వుంటారనీ విశ్వాసము. అందుచేతనే ఉగాది నాడు ఉత్సాహంగానూ, సంతోషంగానూ, సాధ్యమైనంత వరకు ఉండడానికి ప్రయత్నిస్తారు.

ఆ నాడు సూర్యోదయాత్పూర్వమే మంగళాభ్యంగన స్నానం చేస్తారు. ఏ మాత్రం అవకాశమున్నా— ఉన్నంతలోనే నూతన వస్త్రములు ధరిస్తారు. ఇండ్లగడపలను మామిడిఆకుల తోరణాలతో అలంకరిస్తారు. ఇంటిలోపల ఒక మంటపమును నిర్మించి దానిలో సంవత్సరాది దేవతను, ఆ సంవత్సరపు కొత్త పంచాంగాన్ని ఉంచి పూజిస్తారు.

షడ్రసాత్మకమైన రసాయనమును సిద్ధంచేసి సంవత్సరాది దేవతకు నైవేద్యం పెడతారు. ఈ రసాయనం తెలుగునాట 'ఉగాది పచ్చడి' గా ప్రసిద్ధి పొందింది. దీనిలో తీపికి కొత్తబెల్లం, కారమునకు పచ్చిమిరపకాయలు, పులుపుకు కొత్త చింతపండు, వగరుకు మామిడిపిందెలు, ఉప్పుకు ఉప్పు, చేదుకు వేప పూత ఉపయోగిస్తారు.

అన్ని రసాలూ కలసిన ఈ పచ్చడి ఆస్వాదనీయమైన కొత్త రుచిని కలిగిస్తుంది. పదార్థాలతోబాటు రుచులలోను నవ్యత ఇందు కానవస్తుంది. పై వ్రాసిన పదార్థాలన్నీ వసంతకాలంలో ప్రకృతిప్రసాదించిన కొత్త దినుసులు!




జగాని కంతకు జాగృతి నీయగ
ఉగాది వచ్చెను ఊహల వల్లరి!
మామిడి చిగురును మేసిన కోయిల
మత్తిలి పాడెను ప్రగతిపాటలను!
నవపల్లవ వసంత కుసుమపల్లకి
నవనవమై కనిపించెను కనులకు!
తూరుపుదిక్కున తోచిన చైత్రసూర్యుడు
చైతన్యం ఇచ్చెను సర్వప్రకృతికి!
మంచి గతమున కొంచెమేనని
నీరసాలకు స్వస్తి చెప్పుచు
నవ్యజీవన ప్రగతిపాత్రల
నవరసాలను నింపుకొందాం!
ఆరు రుచుల వేపపచ్చడి
నారగించి నేటి మనము
అందరొకటను మహితభావన
అంకురార్పణ నేడు చేద్దాం!

—"సుచంద్రి"

అందరూ ఆనాడు ఈ పచ్చడినే మొట్ట మొదట రుచి చూస్తారు. ఆ తర్వాతనే బంధుమిత్రులతో పిండివంటలతో భోజనం చేస్తారు. మూడు జాములైన తర్వాత స్వగృహంలోనో, దేవాలయాల్లోనో, జను లందరూ చేరదగిన చోటనో, సమావేశమై, పంచాంగశ్రవణం చేస్తారు.

పంచాంగంలోని కందాయ ఫలాలను ఆదాయవ్యయాలనూ, సుయోగ దుర్యోగాలనూ తెలుసుకొని, ఆ సంవత్సరంలోని తమ భవిష్యత్తును నిర్ణయించుకుంటారు. కొన్ని ప్రాంతాల్లో సాయంకాలం ఎడ్ల బండ్లను అలంకరించి పోటీలతో పరుగెత్తనిస్తారు.

వసంతరాత్రులు కూడ ఈ సంవత్సరారంభంతోనే ప్రారంభం అవుతాయి. ఈ విషయాన్ని సంవత్సరాదినాడు జరిపే కార్యక్రమాలను గురించి ధర్మసింధువులో ఈ రీతిగనున్నది. "తైలాభ్యంగం సంకల్పాదౌ నూతనవత్సర కీర్తనాద్యారంభం.... ప్రతిగృహం ధ్వజారోహణం నింబపత్రాశనం వత్సరాది ఫలశ్రవణం నవరాత్రారంభః। నవరాత్రోత్సవాది నిమిత్తా భ్యంగాదిశ్చ కార్యః।"

సంవత్సరాది పండుగతోపాటు వసంత నవరాత్రములు నాడే ప్రారంభం కాగల వనీ, అభ్యంగాదులతో పాటు ఇంటింటా ధ్వజారోహణం జరపాలనీ, వేప చిగుళ్ళు, తినాలనీ దీన్నిబట్టి తెలుస్తున్నది. నింబపల్లవ భక్షణానికి బదులుగానే క్రమంగా నింబపుష్పభక్షణం ఆచారంలోకి వచ్చిందేమో! ఈనాడు ప్రారంభమైన నవరాత్రులు శ్రీరామనవమివరకు జరుగుతాయి.

చాంద్రమానానికి వలెనే మరికొన్ని మానాలు కాలపరిగణనంలో ప్రసిద్ధంగా నున్నవి. అవి సౌరమానం, సావనమానం, బార్హస్పత్యమానం, నక్షత్రమానం, సప్తర్షిమానం, చాంద్రమానాన్ని ఆంధ్రులనుసరిస్తే తమిళులు సౌరమానాన్ని అనుసరిస్తారు. ఉత్తరాదిలో బార్హస్పత్యమానం ఆచరణలోనున్నది. ఈ రీతిగా వుంటున్నా కర్మకాండకు మాత్రం చాంద్రమానాన్నే అనగా చాంద్రమాన సంవత్సరాన్నే గ్రహింపవలసి ఉంటుంది. ఇంకొక మానాన్ని గ్రహింపకూడదట. సంవత్సరం యొక్క ఆదిలో చాంద్రమానానికే ప్రవృత్తియున్నది. కర్మాదుల ఆచరణలో సంకల్పం చెప్పేటప్పుడు అందరూ చాంద్రమానాన్నే స్మరించాల్సి వున్నవి.

ప్రకృతికి నూతనశోభను, కలిగించే వసంతఋతువు ప్రారంభమయ్యే ఈ దినం నూతన సంవత్సరానికి ప్రారంభంకావడం స్వాభావికమే.

విక్రమాదిత్యుని రాజ్యాభిషేకదినం కూడా చాంద్రమాన సంవత్సరాదే అని ప్రసిద్ధి. విక్రమశకం కూడా ఈ దినాన్నే ప్రారంభ మవుతుంది.

"స్మరేత్సర్వత్ర కర్మాదౌ
చాంద్రం సంవత్సరం సదా
నాన్యం యస్మాద్వత్సరాదౌ
ప్రవృత్తి స్తస్య కీర్తితా.

అనుస్మృతివాక్యం కూడా వైదిక కర్మలలో చాంద్రమానాన్నే అందరూ అనుసరించవలెనని తెలియచేయు చున్నది.



## శ్రీ త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు

విజయవాడ శ్రీ సాయి సంగీత సభ ఆధ్వర్యంలో స్థానిక శ్రీ కోదండ రామ దాసాంజనేయస్వామి ఆలయ ప్రాంగణంలో సద్గురు శ్రీ త్యాగ రాజస్వామి వారి ఆరాధనోత్సవాలు ఘనంగా జరిగాయి. 94 మార్చి 6 వ తేదీ ఆదివారం 7 గంట లకు ప్రారంభమైన ఆరాధనోత్సవాల్లో ఉదయం 7 గంటలకు ఉంఛవృత్తి, నగర సంకీర్తన జరిగాయి. ఉదయం 8 గంటలకు పంచరత్న గీతాలాపన సాగింది. ఉదయం 10 గంటలకు శ్రీ మోదుమూడి సుధాకర్ గానం చేసిన త్యాగయ్య కీర్తనలు శ్రోతలను అలరించాయి. వీరికి శ్రీ ఎం.ఎల్.ఎన్. రాజు మృదంగంపై శ్రీ ఎం. హరిబాబు ఘటంపై సహకరించారు.

ఇక ఆ సాయంత్రం జరిగిన కచ్చే రిలో కుమారి పి. విజయలక్ష్మి, శ్రీ సి.పి.వి. శాస్త్రి, ఇంకా పలువురు గానాన్ని ఆలాపించారు. చివరలో శ్రీ సాయి సంగీత సభ కార్యదర్శి శ్రీ వేముల హజరత్తయగుప్త కళాకా రులను, విద్వాంసులను సత్కరించారు.



## ద్వితీయ అఖండ సంకీర్తనారాధన

తిరుపతి అన్నమయ్య గాన సభ వారి ఆధ్వర్యంలో 94 మార్చి 9, 10 తేదీలలో తాళ్లపాక అన్నమాచా ర్యులవారి ద్వితీయ అఖండ సంకీర్త నారాధన మహోత్సవాలు ఘనంగా జరుపబడ్డాయి.

తిరుపతి అన్నమాచార్య కళామంది రంలో జరిగిన ఈ ఉత్సవాలను, టి.టి. దేవస్థానం అధ్యక్షులు శ్రీ ఆకేపాటి చెంగల్ రెడ్డి మార్చి 9 వ తేదీ ఉదయం 8 గంటలకు జ్యోతిని వెలిగించి ప్రారం భించారు. అంతకుముందు ఉదయం 7 గంటలకు అన్నమాచార్య కళామం దిరం నుండి శ్రీ కోదండరామాలయం




తిరువీధుల గుండా అన్నమాచార్యుల వారి కీర్తనలతో విద్వాంసుల నగర సంకీర్తన జరిగింది. ఈ నగర సంకీ ర్తనలో ఎందరో సంగీత విద్వాంసులు కళాకారులు, అన్నమయ్య కీర్తనలను ఆలపించారు. అంతేగాక తిరుపతి ఎస్.వి. సంగీత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ నూకల చినసత్యనారాయణ "అన్న మయ్య" వేషధారణతో నగర సంకీర్త నలో పాల్గొనడం పలువురికి ఆసక్తిని, ఆనందాన్ని కలిగించింది.

9 వ తేదీ ఉదయం ప్రారం భింప బడిన అఖండ సంకీర్తనారాధన నిరవధికంగా 24 గంటలపాటు కొన సాగి మరునాడు 10వతేదీ ఉదయం 8 గంటలకు సమాప్తమయింది. శ్రీ నూకల చిన సత్యనారాయణ, శ్రీ జి. పశుపతి, శ్రీ బాలకృష్ణప్రసాద్ మొద లగు విద్వాంసులు సుమారు 150 మంది పాల్గొన్నారని సుమారు 400 కీర్తనలు గానం చేయబడ్డాయని అన్న మయ్య గానసభ కన్వీనర్ శ్రీ ఎస్.వి. ఆనందభట్టర్ తెలియచేశారు. 10 వ తేదీ ఉదయం 8 గంటలకు అఖండ సంకీర్తనగానం ముగియగానే శ్రీ వేంకటేశ్వరస్వామివారికి, అన్నమా చార్యులకు అర్చనలు, నివేదన, హార తులు జరపబడ్డాయి. ప్రసాదవితరణ జరుపబడింది. అనేక మంది భక్తులు పాల్గొన్న ఈ అన్నమయ్య ద్వితీయ అఖండ సంకర్త నోత్సవాలకు పెద్దగా సహకరించిన టి.టి. దేవస్థానంవా రికి శ్రీ ఆనంద భట్టర్ కృతజ్ఞతలు తెలియజేశారు.



1. స్వాగతం పలుకుతున్న ప్రాజెక్టు అధికారి డా॥ శౌరిరాజన్.



తి.తి. దేవస్థానం
ఆళ్వారు దివ్యప్రబంధ ప్రాజెక్టువారు
94 మార్చి 3.వ తేదీన గురువాయూరు
లోని మేల్పత్తూరు ఆడిటోరియంలో
జరిపిన కులశేఖరాళ్వార్
అవతారోత్సవ దృశ్యాలు

3. శ్రీరామచంద్ర నాయర్‌ని సత్కరిస్తున్న శ్రీ శౌరిరాజన్.








2. ప్రసంగిస్తున్న శ్రీ అరూర్ రామచంద్రనాయర్







4. వందన సమర్పణ చేస్తున్న తి.తి.దే. కల్యాణ మంటపం మేనేజరు శ్రీ వి. వేణుగోపాల్.

# మహోన్నత వ్యక్తి మంథర

డా॥ కోకా శారద

రామాయణం హిందువులకెంతో పవిత్ర గ్రంథం. రామాయణ కథను తెలియనివారు, రాముని పేరు కనీసం ఒక్కసారైనా తలవని వారు ఉండరని చెప్పడం అతిశయోక్తి కాదు. 'పిబరే రామరసం' అన్నారు. ఎంత త్రాగినా తనివి తీరనిది ఈ రామరసం. అంటే ఎంతమంది చెప్పినా ఆ కథ నిత్య నూత్నంగానే ఉంటుంది. అందుకే ఆనాడు వాల్మీకి రామాయణం మొదలు ఈనాడు రామాయణ కల్పవృక్షాల వరకు ఎన్నో రామాయణాలు తెలుగు సాహిత్యంలో చోటు చేసుకొన్నాయి.

రాముని జీవితంలో పట్టాభిషేక సమయంలోని మలుపే రామాయణం. ఆ మలుపుకు కారణం మంథర. అందుకే రామాయణంలో మంథర ఒక మరపురాని పాత్ర. ఆ మహాకావ్యాన్ని మలుపు తిప్పి రాముని కీర్తి ప్రతిష్ఠలకు కారకురాలు అయింది మంథర.




ఏ రచయితకీ, కవికీ లేని కీర్తి రామాయణం వ్రాసిన వారికి లభిస్తుంది. ఎట్లంటే కవి పేరుతో కలిపే ఆ యా రామాయణ కావ్యాలు పిలువబడుతున్నాయి. వాల్మీకి రచించాడు కాబట్టి వాల్మీకి రామాయణం, తులసీదాస రచన తులసీరామాయణం, మొల్ల విరచితం మొల్లరామాయణం, అట్లే భాస్కర రామాయణం, రఘునాథ రామాయణం, దొడ్డ రామాయణం, కంబ రామాయణం, గోవింద రామాయణం, రావుల రామాయణం మొదలగు ఎన్నో రామాయణాలు తెలుగులో ఉన్నాయి.

మంథర కైక దాసి. ఆ పాత్ర రామాయణంలో రామ పట్టాభిషేక సమయంలో మాత్రమే ఎక్కువగా కన్పిస్తుంది. తర్వాత ఒకటి రెండుసార్లు మాత్రమే కన్పిస్తుంది. అయినా ఆ పాత్రకు ఎంతో గుర్తింపు వుంది. మంథర కైకకు దుర్బోధ చేసి రాముని అడవులపాలు చేసిందనేది జగమెరిగిన సత్యం. కానీ మంథరకు ఆ బుద్ధి పుట్టడానికి అనేక కారణాలు రకరకాలుగా కన్పిస్తున్నాయి.

జ్ఞాతిదాసీ యతో జాతా<br>
కైకేయ్యాస్తు సహే పితా,<br>
ప్రాసాదం చంద్రసంకాశ<br>
మారురోహ యదృచ్ఛయా.

ఎక్కడో పుట్టి కైక పుట్టింటివారు అరణమివ్వగా కైకతో కూడా వచ్చిన దాసి మంథర. కాబట్టే తన యజమానురాలి సంతోషం కోరింది. కైక కొడుకు రాజైతే కైక రాజమాత అవుతుంది. అపుడామెకెంతో గౌరవం కదా. అందుకే రామ పట్టాభిషేక వార్త విని ఓర్వలేక పోయింది. మంథర, కైకకు దుర్బోధ చేసింది.

మొదట రామ పట్టాభిషేక వార్త విన్న కైక ఎంతో సంతోషించింది. ఈ శుభవార్త

# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం





శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి, శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.

శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.

శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి!
-శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం





శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.

శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా వెలకొన్న దేవాలయం



శ్రీ అగస్త్యేశ్వరాలయం-తొండవాడ.
కల్యాణీ తటాన ఉన్న పురాతన దేవాలయం



బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6గం॥కు, 10గం॥కు
సాయంత్రం: 3 గం॥కు



టిక్కెట్టు వెల:
పిల్లలకు : రూ. 10/-
పెద్దలకు : రూ: 20/-
ప్రతిచోటా ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR_

చెప్పిన మంథరకు ఒక హారాన్ని బహూకరించింది. దీనివల్ల కైకకు రామునిపై గల ప్రేమ తెలుస్తుంది.

మంచి నార్జింప కష్టమౌ మానవులకు
సమయ జేయంగ నొక నిమిషంబె జాలు.

అని పైడిపాటి రామాయణంలో చెప్పినట్లు కైక మంథర మాటలకు లొంగిపోయింది. భరతుని పట్టాభిషేకాన్ని, రామ వనవాసాన్ని కోరింది. ఇది వాల్మీకి రామాయణంలోని మంథర దుర్బోధ. ఈ విషయమే భాస్కర రామాయణం, దొడ్డరామాయణం, మరింగంటి సింగరాచార్యులు రచించిన దశరథ రాజనందన చరిత్ర అనే పేరుగల నిరోష్ఠ్య రామాయణం, శ్రీరామావఝుల కొండయ్య శాస్త్రి రచించిన సహస్రకంఠ రామాయణం అనే నామాంతరం గల శ్రీరామ విజయం, గడియారం వేంకటశేష శాస్త్రి రచించిన శ్రీమదాంధ్రరామాయణ కావ్యంలోను, పైడిపాటి రామాయణంలోను చెప్పబడింది.

శ్రీదండక రామాయణం మంథర దేవతలు పంపగా వచ్చి కైకతో దుర్భాషలాడినట్లు చెప్తే, గుర్నాధ రామాయణంలో మంథర కైకకు దుర్బోధ గావిస్తూ -- దాసి మాటకేమని త్రోసిపుచ్చకు దేవతలే నానోట ఇట్లు పలికిస్తున్నట్లు తోస్తుంది అని చెప్తుంది.

సాధారణంగా ఎవరైనా తమను పరిహాసం చేస్తే దానికి ప్రతీకారం చేయాలనుకోవడం సహజం. రాముడు బాల్యంలో తన కాలు విరిచినందుకు ప్రతిగా మంథర అతనిపై పగబూనిందని, అందుకు అతని పట్టాభిషేకాన్ని ఆపి వనవాసానికి పంపిందని రంగనాథరామాయణం చెప్తుంది. మంథర కుబ్జ, గూనిది. అటువంటి వారిని చూస్తే కొందరు పరిహసించక మానరు. రాముడు తన చిన్నతనంలో మట్టి ఉండలు వింటిలో పెట్టి, మంథర గూనిపై కొట్టి విసిగించేవాడని, ఆ పాత అవమానాన్ని మనసులో ఉంచుకొని కసితో ఇప్పుడీ విధంగా పగ సాధించుకొందని కంబరామాయణంలో చెప్పబడింది.

కానీ ఇదంతా సమంజసంగా లేదు. సకల సద్గుణాలకు నిలయమైన రాముడు, దయాసముద్రుడు ఒక ముదుసలిని పరిహసించాడంటే నమ్మశక్యంకాదు. మాటతోనైనా ఇతరులను బాధించి ఎరుగని శ్రీరాముడు మట్టి ఉండలతో మంథరను హింసించాడనేది సమంజసంగా లేదు. ఈ రెండు కేవలం మంథరకు రామునిపై పగ ఉందని తెలియజేయడానికి చెప్పే కారణాలు కల్పితాలుగానే కన్పిస్తాయి.

తులసీదాస రామాయణంలోను, గోవింద రామాయణంలోను మంథర వక్రబుద్ధికి సరైన కారణాలు చెప్పబడ్డాయి. రాముని పట్టాభిషేకం దేవతలకు ఎంతో విచారం కలిగించింది. అతడు రాక్షసుల్ని పరిమార్చి భూభారాన్ని తగ్గించడానికి అవతరించాడు. అందుకే వారు ఈ పట్టాభిషేక ప్రయత్నాన్ని ఆపి రాముని వనాలకు వెళ్లేట్లు చేయమని సరస్వతిని ప్రార్థించారు. ఆ పనికై సరస్వతీ దేవి మంథరను పావుగా ఉపయోగించుకుంది. ఆమె మంథర బుద్ధిని కలుషితం చేసింది. దాంతో మంథర బుద్ధి పాపపు చింతలతో నిండి రామపట్టాభిషేకానికి విఘ్నం కలిగించింది. ఇదేకాక తులసీ రామాయణంలోనే మరో రెండు కథలు చెప్పబడ్డాయి.


శక్తి రామకృష్ణ వివేకానందులు --చిత్రం : సోమశేఖర్

కైకేయి తండ్రి ఒకసారి వేటాడుతూ ఒక పురుష మృగాన్ని వధిస్తాడు. ఆ మృగం భార్య తన తల్లితో ఈ విషయం చెప్పి దుఃఖిస్తుంది. అప్పుడు తల్లిమృగం రాజు దగ్గరకు వచ్చి ఆ పురుషమృగ కళేబరం తనకిమ్మని,

యక్షిణీవిద్య తెలిసిన తాను దాన్ని బ్రతికిం చుకోగలనని అడుగుతుంది. అపుడారాజు ఆ తల్లి మృగాన్ని కూడా వధిస్తాడు. అది 'నా అల్లుని ప్రాణాలు గైకొన్నట్లే ముందు జన్మలో నీ అల్లుని ప్రాణాలు గైకొంటానని' పలికి ప్రాణాలు వదుల్తుంది. ఆ తల్లి మృగమే మరుజన్మలో మంథరగా పుట్టి, తన ప్రతీకా రాన్ని తీర్చుకొంది. ఈ కథ మంథరకు సంబంధించిందైతే కైక దుర్బుద్ధికి కారణంగా ఇంకో కథ చెప్పబడింది.

ఒకసారి కైక నిద్రిస్తున్న ఋషిని చూచి అతని ముఖంనిండా పరిహాసానికై మసి పూసింది. మేల్కొన్న తర్వాత విషయాన్ని గ్రహించిన ఋషి కోపించి 'నాకు నీవు కళం కము పెట్టినందున నీకు కూడా కళంకము వచ్చుగాక' అని శపిస్తాడు. మన భారతీయ ఇతిహాస పురాణాల్లో శాపాలు సర్వసామా న్యాలే కాబట్టి ఆ శాప కారణంగా కైక ఆ విధంగా ప్రవర్తించి కళంకం తెచ్చుకుంది. తాను చేసిన పనికి తర్వాత కైక దుఃఖించడం రామాయణంలో కన్పిస్తుంది. మంథర నీచు రాలనీ, దాని పలుకులు విషమని తెలిసినా అజ్ఞానంతోనో లేక దైవమాయ చేతనో లేక శాపకారణంగానో మంథర మాటలు నమ్మి కఠినంగా ప్రవర్తిస్తుంది కైక.

మంథర ప్రతీకారానికి ఇంకో కథ గోవింద రామాయణంలో చెప్పబడింది.

పూర్వం సురాసుర సంగ్రామంలో విరో చనసుత మంథర మాయలతో సురులను మిక్కిలి బాధించింది. ఇంద్రుడామెను స్త్రీ అని సంహరించలేదు. కానీ విష్ణువు పురికా ల్పగా ఇంద్రుడామెపై వజ్రాయుధాన్ని ప్రయో గించిన ఫలితంగా ఆమె కుబ్జ అయింది. అందుకామె విష్ణువుపై పగబూని దుందుభి అనే గంధర్వ రూపంలో బ్రహ్మను గూర్చి తపస్సు చేస్తుంది. బ్రహ్మ ప్రత్యక్షమై విష్ణువు రామావతారమెత్తినపుడు నీవాతనిపై అదను చూసి వనాలందు నివసింపజేసి కసి తీర్చు కొనగలవని చెప్పాడు. ఆ కారణంగా ఆమె కైక దాసియై అయోధ్య చేరి, తన పగ తీర్చుకుంది.

శ్రీపాద కృష్ణమూర్తి శ్రీకృష్ణ రామాయ ణంలో నారదుని ప్రస్తావన కన్పిస్తుంది.

రామ పట్టాభిషేకానికి ముందురోజు రాత్రి నారదుడు శ్రీరామునికి దర్శనమిచ్చి అతని అవతార లక్ష్యాన్ని చెప్పి, కర్తవ్యాన్ని గుర్తు చేస్తాడు. ఆ కారణంగానే దేవతల ప్రేరణచే మంథర తన కర్తవ్యాన్ని నెరవేరు స్తుంది. అందుకే వనవాసానంతరం కైక రామునితో 'నేనెట్టి దానినో నీకు తెలుసు. కానీ లోకం నన్ను, మంథరను శంకించింది' అని చెప్తుంది.

ఇందులోనే -- రావణుని ఆగడాలు భరించలేని దేవతలు విష్ణువును ప్రార్థించగా, అతడు రామావతారంలో అతన్ని సంహరిస్తా



నని చెప్పి దుందుభి అనే గంధర్వ కాంతను పిల్చి, 'దేవకార్యార్థమై నీవు భూలోకంలో జన్మించమని' చెప్తాడు. ఇదే విషయం భార తంలో కూడా చెప్పబడింది. అరణ్యపర్వంలో రామావతార కథలో బ్రహ్మ దుందుభిని పిలిచి నీవు కుబ్జ రూపంలో మంథర అనే పేరుతో భూలోకంలో ఉద్భవించి దేవకార్యం నిర్వహించమని' చెప్తాడు.

ఇవన్నీ ఇలా ఉంటే ఏ రామాయణం లోనూ లేని విషయం విశ్వనాథ సత్యనా రాయణ శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో కల్పించబడింది. ఉపవాస దీక్షలో ఉన్న రామునికి దేవతలు పట్టాభిషేకం నిలుపమని కోరినట్లు అన్పిస్తుంది. అతడు అర్ధరాత్రి కైక గృహాన్ని చేరి ఆమెతో తన బాధను చెప్పుకుంటాడు. తనకు సమాధి నిలవడం లేదని, దేవతలు వచ్చి తనను రాజ్యం చేయ వద్దని చెప్పినట్లు తోస్తున్నదని, తనక్కూడా ఈ రాజ్యపాలనపై ఏ మాత్రం కోరిక లేదని చెప్తాడు. కైక అతనికి మంచి మాటలు చెప్పి పంపిస్తుంది.

దీన్నిబట్టి చూస్తే కైకను రామునికి గల సన్నిహితత్వం తెలుస్తుంది. రాముని మనసు కలత చెందితే తన తల్లియైన కౌసల్య వద్దకు వెళ్లవచ్చు. కానీ అతనికి కైకే గుర్తుకు వచ్చింది. తన మనోవ్యధను తీర్చగల సమర్థురాలు కైకే అని అతడు భావించాడు.

కానీ రామావతార ప్రయోజనం మాత్రం రావణాది రాక్షస వధ. అది జరగాలంటే అతడు దేశసంచారం చేయాలి. అందుకతని పట్టాభిషేకానికి విఘ్నం కలగాలి. ఆ విఘ్నం మంథర కైక ద్వారా కలుగజేసింది. అది దైవ ప్రేరణ కావచ్చు లేదా శాపకారణం కావచ్చు.

రామపట్టాభిషేక విఘ్నానికి కారణం ఏదైనా మనకు ప్రత్యక్షంగా విఘ్నకర్తలుగా కనిపించేది కైక, మంథర. ఇందులో కైక కోరికకు మంథర ప్రేరణ ఉంది. మంథర కైకను ప్రేరేపించినందువల్ల నాటినుండి నేటి వరకు ఆమె నిందలకు నిలయమైందే తప్ప ఆమెకు కలిగిన స్వప్రయోజనం శూన్యం.

కానీ కొన్ని రామాయణాల్లో అది దైవ ప్రేరణగా చెప్పబడింది. దైవమాయచే మంథర దైవ కార్య సాఫల్యానికి కారకురాలైంది. లోకంలో తంటాల మారిగా నిలిచిపోయింది. నిజంగా దైవమాయే మంథర ప్రేరణకు నిజ మని తలుస్తే, రామాయణంలో మంథర దైవకార్య సఫలీకృతికి తనను తాను నింద లకు బలి చేసుకొన్న ఒక మహోన్నత పాత్ర అని చెప్పవచ్చు. ఏది ఏమైనా రామాయణ కావ్య కథను ఒక పెద్ద మలుపు తిప్పిన మంథర పాత్ర ఆ కావ్యంలో స్వల్ప కాలమే ప్రత్యక్షమైనా ప్రముఖ పాత్రగా గుర్తించదగి ఉంది.



(గత సంచిక తరువాయి)

జాంబవంతు డా రీతి నుత్సాహ మొసగ
కాయ మెల్లను పెంచుచు కపులు పొగడ
భీమవిక్రమమున విజృంభించి హనుమ
వాలమును చక్క ద్రిప్పుచు పలికె నిట్లు.

"మూడ అనిలున కౌరససుతుడ నేను
ప్లవన మందున సాటిలే డెవడు నాకు
మేరుగిరి మట్టి వత్తు వేమారు లేని
నేల సాగరజలముల నింప నెంతు.

గమనవేగ తేజముల లాఘవము నందు
మతిని సముని గనని హనుమంతు డంత
క్షణములో చేరి లంకకు కన దలంచె
కాంచి నట్లెంచె సిద్ధసంకల్పు డతడు

పూతచరిత మహీజాత సీతవెదకు
పరమదుష్కర మైనట్టి పనికి పూనె
ఊర్జితానంద కంద రూపోజ్జ్వలుండు
హనుమ తరియించి లవణ మహార్ణవంబు.

# రావుల రామాయణము

వాయు వైనతేయులు దక్క వాస్తవముగ
శక్తి నేడు లోకాల నా సముడు లేడు
నిక్కముగ లంక నా కొక లెక్కగాదు
తలప లిప్తలో తేగల దాని నిటకు.

కపులు తమ విషాదము వీడి కాంచుచుండ
జాంబవంతుడు హనుమ తేజస్వి కనియె
"ఘోరవార్ధి లంఘింపుడు గురుల కరుణ
వేచి చూచెద మిచటనే వేగ రమ్ము.

నాదువేగము సైచగాలేదు ధరణి
ఈ తరుణమందు" అని వచియించి హనుమ
శీఘ్రమే మహేంద్ర గిరీంద్ర శిఖర మెక్క
అచలము చలించె అతని పాదాభిహతికి.

దేవతలు కామరూపాన తిరుగునట్టి
ఆ మహేంద్రమహాగిరి నతుల గతుల
శాద్వలముల విహారమ్ము సలిపె నతడు
విహగములు వన్యమృగములు భీతిచెంద.

రవిని దేవేంద్రు పవనుని బ్రహ్మ దలచి
రామచంద్రు, లక్ష్మణుని వారాశి గొలిచి
భూతముల కెల్ల భక్తితో మ్రొక్కి పిదప
హనుమ జ్ఞాతిచయమ్మున కంజలించె.

దక్షిణాంభోధి లంఘింప తనువు పెంచె
పర్వదినముల పొంగెడు వార్ధివోలె;
పర్వతమునుండి కుప్పింప పరువులెత్తె
భూతగణము; యోగిజనంబు భీతినొందె.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి

'చంద్రశేఖర్'

రామకార్యంబు గావింప శ్రద్ధతోడ
రవ మొనర్చె భీకరము పర్జన్యు డట్లు;
ఉన్నతబలుండు హనుమంతు డూర్ధ్వదృష్టి
చారణాచరి తార్క్ష్యసంచార వాంఛ.

"రాము శరవట్లు లంకను వ్రాలి యిపుడె
సీత నట నేను కనకున్న శీఘ్రగతిని
చొచ్చి స్వర్గాది లోకాల సుదతి గొనుచు
వత్తు; పెకలించి తెత్తు రావణుని లంక."

అని వచించి కపుల కంజనాత్మజుండు
సంశయమ్ము నందక మహోత్సాహ మెసగ
తన్ను వినతాసుతుగాగ దలచికొనుచు
వెంటనే రివ్వుమని వినువీధి కెగసె.

మేదురంబుగ వాలంబు మెడను దాల్చి
సకల భువ నాద్భుతా ఖర్వ శౌర్యశాలి
ఖచర సంఘమ్ము మివుల దిగ్భ్రాంతి నొంద
లంక కున్ముఖు డగుచు నిశ్శంక వెడలె.

వాయుసుతు డేగుచుండ విహాయసాన
సాయ మొనరింప మది నెంచె సాగరుండు
సగరు డనియెడు పావనేక్ష్వాకు విభుడు
తనదు వృద్ధికి మూలకారణము గాన.

ఆంజనేయుడు చనుచుండె అంబరాన;
రామభూవిభు కార్యనిర్మగ్ను డతని
బడలికలు వాప మనము తోడ్పడగ వలయు
త్వరితగతి రమ్ము పైపైకి తనువుపెంచి."

అనుచు జలధి మైనాకున కాజ్ఞ నొసగ
క్షణములో నిల్చె శైల మాకాశవీథి
తరులతా శ్యామ సుందర తనువు దాల్చి;
రామదూతను గాంచి పర్వతము పలికె.

నన్ను మార్గనిరోధిగా నెన్నకయ్య!
ఘనుడు కృతమెంచువాడు సాగరుడు పనుప
సేద దేర్పంగ నిలుచుంటి; స్వీకరింపు
మాతిథేయ సత్కారమ్ము నాంజనేయ!

కరువలి సుతుండు మైనాకు నరసి అనియె
"చీకటి పడకమునుపె నే చేరవలయు
రావణుని లంక రామకార్యమ్ము పైని;
వానరుల కట్టు లిడితి వాగ్దాన మేను."

చనగ హనుమంతుడు గమించి సాగరమ్ము
సురలు సిద్ధగంధర్వులు పరమఋషులు
సూర్యనిభ నాగమాతను సురస నరసి
విఘ్న మతనికి సుంత కావింపు మనిరి.

కామరూపిణి సురస రాక్షసిగ మారి
భయద వక్త్రంబు తెరచి నభస్సమంబు,
ఆంజనేయునితో నిట్లు వచించె
"మేటి వానర! ని న్నిదే మ్రింగివైతు."

పలికె సురసతో అంజలిబద్ధు డతడు
"రామపత్ని నపహరించి రావణుండు
లంకలో నుంచె సాధ్వీలలామ జాడ
రామునకు తెల్పి నీ వక్త్రసీమ జొత్తు."

అందులకు సమ్మతింపక అనియె సురస
వరమహిమ నన్ను మీరంగ తరముగాదు;
అరుగు మవల మదాస్య కందరము సొచ్చి;"
కోరె హనుమంతు డద్దాని నోరు తెరువ.

అప్రమేయ మహాశక్తి నడరు హనుమ
తన శరీర మంగుష్ఠమాత్రమ్ము చేసి
సురస భీకర వదన గహ్వరము సొచ్చి
బయల్వె మెరసె; దాక్షాయణి వరము నిల్పె.

స్వస్వరూపమ్ము గైకొని వనిత సురస
ఆంజనేయునకు ఘటిల్ల నర్థసిద్ధి
స్థిరతరయశంబు గలుగ నాశీర్వదింప
వాయువేగాన సాగించె పయన మతడు.

వాయుసుతు డాంజనేయుని ఛాయబట్టి
వేగమె భుజింప సింహిక లాగ సాగె;
సంభ్రమున నున్న ఆ నిశాచరిని ద్రుంచె
మర్మములు త్రెంచి శ్రీరామ మహిత దూత.

జలధి సింహిక కూలు దృశ్యమ్ము నరసి
దేవతలు హనుమంతుని ధృతిని మతిని
దక్షతను మెచ్చి కార్యసాధకు డనంగ
సాగరముమీ దనేగె నా శౌర్యధనుడు.

నూరు యోజనములు దాటి చేరె నతడు
వృక్షతతుల విరాజిలు ద్వీప మొకటి;
అచలమునుబోలు తనదు దేహమ్ము నంత
కోరి పవమానసుతుడు సంకోచపరచె.

వార్ధితీరము దాటి రూపాలు మార్చి
అంజనాపుత్రు డురికె మహాద్రిపైకి;
స్వీయకార్యము సాగ విచిత్ర సరణి
సుందరంబు లంకాపురి చూచె నతడు.

మది దలంచె వీరుడు హనుమంతు డిట్లు
"అబ్ధి దాటితి శతయోజనాయతమ్ము
దీనికిని నూరురెట్లు దవ్వైనగాని
దాటగల నవలీల సంద్రమ్ము నింక."

అతిభయంకర రాక్షసు లలరు పురిని
సంభ్రమును గాంచి చింతింప సాగె హనుమ
వానరానీక మేరీతి వార్ధి దాటు?
సమర జయమెట్లు సాధింప శక్య మగు-నొ?

బ్రదికియున్నదొ లేదొ శ్రీరామపత్ని
తెలగా, కార్య సరణి సాధింపవచ్చు
రాక్షసుల కంట బడకుండ రాత్రివేళ
మెలత సీతను వెదకంగవలయు లంక.

ఆంజనేయుడు వేచి సూర్యాస్తమయము
సూక్ష్మతనువంది శోధించి చూడ సీత
లంబమనియెడు పర్వతాగ్రంబువీడి
రావణాసురు లంకాపురమ్ము సొచ్చె.

సుందరోజ్జ్వల ప్రాకార శోభతోడ
వజ్రవైదూర్య తోరణావళులతోడ
రాజితోత్తుంగ భర్మహర్మ్యాలతోడ
నయనపర్వమై తోచె నా నగరమెల్ల.

చొచ్చెనో లేదొ పురి అడ్డు వచ్చి పలికె
వాయుసుతునకు లంకిణి స్వీయ వికృత
రూపము ధరించి దారుణక్రోధమంది
"ఎవడవుర నీవు? ఇటురాగ హేతు వేమి?

ఒరులు చొరకుండ చూతు నీ పుర; మెరుంగు
మేను లంకేశు సాకారమైన ఆజ్ఞ!
బ్రదుక తలతేని చెప్పుము భయము వీడి"
అనుచు నడ్డముపడె మహితాద్రి భంగి.

వాక్యవిదుడు వేరొండు పర్వతము వోలె
నిలిచి నిర్భీతి నామెకు పలికె నిట్లు
"తోరణాలు వనాళి కౌతుకము మీర
కాంచి పోవంగ వచ్చితి కపిని గాన."

(సశేషం)






అన్ని మంత్రములలోను అధికశక్తివంతమైనది అతి ప్రధానమైనది ఏకాక్షర మంత్రము ఓమ్. ఓం శబ్దాన్ని ప్రణవం అని కూడా అంటారు. ప్రణవం అనగా ప్రాణంతో ఆవరించుకొని వున్నదని గాని ఊపిరితో ప్రవహించేది అనిగాని చెప్పుకోవచ్చును. ఓం కారము పరబ్రహ్మ స్వరూపము. ఆధ్యాత్మిక సాధకులకు ఓం ఒక ప్రతీకగాను, ధ్యానానికి సహాయకారిగాను నిలిచింది. ఇది మానవునకు భగవంతునకు మధ్య సంధానం చేసే ధ్వని. ఓం కారశబ్దం నుండి ఈశ్వరుడు ఇంద్రియగోచరమైన ఈ స్థూల ప్రపంచము (Manifested world or world of objects) గా రూపొందుతున్నాడు. అనగా ఓం కారము నుండే యావత్తు జగత్తు పుట్టెను. సృష్టి, స్థితి సంహారములకు కారణమైనదే ఓం కారము. ఓం కారము స్వయం సిద్ధమయిన ఆ పరమేశ్వరుని పరమాత్మ స్వరూపము. ఓం కారమే సర్వలోకములు అయి వున్నది. కావున ఓంకారము గాయత్రి మహామంత్రమునకు ముందు ఉంచబడినది.

అకార ఉకార మకారముల కలయిక ఓం కారము. అకారము విష్ణు రూపము, ఉకారము బ్రహ్మ స్వరూపము, మకారము రుద్ర స్వరూపము. ఈ త్రిమూర్తుల స్వరూపమే ఓం కారము. అకారము జాగ్రదవస్థ ఉకారము స్వప్నావస్థ మకారము సుషుప్తి అవస్థలను సూచిస్తాయి. అ పరమాత్మ మ్, జీవాత్మ ఉ, ఈ రెండింటికి గల విడదీయరాని సంబంధము అయి వున్నాయి. అనగా ఉ జీవాత్మను పరమాత్మను కలిపేదిగా ఉన్నది. రెండుసార్లు ఓం కారాన్ని ఉచ్చరించినప్పుడు వీటిమధ్యవుండే నిశ్శబ్దం నాలుగవదయిన తురీయావస్థను సూచిస్తుంది. తురీయావస్థ పరమానంద స్థితి. ఇక్కడే జీవాత్మ పరమాత్మతో ఐక్యం పొంది ఆత్మ ఐక్యాన్ని పొందుతుంది. నాలుగు అవస్థలు కూడి వున్నదే ఓంకారంలో వుండే బ్రహ్మతత్త్వం, అదే పరమాత్మతత్త్వం. ఈ మూడు అక్షరములకు అనగా అకార ఉకార మకారములకు ఇంకను ఎన్నో భావాలు చెప్పబడిఉన్నాయి.

ఓం కారమునుండియే సకల శబ్దములు పుట్టెను. ఓంకారము నాభియందు ఉద్భవించును. అన్ని వాచిక ధ్వనులు నాలుక యొక్క మూలభాగం మొదలుకొని నాలుకచివరె వరకు ఉండే అంతర్భాగంలోనే పుట్టుతున్నాయి. మొదటిదైన అకారము కంఠములోని ధ్వని, ఉకారము జిహ్వామూలము నుండి పెదవుల కదలికవరకు, మకారము పెదవులలోను ఉద్భవిస్తాయి. ఈ మూడు అక్షరములవలన సంగీతము పుట్టెను. ఓంకారను నాద బ్రహ్మము.

ఓం ఏకాక్షరమంత్రము. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మం' అని ఈ ఒక్క ఓం అను అక్షరమునకే బ్రహ్మ తత్త్వం ప్రసాదించబడింది. ఓం కారము భగవంతుని సూచించే అసలైన అతిసన్నిహిత ప్రతీక. ఓం కారమునకు, కారణమేదియు లేదు. ఓంకారము వ్యక్తావ్యక్త ప్రపంచాన్ని (Manifested and unmanifested world) దీనికి అతీతమై వున్న పరతత్త్వాన్ని సూచించేదిగా వుంది. ఓం అనే అక్షరం వేదసారం. ఓం యొక్క స్వరూపం అ ఊ మ్ గ విడదీస్తే దాని అర్థం భావం తెలుసుకుంటే అంతా తెలిసినట్లే.

(33వ పేజీలో)



# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కోరుకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బాగుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడ ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాలకోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః ।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః ।

—బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీత మైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

—బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

'చంద్రశేఖర'

# కాకతీయ రాజులనాటి శాసన విశేషాలు

శ్రీ ఎ.కె.వి.ఎస్. రెడ్డి
అనువాదం : జి. శ్రీమతి

(గత సంచిక తరువాయి)

రెండవ శాసనం క్రీ.శ. 1135కు చెందింది, నాగేశ్వరాలయం వద్దనే మరియొక స్తంభంమీద చెక్కబడివుంది. జాయపసేనాని ఒక విగ్రహాన్ని, తామ్రపురంలో స్థాపించినట్లు (అనగా చేబ్రోలు), లింగాకారంలో వుండే ఆ విగ్రహం నల్లరాతితో చేయబడి జాయప తండ్రి అయిన పిన్నచోడి తర్వాత ఆ దేవ సహస్రలింగ, గణపతీశ్వర, లక్ష్మీనరసింహనారాయణదేవ అతని తండ్రి తర్వాత ఏర్పడిన పేరు) ప్రతిమలను ప్రతిష్ఠగావించినట్లు మరియు 21 శివలింగాలనే గాక ప్రసన్న భైరవను ప్రతిష్ఠించి, ఒక గ్రామాన్ని మరికొంత భూమిని ఆ దేవుళ్ల నైవేద్యానికై ఏర్పాటుగావించాడు. ఈ శాసనాన్ని ఆ గ్రామంలోని కోట ముందున్న రాతిమీద ప్రతిష్ఠ చేయడం లేక, 21 శివాలయాలను కట్టించినందువల్ల వారి కుటుంబానికి చెందిన 21 తరాలవారికి పుణ్యం చేకూరుతుందని కూడ విశ్వసించేవారు.

మధ్యయుగంలో ఆంధ్రదేశంలో గోచరించే మరియొక ముఖ్యాంశమేమనగా, వివిధ తెగలకు చెందిన వారి ఇలవేల్పులైన దేవుళ్లకై



స్వామికి "చోడేశ్వర" అని పేరు వచ్చినట్లు మరియు ఆ స్వామికై దేవాలయం కూడ నిర్మించినట్లు తెలుస్తోంది. అంతేకాక ఆ ఆలయానికి ప్రాకారం, గోపురం, మండపం కూడ నిర్మించబడినాయి. ఆ ఆలయ గోపుర శిఖరాలను బంగారంతో నిర్మించి, ఆ ఆలయానికి ముందు రెండు వరుసల శ్రేణులతో గోపురాన్ని నిర్మించి, అందు పదహారు స్త్రీ అనుచరుల బొమ్మలను అందంగా అలంకరించారు.

క్రీ.శ. 1224 వర్ధమానపురం (మహబూబ్‌నగర్ జిల్లా)కు చెందిన శాసనం చెపుతున్నదేమనగా, భీమేశ్వర (ప్రెగ్గడ -- బుద్ధేశ్వర చూడవచ్చును. పైన తెలుపబడిన బుద్ధేశ్వర, గణపతీశ్వర్ల పేర్లు, గోనబుద్ధారెడ్డి మరియు అతని కుమారుడు గణపయ్య తర్వాత ఏర్పడి వుండవచ్చును. మధ్యయుగంలో సహస్రలింగాల స్థాపన, 21 లింగాల ప్రతిష్ఠ బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. ఒక పెద్దలింగం చెక్కబడి దాని కనుబంధంగా వేయి చిన్న లింగాలు చెక్కబడి వుండడాన్నే "సహస్రలింగం" అంటారు. ఒక విశ్వాసమేమనగా, ఒక సహస్రలింగం చెక్కడానికయ్యే ఖర్చు, ప్రత్యేకంగా ఒక్కొక్కటి చొప్పున వేయిలింగాలు చెక్కడానికయ్యే ఖర్చుతో సమానం. ఇంకొక విషయమేమనగా, 21 లింగాలను నిర్మించబడిన ఆలయాలు బాగా వెలుగులోనికి వచ్చాయి. ఒక శాసనం క్రీ.శ. 1228 గిర్మాజీ పేటకు ( వరంగల్ జిల్లా) చెందింది వివరిస్తున్న విషయమేమనగా, సాలేశ్వరదేవ ప్రతిష్ఠ సాలి సంఘాల వారి పేరుతో జరిగింది. (ధర్మ సాలీయజనులు) కాకతీయ గణపతి తర్వాత "గణపతీశ్వర", "సకలీశ్వర" పేరు 'మటియ'కు చెందిన శెట్టి కులానికి సంబంధించిన భక్తుల పేరులో ఏర్పడింది. శాసనంలో చెప్పబడిన మటియ ప్రాంతమనేది ప్రస్తుతం వరంగల్ జిల్లాలో వుంది. మత్తెవాడ అని పిలువబడుతోంది. మటియ గ్రామం చీరమట్టిగా కూడ పిలువబడేదని ఈ శాసనాధారంగా

తెలుస్తోంది. ఈ శాసనం ఇంకా వివరిస్తున్న దేమనగా, నకరేశ్వర స్వామి ప్రతిష్ఠ చీర మతిలోని నకలేశ్వర అని పిలువబడే వర్తక సంఘంచేత స్థాపించబడింది.

అదే కాలానికి చెందిన కరీంనగర్‌జిల్లా నగునూరు శాసనం విశేషంగా చెపుతున్న విష యమేమనగా, గిర్మాజీపేటకు చెందిన శాసన కాలానికి చెందిందే ఇది కూడానని విశదప రుస్తోంది. గిర్మాజీపేటకు చెందిన శాసనం, సాలేశ్వర, గణపతీశ్వర, సకలేశ్వర, దేవుళ్లను ప్రతిష్ఠ గావించినట్లు చెపుతోంది.

క్రీ.శ. 1236 ఖమ్మంజిల్లా, 'పామి'కి చెందిన శాసనం చెపుతున్న దేమనగా, "దేవన ప్రెగడ" ప్రసన్న వల్లభస్వామిని ప్రతిష్ఠ గావిం చినట్లు, పూసుప్రెగడ 'త్రిమూర్తియ వంటికం' (ఆలయం) నిర్మించినట్లు మరియు పమ్మి గ్రామంలో ఒక మండపాన్ని నిర్మించినట్లు తెలుస్తోంది. ఈ విషయం చెన్నకేశవాల యంలో గల రాతిమీద చెక్కబడివున్నాయి. ప్రసన్నవల్లభ అని శాసనంలో చెప్పబడిన స్వామి ఆ కాలంలో పూజింపబడే చెన్నకేశవే అని తెలుస్తోంది.

క్రీ.శ. 1238 శాసనం, రామేశ్వరాలయం 'దుత్తిక'లో నిర్మించబడినట్లు, ఈ ఆలయం, కొలను కుటుంబానికి చెందిన రాజు తన భార్య జ్ఞాపకార్థమై కట్టించినట్లు తెలుస్తోంది. ఈ శాసన విశేషాలన్నీ ఆ దేవాలయంలోని రాతి మీద చెక్కబడివుంది. ఆ దేవా లయం పేరుకు ముందు "నట్ట" అనే పదం ఎందుకు వాడారో కారణం తెలియడం లేదు. తెలుగులో 'నట్ట' అనగా 'నత్తగుల్ల' అని అర్థం.

కాకతీయ సామంతరాజులు కూడ చెప్ప కోదగ్గ రీతిలో భవన నిర్మాణ కార్యక్రమాలు గావించారు. క్రీ.శ. 1234 నల్గొండ జిల్లా 'నాగులపాడు'కు చెందిన శాసనం చెపు తున్న దేమనగా, రేచర్ల ప్రభువైన కాటిరెడ్డి చేత నామేశ్వర, ఐతేశ్వర, కాటేశ్వరాలయాలు నిర్మించబడ్డాయి. ఈ దేవుళ్లకు పేర్లు వారి తండ్రి, తల్లి పేరు మీదుగా, ఆ రాజు పేరు మీదుగా ఏర్పడినాయి.

కాకతీయరాజుల కాలంలో రాజులే గాక ఇతర వ్యక్తులు కూడ చెప్పుకోదగ్గ రీతిలో దేవా లయ నిర్మాణ కార్యక్రమం గావించారు. క్రీ.శ. 1241 శాసనం, కొందరు ఇతర వ్యక్తులచేత కోట రాజైన 'బేత' జ్ఞాపకార్థం 'రుద్రేశ్వర మహాదేవాలయం నిర్మించబడిన ట్లును, మరియు ఆ స్వామి నైవేద్యానికై కొంత భూమిని కూడ వారు దానం చేసినట్లు తెలుస్తోంది. కాకతీయ గణపతి కుమార్తె మరియు 'కోట' రాణి అయిన గణ పమదేవి కూడ. పైన చెప్పబడిన ఆలయానికి కొంత భూమిని దానం చేశారు. ఇందుకు సంబంధించిన శాసనం గుంటూరుజిల్లాలోని 'ఎనమదాల'లోని వీరభద్రాలయం ముందువై పుగల స్తంభం మీద చెక్కబడివుంది. కోటరా జులకు 'ఎనమదాల' బహుశా ముఖ్యపట్టణమై వుండవచ్చును.

గుంటూరుజిల్లా ఎనమదాలకు చెందిన శాసనాలు చెపుతున్న దేమనగా, కాకతీయ రాజుల కాలంలోగాని, ఆ తర్వాత కాలంలో గాని ఆ ప్రాంతలో మరికొన్ని దేవాలయాలు నిర్మించబడినట్లు చెపుతోంది. కాకతీయగణ పతి కుమార్తె మరియు కోటరాజైన 'బేత' భార్య గణపాంబ, ఎనమదాలలో ఒక ఆల యాన్ని తన భర్త శివలోక సాయుజ్యానికై నిర్మించారు. వ్యాధిగ్రస్తుడైన కోట రాజు పేరు మీదుగా ఆ స్వామికి 'బేతేశ్వర' పేరు స్థిరపడింది. రాణి అయిన గణపాంబ ఈ దేవాలయానికి ప్రాకారాన్ని నిర్మించడమే గాక ఆ దేవాలయ విమానానికి బంగారు కలశాలను సైతం అమర్చినారు. అంతేగా కుండా ధాన్యకటకపుర (అమరావతి) లోని అమరేశ్వరాలయానికి కూడ బంగారు కల శాలను అమర్చినారు. ఆమె మరియొక దేవాలయాన్ని శివునికై నిర్మించారు. ఆమె తండ్రి గణపతి పేరు మీదుగా 'గణపేశ్వర' అని స్వామికి పేరిడినారు. గణపాంబ పరమ శివభక్తురాలు మరియు ఆమె శివునికై నిర్మించిన ఆలయాలు చెప్పుకోదగ్గవి కూడ. ఏది ఏమైనప్పటికీ ఆమెకు పరమత సహనం ఎక్కువని ఈ శాసనం తెలుపుతోంది. ఆమె గోపాల అంశలో కృష్ణస్వామిని 'ఎనమదాల' వద్ద ప్రతిష్ఠించినట్లు, మరియు కొంతభూ మిని, నూనె యంత్రాన్ని, పూలతోటను, పన్నులరూపంలో వచ్చే ఆదాయంలో కొంత భాగాన్ని ఆ గుడి నిర్వహణకై ఏర్పాటు గావిం చారు. ఆ దానం వస్తు, ధన రూపంలో వుండి, స్వామివారి సేవకై ఏర్పాటు గావిం చారు. ఈ శాసనాన్ని వేణుగోపాలస్వామి ఆలయంలో చూడవచ్చును.

మూడవ శాసనం క్రీ.శ. 1295కు చెందింది, అదే స్థలంలో ఆంజనేయస్వామి ఆలయంలోగల రాతిమీద చెక్కబడివుంది. అందు రెండు విగ్రహాలు గణపేశ్వరస్వామికి చెందింది. (గణపతి లేక వినాయక).

నాలుగవ శాసనం రామస్వామి ఆలయం ముందువైపుగల స్తంభంమీద చెక్కబడివుంది. ఈ శాసనం, వైశ్యకులానికి చెందిన వ్యక్తి 'మూలస్థానమైలారదేవ' ఆలయంలో ఒక స్తంభాన్ని రంగమధ్యంలో ఏర్పాటు గావిం చాడు. (రంగమండపం మధ్యలోని స్థలం) ఈ శాసనం క్రీ.శ. 1338కి చెందింది.

క్రీ.శ. 1531 కి చెందిన శాసనం, వీరభద్రాలయానికి ప్రాసాద, ముఖమండపం, ప్రాకారాలు నిర్మించబడినట్లు చెపుతోంది.

పై విషయాలను పరిశీలించిన మనకు ఖచ్చితంగా తెలుస్తున్న దేమనగా, ఒక్క ఎన మదాలలోనే పలు దేవాలయాలు నిర్మిం చబడినట్లు, నిర్మాణాత్మకమైన పలురకాల కట్టడాలు ఆ ప్రాంతంలోని దేవాలయాలకు వివిధ కాలాలలో జరిగినట్లు తెలుస్తోంది. ఎన మదాల మధ్యయుగంలో రాజకీయ ప్రధాన కేంద్రంగా, సాంస్కృతిక కార్యక్రమాలకు కీల కంగా పేరొందినది. కాని ఇప్పుడు ఏ మాత్రం ప్రాముఖ్యంలేని ఒక చిన్న గ్రామం మాత్రమే.

గుంటూరుకు చెందిన కాకాని శాసనం, క్రీ.శ. 1246లో కాకండి గ్రామంలో కేశ వస్వామి ప్రతిష్ఠ ఒక బ్రాహ్మణుని చేత గావించబడినట్లు చెపుతోంది. ఈ శాస నాన్ని మనము హనుమాన్ దేవాలయంలోని స్తంభంమీద చూడవచ్చును.

క్రీ.శ. 1248కి చెందిన శాసనం, మలయ రాజు గణపతి మహదేవేశ్వర స్వామిని గజ

రాము గ్రామంలో ప్రతిష్ఠ గావించినట్లు అతని తండ్రి మాదేవరాజు తర్వాత ఆ స్వామికి ఆ పేరు ఏర్పడినట్లు తెలుస్తోంది. ప్రస్తుతం ఈ శాసనం తూర్పు గోదావరి జిల్లాలోని రాజమండ్రిలో చూడవచ్చును. ఈ శాసనంలో చెప్పబడిన గజరాము ఆ జిల్లా షేర్గును సూచిస్తోంది. (గంజాం జిల్లా)

క్రీ.శ. 1251 గుంటూరుజిల్లా దుర్గికి చెందిన శాసనం, కాయస్తరాజైన గంగయసాహినికి శ్రీ కరనాధిపతి అయిన 'నామదేవ పండితుడు' దుర్గి గ్రామంలో తన తండ్రి అయిన వైదేవ పండితుని పేరు మీదుగా వంకేశ్వరాలయాన్ని నిర్మించినట్లుగా తెలుస్తోంది. ఈ దేవాలయానికి పలురకాలైన దానాలు కాకతీయ రాజైన గణపతిచేతనే గాక ఇతరుల చేత కూడ ఇవ్వబడింది. దీనినిబట్టి చూస్తే ఈ దేవాలయం రాజ ప్రాపకాన్ని పొందినట్లుగా తెలుస్తోది. ఈ దేవాలయాన్ని గొప్ప శిల్పి అయిన 'కడాజా' చేత నిర్మించ బడినట్లు, అతడు పది తూముల భూమిని ఆ దేవాలయానికి దానం చేసినట్లు తెలుస్తోంది. అదే శాసనం చెపుతున్న దేమనగా, పాగేశ్వరదేవ, నాగేశ్వరదేవ, మరియు పరివార దేవతలకు వివిధ రకాల సేవలు జరుపబడేవి.

ప్రకాశం జిల్లాలోని త్రిపురాంతకంలోని శాసనం ముఖ్యమైన విశేషాన్ని తెలుపుతోంది. ఈ శాసనం 'శ్రీ విమానం' గురించి వివరంగా వర్ణిస్తోంది.

క్రీ.శ. 1254కి చెందిన శాసనం, త్రిపురాంతకేశ్వరాలయం గురించి వివరంగా వర్ణిస్తోంది. "ఏతత్ శ్రీ విమానం బహుభరణాయుతం" శ్రీ విమానం భరణాలతో, తోరణాలతో, కూటకోష్ఠాలతో మరియు సింహముఖాలతో అలరారుతోంది.

కడపజిల్లాలోని పుష్పగిరిలోని బైద్యనాథ దేవాలయంలో గల ఒక స్తంభం మీద చెక్కబడిన క్రీ.శ. 1255 కి చెందిన శాసనం. హచలేశ్వర, కమలేశ్వర, పల్లవేశ్వర దేవుళ్ల స్థాపన 'మరారరాణి' అయిన 'హచలాంబ' చేత స్థాపించబడినట్లు తెలుస్తోంది. హచలాంబ పేరులో హచలేశ్వర, కాయస్త గంగ సేనాపతి భార్య అయిన కమలాబాయి పేరులో కమలేశ్వర, మరారా రాజైన పల్లవేశ్వర పేరులో పల్లవేశ్వరాలయం నిర్మించబడినట్లు తెలుస్తోంది.

ఇక్కడొక గమనించాల్సిన ముఖ్య విషయమేమనగా, ఈ దేవాలయంలోని మూడు దేవుళ్లు త్రికూట రూపంలో వెలసివున్నారు.

పశ్చిమగోదావరి జిల్లాలోని జుత్తిలోని సోమేశ్వరాలయంలోని మండపంలో గల స్తంభం మీద చెక్కబడిన శాసనం చాలా ఆసక్తికరమైన విషయాలను తెలుపుతోంది. ఈ శాసనం, బండరి కొండపం నాయక మరియు అతని కుమారుడు వీరభద్ర నాయకుడు దుత్తిగలోని వాసుకిరవి సోమేశ్వరాలయంలో 'కరవాల భైరవ మండపం' నిర్మించినట్లు తెలుస్తోంది.

ఈ శాసనం క్రీ.శ. 1177 లో సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజ కాలంలో చెక్కబడినట్లు చెప్పబడింది. ఇంకొక శాసనం సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజచేత కరవాల భైరవ మండపం, విజయాదిత్యుని చేత వాసుకిరవి సోమేశ్వరాలయం దుత్తిగలో నిర్మించ బడినట్లు చెప్పబడింది. ఇక్కడొక విషయం తెలుస్తున్న దేమనగా తూర్పు చాళుక్యరాజైన విజయాదిత్య దేవ చేత మొదట నిర్మించ బడిన కరవాల భైరవ మండపం యొక్క పునర్నిర్మాణం కొండపనాయకు, వీరభద్ర నాయకుల చేత గావించబడింది. పై విషయానికి ఆధారం ఈ క్రింద చెప్పబడిన వాక్యాలు "శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు 1177". ఇది శక సంవత్సరం 1255 కు చెందింది. స్పష్టంగా తెలుస్తున్న విషయమేమనగా కరవాల భైరవ మండపం, మొట్టమొదట తూర్పు చాళుక్య రాజుచేత నిర్మించబడింది. ఆ తర్వాత ఇది కాకతీయకాలంలోని ప్రజల జ్ఞాపకార్థమై నిలచివుంది.

క్రీ.శ. 1258కి చెందిన శాసనం, నల్గొండ జిల్లా అన్నవరం గ్రామంలోగల ఒక స్తంభం మీద చెక్కబడివుంది. ఈ శాసనం, కామేశ్వరాలయం నాగులపాడు గ్రామంలో రేచెరువుల ప్రభువైన కామిరెడ్డిచేత నిర్మించ బడినట్లు చెపుతోంది. ఆ స్వామికి రేచెరువుల ప్రభువు పేరుమీదుగా ఆ పేరు స్థిరపడింది.

క్రీ.శ. 1261 గుంటూరుజిల్లా ఎడవల్లికి చెందిన శాసనం తెలుపుతున్న విషయమేమనగా, స్వయంభు దేవాలయంలో ముఖ మండపాన్ని మహామండలేశ్వర వేదగిరిరాజు తిరుమలదేవరాజు నిర్మించినట్లుగా, ఆ రాజు ఆ దేవాలయానికి కొంత భూమిని దానం చేయడమే గాక ఆ భవనాన్ని నిర్మించిన కొమ్మోజు, గంగజు, గోపజు, అనమజులకు కూడ కొంతభూమిని దానంగా ఇచ్చాడు. శంభుస్వామి దేవాలయంలోని కల్యాణమండపంలోని స్తంభం మీద చెక్కబడి వుందీ శాసనం. ఈ స్వామికి గల అసలు పేరు 'స్వయంభు దేవ' అని కూడ చెపుతోంది.

*

# నిత్యాభిషేకం

తిరుపతి కపిలతీర్థంలోని శ్రీ కపిలేశ్వరస్వామివారికి నిత్యాభిషేకం సేవను నూతనంగా ప్రారంభించారు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు సంవత్సరానికి రు.42-00లు చెల్లించాలి.

శాశ్వతంగా చేయించదలచుకున్న వారు రు. 500 + 42 లు చెల్లించాలి.

సంవత్సరానికి రెండు పర్యాయములు, ఇద్దరు వ్యక్తులను ఈ సేవను దర్శించటానికి అనుమతిస్తారు.

దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయకళ తిరుపతి
# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

దర్శించండి!

కాలము:
ఉదయం 8 గం.
నుండి రాత్రి 8 గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు. 1.00
పిల్లలకు రు. 0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొకట ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





# అన్నమయ్య -- అద్వైతము

శ్రీ ఇవటూరి రామకృష్ణారావు

అన్నమయ్య విశిష్టాద్వైత మతావలంబకుడు. సమగ్ర జీవితమును శ్రీనివాసుని చరణారవిందములకు సమర్పించి, ఆ స్వామి సంకీర్తనమే తనకు 'భుక్తి, శక్తి, రక్తి, ముక్తి' అని వేలాది కీర్తనలలో తన విభుని విభూతి నాలాపించిన ధన్యజీవి. "ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైత"మని త్రిమతములుగా పరిగణించబడునట్టివి వాస్తవమునకు ఆధ్యాత్మిక ప్రగతిలో మూడు సోపానములు. మానసిక ప్రవృత్తిని ఆధారముగ చేసికొని ఈ మతములు ప్రచారములోనికి వచ్చినవి. ద్వైత విశిష్టాద్వైతములు భక్తికి ప్రాధాన్యమునిచ్చిన అద్వైతము జ్ఞానమునకు ప్రాముఖ్యమిచ్చుచున్నది. ధ్యేయమూర్తి యెడల అనన్య అవ్యాజ అనంత ప్రేమను పండించుకొనుటయే భక్తి అనబడుచున్నది. అట్టి భక్తునకు మోక్షమునకు వలయు బుద్ధి యోగమును తానను గ్రహించెదనని (దదామి బుద్ధి యోగం తం) భగవానుడు గీతలో ప్రతిజ్ఞ చేసినాడు. అనగా భక్తి పరాకాష్టను చేరినపుడు 'అద్వైతమే' గోచరించగలదు. ఆ స్థితిలో సాధకుడు పలికిన పలుకులు జ్ఞానదీపికలే. అవి మనకు సందేశములే. ఉపనిషద్వాక్యములే అగును. అగుచో జ్ఞాని తన అనుభవమును వ్యక్తము చేయుటకు ఉపయోగించిన 'దేహేంద్రియ మనోబుద్ధుల'ను ఉపకరణముల ననుసరించి వాటియందు భిన్నత్వము గోచరించుచున్నది. భక్తిని ప్రబోధించు అన్నమయ్య కీర్తనములలో గూడా ఆధ్యాత్మిక సందేశ సంపత్తిని కలిగి యుండుట మనము చూడగలము.

భావములోనా బాహ్యమునందున
గోవింద గోవింద అని గొలువవో
॥మనసా॥

హరియవతారములె అఖిల దేవతలు
హరిలోనివే బ్రహ్మాండంబులు
హరి నామములే అన్ని మంత్రములు
హరి హరి హరి హరి హరి యనవో
॥మనసా॥

విష్ణుని మహిమలె విహిత కర్మములు
విష్ణుని పొగడెడి వేదంబులు
విష్ణు డొక్కడే విశ్వాంత రాత్ముడు
విష్ణువు విష్ణువని వెదకవో మనసా.
॥మనసా॥

అచ్యుతు డితడే ఆదియునంతము
అచ్యుతుడే అసురాంతకుడు
అచ్యుతుడు శ్రీవేంకటాద్రి మీద
అచ్యుత అచ్యుత శరణనవో మనసా.

"సర్వం విష్ణుమయం" అని తన ఆరాధ్య దైవమును సర్వత్రా దర్శించుచు చెప్పిన ఈ కీర్తన భావము సరళము. స్పందించగలట్టి హృదయమున కీ ఒక్క కీర్తన చాలును. పరవశింపచేసి స్వామి కైంకర్యమున కాయత్త పరచగలదు. కానీ ఈ కీర్తన సొగసింతటితో నాగుటలేదు. నిగమ జ్ఞానమును నిక్షిప్త



## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు
ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- ❋ రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- ❋ సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- ❋ రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అని మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- ❋ కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- ❋ రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- ❋ రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు-- ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయటం వలన ఉపయోగం వుండదు.
- ❋ రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- ❋ మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- ❋ సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ❋ ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ❋ ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

సంపాదకులు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి - 517 507

## రచయితలకు గమనిక

'సప్తగిరి'లో సమీక్ష చేయుటకు రచయితలు
తమ గ్రంథాల్ని రెండు ప్రతులుగా పంపవలెను.
లేనిచో సమీక్ష చేయబడవు

'సంపాదకులు'

పరచుకొని గంభీర భావమును కలిగియున్నది. మోహాంధకారమున బడి జాగ్రత్తునందే స్వప్నము గాంచువారల కొకమేలు కొలుపు. ఆవేశోద్రిక్తులై ఉన్మత్తులై సంచరించువారల కొక హెచ్చరిక.

ఈ కీర్తన మనసును సంబోధించుచు సాగినది. "మనేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయా" అనునట్లు సంసార సాగరమున మునగదీయునది మోక్షమును సాధించునది మనస్సే. Man is his mind--మనిషి మనస్సే. ఈ మనస్సె అనుభవముల నపేక్షించు జీవుడు, నేను కర్తను, భోక్తనను అభిమానము పెంచుకొను అహంకారము. ఆచార్యుడందులకే బోధన కుపక్రమించుచున్నాడు. "ఓ! మనసా! భావములోనా బాహ్యాము నందునా గోవిందుని కొలువు" అని ఆదేశించు చున్నాడు. ప్రతివ్యక్తికి బాహ్యాప్రపంచమున తన ప్రవర్తన, అంతరంగమున స్వార్థపు టాలోచలను ద్వివిధ రూపము లుండుట సత్యదూరముకాదు. నిష్పక్షముగా ఆత్మ విమర్శన చేసికొనిన ఈ రూపములు గోచరమగును. ఈ రెండింటికి పొంతన ఏ కొద్ది మందికో కుదురును. అటుల పొంతన లేక పోవుట యే మనిషి యొక్క ద్వంద్వ ప్రవృత్తికి కారణమగుచున్నది (split personality). వీటిని సమన్వయ పరచు ఆవశ్యకతను ఆచార్యుడు చాటుచున్నాడు. ఒక విధముగా పల్లవిలోనే ఆచార్యుడు మానవ వ్యక్తిత్వమును విశ్లేషణ చేసినట్లు తోచుచున్నది.

బాహ్యాప్రపంచమునకు ఒక్కటిగా గోచరించుచున్న మానవ వ్యక్తిత్వము నాలుగు వ్యక్తిత్వముల సంకలన మనవచ్చును. విషయ ప్రపంచముతో సంబంధ మేర్పరచుకొను సాధనము శరీరము. దీనియందు ఇంద్రియము లమరి యున్నవి. దీనికి ఇష్టానిష్టములున్నవి. కావున ఇది యొక వ్యక్తిత్వము. దీనికన్నను సూక్ష్మమై ఇంద్రియములను శాశించుచు వాటిద్వారా తన ఇష్టములను పూరించుకొనుచు ఆవేశమునకు ఉద్రేకమునకు లోనై అలజడులకు గురియగు మనస్సు రెండవ

వ్యక్తిత్వము. దీనికన్నను సూక్ష్మమైనది విచక్షణ చేయునది అగు 'బుద్ధి' మరి యొక వ్యక్తిత్వమనవలెను. దీని విచక్షణ మారుటకు అవకాశమున్నది. వీటన్నింటి కన్నను సూక్ష్మమైనది అపారజ్ఞానముకలది నిత్యానిత్యముల నెరిగినదియగు ఆత్మ (ఆధ్యాత్మిక వ్యక్తిత్వము) నాల్గవది. ప్రత్యేకాభిరుచులు కలిగియున్న ఈ వ్యక్తిత్వపు పొరలను ఏక కాలమున సంతృప్తిపరచ గలుగు అనుభవములు కద్దు. పర్యవసానము అంతరంగమున ఘర్షణ, అశాంతి దుఃఖమగుచున్నది. ఈ సమస్యకు పరిష్కారము వ్యక్తిత్వపు పొరల నడుమ సమైక్యతను సాధించుటయే. అది స్థూలమగు వ్యక్తిత్వము సూక్ష్మమగు వ్యక్తిత్వమునకు లోబడి యుండుటవలననే సాధ్యము. అది మన అనుభవములోని విషయమే. మానసికానందము కొరకు శరీరము శ్రమనంగీకరించుటయు, విచక్షణాయుతమగు ఆలోచనల ఆచరణలో నిడుటకు మానసికోద్రేకములు నిగ్రహింపబడుటయు మన మెరిగినవే. కాని ఇవి ఎల్లవేళలా జరుగుటలేదు. కొండొకచో శరీరమును మనస్సును; మనస్సు బుద్ధిని నిర్లక్షించుట సత్యదూరములు గావు. కావున స్థూలమగు వ్యక్తిత్వము సూక్ష్మమగు వ్యక్తిత్వమునకు లోబడి యుండునటుల సాధించవలెను. అనగా సూక్ష్మాతి సూక్ష్మమైన ఆధ్యాత్మిక వ్యక్తిత్వమునకు దేహ మనో బుద్ధులు లోబడియుండవలెను. ఈ ఆధ్యాత్మిక వ్యక్తిత్వమునే ఆచార్యుడు గోవిందుడనినాడు. శ్రీ శంకరాచార్యులు గోవింద శబ్దమును నిర్వచించుచు 'గా' అనగా 'వేదము' లేదా 'జ్ఞానము'. గోవిందుడనగా "జ్ఞానమును ప్రకాశింపజేయువాడు" అని ఉటంకించిరి. కావున అంతరంగమున ఎల్లవేళలా బోధించుచున్న అంతరాత్మయే గోవించ వాచ్యార్థత కలిగియున్నది. ఈ సత్యమునే కీర్తనకు పల్లవిగా ఆచార్యుడు చెప్పినాడు. అటులని ఈ పల్లవిని కీర్తనకు మాత్రమే పరిమితము చేయక జీవన గీతానికి పల్లవిగా మలచమను ఆదేశమున్నది. గోవిందుని కొలువ మనటలో గోవిందుని ఆధిక్యతకు తలయొగ్గమని స్ఫురించుచున్నది కదా!



బోధించినంత మాత్రమున చాలదు. దానిననుభవములోనికి తెచ్చుకొను ఉపాయము లేక సాధన కూడా తెలుప వలసిన బాధ్యత గురువుకున్నది. అందులకే మొదటి చరణములోనే "హరి యనవో మనసా!" అని అనవలసి వచ్చెను. అనగా నిత్యము హరినామస్మరణ చేయుమని బాహ్యార్థము. హరితి ఇతి హరి. అనగా సర్వము హరించువాడు హరి. కావున "హరి యనవో మనసా!" అనుటలో మనోనాశము కావలెనని ఆదేశమున్నది. ఈ మనస్సే అహంకారమని తొలుతనే చెప్పబడినది. కావున కర్తను, భోక్తను అని అభిమానించు ఈ మనస్సు (అహంకారము) 'హరి' అనవలెను.

ఈ మనస్సు వేలవేల కోర్కెలకు నిలయమై ఇంద్రియములను ప్రేరేపించుచు పరస్పర సహకారమున కామమును పూరించుకొను చున్నది. వాస్తవమునకు ఇంద్రియములు ఆత్మ చైతన్యశక్తివలన ప్రకాశించుచున్నవి. కావున ఇంద్రియములు ఆత్మకు లోబడి యున్నవి. చైతన్యము తిరోధానము చెందిన ఇంద్రియములు జడములగుచున్నవి కదా! అందులకే "హరి యవతారములె అఖిల దేవత"లని నాడు. ఇచ్చట దేవత అను పదము ఇంద్రియములకు విశేషార్థమున వాడ బడినది. దివ్-ద్యోతనే అను ధాతువు నుండి పుట్టినది దేవ శబ్దము. అనగా ప్రకాశింపజేయునవి. మనకనుభవములను ప్రకాశింపజేయునవి ఇంద్రియములే. బధిరునకు సంగీతానుభవము కలుగుటలేదు. కావున దేవ శబ్దము ఇంద్రియాన్వితమన వచ్చును. ఈ ఇంద్రియములన్నియు హరి అవతారములే. అనగా ఇవన్నియు 'హరి' అను ఆత్మ చైతన్యమువలన నియమించబడినవే. కావున ఆత్మ చైత్యము తిరోధానమున బాహ్య ఇంద్రియములన్నియు జడములై నిస్తేజములై 'హరి' అనుచున్నవి (నాశనమగుచున్నవి). కావున బాహ్యేంద్రియములద్వారా పొందు అనుభవము, ఆనందము పరిమితమై

నది. "బాహ్యేంద్రియములేకాదు, అస్వాప్నికావస్థలతో అనుభవములందించు సూక్ష్మమైన అంతరేంద్రియములు గూడా 'హరి' లోబడి ఉన్నవి" అని "హరిలోనివే బ్రహ్మాండముల"ని నాడు.

కల్పాదియందు ఈ విశ్వమంతయును అండాకారముగ నుండునని ఆర్యులందురు. అది "బృహత్" (చాల పెద్దది) అగుటచే బ్రహ్మాండమనబడుచున్నది. కాని అన్నమయ్య బ్రహ్మాండములనినాడు. ఎన్నో విశ్వములు కలవని పెద్దలు ధృవపరచుట జరిగినది. ప్రళయకాలమందు సర్వత్ర నిండిన చైతన్యము తిరోధానము చెందినపుడు స్థూలమగు జీవరాశులు సంస్కారములుగా మిగిలి సూక్ష్మ రూపులై యుండును. వ్యష్టిలో దీనిని పోల్చి చెప్పవలసివచ్చిన : జాగ్రత్స్వప్న జగత్తులలో మనము దర్శించు దారాపుత్రాదులు, వారితో మన సంబంధము మొత్తమంతయు వాసనా రూపమున సుషుప్తిలో మనలోనే యున్నవి. ఆ స్థితిలో అనుభవములు; అనుభవించెడి ప్రపంచము రెండునులేవు. వాసనా ప్రబోధనమున గాఢ నిద్రనుండి మేల్కొను మనము తిరిగి మన అనుభవ క్షేత్రములను విస్తరింప జేసుకొనుచున్నాము. జాగ్రత్తులో దర్శించు స్థూలప్రపంచము, స్వప్నములో కల్పించబడిన సూక్ష్మ ప్రపంచములు కూడా వేర్వేరుగా నున్నవి. ఇవన్నియును 'బ్రహ్మాండములే. అదియునుగాక అందరి జీవుల వాసన లొక్కటిగాలేవు. వారి వారి వాసనల ననుసరించి వారి అనుభవ క్షేత్రములు కల్పించబడుచున్నవి. ఇవన్నియు సుషుప్తిలో లయించబడి అవ్యక్తములై అండమువలెనున్నవి. ఇట్లు ఒకే సూర్యుడు ఒక్కొక్కరికి వేరు వేరుగా తోచుచు అనేక సూర్యులుగా చెప్పబడినట్లు సమష్టి బ్రహ్మాండము వ్యష్టి దృష్ట్యా బ్రహ్మాండములుగా వర్ణించబడినవి. కావున వ్యక్తిగా మనము సృష్టించుకొనిన స్థూలప్రపంచము, అంతరంగమునగల సూక్ష్మ ప్రపంచము ప్రళయకాలమున 'హరి' అనబడుచున్నవి. కావున అవి హరిలోనివే అనగా అవికూడా నాశనము గునట్టివే. అంతియేకాదు వయస్సుతోపాటు మనస్సు పెరుగుచూ పాత సంకల్పములను నశింపజేసికొని క్రొత్తవి సృష్టించుకొనుచున్నది. కావున సంకల్ప వికల్పము లన్నియు అనిత్యములే. ఇవన్నియు లయించిన వెనుక ఏది యున్నచో అదియే నిత్యమని తెలియవలెను.

ఇట్లు బాహ్యాంతర (స్వాప్నిక) ప్రపంచముల నిత్యతను గ్రహించి, వాటికై వెంపరించుటమాని అంతరంగమున నిజతత్త్వ మెరుగుటకు నాంది పలుకవలెను. అనగా ధ్యేయ రహితముగా చెలరేగు ఆలోచనా ప్రవాహము నిర్దేశించబడి (ఆత్మోపలబ్ధికై) నిర్దిష్టమైన మార్గమున పయనింపవలెను. ఈ ప్రక్రియే జపయోగము. ఈ యోగమున సాధకుడు తన మనోప్రవృత్తి ననుసరించి ఏదైన ఒక మంత్రమును గైకొని, దాని అధిష్టాన దేవతను ధ్యానించుచు మంత్ర మననము గావించవలెను. అధిష్టానదేవత సాక్షాత్కారము దీనిఫలము. అప్పుడే మోక్షమునకు వలయు జ్ఞానము బోధింపబడును. అనగా మంత్ర మననము గావించు సాధకుని ఆలోచనా ప్రవాహము పలుచబడి క్షీణించుచున్నప్పుడు సాధకుని దృష్టి మంత్రమునకు వెనుకగా నున్న నిశ్శబ్దముపై కేంద్రీకృతమగును. ఆ దృష్టి సాధకునికి మౌనస్థితిని కలిగించును. ఆలోచనలన్నియు స్తాంభించిన ఆ స్థితియే ధ్యాన స్థితి. అది ప్రయత్న పూర్వకముగా వచ్చెడి స్థితికాదు. కాని అకుంఠిత దీక్షతో జపయోగమున ఆ స్థితికి వలయు వాతావరణము కల్పించబడును. ఒక విధముగా జపయోగమునకు పరాకాష్ట, ఫలము, పర్యవసానము ఆ స్థితియే. సాధకుడే మంత్రము గైకొనినను చేరవలసిన, చేరిన గమ్య మా 'సమాధి' (ధ్యాన) స్థితియే. ఆ స్థితిలో మంత్ర మనన మాగుటచే నది అన్ని మంత్రములు 'హరి' అను స్థితి. ఆ స్థితినే ఆత్మతత్త్వ దర్శనము కాగలదు. అది సర్వము లయించు సుషుప్త్యావస్థ వంటిదికాదు. "సుషుప్తిలో జాగ్రదావస్థ" అదియే వైకుంఠము "ఆ నిశ్శబ్ద బ్రహ్మమే " అన్నమయ్య పేర్కొన్నహరి. ఎవరు ఏ మంత్రముతో ధ్యానించినను అది హరికి పిలుపే యగును. అందులకే "హరి నామములే అన్ని మంత్రముల"ని మూడవ పాదము ముగించినాడు. కావున ఓ మనసా నీవు నీవుగా మరణించి నిజతత్త్వమగు నిశ్శబ్ద బ్రహ్మముగా జీవించుమని మొదటి చరణము ముగించినాడు.

అగుచో "ప్రాపంచిక దృష్టితోనున్న నేను నా అహంకారమును లయమొనరించుటకు ఎచ్చట దేనితో ప్రారంభించవలె' 'నను దానికి బదులు రెండవ చరణ మందించు చున్నాడు. విష్ణుని వెదకమని రెండవ చరణమున నున్నది. విష్ణువు అను పదము 'విష్' అను ధాతువునుండి వచ్చినది. అనగా వ్యాపించునది. విష్ణువనగా సర్వత్రా వ్యాపించి యున్నవాడు. అంతట ఉన్నవాడిని వెదుకుట ఏమి? వాస్తవమునకు మన కత్యంత సన్నిహితముగ నున్నవే దృష్టిపథమునకు దూరముగ నుండును. అదియునుగాక వెదుకునపుడు మనదృష్టి నలువైపులా ప్రసరించును. అనగా 'విశాల దృష్టి నలవరచుకొనుమను' సందేశము స్ఫురించుచున్నది. సంకుచిత దృష్టిని వదలుటయే విష్ణు నన్వేషించుట. ఈ అన్వేషణ బాహ్యాంతరములు రెండింటియందును జరుగవలెను. బాహ్యముగా మనము చేయు కర్మలు స్వార్థపూరితములు. సమాజములో మన మెదుర్కొను సమస్యలకు మూలము స్వార్థమే. సమస్య 'నాసమస్య' అనుటకన్న 'మన సమస్య' అనుకొనిన పెక్కు సమస్యలకు పరిష్కారములు సులభతరములగును. కారణము ఆ సమస్య నా యొక్క శ్రేయస్సునకే కాక పదిమంది శ్రేయస్సును ఆశించి పరిష్కరించబడును. ఈ సత్యమునే ఆచార్యుడు "విష్ణుని మహిమలె విహిత కర్మముల"ని ఆలపించినాడు.

భారతీయ సంస్కృతిలో కుటుంబపు కట్టుబాట్లు వ్యక్తిని స్వార్థమునుండి ఉద్ధరించుటకే నిర్ణయించబడినవి. గృహ యజమాని తన సంపాదనను తానొక్కడే అనుభవించక, తనపై ఆధారపడువారిని పోషించుటకును, అతిథి అభ్యాగతులను ఆదరించుటకు నిస్స

హాయులకొరకు వినియోగించవలెను. ఇవ న్నియును మనకు విధించబడిన (విహిత) కర్మలు. వీటిప్రయోజనమున వ్యక్తి తన ప్రేమను పదిమందికి పంచుట అలవరచు కొనవలెను. కాని వాస్తవము ఇందులకు భిన్నముగా, వ్యక్తి ఎదుటవారినుండి ప్రేమను యాచించు స్థితిలో నున్నాడు. ఈ పతనావస్థ నుండి ఉద్ధరించుకొను అవసరమును ఆచా ర్యుడు బోధించుచున్నాడు. మరియు వాసనా యుతుడైన జీవుడు కర్మలనుండి తప్పించు కొనలేడు. ఒక విధముగా అవి విహితకర్మలు. ఈ కర్మలు స్వార్థ బుద్ధితో ప్రతిఫలాపేక్షతో చేయుచున్న వగుటచే జీవునికి బంధము లగుచున్నవి. అట్లుకాకుండ ఉండవలెనన్న ప్రతిఫలాపేక్ష లేక కర్మల నాచరించవలెను. "ప్రస్తుతావస్థలో అది సాధ్యము కాకున్నది. కావున నీవు కోరు ప్రతిఫలము పది మందికీ ఉపయోగపడునటులైనను కర్మల నాచరించ" మని కర్మయోగ కీలకమును బోధించినాడు. దాని పర్యవసానమున చేయు కర్మలకు సత్ఫలితములు పొందవచ్చును. పది మంది మేలునకై ఒనరించు కార్యమునకు పలువైపు లనుండి సహాయము లభింపగలదు.

ఇట్టి కర్మాచరణయే 'యజ్ఞ' మగునని గీతలో భగవానుడు వక్కాణించినాడు. యజ్ఞ భావముతో కర్మల నాచరించువానికి సమా జములో గౌరవము కలుగును. సమాజమే తమ సంపదను వాని ముందుంచుటకు వెను దీయదు. అట్టివాడే మహాత్ముడు. కావున స్వార్థ రాహిత్యముతో చేయు కర్మలు మహి మాన్వితములు. మహిమ అనగా ఐశ్వర్యము. బాహ్యముగ కనిపించె సంపద. అష్టైశ్వర్యము లలో మొదటి మహిమ. ఈ భావమును స్ఫురింపజేయుచు "విష్ణుని మహిమలె విహి తకర్మముల"నినాడు.

ఈ విధముగా విశాల దృష్టినలవరచుకొ నిన సాధకుడు వ్యష్టినుండి సమష్టికి ఎదు గుట ప్రారంభించును. మనోవైశాల్యము ఎదిగినంతమేరకు స్వార్థపుటాలోచనలు పలు చబడి మనోశాంతి పెరుగుచుండును. క్రమ ముగ లాభాలాభములకు, జయాపజయము లకు, రాగ ద్వేషముల కతీతుడై అధ్యయనము చేసిన శాస్త్ర జ్ఞానము ననుభవములోనికి తెచ్చుకొనును. ఆ జ్ఞానమే విద్య వేదము -- అదే ఆనంద దాయకము. ఇది విష్ణుతత్వము, ఇది మనో విశాలతను కలిగినదని గుర్తిం చుచున్నాడు. ఈ భావమే "విష్ణుని పొగడే వేదమ"న బడినది. (పొగడ్త ఆనంద దాయ కము). ఇటుల పరిపూర్ణ విశాల దృష్టిలో 'తాను' "తన కన్నా భిన్నుడు అను ద్వంద్వ భావన తొలగిపోవుచున్నది. అంతటా ఏకత్వమే గోచరించు స్థితి అది. అన్నీ తనరూపములే. అన్నిరూపములు తనలో నున్నవే అను అనుభూతిని వర్ణించుచు, విష్ణు డొక్కడే విశ్వాంతరాత్ముడ"ని పొగడినాడు. తెలిసదేమన సాధకుడు సంఘమును వీడక సామాజిక జీవనము సాగించుచు తన దృక్ప థములో మార్పు తెచ్చుకొనిన అద్వైతస్థితికి చేరగలడని రెండవ చరణములో బోధించు చున్నాడు.

ఇట్లు దేహేంద్రియ మనోబుద్ధులకు భిన్న ముగా నున్న 'నేను' (ఆత్మ) స్థితిని చేరిన పిదప మరల అహంకారము (అనగా దేహ మనో బుద్ధుల తాదాత్మ్యము) నన్నావహిం చునా? ఈ ప్రపంచములో అట్టి జ్ఞాని జీవించునా? అనెడు ప్రశ్నలకు మూడవ చరణము బదులు పలుకుచున్నది.

ఆత్మ దర్శనము చేసిన జ్ఞాని పతనమగు ప్రసక్తిలేదని తెలుపుచూ "ఇతడే అచ్యుతుడు" అని వచించుచున్నాడు.

'అచ్యుత' అనగా నాశనములేనిది లేదా తానున్న స్థితినుండి జారనిదను భావము. కావున ఆ స్థితిని చేరిన జ్ఞాని మరల తిరోగ మించడు. అతనికి ఉపకరణములు (దేహము, మనస్సు, బుద్ధి) ఉన్నవి. గాని వాటి తాదా త్మ్యము లేదు. పూర్తిగా దైవత్వమును పొందినవాడు. అతడు జాగ్రదావస్థలోనున్న విరాట్ పురుషుడు. సమష్టి మనస్సు ద్వారా చెప్పబడిన బ్రహ్మ సృష్టికర్త. హిరణ్యగర్భుడు



సమష్టి కారణ శరీరముతో చెప్పవలెనన్న ఈశ్వరుడు. సృష్టికి పూర్వము, సృష్టిలయిం చిన పిదప ఉన్నట్టి ఉనికి (existence) కావున అతడే ఆది, అతడే అంతము.

సృష్టిగావించుటకు గుణము లవసరము. కావున సృష్టి దృష్ట్యా తిలకించిన ఈశ్వరుడు మాయాన్వితుడు. కాని మాయకు లోనగు వాడు కాదు. అది పూర్తిగా సత్వమాయ. అందులకే జ్ఞానమయుడై సహజానంద స్థితిని యుండగలడు. ఆ యోగి సశరీరుడైనను ఈ ప్రపంచమున సంచరించుచున్నను అజ్ఞానాం ధకారమున పడద్రోయు రజస్తమో గుణము లను నిగ్రహించగల శక్తిమంతుడు. ఆవరణ నిక్షేపదోషములకు గురి కాకుండును. ఈ దోషములు రజస్తమోగుణముల జనితములు. ఈ గుణద్వయమే అసురులు. కావున అతడు

అసురాంతకుడే. అట్టి జ్ఞాని తన స్వరూపము తెలిసినవాడు. ఉపాధి సహితుడైన 'ఆత్మ' అని రహితమైన 'పరమాత్మ' తానేనని ఎరుగు ప్రజ్ఞావంతుడు. ఈ పరమాత్మయే 'వేంకటాద్రి మీద విదే' అనగా వేంకటాద్రి నిలయుడైన వేంకటేశ్వరుడు సచ్చిదానందరూపుడు.

వేం అనగా పాపములు. వాటిని కట కట పెట్టునది 'వేంకట'. మనలో నున్న వాసనలే వాస్తవమునకు పాపములనబడును. అవి సద్వాసనలైనను, దుర్వాసనలైనను, ఆత్మ జ్ఞానమున కడ్డు పడునట్టివి. కావున అవి పాప ములే. వాసనలు అజ్ఞాన జనితములు కావున వాటిని కటకట పరచునది జ్ఞానమే. అది నిశ్చలమగునట్టిదియును మహోన్నతమగునట్టి జ్ఞానము. ఈ భావము 'అద్రి' అను శబ్దమున స్ఫురించుచున్నది. కావున వాసనా రాహిత్యము చేయు జ్ఞాన శిఖరమే వేంకటాద్రి. ఆ శిఖరపు టంచున బ్రహ్మానంద స్వరూపమే వేంకటేశ్వరుడు. అదే "వేంకటాద్రి మీద విదే" కావున ఆ బ్రహ్మానందమునే ఆశ్రయించవలెను. ఆ అచ్యుత స్థితినే చేరవలెను. అదేగమ్యము. అది తక్క మిగిలిన ప్రపంచపు టానంద మంతయూ మిధ్యయే. కావున ఆ బ్రహ్మానందాను భూతికే శరణుచేయవలెను. మానవునిగా జన్మించినందులకు సాధించవల సినది ఆస్థియే. అదే జీవితమున కర్థము పరమార్థమగును.

అందులకే "భావములోనా బాహ్యము నందున గోవింద గోవింద అని కొలువ" మన్న ఆచార్యుని ఆదేశమే మనకు శరణ్యము.





# వడ్డాది శ్రీ వేంకటేశ్వరాలయం

శ్రీ మోదేకుర్తి సత్యనారాయణ



కలియుగదైవంగా పేరుగాంచిన శ్రీ వేంకటేశ్వరస్వామి యొక్క మహిమలు ఎన్నో.... ఎన్నెన్నో.... మనరాష్ట్రంలో ఆ స్వామి యొక్క ఆలయాలు ఎన్నో కలవు. అటువంటి వాటిలో-- విశాఖ జిల్లాలోని 'వడ్డాది శ్రీ వేంకటేశ్వరాలయం' ఒకటిగా ప్రసిద్ధి చెందింది. విశాఖపట్నానికి సుమారు 50 కిలోమీటర్ల దూరంలో, అనకాపల్లి నుండి పాడేరు వెళ్ళే మార్గంలో ఈ వడ్డాది గ్రామం నెలకొనివుంది. చుట్టుప్రక్కల ప్రాంతవాసులచే కొలువబడుతూ, భక్తుల కోర్కెలు తీర్చే స్వామిగా కొలువబడుతున్నాడు.

## స్థలపురాణం-స్థానిక కథనం

స్థానికుల కథనం ప్రకారం ఈ స్వామి ఇక్కడ వెలసి సుమారు 150 సంవత్సరాలు కావస్తోంది. అప్పట్లో ఒక రాజయోగి ఎక్కడినుండో ఈ వడ్డాది గ్రామం వచ్చి అక్కడి కొండపై నివాసముండేవాడు. అతనికి దూరంగా జరుగుతున్న దృశ్యాలను కళ్ళకు కట్టినట్లు వివరించడం వంటి అద్భుత శక్తులుండేవి. గ్రామ పెద్దలందరూ ఆ రాజయోగిని ఎంతో గౌరవించేవారు. ఒకనాడా రాజయోగి, గ్రామంలోని పెద్దలను పిలిచి, తానుంటున్న కొండపై ఒకచోట చూపిట్టి, అక్కడ లోతుగా త్రవ్వించమని చెప్పగా, వారా విధంగా త్రవ్వించారు. అంత మూడు సాలగ్రామ శిలలు కనబడ్డాయి.

ఆ మూడింటిలో ఒకటి శ్రీ వేంకటేశ్వరస్వామిదని, మిగిలిన రెండూ శ్రీదేవి-భూదేవులని, వాటిని ఆ గోతిలోనే వుంచి పూడ్చేసి, పైన వేంకటేశ్వరస్వామిని ప్రతిష్ఠించమని చెప్పి ఆ రాజయోగి వెళ్ళిపోయాడు. అంత గ్రామ పెద్దలంతా, శ్రీదేవి-భూదేవి సమేతుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహాన్ని తయారుచేయించి, ఆ కొండపై శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించి, తాటాకులపాకను వేయించారు.

కొన్ని సంవత్సరాలు గడచిన తరువాత గ్రామంలో ధనవంతుడైన శ్రీ దొండా నల్ల అప్పన్నదొర గారి కుమారుడు భగవంతు



## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- మాంసాహారాన్ని భుజించకండి.
- ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- పొగత్రాగకండి.
- వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయుటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజే.

లయ్య గ్రామస్థుల సహకారంతో, ఆ కొండపై చక్కని ఆలయాన్ని నిర్మించారు. ఈ ఆలయ నిర్మాణానికి బొబ్బిలినుండి నిపుణులైన శిల్పులను రప్పించారట.

మెట్ల మార్గం ద్వారా కొండపైకి వెళ్ళగానే చిన్నరాతిపై ఒక మనిషి విగ్రహం కనబడుతుంది. వడ్డాది గ్రామానికి చెందిన ఒక భక్తుడు వేంకటేశ్వరస్వామిపట్ల భక్తి శ్రద్ధలు కలిగి, స్వామి దీపారాధనకై ప్రతి రోజూ నూనెను ఇచ్చేవాడట. ప్రతి క్షణం స్వామి నామస్మరణే చేస్తూ, ఆలయంవద్దే ఎక్కువగా గడిపేవాడట. అతని మరణానంతరం అతని గుర్తుగా కొండపై ముందుగా అతని విగ్రహాన్ని రాతితో మలిచారని స్థానికుల కథనం.

### స్వామివారి కళ్యాణం

ప్రతిసంవత్సరం ఫాల్గుణ శుద్ధ ఏకాదశి (మార్చి) రోజున రాత్రి శ్రీ స్వామివారి కల్యాణం వైభవోపేతంగా జరుగుతుంది. ఈ ఉత్సవాలు అయిదు రోజులపాటు కన్నులపండువుగా జరుగుతాయి. వివిధ సాంస్కృతిక కార్యక్రమాలతోబాటు, కనులు మిరుమిట్లు గొలిపే విద్యుత్ దీపాల అలంకరణ ఈ ఉత్సవాలకు ఆకర్షణగా పేర్కొనాలి. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలనుంచి భక్తులు వేల సంఖ్యలో ఈ ఉత్సవాలను చూడటానికి వస్తారు.

ప్రస్తుతం ఈ ఆలయం దేవాదాయశాఖ వారి ఆధీనంలో వుంది. సుమారు అరవై ఎకరాల స్థిరాస్థి స్వామికి వున్నట్లు తెలుస్తోంది. చుట్టూ ఎత్తైన కొండలతో, పచ్చ పచ్చని పచ్చిక బైళ్ళతో చూడ ముచ్చట గొలిపే రీతిలో వడ్డాది శ్రీ వేంకటేశ్వరాలయం పర్యాటకుల్ని కూడా ఎంతో ఆకర్షిస్తుంది. విశాఖజిల్లాలోని దర్శనీయ స్థలాల్లో 'వడ్డాది శ్రీ వేంకటేశ్వరస్వామి' వారి ఆలయం కూడా ప్రముఖ స్థానాన్ని సంపాదించుకుని, దినదినాభివృద్ధి చెందుతోంది.



# శ్రీలక్ష్మీనరసింహస్వామి దేవాలయం, కదిరి

శ్రీ ఎ. మురళీకృష్ణ

మత్స్య కూర్మో వరాహ శ్చ
నరసింహో థ వామనః
రామో రామ శ్చ కృష్ణ శ్చ
బుద్ధః కల్కి చ తే దశ.

దుష్టశిక్షణ, శిష్ట రక్షణకై శ్రీమన్నారాయణుడు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, రామ, పరుశరామ, కృష్ణ, బుద్ధ, కల్కి అవతారాలు దాల్చినాడు. ఈ అన్ని అవతారాలలో అద్భుతమైన అవతారం నరసింహావతారం. ఈ అవతారం మానవ జాతి వికాసానికి ఒక సంకేతం. ఇటువంటి ఈ నరసింహస్వామికి నిలయాలైన ఆలయాలు రాష్ట్ర వ్యాపితంగా అహోబిళం (కర్నూలు), సింహాచలము (విశాఖపట్నం), వేదాద్రి (కృష్ణా), అంతర్వేది (తూర్పు గోదావరి) మొదలైన చోట్ల వున్నాయి. కానీ వీటితో పాటుగా ఖ్యాతిని గడించిన మరో నరసింహాలయం అనంతపురం జిల్లా కదిరి పట్టణములో వున్నది. ఈ దేవాలయం కదిరి లక్ష్మీనరసింహస్వామి దేవాలయముగా ప్రఖ్యాతి పొందినది. కదిరి, అనంతపురం నుండి 90 కి.మీ. దూరములో ధర్మవరం, పాకాల రైల్వే లైనులో వున్నది. అపూర్వ శిల్ప సంపదకు, క్షేత్ర మహిమకు ఈ ఆలయం పెట్టింది పేరు. కర్నాటక, మహారాష్ట్ర, తమిళనాడుల నుండి కూడా ఈ క్షేత్ర దర్శనార్థమై భక్తులు తండోపతండములుగా రావడం జరుగుతోంది.

## కదిరి నామ పుట్టుక

'పేరులోనే ఉన్నది పెన్నిధి' కానీ కదిరి పద పుట్టుక గూర్చి స్పష్టమైన వివరణ మనకు శాసనాలలో గాని, సమకాలీన సాహిత్యములో గాని లభించుట లేదు. 'ఖ' అంటే విష్ణు పాదమని 'అద్రి' అనగా కొండ అని అర్థము. కనుక కదిరి అనగా విష్ణుపాదం మోపబడిన పర్వతము అని అనవచ్చును. ఇక ప్రాచీన కాలములో ఇక్కడ ఖదిర వృక్ష సముదాయం వుండేదని, ఈ వృక్ష మూలములోనే స్వామి వారి మూలవిగ్రహం లభించిందని, ఫలితంగా ఈ 'ఖదిర' కాలక్రమేణ కదిరి అయ్యిందని తెలుస్తున్నది. ఈ ప్రాంతము చాలా కాలం మహమ్మదీయుల ఏలుబడిలో వుండినది. ఉర్దూలో 'ఖాధిర్' అనగా బలశాలి లేదా ధైర్యవంతుడు అని అర్థం. ఈ ఖాదిరే కాలక్రమేణ ఖాద్రి, కదిరి అయిందని చరిత్రకారులు భావిస్తున్నారు. సాహిత్యములో ముఖ్యంగా క్రీ.శ. 7వ శతాబ్దపు రెండవ అర్థ భాగంలో ఈ ప్రాంతాన్ని పరిపాలించిన కదిరీపతి రచించిన 'శుకసప్తతి' అను గ్రంథములో కూడా కదిరి అనే నామమే మనకు కన్పిస్తుంది. ఇక శాసనాలు కూడా ఈ పట్టణాన్ని కదిరి అనే పేర్కొంటున్నాయి.






## దేవాలయ శాసనాలు

విజయనగర చక్రవర్తుల పరిపాలనా కాలానికి చెందిన అనేక శాసనాలు తెలుగు, సంస్కృతం, కన్నడ భాషలలో లభిస్తున్నాయి. ఈ శాసనాల వలన అనేక ఆసక్తికరమైన విషయాలు తెలుస్తున్నవి. లభించిన శాసనాలలో అతి ప్రాచీన శాసనం (522 ఆఫ్ 1906) శాలివాహన శకం 1274కు అనగా క్రీ.శ. 1352 నాటికి చెందినది. వీరబుక్కరాయలు, ద్వారసముద్రం, పెనుగొండలను పరిపాలిస్తుండగా అతని సామంతుడగు వెలినాయకుడు అవుబల దేవాలయం నిర్మించినట్లుగా



ఈ శాసనం చెపుతున్నది. ఈ శాసనం దక్షిణ గోపురం వద్ద లభించింది. ఇక్కడ పేర్కొన్న 'అవుబల' నరసింహస్వామి కున్న మరొక పేరుగా చెప్పవచ్చును. ఇక్కడే లభించిన ఇంకొక శాసనం (1353 క్రీ.శ.) రెండవ కుమార కంపన వద్ద పనిచేయు 'గోపన్న' అను అధికారి ఆభరణాలను దానం చేసిన సందర్భములో రచించబడినది. శ్లేషాలంకారములో ఈ శాసనాన్ని ప్రధాని 'సోవప్ప' రచించినట్లు తెలుస్తున్నది. ఇది సంస్కృత, కన్నడ భాషలలో వున్నది. మరొక ముఖ్యమైన శాసనం (క్రీ.శ. 1417, 526 ఆఫ్ 1906), మొదటి దేవరాయలు తన పరిపాలనా కాలములో ఈ దేవాలయాన్ని సందర్శించి మహామంటపములో కొలువు తీరి వివిధ కులాలమధ్య ఏర్పడిన వివాదాలను పరిష్కరించడమే కాక, హరిజనులకు దేవాలయ ప్రవేశపు హక్కున్ను గూడా ఇచ్చినట్లు తెలుపుతున్నది. క్రీ.శ. 1458 నాటి ఇంకొక శాసనం కదిరిలోని రామానుజకూటానికి ఒక దాత కొంత భూమిని దానం చేసినట్లు తెలుపుతున్నది. రామానుజకూటం అంటే ఉచిత భోజనాన్ని సమకూర్చే సత్రం. ఇదే విధంగా దీపస్థంభాన్ని గూర్చి మరొక శాసనం వివరిస్తున్నది. 1529లో తాడిపత్రి (అనంతపురం.జిల్లా) నుండి వచ్చిన ఒక వర్తకుడు నరసింహస్వామిని దర్శించినట్లుగా 1000 స్థంభాల మండపములో లభించిన ఇంకొక శాసనం తెలుపుచున్నది. లభించిన వాటిలో చివరి శాసనం (525 ఆఫ్ 1906) 1529 ఏప్రిల్ 29 నాటిది. కృష్ణదేవరాయల కాలములో ఈ రాజు బంధువు వెంకట నాయుడు కొద్ది భూమిని నరసింహస్వామికి దానం చేసినట్లుగా ఈ శాసనం వివరిస్తున్నది.

పై విధంగా శాసనాలు అనేక అమూల్య రాజకీయ, సాంఘిక పరిస్థితులతో పాటుగా దేవాలయ చరిత్రను కూడా చక్కగా వివరిస్తున్నాయి. మరొక ముఖ్య విషయం ఏమంటే విజయనగర రాజుల కాలానికి నరసింహస్వామి దేవాలయం బాగా ప్రసిద్ధిలో వున్నట్లుగా ఈ శాసనాలు నిరూపిస్తున్నాయి.

ముందుగా చెప్పుకొన్నట్లు, 'కదిరీపతి' తన 'శుకసప్తతి'లో కదిరి బ్రహ్మోత్సవాలను గూర్చి ఎంతో విపులంగా వివరించినాడు. కదిరీపతి 17వ శతాబ్దములో (2వ అర్ధభాగంలో) ఈ ప్రాంతాన్ని పరిపాలించినాడు. పద కవితా పితా మహుడు తాళ్లపాక అన్నమయ్య కూడా ఈ క్షేత్రాన్ని దర్శించి పారవశ్యముతో కదిరి నరసింహుని గూర్చి కొన్ని కీర్తనలను పాడినట్లు తెలుస్తున్నది. ఈ ఆలయములో పూజలు వైఖానస ఆగమ పద్ధతిలో జరుగుతాయి. నిత్య, వార, విశేషోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి. ఇక్కడ ప్రతి సంవత్సరం ఫిబ్రవరి-మార్చి మాసాలలో ఫాల్గుణ శుద్ధ పాడ్యమి నుండి పదిరోజుల పాటు బ్రహ్మోత్సవాలు మహా వైభవంగా జరుగుతాయి. ఎన్నో లక్షలమంది భక్తులు ఈ బ్రహ్మోత్సవాలకు హాజరవుతారు. ప్రతిరోజు ఒక్కొక్క వాహనంపై స్వామి వారిని వివిధ పుష్పమాలాలంకృతుడిని చేసి పట్టణవీధులలో పూరేగిస్తారు. ఇక రథోత్సవం నాడు ఉత్సవ మూర్తి మీద మిరియాలు, దవనం చల్లుతారు. క్రింద బడ్డ మిరియాలను ఏరుకొని తింటే

దీర్ఘరోగాలు నయం అవుతాయన్న విశ్వాసం వీరికి వుంది.

## ఆలయ నిర్మాణ పద్ధతి

శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయం 500 చదరపు అడుగుల విస్తీర్ణములో చతురస్రాకారంలో నిర్మింపబడివుంది. చుట్టూ ఎత్తైన ప్రహరీ గోడలతోనూ, నాలుగువైపుల నాలుగు ప్రవేశ గోపురాలతోనూ అత్యంత ఆకర్షణీయంగా ఇది కన్పిస్తుంది. అన్నింటిలోకి తూర్పు ప్రవేశ గోపురం ఎత్తుగా వుండి చక్కటి శిల్పకళతో అలరారుచున్నది. దీని అధిష్ఠానం చాలా వరకు భూమిచే కప్పబడి వుంది. ఉపాన, పట్ట, ఊర్ధ్వ, పద్మ, గళ, విశాల పట్ట, ఆలింగ పట్టిక, ఈ అధిష్ఠానంపై కన్పిస్తాయి. ఎనిమిది అడుగుల ఎత్తుగల కుడ్యాలపై గోపురం నిర్మించబడివుంది. ఇది కపోతాన్ని కలిగివుండి సింహలలాటంతో కూడిన గవాక్షాలతో అలంకరించబడింది.

ప్రధానాలయంలో గర్భగుడి, అంతరాళం, ప్రదక్షిణా పథ, ముఖమండపం, మహామండపం వున్నాయి. గర్భగుడి మీద ఏకతల విమానం నాగరశైలిలో నిర్మాణమైయున్నది. దీనికి నాలుగు మూలల ఆసీన సింహాలు, అంజలి ఘటిస్తున్న నాలుగు గరుడ విగ్రహాలు కూడా వున్నాయి. ప్రధాన దైవమైన నరసింహస్వామి గర్భగుడిలో పద్మపీఠంపై వీరాసన పద్ధతిలో ఆశీనుడై వున్నాడు. ఎనిమిది చేతులతో భయంకరమైన కోరలతో తన అంకముపై హిరణ్యకశిపుని పరుండబెట్టుకొని, ఉగ్రనరసింహుడుగా జ్వలించే నేత్రాలతో ప్రకాశిస్తున్నాడు. పై రెండు చేతులలో శంఖ చక్రాలను, క్రింది రెండు చేతులలో ఖడ్గాన్ని, డాలుని ధరించినాడు. మిగతా వరుసలలోని తన నాలుగు చేతులతో హిరణ్యకశిపుని ఉదరాన్ని ఛేదిస్తున్నాడు. స్వామి ముందు భాగములో ఎడమ వైపు అంజలి ఘటిస్తున్న ప్రహ్లాదుని విగ్రహం కూడా వున్నది. గర్భగృహం అంతరాళానికి చుట్టూవున్న ప్రదక్షిణాపథం, నైరుతిమూల మరియు ఉత్తరాన చోళుల శైలిలో రూపొందించబడిన నాలుగు స్తంభాల రెండు వరుసలను కలిగివుంది. అంతరాళం ఇరువైపుల ఇద్దరు ద్వారపాలకులు వున్నారు. ఇదే విధంగా అర్ధమండపం, ముఖ మండపాలలో వున్న స్తంభాలు కూడా చోళశిల్పరీతిని ప్రదర్శిస్తున్నవి. ప్రతిస్తంభం చతురస్రాకారపు దిమ్మెలను కలిగివుంది. ఈ దిమ్మెలపై దశావతార దృశ్యాలు చెక్కబడినవి.

ముఖమండపం నుండి వెలుపలికి పోవడానికి తూర్పున, ఉత్తరాన, దక్షిణాన మూడు ద్వారాలు ఉన్నవి. ఇందులో ఉత్తర ద్వారం దేవిమండపానికి దారి తీస్తుంది. ఈ దేవిమండపం కూడా గర్భగృహం, అంతరాళం, ముఖ మండపం, మహామండపాలను కలిగివుంది. గర్భగృహం మధ్యభాగములో లక్ష్మీదేవి పద్మాసనంలో కూర్చొని వుంది. ఈ విధంగా దేవి ఆలయం కూడా ఇక్కడే వుండడం వలన స్వామి లక్ష్మీనరసింహుడిగా ప్రఖ్యాతి పొందినాడు.

ఆలయ మహామండపం లేదా రంగమండపంలో ఇరవై ఎనిమిది (28) స్తంభాలు విజయనగర అద్భుత శిల్పశైలికి తార్కాణంగా నిలిచివున్నాయి. నోరు తెరచుకొని లంఘిస్తున్న సింహాలను ఈ స్థంభాలలో అంతర్భాగంగా, అద్భుతంగా చెక్కినారు. ఈ మండప మధ్యభాగంలో పద్మశిల వున్నది. ఇదే విధంగా మండప మధ్య భాగంలోని



నాలుగు స్తంభాలు గజ వ్యాళి మూర్తులచే అలంకరించబడి వున్నాయి. పై కప్పు భాగంలో రామాయణ, మహాభారతమందలి అనేక దృశ్యాలు చిత్రీకరింపబడి ఉన్నాయి ఈ మండపములోని చిత్రాలకు, లేపాక్షి (హిందూపురం మండలం) చిత్రాలకు అనేక దగ్గరి పోలికలు వుండడం వలన రెండు దేవాలయ చిత్రకారులు ఒక్కరేనేమో నన్పిస్తుంది. ప్రతి వైష్ణవ దేవాలయములో వున్నట్లుగానే ఆలయానికి ముందు భాగములో అంజలి ఘటిస్తున్న గరుడ విగ్రహంతో కూడిన మండపం నాగరశైలిలో నిర్మించ బడివున్నది. దీని వెనుక అధిష్టానముపై బలిపీఠం, లతలతోనూ, పక్షులతోనూ, అలంకరించబడిన వేదికపై ధ్వజస్తంభం వున్నాయి. కల్యాణ మండపం ప్రధాన దేవాలయానికి దక్షిణ భాగాన నిర్మించబడి ఉంది. ఇందులో మొత్తం 18 స్తంభాలు ఉన్నాయి. ఈ కల్యాణమండపము కొద్ది భాగం ఎత్తుగానూ, మరికొంత భాగం పల్లముగానూ విభజింప బడివుంది. ఈ స్తంభాలపై ఎటువంటి శిల్పకళ లేదు. అయితే కల్యాణ మండపానికి దారితీసే మెట్ల కిరువైపుల రెండు ఏనుగులు చెక్కబడి ఉన్నాయి. దీనిపై విమానం వేసర శిఖరాన్ని కలిగివుంది. ఈ కల్యాణ మండపములో, దరిదాపున, మధ్య భాగములో ఒక సింహాసనాన్ని చరిత్రకారులు ఈ మధ్యనే కనుగొన్నారు. ఉత్సవాలు జరిగే సమయంలో చక్రవర్తి బహుశ ఈ సింహాసనాన్ని అలంకరించేవాడని దీనివలన అర్థం అగుచున్నది.

భిన్న మతాల ఐక్యతకు, జాతీయసమైక్యతకు మారు పేరుగా వుండి, తర తరాల హిందూ సంస్కృతికి పట్టుగొమ్మయై విరాజిల్లుతున్న కదిరి లక్ష్మీనరసింహస్వామి దేవాలయాన్ని ప్రతిభక్తుడూ సందర్శించడం ఆవశ్యం.



(15వ పేజీ తరువాయి)

ప్రతి మంత్రానిక ఓం చేర్చి ఉచ్చరిస్తాము. ఓం కారము చేర్చని ఏ మంత్రానికి శక్తి సామర్థ్యాలు చాలవు. ప్రాణహీనమై జడమైపోతుంది. అర్చనలో ప్రతి నామము ముందు ఓం చేర్చబడుతుంది.

ఓం కారమును పరబ్రహ్మ స్వరూపముగా భావించి పలుకవలెను. భక్తి శ్రద్ధ విశ్వాసములతో జపించవలెను.

శ్రీ త్యాగరాజస్వామి శ్రీరామ చంద్రుని ఓం కారానికి ప్రతిరూపముగా భావించి ఓరామ ఓరామ ఓంకార ధామ అని ఉత్సవ సంప్రదాయ కీర్తనలో కీర్తించారు. శ్రీ పల్లవి గోపాల అయ్యరు 'నీదు చరణ పంకజములే గతియని నెరనమ్మినాను' అను కీర్తనలో ఓంకార రూపిణి కళ్యాణి అని దేవిని ఓంకార రూపముగా కీర్తించారు.

ఈ విధముగా ఎందరో వాగ్గేయకారులు నిర్గుణ బ్రహ్మమైన ఓంకారాన్ని సగుణ బ్రహ్మగా భావించి భక్తితో కీర్తించారు. వీరు కారణజన్ములు. ఆధ్యాత్మికంగా సామాన్యులమైన మనకు, సగుణ బ్రహ్మకు నిర్గుణ బ్రహ్మకు గల సంబంధాన్ని ఏకాక్షరం ఓం ద్వారా తెలియబరుస్తున్నారు. వారి కీర్తనలు ద్వారా మనసుద్ధరించడానికి.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం
సయాతి పరమాం గతిమ్

అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో (ఎనిమిదవ అధ్యాయం, పదమూడవ శ్లోకం) చెప్పియున్నాడు. దీని తాత్పర్యం క్లుప్తంగా చెప్పాలంటే, ఎవరైతే పరబ్రహ్మమునకు వాచకమైన ఏకాక్షరమంత్రము ఓం ఉచ్చరించుచు నన్ను ఎడతెగక చింతించుచు శరీరమును వదులునో అట్టి వ్యక్తి మోక్షము నొందును.

ఓం కారం అనేక విధములుగా ఉచ్చరించవచ్చును. మానసిక శారీరక ఆరోగ్యం రీత్యా ఉచ్చరించే విధానం ఈ విధముగా నుండును. ఖాళీ కడుపుతో ఒక తివాసీ వంటి మెత్తని ఆసనం పై ఏదైనా ధ్యాన ఆసనంలో కూర్చుని, అనగా పద్మాసనం, అర్ధ పద్మాసనం స్వస్తికాసనం సిద్ధాసనం వీటిలో ఏదో ఒకటి లేదా మరం వేసుకొని వెన్నెముక నిటారుగా ఉంచవలెను. చేతులు జ్ఞానముద్ర లేక చిన్ముద్ర చిన్మయ ముద్ర ఇత్యాదులందుగాని మోకాళ్ళపైన గాని ఉంచవలెను. నాభినుండి కంఠము వరకు ఒక గొట్టము ఉన్నట్లు ఊహించవలెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఈ గొట్టముద్వారా జరుగుతున్నట్లు ఊహించుకొనవలెను. ముక్కుద్వారా దీర్ఘశ్వాస తీసుకొనవలెను. నింపాదిగా ఊపిరి వదులుతూ పైకి గట్టిగా ఓమ్ ఉచ్చరించవలెను. ఓంకార శబ్దము నాభిదగ్గర జనించి పై చెప్పిన గొట్టము ద్వారా కంఠము వరకు వస్తున్నట్లు ఊహించుకొనవలెను. నిచ్ఛ్వాసను సుమారు మూడు సమభాగములుగా విభజించి మొదటి భాగము అకారము రెండవ భాగములు ఉకారము మూడవ భాగము మకారము ఉచ్చరించవలెను. అకారము బాగుగా నోరుతెరచి ఉకారము పెదవులమధ్య కొద్దిగా ఖాళీవుంచి మకారము నోరుమూసి ముక్కుద్వారా ఉచ్చరించవలెను. మరొక పద్ధతి ఏమనగా అకార ఉకారములు కలిపి ఓ గాను, మకారము మ్ గాను ఉచ్చరించవలెను. ఓ నోరు తెరచి మ్ నోరు మూసి ఉచ్చరించవలెను. నిచ్ఛ్వాస సమయములో సుమారు రెండు వంతులు సమయము ఓకు ఒక వంతు మ్ కు నియమించవలెను. ఉదాహరణకు మొత్తం ఓం కార ఉచ్చారణకు పదిహేను సెకండ్లు అయిన సుమారు పదిసెకండ్లు ఓ కు ఐదు సెకండ్లు మ్‌కు నియమించవలెను. అనగా మ్ కంటె ఓ దీర్ఘముగా నుండవలెను. (మరొక పద్ధతిలో ఓ కంటె ఊమ్ దీర్ఘముగా నున్నది.) ఓ నోరు తెరచి మ్ నోరు మూసి ఉచ్చరించవలెను. ఓంకార ఉచ్చారణ ఎన్నిమార్లయినా చేయవచ్చును.

నాభినుండి కంఠము వరకు గొట్టము ఊహించుకొనుట కష్టమయితే శబ్దం మీదే









ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభైశాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్‌ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన షక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ధ్యానం వుంచుకొనవచ్చును. ఓంకార ఉచ్చారణ దీర్ఘముగా అవిచ్ఛిన్నమగు తైలధారవలె ఘంటా నాదమువలె పలుకవలెను. ఒక మారు ఉచ్చరించిన పిదప అవసరమైతే ఆయాసం తీర్చుకొనుటకు రెండు మూడు మార్లు మామూలు ఊపిరి (Normal breathing) తీసుకొని మరల దీర్ఘముగా ముక్కుద్వారా గాలిపీల్చి ఓంకారము ఉచ్చరించవలెను. అలసటగాని ఆయాసముగాని లేకుండా చూచుకొనవలెను.

ఓంకార ఉచ్చారణలో దీర్ఘ శ్వాస వ్యాయామము (deep-breathing exercise) కూడా ఇమిడి ఉంది. దీర్ఘశ్వాస వలన ఊపిరితిత్తుల నిండా గాలి నిండి ఉన్నది. దీనివలన శరీరమునకు ఎక్కువ ప్రాణ వాయువు లభ్యమవుతుంది. ఓంకారం ఉచ్చరిస్తూ ఊపిరి వదలినప్పుడు ఊపిరి తిత్తులు ఖాళీ అయిపోతాయి. దీనివలన ఊపిరితిత్తులలో మూల మూలలనున్న చెడు వాయువులు (waste gases) బైటకు పోతాయి. ఊపిరి తిత్తులు ఆరోగ్యంగా ఉంటాయి.

శారీరక ఆరోగ్యరీత్యా పైచెప్పిన విధముగా దీర్ఘముగా ఓంకారం ఉచ్చరిస్తే ఓ శబ్దం గొంతుకకు మ్ శబ్దం ముక్కుకు మర్దనా (Massage) ను ఇస్తుంది. ఈ విధముగా దీర్ఘముగా గట్టిగా ఉచ్చరించినప్పుడు ఉచ్చరించిన వారి శరీరములోను మెదడులోను తరంగాలు (Vibrations) ఉద్భవిస్తాయి. వీటివలన మనస్సుకు హాయిగా ఉంటుంది. మనస్సు ఉయ్యాలలూగుతుంది. ఓ, ఊమ్ ఈ రెండు శబ్దాలతో ఆల్ఫా థీటా అనే తరంగాలు ఉద్భవిస్తాయని మెడికల్ ఎలక్ట్రానిక్ పరికరాల సహాయంతో ఓంకారం ఉచ్చరించే వ్యక్తికి ఎలక్ట్రో ఎన్‌సెఫలోగ్రాం తీసి శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఈ తరంగాలు మనోశాంతినిస్తాయి. వీటిఫ్రీక్వెన్సీ 8 నుండి 13, 4 నుండి 7 సైకిల్సు సెకండుకి.

అమెరికాలో గ్రేటర్ షికాగో ప్రాంతంలో కొంతమంది అమెరికన్లకు యోగానేర్పుతూ ఓంకార ఉచ్చారణ చెప్పిచేయించగా వారికి చాలా హాయిగా అనిపించింది. ఓం కార మంటే తెలియని అమెరికన్లకి ఆనందాన్నిచ్చిందంటే ఓంకార ఉచ్చారణ ఎంత గొప్పదో వూహించుకోవచ్చును.

ఓం కారం ఉచ్చరించిన వారిలోనే కాక వినేవారిలో కూడా తరంగాలు ఉద్భవిస్తాయి. అనారోగ్యంగా ఉన్నవారి దగ్గర కూర్చుని దీర్ఘంగా గట్టిగా ఓంకారం ఉచ్చరిస్తేవారికి ఉపశమనం కలుగుతుంది. ఓం ఉచ్చరించినవారికి మానసిక వత్తిడి (మెంటల్ టెన్షన్) తగ్గుతుంది. విన్నవారికి కూడా మానసికవత్తిడి తగ్గి మనస్సు ఆహ్లాదకరంగా వుంటుంది.

మామూలుగా పూజదగ్గర అర్చనలోను నామము ముందు ఓం చేర్చినప్పుడు ఓం హ్రస్వముగా నుండి అక్షరముగా పలుకబడుతుంది. కనుక కేవలం పూజకు పరిమితమైయున్నది. పూజదగ్గరగాని వేరే సమయములోగాని పై చెప్పిన విధముగా దీర్ఘముగా ఓంకారం ఉచ్చరించిన ఎడల శారీరకమానసిక ఆరోగ్యములకు కూడ పనికి వచ్చును.

అందరికీ అన్ని సమయములలోను అన్ని ప్రదేశాలలోను ఆసనంపై ధ్యాన ఆసనంలో కూర్చునుటకు అవకాశము లేకపోవచ్చును. అట్టి వారికి సులభపద్ధతి వుంది. కుర్చీలో కూర్చుని అయినా సరే, ఒక మోస్తరు ఖాళీ కడుపుతోనైనా సరే వుంచగలిగితే వెన్నెముక నిరారుగా వుంచి, దీర్ఘ శ్వాస కాకపోయినా ముక్కుద్వారా మధ్యస్తంగా గాలిపీల్చి, పైకి గట్టిగా కాకపోయినా తక్కువ స్థాయిలో పై చెప్పిన విధముగా ఓమ్ ఉచ్చరించవచ్చును.

ఓం కార ఉచ్చారణ తెలిసినవారి దగ్గర నేర్చుకొనటం మంచిది. ఈ విధంగా ఓంకారం ఆధ్యాత్మిక చింతనకు అర్చనకు మాత్రమే పరిమితం కాకుండా మానసిక శారీరక ఆరోగ్యానికి కూడా ఉపయోగపడుతున్నది.



# ఆరోగ్యప్రదాత

శ్రీమతి మంగిపూడి స్వర్ణకుమారి



1987 సం॥లో నేను అనారోగ్యముతో మనశ్శాంతి లేక చాలా బాధపడేదాన్ని. శ్రీవేంకటేశ్వరుని దర్శిస్తే చేసిన పాపాలు కొంతైనా నశించి, ఆరోగ్యం కుదుటబడి మనశ్శాంతి కలుగుతుందన్న ఆశతో డిసెంబరు 24న తిరుపతి వెళ్ళాలని నిశ్చయించుకున్నాము. వెళ్ళటానికి 15 రోజుల ముందుగా రిజర్వేషన్ కోసం స్టేషన్‌కి వెళ్ళి కనుక్కుంటే యిప్పట్లో రిజర్వేషన్స్ లేవన్నారు.

శ్రీ స్వామివారిని దర్శించలేక పోయాననే బాధతో ఆరాత్రి విపరీతమైన గుండెదడ, ఒళ్ళంతా మంటలు ప్రారంభమై చెంచా మంచి నీరు త్రాగటానికి కూడా చాలా కష్టమయింది. హాస్పిటల్లో చేర్పించారు. నేను పడే బాధ చూచి డాక్టర్లకి కూడా ఆశ్చర్యం కలిగింది. ఆరాత్రి భళ్ళున తెల్లారింది. మర్నాడు శని




వారం. నాకు గుండెదడ, ఒళ్ళు మంటలు తగ్గి మామూలుగా అయితే తిరుపతి వచ్చి కల్యాణం చేయించుకుంటామని హాస్పిటల్ బెడ్‌మీదే శ్రీవారికి మ్రొక్కుకున్నాను. అన్ని పరీక్షల రిపోర్ట్సు నార్మల్‌గానే ఉన్నాయి. దడ కొంచెము తగ్గుముఖం పట్టింది. కాని విపరీతమైన నీరసం, ఒంటరిగా వుండాలంటే భయం.

ఇటువంటి స్థితిలో మాకు తెలిసిన వాళ్ళు శ్రీవారి ప్రసాదం ఇచ్చారు. నీ ప్రసాదం తింటున్నాను. నన్నేం చేస్తావో నీదే భారం తండ్రీ! అని ప్రార్థించి తిన్నాను. సరిగా మేము వెళదామనుకున్న డిసెంబరు 24వ తేదీన స్వప్నంలో శ్రీస్వామివారు మూల విరాట్ రూపంలో సాక్షాత్కరించారు. శ్రీవారి ఉజ్జ్వల వరద హస్తము దివ్యమైన కాంతులను విరజిమ్ముతూ దేనినో పైకి విసరి, వెంటనే యధాస్థానంలోకి వచ్చింది. దానితో శ్రీవారు నాలోని అనారోగ్యాన్ని తీసి పారవేశారన్న నమ్మకం కలిగింది. నా ఆరోగ్యం కొంచెము కుదుట బడిన తర్వాత 1988లో తిరుపతి వెళ్ళి శ్రీస్వామివార్కి ఉడతా భక్తిగా కల్యాణం చేయించుకున్నాము. ఇప్పటికీ తలచుకుంటే శ్రీవారి దివ్యమంగళ రూపం నా కనులకు కట్టినట్లే అనిపిస్తుంది.

ఇది నా జీవితంలో జరిగిన యధార్థమైన అద్భుత అనుభవం. ఇప్పుడు ఆతండ్రి దయవలన ఆరోగ్యంగా వున్నాను.

# ఆపదమొక్కులవాడు

శ్రీ రామిశెట్టి వెంకటరావు



నేటి సభ్యసమాజంలో రామిశెట్టిగా పిలువబడే నేను, నా తల్లిదండ్రులకు మిగిలిన ఒకే ఒక మగబిడ్డను. ఆ యేడుకొండలస్వామికి మ్రొక్కుకుని ఆస్వామి పేరే (వెంకటరావు) నాకు పెట్టినందున నేను బ్రతికి బట్టకట్టానని మా నాన్నగారు నాతో పదేపదే చెప్పేవారు.

1990వ సంవత్సరంలో నేను 40వ సంవత్సరంలో ప్రవేశిస్తుండగా ఒకనాడు నాకు ఆకస్మాత్తుగా జబ్బుచేసింది. అలా రెండు, మూడు దినాలు గడిచే సరికి నా శరీరచ్ఛాయ నల్లగా మారిపోయింది. నా శరీరంలో చాలచోట్ల చిన్నచిన్న కురుపులు, కాయలు, మొటిమలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. ఫలితంగా నా శరీరంలో ఒక రకమైన జిడ్డుపదార్థం బయటపడసాగింది. చెడు వాసన, దురద, నొప్పి అధికమయ్యింది. ఆది నుండి మేము జిల్లాకేంద్రమైన శ్రీకాకుళంలో ఉంటున్నందున అచ్చటగల ప్రముఖ వైద్యనిపుణులను సంప్రదించి వారివారి సూచనలు, సలహాలు పాటిస్తూ ఆరోగ్యం కోసం రకరకాల మందులు, టానిక్కులు సేవించాను. కాని ఆశించిన ఫలితం పొందలేకపోయాను.

అంత వరకు సంఘంలో చాల గౌరవంగా బ్రతికిన నేను అనారోగ్యం కారణంగా మానసికంగా చాల బాధపడ్డాను. రాను రాను బయటికి చెప్పుకోలేని విధంగా నా శరీరంలో నలుపు, తెలుపు మచ్చలు కూడ కనుపించాయి. అంతే ఆనాటినుండి కుటుంబ జీవనంపైన, సభ్యసమాజంపైన విరక్తి కలిగింది. ఎవ్వరికీ చెప్పకుండా నిద్రమాత్రలు మ్రింగి ఆత్మహత్యా ప్రయత్నం కూడా చేశాను. ఎందుకో ఆ ఏడుకొండల స్వామికి నామీద మళ్ళీ దయకలిగింది. బ్రతికి బయటపడ్డాను.

ఆరోజు శనివారం అగుటవలన దూరం నుండి మైకుద్వారా వినిపించిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి సుప్రభాతం, భక్తిగీతాలు విని పులకించిపోయాను. ఆ వెనువెంటనే నా కళ్ళముందు కనిపించిన నాగావళీ నదిలో పవిత్రస్నానమాచరించి, త్రికరణ శుద్ధిగా పదే పదే శ్రీవారి నామజపం చేశాను. నాకు సంపూర్ణ ఆరోగ్యం ప్రసాదించమని, కుటుంబ సమేతంగా శ్రీవారిని దర్శించి, తలనీలాలు, కానులు ముడుపుగా సమర్పించుకుంటానని మ్రొక్కుకున్నాను. అంతే అలా ఆదేవునిపై అపారమైన భక్తిభావం, నమ్మకం కలిగింది. అలా రెండే రెండు దినాలు గడిచే సరికి నా శరీరంలో ఎక్కడా ఏవిధమైన దురదలు, కురుపులు, మచ్చలు లేవు. శారీరకంగాను, మానసికంగాను నేను సంపూర్ణ ఆరోగ్యవంతుడనయ్యాను.

అణగారిన బ్రతుకులలో ఆశాజ్యోతులు వెలిగిస్తూ, ఆంధ్రప్రదేశ్‌లో పవిత్ర పుణ్యక్షేత్రంగా పేరుగాంచిన తిరుమలగిరిపై వేంచేసివున్న శ్రీవేంకటేశ్వరస్వామి తనను నమ్ముకున్న భక్తజనకోటిని సర్వకాల, సర్వావస్థలయందు కాపాడుతూ ఆపద మ్రొక్కుల స్వామిగా కీర్తింపబడుచున్నాడు. అనుకున్న మాటప్రకారం నేను, నా కుటుంబసభ్యులు కలసి ఇప్పటికి ఏడుసార్లు ఆ శ్రీవారి పాద దర్శనం చేసుకుని, భక్తిభావంతో ఆస్వామి సన్నిధిలో తలనీలాలు సమర్పించుకుని, పరమ పవిత్రమైన ఆ శ్రీవారి పుష్కరిణిలో పవిత్ర స్నానమాచరించాం.

7వ సారి తిరుపతి వచ్చి ఆస్వామి వారి పాదదర్శనం చేసుకుని, సుఖంగా ఇంటికి చేరిన 7వదినం నాకు ఉద్యోగంలో ప్రమోషన్ లభించింది. ఆనాటి నుండి ఆ స్వామివారి దయవలన నేనూ, నా కుటుంబ సభ్యులు యావన్మందీ సంపూర్ణ ఆరోగ్యంతో సుఖమయ జీవనం కొనసాగిస్తున్నాం. అప్పటినుండి నాదైనందిన జీవితంలో నేను ఏపని చేయతలపెట్టినా సరే ముందుగా ఆవిషయం ఆ శ్రీవారికి మనవి చేశాకనే ప్రారంభిస్తాను. మాఇంట్లో ప్రతి శనివారం మా శక్తి కొలది ఆస్వామిని పూజిస్తూ, ఆ దినమంతా భక్తి భావంతోను, మంచి పనులతోను కాలం గడిపేస్తాం. కులమత విచక్షణ లేకుండా, ఏడుకొండలవాడా!వేంకటరమణా గోవిందా! గోవిందా! అంటూ ఆస్వామిని పిలిస్తే చాలు ఆ దివ్యమంగళ స్వరూపం మనకళ్ళముందు నడయాడుతుంది. ఆస్వామి అభయహస్తం మనలను ఆశీర్వదిస్తుంది.

☆☆☆☆

# శ్రీ వేంకటవిభుని తెలియుకొరకే చదువులు

## అన్నమాచార్యుల ఉద్బోధ

శ్రీమతి వేములకొండ విజయవల్లీదేవి

'జీవానుం మనుజః శ్రేష్ఠ' అన్నట్లు సృష్టిలోని జీవరాశులన్నింటిలోను మానవుడు ఉత్కృష్టమైన జీవి. భగవంతుడు ఆహార, నిద్ర, భయాదుల్లో అన్ని జీవరాశులను సమానం చేసి ఒక్క 'ఆలోచన' అనే విష యంలో మానవుని జంతుకోటి నుంచి వేరు చేశాడు. భగవంతుడు ప్రసాదించిన 'ఆలోచన' అనే లక్షణాన్ని పెంపొందింప జేసి సదసద్వివేకాన్ని కల్గింపజేసేదే విద్య. విద్య అంటే తెలుసుకోవడం అని అర్థం. దీన్నే సామాన్య పరిభాషలో 'చదువు' అని అంటాము. మానవుని ఐహిక జీవ నానికి అన్నవస్త్రాలు, గృహాలు, సంపదలు



ఎంత అవసరమో అలాగే చదువులు కూడా అంత అవసరం. విద్యకున్న ప్రాధాన్యం కొద్దీ 'విద్యలేనివాడు వింతపశువు అని, విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము పురు షాళికిన్.... విద్య నెఱుంగని వాడు మర్త్యుడే' అని 'విద్యా హీనాం నశోభంతే నిర్గంధా నవకింశుకాః' మొదలైన సూక్తులు లోకంలో ప్రసిద్ధికెక్కాయి. మానవునిలో ఈ విద్య వున్నప్పుడే అతనిలో నాగరికత, సంస్కృతి, సౌమ్యత్వం, వివేచన మొదలైన మంచి లక్షణాలు పెంపొందుతాయి. అయితే విద్య నేర్చిన వ్యక్తులందరూ సదసద్వివేకం కల్గి వుంటారా అనే సందేహం కలుగుతుంది.

సదసద్వివేకం అంటే సత్తు, అసత్తుల తారతమ్యం తెలుసుకోవడం. సత్తు అంటే శాశ్వతమైన పరమాత్మ. అసత్తు అంటే అశాశ్వతమైన దేహం. మానవుడు విద్యల మూలాన జ్ఞానాన్ని పెంపొందింపజేసుకొని కేవలం తన దైహిక సుఖ భోగాలకే ఉప యోగించుకుంటున్నాడు. ఎన్నో కర్మలు చేస్తు న్నాడు. తాను చేసిన పుణ్యపాప కార్యాలవల్ల పునర్జన్మలు ఎత్తుతూ గిట్టుతున్నాడు. ఈ విధ మైన భవ బంధాలతో కొట్టుమిట్టాడుతూనే ఉన్నాడు గానీ శాశ్వతమైన పరమాత్మను గూర్చి తెలుసుకోలేకపోతున్నాడు. ఇలాంటి మానవులను ఉద్ధరించడంకోసం భగవంతుడు ఎందరో మహానుభావులను అవతరింపజేస్తుం టాడు. అట్టివారిలో ఘనుడు తాళ్ళపాక అన్నమాచార్యులు.

సుప్రసిద్ధ వాగ్గేయకారుడు, పరమభ క్తుడు, మహాజ్ఞాని అయిన తాళ్ళపాక అన్న మాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని ఉద్దేశించి వేలాది సంకీర్తనలు రచించాడు. అది ఒక



మహాసాగరం వంటిది. అందులో ఆయా వ్యక్తుల మనస్తత్వాలకు అనుగుణమైన ఎన్నో ధార్మిక, ఆధ్యాత్మిక, ఐతిహాసిక, పౌరాణిక అంశాలు, మహా కావ్య గుణాలు, లోకనీ తులు, ఆ బాల గోపాలం పాడుకోదగిన లౌకికమైన పాటలు, ఎన్నో సంగీత విశేషాలు, తత్త్వాలు, లోకహిత బోధలు మొదలైన అనేక అంశాలు దాగి ఉన్నాయి. అన్నమాచా ర్యులు కేవలం భక్తి తత్త్వాన్ని భగవంతుని లీలల్ని తెలియజేయడమే కాకుండా, తన కాలం నాటి సాంఘిక దుస్థితిని కూడా గమనించి తన ఆవేదనను వ్యక్తం చేశాడు. మానవుడు తన మేధస్సును, నేర్చిన విద్యను లౌకిక విషయాలకే ఉపయోగించుకోవడం, పరమాత్మను గూర్చి తెలుసుకోకపోవడం పట్ల ఎంతో విచారించాడు. అలాంటి వాళ్ళను

ఉద్దేశించి--

నాటికి నాడే నా చదువు
మాటలాడుచును మరచేటి చదువు
ఎనయునీతని నెఱుగుటకే పో
వెనకవారు చదివిన చదువు
మనసున నీతని మరచుటకే పో
పనివడి ఇప్పటి ప్రౌఢల చదువు.

తెలిసి ఇతనినే తెలియుటకే పో
తొలుత కృత యుగాదుల చదువు
కలిగిన ఈతని కాదననే పో
కలియుగంబులో కలిగిన చదువు.

పరమవేంకటపతి గనుటకే పో
దొరలగు బ్రహ్మాదుల చదువు
సిరుల నితని మరచెడి కొరకే పో
విరసపు జీవుల విద్యల చదువు.

కృత, త్రేత, ద్వాపర యుగాల్లోని మహాభక్తులంతా భగవంతుని తెలుసుకోవడం కోసమే చదివారు. కానీ ఈ కలియుగంలోని ఈనాటి మానవుల చదువులు ధనాదిగర్వాలతో భగవంతుని మరచిపోవడం కోసమే అవుతోందని తన కాలం నాటికే ఇలా ఆవేదన పడ్డాడు. మరి అప్పటికి ఐదు శతాబ్దాలు దాటి నాస్తికత్వం, వితండవాదం, భోగలాలసత్వం ప్రబలిపోతున్న ఈకాలపు విద్యావంతుల్ని గమనించి నట్లయితే అన్నమాచార్యులు ఇంకెంత ఆవేదనపడేవాడో అనే ఆలోచన రాకపోదు.

అన్నమాచార్యులు బాల్యమాదిగా శ్రీవేంకటేశ్వరస్వామివారి భక్తుడే అయినా సామాన్యజీవిలా సాంసారిక జీవనాన్ని గడిపాడు. ఐహిక సుఖాలను అనుభవించాడు. ఎంత అనుభవించినా అవిక్షణిక ప్రాయాలే. మనోద్వేగాన్ని పెంచేవేకానీ ప్రశాంతి నివ్వలేవు. అందుకే తన ప్రియదైవాన్ని ఉద్దేశించి--

భక్తి నీపై దొకటి పరమ సుఖము
యుక్తి చూచిన నిజిం బొక్కటీ లేదు
ధనమెంత గలిగెనది దట్టమౌ లోభంబు
మొనయు జక్క దనంబు మోహములు రేచు
ఘనవిద్య గలిగి ననుకప్ప పైపై మదము
యెనయంగ పరమపదమించుకయులేదు.

నీపై కల్గిన భక్తి ఒక్కటే శాశ్వతమైన

సుఖాన్ని కల్గిస్తుంది. ధన, విద్య రూపాదుల వల్ల లోభ మోహాదులేకానీ అందులో ముక్తి మార్గంలేదని తేల్చి చెప్పాడు.

మానవుడు విద్య నార్జించిన పిమ్మట దాన్ని భుక్తికోసం వినియోగించుకోవడం కోసం నానా యత్నాలు చేస్తాడు. ఉద్యోగ ప్రాప్తి రాగానే తాను చదువుకొన్నందుకు ఉద్యోగ ఫలితం లభించిందని మురిసిపోతాడు. ఈ చదువులు, ఉద్యోగాలు మానవుని భవబంధాల నుంచి రక్షించవుకదా! ఆత్మ శాంతినివ్వవుకదా! అలాంటి ఫలితాన్ని ఇవ్వనిచదువు ఎలా ఫలించినట్లు అవుతుందని అన్నమాచార్యుల ప్రశ్న. అందుకే అతడు తన సంకీర్తనల్లో--

తన శాంతమాత్మలోఁదగిలినప్పుడు గదా
పనిగొన్న తన చదువు ఫలియించుట.

ఉన్నతి ఁజదువు లెన్ని వుండినా శ్రీవేంకటేశు
సన్నుతించిన మంత్రమే సతమై ఫలించును.

చదువు గలిగిన ఫలము సంశయుంబేగాని
సదమలజ్ఞాన నిశ్చయ మింతలేదు
ఇది యెరిగి తిరువేంకటేశ్వరుని గొలిచినను
బ్రతుకు గలుగును భవము ప్రాణులకు లేదు.

అని జ్ఞానబోధ చేశాడు.

భాగవతంలోని ఎన్నో భక్తి భావాలు అన్నమాచార్యుని సంకీర్తనల్లో చాలా కనిపిస్తాయి. పోతన భాగవతంలో "నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువవలనని, చక్రహస్తుని ప్రకటించు చదువే చదువని అసలైన చదువును గూర్చి చెప్పినట్లే అన్నమాచార్యులు కూడా చదవాలనే కోరిక వుంటే మహావిష్ణువు నామాన్నే నోరార చదవాలి, అలా చదవడమే సకల శాస్త్ర సమ్మతమవుతుంది" అని ఇలా వక్కాణించాడు.

చదువుగన వలసినను శౌరినామము దిరుగఁ
జదువుటే సకల శాస్త్ర సమ్మతము.

వేదశాస్త్రాలను చదివికూడా హరిభక్తిలేని సోమయాజులను, సన్యాసులను, తపస్వులను అందరినీ అన్నమాచార్యులు విమర్శించాడు. ఇలాంటి వాళ్ళకన్నా--



నవధాన్యాలతో వేంకటేశ్వరుడు --చిత్రం : సోమశేఖర్

ఏదియును లేని కుల హీనుడైనను విష్ణు
పాదములు సేవించు భక్తుడే ఘనుడు
సరవి మాలిన అంత్య జాతికులజుడైన
నరసి విష్ణుని వెదకు నతడే ఘనుడు.

అని ఉద్బోధించాడు.

అన్నమాచార్యులు భక్తి తత్త్వాల్ని బోధించని చదువులను, భగవంతుని గూర్చి తెలుసుకోలేని చదువరులను జ్ఞానులను నిశితంగా విమర్శించి వారిని సరిదిద్దడంకోసం ముక్తులను జేయడం కోసం ఇలాంటి అధ్యాత్మ కీర్తనలను ఎన్నింటినో రచించాడు. ఇలాంటి భావాలు, హితబోధలు మహాకావ్యాల్లో కూడా చాలా కనిపిస్తాయి. కానీ ఆ మహాకావ్యాలు ఆ బాలగోపాలానికి అందుబాటులో వుండవు కదా. అందుకే అన్నమాచార్యులు సంకీర్తన పద్ధతిని ఎన్నుకొన్నాడు. ఈ సంకీర్తనల్లో వేమన పద్యాల్లో వున్న లోకనీతులు, హితబోధలు, దురాశలు, గుణచాంచల్యాల విమర్శనం మొదలైన వాటి విషయాలు చాలా కనిపిస్తాయి. అరిషడ్వర్గాలను జయించి సంసారదూరులైన తపస్వులంతటివారే కోపాన్ని అణచుకోలేరు. అలాంటిది సామాన్యుని సంగతి

## విజ్ఞప్తి

# శ్రీవారి ఆలయం, తిరుమల.

తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీవారి ప్రసాద పణ్యారములు, ఆర్జిత చేరువులు, పడుల ధరలు 27-7-92 నుండి ఈ క్రింది విధంగా వుంటాయి.

భక్తులు ఈ విషయాన్ని గమనించి ఆ యా మొత్తాలు చెల్లించ వలసిందిగా విజ్ఞప్తి.

| | | | |
|---|---|---|---|
| 1. | పొంగలి | $\frac{1}{4}$ సోల | రు. 225-00లు |
| 2. | చక్కెర పొంగలి | ,, | రు. 250-00లు |
| 3. | పులిహోర | ,, | రు. 200-00లు |
| 4. | దధ్యోదనం | ,, | రు. 100-00లు |
| 5. | శాకరి బాత్ | ,, | ఝ. 250-00లు |
| 6. | సీరా | ,, | రు. 450-00లు |
| 7. | పాయసం | ,, | రు. 225-00లు |

చెప్పవలసిన పనిలేదు. చెడునడత కలిగిన వాడు సారవంతమైన చదువులను ఎన్నిసార్లు చదివినా కోపాన్ని మానలేదు అనే భావాన్ని--

సారమైన చదువులు సారె సారె చదివినా
గోరపు దుష్టునికి కోప మేల మాను.

అనే సంకీర్తనలో వ్యక్తం చేశాడు. ఇలాంటి భావాన్నే వేమనకూడా--

ఎంత చదువు చదివి ఎన్ని విన్ననుగాని
హీనుడవ గుణంబు మానలేడు
బొగ్గు పాలకడుగ పోవునా మలినంబు.

అని విద్యావంతులైనా గానీ అవలక్షణాలను వదలు కోలేరని విమర్శించాడు.

అలాగే మనోనిగ్రహం లేనివానికి చదువులెందుకు శాస్త్రాలెందుకు? ఎంత చదివినా మనోచంచలత్వం పోదు కదా. గుడ్డి కుక్క సంతకుపోయి ఏదైనా దొరికితే తినాలని తిరిగితే దానికి దుడ్డు కర్రదెబ్బలేకాని ఆహారం దొరకదు. అలాగే జడుడైన మానవుడు చదువగా చదువగా ఆశను పెంచుకొని భవ బంధాల్లో చిక్కుకొని అలమటిస్తాడే కాని, ఆశలు వదలుకోలేడు. ప్రశాంతంగా బ్రతకలేడు. ఈ భావాన్ని అన్నమాచార్యులు దేశీయమైన పదజాలంతో--

తన కేడ చదువులు తన కేడ శాస్త్రాలు
మనసు చంచల బుద్ధి మానీ నా
జడ్డు మానవుడు చదువ చదువ నాస
వడ్డి వారు గాక వద లీనా
గుడ్డి కుక్క సంతకుపోయి తిరిగిన
దుడ్డు పెట్లే గాక దొరకేనా.

అనే కీర్తన వ్రాశాడు.

పోతన భాగవతంలో ప్రహ్లాదుడు--

మందార మకరంద మాధుర్యమున దేలు
మధు పంబువోవునే మదనములకు
అంబుజోదర దివ్యపాదార విందచింతనా మృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబు చేర నేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల.

అని భక్తి రస సాగరంలో ఉన్మత్తుడై ఆనందాన్ని అనుభవించాడు. అలాగే అన్నమాచార్యులు భగవంతుని కథామృతాన్ని ఎల్లప్పుడూ గ్రోలడమే తనకు వేదపారాలని, మంత్రాలని, బహుశాస్త్ర పఠనమని, సంధ్య వార్చడమని, జపమని భావించి తన ప్రియ దైవంతో ప్రత్యక్షంగా--

నీ కథామృతము నిరత సేవన నాకు
చే కొనుట సకల సంసేవనం బటుగాన
ఇదియె మంత్రరాజము నాకు నేపొద్దు
నిదియె వేద సంహిత పారము
యిదియె బహు శాస్త్రమెల్లఁ జదువుట నాకు
నిదియె సంధ్య నాకిదియు జపమటుగాన.

అని నివేదించుకొన్నాడు.

అన్నమాచార్యులు ఎంత లోతైన విషయాలను కూడా సులభశైలిలో అందరికీ అందుబాటులోవున్న పదజాలాన్ని, జాతీయాలను, సామెతలను ఉపయోగించి సంకీర్తన రచన చేయగల ప్రతిభాశాలి, లోకజ్ఞాని. అన్నమాచార్యులు స్పృశించని ధార్మికాంశాలు లేవు, విచారించని లౌకికాంశాలు లేవు, చేయని హిత బోధ లేదు. అతని దృష్టిలో కేవలం తాను తరిస్తే సరిపోదు. లోకులను కూడా తరింప జేయాలి. అదే అప్పని వరప్రసాది అయిన అన్నమాచార్యుల వారి జీవిత లక్ష్యం.






# నిరతాన్నదాత్రి డొక్కా సీతమ్మ

శ్రీ మల్లాది నరసింహమూర్తి

డొక్కా జోగన్న గ్రామము లంకల గన్నవరము. జోగన్న గొప్ప పండితుడు. సదాచారసంపన్నుడు. పండిత గోష్ఠులలో పాల్గొని ప్రశంసలు పొందుటాయన కిష్టము.

ఒకనాడు జోగన్న పండిత సభలకు వెళ్ళి, మధ్యాహ్న సమయమునకు మండపేట గ్రామమునకు వచ్చెను. ఆ గ్రామమునందుంటున్న భవానీ శంకరము జోగన్నకు పరిచితుడే కాక బంధువు కూడ. వారి ఇల్లు తెలిసికొని వచ్చి, జోగన్న వాకిట నిలచి పిలిచెను. వెంటనే తలుపు తెరచుకొని తొమ్మిదేండ్ల అమ్మాయి ఒకతె వెలుపలికి వచ్చెను.

'నాయన ఊరిలో లేరు. లోనికి దయ చేయుడు. మీరు భోజనము చేసినట్లు లేదు. క్షణములో వంట చేయుదును' అని పలికి ఆ పిల్ల కాళ్ళు కడుగు కొనుటకు నీళ్ళిచ్చెను. కొంచెము సేపు విశ్రమింపుడని వేడెను. ఆ కన్య ఆదరణమునకు, మర్యాదకు జోగన్న ముగ్ధుడయ్యెను. అమ్మాయి, నీ పేరేమి? నా పేరు సీతమ్మ.

"సీతా! నీవు వంట చేయవలదు. నేనే వంట చేసికొందును." తల్లి లేని ఆ పిల్లను కష్టపెట్టనేలయని జోగన్న అనెను. జోగన్న నైష్ఠికుడు అగుట గ్రహించి ఆ పిల్ల ఇల్లు అలికి, శుభ్రముచేసి వంట సామగ్రి అంతయు అచ్చోటికి చేర్చెను. వంటపనిలో ఆయనకు సాయపడెను. జోగన్న వంట చేసికొని భుజించి విశ్రమించెను. ఇంతలో భవానీశంకరము గ్రామాంతరమునుండి ఇంటికి వచ్చెను. మహాపండితుడైన జోగన్న తన ఇంటికి అతిథిగా వచ్చినందులకు ఆ గృహస్థు సంతోషమున ఉప్పొంగెను. తాను ఇంట లేకున్నను తన కుమార్తె ఎట్టి లోటు రాకుండ జోగన్నకు సపర్యలు కావించినందులకు లోలోపలి మురిసెను.

"అయ్యా! మీ అమ్మాయి సౌశీల్యవతి. చక్కనిది. శుభ లక్షణములు కలది. ఈమెను పెండ్లాడినవాడు అదృష్టవంతుడు" అని జోగన్న భవానీశంకరమునకు చెప్పెను. కొన్నాళ్ళకు ఆ అదృష్టము జోగన్నకే కలిగెను. భవాని శంకరము అభిప్రాయమును ఎరిగి జోగన్న ఒక సుముహూర్తమున సీతమ్మను పెండ్లాడెను. చిన్నతనమునందే ఆమె అత్తవారింటికి వచ్చెను. ఇంటి కంతకును ఆమెయే సర్వాధికారిణి అయ్యెను. ఆమెకు వయస్సుతో పాటు ఉదార స్వభావము వృద్ధి పొందెను. ఎవరికైన ఏదైన ఇచ్చుటకు భర్త ఏమి అనునో అని మొదట సందేహపడు

చదవండి! చదివించండి!!

# సప్తగిరి

## చందాదారులకు మనవి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్యాత్మిక సచిత్ర మాస పత్రిక 'సప్తగిరి'. తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఆంగ్లం మున్నగు ఐదు భాషల్లో విడి విడిగా నెల నెలా వెలువడుతున్న పత్రిక 'సప్తగిరి'. ఆధ్యాత్మిక వ్యాసాలు - పండుగలు - పిల్లల కథలు - వేంకటేశ్వర లీలలు - మన దేవాలయాలు ఇలా ఎన్నో విషయాలతో, విశేషాలతో మీ ముందుకు వస్తున్న పత్రిక 'సప్తగిరి.'

**మీరు 'సప్తగిరి' పత్రిక కొత్త చందాదారునిగా నమోదు చేయించుకోదలచారా?**

అయితే క్రింది సూచనలను జాగ్రత్తగా గమనించండి.

1. సంవత్సర చందా రు. 24-00లు మాత్రమే.
   ఈ చందాను ఎన్ని ఏండ్లకైనా ముందుగనే కట్టవచ్చును.
2. తమ చందా మొత్తాన్ని "ఎడిటరు, సప్తగిరి, తి.తి. దేవస్థానములు, తిరుపతి" వారి పేర మనియార్డరు గానీ, డిమాండు డ్రాఫ్టుగానీ, పోస్టలు ఆర్డరు గానీ పంపవచ్చును. (చెక్కులు అంగీకరింపబడవు).
3. మీకు ఏ భాషా సప్తగిరి కావలెనో స్పష్టంగా రాయండి.
4. మీ పూర్తి చిరునామాను విడి విడి అక్షరాలలో స్పష్టంగా రాయండి.
5. చందా పంపిన మరుసటి నెలనుండి మీకు సప్తగిరి పంపబడుతుంది.
6. చందా మొత్తాన్ని పంపిన 30 రోజులలోగా మీకు సప్తగిరి రానిచో, ఎం.ఓ. రసీదు నంబరు లేదా డి.డి. నంబరు, పంపిన తేదీ వగైరా వివరాలతో, మీ పూర్తి చిరునామాతో స్పష్టంగా రాయండి.

**మీరు ఇంతకు ముందే చందాదారులా? అయితే క్రింది సూచనలను గమనించండి.**

1. మీ చందా ముగియుటకు ఒక నెల ముందుగానే సప్తగిరి పత్రికలో తెలియజేస్తున్నాం.
2. మీ చందా ముగిసిపోయే నెలకు - ఒక నెల ముందుగనే చందా మొత్తాన్ని పంపి మీ చందాను పునరుద్ధరించుకోండి.
3. మీ చిరునామాలో మార్పుగాని, మీరు చందా పంపటంగాని చేసేటప్పుడు, మీ చందా నంబరుతో కూడ పూర్తి చిరునామాను తెలపండి.

చుండెడిది. క్రమముగా జోగన్న మంచి మనసును తెలిసికొనుటచే పరోపకార విషయమునందు బెదరుమాని తమ ఇంటికి అరుదెంచు వారి కందరికి భోజనములు పెట్టసాగెను. ఊరివారు ఆ పుణ్యదంపతులను పార్వతీ పరమేశ్వరుల విధమున చూచెడివారు. అతిథి అభ్యాగతులను ఆదరించుపని భార్యకే అప్పగించి జోగన్న వ్యవసాయపు పనులు మాత్రమే చూచుకొనసాగెను.

ఆ కాలమున ప్రయాణ సౌకర్యములు సరిగా లేకపోవుటచే బాటసారులు లంకల గన్నవరమున ఆగిపోవలసి వచ్చేది. సీతమ్మ ఖ్యాతిని విని వారి ఇంటికి భోజనమునకు వచ్చుచుండెడివారు. వచ్చినవారికందరికి రాత్రింబగళ్లు సీతమ్మ తృప్తిగా భోజనము పెట్టుచుండెడిది. పాడికి, పంటకు వారి ఇంట తరుగులేదు.

ఒకనాడు సీతమ్మ అంతర్వేది నరసింహస్వామిని దర్శించుటకు మేనా మీద బయలుదేరెను. ఎండ తీవ్రముగా నుండుటచే మోయువారు ఒక చెట్టునీడ యందు మేనా దింపుకొని అలసట తీర్చుకొనుచుండిరి. ఆ సమయమున పెండ్లివారు కొందరు ఆ చెట్టు క్రిందికే వచ్చి చేరిరి. వారి పిల్లలు ఆకటిచే గగ్గోలుగా ఏడ్చుచుండిరి. అది చూచి వారిలో ఒక పెద్ద "మన మిప్పుడు డొక్కా సీతమ్మగారి ఊరికి సమీపించు చుంటిమి. మనము మెల్లగా ఆ ఊరిని చేరుకొందము. ఆమె ఇంట ఏ వేళయందైనను మనకు భోజనము లభించును. ఆమె అన్నపూర్ణ వంటిది. మీరు ఏడవకుడు" అని బుజ్జగింపు మాటలు సీతమ్మ చెవిని పడెను. వెంటనే ఆమె మేనాను వెనుకకు మళ్ళించెను. పెండ్లివారి కంటె ముందుగా ఇంటికి వచ్చి వంటలు చేయించి, వచ్చిన వారికందరికి వడ్డన గావించెను. అంతర్వేదికి వెళ్ళుటకంటే ఆకలి గొన్నవారిని ఆదరించుటయే భగవంతునికి ప్రీతికరమని ఆమె భావించెను.

బొంబాయి నగరమున ధనుగుప్తుడను బంగారు వర్తకుడు ఒకడుండెను. అతనికి

లేక లేక ఒక మగ పిల్లవాడు జన్మించెను. వరహాలను పేరుపెట్టి ఆ దంపతులు ఆ బాలుని అల్లారుముద్దుగా పెంచుచుండిరి. బడిలో ఉపాధ్యాయులు బాధింతురనియు, దూరము నడచిన బాలుని కాళ్లు కందుననియు, తలచి ధనగుప్తుడు వరహాలునకు ఇంటిలోననే చదువు చెప్పించుటకు ఒక ఉపాధ్యాయుని నియమించెను. కాని, వరహాలు ఉపాధ్యాయుడు చెప్పినది వినెడువాడు కాదు. ఎదుట సరిగా కూర్చుండెడివాడును కాదు. అల్లరి మితిమీరుచుండగా ఒకనాడా ఉపాధ్యాయుడు వరహాలును మందలించి మెల్లగా కొట్టెను. వాడు గొల్లున ఏడ్చుచు తల్లి యొద్దకు పోయెను. ఆ తల్లి మండిపడుచు వచ్చి "మా సొమ్ము తిని, మా పిల్లవానిని కొట్టెదవా? నీ చదువెంత? నీ వెంత? పోపో" మ్మని ఉపాధ్యాయుని దుర్భాషలాడి పంపించెను. అతి మాత్రపు గారాబముచే ఆ బాలునికి చదువు అబ్బలేదు. దుష్టుల సహవాసముచే దురభ్యాసములు మాత్రము పుష్కలముగా అబ్బెను. తల్లిదండ్రులకు తెలియకుండ ఇనుపపెట్టె తాళము తీసి వలసినంత ధనమును సంగ్రహింప మొదలిడెను.



వరహాలునకు తండ్రి వేడుకగా వివాహము జరిపించెను. సొంతముగా వ్యాపారము చేసికొనుమని తన ఆస్తి అతనికి పంచి ఇచ్చెను. కాని, వరహాలు తన దురభ్యాసములను మానలేదు. కొలది కాలములోనే ఆస్తి అంతయు పోగొట్టుకొనెను. దరిద్రుడయ్యెను. ధనార్జనకు దొంగతనములు చేసి చెరసాలలో పడెను. చెరనుండి విముక్తుడైన పిదప దేశద్రిమ్మరియై ఆంధ్రదేశమునకు వచ్చెను. డొక్కా సీతమ్మ ఔదార్యమును విని అన్నార్తుడై ఆమె పంచను చేరెను. బాల్యమున తల్లి చూపిన కరుణ కంటే వేయిరెట్లు అధికముగా సీతమ్మ ఆదరణము అతనికి తోచెను.

దురభ్యాసములు అలవడుట సులభమే కాని, మరలుట అతి కష్టము. వరహాలు ఒకనాడు సీతమ్మ ఆరవేసికొనిన పట్టు చీరను దొంగిలించుకొని పారిపోయెను. గ్రామస్థులు అది కనిపెట్టి, అతనిని పట్టి తెచ్చి స్తంభమునకు కట్టి కొట్టబోయిరి. అది చూచి సీతమ్మ జాలిపడి వచ్చి, కట్లు విప్పి అతనిని విడిపించెను. ఇంటికి తోడ్కొనిపోయి, భోజనము పెట్టి, కట్టుకొనుటకు పట్టుపంచె నొకటి అతనికి ఇప్పించెను. తల్లివలె బుద్ధులు చెప్పి "నాయనా! ఈ ధనముతో నీవు మరల వ్యాపారము చేసికొనుము. నీ భార్యాపుత్రులను, తల్లిదండ్రులను ప్రేమతో చూడుము" అని అతనికి కొంత ద్రవ్యమిచ్చి దీవించెను. అతడా తల్లి పాదములకు మ్రొక్కి, బొంబాయికి వెళ్ళి, మరల వ్యాపారము చేసి మహా ధనాఢ్యుడయ్యెను. సీతమ్మ ఆశీర్వచనము అమోఘమైనది.

ఒకనాటి అర్ధరాత్రమున గోదావరికి ఆవలి ఒడ్డున "అమ్మా! సీతమ్మతల్లీ! ఆకలి యగుచున్నది. అన్నము పెట్టి రక్షింపుము" అను కేకలు సీతమ్మ చెవిని పడెను. ఈ రాత్రి చీకటిలో సంగడి మీద వెడలినచో ప్రమాదము. తెల్లవారగనే వెళ్ళి వానికి అన్నము పెట్టవచ్చులే అని జోగన్న చెప్పిరి. సీతమ్మకు అది నచ్చలేదు. మంచి పని చేయువారికి భగవంతుడు తోడ్పడునని నమ్మి, ఆ క్షుధాతురునకు అన్న శాకములు, కట్టుకొనుటకు బట్టలు, పొగచుట్టలు ఒక మూట కట్టి, లాంతరు ఒకటి వెలిగించి ఇచ్చి "ఇక వెళ్ళుడు, అతని ఆకలి తీర్చుడు" అని భర్తను తొందర పెట్టెను. జోగన్న తన భార్యను కసరుకొని ముసుగుపెట్టుకొని పరుండెను. భర్తను శ్రమపరుపనేల యని ఆమెయే ఆ మూటను కైకొని ఆ నిశీథమున బయలుదేరెను. అది చూచి జోగన్న లేచివచ్చి, ఆ మూటను, లాంతరును, లాగుకొని, ఆమెను వెనుకకు పంపి తాను బయలుదేరెను. తొలుత పల్లెవాని ఇంటికి వెళ్ళి, వానిని నిద్రలేపి, ఏటిపాయదరికి తోడ్కొని వచ్చెను. ఏరు పరవళ్ళు దొక్కుచు ప్రవహించుచుండెను. కటిక చీకటి-- దానికి తోడు కారుమబ్బులు నలుదిక్కుల అలముకొని యుండెను. అవతల క్షుధార్తుని దీనాలాపములు వినవచ్చుచుండెను. జోగన్న నావను తొందరగా నడిపించి అవతలి ఒడ్డుకు చేరెను. ఆకట సొమ్మసిల్లి పడియున్న వానిని వెదకి జోగన్న అతనికి అన్నము కలిపిపెటిరి.

తనను రక్షింపవచ్చిన దైవముగా తలంచుచు అతడు తృప్తిగా భుజించి జోగన్న పాదాలకు మ్రొక్కెను. సీతమ్మ పంపిరని పాడిబట్టలు, పొగచుట్టలు అతనికి ఇచ్చి జోగన్న సంగడిపై ఎక్కి ఇంటికి చేరుకొనెను. ఏ ప్రమాదము లేకుండ తన భర్త క్షేమముగా ఇంటికి చేరినం దులకు సీతమ్మ సంతోషించి భగవంతునికి జోతలు చెల్లించెను.

జోగన్నకు అనారోగ్యము సంక్రమించెను. దినదినమునకు ఆయన క్షీణించుచుండెను. ఆయనకు ఏ విచారమును లేదు. కాని, తన అనంతరము తన భార్య జరుపు అన్నదానము నకు కుమారులు అడ్డు చెప్పుదురేమో అను అనుమానము కలదు. ఆయన తన అవ సాన కాలమున ఒకనాడు పెద్ద కుమారుడగు సుబ్బారాయుని పిలిచి "అబ్బాయీ! మీ యమ్మ జరుపు అన్నదానమునకు విఘ్నము కలుగనీయనని చేతిలో చేయి వేసి చెప్పుము. నేను నిర్విచారముగ మరణింతును" అనెను. అతడట్లే చేసెను. జోగన్న నిశ్చింతగా కన్ను మూసెను. సీతమ్మ దుఃఖమునకు అంతు లేదు. పతివియోగ దుఃఖమును దిగమ్రింగి ఆమె యథాప్రకారము అన్నదానమును కొన సాగించుచునే యుండెను.

సీతమ్మ అన్నదానమును గూర్చి జనులు వేనోళ్ళ కొనియాడుచుండిరి. ఆ కాలమున మన దేశమునకు ప్రభువు ఇంగ్లండులోని ఏడవ ఎడ్వర్డు చక్రవర్తి. ఆయన సీతమ్మ ప్రఖ్యాతి విని ఆమె ఛాయా చిత్రమును తెప్పించుకొనిరి. 1903వ సంవత్సరము జన వరి మొదటి తేదీన జరుగు తమ పట్టాభిషేక వార్షికోత్సవమునకు సీతమ్మను ఇంగ్లండునకు రమ్మని ఆహ్వానము పంపెను. కాని ఆమె వెళ్ళలేదు. ప్రశంసాపత్రములను అధికారులు ఆమె ఇంటికే తీసికొని వచ్చి ఇచ్చిరి. ఆ పత్రములను చూచి "నాయనా! ఇవి నా కెందుకు? నే నే ప్రతి ఫలమును కోరి అన్న దానము చేయుటలేదు - మానవసేవయే మాధవసేవ అని నమ్మి నాకు తోచిన సేవ చేయుచుంటిని. దైవ కృపవలన నా కెట్టి కొరతయు లేదు" అని పలికి మర్యాద కొరకు ఆ పత్రములను స్వీకరించెను.

సీతమ్మ అరువదవ ఏట చేతిపై రాచకు రుపు లేచెను. వైద్యము చేయుంచుకొనుటకు ఆమె నిరాకరించెను. తన కుమారులను పిలిచి "నాయనా! నా యందు మీకు ప్రేమా భిమానములున్నచో, మీ కెన్ని కష్టములు వచ్చి నను అన్నదానమును విడువకుడు. అన్నము పెట్టునప్పుడు కులము, మతము మున్నగువా నిని చూడకుడు. అన్నదానమునకు మించిన దానము లేదు" అని చెప్పి, నిరంతరము తమ ఇంట అన్నదానమును కొనసాగ జేయు దుమని కుమారులచే వాగ్దానమును పొంది ఆ మహాతల్లి 28-4-1909 వ సంవత్సరము పగలు పన్నెండు గంటలకు స్వగృహమునందు పరమపదించెను. నిరతాన్న దాత్రి యగు సీతమ్మ అసువులు వీడినంతనే పశ్చిమదిశ నుండి తూర్పు దిక్కునకు ఒక మహాతేజస్సు ఉవ్వెత్తున ఆకాశమునకు ఎగసినదట!



# వికలాంగులకు ఓ వరం

కుమారి డి. పూర్ణిమ

తిరుపతిలో తి.తి. దేవ-స్థానం నిర్వహిస్తున్న "బాలాజీ వికలాంగుల పునరావాస పరి-శోధనా సంక్షేమ కేంద్రం"లో చికిత్స పొందిన ఓ పేషెంటు అనుభవాన్ని యథాతథంగా వారి మాటల్లోనే ప్రచురిస్తున్నాం. ఇది పాఠకులకు నచ్చుతుందని భావి-స్తున్నాం.

సం॥

అందమైన ఆవరణ. మధ్యలో ఒక ఆసుపత్రి. దానిని ఆసుపత్రి అనేకంటే, విక లాంగుల పాలిట దేవాలయం అంటే సబబుగా ఉంటుందేమో! ఏ ఆసుపత్రికి ఉండనంత పరిశుభ్రత. చుట్టుప్రక్కల ప్రకృతి సిద్ధమైన, ఆరోగ్యవంతమైన గాలి, ఎదురుగా విశాలమైన ఖాళీ స్థలం. ఆ ఏడుకొండలవాడి కొండలు ఆసుపత్రి చుట్టూ ప్రకృతి సోయగాలతో చూడ చక్కగా, కనులకింపుగా ఉంటాయి. చుట్టూ నందనవనం మధ్యన రాజఠీవీతో రాజకోటలా ఉంటుంది ఈ ఆసుపత్రి.

శ్రీవారి పాదసన్నిధిలో చికిత్సపొందు తున్న పోలియో రోగులు ఎప్పుడూ నిరాశతో వెనుకకు తిరగరు. "మా బ్రతుకులు ఇంతేనేమో" అని నిరాశపడే పోలియో రోగు లకు "మీ బ్రతుకులు బాగుచేసి, మిమ్మల్ని మామూలు మనుషులుగా తీర్చిదిద్దే బాధ్యత మాది" అన్నట్లుగా చేసే ప్రతి ఆపరేషన్ లోను విజయం పొంది ఎవరెస్ట్ శిఖరం అంత ఎత్తుగా పేరు, ప్రఖ్యాతులతో ఎదు గుతున్నారీ వైద్యులు. ఈ ఆసుపత్రిలో వున్న ప్రతి ఉద్యోగి ప్రతి పేషంటుని తమ స్వంత మనుషులుగా ఎంతో లాలనగా చూస్తారు. తల్లిదండ్రుల ఋణమైనా ఏదో ఒక సమయములో తీర్చుకోగలమేమో కానీ, ఇక్కడి వైద్యుల ఋణం ఏనాటికీ తీర్చుకోలే నిది. ఇక్కడి పోలియోరోగులకి 'నమ్మకం' అనే హస్తం అందించి, వారిని సంతోషం అనే బాట మీద నడిపించేది కూడా ఈ వైద్యులే. ఈ పోలియో వాళ్ళని వారి తల్లి దండ్రులు ఎక్కడెక్కడో చూపించి విసిగి, వేసారి చివరికి ఈ ఆసుపత్రికి వచ్చిన వారు సంతోషంతో హృదయం నిండుగా ప్రేమాభి మానాల్ని నింపుకుని ఆసుపత్రికి వీడ్కోలు ఇస్తారు. "మీరు వికలాంగులు. మీరేమీ సాధించలేరు" అనేవారికి "మేము వికలాంగు లమే అయినా! జీవితంలో మీకంటె ఎక్కువ మేము ఏదైనా సాధించగలము" అని, చెప్ప గలిగే ధైర్యం ఈ వైద్యనారాయణులు ప్రసా దించినదే. ఇక్కడున్న భోజన సౌకర్యం మరే ఆసుపత్రికి ఉండదనే చెప్పాలి. మరో ముఖ్య విషయం వికలాంగులై ఉన్న అనాథ పిల్లలని చేరదీసి, వారికి చదువులకి, జీవనోపాధికి చేయూతనిచ్చి, వారి బ్రతుకులు వారు బ్రతి కేట్లు సహాయ పడుతున్నారు. నడవలేనివారికి ఇక్కడే ఉన్న కృత్రిమ అవయవాల కేంద్రంలో వారికి ఏ అవయవ లోపమున్నదో ఆ అవ యవాలు, వారికి సంబంధించిన ఊతకర్రలు మొదలైనవి ఉచితంగా ఇచ్చి, ఇతోధికంగా సహాయపడుతున్నారు.





ఇదంతా నేను ఊహించి వ్రాసినది మాత్రము కాదు. నా స్వానుభవంతో వ్రాసి నది. నేను కూడా ఒక పోలియో రోగిని. నా స్వస్థలం హైదరాబాదు. అక్కడ ఉన్న పెద్ద గవర్నమెంటు ఆసుపత్రిలో నాకు మూడు ఆపరేషన్లు చేసి 'ఇక రాదు' అని, అక్కడి వైద్యులు చెప్పేశారు. ఆ పరిస్థితుల్లో మేము ఇక్కడికి రావడం, ఆపరేషన్లు చెయ్యడం జరిగింది. ప్రస్తుతం నేను బాగా నడువగలు గుతున్నాను. ఇదంతా వైద్యుల చేతి చలువ! ఆ శ్రీనివాసుని దయ!!

తిరుమల తిరుపతి దేవస్థానముల

# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ప్రసాదించిన వరం. ఆ అడవుల్ని రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అటవీశాఖ వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

## వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

సౌకర్యాలు :

* వృక్షసంపదకు దాతపేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.15,000/-.

## వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచడానికి నిర్దేశించిన పథకం.

**సౌకర్యాలు :**

* దాతపేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కల వితరణ.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.10,000/-.**

## స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

**సౌకర్యాలు :**

* ఈ వనానికి దాత పేరు పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.2,000/-.**

## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు ప్రదర్శిస్తారు.
* ఒక సంవత్సరంపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అధ్యయన వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కదగ్గర దాత పేరు ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-.

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్‌రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటడం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు చెట్టుదగ్గర ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వనసంపద పరిరక్షణకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# వార్తాలహరి

## ధార్మిక గ్రంథ ప్రదర్శన

మార్చి 10 మహాశివరాత్రి పర్వదిన సందర్భంగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు శ్రీకాళహస్తి, కోటప్పకొండ, అమరావతి, శ్రీశైలం క్షేత్రాల్లో ధార్మిక గ్రంథ ప్రదర్శన మరియు విక్రయశాలలు ఏర్పాటు చేశారు.

ఈ విక్రయశాలల్లో ధార్మిక గ్రంథాలు, ఆడియో వీడియో క్యాసెట్లు, క్యాలెండర్లు మొదలైన వాటి ప్రదర్శన అమ్మకం జరిగింది. రు10/- కన్న ఎక్కువ విలువైన గ్రంథాలకు 25 శాతము, రు.10/- లోపల విలువగల గ్రంథాలకు 10 శాతము రాయితీ ఇచ్చారు.

వేలాది మంది భక్తులు ఈ ప్రదర్శన శాలలు దర్శించారు. ఈ ప్రదర్శన శాలల్లో దాదాపు 30 వేల రూపాయల అమ్మకం జరిగింది.

## శ్రీ కపిలేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలు

తిరుపతి సమీపంలోని శ్రీ కపిలేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలు మార్చి 9 నుంచి 13 వరకు 5 రోజులపాటు అత్యంత వైభవంగా జరిగాయి.

మార్చి 8 మంగళవారంనాడు బ్రహ్మోత్సవ అంకురార్పణం జరిగింది. మార్చి 9 న ధ్వజారోహణం, 10న మహాశివరాత్రి సందర్భంగా నంది వాహనోత్సవం, 11న కళ్యాణోత్సవం, 12న ఊంజలసేవ, 13 ఆదివారంనాడు త్రిశూలస్నానం ధ్వజావరోహణం జరిగాయి. వేలాది మంది భక్తులు శ్రీ కపిలేశ్వరస్వామి వారిని దర్శించి తరించారు.

## శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవాలు

తిరుపతి శ్రీ కోదండరామస్వామి వారి బ్రహ్మోత్సవాలు మార్చి 12 నుంచి 20 వరకు 9 రోజులపాటు అత్యంత వైభవంగా జరిగాయి.

మార్చి 11న బ్రహ్మోత్సవ అంకురార్పణం జరిగింది. 12న ధ్వజారోహణం, 19న రథోత్సవం, 20న చక్రస్నానం జరిగాయి.

ఈ తొమ్మిది రోజులు స్వామివారు పెద్ద శేషవాహనం, చిన్న శేషవాహనం, హంసవాహనం, సింహవాహనం, ముత్యపుపందిరివాహనం, కల్పవృక్షవాహనం, సర్వభూపాల వాహనం, గరుడవాహనం, హనుమద్వాహనం, గజవాహనం, సూర్యప్రభవాహనం, చంద్రప్రభవాహనం, అశ్వవాహనం మొదలైన వాహనాలలో భక్తుల కన్నులపండువగా ఊరేగారు.

వేలాది మంది భక్తులు స్వామివారిని దర్శించి తరించారు.

## శ్రీ వాగ్గేయకార వార్షిక సంగీత, హరికథ, నృత్యోత్సవములు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్య కళాశాల ఆధ్వర్యంలో మార్చి 2 నుండి 8 వరకు 7 రోజులపాటు సంగీత, హరికథ, నృత్యోత్సవాలు జరిగాయి. తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్య కళాశాల ప్రాంగణంలో ఈ కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి.

2వ తేది జరిగిన ప్రారంభోత్సవ సభకు తి.తి.దే. అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. దేవస్థానం ఫైనాన్షియల్ అడ్వయిజర్ శ్రీ ఎస్. గురుమూర్తి అధ్యక్షత వహించారు.

వివిధ ప్రదేశాలనుంచి వచ్చిన ఎందరో విద్వాంసులు ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.



### రచయితలకు గమనిక

'సప్తగిరి'లో సమీక్ష చేయుటకు రచయితలు తమ గ్రంథాల్ని రెండు ప్రతులుగా పంపవలెను. లేనిచో సమీక్ష చేయబడవు

'సంపాదకులు'

Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



కానవచ్చె నిందులోనే కారుణ్యానరసింహా!
తానకమై నీకంటె దాస్యమే పో ఘనము!

యెనసి ప్రహ్లాదుఁడు యెక్కడఁ జూపునో యని
ననిచి లోకమెల్ల నరసింహగర్భములై
పనివూని వుంటి వటు భక్త పరతంత్రుఁడవై
తనిసి నీ వధికమో దాసులే యధికమో!



మక్కువ బ్రహ్మాదులు మానుపరాని కోపము
ఇక్కువై ప్రహ్లాదుఁడు యెదుట నిలిచితేను
తక్కక మానితి వట్టే దాసుని యాధీనమై
నిక్కి నీకింకరుఁడే నీకంటే బలువుఁడు!

అరసి కమ్మర ప్రహ్లాదవరదుఁ డని
పేరు పెట్టుకొంటి విట్టే బెరసి శ్రీవేంకటేశ!
సారె నీశరణాగత జనుని కాధీనమైతి--
వీరీతి నీదాసునికే యిదివో మొక్కేము.

--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 449,
రాగం : శంకరాభరణం, సంపుటం : 2 (1981)

(మే 24, నరసింహ జయంతి సందర్భంగా)

## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## ఆర్జిత సేవల ధరల్లో మార్పు

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి తీర్మానం నెం. 529 మేరకు తిరుమల శ్రీవారి ఆర్జిత సేవల ధరలు పెరిగాయి. ఈ కొత్తధరలు 15-8-1993 నుండి అమలులోకి వచ్చాయి.

| వ.నెం. | సేవ/ఉత్సవం పేరు | ప్రవేశం | కొత్తధర |
|---|---|---|---|
| 1. | సుప్రభాతం | ఒక్కరికి | రూ. 100/- |
| 2. | తోమాలసేవ | ,, | రూ. 200/- |
| 3. | సహస్రనామార్చన | ,, | రూ. 200/- |
| 4. | ఏకాంతసేవ | ,, | రూ. 100/- |
| 5. | ఆమంత్రణోత్సవం ($\frac{1}{16}$ సోల ప్రసాదంతో) | ,, | రూ. 600/- (ప్రవేశం ఒక్కరికి) |
| 6. | పూరాభిషేకం | ,, | రూ. 750/- |
| 7. | పునుగు గిన్నె | ,, | రూ. 300/- |
| 8. | కస్తూరి గిన్నె | ,, | రూ. 150/- |
| 9. | నిజపాద సేవ | ,, | రూ. 100/- |
| 10. | ప్రత్యేక కళ్యాణోత్సవం | 5 గురికి | రూ. 750/- |

గృహస్థులు పై మార్పులను గమనించి ఆ యా సేవలకు చెందిన కొత్తధరలు చెల్లించ వలసిందిగా ప్రార్థన.

కార్యనిర్వహణాధికారి





'94 మే, 17

తిరుపతి

గంగ జాతర

సందర్భంగా.....

తిరుపతి

తాతాయగుంట గంగమ్మ

చిత్రం: కె. శాంతన్న






గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త - సంపాదకులు
కాటపాటి సుబ్బారావు, ఎమ్.ఎ
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జాలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# ఈ సంచికలో.... మే, 1994

సంపుటి 24 సంచిక 12



ముఖచిత్రం : శ్రీతాళ్లపాక అన్నమాచార్యులు — చిత్రం--జగదీష్

2 వ కవరు పేజీ : శ్రీగోవిందరాజస్వామి రథోత్సవం (మే 17 నుండి 25 వరకు గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవం)

3 వ కవరు పేజీ : తిరుపతి శ్రీ తాతాయగుంట గంగమ్మ (మే 17, గంగజాతర) ఫోటో-- శ్రీమతి ఎం. రాజ్యలక్ష్మి

4 వ కవరు పేజీ : తిరుమల ఉద్యానవన దృశ్యం

# సంపాదకీయం

ఆదిలో నాదమే ఉన్నది. అదే 'పరమాత్మ' అన్నది వేదం. ఏకరూపంగా అనాహతంగా నిల్చిన నాదమే స్వసంకల్ప వికల్పాలవల్ల ఏడురకాలుగా మారింది. ఇలా స్వరాల కలపోత విడిపోక కారణంగా అక్కడక్కడ ఆగటం సాగటం జరిగింది. ప్రతి వెనకకు, ముందుకు సాగే, సాగుడుల బాట ఒకరకమైన వింతవిడుపు లేదా విరామాన్ని కల్గిస్తూ మళ్లీ మళ్లీ అనుకునేందుకో మలుపులు తిప్పుకునేందుకో కారణమైంది. అవగాహనలేని జీవులు - ఆ దశలో - ఆ స్వరాల అనుకరణతోనే తృప్తి పడగా, అక్షరాలను అనగల బుద్ధిజీవులు బాటలో మాటలు కూర్చుకుని పాటలకు బాట లేర్పరిచారు. మొదటిది ఓంకారమని, తరువాత వచ్చినవాటిని ఏడు స్వరాలని ఈ స్వరాలన్నిటిని సమస్థాయిలో కల్పించే ధ్వని ప్రక్రియను శ్రుతి అని, మాటలు చేరో చేరకో జరిగే ధ్వని విన్యాసంలో ఆపుదలకు తాళమని ఇలా చెప్పుకున్నారు. తక్కువ మాటలు ఎక్కువ స్వరాలు కూర్చుకొన్న ప్రక్రియను మార్గ పద్ధతని, కేవలం శ్రుతి కోసమే స్వరాన్ని ఉపయోగించుకుంటూ మాటలతో ఏర్పడు పాటల బాణీలను దేశి అని వేరు చేశారు. మార్గ పద్ధతి మహాసభలకు, మహారాజ సౌధాలకు చేరి మన్నన పొందగా దేశి పద్ధతి మాత్రం మన లోగిళ్లలోనే నిలిచిపోయింది. పొద్దుపొడుపునుంచి నిద్రించేదాక మనిషి పనులన్నీ జానపదాలుగా నిలిచి కోలాటం, గొబ్బి, జాజర, నోము, హారతి, దంపుళ్లు, మార్పిడి, తత్త్వాలు, సుద్దులు, హరికథ, బుర్రకథ, భాగవత విధానాలుగా మిగిలి పోయాయి. జనానికీ ధనానికీ ఉన్న తేడా ఇక్కడ కూడా చేరి అక్షర ప్రాధాన్య కళారూపాలను కూనరాగాలనీ పల్లె పదాలనీ పాడేవారినీ, ఆడేవారినీ వీథి భాగవతులనే ముద్రవేసి విసిరి కొట్టింది.

తిండీ తీరుబడీ గల స్వరశాస్త్ర విదులకు 'మార్గ' ఒక స్వరమైతే మాట మాటకు మనసునూ మనసునూ ముడివేసే మురిపెం అన్ని రసహృదయాలను అదను చూసి కదను తొక్కించగల జనమోహకశక్తి దేశి పద్ధతిది. అందుకే ప్రజలలో పాతుక పోవాలనుకున్న ప్రతి మతమూ, ధర్మమూ ఈ పల్లీయుల మార్గాన్నే ప్రయాణించక తప్పలేదు. కాని అవసరం తీరింతర్వాత అన్ని వర్గాలవారికీ 'దేశి' కూరల్లో కరివేప స్థాయినే పొందింది. నిజానికి ఏ భాషా చరిత్ర చూచినా దేశి పద్ధతుల కింతకన్న పెద్ద పీఠం దక్క లేదంటే ఆశ్చర్యం ఏమీలేదు.

ఇలా ఉన్న సమాజంలో ఈ పల్లెజనాళి పాటలకు తగిన గౌరవాన్ని కల్గించాలన్న ప్రయత్నం ప్రతి భాషలోనూ చాలాకాలంగా సాగుతూనే వుంది. అయితే ఈ ప్రయత్నాలన్నిటిలో పదకవితలకు పెద్దపీట వేసిన ఆద్య పురుషుడు శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులూ వారి కుటుంబమూ అని చెప్పాలి. రాగ తాళాలతోపాటు ఆర్తికి అధిక ప్రాధాన్యం మార్గ పద్ధతిది కాగా, ఆ రాగ, తాళ ప్రక్రియతోనే ఆలోచనకు భావ ప్రకటనను జోడించి 32000 పద పుష్పాలను ఆదినాద పద సమార్చనను అర్పించిన ధన్యజీవి అన్నమాచార్యులు. అవా లొల్లాయిపదాలు, పుల్లాయి పాటలు అనటానికి వీలులేకుండా అపార మార్గ వైదుష్యం, అనితరసాధ్య భాషా పాండిత్యం మేళవించి, చిరస్థాయిగా ఉండేవిధంగా వాటన్నిటిని వ్రాయించిన పద్ధతి కూడా తర తరాలవారికి ఆలోచనాలోచనాలై ఆశ్చర్యం కల్గిస్తూనే ఉన్నది.

మాటకు పాటలో కన్న ఆటలో ఎక్కువ బలమున్నదని అన్నమయ్య నిరూపించాడు. అందుకే శృంగార సంకీర్తనలలో చాలావరకు నవరసాత్మక నాట్య భంగిమలే కన్పిస్తాయి. ఇది నిజంగా దేశి మార్గంలో కొత్త విప్లవమే !

ఆయన కుమారుడు పెద్ద తిరుమలాచార్యుడు అన్నిటా తండ్రిని మించిన అష్టభాషా కోవిదుడే అయినా, "జనకుడా విచ్చేయవే" అని ప్రార్థించ గల వినయశీలి. సంకీర్తనలతోపాటు, ఆయన రచన భగవద్గీత తెలుగులో తొలి పరిపూర్ణ వచన గ్రంథం అనవచ్చేమో !

తన గొప్ప ఇతరులకు చెప్పటం మనిషికున్న మలినాల్లో ముఖ్యమైనది. తన గొప్ప నసలు చెప్పకోకుండా

(48వ పేజీలో)

# వేదకాలము నాటి సాంఘిక జీవనము

శ్రీ చిట్టిబోయిన వెంకటేశ్వరరావు

క్రీ.పూ. 12000 సంవత్సరములనుండి 6000 సంవత్సరముల వరకూ గల కాలమును వేదకాలమని దైవజ్ఞుల నిర్ణయము. ఈ కాలమును మూడు భాగములుగా విభజించినారు. అవి-- 1. సంహిత కాలము; 2. బ్రాహ్మణ కాలము; 3. ఉపనిషత్ కాలము.

సంహిత కాలము ఋషిపుంగవులు మంత్రతంత్రములను సంకలనము చేసిన కాలము.

బ్రాహ్మణ కాలము బ్రాహ్మణోత్తములు విస్తృతముగా ఆచార వ్యవహారములకు సంబంధించినటువంటి గ్రంథ సముచ్ఛయము రూపొందించిన కాలము.

ఇక ఉపనిషత్ కాలము నిగూఢమైన వేదవాఙ్మయ రహస్యతత్త్వమును ఆవిష్కరించిన కాలము. ఈ ఉపనిషత్కాలమునకు ముందున్న కాలము నందు మానవ మేధస్సు ప్రాకృతి శక్తులకు లోబడి దేవతల యొక్కయు, దేవుళ్ళ యొక్కయు, రక్షణ నాశించి ఆలయములను నిర్మించుటయందును మంత్రతంత్రములనాధారముగా చేసుకొని బలిదానములు జరిపించుటయందును, నిమగ్నమై, పరిపూర్ణ విజ్ఞానము నొందలేదనవచ్చును.

వివిధ దేవతలకు నాటి మానవుడు సమర్పించిన ప్రార్థనలు, బలిదానములు ప్రాపంచిక విషయలోల. సిద్ధ్యర్థమై, ధన, వస్త్ర, వాహన, సంతాన, ఆయురైశ్వర్య ప్రాప్తి కొరకై యనుట కందెట్టి సందేహమునులేదు. నాటి కాలమున జీవిత మతి సామాన్యమైనది., బాధ్యత రహితమైనది. ఆశాజనకమైనది, ఊహాపూరితమైనది. తద్వారా వేదకాలము నాటి ప్రజానీకము జీవితమున దైనందన కార్యక్రమములందు ఉల్లాసముగా జరుపుకొనెడివారనవచ్చును. వారెంతమాత్రమును జీవితమును దుర్భలముగా తలచెడివారుకాదు. జీవితమును వారొకవరముగా భావించెడివారు. ప్రపంచమున మానవునిగా జన్మించుటయే సుకృతముగా తలచి ఇహలోకానంద పరిపూర్ణజీవితమును అనుభవించెడివారు.

వారి పరిసరములయందు గల ప్రకృతి ప్రసాదితములైన జల, వృక్ష, ఫల, పుష్పాదుల ననుభవించుచూ, భగవంతుడు వానిని తమకు ప్రసాదించిన వరములుగా భావించెడివారు. తత్కారణ భూతులైన ప్రకృతి దేవతలనూహించుకొని వారికే పూజా పునస్కారము చేయుచు జీవితముయొక్క మాధుర్యము ననుభవించెడివారు. వారు ప్రకృతి ప్రసాదిత సదృశ్యములైన భూమి, ఆకాశము, వెలుగు, నీరు, గాలివంటివే వారి సుఖదుఃఖాలకు కారణభూతులని తలచి వాటియందే దైవత్వము నాపాదించి ప్రార్థనలు, పూజలు, బలులు, నైవేద్యములు సమర్పించెడివారు.

ఈ ప్రకృతిసిద్ధమైన దృష్టి గోచరమగు భూమి, అగ్ని, గాలి, నీరు, ఆకాశము మొదలగువాటిని ప్రార్థించి దేవతలనుగ్రహము కొరకు క్రతువులు, కర్మలు, యజ్ఞ యాగాదులు చేయునారంభించినారు.

వేదవేద్యుల స్థూలదృష్టి జగత్సృష్టి యొక్క మూల సూత్రములకు మానవుని యొక్క వ్యక్తిగత జీవితమునకు మధ్యగల సూక్ష్మ సంబంధమును గ్రహింపలేక పోయినారనవచ్చును. కానీ.... వారి భావన మానవుని ప్రాముఖ్యతను, శక్తిని విస్మరించకుండా వాని ఔన్నత్యమును, ఘనతను గుర్తించినారనవచ్చును.

మానవుని జంతువులనుండి గుర్తించుటకు అతని మంచి చెడ్డల తారతమ్యము తెలుసుకొను తెలివితేటలే అనునది నిర్వివాదాంశము. ఈ పౌరాణిక జ్ఞానమే ఆధ్యాత్మిక



# తిరుమల తిరుపతి దేవస్థానములు

# అభిషేక సేవలు

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆరు ఆలయాల్లో వారానికొకసారి జరిగే అభిషేక సమయంలో భక్తులు ఒక్కొక్కరు రు. 5-00లు టికెట్టు చెల్లించి అభిషేక దర్శనం చేసికొనవచ్చును.

1. శ్రీ వేదనారాయణస్వామి ఆలయం, నాగలాపురం.
2. శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం, నారాయణ వరం.
3. శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం, కార్వేటి నగరం.
4. శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం, అప్పలాయగుంట.
5. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం, మంగాపురం.
6. ఆలయ సముదాయం, ఋషీకేష్.

భక్తులు, యాత్రికులు ఈ విశేష సేవను దర్శించి కృతార్థులగుదురు గాక!

తి.తి. దేవస్థానములు, తిరుపతి.

భావనరే మానవునికున్నత స్థితి సంతరింపజే
సత్య, నీతి, నియమములయందు దైవచిం
నయందు పరిపూర్ణుడుగా చేసినదనవచ్చు

మానవుని తృష్ణ నిరంతర కృషి
అతని లక్ష్యసాధనకు జీవిత సాఫల్యమున
దోహదము చేసి వేదకాలమున అతని సుఖ
వనమునకు ఆలావాలమైన దనుట యందె
సందేహమును లేదు.

ఈ చరాచర ప్రపంచము పిపీలికా
బ్రహ్మ పర్యంతము ఒక నిర్ణీత జగత్సూ
ముపై ఆధారపడి నడచుచున్నదని, ఆ
భగవంతుని అనంతమైన శక్తియని, ఆ శ
నారాధించి అనుగ్రహము పొందిన సుఖజీ
ప్రాప్తి కలుగునని నాటి సాంఘిక సారథుల
ఋషి పుంగవుల ఉవాచ.

జీవిత పరమార్థము ఆధ్యాత్మిక సాధ
మునందే నిక్షిప్తమైయున్నదని ఋషులు ప్ర
దించిరి. ఈ ఆధ్యాత్మిక సాధనకు వేదమ
త్రములే సోపానములని వానిని మననవ
చేయుట దీక్షగా ప్రార్థనము చేయుట
లక్ష్య సాధనమునకు మార్గమని వా
చెప్పిరి.

ఋకా? అక్షరె పరమివ్యోమన్
యస్మిన్ దేవా అధి విశ్వనిషేధుః
యస్తన్న వేదో క్రిమీ కాకరిష్యతి
య యిట్టద్విదురమ్ హస్తె భవంతి.

సర్వాంతర్యామియైన భగవంతునియె
క్కయు, అతని అవతారములను, ఆ ఋ
తన కొరకు స్తుతించలేదు. పైగా, భగవంతు
దయలేనిదే ఆయన ఉనికి తెలుసుకొనలేమ
అందువలన ఆయన అనుగ్రహము కొర
ప్రార్థించవలెను.

సత్య సందర్శనమునకు, సత్య జ్ఞా
సాధనమునకును మానవునికొకనికే అవ
శము గలదిగాని మరి ఏ ఇతర జీవికిని లేద
మానవుని జీవితోత్కృష్ట సాధనకు, ప్రతి వ్య
ఉన్నత జీవన సముపార్జన నిమిత్తం నిరంత
సాధన చేయవలసియున్నది. ఎందువలనన
ఆధ్యాత్మిక చింతన యొక్కటియే మానవు
అమరత్వము సిద్ధింపచేయునని, అందువ
మానవ జీవిత పరమార్థము సాంఘిక ధర్మ

(41వ పేజీలో

సప/

శతక సాహిత్యంలో

# శ్రీయాదగిరి లక్ష్మీనృసింహస్వామి

**శ్రీ మునుగోటి యాదయ్య**

యాదగిరి క్షేత్ర మందుండి యర్థిజనుల
కఠిన గ్రహ బాధలను మాపు కాలుడీవె
పరమ పదవాస శ్రీయాదగిరి నివాస
భవ్య లక్ష్మీనృసింహ ప్రభా వదంహ.

యాదగిరి నరసింహస్వామిపై శతకాలు భక్తి, నీతి, జ్ఞాన, వైరాగ్య వేదనలను తెలిపే సాహిత్య ప్రక్రియగల రచనా విధానముగలవి.

ఆంధ్రవాఙ్మయ శతకములలో విశిష్టమైనవి భక్తి శతకములు. తెలుగులో త్రిమూర్తులపై శతకములు వెలువడినవి. శైవ వైష్ణవ భక్తి ప్రధానములైన శతకము లసంఖ్యాకములు.

వైష్ణవ భక్తి ప్రధానములగు శతకములలో వివిధ అవతారములపై రచింపబడిన శతకములు గలవు. నారాయణుని కొందరు రాముని రూపమని నృసింహుని రూపమని కృష్ణరూపమని ఆరాధిస్తారు.

తెలంగాణా ప్రాంతంలోని నల్లగొండజిల్లా భువనగిరి దగ్గర (హైదరాబాదుకు 60 కి.మీ. దూరంలోనున్న) శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహస్వామి క్షేత్రం 80 వసంతాలకు పైగా ప్రసిద్ధిగాంచింది. అటువంటి స్వామిపై అనేక శతకాలు వెలువడినవి.

### *1.* యాదగిరి లక్ష్మీనృసింహ శతకము

ఈ శతకము రచయిత శ్రీ ఎన్. బల రామశర్మ. 101 సీస పద్యాలలో శతకం రచించిరి. వీరి నివాసం న్రకెకల్ దగ్గర మంగలపల్లి. ఈయన యాదగిరి క్షేత్రమున స్వామిసేవ చేసి ఆ స్వామి క్షేత్ర గొప్పదనాన్ని ప్రజలకు రచనలద్వారా తెలియజేసిరి. 1940లో శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహక్షేత్ర ప్రచార గ్రంథమాలముద్రితం.

> మే 24 నృసింహ జయంతి సందర్భంగా ఈవ్యాసం ప్రచురిస్తున్నాం.
>
> సం॥

పరమ పదవాస శ్రీయాదగిరినివాస
భవ్య లక్ష్మీనృసింహ ప్రభావదంహ.

అనే మకుటంలోని ఈ పద్యాలు మనోహరమగు శైలిలో శోభిల్లుచున్నవి.

మంగళప్రదుడవై మంగళగిరిమీద
పానకంబు ద్రావు ప్రభుడవీవె
శృంగారమూర్తివై సింహాచలంబందు
సేవలొందుచు నుండు దేవు డీవె
వేద స్వరూపివై వేదాద్రి యందుండి
నిరుపేదలను బ్రోచు నేత వీవె



## 2. నృసింహస్తుతి

దీనిలోని పద్యాలు చక్కని రచనతో కూడిన అచ్చ తెలుగు 110 కంద పద్యాలు. దీనిని మరింగంటి నరసింహాచార్యులు రచించిరని చివరి పద్యం వలన తెలుస్తుంది.

ఇది 'యాదగిరి నరసింహా' అనే మకుటంలో సాగింది. ఆ దేవదేవుని పసందుగా వర్ణించినారు. అచ్చ తెలుగులో మచ్చుగా--

తాగమొగని తెగడం దగు నిగ
నిగలుంగల సొగసు గులుకు, నీపగు మొగముం
దుగదుగ మొగముల జగపతి
కి గనుంగొననగునె యాదగిరి నరసింహా.

## 3. యాదగిరీంద్ర శతకము

క్రీ.శ. 1840లో కొలనుపాక నివాసి పరాంకుశుని కుమారుడైన శ్రీ తిరువాయి వెంకటకవిచే రచించబడింది. నృసింహస్వామిపై తనకు గల భక్తిని కవి ఈ శతకంలో చాటారు.

చూచెద ఫాల మందు తిరుచూర్ణపు
రేఖలు కోరమీసముల్
చూచెద నీదు నాసికము సొంపగు
శ్రీ పతకంబు హారముల్
జూచెద హాటకాంబరము చోద్యపు
గంటలు గజ్జెలందెలున్
జూచెద నీదు వైభవము జూపవే
యాదగిరీంద్ర మ్రొక్కెదన్.

శ్రీ నరసింహస్వామిని సేవించి ధ్యానించు చున్నందున భక్తిభావంతో ప్రతిదినము దైవమును నిలుపుకొనినట్లు వర్ణించెను.

## 4. నరసింహ శతకము

దీని రచయిత శేషప్పకవి. ఇది బహుళ ప్రచారం పొందింది. ఈ శతకము ఆ కాలమునాటి వీధిబడులలో పాఠ్యపుస్తకముగా నుండెను. ఇది కంఠస్థముచేసిన వారు సగము విద్యనేర్చినట్లేనని అప్పటి పంతుళ్ళు చెప్పేవారు. నరసింహ శతకము అనగానే ఇదే జ్ఞాపకం వచ్చును ప్రతివారికి.

నరసింహ నీదివ్య నామ మంత్రము చేత
దురిత జాలములన్నియు తోలవచ్చు
నరసింహ నీ దివ్య నామ మంత్రము చేత
బలువైన రోగముల్ బాపవచ్చు
నరసింహ నీదివ్య నామ మంత్రము చేత
రిపు సంఘముల సంహరింపవచ్చు
నరసింహ నీ దివ్య నామ మంత్రము చేత
దండ హస్తుని బంట్ల దఱుమవచ్చు
భళిర నేను మహామంత్రి బలముచేత
దివ్య వైకుంఠ పదవి సాధింపవచ్చు.

## 5. యాదగిరీశస్తుతి

ఇది 1922 దుందుభినామ సంవత్సరములో వరంగల్లునగల యాదగిరీశ బుక్ సెల్లర్స్‌వారిచే ముద్రింపబడింది.

అప్పటి నిజాం రాష్ట్ర ప్రథమ శతావధాని శ్రీమాన్ వీరవెల్లి నృసింహాచార్యులు (బాలకవి) దీనిని రచించిరి. వీరు యాదగిరి ఆస్థానంలో అవధానం సల్పినట్లు తెలుస్తోంది. బిరుదురాజు రాఘవరాజు శిరికొండ బుచ్చయ్యగారల ప్రోత్సాహంతో ఈ స్తుతి రచించినట్లు కలదు. 27 వృత్త పద్యములలో మత్తేభ శార్దూలములు గలవు. ప్రారంభమున రెండు కందాలలో ఇష్టదేవతాస్తుతి చేసిరి.

శీలంబున్ విడనాడి దుర్గుణగణ
స్త్రీలోల చిత్తుండనై
పూలం గ్రుచ్చిన రామముల్ చెలుల
కొప్పుల్లాలంగా నుంచి, తా
మూలల్నీ గళమందు వేయ జనియిం
పన్లేదు నా కోర్కెన
జ్జాలా యాదగిరీశ! బ్రోవు మిపుడే
తండ్రీ! నృసింహ ప్రభో!

## 6. శ్రీ యాదగిరి లక్ష్మీ నరసింహ శతకం

ఇది 1952 లో వ్రాయబడింది. దీని రచయిత సికింద్రాబాద్ నివాసి శ్రీ బూరెల సత్యనారాయణమూర్తి. భక్తి ప్రపూరితమైన పద్యాలు.

స్వామి అనుగ్రహమున జన్మించిన తన కూతురు నరసమాంబకు స్వామి సమక్షమున పుట్టు వెంట్రుకలు తీసిన సందర్భమున రచించిరి.

## 7. శ్రీ యాదగిరి నరహరి శతకం

దీని రచయిత ఈగె బుచ్చిదాసు. యాదగిరిగుట్టపై నివాసము. అచ్చటనే వివిధ భజన కీర్తనలు వ్రాసి పేరుగాంచిన ఈ భక్తుడు ఆవేదన, ఆత్మార్పణ, నీతి, జ్ఞాన వైరాగ్యాలిందు సులభశైలిలో వివరించిరి. వీరు తన బాధ నివారణమైనందుకు జీవితాంతం స్వామికి సేవచేసియున్నారు. ప్రతినిత్యం తాను రచించిన భజన గీతాలను, పద్యాలను తన కూతుళ్ళద్వారా ఆలాపింపజేసియున్నారు.

## 8. శ్రీ యాదగిరి నృకేసరి శతకం

ఇది 1932 అంగీరస నామ సంవత్సర ఆషాడ శుద్ధపంచమినాడు ముద్రింపబడింది. ఈ శతకమును మహబూబ్ నగర్ జిల్లా కందూరు చౌదరిపల్లినివాసియగు రామచంద్రయ్య మంగమాంబలకు జన్మించిన నారాయణరెడ్డి దేశ్‌ముఖ్ రచించిరి. దీనిలో ఉత్పలమాల చంపకమాలలు కలసి 108 పద్యములున్నవి. కవితాశైలి సరళం. నృసింహావతారాన్ని ఈ కవి చక్కగా నేర్పుతో వర్ణించిరి.

'యాదగిరినృకేసరీ' అను మకుటముతో సకలనీతి విషయాలతో రచించిరి.

## 9. నృహరి శతకం

ఇది శ్రీ ఎన్. బలరామశర్మ 110 కందములతో రచించిరి. స్త్రీలకు, ఏమీ చదువురాని వారికి అర్థమయ్యే శైలియందు ద్రాక్షాపాకంలో, నీతి వైరాగ్యవిషయాలు తెల్పబడ్డాయి. నృసింహుని తప్ప ఎవ్వరినీ నమ్మవద్దని కవియుద్దేశం.

నమ్మను యోగులు జోగుల
నమ్మను మంత్రములటన్న నమ్మనుమాయల్
నమ్మను యంత్రబలమ్ముల్ను
నమ్మనురా నిన్ను దప్పయన్యుల నృహరీ.

## 10. శ్రీ యాదగిరీశ స్తోత్ర రత్నము

దీనిని శ్రీ సింగభట్టు నరసింహరాజ

(43 వ పేజీలో







(గత సంచిక తరువాయి)

కాంత లెందరనో కాంచె కపివరుండు
రావణుని యందె అత్యనురాగ మతుల
కనకవర్ణాంగి నొకతె నేకాంత శయ్య
పవ్వళింపగ జూచె నా పవనసుతుడు.

అంత అంతఃపురేశ్వరి నామె దలచె
సీతయే యని; హర్షము చెంది వేసె
గంతులును చిందులును; వేడ్క-క్షణములోన
ఆమె వైదేహి కాదంచు అవల తరిగె.

రావణుడు సంభ్రమునుదాటు రభస మందు
వనిత కన్నులు తిరిగి ఆ వార్ధిబడెనొ!
కినుక పై రావణుండె భక్షించెనేమొ!
వాని భార్యలె కడు మచ్చరాన తినిరొ!

జానకిని నేను కానంగ జాలకున్న
అవని నిక్ష్వాకు కులనాశ మగుటె కాదు;
సకల వానరలోకమ్ము సమసిపోవు
ఎట్టులున్నదో నా భాగ్య మెవ్వ డెరుగు?"

# రావుల రామాయణము

"ఈమె ఎట్లగు సీత? నిజేశు గనక
నిదుర పోవునె నిముసమ్ము? నిత్యచింత
అన్నపానీయములు సైప వవనిసుతకు
కనకభూషితయై ఇట్లు కునుకునొక్కొ?"

అసురపత్ని మందోదరి ఆమె అనుచు
వేసరక ఎన్ని చోట్లనొ వెదకి వెదకి
జానకిని కానజాల కెచ్చటను కూడ
తలచె తన జన్మ మింక నిష్ఫల మటంచు.

జాతిభవితవ్యము దలంచి జవము నొంది
దీక్షతో వానరుండు యత్నించె మరల;
ఎంత గాలించినంగాని యింతులందు
సీత కనరామి నీ రీతి చింత చేసె.

సుదతి వైదేహి కోసమై వెదకసాగ
కాంచె నా కార్యశూరుడు కడకు హనుమ
కనకమయములు బహుళవృక్షాలతోడ
అంద మెగజిమ్ము న య్యశోకాంతరమ్ము.

ప్రస్ఫుట లతాంత పరిమళ భరిత మగుచు
చూడ నీ వనమెంతయో సొబగుమీరు
వనుల అందమ్ము నచ్చెడు వనితగాన
దీనురాలిట మహిజాత తిరుగవచ్చు."

అట్టు లూహించి అట్టిట్టు లరిగి కాంచె
వేదికలు వేయికంబాలు వెలుగులీన
మింటె నంటుచు, బంగరుమెట్లతోడ
చైత్యమును బోలె అలరు ప్రాసాద మొకటి.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి



'చంద్రశేఖర్'

మైథిలీ మార్గణ నిమగ్న మానసుండు
హనుమ కనుగొనియె నశోకవనములోన
అసురకాంతలమధ్యమం దతి కృశాంగి
వనిత నొక్కతె మాసిన వలువ దాని.

"అన్నపానీయములు మాని అహరహంబు
చింతతో లజ్జతో నెంతొ చిక్కి స్రుక్కి
ధ్యానముద్రా నిమీలిత దీననయన
అతివ తలపోయ జానకి యగుట? నిజము.

రామపత్ని కావచ్చు లక్షణము లరయ
రావణుడు వ్యోమవీథి గొంపోవుచుండ
అరసినారము ఋశ్యమూకాద్రినుండి
పొలతి; నాబిడయే ఈమె పోల్చుకొనగ.

తనదు తనుకాంతిచే లతాతన్వి ఈమె
తరిమివైచెను చీకటితండములను
ఎంచగా పెక్కుచందాల మించు నీమె
కుసుమకోదండు ముద్దులగుమ్మ రతిని.

సీత నగలెల్ల రాముండు చెప్పె నాకు
నేల విడిచిన ఆభరణాలు తక్క
అవిగొ అన్యము లా దీనురాలి దరిని
వరలు తరుశాఖ వ్రేలాడు తరచి చూడ.

నారి నగలతో విడిచిన చీరకొంగు
ఈ రమణి మేన దాల్చిన చీరరంగు
ఏకవర్ణమ్మె; రాముని యెడద నిండె
సీత; ఈ సతి మది పతిచింత నిండె.

రామచంద్రుడు డీ నాతికై బ్రదికి యుండె
ఈమె జీవించు? నిజహృదయేశు కొరకె"
అనుచు మైథిలి కడు మెచ్చుకొనుచు విభుని
రామభద్రుని కపిరాజు ప్రస్తుతించె.

దుఃఖసంతప్తయైన ఆ తోయజాక్షి
నరసి సాలము మూలము నందు హనుమ
ఆమె సీతయే అని నమ్మి అణగి యుండి
వృక్షశాఖల నడుమనె, వేచియుండె.

జానకిని గాంచునచ్చోట వానరుండు
రాక్షసస్త్రీల ఘోరదర్శనల గనియె
ఆమె కనతి దూరంబున; రాము దలచి
హర్ష మందుచు వందనం బాచరించె.

వచ్చెనంతట కామవిహ్వలుడు నగుచు
రాక్షసాంగనలను గూడి రావణుండు
దుర్నిరీక్షమహాతేజు దురితకర్ము
నతని దోర్దండ వింశతి, నరసె హనుమ.

రావణుని రాకకు వడంకె రామపత్ని;
రామనామము స్మరియించు నేమ మూని
అగ్గలంబగు శోకంబు నందు మునుగు
ఆ పతివ్రతాతిలకమ్ము నసుర డాసి.

దీనురాలయి కుములు వైదేహి జూచి
ప్రకట కామ లోభోక్తి రావణుడు పలికె
"నాగనాసోరు! నీవేల నన్ను జూచి
ముడిచి కొందువె యొడలెల్ల పడతి! భీతి?"

సర్వలోకమనోహరీ! సన్నుతాంగి!
వాంఛ నీ పైని నెలకొల్పి వచ్చినాడ!
కామరూపుల మము నరుల్ కానలేరు;
ఏను గలుగంగ భయము నీకేల లలన?

సీత! నమ్ముము నిన్ను స్పృశింప నిపుడు
కామ మేనాడు నా పైని కలుగు నీకు
అపుడె కడగంట నింత న న్ననుమతింపు
శోక మెల్లను విడనాడి సుఖము గనుము.

ఏకవేణీధరణ మేల? ఏల జాలి?
వాడ నెమ్మేను కరినోపవాస మేల?
దైన్యమున కుందగా నేల? ధ్యాన మేల?
ఇటు మలిన వస్త్రమును దాల్ప నేల బేల?

వివిధ దివ్యాంబరంబులు వెలయు నిచట;
అమలముక్తామణీ భూషణములు కలవు
అగణితమ్ములు కేళీగృహాలు కలవు
గాన నాట్య వినోదాల గడమ ప్రొద్దు.

సహజసౌందర్య సముపేత! సత్య మరయ
తిరిగి రాదు యౌవనము గతించె నేని
మనుము నా భార్యగా అగ్రమహిషి వగుచు;
సమరమం దెవ్వడును నాకు సాటిరాడు.

రాము డిచటికి రాలేడు; రాణి వగుచు
అనుభవింపుము సకలసౌఖ్యాలు నీవు
విమల కీర్తి తేజమ్ముల విక్రమాన
భామ! నాకెందు సాటియే? ఆ మనుజుడు!

అసురనాథు ప్రల్లదముల నాలకించి
దీనరవమున పలికె వైదేహి యిట్లు
"ఉద్భవించిన నా కుల మున్నతంబు
సమము నే మెట్టినట్టి వంశమ్ము కూడ.

నేను సాధ్విని; ఏకపత్నీ వ్రతుండు
పతి; జగాన మహాదృష్టవతిని; బ్రదుకు
స్వీయభార్యల సంతుష్టి చెంది నీవు
చెడకు నా మాటలను పెడచెవుల బెట్టి.

లోగ నలతినె? నీవు ప్రలోభపెట్ట?
భోగభాగ్యాలు తృణసమమ్ములు దురాత్మ!
ఘోరమరణమ్మునే నీవు కోరు కొనక
బ్రదుక దలచిన, నన్ను నా పతిని జేర్పు.

భక్తి గొనిపోయి అతని కర్పణము సేయ
నిన్ను సైతము మన్నించు నిక్క మతడు
సన్నుతాత్ముడు ధర్మజ్ఞచక్రవర్తి;
రాముని పవిత్రమైత్రి కర్తవ్య మగుత.

రామ బాణమ్మె కొనును నీ ప్రాణచయము
రాక్షసాళిని చంపును రామవిభుడు
అపహరించితి వీవు న న్నద రీతి
రాముచేతను చత్తువు రణములోన."

ఉవిద సీతను గాంచి మహోగ్రు డగుచు
విభుడు రావణుడు పలికె విప్రియంబు
"పరుష వాక్యాల నెన్నియో పలికినావు
మిన్నకుంటిని నిన్ను కామించు కతన.

గడువు నేను నీ కిడినది గడచు చుండ
నెలత! మిగిలెను నీ కిక నెలలు రెండె;
ఇంతలో నీవు నా శయ్య నెక్కకున్న
అసుర లా మరుదినమె ని న్నారగింత్రు.

జానకి వచించె ఆత్మవిశ్వాస మలర
"కట్టుకొంటివి కఠినవాక్యాలు పలికి
ఘోరపాపము నీకుగా కోరి నీవె;
ఏలొకో చీలదయ్యె! నీ నాలు కిపుడె.

తలప దశరథరాజుకోడలిని నేను
దాశరథిధర్మపత్నినై ధన్యనైతి;
పనిగొనను గాక కానమి పతి అనుజ్ఞ
చిటికలో నిన్ను భస్మమ్ము చేసియుందు.

ఉగ్రజిహ్వోగ్ర నేత్రంబు లొనర నసుర
పలికె సీతతో భయదసర్పమ్ము పగిది
"పనికిమాలిన వానిని ప్రభు వనియెదు
నిన్ను నాశ మొనర్చుట నిక్క మగును."

(సశేషం)

# మనల్ని మనం తెలుసుకోవాలి

శ్రీ పాతూరి ప్రసన్నం

ఒక వ్యక్తిగానీ, ఒక సమాజంగానీ, ఒక జాతిగానీ అభివృద్ధి చెందాలంటే, ముందుగా తమతమ ప్రస్తుత పరిస్థితిని గూర్చి కూలం కషంగా తెలుసుకోవాలి. మనయొక్క గత మును, గతం నేర్పిన పాఠాలనూ వర్తమా నంలో ప్రతిబింబించాలి. గతాన్ని మరచి పోయి భవిష్యత్తుకు బాటలు వేయలేము.

## నిన్నటినుంచి నేడు నేటి నుంచి రేపు

మనం చేసే పొరపాట్లు రెండున్నాయి. ఒకటి గతాన్ని తలుచుకుంటూ వర్తమానం లోని కర్తవ్యాలను ఉపేక్షించటం; రెండు భవిష్యత్తును గూర్చి కలలు కంటూ వర్తమా నంలో చేయవలసిన కర్తవ్యాన్ని ఉపేక్షించటం. ఈ రెండు పొరపాట్లు చేయకుండా, గతం నేర్పిన పాఠాలను మనస్సులో వుంచుకొని, భవిష్యత్తులో ఎదుర్కోవలసిన పరిస్థితులను కూడా దృష్టిలో పెట్టుకొని వర్తమాన కర్తవ్య మును సముచితమైన విజ్ఞతతో, సందర్భోచిత మైన దక్షితతో, సమయస్ఫూర్తితో వర్తించాలి! మహాకాల ప్రవాహంలో గతం, వర్తమానం, భవితవ్యం అనేవి మన మనస్సుపై తగినం తగా ఎప్పుడూ ప్రభావం చూపుతూ వుండాలి. నిన్నటి రోజును గుర్తుంచుకోవటం "సింహా వలోకనం' ' అవుతుంది. రేపటి దానిని ఊహించటం "ముందుచూపు". అవుతుంది. నిన్నటికీ, రేపటికీ నడుమగల ఈ వర్తమానం అనేదే మన జీవిత సౌధానికి పునాది కావాలి.

రేపటి ఉన్నతికి నేటి మంచి చెడూ, బల హీనతలూ బలమైన ప్రేరణలూ, అన్నింటినీ యధాతథంగా గుర్తించాలి. ఒక బలహీనుడు న్నాడు. కానీ తాను బలహీనుణ్ణి అని అంగీక రించడు. అట్టి వాడు జన్మలో బలవంతుడు కాలేడు. ఒకడు ఎన్నో దుఃఖాలతో మునిగి బాధపడుతున్నాడు. సుఖప్రాప్తికి ముందుగా తన దుఃఖ కారణాలనూ, దుఃఖతర పరిస్థితు లనూ గూర్చి తెలుసుకొన్న తర్వాతనే అతడు నిజమైన సుఖాన్ని పొందగలడు. అలాచేయక, "నాకేమీ! నేను సుఖంగానే వున్నాను" అని బాహ్యాడంబరాలను ప్రదర్శించే వ్యక్తి ఎన్నటికీ నిజమైన సుఖాన్ని పొందజాలడు.

రోగికి ఆరోగ్యం కలగాలంటే రోగ లక్షణాలను తెలుసుకోవాలి. రోగ కారణా లను విచారించాలి. తర్వాతనే రోగనివారణ సాధ్యం అవుతుంది.

ఇదే సూత్రం వ్యక్తికీ, జాతికీ కూడా సమానంగా వర్తిస్తుందీ.

## ఎరుక, గుర్తింపుల ప్రత్యేకత

ప్రతి మనిషి జీవితంలోనూ మంచి రోజులూ, గడ్డు రోజులూ వున్నట్లే, జాతి చరి త్రలోనూ స్వర్ణయుగాలూ, చీకటి యుగాలూ వుంటాయి. తన గత వైభవాన్ని, గతం నేర్పిన పాఠాలనూ మరచిపోయిన జాతి యొక్క జీవనం చీకటి రాత్రిలో గుడ్డివాడి అవస్థను పోలినటువంటిదే! తన జాతీయ సంస్కృతి, జాతీయధర్మం, జాతీయ ఆశయం అనేవా టిని గుర్తుంచుకొని, వాటిని వర్తమానానికి అనుగుణంగా మలచుకొని వర్తించే జాతికి ఎప్పుడూ స్వర్ణయుగమే!

ఈనాడు మన యువతరాన్ని పట్టుకొని పీడిస్తున్న నైరాశ్యం, నిస్పృహలు ఎన్నో అన ర్థాలకు దారితీస్తున్నాయి. "సమస్యలవల్ల, అననుకూల పరిస్థితులవల్ల ఈ నైరాశ్యం, నిస్పృహలు కలుగుతున్నాయి, అంటే అది అంగీకారయోగ్యమైనట్టిదికాదు!"

సైన్సు టెక్నాలజీలలో యువతరానికి ప్రావీణ్యం వుండవలసినదే! కానీ వాటితో పాటు ఆత్మ విశ్వాసం, నైతిక విలువల ఆవ శ్యకతను కూడా యువతరం నేర్చుకోవాలి! వ్యక్తిగత సంస్కారాన్ని, జాతీయ సంస్కా రాన్ని రెంటినీ పోషించే జీవిత విధానాన్ని కూడా యువతరం నేర్చుకోవాలి! ఇది గతం చెప్పిన పాఠాలనూ, గత చరిత్ర చెప్పిన యధార్థాలనూ తెలుసుకోవటంచేత సంభవి స్తుంది!

యువతరం సమస్యలకూ, యువతరం ఎదుర్కొనే వైరాగ్యానికి అననుకూల పరిస్థితు లకూ ఎలా ప్రతిస్పందించి, అధిగమించి జీవిత లక్ష్యాలను సాధించాలో మన జాతియొక్క గత అనుభవాలు మనకు నేర్పుతాయి.

" Know Thy Self" (నిన్ను నీవు తెలు సుకో) అంటారు తత్త్వవేత్తలు.

తన గృహమున నభ్యాసం
బున మెలగెడి అంధు చందమున, సంసారం
బున దిరుగు మూఢుం డెరుగడు
వినుతంబగు మోక్ష పదము విమల వివేకా!

--ఆంధ్ర మహాభారతం -- శాంతిపర్వం 5/532

మన బ్రతుకులు తన స్వగృహంలో అల వాటుప్రకారం బ్రతికే అంధుని బ్రతుకువంటివి కాకూడదు.

కష్టపరంపరలు ఎదుర్కొని సుఖప్రాప్తిని చెందటం, నష్టాలను అధిగమించి లాభాలను. పొందటం, దుఃఖాన్ని, పరాజయాన్నీ, పత నాన్ని తొలగించి ఆనందాన్ని, విజయాన్ని, అభ్యుదయాన్నీ వరించటం అనేవి మనల్ని మనం గుర్తించటంలో, మన శక్తిని గుర్తించి పెంపొందించి లక్ష్యాలను సాధించటంలోనూ ఇమిడి వుంటాయి.





# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కామకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడ ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాలకోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణ మితి శ్రుతిః।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః।

— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీత మైనదీ వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

'చంద్రశేఖర'

# శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్యవారి దివ్య భాషణము

ఓం ఓం ఓం ఓం

సశంఖ చక్రం సకిరీట కుండలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్
సహారవక్షఃస్థల శోభికౌస్తుభం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్.

సాక్షాత్తు ప్రత్యక్ష దైవం, పలకరిస్తే పలికే దైవం, ఆరాధిస్తే అలరించే దైవం, భావిస్తే అనుభవ రూపంగా ఉండేటటువంటి దైవమైన శ్రీనివాస ప్రభువు యొక్క దివ్య చరణారవిందములకు సాష్టాంగ ప్రణామములు సమర్పిస్తున్నాను. సాక్షాత్తు ఆ వేంకటేశ్వర స్వామియొక్క ఆ వైభవాలు, అనుభూతి చెందుతూ ఇక్కడ ఏ ఒక్కింతసేపు వున్నా అది సాక్షాత్తు స్వర్గలోకానుభూతిగా ఆనందాన్ని అనుభవిస్తున్నాము.



ఇటీవల తిరుమల ఆస్థానమండపంలో విజయవాడ శ్రీశ్రీశ్రీ మాతా శివ చైతన్యగారు ఇచ్చిన దివ్యసందేశం ఇది.
సం॥

మనపూర్వులు చెప్పారు. భగవదనుగ్రహమనేటటువంటిది మనమీద వుంటే ఎక్కడో ఉన్నా, భగవంతుడు తన సన్నిధానానికి మనల్ని పిలిచి రప్పించుకుంటాడు. తెప్పించుకొని ఏది చేయాలంటే అది చేయించుకుంటాడు. ఈనాడు మనకి మానవజన్మ వచ్చింది అంటే అది భగవదనుగ్రహము వల్ల. మరి ఆ భగవదనుగ్రహము ఎల్లప్పుడూ పొందాలి, సాధించాలి అంటే ఏమి చేయాలండి? నీవు ఏ పని చేస్తూ ఉన్నప్పటికీ కూడ, మనసు భగవంతుడి వైపు సంలగ్నము చేస్తూ వుండు. అదే మనకు ప్రహ్లాద స్వామి గురించి చెబుతారు:

పానీయంబును త్రాగుచున్
కుడుచుచున్ భాషించుచున్, హాస లీ
లా నిద్రాదులు చేయుచున్
తిరుగుచున్ లక్షించుచున్ సంతతశ్రీ
నారాయణ పాదపద్మ యుగళీ
చింతామృతా స్వాద సం
ధానుండై మరచెన్ సురారి
సుతు డేత ద్విశ్వమున్ ...

అని నారద మహర్షి ధర్మరాజుకు చెబుతున్నారు. తిరుగుతూ, కూర్చుంటూ, లేస్తూ, ఏం చేస్తుంటాడండీ? 'సంతతం' అంతం లేకుండా శ్రీమన్నారాయణుని దివ్యపాదారవింద స్మరణచేస్తూ ఈ ప్రపంచాన్ని ఒక లీలగా, ఒక ఆటగా వ్యవహారాలను ప్రహ్లాదుడు సాగిస్తూ వున్నాడు. బాలభక్తుడైన ప్రహ్లాదుడే చేయగా మనం చేయలేమా? చేయడం ఆధ్యాత్మిక చింతన అయినా, లేదా భగవత్ చింతనైనా ఎప్పుడో రిటైర్ అయిన తరువాత కదండి మనం చేసేది అని అందాము అంటే, రిటైర్ అయ్యేంతవరకు మనము బ్రతుకుతాము అని గ్యారంటీ ఎవరైనా ఇవ్వగలరా? చూస్తూనే వున్నాము. కొందరు గర్భంలో పోతున్నారు. కొందరు బాల్యంలో, కొందరు యవ్వనంలో, కొందరు వార్ధక్యంలో పోతున్నారు. అందుచేత ఎప్పుడూ ప్రహ్లాదస్వామి వలె అమ్మ గర్భంలో ఉండగానే నీకు ఆ అభ్యాసాన్ని నీ తల్లిదండ్రులు చేయిస్తే ప్రసవించిన తరువాత నీ అంతట నీవు చేయగలవు.

అందుచేత మన భారతీయ ఆర్ష సంస్కృతి, షోడశ అంటే 16 సంస్కారములను అందించింది. మొట్టమొదటిది గర్భాధాన సంస్కారం. ఈనాడు మన దౌర్భాగ్యం ఏమంటే, ఈ సంస్కారాలన్నింటిని ప్రక్కన పెట్టినాము, కాబట్టి కావలసినటువంటి సత్సంతానాన్ని పొందలేక పోతున్నాము. సమాజాన్ని సక్రమంగా తీర్చిదిద్దుకోలేక పోతున్నాము.

భాగవతంలో చెబుతారు, ఈ భూమికి భారమయ్యేటటువంటి వారి నందరినీ ముందుగా తీసుకు వచ్చేయమని యమ ధర్మరాజు తమ భటులను పిలిచి ఇలా చెబుతున్నారు:-

# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం



శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి, శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.



శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.



శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి!
-శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం



శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.



శ్రీ అగస్త్యేశ్వరాలయం-తొండవాడ.
కళ్యాణీ తటాన ఉన్న ప్రశాంత దేవాలయం



శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా నెలకొన్న దేవాలయం





బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6గం॥కు, 10గం॥కు
సాయంత్రం: 3గం॥కు



టిక్కెట్టు వెల:
పిల్లలకు : రూ. 10/-
పెద్దలకు : రూ: 20/-
ప్రతిచోట ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR

"ఏకసక్కమునకైన ఇందిరా రమణుని పలుకంగ లేని దుర్భాషితులను"

ఇప్పుడు స్వామి సన్నిధానానికి వస్తున్న వారంతా భక్తితోనే వస్తున్నారా? కొందరు భక్తితో, కొందరు నిస్స్వార్థంతో, కొందరు తమ కోర్కెలు నెరవేరడానికి వస్తున్నారు. ఒక వ్యాపారి స్వామిని "స్వామీ నాకు ఈ సంవత్సరం 3 లక్షలు లాభంవస్తే దానిలో ఒక లక్ష నీకు హుండీలో వేస్తాను" అని మొక్కు కుంటాడు. స్వామి అంతర్యామి కదండి; మూడు లక్షలు వస్తే ఒక లక్ష హుండీలో వేస్తానన్నాడు కదా అని రెండు లక్షల లాభా న్నిచ్చాడు. వ్యాపారి అనుకున్నాడు, నేను 3 లక్షలు అడిగాను. ఆయన 2 లక్షలు ఇచ్చాడు, తన లక్ష రూపాయులు తనే హుండీలో వేసు కొని మిగిలిన రెండు లక్షలు ఇచ్చాడని, ఆ స్వామినే మోసం చేయాలని తయారయ్యాడు. ఈ విధంగా కొందరు కోర్కెలతోనూ, మరి కొందరు నిష్కామ భక్తితోనూ రావచ్చు.

చతుర్విధా భజంతే మాం
జనా స్సుకృతినోఽ ర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ.

--భగవద్గీత

ఆర్తితో అంటే నాకు ఆపదవచ్చింది, ఏడుకొండలవాడా! అని కొందరు.

జిజ్ఞాసువు అంటె "ఈ ప్రపంచమంత ఎవరి ఆజ్ఞతో, ఎవరి శక్తితో నడుస్తోందో తెలుసుకోవాలనుకునేవాడు. ఆయనే 'జ్ఞాతు మిచ్ఛతీతి జిజ్ఞాసుః'."

ఇక మూడోవాడు "అర్థార్థి చెప్పినట్టు, తనకు లాభం వస్తే గుండు చేయుంచు కుంటాననేవాడు. నాలుగోవాడు 'జ్ఞాని', అటువంటి వాడు స్వామీ, నీవు దైవుడవైతే నేను జీవుడను. మరి ఇంకా మనిద్దరి మధ్య ద్వైత భావన ఉన్నదా? లేక నేను నీవు ఒక టేనా?" అని తత్త్వాన్ని తెలుసుకొనేదానికి వెళ్ళేవాడు 'జ్ఞాని'.

"ఈ విధమైనటువంటి భక్తి భావనతో స్వామి సన్నిధానానికి వస్తున్న వారిని మాత్రం ఏమి చేయవద్దు సుమా" అని యమధర్మ

## విజ్ఞప్తి

## శ్రీవారి ఆలయం, తిరుమల.

తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీవారి ప్రసాద పణ్యారములు, ఆర్జిత చేరుపులు, పడుల ధరలు 27-7-92 నుండి ఈ క్రింది విధంగా వుంటాయి.

భక్తులు ఈ విషయాన్ని గమనించి ఆ యా మొత్తాలు చెల్లించ వలసిందిగా విజ్ఞప్తి.

| | | | |
|---|---|---|---|
| 1. | పొంగలి | $\frac{1}{4}$ సోల | రు. 225-00లు |
| 2. | చక్కెర పొంగలి | ,, | రు. 250-00లు |
| 3. | పులిహోర | ,, | రు. 200-00లు |
| 4. | దధ్యోదనం | ,, | రు. 100-00లు |
| 5. | శాకరి బాత్ | ,, | రు. 250-00లు |
| 6. | సీరా | ,, | రు. 450-00లు |
| 7. | పాయసం | ,, | రు. 225-00లు |

రాజు చెబుతున్నాడు. ఏ భావంతో వచ్చినా స్వామి సన్నిధానానికి వచ్చారు. కనీసం మన నోటితో, 'గోవిందా' అనకపోయినా, సాటి భక్తులు అంటూవుంటే వింటాము. 'గోవింద' అన్నటువంటి వారికి ఎటువంటి ఫలితం వస్తుందో విన్నవారికి కూడ ఆ ఫలము వస్తుంది.

ఎకసెక్కమునకైన ఇందిరా రమణుని
పలుకంగ లేని దుర్భాషితులను
కలలోననైన శ్రీకాంతుని పత్పాద
కమలమున్ సూడని కర్మ దృశుల
నవ్వుచునైన కృష్ణ ప్రశంసకు
చెవిదాల్పనేరని దుష్కథాప్రవణుల
యాత్రోత్సవంబులనైన ఈశుని
గుడిత్రోవ ద్రొక్కగ లేని దుష్పదులను
పరిహాసమునకైన ఇందిరా రమణుని
పలుకంగ లేని దుర్భాషితులను.

పరిహాసమునకైన ఎందుకో గోవిందా అన్నాడు, నేను గోవింద అని అనుకో ఆయ నను కూడ నీవు ఏమి చేయవద్దు సుమా! ఒక వేళ ఆ భావంగా అనకపోతే వారిని పట్టుకో!

రెండవది: కలలోననైన శ్రీకాంతుని సత్పాద కమలమున్ సూడని కర్మదృశుల

శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రత్యక్షంగా ఈ కంటితో చూడలేకపోయినా, స్వామిని ఆర్తితో ఆయన దర్శనమునకై కలవరించు వారికి కలలో దర్శన మిస్తాడు. ఈ విధంగా కలలో, ఇలలో చూడని వారిని కూడ పట్టుకో!

మూడవది : నవ్వుచునైన కృష్ణ ప్రశంసకు చెవి దాల్చనేరని దుష్కథాప్రవణుల.

అక్కడ ఏదో పురాణం జరుగుతోందట. ఎవరో అబ్బాయట. అతను హాస్యానికైన వచ్చి వింటే పరవాలేదు. హాస్యానికైన వచ్చి వినలేదనుకో అతనిని పట్టుకో. ఇతరుల గురించి లేనిపోని మాటలు చెప్పేవాడిని కూడ పట్టుకో.

నాలుగోది : యాత్రోత్సవంబులనైన ఈశుని గుడిత్రోవ ద్రొక్కగలేని దుష్టగులను

స్వామి బ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి; స్వామితోపాటు ప్రదక్షిణ చేసి మానవజన్మకు చరితార్థం చేసుకుందాము అన్న భావనతో వెళ్తే పరవాలేదు. అట్లాలేని వాడిని కూడ పట్టుకో.

ఇక చివరగా : పరమ భాగవతుల పాద ధూళి సమస్త తీర్థ సారమనుచు తెలియలేని

'వారి వారి వారి వారి జేరిన వారి తొలుత కట్టి తెండు దూతలార!'

ఎవరెవరు పరమ భాగవతులు వున్నారో, భాగవతులు అంటే ఎవరు భగవదనుభూతుల్ని పొందినటువంటి వారంతా భాగవతులే. స్వామి భగవంతుడైతే, స్వామి భగవత్ తత్త్వాన్ని అనుభవించినవారు పరమ భక్తులు. భక్త మీరా, భక్త నామదేవ్‌లు కలరు. కనీసం ఆ భాగవతోత్తముల యొక్క పేర్లను రోజుకు ఒక్కసారి స్మరణకు తెచ్చుకుంటే ఆ భక్తుడు నీ హృదయములో వుండి, ఆ భక్తికి నీకు కూడా ప్రసాదిస్తాడు. గోపికల భక్తిని నేర్చుకోమని అంటారు. గోపికభక్తి ఎంత సులభమో అంత కష్టమే. అలా నీవు నీ అభిరుచికి తగ్గ భక్తుని ఆదర్శంగా తీసుకో. తీసుకోవడంద్వారా వారి పాద తీర్థము యొక్క, లేక పాద ధూళి కాస్త నీ శిరస్సున దాల్చు. సాక్షాత్తు శ్రీ కృష్ణపరమాత్ముడు చిన్నప్పుడు గోవులను మేపడం కోసమని అమ్మ అనుజ్ఞ తీసుకొని, కాళ్లకు చెప్పులు లేకుండా వెళ్తానంటాడు. అరణ్యాలలో తిరగవలసి వస్తుంది. కాళ్లకు ముళ్లు మొదలైనవి గుచ్చుకుంటాయి; తలకు గొడుగు వేసుకొని వెళ్ళాలి అని యశోదా దేవి అనగా, అమ్మా! నేను ఎందుకు వచ్చానో తెలుసా! గోవులనన్నింటిని పరిపాలించడానికి వచ్చాను. మరి నాకు ప్రభువు ఎవరు? గోమాత, మరి గోమాత చెప్పులు వేసుకుందా? లేదే! గోమాతకు ఛత్రం పట్టారా? లేదే! మరి నా ప్రభువుకు ఇవి రెండు లేనపుడు నేను ఎలా వేసుకుంటానమ్మా?విశదముగా చెప్పు అని. నారదుని వంటివారు అడుగగా, ఆయనంటారు "నేను చెప్పులు వేసుకుంటే నా భక్తులకు నాపాద చిహ్నములు ఎలా తెలుస్తాయి? తెలియవు. ఆ బృందావన సీమలో, ఇసుక తిన్నెలలో నేను నడుస్తుంటే నా పాదములో చంద్రరేఖ, హలరేఖ, చాపరేఖలను బట్టి మాస్వామి ఈ మార్గం గుండా వెళ్ళారు అని ఆ ముద్రను గుర్తించి వెళతారు అని చెప్పాడట! అందుకని ఈయన చెప్పులు వేసుకోలేదు."

భగవంతుడు భక్తవత్సలుడు. ఆ వాత్సల్యము భగవంతునికి మాత్రమే ఉన్నదికానీ మిగిలినటువంటి ఏ తల్లికి కూడ లేదండి! ఎందుకని? ఆయన ఈ తల్లులందరికీ, తండ్రులందరికి తండ్రికాబట్టి. అందుచేతనే ఆయన చెప్పులు లేకుండా నడవటం. ఒక గోపమ్మ అంటుంది. "అయ్యో, నా స్వామి పాదాలకు చెప్పులు లేకుండా వెళుతున్నాడే?" అని అది విని మరొక గోపమ్మ అంటుంది. నీ వేమి బాధ పడక్కరలేదు. ఎందుకని? ఆయన పాదము సోకేసరికి అక్కడ రాయి రప్ప వెన్నలాగ సున్నితంగా మారిపోతుంది." స్వామి యొక్క చరణ ధూళికే రాయి తమ సహజ స్వభావాన్ని కోల్పోయి, నవనీతంగా మారిపోతుందట! భక్తుల దృష్టిలో ఇక్కడ రాయి రప్ప, మనిషి భావం ఉన్నది కాబట్టి ఆ గోపికకు ఈ గోపిక సమాధానం చెప్పింది. పరమ భాగవతుల పాద ధూళి సమస్త తీర్థసారమనుచు, ఎవరైతే తెలియలేరో ఆ తెలియనటువంటివారిని, వాళ్ళ స్నేహితులను, ఆ స్నేహితులయొక్క స్నేహితులను. నాలుగు పదాలు 'వారి, వారి, వారి, వారి' అని వాడారు. వాళ్ళందరిని ముందు పట్టి తెచ్చేయండి. దూతల్లార! అని యమధర్మ రాజు చెప్పాడు. మరణం ఎవరికండి. దేహానికి కావచ్చు.

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽ పరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా -
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

గీతాచార్యుడు చెప్పినట్టు, మాసిన చినిగిన వస్త్రాన్ని వదలి పెట్టి క్రొత్త వస్త్రాల్ని ధరిస్తున్నాము. విడిచిపెట్టునపుడు బాధపడక, పైగా సంతోషిస్తున్నాము. అలాగే దేహ మను విలక్షణము వస్తుంది. నీకు విలక్షణము ద్వారా, వార్ధక్యము, రోగము వస్తాయి. రోగము ఎవరికండీ? నేను వేసుకున్న శరీరానికి. శరీరం పోవచ్చు, మరొక శరీరం వస్తుంది. అందుచేత శరీరమునకంటే నేను వేరుగనే ఉన్నాను. శరీరము లోపల ఉన్నటువంటివాడు శరీరి, దేహములోపల వున్నటువంటివాడు దేహి. ఈ విధమైన విలక్షణత్వం నీకు తెలుస్తుంది. తద్వారా మరణం ఎవరికి? నాకు కాదు, అన్నటువంటి భావము కలుగుతుంది.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి
నైనం దహతి పావకః
న చైనం క్లేద యన్త్యాపో
న శోషయతి మారుతః
--గీత

గీతాచార్యుడు ఏ అర్థాన్నైతే చెప్పారో, అదే అర్థాన్ని సులభంగా తెలుగులో "దేహి నిత్యుడు, దేహము లనిత్యాలు' ' అన్న పద్యములో మన అన్నమయ్య గూడ చెప్పారు.

ఆత్మను ఎవరు చంపలేరు. ఈ విజ్ఞానాన్నే, అర్జునుని అడ్డుగా పెట్టుకొని అందరిని దృష్టిలో పెట్టుకొని స్వామి, "ఆత్మ చంపబడేది కాదు. నీవు వేసుకున్నటువంటిది అనాత్మైనటువంటి దేహము మాత్రమే, వస్తుంది - పెరుగుతుంది - మరల తిరిగి లయిస్తుంది." దానికి షడ్భావ వికారాలు వున్నవి అన్నారు. దేహికి లేదు.

(36వ పేజీలో)




అన్నమాచార్య జయదేవులు తెలుగు సంస్కృత భాషలలో ప్రప్రథమ వాగ్గేయ కారులు. అష్టపదుల్లో జయదేవుడు, సంకీర్తనల్లో అన్నమాచార్యుడు భక్తి, మధురభక్తి, శృంగారం, అభినయాన్ని జోడించి - అభివ్యక్తీకరించిన వాగ్గేయకారసత్తములు.

అన్నమాచార్యుడు పదరచన ఆధ్యాత్మ శృంగారకీర్తన, రచన చేసి ఆడి పాడి తరించాడు. తెలుగులో ప్రథమ వాగ్గేయ కారుడు. అందువల్లనే ఆయన 'పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు'. జయదేవుడు గీతగోవిందంలో అష్టపదులు పాడుతూంటే అతనిభార్య పద్మావతి అభినయించేదట. తద్వారా గీత సంగీతాలతోపాటు అభినయానికి ఎంతో ప్రాధాన్య ప్రాచుర్యాలు తెచ్చిన వాగ్గేయకారులు జయదేవ అన్నమాచార్యులు.

అన్నమాచార్యుడు సంకీర్తనల్లో భక్తి శృంగారాలను వర్ణించి తరించాడు. ఇతని సంకీర్తనలు వేదికలే రసప్రతిపాదకాలైన రసవత్కావ్యాలు, ముక్తకాలు. జయదేవుని గీతగోవిందం గీత కావ్యం. ఇరవైనాలుగు అష్టపదులు ముందు వెనుక కొన్ని శ్లోకాలు రచించాడు. అష్టపదులను వేటికవే పరిస్తే, పాడి ఆడితే రసభావ వ్యంజకమై ఆనంద ప్రధానాలుగా ఉంటాయి. రాధామాధవ శృంగార లీలలను చలచ్చిత్రాలుగా చిత్రించాడు జయదేవుడు. అన్నమాచార్యుడు కొన్ని సంస్కృత పదాలను సైతం రచించాడు. జయదేవుని అష్టపదులను స్మరింపచేస్తాయి.

జయదేవునితో ప్రారంభమైన కృష్ణభక్తి, అన్నమాచార్యలో ఫలవంతమైందని చెప్పవచ్చు. జయదేవుడు అన్నమాచార్యులిద్దరు తమ రచనల్లో భక్తి శృంగారాల్లో ప్రత్యేకించి మధురభక్తిలో జీవాత్మ పరమాత్మలో సమైక్యం పొందడానికి పడిన తపనను అభివ్యక్తీకరించారు.

జయదేవుని భక్తి మొదటి అష్టపదిలోనే దశావతారవర్ణనలో విదితమవుతుంది.

ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహితవహిత్ర చరిత్ర మఖేదమ్.
కేశవ! ధృతమీనశరీర! జయజగదీశ! హరే.

--ప్రథమసర్గ-అష్టపది-1

ఇలాగే అనేక సంకీర్తనల్లో అన్నమాచార్యుడు దశావతార వర్ణన వివిధ విధాలుగా చేసినా, తద్వారా భక్తి ప్రపత్తిని ప్రకటించినా, సంతృప్తి చెందిన సంస్కృత సంకీర్తనలో చేయడమూ మనం గమనించగలము.

దశ విధా చరణం తన్న భవతి
దశ విధావస్థార్థం తే తత్ర.

--12-374

ఈ రీతిగానే అన్నమాచార్యుడు పలు విధాల భక్తితత్త్వాన్ని తన సంకీర్తనల్లో నిరూపించారు. నవవిధ భక్తి రీతులకు ఉదాహరణలున్నాయి.

ఇంతకంటే ఈ మహావాగ్గేయకారుల్లో మనం గమనించదగ్గ అంశం వీరిద్దరు పోషించిన మధురభక్తి. జయదేవుడు గీతగోవింద కావ్యాన్ని శృంగార రస ప్రధానంగా రాధామాధవుల ప్రణయం-- రచించినా ముఖ్యంగా మధురభక్తిని ప్రతిపాదించాడు. రాధాకృష్ణుల ప్రణయంలో జీవాత్మపరమాత్మల సమ్మేళనానికై చేసిన యత్నం విదితమవుతుంది. భాగవతభక్తినంతటిని ఇందులో స్పష్టం చేశాడు. ఇలాంటి మధురభక్తిని అన్నమాచార్యుడు తన

సంకీర్తనల్లో - తానే నాయిక అయి శ్రీవేంకటేశ్వరుని నాయకునిగా భావించి - ప్రతిపాదించిన తీరు అమోఘం. ఒక ఉదాహరణ-- నాయిక నాయకునితో సంభాషించిన తీరులో మధురభక్తి:

నీ మహిమో నాలోన నిండిన వలపుజాడో
యేమి సేతు నన్నెప్పుడు నెడపకుమయ్య.

--28-155

జయదేవుడు, అన్నమాచార్యుల నాయిక రాధ, అలమేలుమంగలాగా పతియైన కృష్ణుని, వేంకటేశ్వరుని కలయికకై పడ్డ తపనను వ్యక్తీకరించారు.

అన్నమాచార్య జయదేవులు శృంగారం సైతం మనోజ్ఞంగా వర్ణించి తరించారు. నాయికా నాయకుల విరహముంది; సంభోగ శృంగారంలో సంతృప్తి ఉంది.

అలౌకిక సంభోగ శృంగార వర్ణనలో జయదేవ, అన్నమాచార్యులలో ఒకరిని మించి మరొకరున్నట్లు స్పష్టమవుతుంది. అలౌకికమైన రాధామాధవుల సంభోగశృంగారం జయదేవుడు, అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల సంభోగ శృంగారం అన్నమాచార్యుడు అత్యంత మధురమంజులంగా హాస్యసంభరితంగా వర్ణించడం వారిద్దరికే తగును. తక్కినవారు వారితో దీటుకాలేరు. అదే విశేషం. ఇందులో రాధామాధవుల సంభోగ శృంగార క్రీడలో వారిద్దరి వస్త్రాలు పరస్పరం మారిపోవడంతో హాస్యముత్పన్నమైంది.

ప్రాతర్నీల నిచోల మచ్యుత
ముర స్సంవీత పీతాంబరం
రాధామాశ్చకితం విలోక్య
హసతిస్మేరం సఖీమండలే
వ్రీడాచంచల మంచలం
నయనమో రాధాయ రాధాననే
స్వాదుస్మేరముఖోయమస్తు
జగదానందాయ నందాత్మజః.

రాధామాధవులు రాత్రి యథేచ్ఛగా క్రీడించినప్పుడు ఇద్దరి వస్త్రాలు మారడంవల్ల కృష్ణుని పీతాంబరం రాధ, రాధ దుప్పటి కృష్ణుడు కప్పుకొని ఉదయం శయ్యాగారంనుంచి రాగా సఖులు నవ్వసాగారు. దానితో సిగ్గుపడి రాధా ముఖావలోకనంచేసే కృష్ణుడు లోకానందదాయి డౌనుగాక!

ఇది పై శ్లోకార్థం. ఇందులో రాధాకృష్ణుల వస్త్రాలు మారడం, తెలియకుండా శయ్యాగారం నుంచి బయటికి వచ్చినప్పుడు చెలికత్తెలు చూచినవ్వారట. అది గుర్తించి సిగ్గుతో రాధావలోకనంచేసే శ్రీకృష్ణుడు లోకానందాన్ని కలిగించుగాక అని జయదేవుడు ఆశిస్తున్నాడు. ఇందులో హాస్యముత్పన్నమై ఆనందాపాది అవుతుంది.



ఇలాగే అన్నమాచార్యులలోను మనం చూడగలము. నాయికానాయకులైన అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరులు సురతంలో పరస్పరం గుర్తులు మారడంతో హాస్యానికి అవకాశం కలుగుతుంది. అన్నమాచార్యుల పదం--

మగరూపు నాడు రూపు మారుచు కొనిరిద్దరు
సొగిసెగ్గము చూపరే చూచుకొనేరిద్దరు.
కలికి కస్తూరిబొట్టు కాంతుని నొసలనంటె
విలువునామము పై పై నెంత కంటె
అలివేణి కొప్పుజారి అతనికొప్పు పై వాలె
అలరె నీతన్నిసిక ఆతని పాపటపైని.
కుంకుమ గుబ్బల పూత గురుతు విభునికంటె
అంకె బతిరొమ్ము బొమ్ము ఆకె కంటెను
కంకణాల గాజుల చేయి ఘనుని సందిటజిక్కె
అంకపు సాములచేయి ఆకె సందిట జిక్కెను.
మట్టెల పాదములవె మగడి నాతనిమీద
నిట్ట పెద్ద పాదాలు నిలిచెనందు
యిట్టె శ్రీ వేంకటేశు డింతిగూడి పానుపుపై
పట్ట పగలిందరిని భ్రమయించిరిదివో.

26-309

అలమేలుమంగా వేంకటేశ్వరుల రతిసంభ్రమంలో పరస్పరవిరుద్ధమైన రీతిలో ఆయా గుర్తులు మారిపోయి హాస్య సముత్పత్తికి కారణం కావడంతో మనకు నవ్వు కలుగుతుంది. వాస్తవానికి దేవీదేవేరులు ఆడరూపు మగరూపు మార్చుకొన్న రీతిని చెలికత్తెలే గమనించారు. గమనించి వాళ్ల పరస్పర విరుద్ధ రూపాలను చూసుకొని ఆనందిస్తారు. చక్కటి అద్దం చూపండని చెలికత్తెలే అంటున్నారు. ఇది అత్యంత మలౌకిక శృంగారంలో కలిగిన మార్పుని వర్ణించి చెలికత్తెలను, తద్వారా మనలందరిని భ్రమింపజేసి హాస్యోత్పత్తికి కారణమై మనకానందాన్ని గూర్చడంలో అన్నమాచార్యులు కృతకృత్యులయ్యారు. ఈ రీతిగా అన్నమాచార్యులు తన సంకీర్తనల్లో వివిధ రసభావాలను వ్యంజింపజేయడంలో నిపుణులు.

జయదేవుడు రాధాకృష్ణుల రతి సమయాలలో వస్త్రాల మార్పిడిచేసి హాస్యముత్పన్నం చేశాడు. అన్నమాచార్యులు అలమేలుమంగా శ్రీ వేంకటేశ్వరుల రతి సంరంభంలో చిహ్నాలు మార్చి హాస్యం కలిగించాడు.

ఈ విధంగా ఇద్దరు మహా వాగ్గేయకారులు అనేక విధాల తమ రచనల్లో సారూప్యం గోచరించేలా వర్ణించి మనలను తరింపజేశారు.



# కాకతీయరాజులనాటి శాసన విశేషాలు

డా॥ ఎ.కె.వి.ఎస్.రెడ్డి
అనువాదం : జి. శ్రీమతి

(గత సంచిక తరువాయి)

క్రీ.శ. 1264, గుంటూరుజిల్లా తాడికొండకు చెందిన శాసనం, ఆ దేవాలయ వాస్తు నిర్మాణానికి చెందిన పదజాలాన్ని తెలియచేస్తోంది. మరియు మన్మపోత ప్రభువు కామేశ్వర ప్రతిమను ప్రతిష్ఠించినట్లు, కొంత భూమిని ఆ దేవాలయానికై దానం గావించినట్లు తెలుస్తోంది. (సోయం శంభుం త్రినేత్రం త్రిపురాహారం) ఈ శాసనం ఇంకా వివరిస్తోన్న విషయమేమనగా రాణి పడాంబిక కామేశ్వర, పండీశ్వర (మన్మపోత రాణి అయిన పండాంబిక తర్వాత ఆ పేరేర్పడింది) మరియు మన్మపోతేశ్వర (రాజు మన్మపోత తర్వాత ఆ పేరేర్పడింది) ఆలయాలకు కొంతభూమిని, అఖండదీపాలను ఏర్పాటు గావించారు. ఆదే శాసనం విశదపరుస్తున్న విషయ మేమనగా మన్మపోతేశ్వర స్వామి పండాంబిక చేత ప్రతిష్ఠ చేయబడినట్లు, ఆమె తన భర్త శివలోక మోక్షానికై ఈ ఏర్పాటు గావించింది. ఇక్కడ మనము గమనించాల్సిన విషయమొకటుంది. ఆ యా కుటుంబాలలోని వ్యాధిగ్రస్తులు శివమోక్షాన్ని పొందేందుకు శివలింగాలను ప్రతిష్ఠ చేసే సంప్రదాయం ప్రాచీనకాలంలో వుండేదని తెలుస్తోంది. తమిళ భాషలో ఆ రకమైన స్మృతి దేవాలయాలను 'పల్లిపడై' అంటారు. తొండమనాడులోని ఆదిత్యేశ్వరాలయం ఈ పల్లిపడైగా చెప్పడానికి ఆరాధాలున్నాయి. తొండమనాడులోని ఆదిత్యేశ్వరాలయం పల్లిపడైగా చోళరాజైన పరాంతక I చేత తన తండ్రి జ్ఞాపకార్థమై నిర్మించబడింది. అదేరకంగా యేల్పడిలో అరంజిగై ఈశ్వర పేరుతో ఒక ఆలయం రాజరాజ I చేత నిర్మించబడింది. ఇంకొక ఆలయం రాజేంద్ర I రామనాధన్ కోయిల్‌లోని పంచవన్మదీశ్వరాలయం నిర్మించబడింది. పల్లిపడై ఆలయాలకు ఇవి మంచి ఉదాహరణలు.



గుంటూరుజిల్లా రొంపిచెర్లకు చెందిన వేణు గోపాలస్వామి ఆలయంలో విరిగిన గరుడస్తంబంమీద ఒక విశేషమైన శాసనాన్ని చూడవచ్చును. ఈ శాసనం విశదపరుస్తున్నదేమనగా, క్రీ.శ. 1266 కోట రాజైన భీమరాజ మంత్రి అయిన వల్లభ తన తండ్రి విష్ణులోకసాయుజ్యానికై, అచ్యుతస్వామిని గోపాల అంశలో ప్రతిష్ఠించినట్లు మరియు దేవాలయాన్ని కూడ నిర్మించి ప్రాకార, గోపురాలను ఏర్పాటు చేసి, అందమైన కళాత్మకమైన విగ్రహాలను అందు అమర్చినాడు. ఆ శాసనంలోని తెలుగు భాగానికి సంబంధించిన దాన్ని బట్టి చూస్తే ఆ శాసనంలో తెలుపబడిన స్వామి అనంతగోపినాథ అని తెలుస్తోంది.

క్రీ.శ. 1202 కరీంనగర్ జిల్లా "కటకూరు"కు చెందిన శాసనం, శివునికి, విష్ణువుకు, సూర్యునికి దేవాలయాలు నిర్మించబడినట్లుగాను, అదియే త్రికూటాలమనియు, దాని నిర్మాణం ఒకానొక రాజుచేత అయ్యావరపు గ్రామంలో జరిగినట్లు తెలుస్తోంది. ఇంకా విశదమవుతున్న విషయమేమనగా, రాణి మైలమ మల్లికార్జున (ఆమె పేరు మీదుగా) అన్నీశ్వర (ఆమె తండ్రి తదనంతరం), ఐతేశ్వర (ఆమె తల్లి తర్వాత) విగ్రహాలను ప్రతిష్ఠించినట్లు తెలుస్తోంది. ఈ శాసనంలో ఈ దేవాలయాల సమూహాన్ని త్రికూటగా పేర్కొన్నారు.

క్రీ.శ. 1203, కాకతీయ గణపతి కాలానికి చెందిన శాసనాన్ని వరంగల్ జిల్లా కొండ

పర్తి గ్రామంలో చూడవచ్చును. ఈ శాసనం శివాలయానికి సంబంధించిన వాస్తు నిర్మాణ విశేషాంశాలను విపులంగా తెలియపరుస్తోంది. ఒకానొక మలయరాజు అయిన చౌండ చేత శివాలయం, చెరువు, ఒక గ్రామాన్ని అగ్రహారం కొరకై దానంగా ఇవ్వబడింది. ఆ రాజు తదనంతరం ఆ దేవాలయానికి చౌండేశ్వర, చౌండపుర, చౌండసముద్ర పేర్లు ఏర్పడినాయి. దేవాలయం, చెరువు ఆ శాసనంలో చెప్పబడిన ప్రదేశంలోనే నిర్మించడం జరిగింది. ఇంకనూ తెలుస్తున్న విషయాలేమనగా, ఆ దేవాలయం నల్లరాతిలో (నీలప్రస్తర) నిర్మించబడినట్లు, ఆ దేవాలయానికి అందమైన వివిధ భంగిమల్లో వున్న సాలభంజికలను ఏర్పాటు గావించినట్లు, ప్రాకారం, శిఖరాల నిర్మాణంతో పాటు ఆలయానికి బంగారు కలశాలు సైతం చేయించబడినట్లు తెలుస్తోంది.

"విజిత శూర విమానాశ్యతి చాతుర్య యోగదామల విపుల నీల ప్రస్తరై కల్పితశ్య" ఈ శాసనం శివాలయానికి సమీపంలోని రాతిమీద చెక్కబడివుంది.

వరంగల్ జిల్లా, ఇనుగుర్తికి చెందిన శాసనం, కాకతీయ గణపతి సోదరి అయిన మైలమ మహాదేవి, రెండు శివాలయాలను తల్లిదండ్రుల జ్ఞాపకార్థమై మరియొక శివాలయం ఆమె పేరు మీదుగా నిర్మించినట్లు తెలుస్తోంది. ఈ శాసనంలో చెప్పబడిన 'త్రిశు భువనేశు' అనే దాన్ని బట్టి ఇది త్రికూటాలయమని తెలుస్తోంది. ఈ శాసనం క్రీ. శ. 1206కు చెందినది. ప్రస్తుతం ఈ శాసనాన్ని మనము నరసింహ దేవాలయానికి సమీపంలోని రాతిమీద చూడవచ్చును. మరియొక అసంపూర్ణంగా, జీర్ణావస్థలో వున్న శాసనం చెపుతున్న దేమనగా, (ఈ శాసనం కూడ క్రీ.శ. 1221 ఇనుగుర్తికి చెందింది) మైలమదేవి చేత గోపాలకృష్ణ, శివాలయాలు నిర్మించబడి భైరవ విగ్రహం శివాలయద్వారం వద్ద ప్రతిష్టించబడింది. ఈ ఆలయంలో పలు రాతి విగ్రహాలు కూడ ఉన్నాయి. మరియు ఆమె మెట్లుతో వున్న ఒక బావిని త్రవ్వించి, దేవదాసీ కన్యలను అందు అందంగా అధిష్ఠింపచేసింది. ఆ దేవదాసీ కన్యలు గానం చేసే భంగిమలో కనబడుతున్నారు.

"ద్వార స్థాపిత భైరవం బహు విధ శ్రేయస్ శిల పుత్రక్రం"-----

ఈ శాసనం ఫకీర్ టెక్కలి సమీపంలోని రాతి మీద చెక్కబడి వుంది.

క్రీ.శ. 1207 నల్లగొండ జిల్లా, ఆలుగడపకు చెందిన శాసనాలు, ఒకానొక గ్రామాధికారిచేత ఆ గ్రామానికి తూర్పువైపు 'త్రిపురాంతక దేవాలయం నిర్మించబడినట్లు తెలుపుతోంది. ఇదే శాసనం, 'నుంకదేవరస్వామి' ఒక గ్రామదేవత అని చెపుతోంది. 'దేవిరాజు' అను వ్యక్తి ఒక మాడ మరియు ఒక తవ్వ నూనె దీపారాధనకై ఆ స్థలానికి తూర్పువైపుగల మంకదేవర ఆలయానికై ఏర్పాటు గావించాడు. నుంకదేవర స్వామి పేరు ఆసక్తి కలిగిస్తోంది. ఈపేరు, ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధిచెందిన గ్రామదేవత అయిన నూకాలమ్మను గుర్తుకు తెస్తోంది. మశూచి జబ్బు సోకినవారికైనా ఈ దేవత కాపాడగలిగే శక్తిమంతురాలని తెలుస్తోంది. ఈ దేవత ముఖ్యంగా గ్రామాల్లో మశూచి వ్యాధి సోకినప్పుడు ఎక్కువగా పూజింపబడేది. ఈమెను ఉత్తరభారతదేశంలో కొలిచే సీతాలదేవితో కూడపోల్చవచ్చును. కాని ఈ నుంకదేవత గురించిన వివరాలు మనకు చాలా తక్కువగా లభ్యమవుతున్నాయి. ఆ శాసనంలో తెలుపబడినట్లు ఆ గ్రామానికి తూర్పువైపు దేవాలయాన్ని నిర్మించినారనుటను బట్టి చూస్తే, సాధారణంగా ఈ ఆలయాలను ఊరి పొలిమేరల్లోనే నిర్మిస్తారనే విషయం గోచరమవుతుంది.

క్రీ.శ. 1209 గుంటూరుజిల్లా, పెద్దచెరుకూరుకు చెందిన శాసనం, కోట రాజైన కేతకొమర భీమేశ్వరస్వామిని చెరకూరులో పునః ప్రతిష్ఠించి పలుసేవలను స్వామివారికి నిర్వర్తించుటకై పదికందుల నేలను ఏర్పాటు గావించినట్లు కూడ తెలుస్తోంది. కొమర భీమేశ్వరాలయం ఉనికి ఇప్పుడు తెలియడం లేదు. కాని ఆ కాలంలో ఈ ఆలయానికి పేరు ప్రఖ్యాతులు మిక్కుటంగా వుండేవనడానికి నిదర్శనంగా ఆ ఆలయానికి ఇవ్వబడిన కానుకలు స్పష్టపరుస్తున్నాయి.

పెద్దచెరుకూరు గ్రామం ఒక అగ్రహారం. ఈ అగ్రహారం పురాణాలు, న్యాయ, మీమాంస, వేదాలు, ధర్మశాస్త్రాలు, ఆయుర్వేదం మొదలుగా గల పదునెనిమిది విద్యలను అభ్యసించుటకు కేంద్రంగా ప్రసిద్ధి కెక్కింది. పెద్దచెరుకూరులోని శిలాఫలకంమీద చెక్కబడిన శాసనంద్వారా మనకు స్పష్టమవుతున్న విషయమేమనగా ఆ స్వామిని పునః స్థాపితం గావించినట్లు మరియు ఆ దేవాలయానికి పలు కానుకలు ఇవ్వబడినట్లుగా కూడ తెలుస్తోంది.

క్రీ.శ. 1212 కృష్ణాజిల్లా, అనుమాచిపల్లెకు చెందిన శాసనం, నటవాడి రాజు త్యాగిపోత మంత్రి అయిన అన్నమంచి ఆ గ్రామంలో ఒక ఆలయాన్ని నిర్మించినట్లు, మరియు కొంతభూమిని ఆ దేవాలయ నిర్వహణ, పూజానైవేద్యాలకై ఏర్పాటు గావించినట్లు తెలుస్తోంది. ఈ శాసనం చంద్రమౌళీశ్వరాలయం స్తంభంమీద చెక్కబడివుంది.

క్రీ.శ. 1213 ప్రసిద్ధిచెందిన వరంగల్ జిల్లా పాలంపేట శాసనం, రేచెర్ల రాజైన రుద్ర మరియు కాకతీయ గణపతి సైన్యాధిపతి కలిసి ఓరుగల్లు గ్రామాన్ని నిర్మించి అందు రుద్రేశ్వర స్వామికి దేవాలయం కట్టించారు. ఈ గ్రామాన్ని మనము ఆధునిక పాలంపేటలో చూడవచ్చును. దానికి సమీపంలోనే పెద్దచెరువును కూడ త్రవ్వించాడు. ప్రస్తుతం ఈ చెరువు రామప్ప చెరువుగా పేరుపొందింది. ఇప్పటికి కూడ చెక్కుచెదరకుండా నిలచివుంది. శివాలయం ప్రాకారంలోవున్న స్తంభంమీద ఈ శాసనం చెక్కబడివుంది. రుద్రేశ్వరాలయమే ప్రస్తుతం రామప్ప దేవాలయంగా ప్రసిద్ధి కెక్కింది. ఈ దేవాలయం కాకతీయుల వాస్తు నిర్మాణ పనితనానికి అపురూపమైన ఉదాహరణగా నిలచివుంది. ఈ దేవాలయ ప్రదేశం పది విభాగాలుగా విభజింపబడివుంది.

1. శాసనంలో చెప్పబడినట్లుగా ప్రధానాలయం క్రీ.శ. 1213లో రుద్రచేత

(31వ పేజీలో)

# పద సాహిత్యంలో రారాజులు

శ్రీ ఎం. శ్రీనివాస్ సింగ్

మానవుని జ్ఞానం, ఆధ్యాత్మికం, కళాత్మకం, వైజ్ఞానికం, సాహిత్యంలో విజ్ఞానదాయకమైనవి శాస్త్రాలు. ఆధ్యాత్మికమైనవి పురాణాది గ్రంథాలు. కళాత్మకమైనవి నాట్యశాస్త్రాది గ్రంథాలు. కాలక్రమేణ కళాసంబంధి, ఆధ్యాత్మిక సంబంధి విషయాలు మేళవించి కొంతమంది రచనలు చేశారు. అలాంటి వారిలో వాగ్గేయకారుల స్థానం ప్రశంసనీయమైంది. ఈ వాగ్గేయకారులనే పదకవులు, పదకర్తలు, పదకారులు అని అంటారు. భారతీయతత్త్వము, భక్తితత్త్వము, భక్తితోపాటు పదకవితసైతం ప్రారంభమైంది. భగవంతుని భజించుటకు పదములనువాడి, పదమునకు మాన్యతను కల్పించారు. తెలుగులో ప్రముఖ భక్తి పదకవులుగా కృష్ణమాచార్యులు, తాళ్ళపాక అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యులు, చిన తిరుమలాచార్యులు, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, త్యాగయ్యలను చెప్పుకోవచ్చు.

## కృష్ణమాచార్యులు

తెలుగులో సంకీర్తన వాఙ్మయం కృష్ణమాచార్యులతో ఆరంభమైంది. ఈయన కాకతీయరాజుల్లో రెండవ ప్రతాపరుద్రునికి (క్రీ.శ. 1254-1323) సమకాలికుడు. ఈయన పుట్టినది 1265-70 ప్రాంతం. స్వగ్రామం సంతూరు లేక సంతనపురం. ఇది మహబూబ్‌నగర్ జిల్లాలోని సంతవూరు కావచ్చు. కృష్ణమాచార్యులు భక్తి సంకీర్తనలు పాడుకుంటూ, మహిమలెన్నో ప్రదర్శిస్తూండేవాడు. ఈ మహనీయుడు పుట్టింది సంతనపురంలోనే అయినా, ఎక్కువకాలం సింహాచలంలోనూ, మధ్యకాలం వరంగల్‌లోనూ, చివరికి శ్రీరంగంలోనూ జీవయాత్ర సాగించాడు. ఈయన వచనాల్లో ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ వైష్ణవ పుణ్యక్షేత్రాలన్నీ దర్శించినట్లుగా పేర్కొన్నాడు. "సింహగిరి వచనములు" అనే పేరుతో అనేక సంకీర్తనల్ని రాశాడు.

కృష్ణమాచార్యుని లభ్యమైన కృతులు, వచన సంకీర్తనములు-- తులసీ మాహాత్మ్యము, నృసింహనామాలు, రామనామకీర్తనలు, రామనామాలు అయినప్పటికి ఈయన



చతుర్లక్షవచనాలు రచించినట్లుగా తెలుస్తుంది. కృష్ణమాచార్యుని చూర్ణాఖ్యపదాల్ని చినతిరుమలయ్య తన సంకీర్తన లక్షణములలో--

ధర కృష్ణచార్యాదిక
పదకల్పిత పదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగుననిర్యుక్త నామ భాసిత మగుచున్.

అని తెలపడం జరిగింది. కృష్ణమాచార్యుడు అనియత పదములైన చూర్ణ నామక వచనములు రచించి తరించాడు. ఆంధ్రదేశంలోని వచనరచనకు, భజన సంకీర్తన పద్ధతులకు పరమాచార్యుడు, ప్రపితామహుడు కృష్ణమాచార్యుడే. "ఓం నమో నారాయణాయ" అని, "నమో నమో లక్ష్మీవల్లభా" అని, "అనాథపతి సింహగిరి నరహరీ నమో నమో దయానిధి" అని, "మాయతి రామానుజ ముని వరందాతారు కృష్ణకువ్వారస్వామి నరహరీ నమోనమో దయానిధి" అని, "పరబ్రహ్మ సింహగిరి నరహరీ నమోనమో దయానిధి" అని మకుటంగా స్వామివారి అనంత నామగుణ కథలకు వచన భావంతో విన్నపం చేసేవాడు. 15, 16 శతాబ్దాల్లో వచ్చిన తాళ్ళపాకవారు ఈ కృష్ణమాచార్యులనే మార్గదర్శకుడుగా, తాళబంధచ్ఛందో విరహితమై చూర్ణాఖ్యంబ రగునట్టి పదరచనలకు పరికల్పకుడుగా పేర్కొన్నాడు. ఈయన వచనముల ప్రభావం తరువాతి పదరచయితలపై స్పష్టంగా కనిపిస్తుంది. రచన పద్ధతిలో, భావములో, సంప్రదాయములో ఈయన ప్రభావం ఇతర రచయితలపై బాగా వుంది. స్తుతి వచనములు రాయడంలో ఈయనకు ఈయనే సాటి. వచనములను రచించి సంకీర్తన పద్ధతికి, వైష్ణవభక్తి ప్రపత్తికి చక్కగా ప్రచారం తెచ్చిన ఘనత కృష్ణమాచార్యునిదే. అన్నమాచార్యునికి ముందు చెప్పుకోదగినవాడు కృష్ణమాచార్యులే.

### తాళ్ళపాక అన్నమాచార్యులు

అన్నమయ్య నందవరవైదికి బ్రాహ్మణ వంశంలో జన్మించాడు. ఈ వంశమువాళ్ళు ఋగ్వేదులు, అశ్వలాయన సూత్రులు. అన్నమయ్య భరద్వాజ ఋషివంశంలో జన్మించాడు. ఆ వంశంలో నాల్గవ నారాయణ సూరికి, లక్కమాంబకు అన్నమయ్య జన్మించాడు. ఈయనకు అన్నమయ్య, అన్నమయ్యంగారు, అన్నయ్యగురు, అన్నయార్య, కోనేటి అన్నమయ్యంగారు మొదలైన పేర్లు వున్నాయి. తాళ్ళపాకవారి సంకీర్తనపు రాగిరేకుల్లో ప్రారంభంలో ఇలా రాసి వుంది.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు (1346) అగునేటి క్రోధి సంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలు గాను శాలివాహన శకపురుషంబులు (1424) అగునేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ



(12) నిరుధాన తిరువేంగళనాథుని మీదను అంకితముగాను తాళ్ళపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార కీర్తనములు."

ఇందులో వాక్యనిర్మాణ వైఖరిని బట్టి అన్నమయ్య పుట్టింది క్రోధి (క్రీ.శ. 1424) అని చెప్పవచ్చు. చిన్నతనంలోనే అన్నమయ్య తల్లిదండ్రులు, అన్నావదినలు చెప్పినపనులు చేస్తూండేవాడు. ఒకరోజు వాళ్లు పశువులకి మేత తెమ్మని పంపించడం, అన్నమయ్య చేతివేలు కోసుకోవడం, దానితో విసుగు చెంది "ఎన్నటి చుట్టంబు లిటువంటి వారలెన్నటి బంధుండ నేను వారలకు" అని ఆలోచించి వేంకటేశ్వరుని కొలవాలనే తలంపుతో తిరుపతికి బయలుదేరాడు. తిరుపతి పొలిమేరల్లో తాళ్ళపాక గంగమ్మను దర్శించడం, మోకాళ్ళ ముడుపువద్దకి చెప్పులకాళ్ళతో నడచి వెళ్ళడం, అలసిపోయి రాత్రి మీద పడుకోవడం, అప్పుడు అలివేలు మంగ ప్రత్యక్షమై అన్నమయ్య అలుపుతీర్చి అదృశ్యమవడం జరిగింది. అప్పుడు అన్నమయ్య అలివేలుమంగ ఇచ్చిన ప్రసాదాన్ని తిని సరస సాహిత్యపారీణుడై అలివేలుమంగపై అశువుగా శతకం చెప్పాడు. ఆ తరువాత శ్రీనివాసుని దర్శించడం, అశువుగా సంకీర్తనలు చేయడం అక్కడి వాళ్ళందరికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. వేంకటేశుడు అన్నమయ్య భక్తికి మెచ్చి హరిపరాయణచిత్తుడైన విష్ణుముని కలలో కన్పించి అన్నమయ్య గురించి చెప్పడం, శ్రీనివాసుని ఆదేశానుసారం విష్ణుముని అన్నమయ్యను శంఖచక్రాంకితుని చేసి, పంచసంస్కారములు గావించి శరణాగతి ధర్మాన్ని బోధించి వైష్ణవునిగా చేసాడు. అన్నమయ్యతల్లి వెతుక్కుంటూ తిరుమలకి వచ్చి, అన్నమయ్యను ఇంటికి తీసుకుపోయి తిరుమలమ్మ, అక్కలమ్మ అనే ఇద్దరితో వివాహం చేసింది. తిరుమలమ్మ వలన నరసింహకవి, అక్కలమ్మవలన పెద తిరుమలాచార్యులు, నరసమ్మ, తిరుమలమ్మలు జన్మించారు.

అన్నమయ్య శఠగోపముని దగ్గర సకల వేదాంత పఠనం గావించాడు. వేంకటేశుని మీద పదరచనగావిస్తూ ప్రసిద్ధి కెక్కాడు. ఒకసారి సాళువ నరసింగరాయలు అన్నమయ్యను శ్రీనివాసునిమీద పదములను పోలిన పదములు తనపై పాడమని కోరడం, దానికి అన్నమయ్య తిరస్కరించడం, అప్పుడు అన్నమయ్య ప్రహ్లాదునిలా--

ఆకటి వేళల నలపైన వేళల
దేకువ హరినామమె దిక్కు, మరిలేదు.

--అని కీర్తన చేయగా సంకెలలూడి పడ్డాయి. అపుడు నరసింగరాయలు భయపడి "అపరాధి నపరాధి నన్నమాచార్య కృప జూడు కృపజూడు కృపణశరణ్యా" అని దీనుడై అన్నమయ్యను మ్రొక్కాడు. ఆ తరువాతి

అన్నమయ్య వేంకటేశునికి శృంగారమంజరిని సమర్పించాడు. పుల్లమామిడిని తియ్యమామిడిగా మార్చడం, నిరుపేద వివాహాలకు డబ్బు సమకూర్చడంవంటి మహిమల్ని అన్నమయ్య చేసాడు.

అన్నమయ్య 32 వేల సంకీర్తనల్ని రచించాడు. ఇవి శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలు. అన్నమయ్యకు సంకీర్తనాచార్యుడని, పదకవితా పితామహుడని బిరుదులున్నాయి. ఈయన తెలుగు సంకీర్తనలే గాకుండా, సంస్కృతంలోకూడా సంకీర్తనలు రాసి వేంకటేశునికి అంకితం చేశాడు. అన్నమయ్య జానపదుల వాడుకలో వున్న జానపద గేయరీతుల్ని తన సంకీర్తనల్లో వుపయోగించుకున్నాడు. వాటిలో జాజరలు, చందమామ పదాలు, తుమ్మెద పదాలు, లాలి, సువ్వి, గొబ్బి, ఉయ్యాల, లాల, జోల, శోభన, మంగళపదాలు, ఛాంగుభళాలు, తందనాలు, వెన్నెలపదాలు ఉపయోగించుకున్నాడు.

అన్నమయ్య అద్వితీయ ప్రతిభాశాలి, ఋషికల్పుడు. పదం యొక్క అనంతరూపాల్ని తన రచనల్లో ప్రదర్శించాడు. సంవాద గీతాలు అన్నమయ్య కీర్తనల్లో కొల్లలు. అన్నమయ్య శృంగార, వైరాగ్యాలని సమానస్థాయిలో ఆరాధించాడు. తన తర్వాతి పద కర్తలకి, కీర్తనకర్తలకి మార్గదర్శి అయ్యాడు అన్నమయ్య. నవవిధ భక్తిరీతుల్ని తనపదాల్లో వర్ణించి, తన భక్తి ప్రపత్తుల్ని చాటుకున్న భక్తాగ్రేసరుడు అన్నమయ్య. భగవంతుని చేరడానికి భక్తి ప్రధానమని అన్నమయ్య విశ్వాసం. అన్నమయ్య మధురభక్తిలో శ్రీనివాసుడు నాయకుడు. అన్నమయ్య నాయిక. నాయిక తానై శ్రీనివాసుని ప్రియునిగా భావించి, శృంగారలీలా విలాసములను భావించి తన్మూలముగ మధుర భక్తిని ప్రకటించాడు. అన్నమయ్య నాయికగా చెలికత్తెను బోధిస్తూ--

తారుకాణ సేసుకుంటే తానే నేను
యీ రీతినే నవ్వుగా నీ ఇంటికి రమ్మనవే
చెక్కులివె చెమరించె చిత్తమెల్లా జిగురించె
కుక్కినట్లు కోరికలు కొనసాగెను
తొక్కినాడు వాపాదము తొలుతే పందడిలోవ
యెక్కడ పరాకు పేసీ నింటికి రమ్మనవే...

పై విధంగా అన్నమయ్య పదకవితలోని భక్తిని వివరించవచ్చు.

## తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు

అన్నమయ్య చిన్నభార్య అక్కలమ్మకు పెదతిరుమలాచార్యులు జన్మించాడు. ఇతనికి నరసమ్మ, తిరుమలమ్మ అనే ఇద్దరు చెల్లెళ్ళున్నారు. ఇతని జననం క్రీ.శ. 1458-60 ప్రాంతం. ఈయన సుమారు 97 సంవత్సరములు జీవించి శ్రీకృష్ణదేవరాయ, అచ్యుతరాయాదుల పరిపాలనలను చూసాడు. ఈయన



శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మ సంకీర్తనలు రాసి తండ్రిమార్గాన్నే అనుసరించాడు. ఈయన "వేంకటేశ్వర వచనములు" అనే వచన మాలికాగీతాల్ని, చక్రవాళ మంజరి, సుదర్శనరగడ, వేంకటేశ్వరోదాహరణం, భగవద్గీతా తెలుగువచనం మొదలైన మధుర కవితలు రచించాడు. అన్నమయ్య తర్వాత పదసాహిత్యాన్ని చక్కగా పాలించిన ఘనత పెదతిరుమలయ్యదే. ఈయన సంకీర్తన భాండాగారమునొకదానిని నెలకొల్పి తాళ్ళపాక వారి సాహిత్య సంస్థకొక చక్కని వ్యవస్థ నేర్పరిచాడు.

సింహగిరి నరహరి వచనాలనే పేరుతో తాళగంధి వచన గీతాల్ని రాసిన కృష్ణమాచార్యులు, అన్నమయ్య, పెదతిరుమలయ్య తమ సంకీర్తనలద్వారా ఆంధ్ర వేదాంతకర్తలని, పంచమాగమసార్వభౌములని అన్పించుకున్నారు. పెదతిరుమలయ్యకు శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీరామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతచార్య, కవితార్కిక కేసరి, శరణాగత వజ్రపంజర మొదలైన బిరుదులున్నాయి. పెదతిరుమలయ్యకు ఉపదేశ గురువైన కందాడ అప్పలాచార్యులే తెనాలి రామకృష్ణ కవికి కూడా వైష్ణవమిచ్చిన గురువు.

అన్నమయ్య రచనల్లో పురాణ యుగపు సారళ్యము, సౌకుమార్యం, దేశి పలుకుబళ్ల తీయదనం కన్పిస్తాయి. పెదతిరుమలయ్య పట్టుమని ప్రబంధయుగంలో రాయలకు సమకాలికుడైనవాడు. అందుకే ఆయన కవితాకన్యక ముక్తపదగ్రస్తములు, యమకాలు మొదలైన శబ్దాలంకారాల సొమ్ముల్ని ధరించి ప్రౌఢితనంతో రామరాజభూషణాది ప్రౌఢ ప్రబంధకవుల కవితాసుందరిని తలపింపజేసింది. పెదతిరుమలయ్యపదములు, భావుకత, చమత్కారముకల్గిన అత్యంతమనోజ్ఞములు.

## తాళ్లపాక చిన తిరుమలాచార్యులు

ఈయన పెదతిరుమలయ్యకు పెద్ద కుమారుడు. తాళ్ళపాక పదకవిత్రయములో చివరివాడు. తల్లి తిరుమలాంబ. ఈయన చారుతర అష్టభాషా చక్రవర్తి. ఈయనకు అన్నమయ్యే ఉపనయనం చేశాడు. ఈయన మహావిద్వాంసుడు. ఈయన తండ్రితాతలవలెనే శృంగారాధ్యాత్మ సంకీర్తనల్ని రాశాడు. ఈయన సంకీర్తనల లక్షణమును రచించాడు. "అష్టభాషా దండకము" ఇతని కృతి.

చిన తిరుమలయ్య తన కీర్తనల్లో తాతగారైన అన్నమయ్యను భక్తి శ్రద్ధలతో కీర్తించాడు. ఈయనకి గురుభక్తి అపారంగా ఉంది. భగవద్భక్తిని కోల్పోయి లౌకిక ప్రాభవానికి ప్రభువుల వెంటబడి ప్రాకులాడే దైన్యాన్ని గర్హించాడు. ఈయన వేంకటేశునికి,

దిగువ తిరుపతిలోని వేల్పులక్కూడా చాలా కైంకర్యాలు గావించాడు. క్రీ.శ. 1504లో తమ అగ్రహారమైన మంగాపురంలో కళ్యాణ వేంకటేశ్వర దేవాలయ జీర్ణోద్ధరణము గావించాడు. శాసనాధారాల్ని బట్టి, కీర్తనల్ని బట్టి ఈయన మత ప్రచారానికి, సంకీర్తన ప్రచారానికి చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు మొదలైన మండలాల్లో సంచారం చేశాడు. మంగళగిరి దేవాలయంలో ఈయన సంకీర్తన అరుళప్పాడున కేర్పాటు గావించాడు. ఈయన క్రీ.శ. 1562 వరకు జీవించాడు.



## క్షేత్రయ్య

అన్నమయ్య తర్వాత అన్నమయ్యం లటి వాగ్గేయకారుడు పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. పదకవితా పితామహుదు అన్నమయ్య అయితే పద కవితా చక్రవర్తి క్షేత్రయ్య. క్షేత్రయ్య తన పదాల్లో సంగీత సాహిత్యాలకి సమ ప్రాధాన్యత ఇవ్వడమే గాకుండా సంగీతం జోడించి తెలుగులో పదాభినయానికి ప్రాధాన్యం తెచ్చాడు. క్షేత్రయ్య పూర్వ నామం వరదయ్య. అనేక పుణ్యక్షేత్రాల్ని దర్శించడంవల్ల క్షేత్రయ్య అయ్యాడు. ఈయన నివాసం మొవ్వ. అక్కడవెలసిన మువ్వగోపాల స్వామిపై భక్తితో, శృంగార రస భావాలతో రచించినపదాలే 'మువ్వగోపాల పదములు'.

మొదట పరమశృంగారి అయి ఆ తర్వాత మధురభక్తి పరతంత్రుడైన క్షేత్రయ్య తన పదాల్లో సంగీత సాహిత్యాల్ని సమ్మేళనం చేసి, అభినయము జోడించి, ఉత్తమ వాగ్గేయకారుడుగా సమున్నత స్థానాన్ని ఆక్రమించాడు. క్షేత్రయ్య పదాల్లో కల్పనానైపుణ్యం, చమత్కారం రసజ్ఞ హృదయైక వేద్యం. క్షేత్రయ్య అన్ని విధాల మనోజ్ఞమైన పదరచనలో ప్రతిభా సంపన్నతను, నైపుణ్యాన్ని చూపించగల దిట్ట. అందుకు 'మగువ తన కేళికా మందిరము వెడలెన్' అనే పదాన్ని గ్రహించవచ్చు. ఈ పదాన్ని క్షేత్రయ్య మధురభక్తి భావనతో అభివర్ణించాడు. వర్ణనా వైదగ్ధ్యమునకు "ఎంత చక్కనివాడే నాసామి వీడెంతచక్కనివాడే" అనే పదాన్ని గ్రహించ వచ్చు. సున్నిత భావాల్ని ప్రకటించడంలో క్షేత్రయ్య అందె వేసిన చేయి. దీనికి విరహోత్కంఠిత అయిన నాయిక "తలపు వాని మీద నాయె తలవాకిలె ఇల్లాయె" అనే పదాన్ని గ్రహించవచ్చు. క్రిందిపదం క్షేత్రయ్య మధురభక్తికి ఎంతో సహజమై ఒప్పారుతుంది.

శ్రీపతి సుతుబారికి నే నోపలేక నినువేడితే
కోపాలా? మువ్వగోపాలా
ఏ పొద్దు దానింటిలోనే కాపైయుండి
నీ సరస సల్లాపాలా? మువ్వగోపాలా.

క్షేత్రయ్య నాయిక అయి సర్వము తనకా పరమాత్ముడేనని స్పష్టం చేస్తున్నాడీ క్రింది పదంలో--

ఇంత తెలిసియుండి -- యీ గుణమేలరా
పంతమా? మువ్వగోపాలా? నా సామిర.

క్షేత్రయ్య మధురభక్తి పరవశుడు. ఆంధ్ర దేశమే కాకుండా దక్షిణదేశమంతా తిరిగి పదరచన చేశాడు క్షేత్రయ్య.

## రామదాసు (కంచెర్ల గోపన్న)

రామదాసు ఆంధ్రదేశంలోనే గాకుండా భారతదేశమంతటా ప్రసిద్ధికెక్కిన పరమభక్తాగ్రేసరుడు, వాగ్గేయకారుడు. ఈయన భద్రాచలరామదాసని పేరుపొందాడు. కామాంబా, లింగనమంత్రులు ఇతని తల్లిదండ్రులు. తెలంగాణాలోని నేలకొండపల్లి ఇతని స్వగ్రామం.



ఇతనికి వైష్ణవమిచ్చిన గురువు రఘునాథ భట్టాచార్యులు. ఈయన 1620లో జన్మించి 1680 వరకు జీవించాడు. ఈయన 1650లో భద్రాచలం తహసీల్దారయ్యాడు. మహాభక్తుడు, భజన కీర్తనల రచయిత, వేదాంతి అయిన కబీరుదాసు ఇతని గురువు. రామదాసు తహసీల్దారుగా వుండి సర్కారు పైకాన్ని భద్రాద్రి రాముడికి కైంకర్యం చేయించినందుకు నవాబు ఆగ్రహానికి గురై కారాగార శిక్ష అనుభవిస్తూ, శ్రీరాముని ఆర్తితో వేడుకొంటూ అనేక కీర్తనల్ని రాసాడు.

ఈయన చిన్నప్పుడే సంస్కృతాంధ్ర భాషల్లో పాండిత్యం సంపాదించాడు. శ్రీ మంచాళ జగన్నాథరావుగారు స్వరసహితంగా సేకరించిన రామదాసు కీర్తనలు సంగీత నాటక అకాడమీ ప్రకటించి రామదాసు కీర్తనల్ని నిలబెట్టడం ముదావహం. ప్రసిద్ధమైన రామదాసు కీర్తనలు--

'తారక మంత్రము కోరిన దొరికెను'
'తక్కువేమి మనకు'
'పలుకే బంగారమాయె'
'ఏ తీరుగ నను దయచూచెదవో'

మొదలైనవి సుమారు 20 దాకా వున్నాయి. రామదాసు కీర్తనల్లో, కవితా వైభవముకన్న భక్తి, ఆర్తి, మొర, పరివేదన, శరణాగతి మొదలైన వాటికే ప్రాధాన్యం.



"నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ" ఇది రామదాసు మొరను, ఆర్తిని చక్కగా స్పష్టీకరిస్తుంది. ఈయన రమణీయ రచనకు "బూచివాని పిలువబోదునా ఓ గోపాలాకృష్ణా" అనే కీర్తనను స్వీకరించవచ్చు. నవవిధ భక్తి రీతుల్ని తన కీర్తనల్లో మనోజ్ఞంగా అభివర్ణించి తరించాడు రామదాసు.

## సారంగపాణి

సారంగపాణి చిత్తూరులోని కార్వేటినగర సంస్థానంలో ప్రసిద్ధిపొందిన పదకర్త, వాగ్గేయకారుడు. ఈయన చెన్నపురి సమీపంలోని పొన్నేరులో పుట్టి పెరిగి, తర్వాత కార్వేటినగరం చేరి, ఆ ఆస్థానంలో స్థిరపడ్డాడు. ఈయన ఆస్థాన విద్వాంసునిగ, విద్యాధికారిగ, వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కాడు. ఈయన 1680 ప్రాంతంలో జన్మించి 1750 వరకు జీవించాడు. ఈయన సంస్కృతాంధ్ర భాషా నిపుణుడు. సారంగపాణి పదాలు ఇప్పటికి లభించినవి 201. అన్నమయ్యతో ఆరంభమైన తెలుగుపదకవిత క్షేత్రయ్యతో ఒక స్థిరరూపం పొంది, సారంగపాణితో విస్తృతి పొందింది. క్షేత్రయ్యలాగే సారంగపాణి తన పదాల్లో సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యమివ్వడమేగాక అభినయం జోడించాడు. చివరిదశలో రాజాశ్రయాన్ని కోల్పోయి నిరుపేదతనంతో శ్రీనాథునిలా సారంగపాణి అష్టకష్టాలు పడ్డాడు. సారంగపాణి పదాల్లో మనోజ్ఞమైన కవితాశిల్పముంది. పద ప్రయోగంలో సారంగపాణి సమర్థుడు. తెలుగు భాషపై సారంగపాణికి చక్కని అధికారం వుందనడానికి--

రమ్మనవే సామిని రమ్మనవే
కొమ్మ నీవే నా మనవి గై
కొమ్మని వేణుగోపాలుని.

అనే దానిని గ్రహించవచ్చు. సారంగపాణి పదాల్లో శ్లేష వైభవానికి--

పడతి నేస్తము వేణుగో పాలమాను
తడబడక నీవికను - దాని చింతమాను
పంతమున అటుదిక్కు పదినాళ్ళు పోకమాను
యింతి కిచ్చేవు సుమీ ఈతమాను.

ఇందులో చెట్లపేర్లు పొందుపరచి శ్లేష పొందు పరిచాడు. శృంగార పదాల్లో స్త్రీ పురుష విరహాన్ని సారంగపాణి చక్కగా చిత్రించాడు. సారంగపాణి పదాలు శబ్దాలంకార భరితములు.

## త్యాగయ్య

త్యాగయ్య 1767లో సీతమ్మ, రామబ్రహ్మములకు జన్మించాడు. తల్లి పురందర, రామదాసాదుల కీర్తనల్ని పాడుకుకునేది. సంగీతం త్యాగయ్యకు ఉగ్గుపాలతో అబ్బినది. త్యాగయ్యకు 18 వ ఏట వివాహమయింది. తర్వాత తండ్రి, భార్య మరణించారు. భార్య చెల్లెలు కమలాంబతో త్యాగయ్యకు మరల వివాహం జరిగింది. త్యాగరాజు నిత్యరామసంకీర్తనమే ఆచరించేవాడు. ఆయన కీర్తి దేశమంతట ఉత్తమ వాగ్గేయకారుడుగా వ్యాపించింది. ఈయన రాజాశ్రయాన్ని, సత్కారాన్ని తిరస్కరించాడు. త్యాగయ్య తిరువొత్తియూరు, కోవూరు, నాగలాపురము, తిరుపతి, కంచి, వాలాజాపేట, శ్రీరంగం, ఘటికాచలం మున్నగు పుణ్యక్షేత్రాలను దర్శించి ఆయా దేవతల ఉపముద్రతోటి అనేక కృతులు రచించాడు.

త్యాగరాజు కృతులకు 'త్యాగబ్రహ్మోపనిషత్తు' అను ప్రసిద్ధి కలిగింది. ఈయన 2400 కీర్తనలు రచించాడు. అయిన ఈనాడు సుమారు 60 కృతులు మాత్రమే సంగీత స్వరాలతో ప్రచారములోనున్నవి. .త్యాగరాజు 'ప్రహ్లాద భక్త విజయము', 'నౌకా చరిత్రము', 'సీతారామ విజయము' అనే మూడు సంగీత రూపకాల్ని రాసాడు. ఇవి నృత్య నాటికలు.

1847 వ సంవత్సరంలో త్యాగరాజు సిద్ధి పొందాడు. స్వప్న ప్రబోధితుడై తాను దివ్య ధామము చేరు దినమును సైతం గుర్తించాడు త్యాగయ్య. త్యాగయ్య కృతుల్లో మాతువు కంటే ధాతువునకే ప్రాధాన్యం. అందులోని సంగీతానికే అత్యంత ప్రాధాన్యం. త్యాగరాజు కృతుల్లో లాలి, జోల, నలుగుపాట, మేలు



కొలుపు, హెచ్చరిక, శోభన, మంగళము, పవ్వళింపు మొదలైన జానపదగేయబాణీలు అనేకం వున్నాయి.

భగవంతుని చేరటానికి భక్తియే తరణోపాయమని పదకవులు తామనుభవించి, ఉపాసించి మానవులకు మార్గదర్శకుల య్యారు. భక్తియేకాక నీతి, వైరాగ్య విషయములుకూడా పదకవులచే బోధింపబడ్డాయి. పదకవుల భక్తి ప్రపత్తులు కొనియాడదగినవి. మానవులకు ముక్తిమార్గాన్ని చూపిన వారీ పదకవులు. భగవంతుని పాదసేవయే మూలమని ఆచరించి, బోధించిన పదకవులు చిరస్మరణీయులు. వారు, వారి కవిత్వము అజరామరములు. అందుకే వీళ్లు పదసాహిత్యంలో రారాజులు.

దర్శించండి!

తరించండి!

## అప్పలాయగుంట

# శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి వారి
# బ్రహ్మోత్సవాలు



**ముఖ్య ఉత్సవాలు**

18-6-94 .......... ధ్వజారోహణం
22-6-94 .......... గరుడోత్సవం
25-6-94 .......... రథోత్సవం
26-6-94 .......... ధ్వజావరోహణం







మా ఇంట్లోని వారందరికి శ్రీ వేంకటేశ్వరస్వామి అనిన బహు నమ్మకము. నాకు ఆరాధ్య దైవము.

మా అమ్మ నాన్నలకు మేము ఐదుగురు సంతానం. మగవాళ్ళలో నేను పెద్దవాణ్ణి. ఒక అక్క, ఒక చెల్లి, ఇద్దరు తమ్ముళ్ళు. మా నాన్నగారు చిన్న ఉద్యోగం చేసేవారు. మా అమ్మ కుట్టుపని చేసేది. నేను పెద్దవాడి నవడంవల్ల ప్రతి విషయములోను మా అమ్మనాన్నలకు సహకరించాను. కష్ట సుఖాలు పూర్తిగా అవగాహన చేసుకున్నాను. డబ్బంటే ఏమిటో, వాటి విలువ పూర్తిగా తెలుసు కున్నాను. ఆర్థిక ఇబ్బందులవల్ల అతి కష్టంతో నేను డిగ్రీ పూర్తి చేశాను.

మా తాతగారివల్ల మానాన్నగారికి సంక్రమించిన ఆస్తి చిన్న పెంకుటిల్లు. దానిమీద కోఆపరేటివ్ అర్బన్ బ్యాంక్‌లో 1974 జూన్ నెలలో నేను అప్పుతీసుకొని చిన్న వ్యాపారం పెట్టాను. అప్పటికి నా చెల్లెలు పెళ్ళికి చేసిన అప్పు తీర్చాల్సివుంది. దైవ భక్తితో పాటు డబ్బు సంపాదించాలనే పట్టుదల పెరిగాయి. నాలుగు సంవత్సరాలలో బ్యాంక్ అప్పు, చెల్లెలు పెళ్ళికి చేసిన అప్పు తీర్చాను. గుంటూరులో రెండు ఇళ్ళు కొని మా అమ్మనాన్నగార్ల పేర రిజిస్ట్రరు చేయించాను. మా నాన్నగారి ఉద్యోగానికి రాజీనామా ఇప్పించి నే పెట్టిన షాపులోనే వుంచాను. అంతకు ముందుగా టెంపరరీగా నేను చేసిన కేంద్రప్రభుత్వ ఉద్యోగం, నేను మరికొంతమంది కలసి కోర్టుకువెళ్ళడంవల్ల పర్మినెంట్ ఉద్యోగం వచ్చింది. నా చిన్న తమ్ముణ్ణి, మా నాన్నగారిని షాపులో వుంచి నేను నా ఉద్యోగం చేసుకుంటూ ఖాళీ దొరికినప్పుడు వాళ్ళిద్దరికి సహాయపడుచుండేవాడిని. తమ్ముడి చిన్నతనం వల్ల డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చేస్తుంటే మందలించాను. అయినా వినలేదు. తల్లిదండ్రులకు చెప్పాను. పెళ్ళయిన అక్క చెల్లెళ్ళకు, బావలకు నా తమ్ముణ్ణి మందలించమని చెప్పాను. అందరూ వాడినే సమర్థించారు. కొన్ని నెలలు కాదు సంవత్సరాలు సహించాను. షాపు ముందు ఎప్పుడూ స్నేహితులు. రాత్రికి వాళ్ళతో తాగుడికి అలవాటుపడటం చూడలేక షాపుకు తాళం వేస్తానన్నాను. విధి వక్రించింది. నా తల్లిదండ్రులు నన్నే బయటకు పొమ్మని శాసించారు.

తప్పనిసరి పరిస్థితులలో 13-6-1984న నేను వేరు కాపురం పెట్టాను. అప్పటికి నాకు పెళ్ళయి ఒక బాబు పుట్టాడు. వాడికి 3వ సంవత్సరం. నా జీవితంలో కష్టాలు మొదలైనాయి. పాడికుండలాంటి వ్యాపారంలో లక్షలు సంపాదించి తల్లిదండ్రులను, తమ్ముణ్ణి గొప్ప వాళ్ళను చేయాలనుకోవడం నే చేసిన పాపమా? నా వాళ్ళను కున్న వాళ్ళందరూ నాకు అన్యాయం చేశారు. ఆ వెంకటేశ్వరస్వామిపై భారం వుంచి స్వామీ! నీవే దిక్కని వేరు కాపురం తాడేపల్లిలో పెట్టాను. ఈ చిన్న జీతంతో ఏ విధంగా భవిష్యత్తును నెట్టుకురాగలనా అని బాధపడ్డాను.

ఒక పూట తిన్ని, ఒక్క పూట తినక ఇంట్లో ఒకటి వుంటే మరొకటి లేక ఎన్నో కష్టాలను భరించాము. కుటుంబ పోషణకు జీతం చాలడం లేదు. ఆర్థికంగాను, మానసికంగాను ఎన్నో బాధలు అనుభవిం

# తెలియజెప్పుమయ్యా తిరుమలేశ!

శ్రీ బాలాంత్రపు సత్యనారాయణమూర్తి



శ్రీ తిరుమల విభుడ! శేషేంద్ర శేఖర!
దీన రక్ష వరద దేవదేవ!
భక్తవరులగాచు ముక్తిమార్గ మొకటి!
తెలియజెప్పుమయ్యా తిరుమలేశ!

ముష్టివాడు వచ్చి ముడుపుగా కాసిచ్చు
గొప్పవాడు వచ్చి కోట్లనిచ్చు
ముడుపు లెట్టివైన ముక్తి నిచ్చెద నంచు
దెలియ జెప్పుమయ్యా తిరుమలేశ!

ఆత్మయుద్ధమౌచు యందమౌ సత్యమ్ము
సెప్పుచుండు దాను జిన్నగాను
ఆత్మ నెరుగువాడె యధికుం డటంచును
తెలియజెప్పవయ్య తిరుమలేశ!

ఏడు కొండలెక్కి యెట్టులో నినుజూచి
పాప సంచయంబు బాపుకొనెడి
జనుల హృదయ మరసి శాంతి నిచ్చెద నంచు
దెలియ జెప్పుమయ్యా తిరుమలేశ!

పుట్టునప్పు డేడ్పు పోవునప్పుడు నేడ్పు
యేడ్పుతోనె మనిషి యాడ్పు బ్రతుకు
ఈశు డుండ నీకు నేడ్పేలరా యని
తెలియజెప్పు మయ్యా తిరుమలేశ!

ప్రాయ మెదుగుచుండు నాయువు దగ్గును
బుద్ధిమాత్ర మెపుడు కొద్దిరాదు
బుద్దులున్న చాలు శుద్ధికి మంచిదన్
దెలియజెప్పుమయ్యా తిరుమలేశ!

కలియుగంబులోన వెలసిన దైవమా
ముక్తి నీయవయ్య మోక్షధామ
యనుచు వేడుకొనగ నఖిల భక్తులకును
దెలియ జెప్పుమయ్యా తిరుమలేశ!

చాము. నా భార్య చాలాసార్లు వెంకటేశ్వర స్వామిని దర్శించి వద్దామండి, మన కష్టాలు ఆ స్వామికి విన్నవించుకుందాము. తప్పక అనాథలను రక్షిస్తాడు, కరుణిస్తాడని చెప్పి సలహా ఇచ్చింది. తిరుమల వెళ్ళి స్వామిని దర్శించుకునే ఆర్థికస్తోమతు లేదు.

ఎలాగైతేనేం చివరకు 16-2-1986న తిరుమలకు ప్రయాణమైనాము. తిరుమలలో స్వామివారికి కళ్యాణం చేయించిన ఒక భక్తునితో కలసి అతి సుఖంగా, సులువుగా కనులార శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే భాగ్యం కలిగించాడు. ఏకాగ్రతతో శ్రీస్వామి వారిని ప్రార్థించి శరణాగతవత్సలుని శరణు వేడినాము. నీవు తప్ప వేరే శరణ్యము లేదన్నాము. అప్పుడు నా వద్ద వున్న నాలుగురూపాయి బిళ్ళలు స్వామివారి హుండీలో వెయ్యాలనుకొని మరచిపోయినాము. స్వామివారి ప్రసాదం నాకు, నా భార్యకు, మా బాబుకు ఇచ్చారు. ప్రసాదం తిన్నాము. నేను లడ్లు కొందామని క్యూలో నిలబ జేబులో చెయ్యి పెట్టాను. నాలు రూపాయి బిళ్ళలు చేతికి తగిలాయి. చేసి మతిమరపు పనికి చింతిస్తూ మరల వెనకు వెళ్ళి నాలుగు రూపాయి బిళ్ళలు హుండీ వేశాను. చేసిన తప్పు క్షమించమని మనస్ఫూ వేడుకున్నాను. అప్పటికిగాని నా మనసు శాంతించలేదు. స్వామివారి ప్రసాదం లడ్డు వడ తీసుకొని క్షేమంగా తాడేపల్లి చేరాము

కలియుగ వైకుంఠం తిరుమల. భక్తితో కొలిచేవారి కొంగుబంగారం. ఆర్తితో పిలిస్తే ఆదుకునే ప్రత్యక్ష దైవం శ్రీ వేంకటేశ్వర స్వామి. దర్శనం చేసుకొని వచ్చినప్పటినుండి మాకు అదృష్టం కలసివచ్చింది. ఊహించని విధంగా మా జీతాలు పెరిగాయి. కూర్చోటానికి కుర్చీ, పడుకోడానికి చాప, సరిగాలేని నాకు ఒక వ్యక్తి ద్వారా చిన్న వ్యాపారం చేసి నలభై రోజులలో 40,000/- రూపాయలు సంపాదించుకోగలిగాను. ఇదంతా పూర్తిగా ఆ స్వామి మహిమేనని మేమంతా నమ్ముచున్నాము. భవిష్యత్తు ఎలా వుంటుందోనని భయపడ్డ మాకు ఆపద్బాంధవుడిలా ఒక వ్యక్తి చూపిన దారి నిజంగా ఆ దేవుడే ఆ వ్యక్తిరూపంలో వచ్చి మా సంసార నౌకను గట్టెంక్కించాడని మేము మనసారా నమ్ముచున్నాము. శ్రీ వేంకటేశ్వరుని కరుణార్ద్ర హృదయం వారి లీలలు ఏడేడు జన్మలకు మరువలేము.

ప్రతిదినం నా కోరికలన్నీ వెంకటేశ్వర స్వామివారికి నివేదించడం, ఆయన తీర్చడం జరుగుతుంది. ఇంతవరకు ఆ అనాథ రక్షకుడు ఏ కోరిక తిరస్కరించలేదు. మరల అనేకమార్లు ఆయన దర్శనం చేసుకున్నా తిరిగి ఆయన దర్శనం కొరకు, ఆయన ఆజ్ఞకు ఎదురుచూస్తుంటాము.



# దయార్ద్ర హృదయ ద్రౌపదీదేవి

శ్రీ కె.సి. సిద్ధయ్య

భారతకథలో ద్రౌపదీదేవి పాత్ర ఒక విశిష్ట మైనది. ఆమెయే ఒకచోట చెప్పుకొన్నట్లు, ఆమె వరమున పుట్టింది. భరతవంశమునందు కాలు పెట్టింది. అందు పాండు మహారాజునకు కోడలైంది. జనులు కొనియాడదగిన బలపరాక్రమవంతులగు పాండవులకు భార్య అయింది. సుపుత్రులను బడసింది. అన్నదమ్ముల ఆదరాభిమానములకు నోచుకున్నది. ఇన్ని విధాలుగా ప్రశస్తి కెక్కినది.

ఆమె ధర్మజ్ఞ. అతిథులను ఆదరించెడు స్వభావము గలది. మిక్కిలి పౌరుష వంతురాలు. తమను అన్ని విధాలుగా అవమానించిన దుర్యోధనాదులపై ప్రతీకారము తీర్చుకొనజాడక, సంధికై ధర్మజుడు ప్రయత్నించటాన్ని ఆమె నిరసించినది. (శాంతి పర్వమునందు రాయబారిగా వెళ్ళనున్న శ్రీకృష్ణునితో తనగోడు వెళ్ళబోసికొనే సందర్భమున సుస్పష్టము). ఆపై తనకు ఐదుగురు భర్తలైనను, తన మూలమున ఎవరికీ ఎలాంటి కలహములు రాకుండా నడచుకొనగల్గినది. ఒకపరి తనకు పతిని వశము చేసుకొను మార్గమును గూర్చి




చెప్పమని సత్యభామ అడిగినప్పుడు, పతికి నచ్చునట్లుగను, అతడు నొచ్చుకొనకుండునట్లును సతి నడచుకొనగల్గిన అదియ చాలునని పల్కిన సాధ్వీమణి ద్రౌపది.

అన్నిటికి మించి, ద్రౌపది దయార్ద్ర హృదయ. తన కొడుకులను (ఉపపాండవులను) పరిమార్చిన అశ్వత్థామను చంపక వదలిపెట్టుడని తన భర్తలతో పల్కు సందర్భమునందీ విషయము సుస్పష్టము. ఈ ఘట్టము భాగవతమునందు పోతనామత్యునిచే హృద్యముగా వర్ణించబడినది.

కురుక్షేత్ర సంగ్రామం చివరలో భీమ గదాహతిచే తొడలు విఱిగిపడియున్న దుర్యోధనుని కడకు అశ్వత్థామ వస్తాడు. ఆ స్థితిలో నున్న దుర్యోధనునిచూపి అతడు దుఃఖిస్తాడు. తాను పాండవులను సంహరిస్తానని మాట ఇస్తాడు. అందుకు సంతోషించిన దుర్యోధనుడు జలము తెప్పించి, అశ్వత్థామను సైన్యాధిపతిగా అభిషేకిస్తాడు. ఆ తరువాత, అశ్వత్థామ దుర్యోధనున కిచ్చిన మాటమేరకు, పాండవులను సంహరింప నిశ్చయించుకొంటాడు. అప్పటికి బాగా రాత్రి

సమయమైంది. దారిలో అతడు ఒక చెట్టుపై నిద్రించుచున్న పక్షులపై దాడిచేసి, వానిని చంపి తినుచున్న ఒక గుడ్లగూబను చూస్తాడు. ఆ గుడ్లగూబనుండి తాను ప్రేరణ పొందుతాడు. తానూ అలాగే, నిద్రావస్థలో నున్న పాండవులను వధించడానికి నిశ్చయించుకొంటాడు. తిన్నగా పాండవుల శిబిరంలో ప్రవేశిస్తాడు. అందు నిద్రావస్థలోనున్న అందరను చీకాకుపరచి, ద్రౌపదికి పాండవులవలన కలిగిన ఐదుగురు ఉపపాండవులతో సహా, అందరను సంహరిస్తాడు. పాండవులు ఆ సమయమునకు ఆ శిబిరమునందు లేనందున, వారికి ప్రమాదము వాటిల్లలేదు.

ఉపపాండవుల మరణవార్త విన్న అర్జునుడు కోపోద్రిక్తుడై, అశ్వత్థామను బంధించి తెచ్చి పుత్రశోకముతో విలపించుచున్న ద్రౌపది ముందుంచుతాడు. అప్పుడు బందీకృతుడైన అశ్వత్థామను చూసి, ద్రౌపది పల్కిన పల్కులలో ఆమె దయార్ద్రహృదయము స్పష్టమగుచున్నది.

'గురుపుత్రా! మా మగవారలందరూ మీ నాయనగారైన ద్రోణాచార్యునివద్ద ఆయుధ విద్యలన్నియు నేర్చుకొన్నారు. ' ఆ విధంగా మా మగవారలకు మీ తండ్రిగారు గురువు. నీవు ఆయన కుమారుడవు. అనగా సాక్షాత్తూ పుత్రాకారములోనున్న ద్రోణాచార్యుడవు. మరి నీవు నీ శిష్యుల (పాండవుల) కుమారులను, మనస్సులో కొద్దిగనైన దయ లేకుండ సంహరించితివి. ఇది నీకు న్యాయమా!

నీవు బ్రాహ్మణుడవు. బుద్ధి, దయల చేత భాసిల్లువాడవు. వీరులలో మొదటగా నెన్నదగినవాడవు. ఇట్టి నీవు రాక్షసునివలె ప్రవర్తించావు. శిశువులను వధించావు. ఇది నీకు పాడియనిపించినదా?

ఉద్రేకంబునరారు, శస్త్రధరులై
యుద్ధావనిన్ లేరుకిం
చిద్ద్రోహంబును నీకు జేయరు, బలో
త్సేకంబుతో జీకటిన్
భద్రాకారుల జిన్నపాపల రణ
ప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింపనకటా
నీ చేతు లెట్లాడెనో.

అయ్యో! నా కూనలు ఉద్రేకముతో, నీతో యుద్ధానికి తలపడలేదు. ఆయుధాలు ధరించి, యుద్ధ భూమిలో నిలబడలేదు. నీకు ఆవంతయును కీడుసేయలేదు. నా బిడ్డలు చూడముచ్చటైనవారు, మనోహరాకృతి గలవారు, వయస్సులో చిన్నవారు, యుద్ధతంత్రములందు నేర్పరితనమూ లేనివారు. పైగా అప్పుడువారు నిదురించుచుండినారు. అట్టివారిని, బలగర్వితుడవై చీకటిలో సంహరించితివే. అందుకు నీ చేతులెట్లాడినవి.



గురునందనా! పుత్రశోకార్తనై, నేనిక్కడ ఇట్లా విలపిస్తూ ఉన్నాను. మరి, నిన్ను ఈ విధంగా బంధించి తెచ్చిన విషయము తెలిసి, మీ తల్లి ఎంతగా దుఃఖించుచున్నదో కదా!

అశ్వత్థామనుద్దేశించి ఈ విధంగా పల్కిన ద్రౌపది, కృష్ణార్జునులను జూచి ఇలా అన్నది.

ద్రోణాచార్యులు మరణించారు. కాని, ఆయన ధర్మపత్ని (అశ్వత్థామ తల్లి) ఇంకా జీవించియే యున్నది. ఇతని నీవిధంగా బంధించి తెచ్చిన విషయము తెలిసి, పుత్రశోకంతో విలపిస్తూ నావలె, ఆమె ఎక్కడ, ఏ విధంగా కుమిలిపోతున్నదో. ఒక వేళ ఇతడు గనుక మరణిస్తే, మనకు చాలా పాపము చుట్టుకొంటుంది. ముందీతని హింసించడం మానండి. ఇతనిని బంధ విముక్తుని చేయండి. అంతేకాదు. ఇతడు బ్రాహ్మణుడు. రాజులకు బ్రాహ్మణులను కోపింపచేయుట తగనిపని. అలా కోపింపచేస్తే, ఆ కోపానలమునందు, రాజులనెడి అడవులు కాలిపోగలవు.

ఈ విధంగా ద్రౌపది ధర్మసమ్మతంగా, దాక్షిణ్య సహితంగా, మనసులో ఎలాంటి కపటము లేకుండా సమంజసంగా పల్కిన పల్కులకు ధర్మజుడు సంతోషించాడు. కాని, ఉద్రేకియగు భీముడు "అశ్వత్థామను చంపవలసిందే" నంటాడు. అప్పుడు కృష్ణుడు జోక్యముచేసికొని, "అశ్వత్థామ శిశుహంత. చంప తగినవాడే, క్షమార్హుడు గాడు. కాని, బ్రాహ్మణో నహంతవ్యః అని వేదము వినవస్తున్నది. కనుక, అర్జునా! నీవు ధర్మసమ్మతంగా వ్యవహరింపుము" అని అర్జునునితో చెప్పాడు.

ఆ మాటలు విన్న అర్జునుడు, అశ్వత్థామను చంపక, ఆతని శిరోజములను తరిగి, అందున్న గొప్ప మణిని సంగ్రహించి, అశ్వత్థామను శిబిరము వెడల నంపించెను.

ద్రౌపది తాను పుత్రశోకంతో విలపిస్తూ, అశ్వత్థామను పట్టి తెచ్చినందుకు ఆతని తల్లి ఎంతవిలపించుచుండునో ఊహించినది. తనకు కలిగిన పుత్రశోకము మరొకరికి కలగకూడదనుకొని తలచి తాను బాధపడుచు, ఎదుటివారు తమవలె బాధపడరాదని భావించుట ఎంత గొప్ప విషయము.





(20వ పేజీ తరువాయి)

నిర్మించబడింది.

2. ప్రధానాలయానికి ముందువైపు నంది మండపం కలదు.

3. ప్రధానాలయానికి ఉత్తరంవైపు ఒక అనుబంధాలయం.

4. ప్రధానాలయానికి దక్షిణంగా మరి యొక అనుబంధాలయం.

5. ప్రధానాలయానికి నైరుతిమూలలో ఒక ధర్మశాల వుంది.

6. ప్రధానాలయానికి పది కి.మీ. దూరంలో వాయువ్య మూలలో ఒక చిన్న ఆలయం నిర్మించబడివుంది.

7. ప్రధానాలయానికి ఒకటిన్నర కి.మీ. దూరంలో, వాయువ్య మూలలో ఒక చిన్న ఆలయం నెలకొనివుంది.

8. ప్రధానాలయానికి పశ్చిమంగా 1 కి.మీ. దూరంలో ఒక చిన్న ఆలయం నిర్మించబడివుంది.

9. రామప్ప చెరువుకు పశ్చిమాంత దిశలో ఒక చిన్న ఆలయం నెలకొనివుంది.

క్రీ.శ. 1217 వరంగల్ జిల్లా మచపూరుకు చెందిన శాసనం, రామేశ్వర, శ్రీ పర్వత మల్లికార్జున దేవుళ్ల భక్తుడొకడు 'వెన్నపరెడ్డి' ఐదు దేవాలయాలకు పైగా నిర్మించాడు. అందులో రెండు దేవాలయాలు అతని తల్లి దండ్రుల పేరుమీదుగా, (పేర్లు తెలుపబడ లేదు) నిర్మించబడ్డాయి. అతడు నిర్మించిన ఇతర దేవాలయాలలో కేశవదేవ, ప్రోలేశ్వర దేవ, ఎక్కేశ్వర దేవ, పతిదేవ ముఖ్యమైనవి. ఇందులో చివరిది గ్రామదేవత. వెన్నరెడ్డి కూడ ఈ ఆలయాలన్నింటికి భూమిని కానుకగా ఇచ్చాడు. కాని ఇచట చెప్పబడిన పతిదేవ మనకు అరుదుగా కనబడే పేరు. బహుశా ఇది గ్రామాలలో కొలిచే పోతురాజే అయివుండవచ్చును. పోతురాజు, గ్రామదేవతలయిన మాకలమ్మ, ఎల్లమ్మలతో కలిసి కొలువబడుతుంటాడు. ఈ శాసనాన్ని ఆ దేవాలయం పొలిమేరల్లో వున్న దిబ్బదగ్గర వున్న రాతిమీద చూడవచ్చును.

దేవాలయాల నిర్మాణానికి కాకతీయ గణపతి సోదరి అయిన మైలమ ఎంతగానో కృషి చేసింది. అదే రకంగా గణపతి ఇంకొక సోదరి అయిన కుండమాంబ కూడ చెప్పు కోదగ్గ కృషి గావించింది. ఈమె నట్వాడి రాజైన రుద్రదేవీ భార్య. వరంగల్ జిల్లా నిడిగొండకు చెందిన శాసనం ఆమె చేత నిర్మించబడిన ఆలయాలను గురించి తెలియ చెపుతున్నాయి. మొదట ఆమె రుద్రేశ్వర (ఆమె భర్త తర్వాత), గణపతీశ్వర, మహాదేవ (ఆమె తండ్రి కాకతీయ మహాదేవ తర్వాత), గణపతీశ్వర (ఆమె సోదరుని తరువాత), మరియు సూర్యదేవుళ్లను ప్రతిష్ఠించడమే గాకుండా ఒక త్రికూటాలయాన్ని సైతం నిర్మించి అందు ఈ దేవుళ్లను ప్రతిష్ఠ గావించింది. అంతేగాక ఆమె కాళేశ్వరం, (కరీంనగర్ జిల్లా) మంత్రకూడ, (ఆధునిక మంథెన, కరీంనగర్‌జిల్లా) మరియు జిడిక ల్లులోని హిడింబ పర్వతంమీద శివాలయాలను నిర్మించినట్లు తెలుస్తోంది. ఇంకా ఆమె గురించి తెలుస్తున్న విషయాలేమనగా, శివునికి ఆలయాన్ని 'గుండేశ్వర' పేరుతో శ్రీశైలంలోని మల్లికార్జునాలయం సమీపంలో నిర్మించినట్లు తెలుస్తోంది.

(సశేషం)

# రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- ❋ రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- ❋ సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- ❋ రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- ❋ కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- ❋ రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- ❋ రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు– ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయటం వలన ఉపయోగం వుండదు.
- ❋ రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- ❋ మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- ❋ సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ❋ ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ❋ ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

**సంపాదకులు**
**సప్తగిరి**
**తి.తి. దేవస్థానములు**
**తిరుపతి - 517 507**

దర్శించండి! తరించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం
## ఆలయకళ
## తిరుపతి



# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART
## TIRUPATI

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





# శ్రీ వేంకటాచలపతి ప్రణతి

శ్రీ కుంటిమద్ది శేషశర్మ



శ్రీ వేంకటాచలపతిం
కలౌ ప్రత్యక్ష దైవతం
అర్చానురూప రూపాభి
రూపం నౌమి రమాపతిమ్.

ఇది కలియుగం. ఇందు ప్రథమపాదం సాగుతూవుంది. దీని నాల్గుపాదాలూ ముగిస్తే మరలా కృతయుగం వస్తుంది. ఈ కాల మనాది అనంతము.

ఈ యుగంలో అధర్మాలు అక్రమాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. లంచగొండి తనాలు, దోపిడీతనాలు, మానభంగాలు, హత్యలూ మితిమీరినాయి. ధర్మాన్ని పాలించ వలసిన వారు స్వార్థపరులై కామక్రోధవశులై చేయు అక్రమాలకు మితిలేకుంటే, ఇతరు లను దండించేదెవరు?

యదా యదా హి ధర్మస్య
గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్.
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

--గీత

ధర్మహాని దాపురించినప్పుడు సాధు రక్షణకు నే నవతరించుతానని గీతాచార్య వాక్యము.

ఈ కలియుగంలో కంటే కృతయు గంలోనే దుష్టుల అలజడి అధికంగాబోలు. అందుకే మత్స్యకూర్మవరాహ నారసింహ రూపాలతో పరమాత్మ ఆవిర్భవించినాడు. త్రేతాయుగంలో భార్గవరామ దశరథరాము లుగా, ద్వాపరంలో వాసుదేవుడుగా పుట్టి, దుష్టసంహారం గావించినాడు. కలియుగంలో మాత్రం ఇంకా అవతరించలేదట. తొలిపా దంలోనే ఇంత అక్రమం పెరిగిందే, ఇంక రెండు మూడు నాల్గు పాదాలలో ఎట్టి ఘోర కృత్యాలు చూడవలసివుంటాయో! అది ముగిసే వేళకు కనరాని వినరాని దుర్ఘట నలు సైపలేక భూమాత ఘోషపెడితే విష్ణు యశుని కుమారుడుగ కల్కి నామంతో దుష్ట శిక్షణకు జన్మిస్తాడంట.

భావిన్యా దశయా భవన్నిహ
భవధ్వంసాయ నః కల్పతాం
కల్కిర్విష్ణుయశస్సుతః
కలికథాకాలుష్య కూలంకషః
నిశ్శేష క్షత కంటకే క్షితి
తలే ధారాజలౌఘై ర్ధ్రువం
ధర్మం కార్తయుగం
ప్రరోహయతి యన్నిస్త్రింశధారాధరః.

అని దేశికులవారి దశావతారస్తోత్రం.

అంతవరకూ మనకు ప్రత్యక్ష పరమాత్మ "కలౌ వేంకటనాయకః" అని వాసిగన్న వేంక టాచలపతియే.

అవ్యక్తరూపుడుగా సర్వవ్యాపియై, సర్వ ధారకుడైన పరమాత్మ భక్తానుగ్రహార్థం వైకుం ఠములో పరవాసుదేవుడుగా, జగత్సృష్టి స్థితి లయాలకు వ్యూహావతారుడుగా, రామకృ ష్ణాది విభవావతారుడుగా, "అంగుష్ఠమాత్రః పురుషః ప్రజానాం హృదయే సన్నివిష్టః" అన్నట్లు సర్వహృదయాంతర్వర్తిగా, అర్చావ తారుడుగా ఆవిర్భవించుచున్నాడు. కలికాలం లోని మనకు అర్చావతారుడే పరమాత్మ.

సర్వశక్తుడయ్యూ మనము చేయు ఉప వారాలను అనుమతించి అనుగ్రహించుచు



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం
# తిరుచానూరు
## నిత్యపూజానివేదనలు

సుప్రభాతం: ఉ. 5-00 గం. నుండి 5-30 గం. వరకు
సహస్రనామార్చన: ఉ. 5-30 గం. నుండి 6-00 గం. వరకు
శుద్ధి, మొదటిగంట: ఉ. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: ఉ. 6-30 గం. నుండి 11-30 గం. వరకు
శుద్ధి, రెండవగంట: ఉ. 11-30 గం. నుండి 12-00 గం. వరకు
సర్వదర్శనం: మ. 12-00 గం. నుండి సా. 6-00 గం. వరకు
శుద్ధి, మూడవగంట: సా. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: సా. 6-30 గం. నుండి రాత్రి 8-45 గం. వరకు
శుద్ధి రాత్రి 8-45 గం. నుండి 9-00 గం. వరకు
ఏకాంతసేవ: రాత్రి 9-00 గం. నుండి 9-30 గం. వరకు

## శుక్రవారాలలో

అభిషేకం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(రూ. 100-00 టిక్కెట్‌తో ఒక్కరికి మాత్రమే ప్రవేశం)*
అభిషేక దర్శనం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(ఒక్కొక్కరికి రూ. 5-00 టిక్కెట్)*

## ఆర్జిత సేవలు

| | | | |
|---|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం | ... | రూ. | 63-00 |
| గజవాహనం | ... | రూ | 32-00 |
| తిరుప్పావడ | ... | రూ. | 3000-00 |
| డోలోత్సవం | ... | రూ. | 150-00 |

## ఆర్జిత ప్రసాదాలు

| | | | |
|---|---|---|---|
| దోసె | ... | రూ. | 100-00 |
| దధ్యోదనం | ... | రూ. | 75-00 |
| పులిహోర | ... | రూ | 100-00 |
| పొంగలి | ... | రూ. | 200-00 |
| చక్కెర పొంగలి | ... | రూ. | 200-00 |
| కేసరి బాత్ | ... | రూ. | 300-00 |
| శాకరిబాత్ | ... | రూ. | 250-00 |
| సీరా | ... | రూ. | 400-00 |

*ఇవేగాక, భక్తాదులు రూ. 1-60 టిక్కెట్‌తో తమ గోత్ర, నామాదులతో అమ్మవారికి అష్టోత్తరశతనామ పూజ చేయించవచ్చును.*

న్నాడు. ఆ ఉపచారంలో చేయు నపచారాలను చూచీచూడనట్లు సైచియున్నాడు.

ధర్మశాస్త్రాలలో విధివిహితాలైన కృత్యాలు వదలి "ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థ సంగ్రహం" అన్నట్లు, ధర్మదూరులై అన్యాయార్జనకు పాల్పడువారిని నీచజన్మలపాలు జేస్తానన్నాడు. సజ్జనులైనా తెలిసో తెలియకో పరిస్థితులకు లొంగి అక్రమాలకు పాల్పడిన, వారిని శిక్షింప దొరకొను స్వామిని శాంతింప జేయుటకు సదా ఆతని కపాయినియైన లక్ష్మి హృదయమందే నెలకొన్నది. అట్టి లక్ష్మి లక్షిత వక్షస్కుడైన అర్చావతారుడై కనువిందు గూర్చు వేంకటాచలపతిని స్తుతింతును అని పై పద్యభావము.

నమామి పరమాత్మానం
నాకినామపి దైవతమ్,
జడాజడానాం స్రష్టారం
రమాలంకృత వక్షసమ్.

ప్రలయే సూక్ష్మభూతానాం
ద్యోవాయ్వగ్ని పయోభువామ్,
నామ రూపాది హీనానాం
లీనానాం తున్ద ఆత్మనః.

పరమాత్మ గొప్పదనము, తన నికృష్టత్వమూ తెలిసిన భక్తుడతనికి నమస్కరించును. అతడు పరమాత్మ యనిన, నికృష్టాత్మలు వేరే వుండవలె, వారే జీవాత్మలు. ఆ జీవాత్మలు ఒక్కొక శరీరంలో ఒక్కరుగా అనేకులున్నారు. వారు మూడు తెగలు. బద్ధులు, ముక్తులు, నిత్యులు. కర్మఫలానుభూతికి శరీరాలు తాలుస్తూ వదలుతూ జనన మరణ పరంపరకు బద్ధులైనవారు బద్ధులు వా రే శరీరం దాల్చినప్పు డా శరీరం పేరుతో పిలువబడుతున్నారు. పిల్లి బల్లి, పశువు పక్షి, నరుడు, సురలు అసురులు, మగ ఆడ అన్నవి శరీరాల వాచకాలైనా, లోని ఆత్మవరకూ అన్వయించుచున్నాయి.

మానవ జన్మమెత్తిన జీవి గీతలో చెప్పబడినట్లు ఏ యోగంచేతనైనా బంధవిముక్తుడైతే వాడే ముక్తుడు. ఏ నాటికీ బంధమునకు తగుల్కొని జీవులు నిత్యులు. వార త్రిపాద్విభూతిలోనివారు.

బద్ధజీవులే క్షరులు, ముక్తులు నిత్యులు అక్షరులు. ఈ ఇరుతెగల ఆత్మలకంటే ఉత్తముడుగాన ఆతడు పరమాత్మ. అదే గీతలో--

ద్వావిమౌ పురుషౌలోకే
క్షరశ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని
కూటస్థో౽ క్షర ఉచ్యతే.
యస్మాత్ క్షరమతీతో హం
అక్షరాదపి చోత్తమః,
అతో౽ స్మి లోకే వేదే చ
ప్రథితః పురుషోత్తమః.

అని గీతలో భగవద్వాక్యము.

ఆతని స్వరూప స్వభావాలేమి? అంటే--

యతో వా ఇమాని భూతాని
జాయన్తే యేన జాతాని జీవంతి
యత్ప్రయ న్త్యభిసంవిశన్తి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి.

సర్వమునకూ ఎవ్వడుత్పత్తి కారణమో, ఎవ్వడు రక్షకుడో, ఎవ్వనియందు ప్రళయములో లీనమగుచున్నదో, ఆతడే పరబ్రహ్మమని తెలుసుకో అని అదే "జన్మా ద్యస్య యతః" జగజ్జన్మస్థితి లయ కారణ మెవ్వరో అతడు బ్రహ్మ అని బ్రహ్మ సూత్రము.

ప్రళయ కాలంలో పంచభూతాలూ తన్మాత్రలలో అవి అహంకారంలో, అది తమస్సులో చేరి, అది పరమాత్మతో కలసియుంటుంది. అప్పుడు నామరూపాలు లేక ప్రకృతి సూక్ష్మముగా వుంటే స్వతః సూక్ష్ములైన బద్ధజీవులు కరణకళేబరాలు లేక పరమాత్మలో లీనమై యుండినవి. అప్పుడు సత్తుగానుండినవాడు పరమాత్మ ఒక్కడే.

సదేవ సౌమ్య ఇదమగ్ర
ఏక ఆసీత్ న బ్రహ్మ నేశానః

బ్రహ్మగాని శివుడుగాని ఉండలేదు. పరమాత్మ ఒక్కడే ఉండినాడు అని శ్రుతి.

స ఏకాకీ న రమేత
బహు స్యాం ప్రజాయేయ.

ఒక్కడుగానున్న పరబ్రహ్మకు దిక్కుదోచక తనలో దాగిన ప్రకృతిని పంచభూతాలుగా సృష్టించి, జీవులకు కరణ కళేబరాలు గల్గింపతలంచినాడు. ఆతని సంకల్పంతో ప్రకృతి గుణాలలో వ్యత్యాసమేర్పడి, "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః"-- ఇత్యాదిగా సృష్టికల్గినది. అందుకు నిమిత్తోపాదాన కారణము లాతడే.

సృష్టికర్త పరమాత్మే గావచ్చు "సో౽యం" అతడే ఇతడు అని తెలిసేదెట్లు?

పతిం విశ్వస్యాత్మేశ్వరమ్
శాశ్వతగం శివమచ్యుతమ్,
నారాయణం మహాజ్ఞేయం
విశ్వాత్మానం పరాయణమ్.

సర్వ విశ్వమునకూ, అన్ని జీవాత్మలకు పతి శివుడు, నారాయణుడు అని శ్రుతి. అందుకే ఎవడని నిర్ణయించేదిరా? శివుడవో మాధవుడవో అని త్యాగరాజు అన్నాడు.

రమాలంకృత వక్షసం, లక్ష్మీలక్షిత వక్షస్కుడే పరమాత్మ. పరమపురుష ప్రతిపాదక పురుషసూక్తము. "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ అహోరాత్రే పార్శ్వే" అని లక్ష్మీపతియే పరమపురుషుడని తెగచెప్పుచున్నది.

"శివ మచ్యుతం నారాయణం" అన్న శ్రుతికేమి నిశ్చితార్థము? అంటే శివుడు అంటే మంగళకరుడు. నారాయణుడు అంటే, నరులకు దిక్కయినవాడు అని ఒకటి విశేష్యము ఒక్కటి విశేషణముగావలె. శివునికి నారాయణ అన్నది విశేషణమంటే, అప్పుడు "నారాయన" ఔతుంది. "నారాయణ" గాదు. రషాభ్యాం నోణస్సమానపదే అన్నది ణత్వ విధాయకము, కాన నార పదములోని 'ర్' అయనలోని 'న'కు ణత్వ విధాయకము గాదు. కాన అది సంజ్ఞ అయితే 'పూర్వపదాత్సంజ్ఞాయామగః' అని ణత్వము వచ్చును. కానరమాలంకృత వక్షస్కుడైన నారాయణుడే పరమాత్మ.

ఆతడే నాకినా మపి దైవతం, స్వర్గస్థ దేవతలకూ దైవము. ఇక్కడ నాకం అంటే దుఃఖము లేనిదని. అయితే ఇంద్రాది దేవతలకూ దుఃఖము లేకపోలేదు. దైత్యులచే అప్పుడప్పుడు నానావస్థల పడుతున్నారు. కాన దుఃఖ లవలేశము లేనిది త్రిపాద్విభూతిలోని వైకుంఠము. అచ్చటివారు నిత్యులు ముక్తులు. వారి కీ దైవ మా పరమాత్మ. కాన పరమాత్మ లక్షణము పరమాత్మత్వమే.

పరా + మా = శ్రేష్ఠురాలైన లక్ష్మి. ఆమె గలవాడు పరముడు. అట్టి ఆత్మ పరమాత్మ అని. అట్టి పరమాత్మ అర్చావతారుడుగా వేంకటాచలముపై నెలకొనియున్నాడు. అట్టి పరమాత్మకు నమస్కారము అని పై పద్యముల భావము.



# నిత్యాభిషేకం

తిరుపతి కపిలతీర్థంలోని శ్రీ కపిలేశ్వరస్వామివారికి నిత్యాభిషేకం సేవను నూతనంగా ప్రారంభించారు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు సంవత్సరానికి రు.42-00లు చెల్లించాలి.

శాశ్వతంగా చేయించదలచుకున్న వారు రు. 500 + 42 లు చెల్లించాలి.

సంవత్సరానికి రెండు పర్యాయములు, ఇద్దరు వ్యక్తులను ఈ సేవను దర్శించటానికి అనుమతిస్తారు.

(16 వ పేజీ తరువాయి)

అస్తి, జాయతే, వర్ధతే, విపరణమతే, అపక్షీయతే, వినశ్యతి అన్నటువంటి ఆరు వికారాలు ఈ దేహికి వున్నాయి.

మనకు గూడ అనుభవములోనే వున్నాయి. కాని అనుభవాన్ని ఆలోచించి, గుర్తించే సమయం లేక తెలియటం లేదు అన్నారు. అదుగో ఆ సమయం కోసమే ఈ సత్సంగ గోష్ఠి.

బాల్యాదిష్వపి, జాగ్రదాదిషు  
తథా సర్వాస్వవస్థాస్వపి వ్యావృత్తా  
స్వను వర్తమానమహ మిత్యంతః స్ఫురం  
తం సదా, స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం  
యో భద్రయా ముద్రయా తస్మై  
శ్రీగురుమూర్తయే నమ  
ఇదం శ్రీదక్షిణామూర్తయే.

నా చిన్నప్పుడంటి అని మనం ఎప్పుడూ చెబుతూ వుంటాము. మరి చిన్నప్పుడు శరీరం ఇప్పుడు వుందా? లేదు. చిన్నప్పటి శరీరాన్ని ఫోటోలో తప్పించి చూపించలేము. 'నేను' ఉన్నాను కాబట్టే, నేను చిన్నప్పుడు, పెళ్ళప్పుడు, అని అనుభూతులు చెబుతున్నావు. అవి దేని ద్వారా చెబుతున్నావు. 'అహం'. ఆ నేను ద్వారా బాల్యావస్థ మొదలు అన్ని చూస్తున్నావు. వీటన్నింటినీ చూస్తున్నటు వంటిదే నిజమైనటువంటి ఆత్మ తత్త్వము. ఈ జీవులందరిని కూడ ముడి పెట్టుకుని 'అనుస్యూతం' గా ముడిపెట్టుకొన్నటువం టిది భగవత్తత్త్వము. ఆ భగవతత్త్వాన్నే ఆత్మ తత్త్వము, చైతన్యము, అని శ్రుతి మాత మనకు చెబుతున్నది. విశిష్టమైన ఈ తత్త్వాన్ని గుర్తించడం కోసమే వచ్చింది ఈ మానవ జన్మ. అంతేకాని, తినడం, త్రాగడం, నిద్ర మొదలైనవి జంతువులతోపాటు అందరికి సమానమే. ఈ జీవులలో నర జన్మ చాల దుర్లభము. మరి దేనిలో మానవుడు ఉత్కృష్టుడు? జ్ఞానము లేకపోతే, వాటికన్న హీనము. వేమన చెబుతారు.

చీమ సిద్ధ జ్ఞాని, కోడి కాల జ్ఞాని, కుక్క సుజ్ఞాని, పంది పరమ జ్ఞాని, పామరుడే అజ్ఞాని.

చీమకు సిద్ధత్వం వున్నది. ఏ తీపి వస్తువు ఎక్కడ వున్నది తెలుసుకొని, తమ తోటి వారితో వెళ్ళి నిల్వ చేసుకుంటుంది. కాని మనకు లేదు. సిద్ధత్వం కావాలి అంటే ఒక సాధన చేయాలి. ఒక యోగము, మంత్ర జపము చేయాలి.

కోడి కాలజ్ఞాని. వాటికి అన్ని జాములు తెలుస్తాయి. 'కొక్కొరోకో' అని లేపి 'నాయనా, మానవా! హే మనిషీ! ఇది వరకు చేసిన దుష్కర్మలు విడచిపెట్టు' అని చెబుతుంది. లేచి నన్ను ఏమి చేయమంటావు అని అడుగగా "సత్కర్మలు చేసి ఇతరులకు సహాయపడు" అని బోధిస్తుంది.

కుక్క సుజ్ఞాని. మనము ఒకే సమయంలో ఎన్ని విషయములు తెలుసుకుంటామో దానికి ఏబది రెట్లు ఎక్కువగా కుక్క గ్రహిస్తుంది. కుక్క సూక్ష్మజ్ఞాని అన్నారు. అవి వాసన చూసి దొంగల్ని పడుతుంది. అంతర్యాన్ని గ్రహిస్తుంది కాబట్టి వాళ్ళు మంచి వారా? చెడ్డవారా అని గ్రహిస్తుంది. మనిషికి కుక్క కున్న విశ్వాసము లేదు. దాన్ని ఛీ, ఛీ అన్నప్పుడు అది, "నా కున్న విశ్వాసము మీకు లేదే" అంటుంది.

పంది పరమజ్ఞాని. పంచ భక్ష్య పరమాన్నాలు తిని ఎంతో గొప్పగా అనుకుంటాము. అవి చివరికి మలముగా విసర్జింప బడుతాయి. అటువంటి మలాన్ని స్వీకరించి పంది వాతావరణ కాలుష్యమును లేకుండ చేస్తుంది.

నేను పెద్ద మనిషి నని అహంకరిస్తు వుంటాడే అతడే అజ్ఞాని. రెండు రకాల చక్రాలున్నాయి. భౌతిక చక్రము, ఆధ్యాత్మిక చక్రము అని రెండు. రెండూ అవసరమే. కాని ప్రధానం కాదు. ఆధ్యాత్మ విద్య అవసరం. ఆధ్యాత్మ విద్య అనగా నీ సహజ స్వరూపాన్ని తెలియచేయునది. పుట్టిన తరువాత నీవు ఎవరో తెలియ చెప్పేది ఆధ్యాత్మ విద్య.

ఆత్మ చింతన వల్ల మాత్రమే మనకు సమర్థమైన, శక్తి సద్బుద్ధి వస్తాయి. దేహ సంస్మరణచేత వున్నది పోతుంది. నిద్రలో అన్నింటిని మరచి పోయి ఆ కాసేపు తన స్వరూప స్వభావాలలో వుండాలని తల్లి ఒడిలో నిదురిస్తాడు. భక్తుడుగా వుండిపోవాలంటే భగవంతుని ఒడిలో వాలి పోవాలి. అలాగే ఈ జీవుడు బాహ్యమైన పనులు చేసి అలసిపోయి భగవంతుడనే అమ్మ ఒడిలో వాలిపోతాడు. ఏ రంగంలో ఉన్నప్పటికి ఈ మానవ జన్మలో వుండి జ్ఞానాన్ని పొందాలి. ఈ సదవకాశాన్ని నాకు కల్పించినవారికి, దానికి తగిన విద్యుత్తును నాలో కలుగచేసినందులకు ఆ వేంకటేశ్వరస్వామికి ఈ కుసుమాలను అర్పిస్తున్నాను.

ఓం తత్ సత్




# ఉపమన్యుడు

శ్రీ యం.సి. శివశంకరశాస్త్రి

సకల శాస్త్ర పారంగతుడైన ధౌమ్య మహర్షి ఆశ్రమంలో విద్యార్జనకై పల్వురు విద్యార్థులు చేరారు. ఆ మహర్షి శిష్యవర్గాన్ని బాగా పరీక్షింపదలచి పలు కఠిన పరీక్షలకు గురిచేస్తుండటంతో అందు చాలామంది విద్యార్థులు సగంలోనే తమ చదువులకు మంగళం పాడేసి వెళ్ళిపోగా మెరికల్లాంటి కొంతమంది మాత్రమే మిగిలారు.

అందు అతి చిన్న వయస్కుడైన ఉపమన్యుడనే ఓ బాలుడు వుండేవాడు. ధౌమ్యుడా బాలుని బాగా పరీక్షింపదలచాడు. పసివాడైన ఉపమన్యుని ఓసారి చేరబిలచి తన ఆవుల మందను చూపెడుతూ "నాయనా! రేపటినుంచీ వీటిని మేపుకొచ్చే బాధ్యత నీదే" అంటూ ప్రత్యేకంగా ఆ అర్భకుడికో పని కల్పించి చెప్పాడు. గురుదేవుల మాట శిరసావహిస్తూ ప్రతిరోజూ ఉదయం పాలు పితకటం అయిపోగానే వాటిని మేపుకొచ్చేందుకై అడవిలోకి తోలుకెళ్ళి సాయంత్రంవరకు బాగా మేపుకుని పొద్దుగూకే సమయానికి మళ్ళీ ఆశ్రమానికి చేరుకునేవాడు.

కాలమిలా హాయిగా సాగిపోతూండగా ఓసారి ధౌమ్యుడు ఉపమన్యునితో "నాయనా! రోజూ నీ ఆకలి ఎలా తీర్చుకుంటున్నావు?" అంటూ తన సందేహం వ్యక్తం చేశాడు. అందుకా బాలుడు చిరునవ్వు నవ్వి "గురువర్యా! ప్రతిరోజూ ఓ ఐదు ఇళ్ళల్లో భిక్షం అడుక్కుని వారు పెట్టింది తింటూ కాలయాపన చేస్తున్నాను" అని వినయంగా బదులు పలికాడు. అందుకు ధౌమ్యమహర్షి శిష్యుని ముఖంలోకి అదోలాచూస్తూ "ఉపమన్యా! శిష్యులు తమకు దొరికిన భిక్షను గురువుగారికి సమర్పిస్తే అందులోంచి ఆయన తిరిగి ఇచ్చిన ప్రతిభిక్ష మాత్రమే శిష్యులు భుజించటం ధర్మం. ధర్మ విరుద్ధంగా నడిస్తే మహాపాతకం" అన్నాడు. గురువులమాట గౌరవంగా అంగీకరించి నాటినుంచీ ఆయన చెప్పినట్టుగానే నడచుకున్నాడు. అయితే ధౌమ్యమహర్షి శిష్యుడు తీసుకొచ్చిన భిక్షను తీసుకుంటున్నాడేకానీ అతనికి మాత్రం పట్టెడు మెతుకులు కూడా పెట్టటం లేదు. ఇలా కొంతకాలం సాగి పోయింది.

ఉన్నట్టుండి ఇంకోరోజు ఉదయాన శిష్యునితో "నాయనా! నేను నీకు పిడికెడు మెతుకులు కూడా పెట్టటం లేదు కదా? మరి నీ ఆకలి బాధ ఎలా తీర్చుకుంటున్నావు?" అన్నాడు. "తొలిసారి భిక్షను మీకు సమర్పించి మలిసారి భిక్షాటన చేసుకోగా వచ్చినది తిని తృప్తిపడుతున్నాను" అన్నాడు ఉపమన్యుడు. అందుకాయన విచిత్రంగా నవ్వి "బాబూ! బ్రహ్మచారులు రెండవసారి భిక్షాటనకు వెళ్ళటంవల్ల గృహస్థులకు ఇబ్బంది కల్గించినట్టవు



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

తుంది. ఇంకెప్పుడూ ఇలా ఇబ్బంది కల్గించేపని చేయకు" అని హెచ్చరించి పంపాడు.

ఉపమన్యుడు గురుబోధ శిరసావహించాడు. అనంతరం కొన్నిరోజులు గడిచాక మళ్ళీ ఓ రోజు శిష్యుని చేరపిలిచి చెంత కూర్చుండ బెట్టుకొని "ఇప్పుడు రోజూ నీ ఆకలి ఎలా తీర్చుకుంటున్నావు" అని అడిగాడు. "భిక్షమానేసి ఆవుపాలు త్రాగి ఆకలి తీర్చుకుంటున్నాను" అన్నాడు ఉపమన్యుడు. ఆ ఆవులు నావి. కనుక నా అనుమతి లేకుండా వాటి పాలు త్రాగటం మహాతప్పు అంటూ కోపంగా గద్దించేసరికి నాటినుంచి ఆవుపాలు పిండుకుని త్రాగటంకూడ మానేశాడు.

ఏది ఏమైనా ఉపమన్యుని మరింత కఠిన పరీక్షలకు గురిచేసి అతని ఓర్పును తెలుసుకోగోరిన ధౌమ్యమహర్షి ఓ సంధ్యాసమయాన ఉపమన్యునితో "ఇప్పుడు నీ ఆకలి బాధ ఎలా తీర్చుకుంటున్నావు?" అంటూ ప్రశ్నింప "దూడలు పాలు తాగేప్పుడు పొదుగునుండి జారిపడే ఒకటి రెండు పాలబొట్లను చప్పరించి అంతటితో తృప్తిచెందుతున్నాను. ఇది కూడా తప్పేనా గురుదేవా?" అంటూ దీనంగా పలికేసరికి ధౌమ్యుడు అగ్గిమీది గుగ్గిలంలా మండిపడుతూ "నీవు ఆరగిస్తున్నావు కదా అని లేగదూడలు తమ కడుపుల్ని మాడ్చుకుని నీకోసం కొన్ని పాలబొట్లను జారవిడుస్తున్నాయి. వాటి కడుపుకొట్టటం మహాపాతకం అవుతుంది" అన్నాడు.

గురుదేవులు దేనికది అతికించినట్టుగా చెబుతూ పోతున్నందున పసిబాలుడైన ఉపమన్యుడికి ఎటూ దిక్కుతోచక నాటి నుంచీ కటిక ఉపవాసాలు చేయ మొదలెట్టాడు. చివరికో రోజు ఆవులను మేపుకొచ్చేందుకై అడవిలోకి పోయినపుడు ఆకలి బాధకు తాళలేక చేతికందిన ఆకులలములను దుసురుకుని పశువులా తినేశాడు. అందు కొన్ని ఆకులు విషపూరితం కావటంతో వికటించి అతని కళ్ళు కనుపించకుండా పోయాయి. చివరికి ఎటూ దిక్కు తోచక గుడ్డివాడై పోయిన ఉపమన్యుడు సంజెవేళ ఆవుల అడుగుల చప్పుళ్ళను అనుసరిస్తూ ఆశ్రమంకేసి నడువ సాగాడు. ఇలా వెళ్తుండగా దారిలో ప్రమాదవశాత్తు కాలుజారి ఓ పాడుపడ్డ బావిలో పడిపోయాడు.

ఉపమన్యుడు ఆవులతో కలిసి రానందున ధౌమ్య మహర్షి కలతచెంది వెంటనే కొంతమంది శిష్యులను వెంటపెట్టుకుని ఉపమన్యుణ్ణి పేరెట్టి పిలుస్తూ అడవిని గాలించాడు. పాడుపడ్డ బావిలో పడిన ఉపమన్యుడు గురుదేవుల కేకలు విని "గురుదేవా! నేనిక్కడున్నాను" అని బదులుపలికే సరికి గబగబా బావిదగ్గరకొచ్చి అతన్ని బయటికి తీయించి జరిగిందేమిటో తెలుసుకుని చాలా బాధపడ్డాడు.

ఏది ఏమైనా ఉపమన్యుని గురు భక్తికి, క్రమశిక్షణకు మెచ్చి తన మంత్రశక్తితో పోయిన చూపు మళ్ళీ వచ్చేలా చేశాడు. అనంతరం ఆనందంగా అతన్ని హృదయానికి హత్తుకుంటూ "నాయనా! నేను పెట్టిన ప్రతి పరీక్షలోను నెగ్గి ఘనుడనిపించుకున్నావు. నీ లాంటి శిష్యుడు లభించటం నిజంగా గర్వకారణం" అన్నాడు. వెంటనే ఉపమన్యుడు గురుదేవుని పాదాలపై పడి కన్నీరుకార్చాడు. ఆనాటి నుంచి తనకు తెలిసిన సకల శాస్త్రాలను కరతలామలకమయ్యేలా ఉపమన్యునికి బోధించాడు. గురువును మించిన శిష్యునిగా పేరుపొందిన ఉపమన్యుడు పురాణ ప్రశస్తి గాంచి మన పురాణాల్లో శాశ్వతంగా నిలిచిపోయాడు.





## రామాయణ పాత్రలు

(రచయిత : షేక్ మౌలాలీ; ప్రథమ సంపుటము; వెల రు: 60/- పుటలు : 200 - ద్వితీయ సంపుటము; వెల రు: 60/- పుటలు : 200 ; ప్రతులకు : 5-62-186/6/19, బ్రాడీపేట, గుంటూరు-2.)

# రచయితలకు గమనిక

'సప్తగిరి'లో సమీక్ష చేయుటకు రచయితలు
తమ గ్రంథాల్ని రెండు ప్రతులుగా పంపవలెను.
లేనిచో సమీక్ష చేయబడవు

'సంపాదకులు'

భారతీయాత్మని అవగాహన చేసికొనాలంటే వాల్మీకి మహర్షి సంస్కృతంలో రచించిన రామాయణాన్ని అధ్యయనం చేయటం అత్యవసరం. ఇది ప్రతిపాదిస్తూ వున్న ఆదర్శాల్ని మేధావులు ఈ నాటికీ ఆదరిస్తున్నారు, రేపటికీ ఆదరిస్తారు. వేదాలచేత తెలియబడే పరమపురుషుడు శ్రీరాముడై జన్మించగా వేదమే రామాయణ రూపంలో అవతరించిందని విద్వాంసులమాట. మర్యాదా పురుషోత్తముడైన రామచంద్రుని ఆదర్శ చరిత్రను చెప్తూతూ వున్నందున రామాయణమనీ, తన సౌశీల్యంచేత స్త్రీలోకానికి ఆదర్శప్రాయమైన సీతాదేవిని వర్ణించటంవల్ల సీతా చరితమనీ, లోకవిద్రావణుడైన రావణుని కథ కావటం కారణంగా పౌలస్త్యవధఅనీ దీనికి నామాంతరాలున్నాయి. భారతీయుల ఔన్నత్యమూ, వారి ఉదార జీవితాశయాలూ, సభ్యతా సంస్కృతులూ, వర్ణింపబడటంతో రామాయణం జాతీయ మహాకావ్యంగా ప్రశంసింపబడింది.

రామాయణగాథ అత్యంత ప్రాచీనమైందని చెప్పటానికి ఋగ్వేదంలోని ఇక్ష్వాకు, రామ, దశరథ అనే శబ్దాలు నిదర్శనం. మహాభారతమూ, బౌద్ధజాతక కథలూ, జైన పురాణాలూ, బ్రహ్మాండ పద్మ భాగవతాది పురాణాలూ కూడ రామకథను ప్రస్తావించాయి. వీటి కన్నిటికీ మూలం ఆదికవి విరచిత వాల్మీకి రామాయణమే అని విజ్ఞుల అభిప్రాయం.

రామాయణ కథతోను, దానిలోని పాత్రల తోను, ఏ కొంతైనా పరిచయం లేని భారతీయుడుండడన్న అతిశయోక్తికాదు. ఈకావ్య దీప్తులు దేశంలోని వివిధ భాషల్లోనే గాక, విదేశాల్లో సైతం వ్యాపించాయి.

భారతీయ గృహజీవితాన్ని ఇంత సమగ్ర సుందరంగా వర్ణించిన గ్రంథం సంస్కృతాంధ్రాది సాహిత్యాల్లో మరొకటిలేదు. తల్లీ-తండ్రీ, తనయుడూ-జనకుడూ, భార్యా-భర్తా, అన్నా-తమ్ముడూ, యజమానీ-సేవకుడూ, మిత్రుడూ-శత్రువూ, మున్నగు సమాజంలోని వ్యక్తులందరూ పరస్పరం ఏ రీతిగా ప్రవర్తించాలో, ఏ రీతిగా ప్రవర్తించరాదో రామాయణం స్పష్టంగా నిర్దేశిస్తుంది. ఒకమాటలో చెప్పాలంటే రామాయణ కావ్యంలాంటి గ్రంథం నభూతో నభవిష్యతి.

ఇలాంటి రామాయణ మహాసాగరాన్ని మథించి దానిలోని పాత్రల స్వరూప స్వభావాల్ని విశ్లేషించి ఆ పాత్రలు సమాజానికందించిన సందేశామృతంలోని స్వాదు వెలంటిదో రుచిచూపించిన షేక్‌మౌలాలీగారు సర్వవిధాలా ప్రశంసార్హులు. విజ్ఞుల కడ రామాయణ రహస్యాల్ని కూలంకషంగా చర్చించి, ఆ గ్రంథంపై ఒక స్పష్టమూ, నిర్దుష్టమూ అయిన అవగాహనని ఏర్పాటుచేసి కొన్న మనీషి ఈయన. రామాయణ కావ్యంలో వాల్మీకి మొదలు రామపట్టాభిషేకం దాకా ప్రత్యక్షమవుతూ వున్న పాత్రల్ని రెండు భాగాలుగా విభజించి (మొదటి భాగంలో 29, రెండవ భాగంలో 26) శివధనస్సు, పాదుకలు మొదలైన అప్రాణుల్ని సైతం విడువకుండా వింగడించి చూపారు. రామాయణాన్నేగాక, ఇతర గ్రంథాలలోని రామకథను కూడ ప్రత్యక్షర శోధగా పరిశీలించినవారుగానీ పాత్రల వ్యక్తిత్వాన్ని ఇంత చక్కగ ప్రదర్శింపలేరు. ఈ గ్రంథానికి 'సఖ్యము' ప్రకటించి శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు శ్రీ మౌలాలీ పాండిత్య ప్రతిభల్ని ప్రశంసిస్తూ చెప్పిన మాటలు ప్రత్యక్షర సత్యాలు. చక్కని, చిక్కని వచన రచన, విషయ నిర్దేశ స్పష్టత, సరళమనోజ్ఞ పదవిన్యాసం శ్రీ మౌలాలీ కలానికి పెట్టని సొమ్ములని చెప్పవచ్చు. ఆర్ష సంస్కృతీ పరిరక్షణకు నడుం బిగించిన తి.తి. దేవస్థానములు ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేయడం ఎంతైనా సముచితంగా వుంది. ఇలాంటి ఉత్తమ గ్రంథాలు శ్రీ మౌలాలీ కలం నుండి శతాధికంగా వెలువడాలి. రామాయణాన్ని గూర్చి తెలిసికోగోరే ప్రతి వ్యక్తికీ ఇది అవశ్య పఠనీయగ్రంథము.

- డి. నాగసిద్ధారెడ్డి







# విశ్వాసం

**శ్రీ శివప్రసాద్ పండా**



వెంకయ్య, రాజయ్య అనే ఇద్దరు స్నేహితులుండేవారు. వారిరువురు అంధులు కావడంవల్ల వేరే విధిలేక శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం ముందు భిక్షాటన చేస్తూ కాలం వెళ్లబుచ్చుతుండేవారు.

వీరిరువురిలో వెంకయ్య సహజంగా మంచి బుద్ధిగలవాడు మరియు ఆలోచనాపరుడు. భిక్షాటనలో ఉన్నంతసేపు స్వామివారి నామం స్మరించి, భజనచేస్తూ స్వామివారి గీతారత్నాలను ఆలపించేవాడు. తన మనసులో మెదిలే ప్రతి మంచి సూచన, ఆలోచన తను విధిగా పాటించడంతోబాటు తన స్నేహితుడు రాజయ్యకు చెబుతుండేవాడు. వెంకయ్య రోజూ తను భిక్షాటన చేసేంతర్వాత అందులో సగానికి పైగా పైకాన్ని స్వామివారి హుండీలో వేస్తూ, మిగిలిన దాన్ని తన దిన ఖర్చులకు ఉపయోగించుకొనేవాడు.

వెంకయ్య గుణగణాలకు పూర్తిగా భిన్నంగా వుండేవాడు రాజయ్య. కేవలం డబ్బులకోసమే స్వామివారి ఆలయం ముందు భిక్షాటన చేసేవాడు గానీ, ఏ ఒక్క రోజు స్వామివారి నామాన్ని స్మరించే వాడు కాదు. వచ్చిన పైకాన్ని వివిధ వ్యసనాలకు వినియోగిస్తుండేవాడు. వెంకయ్య ఎన్నోసార్లు అలాంటి చంచల బుద్ధుల్ని వీడిచిపెట్టమని హితవుచెప్పినా పెడచెవిన పెట్టేవాడు రాజయ్య.

ఆరోజు రాత్రి సత్రంలో రాజయ్య గాఢ నిద్రలో మునిగియున్నాడు. వాడికి ప్రక్కనే పక్కపరచుకొని నిద్రకు ఉపక్రమించబోతూ, వెంకయ్య తన మనసులో, "స్వామి శ్రీ వేంకటేశ్వరా, ఆపదమొక్కులవాడా! పుట్టుకతో అంధత్వాన్ని ప్రసాదించావు. ఏజన్మలో చేసుకొన్న పాప ఫలితమో ఈ జన్మలో అనుభవిస్తున్నాను. కాని, స్వామి ఈ అంధత్వాన్ని నాకు సంభవించబోయే మరణం వరకు మాత్రం శాశ్వతం చేయకు. ఈ జన్మలో నీ రూపాన్ని దర్శించే భాగ్యాన్ని నాకు కలిగించి నా ఈ అంధత్వాన్ని పోగొట్టుస్వామి. ఆ ఋణాన్ని నేను జీవించినంతకాలం ఆలయ సేవలు చేస్తుంటాను స్వామి. నీ సాన్నిధ్యంలో గడపి నీ సేవకు పాత్రుడవుతాను స్వామీ! నా ఈ అంధత్వాన్ని పోగొట్టు స్వామీ! ఈ అంధత్వబందీలోంచి నన్ను విముక్తుణ్ణి చేయు స్వామీ!. విముక్తుణ్ణి చేయి" అనుకొని, స్వామివారి నామాన్ని మరోసారి స్మరించుకొని నిద్రలో నిమగ్నమైపోయాడు వెంకయ్య.

తెల తెల వారింది. స్వామివారి సుప్రభాత గీతం వెంకయ్య చెవికి సోకగానే నిద్రలోంచి తేరుకున్నాడు. ప్రక్కన రాజయ్య మాత్రం ఇంకా నిద్రలోనే మునిగి యున్నాడు. అది చూసిన వెంకయ్య మాత్రం రాజయ్యను తట్టిలేపాడు. ఒళ్ళు విరుచుకుంటూ ఆవులింత తీస్తూ లేచాడు రాజయ్య.

వెంకయ్య, రాజయ్య లిద్దరూ కాలకృత్య స్నానాదులు పిదప భిక్షాటనకొరకు ఆలయం ముందు ఆసనాలు వేసి కూర్చున్నారు.

వెంకయ్య, రాజయ్యతో రాత్రి తన మనసులో అనుకొన్నది, స్వామివారికి విన్నవించుకొన్నది అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పి "ఒరే, రాజయ్య నువ్వుకూడా స్వామి వారిని వేడుకోరా ఈ అంధత్వం నుంచి వేరు చేయమని కోరరా" అని చెప్పాడు వెంకయ్య.

దానికి రాజయ్య, "నువ్వూ నీ మూఢ నమ్మకాలు కాకపోతేగాని, స్వామివారిని వేడుకొన్నంత మాత్రాన మన అంధత్వం పోతుందా. చాలు చాల్లే ఆ విముక్తి, ప్రముక్తి నువ్వే సాధించుకో. నాకవేం గిట్టవు" అని విసురుగా అన్నాడు.

వెంకయ్య చాలా బాధ పడ్డాడు.

కొన్నాళ్లకు రాజయ్య వ్యసనాలు మరింత పెరిగి, అనారోగ్యం పాలయ్యాడు. మరణం ఆసన్నమయ్యే ఆఖరి గడియల్లో చిక్కుకుపోయాడు.

వెంకయ్య మాత్రం ఆరోగ్యంగా ఉన్నాడు. పైగా స్వామివారి దయ మూలంగా కళ్లు కనబడసాగాయి. దానికి గాను వెంకయ్య సంతోషం అంతా ఇంతా కాదు. స్వామివారు కేవలం రూపం ఉన్న భగవానుడే కాక తనపై విశ్వాసం చూపే భక్తులకు మంచి త్రోవ చూపే భగవానుడని రుజువయింది. శ్రీ వేంకటేశ్వరస్వామి దృష్టిలో తన భక్తి, శ్రద్ధలు మంచి స్థానాన్ని సంపాదించుకొన్నాయని ఆనందోత్సాహంతో పొంగిపోయాడు వెంకయ్య. స్నేహితుడిచ్చిన మంచి సూచనలను త్రిప్పికొట్టిన మూలంగా, దేవుడిని దూషించిన దూషణల ఫలితంగా తన చావుకు తానే కారకుడయ్యాడు రాజయ్య.





UTSAVA MURTHY OF TIRUMALA TEMPLE

( 6 వ పేజీ తరువాయి)

లనియే నని, ప్రాచీన వేదకాల సంకుచిత భావ సంఘములయందు గూడా ప్రబోధించినారు.

వాస్తవమునకు ఆ సాంఘిక ధర్మపాలనా విధానమే ఆధ్యాత్మిక సాధనమునకు ప్రాధమిక, విజ్ఞాన సోపానమనవచ్చును. ఋగ్వేద కాలమున ఆధ్యాత్మిక మరియు జగత్ సృష్టి, సత్య సందర్శనము. నీతి, ధర్మ సందర్శనము మొదలుగా గల వానిని ఋగ్వేదము బోధించుచున్నది.

సన్మార్గము నీతి ప్రవర్తనయే నాటి కుటుంబ వ్యవస్థకు సాంఘిక జీవితమునకు మూలాధారము. సాంఘిక ధర్మమునతిక్రమించెడివారు మానవాభ్యుదయ నిరోధకులు గాను, సంఘ విద్రోహులుగను పరిగణింపబడెడివారు.

అందువలననే యజుర్వేదమునందు ఋషి పుంగవులు, సర్వాంతర్యామియైన భగవంతునికి హృదయపూర్వక ప్రార్ధనలు చేసెడివారు.

"సుఖ సంపదలనిచ్చువాడు, విజ్ఞాన ప్రదాతయైన సృష్టికర్తకు మా అవయన సంపదతో ఉత్తమమైన కార్యములను నిర్వహించుటకు శక్తిని ప్రసాదించుగాక! మా మధ్య చోరుడు, పాపాత్ముడు అయిన వాడు జన్మించకుండా యుందు గాక!"

--ఋగ్వేదము -- 1-1

మానవ జీవిత లక్ష్యమును ఉన్నత పథముల యందు ఈతి బాధలకు దూరముగా సాగించాలనే కోరికతో భగవంతుని దయ కొరకు ప్రార్ధిస్తూ యజుర్వేదమునందనేక పారములు కలవు.

విజ్ఞాన నిధులతో మమ్ము ఆయన (భగవంతుడు) పునీతులను చేయుగాక! వేద శాస్త్ర విధులతో మమ్ము నిస్వార్థులుగా రూపుదిద్దు గాక!

,--యజుర్వేదము 3-1

"నీకు సత్కార్యాచరణకు ప్రేరణ కల్పించువారెవ్వరు? అది ఆయనే. భగవంతుడు మనలను విజ్ఞాన పథములయందు నడిపించును. ఆయనెందుకా విధముగా చేయును?

నీవు జీవితమున ఉన్నత పథమునధిరోహించి, సత్కార్యాచరణ చేయు జ్ఞానవంతుడివై, సత్యధర్మ విధులను నిర్వహిస్తూ ఉత్కృష్టమైన జీవనము సాగించుటకు"--

--యజుర్వేదము 1-6

ఆ కాలమునందు ఔన్నత్యమునకుగాని, విజ్ఞాన సముపార్జనమునకు గాని, శాస్త్రీయమైనట్టిదియు, క్రమబద్ధమైనట్టిదియు సూత్రములు ప్రతిపాదింపబడలేదనుట యందెట్టి సందేహము లేదు. అయినను నిజమునకు ఆనాటి పురాణ కాలమునందు కూడా నీతిదాయకమై నట్టియు ధర్మపరాయణ మైనట్టియు, జీవితము మానవునికి ఔన్నత్యమును జ్ఞానమును ఆధ్యాత్మిక చింతనమును ప్రసాదించినదనుట యందెటువంటి అతిశయోక్తియూ కానరాదు.

వేదకాలమునాటి ప్రజల దృఢవిశ్వాసమే మనగా, మానవ జీవితౌన్నత్య సాధనకు, భగవంతునిచే చెప్పబడిన నీతి నిజాయితీలు ధర్మ పరాయణతలే సోపానములు.

వారానాడు నిర్వహించిన ఆచార వ్యవహార సంబంధమైన క్రతువులు, యజ్ఞములు వారి వారి స్వప్రయోజనములకు కాక సర్వ మానవ శ్రేయస్సు నాసించి చేసెడి వారనుట యందెట్టి సందేహము లేదు. నేటి సాంఘిక మానవుని సత్య సంధతకు, ధర్మ నిరతికి సంబంధించిన లక్షణములను మనము యజుర్వేదమునందు గాంచగలము.

వారి దృక్పథమునందుగల సాంఘిక, పౌరాణిక ధర్మపాలనము నందు గల దీక్ష, ఆధ్యాత్మిక ధర్మములకు దగ్గరగా నుండెడిది.

### అందుకు కొన్ని నిదర్శనములు

ఓ మానవుడా! నీతిగను, ధర్మముగను ఆర్జించిన వస్తు సముదాయమును సర్వ మానవ శ్రేయస్సుకొరకు వినియోగించుము.

--యజుర్వేదము 1-9

నీ జీవితమును శాశ్వతముగ, స్థిరముగా ఆదైవమున కంకితము చేయుదువు గాక! ఆధ్యాత్మికముగా ఔన్నత్యమును పొందిన వారు కూడ, మానవధర్మ విసర్జన చేయు కుందురుగాక!

భగవదనుగ్రహము కొరకు మనమందరము యజ్ఞములను నిర్వహించవలయును. జీవితౌన్నత్య సాధనకొరకు, విజ్ఞాన సముపార్జన కొరకును, ఇహ పరలోక సాధన కొరకును యజ్ఞములు నిర్వహించవలయును. యజ్ఞములను నిర్వహించి సర్వమానవ శ్రేయస్సులను సాధించవలయును. యజ్ఞం ఈతి బాధలను తొలగించును.

--యజుర్వేదము 1-13

ఇందుమూలముగా విశదమగు సత్యమే మనగా వేదకాలమునాటి యజ్ఞములు కేవలము యాంత్రిక కార్యక్రమములు కావు. అవి ఉత్కృష్టమైన, సాంఘిక మానవత్వ, పౌరాణిక విలువలు గలిగియుండెడివి.

వేదపారము క్రమ శిక్షణ ప్రాథమికముగా పౌరాణికమైనవని భావించవలసియున్నది. వేద ఋషులు ప్రవచించిన నీతి సూత్రములు ధర్మపథము మానవజాతికి భగవంతుడు ప్రసాదించిన జీవిత విధానక్రమమైన సూత్రములు. అందువలన వేదములు వల్లించెడి ధార్మిక మత పారములను గౌరవించవలెను.





# శ్రీమత్స్యగిరి నృసింహక్షేత్రం

శ్రీ యం.వి.ఎస్. రంగాచార్యులు

నల్లగొండ జిల్లాలోని వలిగొండ మండలంలో వేములకొండ గ్రామమునకు సుమారు 3కి.మీ.దూరమున ఒకకొండ కలదు. ఆ కొండ సుమారు 500 అడుగుల ఎత్తుగ లదు. ఆ కొండపై భక్తజన పారిజాతుడగు శ్రీమత్స్యగిరి నృసింహస్వామి గలడు. ఆ స్వామి అచట ఏ శతాబ్దమున వెలసినాడో తెలియదు. శ్రీస్వామివారికి ఆలయముకాని విగ్రహములు కానిలేవు. కొండపైన పుష్కరిణి మాత్రముకలదు. ఆ పుష్కరిణిలో విచిత్రమగు ఆకారములో ఒకే జాతికి చెందిన చేపలు కొల్లలుగాకలవు. వాటికి తిరుమణి కాపు (నామముల) వలె ముఖమున మూడు రేఖలు కనపడును.

ఎంతటి కరువు కాలములోనైనను పుష్కరిణిలో నీరు ఉండును. అదియును పాలవలె తెల్లని ఆకారములో శుభ్రముగా, మధురముగా యుండును. పుష్కరిణిలోగల చేపలనే స్వామిగా భావిస్తూ భక్తులు తమ మొక్కుబడులను చెల్లిస్తుంటారు. కొండపైగల పుష్కరిణిలో మత్స్యములుండుట వలన ఆ కొండకు 'మత్స్యగిరి' అను ప్రసిద్ధనామమేర్పడినది. కొండపైగల పుష్కరిణిలో గల చేపలకు నామములు మూడుండుట వలన అచటికి వచ్చు భక్తులు ఆ చేపలను నామాల చేపలని పిలుచుట ఆచారము.

కొండపైన కేవలము ఒక మంటపము మాత్రమే కలదు. ఆలయ నిర్మాణమునకు భక్తులు ప్రయత్నించగా స్వామివారు వారికి స్వప్నములో దర్శనమిచ్చి, అసమ్మతిని తెలిపినారని జనవాడకము ఈ ప్రాంతమున కలదు. నేటివరకు కూడా ఆలయనిర్మాణము గురించిన ప్రయత్నము జరుగుటలేదు. శ్రీ స్వామివారికి ఆలయ నిర్మాణముమీద కోరిక లేదనియే ప్రజలలో ప్రచారము కలదు. గుట్టపైకి వెళ్లుటకు కనీసము మెట్ల సౌకర్యము కూడా లేదు. ఇటీవలనే భక్తులు చందాల రూపములో డబ్బును సేకరించి, మెట్ల నిర్మాణమును పూర్తి చేయించి కొండపైకి వెళ్లుటకు సౌకర్యము కలిగించినారు. ప్రస్తుతము కొండపైకి భక్తులు సులభముగా వెళ్లి స్వామివారి కార్యక్రమములను పూర్తి చేసుకొనుచున్నారు.

శ్రీస్వామివారు గల కొండకు భువనగిరి నుండి నల్లగొండ వెళ్లు మార్గమున గల వలిగొండ మండల కేంద్రమునుండి మార్గము మారవలసియుండును. యాదగిరి గుట్ట ఆర్.టి.సి. డిపో నుండి వలిగొండ ద్వారా తిరుమలగిరికి మరియు నార్కట్‌పల్లి ఆర్.టి.సి. డిపో నుండి వలిగొండ నుండి మోత్కూరుకు వెళ్లు బస్సులలో ప్రయాణించు భక్తులు అరూరు గ్రామములో దిగినచో స్వామి నిలయమగు వేములకొండ గుట్ట 3 కి.మీ. దూరములో వుండును. చాలా వరకు వేములకొండ శ్రీమత్స్యగిరి నృసింహస్వామివారి సన్నిధికి చేరు భక్తులు వలిగొండ కేంద్రము నుండి బస్సులలో ప్రయాణము చేయుటయే కాక స్వంతముగా టెంపోలను కాంట్రాక్టుచేసుకొని కొండకు చేరుకొందురు.

శ్రీవారి సన్నిధికి చేరు భక్తులు ధనుర్మాస ప్రారంభపు తొలి శనివారమునుండి ప్రతి శని, సోమవారములలో చుట్టుప్రక్కల గ్రామములనుండి ఎడ్ల బండ్లు, గుర్రపుబండ్లు, సైకిళ్లు, ట్రాక్టర్లు, బస్సులలో వస్తారు. ఇతర జిల్లాలనుండి కూడా అత్యధిక సంఖ్యలో భక్తులు వచ్చుచుందురు.

ఇటీవలనే దేవాదాయశాఖవారు ఈ కొండను స్వాధీనపరచుకొన్నారు. ఇటీవలనే కొండపైవరకు రాష్ట్ర విద్యుత్‌బోర్డు వారు విద్యుత్తు సౌకర్యమును కల్పించినారు. కొండపైన సదనము (విశాలము)గా స్థలము ఉండుటవలన వేలాదిగా వచ్చిన భక్తులు వంట చేసికొని భుజించుటకు మంచి సౌకర్యము కలదు. యాత్రీకుల సందర్శన మెక్కువగా యున్న రోజులలో వారు తినెడి ఆహార పదార్థములకు దృష్టి దోషముండదు. ఇది శ్రీవారి మహిమగానే భక్తులీవిధముగా చెప్పుకొనుచున్నారు. చేపలను పట్టుకున్న వారి చేతులు వాపులను పొంది ఆయాసమగునని ప్రతీతి.

పంట చేలకు అనగా ఆముదము, వరి, జొన్న మొదలగు వాటికి తెగుళ్లు కలిగినపుడు, శుభ్రతతో కొండపైకి వెళ్లి శ్రీస్వామిని మనసారా ధ్యానించి పుష్కరిణిలో స్నానమాచరించి టెంకాయను సమర్పించి, అగరువత్తులను ముట్టించి, పుష్కరిణిలోని నీటిని తీసికొని వెళ్లి పైరులపై చల్లినచో తెగుళ్లు నశించి, చక్కని పంటలు పండునని భక్తుల విశ్వాసము. భక్తులు వారికి పండిన పంటలను పుష్కరిణిలో పోసినను, ఆ నీరు కలుషితము కాదు. ఆ పంటలు స్వామివారికి చెందునని భక్తులు విశ్వసింతురు. ఇచట స్వామివారికి తలనీలాలు సమర్పించుటకు ఏర్పాటు కూడా కలదు.

ఈ మధ్యనే యాదగిరిగుట్ట శ్రీలక్ష్మీ నృసింహస్వామివారి ధర్మకర్తలమండలివారు శ్రీమత్స్యగిరి నృసింహస్వామివారి దేవాలయ నిర్మాణమునకు 2 లక్షల రూపాయలిచ్చుటకు తీర్మానించి, శంఖుస్థాపనాదికార్యక్రమాలను జరిపించినారు. ఇట్టి దేవాలయ నిర్మాణము త్వరలో పూర్తియై, శ్రీస్వామివారి విగ్రహ ప్రతిష్ఠాపన జరిగి, భక్తులకు నివాస సౌకర్యములకుగాను సత్రముల నిర్మాణము జరిగినచో, కొద్దికాలములో నల్లగొండ జిల్లాలో మరియొక ప్రసిద్ధ పుణ్యక్షేత్రము కాగలదని భావింపవచ్చును.

వేములకొండ గుట్టపై వెలుగొందుతున్న శ్రీమత్స్యగిరి నృసింహస్వామివారు భక్తులపాలిట కల్పతరువై, సమస్త భక్త జనులకు ఇష్టకామ్యములను తీర్చి, ప్రసిద్ధి పొందుతారని యాశింపవచ్చును.



(8 వ పేజీ తరువాయి)

రచించిరి. వీరిది చేర్యాల మండలం ధూళి మిట్టగ్రామం. శతకమున క్షేత్ర వివరములు ఏవియులేవు. పంచ పద్యాలతో నరసింహావ తారము గూర్చి వర్ణించిరి.

ఆండాళుగారు మిమ్మర్చించు హర్షీఖ్ఖు
నీ పూజ సేయుడే నేడు భఖ్ఖు.

దీనియందు కవి పారశీకోక్తులు ప్రత్యే కంగా వ్రాసిరి.

## *11. యాదగిరి లక్ష్మీ నరసింహ శతకము*

1973లో ఉదయగిరి తాలూకా గంగు లవారి చెరువుపల్లి గ్రామనివాసి కప్ప వెంక టరామరాజు 101 ఉత్పలమాలల్లో రచించిరి. ఆ పూజా సుమాలను భక్తితో స్వామికి అర్పించారు.

లక్ష్మీనరసింహ యాదగిరి
శృంగనివాస దయాపయోనిధీ.

అనే మకుటంతో రచన సాగింది. ప్రతి పద్యంలో ప్రాసాక్షరంగా 'నకా'రమును వాడుట ఇందలి ప్రత్యేక విశేషం. దేవస్థానం వారు దీనిని ముద్రింపచేశారు.

## *12. నరసింహశతకం*

దీనిని జిల్లా ప్రజాపరిషత్ కొండంగల్ తెలుగు పండితులు శ్రీ ముడుంబై వరదా చార్యులు రచించిరి. భక్తి ప్రపూరిత పద్య రత్నాలు కలిగియున్నది.

## *13. నృసింహశతకం*

దీనిని వరంగలు జిల్లా గూరూరు నివాసి శ్రీ కందాళ లక్ష్మణాచార్యులు నృసింహస్వా మిపై భక్తిభావంతో రచించినారు. కాని ఇది అలభ్యము.

## *14. యాదగిరి శ్రీలక్ష్మీ నృసింహస్తవ తారావళి*

ఇది 1931 ప్రజోత్పత్తినామ సంవత్సర శ్రావణ బహుళ సప్తమినాడు వరంగల్లున




గల వేంకటేశ్వర ముద్రణాలయమున ముద్రి తము. దీని రచయిత శ్రీపతి కంఠము రామచంద్రమరాజు. వీరిది హనుమంతపురం. జనగామ మండలం. "యాదగిరి లక్ష్మీనా రసింహ ప్రభో" అనే మకుటంతో రచన సాగింది.

## *15. యాదగిరి లక్ష్మీనృసింహ శతకము*

ఇది 1961లో చొల్లేటి నృసింహశర్మ తనకు కల్గిన సాంసారిక బాధలు యాదగిరి నృసింహుని అనుగ్రహమున తొలగినందులకు కృతజ్ఞతాపూర్వకంగా రచించిరి.

ఇవేగాక ఇతర నరసింహ దేవాలయా లమీద దేవేరులను తాడేపల్లి పానకాలరా యకవిది మంగళాద్రి నృసింహ శతకం. పంచాగ్నుల వేంకట దీక్షితులు మాల్య శైల లక్ష్మీనృసింహశతకం (1926), శ్రీమతి గుడి పూడి ఇందుమతి దేవిగారి "మంగళాద్రి నృసింహ శతకం (1932), మద్దాలి గురు స్వామి నృసింహశతకం" మొదలైనవి ఎన్నియో కలవు.



## తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవ క్రమము

| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 16-5-94 | సోమ | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 17-5-94 | మంగళ | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 18-5-94 | బుధ | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 19-5-94 | గురు | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 20-5-94 | శుక్ర | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 21-5-94 | శని- | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 22-5-94 | ఆది | హనుమద్వాహనం సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 23-5-94 | సోమ | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 24-5-94 | మంగళ | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 25-5-94 | బుధ | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవబృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

## హృషీకేశ్, నారాయణవనం శ్రీ వేంకటేశ్వర స్వామి వార్ల బ్రహ్మోత్సవ క్రమము

| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 21-5-94 | శని | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 22-5-94 | ఆది | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 23-5-94 | సోమ | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 24-5-94 | మంగళ | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 25-5-94 | బుధ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 26-5-94 | గురు | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 27-5-94 | శుక్ర | హనుమద్వాహనం సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 28-5-94 | శని | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 29-5-94 | ఆది | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 30-5-94 | సోమ | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవబృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం ద్వాదశారాధనం, ఏకాంతోత్సవం |

## శాంతి మహాయజ్ఞం

మహారాష్ట్రలోని, కొల్హాపూర్ శ్రీ మహాలక్ష్మి అమ్మవారి ఆలయంలో శ్రీ శ్రీమన్నారాయణ అష్టాక్షర శ్రీసూక్త అద్భుత శాంతి మహాయజ్ఞం మార్చి 19 నుంచి 23 వరకు నిర్వహింపబడింది. తిరుమల తిరుపతి దేవస్థానం వారి ధర్మప్రచారపరిషత్ ఆధ్వర్యంలో ఈయజ్ఞం నిర్వహింప బడింది.

ఈయజ్ఞం వైఖానస ఆగమ శాస్త్రోక్తంగా తిరుమల ఆలయ ప్రధాన అర్చకులు శ్రీ మాడంబాకం శ్రీనివాస భట్టర్ ఆధ్వర్యంలో జరిపించబడింది.

తి.తి.దేవస్థానముల ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి, తి.తి.దే. ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ నాచు శేషగిరిరావు, కొల్హాపూర్ మహారాజు, కొల్హాపూర్ డి.ఐ.జి., కలెక్టరు, జిల్లా న్యాయాధిపతి, సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు, మేయరు తదితర అధికార అనధికార పుర ప్రముఖులందరూ ఈ యాగనిర్వహణకు సహకరించారు.

కర్ణాటక రాష్ట్రం, ముళబాగల్‌కు చెందిన శ్రీ శ్రీ శ్రీ విజ్ఞాననిధి స్వామీజీ యాగాన్ని దర్శించారు.

రోజుకు దాదాపు 70 వేలమంది చొప్పున మొత్తం 3.5 లక్షల మంది భక్తులు ఈ యజ్ఞాన్ని దర్శించారు. దాదాపు రు. 2 లక్షల 30 వేలు ఈ యాగ నిర్వహణకు ఖర్చయింది.

యాగశాలలో వుంచిన హుండీల ద్వారా దాదాపు 1 లక్ష 18 వేల రూపాయలు, విరాళాల ద్వారా దాదాపు 77 వేలు ప్రజలనుంచి లభించింది.

బొంబాయికి చెందిన డా॥ అల్వా 3300/- రూ॥ ఖరీదుచేసే దీపస్తంభాలను విరాళంగా యిచ్చారు. అంతేకాక 5 ఆవుదూడల జతలు విరాళంగా లభించాయి. వీటి ఖరీదు సుమారు రు. 25000/- వుంటుంది.



యజ్ఞం జరిగిన అన్నిరోజులు ప్రసాద వితరణ జరిగింది. ఒక్క 23-3-94 నాడు తిరుమల శ్రీవారి ప్రసాదమైన ఉచిత లడ్డూలు దాదాపు 30 వేలు భక్తులకు వితరణ చేయడం జరిగింది. అంతేకాక 'ఓం' స్టిక్కర్లు, శ్రీవారి, శ్రీ పద్మావతి అమ్మవారి ఫోటోలు పంపిణీ చేశారు.

ఇన్నిరోజులపాటు తి.తి.దే. ధర్మప్రచారపరిషత్, అన్నమాచార్యప్రాజెక్టు కళాకారులు సంకీర్తనలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు వీడియోద్వారా శ్రీ వేంకటేశ్వరవైభవం, శ్రీవారి బ్రహ్మోత్సవం క్యాసెట్లు ప్రదర్శించారు.

✤

## వార్తాలహరి



## తిరుమల తిరుపతి దేవస్థానముల

# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ప్రసాదించిన వరం. ఆ అడవుల్ని ..రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి **శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం** పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అటవీశాఖ వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

### వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

**సౌకర్యాలు :**

* వృక్షసంపదకు దాతపేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.15,000/-.**

### వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచడానికి నిర్దేశించిన పథకం.

**సౌకర్యాలు :**

* దాతపేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కల వితరణ.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.10,000/-.**

### స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

**సౌకర్యాలు :**

* ఈ వనానికి దాత పేరు పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.2,000/-.**

## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు ప్రదర్శిస్తారు.
* ఒక సంవత్సరంపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అధ్యయన వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కదగ్గర దాత పేరు ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-.

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్‌రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటడం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు చెట్టుదగ్గర ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వనసంపద పరిరక్షణకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

## అన్నమయ్య వర్ధంతి ఉత్సవాలు

శ్రీవేంకటేశ్వరస్వామివారి పరమ భక్తుడు, పద కవితా పితామహుడు అయిన తాళ్లపాక అన్నమాచార్యుల వారి 491 వ వర్ధంతి మహోత్సవాలు తిరుపతిలో వైభవంగా జరిగాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్యప్రాజెక్టు ఆధ్వర్యంలో 94 ఏప్రిల్ 7వ తేదీనుండి 13వ తేదీ వరకు వారంరోజులపాటు తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో ఘనంగా జరిగాయి.

7-4-94 వతేదీ ఉదయం 7గం॥ అన్నమయ్య, పెద తిరుములయ్య, వేంకటేశ్వరస్వామివారి ప్రతిమల ఊరేగింపు జరుపబడింది. పిదప అన్నమాచార్య కళామందిరంలో శ్రీకోదండరాములవారి ఆస్థానం. "దినము ద్వాదశి" సంకీర్తన పూజ ఘనంగా జరిగాయి.

ఆ సాయంత్రం దేవస్థానం శ్రీ కార్యనిర్వాహకులు శ్రీ డి.వి.యల్.ఎన్. మూర్తి అధ్యక్షతన జరిగిన సమావేశంలో అన్నమాచార్యప్రాజెక్టు డైరెక్టర్ డా॥ మేడసాని మోహన్ ప్రాజెక్టు నివేదికను సమర్పించారు.

దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి ప్రసంగిస్తూ, శ్రీ వేంకటేశ్వరునకు, అన్నమయ్యకు విడదీయరాని, విడదీయలేని అనుబంధ ముందని, అలాంటి అన్నమయ్య కీర్తనలను భక్తితో ప్రచారం చెయ్యాలని చెప్పారు. ఇటీవల కేవలం వ్యాపార సరళిలో అన్నమయ్య కీర్తనల ప్రచారం సాగుతోందని, ఆవేదన వ్యక్తం చేశారు. అన్నమయ్య జన్మస్థలమైన 'తాళ్లపాక'ను అభివృద్ధి పరచాలని శ్రీ చెంగల్‌రెడ్డి, శ్రీ డి.వి.యల్.ఎన్. మూర్తిని కోరారు.

చివరగా శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి ప్రసంగిస్తూ, దేశం నలు మూలలా, దేవస్థానం చేస్తున్న ధర్మ ప్రచారానికి ఆదరణ లభిస్తున్నదని, ఇటీవల శ్రీరంగం, గురువాయూరులో ఆళ్వారు ప్రాజెక్టు తరుపున ధార్మిక కార్యక్రమాలు నిర్వహించామని తెలియ జేశారు. ఒకదశలో తాము మరచిపోయిన ఆళ్వారు పాశురాలను మళ్లీ శ్రీరంగంలో విన్పించారంటూ అక్కడి జియ్యంగారు సంతోషపడ్డారని, శ్రీరంగ ఆలయాన్ని దత్తత స్వీకరించ వలసిందిగా కోరారని శ్రీమూర్తి చెప్పారు.

పిదప తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయులను శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి సత్కరిస్తూ, తిరుమలలో తాళ్లపాక, తరిగొండవారి గృహాలను స్మారక మందిరాలుగా ఏర్పాటు చేస్తామని తెలియ జేశారు.

ఆ తర్వాత శ్రీ నేదునూరి కృష్ణమూర్తి గాత్ర కచ్చేరి వీనులవిందుగా సాగింది.

వారం రోజులపాటుసాగిన ఈ అన్నమయ్య వర్ధంతి ఉత్సవాల్లో శ్రీ బండ్లమూడి సత్యనారాయణ, శ్రీ పి. శేషగిరిరావు, శ్రీ పి.వి. శ్రీనివాస మూర్తి, శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, శ్రీ కె. రాజన్నశాస్త్రి. శ్రీ ఎల్. వేణుగోపాల్, ఎం.డి. రామమూర్తి మున్నగు సాహితీవేత్తలు ప్రసంగించారు.

శ్రీమతి పి. రాజేశ్వరీ శ్రీనివాస్, శ్రీ కల్లూరి మురళీకృష్ణ, శ్రీమతి జి. జానకి, ఆచార్య పశుపతి, శ్రీమతి ఉషా శ్రీనివాస్, శ్రీమతి విజయలక్ష్మి శర్మ, మున్నగు సంగీత ప్రముఖులు పాల్గొన్నారు.

చివరిరోజు 13-4-94 వతేదీ ఉదయం శ్రీ గోవిందరాజ స్వామివారి ఆస్థానం - సంకీర్తనపూజ జరిగాయి.

ఆ సాయంత్రం జరిగిన సమాపనోత్సవంలో శ్రీ ప్రపంచం సీతారాం సంగీతాన్ని గూర్చి వివరించారు. ఆచార్య టి. కోటేశ్వరరావు కబీర్ - అన్నమయ్య భక్తి సాహిత్యాల్ని తులనాత్మకంగా తెలియజేశారు. ✿

---

( 4 వ పేజీ తరువాయి)

**తాతపాదులపై గురు భావంతో అన్నమాచార్య చరిత్రను దేశి గతిలో రాసి అందించిన చిన తిరుమలాచార్యులు ఆంధ్ర సంకీర్తన చరిత్రకే అపూర్వ సేవ చేశాడు. ఆ చరిత్రే లేకపోతే, కవి అజ్ఞాతుడై పాటలున్న తామ్ర పత్రాలు వంటపాత్రలై పోయేవి. అన్నమయ్యను అనుకునే వాళ్లే ఉండేవారు కారు.**

**ఆదరణ లేక అల్లాడుతున్న దేశి కవితారీతులకు ప్రత్యేకించి కీర్తన పద్ధతులకు రాచమర్యాద కల్పించి అందలం ఎక్కించిన సాహితీ విప్లవ మూర్తులు తాళ్లపాక కవులు.**

**ఇది అన్నమయ్య జయంతి. అందుకే అర్పిద్దాం ఆ ముగ్గురికీ అంజలి!**

**జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,**
**నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్.**

---

Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press
by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



# సప్తగిరి

వెల : రు. 2/-

జూన్, 1994

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక





కొలువుఁడీ భక్తిఁ గొండల కోనేటి
నిలయుని శ్రీనిధి యైనవాని

ఆదిదేవుని నభవుని సామ-
వేద నాద వినోదుని నెర
వాది జితప్రియు నిర్మలతత్త్వ-
వాదుల జీవనమైనవాని.

దేవదేవుఁడైన దివ్యుని సర్వ-
భావాతీతస్వభావుని
శ్రీ వేంకటగిరి దేవుఁడైన పర-
దేవుని భూదేవ తత్పరుని.

--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 44,
సంపుటం : 1 (1980)



# మీతో....నేను

మిద్దె లెక్కిన తర్వాత మెట్లు కనపడవని ఒక సామెత  అలాగే మనం పైపైకి పోతూ కిందికి చూస్తే నేలంతా  సమతలంగా దానిమీదివన్నీ నిలిచినమొక్కలు గానో, నడిచే బొమ్మలుగానో కన్పిస్తాయి. గతమంతా ఒక కలగా భవిష్యత్తొక భూతంలా కనిపిస్తాయి. నిజానికి ఏ క్షణాని కా క్షణం మరొక క్షణం లేదనిపించే  మహత్కాలమే.

ఇప్పటికి ఈ పత్రికకు 25 వసంతాలు నడిచాయి. పత్రిక పాతికేళ్ల పరువంతో పాటు ప్రాజ్ఞత కూడ సంపాదించుకుంది. కాస్త ఆగి వెనక్కి చూస్తే ఇంతకాలం గడిచిందా? గడిపామా? అన్న ఆశ్చర్యం కలుగుతుంది కూడా. నిజానికి కాలపు గాలానికి తగిలి ఆడుతుంటామే తప్ప కాస్త ఆగిచూస్తే నాటికీ నేటికీ ఎంత తేడానో కనిపిస్తుంది.

ఒకనాడు ఓ పది పేజీల కరపత్రసంపుటం స్థాయినించి పుటల పుష్టిని పెంచుకుని, ప్రమాణ ప్రధాన రచనా రూప  పట్టుపుట్టా సింగారించుకుని ఒకటికి ఐదుగా అందరి అభిమానాలను పొందుతూ ఈనాడు సెహబాస్ అన్నమాట బాటలో మరొక్క అడుగు ముందుకు వేయబోతోంది.

ఇక్కడే నా గుడి, బడి అనుకున్న నేనూ ఎంతో ఎదిగాను. ఎదిగి ఏం సాధించావంటే చెప్పలేనుగాని ఆ ఎదుగుదల ఛాయలు ముఖంమీది ముడుతలై స్పష్టంగా కన్పిస్తున్నాయి.  పరిమితి మనిషికిగాని, అనుభవానికి కాదు  కనకా అవకాశం దొరికితే ఇంకా సంపాదించుకుందామనే ఉంది ఆ అనుభవాల సంపదను.

పత్రిక కన్న ఏడేళ్ళు ముందున్న నేను 30 వసంతాల వల్లెవేత బ్రతుకు బాటలో ఎన్ని కోవల వారిని ఈ  కోవెలముందు చూసి వుంటానో!

మూడేళ్ళ కొకసారి మారే ధర్మకర్తల మండలి అధ్యక్షులూ, సదస్యులూ మూడేళ్ళ కొకసారి మామూలుగా అవసరమైనా అయిదేళ్ళు దాటకుండా ఈ శ్రీవారి దివాణం లోకి అడుగు పెట్టి అవతలకు వెళ్ళే  కార్యనిర్వహణాధికారులు అందరూ మంచివాళ్ళే అన్నమాటను వివిధ స్వరాల్లో పంచుకున్నవాళ్లే అయినా అందరూ  మరిమంచి మంచిని పెంచేందుకు ప్రయత్నం చేసినవాళ్లే.

కొత్త పత్రిక అమ్మి పదిరూకలు సంపాదించుకుందా మనుకోటానికి బదులు పాతదైనా పరవాలేదు పంపండి అని  పడిగాపులు గాచిన నాల్గునూర్ల విక్రేతలకు ఆ స్వామి అంటే ఎంత వింత భక్తో!

(48వ పేజీలో)




గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఎ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రమరణకర్త - సంపాదకులు
కాటుపాటి సుబ్బారావు, ఎమ్.ఎ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జాలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# ఈ సంచికలో.... జూన్, 1994

సంపుటి 25 సంచిక 1



ముఖచిత్రం : 25వ సం||లో అడుగుపెట్టిన సప్తగిరి
2 వ కవరుపేజీ : శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయ దృశ్యం, తిరుచానూరు.
3 వ కవరుపేజీ : శ్రీ పద్మావతి అమ్మవారి తెప్పోత్సవం
4 వ కవరుపేజీ : శ్రీ ఆంజనేయస్వామి

చిత్రం : జగదీష్



# సంపాదకీయం



పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జనియించినపుడ పుట్టదు జనులా
పుత్రుని కనుగొని బొగడగ
బుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ!

కొడుకు కలిగాడని కొండంత సంబరం కలిగినా, పదిమంది పొగడినప్పుడే అసలైన ఆనందం కలుగుతుంది. నిజానికి వ్యక్తి అయినా వ్యవస్థ అయినా అంతే. ఒక దృష్టితో తాముచేసిన ప్రయత్నం ఫలవంతమై పదిమంది ప్రశంసలకు పాత్రమైనప్పుడు ఆ వ్యక్తి లేదా వ్యవస్థకు కలిగే ఆనందం ఆ తండ్రి ఆనందం కన్న తక్కువేమీ కాదు.

దేవస్థానం ఓ 40 ఏళ్ళ క్రిందట కేవలం పూజా కార్యక్రమాలు, ఆహార ఆవాస సౌకర్యాలను తెలియజేసేందుకు ప్రచురణ సాగించిన బులెటిన్ 1970 నాటికి సప్తగిరిగా మారి ఈనాడు ఐదు భాషలలో వెలువడుతుందని ఆనాడు ఎవరూ ఊహించి ఉండరు. ఆలయ యాజమాన్యం నుంచి ముఖ్యంగా దక్షిణ భారతం నుంచి ఇన్ని భాషలలో ఆస్తికులకు సేవ చేస్తున్న పత్రిక ఇదే మొదటిది కావచ్చు. ఆర్ష ధర్మ ప్రబోధమే ఆశయమైన అన్ని ధర్మాల వర్గాలవారి అవగాహనకు అనుకూలమైన రీతిలో ఏర్పడిన శీర్షికలు ఆమోదపాత్రం కావటం మనకు కొండంత బలం.

కేవలం ఆధ్యాత్మిక విషయాలకే పరిమితం కాకుండా సప్తగిరి, భక్తబృందాలకు సంబంధించిన ఆహార ఆవాస వాహన సౌకర్యాల విషయంలో ఏర్పడిన సమస్యలను తగు సలహాలను వినహక్కు కలిగినవారందరికి విశదం చేసి ఆ యా రంగాలలో, ముఖ్యంగా రైలు, రోడ్డు రవాణా సౌకర్యాలు అధికతరం కావటానికి యథాశక్తి తోడ్పడింది. ఈనాటి ప్రక్క రాష్ట్రాలనుంచి బస్సులు, పై రాష్ట్రాలనుంచి రైళ్లు, విమాన సౌకర్యాలు ఏర్పడ్డాయంటే తన చేయూతకూడ కొంత ఉన్నదన్న తృప్తి సప్తగిరికి లేకపోలేదు.

కేవలం భక్తుల పత్రికగ కాక ఈనాడు సప్తగిరి పరిశోధకస్థాయికి పెరగడం పత్రిక ప్రగతిలో ఒక మెట్టు. ఇప్పుడు పత్రిక దూరదేశాలలో కూడాను మన్నన పొందుతుంది. ఈ సప్తగిరి ప్రగతి కన్నవారు అక్కడ వున్నవారే కాదు, పత్రికను అందుకున్న సందేశాన్ని పదిమందికి అందచేయటానికి ముందుకు వచ్చిన పంపిణీదారులు, అప్పుడే రాలేదనో, ఆలస్యంగా వచ్చిందనో అనుకోకుండా అవధి లేని ఆదరణతో అందుకున్న అన్ని భాషల పాఠకులూ భాగస్వాములే.

అందుకే ఈ పండుగ మనందరిది. అందరికీ మించి, పుత్రోత్సాహంలో కొండకొమ్మున కోనేటి దరిని కులుకుతూ నుంచున్న వేంకటప్పదీ ఆ అప్పదయతో ఇలాంటివి ఇంకా, ఇంకింకా చేసుకొందాం.

మధు వాతా ఋతాయతే
మధు క్షరన్తు సింధవః
మాధ్వీర్నః సన్తు ఓషధీః!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# శ్రీ హనుమదవగాహనం

శ్రీ తాతపూడి బ్రహ్మానందశాస్త్రి

ఆంజనేయం మహావీరం
బ్రహ్మ విష్ణు మహేశ్వరమ్
బాలార్క సదృశాభాసం
రామదూతం నమామ్యహమ్.

నవవిధ భక్తులైన శ్రవణ, కీర్తన, అర్చన, పాదసేవన, వందన, దాస్య, సఖ్య, ఆత్మార్పణలలో దాస్యభక్తి (దాసభక్తి) కి ఆద్యుడు శ్రీ హనుమంతుడే.

శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షి
దభవ ద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదః స్మరణే తదంఘ్రి
భజనే లక్ష్మీ పృథుః పూజనే
అక్రూరస్త్వభివందనే
కపిపతిర్దాస్యే చ సఖ్యేఽర్జునః
సర్వస్వాత్మనివేదనే బలి
రభూ త్కృష్ణాప్తిరేషాం పరమ్.

భగవద్గుణ శ్రవణముచే పరీక్షిత్తు, కీర్తనలచే శ్రీశుకులవారు, నామస్మరణ మాత్రంచే ప్రహ్లాదుడు, పాదసేవనంవల్ల శ్రీ లక్ష్మీదేవి పూజలచే పృథుచక్రవర్తి, వందనముచే అక్రూరుడు, దాస్యముచే హనుమంతుడు, సఖ్యముచేత అర్జునుడు, ఆత్మసమర్పణ వల్ల బలి, విభీషణుడు భగవదనుగ్రహం పొందారు. అలాగే వ్యాసుడు స్మరణ వల్ల, నారదుడు కీర్తనలవల్ల, రంతిదేవుడు జలాభిషేకంవల్ల, గజేంద్రుడు ప్రార్థనలవల్ల, లక్ష్మణుడు అన్న పాదసేవనంవల్ల కూడా ముక్తి నొందారు.

స్మార్తోపాసనలో ప్రముఖమైనది పంచ దేవోపాసన. ఉపాస్య దేవతలందరిలో సాకార బ్రహ్మచర్య రూపాన్ని గురించి విపులీకరించాలంటే అగ్రాసనాన్ని అలంకరించినవాడు శ్రీమత్ హనుమత్ప్రభువు.

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యః శోకవహ్నిం, జనకాత్మజ
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

> జూన్ 3 హనుమజ్జయంతి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.
> సం॥

హృదయతంత్రులను వీణగాచేసి జయత్వదభ్రవిభ్రమద్భ్రమరమృదంగ గానంతో రావణుడు శివుని పరవశింపచేసినపుడు, తన ప్రియశిష్యుడుగా వరాలనిచ్చాడు. అప్పుడు రావణుడు శివుని పదునొకండు అంశలలోని వానరాంశను హేళనగా చూసాడు. మహాదేవుడు శ్రీరామభక్తుడు. స్వయంగా తన కర కమలాలతో అర్చించాలని అభిలాష అధికంగా



## సవరణ

1994 మే సప్తగిరి సంచిక 6 వ పేజీలో ప్రచురించిన మంత్రంలో కొన్ని తప్పులు దొర్లాయి. పాఠకుల సౌకర్యార్థం సవరించిన మంత్రాన్ని దిగువ ప్రచురిస్తున్నాము.

ఋచో అక్షరే పరమే వ్యోమన్
యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః,
యస్తన్న వేద కిం ఋచా కరిష్యతి
య యిత్తద్విదుస్త ఇమే సమాసతే.

--(శ్వేతా-4-8)

సం॥

ఉంది. ఒక్కోసారి సమాధిస్థితిలో పార్వతీదేవి నికూడా పట్టించుకునేవాడుకాదు. అందుచేత త్రేతాయుగంలో విష్ణువు శ్రీరామచంద్రునిగా అవతారమెత్తినప్పుడు శ్రీరాముని సేవచేయుటకు అవకాశంకల్గి, రావణుని గర్వాహంకారాలు అణచాలని, వైశాఖ బహుళదశమినాడు కిష్కింధమహారాజు కేసరికి, అంజనాగర్భంలో వాయువు వలన పవనసుతుడు మారుతిగా జన్మించాడు. ఆయన మహాశక్తి సంపన్నుడు. ఆయన కేసరీనందనుడు, వాయుపుత్రుడు. అంజనీగర్భ సంభూతుడు. రుద్రావతార మూర్తి కావున రుద్రమూర్తి అయినాడు. బలబుద్ధ్యాదుల విషయంలో అతులిత బల శాలి. అనన్య మహోన్నతకారుడు, అపార ప్రభావ సంపన్నుడు. అద్వితీయ వాక్చతురుడు. వీర, శూర, బుద్ధిమత్వ దీక్షత్వాది సద్గుణనిధి. వజ్రాంగుడు. రామరహస్యోపనిషత్తులో హనుమంతుడు మహాతత్త్వవేత్త అని వాక్కుచ్చారు. అందుకే నవ వ్యాకృతి పండితః, సర్వ విద్యా సంపత్కారాయ నమః అని పూజిస్తారు. సనక, సనందన, సనత్కుమార, సనాతన మహర్షులు హనుమంతుని ద్వారా శ్రీరామమంత్ర రహస్యాలను తెలుసుకొనేవారని ముక్తి కోపనిషత్తులో వివరిస్తే హనుమంతుని ద్వారా రామచంద్రుడే ఉపనిషత్తత్త్వాన్ని బోధించినట్లు ప్రస్ఫుటమౌతోంది.

నాన్ ఋగ్వేదవినీతస్య
వాయజుర్వేదధారిణః,
నాసామవేద విదుషః
శక్యమేవం ప్రభాషితుమ్.

--వాల్మీకి రామాయణం

కిష్కింధనుండి శ్రీరామ పట్టాభిషేకం వరకూ హనుమంతుడు ప్రధానపాత్రధారి. భగవత్కింకరుడై మహాధర్మగామియై దుష్ట సంహారానికి శిష్ట జన సంరక్షణకు పాటుపడి కీర్తిని సంపాదించి గమన, వేగ, తేజస్ఫూర్తులతో వాయు సమానుడయాడు.

దూతం చైవ ప్రకుర్వీత
సర్వశాస్త్రవిశారదమ్
ఇంగితాకార చేష్టజ్ఞం
శుచిం దక్షం కులోద్గతమ్,
అనురక్తశ్శుచిర్దక్షః
స్మృతిమాన్ దేశకాలవిత్,
వపుష్మాన్ వీతభీ ర్వాగ్మీ
దూతో రాజ్ఞః ప్రశస్యతే.

ఇతరుల మనో భావాలకు అనుగుణ్యంగా నడిచేవాడు, భయరహితుడు. సంధి విగ్రహాదులు తెలిసినవాడు, మారువేషంతో ప్రత్యర్థుల గుణాలు తెలుసుకొనువాడు కాంతాకాంచనాదులకు లొంగనివాడు కావున దూతగా పంపారు.

"స సూర్యాయ మహేంద్రాయ
పవనాయ స్వయంభువే,
భూతేభ్య శ్చాఞ్జలిం కృత్వా
చకార గమనే మతిమ్."

ఫలమని భ్రమించి సూర్య గోళం మింగాలని ఆకాశ గమనంతో సప్తాశ్వరథం చేరి ఆడుకుంటూ గ్రసనార్థం వచ్చిన రాహువుని తరమగా, దేవేంద్రుడు వత్తాసుగా వజ్రాయుధం విసరగా, కేసరీనందనుని వామ హనువు తెగిపడింది. వాయువు కుపితుడయాడు. పంచభూతాలు ఏకమై పోయాయి. దానితో అష్ట దిక్పాలకులు దిగి వచ్చారు. వాయుసుతుడు పునర్జీవితుడై, హనుమ తెగి పడ్డంవల్ల హనుమంతుడయాడు. సూర్యుని శతాంశ తేజం, యధేచ్ఛగా దేహాన్ని మార్చుకోగల వరం, బ్రహ్మదేవునివల్ల బ్రహ్మజ్ఞానియై, చిరంజీవి, దీర్ఘాయుష్కుడై, వాయువేగ, మనోవేగంతో అప్రతిహత కీర్తితో--

వైనతేయసమాః కేచిత్కే
చిత్త్రానిలోపమాః
అసఙ్గగతయశ్శీఘ్రా
హరివీరా మహాబలాః
అహం తు హనుమాన్నామ
మారుత స్యౌరస స్సుతః.

మారుతిగా, "హనుమతా కీర్తిమతా యశస్వినా, హనుమాన్ మహాబలపరాక్రమ శాలి" అయ్యాడు. బాల్యక్రీడలలో మహర్షుల శాపాన్ని, శక్తిని మరిచిపోయెదవు గాక! నీ బల పౌరుషాలను పొగుడుతూ ఇతరులు ప్రస్తుతిస్తే నీ శక్తిని మరల పొంది తత్ శక్తిని సంపూర్ణ సద్వినియోగ పరచగలవు. "వరశాపంగా అనుగ్రహం పొందాడు. కర్మ సాక్షి సూర్యదేవుని వద్ద విద్యాభ్యాసంచేసి సకల విద్యాపారంగతు డయాడు."

శ్రీ మధ్వాసుత శోకనాశనకరం
శ్రీ ఆంజనేయం సదా
నానాలంకరణం త్రిపంచనయనం
దేదీ ప్యమానం రుచా
అక్షఘ్నం ఘనశత్రు చాపదమనం
శ్రీరుద్ర రూపం విభుం
శత్రుఘ్నం తరుణార్కకాన్తివదనం
శ్రీరామదూతం భజే.

ఆత్మవిశ్వాసానికి ప్రతీక హనుమ. సముద్ర లంఘనంలో కపిసోదరులను తిలకించి:

జామవన్త కే వచన సుహాఏ సుని హనుమంత
హృదయ అతిభాఏత బలగి మోహి పరిఖే
హుతమభాయీ - నహి
దుఃఖకందమూల ఫలఖాఈ.

నేను తప్పక సీతమ్మవారి జాడ తెల్సుకు వస్తాను. నేను వచ్చే వరకూ కిష్కింధా నగరం నదీ తీరంలో ఎదురుచూడండి అన్నాడు. ఆయన ఆత్మ విశ్వాసం గట్టిది. విశాలహృద యుడు కావుననే తనకు సంక్రమించిన కీర్తి తన వానరజాతి కంతకూ చెందాలనే తన వారినందరినీ తనరాక కోసం ఎదురు చూడ మన్నాడు. అతులిత బలధాముడు, స్వర్ణశైలాభ దేహుడు-- సకల గుణనిధానుడు వానరులలో అత్యధికుడు శ్రీమదాంజనేయస్వామి.

సముద్ర లంఘనం చేస్తూ నాగమాత సురస పరీక్షకు గుర్లై, ఆయన బుద్ధి బలానికి "అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ, గచ్ఛ సౌమ్య యథా సుఖమ్, సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా" రామకార్యం సిద్ధిస్తుంది. నీ బుద్ధిబలం ముందు ఎవరూ ఎదురు నిలవ లేరు. గ్రహ నక్షత్ర చంద్రార్క తారాగణ విభూషితే- నీ కీర్తి చిరకాలం నిలుస్తుందని దీవన పొందాడు.

ఆగు హనుమా నిన్ను భక్షిస్తానంది సురస-- రామకార్యం అయాక తిరిగి ఆహా రంగా వస్తానన్నాడు హనుమ. వీల్లేదంది. "సతతో జన తేహీ ఆనన కీన్హా అతి లఘు రూపనా పవన సుతలీన్హా" ఆమె నూరు యోజనాల నోరు తెరిస్తే అంతకు రెండు రెట్లు దేహం పెంచాడు. వెంటనే బుద్ధి ప్రయోగించి, అతి సూక్ష్మ దేహంతో నోట్లో ప్రవేశించి, తిరిగి వచ్చేసి "నీ నోట్లో దూరాను, అయినా నన్ను మింగలేదు - నువ్వేం రాక్ష సివి" అని చమత్కరించాడు.

ఈ దృష్టాంతరాన్ని ఆధ్యాత్మికపరంగా శ్రవణ, మనన, నిదిధ్యాసలతో అర్చించే సమ యంలో కలిగే వాసనలు సురస వంటివనీ, అరిషడ్వర్గాలు,వాసనలు పోగొట్టుకోవాలంటే నామస్మరణే తరణోపాయం అనీ గ్రహించాలి. తులసీదాస్ ముల్లుని ముల్లుతో తీయాలని, సంసార వాసనలు దాటాలంటే గృహస్థా



శ్రమంలో వుంటూనే భగవంతుని చేరాలని సెలవిచ్చాడు.

సమశ్శత్రౌ చ మిత్రే చ
తథా మానావమానయోః,
శీతోష్ణ సుఖ దుఃఖేషు
సమస్సంగ వివర్జితః.
తుల్య నిందాస్తుతి ర్మౌనీ
సంతుష్టో యేన కేనచిత్,
అనికేత స్థిరమతిః
భక్తిమా న్మే ప్రియో నరః

--భగవద్గీత 12-18-19

ద్వంద్వములైన సుఖదుఃఖములు, మానా వమానములు, నిందాస్తోత్రముల యందు సమబుద్ధి కల్గి, సంగము లేక ఆసక్తి వీడి, మౌనియై స్థిరచిత్తుడై యుండువాడు భగవం తునికి ప్రియుడని కృష్ణ పరమాత్మ బోధిం చాడు.

లంకా నిసిచరనికర నివాసా
ఇహా కహా సజ్జన కర
చాసా, మన మహుః తర కరైక లాగా
తేహి సమయ విభీషణ జాగా.

సుషుప్త భక్తిలో రామనామం జపిస్తున్న విభీషణుని చూసి మురిసి పోయిన ఆయన భగవానుని దయ కల్గాలంటే కేవలం నామంవల్ల కార్య సాఫల్యం కాదు. నామజ పంతో రామకార్యం సఫలీకృతమైతే ఆయన ప్రేమిస్తాడు. కృప చూడ్డం కంటే ప్రేమిం చడం గొప్ప విషయమని అతనిలోని జడ త్వాన్ని పోగొట్టి రామకార్యనికి వినియోగించు

(41వ పేజీలో)






గ్రంథావిష్కరణ

22-4-94 తేదీన సికింద్రాబాదు, జింఖానా గ్రౌండులో 'శ్రీగర్గసంహిత' గ్రంథావిష్కరణ సభ జరుపబడింది. శ్రీమతి రోహిణి వెంకట సుందర వరదరాజేశ్వరి వారిచే సంస్కృతం నుండి తెలుగువచనం చేయబడి, తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థికసహాయంలో ప్రచురింపబడిన 'శ్రీగర్గసంహిత' మొదటి సంపుటి గ్రంథాన్ని శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయరు స్వామివారు ఆవిష్కరించారు. ఈ రచన సరళంగా హృద్యంగా సాగిందనీ, తర్వాతి భాగాలనుకూడ అనువదించడమే గాక, ఇలాంటి ఆధ్యాత్మిక గ్రంథాలు ఇంకా అనేకం శ్రీమతి రాజేశ్వరి చేతి గుండా వెలువడాలని శ్రీ జీయరు స్వామి ఆశీర్వదించారు.

## మెట్ల ఉత్సవం

94, ఏప్రిల్ 18, 19, 20 తేదీలలో తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచార పరిషత్ ఆధ్వర్యంలో తిరుపతిలో మెట్ల ఉత్సవం జరిగింది.

తిరుచానూరు నుంచి తిరుపతి,-తిరుమల వరకు జరిగిన 25 వ వార్షిక మెట్ల ఉత్సవంలో తమిళనాడు, ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలనుండి 150 భజనబృందాలు పాల్గొన్నాయి.

తి.తి. దేవస్థానం ఛైర్మన్ శ్రీ. ఎ. చెంగల్ రెడ్డి; సంయుక్త కార్యనిర్వాకులు, శ్రీ బి. వెంకట్రామయ్య మెట్ల ఉత్సవాన్ని తిలకించారు. తమిళంలో శ్రీనివాసకల్యాణం (బుర్రకథ) వినిపించిన శ్రీ సుబ్బు అర్ముగం గారిని రు 50/. లలో శ్రీ చెంగల్ రెడ్డి సత్కరించారి. ఇంకా శ్రీ. టి. యస్. అనంతనారాయణ అడిగళ్, శ్రీ పిత్తు కొళిమురగదాసు, శుభశ్రీ జయశ్రీ మున్నగువారు సంగీత ధార్మిక కార్యక్రమాలు నిర్వహించారు.

తిరుమల శ్రీస్వామివారి మెట్ల ఉత్సవంలో పాల్గొన్న భక్త బృందాలవారికి తిరుమలలో ఉచిత వసతి, భోజన సౌకర్యం దేవస్థానం కల్గించింది.





# ప్రగతిపథంలో సప్తగిరి

మనిషి పెరుగుదల మనకు కన్పిస్తుంది. చెట్టు ఎదుగుదల కూడా చెప్పవచ్చు. కాని మనస్సు ఎదిగిందా లేదా-దీన్ని నిర్ణయించే హద్దులు లేవు. దానికి మనస్సే సాక్షి. మనిషి ఎదిగినా మనస్సు ఎదగలేని ఎన్నో సంఘటనలు మనకు తెలుసు. మరి మనుష్యుల హృదయాలను మలిచేది, ఎదుగుదలను ఎదురుగావున్న వాళ్ళకేగాక, అందరికీ అంచనావేసి చెప్పేది పత్రిక. కనుకనే పత్రికల ఎదుగుదల కూడా ఎంతో గహనంగా వుంటుంది. దాని కది చాటుకుంటేనేగాని ఎదుగుదల ఎంతో, మామూలు పద్ధతులలో అందదు. అందుకే పెళ్ళు, పెళ్ళుమంటూ మోతలెత్తిస్తున్న పత్రికలు తెల్లవారేసరికి పెళ్ళుమని పోవటం మనం చూస్తూనే వున్నాం.

కాని, ఏవో కొన్ని నైతికవిలువలతో, నిర్మాణాత్మక సిద్ధాంతాలతో లేదా ఆశయాలకు కట్టుబడి కొన్ని మాత్రం తమ అస్తిత్వాన్ని, ఆవశ్యకతను నిరూపించుకుంటూ ముందుకు సాగుతున్న పత్రికలు లేక పోలేదు. ఆ కోవకు చెందినదే 'సప్తగిరి'.

వెనక్కు తిరిగిచూస్తే ఆ వెనుకవున్న ఆధ్యాత్మిక తేజస్సు ఎంతబలీయమైనదో అనిపిస్తుంది...

శేషాచలపతి ఐన శ్రీనివాసుని దర్శించ వచ్చే వేలాది యాత్రికులకు దేవస్థానం చేస్తున్న, చేయనున్న సౌకర్యాల వివరాలను మూలమూలల్లోని భక్తులకు తెలియజేయటంతో పాటు క్షేత్రమహిమ, తదితర పౌరాణిక, వైదిక విజ్ఞానాన్ని ప్రబోధించి ఆస్తికులలో ఆధ్యాత్మికరోచిస్సు లవిచ్ఛిన్నంగా వెలగటానికి తోడ్పడేటందుకు 1949 సంవత్సరంలో తిరుమల, తిరుపతి దేవస్థానం ఒక ప్రచారసాధనం ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. దాని ఫలితంగా ఏప్రిల్ 1949లో కరపత్ర సదృశమైన పత్రిక వెలుపడింది. అప్పుడది ప్రచార మాత్రంగా వుండేది. దాని పేరే దేవస్థానపు 'బులెటిన్.' నాటినుండి నేటివరకూ అంటిపెట్టుకొనివున్న అభిమాను

యాత్రికులకు, భక్తులకు తిరుమల తిరుపతి ఆలయాల దర్శనవేళలు పూజావివరాలు, ఉత్సవ విశేషాలు మున్నగువాటిని తెలియజేయడానికి, దేవస్థానం "బులెటిన్" అనే చిన్న పత్రికను 1949 లో ఏర్పాటు చేసింది. ఆనాటినుండి ఆ "బులెటిన్" రూపురేఖలు దిద్దుకొంటూ ఆధ్యాత్మిక పథంలో దిన దిన ప్రవర్ధమానం చెందుతూ, 1970 జూన్ నెలలో "సప్తగిరి" గా నామకరణం చేసుకొంది.

శ్రీ వేంకటేశ్వరుని అనుంగు పుత్రిక అయిన ఈ "సప్తగిరి" పత్రిక 1994 జూన్ నెలతో పాతికేళ్ల పరువంలో ప్రవేశించింది. సప్తగిరీశుని అనంత ఆధ్యాత్మిక దివ్య తేజస్సుల్లో పురోగమిస్తున్న "సప్తగిరి"ప్రగతి గీతే ఈ వ్యాసం.

సం॥



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

**విద్యే సౌందర్యం** **విద్యే దైవం**

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని "ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటి, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్." వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి

లకు మాత్రమే సప్తగిరీశ విరాట్ స్వరూపం పత్రికా రూపంలో ఎలా సాగిందీ తెలుస్తుంది. అనంతంగా ఈ వేంకటేశ్వర సేవా కార్య క్రమం దినదిన ప్రవర్ధమానమై దేవస్థాన సమా చార ప్రసారంతోపాటు, పలువురు ఆర్షవిజ్ఞా నంలో దిగ్గంతుల్లాంటి పండితుల సహకారంతో ఉత్తమ ఆధ్యాత్మిక సాహితీసౌరభాలను వెద జల్లింది 1961 వరకు. ఈ మధ్యకాలంలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంకూడా దేవస్థానం అధీనంలో ఉండటంతో, అందరు పండితుల మన్ననలు వ్యాసరూపంలో పత్రి కకు కావలసినంత పరపతిని, ప్రణాళికను సమకూర్చాయి. నిజానికి దేవస్థానం నుండి లోగడ వెలువడిన గ్రంథాలలో అధికశాతం మొదట మాసపత్రికలో వెలువడి తర్వాత గ్రంథ రూపాన్ని సంతరించుకున్నాయంటే అందులో అసత్యం ఏమీ లేదు.

మొక్క మానుకావటం. పూవు కాయ కావటం రివాజు. అలాగే, ఈ పత్రికను కేవలం తిరుపతి యాత్రాసహాయిని స్థాయి లోనే నిల్పకుండా, దీన్ని మహోజ్జ్వల అధ్యా త్మికతా ప్రసారణ ప్రతీకగా నిలిచే మాస పత్రికగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం 1961లోనే ప్రారంభ మైనది. 'బులెటిన్' 'దేవస్థాన మాసపత్రికగా', వార్తాపత్రికల్ల నిబంధనలకను గుణంగా పేరును సంతరించుకున్నది ఈ 1961లోనే. దీని కార్యరూపమే ఒక సంపా దకుణ్ణి, అనుబంధ సిబ్బందిని 1963లో నియమించటం. దీనివల్ల పత్రికపైన, దాని ప్రగతి విషయంలో ప్రత్యేక శ్రద్ధతీసుకునే అవకాశం కలిగింది. ఆనాడు పత్రిక ప్రతు లసంఖ్య 3000 మాత్రమే. చిన్న ఆకృతిలో (1/8డెమ్మీ) వున్న ఈపత్రిక ఆరోజులలో చందాదారులకు ఇవ్వటంతోపాటు తిరుమల, మద్రాసు, హైదరాబాద్, బెంగుళూరులలో పత్రిక విక్రయం జరుగుతుండేది. ఆంగ్ల, తమిళ, తెలుగు, కన్నడ, హిందీభాషల వ్యాసా లన్నీ చిన్న చిన్నవిగా ప్రచురితమౌతుండేవి.

ఆశించిన ఫలితాలు కొంతైనా పొందా లంటే పత్రిక ఉనికి పదిమందికి తెలియాల్సిన అవసరం ఎంతైనావుంది. ఈ ప్రణాళికకు ప్రారంభంగా పత్రిక విక్రయాన్ని తిరుమల, తిరుపతి దేవస్థానానికి ఆనాడున్న ధర్మశా లలు, దేవాలయాలు, సమాచార కేంద్రాలలో 1966 జూలైలో ప్రారంభించటం జరిగింది. విక్రయకేంద్రాలు మూడు నుండి పన్నెండుకు వచ్చి ఆ పైన విస్తరణ పొందాయి. దీనివల్ల పత్రిక ప్రతులసంఖ్య కూడా పెరిగింది.

దేవస్థాన విధానప్రచారం, ఆర్షవిజ్ఞాన ప్రసారం ఆశయమైనప్పుడు ఈ పరిధి పలు ప్రాంతాలలో విస్తరించక తప్పదు. అందువల్ల పత్రికను, కమీషన్‌మీద ఇతరవ్యక్తుల ద్వారా అమ్మించే విధానాన్ని 1967 ఏప్రిల్ నెలలో అమలుచేయటం జరిగింది.

ఇది ఈ పత్రిక ప్రగతిలో ఒక ముఖం. మానుకు కొమ్మలు వాటికి రెమ్మలు ఏర్ప రడటం మనకు కన్పించే దృశ్యం. స్వామి వారు అనేక భాషాశాఖోపశాఖాత్మక సనాత నాశ్వత్థ వృక్షం. కార్యక్రమ సమాచారంగాని, ఆధ్యాత్మిక ప్రబోధంకాని ఆయా భాషలలో వుంటే ఎక్కువ అవగాహన ఏర్పడగలదన్న భావం బలపడింది.

ఇంతవరకు బహుభాషాయుతంగా వెలు వడిన దేవస్థాన పత్రికను 1970 జనవరి నుండి ఇంగ్లీషు, సంస్కృతం అన్ని పత్రికలకు అంతర్భాగంగా పత్రికను తెలుగు, తమిళం, కన్నడం, హిందీభాషా పత్రికలుగా వేరుచేసి విడుదల చేయటం జరిగింది. దీనివలన ఆ భాషాపత్రిక ఆ యా భాషా ప్రాంతాలలో మారుమూలలకు చొచ్చుకొనిపోయే అవకాశం కల్గింది. అంటే స్థిరప్రాతిపదికపైన పత్రికను రూపొందించే విధానం 1966 నుండి 1970 వరకు దశలవారిగా జరిగిందన్న మాట.

పిల్లలకు పేర్లు పెట్టుకుంటున్నా మరీ అవసరం వచ్చే దాకా వాళ్ళు మనకు చిట్టి, బుజ్జి, అమ్మడు, బాచి, నాని వగైరా. అన గూడదు కానీ యీ పత్రిక విషయంలోకూడా అదే జరిగింది. 1949 నుండి 1970 వరకూ అంటే దాదాపు 20 సంవత్సరాలపాటు పత్రిక పత్రికా సంప్రదాయానికనుగుణంగా, స్వావ



లంబకమై సాంకేతికమైన పేరేదీ లేనట్లుగానే పెరుగుతూ వచ్చిందన్నమాట. అందుకే స్వామి యీ బిడ్డకు ఆ కొరత తీర్చడం జరిగింది. 1970 జూన్‌లో, ఏడుకొండలకు సాంకేతిక పత్రికగా, 'బులెటిన్'గా పుట్టి పత్రి కగా పెరిగి 'సప్తగిరి'గా అవతరించింది. నాటి నుండి ఈనాటికి అంతటి చరిత్ర వుంది ఈ పత్రికకు.

ఇక్కడి నుండి పత్రికగతిలో గణనీయ మైన మార్పులు తీసుకురావడం జరిగింది. ఇన్ని ఏళ్ళపాటు చిన్న పత్రికగా వుంటూ వచ్చిన యీ పత్రికను ఏప్రిల్ 72లో $\frac{1}{4}$ క్రౌన్ పరిమాణంలోకి తీసుకరావటం జరిగింది. ఇంగ్లీషు, సంస్కృతాలు అన్ని పత్రికలకూ సమానంగానే వుండేవి. కాని, అక్కరలేని వారిపై రుద్దనక్కర లేకుండా వుండేందుకు వివిధ భాషల పత్రికలు ఆ భాషా ప్రాంతా లలో గణనీయస్థితిని పొందేందుకు వీలుగా జనవరి 1975 నుండి ఇంగ్లీషు భాషాభాగాన్ని వేరుచేసి ఐదు భాషల్లో పత్రికలు విడివిడిగా విడుదల చేయటం జరిగింది. ఈపద్ధతి

వల్ల ప్రతి సప్తగిరి, రెండవభాషా పత్రికతో సంబంధం లేకుండా ముందుగా విడుదల అయ్యే అవకాశం ఏర్పడింది. 1975 ఆగ ష్టులో పత్రికను $\frac{1}{4}$ క్రౌన్ నుంచి $\frac{1}{4}$ డెమ్మీ సైజుకు మార్చటం జరిగింది.

ఇన్ని దశల వారీగా పరిణామం పొంది మన ముందున్న సప్తగిరి ఈనాడు ఆస్తిక సమాజంలోని పలువర్గాలవారికి అవసర మైన ఆలోచనాత్మకమైన, చైతన్యవంతమైన విషయాలు ప్రకటించటం జరుగుతున్నది. ఆనాటి 3000 ప్రతుల ప్రచురణ ఈనాటికి 50,000 పైగా వుంది.

ఐతే ఈ కృషి, వృద్ధి, తత్ఫలితము ఏ వ్యక్తికో చెందింది మాత్రం కాదు. దేవస్థాన కార్యనిర్వాహణాధికారులందరూ ఒక్కొక్కరు తమ తమ బాటలలో సప్తగిరి ప్రగతికి తోడ్ప డ్డారనటంలో సందేహం లేదు.

డాక్టర్ చెలికాని అన్నారావు కార్యనిర్వ హణాధికారిగా వున్నకాలంలోనే 'బులెటిన్' ను దేవస్థాన మాసపత్రికగా మార్చటం జరిగింది. పత్రికను సుస్థిరమైన సంప్రదా యాలపై నడిపే కార్యక్రమం శ్రీ కె. ఉమాపతి కాలంలో ప్రారంభమైంది. పత్రిక భాషా విషయక విభజనకూ, కొత్తపేరుతో అవతరించటానికి శ్రీ యం. చంద్రమౌళి రెడ్డి, పత్రికను ఐదుభాషలలో విడివిడిగా వెలువడటానికి శ్రీ పి. యస్. రాజగోపాల రాజు కారణభూతులుకాగా, శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ కాలంలో పత్రికను ఆస్తిక సమాజం లోని వివిధ వర్గాలవారికి ఆమోద యోగ్యంగా మలచే ప్రయత్నాలు జరిగాయి. ఆత ర్వాత శ్రీ కుమారస్వామిరెడ్డి, ఆతర్వాత శ్రీ లక్ష్మినారాయణ, శ్రీ వెంకటపతిరాజు, శ్రీ ఎం.వి.యస్. ప్రసాద్.. ఇలా 'సప్తగిరి' ప్రగ తికి చేయూతనిచ్చిన మహానుభావులెందరో వున్నారు.

ప్రస్తుతం కార్యనిర్వహణాధికారి శ్రీ. డి.వి.యల్.యన్.మూర్తిగారి నిర్విరామకృషి, పట్టుదల దక్షతలతో మరింత విషయసమృ ద్ధమైన ఆలోచనాత్మక వ్యాస వేదవృక్షంగా కొత్త చిగుళ్లు తొడుగుతూ ప్రగతిపథంలో పయనిస్తూ ఆధ్యాత్మిక పుష్పపరిమళాలను వెంగడిస్తూంది.

ప్రతి పనికి ఒక ప్రయోజనం వుంటుంది. ఫలంలేని పనిని పనికిమాలినవాడు కూడా చేయడని సామెత. పరహితైషికంగా నడిచే పత్రికలకు అనంతమైనది ఆశయం, కర్తవ్యం మాత్రం, అనుకున్న ఆశయపు పరిధిలో సేవ చూస్తూ ముందుకు పోవటమే. మనుషుల జీవితంలో మాదిరే పత్రికలకు కూడా మన మిది సాధించామనో, దీని సాధనకు తోడ్పడగలిగామనో సంతృప్తి కలుగుతుంది. దాన్ని ఊతగా తీసుకుని పత్రికలు మరింత ముందుకు సాగుతుంటాయి.

సప్తగిరి కేవలం దేవస్థాన కార్యక్రమాలు, ధార్మిక విషయప్రచారానికి మాత్రమేగాక రాజ కీయాల కతీతంగా యాత్రిక సమస్యలను వినికిగలవారికి, వినగలవారికి నివేదించి పరి ష్కారానికి యథాశక్తి పాలు పంచుకున్నది.

> వార్త యందు జగము వర్తిల్లు చున్నది
> యదియు లేనినాడ యఖిల జనులు
> నంధకార మగ్నులగుదురు గావున
> వార్త నిర్వహింప వలయుఁ బతికి.
>
> -- మహాభారతం - సభాపర్వం

దేవస్థాన సమాచారకేంద్రాలు స్థాపనకు 1965లో కొన్ని ప్రదేశాలను ఎన్నికచేస్తూ తీర్మానం జరుగగా ప్రతి జిల్లా కేంద్రంలోనూ, రాష్ట్రంలోని ప్రతి పుణ్యక్షేత్రంలోనూ సమా చార కేంద్రాలను స్థాపిస్తే బాగుంటుందని 'సప్తగిరి' సూచించిన తర్వాత నెలలోనే దేవ స్థాన పాలకమండలి తత్తుల్యమైన తీర్మానం చేసిందంటే అది కాకతాళీయం కాదేమో !

తిరుపతి-రేణిగుంట బ్రాడ్‌గేజ్ ఏర్పడిన తర్వాత తిరుపతి-మద్రాసు-విజయవాడ-హై దరాబాద్‌ల నడుమ ప్రయాణ సౌకర్యాలు విస్తృతం చేసేందుకు సంపాదకీయాలద్వారా ఇతర శీర్షికలద్వారా ఎలా ప్రయత్నం చేసిందీ, అవి ఎలా ఫలరూపం పొందిందీ లోగడ సప్తగిరి పాఠకులుగావున్న వారందరికీ తెలుసు.

తిరుపతి విమానాశ్రయాన్ని ప్రారంభిం చినప్పుడు దేశంలో వివిధ కీలక కేంద్రాలను కల్పుతూ విమానయానం ఏర్పడాలని మొద టగా ప్రతిపాదించింది సప్తగిరే! ఆ ప్రతిపాదన ఫీడర్ సర్వీస్ రూపంలో ఇరుగు పొరుగు రాష్ట్రాలలో, ఆంధ్రప్రదేశ్‌లోనూ ఆచరణలో, ఆలోచనలో ఇప్పుడున్నాయంటే అది 'సప్త గిరి' ప్రజాసమస్యలపట్ల నిర్మాణాత్మకమైన దృక్పథంతో ఆలోచిస్తున్నదని, సప్తగిరి సూచ నలను మనసులో వుంచుకోగల అధికారవర్గం సప్తగిరి పాఠకులుగా వున్నదనటానికి నిద ర్శనం. కాని వెంటనే మన్నింపు వుంటే మాన్యత, పత్రిక నాణ్యత మెరుగౌతాయి.

ఇతర విషయాల్లో సప్తగిరి సంపాద కీయాలుగాని, వ్యాసాలుగాని మంచిస్థాయికి చెందినవన్న ఆశీర్వాదం, ఆశంసనలు అప్ప డప్పుడూ పాలకులనుంచి, పాఠకులనుంచి లభించటంకూడా ప్రగతిద్యోతకమే. నిజాని కది కార్యకర్తలకు కొండంత బలాన్నిస్తుంది.

ఇదీ యీ 'సప్తగిరి' ప్రగతి గీత! అయితే గతమంతా కమ్మనికథా కాదు. రాగలదంతా భయంకర వ్యథా కాదు. నిజానికి ప్రతి సంచికా ఉగాదిపచ్చడి అనుభూతే కల్గిస్తుంది. వండటం ఒక కళే. కానీ అందరినీ మెప్పిం చటం: పత్రిక విషయంలోకూడా అంతే.

ఆశయాలెప్పుడూ ఆకాశమంత ఉన్నతం! ఆచరణలు ఆవగింజతో సమానం. కనుక నడచిందానికన్నా నడవాల్సిందే ఎక్కువ. దూషణ, భూషణల కతీతంగా తన బాటలో తను సాగటమే పత్రిక కర్తవ్యం. భర్తృహరి చెప్పనే చెప్పాడు.

> నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు
> లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్।
> అద్యైవ వా మరణ మస్తు యుగాంతరే వా
> న్యాయ్యాత్ పథః ప్రవిచలంతి పదం న ధీరాః
> ॥

అని మనిషికి ఆ ధైర్యమే కావాలి. అది ఆ వేంకటేశ్వరుడే ఇవ్వాలి.

– నాగరాజ్

# అరవిందుని "సావిత్రి"లో సప్తగిరీశుడు

శ్రీ కె. యజ్ఞన్న

శ్రీ అరవిందులు మహాద్రష్ట. వ్యాస, వాల్మీకి, వంటి మహాకవుల కోవకు చెందిన వారు. జనోద్ధరణకై పుదుచ్చేరిలో ఘోర తపస్సుచేసి, జగన్మాతను సాక్షాత్కరింపచేసుకొని, మానవళికోసం మనస్సుకు అతీతమైన ఒక మహాశక్తిని (Supermind) భూలోకానికి తెచ్చిన అవతారమూర్తి ఆయన. దివ్య జీవన సంస్థాపనే మహాలక్ష్యంగా పెట్టుకొన్న శ్రీఅరవిందులు తన మహోన్నత ఆదర్శాలు ఆధారంగా 'సావిత్రి' మహాకావ్యం రచించారు. ఆయన చదవు 40 సంవత్సరాల కాలం శ్రమించి ఈ మహాకావ్యాన్ని రాశారు.

'సావిత్రి' కావ్యంలో గతంలో వచ్చిన అనేక అవతారాలు గూర్చి వర్ణన ఉంది. సప్తగిరి తేజం, శ్రీవేంకటేశ్వరుని గూర్చి ప్రస్తావన కూడా ఉంది. 'సావిత్రి' కావ్యంలో రెండవ గ్రంథం, 14వ ప్రకరణం. 'ప్రపంచాత్మ'లో ఈ వెంకటేశ్వరుని గూర్చి శ్రీ అరవిందులు ఇలారాశారు.



సావిత్రి తండ్రి అశ్వపతి ఒక భూమికను చేరుకొంటాడు.

అక్కడ ఈ అనంత ప్రపంచపు నిశ్శబ్ద ఆత్మ ఉంది!

ఒక సత్ – చైతన్యం, ఒక దివ్యసాన్నిధ్యం, ఒక మహాశక్తి అది!

ప్రకృతి తీయని, విపత్కర స్పందనలను దివ్య స్పందనలుగా మార్చివేసే మహాపురుషుడు ఆయన.

ప్రేమకు ప్రతిఫలం ఆశించకుండా ప్రేమించే దైవం!

క్షుద్ర జీవన రీతుల్ని ఆనందమయం చేసే దైవం ఆయన!

ఎందరికో కలిగిన విధివిఘాతాలను నయం చేసిన దైవం!

ఆయన ఆనంద హస్తాలు ఎందరి కన్నీటినో తుడిచివేశాయి.

ఆయనలో ఒక బీజం, ఒక జ్వాల ఉంది.

చిరంతన దైవం. ఆ బీజంనుండే ఎప్పటికప్పుడు కొత్తగా జన్మిస్తుంటుంది.

మర్త్య జీవన తీరాలలో మృత్యువును సంహరించే జ్వాల అది!

ఒక దివ్య ఆత్మీయత, ఒక భగవత్ సామీప్యత అంతటా ప్రతిఫలిస్తుంటుంది.

ఎటువంటి యవనికలు లేవు. ఎటువంటి అడ్డంకులు లేవు. ఏదూరమూ ఆయన్ని వేరు చేయలేదు. కాలం మార్చనూలేదు.

ఆత్మలోతులలో ఒక జ్వాల ప్రదీపించింది! ఏదో మాధుర్యపు నిరంతర స్పర్శ అందరి హృదయాలను కలిపింది!

ఏదో తెలియని ఆనందం అందరిలోనూ నిండిపోతుంది.

ఏవో విశ్వజనీన సౌరు, నవ్య రాగాలు పరిమళించాయి.

సత్యం, సౌందర్యం, ఆనందం, శుభం అన్నీ శాశ్వతమై ఒకే రూపం దాల్చింది!

ఒక రూపరహితఆత్మ ఆత్మరూపమై భాసించింది!

✪



# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కోరుకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడ ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాల కోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః।
— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక గుణాతీత మైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి
— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

'చంద్రశేఖర'

(గత సంచిక తరువాయి)

రావణుడు చెప్పె ఘోరదర్శనల గాంచి
వనిత నెట్టులైన నిజవశంవదను జేయ
ధాన్యమాలిని అంతలో తళుకు లీన
ఏగుదెంచి అనియె విభు కౌగిలించి.

అలతితో నేమిటికి నీకు నామెతోడ?
ప్రౌఢ భోగపయోధి తరంగములను
రమ్ము నిను తేల్తు ననిన థరాజ వీడి
అతడు నగుమోముతో ఆమె ననుసరించె.

కనుల బాష్పాలతో సీత అనియె నిట్లు
"రాజ్యహీనుడొ దీనుడొ రాము డొకడె
భర్త; కొలుతు నిత్యంబు నా పరమపురుషు
విడను మీ మాట జాగేల? తినుడు నన్ను."

జనకసుతను రావణుని ఆజ్ఞప్తి బట్టి
చుట్టుముట్టుచు భయపెట్టుచుండి రంత
దైత్యవనితలు; మారుతి దాగియున్న
శింశుపావృక్షమూలంబు చేరె సీత.

# రావుల రామాయణము

ఈవిధి వచించినారు రక్షోవనితలు
వికృతరూపిణు లాతండు వెడలినంత
భీతి గొలుపుచు సీత నొప్పింప జేరి
"విశ్రవోబ్రహ్మ పుత్రుడు వీరు డితడు.

అమలసుందరాంగుండు మహాయశుండు
భవ్య పౌలస్త్యవంశ సంభవుడు ఘనుడు
రావణుడు దృఢ బాహు విరాజితుండు
వెన్ను చూపని విఖ్యాతవీరు డాజి.

రాము నభిలాష విడనాడి రావణేశు
కేలు చేపట్ట కలుగ దే కీడు నీకు
తరుణి! భార్యవైనంత నంతఃపురాన
ప్రభువరుడు నీకు చేయును పాదసేవ.

అనియె నిట్లు సీతకు దైత్యవనిత వినత
"అలరుచుంటివి నీవు దివ్యాంగశోభ
రావణుని ఆశ్రయింపుము రాము వీడి
కానిచో నిను తిందుము క్షణములోన.

క్రూరరాక్షసి వికట వాక్కుచ్చె నిట్లు
"పైచె దైత్యనాథుండు దూషణలు నీవి;
అందు మతులసౌఖ్యాలు దైన్యంబు వీడి
అధ్రువము కాదె అతివల యౌవనంబు!

సీతబెదరింపగా రాక్షసీచయంబు
రామలక్ష్మణుల దలంచి ఆమె యేడ్చె
"అసలు నరజన్మమే హేయ మగును దలప
పరమదౌర్భాగ్య మైనట్టి బ్రదుకు నాది.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి

అస్మదీయనాథుండు ప్రియంవదుండు
రామభూపాలు డిక్ష్వాకురమ్యకులుడు;
వాని విడనాడి జీవింప వశమె నాకు?
చావు కోరుదమన్న అశక్య మదియు.

ఇచట నేనుంటి నను వార్త ఎరిగె నేని
కాల్చు నతడు శరాగ్ని లంకాపురమ్ము
కాంచగా లేక నన్ను శోకమ్ము నంది
తనువు విడిచెనొ రామచంద్రప్రభుండు!

సత్యమైన రాజర్షి నిష్కామి యతడు
పత్నితోడనె పనిలేని పరమయోగి
మరచెనేమొ? న న్నెన్నడు మరువ డట్లు
ఆయువులు వీడ మేలు; ఏమైన నాకు.

విభున కెరిగింప జరిగిన విషయమెల్ల
ఘోరరూపలు కొందరు కోరి వెడల
కడమ రక్కసిమూక ప్రక్కన పరుండ
త్రిజట తా గన్న స్వప్నమ్ము తీరు తెలిపె.

"ధవళ వర్ణ విరాజిత దంతి నెక్కి
లంకపై మింట రాముడు లక్ష్మణుండు
కాంత సీతతో నుండగ కంటి నేను;
రావణుని గంటి తైలమ్ము త్రావుచుండ.

ఖరముపై దక్షిణాశకు తరలినట్లు
స్వప్నమున కనిపించె రావణుడు నాకు
రాక్షసాళి గంటిని సముద్రాన కూల
కాంచితిని కపి లంక దగ్ధంబు జేయ.

స్వప్నఫలము లంకేశు నాశనముతోడ
రామచంద్రుని విజయము భామలార!"
"తల్లి! రానుండె నిటకు నీ ధవు" డటంచు
స్వాగత మొసంగ పలుమారు పక్షికూసె.

దరియెరుగరాని దగు పతి విరహజలధి
ధరణిజకు లోన గాఢవితర్క మొదవె
మరణమె శరణ్యమై యున్న తరుణముననుు
తనర తోచునొ? శుభనిమిత్తంబు లెందు.

చెట్టుపై నున్న కపిరాజు సీత బాధ,
త్రిజట కాంచిన స్వప్నమ్ము తీరు నెంచి
చింత తీరంగ మది కడు సంతసించె
కపులలో తానె జానకి కంటి ననుచు.

మదిని యోచించె శ్రీ హనుమంతు డిట్లు
"రాముపై గల అత్యనురక్తి కతన
రాక్షసీజన ఘోరతర్జనల వలన
అమిత శోకోపహత యయ్యె అకట! సీత!

రామచంద్రుని క్షేమమ్ము రమణి ఈమె
ఎరుగకున్నచో ప్రాణాల నింక వీడు;
ఎట్టు లూరడింతును సాధ్వి నిందరుండ
పలుకరింతును సూక్ష్మరూపమ్ము దాల్చి.

పలుక సంస్కృతభాష రావణుగ నెంచు
దేశభాషలో నైన సందేహపడుచు
సద్దుచేసినసీత రాక్షసగణమ్ము
చుట్టుముట్టిన మిన్నక రట్టు పెరుగు.

సీత మనియున్న వార్తయే చేరకున్న
తాను రాముండె బ్రదుకడు గాన; దూత
దేశకాల పాత్రంబుల తీ రెరింగి
క్రమత చేయకున్న చెడును కార్య మెపుడు."

మంజులంబును మధురమౌ మాట్కి హనుమ
కడగె సీతకు సుభగవాక్యాలు పలుక
"ప్రభుడు రాముడు పితృవాక్యపాలకుండు
పత్నితో భ్రాతతోడను వనికి జనియె.

అవనిజాతను రావణుం డపహరించె
కపటవేషాన ఆమె నేకాంత మరసి
దీను డా రామచంద్రుండు దేవి వెదకె
తమ్ముడైన సౌమిత్రితో తరుల గిరుల.

మిత్రు డయ్యె సుగ్రీవుడు మిగుల వనిని;
వానరాధిపు డాతడు వార్త తెలుప
దిశల కంపెను కపులను దేవికొరకు
కడలి లంఘించి సీతను గంటి నేను."

విమలనయనుని వానరు వీక్షసేసి
అచ్చెరువు నందె మిక్కిలి అవనిజాత;
భయముతో అది యెల్ల స్వప్నముగ నెంచి
మరల కపి గనె కనుల నమ్మంగ లేక.

విశదగతి నామె యిట్లు భావించె నెడద
"కపిని కాంచుట క్షేమంబు గాదు కలను;
కలుగునే నిద్ర శోకదుఃఖాల నడుమ?
కలుగదేనియు, కల నేను గాంచు టెట్లు?

రామచింతన నుందు నిరంతరమ్ము
తాల్చె నో యేమొ కపిరూపు తలపు లెల్ల
తలతు నిజమని కపి ముందు నిలిచెనేని
సకలదేవతల కరుణ సత్య మగుత!"

చెట్టు దిగివచ్చి మారుతి సీత గాంచి
అనియె సాష్టాంగ వందనం బాచరించి
"పద్మదళనేత్ర! తరుశాఖ పట్టనేల?
కారణం బేమి నింపంగ కనుల నీరు?

పరమకల్యాణి! నిన్ను దేవతగ నెంతు
ఏడ్పు లూర్పులు సురలైన నేల కలుగు?
రాజ్ఞిగా తోచుచున్నావు రమణి! నీవు
రామునతి సీతవా? నీకు క్షేమ మగుత!

ఆత్మనాథుని రఘురాము నతడు పొగడ
అనియె నిట్లులు వైదేహి హర్షమంది
"దశరథమహీశుని స్నుషను; తండ్రి నాకు
తేజ మలరు జనకుడు విదేహవిభుడు.

భర్త శ్రీరామచంద్రుండు పావనుండు
దండకాటవి వసియింప తండ్రియాజ్ఞ
అసురు డొంటరి జేసి న న్నపహరించె
చావునకు గడు విడియె మాసాలు రెండు."

మారుతి యతండు బుద్ధికి మారు పేరు
సాంత్వన సుధామధుర వచస్సంచయమున
బహుళ సంతాపమగ్నయై బాధపడెడు
ఉవిద సీతకు నిటులాడె నూరడిల్ల.

"రామదూతగ వచ్చితి క్షేమ మరయ
విమలతేజుండు బ్రహ్మాస్త్రవేత్త యతడు
వేదవిదులందు ప్రథముడై వెలయుచుండు
క్షితివిభుండు రాముండు నీ క్షేమ మడిగె.

పరమశోకసంతప్తుడు భక్తి తెలిపె
అమిత తేజుండు రామభద్రానుజుండు
మిక్కిలిగ ప్రణామము" లని, వక్కణించి
నెమ్మదిగ జేర సీత సన్నిధికి హనుమ

దేవి వచియించె నిట్లు సందేహపడుచు
"నన్ను వంచించినాడవు నాడు యతిగ
మరల వర్ణివై యీనాడు మలయుదు విదె
కామరూపుల్ల నమ్మ శక్యమ్ము కాదు."

"రాము డతడు మహాయశోరాజితుండు
విభుడు లోకకాంతుడు సత్యవిక్రముండు
కోరుచుండు నిత్యము భూతకోటిహితము
అలుగు నెప్పుడొ కాని తా నదియు క్షణమె.

(సశేషం)



# సర్వదేవతా సమన్వయమూర్తి
# సప్తగిరీశుడు

—శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర
సరస్వతీ స్వామి

సేకరణ: కడియం గోవిందాచార్యు

శివ, విష్ణు, శక్తి, సుబ్రహ్మణ్యం,-- ఈ చతుర్మూర్తులు ఏడు కొండలపై వెలసి ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి వారిలో పరిపూర్ణంగా మూర్తీభవించి ఉన్నవి గనుక, ఈ సప్తగిరీశ్వరుడే సాక్షాత్ సమన్వయ మూర్తి స్వరూపుడు.

* శ్రీ స్వామివారిపై అలంకృతమైవున్న సర్పము, ఆ జడ, వారి అర్చనలో వినియోగింపబడే ఆ బిల్వపత్రములు వారి 'శివ' స్వరూపమునకు స్పష్టీకరణలు.
* శ్రీవారు ధరించిన శంఖు, చక్ర, కిరీట, తిలకాదులు మహావిష్ణు స్వరూపమునకు సాక్షాత్కారములు.
* శ్రీస్వామి వారి ఆలయంలోని శ్రీచక్రము, 'సింహ' చిత్రీకరణ, వెలుపలి ప్రాకారమునకు అలంకృతమైఉన్న 'సింహ' చిహ్న చిత్రములు మున్నగునవి "శక్తి" స్వరూపమునకు నిరూపణలు.
* పునీతమైన ఏడుకొండలపై మహోన్నతంగా వెలసిఉన్న ఈ స్వామిని 'బాలాజీ' అనిగూడా పిలుచుకుంటున్నాము. ఈ పవిత్ర నామధేయము బాలసుబ్రహ్మణ్య స్వామికి అన్వయము.

--ఇలాగ ఈ చతుర్మూర్తులన్నీ శ్రీ వేంకటేశ్వరస్వామిలోనే ఇమిడి ఉన్నవి గనుక, ఈ ఆదిదేవుడే సాక్షాత్ సర్వ విశిష్టమూర్తి స్వరూపి ; పరిపూర్ణ దైవ సమన్వయ ప్రతీక!



అసలు శైవము - వైష్ణవము అనే భేద భావనలు అనవసరంగా తలలెత్తినది ఆ తరువాత తరువాతనేగాని, మొదటిదశలో కానే కాదు. 'శివం' అనే పదం ముండకోపనిషత్తులో ఒక్కసారి మాత్రమే పేర్కొనబడినది.

'విష్ణు' అనే పదం కఠోపనిషత్తులో ఒక్కసారి మాత్రమే చెప్పబడినది. ఏమైనప్పటికీ ఈరెండునూ సర్వవిధములా సర్వోత్తమమైన, దైవ సంభూతమైన 'మంగళప్రదము'నే సూచించుచున్నవి గనుక, ఏలాంటి తర్కము నకు తావు లేదు.

అందువల్ల ఏకైక శివ - విష్ణు సమన్వయస్వామిగా, సర్వదేవతాసమన్వయ విశిష్ట మూర్తి స్వరూపునిగా, పరిపూర్ణ పరమాత్మునిగా, - స్థిరప్రశాంతమైన సప్తగిరిపై వెలసి ఉన్న స్వామి ఈయన. భక్తులిపాలిటి కొంగు బంగారమైన "శ్రీ"-- "వేంకట" - "ఈశ్వర" - "బాలాజీ" - స్వామిని సంయమ, సమన్వయ దృక్పథంతో, శ్రద్ధాబుద్ధులతో దర్శించడము, మననం చేయడము భక్తులందరి ధర్మం.

(ది హోలీ అద్వైంటు -- (సేజ్ ఆఫ్ కంచి) ఆంగ్ల గ్రంథం ఆధారంగా)



# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం



శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి. శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.



శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.



శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి!
-శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం



శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.



శ్రీ అగస్త్యేశ్వరాలయం - తొండవాడ -
కళ్యాణి తటాన ఉన్న ప్రాచీన దేవాలయం



శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా వెలుకొన్న దేవాలయం





బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6 గం॥కు, 10 గం॥కు
సాయంత్రం: 3 గం॥కు



టిక్కెట్లు వెల:
పిల్లలకు : రూ. 10/-
పెద్దలకు : రూ: 20/-
ప్రతి చోటా ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR

# సీతమ్మను వెదకినట్టి లోకరాయుడా

రాగం : మోహన

— అవధూత దత్త పీఠాధిపతి
శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ

పల్లవి: సీతమ్మను వెదకినట్టి లోకరాయుడా
శోకాలను బాపవయ్యా మాకు కూడ



చరణం: మైనాకుని శిఖరాలను ముట్టినావట
ఆ సింహిక కడుపులోన దూరినావట ...... ॥సీతమ్మను॥

* వంకు పథములను దాటి యెగిరినావట
ఛాయాగ్రహం గుండెలను చీల్చినావట....॥సీతమ్మను॥

* సీతమ్మను చూచి ఓదార్చినావట
ముద్రికిచ్చి శిరోమణిని తెచ్చినావట.....॥సీతమ్మను॥

* పతిని కూర్చి దుఃఖ మార్చి ప్రోవుమంచును
సీత లోకమాత నిన్ను వేడె నంటగా......॥సీతమ్మను॥



* బుద్ధి బలము యశము ధైర్య మభయ మిత్తువు
జాడ్య ముడిపి సుస్థిరారోగ్య మిత్తువు...॥సీతమ్మను॥

* విద్యలబ్బి వక్తృటుత్వ మబ్బ చేతువు
గానమందు నీవు రాళ్లు కరగ జేతువు ॥సీతమ్మను॥



* ప్రత్యక్ష సాక్షి నీవు భగవద్గీతకు
సచ్చిదానంద బోధ మీవయ్యా మాకు....॥సీతమ్మను॥

['94, జూన్, 3 హనుమజ్జయంతి సందర్భంగా]

చంద్రశేఖర్

# బాల ప్రబోధం




# విశ్వాసం

— శ్రీ వాసాల నరసయ్య

ఒకప్పుడు తుంగభద్రానది ఒడ్డున విద్యానందులవారి ఆశ్రమం ఉండేది. ఆ ఆశ్రమంలో సుందరుడు ఆనందుడు అనే పేరుగల శిష్యులిద్దరు విద్యాభ్యాసం చేస్తుండేవారు.

సుందరుడికి గురువుగారి పైన భక్తి, ఆయనగారు. చెప్పే విషయాలమీద అచంచలమైన విశ్వాసం ఉండేవి. అందుకే సుందరుడు విద్యలో ముందుండేవాడు. కాని ఆనందుడికి బోలెడు అనుమానాలుండేవి. అందుకే గురువుగారు చెప్పింది ఎప్పుడూ సులభంగా విశ్వసించేవాడుకాదు. ప్రతి చిన్న ప్రశ్నకు సవాలక్ష ప్రశ్నలు వేసి అనుమానాలు తీర్చుకొనేవాడు.

కొన్ని రోజుల తరువాత శిష్యు లిద్దర్నీ పిలిచి, "మీరు తుంగభద్రానదిలో స్నానం చేస్తున్నారు గదా! మీలో ఈదడం తెలియని వారెవరు?" అన్నారు గురువుగారు.

సుందరుడు తనకు ఈదడం వచ్చును అన్నాడు. ఆనందుడు మాత్రం తనకు ఈదడం రాదని అందుకే ఒడ్డునే స్నానం చేస్తానని చెప్పాడు.

ఆనందుడి దగ్గరగా ఈదుతూ వెళ్లి అతడికి తెలియకుండా సొరకాయకు అల్లిన త్రాడు ముడిని విప్పేసెయ్యి. ఆ పిదప ఆనందుడికి చేరువలోనే ఉండు" అన్నారు.

సుందరుడు గురువుగారు చెప్పినట్లే చేశారు. సొరకాయ వీపున లేకున్నా ఆనందుడు ఈదుతూనే ఉన్నాడు. అది గమనించి, "ఆనందా! నీ వీపున సొరకాయ లేదు. జాగ్రత్త!" అన్నారు గురువుగారు. అయితే ఆనందుడు అది గమనించగానే అతడి ధైర్యం సడలి పోయింది. భయం వేసింది. వెంటనే నీటిలో మునిగి పోయాడు. కాని చేరువలోనే

ఒకసారి విద్యానందులవారు దేవుని ఉనికి గురించి చెబుతూ, "ఆయన మన కంటి ముందు కనబడక పోవచ్చును. అయినా ఆయనను విశ్వసించే వారికి శుభాలు జరుగుతాయి. అందుకే పెద్దలు 'విశ్వాసం ఫలదాయకః' అన్నారు.. కనుక మనం దేవుని ఉనికిని తప్పక విశ్వసించాలి" అన్నారు.

సుందరుడు శ్రద్ధగా విన్నాడు. కాని ఆనందుడు లేచి, "కంటి ముందు కనిపించని దేవుడినే కాదు, దేనినయినా విశ్వసించడం సాధ్యంకాదు. అందుకే అలాంటి దానికి తగిన నిదర్శనం కావాలిగదా 'గురుదేవా?" అంటూ ప్రశ్నించాడు.

గురువుగారు నవ్వి, "సమయం రాని. అందుకు తగిన నిదర్శనం నీవే చూస్తావు గదా? ఈ రోజుకు పాఠం చాలు' ' అంటూ లేచారు.

గురువుగారు సమీపంలో ఉన్న పల్లెటూరు నుండి సుందరుడి చేత ఒక ఎండిన సొరకాయ (బుఱ్ఱ)ను తెప్పించారు. దానిని త్రాళ్లలో భద్రంగా అల్లించారు. అప్పుడు దానిని ఆనందుడి వీపుకు సుందరుడి చేత కట్టించి నీటిలో దిగి ఈదమన్నారు. సొరకాయ (బుఱ్ఱ) నీటిలో తేలుతూ ఆనందుడి ఈతకు సాయపడింది. అలాగే రోజూ ఆనందుడిని ఈదడం నేర్చుకోమని చెప్పారు గురువుగారు.

మాసం గడచిపోయింది

ఒకరోజు ఉదయం గురువుగారు శిష్యులతో సహా నదికి వచ్చి ఒడ్డునే నిలబడి ఆనందుడిని గమనించసాగారు. ఆనందుడు నదిలో సొరకాయను వీపున కట్టుకుని ఉత్సాహంగా ఈదసాగాడు. గురువుగారు సుందరుడిని దగ్గరగా పిలిచి గోప్యంగా, "నీవు

వున్న సుందరుడు అతడిని కాపాడి ఒడ్డుకు చేర్చాడు.

గురువుగారు ఆనందుడిని సమీపించి, "చూచావా ఆనందా! నీవు సొరకాయను నమ్ముకున్నంత .కాలం దాన్ని ఆశ్రయించుకొని ఉన్నంత కాలం దాన్ని విశ్వసించి నిర్భయంగా ధైర్యంతో ఈదావు. కాని అది వీపున లేదని తెలియగానే ధైర్యాన్ని కోల్పోయావు. నీటిలో మునిగి పోయావు. సరిగ్గా దైవం సంగతీ అంతే! దైవం తన వెంటే ఉన్నాడని నమ్మిన వారికి ధైర్యం కలుగుతుంది. అందువల్ల మనోధైర్యంతో జీవన సాగరాన్ని ఈదగల్గుతారు. నీ అనుమానం ఈ నిదర్శనంతో తీరిపోయిందా?" అన్నారు.

ఆనందుడు వెంటనే గురువుగారికి పాదాభివందనం చేశాడు. ఆ తరువాత విద్యానందులవారు తన శిష్యులతో ఆశ్రమం వైపు సాగిపోయారు. ❂




సంగీతములో - సాహిత్యము. సాహిత్యములో - సాహిత్యము.

ఈ జతలలో 'సాహిత్యము' అన్నది ఒకే గుణం ఒకే తత్వం గలది అని అనిపిస్తుంది.

కానీ కాదు. కళా జగత్తులో-- "సంగీతము అన్నది ఒక కళ. సాహిత్యము అన్నది మరొక కళ." ఈ రెండు కళలలోనూ సాహిత్యము అన్నది ఉన్నది.

సంగీతకళలోని సాహిత్యము సంగీతకళ నిండా నిండి లేదు. సంగీతకళ అంతా సంగీతములోని 'స్వరకల్పన' అన్న దానితో నిండి ఉన్నది.

ఈ స్వరకల్పనలోనే, సంగీతములోని రాగకుశలతా, అందులోని సౌందర్యతత్వము అన్నవి ఉన్నాయి.

సంగీతకళలో ధాతు మాతువులు అన్నవి రెండు ఉన్నాయి. ఆ ధాతు మాతువులలో ధాతువు అంటే సంగీత ధాతువు అని అర్ధం. అది సంగీతంలో ఉండే స్వరం, లేక రాగంలోని స్వరకల్పానారూపంలో ఉంటుంది. మాతువు అన్నది సంగీతకళలో కల్పనాస్వరాల క్రింద నుంచి ప్రవహిస్తూపోయే సాహిత్యాక్షరాలుగల ఓ అంతర్వాహిని పదార్ధం. ఇది సంగీతంలోని సాహిత్యం.

ఈ సాహిత్యము అన్నది శుద్ధ సంగీతానికి నిమిత్తమాత్రంగా జోడింపబడిన ఓ అంశ లేక మరో పదార్ధం. మామూలుగా మన అందరికీ తెలిసినదీ, అనిపించేదీ సంగీతకళలో సాహిత్యం ప్రధానం అని. ఆ సాహిత్యాలంబనగా సంగీతం కూర్చబడుతుంది అని.

యధార్థానికి సంగీతం అన్నది సాహిత్యం మీద పోయబడి; సాహిత్యంలోని ప్రతి అక్షరంలోనూ స్వరాన్నీ లేక స్వరాలను నింపేది. అందుకని సంగీతకళలో సాహిత్య శబ్దమే సంగీతమై కూర్చోవటంలేదు.

సంగీతంలో ధాతురూపమైన స్వరాన్ని ఆలపిస్తున్నప్పుడు, లేక స్వరం వాయిస్తు

న్నప్పుడు, స్వరాలు అన్నీ పాడిపాడిగా ఉంటాయి. ఆ పాడి స్వరాలనే రసభావ స్పష్టత కొరకు ఆ స్వరాలలోనే తగినచోట్ల చమత్కారంగా గమకాన్ని లాగుతున్నప్పుడూ, స్వర నాదాలను ఒక దానిలో మరొక దానిని కలిపినప్పుడూ, అను స్వరాలను వేస్తున్న ప్పుడు, సాంకేతికంగా సంగీతకళలో 'సంగీత సాహిత్యం' లేక 'స్వర సాహిత్యం' అన్నది పుట్టూ ఉన్నది. ఒక గీతానికి గానీ, ఒక కీర్త నకు గానీ ఉన్న కేవలం స్వరాన్ని వాయిద్యం మీద వాయించినప్పుడు వినబడినదానికీ, ఆ స్వరాలను సాహిత్యంకొరకు వాదనం చేసి నప్పుడు వినబడిన నాదానికీ తేడా ఉంది. ఆ స్వరాల నాదమేళవింపులోనే స్వరంలోకి అక్షరం పాకటం, లేక అక్షరంలోకి స్వరం లేక స్వరాలు పరుసవేదిలా లోనికి ప్రవేశించటం జరుగుతుంది. ఇది సంగీత సాహిత్యం ఔతుంది.

సంగీతకళా జగత్తులో, మూల సౌందర్య సత్తాగలవి వర్ణాలు. వానిని పరిశీలిస్తే--

సంగీతకళలోగల నాదశబ్దాల కలయిక లలోగల సౌందర్యమూ, స్వరస్థాయిలలోగల సౌందర్యమూ, గమకాలలోగల రసతత్వ సౌందర్యమూ, ధాతువులలోగల స్వరఛమకాల సౌందర్యమూ, మొదలైనవి సాంకేతిక అంశా లుగా ఉన్నాయి. అవన్నీ స్వరతత్వ సౌంద ర్యాలను సంతరించుకొను ఓ రమణీయ రస ప్రజ్ఞాపాటవాల గనిగా అవగాహన మౌతుంది. ఈ స్వరమేళన వర్ణాల సౌందర్య కోశము, సాహిత్యకళలోని అలంకారాలవలె సంగీతకళ లోని స్వరగ్రామాల జాతుల గతులలోని సౌందర్యాలను మధురంగా పైకి తీసుకొచ్చి చేతికందిచ్చేవిగా, గతంలోని స్వరపేటికలో స్వరామృతాన్ని పోసేవిగా ఉన్నాయి.

సంగీతకళలో, అక్షరరూపంలో ఉన్న సాహిత్యంపైన సంగీత స్వరరచన ఓ ట్రాన్స్ పరెంట్ కలర్ పూత మాదిరిగా ఉంటుంది. కనుక పాడుతున్నప్పుడు, రాగంలోని స్వర రచన అడుగున ఉన్న సాహిత్యాక్షరం పైకి స్పష్టంగా వినబడుతున్నట్లున్నా, యథార్థంలో ఆ సాహిత్య అక్షరాలూ పదాలూ స్వరాల నాదంలో కలిసి కరిగిపోయి స్పష్టా స్పష్ట

లుగా వినబడుతుంటాయి. సాహిత్యాక్షర శబ్దం లీలామాత్రంగా ఉంటుంది. అంతగా సంగీతకళలో, సాహిత్య శబ్దం ఒదిగి రస సమన్వయంగా ఇమిడిపోతుంది. అలా ఇమిడి పోవాలి కూడా.

సాహిత్యాక్షరం ఎంత ద్విత్వాక్షరమైనా, ఎంత సంయుక్తాక్షర, క్లిష్టాక్షరమైనా, అది తేలికగా గానంలో పలుకబడి ఆ సాహిత్యాక్షరపు వాదనకన్నా, ఆ అక్షరంపైన పరచబడి, అక్షర ధ్వనిలో నింపబడిన స్వరనాదంయొక్క శ్రావ్యతా దానికుచియే అధికంగా గుబాళించునట్లు సాహిత్యాక్షరం సంగీతంలో మలచబడుతుంది. కనుక సంగీతసాహిత్యాలు ఎంత ఏకగర్భ జనితాలైనా సంగీతంలోని సాహిత్యం సంగీతానికి ఓ ప్రేమానుబంధిగా ఉండవలసిందే.

కనుకనే సంగీతంలో సాహిత్య సంబంధమైన పదాలూ శబ్దాలూ ఎక్కడా ఆ రాగ గతిలో రాళ్ళులా అడ్డుపడకుండా ఆ రాగంలో కలిసిపోయి శుద్ధ సంగీతంలా వినిపిస్తాయి. రాగములో స్వరమే పలికిందో అక్షరమే పలికిందో తెలుసుకోలేనంత ఇదిగా అవి ఒక దాన్ని మరొకటి పెనవేసుకొని సాగిపోతూ రసోత్పత్తిని చేస్తుంటాయి.

ఇలాంటి మధుర సమన్వయంలో మనం సంగీతాన్ని పట్టుకోటానికి ప్రయత్నించకపోతే, మనకు దొరికేది అక్షరరూపంలోని సాహిత్యమే. అప్పుడు స్వరమూ, ఆ స్వరరచనలోని విశిష్ట చమత్కృతులూ మనకు అందవు.

కనుక సంగీతకళలోని సాహిత్యరచన అన్నది ఒక భావార్థపు మిషమాత్రమే. అందుకని సంగీతకళలో సంగీతప్రజ్ఞను పట్టుకోవాలి అని అంటే, సంగీతంలో సాహిత్య రూపంలో ఉన్న అక్షరశబ్దధ్వనిని ప్రక్కన ఉంచి, దానిలో పొదగబడిన నాదరూపంలో ఉన్న స్వరాన్నీ స్వరనాదాన్నీ, రాగ మాధుర్యంలోని స్వరకల్పననూ వినాలి. అప్పుడు గానకళాలోలులకు గాంధర్వ తత్వము చేతికి దొరికి, అందులోని స్వరరచనా చమత్కృతులూ, స్వర విన్యాస చమత్కృతులూ అందుతాయి. ఆ తరువాత అక్షరస్వరంమీద ప్రయోగింపబడిన గమక చమత్కృతులూ దొరుకుతాయి.

అప్పుడు సంగీతకళ, సంగీతకళలోని సాహిత్య మీమాంసను ఒదిలి, స్వరమీమాంసలో అధికంగా పడుతుంది.

సంగీతకళను కేవలం వినటం ఆనందించటమే కాకుండా, గానలోలత్వమూ అందులోవి లాలిత్యాన్నీ పట్టుకోగల నైశిత్యమూ, సాహిత్య రసజ్ఞులవలె సంగీత రసజ్ఞులకు కావాలి. అప్పుడు గానం, లాలిత్యములో లోలకంగా కాకుండా లాక్షిణికము అవుతుంది.

సంగీత సాహిత్యమూ, సాహిత్య సంగీతమూ అభేదంగా కనిపిస్తాయి ప్రథమ-వీక్షణలో. ఆ అభేదంలో విభేదముంది. అది ఈ రెంటి గుణపరిశీలనలో కొంత స్పష్టంగా తెలుస్తుంది.

సంగీత సాహిత్యంలో స్వరం ప్రధానం అధికం కూడా. అందుకని వాగ్గేయకారుల సాహిత్యశబ్దం స్వరానికి అనుగుణంగా ఉంటుంది. అలా ఉండాలి కూడా. అంతే కాకుండా సంగీతస్వరంలోని విన్యాసానికి అనుచారికగా, రాగాలాపనలో పరిచారిక స్వరంగా కూడా ఆ శబ్దగుణం ఆ సాహిత్య పదనాద గుణం ఉండాలి. అలాంటి ఒక విశిష్టలక్షణం కలది సంగీతకళలో ఉన్న సాహిత్యము.

అసలు సంగీత-- సాహిత్యమూ, సాహిత్య- సంగీతము రెండూ నాద ప్రధానమైనవే, శబ్ద ప్రధానమైనవే. అయినప్పటికీ వాటి వాటి అంశాల స్వభావాలలో కొంత మూల ప్రధానమైన తేడా ఉన్నది. ఈ రెంటినీ కలిగి ఉన్నది 'పదం'. ఈ పదం అన్న పదార్థం అటు సాహిత్యంలోనూ ఉంటుంది. ఇటు సంగీతంలోనూ ఉంటుంది. కనుక రసతత్వంలోని 'పదం' అన్న పదార్థంలో, అటు మధుర శబ్దమూ ఉంటుంది. ఇటు కమ్మని నాదమూ ఉన్నది. అందుకనే ఈ సంగీత సాహిత్య కళలలో 'పదం' అన్నది ఓ విచిత్రమైన మాధ్యమంగా ఉంటుంది. ఈ రెండుకళలలో ఆ పద పదార్థంలో సాహిత్య శబ్దమూ, సంగీత స్వరమూ పోయటానికి వీలయే ఓ పాత్రగా దాన్ని వినిమయం చేసుకొంటున్నవి సంగీత సాహిత్య కళలు. ఈ పదమాధ్యమాన్ని సంగీతసాహిత్యాలు లేని పరిధిలో అది తమ మూల అంశలో మలచుకొని, ఆ కళా సౌందర్యతత్వాన్ని దానికి కలిగించుకొని ఆ పదాన్ని తమ సౌందర్యవాచకంగా తీసుకొని పోతుంటవి తమ తమ కళాసృష్టిలో కనుకనే సంగీత వాగ్గేయకారులకు సాహిత్య పదశబ్దం మీద ఎంతో అవగాహన కావాలి. అప్పుడుగానీ సంగీతంలోని వాగ్గేయకారకత్వంలో వాక్కు సంగీతమధురంగా మధురసంగీతంగా నిలబడదు.

కనుకనే సంగీతకళలోని మూల సౌందర్య తత్వం, రసతత్వ వ్యక్తిత్వాన్ని వహించటానికి సంగీతకళలో సాహిత్యపదాలు చాలా పరిమితంగా పరిమిత పరిధిలో ఉంటాయి. ఆ ఉన్న పదాలూ క్లిష్టశబ్దాలను కలిగి ఉండవు. ఓ వేళ అలా ఉన్నా, ఆ పదంలోని అక్షరాల కన్నా అధికంగా, ఒక అక్షరానికి రెండూ, నాలుగు, ఎనిమిది స్వరాలు ఆ అక్షరంమీద పోయబడితే, ఆ అక్షరధ్వని మారిపోయి, అవి స్వరనాదంగా మారిపోతుంది. ఇలా సాహిత్యంలోని పదాలూ అక్షర శబ్దాలూ సంగీతకళలోని స్వరానికీ, ఆ స్వరంలోని స్వరగుణానికీ ఇమిడి పోయేవిగా ఉంటాయి. అలాలేకపోయినా, ఆ సాహిత్య శబ్దాల తత్వాన్ని సంగీతకళ తన స్వరతత్వంలోకి, స్వరస్థాయిలలోకీ మలచు కొని లలితంగా శ్రావ్యంగా చేసుకుంటుంది. అదీకాకపోతే ఆ అక్షర శ్రావ్యతను అక్షరకాలాలతో సాధించుకుంటుంది కూడా ఈ గానకళ. అలానే సాహిత్యకళలోని శబ్దం, పదాన్నీ పద అర్థాన్నీ మించిపోకుండా చూసుకుంటుంది. నిర్వచన రచనల్లో సాహిత్యపదం కన్నా ఆ పదంలోని శబ్దం అధికంగా ఉండి, ఆ పదాన్నీ దాని అర్థాన్నీ మించిపోకుండా ఆ నిర్వచన సాహిత్యం ఎప్పటికప్పుడు చూచుకుంటూ ఉంటుంది. అలానే సంగీతంకూడ తన సాహిత్యంలోని పదమూ అందులోని శబ్దమూ స్వరాన్నీ స్వరంలోని మాధుర్యాన్నీ మించిపోకుండా చూసుకుంటుంది.

నిర్వచన సాహిత్య రచనలలో పదాల శబ్దాల నడకలలో గల లయను తమ సౌందర్యం కోసం భద్రంగా వాడుకొంటుందే తప్ప, లయలోగల విభిన్నజాతులను గతులను అది అంతదాపుగా జేరనివ్వదు.

(28వ పేజీలో)




విశ్వవిఖ్యాతమూ, సుసంపన్నమూ అయిన ఆధ్యాత్మిక విజ్ఞాన కల్పవృక్షం అనే వేదవృక్షం భారతదేశంలోనే పుట్టి, పెరిగి ప్రపంచ జనహృదయ పీఠం మీద చెరగని తరగని అఖండ ముద్రను ఆవిష్కరించింది.

ఏ దేశంలో - ఏ గడ్డ మీద, ఏ భావనా ప్రసూనావిర్భావం జరిగినా - ఆధ్యాత్మికతా పూరిత ఓంకార వేదశబ్ద ప్రపూర్ణమైన భారతీయ తాత్త్వికతాముద్ర తప్పక ధ్వనిస్తూ, దర్శనమిస్తూ - కనిపిస్తుంది. ఇది భారత జాతి విశ్వమానవాళికి సమర్పించిన అపూర్వమైన కానుక.

"అధ్యాత్మవిద్యా విద్యానామ్" అని శ్రీకృష్ణ భగవానుడు గీతలో తన స్వరూప స్వభావాన్ని వినిపించడంలోనే మనకు ద్యోతకమౌతుంది.

మానవుడు తన జన్మను సార్థకం చేసుకుంటూ మనిషిగా ఎదగడానికి, సత్య శివ సుందరాత్మకమైన ఈశ్వర దర్శన భాగ్యానికీ, మోక్ష సాధనకూ ఆధ్యాత్మిక ధర్మాచరణమే శరణ్యమనీ తపస్సంపన్నులయిన ఋషిపుంగవులు ప్రబోధించారు.

ఇట్టి భాషితాలనూ, సుభాషితాలనూ, సందేశాలనూ జనహృదయానికి హత్తుకునేలా, ఆలోచనలు రేకెత్తించేవిగా, ప్రగతి మార్గానికి, జ్ఞానపథానికి దారిచూపే వెన్నెల దీపాలుగా పత్రికల పాత్ర, కర్తవ్యం, బాధ్యత ఎంతైనా వుంది.

పత్రికలూ అంటే ఏ పత్రికలు, ఎటువంటి పత్రికలు - ఏ సిద్ధాంతాన్ని ఆలంబనగా చేసుకోవాలి ? ఏ మత ప్రచారానికి నడుం బిగించి నడపాలి?

జర్నలిజం - ప్రస్తుతం మనం దిన, వార, పక్ష, మాస పత్రికలను చూస్తున్నాం.

స్పుత్నిక్ యుగంలో వున్న మనం విశ్వవ్యాప్తంగా - క్షణ క్షణం జరిగే సంఘటనలను చూస్తున్నాం, వింటున్నాం - చదువుతున్నాం.

సరే! అంతదాకా అభివృద్ధిని సాధించాం. ప్రపంచం నాలుగు చెరగులా జరిగే ప్రతి సమస్యా, సంఘటనా మన కళ్లముందు ప్రత్యక్షమౌతూంది. ఇవన్నీ చూసినా, విన్నా మనిషి మనస్సులో ఎదురయ్యేది భయం, ఈర్ష్య, క్రోధం, పగ, బాధ, దుఃఖం, సంతోషం, ఆలోచన - ఇన్ని ప్రశ్నల చక్రబంధంలో చిక్కుకుని సమాధానాలు దొరక్క, దారి కనుపించక, ఏమిటా ? ఈ విశ్వమానవుని గుండె చప్పుళ్లలో తడబాటు, ఉరుకులు, పరుగులు, - అనే మీమాంసతో - దేనికోసమో వెంపర్లాడే మానవునికి కనిపించవలసిన దృశ్యం, వేదనా భరిత మానవునిలో శబ్ద నిశ్శబ్దాల మధ్య వినిపించవలసిన నాదవేదం, హిందూ ధర్మ ప్రబోధం, ఉపనిషత్ అష్టపదుల ప్రవచన పంచామృతంతో కూడిన ధార్మిక జిజ్ఞాసా జ్యోతి - ఆధ్యాత్మిక సంస్కృతీ విపంచి.

అదే హిందూమతంలో ప్రవహించే ధార్మిక నదీప్రవాహం! వేదబోధలు మానవ ప్రగతికి మహోదయాలు - దివ్యాక్షర రమ్య రమణీయాలు!

అది హిందూ సంస్కృతి విశ్వమానవుని మేలుకొలుపడానికి మీటిన మహతి.

వేద ధర్మాలు వెన్నెల ముద్దల్లా, ప్రపంచానికి అందిన అపూర్వ మణిహారం!

కాలం నదీ ప్రవాహం వంటిది! మారుతున్న కాలంతో పాటు, ఆధునికత పేరున, ఆధునిక మానవుని రుచులు, ఆలోచనలు, అవగాహనలు, ఆచరణలు, ఆరాధనలు, అర్చనలు లోకనాలోకనాలలోనూ ఒక కొత్త చూపూ, ఒక కొత్తబాటా, ఒక నూతన పరిశీలనాత్మక వివేచనా - ఉదయించింది. కాని ఆ ఉదయ కిరణాలు ప్రగతీ మహోదయాలా ? తొంగిచూచిన తిరోగమన భావ దారిద్ర్యపు నీలినీడలా?

మతం కానివ్వండి, సంస్కృతి కానివ్వండి, సంప్రదాయం కానివ్వండి - నాలుగు కాలాల పాటు నిలచిందీ అంటే - ఔనన్నా, కాదన్నా - అందులో వున్న, ఆ జ్ఞానఖనిలో వున్న సుసంపన్న సంస్కారమే కారణం - అదే వేదసంస్కృతి - అదే ఆర్షధర్మం - అదే ఉపనిషత్‌సారం - అదే భారతీయాత్మ ప్రపంచానికి అందించిన మహాసందేశం!

అయితే! మన కర్తవ్యం ఏమిటి? మనం ఆచరించవలసిన, అనుసరించి అనువర్తింపజేయవలసిన మహాయజ్ఞ కర్తవ్యం ఏమిటి?

ప్రస్తుతానికి ప్రచారం కావాలి - ప్రబోధం కావాలి - అందుకే క్రైస్తవులకు, మహమ్మదీయులకు ఇంటింటికీ వారి వారి సందేశం అందివ్వడానికి అన్ని సాధనాలకన్నా పత్రికా ప్రచారం అవసరమని గుర్తించి -



# ప్రగతి మార్గంలో పత్రికల పాత్ర — ఎల్లోరా

కోట్లాది ధనం అందుకోసం వెచ్చిస్తున్నారు. దేశ దేశాలకూ గుప్పిస్తున్నారు.

హిందూమత ధర్మాలను ప్రశ్నిస్తున్నారు. వేదసూత్రాలకు వక్రభాష్యాలు పలికిస్తున్నారు. ఉపనిషద్వాణికి అపార్థాలు లాగుతున్నారు. భగవద్గీతకు అపస్వర భావనను అంట గడుతున్నారు.



మనకు ధనం లేకపోవచ్చు - వేదధర్మం వుంది. ప్రచారసాధనాలు లేకపోవచ్చు. ఆధ్యాత్మిక భావసంపద కోకొల్లలుగా వుంది.

కావలసింది - పట్టుదల, నిష్ఠ, మన మత ధర్మాలను, విషయాలను, విశేషాంశాలను జనహృదయరంజకంగా, ఆలోచనామృత ప్రాయంగా, జ్ఞాన సమృద్ధంగా ప్రచారం చేయడం!

అందుకు ప్రధాన సాధనం పత్రికలు. పత్రికలకు లోటు లేదు దేశంలో - ఉన్న లోటు ఆధ్యాత్మిక ప్రబోధంతో వేద, ఉపనిషత్తుల నుంచి భారతీయ హృదయంలో మహా జ్యోతులుగా - వేదనాదాలుగా - ఓంకార శబ్ద తరంగాలుగా - ప్రజలను ఆకర్షించి, ఆలోచింపచేసి, ధర్మ భావంతో, ధార్మిక తాదాత్మ్య వాతావరణాన్ని వినిపించి, నడిపించి, చదివించే ధార్మిక పత్రికల ప్రచురణలు ఎన్నైనా, ఎంతైనా అవసరం.

కాని, ప్రపంచ వ్యాప్తంగా వున్న క్రైస్తవ మిషనరీలు వారి మతప్రచారానికై లక్షలాది ధనాన్ని ప్రపంచ పరివ్యాప్తంగా కుమ్మరిస్తూ - చిన్న చిన్న బుక్‌లెట్సు ద్వారా, చిన్న చిన్న పత్రికల ద్వారా వారు తమకు తెలిసిన ఎన్నో మార్గాల ద్వారా వారి మతాన్ని ప్రచారం చేస్తున్నా, దానికి దీటుగా హిందూ మత ప్రవర్తకులు, స్వాములు, సన్యాసులు, పీఠాధిపతులు - ధార్మిక సర్వజ్ఞులు ఎవరూ అంతగా పట్టించుకో లేదు. దానికి ప్రత్యామ్నాయ ప్రచారంతో హిందూమత ధర్మాన్ని, ఆచరణను జనంలోకి మళ్లించలేకపోయారు.

ఎంత గొప్ప వటవృక్షమైనా మొదట్లో నీళ్లు పోసి పెంచాలి. చావకుండా చూడాలి. చిగురించేదాకా దాని రక్షణ బాధ్యతను వహించాలి. అప్పుడు అది ఒక మహావృక్షంగా పలుశాఖలతో - పచ్చని ఆకులతో నిలబడగలుగుతుంది.

అలాగే మన మతంలోని గొప్పనీ, వేదాధ్యయనంలోని మహత్త్వాన్నీ, ఉపనిషత్ సారాన్నీ, భగవద్గీతలోని భావజాలాన్ని నలుగురికీ అర్థం అయ్యే భాషలో సందేశాత్మకంగా అందించ గలిగితే ఇతర మతాల తాకిడికి, ధాటికి - భారతీయులు మోసపోయేవారు కారు.

అనేక మతఛాందసవాదుల - వాదాల పద ఘట్టన క్రింద, మత రాజకీయపు మంటల వల్ల భారతీయ తాత్త్విక, ఆధ్యాత్మిక, ఋషి ప్రబోధాలు - ప్రచారాలూ ఎన్నో ఎన్నెన్నో ఆటుపోటులను, సవాళ్లను ఎదుర్కోవలసి వచ్చింది.

అది హిందూమత ధర్మ పీఠానికి ఒక సవాలుగా నిలిచింది.

నీలి వార్తలతో, ప్రబోధాలతో, దుష్ప్రచారాలతో ధార్మిక హృదయంలో ప్రశ్నలు - సమాధానాలూ, ఆలోచనలూ అవలోకనలూ - అనైక్యత, తప్పుడు వ్యాఖ్యానాలు - హిందువుల్లోనే తిరోగమన భావాల జడివానలు - ఇలా అడుగడుగునా అగ్నిగుండం మీద నిలబెట్టి భయపెట్టే విషనాగుల మధ్య మన ఉనికిని కాపాడు కోడమే, వేదవృక్షాన్ని రక్షించుకోడమే - ధర్మాలను పరిరక్షించు కోడమే కర్తవ్యం అయింది.

మహానదులు పారి పాయలైనట్లుగా హిందూమతంలో ఎన్నో ఎన్నెన్నో మత తత్త్వ పాయలు ప్రత్యక్షం అయాయి.

కానైతే - వీటన్నిటికీ మూలమైన ఆర్ష, ఆధ్యాత్మిక, తాత్త్విక, ధార్మిక సముచ్చయం, జ్ఞాన సమృద్ధమై, విజ్ఞాన ప్రఫుల్లమై వేదనాద ఓంకారమై - హిందూమతం పాలిటి హిమాలయమై - మహిమాన్విత మానవతా జ్ఞాన సూత్రమై నిలిచింది.

ఇప్పుడు మనం ఏం చేయాలి? ఏంచేస్తున్నాం - ఈ ప్రగతీ ప్రస్థానం ఎటు? ఏం సాధించడానికి ?

ఇతర మతాలను దూషించడం మన రక్తంలో ఇమడనిది, ఇతర మతాల లోని మంచిని హర్షించడం మన హిందూ ధర్మంలోని సహృదయం. అంతదాకా బాగానే వుంది. మన మత ధర్మాలకూ, క్రతు కర్తవ్యతా నిర్వహణంలో అడ్డుపడే మందేహతతిని ఓ కంట కనిపెడుతూ, మనమతంలోని మంచినీ, ఔన్నత్యాన్ని - ప్రపంచ పరివ్యాప్తంగా పాశ్చాత్యులను సైతం మన ధర్మాచరణం, వేదంలోని

సూక్ష్మ పరిశోధనాత్మక విషయాలు - భగవత్ సాక్షాత్కారానికి ఆర్షధర్మ - తపో రహస్యాలూ - వంటి అన్నింటినీ సరళంగా, సామాన్య భక్త జనకోటికి అందుబాటులో వుండేలా ప్రచారం చేయడం అవసరం.

ప్రచార సాధనం పత్రికలే! పత్రికలూ అంటే - జర్నలిజంతో ధార్మిక జర్నలిజాన్ని బేరీజు వేయడం సరిఅయిన ఆలోచన కాదు. దిన, వార, పక్ష, మాస, పత్రికలు. ఇప్పుడు వస్తూన్న వర్తమాన ఆలోచనలకూ, సంఘటనలకూ, సాంఘిక, రాజకీయ, సాహిత్యాలతో కొనసాగే జర్నలిజం అది.

అడపా దడపా ఓమత ధర్మాన్ని గురించో, వేదంలోని ప్రత్యేకతలను గురించో ప్రచురించినా - అది ధార్మిక జర్నలిజం క్రిందకు రాదు!

**ధార్మిక పత్రికలు:**

మత ప్రచారం కోసం - అది ఏమతమైనా వెలువడిన పత్రికలను గురించి పరిశీలిస్తే - మనం మనమతం కోసం, ధార్మిక ప్రచారానికి మన కర్తవ్యం ఎంతవరకూ ఏవిధంగా నిర్వర్తించాం అన్నది ప్రస్ఫుటమౌతుంది. అందుకు కొన్ని పత్రికల నామాలు - సంవత్సరాలూ - వారి కమిట్‌మెంట్‌లను గురిచి స్థాలీపులాకంగా చూద్దాం.

భారతదేశంలో మొట్టమొదటి సారిగా 1818లో బెంగాల్ నుంచి "దిగ్దర్శన్" పేరున పత్రిక వెలువడింది.

సత్యదూత - 1835 లో మతప్రచారానికై ప్రారంభించ బడింది. క్రైస్తవ ప్రచారం వీరి ప్రధానోద్దేశం.

తత్త్వబోధిని - మద్రాసు నుంచి బ్రహ్మ సమాజం వారు ప్రారంభించారు, 1864 లో.

ఇంకా వృత్తాంతిని, వర్తమాన తరంగిణీ, దినవర్తమాని, సుజనరంజని, శ్రీయక్షిణి, తత్త్వబోధిని, గోదావరి మండల విద్యాప్రబోధిని, ఆంధ్రభాషా సంజీవని, పురుషార్థప్రదాయిని, స్వధర్మ ప్రకాశిని, సుధీరంజని, సకల విద్యాభివర్ధని, బ్రహ్మాండరంజని, విద్వన్మనోహారిణి, లోకరంజని, వివేకవర్ధని, జనవినోదిని, స్వదేశి, భారతి, ప్రబంధ కల్పవల్లి, యధార్థవాది, సతీహిత బోధిని, నీతిదర్పణము, సుజన మనోల్లాసిని, హిందూ జన సంస్కారిణి, దేశాభిమాని, అముద్రిత గ్రంథ చింతామణి, రసికోల్లాసిని మొదలయినవి.

వైష్ణవ పేర్కొన్న పత్రికలలో పూర్తిగా మత ప్రచారం కోసం ఏర్పడితే - మరికొన్ని సంఘ సంస్కరణల పేరున ప్రచారం ప్రారంభించినవి వున్నాయి. అక్కడా అక్కడా సాహిత్య వ్యాసాలూ అవీ వున్నాయి. (కొన్నిమాత్రం సాహిత్యానికే పరిమితమయ్యాయి.)

పూర్తిగా ధార్మిక ప్రచారం కోసం ఏర్పడిన పత్రికలలోనూ అటుకొన్ని, ఇటుకొన్ని కలగూరగంప రీతిగా వున్నవీ లేకపోలేదు.

మానవుని మనుగడ కత్తుల వంతెన మీద పరుగులా తయారయి రాజకీయ సుడిగుండాలలోనూ, అజ్ఞానాంధకారపు దుష్ప్రభావాలవల్ల తన గమ్యం, తన మతం -

> "హిందూమత ధర్మావగాహనకు
> ధార్మికపత్రికలు కరదీపికలు కావాలి"
> - ఎల్లోరా

తన ధర్మనిర్వహణా కర్తవ్యం మరచి తాత్కాలిక మైన విషయ వాంఛాలోలుడయినప్పుడు తనలో కలిగే భావ సంఘర్షణతో - ఒకానొక తాత్త్వికతను, ఆధ్యాత్మిక వెలుగును ఆశిస్తాడు. ఇది తెలిసీ రావచ్చు. తెలియకా రావచ్చు.

ఆటువంటి వానికి ఏదో ఒక వాణి, ఎక్కడో ఒక సందేశం, మరెక్కడో ఒక సుభాషితం - వినిపించాలి. ఆ వినిపించడమనే ప్రక్రియనే ప్రచారం అనుకొందాం.

అపారమైన మత సంప్రదాయం మనకు వుంది - అపూర్వమైన జ్ఞాన సంపద శబ్ద, అక్షర రూపాలలో మనకు వుంది. నాకీదారి చూపే మోక్ష జ్యోతి ఇదీ అని తెలియజేయడానికి, తెలుసుకో గలగడానికి ప్రచారసాధనం కావాలి. అందుకు పత్రికలు వాహికలు కావాలి.

ఆమూలనుంచి ఓ చిన్న పత్రిక ఈమూల నుంచి ఓ చిన్న పత్రిక వెలువడు తూనే వున్నాయి. సంతోషదాయకం - హర్షణీయం!

అయితే - ఇవి సుసంపన్నమైన పథకాలతో - సూత్రాలతో - నడుస్తున్నాయా?

మహానదులకు ఉపనదులు - పాయలు ఏర్పడినట్లు - హిందూమతం, సంస్కృతి వేద సంపదలకు కూడా ఎవరికి తోచిన వ్యాఖ్యానాలూ చేస్తున్నారు.

అనేక ఒడుదుడుకుల మధ్య మన సంస్కృతి, మన మత ధర్మాలూ, ధార్మిక సత్ సంప్రదాయాలు నిర్వీర్యమై పోకుండా నివురు గప్పిన నిప్పులా తిరిగి రగిలించి అగ్ని సూక్తం ఆలపించాలి. వేదవృక్షం చిగురించాలి.

అందుకు ప్రచార సాధనమైన ధార్మిక పత్రికలే శరణ్యం!

ఈ యజ్ఞ క్రతువువంటి కృషి విజయవంతం కావడానికి సప్తగిరివాసుడే శ్రీరామ రక్ష!

దీనికి జరిగిన కృషికన్నా, జరుగుతూన్న కృషికన్నా - జరగవలసిన కృషి చాలావుంది.

భారతాత్మ మేలుకొనేవుంది. భారతీయ సంస్కృతీ సంపద. సమున్నతమైనది అని అనేక ధార్మిక పత్రికలు ఓపినంతలో నేల నాలుగు చెరగులనుంచీ వినిపిస్తూ ధర్మనిరతిని, ఆధ్యాత్మిక చింతనను - వేద మూలక జ్ఞాన చైతన్యాన్నీ ప్రబోధామృత సారం పంపుతూనే వున్నాయి.

మన ఋషులు - మన వేదాలు, మన ఉపనిషత్‌లు - రామాయణ, భారత, భాగవత, తదితర ధార్మిక, ఆధ్యాత్మిక, హిందూమత ప్రచార పత్రికలు బోధిస్తూ జనాన్ని చైతన్య వంతులను గావిస్తూనే వున్నాయి.

పీఠాధిపతులు, యోగులు, స్వాములు, ఆచార్యులు ఎందరో ఏదో మూల నుంచి మనిషిలోని చీకటిని పారద్రోలి వెలుగులను వెలార్చడానికి జ్ఞానజ్యోత్స్నను ఆవిష్కృతం గావిస్తూనే ఉన్నారు.

మచ్చుకు - కన్నడంలో 'శంకర భాస్కర', అరవంలో 'కామకోటి', సంస్కృతంలో 'గైర్వాణి', హిందీలో - 'అగ్నిశిఖ', ఇంగ్లీషులో 'ది మౌంటెన్ పాత్', హిందీలో - 'శ్రీ వైష్ణవ సమ్మేళన్', కన్నడంలో - 'దాసవాణి' ఇలా అనేక భాషల్లో మరెన్నో -

తెలుగులో అయితే - భక్తి నివేదన, నృసింహప్రియ, శ్రీశైలప్రభ, సనాతన సారథి, వేదాంత భేరి, సద్గురువాణి, యథార్థ భారతి, రామకృష్ణప్రభ, వేదాంతకేసరి, గీతావాణి, వేదాంతవాణి - ఇంకా ఎన్నో, ఎన్నెన్నో!

సుఖశాంతులతో మనిషి తన జీవితాన్ని గడపడానికి, తన మనుగడను సార్థకం చేసుకోడానికి - తద్వారా అభ్యుదయ పథంలో పయనించడానికి - ప్రధానమైన అస్త్రధారణం ధర్మాచరణం!

స్వార్థం వేయిపడగలై, ఈర్ష్యా ద్వేషాలు శత సహస్ర జ్వాలలై బుసలు కక్కుతూన్న ప్రస్తుతంలో - దానిని అదుపు చేయడానికి ధర్మాచరణమే ప్రధానం.

ఆధునిక యుగంలో - ప్రస్తుత సమాజంలో బ్రతుకీడిస్తూన్న మానవునికి సనాతన ధర్మం అంటే ఏమిటో? ఏ కారణాల వల్లనైతేనేం మన సంస్కృతి, సంప్రదాయం, కట్టుబాట్లు - కర్మ నియమాలూ, ఆచరణలూ ఏమిటో కూడా తెలియని స్థితి ఏర్పడింది.

ఈ చీకటినుంచి, ఈ అజ్ఞానంనుంచి మనిషిని, మనసును తట్టి మేల్కొల్పవలసిన అవసరం ఎంతైనా వుంది.

అందుకోసం - ధార్మిక పత్రికలు వేయి పూవులై వికసించాలి - భారతీయ ఆధ్యాత్మిక నందనవనం పరిమళించాలి.

ఆ కర్తవ్య నిర్వహణం కోసం 'సప్తగిరి' ధార్మిక ప్రబోధామృత పీఠం కావాలి.

కలియుగ వైకుంఠవాసుని. ధార్మిక క్షేత్రమే అందుకు అంకురార్పణగా నిలిచి శుభాక్షతలు జల్లాలి.

## వేద ఏవ పరోధర్మః

ధర్మం నాలుగు పాదాలా నడవాలంటే వేదార్థసారం అవగతం చేసుకోవాలి. ఉపనిషద్ రహస్యాలను పరిశీలనం గావించాలి. వ్యాస పీఠంలోని మానవతా విలువల లోతులను గ్రాహ్యమొనరించుకొని కల్యాణ కారకమైన యజ్ఞాచరణకు ప్రణవ నాదాలను పలికించే మహతీతంత్రులను లయాన్వితమైన హిందూమత ధర్మ సూత్రాలను గానంలా వినిపించాలి. అప్పుడు గతంలోంచి ప్రస్తుతంలోంచి భవిష్యత్తులోని మహోన్నత ఆదర్శ ప్రపంచపుటంచులను అందుకోవాలి. ఆ క్షణమే సంఘం పరిమళిస్తుంది. ధర్మం నవ్వుల పువ్వులు విరబూస్తుంది. జ్ఞానసూర్యోదయం అరుణమై ప్రతిధ్వనిస్తుంది.

---ఎల్లోరా

సప్తగిరి

సుమారు మూడు దశాబ్దాలుగా ధార్మిక ప్రచారమే ఊపిరిగా - భారతీయ తత్త్వ ప్రచారమే ధ్యేయంగా 'సప్తగిరి' చేస్తూన్న అక్షరార్చన అపూర్వమైనదీ - అభినందనీయమైనదీ!

వేంకటేశ్వర లీలలు, మన దేవాలయాలు, బాలప్రబోధం, గృహలక్ష్మి, యువవాణి, ఇత్యాది శీర్షికలతో అన్ని తరహాల ప్రజానీకంలో ధార్మిక చింతన, చైతన్యం రగిలించి - భక్తిమార్గంవైపు, సనాతన ధర్మపథం దిక్కుగా పయనించడానికి కంకణం కట్టుకున్న పత్రిక ఇది.

దీని కర్తవ్యం ఇంతటితో ఆగిపోలేదు. ధార్మిక పత్రికలుగా వెలువడి సేవ చేస్తూన్న అన్ని తరహాల వారినీ ఒక వేదిక మీద సమైక్య పరచి, చర్చాగోష్ఠులు ఏర్పాటు చేసి, సదస్సులలో ఒక బృహత్ ప్రణాళికను రూపొందించి ధార్మిక జర్నలిజంకు నిర్దిష్టమైన, ప్రణాళికాబద్ధమైన సమైక్య వేదిక నిర్మించి భారతీయాత్మ మహాజ్యోతిని వెలిగించే ప్రయత్నం చేయాలి - వీరికి సమన్వయ కర్తృత్వం ధర్మ ప్రచార పరిషత్ స్వీకరించి - కార్యరంగానికి శ్రీకారం చుట్టాలి.

ధార్మిక పత్రికలే ఇలా ముందడుగేసినప్పుడు - హిందూమతం అఖండమై అఖండ దీపమై జ్ఞాన పుష్పాలను విరబూస్తుందనడంలో సందేహం లేదు.

అందుకోసం ధర్మచింతనతో, ధార్మిక చైతన్యంతో ఓంకారనాద రూపమైన జయ పతాకను ఎగురేద్దాం!

ప్రపంచ మానవాళిని భారతీయ తత్త్వామృతంతో అభిషేకిద్దాం!



(23వ పేజీ తరువాయి)

కనుకనే, సంగీతంల్లోని సాహిత్యంలో నాదం ఉంటుందేగానీ, పదశబ్దం అధికంగా ఉండదు. ఉన్నా, అది స్వరకల్పనా స్వరంలో కరిగిపోతుంది. సాహిత్యంలోని సంగీతంలో శబ్దం దాని నడక సౌందర్యం అధికంగా ఉంటుందేగానీ, నాదం అధికంగా ఉండదు. ఉన్నా అది శబ్దార్థాలలో కలిసిపోయి ఆ శబ్దార్థాలకు సువాసనలను ఇచ్చేదిగా ఉంటుంది.

అందుకనే సంగీతకళలోని సాహిత్యమూ, అందులోని పదాలూ, సాహిత్యకళలోని సాహిత్యంలా కాకుండా, రాగంలో జాలువారుతూ ప్రవహించే స్వరాల సాహిత్యం మాదిరిగా ఉంటుంది.

కాలాలూ ఎన్నిమారినా, సాహిత్యంలో ఎన్ని క్రొత్త రీతులు వచ్చినా, అందులోని సౌందర్యతత్వసృష్టి, ఆ సాహిత్యాన్ని రసవత్తరంగా చేసేదిగానే ఉంటుంది. ఆనాటి పద్యం ఈనాటి వచనగేయంగా అయినా, సుందరత ఎంత వద్దనుకున్నా ఆ సాహిత్యశబ్దాల కూర్పులో ఏదో ఒక సుందరత ఉండకుండా పోవటంలేదు. దానిని ఈనాడు, 'ఈ వచనగేయం చక్కగా నడిచింది' అంటాం. గతంలో అయితే 'చక్కని ' యమకాలు నడకలు అందులో ఉన్నాయి. మంచి శబ్దం ఉంది అనే వాళ్లము. ఆ సాహిత్యసుందర స్రవంతికి యమకం జీవం. ఈ సాహిత్య హృదయ పటుత్వానికి ఊపు జీవగర్ర.

సంగీత కళకు జీవనాడి స్వరప్రయోగంలో చూపించే గమకం. ఈ గమకాలు లేకపోతే సంగీతకళలో భావపుష్టిరాదు. రసావిష్కరణ జరగదు. పాడిస్వరాలను చిత్రవిచిత్రంగా ఎంతగా కల్పనచేసినా వాటిని ఎంతగా వాదనము చేసినా ఆ వాదనములో, ఆ గాత్రంలో రసావిష్కరణ గాఢంగా జరగదు. అలాంటి గమకాలు సంగీతకళకూ, సంగీతకళలోని స్వరానికీ, సంగీతకళలోని రసావిష్కరణకూ ఆయువుపట్టులు. ఆ వివిధ రుచులు గల గమకాలు భావపుష్టికీ రాగభావ పుష్టికీ గాత్రంనుండి రసం చిప్పిల్లటానికీ, రసామృతంగా స్వరసౌందర్యానుగుణంగా-- 1. గాత్రపు స్వరస్థానాల పొరల్లో; 2. వాద్యపు మెట్లమీదా; 3. వాద్యపు స్వరస్థానాల్లో ప్రయోగింప బడుతాయి. అప్పుడు వాద్యపు మెట్లమీది నుండీ, గాత్రంలోని స్వరపేటిక పొరల్లో నుండీ జాలువారుతూ పొంగిపొరలుతూ ఉంటుంది. రసకళయైన సంగీతకళ.

అందుకని సాహిత్య జగత్తులో యమకంలోని సౌందర్య తత్వం, భావరసాల వ్యక్తీకరణకు అఖండబలం. అలానే సంగీతకళా జగత్తులోని సౌందర్యలక్షణం, ఈ గమక జీవనంలో ఉన్నది. ఈ గమక యమకాలు రెండూ ఆయా కళలలోని రసస్ఫష్టికి ఆయువుపట్టులూ రసజీవన స్రవంతులు.

సాహిత్యం తన భావాన్ని బలంగా చెప్పటానికి, ఏదోరూపంలో ఏదో ఒక వర్ణనలో పలుకుతూ ఉంటుంది. వర్ణనలు రచనా జగత్తులో ఓ సాహిత్యధనరాశి. అవి ఎన్ని రూపాలలోనైనా కాలగతులలో పరిణామం పొందవచ్చు. అలానే సంగీతకళలో వర్ణాలు అన్నవి అనంతంగా ఉన్నాయి. ఈ వర్ణాలు సంగీతకారునకు ఎంతగా ఒంటపట్టితే, ఈ సంగీతకళాజగత్తులో అంతగా ఆ సంగీతకళాకారుడు సంగీతరస కళాకారుడు ఔతాడు. సాహిత్యంలోని వర్ణనలు రచయితలో రచనలోని సృజనశీలతను ఎంతగా పెంచుతాయో, అలానే ఈ సంగీతకళలోని వర్ణాలు సంగీత కళాకారునికి అతనిలోని సృజనాత్మకతనూ సృజనశీలతనూ అంతగా పెంచుతాయి.

సాహిత్యకళలో అందాన్ని తెచ్చేది వర్ణన అన్న అంశం. ఆ అంశం ఎన్నో రీతులలో ఎన్నోకాలాల్లో విస్తరిల్లి ఉన్నది. ఈ వర్ణన అంశ అప్పుడేకాదు, ఇప్పుడూ, ఇకముందూ సాహిత్యకళలో ఉండవలసినదే. అది లేనిదే సాహిత్యం అన్న కళకు జీవిక లేదు. అధునాతనమూ ఆహ్వానగతమూ అయిన సాహిత్యంలో ఏవో కొన్ని రూపాలలో వర్ణన ఉండక తప్పదు. అప్పుడుగానీ అది సాహిత్యము అని అనిపించుకోదు.

సంగీతకళ ధాతు అభ్యాసంలో వివరగా వచ్చే వర్ణాలు, సంగీతంలోని తమ వర్ణాల సాధనలో ఎంతో పుష్టిని ఇస్తుంది. అలాంటి వర్ణాలు సంగీతకళలో సంగతులుగా నిరవల్సగా ఉపయోగించవలసిన అవసరాన్నీ స్థాయినీ అనుసరించి ప్రయోగించబడుతుంటాయి. దీనివలన భావపుష్టీ, రసపుష్టీ వస్తవి. అంతకన్నా మించి సంగీత సౌందర్యసృష్టి జరుగుతుంది. కళాసృజనలో రస ఔచిత్యమూ ఉంటుంది.

సంగీతకళకు సోదరకళయైన సాహిత్యంలోనూ వర్ణాలకు సమతూకంగా వర్ణనలు ఉన్నాయి. ఈ వర్ణనలుగల సాహిత్యం ఎప్పుడైనా ఎక్కడైనా, ఏకాలంలోనైనా మనిషి హృదయాన్ని తాకగలదు. అది సాహిత్య లక్షణం. అది దేశకాలాలనుబట్టి విభిన్నం కావచ్చు. అలాంటి లక్షణాలను సంగీత కళలోని వర్ణాలు కళా సుందరతత్వంలోనూ, భావ రసపుష్టి గుణాలలోనూ ఉన్నవి.

సాహిత్యంలో చక్కని వర్ణనవస్తే ఎంత ఆర్ద్రత కలుగుతుందో, సంగీతకళలోని స్వరకల్పనలో చేసే చక్కని వర్ణ సంగతులు వర్ణ ఆలాపనలు మనోధర్మ సంగీతంలో వచ్చినప్పుడు అలాంటి సౌందర్యానుభూతీ రసస్థాయీ కలుగుతుంది. అప్పటికప్పుడు సంగీతకారునితో సృజింపబడుతుంది. సాహిత్యంలో ఆశువు ఛందోబద్ధము వ్యవధానములేకుండా సాహిత్య కారునితో సృజింపబడుతుంది.

సంగీతకళలోని మనోహరమైన మనోధర్మ సంగీతమూ లయబంధి. రాగములోని స్వరకల్పనలు అన్నీ విచిత్రగతులలో అప్పటికప్పుడు వ్యవధానములేకుండా ఎంతో సృజనతో కళానైపుణ్యంతో ధారగా వచ్చెటటువంటివి. ఆశువులో వేగము, కేవలం కల్పనా నైపుణ్యం ప్రధానమైనట్లు, మనోధర్మ సంగీతంలోనూ వేగమూ స్వరకల్పనా నైపుణీ నెరవూ ప్రధానంగా ఉంటాయి.

సాహిత్య ఆశువు శ్రోతలను ఆశ్చర్యచకితులను చేసినట్లు సంగీతకళలోని మనోధర్మ సంగీతము శ్రోతలను సంభ్రమాశ్చర్యాలలో ముంచుతుంది. కరతాళధ్వనులను చేయిస్తుంది. ఇది ఒక సంగీత కళాసృజన.

ఒకరకంగా ఆస్వాదించేది సంగీతకళే అయినా, అందులో మనకు తెలీకుండా మన అధోచేతనలో ఇలాంటివి ఎన్నో సాహిత్య లక్షణాలనూ సాహిత్య అనుభూతులనూ సంగీతంలోని స్వరరచన మనలో పుష్పింపజేస్తూ-- ఎన్నో సంయమన స్వరాలను సంగీతకళ మధురంగా మనలో ఆలాపిస్తూ ఉంటుంది.

*

# శ్రీ ప్రసన్న వేంకటేశ్వరాలయం - అప్పలాయగుంట

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

భక్తుల పాలిటి కొంగుబంగారమై వెలుగుతున్న తెలుగు వారి ఇలువేలుపు తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి. ఆ దేవదేవుడు కోరిన వారి కల్పతరువు. చింతించువారి పాలిటి చింతామణి. భావించువారి పరబ్రహ్మ.

అట్టి మహిమోపేతుడైన తిరుమల స్వామి వారి ప్రతి రూపాలుగా శ్రీవేంకటేశుని అర్చామూర్తులు ప్రాచీనకాలం నుంచీ దేశం నలుమూలలా ప్రతిష్ఠింపబడ్డాయి.

ఇటీవలి కాలంలో అమెరికా, ఆస్ట్రేలియా వంటి పాశ్చాత్యదేశాల్లో సైతం ఆ ఘనవేంకటేశుని ఆలయాలు వెలిశాయి, వెలుస్తున్నాయి కూడ.

కలుషభంజనుడు, వరప్రదాతయగు కొండలరాయని ప్రతిరూపంగా వెలసిన అర్చామూర్తి "అప్పలాయ గుంటలోని శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామి."

తిరుపతికి 15 కిలోమీటర్ల దూరంలో కొండలనడుమ చుట్టూ పచ్చని పంట పొలాలు, పెద్ద తామరగుంట ఇలాంటి ఆహ్లాదకరమైన పరిసర వాతావరణంలో వెలసిన గ్రామం అప్పలాయగుంట.

కలియుగ ప్రారంభంలో సుమారు 5 వేల ఏండ్ల క్రిందట నారాయణవనాన్ని పాలించే ఆకాశరాజు కూతురు పద్మావతిని పరిణయమాడి, ఏడుకొండలు ఎక్కేముందు, శ్రీవేంకటేశ్వరస్వామి పద్మావతితో కూడ అప్పలాయగుంట సమీపంలోగల కొండలమధ్య, కోనల మధ్య విహరించినాడట. మరి కొంతకాలానికి అక్కడ వున్న యోగులకొండలో సిద్ధయ్య అనే యోగి శ్రీస్వామివారిని గూర్చి తపస్సు చేశాడు. అతని తపస్సుకు ప్రసన్నుడైన వేంకటేశ్వరుడు ప్రత్యక్షమై దర్శనమిచ్చాడు. ఆ యోగి కోరికపై అప్పటినుంచి స్వామివారు ఆ కొండ క్రింద "ప్రసన్న వేంకటేశ్వరస్వామి"గా వెలసినాడు. అప్పటి యోగుల కొండే నేడు వేములకొండగా పిలువబడుతున్నది.

### జనశ్రుతులు

ఒకప్పుడు "అప్పలయ్య" అను యాత్రికుడు తిరుమలకు వెళుతూ, ప్రస్తుతం అప్పలాయగుంట వున్నచోట కొద్దిసేపు విశ్రమించినాడట! పిదప నిద్రలేచి తిరుమలకు పోతూ, తన దగ్గరవున్న డబ్బుసంచిని అక్కడే మరచిపోయినాడట! దారిలో జ్ఞాపకం వచ్చి "స్వామీ ఏడుకొండలవాడా! నా ధనం నాకు దొరికితే ప్రజోపకరమైన శాశ్వత కార్యం అచ్చోట చేస్తా"నని మొక్కుకున్నాడట!. తాను పడుకున్నచోటనే తన డబ్బు యథాస్థితిగా దొరుకగా దానితో ప్రసన్న వేంకటాచలపతికి ఎదురుగా ఒక గుంటను తవ్వించినాడు. అది అప్పలయ్య తవ్వించిన గుంట కాబట్టి "అప్పలయ్య గుంట" అని పిలువబడిందట! కాలక్రమేణ జనవ్యవహారంలో "అప్పలాయగుంట"గా మారిందని ఒక జనశ్రుతి వినవస్తున్నది.

మరో కథనం ఏమిటంటే పూర్వం ఆ గ్రామస్థులు స్వామివారి ఆలయం ప్రక్కన ఒక చెరువును తవ్వించాలని తలపెట్టారట! పని మొదలు పెట్టినప్పటినుండి పనివాళ్లకు ఏ రోజుకూలి ఆ రోజే అప్పులేకుండా ఇచ్చేవారు. ఇలాగ అప్పుపెట్టకుండానే, చివరివరకు ఆ గుంటను తవ్వించారట! ఇలా అప్పు చేయకుండా తవ్వించిన గుంట కాబట్టి "అప్పులేని గుంట"అని పిలువబడిందట. తర్వాత తర్వాత

> 94 జూన్ 17 నుండి 26 వరకు - పదిరోజులపాటు జరుగుతున్న అప్పలాయగుంట శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి బ్రహ్మోత్సవం సందర్భంగా ప్రచురితం.
>
> సం॥





జనవ్యవహారంలో "అప్పలేనిగుంటే" అప్పలాయగుంటగా పిలువబడి, చివరకు ఆ పల్లెకు కూడా అదే పేరు స్థిరపడిందని అంటారు.

పై రెండు గాథల్లో, రెండవ కథనం కొంత సత్యానికి దగ్గరగా వుందని చెప్పవచ్చు. ఎందుచేతంటే ప్రాచీన కవుల వ్రాతల్లో, శాసనాల్లో "అప్పలేనిగుంట" పేరు సంస్కృతీకరింపబడి "అనృణసరోవరం" అనే పేరుతో ప్రయోగింపబడింది.

## చరిత్ర

సుమారు వెయ్యేండ్లకు పైగా చారిత్రక ప్రసిద్ధి పొందిన కార్వేటినగర ప్రభువుల పాలనలో ఈ అప్పలాయగుంట గ్రామం వుండినట్లు శాసనాధారాలు స్పష్టం చేస్తున్నాయి. వీరి రాజ్యానికి వాయువ్యంలోను, దక్షిణంలోను ఉత్తరార్కాడు, తూర్పున చెంగల్పట్టు జిల్లా, ఈశాన్యదిశలో శ్రీకాళహస్తి రాజ్యం ఎల్లలుగా వుండినాయి. అనగా తిరుమల, తిరుపతి, తిరుచానూరు, నాగలాపురం, నారాయణవనం, తిరుత్తణి, షోళింగర్ మున్నగు




అనేక ఆలయాలు, క్షేత్రాలు, ఇంకా 900 గ్రామాలు వీరి ఏలుబడిలో వుండినట్లు చరిత్ర తెలుపుతున్నది.

అంతమాత్రమేగాక తిరుమల, తిరుపతి, తిరుచానూరు, అప్పలాయగుంట, ఆలయ ఉత్సవాలు, ఊరేగింపుల్లో కార్వేటినగర ప్రభువులు ప్రధానపాత్ర వహించేవారు. వారు తిరుమల శ్రీస్వామివారికి ఒక రత్నకిరీటం, సూర్యకరారి అనబడు నందక ఖడ్గాన్ని సమర్పించినట్లు కూడా తెలుస్తున్నది.

కార్వేటినగర ప్రభువులలో కటారి సాళ్వమాకరాజు శ్రీవేంకట పెరుమాళ్రాజు అత్యంత ప్రసిద్ధుడు. మీదుమిక్కిలి వేంకటేశ్వరస్వామికి పరమభక్తుడు. ఈ ప్రభువు అప్పలాయగుంట ప్రసన్న వేంకటేశ్వరస్వామి వారికి ఎన్నో మడులు, మాన్యాలు ఇచ్చాడు. ఉత్సవాలు ఊరేగింపులు నిర్వహించాడు. ఈ వెంకట పెరుమాళ్రాజు క్రీస్తు శకం 1750 ప్రాంతంలో కానుకగా సమర్పించుకున్న రెండు దీపస్తంభాలు సుమారు 5 అడుగుల ఎత్తుకలవి నేటికీ అప్పలాయగుంట ఆలయంలో చూడవచ్చు.

ఆ దీపపు సెమ్మెలపై వెంకట పెరుమాళ్రాజు వేయించిన శాసనం కూడా మనం పరిశీలించవచ్చు.

"శ్రీ అక్షయ సం॥ వైశాఖ శుద్ధ ౧౫ అనృణసరోవర నగరాధీశ్వర శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి సన్నిధౌ శ్రీ మహా మండలేశ్వర కటారి సాళ్వమాకరాజు శ్రీ వెంకట పెరుమాళ్రాజు దేవమహారాజు సమర్పితాఖండ దీపికాస్తంభో విజయతేతరాం"

ఈ శాసనానికి ఎడమవైపు ఖడ్గం గుర్తును, ఆ ఖడ్గానికి ఇరువైపులా సూర్యచంద్రుల ముద్రలు, ఖడ్గం మొనక్రింద వరాహ ముద్ర చిత్రింపబడ్డాయి.

ఈ మాకరాజు వెంకట పెరుమాళ్రాజు కవి, పండితుడేగాక కవిపోషకుడు కూడ. ఈయన విజయనగర ప్రభువుల మాదిరిగానే అష్టదిగ్గజాలను, కవులను తన ఆస్థానంలో పోషించినాడు. వారిలో 'సారంగపాణి' ప్రసిద్ధిగన్న వాగ్గేయకారుడు. ఈయన పాడిన

పాటలు "సారంగపాణి పదాలు"గా ప్రసిద్ధి కెక్కాయి. ఈ సారంగపాణి పదాల్లో అప్పలాయగుంట ప్రసన్న వేంకటేశ్వరుడు కూడ చోటు చేసుకున్నాడు.

ఘంటారాగం - ఆదితాళం

తటుకు తటుకుమని యెదురీనె గుండె
దిటవు లేదె నీసాక్షిగా ‖ పల్లవి ‖
కుటిల కుంతలి యమ్మణ పరోపర
మట ప్రసన్న వేంకటశౌరి మొన్న
చిటికలో వలపించి పోయెనే
నెటులసైతు దెలుపవే నా రొమ్మున ‖ తటు ‖

........

సారంగపాణి కాలాన్ని క్రీస్తుశకం 1680-1750గా నిర్ణయించి, ఈయన కార్వేటి నగర ప్రభువైన వెంకటపెరుమాళ్రాజు ఆస్థానంలో వుండినట్లు పరిశోధకులు నిగ్గుదేల్చి చెప్పారు. సారంగపాణి తన ప్రభువైన మాకరాజు మీద కూడ పదాలు చెప్పాడు.

శంకరాభరణం - ఆదితాళం

తేనెలూర మాటలాడకు
తెలిసె నీనెనరు
మానినీ మనోహర శ్రీసాళువ
మాకరాజు కార్వేటి రాజేంద్రా.

సారంగపాణి చేత కీర్తింపబడ్డ ఈ మాకరాజే మాకరాజ వెంకట పెరుమాళ్రాజని పైన పేర్కొన్న అప్పలాయగుంట ఆలయం లోని దీపపు సెమ్మెలమీది శాసనం స్పష్టం చేస్తున్నది.

కాని అంతకు పూర్వమే కార్వేటినగరంలో కూడ ఒక ప్రసన్న వేంకటేశ్వరుడున్నట్లు తెలియ వస్తున్నది.

ఋగ్వేది వేంకటాచలకవి తాను రచించిన చంపూ రామాయణాన్ని వెంకట పెరుమాళ్రాజు జ్యేష్ఠ భ్రాతయగు కసవ రాజునకు అంకితమిచ్చాడు. దానిలో తాను రచించిన "వేంకటేశ్వరాష్టకం"లోని క్రింది పద్యాన్ని కసవరాజు ఎదుట చదివినట్లుగా ఋగ్వేది వేంకటాచలకవి తన చంపూ రామాయణంలో పేర్కొన్నాడు.

వేర్వేరన్ శివుడంచు విష్ణువనుచున్
వెల్గింటి కావేది రా
జోర్వీనాథకుమారుడౌ కసవరా -
జుత్సాహ పృత్తిన్‌ధరా
గీర్వాణ ప్రకరంబు లెంచగను భ-
క్తిన్ సంప్రతిష్ఠించెగా
కార్వేటీశ ప్రసన్న వేంకట
రమాకాంతా మహావల్లభా!

ఈ పద్యంవల్ల ఆ నాటికే కార్వేటినగరంలో ఒక ప్రసన్న వేంకటేశ్వరుడు ప్రతిష్ఠింపబడినట్లు స్పష్టం. ఇది కార్వేటినగరానికి పశ్చిమదిక్కులో వుండినట్లు జనశ్రుతి. నేడు ఈ ఆలయం కానరాదు. కార్వేటినగరంలోని ఆ ప్రసన్న వేంకటేశ్వరస్వామిని అప్పలాయగుంటకు తరలించి, ప్రతిష్ఠించారని కూడ జనవ్యవహారంలో వుంది. ఇది పరిశోధింపవలసిన విషయం.

అంతకు చాలాపూర్వం అంటే క్రీస్తుశకం 16వ శతాబ్దం పూర్వార్ధంలో తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడైన చిన తిరుమలాచార్యులు ఒక ప్రసన్న వేంకటేశ్వరుని కీర్తించాడు. కాని ఊరుమాత్రం పేర్కొన లేదు.

## నాదరామక్రియ

వేవేలు చేతలవాడు వీడె
దేవుడుగదె ప్రసన్న తిరువెంగళప్పుడు
యిద్దరు సతులు తన యిరువంకల గొలువ
గద్దెన చూపులనె కరగింపుచు
అద్దరిపాటు సేసి ఆయుములు ముట్టీని
దిద్దిన గోళ్ళ ప్రసన్న తిరువెంగళప్పుడు

కామిములు నలువంక కదిసి సేవలు సేయ
సాముపు ఘాటలనె యాసలు చేయుచు
దోమటి వెనకులనె దుండగాల సేసీని
దీముసముతో ప్రసన్న తిరువెంగళప్పుడు!!

అలమేలుమంగ దసి కాకు పుడిచియ్యగాను
సొలపుల మాటలనె చొక్కింపుచు
నలువై శ్రీవేంకటనాథుడై కూడిన వాడు
లలి నిన్నుల ప్రసన్న తిరువెంగళప్పుడు!!

సంపు 16 - పాట 2 - 29.



పైపాటలో అప్పలాయగుంట ప్రసన్న వేంకటేశ్వరుడే కీర్తింపబడి వుండవచ్చునేమో!

ఇటీవలికాలం వరకు అంటే ఆంగ్లేయుల వారి కాలం వరకు కూడ ఈ అప్పలాయగుంట ఆలయానికి కార్వేటినగర రాజులు ధర్మకర్తలుగా వుండినారు.

స్వాతంత్ర్యానంతరం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కొంతకాలంపాటు ఈఆలయం తిరుత్తణి ఆలయనిర్వహణలో వుండింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన పిదప ఆంధ్రప్రదేశ్ దేవాదాయశాఖ ఆధీనంలో వుండింది. అటు తర్వాత 1988లో సెప్టెంబరు 23వ తేదీన తిరుమల తిరుపతి దేవస్థానాల ఆధీనంలో చేర్చబడింది.

## ఆలయనిర్మాణం

తూర్పుముఖంగా నిర్మించబడిన ఈ ఆలయం చుట్టూ ఇటుకలతో కట్టిన విశాలమైన ప్రాకారం వుంది. ప్రవేశద్వారం వద్ద మహాద్వార గోపురం కట్టడానికి అనువుగా నిర్మించబడ్డ రాతి చట్రం మాత్రమే మొండిగా నిలిచిపోయింది. ప్రవేశద్వారం దాటిన వెంటనే పది అడుగుల దూరంలో ధ్వజ

స్తంభం, దానిని ఆనుకొని గరుడని మండపం పడమటి ముఖంగా అంటే శ్రీప్రసన్నవేంకటేశ్వరునికి అభిముఖంగా వున్నాయి. ఈ గరుత్మంతుని విగ్రహం తిరుమల, తిరుపతి ఆలయాలలో వలెనే వున్నది.

మొదటి ప్రధాన ప్రాకారం తర్వాత అసంపూర్తిగ నిలిచిపోయిన మరో ప్రాకారం ఆలయం చుట్టూ వుంది. దీని ఎత్తు కేవలం రెండడుగులు మాత్రమే.

ఈ రెండవ ప్రాకారంలోపల ప్రదక్షిణ ఆవరణలో స్వామివారి గర్భాలయానికి నైరుతి మూలలో శ్రీ పద్మావతి అమ్మవారి చిన్న గుడి, వాయవ్యములలో నిలువెత్తు శ్రీ గోదా లక్ష్మి (ఆండాళ్) గుడి వున్నాయి. ఇచ్చటి పద్మావతీ అమ్మవారి విగ్రహం తిరుచానూరులో కంటె పెద్దది.

ప్రాకారాలమధ్య గరుడని మందిరానికి ఎదురుగా ప్రధాన ఆలయం వుంది. ఇది ముఖమండపం, అంతరాళం, గర్భాలయం అని మూడు భాగాలుగా నిర్మింపబడింది.

చతురస్రాకారం కలిగిన ముఖమండపంలో 16 రాతిస్తంభాలున్నాయి. ఈ ముఖమండపం మధ్యలో మూలవరులకు ఎదురుగా నాలుగు స్తంభాలమధ్య చతురస్రాకారపు వేదిక అమర్చబడివుంది. ఈవేదిక మీద ఉత్సవ మూర్తుల కొలువు, కల్యాణం నిర్వహింప బడతాయి. ఈ మండపంలోనే ఉత్తరం వారకు గోడకు ఆనుకొని వున్న వేదికపై ఆళ్వారుల విగ్రహాలు ప్రతిష్ఠించ బడినవాయి. వీరిలో రామానుజులవారి విగ్రహం కూడా వుంది.

ముఖమండపం దాటిన తర్వాత చిన్న అంతరాళం వుంది. దానితరువాత గర్భాలయం అంతరాళం కంటె అర అడుగు ఎత్తులో ఏర్పాటు చెయ్యబడింది.

గర్భాలయంలో శ్రీప్రసన్నవేంకటేశ్వర స్వామివారి నిలువెత్తు విగ్రహం ప్రతిష్ఠింపబడింది. తిరుమలలోవలెనే స్వామి చతుర్భుజుడై శంఖ చక్రాలు ధరించి కటిహస్తంతో విరాజిల్లుతున్నాడు. తిరుమలస్వామి వరద హస్తుడై దర్శనమిస్తుండగా, అప్పలాయగుంటస్వామి అభయముద్రతో ప్రసన్నుడై దర్శనమిస్తున్నాడు. తిరుమల శ్రీవారి హృదయంలో వలెనే అప్పలాయగుంట స్వామివారి హృదయంలో కూడ మహాలక్ష్మి దేవికి సంకేతంగా "శ్రీవత్స" చిహ్నం వుంది.

ఇక్కడ కూడ వైఖానసాగమం ప్రకారం అర్చనలు జరుగుతున్నాయి.

ఈ గర్భాలయంలో మూలమూర్తి కాకుండా శ్రీదేవి భూదేవి సమేత శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామివారి ఉత్సవ విగ్రహాలు సుమారు 3 అడుగుల ఎత్తు గలవి వున్నాయి. ఇవికాక చక్రత్తాళ్వారు, విష్వక్సేనులు, భాష్యకారుల ఉత్సవ విగ్రహాలు కూడ ఈ ఆలయంలో నెలవై వున్నాయి.

తిరుమల తిరుపతి ఆలయాలవలెనే అప్పలాయగుంట గర్భాలయం మీద ఏక కలశ గోపురం నిర్మింప బడింది. ముఖమండపం, అంతరాళం, గర్భాలయం ఈమూడూ రెండు అడుగుల అధిష్ఠానంపై నిర్మింప బడ్డాయి.

మొదటి ప్రాకారం లోపల ప్రవేశం ద్వారానికి ఎడమవైపు ఆగ్నేయమూలకు వంటశాల, యాగశాలలు వున్నాయి. వంటశాలలో తిరుమలలో వలెనే వకుళమాలిక విగ్రహం వుంది.

ప్రాకారాన్ని దాటి వెలుపల ఆలయానికి ఎదురుగా సుమారు 100 గజాల దూరంలో శ్రీప్రసన్న ఆంజనేయస్వామివారి ఆలయం వుంది. ముఖమండపం, గర్భాలయం అని రెండుభాగాలుగా నిర్మింపబడిన ఈ ఆలయంలో తిరుమల, తిరుపతి ఆలయాలలో వలెనే నిలువెత్తు ఆంజనేయ స్వామి చేతులు జోడించి శ్రీప్రసన్నవేంకటేశ్వరునికి అభిముఖంగా నిలిచి వున్నాడు. ఈ ప్రసన్నాంజనేయ స్వామి ఇష్టార్థ ప్రదాతగా ప్రసిద్ధిపొంది ప్రతి ఆదివారం పంచామృతాభిషేకం, పూలంగి సేవలు జరిపించుకుంటున్నాడు.

శ్రీప్రసన్న వేంకటేశ్వర- ఆంజనేయ స్వామి ఆలయాలమధ్య దక్షిణం వారకు విశాలమైన వాహనమండపం వుండినట్లు తెలియ వస్తున్నది. అది శిథిలం కాగా ప్రస్తుతం వాహనాలను ఆలయముఖ మండపంలో పెట్టారు.

## ఉత్సవాలు

ప్రతి సంవత్సరం జ్యేష్ఠ మాసంలో శ్రవణ నక్షత్రంనాటికి ముగిసేట్లుగా పది రోజులపాటు అప్పలాయగుంట వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవాలు వైభవంగా జరుగుతాయి. వీనిలో గరుడోత్సవం - రథోత్సవం అత్యంత ప్రధాన ఉత్సవాలు - చివరిరోజున శ్రవణం రోజున దేవాలయం ఎదురుగావున్న ఈశాన్య మూలకు వున్న గుంటలో చక్రస్నానం జరుగుతుంది. ప్రతిరోజు డోలోత్సవాలు జరిపిస్తారు. బ్రహ్మోత్సవాలుకాక వైకుంఠ ఏకాదశి నాడు, ఊరేగింపు, వైకుంఠద్వాదశినాడు చక్రస్నానం జరుపుతారు. ఉగాది నాడు ఆస్థానం, కొలువు, పంచాంగశ్రవణం ఘనంగా జరుపబడతాయి. ప్రతిరోజు భక్తులు అర్చనలు నివేదనలు చేయించవచ్చు. ప్రతి శుక్రవారంనాటి ఉదయం - అభిషేకం జరుపబడుతుంది.

ఇలాగ అప్పలాయగుంట శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి ప్రాచీనకాలంనుంచీ కార్వేటి నగర రాజుల ఏలుబడిలో రోజు కొక వైభోగంగా, అంగరంగా వైభవంగా ఉత్సవాలతో, ఊరేగింపులతో వెలిసినాడు.

ఇటీవల తిరుమల తిరుపతి దేవస్థానంలో విలీనమైన ఈ అప్పలాయగుంట దేవాలయం మళ్లీ పూర్వపు ఔన్నత్యాన్ని సంతరించుకుంటుందనడంలో ఏమాత్రం సందేహం లేదు.

తిరుమల యాత్రికులు, ఈ ప్రసన్న వేంకటేశ్వరుని దర్శించడానికి వీలుగా తిరుపతినుంచి ఆర్.టి.సి బస్సులు నడుపబడుతున్నాయి.



# ఐటన్ దొరను అనుగ్రహించిన యోగి ఈశాన్య దేశికులు

శ్రీ రావినూతల శ్రీరాములు

తమిళ దేశంలోని అనేక ప్రసిద్ధ పుణ్య క్షేత్రాలలో తిరువణ్ణామల ఒకటి. దీనినే 'అరుణాచలం' అంటారు. ఇక్కడి శివునికి అరుణాచలేశ్వరుడనీ అమ్మవారికి అపీత కుచాంబ అనిపేర్లు. సాక్షాత్తు శివుడే గిరిరూపంలో ప్రత్యక్ష మైనందున 'గిరి ప్రదక్షిణ' ఇక్కడి క్షేత్ర విధి. ప్రతి ఏటా కార్తీక పూర్ణిమ నాడు అరుణగిరి శిఖరంపై జ్యోతి వెలిగిస్తారు.

అనాది కాలం నుండి అరుణాచలం సిద్ధపురుషులకు నిలయం. ఈ శతాబ్దంలో నివసించిన రమణ మహర్షి కారణంగా తిరువణ్ణామల ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది.

18వ శతాబ్ది చివరి భాగంలో 'ఈశాన్య దేశికర్' అనే సిద్ధపురుషుడు అరుణాచలాన్ని పునీతం చేశారు. తేజో లింగంగా ఖ్యాతి గాంచిన అరుణాచలేశ్వరుని కోవెలకు అనతి దూరంలోనే ఈయన పేరిట వెలసిన మఠం ఈనాటికీ చూడవచ్చు.

పవిత్ర పాలార్‌నదీ తీరస్థమైన రాయవేలూరులో క్రీ.శ. 1750లో తిరునీలకంఠ దేశికులు ఉమాపార్వతి దంపతులకు ఇలవేల్పు సుబ్రహ్మణ్యస్వామి వరపుత్రుడై మగబిడ్డగా జన్మించాడు. స్వామి పేరిట అతనికి కందప్పన్ అని పేరుపెట్టారు. బాల్యం నుండే కందప్ప అత్యంత ప్రతిభ ప్రదర్శించేవాడు. చెప్పి చెప్పకముందే పాఠాలు వల్లించేవాడు.

పదునారవ ఏట తల్లిదండ్రులు తమ ఏకైక సంతానమైన కందప్పన్ కు పెండ్లి చేయాలని సంకల్పించారు. ఈశ్వరుని పట్ల లగ్న మనస్కుడైన కందప్ప పెండ్లి ఆటంకమని భావించి వారి కోరిక నిరాకరించాడు



తల్లిదండ్రుల అనుమతిని గైకొని కందప్పన్ పుణ్యక్షేత్రాల సందర్శనకు బయలుదేరాడు. చివరకు చిదంబర క్షేత్రంలో "మౌన స్వామి" అనేక పరీక్షలలో నెగ్గిన కందప్పకు 'దేశికులు' అనే పేరుతో సన్యాస దీక్షనిచ్చారు.

దేశాటన చేస్తూ దేశికులు తిరువణ్ణామల లోని గోరకనాథ్ తటాకం చెంత ధ్యాన నిమగ్నుడైనారు. సిద్ధసంఘాలు ఆయనను పరివేష్టించి సంరక్షిస్తూ వుండేవి.

దేశికుని సేవించిన వారిలో ముత్తుస్వామి ఉడయర్ ముఖ్యుడు; శిష్యు లెవరూ తన చెంతలేని సమయంలో అరవయ్యావ పడిలో పడిన దేశికుడు నగ్నంగా వుండేవాడు. అరుణాచలేశ్వరుడు పెద్దపులి రూపంలో ఆయనకు రక్షణ కల్పించేవాడు. ఎవరు ఎవరైనా సమీపిస్తున్నట్లు గమనించ గానే పెద్దపులిని తప్పుకోమనేవారు దేశికులు.

ముత్తుస్వామి ఉడయర్ అనేభక్తుని చొరవతో పట్టణానికి ఈశాన్య భాగాన వుండే పూంతోటలోని కొంతభాగం దేశికునికి తపోభూమిగా స్థిరపడింది. నాటినుండే స్వామి ఈశాన్య దేశికర్'గా ఖ్యాతి వహించారు.

పాశ్చాత్య ఉన్నత ఉద్యోగిని శిష్యునిగా స్వీకరించిన మొట్ట మొదటి తపస్వి ఈశాన్య దేశికులే !

## విజ్ఞప్తి

# శ్రీవారి ఆలయం, తిరుమల.

తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీవారి ప్రసాద పణ్యారములు, ఆర్జిత చేరువులు, పడుల ధరలు 27-7-92 నుండి ఈ క్రింది విధంగా వుంటాయి.

భక్తులు ఈ విషయాన్ని గమనించి ఆ యా మొత్తాలు చెల్లించ వలసిందిగా విజ్ఞప్తి.

| | | | |
|---|---|---|---|
| 1. | పొంగలి | $\frac{1}{4}$ పోల | రు. 225-00లు |
| 2. | చక్కెర పొంగలి | ,, | రు. 250-00లు |
| 3. | పులిహోర | ,, | రు. 200-00లు |
| 4. | దధ్యోదనం | ,, | రు. 100-00లు |
| 5. | శాకరి బాత్ | ,, | రు. 250-00లు |
| 6. | సీరా | ,, | రు. 450-00లు |
| 7. | పాయసం | ,, | రు. 225-00లు |

అయిటన్ అను తెల్లదొర తిరువణ్ణామల మొదలు వృద్ధా చలం వరకు గల ప్రాంతానికి ఆ దినాలలో జిల్లా కలెక్టరు. ఆయన క్షయ వ్యాధితో చాల కాలంగా బాధపడేవాడు. దేశికుని గూర్చి తెలిసికొని తిరువణ్ణామల వచ్చాడు. యథాప్రకారం పెద్దపులిని తప్పుకొమ్మని, దేశికులు కలెక్టరును తన చెంతకు అనుమతించారు.

అయిటన్ స్వామికి సాష్టాంగపడి తన బాధను విన్నవించుకొన్నాడు. దేశికులు చిరునవ్వు చిలికించి కొంతసేపటికి నేలపై దొర్లడం కన్పించింది. ఆ క్షణం నుండి అయిటన్ రోగ విముక్తుడైనాడు. ఆనందం పెల్లుబుకగా కలెక్టరు చేతులు జోడించి "స్వామీ నాకు వాలాభూములు మంజూరు చేసే అధికారం వున్నది. తమరు అంగీకరిస్తే కొన్ని భూములు సమర్పించుకుంటాను" అని వేడుకున్నాడు.

దేశికులు చిరునవ్వుతో "వీాభూములు కరవులో కూడా పంటలు పియ్యగలవా ? అంటూ తన వ్రేలితో అరుణాచలశిఖరం చూపుతూ "చూడూ, అక్కడ గృహస్థుడొకడు భార్యా బిడ్డలు పెద్ద పరివారంతో వున్నాడు. సన్యాసి నయిన నాకిచ్చే కంటే నీవు ఆ భూములేవో ఆయనకు చెందచేయడం సమంజసం" అంటూ ముగించారు.

సంతుష్టుడైన అయిటన్ స్వామి చెంత సెలవు తీసికొని వెళ్లి పోయాడు. దేశికులను అవకాశం చిక్కినప్పుడల్లా దర్శనం చేసికొనేవాడు. స్వామిని 'తాతా' అని సంబోధించేవాడు.

ఏకొత్తపని తలపెట్టినా "తాతా నాకు ఈ పనిలో సాయం చేయవా ! ఇది నీపనే" అనేవాడు.

దీపోత్సవ సమయంలో అరుణాచలేశ్వరుని రథం లాగుతూ కూడా అయిటన్ "నీవు త్రాడు పట్టుకొని మమ్మల్ని ముందుకు నడిపించవా" అని వేడుకొనేవాడు.

ప్రతి ఏటా రథోత్సవానికి అయిటన్ తప్పక విచ్చేసేవాడు. ఒక సంవత్సరం పాలార్ నది పరవళ్లు త్రొక్కుతూ ప్రవహిస్తున్నది. తన అశ్వం చెవిలో ఇలా చెప్పాడు అయిటన్. "నేను తాతను చూచి స్వామి వారి రథోత్సవంలో పాల్గొనాలి. వేగిరం అరుణాచలం నన్ను చేర్చు." నమ్మినబంటు యజమాని ఆజ్ఞ శిరసావహించిన రీతిని గుర్రం వెంటనే నదిలోనికి ఉరికింది. కలెక్టరు పరివారం భయభ్రాంతులైనారు. కానీ గుర్రం క్షేమంగా తన యజమానిని ఒడ్డుకు చేర్చింది.

ఈశాన్య మఠంలో అప్పటివరకు ధ్యానంలో వున్న దేశికులు దక్షిణం వైపుగా చేయి చాచారు. శిష్యులు అలా ఎందుకు చేస్తున్నారని స్వామిని ప్రశ్నించారు. "ఎవ రైనా నీటిలో పడితే మనం రక్షించవద్దా" అని సెలవిచ్చాడు స్వామి.

ఇంతలో కలెక్టరు అయిటన్ స్వామి చెంతకు విచ్చేసి అనుమతిని పొంది రథం లాగటానికి వెళ్లిపోయాడు.

కలెక్టరు అయిటన్ కు ప్రాణదానం చేసిన దేశికుని మహిమ అశేష జన సందోహం ఆశ్చర్యంగా చెప్పుకోసాగింది.

నాటినుండి వీరి సన్నిధికి వచ్చే భక్త సమూహం పెరగ నారంభించింది. చిత్తశుద్ధి గల శిష్యులను ఎంపిక చేసికొని దేశికులు వారికి ఉపదేశం చేశారు. సాధకులకోసం రచించిన వీరు "జ్ఞానకట్టవై" గ్రంథం పరమ ప్రమాణం కలిగి వున్నది.

నిండు వార్ధక్యంలో క్రీ.శ. 1829 మార్గశిరంలో 26 రోజున తన శరీరం వదలి వెళ్లారు దేశికులు. అంతకు ముందే ఒకతాటియాకు మీద ఆ తేదిని వ్రాసి పెట్టి తన ఆసనం క్రింద దాచి వుంచారు. "నటరాజస్వామి వేగాల్ల మండపంలోనికి వెడుతున్నారు. మనమూ వెళ్లవద్దూ" అని శిష్యులొకరికి తన దేహత్యాగాన్ని గూర్చి ముందు సూచన చేశారు.

సమాధి చేయుటానికి శరీరాన్ని తొలగిస్తూ క్రింద [illegible] తాటియాకును చూచి తమ గురువు కడపటి మహిమ గా దానిని తలపోశారు.



**యువవాణి**

# భౌతికం - ఆధ్యాత్మికం

శ్రీ మన్నన గిరిధరరావు

ఆధ్యాత్మికం అనగానే చాలామందికి బైరాగులు గుర్తుకు వస్తారు. దైవభక్తుల మని అనుకుంటూ ప్రపంచాన్ని నిర్లక్ష్యం చేసేవారు కాన వస్తారు. జీవిత సమస్యలను ఎదుర్కోలేక సన్యాసులైనవారు జ్ఞప్తికివస్తారు. ఇలా ఆధ్యాత్మికం అనేదానికి విపరీతార్థాలు ఏర్పడి వున్నాయి.

కాని ఆధ్యాత్మికమునకు సరియైన అర్థాలు ఇవి కావు. ఇన్నికోట్ల జీవరాసులనూ నడిపించే శక్తి, కదిలించే శక్తి, ఆలోచింప చేసేశక్తి వాటిలోనే అంతర్గతంగా వున్నది.

"ఏది కన్నులకు కనపడదో, దేనివలన కన్నులు చూచు చున్నవో అదియే పరబ్రహ్మ మని తెలుసుకొనుము" అని కేనోపనిషత్తు చెపుతుంది.

కారు నడుపువాడు డ్రైవరు అయినను నడిపించే శక్తి వేరేవున్నది. అది పెట్రోలు. అది కంటికి కనపడదు. లోపలవుండి నడిపించడానికి కావలసిన శక్తినిస్తుంది.

మనుష్యుడు కాళ్లతో నడుస్తూ వున్నాడు. ఐతే ఆ కాళ్లను నడిపించేశక్తి లోపలవున్నది. అది కంటికి కానరాదు - అదియే ప్రాణశక్తి.

ప్రతి మనిషికీ, జంతువుకూ, వృక్షాలకూ లోపల, బయట అని రెండు వున్నాయి. బయటికి కనిపించేది దాని శరీరము. లోపల వుండేది ప్రాణశక్తి.

బయటికి కనిపించే మోటారు కార్లు వేరు వేరు రంగులతో, గాజు తలుపులతో, కుషను సీట్లతో వున్నప్పటికీ అన్నిటిని నడిపించే పెట్రోలు ఒకే విధంగా వుంటుంది.

అలాగే ప్రాణికోటి యొక్క రూపు రేఖలు వేరైనా అన్నిటిలో వుండి నడిపిస్తున్న ఆత్మశక్తి ఒకే విధంగా వున్నది.

అందుకే శ్రీ గుడిపాటి వెంకట చలం ఇలా వ్రాశారు: "పై పైన చూచిన కొద్దీ సృష్టిలో ప్రతిదానికీ ఒకదానినుండి ఇంకో దానికి భిన్నత్వం ఎక్కువగా కనపడుతుంది. లోతుగా చూడగలిగిన కొద్దీ భిన్నం చేయ డానికి వీలులేని ఏకత్వం తోస్తుంది. ఆ ఏకత్వమే భగవంతుడు."

దీనికి చక్కని ఉదాహరణ బంగారు నగలు, చూడడానికి చంద్రహారము, గాజులు, చెవికమ్మలు, ఉంగరాలు - ఇలా వేర్వేరు రూపాలలో కానవస్తాయి. కాని వీటిని లోతుగా పరిశీలించి చూస్తే అంతటా బంగారమే కానవస్తుంది. అదే పరమసత్యం. అది దాల్చిన రూపములన్నీ తాత్కాలిక సత్యాలు.

లోపలవున్నది ఆధ్యాత్మికం. బయటకు కనిపించేది భౌతికం. తీగెలో విద్యుచ్ఛక్తి వున్నది. తీగె భౌతికం, విద్యుత్తు ఆధ్యాత్మికం. ఈరెంచూ పరస్పర విరుద్ధములుకావు. విద్యుత్తు కనిపించదు, తీగె కనిపిస్తుంది. తీగె



## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు-- ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయటం వలన ఉపయోగం వుండదు.
- రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

**సంపాదకులు**
**సప్తగిరి**
**తి.తి. దేవస్థానములు**
**తిరుపతి - 517 507**

లేకుండా విద్యుత్తు ప్రవహించదు, విద్యుత్తు లేకుండా తీగె నిరుపయోగం.

భౌతిక ఆధ్యాత్మికములు రెండింటికీ నడుమ మనస్సు అనేది సింహద్వారం. మనస్సు లోపలికి త్రిప్పితే ఆధ్యాత్మికం, బయటికి త్రిప్పితే భౌతికం.

మానవుడికి భౌతికంగా కానవచ్చే శరీరము, దాని అవసరాలు, దానికొరకు తాపత్రయపడం - ఇవిమాత్రమే చాలు కదా. లోపల వున్నవాటి గురించిన ఆలోచన ఎందుకు? ఇదే అసలైన ప్రశ్న!

ఈ శరీర అవసరాలు, శారీరక సుఖం అనేవి లోపలవున్న మనస్సు, బుద్ధి, ఆత్మ అనబడే మూడింటితో పెనవేసుకొని వున్నాయి. ఈ సత్యం ఎప్పుడోగాని అర్థం కాదు.

ప్రతి మనిషిలోనూ నలుగురు మనుషులున్నారు ! ఆ నలుగురూ ఎవరో ముందు గ్రహించాలి.

"నేను భోజనము చేస్తున్నాను... నేను రేడియో వింటున్నాను... నేను పుస్తకం చదువుచున్నాను" - ఇక్కడ నేను అనగా ఇంద్రియము లతోగూడిన దేహము. ఇచట నేను అనగా శరీరము.

"నాకు పెండ్లి చేసుకోవలెనని యున్నది. నాకు ఉద్యోగము చేయవలెనని యున్నది. నేను ఎం.ఏ. చదువగోరుచున్నాను" ఇక్కడ నేను అనగా మనస్సు. అది కోరికలను కోరుతూవుంటుంది.

"నేను ఉద్యోగం చేయాలో వద్దో నిర్ణయించుకోలేదు. నేను అమెరికావెళ్లాలో ఇక్కడే వుండాలో తేల్చుకోలేదు" అన్నపుడు నేను అనగా బుద్ధి. అది తాను ఏమిచేయాలో నిర్ణయిస్తూ వుంటుంది. అది న్యాయమూర్తి వంటిది.

"నేను ఉన్నాను" - ఇచట నేను అనగా ఆత్మ. తన ఉనికిని వెల్లడించేది ఆత్మ. అది లేకపోతే శరీరం కాస్తా శవం అయిపోతుంది.

శరీరము, మనస్సు, బుద్ధి, ఆత్మ - వీటి నడుమ సమన్వయ సహకారము లున్నపుడు జీవితం సుందరంగా వుంటుంది. అందుకై భౌతిక ఆధ్యాత్మికముల నడుమ సమన్వయం కావాలి.

శరీరము కొరకు అర్థము. మనస్సుకొరకు కామము, బుద్ధికొరకు ధర్మము, ఆత్మ కొరకు మోక్షము అనే నాలుగు లక్ష్యములను సనాతన ధర్మము మన ముందుంచినది.

నాకు ఆహారం కావాలి. ఇది శారీరక అవసరం.

నాకు ఆహారం ఒక్కటే చాలదు. ఇతరులు నన్ను ప్రేమించాలి. నేను నా భార్యాబిడ్డలను ఆప్యాయతతో స్వీకరించాలి. నాస్నేహితులు నన్ను ఆదుకోవాలి. నాకు ప్రేమకావాలి. ఇది మానసిక అవసరం.

నేను ఇతరులతో వ్యవహరించేటపుడు, నేను ఇతరులతో మెలిగేటపుడు ఒక ప్రవర్తనా నియమావళికావాలి. మనం సద్బుద్ధితో మెలగాలి. ఇదిధర్మం.

నాకుగల భౌతిక సంపదలో ఒక పూచికపుల్ల గూడ నావెంట రాదు. ఎప్పటికైనా మరణించక తప్పదు. కనుక భౌతిక విషయాలమీద మమకారం పెంచుకోవడం దుఃఖ కారణ మవుతుంది. కనుక ఐహిక భోగముల యెడ వ్యామోహము వదలుకోవాలి. మోహరాహిత్యమే మోక్షము.

ఇట్టి వివేకము కలుగుటకు భౌతిక ఆధ్యాత్మికముల నడుమ సమన్వయము అవసరము. ఈ రెండింటిలో ఏదీ తృణీకరింపతగినదికాదు.



# కాకతీయరాజులనాటి శాసన విశేషాలు

డా॥ ఎ.కె.వి.ఎస్.రెడ్డి
అనువాదం : జి. శ్రీమతి

(గత సంచిక తరువాయి)

క్రీ.శ. 1222, క్రీ.శ. 1236 కృష్ణా జిల్లా గుడివాడకు చెందిన శాసనాలు, కుండ మహేశ్వరాలయాన్ని మహాసామంత నామి రెడ్డి నిర్మించినట్లుగా తెలుపుతోంది. బహుశా ఈ స్వామికి ఆ పేరు గణపతి సోదరి అయిన కుండమాంబ పేరు మీదుగా స్థిరపడి ఉండ వచ్చును. ఈ శాసనాన్ని భీమేశ్వరాలయం కుడి తలుపువద్ద గల స్తంభం మీద చూడ వచ్చును. క్రీ.శ. 1243 అదే ప్రాంతానికి చెందిన శాసనం చెపుతున్న అంశమేమనగా, ఈ దేవాలయం 'మల్లెబోయ' అనే శిల్పిచేత చెక్కబడింది. ఈ దేవాలయం కాకతీయుల కాలంలో ప్రఖ్యాతి వహించింది. ఈ ఆలయా నికి ఎన్నో భూములు దానంగా ఇవ్వబడ్డాయని కూడ తెలుస్తోంది. ఈ ఆదాయంలో ఆ దేవాలయంలోని స్వామికి పూజాదికాలను నిర్వర్తించేవారు. మరియు దేవాలయ సిబ్బం దికి జీతాలు కూడ చెల్లించేవారనడాన్నిబట్టి, ఆ కాలంలో ఈ దేవాలయం చెప్పుకోదగ్గ ఉనికిని కలిగివుండేదని తెలుస్తోంది.

క్రీ.శ. 1229 గుంటూరు జిల్లా పొత్తూరుకు చెందిన శాసనం, పరిచ్ఛేది రాజైన భీమ రాజు, గోపాలస్వామిని ప్రతిష్ఠ గావించినట్లు, మరియు దేవాలయాన్ని (శ్రీ విమానం) నిర్మించినట్లు తెలుస్తోంది. వేణుగోపాల స్వామి ఆలయానికి ముందు వైపుగల గరుడ స్తంభంమీద ఈ శాసనం చెక్కబడివుంది.

క్రీ.శ. 1231 కృష్ణాజిల్లా గణపేశ్వరానికి చెందిన శాసనం కూడ మంచి ప్రాశస్త్యాన్ని పొందింది. ఈ శాసనం, ద్వీప (ఆధునిక దివి - గణపేశ్వరం సమీపం - కృష్ణాజిల్లా)లో సేనాధిపతి అయిన జాయపచేత గణపేశ్వర లేక గణపతీశ్వర దేవాలయం నిర్మించిబడినట్లు తెలుస్తోంది. ఈ స్వామికి కాకతీయరాజు గణపతి తర్వాత ఆ పేరు ఏర్పడింది. ఈ శాసనం వల్ల, కాకతీయ రుద్ర I శివాలయాలను పెక్కింటిని ఓరుగల్లులో (ఆధునిక వరంగల్) నిర్మించినట్లు తెలుస్తోంది. ఇంకనూ నారాయణ, జాయపసేనాని తాతగారు ద్వాపాను పట్టణంగా రాజనివాస యోగ్యంగా తీర్చిదిద్దారు. అంతకు మునుపు ఇది నివాస యోగ్యంకానిదిగా వుండేది. ఈ శాసనం ఆ పట్టణంలోని అందమైన భవనాలు, రాజ గృహాలను గురించి వర్ణిస్తోంది. (సౌధాట్టాలక హర్మ్య గోపుర బృహత్ ప్రాకార బాస్వత్ పురం ద్వీపం) ఆ ద్వీపలో అతడు చోడ సముద్ర చెరువును, చోడేశ్వర, భీమేశ్వరాలయాలను నిర్మించారు. చోడేశ్వర, చోడసముద్ర ఆలయాలు అతని ప్రభువు మీదుగా, భీమేశ్వరాలయం అతని తండ్రి పేరుమీదుగా నిర్మించాడు. మరియు వడ్లకుర్రు గ్రామంలో భీమేశ్వర సముద్ర అనే చెరువును, భీమేశ్వరాలయాన్ని నిర్మించాడు. ఇవియే గాకుండా నారాయణ, విష్ణు, కరాల భైరవ (భైరవకు చెందిన భయానక రూపం), మహాకాళి, బందులదేవిలకు దేవాలయాలను నిర్మించాడు. అందులో చివర తెలుపబడి నామె గ్రామదేవత. బందులదేవి దేవత ఆంధ్రదేశానికి క్రొత్త మరియు ఈమె ఇంకే ఇతర శాసనాల్లోను చెప్పబడలేదు. ఈ దేవత గురించిన ఖచ్చితమైన విషయాలేవీ మనకు తెలియడం లేదు.

క్రీ.శ. 1241 వరంగల్ జిల్లా కొండపర్తికి చెందిన శాసనం, మలయ కుటుంబానికి చెందిన కాటయ, రుద్రేశ్వరాలయాన్ని, కేశవ దేవాలయాన్ని నిర్మించినట్లు, మరి రెండు



దేవాలయాలకు ప్రాకారాన్ని నిర్మించినట్లు తెలుస్తోంది. ప్రోలేశ్వరాలయం ఉనికి కూడ మనకు గోచరిస్తుంది. ఈ మూడు దేవాలయాలు కలిసే త్రికూట అయింది. ప్రాకారం నల్ల రాతితో గొప్ప శిల్పులచేత పటిష్ఠంగా నిర్మించబడింది.

క్రీ.శ. 1246 మహబూబ్‌నగర్ జిల్లా, వర్ధమాన పురానికి చెందిన శాసనం, మలయ కుటుంబానికి చెందిన గుండయ నాగేశ్వరాలయాన్ని నిర్మించి, గోపురం, మండపాలను సైతం అమర్చినట్లు స్పష్టమవుతోంది. దేవాలయం సమీపంలో గల స్తంభం మీద ఈ శాసనం చెక్కబడివుంది.

క్రీ.శ. 1247 కడపజిల్లా జ్యోతికి చెందిన శాసనం, ఆ ప్రాంతాన్ని రక్కస గంగదేవ పాలించే కాలంలో, కాకతీయ గణపతికి సామంతుడైన ఒకానొక రామినాయక ప్రాకారాన్ని, గోపురాన్ని జ్యోతినాథాలయానికై నిర్మించినట్లు తెలుస్తోంది. మరియు గ్రామదేవతైన ఇరుగలసానికై ఒక ఆలయాన్ని అతడు తక ప్రోలు గ్రామంలో నిర్మించినట్లు అంతేగాక బేలూరు గ్రామంలో మరియొక దేవాలయాన్ని సైతం నిర్మించినట్టు తెలుస్తోంది. మనకు ఈ ఎరుకలసాని ప్రాముఖ్యతను గురించి తెలియనప్పటికీ ఈమె సతీసహగమనాన్ని ఆచరించినట్లు తెలుస్తోంది. కాని మధ్య యుగ కాలంలో ఆంధ్రదేశంలో సతీ సహగమనం ఆచరణలో వున్నట్లు శాసనాధారాలేవీ మనకు గోచరమగుట లేదు. సతి ఆచారాన్ని ఎవరైతే ఆచరిస్తారో ఆ స్త్రీలను పేరంటాండ్రు లేక పేరంటాళ్లు అని పిలిచేవారు. అటువంటి వారిని కుటుంబదేవతలుగా లేక గ్రామదేవతలుగా పూజించేవారు. జ్యోతినాథాలయంలోని రాతిమీద ఈ శాసనం చెక్కబడివుంది.

క్రీ.శ. 1254, గుంటూరుజిల్లా ఇనుమెల్లకు చెందిన శాసనం, కాలపనాయక చెన్నకేశవస్వామిని ప్రతిష్ఠ చేసినట్లు మరియు ఇనుమడాలలో 'తిరుముట్టము'ను (ఆలయం) తన ప్రభువులైన వీరయదేవ కాకతీయ గణపతులకై నిర్మించినట్లు తెలుస్తోంది. మరియొక శాసనం అదే స్థలంలోనిది తెలియచేస్తున్న దేమనగా, అదే వ్యక్తి సోమేశ్వరాలయానికి మండపాన్ని రుద్రయదేవ అమ్మగారి కొరకై నిర్మించాడు. ఆమె కాకతీయ రుద్రమే అయివుండవచ్చును.

క్రీ.శ. 1261 కాకతీయ రుద్రమకు చెందిన మల్కాపురం శాసనం చెపుతున్న దేమనగా, గోపాలనాథుని ప్రతిష్ఠ జరిగినట్లు, వివిధ సంస్థలతో పాటు ఆలయనిర్మాణం జరిగినట్లు తెలుస్తోంది. ఇంకనూ వివరిస్తున్న విషయమేమనగా, కాకతీయ గణపతి ఆధ్యాత్మిక గురువైన విశ్వేశ్వర గోలకి మరియు దేశంలోని వివిధ కులాలకు చెందిన వ్యక్తులు కలిసి విశ్వేశ్వరాలయాన్ని, ఒక సంస్కృత కళాశాలను, శైవులకొరకై ఒక మఠాన్ని, ఉచిత అన్నదాన గృహాన్ని వివిధ కులాలకు, మతాలకు చెందిన వారికై నిర్మించడం జరిగింది. మరియు అతడు ఈ సంస్థల నిర్వహణకై కొంత భూమిని కూడ ఏర్పాటు గావించాడు. ఈ శాసనాలు, శైవగురువు పలు శివలింగాల ప్రతిష్ఠ వివిధ ప్రాంతాలలో గావించినట్లు చెపుతున్నాయి. బహుశా ఈ దేవాలయం సమ్మోజు కుమారుడైన శిల్పి ఆచార్య గుడ్డోజు చేత నిర్మించబడి వుండవచ్చును. ఆ గ్రామంలోని పాడుబడిన ఆలయం సమీపంలో వున్న నంది స్తంభం మీద ఈ శాసనం చెక్కబడివుంది.

క్రీ.శ. 1262 గుంటూరుజిల్లా, పెదకాకానికి చెందిన శాసనాన్ని ఆ గ్రామంలోని గోపాలాలయం ముందువైపు చూడవచ్చును. ఈ శాసనం, కిరీటి గోపీనాథ ప్రతిష్ఠ జరిగినట్లు, ఆ స్వామికై ఒక ఆలయాన్ని కోటికకండిలో నిర్మించినట్లు తెలుస్తోంది. అదే గ్రామంలో కృష్ణస్వామి ప్రతిష్ఠ జరిగినట్లు కూడ తెలుస్తోది.

కాకతీయ గణపతికి కుమారులు లేరు. అతడు తన కుమార్తె రుద్రమను వారసురాలిగా ప్రకటించాడు. ఆమె క్రీ. శ. 1259-60 వరకు రాజ్యపాలన గావించింది. ఆమె క్రీ.శ. 1262లో సింహాసనాన్ని అధిష్ఠించింది. పలు శాసనాలు ఆమెను పురుష నామధేయమైన "రుద్రదేవ మహారాజ"గా తెలుపుతున్నాయి. ఆమె తండ్రిలాగే ఆమె కూడ గాఢ శివభక్తురాలు. ఆమె తన జీవితకాలంలో పెక్కు శివాలయాలను నిర్మించింది.

క్రీ.శ. 1264కి చెందిన శాసనం, గండపెండారు మేయి దేవరాజు పరిపాలించే కాలంలో ఒకానొక అన్నిరెడ్డి, సురేశ్వర దేవాలయానికి ప్రాకారం (కలుకోట) మరియు గోపురాన్ని నిర్మించినట్లు తెలుస్తోంది. గుంటూరు జిల్లా కారెంపూడిలో సురేశ్వరాలయంలోని మండపంలోగల స్తంభం మీద ఈ శాసనం చెక్కబడివుంది. శాసనంలో చెప్పబడిన ఆలయం ఇదేనని తెలుస్తోంది.

శైవమతం రుద్రమకాలంలో బాగా పోషించబడిందని, అంతేగాక వైష్ణవాలయాల నిర్మాణం సైతం జరిగిందని తెలుస్తోంది. ఉదాహరణకు క్రీ.శ. 1265, నల్గొండజిల్లా, ఆలుగడపకు చెందిన శాసనం చెపుతున్న దేమనగా, ఆలుగడప గ్రామంలో నలుగురు వ్యక్తులచేత ఆ గ్రామ మధ్యంలో 'వరద గోపీనాథాలయం' నిర్మించబడినట్లు తెలుస్తోంది. అదే శాసనం వివరిస్తున్నదేమనగా, అదే గ్రామంలో తూర్పువైపుగా త్రిపురాంతక దేవాలయం సైతం నిర్మించబడిందని చెపుతోంది.

గుంటూరుజిల్లా కొలలపుడి గ్రామంలో గల చెన్నకేశవాలయం ముందువైపు స్తంభం మీద ఒక శాసనం చెక్కబడి వుంది. దీని నిబట్టి మనకు తెలుస్తున్న విషయమేమనగా, ఈ దేవాలయం క్రీ.శ. 1267లో నిర్మించబడినట్లు, ఆ స్వామి కుమారగోపీనాథ అని అర్థమవుతోంది. ఈ శాసనం ఇంకనూ వివరిస్తున్న విషయమేమనగా, ఈ స్వామిని వల్లభరాజు ప్రతిష్ఠచేసి, నేలసుంకరి చెరువు వెనుక వైపుగల భూమిని ఈ దేవాలయానికై దానం గావించినట్లు తెలుస్తోంది.

క్రీ.శ. 1269కి చెందిన శాసనం, కరణం నామయ గోపీనాథస్వామిని పల్లినాదులోని దుగ్గ్య గ్రామంలో ప్రతిష్ఠ చేసినట్లు తెలుపుతోంది. అంతేగాక ఈ శాసనం ఈ దేవాలయానికి విరివిగా దానం చేయబడిన భూముల గురించి, దేవాలయాల ఉద్యోగుల గురించి కూడ చెపుతోంది. ఈ శాసనాన్ని గుంటూరు జిల్లా, దుర్గి గ్రామంలో

గోపాలస్వామి ఆలయంలోని రాతిమీద చూడ వచ్చును.

క్రీ.శ. 1270 పెద్ద గంజాం గ్రామం లోని ఒక శాసనం, శెట్టికులానికి చెందిన వ్యక్తి తన తండ్రి పిన్నిశెట్టి పేరుమీదుగా పిన్నేశ్వర స్వామిని ప్రతిష్ఠగావించినట్లు తెలుపుతోంది. గుంటూరుజిల్లాలోని విశ్వేశ్వరాలయంలోని స్తంభంమీద ఈ శాసనం చెక్కబడి వుంది. ఈ ఆలయం క్రీ.శ. 1270లో నిర్మించబడినట్లు పిన్నేశ్వర స్వామియే విశ్వేశ్వరస్వామిగా చెప్పబడినట్లు తెలుస్తోంది.

క్రీ.శ. 1271 శిథిలావస్థలో వున్న శాసనం, రుద్రమ అంగరక్షకులైన 'నగరి శ్రీ వాకిలి', 'అంగరక్షక' పేర్లుగల అధికార్లు కేశవస్వామిని ప్రతిష్ఠ గావించినట్లు, ఆ ప్రతిష్ఠ వారి తండ్రిగారైన మేలినాయక పేరుమీదుగా మూల్పూరు గ్రామంలో గావించినట్లు తెలుస్తోంది. ఈ శాసనం గుంటూరుజిల్లా మూల్పూరులోని చెన్నకేశవాలయం ఉత్తరం వైపు గోడమీద గల రాతిమీద చెక్కబడివుంది. శాసనంలో చెప్పబడిన ఆలయం ఇదియే.

పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లులో క్షీరా రామేశ్వరాలయంలోని స్తంభంమీద చెక్కబడిన శాసనం చెపుతున్న విషయమేమనగా, నాట్యమండపం తూర్పు ద్వారానికి కంచుతో తలుపులు చేయించబడింది. ఈ శాసనం క్రీ.శ. 1276 కు చెందింది.

క్రీ.శ. 1277 మహబూబ్‌నగర్‌జిల్లా బోధ్‌పూర్ గ్రామానికి చెందిన శాసనం, మల్యాల గుండ మరణించిన తర్వాత అతని భార్య కుప్పాంబిక "బుదునూరు" గ్రామంలో ఒక ఆలయాన్ని నిర్మించినట్లు మరియు లింగ ప్రతిష్ఠ గావించినట్లు తెలుపుతోంది. కుప్పాంబిక పలు దాన శాసనాలు ఈ దేవాలయానికి తన కుమారులు, బంధువుల పేరు మీదుగా గావించినట్లు తెలుస్తోంది. బొదునూరులో ప్రస్తుతం లింగప్పాలయంగా పిలువబడే ఒక ప్పటి ఈశ్వరాలంలోని అంతరాళ గోడ మీదగల రాతిఫలకం మీద ఈ శాసనం చెక్కబడివుంది. శాసనంలో తెలుపబడిన ఆలయం ఇదియే. ..

గుంటూరుజిల్లా రావిపాడుకు చెందిన శాసనాన్ని ఆ గ్రామంలోని రామలింగేశ్వరాలయానికి ముందువైపుగల విరిగిపోయిన నందిస్తంభం మీద చూడవచ్చును. ఈ శాసనం ఆసక్తి కలిగించే పలువిషయాలను వెల్లడిచేస్తోంది. సురేశ్వరాలయ నిర్మాణం అంటే శాసనంలో చెప్పబడిన 'త్రికూటము - ఇండ్లు' మరియు మండపం సామంత రాజైన పోలినాయకచేత నిర్మించబడింది. ఆయన తండ్రిపేరు మీదుగా ఈ దేవాలయాన్ని నిర్మించినట్లు ఆయన తెలుపుకున్నాడు. ఈ దేవాలయం త్రికూటాలయంగా వర్ణింపబడింది. అయితే గమనించాల్సిన అంశమేమనగా ఈ శాసనంలో ఇతర దేవుళ్ల పేర్లు తెలుపబడలేదు.

క్రీ.శ. 1280-81 కృష్ణాజిల్లా మల్లవోలుకు చెందిన శాసనం, ఆ గ్రామంలోని చిన్మయేశ్వరాలయంలోని ధ్వజస్తంభం సమీపంలోగల నంది స్తంభంమీద చెక్కబడి వుంది. చిన్మయేశ్వరాలయాన్ని కాశీముపడోజు నిర్మించుటయే గాకుండా పలుకానుకలను కూడ అర్పించుకున్నాడు. కాసె నాగోజు ఆ దేవాలయానికి స్తంభాలు నిర్మించాడు. ఈ శాసనం సూచిస్తున్న విషయమేమనగా, చిమ్మీశ్వరాలయం ప్రస్తుతం పిలువబడే చిన్మయేశ్వరాలయం క్రీ.శ. 1280-81 సంవత్సరంలో నిర్మించబడింది. కాని ఇప్పుడు చిన్మయేశ్వర అని పిలువబడేది సంస్కృత పదమైనటువంటి చిమ్మీశ్వర నుండి రూపాంతరం చెందింది. ఈ పదం ఒకప్పుడు పిలువబడే చిమ్మీశ్వర అనుకొనడానికి ఆస్కారముంది. మహబూబ్‌నగర్ జిల్లా శాసనం నందలి -- ఉమామహేశ్వరాన్ని ప్రసిద్ధి శైవక్షేత్రమైన శ్రీశైలానికి ఉత్తర ద్వారంగా చెపుతోంది. ఇచట శాసనాలను బట్టి చూస్తే ఉమామహేశ్వరంలో క్రింద చెప్పబడిన దేవాలయాలు నిర్మించబడినట్లు మరియు ఆ దేవాలయాల నిర్వహణకు మిక్కిలిగా దాన శాసనాలు ఏర్పాటు చేయబడినట్లు తెలుస్తోంది.

1. కాకతీయ రాణి రుద్రమ తర్వాత ఏర్పడిన పంపులిగండ రుద్రేశ్వరాలయం రాజకోశాధికారైన కరణం రామయ చేత నిర్మించబడింది.
2. రామనాథ దేవాలయం
3. చెన్న సోమనాథదేవ
4. చెన్నమల్లినాథదేవ
5. పోచేశ్వర దేవ.

2 నుంచి 5 వరకు చెప్పబడిన ఆలయాలు పైన తెలుపబడిన కరణం రామయ భార్య అయిన మల్లసానమ్మ చేత నిర్మించబడ్డాయి. మరియు ఈ శాసనం వివరిస్తున్న విషయమేమనగా, తొమ్మిది లింగాలకు తొమ్మిది గర్భగుళ్ళు, ఐదులింగాలకు ఐదుగర్భగుళ్లు మరియు ఉమామహేశ్వరాలయానికి పెండ్లి-మేడ (కల్యాణమండపం)ను నిర్మించినట్లుగా కూడ తెలియచేస్తోంది. క్రీ.శ. 1280కి చెందిన ఈ శాసనం దిగువ ఉమామహేశ్వరాలయంవద్దగల రాతిమీద చెక్కబడివుంది.

కాయస్థ రాజైన 'త్రిపురారిదేవ' పేరు మీదుగా శివాలయాన్ని ఒకానొక స్త్రీ నిర్మించినట్లుగా కడపజిల్లా 'అక్కలరెడ్డిపల్లి' శాసనం చెపుతోంది. క్రీ.శ. 1283కు చెందిన ఈ శాసనం మల్లికార్జునాలయానికి ముందువైపు గల రాతిమీద చెక్కబడివుంది. ఈ ఆలయం ఆ గ్రామానికి 4 కి.మీ. దూరంలోగల గోసంగి పర్వతం మీద నెలకొనివుంది.

కడపజిల్లా అత్తిరాలకు చెందిన శాసనం చెపుతున్న విషయమేమనగా, కాయస్థ రాజైన అంబదేవ ఒక మండపాన్ని, అరటురేవులలో గల పరమేశ్వరాలయంలో నిర్మించినట్లు తెలుస్తోంది. ఈ శాసనం పరశురామేశ్వరాలయం గోడమీద గల రాతిపైన చెక్కబడివుంది. శాసనంలో చెప్పబడిన ఆలయం ఇదియే.

చందుపట్ల శాసనం, కాకతీయ రుద్రమ బహుశా క్రీ.శ. 1289 ప్రాంతంలో పందువయసైన ఎనభైలో మరణించి వుండవచ్చునని చెపుతోంది. ఆమె మనవడు ప్రతాపరుద్ర ఆమె తదనంతరం సింహాసన మధిష్ఠించారు. ఇతని పాలన కాలంలో పెక్కు యుద్ధాలు సంభవించాయి. ముఖ్యంగా ఢిల్లీనుంచి మహమ్మదీయుల దండయాత్రలు మొదలైనాయి. కాని దేవాలయ నిర్మాణాలకు ఎటువంటి

భంగం మొదటిరోజుల్లో కలుగలేదు. ప్రతాప రుద్రుని పాలన క్రీ.శ. 1326 లో అంతమైంది. శాసనాలాధారంగా ఇతని కాలంలో జరిగిన ఆలయాల నిర్మాణం గూర్చి పరిశీలిద్దాం.

క్రీ.శ. 1190 ఖమ్మం జిల్లా, మదిరకు చెందిన శాసనం, దేవరతగోత్రకు చెందిన బ్రాహ్మణుడొకడు రెండు ఆలయాలను నిర్మించినట్లు, ఒకటి శివునికై మరియొకటి విష్ణువుకై మధురాపురిలో నిర్మించినట్లు తెలుస్తోంది. అంతేగాక, శివాలయానికి అర్చకుడిగా ఒక శివబ్రాహ్మణను నియమించినట్లుగా తెలుస్తోంది.

గోదావరిజిల్లా విప్పర్రుకు చెందిన మూడు శాసనాలను రాజేశ్వరాలయంలోని ముఖమండపంలోని స్తంభాలమీద చూడవచ్చును. అంతేగాక ఆ గ్రామంలోని నరేంద్రేశ్వరాలయంలోని మండపానికి స్తంభాలను నిర్మించినట్లు కూడ తెలుస్తోంది. అదే ప్రదేశంలోని ఇంకొక శాసనం చెపుతున్న విషయమేమనగా ఒక కటకభక్తుడు, అదే దేవాలయంలోని మండపానికి తూర్పు ద్వారం వైపు వరకు శఖలను నిర్మించినట్లు తెలుస్తోది. ఈ శాసనాలన్నీ క్రీ.శ. 1299కి చెందినవి. నరేంద్రేశ్వర పేరు మీదుగా వున్న శివాలయాలు తూర్పు చాళుక్యరాజైన విజయాదిత్య II చేత నిర్మించబడ్డాయి. అతడికే నరేంద్రమృగరాజ అనే పేరు కూడ వుంది. ఈ శాసనాధారంగా తెలుస్తున్న విషయమేమనగా, ప్రస్తుతమున్న రాజేశ్వరాలయం ఒకప్పుడు నరేంద్రేశ్వరాలయంగా పిలువబడేది. ఈ దేవాలయం చాళుక్య విజయాదిత్య II చేత నిర్మించబడింది.

కృష్ణాజిల్లా, పెదకల్లేపల్లెకు చెందిన పది శాసనాలు ఆ గ్రామంలోని నరేంద్రాలయంలో, వివిధ ప్రదేశాలలో, వివిధ కులాలకు చెందినవి చెక్కబడివున్నాయి. ఆ దేవాలయం పునర్నిర్మాణం గావించబడిందని. ఈ శాసనాల వల్ల తెలుస్తున్నాయి. కనీసం రెండుసార్లు ఈ దేవాలయం పునర్నిర్మించబడిందని ఈ శాసనాలు చెపుతున్నాయి.

ఈ దేవాలయానికి సంబంధించిన మొదటి శాసనం క్రీ.శ. 1154కు చెందింది. ఆ దేవాలయంలోని అఖండ దీపాల నిర్వహణకై కొంతధనం కానుకగా ఇవ్వబడిందని రికార్డులు చెపుతున్నాయి. క్రీ.శ. 1236కు చెందిన శాసనం ఇదే ఉద్దేశమునకై 25 ఆవులను దేవాలయానికి కానుకగా ఇచ్చినట్లు తెలుస్తోంది. క్రీ.శ. 1212కు చెందిన శాసనం సోమశివాచార్య అనే మఠానికి చెందిన 'సంతానిక' పుష్పగిరివద్ద, రాతి ఆలయాన్ని నాగేశ్వర మహాదేవకై ప్రతాపరుద్రుని కాలంలో నిర్మించాడు. ఇదే శాసనానికి సమీపంలో వున్న మరొక శాసనం క్రింద ఒక విగ్రహాన్ని కూడ కలిగివుంది. ఈ విగ్రహం ఆ దేవాలయాన్ని నిర్మించిన సోమశివాచార్యదని తెలుస్తోంది. కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో రాతితో నాగేశ్వరాలయం పునర్నిర్మించబడిందని తెలుస్తోంది. అదే దేవాలయానికి దక్షిణ గోడ మీద చెక్కబడివున్న శాసనం, యార్లగడ్డ కోదండరామనదేశాయి క్రీ.శ. 1782లో పాడుబడిన ఈ ఆలయాన్ని పునరుద్ధరించినట్లుగా చెపుతోంది.

పైన కనపరచిన అంశాలవల్ల మనకు తెలుస్తున్న విషయమేమనగా, కాకతీయ రాజుల కాలం దేవాలయాల నిర్మాణానికి మంచి ప్రోత్సాహాన్ని ఇచ్చింది. కాకతీయరాజుల కాలంలో త్రికూటాలయాల నిర్మాణం మిక్కుటంగా జరిగింది. ఈ ఆచారాన్ని వీరు కర్నాటకు చెందిన కల్యాణచాళుక్యుల నుంచి అరువు తెచ్చుకున్నారు. ముఖ్యంగా కాకతీయరాజుల కాలంలో ఈ త్రికూటాలయాలలో విష్ణురూపం వుండేదికాదు. ఇందుకు భిన్నంగా అప్పటి హోయసాలుల కాలంలో విష్ణువు ఈ త్రికూటాలయాలలో వుండేవాడు.

ఇంకొక గమనించాల్సిన విషయమేమనగా, త్రికూటాలయాల నిర్మాణం కాకతీయ రాజుల తర్వాత అంతగా ఆదరించబడలేదు.

కాకతీయరాజులు శైవమతాన్ని విశేషంగా ఆదరించారు. వైష్ణవ దేవాలయాలు కూడ కొంతవరకు నిర్మించబడ్డాయి. కేశవ లేక చెన్నకేశవ, ప్రసన్నకేశవ, గోపినాథ, వేణుగోపాల మరియు చతుర్వింశతి మూర్తి రూపాలు ఎక్కువ ప్రాచుర్యంలోకి వచ్చాయి. గ్రామదేవతారాధన ప్రాముఖ్యత కూడ పెరిగి, వివిధ ఆలయాలకు మండపాలు కూడ నిర్మించబడినాయి. కొన్నిసార్లు ఆ ఆలయాలు బ్రాహ్మణిక ఆలయాలలో పోలిక తీసుకురాబడినాయి. వివిధ రకాల వృత్తి సంఘాలు అనగా సాలె మొదలగువారు సాలేశ్వర వంటి వారివారి దేవతలకు ఆలయాలను నిర్మించారు.

ఈ కాలంలో దేవాలయాలకు చెందిన సంప్రదాయాలు, పండుగలు మిక్కిలిగా జరిపేవారు. దేవాలయాలకు అనుబంధంగా నాట్యకత్తెలు ఏర్పాటు గావించబడ్డారు. శాసనాలు, ఆ నాట్యకత్తెలకు దేవాలయానికి సమీపంలోనే ఇళ్లను కూడ నిర్మించినారనే విషయాన్ని తెలుపుతోంది. పరివార దేవతలకు ప్రత్యేకంగా మండపాలు, గర్భగుళ్లు నిర్మించారు. దేవాలయ శిల్పుల చేతుల్లో ఈ మండపాలు అన్నిటికంటె రంగమండపం ప్రత్యేకంగా మలచబడినాయి. ఈ కాలానికి చెందిన కొన్ని శాసనాలు చెప్పకోదగిన విశేషాంశాలను ముఖ్యంగా వాస్తు నిర్మాణ విశేషమైన శ్రీ విమానం గురించి చెపుతున్నాయి. పలు శాసనాలాధారంగా చూస్తే, ఈ కాలంలో దేవాలయాల నిర్మాణానికి నల్ల రాతిని ఎక్కువగా ఉపయోగించేవారని విదితమవుతోంది. ఈ కాలంలో ముందుగా ఇటుకలతో నిర్మించబడిన ఆలయాలు, తిరిగి నల్లరాతితో పునర్నిర్మించబడినట్లు తెలుస్తోంది. ఆలయాలలో వివిధ ప్రదేశాలలో, వివిధ భంగిమలలోవున్న అందమైన విగ్రహాలను అమర్చేవారు. ముఖ్య దేవాలయాలైన చేబ్రోలు మొదలుగా గల ఆలయాలు పునర్నిర్మించబడినాయి.

ఈ కాలంలోని శాసనాలు క్రొంగొత్త వాస్తు నిర్మాణ పదాంశాలను అందిస్తున్నాయి. అవి ఏవనగా, తిరుముట్టము, తిరుముట్టియ వంతికము (ఆలయాలు) రంగమధ్యము లేక మధ్యరంగము. ఏది ఏమైనప్పటికీ కాకతీయ దేవాలయాలు ముస్లిందండయాత్రల తాకిడికి తప్పించుకోలేక పోయాయి. ఈ దండయాత్రల్లో పలు దేవాలయాలు నాశనమవడమే గాకుండా, విగ్రహాలు నామరూపాలు లేకుండా ధ్వంసం చేయబడినాయి.

(సమాప్తం)

( 7 వ పేజీ తరువాయి)

కుంటాడు. రావణుడు వధించమని చెప్పిన ప్పుడు విభీషణుడు--

క్షమస్వ రోషం త్యజ రాక్షసేన్ద్ర
ప్రసీద మద్వాక్య మిదం శృణుష్వ,
వధం న కుర్వన్తి పరావరజ్ఞా
దూతస్య సన్తో వసుధాధిపేన్ద్రాః.

దూతను వధించుట సమంజసంకాదని వాదించి లంకానగర బహిష్కృతుడయాడు. అప్పుడుకూడా, మాసం వ్యవధిలో తిరుగు లేని రామబాణంవల్ల క్రూరదంష్ట్రాలవలెనున్న రాక్షసులు నాశనమై, జిహ్వవలెనున్న నీవు శాశ్వతుడవని చెప్పినట్లుగనే రావణవధా నంతరం లంకాధినేతగా శ్రీరామచంద్రుని కరకమ లములచే పట్టాభిషిక్తుడుగావించ బడి, అయోధ్యకుకూడా రావింపబడ్డాడు విభీ షణుడు.

విభీషణస్య సంయోగ
మాచచక్షే చ మన్త్రిణామ్,
శ్రుత్వా తు విస్మయం జగ్ము
రయోధ్యాపురవాసినః.

హనుమంతుడు భక్తి విషయంలో సదా రామసేవలో ఉంటాడని కావున ఎవరిపై రామకృప ఉంటుందో ఆయనకు తెలు సును కావుననే విభీషణుడు రామసంధానంలో సూత్రధారుడైనాడు.

కనకభూధరాకార శరీరా,
సమరభయంకర అతిబల వీరా
హరిపర్వత సంకాశాస్త్రాస్య
వక్త్రోమహాబలః
వజ్రదంష్ట్రనఖో భీమో
వైదేహీ మిదమబ్రవీత్.

ఆంజనేయస్వామి పంచముఖాలు, దశ హస్తాలు పరశువు, ఖడ్గం, కమండలం, డాలు, గద, పాశం, ధ్వజం, త్రిశూలం, నాగబంధం, అభయహస్తంతో, సీతామ్మవారికి దర్శనమి చ్చాడు. ఆమె లఘురూపంలోకి శాంతపరిచి, 'నాయనా! నువ్వు అజరుడవు. నిన్ను వార్ధక్యం బాధించదు' అని దీవించింది.

ఆయన కర్తవ్యపాలకుడు. అందుకే లంకలో లోకకు నిప్పు పెట్టినప్పుడు మనసా రామచంద్రుని ఆజ్ఞకోసం భృకుటిలో కనులు నిగిడ్చి సహస్రారంనుంచి తలచుకున్నప్పుడు శ్రీరామచంద్రమూర్తి నలభై తొమ్మిది వాయు వులు బయల్దేరి ఆనతి నిచ్చాయి.

అమ్మవారినుండి చూడామణి తీసుకు వచ్చి-- తౌహివీరౌ నరవరే సహితౌ రామ లక్ష్మణౌ, ఆగమ్యనగరీం లంకాం సాయకై ర్విధమిష్యతః, సగణం రావణం హత్వా రాఘ వోరఘు నన్దనః-- రావణుని సంహరించి తనను తీసుకు వెళ్లమందని చూడామణి ప్రదానం చేసిందని చెప్పినప్పుడు 'ఈ ప్రపంచంలో నీ వంటి పరోపకారి మరొకరు లేరు. నీకు చాలా ఋణపడి వున్నాను. అంటూ రామపాదాలను చుట్టుకున్న ఆంజనేయుని లేవనెత్తి, నాయందు అనన్యభక్తి కల్గి ఉండ మని దీవించాడు' వీపు నిమురుతూ--

సకృదేవ ప్రపన్నాయ
తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో
దదామ్యేతద్వ్రతంమమ
శరణాగతుని దరిచేర్చడం రామవ్రతం.

పరమశివుడు.... శ్రీమన్నారాయణుని ఈ దీవన కోసమే వానరుడుగా హనుమం తునిగా పుట్టుకకు కారణభూతమైంది. అన న్యభక్తి కల్గి ఉండాలనే దీవన అందరికీ లభిం చదు. పట్టాభిషేకానంతరం హనుమంతుని వదిలేసి లక్ష్మణ భరత శత్రుఘ్నులు సీతా రామచంద్రుల సేవలు పంచుకున్నప్పుడు-- సూక్ష్మబుద్ధితో ఆవులిస్తే చిటికెలువేసే పని కల్పించుకుని, సర్వకాల సర్వావస్థలయందూ వెన్నంటి ఉంటూ ఆఖరికి పుణ్యదంపతుల నిద్రాసమయంలో కూడా ఆవలింతకోసం ఎదురుచూస్తోంటే సీతమ్మకు ఇబ్బందయి - ఆ పద్దతికి స్వస్తి చెప్పించి సీతారాములను తన హృదయంలో నిక్షిప్తం చేసుకున్నాడు.

దేహదృష్ట్యాతు దాసోఽహం
జీవదృష్ట్యా త్వదంశకః,
ఆత్మదృష్ట్యా త్వమేవాహం
ఇతిమే నిశ్చితా మతిః.

దేహదృష్ట్యా ఆయన శ్రీరామదాసుడు. జీవదృష్ట్యా రామాంశ-- తత్త్వ దృష్ట్యా రామ స్వరూపుడే. హనుమ భక్తిని మెచ్చువాడు. ఆయన మనమనసుకు ప్రసన్నం కావాలంటే సీతారాములను మనసా స్మరిస్తే ఆ రామ భక్త హనుమాన్ దర్శనమీయగలడు. రా క్తులంటే స్వామికి తగని ప్రేమ-వాత్సల్యం వారు మనకు కైవల్యం ప్రసాదించాలంటే మనకు శ్రద్ధ, విశ్వాసం అత్యవసరం--

యే జపంతి సదా స్నేహాన్నామ
మాంగల్య కారణమ్,
శ్రీమతో రామచంద్రస్య కృపావేశో
మమ స్వామినః
తేషామర్థే సదా విప్రప్రదాతారం
ప్రయత్నతః
దదామి వాంఛితం నిత్యం సర్వదా
సౌఖ్యముత్తమమ్.

శ్రీమంతుడైన నిత్యమంగళాకారుడు శ్రీరామచంద్రుని ఏ మానవులు సదా ప్రేమ పూర్వకంగా జపింతురో వారికి నేను అనుక్షణం ప్రయత్నపూర్వకంగా ప్రదాతనై యుందునని సెలవిచ్చాడు.

ఓం హం హనుమతే నమః
ఓం పరమంత్ర పరతంత్ర
సర్వగ్రహోచ్చాటనాయ
సకలశత్రు సంహారణాయ
జం జం జం జం గ జం గ స్వాహా.

"శ్రద్ధ-బుద్ధి" ఆయన కవచం-- అట్టి ఆంజనేయునికి:

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.



# దుఃఖించుట దోషము

శ్రీ ముడుంబ వెంకటాచార్యులు




ఆధ్యాత్మిక సాధనలో పురోభివృద్ధి జీవితం యెడల సరియైన దృక్పథం కలిగి ఉండడంలో తెలుస్తుంది. ఈ పురోభివృద్ధిలో తొలిమెట్టు, తక్కువ రకపు దృశ్య నృత్య గీతా దుల లోను, సాహిత్యంలోను అభిరుచిపోయి మేలురకపు అభిరుచులు కలగడం.

సాధన ఉన్నతస్థితి చేరుకొనేసరికి "నిత్యం చ సమచిత్తత్వం ఇష్టా నిష్టోప పత్తిషు" అవుతాడు. కాని ఆస్థితిని చేరడానికి ముందు జీవితపు సుఖ దుఃఖాల యెడల సరియైన దృక్పథం కలిగి ఉండాలి. జీవి తంలో అనేక సుఖ దుఃఖ కారక సంఘటన లెదురౌతాయి. సుఖ కారక సంఘటనలకు అతిగా మురిసిపోకూడదు. "నా ప్రయోజ కత్వం వల్లనే ఈవిధంగా జరిగింది" అని మిడిసి పడ కూడదు. అది అహంకార దృక్పథం. అలాగే దుఃఖ పడడం. దుఃఖ పడడం దేహాభిమానం వల్ల వస్తుంది. తాను దుఃఖాతీతుడనని గ్రహించి దుఃఖ పడుటను దోషముగా గ్రహించడమే "దుఃఖ దోషానుద ర్శనం."

దుఃఖ సంఘటనలకు కృంగిపోకూడదు. "భగవంతుడు ఇలా రాసిపెట్టాడు; అనుభ వించ వలసిందే" అనుకోవడం కూడా తప్పు. దుఃఖానుభవం పాపఫలితమే. కాని, దానిని ఏడుస్తూ అనుభవిస్తే ప్రయోజనం లేదు. ఆ అనుభవం వల్ల ప్రారబ్ద కర్మ తరుగుతోందని సంతోషించవచ్చు. విషాదం కూడా ఒక యోగం కావాలి, దానినుండి దుఃఖాతీత స్థితి కలగాలి. అర్జునుని విషాదం భగవంతుని బోధ వల్ల యోగమైంది. అలాగే మన విషాదాల నుండి కూడా పాఠాలు నేర్చుకొని సత్ఫలి తాలు పొందాలి. సత్ఫలితాలను పొందడమే -- విషాదాన్ని సుఖంగా పరివర్తన చేసికో వడం. "All my illusions will burn into illumination of joy" (Tagore) "నా భ్రమ లన్నీ మండి ఆనంద జ్యోతుల కాంతుల్ని వెదజల్లుతాయి" అంటారు రాగూర్.

మనను ఎవరైనా బాధించినప్పుడు తిరిగి వారిని బాధించకుండడం అహింసలో భాగం. అహింస పిరికితనమూ కాదు; చేతకాని తనమూ కాదు. మన కోపాన్ని గాని ద్వేషాన్ని గాని అణచుకొన్న ప్రతిసారి మనం మరింత మనోబలాన్ని ప్రదర్శించడమే కాదు - పెంచుకుంటున్నామని కూడా అర్థం. ఈవిష యంలో గాంధీజీ అభిప్రాయాలను, పతంజలి యోగసూత్రాలు I. 33 పై వివేకానందుని వ్యాఖ్యానం గమనించండి ; II. 21పై వ్యాఖ్యా నిస్తూ ఆయన "పురుషుణ్ణి (జీవుని) విము క్తుణ్ణి చెయ్యడమే ప్రకృతి పరమోద్దేశము" అంటారు. అందుచే ఇతరులవల్లా స్వభా వసిద్ధంగాను మనకు కలిగే దుఃఖాన్నుండి కూడా మనం ప్రయోజనం పొందవచ్చునని గ్రహించడమే సరియైన దృక్పథం.

తన కివ్వబడిన శాపాన్నే వరంగా మార్చు కొని వారంరోజుల్లో మోక్షం పొందాడు పరీ క్షిత్తు.

భగవంతుడు మనకిచ్చే సుఖ దుఃఖాలకు వరాలకు శిక్షలకు లక్ష్యమొకటే. ఆయనకు

పక్షపాతంలేదు; కక్షాలేదు. శిక్షించే సమయంలో భగవంతుని మనసు kind cruelty of a surgeon's knife వంటిది. "బహుమతులు శిక్షలు ఒకే తలుపుకి రెండు బందులు" (ఆర్.ఎల్. స్టీవెన్ సన్). బహుమతులు ఉల్సాహపరచడానికి, శిక్షలు శిక్షణ కొరకు వస్తాయి. "స్త్రీ (జీవాత్మ) తన ప్రియుణ్ణి కోరక, ప్రియుడిచ్చే ఆభరణాలకై ఆశిస్తూ" ఉంటే - - - "తన (పరమాత్మ) కౌగిలిలో ప్రియురాలు అన్యమనస్క ఐ తన ప్రణయ లీలకు బదులు పల్కకపోతే, బాధించి ఐనా సరే తనలోనికి దృష్టి మరలించుకోడా శృంగార నాయకుడు ?" ('గీతాంజలి' ఉపోద్ఘాతంలో చలం) మనం అన్య మనస్కులమైన మూలంగానే మనకు బాధలు. తనలోనికి మన దృష్టి మరల్చుకోడానికే ఆయన ప్రయత్నం.

దైవం, మనను ఏడిపించి ఏడుస్తూఉంటే చూచి ఆనందించే క్రూర బాలుడు కాదు. ఆయన కరుణామయుడైన తండ్రి, మిల్టన్ తన కవితాశక్తిని ఈశ్వర సేవకు వినియోగించాలనుకున్నాడు. He "wanted to justify theways of God to men." కాని 42వ ఏటకే ఆయనకు రెండు కళ్లూ పోగొట్టాడు భగవాన్. ఆయన ఆలోచించి "They also serve, who only stand and wait" అని గ్రహించాడు.

మాయలేడి ప్రలోభంలోపడి భువన సుందరమూర్తి యైన పరమాత్ముని సన్నిధి నుండి దూరమైంది (జీవుని ప్రతీక) సీతమ్మ. తన యాతనలకు కారణం "మమైపి దుష్కృతం కించిద్మహదస్తి న సంశయః" అని తెలిసికొని, రామధ్యానంలో ఉండి, ఆయనే వచ్చి రక్షిస్తాడనే దృఢ నిశ్చయంతో అన్యోపాయాన్ని (హనుమ తీసుకు పోతానంటే కాదని) తిరస్కరించి, భగవంతుని చేరడానికి భగవంతునే ఉపాయంగా నమ్మి, కృతకృత్యురాలైంది. తనకు వచ్చిన ఆపదకు కారణం తెలుసుకుంది ; ఆపదనుండి బయటపడే ఉపాయం తెలుసుకుంది ; తగు న్నిర్ణయం, సాధన చేసింది. ఏ .దుఃఖ కారక సంఘటనలోనైనా మనం చెయ్యవలసిన పనికూడ అదే. ఆ సంఘటనలు మన మనఃపరివర్తనకు దోహద పడాలి.

"మానవ జీవితమున దుఃఖమును నివారింపజేయుట మాత్రమే యోగలక్ష్యము కాదు. దుఃఖమును పరివర్తింపజేసి ఆనందమొనరించుట పూర్ణయోగ లక్ష్యము" - శ్రీ అరవిందుడు. "It is not a great virtue to suffer, whether it is just a bad temperment or severe depression. It is of importance to understand the message behind it and bring about the necessarychange." [purity - Feb.92]

కొందరు తమకు దాంపత్య సుఖం లేదనుకుంటారు ; అన్యోన్య దాంపత్యాలు చాలా తక్కువ ఉంటాయనుకుంటారు. నిజానికి నూటికి నూరూ అన్యోనం తగిన దాంపత్యాలే. భగవంతుడెప్పుడూ పొరపాటు చెయ్యడు ;



పరస్పరం తగిన వాళ్లనే కూరుస్తాడు -- అని భావించాలి. తనకు లభించిన భార్య లేక భర్త వల్లనే అభ్యున్నతి సాధించాలి. కొన్ని దాంపత్యాలలో ఘర్షణ కనిపిస్తుంది. ఆ ఘర్షణ వల్లనే తమ స్వభావాల్లోని గతుకులు గరుకులు నున్నబడుతున్నాయని గ్రహించాలి. కొందరివి అనుకూల దాంపత్యాలలాగ తోస్తుంది. వారు ఒకరికొకరు చేదోడు వాదోడై ఉన్నతిని పొందుతారు. సైంటిస్టయిన మిస్టర్ క్యూరీకి ఉత్తమమైన భార్య దొరికింది. ఆమె ఆయన బీదరికంలోనూ పరిశోధనల్లోనూ పాలుపంచుకొంది. వారు క్రొత్త విషయాలు కనిపెట్టారు. ప్రఖ్యాత వేదాంతి సోక్రటీసుకు పరమ గయ్యాళి దొరికింది. బహుశః అందువల్లే ఆయన గొప్ప తత్త్వవేత్త అయ్యారు. తుకారాంకు ప్రతికూలమైన భార్య, ఏక్‌నాథ్‌కు అనుకూలమైన భార్య దొరికారు. నర్సీమెహతాకు భార్యా వియోగం కలిగింది. ఈమూడూ పరస్పరం విరుద్ధ పరిస్థితుల్లాగ కనిపించినా, వారు మాత్రం ఒకే గమ్యం వైపు పయనించడానికి వారివారి భిన్న పరిస్థితులను అనుకూలంగా చేసుకున్నారు. అలాగే మనం మన పరిస్థితులను మన ఉన్నతికి దోహదపడేలాగ మలచుకోవడమే జీవితం యెడల సరియైన దృక్పథం కలిగి ఉండడం.

"కష్టములు దైవమును చూపు కాగడాలు" అన్నారు స్వామి రామతీర్థ. చాలా మంది కష్టంమీద కష్టం వచ్చినా సరే కాగడాను పట్టుకోరు. ఒకాయన స్మృతియాత్ర గ్రంథం (దైవ స్మృతితో జీవనయాత్ర) వ్రాయడానికి బదులు స్మృతియాత్రపై గ్రంథం వ్రాయమొదలు పెట్టాడు. మిడిమిడి జ్ఞానం కల ఆయనకు, ఆ రచన నిజమైన స్మృతి యాత్ర కాదనీ, విషయ సేకరణమీద చాలా కాలం వృధా అవుతుందనీ పుస్తకప్రమరణ దానికి సంబంధించిన విషయాలమీదే దృష్టి పడుతోందనీ తెలిసినా ఆయన ఆ రచన విరమించలేదు. భగవంతుడు, చూచి చూచి ఆయన కుడిచేతిమీద బాధకలగకుండా ఒక్క చిన్న దెబ్బ కొట్టాడు. కొద్దికాలం ఆదెబ్బ (పెరాలిసిస్ స్ట్రోక్) వల్ల. ఆచెయ్యి పని చెయ్యలేదు ; ఐనా ఆయన ఆ రచన మానాడా ? ఒక్క దెబ్బతో మానితే మనిషి ఇన్ని దెబ్బలెందుకు తింటాడు ?

భగవంతుని చర్యలన్నిటికి భాష్యం చెప్పడం కుదరదు; అంటే మన బుద్ధి కందదు. "ఆయన శాశ్వత కాల జ్ఞానమును నరుల హృదయమందుంచి యున్నాడు. కాని దేవుడు చేయు క్రియలను పరిశీలనగా తెలిసికొనుటకు అది చాలదు." (ప్రసంగి III. 11)

మనం ఏ పరిస్థితులనుండి పారిపోదామనుకుంటామో, ఆ పరిస్థితులమందే - మన స్వభావాన్ని మార్చుకొని ఉద్రేకాల నణచుకొని చిత్తస్థైర్యం అలవరచుకోవాలి. అదే ఆధ్యాత్మిక పురోగమనానికి బాట. మనను అయిష్టపడేవారివల్ల, మనము ద్వేషించే వారి వల్లే మనకు సహనము క్షమ సమచిత్తత్వం అలవడతాయి.

తప్పు చేస్తే జైలులో పెడతారు. తప్పు చేశాను కాబట్టి, ఈ శిక్ష అనుభవిస్తున్నాను – అని తెలుసుకొని, ఇకపై ఆ తప్పు చెయ్య కూడదని తీర్మానించుకుంటే అది మంచి పరివర్తన. ఒకరిని, తప్పు చెయ్యకుండానే జైలులో పెట్టారనుకుందాం. అప్పు డతడు "తప్పు చెయ్యక పోయినా ఈబాధ వచ్చింద"ని దుఃఖిస్తూ కూర్చోకూడదు. దానినే సుఖ స్వరూపంగా వినియోగించుకోవచ్చు. రాజ కీయ ఖైదీలు జైళ్లలో అనేక గ్రంథాలు వ్రాశారు. వారికి బందిఖానాయే వరమైంది. ఆవిధంగా శిక్షలను వరాలుగా మార్చుకోవచ్చు. గ్రంథ రచన కాకపోతే పఠనం చెయ్యవచ్చు. లేదా దైవస్మృతైనా చేసుకోవచ్చు.

ఈవిధంగా కష్టాలను సుఖ స్వరూపంగా మలచుకోవచ్చు.

"జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనం" అమానిత్వాది గుణాల్లో ఒకటి (భ. గీ.XIII. 9) వాటిచే కలిగే దుఃఖం యెడల కూడా మనం సరియైన దృక్పథం కలిగి ఉండాలి. వాటిచే దుఃఖ పడడం దోషం. ఆ"దుఃఖమును దోషముగా నెఱుంగుట" (మళయాళస్వామి) మనం విచార మథనం చేసి దృఢ పఱచుకో వలసిన దృక్పథం. వాటికి విచారపడడం మనలోపంగా గుర్తించ గలగడ జ్ఞానం.

తాను ఆత్మననీ, ఈ శరీరాన్ని కాననీ "అన్తవన్త ఇమేదేహా"అని గ్రహించాలి. జీర్ణ శరీరం పోయి క్రొత్త శరీరం వస్తూవుంటే విచారించడం దోషం కదా! క్రొత్త జన్మలో క్రొత్త శరీరంతో గతంలో చేసిన సాధనను కొనసాగించి, మన గమ్యానికి దగ్గర కావచ్చునని భగవంతుడు (భ.గీ. 40 - 44) చెప్పాడు కదా! అందుచే క్రొత్త శరీరం ధరిస్తున్నందుకు సంతోషించాలి.

మృత్యువు లేకుండా మరుజన్మ రాదు కదా. అందుచే మరుజన్మకు కారణమయ్యే మృత్యువు, ఆహ్వానించ దగినదే. మరుజన్మలేని మృత్యువైతే అంతకన్నా కోరదగిన దేముంది? ఈరెండు విధాలా మృత్యువునొక మధుర సంఘటనగా మనం గుర్తించగలగాలి.

జర అనగా ముసలితనం. ముసలి తనంలో నేర్చుకొనే పాఠాలు అపారం. ఆ కాలంలో, పూర్వానుభవంచే పరిణితి పొందిన మనసుతో అభాస బాంధవ్యాల భ్రమలు తొల గించుకొని ప్రతివారు క్రొత్తపాఠాలు నేర్చుకొని పాతవ్యామోహాలను వదలి, ఆ క్రొత్త జ్ఞానంతో పాత సంస్కారాలను దగ్ధం చేసికోవచ్చు. దుఃఖిస్తూ కూర్చుంటే ఆ దుఃఖమే మిగులుతుంది. ఆ కాలంలోని బాధలూ కష్టాలూ కరదీపికలై జ్ఞానోదయం కలిగించి మనలను దైవోన్ముఖులను చేసి జీవిత గమ్యానికి చేరువచేసే అవకాశముంది. అట్టి సత్ఫలితాలనిచ్చే జర దోషమెలా అవుతుంది?

సంతానం లేనివాళ్లు సామాన్యంగా దిగులుగా ఉంటారు: వ్యాధిగ్రస్తులు కూడా అంతే. కాని వాసుదాసస్వామికి బిడ్డలు లేరు, ఎప్పుడూ వదలని ఉబ్బసం జబ్బుండేది. ఆయన ఆరెంటిని దైవస్మరణ కనుకూల పరి



స్థితులు గానే మలచుకున్నారు. ఆయనకు శ్రీరామ దర్శన మైందని పెద్దలు చెప్తారు.

ముసలితనం, వ్యాధులు జతగాళ్లే, కాని వ్యాధులు విడిగానూ వస్తాయి. కొందరు అనారోగ్యంచే విశ్రాంతి తీసుకోవలసి వస్తుంది. ఆకాలంలో వారు గ్రంథ పఠనం లేదా దైవ స్మృతి చేసుకోవచ్చు. వ్యాధి, కొంతవరకు మనిషిలోని అహంకారాన్నణచి దైవోన్ముఖుణ్ణి చేస్తుంది. తీవ్రమైన శారీరక మానసిక బాధల్ని సుఖ స్వరూపంగా మలచుకోవడం కష్టం. అది మహాయోగులకే సాధ్యం. కాని ప్రతివారు దానికై సాధన చెయ్యాలి. అదే యోగసాధన.

శ్లో॥ గుణానే తాన తీత్య త్రీన్ దేహ
దేహసముద్భవాన్
జన్మ మృత్యు జరా దుఃఖై
ర్విముక్తోఽ మృత మశ్నుతే. XIV.20.

ఈ దేహధారియైన ఆత్మ, దేహము వలన పుట్టిన ఈ సత్వరజస్తమో గుణములను అతిక్రమించి, జననము మరణము ముసలి తనము అను వాటిచే కలిగిన దుఃఖములచే విడువబడిన వాడై శుద్ధాత్మ స్వరూపమును అనుభవించుచున్నాడు.

ఆ శుద్ధాత్మ స్వరూపము ఎట్టిది ?

"విజ్ఞానోస్మి విశేషోఽ స్మి
సోమోఽస్మి సకలోఽ స్మ్యహం
శుభోస్మి శోకహీనోఽస్మి
చైతన్యోఽ స్మి సమోఽ స్మ్యహం"॥
(మైత్రే. ఉ. III.3 )

తా॥ విజ్ఞానమును నేనే, విశేషమును నేనే, సోముడను నేనే, సకలమును నేనే, శుభమును నేనే, శోకహీనుడను నేనే, చైతన్యమును నేనే, సమచిత్తము కలవాడను నేనే.

నన్ను దుఃఖపెట్టే దెవరు ? దుఃఖ పడే దెవరు ?

"నానాత్మ భేద హీనోఽస్మి హ్యా ఖండానంద విగ్రహః" (మైత్రే. ఉ. III.8)

నేను, అందరును, ఒకే ఆత్మ స్వరూపులను భావము కలవాడను. నేను నిత్య అఖండ ఆనంద విగ్రహుడను.

నిత్యానంద స్వరూపమైన ఆత్మానుభూతిని పొందక, ప్రకృతి సిద్ధమైన దేహసంబంధమైన దుఃఖములను తనదుఃఖములుగా భావించుట దోషమని మన మందరం గుర్తించాలి. ★



## రు 30 కోట్ల వ్యయంతో శ్రీవారికి మండపం

30 కోట్ల రూపాయల వ్యయంతో వజ్రాకారంలో శ్రీవారికి తిరుమలలో 'శ్రీవారి వైభవోత్సవ మండపం' త్వరలో నిర్మించనున్నట్లు తి.తి. దేవస్థానముల ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఆంజనేయులు నాయుడు తెలియజేశారు.

ఈ భారీపథకం తి.తి. దేవస్థానముల చరిత్రలోనే మొదటిదని, ఇది 1998 నాటికి పూర్తవుతుందని ఆయన తెలిపారు. తమిళనాడు రాష్ట్రంలోని కోవనూర్ నుంచి తెప్పించిన నీలపు గ్రానైట్ రాయితే ఈ మండపం నిర్మిస్తారని, కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం తదితర ఉత్సవాలు ఈ మండపంలో నిర్వహిస్తారని, ఇందులో దాదాపు 4 వేలమంది భక్తులు కూర్చోవటానికి వీలవుతుందని, ప్రస్తుతం ఆలయంలో వున్న శ్రీవారి వాహనాలన్నీ ఇందులో భద్రపరుస్తారని ఆయన తెలిపారు.

## వచ్చే సంచికలోనే....................

## కొత్త శీర్షిక ప్రారంభం

**పాఠకుల ధార్మిక సందేహాలకు సమాధానాలు**

ఎంతో కాలంగా పాఠకులందరూ ఎదురుచూస్తున్న ఈ శీర్షిక వచ్చే సంచిక నుంచే ప్రారంభం అవుతుంది. పాఠకుల ధార్మిక సందేహాలకు ప్రముఖ పండితులు సమాధానాలు ఇస్తారు.

పాఠకులు తమ ప్రశ్నల్ని, తమ చిరునామాతో పాటు కార్డుమీద రాసి పంపవలసిందిగా కోరుతున్నాము. సమాధానాలు వీలువెంబడి ప్రచురిస్తాము.

**ప్రశ్నలు పంపవలసిన చిరునామా :**

సందేహాలు - సమాధానాలు
సంపాదకుడు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి -- 517 507

# వార్తాలహరి

## దేశవ్యాప్తంగా తి.తి. దేవస్థానముల కళ్యాణ మండపాలు

దేశవ్యాప్తంగా గల ఆయా రాష్ట్ర రాజధాని కేంద్రాల్లో తి.తి. దేవస్థానం ఆధ్వర్యంలో కళ్యాణ మండపాలు నిర్మించాలని యోచిస్తున్నామని తి.తి. దేవస్థానం అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి తెలిపారు. మే 8 ఆదివారంనాడు మదనపల్లెలో జరిగిన ఓ కార్యక్రమంలో ఆయన ఈ విషయాలను విలేకరులకు తెలిపారు.

రాష్ట్రంలో ప్రస్తుతం 85 కళ్యాణ మండపాలు వున్నాయని, ప్రతి మున్సిపాలిటీలోను ఓ కళ్యాణ మండపం నిర్మిస్తామని ఆయన అన్నారు.

తి.తి. దేవస్థానం ఆధ్వర్యంలో వివిధ అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టేందుకుగాను ప్రజలనుండి 50 కోట్ల రూపాయలు బాండ్ల రూపంలో ఋణంగా సేకరించదలిచామని ఆయన తెలిపారు. దీనికి 8 శాతం వడ్డీ చొప్పున ప్రజలకు తిరిగి చెల్లిస్తామని ఆయన చెప్పారు.



## తిరుమల తిరుపతి దేవస్థానముల

# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ప్రసాదించిన వరం. ఆ అడవుల్ని రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి **శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం** పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అటవీశాఖ వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

## వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

సౌకర్యాలు :

* వృక్షసంపదకు దాతపేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.15,000/-.

## వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచడానికి నిర్దేశించిన పథకం.

సౌకర్యాలు :

* దాతపేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కల వితరణ.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.10,000/-.

## స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

సౌకర్యాలు :

* ఈ వనానికి దాత పేరు పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.2,000/-.

## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు ప్రదర్శిస్తారు.
* ఒక సంవత్సరంపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అధ్యయన వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కదగ్గర దాత పేరు ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-.

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్ రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటడం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు చెట్టుదగ్గర ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వనసంపద పరిరక్షణకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

**మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.**

**కార్యనిర్వహణాధికారి,**
**తి.తి. దేవస్థానములు, తిరుపతి**

( 2 వ పేజీ తరువాయి) 

వేడుకకు చందా పంపటం లేదు, వెనుకటివి కూడా పంపండనీ ఎదురుచూచే ఆ ఏభైవేల భక్త పాఠకుల అభిమానం ఎంత గట్టిదో. ఎన్ని అవాంతరాలు కలిగినా ఆ చల్లని మనసుల మనుషులుండబట్టీ, అనుభవాలు అట్టుడుకుతున్నా మనసు మాత్రం మంచంత చల్లగా ఉంచుకో గలిగాను.

నా తోటివాళ్లే ఐనా, ప్రతి ఒక్కరు నన్ను మించేవాళ్లే ఐనా, వాళ్ల మనసులు మలచుకొని, పాలూ నీళ్ల లాగా కాకుండ పొదుగు పాల ఆర్ద్రితగా, నా ఆలోచనల అంతర్భాగాలుగా కలిసి, నా పదోన్నతికి, పథోన్నతికి పాటు పడి పాలుపంచుకున్న సహోద్యోగులు సహాయక సంపాదకోద్యోగులూ, అధికారులకు అవసరాలకు నే చుట్టించిన గీతను పెట్టని కోటన్నా ఇంతకాలం ఎలా రక్షించుకుంటూ వచ్చారో!

అందించేవారూ, అవసరాలవారూ వేరే వేరే ఐనా, వీరిద్దరికీ పత్రిక వారధిగా, ఈ చేయి ఎందరు నట కవి, గాయక సంతర్పణలో సహాయపడిందో, అందనివారి మందలింపులతోపాటు, అందుకున్న వారి ఆశీస్సులు కూడా నాకు కొండంత బలం ఇచ్చాయి.

కనిపించే ఇన్ని ఘనతలూ నా వనిపించే శక్తి యుక్తులు నావా? కానే కాదు. కొండ కొమ్మున దేవర కరుణ కొండంత, పై కొలువు అధికారుల కలివిడితనం కొంత కావలసిన అండదండలలో తమ శక్తి కొద్ది అందించిన దేవస్థాన సహాధికార వర్గాల సౌజన్యం కొంత. ఏమి రాసినా, ఎంతరాసినా అంతా మంచేనని ఇన్నాళ్లు ఆదరించిన కరుణామయుల కొన చూపు కొంత అంతా కలిసి నాకు ఎంతెంతో!

సప్తగిరి దాటిన ఈ పాతిక సంవత్సరాల శుభపర్వాన్ని పురస్కరించుకుని 'సప్తగిరి'కి వారధిలాంటి నేను, ఇందరి అభిమానాన్ని పొంది, కృతజ్ఞతతో తలవంచకపోతే, తలదించుకునేంత తప్పుచేసిన వాడినౌతాను. అందుకోండి నా కృతజ్ఞతలు.

ఎందరో మహానుభావులు అందరికీ సుహృద్వందనాలు

కాటపాటి సుబ్బారావు
సంపాదకులు, సప్తగిరి.



Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507




జూలై, 1994

# సప్తగిరి

వెల : రు. 2/-



తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక



తానె తానే యిందరికి గురుఁడు
సాన బట్టిన భోగి జ్ఞానయోగి

అపరిమితములైన యజ్ఞాలు వడిఁజేయఁ
బ్రపన్నులకు బుద్ధి వచరించి
తపముగా ఫల పరిత్యాగము సేయించు
కపురుల గరిమల కర్మయోగి.

అన్ని చేఁతలును బ్రహ్మార్పణవిధిఁ జేయ
మన్నించు బుద్ధులను మరుగఁజెప్పి
ఉన్నతపదమున కొనరగఁ గరుణించు
పన్నగశయనుఁడే బ్రహ్మయోగి.

తనరఁగఁ గపిలుఁడై దత్తాత్రేయుఁడై
ఘనమైన మహిమ శ్రీవేంకటరాయఁడై
వొనరఁగ సంసారయోగము గృపసేయు
అనిమిష గతుల నభ్యాస యోగి.



--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 60,
రాగం : సామంతం, సంపుటం : 11 - పుట.40

(జూలై 22 గురుపూర్ణిమ సందర్భంగా)

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- ❁ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- ❁ మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- ❁ శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- ❁ స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ❁ ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ❁ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- ❁ తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- ❁ తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- ❁ సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- ❁ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- ❁ శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- ❁ విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- ❁ మాంసాహారాన్ని భుజించకండి.
- ❁ ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- ❁ పొగత్రాగకండి.
- ❁ వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- ❁ శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ❁ ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- ❁ వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- ❁ శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- ❁ శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ❁ ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయుటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ❁ ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ❁ తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజే.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్‌ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.





గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.

ప్రచురణకర్త - సంపాదకులు
కాట్రపాటి సుబ్బారావు, ఎమ్.ఎ.
ఫోను. 22294

ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,

ముద్రాపకులు
ఎమ్. విజయకుమార్ రెడ్డి
ఫోను. 22340

విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00

అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.




# ఈ సంచికలో.... జూలై, 1994

సంపుటి 25 సంచిక 2

# సంపాదకీయం




పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి పార్థ! బృహస్పతిమ్.

'పురోహితులలో నేను బృహస్పతి రూపమని తెలుసుకో' అన్నాడు భగవానుడు. బృహస్పతి దేవగురువని శాస్త్రాలు చెప్తున్నాయి. అంటే పురోహిత గురుశబ్దాలు రెండూ సమాన ధర్మకాలు, సమానార్థకాలు అన్నమాట. ఈరెండు శబ్దాలు గురువుకున్న గురుతర బాధ్యతను స్పష్టం చేస్తున్నాయి. పురోహితః అంటే ముందు హితాన్ని చేకూర్చేవాడు అంటే తానాశ్రయించినవాళ్లనీ తన నాశ్రయించినవాళ్ళనీ, అత్యంత విశ్వాసంతో మేలు కోరుతూ వారికి ముందు రాబోయే కష్టనష్టాలను, సమస్యలను ఊహించి వాటిని పరిహరించే ఉపాయాలాలోచించి ఆచరింప జేసి మేలు చేకూర్చేవాడు కనుక అతనిని పురోహితుడు అన్నారు. గురువు శబ్దానికి కూడా ఇదే అర్థం. తనను ఆశ్రయించినవారి హితాన్ని ఆలోచించి సరైన బోధ చేసేవాడన్నమాట. అది లౌకికమూ కావచ్చు, పారలౌకికమూ కావచ్చు. ఏదైనా ఆశ్రితులకు రెండురకాల సంక్షేమాన్ని చేకూర్చేవాడు గురువు. కనుక గురువులో గొప్పల క్షణం ఆశ్రితుల విశ్వాసాన్ని పోగొట్టుకోక పోవటం. అలా విశ్వాసం పోగొట్టుకున్న గురువు ఎంత ప్రమాదంలో పడుతుంటాడో మనకు విశ్వరూపుని చరిత్రే వివరిస్తోంది.

దేవేంద్రుడు యజ్ఞం చేయసంకల్పించి త్వష్ట కొడుకైన విశ్వరూపుణ్ణి ఆచార్యుడుగా ఎన్నుకున్నాడు. అహంకారం, నిర్లక్ష్యం మూర్తీభవించిన విశ్వరూపుడు, దేవతలను చులకన చేస్తూ హవిర్భాగాలను రాక్షసులకు కూడా పంచటం ప్రారంభించాడు. ఈ ఒప్పుకానిపని ఒప్పుకోలేని దేవేంద్రుడు తన వజ్రాయుధంతో విశ్వరూపుణ్ణి సంహరించాడు. దానివల్ల దేవేంద్రుడికి హత్యాపాతకం పట్టుకోవటం వేరేవిషయం. ఇలా గురుద్రోహం చేసే గురువులు ఏ దుఃస్థితికి లోనౌతారనడానికి ఇదే నిదర్శనం.

గురువుకు కావలసింది సమదృక్పథం. విద్యార్థి ఐనవాడు శత్రువు కొడుకైనా సమదృష్టితో విద్యనేర్పటం. దీనికి తనకు బృహస్పతికి వైరమున్నా అది మనసులో ఉంచుకోక మృతసంజీవనీ విద్యను చెప్పి, ఆ కచునికోసం తన ప్రాణాలు సైతం వదలటానికి సిద్ధపడిన శుక్రాచార్యుడిదే అగ్రతాంబూలం. మాటవినని ఆశ్రితుని వల్ల తనకు అవమానం, ఆపదా కలిగినా తనవంతు కర్తవ్యంగా భావించే త్యాగశీలతకు కూడా శుక్రుడే సాక్షి. బలి తన కన్ను బలితీసుకున్నా ఆతని హితానికి తన సర్వ శక్తులతో ప్రయత్నించటం అందరికీ తెలిసిన విషయమే.

దశరథుడు రాముడు పాండవులు తమ తమ ప్రయత్నాల్లో సత్ఫలితాలను పొందినా దుర్యోధనుడు, కర్ణుడు, రావణుడు, బలి, బాణుడు తమ ప్రయత్నాల్లో దీర్ఘకాల ఫలితాలను పొందక పతనం కావటానికి కారణం గురుబోధలపట్ల వాళ్లకున్న శ్రద్ధా పరిణామమే. కొందరికి గురుబోధలు చాలా బరువుగా అనిపించి తామే గొప్పవాళ్లమని, గురువులను అతి లఘుత్వంతో చూడటం జరిగింది. లేకపోతే అపార తపశ్శక్తి సంపన్నుడైన నహుషుడు ఇంద్రపదవిని పొందికూడా దక్కించుకోలేక నరలోకంలో పామై పడిపోయేవాడు కాదు.

ఆశ్రితులను అవహేళన చేసిన గురువులు, గురువుల త్యాగాలపై గురిలేని శిష్యులు పతనం కావటం జరిగిన కథలెన్నో వున్నాయి.

అందుకే గురు శిష్యుల మధ్య ఉండవలసినది సదవగాహన, సద్భావనా. అవి లోపించినప్పుడు ఎన్ని ఉన్నా మనిషిలో అన్నీ లోపించినట్లే.

ఈ గురు పూర్ణిమ పర్వదినాన్ని పురస్కరించుకుని సదవగాహనను బోధించే ఈ దివ్యసూక్తితో పరమాత్మను ప్రార్థిద్దాం.

సహ నా వవతు సహ నౌ భునక్తు
సహ వీర్యం కరవావహై తేజస్వినావధీతమస్తు
మా విద్విషావహై.



# సద్గురువు

శ్రీ భాగవతి రామమోహన్‌రావు




నిజమైన గురువు ఎవరో, ఆ సద్గురుని లక్షణాలెటువంటివో తెలుసుకోడం అందరికీ అవసరం. ఆధ్యాత్మిక సాధకులకీ, ఆత్మజిజ్ఞాసులకి ఎంతో శ్రేయస్కరం. వేదాంత శాస్త్రాల్లో "గురు" అనే పదానికి అర్థం ఈవిధంగా చెప్పబడింది:

గుకార స్త్వంధకారోఽస్తు
రుకార స్తన్నిరోధకః,
అంధకారనిరోధత్వం
గురు రిత్యభిధీయతే.

అంటే, "గు" అనే పదం అంధకారాన్ని సూచించేదని, "రు" అనే పదం దాన్ని నిరోధించేదని, అంధకారాన్ని నిరోధించేది కనక, "గురు" అనేది అలా చెప్పబడుతోంది.

అంధకారాన్ని పోగొట్టేవాడు గురువని పై శ్లోకంయొక్క అర్థం. అజ్ఞానానికి మరో పేరే అంధకారం. అజ్ఞానం అంటే: తానెవరో, తన నిజస్వరూపంయేదో, జనన మరణాదులతోకూడిన ఈ ప్రపంచం ఎట్టిదో ఏమీ తెలియక పోవడం. తన సహజ, స్వభావ, నిరతిశయానంద చైతన్య స్వరూపాన్ని గురించిన జ్ఞానం ఎంతమాత్రమూ లేకపోవడమే. జడ పదార్థదాయక, అనిత్యమైన శరీరమే తాను అనుకొనే అహంకార సంకుచిత భావమే అజ్ఞాన బీజం. దానివల్ల, తన నిరవధిక, సహజ, స్వభావ, సత్య స్వరూప చైతన్యానుభవాన్ని తాను కోల్పోయినాడు. కనుక, తన యదార్థ స్వరూపమైన చైతన్యాను భవానికి అవరోధంగావున్న అజ్ఞానాన్ని తొలగించి, తన స్వ స్వరూప దివ్యానుభవాన్ని పొందటానికి సరియైన దారి చూపి, తనకి తోడ్పడేవాడే నిజమైన గురువు. అటువంటి గురు మహనీయుడు ఎక్కడో ఎంతో అరుదుగా వుంటాడు.

ఆశ్రమాలలోనూ, మఠాలలోను, మందిరాలలోను ఈ రోజుల్లో సామాన్యంగా తారసిల్లే, స్వాములను, సన్యాసులను, మఠాధిపతులను గురువులనుకోవడం అపోహే అవుతుంది. వారిలో కొందరు కాషాయాంబర దండ కమండలాదులు కలిగి యున్న వారైనా సరే. శాస్త్ర జ్ఞాన సంపన్నులైన పండితవరేణ్యులైనాసరే. అటువంటి వారినందరినీ గురువులుగా భావించడం చివరికి పొరపాటుగా పరిణమిస్తుంది. కనుక, నిజమైన గురువెవరో గుర్తించుకోడానికి, అటువంటి గురు మహనీయునికుండే లక్షణాలను తెలుసుకోవడం ఎంతో ముఖ్యం.

## గురుని లక్షణాలు

సర్వ కాల సర్వావస్థలయందూ ఆత్మనిష్ఠ యందుండువాడే సద్గురువని భగవాన్ రమణ మహర్షి వారి ప్రబోధాలలో విదితం చేశారు. ఆత్మనిష్ఠ అంటే దేహభ్రాంతిని (దేహాత్మ బుద్ధిని) వదల్చుకొన్నవాడై, జనన మరణాదులతోకూడిన ఈ దృశ్య ప్రపం

చంయొక్క మాయా స్వరూపాన్ని అనుభవ జ్ఞానంతో అవగాహన చేసుకున్నవాడని అర్థం. అలా అవగాహన చేసుకున్న మహనీయుడు, తన సహజ, స్వభావ, స్వరూపమైన ఆత్మ నిష్ఠలోనే ఎల్లప్పుడూ నిరతిశయానందంతో ఓలలాడుతూ వుంటాడు. అటువంటి సద్గురు మూర్తికి - తాను, ఇతరులు అనే భేద బుద్ధి ఉండదు. తాను గురువునని, గొప్పవాడనని, ఉత్తముడనని, ఇతరులందరూ అజ్ఞానంతో నిండి, సంసార బద్ధులై వున్నారని అతనికి తోచదు. అతని దృష్టిలో, ఉన్నదంతా ఏకైక భగవత్ స్వరూపమై భాసిస్తూంటుంది. అతడు దేనినీ ఆశించడు. దేనినీ ద్వేషించడు. పేరు ప్రతిష్ఠలను కీర్తినీ అసలే కాంక్షించడు. స్తుతులను, సన్మానాలను సహించడు. ఆయన దృష్టిలో, అటువంటివన్నీ వట్టి మిథ్యా స్వరూపమైన భౌతిక జగత్తుకు సంబంధించిన అర్థరహిత కార్యకలాపములు. వినయ విధేయతలతో, తనను శరణు జొచ్చిన శిష్యులను విడువకుండా, వారిని అజ్ఞాన మయమైన సంసార సాగరం నుంచి ఉద్ధరించువాడును, శిష్యుడు చెప్పలేని దానిని కూడా తాను గ్రహించి, బోధానుకూల యుక్తులతో, శిష్యుని అజ్ఞానాన్ని తొలగించి, వానికి జ్ఞానోదయం కలిగించేవాడును, అర్హులైనవారి దుఃఖములను, క్లేశములను, అనుగ్రహంతో తొలగించుటకు పూనుకొనువాడును సద్గురువని వేదాంత శాస్త్రాలలో వివరించబడింది.

అలాటి సద్గురువుకి ఐహిక, ఆముష్మిక, సుఖాలయందెటువంటి వ్యామోహమూ వుండదు. సుఖ దుఃఖాది ద్వంద్వాల యందు నిర్వికారుడై వుంటాడు. విషయ రహిత నిర్వాసనాదృష్టి కలిగి వుంటాడు. ద్వేషము, డంబము, మాత్సర్యము, వంచన - ఇలాటి దుర్గుణాల అంశముకూడా ఏమాత్రమూ ఆయనయందు పొడ సూపదు. అహంకార, మమకార రహితుడై, వేదాంత మహావాక్యాల తత్త్వార్థమందు అనుభవ జ్ఞానం కలిగి, అపరోక్ష జ్ఞాన సంపన్నుడై వుంటాడు. అర్హతగల శిష్యులకు, వేదాంత తత్త్వార్థాన్ని బోధించడంకంటె ఇతరమైన ఏ కర్తవ్యమూ ఆ మహనీయుని కుండదు.

గురుత్వమంటే కేవలమూ తన అభిమానానుగ్రహదృష్టి చేతనే శిష్యుని అజ్ఞాన పరమైన మిథ్యాజ్ఞానాన్ని నశింపజేసి, బ్రహ్మ జ్ఞాన శక్తిని పెంపొందింపజేసేదని యోగవాశిష్ఠంలో చెప్పబడింది. సద్గురువుని గురించి యోగ వాశిష్ఠంలో ఇంకా ఇలా స్పష్టం చెయ్యబడింది:-

దర్శనా త్స్పర్శనా చ్ఛబ్దా
త్కృపయా శిష్య దేహకే,
జనయే ద్యః సమావేశం
శాంభవం స హి దేశికః.

అనగా, దర్శనమువలనా, స్పర్శచేతా, కృపాకటాక్షములతోకూడిన ప్రబోధ వాక్యము లవల్లా, శిష్యుని హృదయమందు శివ జ్ఞాన పరమైన ఆత్మతత్త్వ సమావేశమును ఎవడు జనింపజేయగలుగునో, అటువంటి మహనీయుడే నిజమైన సద్గురువు.

సర్వే శృణుత భద్ర వో
నిశ్చయేన సునిశ్చితమ్,
ఆత్మజ్ఞానా త్పరం నాస్తి
గురో రపి చ తద్విధః.

తా॥ ఓ జనులారా! మీకు శుభము కలుగుగాక! మీరందరూ అత్యంత నిశ్చయమైన, పరమ సత్యమైన ఈ మహత్తర విషయమును వినుడు: "ఆత్మ జ్ఞానము కంటెను, ఆత్మజ్ఞానాను భవ జ్ఞుడైన సద్గురువుకంటెను మించినది ఈ లోకమందేదియును లేదు."

## గురుని ఆవశ్యకత

ఆత్మజ్ఞాన సంపన్నుడైన గురువు ముఖమున స్వయముగా బ్రహ్మవిద్యను అభ్యసించాలని, సద్గురుని అనుభవైక ప్రబోధాల వల్లకాక, కేవలము శాస్త్రప్రమాణాలచేత నేర్చుకొన్న విద్య, ఫలప్రదంకాదని, ఆత్మవేత్తలైన సద్గురువులవల్ల నేర్చుకొన్న విద్యయే సుస్థిరమైన, ఫలప్రదమైన ఆధ్యాత్మిక ప్రగతిని కలుగజేస్తుందని శ్రుతులలో చెప్పబడింది. అయితే, పక్వ జీవులైన కొందరు మహనీయులు, ఏగురువునూ ఆశ్రయింపకయే, స్వక్రమమైన, స్వకీయమైన పురుష ప్రయత్నం చేసుకుని, ఆత్మసిద్ధిని పొందడం కూడా గమనార్హం. అటువంటివారికి వారి అంతర్యంలోవున్న పరమాత్మ స్వరూపుడే తోడ్పడుతూ, ఆధ్యాత్మిక ప్రగతినీ, ఆత్మజ్ఞానాన్నీ ప్రసాదిస్తుంటాడు.

సూక్ష్మంగా చెప్పాలంటే, తాను నామ రూపాలుగల శరీరుడననే దేహాత్మభ్రాంతి తొలగి పోనంతవరకూ, తనను ఒక వ్యక్తిగా, దేహిగా తాను భావించుకొనుచున్నంత కాలమూ, తనకు గురువు అవసరమే. అలా కాక, శరీరభ్రాంతి వదలి, తాను దేహిని ఎంతమాత్రం కాదని, నిత్య సత్యాత్మ స్వరూపమైన బ్రహ్మ స్వరూపుడనేనని అవగాహన అయిన మాన వోత్తమునికి, ఆత్మయే సద్గురువుగా భాసిస్తుంది.

## గురు ప్రార్థన

పదవాక్య ప్రమాణజ్ఞై
ర్దీపభూతైః ప్రకాశితమ్,
బ్రహ్మవేద రహస్యం యై
స్తా న్నిత్యం ప్రణతోఽ స్మ్యహమ్.

(ఉ. సా.)

తా॥ వేదాంత మహావాక్య ప్రమాణాల్ని సంపూర్ణంగా ఎరిగిన వాడవటం వల్ల, దీపం వస్తువుల్ని ఎలా ప్రకాశింప జేస్తుందో, అలా వేద రహస్యమైన బ్రహ్మ స్వరూపాన్ని ప్రకాశింపజేసి, శిష్యుడికి గోచరింప జేసే సద్గురు మహనీయునికి సర్వదా ప్రణామము లర్పించుచున్నాను.

మంగళం గురుదేవాయ
మహనీయ గుణాత్మనే,
సర్వలోక శరణ్యాయ
సాధురూపాయ మంగళమ్.










ధర్మప్రచార పరిషత్ కర్నూలు శాఖ ఆధ్వర్యంలో నంద్యాలలో జరిగిన పురాణ ప్రవచనం



ఇటీవల మచిలీపట్నంలో జరిగిన అన్నమయ్య జయంతి





ధర్మప్రచార పరిషత్ ఆధ్వర్యంలో
చిత్తూరు జిల్లాలో జరిగిన 'ధార్మిక కార్యక్రమాల దృశ్యాలు'



(గత సంచిక తరువాయి)

అమ్మరో! నీ వియోగదుఃఖార్తు డతడు
భ్రాతృమిత్రయుతుడు పంప వచ్చినాడ
మర్కటాధీశు సుగ్రీవు మంత్రి నేను
ఊరడిల్లుము శుభములే ఒదవు నీకు."

ఆమె ప్రశ్నించె హనుమవాక్యముల వినుచు
"లక్షణము లేవి శ్రీరామలక్ష్మణులకు?
వనమునందున నరులకు వానరులకు
స్నేహ మెట్టులు కలిగెనో చెప్పు మయ్య!"

సూక్ష్మముగ జెప్ప తేజస్వి లక్ష్మణుండు
భ్రాత సరిపోలు సుగుణ రూపాలలోన;
అధికచింతాభరనిమగ్ను లగుచు వారు
నిన్ను వెదకుచు వనమున నన్ను గనిరి.

వానరేశు సుగ్రీవుని ద్వార లరయ
నగముపై నీవు విడిచిన నగలమూట
చూపె కపిరాజు; రాముడు శోకవార్ధి
మునుగ ఓదార్చి కూర్చెను ముదము నతడు.

# రావుల రామాయణము

రామదూత యిట్లు వచించె నామె గాంచి
"ఆంజనేయాభిధానుండ నమ్మ! నేను
తేజమందున రాము డాదిత్యసముడు
సముడు బుద్ధిసంపద బృహస్పతి కతండు.

వినయ మొప్ప చదివి యజుర్వేద మెల్ల
వేదవిదులచే నాతండు వినుతు లందె
వేదవేదాంగ విద్యల విశ్రుతుండు
వెలది! పరినిష్ఠితుడు ధనుర్వేదమందు.

స్వీయజనమునె కాక రక్షించు నతడు
ప్రత్యహంబును జీవప్రపంచ మెల్ల
రాముడు వినీల నీరద శ్యామలుండు
బ్రహ్మచర్యవ్రతమ్మున బరగుచుండు.

అధిక బలశాలి సుగ్రీవు నాజ్ఞ కపులు
నిన్ను వెదకంగ వెడలిరి నిఖిలదిశల
పథములో పక్షిరాజు సంపాతి మాకు
చూపె దారి జటాయువు సోదరుండు.

రామచంద్రకృతోద్యోగ రతుడ నేను
కంటి నిను నిస్తులంబగు ఖ్యాతి గాంచ
అమ్మ! నేను చేయంగ యోగ్య మ్మదేది
తెలియ జెప్పుము నీవింక స్తిమితబుద్ధి.

"అరయు మిదిగో శ్రీరామనామాంకితమ్ము
అంగులీయక మొసగె మహాత్ము డతడు"
దాని గాంచినతోడనే తలచె సీత
ప్రియుడు భర్తయే తనకు కన్పించినట్లు.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి

'చంద్రశేఖర్'

రామచంద్రుని క్షేమవార్తలను వినగ
పడతి కనుల ఆనందబాష్పాలు దొరలె
సంతసంబందిన అవనిజాత సీత
బుద్ధిశాలిని హనుమను పొగడ దొడగె.

"ఓ కపిశ్రేష్ఠ! చొచ్చితి వొంటివగుచు
దుర్గమంబగు పద మిది దుస్తరంబు
అరయ వారాశి శతయోజనాయతంబు
దాటినాడవు శౌర్యము ధైర్య మలర.

వానరోత్తమా! నీకు రావణునివలన
సంభవించవు భీతియు సంభ్రమమ్ము
రామలక్ష్మణు లిరువురు క్షేమ మనుచు
తెలుప నిపు డీవు ప్రాణాల నిలువ గలిగె."

జనపరిత్రాత ధర్మరక్షణపరుండు
నన్ను గొనిపోవ యత్నించు చున్నవాడె?
రావణుడు నిజ బంధుమిత్రాళితోడ
అస్త్రహతుడగు టెపుడు కన్నార చూతు!"

రామభద్రుండు పుడమి ధర్మంబు నిలుప
అతులరాజ్యంబు విడియేగు నపుడు కాని,
అడవి నున్నప్పుడును గాని అడల డయ్యె
చెలియ నెడబాసి దైన్యము చెందె నిపుడు.

అధికులుగ సములుగ కూడ అరయ డతడు
తల్లిదండ్రుల స్నేహబంధాన నీకు"
"కాన కష్టంబు లేవేని కాని నేను
విభుడు వచ్చెడు దాక జీవింతు నెట్లొ."

పలికె మారుతి నుదుట నంజలి ఘటించి
"సుఖ మెరుంగడు రాముడు శోకపరత
నిన్నె ధ్యానించుచుండును నిత్యమతడు
శ్రీ రఘువరుండు వచ్చును శీఘ్రగతిని."

"రావణుం డిడ సంవత్సరమ్ము గడువు
కపివరా! అందు పదినెలల్ గడచిపోయె
రామచంద్రుని నన్ను జేర్పంగ ప్రీతి
అన్నను విభీషణుడు వేడి విన్నబోయె."

సందియములేదు శుభగుణసంయుతుండు
రామచంద్రు డొసగు నాకు రక్షణమ్ము"
అనివచించుచు శోకంబు నంద సీత
అనిలుపట్టి మహావీరు డనియె నిట్లు.

"విషయ మెరిగింప సమకూర్చి వివిధకపుల
రాము డిచటి కేతెంచు శీఘ్రముగ, లేక
సుదతి! నా భుజపీఠి కూర్చుండ నీవు
నిలిపెదను రాము సన్నిధి నిముసమందె."

సీత పలుక "నీదింతటి చిన్నమేను
భుజముపై నెట్లు నను కొనిపోదు" వనిన
కనుచు నుండగ జానకి గాడ్పుపట్టి
మేరుశృంగోన్నతంబుగ మేను పెంచె.

అవనిజాత మహాసాధ్వి అనియె నిట్లు
"అరసితి భవన్మహాసత్త్వ మాంజనేయ!
అభ్రవీథి వేగమున నీ వరుగునపుడు
వననిధిని నేను పడవచ్చు కనులు తిరిగి.

కానిచో క్రూరదైత్యుల కంటబడగ
బలయుతులు సాయుధులు వారు, పట్టి నీకు
ఘోరయుద్ధాన కీడు చేకూర్చవచ్చు
గెలిచినను నీవు పతికీర్తి కించపడును.

సార్థకంబుగ నీ పృథుయత్నమెల్ల
తెమ్ము వేగమె సైన్యసందీప్తు రాము;
స్వప్నమందేని స్పృశియింప పరపురుషుల
తనువు వివశంబుగా నన్ను తాకె ఖలుడు.

తోచదు సముచితముగ నీ తోడరాగ
వింటి కంటి గాథల మహావీర రాము
సాటిలేరు భువనమ్ముల మూట నెవరు;
రాముని సలక్ష్మణుని తెమ్ము రయము మీర."

"చూడ యోజనశతము కూర్చుండలేవు
అన్యపురుషుల తాకని అనఘచరిత!
ఎనెద నొసగుము భవదభిజ్ఞాన మొకటి
శుభవచస్సుల ప్రియునికి చూప నేను."

హనుమ కమనీయవచనము లాలకించి
అశ్రునయనాలతో నిట్టు లనియె సీత
"వాయుపుత్ర! చెప్పెద ఆనవాలు గాగ
వినుము రాఘువునకు నీవు ప్రీతి దెలుప.

"చిత్రకూట నగమ్మున చెలువ మొప్ప
తాపసాశ్రమ మందున్న తరుణమందు
దివ్యమందాకినీ నదీ తీరమందు
చక్కగ వనవిహారము సలిపినాము.

నాడు పుష్పవృక్షాల సౌందర్య మరసి
అలసిపోయిన నేను నీ అంక మందు
తలనిడి పరుండ పొడువ మొదలిడె నిన్ను
మాంసవాంఛను కాకమ్ము మరల మరల.

దాని బెదరించి బెడ్డతో తరిమివేయ
పొడుకాకి వదలక నాపైట లాగి
నాన ముంచిన నను జూచి నవ్వినావు
ఊరడించితి వెంతయో చేరదీసి.

తిరిగి నా అంకసీమ నిద్రింప నీవు
కాకి నా స్తనమధ్యంబు గాయపరచె;
సోక నెత్తురు నీవు సుషుప్తి వీడి
కాంచినావు క్రోధంబు కాకంబు పైని.

దర్భ ఒక్కటిగొని మహాస్త్రముగ మార్చి
దానిపై ప్రయోగింపగ తరుమసాగె
శరము; ప్రాణభీతిని కాకి శరణువేడ
మూడులోకాల నెవరు కాపాడలేదు.

శరణ మనుచు కాకి నీ పదాబ్జముల వ్రాల
వ్యర్థమయిపోదు బ్రహ్మాస్త్రమంటి వీవు
కాకి సిద్ధపడుచు కుడికన్ను నిడగ
అస్త్ర మరిగెను పయి దక్షిణాక్షి గొనుచు.

చావు తప్పెను కనులొట్ట పోవుగాక!
కాకి తనదారి నేగెను నీకు మ్రొక్కి
అలతి కాకికి విడిచి బ్రహ్మాస్త్ర మట్లు
సతి హరించిన రావణుపైప దగునె?

సీత హనుమంతు గాంచి వచించె నిట్లు
"ప్రథితవీరుడు రాముడు రా డదేల?
మిన్నకుండె నే కతము సుమిత్రసూతి?
ఇటు లుపేక్షింపగా వారు హేతువేమొ!"

అనియెను మహాత్ము డంజనాతనయు డిట్లు
"రామచంద్రుడు శుద్ధధర్మజ్ఞు డతడు
నిత్యశోకసంతప్తుడు; నీ వ్యథార్తి
తమ్ముడగు లక్ష్మణుండును తల్లడిల్లు.

"కాల్చివేసి శరాగ్ని లంకాపురమ్ము
సంహరించును ఖలుని నిస్సంశయముగ
పురి కయోధ్యకు నిను గొనిపోగలండు
సీత! చెప్పంగదగు నుడుల్ చెప్పు మమ్మ!"

అనియె శోకోపహతయైన అవనిజాత
"వాయుసుత! నాకు మారుగా వంచి శిరము
క్షేమ మడుగుము నీవు శ్రీరామవిభుని
మృదులవచను నడుగుము సౌమిత్రి నట్లె.

(సశేషం)



# దేవతలారా! దీవించండి!

శ్రీ నదాథూరు జగన్నాథాచార్యులు

ఆగమములు, పురాణ ఇతిహాసములు, ధర్మశాస్త్రములు అన్నీ కూడ దేవతారాధన గురించి చెప్పబడినవి. మానవజీవితం పొంది నందుకు భగవత్ప్రాప్తి పొందాలి. అందుకు సదాచరణ, శౌచము మొదలైన నియమము లతో భగవంతుని ఆరాధించాలి. అయితే దేవతలు ఎంతమంది ? ఏయే దేవత లను ఏ ఏ సమయాలలో ఆరాధించాలి ? అనేది తెలుసుకోవాలి. మనకు శాస్త్ర ప్రకారంగా 33 కోట్ల మంది దేవతలు గలరని తెలియుచున్నది.

ఈదేవతలలో ప్రధాన దేవతలుగా సృష్టి, స్థితి, లయ కారకులైన బ్రహ్మ, విష్ణు, మహే శ్వరులను చెప్పవచ్చును. మిగిలిన దేవతలలో 2 శ్రేణులు కలవు. 1. దేవతా శ్రేణి 2. ఉప దేవతాశ్రేణి.

## 1. దేవతాశ్రేణి

ఈ దేవతలలో 9 గణములు కలవు.

*1. ఆదిత్య గణము :-*

వీరు 12 మంది. 1. వివస్వాన్. 2. అర్యమ్, 3. పూషా. 4. త్వష్టా. 5. పవితా. 6. భగ. 7. ధాత. 8. విధాత 9. వరుణ. 10. మిత్ర. 11. శక్ర. 12. ఉరుక్రమ.

*2. తుషితగణము :-*

వీరు 12 మంది. 1. దర్మ. 2. పౌర్ణమాస. 3. బృహత్. 4. రథన్తర. 5. విత్తి. 6. వివిత్తి 7. ఆకూతి. 8. కూతి. 9. విజ్ఞాతి. 10. జ్ఞాత. 11. మన. 12. యజ్ఞ.

*3. విశ్వే దేవగణములు :-*

వీరు 10 మంది. 1. క్రతు. 2.దక్ష. 3.సత్య. 4. వసు. 5. ధూలి. 6. రోచన. 7. పురూరవ. 8. ఆర్ద్రవ. 9. కాల. 10. కామ.

**4. సాధ్య గణము :-**

వీరు 12 మంది. 1. ప్రాణ. 2. అపాన. 3. ఉదాన. 4. సమాన. 5. వ్యాన. 6. చక్షు. 7. శ్రోత్ర. 8. రస. 9. ఘ్రాణ. 10. స్పర్శ. 11. బుద్ధి. 12. మనస్సు.

**5. అభాస్వరగణము :-**

వీరు 64 మంది గలరు. వీరిని ఆరాధించుట వలన దేశము, ప్రజలు ధన ధాన్యసమృద్ధి కలిగియుందురు. వీరందరికి వేరు వేరు పేర్లు ఉన్ననూ సమిష్టిగా అభాస్వరగణముగానే పూజలందుకొనుచుందురు.

**6. మరుద్గణము :-**

వీరు 49 మంది.1.సత్యజ్యోతి. 2. ఆదిత్య. 3.సత్యజ్యోతి. 4. తిర్యక్‌జ్యోతి. 5. సజ్యోతి. 6. జ్యోతిష్మాన్. 7. హరిత. 8.ఋతజిత్తు. 9. సత్యజిత్తు. 10. సుషేణ. 11. సేనాజంతు. 12. సత్యమిత్ర. 13. అభిమిత్ర 14. హరిమిత్ర 15. కృత. 16. సత్య. 17. ధృవ. 18. ధర్తా. 19. విధర్తా. 20. విధారయ. 21. ధ్వాన్త. 22. ధుని. 23. ఉగ్ర. 24. భీమ. 25. అభయ. 26. సాక్షిప. 27. ఋక్. 28. ఈదృక్. 29. అన్యాదృక్. 30. యాదృక్. 31. ప్రతికృత్. 32. సమితి. 33. సంరంభం. 34. ఈదృక్ష. 35. పురుష 36. అన్యాదృక్ష. 37. చేతస. 38. సమ్మతి. 39. సమీదృక్ష. 40. ప్రతీదృక్ష. 41. మరుత. 42. సరిత. 43. దేవ. 44. దిశ. 45. యజుః 46. అనుదృక్. 47. సామ. 48. మానుష. 49.విస.

**7. మహోరజిక గణము :-**

వీరు మొత్తం రెండువందల ఇరవైమంది. వీరందరూ కూడ సమిష్టిగానే సంచరించుదురు. సమిష్టిగానె పూజలందుకొందురు. వీరిని ఆరాధించుట వలన శాంతి, సహనము, నిష్కామభక్తి, జ్ఞానము కలుగును. వీరు అసంఖ్యాకముగా వ్యాపించి ఉండుట చేత మహోరజిక గణము అనుపేరుతో పిలువబడుచుండిరి.

**8. రుద్ర గణము :-**

వీరు 11 మంది. వీరిని ఏకాదశరుద్రులు అందురు. 1. మన్యు. 2. మను. 3. మహినస. 4. మహాన్. 5. శివ. 6. ఋతధ్వజ. 7. ఉగ్రరేత. 8. భవ. 9. కాల. 10. వామదేవ. 11.ధృఢవ్రత.

**9. వసు గణము :-**

వీరు 8 మంది. వీరిని అష్ట వసువులు అందురు. 1. అప. 2. ధృవ. 3. సోమ. 4. ధర్మ. 5. అనిల. 6. అనల. 7. ప్రత్యూష. 8. ప్రభాస. (ఇది విష్ణు పురాణము ప్రకారము)

1. ద్రోణ. 2. ప్రాణ. 3. ధృవ. 4. అర్క. 5. అగ్ని. 6. దోష. 7. వసు. 8. విభావసు. (ఇది శ్రీమద్భాగవతము ప్రకారము)

## 2. ఉపదేవతాశ్రేణి

ఈ దేవతలలో 10 గణములు కలవు.

1. విద్యాధర గణము. 2. అప్సరస గణము. 3. యక్ష గణము. 4. రాక్షస గణము. 5. గంధర్వ గణము. 6. కిన్నెర గణము. 7. పిశాచ గణము. 8. గుహ్యాక గణము. 9. సిద్ధ గణము. 10. భూత గణము. ఇదే విధముగా పితృగణము, చారణ గణము, నాగ గణము, గరుత్మంతుడు ప్రధానంగాగల పక్షి గణము, హనుమంతుడు ప్రధానంగా గల వానర గణము కూడ దేవతా గణములలో చేర్చబడినవి. వీరందరికీ అణిమా, గరిమాది అష్టసిద్ధులు కలవు. ప్రత్యక్షమగుట, అంతర్ధానమగుట కలదు. ఆకాశగమనము చేయుశక్తి విశేషముగా వీరికి గలదు.

ఇంకా దేవతాశ్రేణిలో ఆదిత్యాది నవగ్రహములు. ఇంద్రాది అష్టదిక్పాలకులు కలరు.

బృహ దారణ్యక ఉపనిషత్తులో ఒకచోట శాకల్యమహర్షి యాజ్ఞవల్క్య మహర్షిని దేవతలు ఎంతమంది అని ప్రశ్నించగా ఆయన 3 వేల 3 వందల అరవై మంది అని చెప్పెను. మళ్ళీ మళ్ళీ ప్రశ్నించగా క్రమేణా 33 మంది, ఆరుగురు, ముగ్గురు, ఇద్దరు, చివరకు ఒక్కరే అని చెప్పిరి. అంటే హిందూ ధర్మశాస్త్రములో బహుదేవతా వాదము ఉన్నప్పటికిని కూడ సర్వేశ్వరుడు, మోక్ష ప్రదాత. శ్రీమన్నారాయణుడే అని తేల్చి చెప్పిరి.

## 1. విష్ణుమూర్తి

శాంతాకారం భుజగశయనం
పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్,
లక్ష్మీకాంతం కమలనయనం
యోగిహృద్ధ్యాన గమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్.

అని ఈవిధంగా విష్ణు భగవానుని ధ్యానించి ఆరాధించాలి. కేవలం సాత్త్విక జనులు నారాయణుడే పరతత్త్వమని ఎరింగి పంచసంస్కార పూర్వకముగా వైష్ణవ మతాన్ని స్వీకరించి శ్రీమన్నారాయణుని ఆరాధించి అంత్యమున విష్ణువుయొక్క నివాస స్థానమైన పరమపదమును చేరి నిత్యముక్తులై జన్మరాహిత్యమును పొందుదురు.

విష్ణుమూర్తి ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు క్షీర సాగరమున శయనించును. కనుక ఈ ఏకాదశికి శయన ఏకాదశి అనిపేరు. కార్తీక శుద్ధ ఏకాదశినాడు క్షీరసాగరమున శయనించియున్న విష్ణుమూర్తి మేల్కొని దేవతలందరుకు దర్శనమును కలుగజేయును. కాన ఈ ఏకాదశికి ఉత్థాన ఏకాదశి ప్రభోదన ఏకాదశి అనిపేరు. ఆ మరునాడు క్షీరాబ్ధి ద్వాదశి వ్రతము చేసిన సకలసంపదలు కలిగి సుఖించెదరు.

మానవలోకంలో మానవులు పాపకర్మలు చేస్తూ భగవంతుని యందు భక్తిశ్రద్ధలు లేక "పునరపి జననం పునరపి మరణం" అన్నట్లు పాపకర్మల ఫలితముగా జనన మరణరూపమైన సంసార చక్రమున పడుతూ ఉండిరి. అట్టి వీరిని తరింపజేయుటకై అనేక శాస్త్రములను భగవంతుడు ఈ మానవునికి ప్రసాదించెను. కానీ "అనంతశాస్త్రం బహువేదితవ్యం అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః" అన్నట్లుగా

(37వ పేజీలో)

# సింహగిరి వచనాలు

శ్రీ జి. బాలశ్రీనివాసమూర్తి

తెలుగు సాహిత్యంలో ఆధునిక దశ ఆరంభమయ్యే వరకు గుణాత్మకంగా కొన్ని విభజనలు కన్పించేవి. ఇవి మిగతా భారతీయ భాషా సాహిత్యాల్లో అరుదుగా ఉన్నాయి. అయితే తెలుగు సాహిత్యంలో ప్రధానంగా కవిత్వం భక్తి - శృంగారాలతో కేంద్రీకృతమై నట్టుగా కన్పిస్తుంది. ఆనాడు రాజుల, సంస్థానాల రాజుల ఆస్థానాల్లోని కవులు దాదాపుగా అందరూ సంస్కృత కావ్యాల్లోని చిన్న చిన్న వస్తువులను తీసుకొని శృంగార మయంగా రచనలు చేశారు. ఇవి ఆ కవి పోషకులకు ఆనందాన్ని కల్గించేవి. ప్రబంధ ధోరణిలో ఇదే కన్పిస్తుంది. ఇదే సమయంలో మరి కొద్ది మంది కవులు మాత్రం శృంగారానికి విరుద్ధంగా, సమాంతరంగా అంకిత భావంతో భక్తి సాహిత్యాన్ని సృష్టించారు. వీరిలో చాలామంది పేదలు, పరమ సాత్త్వికులు. రాజాస్థానాల కితాబులకు, సుఖాలకు ఎంతో దూరంగా ఉన్నారు. తమ కవితా శక్తిని భక్తి ఉద్యమానికి అంకితం చేశారు. పోతన, పరశురామ పంతుల లింగమూర్తి వంటివారు ఈ కోవకే చెందుతారు. ఇదే వరుసలో మరింత ముందుకు పోయి తెలుగువచనానికి ఒరవడి పెట్టిన భక్త సాహిత్యమూర్తి "సింహగిరి నరహరి వచన"కర్త కృష్ణమాచార్యులు. తెలుగులో తొలిసారిగా స్వతంత్రంగా వచనం రాసిన వాడు కృష్ణమాచార్యులే నంటూ ప్రముఖ పరిశోధకులు ఆచార్య కులశేఖరరావు "భక్తి ప్రధానములై స్తోత్ర రూపములుగా నుండి సంకీర్త నాత్మకముగానున్న వచనములలో కాలక్రమము ననుసరించి కృష్ణ మాచార్యులు రచించిన సింహగిరి వచనములు మొదటివి" అనివ్యాఖ్యానించారు.

సాహిత్యంలో నాటినుండీ కవిత్వం పెద్ద పీట వేసుకుంది. వస్తువు ఏదైనా రూపం మాత్రం కవిత్వమే! అయితే సంప్రదాయానికి విరుద్ధంగా కృష్ణమాచార్యులు తన భక్తి భావనను వచన రూపంలో అందించడం విశేషం. ఆయన తర్వాతే తాళ్ళపాక కవులు, రాయవాచకం రాసిన స్థానాప తి, సముఖం వెంకటకృష్ణప్ప వంటి వారు ఎన్నో వచన రచనలు చేశారు. హృదయగతంగా పొంగి పొరలే భక్తిని వచన రూపంలో అందించిన కృష్ణమాచార్యుల సింహగిరి నరహరివచనాలు తెలుగ సాహిత్యంలో భక్తికి ప్రతిరూపంగా చిరస్థాయిగానిలిచిపోతాయి. నాలుగు లక్షల వరకు ఈ రకమైన వచనాల్ని ఆయన రాశా డని అంటారు కానీ ఈనాడు అవి చాలా తక్కువగా లభ్యమవుతున్నాయి.

కృష్ణమాచార్యుల గురించిన కాల నిర్ణయం ఇంకా ఖచ్చితంగా జరగలేదు. ఈ అంశంపై పరిశోధన చేసిన కొంతమంది ఆయన ప్రతాపరుద్రుని కాలంలోని వాడని అభిప్రాయపడ్డారు. క్రీ.శ. 13-14 శతాబ్దాల మధ్య జీవించి ఉంటాడని వీరి అభిప్రాయం. ఉప్పొంగుతున్న ఆవేశంతో దేవా! అని పదే పదే సంబోధిస్తాడు వచనకర్త. సాధారణంగా



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

విద్యే సౌందర్యం | విద్యే దైవం

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని *"ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటి, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్."* వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి

అనాథ పతీ, స్వామీ, సింహగిరి! నమోనమో దయానిధీ, అని ముగుస్తుంది. ప్రతి వచనానికీ విస్తరణ రీత్యా ఏ నిబంధనలూ లేవు. భక్త్యావేశం కొంత చల్లబడగానే వచనం ముగుస్తుంది. అయితే "దేవా, పరమపురుషా దేవా, దయాపరా, పరమ ధర్మనికరా, నిత్య నిరంజనా, నిర్వికల్పా, దుఃఖవిమోచనా, మంగళాకారా, దోషనిగ్రహణా, నిరవంద్యా, నిరవధికా, నిరాలంబా, నిరాశ్రయా, నమో, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ" అని సంబోధనంతోనే ముగిసిన వచనాలు కూడా ఉన్నాయి. తన వచనాల్ని ఇలా ఆరంభించాడు కృష్ణమాచార్యులు.

"దేవా, ఇంద్రాది దేవతలు నూఱును, హిరణ్య గర్భు లిన్నూరును, కాశ్మీర గిరులు మున్నూరును, తిలదాంచన గిఱులు నన్నూరును, పతివ్రతలేనూఱ్లును, అగ్రహారంబు లెనిమిది నూఱ్లును, స్త్రీమూర్తులేడు నూఱ్లును, మభయస్తోమకు లెనిమిదినూఱ్లును, హేమస్త్రీ గర్భంబులు తొమ్మిది నూఱ్లును, కపిల ధేనువులు వేయిని, కాలచక్రంబులు లక్షయును, తులా పురుషంబులు కోటి యును, కన్యకా దానంబులు పదికోట్లును, నివి యన్నియు గూడిన మీ దివ్యనామ సంకీర్తన వినినందులకు వేయిలో నొక్క భాగంబునకు సరిగావు, సరిగావు."



తెలుగు సాహిత్యంలో ఆనాటి భక్త కవులు సమకాలీన సమాజంలోని అనేక అన్యాయాల్ని వాస్తవిక దృష్టితోనే ఆలోచించారు. కొందరు సమాజంలోని పెద్ద మనుషులతో ఈవిషయంలో సంఘర్షించారు. మరికొందరు ఆవేదనను భగవంతునికి విన్నవించుకున్నారు. ఈ రకమైన భావనలు ఎన్నో కృష్ణమాచార్యుల వచనాల్లో కన్పిస్తాయి. కరుడు గట్టిన కుల వ్యవస్థ, అగ్రనిమ్న తారతమ్యాల్ని శ్రీ రామానుజాచార్యుల వారు ఆనాడే తీవ్రంగా ఖండించి భవిష్యత్తుకు దారితీశారు. కృష్ణమాచార్యులకు శ్రీ రామానుజులంటే ఎంతో గౌరవం. అలాగే ఆయన భావాల ప్రభావం కూడా సింహగిరి వచనాల్లో కన్పిస్తుంది. అందుకే ఒక వచనంలో "దేవా! శ్రీ రామానుజ సిద్ధాంతమును బోలు మఱి సిద్ధాంతము, పరమా చార్యులంబోలు మఱి ఆచార్యులు లేరు"అని ప్రస్తుతించాడు. మరొక దగ్గర "దేవా! శమ దమాది గుణంబులు కలిగిన బ్రాహ్మణుం డుత్తముండు. శమ దమాది గుణంబులు గలిగిన క్షత్రియుండుత్తముండు, శమ దమాది గుణంబులు గలిగిన శూద్రుం డుత్తముండు . . . . . . .దేవా! విష్ణు భక్తిలేని విద్వాంసుని కంటె హరికీర్తనము సేయునతడె కులజుండు, శ్వపచుండైననేమి? ఏవర్గంబైననేమి? ద్విజుని కంటె నతడె కులజుందు" అని ధైర్యంగా ఆకాలంలోనే తన అభిప్రాయాల్ని వెల్లడించాడు వచనకర్త.

భక్తి రచనలు చేసే వారిలో శివ-కేశవ భేదభావం ప్రధానంగా కన్పిస్తుంది. దీనికి సింహగిరి నరహరి వచనాలు మినహాయింపు కాదు. వివిధ దేవుళ్ళను దేవతల్ని అస్థిరంగా పూజించడం బదులు నమ్మిన ఒకే దేవుణ్ణి గాఢంగా కొలవడం మంచిదని కృష్ణమాచార్యుల భావన. ఈధోరణిని బలపరుస్తూ ఆయన "దేవా! (శ్రీ) పర్వతంబునకు బోయి శైవులగుదురు. తిరుపతుల జూచి వైష్ణవులగుదురు. శుక్తిమంతంబును జూచి కుశాలులగుదురు. ఇటువంటి మనస్సంచలనమునగడా రౌరవాది నరక గతిమై ఇహ పరములు లేకుండుట" అంటాడు. అట్లాగే ప్రపంచంలోని ప్రతి అణువునూ, జీవనిర్జీవాల్ని కూడా తను కొలిచే విష్ణురూపంలోనే

చూశాడు కృష్ణమాచార్యులు. తాను ఏర కంగా చూసినా విష్ణు దేవుని మెప్పించలేనని భావించాడు. ఎందుకంటే అన్ని రంగాల్లో ప్రముఖులైన వారందరూ విష్ణువు సన్నిధిలోనే ఉన్నారు. దీన్నే ఒక వచనంలో" దేవా! పెద్ద తనంబు సేసి మిమ్ము మెప్పించెదనంటినా జాంబవంతుండు మీ సన్నిధినే యున్నాడే, దేవా! బంటుదనంబు సేసి మెప్పించెద నంటినా యండ వాయు సుతుండు హను మంతుండు మీసన్నిధినే యున్నాడే . . . ." ఇలా సాగుతుంది.

భక్తి పారవశ్యంతో రచనలు చేసే వారు సాధారణంగా తమ గత జీవితంలోని కొన్ని ఐహిక సంబంధ అంశాల్ని భగవంతుని ముందు విన్నవించుకుంటారు. అట్లాగే కృష్ణ మాచార్యులు కూడా "దేవా! మీకు మొఱ వెట్టి విన్నపము చేయుచున్నాడను. సంసార మోహ బంధంబుల దగులు వడితిని. కాంతల మీది కోరికలు డాపెను. కామాంధకారము కన్నుల గప్పెను. కర్మవారధి గడువ దయ్యెను. అపర కర్మములకు లోనైతిని. అజ్ఞాన జడుండనైతిని. అధమాధముండ నైతిని. అందని ఫలముల కఱ్ఱులు సాచి తిని. దుష్ట దురాచారుండనైతిని. మూఢుండ నైతిని" అని చెప్పుకున్నాడు. ఈ లోకంలో చాలామంది కేవలం జీవితంలోని సుఖాలు వాటికోసం మనిషి పడే తాపత్రయం, అతి నీచమైన ప్రయత్నాలు ఇవన్నీ కృష్ణమాచార్యు లను ఆలోచించేలా చేశాయి. ఆధ్యాత్మిక చింతనలో వైరాగ్యం వైపు నడిపించాయి. తను, రక్త సంబంధాలు మోక్ష మార్గానికి అడ్డంగా నిలుస్తున్నాయని అవి తెగిపోవాలని ఆయన భావించాడు. అందుకే "నిత్య పదం బైన మీ దివ్య నామ సంకీర్తన బఠింప నేరక సర్వ దేవతలు సాక్షియైన భర్తను విడిచి పరమపురుషుం గోరు వ్యభిచారిణి విధంబున నున్నవాడను. నన్ను గృతార్థు జేయవే" అని భగవంతుడిని వేడుకున్నాడు.

దేహం మీద ఉన్న మమకారంపోయి దేహమంటే ఒక రక్తమాంసాల, మలమూత్రాల లోలుతిత్తి అన్న భావన ఏర్పడటం వైరాగ్యానికి పరాకాష్ఠ. ఇది సింహగిరి వచ నాల్లో ఒకచోట విస్పష్టంగా కన్పిస్తుంది. ఈ భావన ఏర్పడ్డ తర్వాత వ్యక్తిలో మరో దర్శనం కన్పిస్తుంది. అందుకే "దేవా! తను వులు మాయ, తలపోసి, తలపోసి చెప్పెద నంటినా కళకళల మోహమిది, ఆశలపాశా ణంబిది. అతుకుల జల్లెడ యిది. తన బ్రతుకు కొఱకు పోరాడి పోరాడి యొరులం జెఱచెడు దుర్గంధపు డొంకయిది. నీరుబుడ్డ, ఊట చెలమ, తూంట్ల బాన, తాడరి దుర్గంధమును బాలు(చు)ను. మాటలేకానీ మఱి యెందుకు బసలేదు. నోటను ముఱికి, దంతంబులబావి, నాశికంబున ఊళె, నయనంబుల పీళె, చెవి లోని గుల్మి, చెట్టలకొంప, మూటగట్టుకున్న మలమూత్రముల తిత్తి, చీమునెత్తుట జడిపు రుగుల జలదారి . . . . ." అని వాస్తవికతను బయట పెట్టాడు కృష్ణమాచార్యులు.

జీవితంలో పరిశుద్ధతకు, పవిత్రతకూ కేవలం విష్ణువైన నరహరిస్తుతులే మార్గ దర్శ కాలని అంకిత భావంతో నమ్మాడు కృష్ణ మాచార్యులు. అందుకే "దినదినంబులు దుర్భాషలాడిన నా జిహ్వకు మీదివ్య నామ సంకీర్తనం బొకటి చాలదా?" అని ప్రశ్నిం చుకున్నాడు. ఎన్ని భరించి ఊహించరాని పాపాలు చేసినా కేవలం నారాయణుని స్మర ణతో అతను భాగవతోత్తముడు అవుతాడని కృష్ణమాచార్యుల ప్రగాఢ విశ్వాసం. "విప్రవధ లనేకంబులొనర్చి సురాపాన సువర్ణ ఘాత కాది మహా పాతకంబులు సేసిన యతండై నగాని, ఏక నిమిషంబున మీ దివ్య నామ సంకీర్తన చేసిన యతండే నారాయణశ్రే ష్ఠుండు కాకుండునా" అని ఒక విషయంలో ప్రశ్నించు కున్నాడు.

ఒకటి రెండు కథల్ని కూడా సింహగిరి నరహరి వచనాల్లో కృష్ణమాచార్యులు వెల్ల డించి తను అంకిత భావంతో నమ్మిన విష్ణు భక్తిప్రభావాన్ని చూపించారు. పూర్వం వరం గల్లులో (ఓరుగల్లు) ఒక అగసాలె వ్యక్తి ఉండే వాడు. ఆయనకెపుడు ఆయన చనిపోయిన తర్వాత భార్య తానుకూడా సహగమనం చేద్దామని భర్త శవంతో పాటు పోసాగింది. ఈ సమయంలో కృష్ణ మాచార్యులు తోవలో కన్పించాడు. అగసాలె వ్యక్తి భార్య కృష్ణ మా చార్యులకు నమస్కరించింది. అపుడాయన ఆమెను దీర్ఘసుమంగళివి కావాలని ఆశీస్సులి చ్చాడు. కానీ ఆమె తన భర్త మరణించిన వైనాన్ని ఆచార్యులకు తెల్పింది. తానన్న మాటలు దండుగ కావద్దని చిటి తాళాల్ని తీసుకొని కృష్ణమాచార్యులు భక్తితో భజన చేయడం ఆరంభించాడు. ఆశ్చర్యకరంగా అగ సాలెవాడు ప్రాణంతోలేచి కూర్చున్నాడట. "సింహగిరి నరహరి వచనా"ల్లో ఇటువంటి ఐతిహ్యాలు మరెన్నో ఉన్నాయి.

భక్తితో మునిగిన రచయితకు ఇహలోక సౌఖ్యాల గురించిన అవగాహన గాని అవసరం గానీ ఉండదు. అది కృష్ణమాచార్యునిలో కూడా కన్పిస్తుంది. జీవుడు - అతని ఆలోచనల చుట్టూ తిరిగి మనోహర సుగుణ మూర్తిగా వెలిగే దేవుడు ఇవే సింహగిరి వచ నాల్లో మేరు పర్వత శిఖరాల్లా కన్పిస్తాయి.

నిసర్గమైన భక్తిసాహిత్యానికి శ్రీ రామా నుజుల ప్రత్యక్ష పరోక్ష ప్రభావాలతో వచ్చిన వైష్ణవ సాహిత్యం గొప్ప స్ఫూర్తిని, భూమికను ఇచ్చింది. తొలినాడే ఈ భక్తి భావనలకు బీజాలు వేసిన ఘనత కృష్ణ మాచార్యులకే చెందుతుంది.

సింహగిరి నరహరి వచనాల్ని గురించి మరిన్ని పరిశోధనలు ముమ్ముందు జరిగితే ఇంకా ఎన్నో విశేషాలు వెల్లడయ్యే అవకాశం ఉంది.



# దైవ ప్రార్థనకై మహావకాశం

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి



వితర వారిద వారి దవాతురే
చిరపిపాసిత చాతక పోతకే,
విపరితే మరుతి క్షణమన్యథా
క్వచ భవాన్ క్వయః క్వ చ చాతకః.

ఓ చిన్న పర్వత శిఖరంపై ఓ చాతక పక్షి కూర్చుని ఉంది. జలభరితమైన ఓ మేఘం దాని మీదుగా సాగిపోతూన్నది. దానిని చూసి ఆ పర్వతం క్రింద భాగంలో నిలబడిన కవి అంటాడు - అరే! మేఘమా! ఈ చాతకం చాల సేపటి నుండి దాహంతో వేదనపడుతున్నది. దీనికి నీవు కొంచెం నీళ్ళిచ్చి మరీ ముందుకు పో. ఎక్కడో అక్కడ నీవు కురవక తప్పదు కదా! ఇట్టి పరోపకారావకాశాన్ని ఎందుకు చేజార్చుకుంటావు? చాతకానికి నీళ్ళివ్వక పోయినా, గాలి మారినా, నువ్వెక్కడ చిక్కుపడినా, నువ్వెక్కడ వర్షించినా తెలియదు కదా! ఈ పక్షి ఎక్కడకు పోతుందో ఎవరికెరుక? ఇట్టి సదవకాశం మరల లభిస్తుందా?"



నేడు మనం 'దైవ ప్రార్థనకు సర్వోత్తమావకాశం ఎట్టిది?" అనే విషయంపై విమర్శన చేసుకుందాము. దీనితో బాటు మానవ జీవన సార్థక్యం భజనలోనే కానీ భోగానుభవంలో లేదన్న విషయాన్ని నిశ్చయించుకుందాము.

మానవ శరీరం దేవదుర్లభమైనది. ఇట్టి దేహాన్ని పొంది కూడ దీనిని సద్వినియోగం చేసుకోజాలని వాడు - చేతిలో ఉన్న అమృత పాత్రను విసిరేసి విషపాత్రను వినియోగించుకోవలెనన్న మూర్ఖత్వంలో ఉన్నవాడు. విశేష పుణ్యం వల్ల లభించిన చింతామణిని ఇచ్చివేసి పైపై మెరుగులు కల గురువింద పూసను తీసుకున్నట్లయింది.

ఏ శరీరంలో ఉన్నా విషయ భోగాలు లభిస్తాయి. వాటిని అనుభవించవచ్చును కూడ. అన్య దృష్ట్యా సమస్త శరీరాలలోని సుఖభోగాలు తారతమ్యంగా . గోచరమైనా ప్రతి ప్రాణీ తన దృష్టిలో సమానసుఖాన్నే అనుభవిస్తున్నది. పందికి తన ఆహారమైన అశుద్ధాన్ని స్వీకరించేవేళలో కలిగే సుఖానుభవం, ఓ కీటకం అన్య ప్రాణిని కరచి ఆ రక్తాన్ని పానం చేసే వేళలో పొందే సుఖానుభవం, ఓ బక్కె పచ్చ పచ్చటి పరకలను మేసే వేళలో పొందే ఆనందానుభవం, ఓ మహరాజు షడ్రసోపేతమైన భోజనాన్ని స్వీకరించే వేళలో పొందే మహానందానుభవం, ఓ పేదవాడు ఉప్పూ గంజీ అన్నాన్ని స్వీకరించే వేళలో

# తిరుమలలో వసతి

* తిరుమలలో యాత్రికుల కోసం ఉచితంగా లభించే సత్రాలు చాలా వున్నాయి. ఈ గదులలో కరెంటు, నీళ్ళు కూడ ఉచితం. అయితే ఈ గదులలో మంచాలు పరుపులు తదితర సౌకర్యాలు వుండవు. ఇందులో వసతి కావలసినవారు బస్టాండు దగ్గర వున్న కేంద్ర విచారణ కార్యాలయాన్ని సంప్రదించాలి.

* ఫర్నిచరు తదితర సౌకర్యాలతో వసతి కావలసినవారు తిరుమలలోని అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుకు (రిసెప్షన్-1) వారిని సంప్రదించాలి. లేదా కనీసం 30 రోజుల ముందుగా జాతీయం చేయబడిన ఏ బ్యాంకు నుంచి అయినా కార్యనిర్వహణాధికారి, తి.తి. దేవస్థానములు వారి పేరు మీద రు.100/- కు డిమాండు డ్రాఫ్టు తీసుకొని వారికి వసతి కావలసిన తేదీ వివరాలతో అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (రిసెప్షన్-1), తిరుమల--517 504 వారికి పంపాలి.

**రు.100/- డి.డి.ని కార్యనిర్వహణాధికారి, తి.తి. దేవస్థానములు వారి పేరు మీద తీసుకొని వివరాలతో దానిని అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (రిసెప్షన్-1) తిరుమల--517 504 వారికి పంపాలి.**

* సౌకర్యాలతో వసతి ఈ క్రింద సూచించిన సర్వీసు చార్జీలతో (ఒక రోజుకు) లభిస్తుంది.

I హిల్ వ్యూ సగం కాటేజీలు, శంకుమిట్ట, శేషాద్రినగర్, అంజనాద్రినగర్, గరుడాద్రినగర్ కాటేజీలు.

| | | |
|---|---|---|
| | ఒక భాగం (గీజరు లేకుండా) | రు.15/- |
| | హెచ్.వి.డి.సి. ఒక సూటు గీజరుతో | రు.50/- |
| | హెచ్.వి.సి. అతిథిగృహం పెద్ద సూటు గీజరుతో | రు.30/- |
| | హెచ్.వి.సి. అతిథిగృహం చిన్న సూటు గీజరుతో | రు.25/- |

* ముందుగా రిజర్వేషను చేసుకొనవచ్చును.

| | | |
|---|---|---|
| II | మంగళంబావి కాటేజీలు, టి.బి.సి. 3 వ వరుస మొ॥ | |
| | టి.బి. కాటేజీలు గీజరుతో A, B భాగములు ఒక్కొక్కటి | రు.50/- |
| | టి.బి. కాటేజీలు గీజరుతో C, D భాగములు ఒక్కొక్కటి | రు.60/- |
| | వి.వి.సి. | రు.150/- |
| | ఎమ్.బిసి. గీజరుతో ఒక్కొక్కటి | రు.50/- |
| | టి.బి.సి. సూటు గీజరుతో | రు.30/- |
| | ఎ.టి.సి. ఒక్కొక్కటి | రు.30/- |
| | ఎ.టి.సి. సూటు | రు.15/- |
| | ఎస్.వి. అతిథిగృహం, ఎన్.జి.జి.హెచ్. ఒక్కొక్కసూటు | రు.100/- |
| | ఆర్.బి.జి.హెచ్., ఎస్.ఎన్.జి.హెచ్. | రు.100/- |

* రిజర్వేషను పద్ధతి లేదు.

| | | |
|---|---|---|
| IV | ట్రావెలర్స్ బంగళా లోపలి కాటేజి | రు.150/- |
| | స్పెషల్ టైపు కాటేజీ (నారాయణగిరి) | రు.200/- |
| | హెచ్.ఆర్.జి. కాటేజి ఒక్కొక్క భాగం ఏ.సి.తో | రు.250/- |
| V | మోది భవన్ ఒక్కొక్క సూటు ఏ.సి.తో | రు.250/- |
| | శ్రీనికేతన్ అతిథిగృహం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| | ఇందిరా అతిథిగృహం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| | బాలకుటీర్ ఒక్కొక్క సూటు ఏ.సి.తో | రు.250/- |

| | |
|---|---|
| శ్రీనివాసనిలయం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| శ్రీ లక్ష్మీనిలయం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| గోదావరి సదన్ ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| గాంబుల్ అతిథి గృహం | రు.250/- |
| పద్మావతి అతిథిగృహం (మాస్టర్ సూటు) | రు.1500/- |
| " ఒక్కొక్క సూటు | రు.500/- |
| విద్యాసదన్ మాస్టర్ సూటు | రు.1500/- |
| ఇతర సూట్లు | రు.500/- |
| గోకులం అతిథిగృహం (టి.బి.సి. దగ్గర) ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.1000/- |

ముందుగా రిజర్వేషను పద్ధతి లేదు. వీలునుబట్టి కేటాయిస్తారు.

పెళ్ళి మండపాలు ఉదయం గం॥ 8 నుంచి ఉదయం గం॥ 8 వరకు

| | |
|---|---|
| శంకుమిట్ట కాటేజీలు తూర్పునెం.272, 260, 266, 267 | రు.100/- |
| టి.బి. కాటేజీలు నెం.71, వరుస III నెం.136, 152 | రు.100/- |
| రుయా కాటేజి, గోగినేని కాటేజి, ఎ.టి.సి. నెం.99 | రు.100/- |
| చిదంబరం చెట్టియార్ కాటేజి | రు.100/- |
| శ్రీ సీతారామ కల్యాణ మండపం | రు.1000/- |

* రిజర్వేషను కొరకు డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (ఆర్), తి.తి. దేవస్థానములు, తిరుమల వారిని సంప్రదించాలి.

నిబంధనలు

* రోజు అనగా కేటాయించిన సమయం నుంచి 24 గంటలు
* కోరిన చోట వసతి లభించని సందర్భంలో మరొకచోట వసతి ఏర్పాటు చేస్తారు. ఎక్కువ చెల్లింపు జరిగివుంటే వసతి సర్వీసు చార్జీలు పోను మిగిలినది తిరిగి ఇస్తారు.
* రిజర్వేషను ఒకరోజుకు మాత్రమే చేయబడుతుంది. రిజర్వేషను చేయించుకున్నవారు ఆ రోజు రాకపోతే రిజర్వేషను రద్దవుతుంది. రిజర్వేషను చార్జీలను తిరిగి ఇవ్వటంగాని, తరువాత రోజుకు జమ చేసుకోవడంగాని జరగదు.
* గడువుకు మించి బస చేసిన సందర్భాలలో అపరాధ రుసుముగా అద్దెకు మూడురెట్లు మొత్తం వసూలు చేస్తారు.
* <u>ఇక్కడ సూచించబడ్డ రుసుములు మార్పబడే అవకాశం వుంది.</u>

## తిరుపతిలో వసతి

| | | |
|---|---|---|
| 1. | ఎస్.వి. అతిథిగృహం గది ఒకరోజుకు | రు.100/- |
| 2. | అలిపిరి అతిథిగృహం గది ఒకరోజుకు | రు.75/- |
| 3. | మొదటి కొత్త సత్రం -- సింగిల్ రూము | రు.50/- |
| | డబుల్ రూము | రు.100/- |
| | 4 పడకలు గలది | రు.100/- |
| 4. | పద్మావతి అతిథిగృహం (ఏ.సి. గదులు) | |
| | సింగిల్ రూములు (9, 10) | రు.100/- |
| | రెండు పడకలు గలవి | రు.150/- |
| | రెండు పడకలు గలది మొజాయిక్‌తో గదులు 11,12,16,17 | రు.200/- |
| | రెండు పడకలు గలది సూపర్ మొజాయిక్‌తో గది నెం.16 మరియు 18 | రు.250/- |

## విజ్ఞప్తి
## శ్రీవారి ఆలయం, తిరుమల.

తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీవారి ప్రసాద పణ్యారములు, ఆర్జిత చేరువులు, పడుల ధరలు 27-7-92 నుండి ఈ క్రింది విధంగా వుంటాయి.

భక్తులు ఈ విషయాన్ని గమనించి ఆ యా మొత్తాలు చెల్లించ వలసిందిగా విజ్ఞప్తి.

| | | | |
|---|---|---|---|
| 1. | పొంగలి | 1/4 సోల | రు. 225-00లు |
| 2. | చక్కెర పొంగలి | ,, | రు. 250-00లు |
| 3. | పులిహోర | ,, | రు. 200-00లు |
| 4. | దధ్యోదనం | ,, | రు. 100-00లు |
| 5. | శాకరి బాత్ | ,, | రు. 250-00లు |
| 6. | సీరా | ,, | రు. 450-00లు |
| 7. | పాయసం | ,, | రు. 225-00లు |

పొందే ఆనందానుభవం, మహేంద్రుడు అమృత భోజన వేళలో కూడ పొందుతాడు. సుఖానుభూతి ఎక్కడున్నా ఒక్కటే. మనం – కుక్క, పంది, బల్లి – వీటి సుఖాలను తుచ్ఛంగా భావించవచ్చును, ఓ మహరాజు ఓ పేదవాని సుఖాన్ని తుచ్ఛంగా భావించవచ్చును, అలాగే దేవతలు కూడ మన సుఖాలను తుచ్ఛంగా భావించవచ్చును.

దీనికి కారణం సుఖమన్నది ఏ పదార్థంలోను లేదు, రాదు. కానీ భోగ పదార్థాలు లభించిన వేళలో చిత్తం శాంతంగా ఉంటుంది. శాంత చిత్తంలో ఆత్మ ప్రతిబింబం కావడం వల్ల సుఖానుభవం కలుగుతుంది. కారణం? ఆత్మ సుఖస్వరూపమైనది. ఏకమాత్ర వ్యాపకాత్మ ప్రాణి మాత్రునిలో భోక్త రూపంలో ఉంది. కనుక సుఖానుభవం కూడ ఏకరీతిగానే ఉండాలి. ఈ విషయాన్ని పంచదశిలో విద్యారణ్య స్వాముల వారు ఈ రీతిగా సువ్యక్తం చేశారు.

యత్సుఖాయ భవేత్ తత్తత్
బ్రహ్మైవ ప్రతిబింబనాత్,
వృత్తి ష్వన్తర్ముఖా స్వస్య
నిర్విఘ్నం ప్రతిబింబనమ్.

భావమేమంటే ఇచ్ఛిత పదార్థ ప్రాప్తి వల్ల సుఖానుభవం కలుగుతుంది. వస్తువులభించడం వల్ల, చిత్తవృత్తి అంతర్ముఖం కావడం వల్ల ఆత్మ ప్రతిబింబం చిత్తంలో సక్రమంగా పడుతుంది. తద్వారా ఆత్మ సుఖానుభవం కలుగుతుంది. కానీ మానవుడు మోహవశుడై – ఆ సుఖం వస్తువు వలన లభించినదని భావిస్తాడు.

ఇంకా ఈ విషయాన్ని విశేషంగా గ్రహించాలంటే సావధానంగా పరిశీలించండి. ఓ భోగవస్తువును పొందాలని కోరిక కలిగింది; దాని ప్రాప్తికై చిత్తం వ్యాకుల పడుతూన్నది. ఆ వస్తువు లభించింది. దానితో చిత్త శాంతి కలిగింది. చిత్తశాంతి లభించడంతోనే ఆత్మ ప్రతిబింబం కావడంతో సుఖానుభవం ఏర్పడింది.

ఈ రీతిగా సుఖానుభవం చిత్తశాంతి ద్వారా లభిస్తున్నది – కానీ మానవుడు తన అజ్ఞానం కారణంగా – పదార్థం వల్ల సుఖం లభిస్తూన్నదనుకొని జీవితం అంతా పదార్థ ప్రాప్తికే వ్యయం చేసివేస్తున్నాడు. యదార్థమైన సుఖమే లభించడం లేదు.

దీనిని బట్టి – మానవ శరీర సార్థక్యం విషయభోగంలో లేదు కనుక వివేకంతో విషయవాసనలను త్యజించి భగవద్భజన చేసుకుని ఆ దేవదేవుని పొందడంలోనే ఉన్నదని గ్రహించాలి.

మానవ శరీరం పొంది కూడ విషయ భోగానుభవంలోనే దానిని వ్యర్థం చేసుకోవడమంటే – మనకూ – సూకర, శునక, మార్జాల, కీటకాదులకూ భేదం ఏమున్నది? విషయ సుఖానుభవం సమస్త యోనులలోను లభిస్తుంది. ఇంద్రుడే అగును గాక, భూలోక ప్రభువే అగును గాక, ఇతరేతర పశుపక్ష్య కీటకాదులే అగును గాక, సర్వం విషయ సుఖాలూ ఏకమాత్రమైనవే!

ఇంత వరకూ వచ్చి – నిశ్చయాత్మకంగా వ్యక్తం చేసేదేమిటంటే మానవ శరీరం కేవలం భగవద్భజనార్థమే లభించినది. కానీ భోగానుభవార్థం కాదు. విషయ భోగాలు సర్వయోనులలోనూ సమా రూపంలో ప్రాప్తిస్తాయి.

(29వ పేజీలో)

# సందేహాలు? - సమాధానాలు!



**సమాధానాలు :- ఎల్లోరా**

ప్రశ్న:-

వేదాలు బహుదేవతావాదాన్ని ప్రతిపాదిస్తున్నాయా?

- టి. రామబ్రహ్మం, ఒంగోలు.

**సమాధానం:**

వేదాలు బహుదేవతా వాదాన్ని సమర్థిస్తున్నట్లు అనిపిస్తుంది. కాని అందులో అంతర్లీనమైన సూక్ష్మసందేశం అది కాదు. ఏకదేవతా వాదమే వేదం చెప్పింది. వారి దృష్టిలో విభిన్న దేవతానామాలతో తెలుపబడే పరమేశ్వరుడే ఏక దేవత. ఋగ్వేదం: "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి"పరమేశ్వరుడు ఒకడే. విప్రులు ఆయననే వివిధ దేవతలుగా చెబుతున్నారు.

ప్రశ్న:

వేదం రచించిన దెవరు? వేదాలపుట్టుకను తెలపండి?

కె. శారద, రాజమండ్రి.

**సమాధానం:**

పరమాత్ముని యొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసాల శబ్దతరంగాలే వేదాలని అంటున్నారు.

శబ్దాత్మకమైన పరబ్రహ్మ స్వరూపం నిత్యమైంది. దీనికి ఆదికాని అంతం కాని లేదు.

తపస్సంపన్నులైన మహర్షులు ఇంద్రియాలకు గోచరించని వస్తువులను కూడ సమాధి దశనుపొంది తెలుసుకోగలిగారు. అలా వారు ఋజు ప్రవృత్తి కలవారై నిర్మలాంతఃకరణాలతో కనుగొన్న జ్ఞాన ఖండికలే ఈ వేద వాఙ్మయమని చెబుతారు.

వారెవరూ వేదాలను రచించలేదు. అనంతవిశ్వంలో భగవంతుని ఊపిరిగా సంచరిస్తున్న శబ్దతరంగాలను తమశక్తితో పసికట్టి, వాటిని తరతరాలుగా లోకకల్యాణంకోసం మనకందించారు.

భగవంతుని ప్రేరణవల్లనే ఈ వేదవాక్కులు వారి హృదయాలలో ప్రవేశించాయని ఋగ్వేదం పేర్కొంటున్నది.

యజ్ఞేన వాచః
పదవీయమాయన్
తామన్వవిన్దన్
ఋషిషు ప్రవిష్టామ్.

## కొత్త శీర్షిక

ప్రశ్న:

కుంభకర్ణుడిని చంపినది రాముడా? లక్ష్మణుడా?

పి. గురునారాయణ, చిత్తూరు.

**సమాధానం**

రామాయణ, భారతాలలో రామాయణ కథ ప్రాచీనమైనది. వ్యాస, వాల్మీకులలో వ్యాసుడే పెద్దవాడు.

భారతం పుట్టేనాటికి రామాయణ గాథ లోకప్రసిద్ధమై నిలచింది. వాల్మీకి రచించిన రామాయణ కథ తర్వాత - ఆకథను చాల మంది అనేక భావాలతో, కథాంశాలతో పాత్రల గురుతత్వాన్ని రాస్తూవచ్చినట్లు కనిపిస్తుంది.

భారతరచనా కాలానికి అనేక రామాయణాలు అనేక కొత్త అంశాలతో ప్రత్యక్షమయ్యాయి. వ్యాసులువారు భారత రచనకు ఉపక్రమించినప్పుడు వారి ఆలోచనలో - అవలోకనంలో - రచనా శిల్పక్షణంలో రామాయణకథలో కొంతలో కొంత మార్పులు జరిగివుండవచ్చు.

రామాయణంలో ఋషితుల్యుడైన వాల్మీకికి కుంభకర్ణుడి మీదకు ఎక్కు పెట్టిన బాణం రాముడిదే అనిపించింది. పక్కన లక్ష్మణుడు ఉన్నాడాయె. రాముని బాణానికే కుంభకర్ణుడు మృతిచెందాడని నిర్ధారణకు వచ్చిన వాల్మీకి రాముడే చంపినట్లు అక్షర నిక్షిప్తం చేశాడు.

(యుద్ధ. 67)

మరి భారతరచనచేసిన వ్యాసుడికి ఈదృశ్యం మరోవిధంగా అగుపించింది. వ్యాస మునికి లక్ష్మణుడు సంధించిన బాణమే కుంభకర్ణుడిని హతమార్చినట్లుగా అగుపించింది. అదే దృశ్యం భారతంలో రామాయణ ఘట్టంలో అక్షరాకృతి ధరించింది.

(అరణ్య: 271-16-17)

ఏతావాతా చెప్పొచ్చేది ఏబాణానికైతేనేం చేసిన తప్పు పనికి కుంభకర్ణుడు చచ్చిన మాటమాత్రం నిజం!

పాఠకుల ప్రశ్నలకు ప్రముఖ పండితులు, కవి, పత్రికారచయిత శ్రీ ఎల్లోరా సమాధానాలు ఇచ్చారు. ప్రతినెలా ఈ శీర్షికను వీరే నిర్వహిస్తారు.



# విష్ణుతేజం

శ్రీ పి. ఓబళేసు




సామాన్య మానవులకు ఆమాటకొస్తే చాలామందికి కూడా భగవత్తత్త్వమంటే ఏమిటో సంపూర్ణమైన అవగాహనలేదు. పోతన తనకు తెలిసిన భగవత్తత్త్వాన్ని భాగవత ఘట్టాలలోని కథలలో కొన్ని పాత్రల ద్వారా చెప్పించాడు.

మహాభాగవతంలో బమ్మెరపోతన విష్ణువు యొక్క మూర్తి మత్వాన్ని అనేక విధాల ప్రదర్శించాడు. అంతటా వ్యాపించిన వాడైన భగవంతుని యొక్క ఆకారం ఇది అని మనోనేత్రానికి కనిపింపజేయడంలో అతని కతడే సాటి. విష్ణువనగా అంతటా వ్యాపించినవాడనే అర్థం. తేజమనగా ఆత్మచైతన్యం. వెరసి విష్ణుతేజం. అంటే ప్రతి రేణువులోను విష్ణువుయొక్క నిరాకారాంశమే దాగివుందని తెలుసుకోవచ్చు. అందుకే బమ్మెరపోతన వర్ణనల్లో ఈ మూర్తినే స్ఫురింపజేసాడు. భగవంతునికి ప్రధానంగా సర్వవ్యాపకత్వము, సర్వాంతర్యామిత్వము, సర్వజ్ఞత్వము అనే మూడు లక్షణాలున్నాయి.

ప్రహ్లాద చరిత్ర ఘట్టంలో హిరణ్యా కశిపుడు ప్రహ్లాదునితో దేవుడెక్కడున్నాడని అడిగినప్పుడు ప్రహ్లాదుని సమాధానము--

కలఁడంభోధిఁ గలండు గాలిఁ
గలఁ డాకాశంబునన్ గుంభినిన్
గలఁడగ్నిన్ దిశలం బగళ్ళ
నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ
ద్రిలింగ వ్యక్తులందంతటన్
గలఁడీశుండు గలండు దండ్రి
వెదకంగా నేల యీ యా యెడన్.

--సప్తమ స్కంధ--274

సముద్రములోనూ, గాలిలోనూ, ఆకశములోనూ, భూమిమీదనూ, అగ్నిలోనూ అన్నిదిశలలోనూ, పగలు - రాత్రులలోనూ, సూర్య - చంద్రులలోనూ, ఓంకారమందునూ, త్రిమూర్తులందునూ, మూడు లింగముల వ్యక్తులలోనూ అంతటా భగవంతుడున్నాడు. అలాంటప్పుడు అక్కడని ఇక్కడని ఎందుకు వెదకాలి? ఒక్కమాటలో చెప్పాలంటే అంతటా ఉన్నాడని చెప్పడం ఉద్దేశం. ప్రపంచమందంతటా వున్నాడని చెప్పడానికి కవి ఈ విధంగా చూపిస్తున్నాడు.

ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు దానవాగ్రణి! వింటే.

సప్తమస్కంధ--275

ప్రపంచం ఎన్ని రీతులుగా వుంటుందో అని చెప్పి వాటిన్నింటిలోనూ ఉన్నాడని చెబితే పరమాత్ముని సౌందర్యం ద్విగుణీకృత మౌతుంది. భక్తుని మనస్సు ఆర్ద్రిత చెంది పరమాత్ముని వైపు మళ్ళుతుంది. అట్లా వూరకే అంతటా వున్నాడంటే పాఠకుల్ని భక్తి వైపు లేదా పరమాత్మునివైపు అంతగా త్రిప్పుకోలేక పోవచ్చు. పై పద్యంలో ప్రత్యంశంలోనూ భగవంతుడున్నాడని చెప్పడం వల్ల పాఠకుని మనస్సు భగవంతుని వైపు మళ్ళుతుంది.

విష్ణువంటేనే సర్వవ్యాపి అని అర్థం. ఛాందోగ్య, బృహదారణ్యక, భగవద్గీతల ప్రకారంగా ఈ సమస్త జగత్తునందలి ప్రతి

పరమాణువు కూడా పరమాత్మ స్వరూపమే. హిరణ్యకశిపుడు రాక్షసుడు కనుక విష్ణువు యొక్క సర్వవ్యాపకత్వాన్ని సందేహించాడు. ప్రహ్లాదుడు భక్తుడు కనుక బాల్యములోనే విష్ణువుయొక్క సర్వవ్యాపకత్వాన్ని తెలిసి కొన్నాడు. ఎందు వెదకి చూచినా అందే పరమాత్ముడు సాక్షాత్కరించగలడు. ఇందు అందు అని సందేహము ఆయన సర్వవ్యాపకత్వాన్ని గురించి వుండరాదు. కనుకనే చక్రి సర్వోపగతుడని ప్రహ్లాదుడు నిర్ధారణ చేసాడు. అనగా సర్వ చరాచర వస్తు సముదాయంలో కూడా విష్ణువు దాగి వున్నాడనే అర్థం.

గజేంద్రమోక్షణ ఘట్టములో గజరాజు-నీటిమడుగులో మొసలి చేత పట్టుబడి దానితో వెయ్యేండ్లు పోరాడి అలసిపోయి చివరి దశలో భగవంతునితో ఇలా మొరపెట్టుకుంటుంది--

ఎవ్వనిచే జనించు జగమెవ్వని
లోపల నుండు లీనమై
యెవ్వని యందు డిందుఁబరమేశ్వరుఁ
డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయుఁడెవ్వఁడు
సర్వముఁదానయైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు
నీశ్వరునే శరణంబు వేఁడెదన్.

--అష్టమ స్కంధ--73

భగవల్లక్షణాన్ని యత్తద్దర్థక ప్రయోగంలో కవి చూపాడు. ఎట్లంటే ఈ జగత్తు ఎవ్వరి చేత జనించిందో, ఎవ్వనిలోపల ఇది వుందో, ఈ జగత్తు మొత్తానికి మూలకారణమెవ్వడో, ఎవ్వనికి ఆది, మధ్యమ, అంతములు వుండవో ఎవ్వడు ఈ సృష్టిసర్వము తానే అయి నిండుకొని వున్నాడో అట్టి భగవంతుణ్ణే నేను శరణు వేడు కుంటున్నాను. అట్టి భగవంతుడంటే ఎట్టి భగవంతుడు? అనగా ఆ భగవల్లక్షణాల్ని పేరు చెప్పకుండా యత్తద్దర్థక ప్రయోగంలో చెప్పడం ఇక్కడ చక్కగా కుదిరింది. పైగా భగవంతుడు నామరహితుడు ఈ పద్యం ద్వారా దేవుణ్ణి ఏ మతానికీ సంబంధం లేకుండా భావం వచ్చేటట్లు ఎవ్వరైనా ఏ మతం వారైనా ప్రార్థించుకోవచ్చు.

ఒక పరి జగములు వెలినిడి
యొక పరి లోపలికిఁగొనుచు నుభయము దానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని నాత్మ మూలు నర్థి దలంతున్.

--అష్టమస్కంధ--75

ప్రపంచాన్ని ఒకసారి తననుంచి బయట వుంచుతూ, మరొక్కసారి దాన్ని తనలోపల వుంచుకుంటూ, ఇంకోసారి ఆ రెండూ తానై భగవంతుడుంటాడు. అది అతని లీల. అంటే సృష్టి తనలోనూ జరుగుతుంది. తన బయటా జరుగుతుంది, బయటా లోపల కూడా జరుగుతుంది. ఇది భగవంతుని విచిత్ర లీల. ఇదే తన తత్త్వము.

భవము దోషంబు రూపంబు కర్మంబు
నాహ్వయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించు కొఱకునై
నిజమాయ నెవ్వఁడిన్నియును దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి
బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునకు సాక్షికి నాత్మరుచికినిఁ
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు
మాటల నెఱుకల మనములఁ జేరంగఁ
గాని శుచికి సత్త్వగమ్యుఁడగుచు
నిపుణుఁడైనవాని నిష్కర్మతకు మెచ్చు
వానికే నొనర్తు వందనములు.

--అష్టమస్కంధ--78

పరమాత్ముడు రూపరహితుడు అంటే ఆకారము లేనివాడు. అనగా ఘనరూపము కాదు- ద్రవరూపముకాదు- మరి ఆవిరి రూపముకాదు. శూన్యమంతకంటే కాదు. కాబట్టి వానికి నీడా జాడాలేదు. వానికి ఏ గుణములు లేవు. పరమాత్మ తత్త్వమన్నది ఒక అనంతశక్తి. పుట్టుక కాని గిట్టుటకాని అతనికి లేవు. అవతారాలలో పుట్టినట్లు నటిస్తాడు. భగవంతుడు భువికి అవతరించి కొంత కర్మ కలాపాన్ని తానే కల్పించుకొని మానవునిలాగా నివసిస్తున్నట్లు నటిస్తాడు. తప్ప అతనికి కర్మభుక్తి అనడం వుండదు. ఎందుకంటే కర్మకూడా తానే కనుక. భగవంతుడు శబ్దరూపంలో వుంటాడు. భగవంతుడంటే జ్ఞాన స్వరూపమే. భగవంతుడు పరిశుద్ధ చైతన్య స్వరూపుడు.

స్త్రీ నపుంసక పురుషమూర్తియునుగాక
తిర్యగమర నరాది మూర్తియునుగాక
కర్మ గుణ భేద సదసత్ప్రకాశిగాక
వెనుక నన్నియుఁదానగు విభుఁదలంతు

--అష్టమ స్కంధ--85

భగవంతుడు స్త్రీకాదు, పురుషుడు కాదు, నపుంసకుడు కాదు. త్రిలింగాతీతుడు. త్రిగుణ రహితుడు. పశుపక్ష్యాదులు కాదు, అమరుడు కాదు, నరుడు కాదు, వెలుగు కాదు, చీకటి కాదు. అయితే అన్నీ తానై వాటన్నింటి వెనుక వున్నాడు. ఇక్కడ వెనుక వాటికి ఆధారభూతమైనవాడని అర్థం.

అద్వైత మతములోని పరబ్రహ్మవాదము ప్రకారంగా ఈ సకల జీవులు మొదట అచేతనాలు కాగా పరబ్రహ్మమే ఆత్మరూపంలో వాటిలోకి ప్రవేశించాడని అందుచేతనే వాటికి చలనము వచ్చిందనే వాదం లేదా సిద్ధాంతం చాలా సమంజసంగా వుంది. ఎందుకంటే పరమాత్ముని ఆజ్ఞవల్ల ప్రపంచం ముందుకు సాగుతుంది. నిరాకారంగా వున్న పరమాత్మ సాకారంగా వుండే సకల సృష్టికి ఆధారభూతుడు. అట్టి ఆధారభూతుడైన భగవంతుని స్మరించి జీవుడు విముక్తి పొందాలి. గజేంద్ర మోక్షణ కథ ఈ విషయాన్ని ప్రతీకాత్మకంగా చేస్తుంది.

పై చెప్పబడిన లక్షణాలు కల భగవంతుని నేను ప్రార్థిస్తున్నానని గజేంద్రుడు ప్రార్థించాడు. అదే విధంగా మనమూ ప్రార్థనా సమయంలో ఈ పద్యాలను పఠించుకోవచ్చు.

విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్.

--అష్టమస్కంధ--88

❊❊❊❊

పౌండ్రకవాసుదేవుని సంహారమొనర్చి, చిన్ననాటి స్నేహితుని చూచుటకై వాసుదేవుడు సుదాముని గృహమునకు వేంచేసెను. ఒకప్పుడు తన్ను చూచుటకు ఎంతయో మార్గాయాస శ్రమకోర్చి సుదాముడు ద్వారకకు అతిథిగా వచ్చినాడు కదా! తాను సుదాముని చూచుట కనీస స్నేహధర్మమై యున్నది. బాహ్యవిశ్వమును పరిపాలించుచు, గర్భగోళమున నున్న ఆంతర్య విశ్వమును గర్భస్థ శిశువునువలె రక్షించుచు తీరికలేక మిత్రుని చూచుటకు ఇంతవరకు అవకాశము చిక్కినది కాదు. పౌండ్రకవాసుదేవ సంహారమునకై సుదాముడు వసించు సమీపవర్తి దేశమునకు వచ్చిన తనకు సుదాముని చూచుట ఆప్తధర్మమైయున్నది. తాను సుదాముని గృహమును చేరుటకు ముందుగనే వార్తను పంపినాడు. సుదాముని సంతోషమునకు మేరయే లేదు; ఆనంద సాగరమున మునిగి తేలుచుండెను; పరమాత్మ దర్శనమునకై వేయికళ్ళతో నిరీక్షించుచుండెను; పరమాత్మ వచ్చినాడు. భగవంతునికి సువర్ణాసనమును సమర్పించినాడు. నవరత్న ఖచిత సువర్ణ పళ్ళెరమునందు భగవత్పాదములనుంచి సద్గుణములకు సౌశీల్యమునకు ఆకరమైన ధర్మపత్ని బంగారు భృంగారువుతో పన్నీటి జలములు పోయుచుండగా ముముక్షు జనుల నిరంతరధ్యేయరూపములైన భగవత్పాదపంకేరుహములను కడిగి ఆ జలమును శిరస్సుపై జల్లుకొని కృతార్థుడైనాడు. భగవంతుని పురుషసూక్తముతో అర్చనచేయ ప్రారంభించినాడు.

"సహస్రశీర్షా పురుషః
సహస్రాక్షః సహస్రపాత్,
స భూమిం విశ్వతో వృత్వా
అత్యతిష్ఠ ద్దశాంగులమ్.

స్వరయుక్తముగా వేదమంత్రమును వైఖరీ రూపమున ఉచ్చరించుచు మంత్రార్థమును మనసున నెమరువేయుచుండెను.

"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ
అహో రాత్రే పార్శ్వే
నక్షత్రాణి రూపం
అశ్వినౌ వ్యాత్తం

ఇష్టం మనిషాణ
అముం మనిషాణ
సర్వం మనిషాణ

పురుషసూక్తమును చదివి, మంత్రపుష్పమును చదువుచూ నారాయణుని ఇట్లు స్తుతించినాడు.

నారాయణం మహాజ్ఞేయం
విశ్వాత్మానం పరాయణమ్,
నారాయణః పరో ధ్యాతా
ధ్యానం నారాయణః పరః.

నారాయణుడే పరమజ్ఞేయుమనియు, ధ్యానము చేయువాడునను, ధ్యానమునూ నారాయణుడేయని మంత్రపుష్పార్థమును మనసున అవగతమొనర్చుకొని, ధ్యేయ-ధ్యాన-ధ్యాతృ రూపమైన ధ్యేయమునందు త్రిపుటిని ఏకీకరణమొనరించుకొనినాడు. సుదాముడు ఆ పరమానందములో బాహ్య జగత్తునేకాక తన్నుగూడ విస్మరించినాడు. పరమాత్మ, "సుదామా! ఏల ఇట్లు అవాక్కయితివి?" అనువరకు సుదామునకు బాహ్యస్మృతియే లేదు. స్మృతి కలిగిన పిమ్మట:

తానేర్చిన విద్యలన్నింటిని వినియోగించుచు స్తోత్రము చేయుచుండెను.

పరమాత్మ ఇట్లనెను: "ఏమిది! సుదామా! చిన్ననాటి స్నేహితుడవైన నీతో కొంతతడవు ముచ్చటలాడుకొనుటకై వచ్చితిని. నీవును, సనకాదియోగులవలె మహర్షులవలె, స్తోత్రము చేయుచుంటివి. ఇట్టి స్తోత్రములను నేను అహర్నిశములందును వినుచుంటిని. తెల్లవారక మునుపే మేలుకొలుపులను పాడి, మరల జోంపాటపాడి, పరుండు సమయమునకు నన్ను విడిచిపుత్తురు. ఒక భక్తునకు తెల్లవారిన కొంతసేపటికి గాని, మరియొక భక్తునకు తెల్లవారదు. వాడును ఇట్లే చేయును. ఇట్లు ఒకని వెంట నొకడు స్తోత్రములను చేయుటవలన ఆఖరు భక్తుడు జోలపాటలు ముగింపక మునుపే మొదటి భక్తుడు సుప్రభాతమును ప్రారంభించును. ఇట్టి స్థితినుండి ఆటవిడుపుకై చిన్ననాటి స్నేహితుడవు కదాయని

# సుద

శ్రీ కొ్ట

నీయొద్దకు వచ్చితిని. నీవును స్తోత్రపా... లచే నన్నుక్కిరి బిక్కిరి చేయుచున... చిన్ననాడు నన్ను ఎట్లు పిలిచితివో ఇప్పుడును పిలువరాదా?"

భగవంతుని వచనముచే సుదాము... కొంతచనవు ఏర్పడినది. వెనుకంజ వేయ... కాలప్రవాహములో సుదాముడు ఒక్క...





THE PADMA SAROVARA WITH THE TEMPLE OF GODDESS PADMAVATHI

# ముడు

కటరమణమూర్తి

తాను సాందీపని మహర్షియొద్ద విద్యాభ్యాస ముచేసిననాటికి భగవత్కృప వలన పయనించినాడు. ఆ రోజులలో తాను పరమాత్మను 'నల్లనయ్యా' అని పిలచెడివాడు. స్మృతింపబ్డ పూర్వసంబోధనను మరల ప్రయోగించుటకై మొదట సంకోచించెను. కాని, పరమాత్మ ముఖములోని ప్రసన్నతను సందర్శించి మరి కొంత చనవును పొందినాడు. నాలుగు





ముఖముల వేల్పగు బ్రహ్మదేవునికే 'అయ్య' అగు ఆ దేవదేవుని 'నల్లనయ్యా'అని సంబోధించెను. పరమాత్మ ముఖమును పరికించినాడు. "అతి పరిచయా దవజ్ఞా"అనునట్లు తాను మర్యాద నతిక్రమించెనేమోయని సందియ పడినాడు.

పరమాత్మకు శ్రుతిగీతలకంటె ఈ 'నల్లనయ్యా' అను పిలుపు ఎంతో ముదమును గూర్చినది. పరమాత్మయే ఇట్లనినాడు: సుదామా! నల్లనయ్యా? అను నీ పిలుపు నాకెంతో ఆనందమును కూర్చినది. దీనితో సుదామునకు మరికొంత చనవు ఏర్పడినది. నోరార 'నల్లనయ్యా' అని పిలచినాడు. "నీవెంత పెంకెవాడవయ్యా! అనినాడు. కృష్ణపరమాత్మ కలతచెందినవానివలె "ఏమి సుదామా! నేనిచ్చిన ఈ గృహమును, ఇతర ఐశ్వర్యములు నీకు సంతృప్తిని కలుగజేయ లేదా? నీవు నాభక్తులలో లత్యుత్తముడవు. అంతియేకాక చిన్ననాటి ప్రాణస్నేహితుడవు. అందుచే లనితర సాధ్యమగు భోగ భాగ్యము లను నీకు తృటిలో కలుగజేసితిని. అయినను, నన్ను పెంకెవాడననుచున్నావు. 'భగవంతుని మెప్పించుట సుకరముగాని, భక్తుని సంతోషపరుప మిక్కిలి దుష్కరము అను నానుడిని నిక్కమొనర్చితివి. నావలన ఎట్టి దోసగు కలిగినదో భయరహితుడవై వచింపుము."

సుదాముడు భగవంతుని పెంకెవాడు అని పల్కిన అభియోగము తానిట్లు విశద పరచెను. "నల్లనయ్యా! నీవు నిజముగా పెంకెవాడవేనయ్యా!"

సుదాముడు మహావిద్వాంసుడు; సాంగ చతుర్వేదాధ్యాయి; సమస్త శాస్త్ర పారంగతుడు. అయినను, కఠోరదరిద్రము ననుభవించినవాడు. కట్టుకొనుటకు చిరుగులేని వస్త్రమునకైన నోచుకొనిన వాడు కాడు లోకులందరును తన దరిద్రమును తనకు వేలెత్తి చూపునట్లుగా 'కుచేలుడ'ని పిలచు చుండెడివారు. కుచేలుడనగా జీర్ణవస్త్రమును కట్టినవాడని యర్థము. సుదాముడు గొప్ప పండితుడేకాని బ్రతుకుతెరువు నేర్చినవాడు కాదు.

ఉ॥ ఆకొని యేడ్చు లేఁజిఱుత లన్నముకై
తనకొంగు వాఁగఁ బెల్లాకట
సోలు చుండెడి నిజాంగన
దుర్దశఁ జూడఁ డేని యా
త్మా కలనా విభంగ భయసంభృత
సద్గదశూన్య కంఠుడై
చేకొని దేహి యంచడుగఁ
జేరునె కాలిన పొట్ట కెవ్వడున్॥

చిన్ననాటి స్నేహితుడు ద్వారకయందున్నాడు; పోయి వేడినచో, కఠోర దారిద్ర్య విచ్ఛిత్తికి యేదియో ఒక సదుపాయము చేయకపోడు, అను భార్యావాక్యములచే ప్రేరేపింపబడి ద్వారకకు పోయినాడు. మార్గమందంతయును అనేక సందేహములచే చిత్త వృత్తి కలతచెందుచుండెను. చిన్ననాటి స్నేహితునకు తాను జ్ఞప్తి పథమునందుండునా? తనవంటి దరిద్రుని ఆదరించి పలుకరించునా? అంతటి ద్వారకా మహానగరమున అనేక రాజసౌధములుండును; ద్వారకావాసునకు లెక్కకు మిక్కిలియైన భార్యలున్నారని వినియున్నాడు. ప్రతియొక్కతెకు ఒక్కొక్క భవనముండును. అందు పెరవారు చొరరాని అంతఃపురముండును. తన నల్లనయ్య ఏ భవనములో, ఏ అంతఃపురములో ఉండునో? తానెట్లు కనుగొనగలడు. నోరు విడిచి అడిగినను తనవంటి నిరుపేదకు రాజోద్యోగులు ఉత్తర మిత్తురా? తన ప్రయాసయంతయు వృథాయగుటయేగాక దరిద్రము కంటె దుస్సహమగు ఎట్టి అపహాస్యమున పాలుగానున్నాడో, ఎట్టి అవమానములకు తను యొగ్గనున్నాడో? అను ఆలోచనలతో శరీర శ్రమకంటె మిక్కుటమైన మానసిక శ్రమను పొంది చిట్టచివరకెట్టెట్టో ద్వారకను చేరుకొనినాడు. శ్రీ కృష్ణపరమాత్మ ఆ సమయమున రుక్మిణీదేవి మందిరమున నుండెను. పరమాత్మయే ముందుగా తనను చూచి ఎంతయో చనువుతో పలకరించి తనమందిరములోనికి తీసుకొనిపోయి, తన కుచేలత్వమును ఏవగింపక, తనతోపాటు కూర్చుండబెట్టుకొని

# కొత్త శీర్షిక ప్రారంభం

## పాఠకుల ధార్మిక సందేహాలకు సమాధానాలు

ఎంతో కాలంగా పాఠకులందరూ ఎదురుచూస్తున్న ఈ శీర్షిక జూలై 94 నుండి ప్రారంభమయ్యింది. పాఠకుల ధార్మిక సందేహాలకు ప్రముఖ పండితులు సమాధానాలు ఇస్తారు.

ప్రశ్నలలో ఎటువంటి అవహేళనలకుగాని, దుర్విమర్శలకుగాని తావు వుండరాదు. వీలైనంతమటుకు ప్రతి ప్రశ్నకు ఆయా విషయాలలో నిపుణులైన వారిని సంప్రదించి సమాధానం ఇవ్వవలసి వుంటుంది గనుక, కొంత ఆలశ్యంగా ఒక్కొక్క ప్రశ్న ప్రచురితమయ్యే అవకాశమున్నదని గమనించగలరు.

**ప్రశ్నలు పంపవలసిన చిరునామా :**

సందేహాలు - సమాధానాలు
సంపాదకుడు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి -- 517 507

అతిథి సత్కారము లన్నియు నిర్వర్తించెను. భోజనానంతరమున ఇష్టాగోష్ఠి సలుపుచు - "మిత్రమా! నాకై ఏమి కానుక తెచ్చితివని అడిగెను. శ్రీకృష్ణుని అంతవానికి కానుకగా అర్పించుటకు తనయొద్ద ఏమి కలదు? అంగవస్త్రమున తనభార్య కట్టియిచ్చిన కొద్దిపాటి అటుకులు మాత్రము ఉన్నవి. ఇంకేమియును లేవు. అయినను, తన నల్లనయ్య పెంకెవాడు కనుక అటుకుల మూటను బలవంతముగావిప్పి ఎంతో ప్రీతితో పిడికెడు అటుకులను తినెను. శ్రీకృష్ణుని భవనమున మృష్టాన్నములతో విందు భోజనము చేసియు, తాను పిడికెడు అటుకులను మాత్రము కానుకగా తే గలిగినాడు; అవియు తనకుతానై ఈయలేకపోయినాడు; భగవంతుడే ప్రయత్నపూర్వకముగా స్వీకరించినాడు. నోరువిప్పి తాను శ్రీకృష్ణుని అర్థింపలేకపోయినాడు. తనకు ఘనమైన వీడ్కోలు శ్రీకృష్ణుడిచ్చినాడు. తాను ఇంటికి పోవుటకు తిరుగుప్రయాణము కట్టినాడు. తన జీవితమంతయు అంధకారమయి పోయినది. ఆకలిచే మాడుచుండి, ద్వారకనుండి ఏదియో తెత్తునను ఆశామాత్రముచే జీవములు నిల్పుకొనియుండి, 'ఏమి తెచ్చితివి'? అని అడుగు పిల్లలకు ఏమి చెప్పగలడు? సద్గుణవంతురాలు తనధర్మపత్ని శ్రీకృష్ణుడు ఏమియును ఈయలేదా? లేక మీరడుగనేలేదా? అని ప్రశ్నించగా తానేమి చెప్పగలడు. ఇట్టి దుఃఖపరంపరలతో తిరుగు ప్రయాణము చేసెను.

సుదాముడు భగవంతునితో ఇట్లు పలికెను: "నల్లనయ్యా! నీవు పెంకెవాడవు కాదా? వెలగట్టలేని సమస్త సంపదలను నీవే నాకు ప్రసాదించితివి. ఈ విషయము ద్వారకలోనే నాతో చెప్పియుండ రాదా? నీ చేతికి ధనమిచ్చిన నీవు తిరుగుప్రయాణములో పారవేసి కొందువేమోయని సరాసరిగా నీ గృహమందున్న నీ భార్యాబిడ్డలకు అతులితధనము నొసంగితిని; నీవు ఇంటికి ఆనందముగా పొమ్మని చెప్పియుండరాదా? తిరుగు ప్రయాణములో నే పొందిన దుఃఖమునకు మేరయే లేదు. నీ సందర్శనానంతరముకూడ నా దరిద్రమునకు అంతము కలుగలేదే! అని ఎంత దురపిల్లితినో? సమస్త జీవ హృదయగతుండవయిన నీకు తెలియలేదా? ధనమునిచ్చియు, ఇచ్చితినని చెప్పక నాతో కేళి సేయుదువా? నల్లనయ్యా! నీవు పెంకెవాడవు కాదా? నా జీవితమున అనుభవించిన దారిద్ర్యదుఃఖమునకు వేయి మడుంగులు దుఃఖము తిరుగుప్రయాణములో అనుభవించితినే! పూర్వము ధనములేక దరిద్రము అనుభవించితిని; ఈనాడు ధనముండియు దరిద్ర దుఃఖమునునుభవింపజేసితివి. నల్లనయ్యా ! నీవు నిజముగా కొంటెవాడవు ; పెంకెవాడవు !"

పరమాత్మ తనలో తాను నవ్వుకొనెను. సుదాముని చూచి చిరునవ్వుతో ఇట్లు పలికెను. నీవు నిజముగా వేదవేత్తవే ! సకల శాస్త్ర పరిజ్ఞాతవే ! కావుననే, వేయి జన్మలలో అనుభవింపదగిన సంచితమునంతయు, పశ్చాత్తప్త భావతీవ్రతచే నిశ్శేషముగా తిరుగు ప్రయాణపు స్వల్పసమయమందే అనుభవించితివి. కర్మఫలమనుభవింపక తీరదు కగా

!ఇంత మాత్రము సకల శాస్త్రవేత్తవు నీకు తెలియదా?"

సుదాముడు వినయముతో ఇట్లడుగుచు న్నాడు : "నల్లనయ్యా ! ఇట్టి దారిద్ర్యమును అనుభవించుటకు నేను ఎట్టి దుష్కర్మను చేసితినో నాకు తెలియుట లేదు. నీవు సర్వజ్ఞుడవు కదా ! చెప్పరాదా?"

పరమాత్మ తనలో తాను నవ్వుకొనెను. "సుదామా ! జీవులొనరించు సుకృత, దుష్కృతములు నాకేమి తెలియు నయ్యా ! నీవొనర్చిన దుష్కృతము నీకే తెలియన గును."

భగవంతుని ఈమాట వినిన పిదప సుదా ముడు తనను తానే పరీక్షచేసికొన దొడ గెను. మరల చిన్ననాటికాలమునకు స్మృతి పథమును తీసికొనిపోయెను. తానును, నల్లనయ్యయు సాందీపని మహర్షివద్ద విద్యా భ్యాసము చేసెడిరోజులు. ఒకనాడు పుష్ప ములకు - సమిధలకై తానును, నల్లన య్యయు సమీపకాంతార భూములకు పోయి యుండిరి. ఎట్టి సూచనయు లేకుండగనే ఝంఝామారుతమును, ఉరుములు-పిడు గులు తోడుగా భీషణ వర్షపాతమును వచ్చినది. తానును, నల్లనయ్యయు ఒక చెట్టుకొమ్మ పైకెక్కి కూర్చుండిరి. ఆకాశమంతయు కాలమేఘావృతమై నక్షత్రకాంతికి తావీ యక, కాలాంజన మద్దినట్లు, అంధకారమ యమై యుండెను. వర్షము హెచ్చుటయే గాని, తగ్గుటలేదు. గురువు గారింటికి పోవు అవకాశము ఆ రాత్రికి ఇకలేదని, తామి రువురు నిరాశ చెందిరి. ఆటలలో అలసి యున్నందువలనను, కాలాతీతమైనందు వల నను, తమ ఇరువురకును ఆకలి మిక్కు టముగనే యుండెను. గురువుగారి భార్య ఇచ్చిన కొద్దిపాటి అటుకులు తనవద్దయు న్నవి. తానుకొన్ని తీసుకొని మిగిలినవి నల్లనయ్యకు ఈయవలెనని మొదట అను కొనినాడు. గురుపత్ని గారిచ్చిన అటుకులు తమ ఇరువురకు చెందినవేకదా !కొన్నింటిని ఇత్తుననుకొన్నాడు. ఇంతలోనే విషపూరిత రేఖయొకటి తన అంతరంగమున చోటు చేసుకొని అంధకారమును అంతరంగమున ప్రవేశింపజేసినది. బాహ్యమంతయు మేఘ ముంచే అంధకారమైయే యుండెను; సుదా ముని అంతరంగముకూడ అంధకారముచే సంపూర్ణముగా నిండియున్నది. అంధకార ముకే మరియొకపేరు అజ్ఞానము. అజ్ఞానమే లోభమునకు కారణము. ఈ లోభప్రవృత్తి నుండియే దారిద్ర్యము సంభవించుచున్నది. అప్పుడు సుదామునకు ఒక దరిద్రపుటాలో చన మనస్సునందు మెదలినది. ఈ వర్షమిట్లే మరునాటివరకు ఉండినచో నల్లనయ్య కెయ్య వలసిన అటుకులు తనకే ఉపకరించును కదా ! అనుకొనినాడు. తానే అటుకులను పూర్తిగా తినినవాడునుకాడు. తాను తిను చుండగా ఏమి తినుచుంటివని నల్లనయ్య అడుగునేమోయని భయపడుచుండెను. ఇట్టి మనఃప్రవృత్తితో సగము అటుకులను తిని సగము మూటకట్టినాడు. ఈమాటయే సంచి తము.

నల్లనయ్య అడుగనే అడిగెను; "సుదామా ! ఏమి తినుచుంటివని?" సుదా ముడు చెప్పెను. "ఏమియు లేదు. ఊరకనే దంతములను కదల్చుచుంటిని. తినుచున్నట్లు నటించుచుంటిని. ఇట్లు నటించినచో క్షుద్బా ధకు కృత్రిమ నివృత్తియైన యౌనుకదా ! నీవును అట్లే చేయుము."

నల్లనయ్య నిజముగా పెంకెవాడే ! "సుదామా ! అట్లయిన ఏమియు లేదా?" అని మరల అడిగెను. సుదాముడు ఏమి యులేదని బదులు చెప్పెను. నల్లనయ్య "తథాస్తు!" అనినాడు. ఈ ఇతివృత్తమం తయు సుదాముని స్మృతిపథములో సుస్ప ష్టముగా భాసించెను. తనకుతానై ఎట్లు దరిద్రమును వరించెనో; అదియు భగవత్సా న్నిధ్యముననే, ఇప్పుడు తనకు అవగతమైనది.

తన తప్పు తెలిసికొనిన సుదాముడు భగ వత్పాద పద్మములపై శిరమును మోకరించి పశ్చాత్తప్త హృదయజనిత బాష్పములతో భగ వంతుని పాదములకు అభిషేచనమొనర్చెను. ఇప్పుడు తన హృదయము తేలికయైనది. అజ్ఞాన నివృత్తియైన జ్ఞాని మహైశ్వర్య సంపన్నుడు. అట్టి ఐశ్వర్యమును తానిప్పుడు పొందినాడు. భగవంతుడు సుదాముని లేవ దీసి తన ఉత్తరీయముతో కన్నీళ్ళు తుడిచి తన సరసను కూర్చుండ బెట్టుకొని, "ఏమి సుదామా! ఇట్లు బేలవై ఏడ్చుచుంటివి!" అని ఓదార్చెను.

సుదామునకు మరల కొంత చనవు ఏర్పడినది. "నల్లనయ్యా! నీవు నిజముగా పెంకెవాడవేనయ్యా! నేనేదో తెలియక ఏమియు లేదని పలికిన మాటకు ప్రతిగా "తథాస్తు!" అని ఘోర శాపమిత్తురా?" అని అడిగెను.

పరమాత్మ తనలో మరల నవ్వుకొనెను. "సుదామా! నీకు నేను శాపమేమియును ఇవ్వలేదు. నీవు అటుకులను తినుచుంటివని నాకు తెలిసినదని నీకును తెలిసినది. నాకు తెలిసినదని నీకు తెలియకుండుటకై 'తథాస్తు' అంటిని. నీవు ఏమియు లేదన్నదానికి నేను అంగీకరింపకున్న నీవు మనసున నొచ్చుకుం దువని "తథాస్తు" -- అనగా 'అట్లే' యని పలికితిని, నేను శపించితి నన్న భావము కూడ నీదియే! నీకు ఏమియు లేదను దరిద్ర భావమును నీదియే! నీవు ఎల్లప్పుడు నాయందే యున్నావు. నీ కెప్పుడును దరిద్ర ములేదు. నీ దరిద్ర భావమే నీ దరిద్రమునకు కారణము. ఇప్పుడు కర్మ శేషమును పూర్తిగా అనుభవించితివి. పశ్చాత్తప్త హృదయుడవైతివి. అజ్ఞానము నిన్ను పూర్తిగా వీడిపోయినది. భగవంతునకు, జీవునకు అడ్డముగానున్న తెర అజ్ఞానమే! తెర పూర్తిగా తొలగినది. నీవే నేనయితిని !

యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్.

నల్లనయ్య కంటె వేఱుగా సుదాముడు ఇకలేడు.

"మా కశ్చి ద్దుఃఖభా గ్భవేత్."






## మానవజన్మము

(రచయిత : కైప మహానందయ్య
-- ప్రతులకు : కైప నాగరాజు, 78,
ప్రకాష్‌రోడ్, అనంతపురం-515 001
-- 57 పేజీలు -- వెల:రు5/-)

ధర్మచింతన, ఆధ్యాత్మిక ప్రబోధం, సత్కార్యాచరణం, సత్యం, దయ, ధర్మం మొదలైన సుగుణాలను సామాన్యునికి సైతం అర్థం అయ్యే భాషలో, శైలిలో వివరించిన తీరు అభినందనీయం.

ఇందులో ప్రార్థనామహిమ, దుఃఖోప శమనము, దయ, దైవీసంపద, సంభాష ణము, జ్ఞానాభివృద్ధి, సజ్జనుడు, సుఖదుః ఖాలు, మానవ జీవితము, తీర్థయాత్రలు, సత్సాంగత్యము, సద్గ్రంథ పఠనము, మంత్ర జపము, మరణలీల, జీవిత రహస్యము, దోషా రోపణ వంటి 25 విషయాలపై సందేశాత్మక రచన కొనసాగింది.

అవసరాన్ని బట్టి గుణ ప్రాధాన్యాన్ని అనుసరించి అక్కడక్కడ పద్యాలు, శ్లోకాలు పేర్కొనడం గ్రంథానికి మరింత మేలు కలిగింది.

ఇటువంటి ప్రబోధాత్మక రచనలు ఎన్నైనా వెలువడ వలసిన అవసరం ఎంతైనా వుంది.

మంచి విషయాలను స్ఫూర్తివంతంగా చెప్పిన తీరుకు రచయితను అభినందించాలి.



-ఎల్లోరా



## శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం
## తిరుచానూరు
### నిత్యపూజానివేదనలు

సుప్రభాతం: ఉ. 5-00 గం. నుండి 5-30 గం. వరకు
సహస్రనామార్చన: ఉ. 5-30 గం. నుండి 6-00 గం. వరకు
శుద్ధి, మొదటిగంట: ఉ. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: ఉ. 6-30 గం. నుండి 11-30 గం. వరకు
శుద్ధి, రెండవగంట: ఉ. 11-30 గం. నుండి 12-00 గం. వరకు
సర్వదర్శనం: మ. 12-00 గం. నుండి సా. 6-00 గం. వరకు
శుద్ధి, మూడవగంట: సా. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: సా. 6-30 గం. నుండి రాత్రి 8-45 గం. వరకు
శుద్ధి రాత్రి 8-45 గం. నుండి 9-00 గం. వరకు
ఏకాంతసేవ: రాత్రి 9-00 గం. నుండి 9-30 గం. వరకు

### శుక్రవారాలలో

అభిషేకం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(రూ. 100-00 టిక్కెట్‌తో ఒక్కరికి మాత్రమే ప్రవేశం)*
అభిషేక దర్శనం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(ఒక్కొక్కరికి రూ. 5-00 టిక్కెట్)*

### ఆర్జిత సేవలు

| | | |
|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం | ... | రూ. 63-00 |
| గజవాహనం | ... | రూ. 32-00 |
| తిరుప్పావడ | ... | రూ. 3000-00 |
| డోలోత్సవం | ... | రూ. 150-00 |

### ఆర్జిత ప్రసాదాలు

| | | |
|---|---|---|
| దోసె | ... | రూ. 100-00 |
| దధ్యోదనం | ... | రూ. 75-00 |
| పులిహోర | ... | రూ. 100-00 |
| పొంగలి | ... | రూ. 200-00 |
| చక్కెర పొంగలి | ... | రూ. 200-00 |
| కేసరి బాత్ | ... | రూ. 300-00 |
| శాకరిబాత్ | ... | రూ. 250-00 |
| సీరా | ... | రూ. 400-00 |

*ఇవేకాక, భక్తాదులు రూ. 1-50 టిక్కెట్‌తో తమ*
*గోత్ర, నామాదులతో అమ్మవారికి అష్టోత్తరశతనామ పూజ చేయించవచ్చును.*

(20వ పేజీ తరువాయి)

ఇప్పుడు భజనకు - సర్వోత్తమావకాశం గురించి చర్చించుకుందాము. ఈ ప్రసంగంలో భర్తృహరి వచనాలను స్మరించండి.

యావ త్స్వస్థమిదం కళేబరగృహం
యావచ్చ దూరే జరా
యావచ్చేంద్రియ శక్తి రప్రతిహతా
యావత్ క్షయో నాయుషః
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా
కార్యః ప్రయత్నో మహాన్
ప్రోద్దీప్తే భవనే తు కూపఖననం
ప్రత్యుద్యమః కీదృశః.

శరీరరూపమైన గృహం స్వస్థంగా ఉన్నంతకాలం, వార్ధక్యం దూరంగా ఉన్నంతలో, శరీరం కార్యకరణ శక్తితో బలిష్ఠంగా ఉన్న వేళలో శక్తి దూరం కానంతలో, ఆయుర్ధాయం శేషించి ఉండగానే బుద్ధిమంతడైనవాడు సంపూర్ణంగా ప్రయత్నించి ఆత్మ కళ్యాణ సాధన చేసుకోవాలి. కారణం? మరణ వేళలో ఏమీ జరుగదు. కనుక ఈలోగా ఆత్మ కళ్యాణ సాధన చేసుకోజాలని వాడు - ఇంటికి నిప్పు అంటుకున్న తరువాత నూతిని త్వ్రేవాడు పొందే ప్రయోజనాన్నే పొందుతాడు. అట్టి వాడు మూర్ఖుడు కాక మరెవ్వడు.

## ప్రథమ విషయం :

ఈ దేహం ఆరోగ్యంగా ఉండగానే భగవద్భజన చెయ్యాలి. శరీరం ఎంతవరకూ స్వస్థంగా ఉంటుందో ఎవరు చెప్పగలరు? నేడు బలిష్ఠంగా యువకుడుగా ఉన్నవాడే - రేపు అంగ విహీనుడు కావచ్చును. ఇలాంటివి మనం కళ్ళారా ఎన్నో చూస్తున్నాము. ముప్పై ఏళ్ళ వయస్సు గల ఓ యువకుడున్నాడు. అతడు 14,15 గంటలు ఉత్సాహంగా పనిచేసేవాడు. ఒకనాడు అకస్మాత్తుగా పనిచేస్తూండగా అతడు పైనుండి కాలుజారి పడిపోయాడు. అంతే కుంటివాడయిపోయాడు. అందరికీ ఇదే స్థితి వస్తుందని కాదు. కానీ ఈ ఉదాహరణను బట్టి కీడెంచి మేలెంచాలి. ఈ విషయం శాస్త్రం ఇలా సమర్థిస్తున్నది:

యత్ప్రాతః సంస్కృతం చాన్నం
తచ్చ సాయం వినశ్యతి
తదీయ రససంపుష్టే
కాయే కా నామ నిత్యతా.

పొద్దుటి పక్వమైన అన్నం సాయం కుళ్ళిపోయేటట్లు - ఈ శరీరం కూడ చిరకాలం. స్వస్థంగా ఉంటుంది అనడానికి ఆస్కారం లేదు. కారణం? 24 గంటల కాలవ్యవధిలో కుళ్ళిపోయే అన్నంతో పోషింపబడే ఈదేహం మాత్రం ఎంతకాలం నిలుస్తుంది? కనుక శరీరారోగ్యంపై భారం ఉంచడమంటే తన్ను తాను మోసగించుకోవడమే అవుతుంది.

## ద్వితీయ విషయం :

వార్ధక్యం ప్రవేశించక పూర్వమే ఆత్మ కళ్యాణ సాధన పూర్తి చేసుకోవాలి. పుట్టిన ప్రతి వ్యక్తీ వార్ధక్యం వరకూ ఉంటాడనటానికీ అవకాశం లేదు. ఎందరో బాల్యంలో లేదా యౌవ్వనంలోనే మృత్యువునకు గురి అయిపోతున్నారు. కనుక వార్ధక్యావస్థ ఇంకా ఉందిలే అని అనుకోవడానికి లేదు. రావలసిన వస్తువు వస్తుందో రాదో తెలియని స్థితిలో నున్న మనకు వార్ధక్యం దగ్గర నున్నదో, దూరంగా ఉన్నదో ఎలా తెలుస్తుంది? కనుక ఉద్యోగ విరమణ (రిటైర్) అయిన తరువాత "భగవద్భజన" చేస్తాననుకోవడం సాధ్యం కాని విషయం.

జలబుద్బుదవ న్మూఢ
క్షణవిధ్వంసి జీవనమ్,
కిమర్థం శాశ్వతధియా
కరోషి దురితం సదా.

ఈ శరీరం నీటి బుడగలా క్షణ భంగురమైనది. దానిని స్థిరమని నమ్మి మానవుడు ఏమి పాపం చేస్తాడు? ఇక్కడ క్షణభంగుర శబ్దం అర్థం చేసుకోదగినది. ఏ క్షణంలో శరీరం ఏ స్థితిని పొందుతుందో తెలియదు గదా! ప్రారబ్ధ కర్మభోగార్థం జీవునికి సీమితకాలం ఈ దేహం లభిస్తుంది. భోగసమాప్త్యనంతరం శరీరం రాలిపోతుంది. కనుక ఈ దేహాన్ని ఎన్నడూ నమ్మడానికి వీలు లేదు.

## తృతీయ విషయం :

ఇంద్రియ శక్తి క్షీణం కానంత వరకూ - అంటే బలంగా ఉండగానే ఆత్మ కళ్యాణం సాధన చేసుకోవాలి. ఇంద్రియ శక్తి ఎంతవరకూ ఉంటుందో ఎవరు మాత్రం నిశ్చయంగా చెప్పగలరు?

ఓ ఉపాధ్యాయుడు పాఠశాలలో విద్యార్థులకు నిత్య నియమానుసారం పాఠాలు చెప్పి సాయం సమయానికి స్వగృహం చేరుకున్నాడు. రాత్రి నిద్రపోయాడు. ఉదయం లేచి చూసే సరికి అతని దృష్టి పోయింది. అకస్మాత్తుగా తగిలే ఆఘాతాల వల్ల, లేదా రోగాల వల్ల ఇంద్రియాలు శక్తి హీనమైపోవడంతో ఇట్టి ఎన్నో సంఘటనలు జరగడం మనం నిత్యం చూస్తూనే వున్నాము. దీనిని బట్టి ఇంద్రియశక్తి ఎంతకాలం స్థిరంగా ఉంటుందో కూడ నిశ్చయించజాలము.

అనిత్యాని శరీరాణి
విభవో నైవ శాశ్వతః,
నిత్యం సన్నిహితో మృత్యుః
కర్తవ్యో ధర్మ సంగ్రహః.

శరీరం క్షణభంగురమైనది. మనో బుద్ధీంద్రియసాధన రూపే వైభవాలు ఎంత వరకూ ఉంటాయో చెప్పజాలము. మృత్యు - దేవత శిరస్సు పై తాండవం చేస్తూనే ఉంటుంది. కనుక ప్రతీ క్షణం ఆత్మ కళ్యాణార్థం వినియోగిస్తూండాలి.

## చతుర్థ విషయం :

సర్వాధిక మహత్త్వ పూర్ణమైనది: ఆయుర్దాయం ఉన్నంతవరకూ ఆత్మ కళ్యాణసాధన చేస్తూనే ఉండాలి. దీని విషయం ముందుగా ఎవ్వరికీ తెలియదు. నేటి కాలంలో జీవితాన్ని భీమా చేస్తున్నారు. కానీ భీమా సమయం పూర్తికాక మునుపే శరీరాలు రాలిపోవడమూ చూస్తున్నాము. భీమా చేయబడిన శరీరాలను మాత్రం ప్రాణం పోయిన తరువాత ఉంచుతున్నారా? ఎన్ని రూపాయలకు భీమా చేస్తున్నారో ఆ ద్రవ్యాన్ని మాత్రం

వారసులు తీసుకుని యజమానిని శ్మశానం చేరుస్తూన్నారు. మానవ జీవనాయుర్దాయం అత్యంత అమూల్య మయినది. డబ్బు ద్వారా దానిని కొనజాలము. అదే సాధ్యమయితే ఎందరో ధనికులు ఎన్నాళ్ళు బ్రతకాలను కుంటారో అన్నాళ్ళూ బ్రతుక గలుగుతారు. కాని, అలాంటిదేమీ కానరావడం లేదు. కనుక దీనిని బట్టి ద్రవ్యానికి ఆయువు లభించదని సుస్పష్టమవుతూన్నది.

మృత్యుర్జన్మవతాం వీర
దేహేన సహ జాయతే
అద్య వాబ్ద శతాంతే వా
మృత్యుర్వై ప్రాణినాం ధ్రువమ్.

ప్రతీ శరీరధారి మరణమూ శరీరంతో బాటే నిర్ణయమై ఉంటుంది. సదా వాని శిరస్సు మీదనే ఎక్కి సమయం రాగానే కబళించి వేస్తుంది. తత్సమయంలో ఎవరి సిఫారసూ చెల్లనేరదు. ఈ విశ్వంలోని ఏ శక్తీ మృత్యువును వారింపజాలదు. క్షణ కాలం కూడ దానిని నివారించజాలదు.

ఇంతవరకూ వచ్చి - 'శరీరం ఎంతకాలం ఆరోగ్యంగా ఉంటుంది?' అన్న విషయాన్ని కూడ మనం అంచనా వేయలేము. వార్ధక్యం వస్తుందా? రాదా? వస్తే ఎన్నాళ్ళు ఉంటుంది? అన్న విషయాన్ని ముందుగా నిశ్చయించజాలము. క్షణ భంగురమైన ఈ దేహం ఎప్పుడు నాశనమవుతుందో కూడ ముందుగా ఎట్టి వారూ చెప్పజాలరు. ఇంద్రియశక్తి ఎంతకాలం సహకరిస్తుందో కూడ ఆదిలో ఎవరూ చెప్పలేరు కనుక దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దుకోవాలన్న సూత్రానుసారం తత్వర భావంతో భజన యందున సంలగ్నులు కావాలి. ఇదే నిర్భయ మార్గము. భజనకు సర్వోత్తమ ముహూర్తం ఎప్పుడు? నేడే - కాదా ఇప్పుడే అని తెలుసుకోవాలి. గతించిన క్షణం కూడ మరలిరాదు.

ప్రత్యాయాంతి గతా:
పునర్నిదివసా: కాలోజగద్భక్షకః
భర్తృహరి అంటాడు--

అంటే గడచిన కాలం మరల రాదు. కాలుడు జీవుని కబళిస్తూనే ఉంటాడు. మానవ జీవనం విశేష అమూల్యమయినది. కనుక ఈ జీవన కాలంలో క్షణం కూడ వ్యర్థం కారాదు. కుదిరితే ప్రతీ క్షణాన్నీ భజనలోనే గడపండి.

ఈ విషయంలో శాస్త్రాలు ఈ రీతిగా బోధచేస్తున్నాయి:

శ్వః కార్య మద్య కుర్వీత
పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్,
నహి ప్రతీక్షతే మృత్యుః
కృత మస్య న వా కృతమ్.

రేపు చేద్దామనుకున్న కార్యాన్ని ఏ మాత్రం అనుకూలించినా నేడే చెయ్యాలి రెండు జాముల తరువాత చెయ్యాలనుకున్న కార్యాన్ని ఇప్పుడే చెయ్యి. ఏ మంటే



మృత్యువు ఎప్పుడు మీదపడుతుందో? ఎవరూ చెప్పలేరు. నిరీక్షిస్తూ ఉండడానికి మృత్యువు ఈషణ్మాత్రం విలంబం చేయదు. కాలం ఆసన్నమయితే అది జీవుని కబళించి వేస్తుంది. కార్యం అసంపూర్ణంగా ఉండిపోతుంది.

దైవప్రార్థనా రహితంగా ఒక్క శ్వాస కూడ వ్యర్థంగా పోరాదు. ఏమంటే జీవనం - ఎంత చంచలమైన దంటే విడిచిన శ్వాస ఒక్కొక్క సారి మరల లోనికి రాదు.

"బహిస్సరతి నిశ్వాసే
విశ్వాసః కః ప్రవర్తతే".

ఓ మాలలో 108 పూసలుంటాయి. ఇవి శ్వాస యొక్క లెక్కలకు సంబంధించి ఉంటాయి. ఆరోగ్యవంతుడైన వాడు నిముషానికి 15 శ్వాసలు తీసుకుంటాడు. ఈ దృష్ట్యా రోజుకు 21,600 శ్వాసలు తీసుకుంటాడు. దీనిని 200 పెట్టి భాగిస్తే 108 వస్తుంది. కనుక ఈ లెక్కప్రకారం ప్రతి 200 మాలలు జపం చెయ్యాలి.

శరీరం క్షణ భంగురమైనదనీ, మృత్యువు తప్పదనీ తెలిసి కూడ మానవుడు మోహవశుడై "నిత్యం సన్నిహితో మృత్యు:" - శిరస్సుపై మృత్యువు తాండవిస్తున్నది - అన్న విషయాన్ని విస్మరిస్తాడు. తనకు ఎన్నడూ మృత్యువు రాదనుకుంటూ విషయభోగాలలో తన్మయుడై పోతాడు. పుణ్యపాప విచారణ చెయ్యడు. ఇదియే భగవన్మాయ.

యక్షుడు ధర్మరాజును ప్రశ్నిస్తాడు - "జగత్తులో అన్నింటికంటె ఆశ్చర్యకర విషయం ఏమిటి?". బదులు పలుకుతూ ధర్మరాజు అంటాడు.

అహన్యహని భూతాని
గచ్ఛన్తి యమమందిరమ్,
శేషాః స్థావర మిచ్ఛన్తి
కిమాశ్చర్య మతః పరమ్.

పుత్రుడు మాతాపితరులకు దహన సంస్కారం చేసి వస్తాడు. సోదర బాంధవుల శ్మశాన యాత్రలో పాల్గొంటాడు. పుట్టిన ప్రతి వ్యక్తీ మరణించడం కనులారా చూస్తాడు. వాడూ చావక తప్పదు. కానీ ఏ వ్యక్తికీ "నేనూ ఓనాడు పోవలసినదే" అన్న భావం అనుభవ పూర్వకంగా కలగడం లేదు. పైగా తాను శాశ్వతంగా జీవిస్తాననుకుంటాడు. దీనికి మించిన ఆశ్చర్యకర విషయం ఏముంటుంది? ఇంత కన్న మహా మాయా స్వరూపం ఏముంటుంది?

కనుక ఓ మహాత్ముడంటాడు:

ఓ మానవా! నువ్వు శుభాన్ని కోరుకుంటావో? రెండే రెండు విషయాలు సర్వదా దృష్టిలో ఉంచుకో! ఒకటి, మృత్యువును సదా జ్ఞప్తియందుంచుకో; సమయం వ్యర్థం కారాదు.

అవిస్మృతిః కృష్ణ పదారవిందయో
ర్థనో త్యభద్రాణి చ శం తనోతి.

భగవంతుని చరణకమలాలను నిరంతరం స్మరిస్తూ ఉంటే అశుభాలు నాశనమై శుభాలు చేకూరుతాయి. ✪

# శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయము

## గంగాపూర్

శ్రీ నాగాభట్ల మార్కండేయశర్మ

మహబూబ్ నగర్‌జిల్లా, జడ్చర్ల తాలూకా కేంద్రానికి నాలుగు కిలోమీటర్ల దూరమున నున్న గంగాపూర్ గ్రామమందు గల శ్రీ చెన్నకేశవ స్వామి దేవాలయము బహు పురాతన మైనది. క్రీ.శ. 1050 నుండి 1280 వరకు పశ్చిమ చాళుక్య సామంతులైన కందూరు చోళవంశము వారు ఇప్పటి నల్లగొండ, మహబూబ్ నగర్ జిల్లాలలోని మధ్య భాగమును పరిపాలించారు. పానగల్లులోని పచ్చల సోమేశ్వరాలయము, పేరూరి లోని స్వయంభూ సోమేశ్వరాలయము, గంగాపురములోని శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయము ఆ రాజుల కాలములో నిర్మింపబడిన ప్రసిద్ధాలయములు. వాటి వాస్తువు, శిల్పము ఒక ప్రత్యేకతను కలిగి గొప్ప కళాసంపదను వ్యక్తము చేయుచున్నది.

గంగాపురము యొక్క స్థల ప్రాశస్త్యమును గురించి పాల్కుర్కి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్ర యందు విశదీకరించాడు. క్రీ.శ. 16వ శతాబ్దమందు మల్లారెడ్డిచే రచింప బడిన "గంగాపుర మాహాత్మ్య" మందు, వెంగయకవి విరచిత మైన "నరపతి విజయ" మందు గంగాపుర ప్రస్తావన కానవచ్చును. గంగాపురమునకు "మాయపురి" అను ద్వితీయ నామధేయ ముండుట వలన వెంగయకవి గంగాపుర




ప్రాచీనతను బుద్ధుని కాలముతో ముడిపెట్టినాడు. బుద్ధుని తల్లి మాయాదేవి అగుట వలన ఆ నామముతో ఈ గ్రామ మేర్పడి యుండవచ్చునని అభిప్రాయము వ్యక్త పరిచినాడు. క్రీ.శ. 11వ శతాబ్ద కాలానికి చెందిన పశ్చిమ చాళుక్య శాసనములలో "త్రైలోక్యమల్ల కేశవపురము"గా పేర్కొనబడినది. పశ్చిమ చాళుక్య రాజైన మొదటి త్రైలోక్య సోమేశ్వరుడు (క్రీ.శ.1042-68) తన పేరున త్రైలోక్యకేశవ పురాన్ని, శ్రీ చెన్నకేశవ ఆలయాన్ని నిర్మించాడు. శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయ శిల్ప సంపద ఆనాటి వారి శిల్ప కళా చాతుర్యానికి తార్కాణం.

పశ్చిమ చాళుక్య ప్రభువులైన మొదటి సోమేశ్వరుడు, ఆరవ విక్రమాదిత్యుడు, మూడవ సోమేశ్వరుడు వేసగిన శాసనముల వలన శ్రీ చెన్నకేశవస్వామి ఆరాధన వైభవోపేతంగా జరిగినట్లు తెలియవచ్చుచు

న్నది. క్రీ.శ. 1091 నాటికే ఈ ఆలయము ప్రఖ్యాతి గా వెలుగొందుకొంది. పైరాజులచే వేసగ బడిన శాసనములు సాగరేశ్వర, కోమరేశ్వర, సోమనాథదేవ, సారేశ్వర, భీమేశ్వర, పాలేశ్వర, మరియు కేశవస్వామికి విరివిగా దానములు యిచ్చినట్లు తెలియుచున్నది. కాని ప్రస్తుతము పైన పేర్కొన్న శివాలయములు మనకు కానవచ్చుటలేదు. గంగాపురమునకు రెండు కిలో మీటర్ల దూరములో మీనాంబరియేరువద్ద కొన్ని శివలింగములు కొద్దికాలము క్రితం త్రవ్వకములలో బయల్పడినవి. బహుశ ఆ శివలింగములే శాసనములందు పేర్కొనబడిన శివాలయములై యుండవచ్చునని ఊహింపనగును.

### ఆలయ నిర్మాణము :

క్రీ.శ. 11వ. శతాబ్దము నుండి ఈనాటి వరకు నిరాటంకముగా నిత్యధూప దీప నైవేద్యములను అందుకొంటున్న శ్రీ చెన్నకేశవస్వామి ఆలయ నిర్మాణం పశ్చిమ చాళుక్యుల శిల్పచాతుర్యానికి ప్రతిగా నిలచియున్నది. గంగాపుర గ్రామ నైఋతి దిశ యందు, సువిశాలమైన ప్రాంగణములో రెండు ప్రాకారములుగల్గి, ఎత్తైన అధిష్ఠానముపై నిర్మింపబడినది. ఆలయము తూర్పుముఖముగా నిర్మింపబడినది. తూర్పు దిశగా గల మొదటి ప్రాకార ప్రవేశ ద్వారమునకు యిరువైపుల మండపములు గలవు. ప్రవేశద్వారమునకు మెట్లు గలవు. మెట్లకు యిరువైపుల గజహస్త నగిషీగల శిలాఫలకములు చేర్చబడియున్నవి. మొదటి, రెండు ప్రాకారముల నడుమ నైఋతిదిశగా గణపతి, దక్షిణ దిశగా కల్యాణ మండపము, ఉత్తరదిశగా యాగశాల గలవు. మొదటి రెండు ప్రాకారాల నడుమ నాల్గు స్తంభముల మండపము, దానికి ప్రక్కగా హనుమాన్ మందిరము గలవు. సమభంగి భంగిమలో, అంజలి ఘటించు చున్న హనుమాన్ విగ్రహము సుందరముగా మలచ బడినది.

ప్రధానదైవమైన శ్రీ చెన్నకేశవస్వామి ఆలయము అధిష్ఠానముపై నిర్మింపబడినది. అధిష్ఠానము చాళుక్య సాంప్రదాయ పద్ధతిలో పట్టిక, పద్మ, మహాపట్టిక, పట్టిక మొదలగు భాగములుగా విభజింపబడినది. గర్భాలయము, అంతరాళము, ముఖమండపము గలవు. ముఖమండపములోనికి ప్రవేశించుటకు గల ద్వార బంధము గజలక్ష్మి చిహ్నము గలిగి అతి మనోజ్ఞంగా మలచబడి, మాపరులను ఆకర్షించేదిగా నున్నది. ద్వార బంధమున కిరువైపుల లతాంశములను పట్టుకొని యున్న లావణ్యవతులు జీవకళతో ఒప్పారుచున్నారు. ముఖమండపమునకు ఉత్తర, దక్షిణములకు కూడా ప్రవేశద్వారములు గలవు. ఆలయ వెలుపలి గోడలు కుడ్య స్తంభములతో, కుడ్య స్తంభాగ్ర భాగములు రథాకృతినిబోలి, కొన్ని కుడ్య స్తంభములు "కూడు" నగిషీలతో అతిసుందరముగా మలచబడినవి. మండప స్తంభములు చతురస్ర అష్టభుజపట్టిక విభాగములు గలిగి యున్నవి. మండప పై కప్పు భాగమున నగిషీలు లేవు. ద్వార బంధమున కిరువైపుల యందుగల గూడులయందు ద్వారపాలక విగ్రహములు గలవు. ద్వార బంధ నిలువు పట్టికలు ఆరు శాఖలుగా విభజింపబడి, లతలు, నగిషీలు చెక్కబడినవి. కొన్ని శాఖలపై ఎటువంటి నగిషీలు లేవు. ద్వారోపరి భాగమందు విమాన గోపురములు చెక్కబడినవి. మరొక ద్వార బంధమువద్ద ద్వార పాలకులతో బాటు గరుడ విగ్రహము, భక్తుడు వేదికపై గలరు.

రెండవ ప్రాకారము నాల్గు మూలలందును నాల్గు ఉపాలయములు గలవు. చిరు అధిష్ఠానముపై నిర్మింప బడిన ఈ ఆలయములు చిరు మండపములు, గర్భాలయములు గలిగి యున్నవి. ఈ ఆలయ గోడలు కూడా ప్రధానాలయ గోడలవలె కుడ్య స్తంభములతో, గోపురాకృతులతో మలచబడినవి. ముఖమండప మందు దేవకోష్ఠములు ఉన్నప్పటికి వాటియందు విగ్రహములు లేవు.

ప్రధానాలయ గర్భాలయమందు గల మూలవిరాట్టైన శ్రీ చెన్నకేశవస్వామి సమపాద భంగిమలో మలచబడ్డ స్థానకమూర్తి. క్రింది హస్తములందు పద్మము, గద, పై హస్తములందు శంఖము, చక్రము ధరించి యున్నాడు. ఓ స్త్రీమూర్తి అతని వామ భాగమందు గలదు. దక్షిణ భాగమందు నిలచియున్న మూర్తిని గుర్తించుటకు వీలుకాకున్నది. కిరీట మకుటము, కుండలములు, కంకణములు, హారములతో సర్వాలంకార భూషితుడై ఒప్పారుచున్నాడు. గర్భాలయ మందు ప్రక్కగా లక్ష్మీదేవి పద్మాసనమందు ఆసీను రాలై యున్నది. ఈమె చతుర్భుజమూర్తి. పైరెండు హస్తములయందు కలువలను ధరించి, క్రింది హస్తములు అభయ, వరద ముద్రలను సూచించుచున్నవి. మరియొక విగ్రహము లక్ష్మీనారాయణునిది. శ్రీమన్మహావిష్ణువు ఆసీనుడై యుండగా, వామభాగమందు లక్ష్మీదేవి అతని ఉరముపై ఆసీనురాలైయున్నది.

చతుర్భుజ మూర్తియైన విష్ణువు శంఖ చక్రములు ధరించి, దక్షిణ హస్తము అభయ ముద్రను సూచించు చుండగా, వామహస్తముతో లక్ష్మీదేవిని ఆలింగనము చేయుచున్నాడు.

మొదటి ప్రాకార మందు చతుర్భుజ గణేశవిగ్రహము చూడముచ్చనైనది. హస్తములందు దండము, పరశు గల్గి, క్రింది హస్తములందు మోదకములు గలవు. హారము, ఉదర బంధము, యజ్ఞోపవీతము గల్గి, మకుట ధారియై యున్నాడు. మూషిక వాహనము గలదు. ఆలయ ఆవరణలో భైరవుడు, నాగ-నాగిని ప్రతిమలు గలవు. సప్త మాతృకల ఫలకము గలదు.

ఆలయ ప్రాంగణములో మొదటి, రెండు ప్రాకారముల మధ్య స్థలములో ప్రక్కగా చాలా విశాలమైన మెట్లు గలిగిన దిగుడు బావి గలదు. అదియే ఆలయ పుష్కరిణిగా ఉపయోగపడుచున్నది.

క్రీ.శ. 11వ. శతాబ్దమునుండి నేటివరకు నిరాటంకంగా నిత్యధూపనైవేద్యము లందుకొంటున్న శ్రీ చెన్నకేశవస్వామి ఆలయము అతి ప్రాచీనమైనది. పశ్చిమ చాళుక్య శిల్పకళా చాతుర్యం ఉట్టి పడేలా నిర్మింపబడ్డ ఈ ఆలయము ఈ జిల్లాలోని ఆలయ సంపదకే కలికి తురాయి. శ్రీ చెన్నకేశవస్వామి ఆలయము పరిశుభ్రముగా నుంచి, ఆలయ విధులు నిర్వహించుచున్న దేవాదాయశాఖ, ఆలయ ప్రాచీనతను, శిల్పములను పరిరక్షించుచున్న పురావస్తు పరిశోధన శాఖ వారు ప్రశంసనీయులు.

# పినాకం -- కోదండం -- గాండీవం

శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి

బ్రహ్మదేవుడు ఒకనాడు తన హంస వాహనంపై మేరు పర్వతం మీదుగా, దేవ కార్యార్థమై ప్రయాణిస్తుండగా సూర్యోదయం కాసాగింది. అది సంధ్యవార్చే సమయంకావటంతో మేరుపర్వతం చాలా పవిత్రమయిన ప్రదేశం కావడంవలన, తన హంసవాహనాన్ని క్రిందకు దిగమని చేత్తో దాన్ని నెమ్మదిగా నిమిరాడు. ఆయనభావం అర్థంచేసుకున్న రాజహంస అనువైన ప్రదేశాన్ని చూసుకుని దిగింది.

చక్కని సెలయేరు. ప్రక్కనే ఒడ్డు చుట్టూ స్వర్ణమయములయిన వృక్షలతా గుల్మాదులతో ఆ స్థలం చాలాసుందరంగా ఉంది. బ్రహ్మదేవుడు హంసవాహనాన్ని దిగి దండ, కమండలాల్ని ఒడ్డున ఉంచి స్నానార్థమై సెల ఏటిలో దిగాడు. స్నానంచేస్తూండగా చిన్నవింత జరిగింది.

సరిగ్గా ఆ సమయంలో ఆప్రాంతంలో సంచరిస్తున్న 'కిమ్మీరుడ'నే రాక్షసుడు బ్రహ్మదేవుణ్ణి, ఒడ్డున హంసను, ప్రక్కనే నీరెండలో మెరుస్తున్న బ్రహ్మయొక్క స్వర్ణ, దండకమండ లాల్ని వీక్షించాడు. వాడికి బ్రహ్మను ఆటపట్టించాలనిపించింది. నెమ్మదిగా సవ్వడి కాకుండా వెనకవైపునించివచ్చి దండ కమండలాల్ని సంగ్రహించి పారిపోసాగాడు. అది చూసిన రాజహంస అరవడం ప్రారంభించింది. సూర్యభగవానుడికి అర్ఘ్యప్రదానం చేస్తున్న బ్రహ్మకు ధ్యానభంగం అయింది. ఆయనకు దూరంగా పారిపోతున్న రాక్షసుడు కనిపించాడు. త్వరగా ఒడ్డుకువచ్చి హంసను అధిరోహించి దనుజుని తరమసాగాడు.




ఇది గమనించిన రాక్షసుడు తను బ్రహ్మకు దొరికిపోవడం తథ్యమని గ్రహించి చేతిలో దండాన్ని విరిచి రెండు ముక్కలు చేసి క్రింద త్వరతరగా నిలువెత్తు గొయ్యితీసి అందులో ఆ రెండుముక్కల్నీ, కమండలాన్ని పాతిపెట్టి మళ్ళీ బ్రహ్మకు చిక్కకుండా పరిగెత్తసాగాడు. కాని ఈలోగా హంస వాణ్ణి సమీపించి తనపాదాల్తో ముందుకుతోసింది.

ఆ తోపుకు వాడు క్రిందపడ్డాడు. బ్రహ్మ దేవుడు క్రిందకుదిగి వాడి జుట్టు ముడి పట్టుకుని తనముష్టి ఘాతంతో మళ్ళీ కిమ్మీ రుణ్ణి క్రిందపడవేశాడు. క్రిందపడ్డ వాడి ఛాతీపై తన దక్షిణపాదంతో నోట్లోంచి రక్తం వచ్చేలా ఒదుముసాగాడు. రాక్షసుని నోట్లోంచి రక్తం వరదలా రాసాగింది. ప్రాణభీతితో కిమ్మీరుడు బ్రహ్మకు నమస్కరిస్తూ "బ్రహ్మ దేవా! బుద్ధిచాపల్యంతో నేనుచేసిన అపరా ధాన్ని మన్నించు. ఈ జగత్తులో పిపీలికాది జీవరాసుల సృష్టికర్తవైన నీవు నాకు పితృస మానుడవు. ఏ తండ్రైనా తన సంతానంచేసే చిలిపిపనులను సహృదయంతో మన్నిస్తాడు. ఈచర్యవల్ల ఎవరికీ ఏ హానీ కలుగలేదు "అనిపరిపరివిధాల స్తుతించి ఆయన పాదా లను పట్టుకుని క్షమాభిక్షవేడాడు. దయార్ద్రి హృదయుడైన సరస్వతీపతి వాడి ప్రార్ధనతో శాంతించి, క్షమించి, శపించకుండా దాన వుణ్ణి వదిలిపెట్టాడు. భూస్థాపితమైన దండ కమండలాల్ని వర్జించి సత్యలోకానికి తరలివెళ్ళి పోయాడు."బ్రతుకుజీవుడా" అని రాక్షసుడు అక్కడ్నుంచి పాతాళానికి పారిపోయాడు. సృష్టికర్త తనసృష్టికార్యక్రమంలో పడి దండ, కమండలాలమాటే విస్మరించాడు.

కొన్నాళ్ళు జరిగేసరికి రాక్షసుడు, బ్రహ్మ దండ కమండలాలు పాతినచోట ఒక పొడు గైన వెదురుమొక్క, దాని ప్రక్కనే ఒక లత పెరసాగాయి. రెండు స్వర్ణమయములై వింతకాంతులతో మెరిసిపోతూ రోజురోజుకు పొదుగ్గా పెరగసాగాయి. అవి అంతకంతకు విపరీతంగా పెరగడం సూర్య భగవానునికి ఆశ్చర్యం వేసింది. దివ్యదృష్టితో అవి బ్రహ్మ దండ, కమండాలని గ్రహించి, అటువంటి పవిత్రమయిన వస్తువులు వృధాకారాదని, ఆ విషయం ఆయనకు తెలియచేశాడు.

వాటిని బ్రహ్మదేవుడు వచ్చి చూసి "ఏంచెయ్యాలా" అని నిశితంగా ఆలోచిం చాడు. మనస్సులో దేవశిల్పి విశ్వకర్మను తలుచుకున్నాడు. విశ్వకర్మ వెంటనే బ్రహ్మ దేవుని ఎదుట నిలబడి నమస్కరించాడు. బ్రహ్మదేవుడు విశ్వకర్మతో "విశ్వకర్మా! ఈలతా, వృక్షములు రెండూ మహిమాన్విత ములైన నాదండ కమండాలకు ప్రతిరూపాలు - వీటిని లోకకల్యాణార్థమై ఉపయోగపడేలా నీకు తోచిన వస్తువుల్ని తయారుచెయ్యి అని ఆజ్ఞాపించాడు.

విశ్వకర్మ "వల్లె" యని ఆ వెదురు మొక్కని ఖండించి మూడు దివ్యధనుస్సు లుగాను, అక్షయతూణీరాలను ప్రసాదించే మూడు అమ్ములపొదులుగాను తయారుచే శాడు. లతను ఆమూడు ధనుస్సులకు నారిగా అమర్చాడు. ఆ దివ్యవస్తువులను బ్రహ్మకు ఇవ్వగా ఇంకా కొంచెం ముక్క మిగిలింది. దానిని కూడావృథాపోనివ్వకుండా ఒక అద్భు తమైన మురళిని తయారుచేశాడు. దాన్ని బ్రహ్మదేవునికి సమర్పించి "మహానుభావా! మీ ఆజ్ఞను నెరవేర్చాను. ఈధనుస్సులు, మురళి మహామహిమాన్వితములు. లోక కల్యాణార్థమై అవతరించే దివ్య పురుషులు ధరించతగ్గవి. అటువంటివారికి కానుకలుగా అందచెయ్యండి. మరి సెలవు" అని విశ్వకర్మ అంతర్ధానమయ్యాడు.

బ్రహ్మదేవుడు మొదటి ధనుస్సుకు "పినాక"మని రెండవధనుస్సుకు "కోదం డమ"ని మూడవధనుస్సుకు "గాండీవ"మని నామకరణాలుచేశాడు. మొట్టమొదట ఈశ్వ రుని తలుచుకున్నాడు. చిరునవ్వుతో, నెత్తిన జటాజూటంలో, గంగాదేవి ప్రవహిస్తోండగా చేతిలో శూలంతో, బ్రహ్మముందు ఈశ్వరుడు ప్రత్యక్షం అయ్యాడు. పినాక నామధేయ ధను స్సును ఈశ్వరునికి కానుకగా అమ్ములపొదితో సహా అందించాడు బ్రహ్మ. ఆనందంగా దాన్ని స్వీకరించి బ్రహ్మను గాఢాలింగనం చేసుకు న్నాడు పరమేశ్వరుడు. ఆరోజునుంచి పశుపతి "పినాకపాణి" అయ్యాడు.

ఆ తర్వాత దేవేంద్రుణ్ణి తలుచుకు న్నాడు బ్రహ్మ. దేవేంద్రుడు రాగానే "కోదండం" పేరుకల ధనుస్సును, అమ్ముల పొదిని అందిస్తూ "ఇంద్రా! ఈదివ్యధను స్సును త్రేతాయుగంలో రాక్షస సంహారార్థం శ్రీమన్నారాయణుడు భూలోకంలో శ్రీరా మునిగా అవతరిస్తాడు. అప్పుడు ఆ పురాణ పురుషునికి అందజెయ్యమన్నాడు. "వల్లె" యని ఇంద్రుడు ధనుర్బాణాలతో అంతర్ధాన మయ్యాడు. బ్రహ్మ ఆజ్ఞానుసారం ఇంద్రుడు నారాయణుడు రామావతారం దాల్చి సీతా లక్ష్మణంతో వనవాసానికి వెళ్ళినప్పుడు అగస్త మహర్షి ఆశ్రమాన్ని దర్శించిన సమయంలో ఒకవృద్ధబ్రాహ్మణ వేషంలోవచ్చి, కోదండాన్ని అమ్ములపొదిని అగస్త్యమహర్షి ద్వారా అంద శాడు. దాన్నిస్వీకరించి శ్రీరాముడు "కోదం రాముడ"య్యాడు.

బ్రహ్మ మళ్ళీ అగ్నిదేవుణ్ణి తల్చుకున్నాడ అగ్నిదేవుడువచ్చి ఎదురుగా బ్రహ్మకుమొక్కి నిలబడ్డాడు. అతనికి బ్రహ్మ "గాండీవాన్ని అ యతూణీరాల అమ్ములపొదిని అంద చేశాద "అగ్నిదేవా! ద్వాపరయుగంలో నర నారాయ ణులు కృష్ణార్జునులుగా అవతరించి లోకకల ణార్థమై దుష్టులను సంహరిస్తారు. అర్జునుని ఈ గాండీవాన్ని, అక్షయతూణీరాల్ని అం జెయ్యి. నీకు శుభం కలుగుతుంది" అ అగ్నిహోత్రుణ్ణి ఆశీర్వదించాడు. "అల్లాగే నని స్వాహాప్రియుడు-అంతార్థాన మయ్యాడ ఖాండవ వన దహన సమయంలో తనక సాయపడినందుకు కృతజ్ఞతగా అగ్ని"గాం వాన్ని" అక్షయతూణీరాల్ని అర్జునునకు కాన కలుగా అందించాడు. వాటిని స్వీకరిం అర్జునుడు "గాండీవి" అయ్యాడు.

ఇంక మురళి మిగిలింది. శ్రీకృష్ణుడ బృందావనంలో తనమిత్రులైన గోపబాలురత యమునానది ఒడ్డున ఆలమందలను మేప తున్నాడు. బ్రహ్మ వినోదార్థం ఆలమం లను, గోపబాలురను తన మాయాబలంత కొండ గుహలో కృష్ణునికి తెలియకుండ దాచాడు. శ్రీకృష్ణుడు ఇదంతా బ్రహ మాయగా గ్రహించి ఏమీతెలియనివాడి తాను సాయంకాలం ఇంటికి వెళ్ళేటప్పుడ ఆలమందలను, గోప బాలురను ప్రతిసృ చేసి తనతో తీసుకుపోయాడు. ఆవిధం బ్రహ్మ పదిహేనురోజులు కొండగుహలో ఆ మందలను, గోపబాలురనుదాచాడు. అయిన శ్రీకృష్ణుడు ఏమీదిగిరాలేదు. బ్రహ్మ కృష్ణు శక్తి తెలుసుకొని అతనిముందు ప్రత్యక్షమం "తన తప్పును క్షమించమని" వేడుకున్నాడ బ్రహ్మకృతజ్ఞతగా తనవద్దనున్న దివ్య ము ళిని శ్రీకృష్ణునికి కానుకగా అందచేశాడ దాన్ని స్వీకరించి కృష్ణుడు "మురళీకృష్ణుడ అయ్యాడు. ☆

# కోర్కెలు తీర్చే స్వామి

**శ్రీమతి నిర్మల**

మండువేసవి మిట్టమధ్యాహ్నం అమ్మగా రింట్లో ఆమె ఉదయంనుంచి ప్రసవ వేదన పడుతోంది. పురిటి నొప్పుల బాధ ఒక వైపు, "ఈ సారైనా మగపిల్లవాడు పుడితే బాగుం టుంది " అనే కోరిక మరోవైపు ఆ తల్లి మనస్సుని, శరీరాన్ని బాధతో మెలిపెట్టివేస్తున్నాయి.

ప్రొద్దుటనుండి అవస్త పడుతూనే ఉంది. తమ కన్నబిడ్డ దుఃఖం చూసి ఏం జరుగు తుందో అని తల్లిదండ్రులు ఆందోళన పడు తున్నారు. ఈ రంపపుకోతను తాళలేక ఆమె ఆ శ్రీనివాసుణ్ణే తలచుకొని ప్రశాంతంగా కళ్ళు మూసుకుని "స్వామీ నాకు కొడుకు నివ్వు వాడికి నీ పేరు పెట్టుకుంటాను" అని మొక్కుకుంది. ఆపదమొక్కులవాడు ఆమెకు సుఖ ప్రసవంతో పాటు పండంటి మగబిడ్డనిచ్చాడు. ఆ తల్లికి మనోధైర్యం కలి గింది.

ఆ తల్లి అత్తమామలు పురిటిసుద్ధి తరు వాత గ్రహస్థితినిబట్టి నామకరణోత్సవం జరి పారు. బాబుకి 29వ రోజున తీవ్రమైన అనారోగ్యం చేసింది. వెంటనే హాస్పిటల్లో చేర్చవలసి వచ్చింది. డాక్టరు అయిదురోజుల వరకూ ఏ విషయమూ చెప్పలేమన్నారు. ఆ తల్లి మనోవేదన అలవికానిది. మనస్సులో మొక్కుకున్న విధంగా 'శ్రీనివాసుని' పేరు పెట్టుకోలేక పోయినందుకు మరింత కుమిలి పోతుంది. "పిల్లవాడు ఇంటికి రాగానే అందరికి చెప్పి తన బిడ్డను శ్రీనివాస్ అని అందరిచేతా పిలిపిస్తానని ఆ వేంకటే శ్వరునికి" మొరపెట్టుకుంది. అంతే బిడ్డ క్షేమంగా ఇంటికి చేరాడు. విషయమంతా ఆ తల్లి అందరితోనూ చెప్పగా అందరూ 'శ్రీని వాస్' అని పిలవసాగారు. వేంకటేశ్వరస్వామి ఆ తల్లిమొర ఆలకించాడు.

ఆ బాబు మద్రాసులో పెరిగి పెద్దవా డయ్యి పి.యు.సి. పూర్తి చేశాడు. బి.య స్సీలో చేరడానికి అతనికి మద్రాసులో సీటు దొరకలేదు. శ్రీనివాస్ మద్రాసులోని అన్ని కాలేజీలకు సీటుకోసం అహోరాత్రులు తిరి గాడు. ఆ పిల్లవాణ్ణి తనదగ్గరే ఉంచుకొని







చదివించుకోవాలని ఆ తల్లి దేవుడికి పెట్టని దండం లేదు. కాని మద్రాసులో సీటు దొరికే మార్గం లేకపోయింది.

ఇంకేదైనా పొరుగూరికి పంపించి చది వించాలి. శ్రీనివాస్ మేనమామలు తమ ఇంటివద్ద పెట్టుకుంటామన్నారు. ఎంత మేనమామలైనా పొరుగు ఊరిలో చదువూ, ప్రతినెలా చదువు ఖర్చులకు పంపడం కూడా కష్టమే. కొడుకు చదువుని మధ్యలో

ఆపివేయలేరు. ఇంతకాలం ఎప్పుడూ తన విడిచిపెట్టకుండా, చేదోడు వాదోడుగా ఉన్న బిడ్డని తనదగ్గరే ఉంచి చదివించుకోవాల ఆ తల్లి దేవునికి మొక్కని రోజు లేదు.

మద్రాసులో సీటు దొరికే మార్గం పూర్తిగా లేకపోవడంతో శ్రీనివాస్ తన మేన మామం ఇంటి దగ్గర్నే ఉండి బి. యస్సీ చదవడానికి ఏర్పాట్లు జరిగాయి. ఆ తల్లి మథనపడుతూనే కొడుకు ప్రయాణం కోసం అన్ని ఏర్పాట్లు సిద్ధం చేసింది. ఆఖరు రోజున రాత్రి 12 గంటలకు నిద్రపోవడానికి ముందు శ్రీనివాసుని విగ్రహం ముందుకు వెళ్ళి "శ్రీనివాసా! బాబునిచ్చావు, చింత తీర్చావు, ఇంతవరకూ చదివించావు. కానీ నావద్దనుండి చదువు పూర్తి చేసుకోవడానికి సీటు ఇప్పించకుండా ఊరు పంపుతున్నావు. ఇదేనా నీదయ, నేను బీదరాలిని, అంత డబ్బు తేవడం ఎంతో కష్టం, వాళ్ల మామల వద్ద ఉన్నా ఖర్చు ఎలా భరించాలి? ఆ పిల్లవాణ్ణి నేను చదివించలేను. నామీద దయ పెట్టు తండ్రీ" అని ఆ తల్లి ఆ ఏడుకొండల వాడితో చెప్పి బాధపడుతూ నిద్ర పోయింది.

తెల్లవారింది, · శ్రీనివాస్ స్నేహితుడు వచ్చి మీ అబ్బాయికి ప్రెసిడెన్సీ కాలేజీలో సీటు దొరికే ఏర్పాటు చేశారన్న తీయటి వార్తతో ఆమెకు కొంత ఊరట కల్గింది. తర్వాత ఆ ఏడుకొండలవాని దయవల్ల చల్లని చూపువల్ల శ్రీనివాస్ బి. యస్సీ డిగ్రీనే కాకుండా ఎమ్.ఎస్సీ పోస్ట్‌గ్రాడ్యుయేట్ డిగ్రీ కూడా సంపాదించుకో గల్గాడు. తరువాత శ్రీనివాస్ ప్రతి నిత్యమూ ఏడుకొండల స్వామికి మొక్కందే ఏపనీ చేసేవాడు కాదు. ఆ కరుణామూర్తి దయవల్ల ఇప్పుడు శ్రీనివాస్ మంచి ఉద్యోగం, భార్య, చక్కని పిల్లలతో సుఖ సంసారంతో జీవితాన్ని గడుపుచున్నాడు. తన జీవితకాలాన్ని పూర్తిగా కొడుకుకోసం ధారపోసిన ఆమె ఆ వేంకటేశ్వరుని మొక్కని రోజులేదు. ఆమె ఎవరోకాదు నేనే.



(12 వ పేజీ తరువాయి)

సన్మార్గ ప్రవర్తనకు శాస్త్రజ్ఞానమే కావలెనన్న అనేక శాస్త్రములు అందుబాటులో నుండుటయు, కొంతవరకే పరిశీలించుదమంటే తెలియవలసిన విషయము (శాస్త్రజ్ఞానము) ఇంకా చాల ఉండుటయు అన్నిశాస్త్రములను క్షుణ్ణంగా పరిశీలించుదమన్న అల్పాయుష్కులగుటయు జరుగుచున్నది. అంతేగాక "శాస్త్ర జ్ఞానం బహుక్లేశం బుద్ధే శ్చలన కారణం ఉపదేశాద్ధరిం బుద్ధ్వా - విరమేత్సర్వకర్మసు" శాస్త్రము ఒకచోట ఒకరీతి మరియొకచోట మరొకరీతిగా ఉండి బుద్ధికి చపలత్వము కలిగించును. అందుచేత భగవంతుడు ఆలోచించి మానవులు తరించుటకు తిరుమంత్రమే మూలమని గ్రహించి తానే ఎవరికైనా ఉపదేశింతమని తలంచెను. అట్లు తలచిన భగవానుడు ఈ జీవునిచూసి నీవు నాకు దాసుడవు. నేను నీకు మంత్రోపదేశము చేస్తాను. అంటే ఈ జీవుడు అహంకార మమకారములచే బంధితుడై నాకునేనే దాసుడిని. అంతేగాక సర్వము తెలుసుకొన్న నాకు నీవే దాసుడివి అనే స్థితి గలిగింది. ఇంక మంత్రోపదేశానికి తగిన శిష్యుడు లేక తానే శిష్యుడు తానే ఆచార్యుడునై బదరీకాశ్రమమున నరనారాయణులుగా అవతరించి సకల వేదసారము అనాదిసిద్ధము అయిన తిరుమంత్రమును శిష్యుడైన మానవునికి (నరుని) ఆచార్యుండైన నారాయణుడు ఉపదేశించెను.

ఆతర్వాత ద్వయము అను మంత్రమును శ్రీవైకుంఠమునందున్న తనభార్య అయిన లక్ష్మీదేవికి ఉపదేశించెను. పిదప ద్వాపర యుగమున శ్రీకృష్ణునిగా అవతరించి అర్జునునికి సర్వదుఃఖ నివారకం బగు చరమ శ్లోకమును ఉపదేశించెను.

తిరుమంత్రము :-

ఓం నమో నారాయణాయ.

ద్వయమంత్రము :-

శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః

చరమశ్లోకము :-

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః.

సాక్షాత్తు శ్రీమన్నారాయణు నుండి వెలువడిన ఈ మంత్రములను పంచ సంస్కారములు పొంది గురువుద్వారా ఉపదేశము పొంది గురుపరంపరాను సంధానములో జపించిన ముక్తి కలుగును. ఈ గురుపంపరలో శ్రీమన్నారాయణుడే ప్రథమ గురువు. అందుచేత--



లక్ష్మీనాథ సమారంభాం
నాదయామునమధ్యమామ్,
అస్మదాచార్య పర్యంతాం
వందే గురుపరంపరామ్.

అని ముందు గురుపరంపరాధ్యానము చేయాలి.

తిరుమంత్రమును అష్టాక్షరీ మంత్రము అనికూడ వ్యవహరించెదరు. దీనిని స్నానానంతరం, ఆహారము తీసుకోవటానికి ముందుగా. ఆశౌచం లేనప్పుడు యథేచ్ఛగా సంఖ్యా నియమము లేకుండా జపించవచ్చును. మిగతా సమయాలలో జపించుట తగదు.

ద్వయమంత్రమును మంత్ర రత్నం అని వ్యవహరించెదరు. దీనిని ఏస్థితిలో ఉన్నా ఎక్కడైనా ఎప్పుడైనా మనస్సునందే జపించవలెను. ఇతరులు వినునట్లు జపించరాదు.

చరమశ్లోకమును తీర్థము తీసుకొను సమయమున అనుసంధించవలెను. భక్తితో సాత్త్విక ఆహార నియమములతో ఈ పై మంత్రములను సదాజపించుచుండిన మోక్ష ప్రాప్తి కలుగును.

శ్రీమన్నారాయణుడు త్రేతాయుగమున శ్రీరామునిగా ద్వాపరయుగమున శ్రీకృష్ణునిగా అవతరించి, ఈ కలియుగమున "వరా వేంకటనాయకః" అనునట్లు వేంకటేశ్వరునిగా అవతరించి ప్రత్యక్షదైవమై వెలుగొందుచుండెను.

## 2. మహాలక్ష్మి

ఒకసారి దూర్వాసుడు లోకసంచారము చేయుచు మార్గ మధ్యమున ఒక విద్యాధరకన్య వద్దనున్న పుష్పమాలికను తీసుకొని ఇంద్రలోకమునకుపోయి ఉద్యానవనములో ఏనుగుపై విహరించుచున్న ఇంద్రునకు ఆ దండను ఇచ్చెను. ఇంద్రుడు దానిని తీసుకొని అలంకారముగా ఏనుగు మెడలో వేసెను. వెంటనే ఏనుగు ఆ దండను తొండముతో తీసి క్రింద పడవేసి త్రొక్కివేసెను. చుట్టూ వున్న ఇంద్రుని పరివారము అదిచూసి నవ్విరి. దూర్వాసునకు తాను దండ ఇవ్వగా ఇంద్రుడు అహంకారముతో ఇట్లు చేసెనని కోపమువచ్చి నీ ఐశ్వర్యమంతా సముద్రములో పడుగాక అని శపించెను. అపుడే సర్వసంపదలు సముద్ర గత మయ్యెను. ఇంద్రుడు విష్ణువుని శరణువేడగా అమృతము కొరకై సముద్రమును మథించుమని అందుండి సర్వసంపదలు యథావిధిగా ఉద్భవించునని చెప్పగా దేవదానవులు కలిసి సముద్రమును మథించిరి. అందుండి లక్ష్మి కూడ ఉద్భవించెను. ఈమెను విష్ణుమూర్తి

అర్ధాంగిగా చేసుకొనెను. అందుకే ఆమె సముద్రరాజతనయగా వర్ణింపబడినది.

సకల సంపదలకు ఆదిదేవత లక్ష్మి. మానవులు తమ ఉన్నతి కొరకై ఈమెను పూజించాలి. శ్రీహరి యొక్క కథాశ్రవణము జరుగుచోట, తులసి ఉన్నచోట, శంఖము నందు, ఉసిరిక ఫలమునందు, గోమయము నందు, తెల్లని వస్త్రములందు, ఎఱ్ఱ కమలము లందు, దేవాలయములందు, ఎప్పుడూ పరిశు భ్రముగానుండు గృహములందు లక్ష్మి నివ సించును. విశేషించి శ్రావణమాసములో అష్ట లక్ష్మిపూజ, వరలక్ష్మీవ్రతము చేసుకోవలెను. "శుక్లే శ్రావణికే మాసి పూర్ణిమో పాంత్య భార్గవే" అను శాస్త్రముప్రకారము శ్రావణ మాసమున పూర్ణిమకు ముందు వచ్చు శుక్రవారమున ఈ వ్రతము చేసుకోవలెను.

ఒకసారి శంకరులవారు భిక్షాటనకై బయలుదేరి ఒకబ్రాహ్మణుని ఇంటిముందు నిల్చుండి "భవతి భిక్షాం దేహి" అని పిలువగా ఆ ఇంటనున్న ఇల్లాలు అతి దారిద్ర్యస్థితిలో నుండి శంకరులవారి భిక్షాపాత్రలో వేయు టకు ఏమి దొరుకునా అని వెతుకుతూ చివరకు ఒక జాడీలోనున్న ఆమలకము (ఉసిరికాయ)ను తీసుకొని వచ్చి భిక్షాపా త్రలో వేసెను. అపుడు శంకరులవారు ఆమె దారిద్ర్యబాధ తెలుసుకొని లక్ష్మిదేవిని గూర్చి "కనక ధారాస్తోత్రము"ను అప్పటిక ప్పుడు పఠించగా లక్ష్మిదేవి కరుణతో బంగారు ఉసిరికాయలను ఆకాశమునుండి వర్షముగా కురిపించెను. దానినంతటిని ఆ బీదరాలికి ఇచ్చి శంకరులవారు వెడలిపోయిరి. అట్టి మహిమాన్వితమైన "కనకధారాస్తోత్రమును" నిత్యముగాని లేక ప్రతి శుక్రవారముగాని పఠించిన సకల సంపదలు కలుగును. ఇంకా ఇంద్రుడు స్తోత్రము చేసిన లక్ష్మి అష్ట కమును, శివుడు పార్వతికి ఉపదేశించిన లక్ష్మి అష్టోత్తరమును నిత్యము పారాయణ చేసుకోవచ్చును. భాద్రపద శుద్ధ అష్టమి మొదలు ఆశ్వయుజ కృష్ణ పక్ష అష్టమి వరకు లక్ష్మివ్రతము పూజ చేసుకోవలెను. ఇంకా ఆశ్వయుజ పూర్ణిమ శరత్ పూర్ణిమ నాడు కార్తీక అమావాస్య దీపావళినాడు లక్ష్మిపూజ తప్పక చేసుకోవలెను. దీనివలన అష్టైశ్వర్య ప్రాప్తి కలుగుతుంది.

లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం
శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవ వనితాం
లోకైక దీపాంకురామ్,
శ్రీమన్మందకటాక్ష లబ్ధ విభవ
బ్రహ్మేన్ద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం
వందే ముకుందప్రియామ్
మాతర్నమామి కమలే కమలాయతాక్షి
శ్రీవిష్ణు హృత్కమల వాసిని విశ్వమాతః,
క్షీరోదజే కమల కోమల గర్భగౌరి
లక్ష్మి ప్రసీద సతతం నమతాం శరణ్యే.
అని లక్ష్మిదేవిని ధ్యానించాలి.

## 3. బ్రహ్మ

ఈ సృష్టికి మూలకర్త బ్రహ్మ. మహాప్రళ యము సంభవించిన తర్వాత సర్వశక్తులు తన శరీరంలో దాచుకొని శ్రీమన్నారాయణుడు దీర్ఘకాలము యోగనిద్రలో గడిపెను. ఆ సమ యంలో మహావిష్ణువు యొక్క నాభి నుండి ఒక కమలము ఉద్భవించెను. దానియందు బ్రహ్మ కూర్చుండెను. అట్లు ఉద్భవించిన కమలముపై నున్న బ్రహ్మ కనులు తెరచి చుట్టూ పరికించిచూసెను. అట్లు చూచుట వలన అతనికి నాలుగు దిశలయందు నాలుగు ముఖములు ఉద్భవించెను. కాని బ్రహ్మకు అంతాశూన్యము గా కనిపించెను. అప్పుడు బ్రహ్మ చింతిస్తూ ఈ కమలముపైనున్న నేను ఎవరిని, ఎక్కడనుండి వచ్చితిని. ఈ కమ లము ఎక్కడనుండి ఉద్భవించినది. అని ఆలోచించి పరమాత్మను గురించి చాలకా లము తపస్సుచేసెను. ఇతని తపస్సుకు మెచ్చి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయి, నీ తప స్సుకు సంతోషించితిని. నా అనుగ్రహము కూడ నీకు కలిగినది. కాబట్టి సృష్టిచేయుమని ఆజ్ఞాపించెను. విష్ణుమూర్తియొక్క ప్రేరణతో సరస్వతి బ్రహ్మయొక్క హృదయంలో ప్రవే శించి నాలుగు ముఖములనుండి నాలు వేదములను గానము చేయించెను.

బ్రహ్మ మానసిక సంకల్పముతో ప్రజ తులను సృష్టించి వారి ద్వారా సృష్టి రచ సాగించుచుండెను.

1. మరీచి. 2. అత్రి. 3. అంగిర 4. పులస్త్య. 5. పులహ. 6. క్రతు. భృగు. 8. వశిష్ఠ. 9. దక్ష. 10. కర్దమ. ఈ పదిమంది ముఖ్యప్రజాపతులు. ఈ పదిమం ప్రజాపతుల యొక్క సంతానమే విస్తారమై ఈ సృష్టికి మూలము. వీరిలో మరీచి కశ్యపుడు, అలాగే దక్షప్రజాపతికి అనేక వి ములయిన సంతానము కలిగి ఆ సంతానమ త్రైలోక్యవ్యాప్తి చెందినది. ప్రజా సృష్టిలో ద ప్రజాపతిదే అగ్రస్థానము. అందుచేత బ్రహ్మ ఇతనిని మిగతా ప్రజాపతులందరికి అధ్యక్ష నిగా చేసెను. దక్షప్రజాపతికి అనేక మంది కుమార్తెలు గలరు. మరీచి కుమారుడైన కశ్యపుని దక్షపుత్రికలు 10 మంది వివాహము చేసుకొనిరి. వారిలో అదితి అను భార్యవలన ఆదిత్యాది దేవతలు, దితి అను భార్యవలన దైత్యులు, దను అనుభార్య వలన దానవుల పుట్టుట జరిగినది. ఈప్రకారంగానే దే తలు, విద్యాధరులు, నాగులు, కిన్నరాదుల జన్మించిరి. బ్రహ్మయొక్క ముఖమునుండి సాక్షాత్తు రుద్రుదు ఉద్భవించెను. బ్రహ్మ యొక్క ముఖమునుండి సాక్షాత్తు రుద్రుడ ఉద్భవించెను. ఈ శంకరుడు దక్ష పుత్రికయైన సతిని వివాహము చేసుకొనెను.

మానవుల సృష్టికి మూలకారణుడైన స్వాయంభువ మనువు బ్రహ్మయొక్క కుడి భాగమునుండి ఉద్భవించెను. ఆ తర్వాత బ్రహ్మయొక్క ఎడమ భాగమునుండి మహా రాణి శతరూపాదేవి ఉద్భవించిరి. అందు చేతనే బ్రహ్మను అందరూ పితామహుడని పిలుచుదురు.

బ్రహ్మయొక్క ఒకదినము సృష్టియొక్క సమయము దీనిని కల్పము అందురు. ఈకల్ప ములో 14 మన్వంతరములు వచ్చును. ఇంతే కాలము బ్రహ్మకు రాత్రి సమయం. బ్రహ్మ

యొక్క ఈ కల్పములో పగటియందు సృష్టి జరుగును. రాత్రి అవాంతర ప్రళయాలు కలిగి భూర్, భువ, సువర్లోకాలను బాధిస్తవి. మహా ప్రళయంలో బ్రహ్మకు నిర్యాణం. పురాణాలు, ధర్మ శాస్త్రాదుల ప్రకారము బ్రహ్మయొక్క నూరు సంవత్సరములలో 50 వ సంవత్సరము జరుగుచున్నది. మనం పూజాకాలంలో రోజూ చెప్పుకొనే సంకల్పములో ఇవన్నీ ఉన్నాయి.

బ్రహ్మ ఆరాధన గురించి శైవ, పాంచ రాత్ర, శాక్త, వైఖానస, మొదలైన ఆగములలో వివరించబడినది. అమూర్తి ఉపాసన ద్వారా బ్రహ్మకి అన్ని ఉత్సవాలలో పూజ జరుగును. ఇంకా సర్వతోభద్ర, వాస్తుమండల, నవగ్రహ మండ; అష్టదిక్పాలక మండల చక్రములలో బ్రహ్మకు విశిష్ట మైన స్థానము. అర్చనాదులు జరుగును. శాపకారణంగా ఆయనకు భూలో కములో ఆలయము కట్టి అర్చామూర్తిగా ఆరాధించు ఆచారము లేదు.

## 4. సరస్వతి

సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా.

అని సరస్వతిని అక్షరాభ్యాస కాలమున పూజించుట కలదు. మరియు ఆశ్వయుజ మాసమున వచ్చు దేవి నవరాత్రి దినము లలో మూలా నక్షత్రముతో ప్రారంభించి 3 దినములు సరస్వతీపూజ (పుస్తక పూజ) జరు పుదురు. "పుస్తకేషు యతో దేవీ క్రీడతే పరమార్థతః, తత స్తత్ర ప్రకుర్వీత ధ్యాన మావాహనాదికమ్." సరస్వతి పుస్తకముల యందు సదా క్రీడించుచుండును. కావున జితేంద్రియుడయిన పురుషార్థములను గోరు వాడు పుస్తకములయందే ధ్యానావాహనాది పూజలను చేయవలెను. అని ఉండుటచేత ఈ పుస్తకపూజ సరస్వతీ వ్రతమను పేరుతో చేయుట జరుగుచున్నది.

సకల విద్యలకు ఆదిదేవత సరస్వతి. ఈమెను 1. భారతి. 2. బ్రాహ్మి. 3. గీర్దేవి. 4. వాగ్దేవి. 5. వాణి. 6. భాషా. 7. శారద. 8. త్రయీమూర్తి అను పేర్లతో వ్యవహరించుట కలదు. ఈమె ధరించిన వీణపేరు కచ్ఛపి.

ప్రాచీన కాలములో ఋషులు - మహర్షులు రాగద్వేషాది అరిషడ్వర్గమును జయించి, శుద్ధమైన అంతఃకరణముతో బ్రహ్మవిద్యారూపముతో అహర్నిశలు సరస్వతీ దేవినే ఉపాసించిరి.

మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసామ్,
మాహేంద్ర నీల ద్యుతి కోమలాంగీం!
మాతంగకన్యాం మనసా స్మరామి.




చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే,
పుండ్రేక్షు పాశాంకుశ పుష్ప-
బాణ హస్తే నమస్తే జగదేకమాతః.

శరణం కరవాణి శర్మదం తే
చరణం వాణి చరాచరోప జీవ్యమ్,
కరుణామసృణైః కటాక్షపాతైః
కురు మామంబ కృతార్థ సార్థ వాహమ్.

అని ఈవిధముగా సరస్వతిని ధ్యానించి పూజించాలి. ఈసరస్వతీపూజ వలన జ్ఞాన ప్రాప్తి కలుగుతుంది. ముఖ్యముగా విద్యార్థులు ప్రతినిత్యం ప్రాతఃకాలమున సరస్వతీ దేవిని ధ్యానించిన విద్యాలాభం, విద్యా జయము కలుగుతుంది.

సరస్వతి బ్రహ్మయొక్క భార్య. ఈమెకు కూడ భూలోకంలో ఆలయము నిర్మించి అర్చామూర్తిగా పూజించు ఆచారములేదు.

## 5. శివుడు

ఈశాన్య దిక్కునకు అధిపతి శివుడు. బ్రహ్మపుత్రుడు, లయకారకుడు, శివ, శంభు

శంకర, ఈశ్వర, అనుపేర్లు గూడ కలవు. నంది వాహనము.

మాండూక్య ఉపనిషత్తులో శివుని గూర్చి ఎక్కువ వర్ణన గలదు. ఇతను అల్ప సంతోషి. ఆకారణంగానే తన్ను ఉపాసించు రాక్షసు లకు సైతం అత్యంత శీఘ్రముగా ప్రసన్ను డయి కోరిన వరములను ఇచ్చి ఆపాయములో పడుచూ విష్ణువుని ప్రార్థించి మరల ఆయన ద్వారా స్వస్థత పొందుచుండెను. భారతంలో అర్జునుడు శివుని ప్రార్థించి ఆయన ద్వారా పాశుపతాస్త్రమును సంపాదించెను.

లోకములకు మేలు చేయగోరి క్షీరసాగర మధన సమయమున ఉద్భవించిన హాలాహ లమును ఆరగించి నీలకంఠుడైనాడు. స్వర్గం నుండి భువికి దిగివచ్చు గంగను భగీరథుని ప్రార్థనపై తనశిరస్సునగల జటాజూటములో బంధించి ఒక్క పాయను మాత్రమే భూమిపై వదిలెను. హిమవంతుని కుమార్తె అయిన పార్వతిని భార్యగాపొంది ఆమెకు తన శరీ రములో అర్థభాగము నిచ్చి గౌరవించెను.

శివుని ఉపాసించి ప్రసన్నుని చేసుకొని అంధకాసుర, దుందుభి మహిషాసుర, త్రిపు రాసుర, రావణ, నివాతకవచులు, గజాసుర, భస్మాసుర, మొదలైన రాక్షసులు అనేక వర ములను పొందిరి. ఆ వరబలముతో మదించి దేవతలను బాధించుటచే అంధకాసుర, గజా సురాది రాక్షసులను కొంతమందిని తానే సంహరించెను. మిగిలిన వారిని విష్ణుమూర్తి అనేక అవతారములనెత్తి సంహరించి లోక ములకు మేలు చేకూర్చెను.

ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత, అను ఈ అయిదు శివునియొక్క విశిష్టమూర్తిత్వముగా చెప్పబడినది.

1. సోమనాథ్. 2. మల్లికార్జున, 3. మహాకాళేశ్వర. 4. పరమేశ్వర (ఓంకారేశ్వర) 5. కేదారేశ్వర. 6. భీమాశంకర. 7. విశ్వేశ్వర. 8. త్ర్యంబక్. 9. వైద్యనాథ. 10. నాగేశ్వర. 11. రామేశ్వర. 12. ధృష్ణేశ్వర, అను ఈ 12 ద్వాదశ జ్యోతి ర్లింగములుగా చెప్పబడినవి. శాపకారణముగా ఈయనకుకూడ లింగపూజే కాని మూర్తి పూజలేదు. ప్రతిసోమవారం శివుని ధ్యానించి పూజించవలెను. శివ పురాణములో శివ రాత్రి మాహాత్మ్యముగూర్చి విపులంగా చెప్ప బడినది. కార్తీకమాసంలో శివాలయములో శివుని అభిషేకించుట, పూజించుట, చేసిన సుఖశాంతులు గల్గి, గ్రహబాధలు తొలగును.

"ఓం నమశ్శివాయ" అను మంత్రమును శివపంచాక్షరీ మంత్రము అందురు. దీనిని ప్రతినిత్యం జపము చేయవచ్చును.

ఓం నమశ్శివాయ విద్యాయ నాథాయ గురవేనమః ! అని అక్షరాభ్యాస కాలంలో శివుని ధ్యానించ వలెను.

నమస్తే దేవ దేవేశ నమస్తే పరమేశ్వర
నమస్తే వృషభారూఢ నమస్తే త్రిలోచన,
మహాదేవం మహాత్మానం మహాపాతక నాశనం
మహానటవరం వందే శివం శంకరం.

అని శివాలయములో శివలింగ దర్శన సమయమున పఠించవలెను.

## 6. పార్వతి

పార్వతి శివుని భార్య. గణపతి, కుమార స్వామి అను ఇద్దరు కుమారులు. ఈమెకు సర్వమంగళ, గౌరి, ఉమ, సతి, ఈశ్వరి అనుపేర్లు గలవు.

ఆంధ్రదేశంలోనూ, ఉత్తర దేశంలోనూ వివాహ సమయంలో గౌరీ పూజచేసే అల వాటు ఒకటి ఉంది. రుక్మిణీదేవి కృష్ణునే వివాహం చేసుకోవాలని సంకల్పించి తన కోరిక నెరవేరడం కోసం గౌరీపూజచేసి కృష్ణుని భర్తగా పొందినట్లు భాగవతంలో ఉంది. అయితే రుక్మిణీదేవి ఏ సరస్వతినో లేక లక్ష్మీదేవినో పూజించక అందుకు ఈపా ర్వతినే ఎందుకు ఎన్నుకొంది? అంటే ఆ[illegible] వాహితలైన కన్యలు పెండ్లి అయిన తర్వా[illegible] పాతివ్రత్యం పాటిస్తూ అన్ని విషయాలలోన భర్తకు అనుగుణంగా నడుచుకోవాలి అంటే దానికి ఎంతో చిత్తశుద్ధి కావాలి. సతీత్వపా తివ్రత్యాల ఆకృతియే అంబిక (పార్వతి) ఆమె దక్షునికి కూతురుగాపుట్టి తనభర్తన తండ్రి దూషించినాడన్న కారణంగా శరీరమే త్యాగంచేసింది. తర్వాత జన్మలో పార[illegible] తిగా పుట్టి ఉగ్రతపస్సుచేసి శివుని భర్త[illegible] పొందింది.

లక్ష్మీదేవి పతివ్రతగా ఉన్నదంటే అందు[illegible] పెద్ద విశేషమేమీలేదు. ఎందుకంటే అందమూ, చందమూ, అలంకారమూ, ఐశ్వ ర్యము ఉన్న ప్రభువు మహావిష్ణువు. అట్టి వాడు భర్త అయితే ఎవతె అయినా పత[illegible] వ్రత అయిపోతుంది. కాని అట్లాకాదే మాధవుని తీరు ఒకటి మహాదేవుని తీర మరొకటి. ఈయన ఉనికి స్మశానంలో పాములు మెడలో, కపాలం చేతిలో ఇట్[illegible] ఈయనది ఘోరమైన స్వరూపం. సంహారక[illegible] కదా. ఇటువంటి ఘోరమైన స్వరూపాన్ని వరించి, పాతివ్రత్యాన్ని పాటించి, భర్తన తండ్రి దూషించినాడన్న కారణంగా అగ్ని ప్రవేశం చేసి, మరల అతనికై తపస్[illegible] చేసి, ఆయననే పెళ్ళిచేసుకొన్న పరమస[illegible] ఈసర్వ మంగళను ఆరాధిస్తే పాతివ్రత్యమ[illegible] లభిస్తుంది. ఆమె అనుగ్రహం స్థిరం[illegible] ఉంటుంది. కనుక--

సర్వమంగళ మాంగళ్యే
శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి
నారాయణి నమోఽ స్తు తే.

అని ప్రతినిత్యం పార్వతిని ధ్యానించాలి

(సశేషం)

# ప్రహ్లాదుని పూర్వజన్మ

కుమారి. పి. విజయలక్ష్మి పండిట్

రాక్షసత్వము, బ్రాహ్మణత్వమనునవి జన్మమును బట్టి నిర్దేశించుటకు వీలు కాదు. బ్రాహ్మణ కుటుంబమున జన్మించినంత మాత్రమున వ్యక్తియందు బ్రాహ్మణత్వముందుననుట నేతి బీరకాయ యందు నేయియుందునని భ్రమించుట వంటిదే. ఇందులకు అజామిళుడే చక్కని ఉదాహరణము. రాక్షస కులమున బుట్టిన ప్రహ్లాదుడు పరమ భక్తాగ్రణ్యుడుగ ప్రసిద్ధినందినాడు. హరి పార్శ్వచరులైనను, వైకుంఠమందిర ద్వారపాలకులైనను జయవిజయులు ఋషి శాపవశమున రాక్షసులుగ నుద్భవింపవలసి వచ్చినది. ఇందులకు వారి వారి కర్మ వాసనలే కారణములు. అశుభ కర్మ వాసన (ఋషులనవమానించుట) వలన జయ విజయులకు రాక్షసజన్మ ప్రాప్తించినది. అసురగర్భ సంభూతుడైనను ప్రహ్లాదునకు శుభకర్మవాసన వలన నారదానుగ్రహమున పరమ భాగవత జన్మము లభించినది.

ప్రహ్లాదు డొనరించిన శుభకర్మము పద్మ పురాణమునందిట్లు వివరింపబడినది. "పూర్వము ద్వారకా నగరమున శివకర్మ యను వేదవిదుడైన విప్రుడుకలడు. అతనికి యజ్ఞశర్మ, వేదశర్మ, ధర్మశర్మ, విష్ణుశర్మ, సోమశర్మ అను ఐదుగురు కుమారులు కలరు. వారు పితృభక్తి పరాయణులు. తండ్రి వారి భక్తిని పరీక్షింపగోరి తన భార్యను మృతురాలినిగా కనబఱిచి, జ్యేష్ఠపుత్రుని పిలిచి ఆమె అవయవములను ఖండింపుమనగా మారుమాటాడక యజ్ఞశర్మ అట్లేచేసెను. పిమ్మట రెండవ కుమారుని పిలిచి "వీధిని చనుచున్న ఆ లలితాంగిపై నామనస్సు చిక్కినది. ఆమె నొడంబఱచి తోడుకొని రమ్మ"ని పంపెను. అతడుపోయి వేడగా ఆఇంతి "ముదుసలి వానిని నేనొల్లను. వలసిన నిన్ను వలతుననెను". అతడు "నా ప్రార్థన మన్నించిన సర్వజగంబులు నీకు కైవసముగావింతుననెను. అంతట నామె సకలదేవతలను దర్శింపగోరినది. ఆమె కోరికను మన్నించి వేదశర్మ దేవతలను ధ్యానింప, వారెల్లరును ఆమెకు దర్శనమిచ్చిరి. ఆమె కింకను తృప్తి కలుగలేదు. "తల్లీ! నీకెట్లు తృప్తి కలుగునో తెలుపుము. నాజనకునికై దేహము నైనను వీడుటకు సంసిద్ధుడను" అని పలికిన విప్ర తనయునితో "నీ శిరస్సును ఖండించి నాకు



కాన్కగా నిమ్మ"ని ఆమె కోరెను. మరుక్షణముననే అతడు ఖడ్గముచే తన శిరమును కోసి యిచ్చెను.

ఆ వనిత ఆ శిరస్సును గొనిపోయి శివశర్మ కిచ్చెను. కుమారుని స్థితికి తండ్రి కొంత చింతించి ఆ శిరమును మూడవకుమారునకిచ్చెను. తండ్రి విచారమును మానుపగోరిన ధర్మశర్మ సమవర్తిని ప్రార్థించెను. ఆతడు ప్రసన్నుడై మీపితృభక్తియే వీనిని బ్రతికింపగలద"ని వచించెను. అటులనే ఆతడు పునర్జీవితుడయ్యెను. పిమ్మట నాల్గవ కుమారుడైన విష్ణుశర్మను తిలకించి, కుమారా! నాజరాభారమును తొలగించుకొనుటకు స్వర్గమునుండి అమృతమును తెచ్చియిమ్ము. నా సకల బాధలు తీరినంతనే ఈ ఇంతిని చేపట్టి సుఖింతు" ననెను. అంతట విష్ణుశర్మ తండ్రికి ప్రణమిల్లి, స్వర్గమునకు బయలుదేరెను. ఇంద్రుడు మేనకను పంపి ఆతనిని ప్రలోభమునకు లోనుచేయ యత్నించెను. మేనకా హాసవిలాసములకు కొంచెమైనను చలించక పోవుచున్న విప్రతనయుని మార్గమున దేవపతి యెన్నియో విఘ్నములను కల్పించెను. పితృభక్తి బలమువలన విష్ణుశర్మ వాటి నన్నింటిని అధిగమించుచుండెను. వజ్రి కోపించి నిశిత బాణములనాతనిపై కురియించెను. బ్రాహ్మణ కుమారుడందులకు ఉగ్రుడై "పితృభక్తి రతుడనైన నాతోనా ఈదేవపతికి చెర్లాటమ"ని కనురెట్టజేసి చూచుచుండ, ఇంద్రుడు దాసోహమని శరణవేడి, అమృత భాండము నర్పించెను. దానిని కొనివచ్చి విష్ణుశర్మ తండ్రికి సమర్పించెను. ఆ తండ్రి పుత్రుల నలువురను జూచి "మీకోరిన వరము లిచ్చెద"ననగా వారు "జననిని పునర్జీవితగా జేయుమని" ప్రార్థించిరి. శివశర్మ "అట్లేయగుగాక అనినంతనె ఆమె పునర్జీవితు రాలయ్యెను. తండ్రి "యింకేదేని వరము కోరు కొమ్మ"ని తనయులతో పలుక, వారు "విష్ణు ధామమును దయసేయుమని" వేడిరి. చూచుచుండగనే గరుడారూఢుడై శ్రీపతి అటకరుదెంచి, శివశర్మ తనయులను నలువురను గరుడునిపై నెక్కించుకొని వైకుంఠమునకు గొనిపోయెను

అంతట శివశర్మ ఐదవ కుమారుడైన సోమశర్మను బిలిచి "నాయనా! మేమిరువురము తీర్థయాత్రల సేవింపబోవుచున్నాము. మేము మరలి వచ్చునందాక, ఈ అమృత ఘటమును జాగరూకుడవై కాపాడుచుండు"మని యాదేశించి, భార్యాసమేతుడై వెడలెను. సోమశర్మ పితృశాసనమును పాలించుచుండెను. పదియేండ్లు గడచిన పిమ్మట శివశర్మ గృహమున కరుదెంచుచు, తనకును తన యిల్లాలికిని కుష్ఠువ్యాధి సోకినట్లు మాయను కల్పించెను. అట్టి దుఃఖస్థితిలోనున్న మాతా పితరులను చూచి సోమశర్మ మిగుల వగచి, స్వహస్తములతో వారికి సమస్తోపచారములు గావించుచు, భక్తితో వారిని సేవించు చుండెను. అటుల భక్తి తత్పరుడై ఇసుమంతయైన ఏహ్యాభావములేక తమను సేవించుచున్న తనయుని శివశర్మ చెడ దిట్టుచు, కాలితో తన్నుచుండెను. తండ్రి తిట్టినను, కొట్టినను లేశమైనను బాధచెందక సోమశర్మ పట్టువిడవక వారిని సేవించుచుండెను. తండ్రి సోమశర్మ ఇంకను పరీక్షింపగోరి అమృతభాండము నందలి యమృతమును హరియించి, "కుమారా! అమృతముగ్రోలవలెనను కోర్కెపొడమినది. భాండము నిటు తెమ్మనె"ను. కంటికి రెప్పవోలె జాగరూకతతో తాను రాత్రింబవళ్ళు కాచుచుండిన ఘటము మూతతీసి, అందు అమృతము లేకుండుటకు చింతించి సోమశర్మ తండ్రి మనస్సునకు కలుగబోవు. కష్టమును సహింప లేక "నే పితృభక్తి పరాయణుడను, పితృసేవా తత్పరుడనైతినేని ఈ క్షణముననే అమృతభాండము పరిపూర్ణ మగును గాక" యని పలికెను. తక్షణమే భాండము అమృతపూర్ణమాయెను. దానిని కొనివచ్చి సమర్పించిన తనయుని భక్తికి ప్రసన్నుడై తండ్రి యథాస్వరూపమును పొందెను. తల్లియు స్వస్థురాలయ్యెను. సోమశర్మ ఆనంద పారవశ్యమున వారి పదములపై వ్రాలెను. కొడుకును దీవించి శివశర్మ, భార్యా సమేతుడై విష్ణు సన్నిధానమున కేగెను.

అటుపిమ్మట సోమశర్మ సాలగ్రామ క్షేత్రమున కరిగి, విజన ప్రదేశమున విషయ విముఖుడై తపమాచరించుచుండ ఆతనికి మరణ మాసన్నమాయెను. అట్టి సమయమున దానవులు కొందరటకేతెంచి భయంకర ధ్వనులు చేయసాగిరి. అదియేమి పాపమో, వాని యంతరంగము భయముతో నిండెను. ఆభీతితోడనే సోమశర్మ యసువుల బాసెను. దానివలన అతనికి అసుర దేహము ప్రాప్తించెను. ఆతడు హిరణ్యకశిపుని కుమారుడై (ప్రహ్లాదుడై) జన్మించి దేవాసుర యుద్ధమున అచ్యుతుని దర్శించి, పూర్వజన్మ జ్ఞానమును పొంది, 'ఈ దైత్యకాయమునుండి విముక్తి కలిగింపమ'ని వేడుకొనెను. చక్రపాణి కరుణామయుడై వాని శిరమును సుదర్శన చక్రముతో ఖండించెను. ఆవిధముగా చక్రవిహతుడైన తనయుని కొరకై 'కమల' (హిరణ్యకశిపుని భార్య 'కమల' యని పద్మ పురాణమున చెప్పబడినది) కన్నీరు మున్నీరుగా విలపించుచు ప్రాణత్యాగము చేయ సంకల్పించెను. అచటికి నారదుడరుదెంచి, "అమ్మా సాహసము వలదు, ప్రహ్లాదుడు మరల నీకుమారుడై జన్మించి, దానవ కృత్యములు వీడి, పరమ భాగవతోత్తముడై ఇంద్ర సింహాసనము నధిష్ఠింపగలడు. దీనినెవరికిని తెలుపవలదని పలికి యంతర్హితు డయ్యెను.

తరువాత కొన్ని మాసములకు ఆమె గర్భముననే మరల ప్రహ్లాదుడుదయించెను. ఇట్లు పరమభక్తుడై జన్మించిన ప్రహ్లాదుడు నృసింహానుగ్రహమున త్రైలోక్యరాజ్య పదవి నందెను. సకలశక్తి సమన్వితుడైనను ప్రహ్లాదుడు విషయాసక్తుడుగాక స్వర్గరాజ్యమును పాలించి కడపటి ముక్తి నందెన"ని పద్మ పురాణము పేర్కొనినది. ప్రహ్లాదుని ఈ పూర్వజన్మ వృత్తాంతము నెఱింగిననేకాని మహాభాగవతమునందు వర్ణింపబడిన ప్రహ్లాదుని భక్తి ప్రపత్తులు, ఆతని పరమభాగవత తత్త్వము మనకర్థము కాదు.

# పరమభాగవత శేఖరుడు ప్రహ్లాదుడు

ప్రహ్లాదునకు పూర్వజన్మమునం దొనర్చిన పితృసేవాఫలమెంత యున్నను దానవ భీకరా రావముల నాకర్ణించుచు దేహము వీడిన కారణమున అసురజన్మ కలిగినది. మరల విష్ణుదేవుని అనుగ్రహమున ఆతనికి భాగవత దేహము ప్రాప్తించినది. ఇది ఆతని శుభకర్మవాసన. విష్ణుద్వేషి యైన హిరణ్యకశిపుని కుమారుడై జన్మించినను సద్గుణములన్నియు సంఘములై వచ్చి ప్రహ్లాదు నాశ్రయించినవి. తల్లి గర్భమునందుండగనే నారదముని బోధలచే పరమ భాగవతధర్మము లాతని అణువణువున జీర్ణించినవి. విష్ణుభక్తి అతని జీవనాడులలో రక్తమై ప్రవహించినది. కనుకనే పంచశరద్వయస్కుడైనను బాల్యోచితములైన ఆటపాట లాతని లో కనిపించవు. నిరంతరము హరి పరతంత్రుడై, అన్యచింతలేక సహజ సంవర్ధాన ధ్యానరుడై, నిత్య పరిపూర్ణుడై నారాయణ పాదపద్మ సుధా మాధుర్యమున నోల లాడుచు విశ్వమును మరచి వుండేవాడట!

పగవారైన దేవతలు సైతము ఇంద్ర సభలో ప్రహ్లాదుని వంటి సద్గుణ రత్నాకరుని యెందును గాంచి యెఱుగ మని పొగడుచుండెడివారట. ఆతని గుణములు వర్ణింప సహస్ర శిరస్కుడైన ఆదిశేషునకు గాని, దేవతల యాచార్యుడైన బృహస్పతికి గాని, చతుర్ముఖ బ్రహ్మకుగాని అశక్యమట. తనయందును, అఖిల భూతముల యందును సమభావమును పూనుట, పెద్దలను చూచినంతనె భృత్యభావములో నమస్కరించుట, పరస్త్రీల యందు మాతృభావము కలిగి యుండుట, సమవయస్కులను సోదర భావముతో ఆదరించుట, గురువులను దైవములవలె ఎంచుట, లీలలందును బొంకులు పలుక కుండుట - ఇట్టిది ప్రహ్లాదుని లలితమర్యాద.

ఆకార జన్మ విద్యార్థముల యందు అగ్రగణ్యుడైనను ఆతడు గర్వపడడు. వివిధ విషయ సంపన్నుడైనను పంచేంద్రియము లచేత పట్టుబడడు. కామ రోషాదు లాతని సమీపించుటకే వెఱచును. విశ్వమందలి సమస్త వస్తు జాలములో ఏ యొక్కటి యైనను ఆతనిని వాంఛాబద్ధుని కావింప జాలవట.

ఇట్టి బుధజన విధేయుడును, మహా భాగధేయుడును, పరమ భాగవతశ్రేష్ఠుడు ఐన ప్రహ్లాదుడు అసురవిభునికి అజ్ఞానివలె, జడునివలె గోచరించినాడు. ఇందు ఎంత ఆవంతయును లేదు. అహంకార, ఆడంబరములు కలవారికి అణకువ విలువ యెట్లు తెలియును? చదివిన సదసద్వివేక చతురత కలుగునని చండామార్కుల రావించి బాలకు నప్పగించినాడు. ప్రహ్లాదుడు ఆదర్శ విద్యార్థి. గురువులు బోధించున వన్నియు మిథ్యా విద్యలని యెఱింగియు వారు పఠింపించిన శాస్త్రములన్నియు చలింపని వైష్ణవభక్తిపూర్ణుడై పఠించినాడు.

కొన్నిదినముల పిమ్మట ఆ గురు శిష్యులను రావించి, కుమారుని యొడిలో కూర్చుండబెట్టుకొని వాత్సల్యముతో 'నీకెయ్యది భద్రమ'ని ప్రశ్నించిన అసురేంద్రునికి ప్రహ్లాదుడిచ్చిన సమాధానమిది.

"ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటి నూతి
లోపలం
ద్రెళ్ళక వీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై
ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమంచు
విష్ణునం
దుల్లము, జేర్చి కారడవి నుండుట మేలు
నిశాచరాగ్రణీ!"

(7-142)

ప్రతిపక్షానుకూలములైన ఈ పలుకులు హిరణ్యకశ్యపుని ఆశ్చర్యచకితుని గావించినవి. రాక్షసోచితములైన కృత్యముల నాచరింపక హరి యని, గిరి యని మోహాంధుడవై చెడవలదని పుత్రునికి బోధించినాడు. కాని ఫలితము శూన్యము.

'ఇనుమయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నావిధమునఁ
గరఁగు చున్నది దైవ యోగమున, జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు'

(7-149)

అని పలికి అసురేంద్రుని మ్రోల తనను తలవంచుకొనినట్లు చేసిన ఆ రాచబిడ్డనిపై రోషించిన గురువాతనిని కొనిపోయి వివిధోపాయములలో వెఱపు గలిగించును. త్రివర్గముల నెఱింగించి, సామదాన భేద దండోపాయములను బోధించినాడు. బాలకుడు నీతి కోవిదుడాయెనని విశ్వసించిన గురువునకు అడియాసయే మిగిలినది. దనుజ వల్లభుని కడకు తిరిగి తోడి తెచ్చినప్పుడును తండ్రి ప్రశ్నకు తనయుని సమాధాన మొక్కటియే. "నవ విధ భక్తిమార్గముల సర్వాత్ముడైన హరిని నమ్మి సజ్జనుడై యుండుట భద్రమ"నుచు "తండ్రి! హరిజేరుమని యెడి తండ్రి తండ్రి" అని తెలిపినాడు. చదువన నేమియో, గురువన నెట్లుండవలయునో, జనకుని బాధ్యత యెట్టిదో ఎఱుగ జెప్పినాడు మానవదేహము సార్థకమెట్లగునో వివరించినాడు.

కంజాక్షునకు గాని కాయంబు కాయమే?
పవన గుంభిత చర్మ భస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే?
ఢమ ఢమ ధ్వని తోడి ఢక్కగాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే?
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే?
తను కుడ్యజాలరంధ్రములుగాక

చక్రిచింతలేని జన్మంబు జన్మమే?
తరళసరిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే -
పాదయుగము తోడి పశువుగాక!

(7-170)

విష్ణుభక్తి లేని వాని [illegible]ము పశు జన్మ మే యని ప్రహ్లాదుని [illegible]యము.

కుమారుని పలుకులు వినిన హిరణ్యకశిపుని కోపము తారస్థాయికి చేరినది. విరోధిశాస్త్రములను బోధించినా[illegible] పురోహి[illegible]పై విరుచుకు పడినాడు. 'ఇది యెవ్వరును బోధిం

# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం







శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి, శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.

శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.

శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి!
-శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం







శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.

శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా వెలకొన్న దేవాలయం



శ్రీ అగస్త్యేశ్వరాలయం-తొండవాడ.
కల్యాణీ తటాన ఉన్న పురాతన దేవాలయం



బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6గం॥కు, 10గం॥కు
సాయంత్రం: 3 గం॥కు




టిక్కెట్టు వెల:
పిల్లలకు : రూ. 10/-
పెద్దలకు : రూ: 20/-
ప్రతిచోటా ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR

చినది కాదు. మీకుమారున కిది యంతయు నైజమనీష' యనినాడా గురువర్యుడు. విషయ ప్రవిష్టులై జనన మరణచక్రమున పరిభ్రమించు జీవులకు హరిభక్తి యలవడుట దుర్లభమని ప్రహ్లాదుడు గురుని వచనములనే బల పరచి నాడు.

దైత్యవల్లభుని వధించి, ప్రేవులు కంఠ మాలికలుగ ధరించి, కరాళ వదనముతో, రుధి రాంకిత కేసరములతో నున్న నృసింహుని భీకరాకృతిని శాంతింపజేయుట ఆ లక్ష్మీదేవికి కూడ సాధ్యము కాలేదు. ఎట్టకేలకు విధాత ప్రహ్లాదునే ఆశ్రయింప వలసి వచ్చినది. ఆ నృసింహాకృతి భక్తి పూరిత చిత్తుడైన ప్రహ్లాదు నికి రుచిరముగ, కల్యాణ కరముగ కనిపించి నదట. నిర్భయముగ ఆస్వామిని సమీపించి పలురీతులుగ ప్రస్తుతించిన ప్రహ్లాదుని యెడ ప్రసన్నుడైన హరి ఆతని శిరస్సుపై అభయ హస్తముంచి ఆశీర్వదించి, 'నీవేది కోరినను అనుగ్రహించెద' ననినాడు ప్రహ్లాదున కే కోరి కయు లేదు. కనుకనే "స్వామీ! కామంబు వృద్ధి పొందని వరమిమ్మ"ని వేడినాడు. ఆభక్తాగ్రగణ్యుని వచనముల కెంతయు సంత సించిన వాసుదేవుడాతనికి అసురేంద్ర పదవిని, నిఖిలభోగములను ప్రసాదించినాడు. "నీవు నాకు నిజభక్తుడవ"ని పొగడినాడు. భగవానుని చేతనే నీవునాకు భక్తుడవనిపించు కొనుట ప్రహ్లాదుని భక్తి కావ్యమున పతాక సన్నివేశము. భగవంతుని యాజ్ఞచేతనే ప్రహ్లా దుడు దైత్యదానవ రాజ్యాభిషిక్తుడైనాడు. ఆతని జననముచే ఆ వంశమున అటునిటు నెన్నియో తరములు తరించినవి.

ప్రహ్లాదుడు స్థితప్రజ్ఞుడు. కనుకనే తండ్రి మరణమును కూడ దైవలీలగ నెంచగలి గినాడు. ఆతడు నిష్కాముడైన ఏకాంత భక్తుడు. తనదేహమన్నిరీతుల హింసింపబ డుచున్నను రక్షింపుమని యైన ఆతడు దైవ మును వేడికొనలేదు. తనభక్తుడైన ప్రహ్లాదుని దేహము నా మహావిష్ణువే కాపాడవలసివచ్చి నది. ఈతని భక్తి మార్జాల కిశోర న్యాయము ననుసరించినది. ప్రయత్నమేమియు లేకుం డగనే జన్మాంతర పుణ్యకర్మలచేత కేవలం దైవానుగ్రహమున లభించు పవిత్ర భక్తిత త్వము ప్రహ్లాదునిది. దీనినే పుష్టికరయని పెద్దలందురు. అదియే పరాభక్తి.

ప్రహ్లాదుని చరిత్రమునుండి మనమందు కొనవలసిన యాదర్శము లెన్నియో యున్నవి. లౌకికదృష్టితో ఆలోచించినను ప్రహ్లాదుని జీవి తము నేటి యువ తరమునకు మహో న్నతమైన ఆదర్శము. నేటివిద్యార్థులు తొలుత ననుసరించవలసినది ప్రహ్లాదుని లలిత మర్యాద. భగవన్నామస్మరణతో నెట్టి కష్టముల నైనను మానవుడెదుర్కొన వచ్చుననుటకు ప్రహ్లాదుడే తార్కాణము. నిజమైన భక్తుని దైవమెప్పుడును కంటికి రెప్పవోలె కాపాడు ననుటకు ప్రహ్లాద చరిత్ర చక్కని నిదర్శనము. జన్మమును బట్టి కాక కర్మమును బట్టియూ పూర్వజన్మ సంస్కారమును బట్టియు మానవ జీవితము ధన్యత నొందునని ప్రహ్లాదచరిత్రము ప్రవచించుచున్నది.

❄ ❄ ❄

తిరుమల తిరుపతి దేవస్థానముల

# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం

"వృక్షో రక్షతి రక్షితః".

వృక్షాలను రక్షించేవారిని భగవంతుడు రక్షిస్తాడు.

వృక్షాలను పెంచి పోషించేవారిని భగవంతుడు ప్రేమిస్తాడు.

పవిత్రమైన తిరుమలలోని అడవులు మానవాళికి శ్రీ వేంకటేశ్వరుడు ప్రసాదించిన వరం. ఆ అడవుల్ని రక్షించడానికి, వాతావరణ సమతౌల్యాన్ని సాధించడానికి శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం పేరుతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు అద్భుతమైన పథకాలను ప్రవేశపెట్టారు. తి.తి. దేవస్థానముల అటవీశాఖ వారి సహాయంతో అధిక సంఖ్యలో వృక్షసంతతి అభివృద్ధి చేసేందుకు ప్రజలందరూ ఈ పథకంలో భాగస్వాములు కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు.

## వృక్ష సంవర్ధనం

ఈ పథకం క్రింద దాదాపు ఒక ఎకరా భూమిలో వృక్ష సంపద అభివృద్ధి చేయబడుతుంది.

**సౌకర్యాలు :**

* వృక్షసంపదకు దాతపేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.15,000/-.**

## వృక్ష ప్రసాదం

ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కలను పెంచడానికి నిర్దేశించిన పథకం.

**సౌకర్యాలు :**

* దాతపేరుతో ప్రతి సంవత్సరం 100 ఫల పుష్ప మొక్కల వితరణ.
* మామూలు రోజుల్లో సంవత్సరానికి 2 రోజులు చొప్పున 10 సంవత్సరాలపాటు తిరుమలలో ఉచిత వసతి.
* 10 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.10,000/-.**

## స్మారక వనాలు

ఈ పథకంక్రింద 10 మొక్కలు నాటి వాటిని 5 సంవత్సరాలపాటు పెంచి పోషిస్తారు.

**సౌకర్యాలు :**

* ఈ వనానికి దాత పేరు పెడతారు.
* 5 సంవత్సరాలపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

**విరాళం : రు.2,000/-.**

## వన సంరక్షణ భాగస్వామ్యం

ఈ పథకంక్రింద తిరుమల కొండపై వున్న సహజారణ్యాలను రక్షించి, అభివృద్ధి చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు ప్రదర్శిస్తారు.
* ఒక సంవత్సరంపాటు, సంవత్సరానికి ఒకసారి 5 గురికి ప్రత్యేక ప్రవేశంద్వారా శ్రీవారి దర్శనం.

విరాళం : రు.1,000/-.

## అధ్యయన వనాలు

ఈ పథకంక్రింద తిరుమల ఉద్యానవనంలో రకరకాల మొక్కల పెంపకం, అభివృద్ధి చేపడతారు.

సౌకర్యాలు :

* మొక్కదగ్గర దాత పేరు ప్రదర్శిస్తారు.

విరాళం : రు.500/-.

## వృక్ష దత్తత

ఈ పథకంక్రింద తిరుమలలోను, ఘాట్ రోడ్డులోను వృక్షాలను దత్తత తీసుకోవడం, నాటడం చేస్తారు.

సౌకర్యాలు :

* దాత పేరు చెట్టుదగ్గర ప్రదర్శిస్తారు.

విరాళం : రు.250/-.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిలయమైన తిరుమలకొండలపై వున్న అమూల్యమైన వనసంపద పరిరక్షణకు భక్తులు, దాతలు విరివిగా విరాళాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

మీ విరాళాలు డిమాండుడ్రాఫ్టుద్వారా ఈ క్రింది వారికి పంపండి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# వార్తాలహరి

## నూతన సంయుక్త కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానాల నూతన సంయుక్త కార్యనిర్వహణాధికారిగా శ్రీ సి.హెచ్. సత్యనారాయణ మే 26 గురువారంనాడు పదవీ బాధ్యతలు స్వీకరించారు. బాధ్యతలు స్వీకరించిన అనంతరం ఆయన తి.తి.దే. పరిపాలనా భవనంలోని అన్ని విభాగాల్ని సందర్శించి సిబ్బందిని పలుకరించారు. యాత్రికుల సౌకర్యాలు మెరుగుపరచటానికి కృషి చేయగలనని ఆయన తెలిపారు.

## తిరుమలలో గవర్నర్

ఆంధ్ర రాష్ట్ర గవర్నరు శ్రీ కృష్ణకాంత్ మే 19 గురువారం సాయంత్రం తిరుమలలో శ్రీవారిని దర్శించారు. వారికి ఆలయంవద్ద తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, డిప్యూటి ఇ.ఓ. శ్రీ వాసుదేవన్ తదితర అధికారులు స్వాగతం పలికారు.

## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు– ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయటం వలన ఉపయోగం వుండదు.
- రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

**సంపాదకులు**
**సప్తగిరి**
**తి.తి. దేవస్థానములు**
**తిరుపతి - 517 507**

## పద్మావతీ పరిణయం

తిరుమలలో మే 19 గురువారంనాడు శ్రీ పద్మావతీ అమ్మవారి పరిణయ ఉత్సవం అత్యంత వైభవంగా జరిగింది. తిరుమలలోని నారాయణగిరి ఉద్యానవనంలో అందంగా కన్నుల పండువుగా అలంకరించిన వేదికపై ఈ పరిణయోత్సవం జరిగింది.

రాష్ట్ర గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ ఈ ఉత్సవాలలో పాల్గొన్నారు.

ఈ ఉత్సవాలు మూడు రోజుల పాటు అత్యంత వైభవంగా జరిగాయి.

## విరాళం

తూర్పు గోదావరి జిల్లాకు చెంది ప్రస్తుతం అమెరికాలో స్థిరపడివున్న శ్రీ సతీష్ కస్తూరి మే 11 బుధవారంనాడు తి.తి. దేవస్థానానికి 8 వేల డాలర్లను విరాళంగా ఇచ్చారు. తమ తల్లిదండ్రుల జ్ఞాపకార్థం దేవస్థానం నిర్వహిస్తున్న వివిధ పథకాలకు ఆయన ఈ విరాళం ఇచ్చారు. ఈ మొత్తాన్ని చెక్కు రూపంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తికి అందజేశారు.



Edited and published on behalf of T.T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press by M Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507




ఆగష్టు, 1994

# సప్తగిరి

వెల : రు. 2/-

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక



దేవతలు గెలువరో తెగి దైత్యులు పొరరో
భావించ నింతటిలో భూభారమెల్ల నణఁగె

నేఁడు కృష్ణుఁడు జనించె నేఁడే శ్రీజయంతి
నేఁడే రేపల్లెలోన నెలవైనాఁడు
పేఁడుక యశోదకు బిడ్డఁడైనాఁ డిదె నేఁడే
పోఁడిమి జాతకర్మ మొప్పగ నాయ నేఁడు

ఇప్పు డిదె గోవుల నిచ్చెను పుత్రోత్సవము
ఇప్పుడు తొట్టెల నిడి రింతులెల్లాను
చెప్పరాని బాలలీల సేయఁగలదెల్లాఁ జేసి
కప్పెను విష్ణుమాయలు గక్కన నేఁ డిపుడు.



ఇదివో వసుదేవుని ఇంటిచెరలెల్లఁ బాసె
ఇదివో దేవకితప మిట్టె ఫలించె
చెదరక తానిలిచె శ్రీవేంకటాద్రిపై నిదె
యెద నలమేలుమంగ యెక్కివున్న దిదివో.

--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 478,
రాగం : సాళంగనాట, సంపుటం : 2 (1981)

(ఆగష్టు 29 శ్రీ కృష్ణజయంతి సందర్భంగా)

# తిరుమల తిరుపతి దేవస్థానములు
## తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

**విద్యే సౌందర్యం** **విద్యే దైవం**

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని *"ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటీ, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్."* వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి




# ఈ సంచికలో.... ఆగష్టు, 1994

సంపుటి 25 సంచిక 3



గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త-ఇన్‌చార్జి సంపాదకులు
ఎస్.ఎస్. రామమూర్తి, ఎమ్.ఎ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎం. విజయకుమార్‌రెడ్డి,
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



ముఖచిత్రం : శ్రీరాధాకృష్ణులు — చిత్రం--కె. జగదీష్
2 వ కవరు పేజీ : తిరుమల శ్రీవారి పవిత్రోత్సవం
3 వ కవరు పేజీ : శ్రీ విల్లిపుత్తూరు (తమిళనాడు) వటపత్రశాయి దేవాలయం
4 వ కవరు పేజీ : శ్రీకృష్ణ భగవానుడు
సెంటర్ స్ప్రెడ్ : శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం, శ్రీనివాసమంగాపురం.

# సంపాదకీయం

నీటికి రూపం ఏదయ్యా అంటే - అది వున్న ఘటం. ఎందులో నీరు వుంటే అదే దాని స్వరూపం. స్వభావం మాత్రం సర్వ జీవకోటికి జీవనాధారం.

భగవంతుడూ అంతే. ఆయన ఆకారం ఏదయ్యా అంటే - అది భక్తుని మనస్సు. ఎవరు ఏ రూపంలో ధ్యానిస్తే వారికి ఆ రూపంలో కనిపిస్తాడు, కరుణిస్తాడు. స్వభావం - సమస్త సృష్టికి, స్థితిలయాలకు సర్వకాల సర్వావస్థలయందు ఆధారం, ఆధేయం.

విశ్వాధిపతి అయినా సేవకుడాయన. తన భక్తుడే తనకు అధినేత అన్నది ఆయన ప్రవచనం. ఆర్తిగా భక్తుడు ఆర్తనాదం చేసిన వేళ, అన్నీ మరచి వాలిపోతాడు ఆ భక్తుని ముంగిట.

రాముడని కొలిచినా, కృష్ణుడని తలచినా, పాండురంగా అంటూ పరవశంతో పిలిచినా - పలికేది భక్తుని పారవశ్యం చూసి పరవసించేది - ఒక్కరే.

మనం మన హృదయ సంస్కారాన్నిబట్టి విశ్వాధారమైన ఆ అనంతానంద జ్యోతికి ఓ పేరు పెట్టుకుంటాం, ఓ ఆకారం కళ్ళముందు కట్టుకుంటాం. కథలు చెప్పుకుంటాం.

నదులన్నీ సాగరం చేరుకుంటాయి. మరుక్షణం అవీ సాగరాంతర్భాగం అవుతాయి. అలాగే మనం ఏ ఆకారాన్ని ఏవిధంగా పూజించినా ఆ పూజ చేరేది ఆ సర్వాంతర్యామికే.

అష్టమినాడుపుట్టి, అందరికీ ఇష్టుడై, నమ్మినవారి కష్టాలు, అరిష్టాలు తొలగించిన ఆ చల్లని నల్లని కన్నయ్య మనకు తెలుపుతున్న సత్యం ఇదే.

భక్తుల హృదయాలలో తాను ఖైదీనని చెప్పటానికేమో ఖైదులో జన్మించాడు. కులాల పేరుతో సంకుల సమరాలు ఎందకయ్యా అని గోకులంలో పెరిగాడు. సృష్టికి కాపరి, పసుల కాపరి అయ్యాడు. మన్నూ వెన్నా సమంగా తిన్నాడు. ఆడుకుంటూనే అసురుల్ని సంహరించాడు. గోవర్ధన గిరిని చిటికెన వేలితో ఎత్తగలిగిన వాని బరువు తులసీదళమంత. ఎంత వింత!

సర్వపరిపాలకుడై కూడ పార్థుడికి సారథి అయ్యాడు. అతిరథ మహారథుల్ని, ఎదురుగావున్న అక్షోహిణుల సైన్యాన్ని అరక్షణంలో అంతమొందించ గలిగి కూడ ఆయుధం పట్టక, అర్జునుడిని నడిపించాడు. అంతా తెలిసీ ఏమీ తెలియనట్లే వున్నాడు.

ఎదిగే కొద్దీ ఒదిగి ఒదిగి వుండాలని, జ్ఞానసంపద పెరిగేకొద్దీ వినయ సంపన్నం కావాలని చెప్పక చెబుతుంది కృష్ణావతారం.

ఇష్టంగా కృష్ణాష్టమి జరుపుకోవడం అంటే ఆరోజు ఆయన పేరుతో కడుపునిండా పిండివంటలు తినడం కాదు. ఆయన ప్రవచించిన గీతా సార సాగరంలోని ఓ బిందువునైనా అర్థం చేసుకుని ఆచరించ గలిగితే, నీ, నా భేదలు లేవని అందరూ ఒక్కటే అని తెలుసుకో గలిగితే అదే నిజమైన కృష్ణాష్టమి.

అపారమైన ఆ అనంత జ్ఞానగంగ అంతాకాకపోయినా కొంతైనా తెలుసుకోవటానికి అవకాశం ఇమ్మని ఆ సప్తగిరీశుని ప్రార్థిద్దాం.

"కృష్ణం వందే జగద్గురుమ్"

# ఆదర్శ పురోహితుడు

డా॥ చలసాని సుబ్బారావు

దశరథ మహారాజునకు పరిపాలనా వ్యవహార బాధ్యతలను నిర్వహించేందుకు జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, దృష్టి, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంతుడు అను ఎనిమిదిమంది మేధావంతులైన అమాత్యులతో కూడిన మంత్రి పరిషత్తుండేది. అది కాక అతి ముఖ్య విషయాలపై సంప్రదింపులు జరిపేందుకు ఆ యా శాస్త్రీయ విషయాలలో నిష్ణాతులైన ఎనిమిదిమంది పండితులతో కూడిన పరామర్శక మండలి వంటి 'గురుజన పరిషత్తు' ఒకటి ఉండేదట. ఆ పరిషత్తులో వశిష్ఠుడు, వామదేవుడు, గౌతముడు, కశ్యపుడు, జాబాలి, సుయజ్ఞుడు, మార్కండేయుడు, కాత్యాయనుడు సభ్యులుగా నుండెడివారట. వారందరు బ్రహ్మర్షులు, ఋత్విజులు; వేద విద్యా పారంగతులు, వంశపరంపరగా గురుస్థానాల నలంకరిస్తూ వస్తున్న పెద్దలు. వారందరిలో వశిష్ఠ మహర్షికి విశేష ప్రాముఖ్యముండేది. ఆయన మహారాజుకు ఆంతరంగికుడుగా అనేక విషయాలలో ముఖ్య పరామర్శదాతగా మంత్రి పరిషత్తుకు, గురుజన పరిషత్తుకు నాయకత్వం వహిస్తూండేవాడు. పురోహిత కార్యాలలో గురుజనులాయన ఆదేశాలను పాటిస్తూ ఆయనకు సహకరిస్తుండేవాడు.

వశిష్ఠ మహర్షి రాజపురోహితుడు, రాజ వైద్యుడు, రాజ జ్యోతిషి, రాజ విద్వాంసుడు, రాజగురువు, రాజ కుటుంబానికి సర్వస్వంగా పరిపాలనా విషయాలనే కాక ప్రత్యేకించి ఇంట బయటా మొత్తం రాజ కుటుంబ శ్రేయస్సును పర్యవేక్షిస్తూ, రాజవంశ ప్రతిష్ఠను పరిరక్షించు బాధ్యతను నిర్వహిస్తూండేవాడు. వశిష్ఠునితో పని పడని రాజ్య వ్యవహారం రాజు స్వయంగా పరిశీలించుకొనదగిన దంటూ వుండేది కాదట. వశిష్ఠుని సలహా సంప్రదింపులు లేకుండా రాజు ఏ నిర్ణయం చేసేవాడు కాదు. అది రాజ కుటుంబ సభ్యుల విషయమైనా, ప్రజల విషయమైనా, ఇరుగు-పొరుగు దేశాల విషయమైనా, మరే విషయమైనా సరే, దానికి వశిష్ఠుని అంగీకారం అభిలషణీయంగా రాణించేదంటే అతిశయోక్తి కాదు. ఇది రామాయణం తెలిసిన ప్రతి ఒక్కరు గమనిస్తున్న సత్యమే.

యుద్ధాలు, సంధులు వంటి ప్రధాన పరిపాలనా వ్యవహారాలలోనే కాక రాజ కుటుంబంలో జరగవలసిన వివాహాల విషయంలోను, సింహాసనానికి వారసుణ్ణి నిర్ణయించవలసివ సందర్భాలలో కూడ వశిష్ఠుడు అతి కీలకమైన పాత్రను నిర్వహిస్తుండేవాడు. దశరథుడు మరణించినప్పుడు రాజ్యంలో అరాచకానికి తావు లేకుండా వెనువెంటనే మంత్రులు, పురోహితులు సమావేశమై రాజ్యానికి తగిన వారసుణ్ణి ఎంపిక చేయు భారాన్ని వశిష్ఠునకే వదలిపెట్టిన ఘట్టం ఈ సందర్భంలో గమనించదగింది.

ఇక్ష్వాకూణా మిహాద్యైవ
కశ్చి ద్రాజా విధీయతామ్,



## వచ్చే సంచికలో ..................

### తిరుమల శ్రీస్వామివారి శుక్రవారాభిషేకం

ప్రతి శుక్రవారం తెల్లవారుజామున తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి "అభిషేకోత్సవం" వైభవంగా జరుగుతుంది. సుమారు 45 నిమిషాలపాటు శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తి యొక్క దివ్యమంగళ సౌందర్యాన్ని దర్శింపజేసే ఈ శుక్రవారాభిషేకోత్సవాన్ని గూర్చి వివరంగా, విపులంగా చదివి ఆనందించండి! ప్రత్యక్షంగా దర్శించిన అనుభూతిని పొందండి! శ్రీస్వామివారి అనుగ్రహాన్ని పొందండి!!

**సంపాదకుడు**

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★



అరాచకం హి నో రాష్ట్రం
వినాశం సమవాప్నుయాత్.

--వాల్మీకి రామాయణం 2-67-8.

రాజులకు, రాణులకు, యువరాజులకు, రాజబంధువులకు సైతం వశిష్ఠుడు విశేష గౌరవపాత్రుడుగా వుండే వాడట. ఆ బ్రహ్మర్షి సలహాలను వారు ఆదేశాలుగానే పాటించే వారంటే అతిశయోక్తికాదు. అది ఇక్ష్వాకు వంశీయ క్షత్రియ రాజ సంప్రదాయం. దశరథుని సభా భవనంలో పురోహితుడుగా వశిష్ఠుడు ప్రవేశించినప్పుడు సభాసదులందరు ఉన్నతాధికారులతోసహా లేచి నిలబడి గౌరవ భావాన్ని ప్రదర్శించేవారట.

తమాగత మభిప్రేక్ష్య
హిత్వా రాజాసనం మహత్,
సభాసదః ఆపనేభ్యః సముత్తస్థుః
పూజయంతః పురోహితమ్.

--వాల్మీకి రామాయణం -- 2-5-24

రాజ్యసభలో చర్చకు వచ్చిన ప్రతి విషయం అంతిమ నిర్ణయం కొరకు సత్యసంధుడు, గుణశీలి, ధర్మాధ్యక్షుడు అయిన వశిష్ఠుని అంగీకారం కొరకు వేచివుండడం అప్పటి పరిపాటిగా వుండేది. ఆయన కాదంటే అమాత్యులు అందుకు ప్రత్యామ్నాయం వెతకవలసి వచ్చేదట.

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం
పురోధాః పరమాగతిః,
న చాతిక్రమితుం శక్యం
వచనం సత్యవాదినః.

--వాల్మీకి రామాయణం -- 1-58-3

అలా బాధ్యతల రీత్యా వశిష్ఠుని స్థానం ఇక్ష్వాకు రాజ్యంలో ప్రత్యేకించి రామరాజ్యంలో అత్యున్నతమైనదిగా వుండేది. అది ఆనాటి రాజ తంత్ర పరిపాలనా వ్యవస్థలో కానవస్తున్న ప్రత్యేకత అనిపిస్తుంది. అలా దేశ శ్రేయస్సు కొరకు రాజు తనకు లానే ప్రజాశ్రేయస్సును లక్ష్యించి స్వయంగా మరొక గుణశీలుడు, ప్రజ్ఞావంతుడు అయిన విద్యావంతుని ఆలో

(41వ పేజీలో)

# దత్తాత్రేయ స్వామికి వెండి తేరు

13-6-94 సోమవారం నాడు మైసూరు శ్రీదత్త పీఠంలోని శ్రీకాలాగ్ని శమన దత్తాత్రేయ స్వామివారిని సుమారు 12 అడుగుల ఎత్తు కలిగిన వెండిరథంలో ఊరేగించారు. దత్తాత్రేయ స్వామికి ప్రప్రథమంగా జరిగిన ఈ వెండి రథోత్సవాన్ని తమిళనాడు గవర్నరు డా॥ మర్రి చెన్నారెడ్డి సకుటుంబంగా ప్రారంభించారు.

అవధూత దత్త పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ 52 వ జన్మ దినోత్సవాల సందర్భంగా శ్రీ కాలాగ్ని శమన దత్తాత్రేయ స్వామికి జూన్ 13 వ తేదీన వెండి రథోత్సవం, జూన్ 17 వ తేదీన ఆశ్రమంలోని సప్తర్షిసరోవరంలో తెప్పోత్సవాలు వైభవంగా జరిగాయి. ఈ సందర్భంగా శ్రీ స్వామీజీ సందేశమిస్తూ ఆ యా ప్రసిద్ధ క్షేత్రాల్లో, దేవాలయాల్లో ఆయా దేవతలకు జరిగే మంటపోత్సవం, పల్లకి ఉత్సవం, రథోత్సవం, తెప్పోత్సవం, డోలోత్సవం వంటి ఉత్సవాలు కేవలం బొమ్మలాటలుగా తలవకూడదనీ, ప్రతి ఉత్సవంలోను పంచభూతాత్మకమైన ఆధ్యాత్మికతత్త్వం ఇమిడివుందనీ, ఆ యా ఉత్సవాలను తిలకించిన భక్తుల యొక్క పాపాలు, సంకటాలు తొలగి, కోరికలు నెరవేరుతాయని చెప్పారు.

94 జూన్ 12 నుండి 19 వరకు ఎనిమిదిరోజులపాటు జరిగిన శ్రీస్వామీజీ వారి 52 వ జన్మదినోత్సవాలు "కృష్ణయజుర్వేద హవన యజ్ఞం"తో ప్రారంభమయ్యాయి.

ఆంధ్రప్రదేశ్ రోడ్లు, భవనాల శాఖా మంత్రి శ్రీ టి. పురుషోత్తమ రావు జ్యోతిని వెలిగించి ఈ వేద యజ్ఞాన్ని ప్రారంభించారు. లోక






శాంతికై 8 రోజులపాటు సంపూర్ణంగా నిర్వహింపబడిన ఈ వేదయజ్ఞంలో ఆంధ్ర, కర్నాట, తమిళనాడు రాష్ట్రాలకు చెందిన వేదపండితులు పాల్గొన్నారు.

ఈ సందర్భంగా 94 జూన్ 12 ఒక భక్తునిచే దంత మంటపం సమర్పింపబడింది. సుమారు 18 అడుగుల ఎత్తువున్న ఈ దంత మండపాన్ని అధిరోహిస్తూ శ్రీ స్వామీజీ సుమారు 50 మంది మహమ్మదీయులు 14 ఏండ్లుగా నిరంతరం శ్రమించి అత్యంత భక్తి ప్రపత్తులతో అపూర్వంగా తయారు చేసారని, ఈ మండపంలో ప్రతి అణువణువునా దత్తాత్రేయ అష్టోత్తర శత నామావళి దంతంతో మలచబడిందని తెలియజేస్తూ, మండపంలో భగవంతుణ్ణి ప్రతిష్ఠించినట్లే ప్రతి మానవుడు తన హృదయమనే స్వచ్ఛమైన మందిరంలో దైవాన్ని ప్రతిష్ఠించుకోవాలని సందేశమిచ్చారు. భగవంతుని దృష్టిలో అందరూ సమానమేనని, భగవంతుని సేవలో కుల మత జాతి విచక్షణ లేదనీ, ఇప్పుడే మీరంతా ప్రత్యక్షంగా చూస్తున్నారనీ చెప్పుతూ, దంతమండపం తయారీలో శ్రమించిన ముస్లిం భక్తులను శ్రీస్వామీజీ ఆశీర్వదించారు. ఆ తర్వాత కృష్ణయజుర్వేద పరీక్షల్లో గెలుపొందిన 5 మంది వేద విద్యార్థులకు ప్రశస్తి పత్రాలు శ్రీస్వామీజీ ఇచ్చారు.





శ్రీస్వామీజీ సమక్షంలో వేదపరీక్షలు నిర్వహిస్తున్న దృశ్యం

శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గాత్ర కచ్చేరి దృశ్యం ప్రక్కన మృదంగం మీద విద్వాన్ కారైకుడి మణి, వయొలిన్ మీద పద్మశ్రీ ఎం.ఎస్. గోపాలకృష్ణన్





జూన్ 18 సాయంత్రం శ్రీ స్వామీజీ సమక్షంలో పద్మవిభూషణ డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గాత్ర కచ్చేరి వీనుల విందుగా సాగింది. వీరికి పద్మశ్రీ ఎం.ఎస్. గోపాల కృష్ణన్ వయోలిన్‌మీద, విద్వాన్ కారై కుడి మణి మృదంగం మీదా సహక రించారు.

ఈ ఉత్సవాల సందర్భంగా, ఆంధ్ర ప్రదేశ్ ప్రొద్దుటూరుకు చెందిన శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మను "వేద నిధి" బిరుదుతోను, అలాగే డా॥ మంగ ళంపల్లి బాలమురళీకృష్ణను "నాదనిధి" బిరుదుతోను శ్రీ గణపతిసచ్చిదానంద స్వామీజీ సత్కరించి ఆశీర్వదించారు.

ఎనిమిది రోజులపాటు జరిగిన ఉత్సవాల్లో తెలుగు, తమిళం, ఆంగ్లం, కన్నడం, ఆధ్యాత్మిక గ్రంథాలు, ఆడియో వీడియో కాసెట్లు ఆవిష్కరింపబడ్డాయి. ఈ ఉత్సవాల్లో డా॥ ఎన్. రమణి, మాండోలిన్ శ్రీనివాస్ మున్నగువారి సంగీత కార్యక్రమాలు కూడ జరిగాయి.

చివరిరోజున 19 వ తేదీ శ్రీ గణపతిసచ్చిదానందస్వామీజీ సమర్పించిన "నాదచికిత్సా విభావరి" కార్యక్రమం 3 గంటలపాటు వేలాదిమందిని మైమరపించింది. చివరగా శ్రీ స్వామీజీ వేదయజ్ఞంలో సమర్పించిన మహాపూర్ణాహుతితో కార్యక్రమాలు సమాప్తమయ్యాయి.



బెదిరిస్తే గోవు క్షీరమివ్వదు.
దూషిస్తే పుణ్యం రాలిపడదు

# ఉపవాస ప్రయోజనము

శ్రీ కాశీభట్ల సుబ్బారామశర్మ

ఉపవాసం మతాచారాల్లో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. ప్రతి పక్షంలోను ఏకాదశివ్రత మేర్పఱచినారు. పర్వ దినాల్లో పుణ్యవీధుల్లో ప్రత్యేకమైన ఉద్దేశం దృష్టిలో పెట్టుకునే ఉపవాసం చేస్తున్నారు. దేవతానుగ్రహానికి ఉపవాసం ప్రధాన సాధనమన్నారు. గాయత్రీ ఉపాసకులు ఆదివారంనాడు, శివభక్తులు సోమవారంనాడు, హనుమద్భక్తులు మంగళవారంనాడు, లక్ష్మీకటాక్షాన్ని పొందగోరేవారు, శుక్రవారంనాడు, వెంకటేశ్వర భక్తులు శనివారంనాడు, సాయిబాబా రాఘవేంద్రస్వామి అనుగ్రహాన్ని అభిలషించేవారు గురువారంనాడు ఉపవాసం చేస్తున్నారు. కొంతమంది మహానుభావులు నిర్జలోపవాసంచేస్తే, ఇంక కొంతమంది చాంద్రాయణవ్రతం చేస్తున్నారు. మన మహర్షులు మతాచార్యులు తాముచాలా రోజులు ఉపవాసములుండి దానివల్లగలిగే ప్రయోజనాలను లాభాలను శిష్యులకు బోధించి వారితో ఉపవాసం చేయించేవారు.

ప్రస్తుతం మన దృష్టిలో ఉపవాసం చేసేవారు మతమౌఢ్యం గలవారుగా పరిహసింపబడుతున్నారు. ఇప్పటివారు ప్రకృతి నియమాల తెలిసికొనక పోవడమే కారణంకావచ్చు. "అన్నాన్నే ప్రాణంగా భావించేవారు ఉపవాస సిద్ధాంతాలను తెలుసుకొని దాన్ని ఆచరణలో పెట్టవలసి ఉంది. ఉపవాస ప్రయోజనాలను బాగా గుర్తించవలె" అని సుప్రసిద్ధ వైజ్ఞానికుడు బాబూ రామచంద్ర వర్మ ఒకచోట ఎలుగెత్తిచాటినాడు.

"హిందూ మతాచారాలు విజ్ఞానసమ్మతాలు. వాటిని గుర్తించి తీరవలె. పున్నమి నాటి చంద్రుడు మన మస్తిష్కాన్ని ఏకాదశినాటి చంద్రుడు మనస్సును, విదియ నాటి చంద్రుడు పాదాల వ్రేళ్ళను ప్రభావితం చేస్తారు. హిందువులు ఏకాదశినాడు ఉపవాసముండి రాత్రిపూట జాగరణ చేస్తారు. ఆధ్యాత్మిక సాధనలు చేస్తారు. అమరుల నాకర్షిస్తారు - అని ప్రొఫెసర్ నట్‌వర్ ఉపవాసాన్ని వైజ్ఞానిక దృష్టి వివరించినారు. తన అనుభవాల పురస్కరించుకొని ఉపవాస ప్రయోజనాల వెల్లడించినాడు.

నిజానికి ఉపవాసమనేది ఆత్మోన్నతి కేర్పరచిందే. ఉపవాసం చేసినపుడు ఆత్మ శక్తులు చైతన్యవంతంగా ఉంటాయి. ఇది ఒక తపశ్చర్య. దీనివల్ల సత్సంకల్పాలలో బుద్ధి వికసిస్తుంది. సాహసమేర్పడుతుంది. క్రమబద్ధ జీవితం గడపడానికి తగిన ప్రేరణలభిస్తుంది. ఆంతరిక మాలిన్యం తొలగుతుంది. బంధ



విముక్తికి మనస్సు త్వరపడుతుంది. భోగేచ్ఛ నశిస్తుంది. కైవల్య కాంక్ష పెరుగుతుంది.

ఉపవాసము మనస్సును నిర్మలీనం చేస్తుంది. ఉపవాసంతోబాటు స్వాధ్యాయ మనన చింతన ధ్యానాదులు కూడ మనస్సుపై శాశ్వత ముద్ర వేస్తాయి. ఉపవాసాగ్ని మనస్సునే అయఃపిండాన్ని కరిగిస్తుంది. అప్పుడది యిచ్చవచ్చిన రూపాన్ని పొందుతుంది. ఉపవాసం చేసి సకాయసాధనలు చేసేవారు తమ కోరికల నెరవేర్చుకున్నట్లే. ఉపవాసంవల్ల బ్రహ్మచర్యాన్ని కాపాడుకోవచ్చు.

"ఆరోగ్యాన్ని యౌవనాన్ని జీవితానందాన్ని శక్తిని పొందగోరేవారు ఉపవాసము చేసి తీరవలె. ఉపవాసం వల్ల మానవుడు నైతికాధ్యాత్మికంగా ఎదిగి తీరును. దయామయుడై యుండును,, అని ప్యురింగ్‌టన్

"ఆరోగ్యాన్ని యౌవనాన్ని జీవితానందాన్ని శక్తిని పొందగోరేవారు ఉపవాసముచేసి తీరవలె. ఉపవాసం వల్ల మావవుడు నైతికాధ్యాత్మికంగా ఎదిగి తీరును.

(గత సంచిక తరువాయి)

ఒక్క మాసము కంటె నే నోర్వజాల
ప్రాణములు వీడుదు నటంచు పతికి పలుకు"
కొంగులోని చూడామణి కోమలాంగి
హనుమ కిచ్చెను రాముని కందజేయ.

రాము ప్రేరేచు కార్యభారమ్ము నీదె
రవితనయుడైన సుగ్రీవు ప్లవగవరుల
కుశల మడిగితి నంచు వాక్రుచ్చు మయ్య
వేగ చనుదెమ్ము రాముని వెంట గొనుచు.

భూమి నాకాశ పాతాళముల చరించు
ఖ్యాతబలవిక్రమాఢ్యులు కపులు గలరు;
వారిలో అల్పుడను నేనె పారుదెంతు
నా భుజాల దాలిచి రఘునందనులను.

తల్లి! విడువుము హృదయ సంతాప మీవు
ముట్టడించు వానరసేన ఇట్టె లంక,
రామచంద్రుడు రఘుకులరమణు డింక
సంహరించు దశగ్రీవు సమరమందు.

# రావుల రామాయణము

బాష్పగద్గగ కంఠియై పలుక సీత
ఆలకించి కపీశ్వరు డనియె నిట్లు
"రామబాణము మ్రోల ధైర్యముగ నిలువ
నరసురాసురులందు నెవ్వరును లేరు."

పలికె వైదేహి సౌహార్ద ఫణితి నిట్లు
"కొంత శాంతి ఘటించె నీ అంతికమ్ము
ఓ మహాత్మ! నీ విట నుండు మొక్కదినము
తెలియ జెప్పు కార్యంబు సిద్ధించు తెరువు."

ఆంజనేయుడు సీతతో అనియె నిట్లు
"నీదు చె రబాపు మా తల్లి! నిశ్చయముగ
శక్తి జూపు సుగ్రీవుడు సముచితగతి
ఆతనికి కోట్లకొలది సైన్యంబు గలదు.

శోకసాగర పారము చూతువమ్మ!
రామభద్రుని కంటెను రాజు కాని,
సముదు కాని సౌమిత్రికి జగతి లేరు
చిరము లంకాపురమున వసింప వీవు."

అమితముదమున హనుమతో అనియె సీత
"పరవశింపగ రాముని స్పర్శ నాకు
కలుగజేయుము కరుణతో కపివరేణ్య!
అనఘ! ఎరిగింతు మరియొక్క ఆనవాలు.

తిలక మొకసారి నొసలిపై దిద్ది నాకు
చెక్కి మణిశిల చెక్కిలిచుక్కతీర్చె
కాంతు డీమణి బాయ శోకంబు గదురు
పతికి చెప్పుము దీని పంపితి నటంచు."

డాక్టర్
శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

"తావక వియోగ దుఃఖసంతాప కలన
శాంతి గనని రాముండు లక్ష్మణుని గూడి
సత్వరమె నిన్ను గొనిపోవు సన్నుతాంగి!"
పుణ్యు డిట్లని సీతకు మ్రొక్కె భక్తి.

చెప్పి రాము సేమంబు పృచ్ఛించినట్లు
పాశునయనాల వైదేహి స్వస్తి పలుక
ముదలగొని ఉత్తరదిశాభిముఖుఁడు నగుచు
పవమానుడు ముదమున పయన మయ్యె.

మనమున దలంచె నా హనుమంతు డిట్లు
"ప్రభుడు సలుపంగ పనిచిన పనియె గాక
భవ్యగతి అన్యకార్య లాభంబు గూర్చు
వాడె దక్షుడు తలపోయ వాడె దూత.

కావున అశోకవనము భగ్నమ్ము చేయ
దనుజపతి శక్తియుక్తులు కనగవచ్చు
తెలియు దశకంధరునకు మదీయశక్తి
ఆత్మని కావర మొక్కింత అణచివైతు."

క్రుద్ధుడై చెట్లు మొదలంట కూల్చి కూల్చి
సర్వనాశన మొనరింప క్షణములోన
మొద్దులకు విందు గూర్చెడు సొబగు దక్కి
శోకదేవత యయ్యె ఆశోకవనిక.

వ్యాప్తిగనె వృక్షభంగరవంబు దెసల
బహువిహంగమ సంఘాలు పారిపోయె;
ఆట్లు దనుజన క్షపియ మాచరించి
హనుమ తోరణభాగాన కరిగి నిలిచె.

నిదుర లేచిన దానవసుదతు లెల్ల
భయము నందిరి భగ్నమౌ వనము గాంచి
పెద్ద గిరివోలె మారుతి పెరుగ, సీత
కాంచి రాక్షసస్త్రీలు దండించి రిట్లు.

"భామ! ఎవ్వడు వీడు? పేరేమి? ఏల
వచ్చె? ఏమి పలికె? చెప్పు భయము వీడి"
కామరూపులు వారికే కాని తనకు
తెలియ దస లేమియు నటంచు తెలిపె సీత.

కొందలంబున రావణుమందిరమ్ము
చేరి కొందరు విభునకు చెప్పి రిట్లు
"మన అశోకవనమ్ము నాశనము చేసె
ఒక్క మర్కటు డతివిక్రమోజ్జ్వలుండు.

సీతతోడ సంభాషించె; ఆత డెవరొ
చెప్పదయ్యె ఎట్లెట్లొ ప్రశ్నించినాము;
తాకలే దామె యుండిన తరు వొకండె
ఆమెరక్షకు డత డని వ్యక్తమయ్యె.

ప్రజ్వలించిన ప్రభుని నేత్రాలనుండి
దొంతరగ వేడినీటిబిందువులు రాలె;
బయలుదేరిరి వేగ రావణుని యాజ్ఞ
కింకరాఖ్యులు శూరులు కినుక బూని.

వికృతరూపాల ఎనిమిది వేలమంది
గదలు శరభగ్గములు పరిఘలు ధరించి
చుట్టుముట్టిరి హనుమంతు పట్టుకొనగ
సాహసులు వారు సంగరోత్సాహయుతులు.

అమితతేజస్వి శ్రీమంతు డద్రిసముడు
తోకతో గొట్టి క్షితి గట్టి కేక పెట్టె;
నింగి నేల మహోగర్జ నిండిపోవ
పక్షు లంతట భీతితో పడియె పుడమి.

"జనవినుతుడై రాఘవేంద్రునకు జయము
శౌర్యశాలి సౌమిత్రికి జయము జయము
అతిబలయుతుండు వానరపతికి జయము
అలరుదురు విక్రమాఢ్యులై అవని వారు.

క్లేశ మెవరికి గూర్చని దాశరథికి
దాసదాసుడ వాయుపుత్రకుడ నేను
శత్రుసంహారదక్షుండ శౌర్యనిధిని
ఆంజనేయాహ్వయంబున నలరు వాడ.

తరులు గండశిలలె ఆయుధాలు నాకు
రావణులవంటి వారలు వేవురైన
నాకు చాలరు సమరాంగణమ్ములోన
అరుగుచుంటి కృతార్థుడ నగుచు నిపుడె."

హనుమభీకరనాదమ్ము నాలకించి
జంకొదవ దాగి అందందు కింకరాళి
భీతి నాయుధజాలము విసిరి రంత
ప్రభుని యానతి ధిక్కరింపంగలేక.

శూరు లెల్లరు నాతని చుట్టుముట్ట
దొరకగా తోరణమువెంత పరిఘ యొకటి
దాని గిరగిర ద్రిప్పుచు వానరుండు
సాహసంబున వారల చంపివేసె.

ఘనతరంబుగ మారుతి తనువుపెంచి
జలధరపథంబు నంటెడు చైత్య మెక్కి
భీతి కొలుపుచు కాంతి శోభిల్లుచుండె;
మట్టుపెట్టగ మార్తుర మల్లచరచె.

చైత్యపాలు రసంఖ్యాక దైత్యభటులు
శూరవరులు కొట్టి రతని చుట్టుముట్టి;
ఒక్క ఉదుటున స్తంభంబు నూడబెరికి
వారి నెల్లర చదిపెను వాయుసుతుడు.

పలికె ఆంజనేయు డిటు లంబరమునుండి
"రామవిభునితో మీరు వైరమ్ము గొనుట
కోట్లకొలదిగ నావంటి ఘోరబలులు
మిమ్ము చంపుట నిస్సంశయమ్ము సుండు."

రావణుడు పంపగా ఖరరథము నెక్కి
జంబుమాలి తోతెంచె ప్రచండబలుడు
దశశరమ్ములు వేసె వదనము శిరము
కరముల దగుల ఆ కపివరుని పైని.

క్రుద్ధుడై హనుమంతుడు కొట్టెవాని
గండశిలతోడ సాలవృక్షమ్ముతోడ;
జంబుమాలి వక్షస్థలి చాల బలిమి
తగిలిన పరిఘదెబ్బతో పగిలిపోయె.

జంబుమాలి-వికటదంష్ట్రు చావు కబురు
రావణుడు విని నేత్రాల రక్త మొలుక
శీఘ్రమే పంపె ఆయుధశ్రేణితోడ
సమరదుర్జయు లేడ్వురు సచివసుతుల.

సంగర కుతూహలులు వారు స్యందనాల
వచ్చినంత విహాయసపథమునుండి
స్వీయబలమున తిరుగుచు స్వేచ్ఛమీర
మహితగతి చేసె హనుమ విమర్దనమ్ము.

సప్తసంఖ్యులు వీరులు సమసిపోవ
ప్రాణభీతిని సైన్యము పారిపోయె;
తోరణముఖాన సమరసంతోషయుతుడు
మారుతాత్మజుండు మరల జేరి ధృతిని.

దైత్యవిభు డాంజనేయుని తలచె మదిని
క్రోతిమాత్రునిగా కాక భూత మట్లు;
అతనిపట్టంగ పంచసేనాధిపతుల
బలవిశిష్టుల వాయువేగులను పనిచె.

(సశేషం)






దేవునికి భారీగా కానుకలు సమర్పిస్తే ఎన్నిపాపాలు చేసినా ఫరవాలేదనే అభిప్రాయం చాలా మందికి ఉంటుంది. అయితే ఈ అభిప్రాయం, ఈ ఆశ కేవలం ఒక అపోహ మాత్రమే. భారతీయులు అత్యంత పవిత్రంగా భావించే భగవద్గీత ఈవిషయాన్ని స్పష్టంచేస్తుంది. గీతలో 12వ అధ్యాయమైన భక్తియోగంలో 13 నుండి 19 శ్లోకం వరకు తనకు ఎటువంటి భక్తుడంటే ఇష్టమో . కృష్ణపరమాత్మ వివరిస్తారు.

అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏ వచ,
నిర్మమో నిరహంకారః
సమదుఃఖ సుఖః క్షమీ.

సంతుష్ట స్సతతం యోగీ
యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధిః
యో మద్భక్త స్స మే ప్రియః.

ద్వేషం లేనివాడు, అన్ని భూతముల యందు మైత్రి, కరుణ కలవాడు, మోహం, అహంకారం లేనివాడు, సుఖదుఃఖాలను సమానంగా చూసేవాడు, నిత్య సంతుష్టుడు, యోగి, దృఢనిశ్చయుడు, నాకు మనసు అర్పించిన వాడు అయిన భక్తుడు నాకు ఇష్టుడు.

ఈ లక్షణాలను ఒక్కసారి సమీక్షిస్తే భక్తునికి ఎంత విశాల హృదయం ఉండాలో అర్థం కాగలదు. పెక్కుమంది ఈనాడు సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధిస్తున్నారు. కాని కేవలం మనుషులను మాత్రమే కాక అన్ని జీవరాశులను ప్రేమించే వాడే ఉత్తమ భక్తుడని గీతాచార్యుడు చెబుతున్నాడు. భక్తునికి క్షమాగుణం ముఖ్యం. అపకారికి కూడా ఉపకారం చేయగల పెద్ద మనసు ఉండాలి.

సుఖదుఃఖాలను సమానంగా చూడటం, అహంకార మమకారాలను జయించటం ఉత్తమ భక్తునికి ఉండవలసిన లక్షణాలు. భక్తుడు నిత్య సంతుష్టుడై ఉండాలి. అంటే నిరంతరం భగవంతుని ఏదో ఒకటి కోరేవారు ఉత్తమ భక్తులు కాదన్నమాట. అదేవిధంగా భక్తుడు యోగి అయి ఉండాలంటున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

శ్రీ ఎం.వి. రమేష్

"సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే" (2-48)

ఒక పని నెరవేరినా నెరవేరక పోయినా సమస్థితిలో ఉండటమే యోగం. అట్టి స్థితి పొందిన వాడే యోగి. ఇటువంటి యోగి జీవితంలో ఎప్పుడూ నిరుత్సాహ పడడు. నిరుత్సాహ పడని వాడు ఏనాటికైనా ఉన్నత స్థితిని పొంద గలుగు తాడు. ఇంతేగాక సంయమనం, దృఢ నిశ్చయం కలిగి మనస్సును తనకు అర్పించే వాడే ఉత్తమ భక్తుడని కృష్ణ పరమాత్మ చెప్పాడు.

భగవంతుడు ఇంకా ఇలా చెపుతున్నాడు.

యస్మా న్నోద్విజతే లోకో
లోకా న్నోద్విజతే చ యః,
హర్షామర్ష భయోద్వేగైః
ముక్తో యస్స చ మే ప్రియః. (12-15)

లోకానికి భయ పడనివాడు; లోకాన్ని భయపెట్టని వాడు, హర్షం, విషాదం, భయం, ఉద్వేగం లేనివాడు అయిన భక్తుడు నాకు ప్రియుడు.

ఈశ్లోకంలో చెప్పిన మొదటి రెండు లక్షణాలు అతి విచిత్రంగా కనపడుతాయి. ఇటువంటి లక్షణాలు కలిగిన భక్తుడు ఉండటం సాధ్యమా అనిపిస్తుంది. కాని చరిత్రలో మనకు ఇటువంటి భక్తులు దర్శన మిస్తారు. మహాకవి బమ్మెరపోతన, వాగ్గేయ కారుడు త్యాగరాజు ఇటువంటి భక్తులని చెప్పవచ్చు. వారు ఎన్నడూ, ఎవ్వరినీ భయపెట్టిన దాఖలాలు లేవు. వారు ఎవ్వరికీ భయపడలేదు. ఒక మహారాజు వచ్చి తనకు కావ్యాన్ని అంకితం చేయవలసినదిగా కోరినా పోతన తిరస్కరించాడు. దీనికి ఎంత ధైర్యం కావాలి. తనమాట కాదంటే రాజు ఏం చేస్తాడోనని భయపడేవాడు ఆవిధంగా ప్రవర్తించలేడు. ఇకపోతే త్యాగరాజు కూడా అంతే. ఒక రాజా కానుకలను పంపితే--

(35వ పేజీలో)

# భక్త మీరా

## సామాజిక భూమిక

పదకొండవ శతాబ్ది మహమ్మద్ గజనీ దాడులతో ప్రారంభమైంది. క్రమంగా ఉత్తర భారతదేశాన్ని మహమ్మదీయులు ఆక్రమించారు. పరిపాలనను సుస్థిరం చేసికోవటానికి వారు హిందూ రాజులతో ముఖ్యంగా రాజపుత్రులతో యుద్ధాలు చేశారు. అంతే కాక రాజపుత్రుల అంతర్గత యుద్ధాలతో కూడ మీరా జన్మస్థలం అల్లకల్లోలం అయింది. మీరా జన్మస్థలం మేడ్తా. చిన్న సంస్థానం. నిరంతరం అంతః కలహాలతో నిండిపోయింది. ఈ కల్లోలాల ప్రభావం మీరాబాయి జీవితంలో అస్థిరతకు, అభద్రతకు, అశాంతికి దారితీసింది. పర్యవసానంగా ఆమె తాత్విక చింతనలో చిత్తశాంతిని అన్వేషించింది. ఈ జీవన సంఘర్షణే మీరాబాయి జీవన వైఫల్య, సాఫల్యాల్ని, వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే విధంగా పదకవిత్వం వెలువడింది.

## భక్తి ఉద్యమం

ఉత్తర భారతదేశంలో ఒక ప్రక్క దేవాలయాలు ధ్వంసం అవుతూవుంటే మరో ప్రక్క విమత పాలన ఆధిపత్యం చెలాయిస్తుంటే, వేరొకవంక అన్య సంస్కృతి ప్రకోపిస్తుంటే దక్షిణ భారతంలో హిందూమత పునరుజ్జీవనానికి తీవ్రంగా కృషి జరిగింది. ఫలితం భక్తి ఉద్యమం. వేదాలు, రామాయణ, మహాభారతాల్లాంటి మహేతిహాసాలు ఉపనిషత్తులాంటి వైదిక మత గ్రంథాలు ఉత్తరభారతంలో ఆవిర్భవించాయి. భక్తి ఉద్యమం మాత్రం దక్షిణ భారతంలో పుట్టి ఉత్తరభారతానికి రామానంద్ తీసుకువచ్చాడని క్రింది దోహా ఉద్దేశిస్తుంది. "భక్తి ద్రావిడ ఉపజీ లాయే ఉత్తర రామానంద్" -- "పర్గట్ కియో కబీర్‌నే సప్తద్వీప్ నవఖండ్" ఈ భక్తి ఉద్యమం ముసల్మానుల ఏలుబడిలో అణగారిపోయిన హిందూ సోదరుల నిరాశ నిస్పృహలను తొలగించడంలో కృతకృత్యం అయింది. అందువల్లనే పవిత్రవైదిక గ్రంథాలకు దక్షిణాన వెలసిన త్రిమతాచార్యులు వ్యాఖ్యాన గ్రంథాలు ప్రాయవలసి వచ్చింది.

**డా. సి. గోవిందరాజులు**

జ్ఞాన, కర్మ, భక్తి మార్గాలలో చివరిదైన భక్తిమార్గం జన సామాన్యం అనుసరించటానికి సులభమైంది. అందువల్లనే వివేకంకంటె, వైదిక కర్మాచరణకంటె, ఆరాధనకు, ఆత్మార్పణకు అంతులేని ప్రాధాన్యత ఏర్పడింది. శ్రీ మహావిష్ణువు ధరించిన దశావతారాల్లో శ్రీకృష్ణుని అవతారం ప్రధానమైందేగాక ప్రశస్తమైంది. శ్రీకృష్ణతత్వాన్ని అద్భుతంగా వర్ణించిన గ్రంథం మహాభాగవతం. ఇది మహాభాగవతోత్తముల జీవితాన్ని వివరించి ఆనాటి భక్తి ఉద్యమానికి ఒక గొప్ప ప్రబోధక శక్తి అయింది. శ్రీరామానుజాచార్యులవారి విశిష్టాద్వైతస్థాపనతో భక్తి ఉద్యమం మరింత వేగాన్ని పుంజుకొంది. రామానందుడు, వల్లభాచార్యుడు, వల్లభుని కుమారుడైన విఠలనాథుడు భక్తి ఉద్యమాన్ని ప్రజా బాహుళ్యంలోకి చొచ్చుకొని పోయేలా చేశారు.

> రాధాదేవి అంశగా భావించే మీరాబాయి పుట్టుకతోనే మహారాణి. కాని ఆమె రాజాంతఃపుర బంగారు సంకెళ్లను విదిలించివేసి, తాను ఆరాధించిన ఆ వల్లని కన్నయ్యకోసం ద్వారకవైపు పరుగులు పెట్టింది. కృష్ణయ్య అనుగ్రహం కోసం అర్రులు చాచింది. కృతకృత్యు అయ్యి "మీరా కే ప్రభు గిరిధరనాగర్" అని సగర్వంగా చెప్పు-కొని "భక్తమీరా"గా ప్రసిద్ధి-పొందింది. రేఖామాత్రంగా వివరించబడ్డ "భక్తమీరా"ను ఆగష్టు 29 శ్రీకృష్ణాష్టమి సందర్భంగా ప్రచురిస్తున్నాం.
>
> సం॥

## భక్తి కవిత

ఏకాలంలో అయినా ఏ సమాజంలో అయినా కవిత్వానికి ఒక చోదకశక్తి అవసరం. భారతదేశంలో మతాన్ని ఆశ్రయించుకొనే కవిత వర్ధిల్లింది. మతంలో భక్తి వేరు, మధ్య యుగాల్లో కవిత్వాన్ని నడిపిన భక్తివేరు. ఉత్తర భారతదేశంలో వెలువడిన కవిత్వంలో 'మధురభక్తి' కనిపిస్తుంది. ఈ భక్తిలో శృంగారం మిళితమైంది. ఈ కవుల కవయిత్రుల రాసిక భావనకు కేంద్రం రసిక శిఖామణి శ్రీకృష్ణుడు అయ్యాడు. భక్తి ఉద్యమం సాహిత్యంలో రకరకాలుగా భాసించకపోలేదు. మహత్తర కవితా ప్రతిభగల భక్తి ఉద్యమకారులు తమ ఇష్టదైవాల్ని, ఇలవేల్పుల్ని రకరకాలుగా కీర్తించి తరించి తరింపజేశారు. తమిళంలో ఆళ్వారులు, దివ్యప్రబంధాల్ని, తెలుగులో తాళ్ళపాకకవులు, శృంగార అధ్యాత్మ సంకీర్తనల్ని రచించారు. అంతేగాక మరాఠీలో నామదేవ జ్ఞానేశ్వరులూ, బెంగాలీలో చండీదాసూ, గుజరాతీలో నర్సీమెహతా, ప్రాతఃస్మరణీయమైన భక్తి కవితా సంకలనాలను వెలయించారు.

## హిందీలో భక్తి కవిత

హిందీభాషా వ్యవహార ప్రాంతమంతా కూడా ఈ ప్రభావాలకూ ప్రమేయాలకు అతీతంగా ఉండలేకపోయింది. కబీరు తన దివ్య సందేశాన్ని వినిపించటానికి పదకవితను సాధనంగా ఎన్నుకున్నాడు. తులసీదాసు పండిత జన పరిమితమైన గీర్వాణానికి స్వస్తిచెప్పి సామాన్య జనం కోసం ప్రాంతీయభాషను ఆశ్రయించాడు. కళ్లుండి చూడలేని శ్రీకృష్ణుని లీలను, అందచందాల్ని గ్రుడ్డివాడైన సూరదాసు చూపించాడు.

మీరాబాయి కూడా "పాడుకొందు గోవిందుని పరమదివ్య గుణాలనే" అంటూ "గిరిధరుడు తప్ప నా -- కొరులెవరూలే రని" ఉద్ఘాటించి కృష్ణుని పట్ల తనకుండే అభిమానాన్ని పాటలుగా పాడుకొంది.

మధ్యయుగపు హిందీ వాఙ్మయ చరిత్రలో మీరాబాయి పదావళికి ఒక విశిష్టస్థానం వుంది. ఆమె సమకాలీనులైన కబీరు, సూరదాసు, తులసీదాసులతో పోల్చిచూస్తే భారతీయ సాహిత్య చరిత్రలో ఆమెస్థానం అంత ప్రముఖమైంది కాక పోవచ్చు. కాని ఆమె భజనకీర్తనలు నాలుగువందల ఏళ్లుగా యావద్భారతదేశమంతా ప్రజల నాలుకలపై నాట్యమాడుతూ భక్తి వాఙ్మయంలో ఆమెకు ఉండే ప్రత్యేక స్థానాన్నిచాటి చెబుతున్నాయి. కవయిత్రిగా ఆమెకంటె గొప్పవాళ్ళు ఎందరో వుండవచ్చు. కాని ఉషాయస్ నిల్సన్ గార న్నట్లు "స్వచ్ఛందశీలం, అవరోధాలకెదురొడ్డి నిలచిన అచంచల మత విశ్వాసం ఆమె వ్యక్తిత్వానికొక ఆధిక్యతను సమకూర్చాయి. భక్త కవులలో పలువురు నిమ్న తరగతులకు చెందినవారే. కాని మీరాబాయి రాజకుమారి. రాచవారింటికోడలు. భక్తి మార్గానుసరణకై సమస్త సౌఖ్యాలను, వంశగౌరవాన్నీ పరిత్యజించడానికి ఎంతో ధైర్యం కావాలి. ఆమె కవిత్వం, వ్యక్తిత్వం, జీవితం, అచ్చమైన భక్తికి స్వచ్ఛమైన ప్రతిరూపాలు. గిరిధరుని చరణ కమల సన్నిధిలో ఆమె ఆత్మార్పణం చేయడం ఆమె బహుళ వ్యాప్తికి చిరస్మరణీయ కీర్తికి హేతువైంది."

## మీరాబాయి జీవితం

ప్రహ్లాదుడు తండ్రిని త్యజించాడు. విభీషణుడు సోదరుని వదలి పెట్టాడు. భరతుడు తల్లికి దూరమయ్యాడు. బలిచక్రవర్తి గురువును పరిత్యాగం చేశాడు. గోపికా స్త్రీలు గోపాలునికోసం భర్తలనే విసర్జించారు. మీరాబాయి కూడా అంతే. జనాపవాద భీతిని లెక్క చేయక సంసార శృంఖలాలను తెంచుకొని ఐదవ ఏటనుండే గిరిధరుణ్ణి నమ్ముకొంది. జంకుగొంకు లేక యమునాతీరం నుండి ద్వారకదాకా ప్రయాణించి శ్రీకృష్ణ భక్తి అనే గానామృతంతో భారతావనిని పునీతం చేసింది.

మహాభక్తురాలైన మీరాబాయి రాజాస్థానంలోని ప్రభువులైన రాణాల కుటుంబానికి చెందింది. ఎండకన్నెరుగకుండ అంతఃపురంలో ఘోషాలో ఉండవలసిన కాంత అసాధారణ సౌందర్యరాశి, రాజ ప్రసాదాన్ని దాటి జనంలోకి వస్తే తాను నీలాపనిందలకు గురికాక తప్పదని ఆమెకు తెలియకపోలేదు. అయినా ఖాతరు చేయక ఆ గాయిక యోగిని తన జీవితాన్ని శ్రీకృష్ణుని స్తుతించటానికి, కృష్ణభక్తిని ప్రచారం చేయటానికి సంపూర్ణంగా అంకితమయ్యింది. ఆమె నైసర్గిక పద సాహిత్యం జన బాహుళ్యంలోనికి చొచ్చుకొని పోయి వేళ్ళూనింది.




మీరాబాయి జీవితాన్ని గురించి గేయాలను గురించి అభిప్రాయ భేదాలు కనిపిస్తున్నాయి. టాడ్‌దొర ఈమె కుంభరాణా భార్య అని Annals and Antiquities of Rajasthan అనే బృహద్గ్రంథంలో రాశారు. మీరాబాయి తాత దూదాజే. ఆయన కుంభరాణా సమకాలీనుడు. అతడు 1467లో

మరణించాడు. మీరాబాయి తండ్రి రత్న సింహుడు. తల్లి ధారోడ్ వీరకుమారి. ఈమె కుడ్కే గ్రామంలో 1498లో జన్మించింది. తనువు చాలించింది 1546 ద్వారకలో (కార్యావాడ్) ఈ కాల నిర్ణయాన్నే పలువురు సుప్రసిద్ధ చారిత్రకులు అంగీకరిస్తున్నారు. టాడ్‌దొర అభిప్రాయం పరాస్తమైపోయింది. హరివిలాస్‌సర్దా, గౌరీశంకర్, హీరా చంద్ర ఓఝాలవాదం నిలచి నేడు అందరికీ ఆమోదమైంది. పుట్టినప్పుడు మీరా ముఖం దివ్య తేజస్సుతో వెలుగుతూంటే జ్యోతిష్కులు 'సూర్యముఖి' అనే అర్థం వచ్చేట్లుగా బాలికకు మీహిరాబాయి అని నామ నిర్ణయం చేశారు. 'మీహిరాబాయి' మీరాబాయిగా ప్రసిద్ధురాలై స్థిరపడింది.

మీరాకు 1516లో సంగరాణా జ్యేష్ఠ పుత్రుడైన కుమార భోజరాజుతో వివాహం జరిగింది. వివాహానంతరం పుట్టింటినుంచి ఆభరణాలు, కానుకలు, ధనకనక వస్తు వాహనాలు పంపారు. వీటితోపాటు చిన్నతనంలో సాధువు ప్రదానం చేసిన శ్రీకృష్ణ విగ్రహాన్ని, గజ్జెలు, తాళాలు, ఏకతార మొదలైన వాటిని అత్తవారింటికి తీసుకెళ్లింది. అక్కడ పూజామందిరంలో గోపాల విగ్రహాన్ని ప్రతిష్ఠించుకొని భక్తితో పూజలు కొనసాగించింది.

## కట్టుకథలు

మీరా జీవితాన్ని గురించి, కృతులను గురించి చెప్పే నిశ్చితమైన ఆధారాలు లభించడంలేదు. మిగిలిన భక్త కవుల్లాగే నిరహంకారి అయిన మీరా తనను గురించి చెప్పుకున్నది ఎంతో తక్కువ. జనప్రియులైన వ్యక్తులను గురించి జనసామాన్యంలో కట్టుకథలు బయలుదేరడం సర్వసామాన్యం. మీరాబాయికి సంబంధించిన ఖచ్చితమైన చారిత్రక ఆధారాలు లేకపోవడంతో పిట్టకథలు ఎన్నో పుట్టుకొచ్చాయి. మేవాడు యువరాజైన కుమారభోజరాజు 1521లో యుద్ధంలో మరణించాడని ప్రసిద్ధి. భర్త మరణానంతరం ఆమె బావగారైన రతన్‌సింగ్ మీరాను అంత మొందించటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కానీ ఆ ప్రయత్నాలన్నీ విఫలమైనాయి.

హరి గుణ గణముల గానముచేసి
పరవశించినది మీరా.

సర్పపేటికను రాణా పంపగ
చల్లగ మీరా గ్రహించె
స్నానమాడి ఆ పేటిక విప్పగ
సాల గ్రామమై అగుపించె.

విషపాత్రను రాణా పంపగ అది
విమలామృతమై కనిపించె
ఆ విషమును తానారగించగా
అమృతరూపమె సిద్ధించె.

శూల శయ్యపై పవళించగ ఆ
సుదతిని రాణా శాసించె
శూలశయ్యపై మీరా చేరగా
పూల శయ్యగా భాసించె.

ఆశ్రితావనుడు మీరా ప్రభువే ఈ అంతరాయాలన్నీ తొలగించాడు. మేఘ సుందరుని గానములోనే మీరా నిరంతరం పునీతమైంది. విక్రమజిత్తు మీరాబాయిని నీటమునిగి ఆత్మహత్య చేసికోవలసినదిగా ఒత్తిడి చేసినట్లు ఆమె అలా చేసినా చెక్కు చెదరక సజీవంగానే ఉన్నట్లు మరోగాథ కూడ ప్రముఖంగా ప్రచారంలోకి వచ్చింది. ద్వారకలో ఆమె మరణానికి సంబంధించి కూడ కొన్ని కట్టు కథలు వ్యాప్తిలోకి వచ్చాయి.

## మీరాబాయి రచనలు

మీరాబాయి జీవితాన్ని గురించి అభిప్రాయ భేదాలు వున్నట్లే ఆమె కృతుల సంఖ్యను గూర్చి గూడ వివాదాలున్నాయి. మీరాబాయి తన పదాలను ఒక ప్రియ స్నేహితురాలికి చెప్పినట్లుగా రచించింది. దీనిని గురించి ఒక కథ ప్రచారంలో వుంది. మీరా జీవితంలో చివరిదాకా ఆమెను అంటిపెట్టుకొని 'లలిత' అనే పేరుగల దాసి ఉన్నదట! బృందావనానికి వెళ్ళినపుడు కూడా లలిత తన యజమానురాలుతోనే ఉండట. మీరా రచించిన గీతాలను ఈ దాసి భద్రపరిచేదట. 17వ శతాబ్దిలో గుజరాతుకు చెందిన ముస్లిం రాజొకడు రణచోడ్‌జీ మందిరంలోని సంపద నంతటినీ కొల్లగొట్టగా లలిత భద్రపరచిన వ్రాతప్రతులన్నీ నాశనమైనాయని అంటారు.

గీతగోవింద్ టీకా, నర్సజీరోమెహెరో ఆమె రచనలని ప్రతీతి. పదావళి, సారరాక్తే పద్, రాగ్‌మలార్, రాగగోవింద్, సత్‌భామా నూరసన్ మీరాబాయి గార్బీ, రుక్మిణీమంగల్, నర్సీమెహతా, నీహుండీ, చరిత్ మీరాబాయి కృతులని ప్రభాత్ అభిప్రాయం. గీతగోవిందానికి ఆమె వ్యాఖ్యానం రాయలేదనీ, కర్తృత్వాన్ని టాడ్ పొరబాటున అంటగట్టాడని పలువురు విమర్శకుల అభిప్రాయం. ఆమె పేరిట చెలామణీ అవుతున్న గేయాలన్నీ ఆమెవేనా అనే సందేహం ఉండనే వుంది. మీరాబాయి పదసాహిత్యంగా గుర్తించబడిన గేయాలు రమారమి నాలుగువందలు వున్నాయి. రాజవంశీకులు ఆమెనే హతమార్చాలని ప్రయత్నించినపుడు ఆమె రచనలను భద్రపరుస్తారా? ఆమెకు శిష్యులు కూడ ఉన్నట్టులేరు. పండితకవులు ఆమెను విస్మరించారు. ప్రజల జనజీవనంలో భాగంగా మిగిలిన ప్రసిద్ధ గేయాలే ఈనాడు మనకు మిగిలాయి.

## భక్తితత్పరత

మీరాబాయి కబీరులా సంస్కర్త కాదు. తులసీదాసులా మత ప్రవక్త కాదు. ఆమె రాసిక్య భావన లీలా మానుష విగ్రహుడైన చిన్నకృష్ణుని మీద గోపికా హృదయచోరుడైన నల్లనయ్యమట్టు భక్తి భావంలో అల్లుకొనిపోయింది. మీరాబాయి తననుతాను మధురా నగరిలోని గోపికగా సంభావించుకొంది. భగవద్గీత అష్టాదశాధ్యాయంలో శ్రీకృష్ణుడు భక్తి మార్గాన్ని ప్రభోదిస్తాడు. మీరాబాయి జీవితాన్ని పరిశీలిస్తే ఆమె ఈ ప్రబోధాన్ని మనసా, వాచా, కర్మణా అనుసరించినట్టు అర్థమవుతుంది. ఆమె తన చిత్తాన్ని పరమాత్మునియందే ఉంచింది. ఆత

(33వ పేజీలో)



# దేవతలారా! దీవించండి!

శ్రీ నడాధూరు జగన్నాథాచార్యులు

## 7. విఘ్నేశ్వరుడు

సుముఖ శ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః.
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః,
వక్రతుండ శూర్పకర్ణో హేరంబ
స్కంధ పూర్వజః
షోడశైతాని నామ్నాని యః పఠేత్
శృణుయాదపి
విద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా,
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే.

అని ఈవిధంగా విఘ్నేశ్వరుని సర్వశుభ కార్యాలకు ముందు విఘ్నములు తొలగిపోయి అనుకొన్న కార్యము జయప్రదంగా నెరవేర వలెనని షోడ శోపచారములతో పూజించి పూజా అక్షతలు శిరస్సున ధరిస్తారు.

ఈ గణపతి పుట్టుక అందరికీ తెలిసిందే - అయితే వివిధ యుగాలలో గణపతి లీలను పరిశీలించిన కృతయుగంలో "మహోత్కట వినాయక" అను పేరుతో ఉద్భవించి దేవాంతక నరాంతక అను రాక్షసులను సంహరించెను. త్రేతా యుగంలో "మయూరేశ్వర వినాయక" అను పేరుతో జన్మించి రాక్షసుడైన "మహాబలిసింధువు"ని సంహరించెను. ద్వాపర యుగంలో "గజానన" అను పేరుతో జన్మించి భయంకరుడైన సింధూరుడు అను రాక్షసుని సంహరించెను. ఈ కలియుగాంతములో ధూమ్రకేతు అను పేరుతో జన్మించి దుష్టశిక్షణ చేయును. అని గణేశ పురాణము, ముద్గల పురాణముల ద్వారా తెలియును. ఇంకా అష్ట వినాయకులు వారి పేర్లు వాహనములు ఈవిధముగానున్నవి.

1. వక్రతుండ - వాహనము సింహము.



2. ఏకదంత - వాహనము ఎలుక.
3. మహోదర - వాహనము ఎలుక.
4. గజానన - వాహనము ఎలుక.
5. లంబోదర - వాహనము ఎలుక.
6. వికట - వాహనము నెమలి.
7. విఘ్నరాజు - వాహనము ఆదిశేషువు.
8. ధూమ్రవర్ణ - వాహనము ఎలుక.

శివభక్తులు విఘ్నేశ్వరుని పూజిస్తే, విష్ణు భక్తులు వినాయకుని బదులు శంఖ చక్ర గదాహస్తములు కలిగి ఊర్ధ్వపుండ్రము ధరించిన విష్వక్సేనుని పూజించుదురు. ఇతడు వైకుంఠమునందు శ్రీమహావిష్ణువి యొక్క సేనాధిపతి.

యస్య ద్విరదవక్త్రాద్యాః
పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం విఘ్నంతి సతతం
విష్వక్సేనం తమాశ్రయే.

అని విష్వక్సేనుని ధ్యానించి పూజించుదురు.

భాద్రపద శుద్ధ చవితినాడు వినాయకునికి విఘ్నాధిపత్యం వచ్చింది. ఆనాడు సర్వదేశస్థులు వినాయకుని పూజించి పూజా అక్షతలు శిరస్సున ధరిస్తారు. ఒకసారి భాద్రపదశుద్ధ చవితినాడు కుడుములు ఆరగించి భుక్తాయాసముతో నెమ్మదిగా నడుచుచున్న వినాయకుని చంద్రుడు చూసి నవ్వెను. ఆ కారణమున రాజదృష్టి సోకిన రాళ్ళుకూడ నుగ్గగును అను సామెత నిజమగునట్లు వినాయకుని గర్భము పగిలి మృతుడయ్యెను. అంత పార్వతి శోకించుచు చంద్రునిచూసి "పాపాత్ముడా! నీదృష్టి తగిలి నాకుమారుడు మరణించెను గాన నిన్ను చూసినవారు పాపాత్ములై నీలాపనిందలు పొందుదురు గాక" అని శపించెను. అంత దేవతలు వచ్చి "అమ్మా! చంద్రుని చూడకుండా ఎలా ఉండగలము. కాన నీకుమారుని బ్రతికించెదము. శాపమును ఉపసంహరింపుమని" ప్రార్థించిరి. పార్వతి సంతుష్టాంతరంగయై కుమారుని చేరదీసి ముద్దాడి "ఈ వినాయకచవితినాడు మాత్రము నాకుమారుని పూజించక చంద్రుని చూడరాదు. అట్లు చూసిన వార్కి నీలాపనిందలు కలుగును" అని చెప్పెను.

కావున వినాయక చవితినాడు విఘ్నేశ్వరుని పూజించి ఉండ్రాళ్ళు పాయసము నివేదన చేసి, అనంతరము శమంతకోపాఖ్యానము కథ విని "సింహః ప్రసేన మవధీస్సింహో జాంబవంతా హతః సుకుమార కమారోదీస్తవ హ్యేషశ్శమంతకః" అను శ్లోకమును పఠించి అక్షతలు శిరస్సున ధరించిన వారు చంద్రుని చూసి నా నీలాపనిందలు పొందరు.

వక్రతుండ మహాకాయ
కోటిసూర్యసమప్రభ,
నిర్విఘ్నం కురు మే దేవ
సర్వకార్యేషు సర్వదా.

అని వినాయకుని ప్రార్థించవలెను. అనుకున్న కార్యము జయప్రదముగా నెరవేఱును.

## 8. నవగ్రహాలు

ఆదిత్యాయ చ సోమాయ
మంగళాయ బుధాయ చ,
గురు శుక్ర శనిభ్య శ్చ
రాహవే కేతవే నమః.

1. సూర్యుడు. 2. చంద్రుడు. 3 అంగారకుడు. 4. బుధుడు. 5. గురువు 6. శుక్రుడు. 7. శని. 8. రాహువు. 9 కేతువు. అని గ్రహాలు తొమ్మిది. మానవ జీవితంలో సుఖశాంతుల కొరకు నవగ్రహపూజ తప్పనిసరి. జాతకరీత్యా బాగుండని గ్రహాదులకు జప హోమ అర్చనాదులతో శాంతి అవసరం. తప్పక శాంతి చేసుకొనవలెను. ఈ నవగ్రహాలు వీటి ఫలితాలు గురించి చెప్పేది జ్యోతిషశాస్త్రం ఇది వేదపురుషునికి కన్ను. జ్యోతిషంలో గణనం ఎంత సూక్ష్మంగా ఉంటే ఫలితాలు అంత నిష్కర్షగా చెప్పడానికి వీలు ఉంటుంది. మినుకు మినుకుమంటూ ఉండేవి నక్షత్రాలు. స్థిరంగా ప్రకాశించేవి గ్రహాలు. సూర్యుడు, నక్షత్రాలు స్వయం ప్రకాశాలు, గురుశుక్రులు పెద్ద నక్షత్రాల వలె ఉంటారు. ఈ గురు, శుక్రులు రవితో కలిసియుండు కాలమును మూఢమి అందురు. అప్పుడు గురు శుక్రులు అస్తంగత దోషము వలన పాపఫలితములు యిచ్చెదరు. కాబట్టి ఆ కాలమున శుభ కార్యములు చేయరాదు.

నవగ్రహాల స్థితులు ఎట్లామారుతున్నాయో మానవుని జీవన స్థితులు గూడ అట్లామారుతున్నాయి. కష్టం సుఖం ఒకరోజు, సంతోషం మరొకరోజు. దుఃఖం మనోవ్యాకులత, పదవులలో పైకి పోవడం క్రిందికి రావడం, ఇట్లు లోకంలో ప్రతిజీవికి ఎగుడు దిగుడులున్నాయి. అంతరిక్షంలో అవిరామంగా ప్రయాణించే గ్రహాలకున్న మాటిమాటి వస్తున్న కష్ట సుఖాలను అనుభవిస్తున్న మానవులకున్న సంబంధం ఉన్నదని ఎఱిగియే మనమహర్షులు ఒక్కొక్క గ్రహం ఇచ్చే ఫలితాలు నిరూపించి ఉన్నారు. జననకాలాన్ని ఆరంభంగా తీసుకొని సుఖ దుఃఖాలను శాస్త్రమూలంగా తెలుసుకోగలుగుతున్నాము. చెడు కలుగజేసే గ్రహాలకు శాంతి జరుపుకొంటున్నాము.

గృహనిర్మాణము, గృహప్రవేశాదుల లోను, వ్రతాలలోను ఈ నవగ్రహపూజ తప్పక చేసుకోవాలి. ముఖ్యంగా ఆరోగ్యం కోసం సూర్యోపాసన చేయాలి.

## నవగ్రహ జపవిధానము

రవి (సూర్యుడు)కి 10 వేలు, చంద్రునికి 1,000, కుజునకు 600 లు, బుధునకు 2,000 లు, గురునకు 4,000 లు, శుక్రునికి 5,000లు, శనికి 300 లు. ఈప్రకారము దినము 1 కి జపసంఖ్య. ఇట్లా 40 రోజులు గాని 20 రోజులుగాని యథాశక్తి గ్రహజపము చేయించవలెను. జపసంఖ్యలో 10వ వంతు తర్పణము, తర్పణములో 10వ వంతు హోమము, హోమములో 10వ వంతు బ్రాహ్మణ భోజనము చేయించవలెను.

గ్రహాణాం నవధాన్యాని
సద్విప్రాయ నివేదయేత్,
గ్రహదోషం నిహంత్యాశు
గార్గేయవచనం తథా.

గ్రహదోషము తొలగిపోవుటకు ఆ యా గ్రహాలకు చెప్పబడిన నవధాన్యాలను బ్రాహ్మణులకు దానమీయవలెను. దీనివలన గ్రహదోషం తొలగిపోతుంది అని గార్గేయ మహర్షి చెప్పెను.

## నవగ్రహదానములు

1. సూర్యునికి గోధుమలు, కెంపు. 2. చంద్రునికి బియ్యము, ముత్యము. 3. కుజునకు కందులు, పగడము. 4. బుధునకు పెసలు, మరకతము. 5. గురువునకు శనగలు, పుష్యరాగము. 6. శుక్రునకు బొబ్బర్లు, వజ్రము. 7. శనికి నువ్వులు, నీలం. 8. రాహువునకు మినుములు, గోమేధికము. 9. కేతువునకు ఉలవలు, వైడూర్యము.

## నవగ్రహ హోమము

సూర్యునికి జిల్లేడు సమిధలతోను, చంద్రునికి మోదుగ, కుజునకు చండ్ర, బుధునకు ఉత్తరేణి, గురువునకు రావి శుక్రునకు మేడి, శనికి జమ్మి, రాహువుకు గరికి, కేతువునకు దర్భలు తోను, త్రిమధువులతోను హోమము చేయవలెను. (త్రిమధువులు అనగా పాలు, పంచదార, తేనె)



పూర్వజన్మ కృతం పాపం
వ్యాధిరూపేణ బాధతే,
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జప
హోమ అర్చనాదిభిః.

పూర్వజన్మలో చేసిన పాపం ఈజన్మలో వ్యాధి రూపములో బాధించును. కావున ఆ దోషము తొలగుటకై (శాంతికి) ఔషధ సేవ, దానము, జపము, హోమము, భగవదారాధన చేసుకోవలెను.

ఇంకా సర్వకార్యసిద్ధికి మనోవాంచలు తీరుటకు వ్యాసభగవానునిచే రచింపబడిన ఈ నవగ్రహస్తోత్రమును ప్రతినిత్యం పారాయణ చేయవలెను.

జపాకుసుమ సంకాశం
కాశ్యపేయం మహాద్యుతిమ్,
తమోరిం సర్వపాపఘ్నం
ప్రణతోఽస్మి దివాకరమ్.

దధిశంఖ తుషారాభం
క్షీరార్ణవ సముద్భవమ్,
నమామి శశినం సోమం
శంభోర్మకుటభూషణమ్.

ధరణీగర్భ సంభూతం
విద్యుత్కాంతి సమప్రభమ్,
కుమారం శక్తిహస్తం చ
మంగళం ప్రణమామ్యహమ్.

ప్రియంగుకళికా శ్యామం
రూపేణాప్రతిమం బుధమ్,
సౌమ్యంసత్త్వగుణోపేతం
తం బుధం ప్రణమామ్యహమ్.
దేవానాం చ ఋషీణాం చ
గురుం కాంచనసన్నిభమ్,
బుద్ధిమంతం త్రిలోకేశం
తం నమామి బృహస్పతిమ్.
హిమకుంద మృణాలాభం
దైత్యానాం పరమం గురుమ్
సర్వశాస్త్ర ప్రవక్తారం
భార్గవం ప్రణామామ్యహమ్.
నీలాంజన సమాభాసం
రవిపుత్రం యమాగ్రజమ్,
ఛాయామార్తాండ సంభూతం
తంనమామి శనైశ్చరమ్.
అర్ధకాయం మహావీరం
చంద్రాదిత్య విమర్దనం।
సింహికాగర్భసంభూతం
తం రాహుం ప్రణమామ్యహమ్.
పలాశపుష్ప సంకాశం
రకాగ్రహ మస్తకమ్,
రౌద్రం రుద్రాత్మకం ఘోరం
తం కేతుం ప్రణమామ్యహమ్.
ఇతి వ్యాసముఖోద్గీతం
యః పఠే త్సుసమాహితః,
దివా వా యదివా రాత్రౌ
విఘ్నశాంతి ర్భవిష్యతి.
నరనారీనృపాణాం చ
భవేద్దుస్స్వప్న నాశనమ్,
ఐశ్వర్య మతులం తేషా
మారోగ్యం పుష్టివర్ధనమ్.
గ్రహనక్షత్రజాః పీడా
స్తస్కరాగ్ని సముద్భవా,
తా స్సర్వాః ప్రశమం యాంతి
వ్యాసో బ్రూతే న సంశయః.

## 9. అష్టదిక్పాలకులు

1. తూర్పు దిక్కునకు అధిపతి ఇంద్రుడు. ఇతడు దేవతలందరికీ రాజు. ఇంద్రునికి శచీదేవి అనేభార్య, జయంతుడు అనే కుమారుడు, జయంతి అనే కుమార్తె కలరు.

ఐరావతము అను పేరుగల తెల్లని ఏనుగు ఇతని వాహనము. ఆయుధము పేరు వజ్రా యుధము. పట్టణము అమరావతి. ఇతడు మేఘములకు అధిపతియైన కారణమున సకా లంలో వర్షములు కురిసి పంటలు పండుటకు, సస్యసమృద్ధికి ఇతనిని పూజించవలెను.

2. ఆగ్నేయ దిక్కునకు అధిపతి అగ్ని. ఇతనికి స్వాహా, స్వధా అను ఇద్దరు భార్యలు కలరు. స్వాహాదేవి వలన అగ్నికి పావక, పవమాన శుచి అను ముగ్గురు కుమారులు. స్వధాదేవి వలన కార్తికేయుడు, స్వారోచిష మనువు అను ఇద్దరు కుమారులు కలిగిరి.

వాహనము మేక. ఆయుధము శక్తి. పట్టణము తేజోవతి. దేవతలకు హవ్య కవ్య ములను చేర్చువాడగుటచే ఇతనికి హవ్యవా హనుడు అనుపేరుగలదు. ఇతనిని పూజిం చుట వలన ఆరోగ్యము, సంపత్తి కలుగును.

3. దక్షిణ దిక్కునకు అధిపతి యముడు. ఇతనికి జమున అనుభార్య యమున, తపతి అను సోదరీమణులు కలరు. మరొక పురాణములో యమునకు ధూమోర్ల, విజయ అను ఇద్దరు భార్యలు కలరు.

వాహనము దున్నపోతు. ఆయుధము దండము. పట్టణము సంయమినీ. అపమృ త్యుభయం లేకుండుటకై ఇతనిని పూజించ వలెను.

4. పశ్చిమ దిక్కునకు అధిపతి వరు ణుడు. ఇతనికి దేవి, వర్ణశ, చర్షణి అను ముగ్గురు భార్యలు, కలరు. దేవి వలన బల, వంది అను పుత్రులు, సుర అనుపుత్రిక, వర్ణశ వలన శతాయుధ అనుపుత్రుడు, చర్షణివలన భృగుమహర్షి జన్మించిరి.

వాహనము మొసలి, ఆయుధము పాశము, పట్టణము రక్షోమతి, దేశంలో సకాలంలో వర్షములు కురియుటకు వరు ణుని పూజించవలెను.

5. నైరుతిదిక్కునకు అధిపతి నిర్ఋతి. ఇతడు రాక్షసులందరికీ అధిపతి. భార్య వ్యోమవతి.(దీర్ఘావతి)

వాహనము మనిషి. ఆయుధము. ఖడ్గము, పట్టణము సింధుమతి. మానవులకు గల అరిషడ్వర్గములు అదుపులోనుండుటకు ఇతనిని పూజించవలెను.

6. వాయువ్య దిక్కునకు అధిపతి వాయువు. ఇతడు విరాట్ పురుషునియొక్క ప్రాణమునుండి ఉద్భవిం చెను. ఇతనికి మరీచిక అను భార్య కలదు. అంజనాదేవి వలన తన అంశతో హనుమంతుని కుంతీదేవి వలన భీముని పుత్రులుగా పొందెను.

వాహనము లేడి, ఆయుధము అంకు శము, పట్టణము గంధర్వ పట్టణము. ఇతనిని పూజించుటవలన ప్రకృతి సిద్ధమయిన అను కూల వాయువులు వీచి ప్రజలు క్షేమమును పొందుదురు.

7. ఉత్తరదిక్కునకు అధిపతి కుబేరుడు. ధనమునకు అధిపతి (పద్మ, మహాపద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద, నీల వర్చస్సు అను నవనిధులకు అధిపతి). ఇతనికి భద్ర అనుభార్య నలకూబరుడు, మణిగ్రీవుడు, అను కుమారులు కలరు.

వాహనము ఉచ్చైశ్రవమను గుఱ్ఱము. ఆయుధము గద. పట్టణము అలకాపురి. (అవంతికా పట్టణము). ఇతనిని పూజిం చుటవలన ధన కనక వస్తు వాహనములు లభించును.

8. ఈశాన్యదిక్కునకు అధిపతి శివుడు. ఇతనికి పార్వతి, గంగ అను భార్యలు, గణేశ, కుమారస్వామి అను కుమారులు గలరు.

వాహనము నంది, ఆయుధము త్రిశూ లము, పట్టణము కైలాసపురి (యశోవతీ పట్టణము). ఇతనిని పూజించుట వలన వ్యాధులు, అకాలమరణము లేక సుఖంగా ఉందురు.

---ఇంద్రాగ్నియమనిరృతి వరుణ వాయుకుబేర ఈశానాద్యష్టదిక్పాలక దేవ తాభ్యో నమః. అని దేవాలయ ఉత్సవా దులలో వీరిని ఆరాధించుదురు.

(29వ పేజీలో)




నిర్వహణ: ఎల్లోరా

ప్రశ్న:–
యజ్ఞ పశువును చంపడం జీవహింస కాదా? వేదాలు అంగీకరించాయా?

– బి. శ్యామసుందర్, మదరాసు.

**సమాధానం :**

యజ్ఞంలో జంతువులను చంపడం అన్న కర్మకాండను – ఆనాటి ధర్మాలూ, ఆచారాలు, మత నమ్మకాలనుబట్టి జరిపేవారు. వాస్తవానికి అది వేదవిహితమైన కర్మే!

మొట్టమొదట్లో గొర్రె, ఎద్దు, ఆవు, చివరకు మనిషినికూడా యజ్ఞ పశువుగా నిలిపేవారు ఆవాహనం చేసేవారు. చివరకు మేకను సంప్రదాయంగా వధించడం జరిగింది.

ఒకనాటి ఆచారాల మంచి చెడ్డలను ప్రస్తుతం చర్చించి ప్రయోజనం లేదు – అది గత జలసేతు బంధనంలాటిది.

కానైతే, ఇక్కడ మనం ఆలోచించవలసింది ఒకటుంది.

వైదిక ప్రపంచంలో – వైదిక కర్మానుష్ఠానంలో – వైదిక కర్మధర్మ ఆచరణంలో సైతం అనేక సంస్కరణలు ప్రవేశించాయి.

మీకూ తెలిసేవుంటుంది రామానుజాచార్యులు వైదిక యజ్ఞాన్ని రమారమీ రద్దు చేశారు.

మధ్వాచార్యులు పశు జీవహింసను రద్దు చేసి, ప్రతిగా – పిండితో చేసిన పశువును ప్రవేశపెట్టారు.

ఏది ఏమైనా – ప్రస్తుతం పశుహింస స్థానంలో ఆవాహనం పిండి చేరింది.

కనుక "హింస" లేనట్లే; దేశకాల పరిస్థితుల్నిబట్టి ఆచార వ్యవహారాలు మారుతూ వుంటాయనే సత్యాన్ని మనం గ్రహించవలసి వుంటుంది.

ప్రశ్న:
వేదాలకు ఎన్నిపేర్లు వున్నాయి. అవి ఏమిటి?

– కె. రామకృష్ణ, గుడివాడ.

**సమాధానం :**

వేదాలకు తొమ్మిదిపేర్లు వున్నాయి. 1 శ్రుతి, 2. అనుశ్రవం, 3. త్రయి, 4. ఆమ్నాయం, 5. సమామ్నాయం, 6. ఛన్దం, 7. స్వాధ్యాయం, 8. ఆగమ్మం, 9.. నిగమం అని.

> పాఠకుల ప్రశ్నలకు ప్రముఖ పండితులు, కవి, పత్రికారచయిత శ్రీ ఎల్లోరా సమాధానాలు ఇచ్చారు. ప్రతినెలా ఈ శీర్షికను వీరే నిర్వహిస్తారు.

ప్రశ్న:
వేదాలు – కాలనిర్ణయం వివరిస్తారా?

– ఎ. సుందరమూర్తి, రొంపిచెర్ల.

**సమాధానం :**

మనం, మనతరాలవారి రచనల కాలనిర్ణయం చేయడం సులభం. అయితే వేదాలవంటి శ్రుతుల గురించి, ఆగమాలగురించీ కాలనిర్ణయం చేయడం సాధ్యమయేపనికాదు.

భగవంతుని నిశ్వాసరూపాలైన వేదాలకు కాలనిర్ణయం చేయడానికి ప్రయత్నించడం జరిగే పనికాదు.

అందుకే వైదికుల అభిప్రాయంతో "వేదాలు అనాదులు అనంతాలు నిత్యాలు" అని; పాశ్చాత్య పండితులు భారతీయ సాహిత్య వేత్తలు వేదాలకు కాలనిర్ణయం చేయడానికి కొంతకృషి చేసినమాట వాస్తవం.

మాక్స్ ముల్లర్ మహాశయుడు క్రీ॥పూ 1200 సం॥లకు ముందు వేదాలు వెలుగొందాయని అభిప్రాయపడ్డాడు. మరి కొందరేమో 3,000 – సం॥కు ముందన్నారు.

బాలగంగాధర తిలక్ క్రీ॥పూ 4,000 – ముందే వేదాలు ఏర్పడినట్లు అభిప్రాయపడ్డాడు.

పావగీ పండితుడు క్రీ॥శ పూ॥ 7,000 నాటికే వేదాలు ప్రచారంలో వున్నట్లు ఊహించాడు.

అవినాశచంద్రదాసు క్రీ॥పూ 25,000 సం॥నుంచి 75,000 సం॥ మధ్య వేదనిర్మాణ నిక్షిప్త కాలమని నిర్ధారించాడు.

ఇక్కడ గమనించవలసిన విషయం – సంప్రదాయవిదులు, సనాతన ధర్మపరాయణులు పై నిర్ణయాలతో ఏకీభవించడంగాని అంగీకరించడంగాని జరుగలేదు. వీరు దేశానికీ కాలానికీ ప్రాముఖ్య మివ్వరు.

మరివారి దృష్టిలో ఇవి ఒకప్పుడు ఏర్పడ్డవే కావు.

నిత్యమూ సత్యమూ, నిత్య నూతన భావమూ ప్రబోధమైన శబ్ద సుందరమైన మంత్రధ్వని ప్రధానమైన శబ్దరాశి ఇది.

వేదాలలో – ఆ యా శాఖలలోని భాష, భావ, సందేశాలను ఆధారంగా పెట్టుకుని ఈకాల నిర్ణయాలు చేసి ఉండవచ్చు. ఎన్నిశాఖలు వెలువడ్డాయి? ఏ ఏ శాఖలో ఎలాటి మార్పులు సంభవించాయి? అనేదానికి సమాధానం దొరకదు!

ఇటువంటి అనంతమైన వేదరాశికి కాలనిర్ణయం చేయడం సాధ్యమంటారా?

# శ్రీ వేణుగోపాలస్వామి ఆలయము - రాజమండ్రి



దేవాలయములు ఆధ్యాత్మిక చైతన్య ప్రతీకలు. మానవుని మనసును పవిత్రంచేసి దైవోన్ముఖుని చేసే ఆధ్యాత్మిక నిలయాలు. ఒక్కొక్క నగరమునకు ఒక్కో క్షేత్ర పాలకుడుంటాడు. రాజమహేంద్రికి క్షేత్రపాలకుడు శ్రీ వేణుగోపాలస్వామి.

తూర్పున కభిముఖుడై వేణువు నూదుచు, త్రిభంగిలలితుడై సాల్గ్రామ శిలా మాల ధరించి మందస్మేరముఖాంబుజముతో భక్తజనమనోహరుడై కొలువున్న స్వామిని గూర్చిన పౌరాణిక గాథలనేకం వున్నాయి.

వశిష్ఠమహర్షి పుత్రుడైన పరాశరుడికి, దాశరాజుచేత పెంచబడిన సత్యవతికి వ్యాస మహర్షి జన్మించెను. పుట్టినవెంటనే మహర్షి తపోదీక్షకై అడవికివెళ్ళగా పుత్ర వియోగ దుఃఖాన్ని భరించలేని పరాశర మహర్షి గోదా వరితీరాన ఉన్న శ్వేతగిరిని చేరి తపస్సుచేసి వేణుగోపాలుని ప్రతిష్ఠచేసి దుఃఖమును పోగొ ట్టుగొనెనని ఒకగాథ గలదు.

గోపవేషమునగల గోవిందుడిచటనే గోవర్ధన పర్వతంతో బాటుగా ప్రతిష్ఠించబడినా డని, మహాప్రళయ సమయానగూడా ఈ గోవిందుడిచటనే నివశించినాడని ఒక గాథ ప్రచారంలో ఉంది.

వ్యాసమహర్షి తనయుడైన శుకమహర్షి ఇక్కడ స్వామి అనుగ్రహం పొంది శ్రీ మహా భాగవతమునకు కర్త అయినట్లుగా కూడ స్థల పురాణం ఉంది. ఇచట వేంచేసి యున్న శ్రీరుక్మిణి సత్యభామ సమేత శ్రీ వేణుగోపా లస్వామి ఆలయము దివ్యక్షేత్రమైనది. మూల విరాట్టు 13వ శతాబ్దమునాటిదని దరిమిలా 17వ శతాబ్దంలో మహమ్మదీయుల దండ యాత్రలో అల్లాఉద్దీన్‌ఖిల్జీ సేనాధిపతియైన రుస్తుం ఖాన్ స్వామి విగ్రహాన్ని పెకిలించి ఆలయమును మశీదుగా మార్పుచేసినారట.

శ్రీమతి కొల్లేపల్లి రత్నావతి

ఆనాటి విగ్రహాన్ని 18వ శతాబ్దంలో ఇపుడున్న దేవాలయాన్ని నిర్మించిన కొచ్చెర్ల కోట జమిందార్లు ప్రతిష్ఠ చేసారని చరిత్ర చెబుతున్నది.

స్వామివారి సన్నిధిలో ఎడమవైపు శ్రీదేవి భూదేవి సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారు కుడివైపు శ్రీలక్ష్మీనృసింహస్వామి, శ్రీలక్ష్మి అమ్మవారు, స్వామికి ఎదురుగ ఆంజనేయ స్వామి, కొంచెం ప్రక్కగ గోదాదేవి అమ్మ



వారు మరియు ఆళ్వారులు వేంచేసి కొలువు తీరియున్నారు. లక్ష్మీదేవి అమ్మవారు (గోదా దేవి) మూలవిరాట్టు ఆలయంలోనే గలదు.

ప్రతిరోజు స్వామివారికి పాలభోగం, బాల భోగం మొదలగు వైష్ణవ సాంప్రదాయం ప్రకారం జరుగు పూజలతోబాటుగా వైఖానసా గమ శాస్త్రంప్రకారం వైశాఖ శుద్ధ ఏకాదశిరో జున స్వామివారి కల్యాణ మహోత్సవములు అత్యంత వైభవోపేతంగా జరుగుతాయి. ధను ర్మాసము నెలరోజులలో. దేవాలయము విశేష పూజలతో భక్తులతో క్రిక్కిరిసి యుంటుంది. ముక్కోటి ఏకాదశి వైకుంఠ ద్వారము తెరచు రోజున వేల సంఖ్యలో భక్తులతో రద్దీగా ఉంటుంది.

ప్రతినెల బహుళ ఏకాదశినాడు స్వామివా రికి లక్ష తులసిపూజ అమ్మవారికి దశ సహస్ర కుంకుమార్చన హోమం, పూర్ణాహూతి, అన్న దానము మొదలగు విశేష కార్య క్రమములన్నీ అత్యంతభక్తి శ్రద్ధలతో జరుగుతాయి.

గుడిలో అడుగుపెట్టినది మొదలు ఎటు చూచినా ఆధ్యాత్మిక భక్తిభావన కల్పించే సన్నివేశాలు, గోడలపై వ్రాయించిన భగవ ద్గీత, విష్ణు సహస్రనామములు మొదలగునవి కన్పిస్తాయి. ✪



# నిత్యోత్సవం



రాగం : ఉదయరవిచంద్రిక.......తాళం : ఝంపె

పల్లవి : ఉదయ రవి బంధుడు తిరువేంకటాధిపుడు
హృదయాన శ్రీలోల కొలువమరినాడు ||

అనుపల్లవి : బంగారు వాకిటిలో సుప్రభాతమ్మునే
బ్రహ్మాది దేవతలు విశ్వరూపము జూడ ||

చరణాలు : కలశాభిషేకాలు ఆకాశగంగతో
కస్తూరి పరిమళ ద్రవ్యాల పూతలు
తేజరిల్లెడు దివ్యతిరునామములతో
తోమాలసేవలో ప్రభవిల్లినాడు ||

కోనేటిరాయనికి నిత్యకళ్యాణములు
కనుల కింపగును పూలంగి సేవలు
వజ్రకవచముతో వేంకటాచలపతి
వేడ్కతో తిరువీధి ఊరేగినాడు ||

ఏకాంత సేవలో పాలారగించి
ఏడుకొండలవాడు పవ్వళించెడు
కరుణతో భక్తులకు శుభములను గూర్చి
తిరుమల క్షేత్రాన నెలకొన్నవాడు ||

— శ్రీ యం. వేణుగోపాలం

చంద్రశేఖర్

# శ్రీ కృష్ణసూరి చరితము

## (శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై ప్రభావము)

శ్రీ యన్.సి.వి. నరసింహాచార్య

శ్రీమత్కృష్ణ సమాహ్వాయ
నమో యామున సూనవే,
యత్కటాక్షైకలక్ష్యాణాం
సులభ శ్శ్రీధర స్సదా.

యామునాచార్య పుత్రులగు శ్రీకృష్ణ సూరి యను పేరుగల పెరియ వాచ్చాన్ పిళ్లై అను ఆచార్యులవారికి నమస్కారములు. వీరి కటాక్ష పాత్రులైనవారికి శ్రీధరుడు ఎప్పుడును సులభుడే.

సకల ద్రావిడామ్నాయ
సార వ్యాఖ్యాన కారిణమ్,
శ్రావణే రోహిణీజాతం
కృష్ణసంజ్ఞ మహం భజే.

నిఖిల ద్రావిడ వేదములకును సార భూత వ్యాఖ్యలు రచించినవారును, శ్రావణ మాసమున రోహిణీ నక్షత్రమునాడు పుట్టిన వారును కృష్ణ నామధేయములును అగు ఆచార్యులను నేను భజింతును.

"రామస్య దక్షిణో బాహుః" అన్నట్లు శ్రీరామభద్రునకు శ్రీలక్ష్మణస్వామి కుడి భుజమైనట్లు శ్రీ నంబిళ్లగారికి దక్షిణ బాహువుగా నుండి వారి యుపన్యాస సుధా సారధారలను ప్రశస్త వ్యాఖ్యాన రూపమున గ్రంథస్థము చేసి భక్తజనులకు మహోపకార మొనర్చిన 'శ్రీ కృష్ణసూరి' యను నామధేయ

ముగల పెరియవాచ్చాన్ పిళ్లై (క్రీ.శ. 116
సర్వజిన్నామ సంవత్సర శ్రావణ (అవ
మాసము కృష్ణాష్టమి రోహిణి ప్రొద్దున చ
దేశమందలి ( తంజావూరు జిల్లా) 'తిరు
యంగుడి' సమీపమున నున్న 'శంగనల్లూ
అను గ్రామమున పురశ్ఛూకులై ( శిరస్సు
వెనుకభాగమునగాక ముందు భాగమందు శి

దరించుదారు) బ్రాహ్మణోత్తములైన యామ
నాచార్యులు నాచ్చియారమ్మ అను పుణ్యద
పతులకు సత్పుత్త్రులై శ్రీకృష్ణాంశరూపు
అవతరించిరి.

పెరియ పెరుమాళ్ (శ్రీరంగనాథుని
ప్రభావమును వర్ణింప నలవియగు నేమొ
గాని పెరియవాచ్చాన్ పిళ్లై ప్రభావమున
వర్ణింపనలవి గాదని పెద్దలందురు. శ్రీ
ష్ణవ సిద్ధాంతము దేశము నాలుగు చెరగు
వ్యాపింప జేసిన ఆచార్యులలో వీరితో తు
తూగువారు మునుపు అవతరింప లేదు; అ
తరింపబోరు - అని నొక్కి చెప్పవచ్చును. ఇ
వీరిని మించినవారు 'న భూతో న భవిష్యతి
అని చెప్పవలెనా? వీరు సద్గుణనిలయు
శిష్యలక్షణమునకు ఆచార్య లక్షణమునకున
ఉత్తమోదాహరణమై వెలుగొందిరి. అజ్ఞ
నాంధ తమసావృతమైయుండిన ఈపృథి
వీరవతరించిన తరువాత "అనుగ్రహముపొం
దిన భూమి" అను పేరుగన్నది. 'గుణై
ర్దాస్య ముపాగతః' అన్నట్లు వీరి గుణములకు
లోనై తలొగ్గని వారులేరు; ఆ దినముల
లోను, ఇప్పుడునులేరు; ఎప్పుడును ఉండ

భగవద్రామానుజులవారి గురు
శ్రీశైలపూర్ణులు (తిరుమలనంబి
శ్రీశైలపూర్ణుల గురువు యాము
నాచార్యులు. ఈ యామును
పుత్రులే వైష్ణవ భక్తాగ్రేసరుడైన కృష్ణ
సూరి. వీరినే పెరియవాచ్చాన్ పి
అనికూడ అంటారు. ఆగష్టు 3
న, కృష్ణసూరి జయంతి సందర్భం
ఈ వ్యాసం ప్రచురితం.

స



# A HEALING TOUCH

## T. T. DEVASTHANAMS INTRODUCES
## SRI BALAJI AROGYAVARAPRASADINI SCHEME

For ages Tirumala the abode of Lord Venkateswara has been a great centre of pilgrimage Thousands of devotees visit the sacred hills every day and offer their solemn prayers to the Lord for their spiritual and physical well-being

Alleviating human suffering has been a part of dedicated efforts of TTD to the mankind TTD already manages a Leprosorium, centre for physically handicapped a poor home and also a central hospital To provide the most advanced medical technology to the needy the TTD has launched another monument a blessing from the Lord by opening Sri Venkateswara Institute of Medical Sciences -- a sophisticated superspeciality centre on the lines of AIIMS of New Delhi & JIPMER of Pondicherry and PGI of Chandigarh Total well being of man is the aim of Sri Venkateswara Institute of Medical Sciences which apart from offering service, training and education in medical sciences also encourages Research and development

The doors to such a state of the art technology should be open to our poor and disabled brethren

With a view to achieving this, Sri Venkateswara Institute of Medical Sciences has introduced a New scheme Balaji Arogyavaraprasadini Scheme To accomplish the goal of proving the sophisticated medical technology to every individual at an affordable rate, we invite the generous co-operation of philanthropists and the general public

### The Scheme in essence:

A donor can make an endowment of Rs 1000 - or multiples thereof / Rs 1 lakh / Rs 5 lakhs / Rs 10 lakhs to T T Devasthanams which will in turn contribute matching grant The entire amount will be deposited in fixed deposit in a nationalised Bank and the interest accrued on it will be utilised for providing free medical services to the poor and the needy

A Chair in Sri Venkateswara Institute of Medical Sciences will be named after the donor who contributes Rs 10 lakhs or above These endowment chairs are purely research oriented

- Donations can be made by any individual / family / company / firms etc
- The name of the donor who endows Rs 5 lakhs or more will be displayed prominently in the Reception hall of the hospital
- The discharge ticket of the benefited patient will carry the name of the donor

### Additional Benefit and facilities :

- Donations to Sri balaji Arogyavaraprasadini Scheme are exempted from Income Tax under 80 (G)
- Paid rooms / Air conditioned rooms will be allotted to family members of the donor in the hospital
- Paid rooms can be named after donors who contribute a sum of Rs 5 lakhs or above
- By paying Rs 5 lakhs and above a donor may sponsor one operation per year
- Donors can sponsor feeding of the In-patients and out-patients They may also sponsor a travel fellowship for the faculty per year

All donations, by D Ds drawn in favour of The Executive Officer T T Devasthanams Tirupati-517 501 (Andhra Pradesh) should reach the Director, Sri Venkateswara Institute of Medical Sciences, Tirupati along with the following particulars

- Name and address along with the latest passport-size photographs of the family members of the donor who contributes Rs 1 lakh or more
- Name and address of the person to whom Income Tax Exemption Certificate is to be issued

The donors are also welcome to offer equipment, vehicles etc to SVIMS or even sponsor health camps in rural areas, if they so desire Further details can be had from

**The Executive Officer**
**T.T. Devasthanams, Tirupati**
**or**
**The Director**
**Sri Venkateswara Institute of Medical Sciences, Tirupati**

**EXECUTIVE OFFICER**

## TIRUMALA TIRUPATI DEVASTHANAMS

# Sri Venkateswara Vanabhivriddhi Scheme

## An Appeal . . .

*He that planteth a tree is the servant of God*
*And Provideth a kindness for many generation*
*And faces that he hath not seen shall bless him*

Sacred Forests of Tirumala are the precious gift of Lord Venkateswara to mankind. With a view to safeguarding its unique yet delicate ecological condition Tirumala Tirupati Devasthanams have introduced a series of exciting schemes called Sri Venkateswara Vanabhivriddhi Schemes. The Schemes seek to provide a rare opportunity to the public for participation in a massive plantation project implemented by the Forest Department of T.T. Devasthanams.

The salient features of Sri Venkateswara Vanabhivriddhi Schemes are.

**VRIKSHA SAMVARDHANAM :** Under this Scheme about one acre of land will be brought under plantation

**Benefits :**

- Plantation will be named after the donor or person of his choice
- Every year free accommodation on 2 ordinary days at Tirumala for 10 years
- One paid special darshan every year for 5 persons for 10 years

**Donation :** Rs 15,000

**VRIKSHA PRASADAM :** The Scheme is proposed for raising 100 fruit and flowering seedling every year

**Benefits :**

- Distribution of one hundred seedlings, both fruit bearing and flowering in the donor's name every year.
- Two days free stay at Tirumala every year on any ordinary days for 10 years.
- One paid special darshan every year for five persons for 10 years.

**Donation :** Rs. 10,000.

**SMARAKA VANALU :** Under this scheme 10 saplings of selected species will be planted in a grove and maintained for five years.

**Benefits :**

- The grove will be named after the donor.
- Every year paid special darshan for five persons for five years

**Donation :** Rs 2,000.

**VANA SAMRAKSHANA BHAGA SWAMYAM :** is proposed to protect and improve the natural forest cover on Tirumala hills

**Benefits :**

- Diplay of the donor's name.
- Paid special darshan for five persons for one year

**Donation :** Rs 1,000.

**ADHYAYANA VANALU :** Plantation and maintenance of a variety of species will be taken up under this scheme in the proposed botonical garden at Tirumala.

**Benefits :**

- Display of donor's name near the plant.

**Donation :** Rs 500.

**VRIKSHA DATTATA :** is a bold scheme featuring adoption and plantation of avenue trees on the ghat road and at Tirumala.

**Benefits :**

- Display of donor's name.

**Donation :** Rs 250

We appeal to all devotees to donate liberally and help us to preserve the priceless forest wealth of Tirmala - The Abode of LORD VENKATESWARA

Please send your donations by Demand draft to the **The Executive Officer, T. T. Devasthanams, TIRUPATI - 517 507.**

**EXECUTIVE OFFICER**

బోరు-అని ధృఢముగా చెప్పవచ్చును. వీరిని పరమకారుణికులు, పరమసాత్త్వికులు, అని ఎల్లవారును ఐకకంఠ్యముతో శ్లాఘించినారు. ఉత్తమ సంస్కారము మూర్తీభవించిన మహానుభావులు వీరు. అతివిశాల గ్రంథములందొక్కచోటగూడ పూర్వాచార్య శ్రీసూక్తులు సదోషములని వీరు దూషించి యుండుట కాంచలేము. తమ సమకాలిక విద్వాంసులను గాని, వారి గ్రంథములను గాని దూషించెడు చెడుతలంపు వీరిలో లేదు.

"ఆళ్వారులందరును పెరియాళ్వార్ (విష్ణుచిత్తులు) వంటివారో కారు" అని పిళ్లై లోకాచార్యులవారు పలికినారు. 'అందరాచార్యులవంటివారు కారు పెరియవాచ్చాన్ పిళ్లై (కృష్ణసూరి)" అని పెద్దల సుద్ది. రహస్యతత్త్వార్థములకు సంక్షేమనిధియై యుండినవారు తిరుక్కోట్టియూర్ నంబి (గోష్ఠీపూర్ణులు). తిరువాయ్ మొళి (శ్రీముఖసూక్తి) శఠకోపసహస్రము) ప్రబంధమును చక్కగ వివరింపగల అర్హతగలవారు తిరుమాలై యాండాన్ (మాలాధరస్వామి) శ్రీరామాయణ రహస్యార్థములు తెలిసికొనుటకై పెరియ తిరుమలనంబి (శ్రీశైలపూర్ణుల)వద్ద ఒక ఏడాది శుశ్రూష చేయవలెను, ఈ ఆచార్యత్రయము లేకున్న శ్రీవైష్ణవసిద్ధాంతమునకు ఇంతటి మనుగడయు నిలుకడయు నుండెడిది కాదు. ఈ మూర్తిత్రయమునుండి రహస్యతత్త్వార్థములు తేట తెల్లముగా తెలిసి హృదయమందు పదిలపరచుకొని అనేక సహస్ర సంఖ్యాకులగు శిష్యులకు ఉపదేశించుటయే కాక, తమకు తరువాతి వాడైన శ్రీవైష్ణవులరసి యుజ్జీవింపగల్గునట్లుగ దివ్యప్రబంధములు, శ్రీరామాయణ విశిష్ట శ్లోకములు, రహస్యగ్రంథములు, స్తోత్రములు, గద్యములు మున్నగు ఎన్నో శ్రీకోశములకు తేనె సోనలు వారెడి వ్యాఖ్యలు వ్రాసి ఆబాలగోపాలము పిన్నలు, పెద్దలు అను భేదము లేక అందరు తెలియులాగున చేసిన ఆచార్యులు వీరుగాక వేరెవ్వరు గలరు? ప్రబంధపాశురములకు (పద్యములు లేదా పాటలు) రసతుందిలమగు వ్యాఖ్యవ్రాసి వానిని దివ్య రమ్య భోగ్య ప్రబంధములు గావించిన గొప్పదనము వేరగు ఆచార్యు లెవ్వరికి దక్కును? వీరివ్యాఖ్యలందలి సుధారసమును చుబ్బన చూరగా చవిగొనెడువారు 'మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు,' 'స్థితే౽రవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురసం హి వీక్షతే' అన్నట్లు ఈ సారస్యము తప్ప సారస్యాం తరమును కోరక వీరి వాగమృతము నానుచు ఆనందనిర్భరులై అందే యుందురు. నాలాయిర (నాలుగువేల పాటల) దివ్యప్రబంధములకుకూడ వ్యాఖ్య వ్రాసినవారు వీరొక్కరే. ఇతరాచార్యులు చెదురుమదురుగా కొన్నిటికే వ్యాఖ్యరచించిరి. విశిష్టాద్వైతదర్శనమునకు మూలాధారభూతులైన ఆళ్వారుల ద్రావిడవేదములకు శ్లాఘ్యములైన ప్రబంధగూఢార్థములరయుటకు వీరు ప్రసాదించిన అమృతాధిక మాధుర్య సంభృతములైన వీరి వ్యాఖ్యలే తప్ప గత్యంతరము లేదు. అను విషయమును తటస్థులైన మతాంతరస్థులు సయితము తెలుపుచున్నారు. ఆళ్వార్ ఆచార్యుల వైభవప్రతిపాదక గ్రంథమునందు "విశిష్టాద్వైత సిద్ధాంతమున వర్తించువారికి 'తిరుప్పల్లాండు మున్నగు దివ్యప్రబంధములే తప్ప మార్గాంతరము లేదు. పూర్వాచార్య సంప్రదాయ పరంపరామూలముగ వచ్చిన దివ్యప్రబంధభవ్యార్థములను తెలియుటకు శ్రీకృష్ణసూరి రచించి ప్రసాదించిన వ్యాఖ్యానములు తప్ప సత్ఫలితము నిచ్చు సద్వ్యాఖ్య వేరొండు లేదు. కాన శ్రీవైష్ణవులు ఎల్లరును పెరియవాచ్చాన్ పిళ్లై సంబంధమును పొంది వారికి శిష్యకోటులై యుందురు, అని నుడువబడినది. వీరి దివ్యప్రబంధవ్యాఖ్యలు 'కాలక్షేపము ' (గురుముఖతః నేర్చుట) చేయని శ్రీవైష్ణవులే లేరు - అని చెప్పవచ్చును. అట్టివారున్నచో 'నిందిత స్స భవేల్లోకే స్వాత్మా ప్యేనం విగర్హతే' అనెడు కోవకు చెందినవా రగుదురు వారు.

వీరికి 'అభయప్రదరాజు' అనెడు బిరుద నామము వీరి వ్యాఖ్యానములు ఆలకించిన శ్రీరంగనాథునిచే అనుగ్రహింపబడినది. ఆళ్వారుల ప్రబంధములను, వానికి వీరు రచించిన వ్యాఖ్యలను ఆకర్ణించుటకేకదా నేటికిని "తిరుమొళిత్తిరునాళ్" (శ్రీసూక్తి తిరునాళ్ల) అయిన అధ్యయనోత్సవము శ్రీవైష్ణవ దేవాలయములందు అనుస్యూతముగా అనుష్ఠింపబడుచున్నది. శ్రీరామాయణవిశేషార్థములను 'తనిశ్లోక వ్యాఖ్య ' ద్వారముగాను, రామ చరమ శ్లోక వ్యాఖ్యా రహస్యమును ' అభయప్రదానసార'మను గ్రంథము మూలమునను దివ్య ప్రబంధవ్యాఖ్యలందు పేర్కొన్న పెక్కు శ్లోకము లుద్ధరించి వానికి విస్తృతవివరణ సలుపుట మూలమునను పలు తత్త్వార్థములను ప్రకాశపరచిన ఈ మహాచార్యులు 'శ్రీరామాయణ ప్పెరుక్కర్ '(శ్రీరామాయణమును పెంచినవారు గొప్పచేసినవారు)అనిప్రఖ్యాతి వడసిరి. వానిని చదివిన మతాంతరస్థులుగూడ, వీరు 'వాల్మీకి హృదయాంతర ప్రతిష్ఠితుడగు అంతరాత్మయో, లేక వాల్మీకి యపరావతారమో యని భావించి ఆశ్చర్యచకితులైనారు.

మతాంతరస్థులగు శ్రీభట్టభాస్కరులు, శ్రీవిద్యారణ్యులు వేదభాష్యములను అతివిపులముగా వ్రాసి కీర్తి నుపార్జించిన వారే. అయినను ఆ భాష్యములు శ్రీకృష్ణసూరి వ్యాఖ్యలముందు పగటి దివిటీల వలె కాంతి తరిగి యుండును. ఆవేద భాష్యములు కట్టలు కట్టలుగా నున్నను పలానా విషయములను ప్రతిపాదించుచున్న వని తెలియ దుర్బోధములై యున్నవి. మూలగ్రంథమందు రసమున్ననేగదా వ్యాఖ్యలందు రసము కానవగును. నిరుపయోగవిస్తారములైన కర్మకాండలు కర్మనిష్ఠాతులకు కూడ ఉపయోగపడనివైయున్నవి. భగవద్గుణప్రశంస యున్నది యెచ్చోటను అణుమాత్రమైన అందు కానరాదు. భగవద్గుణానుభవరసికులకు వానితో ప్రయోజనమేమి? అట్లుగాక ద్రావిడవేదభాష్యకారులైన కృష్ణసూరి సూక్తి యొక్కొక్కటియు, భగవద్గుణానుభవశూన్యముగా ప్రొద్దుపుచ్చుటే యెరుగని మోక్షార్థులకు అమోఘ రసాయనమై యుండును.

ఇతరాచార్యులు సంస్కృతభాషయందో సంస్కృతవాక్య సందృబ్ధములైన కఠిన

దుర్భోధ తమిళభాషయందో గ్రంథములను వ్యాఖ్యానములను రచించినారు. వ్యాఖ్యానములులేక వాని భావము తెలియుట దుర్ఘటము. ఈ మహాచార్యులు వేదభాషావ్యుత్పన్నులై యుండియు 'జ్ఞానహీన పామరజనులు కూడ అరుదగు వేదార్థములను తెలిసి ఉజ్జీవింపవలెను.' అనెడు వాత్సల్యము పొంగెడు ఆసక్తివలన 'సంస్కృతమునందు గ్రంథము వ్రాయను' అను వ్రతము పూని ముత్తెములు పవడములు బోలు సంస్కృత ద్రావిడ పదములు కలబోసిన 'మణిప్రవాళ' భాషలో సుబోధ మృదులశైలిలో హృదయము కరగించు వాక్యరత్నములు పొదిగిన వ్యాఖ్యారత్నమాలలను కరుణావృష్టిగా కురియించిరి. తదితరాచార్యులలో పలువురు తొమ్మిది పది గ్రంథములకు పైబడి మన కివ్వలేదు. మరి వీరో వందలకొలది గ్రంథములు రచించినట్లుగ ప్రసిద్ధియున్నది. వీనిలో పెక్కు మన అజాగ్రత్త వలన మరుగునపడినవి. అయినను, మన భాగ్యవిశేషమువలన, ఇప్పటికిని అరువదికి పైబడిన గ్రంథములు లభించుచున్నవి. వీనిన్నిటిని అధ్యయనము చేసి తెలిసి యానందించుటకు ఒక పురుషాయుషము చాలదు.

పెరియ పెరుమాళ్ (శ్రీరంగనాథులు), పెరియాళ్వార్, (విష్ణుచిత్తులు), పెరియవాచ్చాన్ పిళ్లై (శ్రీకృష్ణసూరి), పెరియ జీయ్యరు (మణవాళమహా మునులు) అని వ్యవహరింపబడు పలువురు మహాపురుషులు విశిష్టాద్వైతవేదాంత దివ్య మండపమునకు ఆధారస్తంభ చతుష్టయముగా బేర్కొన దగినవారు వీరు తమ తమ మహిమచేత 'పెరియ' (పెద్ద)అను బిరుదు వహించి యశము నార్జించినారు.

పెక్కు మహిమలు గల కృష్ణసూరి ప్రభావము తెలిసిన ప్రాచీనులు--

వ్యాసో వల్మీకజన్మా వా
గరుడః కృష్ణ ఏవ వా,
బుద్ధై రితి వితర్క్యాయ
శ్రీకృష్ణాయాస్తు మంగళమ్.

అని శ్లాఘించి యున్నారు. దేవభాషా మయు వేదములను అసంకీర్ణముగా వింగడించి చిక్కులు తీసి సూత్రముల తోడ వాని యర్థములను వివరించిన శ్రీ కృష్ణ ద్వైపాయనులే (వేదవ్యాసులే) ద్రావిడ వేదభావముల వివరింప శ్రీ కృష్ణసూరియై యవతరించినారో? లేక, ఆదికావ్యముగాను, వేదోపబృంహణముగాను విరాజిల్లెడు శ్రీరామాయణమును గానము చేసిన వాల్మీకి మహర్షియే తన హృదయమునందు పదిలముగా నుండిన భావములను ప్రకాశింపజేయ 'అభయ ప్రద రాజు'గా అవతరించిరో? లేదా, వేదాత్మయు, విహగేశ్వరుడును అగు గరుత్మంతుడే రహస్యార్థముల మహిమ తెలియ జేయుటకై పెరియ వాచ్చాన్ పిళ్లైగా దివినుండి భువికి దిగి వచ్చినాడో? అట్లుగాక పూర్ణావతారమైన శ్రీ కృష్ణ భగవానుడే, ఉపనిషద్రూపమగు క్షీరాబ్ధిని త్రచ్చి గీతామృతమును ప్రసాదించి యుపకారమొనర్చిన రీతిగ, చరమశ్లోకార్థ వివరణ యొనర్చి ప్రపత్తి (శరణాగతి) వైశిష్ట్యమును ప్రతిపాదించియు, ఆళ్వారుల దివ్య ప్రబంధ సుధాసాగరము మథించి ద్రావిడ వేదభాష్యములనెడు, ఎంత చవిచూచినను తనివి తీరని యమృతమును భూలోకమున కిచ్చియు వెలుగొందుటకై తన జన్మదినమగు శ్రీజయంతి (కృష్ణాష్టమి) నాడు కృష్ణుడు అను నామధేయముతోడనే యవతార మెత్తినాడో యని బుద్ధిమంతులు తలచి తలచి వీరికి మంగళాశాసనము చేయుచున్నారు.

## అవతార రహస్యము

పెరియతిరు మొళియందు
"మెయ్మ్మైశొల్లిల్ వెణ్ శంగ మొన్దేందియ
కణ్ణా! నిన్ తనక్కు కుఱిప్పాకిల్
కఱ్కలామ్ కవియిన్ పొరుళ్ తానే"

(7-10-10)

(నిజము చెప్పవలె నన్న, తెల్లశంఖము ఒక్కటి చేతబూనిన కృష్ణా! నీకు సమ్మతమైనచో (నానుండి) కావ్య భావములను నేర్వవచ్చును.)

అని తిరుమంగై ఆళ్వారు, (పరకాలుడు) తిరుక్కణ్ణ మంగై అను క్షేత్రస్వామి శ్రీకృష్ణ పరమాత్మ తన తిరుమొళి యందలి భావార్థములను తెలియ ఆశపడుచున్నాడని స్వామి ముఖకవళికలనుబట్టి తెలిసి "నీవు నానుండి కావ్యార్థములను తెలిసికొనుము" అని నియమించిరి. అది విని రసికాగ్రణి శ్రీకృష్ణుడు "మీనుండి తప్పక కావ్యభావములు నేర్చెదను. కాని ఇప్పుడు అర్చావిగ్రహరూపుడనై యున్నందున అది వీలు పడదు. భవిష్యత్తులో ఒకప్పుడు మీరు మీ అవతార (జన్మ) నక్షత్రమైన కార్తిక మాసమందలి కృత్తికానక్షత్రము నాడు మీ నామధేయమగు 'తిరుక్కలి కన్రి దాసుడు' అను పేరుతోడ ఆచోళ దేశమందే అవతరింపగలరు. అప్పుడు నేను ఈచోళ దేశమందే నాడు అవతార (జన్మ) నక్షత్రమైన శ్రావణమాసపు రోహిణీ నక్షత్రమందే కృష్ణుడు (కృష్ణ సూరి) అను పేరుతోడ అవతరించి మిమ్ము ఆచార్యులనుగా గొని ఆళ్వారులందరియొక్క, గోదాదేవియొక్కయు ప్రబంధములందలి భావవిశేషములను, ఇవియేకాక ఇంకను ఉన్న రహస్యార్థములను, శ్రీరామాయణార్థ విశేషములను మీనుండి యే నేర్చి యెరిగి లోకమున ప్రచారము చేసెదను" అని సెలవిచ్చినారు. అదే రీతిగ 'కలికన్రి'యను తిరుమంగై యాళ్వార్ 'తిరుక్కలికన్రిదాసులగు 'నంబిళ్లై'గాను శ్రీకృష్ణ పరమాత్మ శ్రీకృష్ణ నామధేయులైన (శ్రీకృష్ణ సూరి) పెరియ వాచ్చాన్ పిళ్లైగాను అవతరించిరని పెద్దలు వక్కాణింతురు. ఇదియే నంబిళ్లై, పెరియ వాచ్చాన్ పిళ్లైల అవతార రహస్యము.

మహాభారతమును రచించిన వేదవ్యాస మహర్షి, ఆ కారణముచేతనే తన జనకులైన పరాశరమహర్షిచేత నారాయణుని యంశావతారముగా నిర్ణయింపబడినట్లు, ఆ మహాభారతముకంటె శబ్దార్థవైశిష్ట్యములచే గొప్పదైన నాలాయిర ( చతుస్సహస్రీ) దివ్య ప్రబంధ వ్యాఖ్యలను, శ్రీరామాయణ తని శ్లోకిని, రహస్యగ్రంథ వ్యాఖ్యానములను, స్తోత్రగద్య వ్యాఖ్యలను ప్రసాదించిన పెరియవాచ్చాన్ పిళ్లైను మనము శ్రీమన్నారాయణాంశావతారమని నిర్ణయింపదగును.

(సశేషం)



# శ్రీ శ్రీనివాసాయ నమః

శ్రీ వి. కుటుంబరావు



కలియుగ ప్రత్యక్ష దైవము శ్రీ వేంకటే శ్వరస్వామి. పిలిస్తే పలికే దైవము. ఆపద మొక్కులవాడు. వడ్డికాసులవాడు, వేయి నోళ్ళున్న ఆదిశేషుడు.

అది 1980వ సంవత్సరము. నేను మద్రాసులో ఉద్యోగము చేస్తున్న రోజులవి. అప్పుడు మా కుమారునకు 6 సంవత్సరములు. తరచుగా మూర్ఛ వస్తుండేది. ఆ సమయంలో నాకు ఉద్యోగంలో ప్రమోషనుమీద రిషీకేసు భదలీ ఆర్డరు వచ్చింది. నాకు ఏమి చెయ్యాలో తోచలేదు. మా అబ్బాయి ఆరోగ్యం అంత మాత్రంగానే ఉంది. ఇంకా దూరంగా వైద్య సదుపాయంలేని ప్రదేశంలో ఎట్లా ఉండేది అని మనస్సులో పరిపరి విధాల బాధ పడుతున్నాను. మా ఇంట్లో ఒకరూము - ప్రత్యేకంగా దేవుడి రూము ఉండేది. అక్కడ స్వామివారిది పెద్దపటం, ప్రతిరోజు నిత్యపూజ చేస్తుంటాను. ఆరోజు సాయంత్రం 7 గంటలు దాటిన తరువాత స్వామి పటము దగ్గర కూర్చుని, స్వామితో మాట్లాడుతూ కంటి నీరు ధారగా ఏడ్చి, ఏడ్చి, స్పృహలేకుండా అలా 3 గంటలపాటు ఆయన పాదములు దగ్గర నీవే దిక్కు అంటూ, నాకు రిషీకేసు బదిలీ ఆపుచేయించు స్వామి అని వేడుకున్నాను.

తర్వాత రాత్రి 10 గంటలకు స్పృహ వచ్చింది. స్పృహ వచ్చినవెంటనే నాలో చాలా ధైర్యం వచ్చింది. వెంటనే మరుసటి రోజు ఏది ఏమైనాసరే అనుకొని, తిరుపతి వెళ్లి తలనీలాలు సమర్పించి, స్వామి దర్శనము చేసుకొని వచ్చాను. మనస్సు చాలా ప్రశాంతముగా ఉన్నది. అప్పుడు మా పైఅధికారులిద్దరూ నన్ను పిలిచి, "రిషికేశు బదులు, అదే ప్రమేషనమీద మద్రాసు నుండి, నేను కోరుకున్న హైదరాబాదు బదిలీ అయినది" అని చెప్పారు. ఇది కేవలం స్వామి అనుగ్రహం వల్లనే అయినది. సామాన్యంగా గవర్నమెంటులో ఒకసారి ఆర్డరు ఇచ్చిన తర్వాత ఉపసంహరించుకొని, మరల వేరే ఆర్డరు ఇవ్వటమనేది చాలా అరుదు.

ఇటీవల 1991లో నాకు ఉద్యోగ రీత్యా ప్రమోషన్ రావాలి. ప్రమోషన్ జాప్యం అయింది. ఆ ప్రమోషన్ 1990 అక్టోబరు 1 నుంచి రావాలి. మనసులో ఆవేదన. పరే స్వామివారిని మనస్సులో తలచుకొని, స్వామి ఈ రోజునుంచి 15 రోజుల లోపు నాకు ప్రమోషన్ ఆర్డరు మేనేజరుగా వస్తే అక్షరాల నీ మహిమ వల్లవచ్చినట్లే, అదీ రెట్రోస్పెక్టివ్ డేట్ నుంచి రావాలి. అంటే గత 1 సంవత్సరము వెనకనుంచి ఇవ్వాలి. అలా ఇస్తే కచ్చితంగా కానుకలు నీ హుండీలో వేస్తాను అని అనుకున్నాను. స్వామి కరుణామయుడు, పిలిస్తే పలికే దైవము. 15 రోజుల బదులు 7వ రోజున ప్రమోషన్ ఆర్డరు రెట్రోస్పెక్టివ్ డేట్‌తో ఇచ్చారు. స్వామీ! ఈ ప్రమోషన్ నీ కరుణవల్ల వచ్చింది. నేను నిమిత్త మాత్రుణ్ణి, నన్ను సదా మంచి ప్రవర్తనతో, మంచి మార్గంలో, నాచే సక్రమంగా ఉద్యోగపు బాధ్యత నిర్వహించింది నీవే స్వామి. నాలో నీవున్నావు. నాలో ఉన్న నీకు సదా నా కృతజ్ఞతలు. అనుకున్నట్లుగా స్వామి మొక్కు తీర్చుకున్నాను.




అయితే ఒకరోజు నాకు స్వామి దగ్గిర నుండి నేను ఏదో ఒకటి కావాలి అని వేడుకొంటమేగాని, నేనుగా ఏంచేస్తే బాగుంటుంది. నాకు ఉపయోగపడకుండా ఏదన్నా నిస్వార్థ సేవచేసి తరించాలి అని అనిపించింది మనస్సులో. ఒకరోజు మనస్సులో అనుకున్నాను, నా అహంకారాన్ని వదిలి, ప్రతి ఉద్యోగి దగ్గరికి వెళ్ళి, సప్తగిరి మాసపత్రిక కనీసం ఒక 30 మందితో చందా కట్టించాలి అని. అయితే ఆ విషయం కాలక్రమంలో మర్చిపోయాను. ఒక సంవత్సరంపాటు మర్చిపోయాను. ఆరోగ్యం అప్పుడప్పుడు ఇబ్బంది పెడుతొంది. ఒకరోజు కూర్చుని ఆలచిస్తే, అప్పుడు గుర్తుకు వచ్చింది నా నిస్వార్థ సేవ మర్చిపోయానని. వెంటనే అదే రోజున 30 మందితో, ఒకే రోజున సప్తగిరి మాస పత్రికకు చందా కట్టించి డి.డి. పంపాను. అప్పటి నుంచి ఈ రోజు వరకు ఆరోగ్యం చాలా బాగుంది. మనస్సు ప్రశాంతంగా ఉంది.



## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- మాంసాహారాన్ని భుజించకండి.
- ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- పొగత్రాగకండి.
- వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయుటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజే.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే విధైశాతం సద్బిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్‌ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

(20వ పేజీ తరువాయి)

నమ స్త్రిదశనాథాయ
నాశితాశేష విద్విషే,
పులోమజా కుచాంభోజ
సంభోగరసభాషిణే.

నమస్సమస్త భూతానా
మంతర్జ్యోతిః స్వరూపిణే,
బడబాముఖ కాలాగ్ని
మూర్తయే జాతవేదసే.

నమస్సమస్త భూతానాం
ప్రాణ నిర్వాపకారిణే,
యమాయ ధర్మరాజాయ
కాలాయ పరమాత్మనే.

నమస్సమస్త గీర్వాణ
గర్వ నిర్వాపకారిణే,
అశేషాసురనాథాయ
రక్షాధిపతి మూర్తయే.

నమస్సమస్త భూతానాం
ఆధారాధేయ రూపిణే,
మహామాయాబ్ధి సంవర్త
వరుణాయ మహాత్మనే.

నమస్సమస్త భూతానాం
ప్రాణినాం ప్రాణరూపిణే,
నిర్వాణాంబర సంచార
వాయవే పరమాత్మనే.

నమస్తస్మై కుబేరాయ
నిధీశాయ మహాత్మనే,
శివమైత్రేయ జగతాం
మహదైశ్వర్యమూర్తయే.

నమః ప్రమథనాథాయ
కైలాసాచలవాసినే,
స్థిత్యుత్పత్త్యుపసంహార
నిర్దేశాయ చ మూర్తయే.

ఆకాశా త్పతితం తోయం
యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవ నమస్కారః
కేశవం ప్రతి గచ్ఛతి.

## 10. విశ్వే దేవతలు

ఈ విశ్వే దేవతలను గూర్చి బ్రహ్మాండ పురాణములో ఈవిధంగా చెప్పబడినది. పూర్వము దక్షుని పుత్రిక ధర్మదేవునియొక్క పత్ని అయిన విశ్వ యొక్క గర్భమునుండి క్రతు, దక్ష, సత్య, వసు, ధూళి, రోచన పురూరవ, ఆర్ద్రవ, కాల, కామ అను పది మంది పుత్రులు జన్మించిరి. వీరినే విశ్వే దేవతలు అందురు. వీరు పెరిగి పెద్ద అయిన తర్వాత హిమాలయములకు పోయి తపస్సు ప్రారంభించిరి. వీరి ఉగ్ర తప




స్సుకి మెచ్చుకొని పితృదేవతలు, బ్రహ్మ, కూడ ప్రత్యక్షమయి వరముకోరు కోమనగా విశ్వేదేవతలు మాకు పితరులకు పెట్టు శ్రాద్ధములందు భాగము కావలెనని కోరుకొనిరి. వారు అదేవిధముగా వరమునిచ్చిరి. అది మొదలు ఈవిశ్వే దేవతలు శ్రాద్ధభాగమును పొంది శ్రాద్ధమును రక్షించుచు, అన్నాది పదార్థములను పితృదేవతలకు అందించుచూ ఉండిరి. అందువల్లనే పితరులకు పెట్టు శ్రాద్ధములందు విశ్వేదేవతలును ముందుగా ఆరాధించుట జరుగుచున్నది.

శ్రాద్ధము అయిదు రకములు. 1. ఇష్టి :- (యజ్ఞయాగాదులలో చేయునది) 2. నాందీముఖము. (వివాహాది శుభకార్యము లలో చేయునది ఇది అభ్యుదయం కొరకు పితృ దేవతలను ఆహ్వానించి పూజించుట. పితృ దేవతాపూజ అని అందురు) 3. పార్వణము, (ఈ పార్వణశ్రాద్ధమునందు సంకల్ప విధానము కూడ కలదు) 4. నైమిత్తిక. 5. కామ్యక, అనునవి. ఒక్కొక్క శ్రాద్ధమునందు ఇద్దరేసి విశ్వేదేవతలు ఆరాధింపబడుదురు.

ఇష్టి శ్రాద్ధమునందు క్రతు, దక్ష, నాందీ ముఖమునందు సత్య, వసు, కామ్యకశ్రాద్ధమునందు ధూళి, రోచన. పార్వణ శ్రాద్ధమునందు పురూరవ, ఆర్ద్రవ, నైమిత్తిక శ్రాద్ధమునందు కాల, కామ అను విశ్వే దేవతల యొక్క అర్చనాదులు జరుగును.

ఈ విశ్వే దేవతలయొక్క సహాయముతో పితృపితామహులు శ్రాద్ధములో అర్పించు వస్తువులను గ్రహించి తృప్తిపొందుదురు. కాబట్టి ఈ విశ్వే దేవతలను శ్రాద్ధకాలములో తప్పకపూజించి శ్రాద్ధకర్మను సఫలముచేసుకొనవలెను.

ఓం ఆగచ్ఛంతు మహాభాగా
విశ్వేదేవా మహాబలాః,
యే అత్ర విహితా శ్రాద్ధే
సావధానాః భవన్తు తే.

(కొన్ని గ్రంథములలో ఈ విశ్వేదేవతలు 13 మంది అనిచెప్పబడినది. పైనచెప్పిన 10 మందికాక ఇంకా హేమశ్రాద్ధములో ధను రుచి అను విశ్వేదేవత ఏకోదిష్టంలో రుద్ర అను విశ్వేదేవత, ఇంకొక శ్రాద్ధక్రమములో విలోచన అను విశ్వేదేవత పూజింపబడుదురు.)

ఈవిశ్వేదేవతల గురించి బ్రహ్మాండ పురాణము, చతుర్వర్గచింతామణి అను గ్రంథము లలో వివరముగా తెలుపబడినది.

## 11. వాస్తుదేవత

వాస్తువనగా భూమి, నివాసస్థానము అని అర్థము. కావున ఈభూమిపై నివాసార్థమై నిర్మించు వివిధ కట్టడములకు వాస్తు పురుషుడే అధిపతిగా ఉండును. వాస్తు

బ్రహ్మగా పేర్కొనబడే ఈవాస్తుపురుషుని గురించి మత్స్య పురాణములో ఈవిధ ముగా చెప్పబడినది.

పూర్వము అంధకాసురుని సంహరించు టకు శివుడు అతనితో ఘోర యుద్ధముచేసి అలసిపోయెను. ఆ సమయంలో శంకరుని యొక్క లలాటమునుండి ఒకస్వేదబిందువు భూమిపై పడెను. అందుండి భయంకరమైన ఆకారముగల ఒక పురుషుడు ఉద్భవించెను. అతడు శివునికి అంధకాసురునికి జరుగుచున్న యుద్ధములో రాక్షస సైన్యము యొక్క రక్త మును పీల్చివేసెను. అయినను అతనికి తృప్తి కలుగలేదు. ఆకలితో త్రిలోకాలను భక్షించు టకు ఉద్యుక్తుడయ్యెను. అప్పుడు శంకరుడు అతనిని పట్టుకొని భూమిపై పడవేసెను. ఆ మహాకాయుడట్లే భూమిపై బోర్లాపడెను. మళ్ళీ శంకరునికి అతనిపై జాలి కలిగినది. యుద్ధములో తనకు సహాయముచేసిన ఇత నికి నేను చేయు ప్రత్యుపకారము ఇదా అని చింతించి అతనికి వరమునిచ్చి వాస్తు పురుషునిగా ప్రతిష్ఠించెను. అప్పుడు అతనికి చైతన్యము కలుగుటకు దేవతలందరు తమ తమ అంశలతో అతని శరీరముపై నివసించిరి. అప్పటి నుండి అతనికి వాస్తుపురుషుడు అను పేరు గలిగెను.

దేవతలు అతనికి గృహనిర్మాణము, గృహప్రవేశాదులలోను, యజ్ఞయాగాది కర్మల లోను పూజింపబడునట్లు వరమొసగిరి. అటు లనే నూతనగృహ ప్రవేశాదులలో నిన్ను పూజిం పక, బలిహోమాదులతో నిన్ను తృప్తునిచేయక మందు వారలను బాధలుపెట్టుమని, భక్షిం పుమని చెప్పిరి. అందువల్ల నూతన గృహ ప్రవేశములలో వాస్తుపూజ తప్పనిసరిగా చేసుకోవాలి.

ఈ వాస్తుదేవుని పూజసమయంలో వాస్తు చక్రమువేసి పూజించు ఆచారము గూడ కలదు. ఈవాస్తుచక్రము అనేక విధములు. అందు 49 గడులు మొదలుకొని 1001 గడుల వరకు వివిధ అవసరములకు వివిధ వాస్తు చక్రములు గలవు. ఉదా హరణకు నగరము గ్రామ నిర్మాణములకు 64 గడులు గల వాస్తు చక్రము. గృహ ప్రవేశమునకు 81 గడులు, జీర్ణోద్ధారణకు 49, కళ్యాణ మంటపాదులకు 100. వాపీ, కూప, తటాక, ఉద్యానవన నిర్మాణములకు 116 గడులు గల వాస్తు చక్రమును వేయవ లెను. అందుదేవతలందరినీ ఆవాహన చేసి పూజించవలయును.

"వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్
త్స్వావేశో అనమీ వోభవా వః
యత్వే మహే ప్రతి తన్నో జుషస్వ శం
నో భవ ద్విపదే శం చతుష్పదే."

"హే! వాస్తుదేవ! నిన్ను మనస్ఫూర్తిగా ఆరాధించు మాయొక్క ప్రార్థన మన్నించి, వ్యాధులు, దుష్టపీడల నుంచి మమ్ములను రక్షించు. అలాగే ఈవాస్తు భూమిలో



(నూతన గృహము) నివసించు స్త్రీ పురు షాదులకు, అలాగే వారి అధీనములోనున్న గోఅశ్వాది చతుష్పాద జంతువులకు గూడ శుభములను కలుగజేయుము" అని ఈ వేదమంత్రముయొక్క అర్థము. గృహనిర్మా ణము ఎలా ఉండాలి ? అని తెలిపేది వాస్తుశాస్త్రము.

జ్వలనార్క ప్రతీకాశం
జటామకుట మండితమ్,
బ్రహ్మ శ్రియా విరాజితం
దీప్యమాన ముఖాంబుజమ్.

వాస్తురూప మయం
దేవం జగద్వ్యాప్తచరాచరమ్,
ధ్యాయేత్తం వాస్తుబ్రహ్మాణం
దోషనాశకరం పరమ్.

అని వాస్తు పురుషుని ప్రార్థించవ లెను----

## 12. హయగ్రీవుడు

ఒకసారి విష్ణుమూర్తి దానవులతో యుద్ధ ముచేసి, చేసి, డస్సి ఎక్కుపెట్టబడిన ధన స్సుపై తలపెట్టుకొని నిద్రించుచుండెను. ఇంతలో దేవతలు యజ్ఞముచేసి యజ్ఞభా గములను విష్ణుమూర్తికి అర్పించుటకై వచ్చిరి. కాని నిదురించుచున్న అతనిని లేపుటకు సందేహించు చుండిరి. అపుడు శివుడు ఒక ఉపాయమును చెప్పెను. ధనస్సుయొక్క నారిని త్రెంపి వేసినచో విష్ణుమూర్తి తల కదలి అతనికి తప్పకుండా మెలకువ వచ్చును అని చెప్పెను. ఈపనిచేయుటకు వమ్రి అను ఒక కీటకమును నియమించిరి. ఆ కీటకము వింటి త్రాటిని కొరికి వేసెను. ఎక్కుపెట్టబడి యుండిన ధనస్సుయొక్కనారి త్రుళ్ళి విష్ణు మూర్తి మెడనుండి శిరమును వేరుచేసెను. దానితో దేవతలు భయము నొందిరి. తర్వాత దేవిని స్తుతించి ఆమె ఆనతిప్రకారం గుఱ్ఱము యొక్క తలను తెచ్చి మొండమునకు అతికిం చిరి. విష్ణుమూర్తి అప్పటినుండి హయగ్రీవుడై విద్యలకు అధిపతిగా వెలుగొందుచుండెను.

హయగ్రీవునియొక్క ఉపాసనవల్ల జ్ఞానము వృద్ధియగును. విద్యాలాభము కలుగును. వాక్సిద్ధి, వాగ్ధాటి కలుగుతుంది.

జ్ఞానానందమయం దేవం
నిర్మల స్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం
హయగ్రీవ ముపాస్మహే.

అని హయగ్రీవుని ప్రార్థించాలి.

విశుద్ధ విజ్ఞానఘన స్వరూపం
విజ్ఞాన విశ్రాణన బద్ధ దీక్షమ్,
దయానిధిం దేహభృతాం శరణ్యం
దేవం హయగ్రీవ మహం ప్రపద్యే.

వాగర్థ సిద్ధిహేతోః పఠత
హయగ్రీవ సంస్తుతిం భక్త్యా
కవితార్కిక కేసరిణా వేంకట
నాథేన విరచితా మే తామ్.

## 13. హనుమంతుడు

హనుమా నంజనా సూను
ర్వాయు పుత్రో మహాబలః,
రామేష్టః ఫల్గుణసఖః
పింగాక్షో అమిత విక్రమః.

ఉదధిక్రమణ శ్చైవ
సీతాశోక వినాశనః,
లక్ష్మణ ప్రాణదాతా చ
దశ గ్రీవస్య దర్పహా,
ఏవం ద్వాదశ నామాని
కపీంద్రస్య మహాత్మనః,
స్వాపకాలే పఠే ద్యస్తు
యాత్రాకాలే విశేషతః
తస్య మృత్యుభయం నాస్తి
సర్వత్ర విజయీ భవేత్.

అని ప్రార్థించు హనుమంతునియొక్క చరిత్ర అందరకు తెలిసినదే. సమస్త అమంగళములను తొలగించు భక్త హనుమంతుని చరిత్ర పరమ పవిత్రము కళ్యాణ ప్రదము, ఆదర్శప్రాయమూనైనది.



బ్రహ్మాది పురాణముల ప్రకారము హనుమంతుడు శివ, విష్ణువులయొక్క తేజస్సు వలన జన్మించెను. అందుకే ఇతనికి "వృషాకపి" అనుపేరు గలదు. రామాయణము ప్రకారం త్రేతాయుగంలో ఇతడు అంజనా - కేసరులను దంపతులకు వాయువు యొక్క అంశతో జన్మించెను. అందువల్ల ఇతనికి ఆంజనేయుడు, కేసరీనందనుడు, వాయుపుత్రుడు, పవన సుతుడు అనుపేర్లు కలిగినవి. శ్రీరామునికి సేవచేయుటవలన రామదూత. అర్జునుని రథంపై నిలిచి హుంకారముచేసి శత్రువులను బెదరించుటచేత ఫల్గుణసఖ. గరుత్మంతుని తోసమానవేగము కలిగి శతయోజన విస్తీర్ణ సముద్రమును లంఘించుటచేత ఉదధిక్రమణ, ఎప్పుడూ పరాజయము ఎఱుగని వాడగుటచేత అపరాజిత అనుపేర్లు కలిగినవి. హనుమంతుడు సూర్యుని వద్ద సకలవిద్యలను అభ్యసించెను, నవవ్యాకరణ పండితుడై, సుగ్రీవునికి మంత్రియై వెలుగొందెను.

మంగళవారము హనుమంతునికి ఎంతో ప్రీతికరమైనది. ఆ రోజుననే హనుమంతుడు లంకలోగల సీతనుచూపి, ఆమెకు రాముని వృత్తాంతము తెలిపి సంతోషము కలిగించెను. ఆమె దర్శనముచే తానూ మహదానందమును పొందెను. ఆ కారణంగా ఆ రోజు ఎంతో ప్రీతి అయినది. ఆ రోజున ఆయన ఎంతో ఆనందంగా ఉంటాడు. ఆ రోజున భక్తుల కోర్కెలను తప్పక తీర్చును. గాన హనుమదుపాసన చేయువారు మంగళ వారము నాడు చేయవలెను. ఈ మంగళవారమునకు జయ వారము అనుపేరుకూడ కలదు. హనుమంతుని పూజించుటవలన భూతప్రేత పిశాచాది బాధలు తొలగును. జయము కీర్తి, సంపద, కలుగును. ప్రతి మంగళవారము హనుమంతుని దేవాలయములో దర్శించుకొనుట, హనుమంతుని ప్రీతికొఱకై రామాయణ పారాయణం దండకము స్తోత్రము, కవచము మొదలైనవి పఠించిన సర్వశ్రేయస్సులు కలుగును.

కొన్ని గ్రంథముల ప్రకారం హనుమంతుని జననము ఈవిధముగానున్నది.

బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.



1. చైత్రశుద్ధపూర్ణిమా జయవారము.
2. వైశాఖ బహుళ దశమీ శనివారం.
3. కార్తీక బహుళ చతుర్దశీ ఆదివారం.
4. మార్గశిర శుద్ధ త్రయోదశీ శనివారం.

కానీ పరాశర సంహిత ప్రకారము వైశాఖ బహుళ దశమి శనివారం హనుమంతుని జననం అని తెలియు చున్నది.

వైశాఖమాసం పూర్వభాద్రా నక్షత్రములో ఆంజనేయస్వామివారు జన్మించుట చేత ఆ మాసమంతా పవిత్రమైనది. అందువల్ల ఈ నెలలో చేసిన స్నాన, దాన, జప, తపో నుష్ఠానాలవల్ల హనుమంతుడు ప్రీతిపొంది అనుగ్రహించును.

ప్రతిసంవత్సరం మార్గశిర శుద్ధ త్రయోదశి మొదలుపెట్టి పూర్ణిమతో పూర్తిచేయు నట్లుగా హనుమద్వ్రతం కలదు. ఈవ్రతం విడువకుండా 13 సంవత్సరములు వరుసగా చేయాలి. ఇట్లాచేసి చివర ఉద్యాపనచేసి బ్రాహ్మణ సంతర్పణ చేయాలి. ఇట్లా చేయుటవలన కుబేరునితో సమానమైన ఐశ్వర్యం కలిగి దీర్ఘాయుర్దాయము కలిగి సుఖించును.

ఆంజనేయస్వామికి గంగసింధూరం ఎంతో ప్రీతికరమైనది. గంగసింధూరంతో పూజించినా దానిని విగ్రహానికి లేపనం చేసినా త్వరలో ప్రసన్నులౌతారు. ఒకనాడు అయోధ్యలో రామసేవచేస్తూ రాత్రి పొద్దుపోయే వరకు, ఆంజనేయస్వామి శ్రీరాముని వద్ద శయనాగారంలో ఉంటాడు. సీతామాతవచ్చి ఇంకవెళ్ళు అన్నది. ప్రొద్దుపోయాక శయనమందిరంలో అయ్యగారి వద్ద ఎవ్వరూ వుండకూడదు అనిచెప్పింది. అయితే మీరు ఎందుకు ఉన్నారు? అని మారుతి ప్రశ్నిస్తే ఆమె తనపాపిట నుండి సింధూరం తీసి చూపి "దీనివలన నేను అయ్యగారి దగ్గర ఉండే అధికారం పొందాను." అదివిని తెల్లవారి గంగ సింధూరాన్ని నూనెలో కలిపి శరీరమంతా లేపనం చేసుకొని మారుతి రామదర్బారుకు వస్తాడు. అక్కడ సభికులందరు విచిత్రంగా చూస్తారు. ఇదేమిటని రాముడడిగితే పాపిటలో కొంచెం సింధూరం ఉండటం చేతనే దగ్గర ఎల్లప్పుడూ వుండే అధికారం అమ్మకు కలిగింది. మీసాన్నిధ్యం నాకు నిరంతరం కావాలి. అందుకే ఈ సిందూరాన్ని ఇట్లా శరీరమంతా రాసుకున్నాను. అన్నారు. ఆంజనేయస్వామివారి ఈసమాధానం విని రామచంద్రుడు నవ్వుకొని "హనుమా! నిన్ను ఏ భక్తులు సింధూరంతో నీకిష్టమైన మంగళవారం నాడు పూజిస్తారో, మరియు పూజించిన సింధూరాన్ని ఎవరు ధరిస్తారో వారికోరికలు తీరి, వారికి సమస్త భోగ భాగ్యాలు కలుగుతాయి." అని దీవించారు.

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,

## 14. గరుత్మంతుడు

ఇతడు కశ్యపుని భార్య అయిన వినత యొక్క పుత్రుడు, విష్ణుమూర్తి. ఇతని బలపరాక్రమములను చూసి మెచ్చుకొని తన వాహనముగా చేసుకొనెను. తల్లి దాస్యమును పోగొట్టుటకై ఇంద్రలోకము చేరి అమృతమును తెచ్చెను. తల్లి దాస్యమునకు కారకులైన సర్పములను భక్షించుచు, ఒక మహాపురుషునివల సర్పభక్షణమును వదలి నాగానందం కలిగించెను. దేవాలయ ఉత్సవాలలో ధ్వజారోహణము పేరిట గరుత్మంతుని ఆరాధించి ధ్వజ పటమును ఎగురవేయుదురు. ఆసమయముననే సంతానార్థులకు గరుడ ప్రసాదమును అందజేయుదురు.

సంతానములేనివారు అష్టనాగాభరణ భూషితుడైన గరుత్మంతుని ప్రధాన దేవతగా "వైనతేయేష్టి" చేసిన సంతానమును పొందుదురు. జీవునియొక్క పరలోకయాత్రను గూర్చి తెలుపునది గరుడపురాణము. దీనిని విష్ణుమూర్తి గరుడునికి చెప్పెను.

వాహనాథ మహావిష్ణోః
తార్క్ష్యాయామిత తేజసే,
గరుడాయ నమస్తుభ్యం
సర్వసర్పేన్ద్ర మృత్యవే.

అని గరుత్మంతుని ప్రార్థించాలి.

అనంతో వాసుకిశ్చైవ
తక్షః కర్కోటకస్తథా,
పద్మాఖ్యశ్చ మహాపద్మః
శంఖశ్చగులికస్తథా.

అనంతుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, పద్మాఖ్యుడు, మహాపద్ముడు, శంఖుడు, గులికుడు అను 8 మంది నాగులను ఆభరణములుగా కలిగిన వాడు గరుత్మంతుడు.

(సశేషం)



(16వ పేజీ తరువాయి)

నినే సేవించింది. అతనినే భక్తి భావంతో పూజించింది. అతనికే నమస్కరించింది. అలాచేసి అతన్నే పొందింది. ఆయనకు ప్రీతిపాత్రురాలైంది. తనకు ఆయన ప్రియు డైనప్పటికి ఆమె ఏనాడు ఆయన దివ్యత్వాన్ని ఏమరలేదు. "మీరాకే ప్రభు గిరిధరనాగర్" అని సవినయంగా విన్నవించుకొంది. సూరదాసులో వున్నంత తీవ్రవాత్సల్య భావన తులసీదాసులో కనిపించేటంత గాఢ దాస్యం మీరాబాయి కృతులలో కనిపించదు. సఖ్య మాధుర్య భావాలలోని ఔన్నత్యం, వ్యగ్రత నిమగ్నతలు ఆమె భజన కీర్తనల్లో అనుభూతుల్ని రేకెత్తిస్తాయి. భగవంతుని యోగిగా ఆరాధించే సంప్రదాయం నాథ సంప్రదాయం. మీరా ఈ సంప్రదాయ భావనకు లోనై కాబోలు-- "వగపే మిగులును యోగిని, వలచిన వారికి చెలియా" అంటూ వాపోయింది. యోగి ఎవ్వరికీ సఖుడు కాడని నిర్వేదం చెందింది.

## మీరాబాయి గీతాలు

మీరాబాయి పదాలను స్థూలంగా స్తోత్ర గీతాలు, ఆత్మానుభూతుల్ని చిత్రించే ప్రణయ గీతాలని రెండురకాలుగ విగడించవచ్చు. ప్రార్థనాగీతాల సంఖ్య తక్కువ.

విధి విలాసములు అతి విచిత్రములు
మూఢులు గద్దెలనేలు చుందురు
బుధులేమో అడుగంటుచుందురు.

అన్న ప్రతిఘటన దృక్పథం క్రమంగా అనాసక్తయోగంగా మారింది. ఆకాంక్ష, ఆశ, నిరాశ, తపన, ఈర్ష్య, క్రోధం యిత్యాది వివిధ మానసిక ఉద్వేగావస్థల్లో ఆమె ప్రణయానికి చిత్రిక పట్టింది. ప్రణయార్తి అయిన పదుమ గోపికలా ఈ భావోద్వేగాలన్నింటిని తాను అనుభవించి శ్రోతకు అనుభూతం చేస్తుంది. మురళిపాటవిని పరవశించడంలో ఆమెకు విసుగులేదు. విరామంలేదు. "గిరిధరా ఏలరా-- కినుకా నామీద" అంటూ దిగ్భ్రాంతి చెందుతుంది. అతని విరహంతో మనోవ్యథ చెందుతుంది. చెలులు రకరకాల ఉపచారాలు చేస్తారు. ఫలితం కనిపించదు "వంశీమోహనుని మించి వైద్యుడు లేడని నమ్మితి" అని వ్యాధి మూలాన్ని కనుగొని చికిత్స చేయగల వైద్యుడెవరో తెలిపింది.

నీవులేక నిలువలేను
రావోయి ఓ ప్రియా
జలములేని వలిపోలె
వెల పాడువని రజనివోలె
నీవురాక నా బ్రతుకే
నిష్ఫలమో ప్రియతమా!

(లేక)

విరహ భుజంగము కాటువేయుగా
విషలహరులలో పొరలితిని.

(లేక)

అశ్రు జలముతో పెంచితినేనా
అనురాగ ద్రాక్షలతను.

ఇలాంటి పదాలతో ఉపమ, రూపకం లాంటి అర్థాలంకారాలు అతి సహజంగా అప్రయత్న సిద్ధంగా పడినట్లు తోస్తాయి. వీటిని ఆమె పరిసరాలనుండే గ్రహించింది. ఇవి పాతపడ్డ పద బంధాలే. కాని కొత్తరంగులను సంతరించుకొని హృదయాహ్లాదాన్ని కలిగిస్తాయి.

## ఛందస్సు

పదకవిత్వంలో సంగీతానికి ప్రథమ స్థానం. మీరాబాయి కూడా సంప్రదాయ బద్ధమైన పదసాహిత్య నియమాల్ని అవలంబించినా వాటిని గుడ్డిగా అనుసరించలేదు. ఔచిత్యాన్ని బట్టి వీటిని భావానుగుణంగా మలిచింది. ఈమె పదాలలో సంగీతం ప్రధానాంశం కావడంచేత అవి ప్రత్యేకమైన రాగవరుసలలో పాడటానికి అనువుగా కూర్చబడ్డాయి. ఆమె పదాలలో సుమారు 70 రాగాలు వున్నట్టు ఒక అంచనా. రాగవిహ్వలతను విషాదాన్ని ప్రకటించ సామర్థ్యంగల 'పీలు' రాగాన్ని ఆమె ఎక్కువగా అభిమానించింది. సారంగ్, దేస్, సోరఠా, హమీర్, హోలీ, ఓహాగ్, బిలావక్, కన్హరా, దర్బారీ, భైరవీ, మాల్కోస్, రామకలీ, భాగేశ్వరీ, భీంపలాసీ లాంటి రాగాల్లో ఆమె పదాలు పాడుకోవచ్చు. ఈమె రచనలపై జానపదగేయాల ప్రభావం విశేషంగా వుంది. అనేక జానపద ఛందస్సులను తన గేయాల్లో వాడుకొంది. సరసి, దోహ, విష్ణుపద, శోభాచ్ఛందస్సులను ఎక్కువగా మీరా వాడింది.

## భాష

మీరాబాయి మౌలికంగా కవయిత్రి కావాలనుకోలేదు. పాండిత్య ప్రకర్ష ప్రదర్శించాలని తాపత్రయపడలేదు. సంగీత విద్వాంసురాలు కావాలని తలపోయలేదు. భాషగానీ, కవిత్వం గానీ, పాండిత్యంగానీ, సంగీతంగాని ఆమె ఆత్మ నివేదనకు వాహికలు మాత్రమే. అవి సాధనాలేగాని సాధ్యాలు కావు. సాదాసీదా భాషలో ఆమె తన భక్తి భావాన్ని వెల్లడించి ప్రచలితం చేసింది. అందుకే సంస్కృత పదాడంబరం పాండిత్య పటాటోపం వాటిలో కనిపించవు. దైనందిన జీవితంలోని పదజాలం ఆమె కృతులంతటా విస్తరించింది. మీరాబాయి కవిత్వం మార్వాడీ, ప్రజల భాషల సమ్మేళనం. ఆమె రచనల్లో మార్వాడీ పద ప్రయోగాలు ఎక్కువగా ఉన్నా క్రియా ప్రయోగంలో ఆమె ప్రజా భాషనే ఎక్కువగా వినియోగించింది. ఆనాటి ఔత్తరాహిక భారతీయ వాఙ్మయ భాష వ్రజే. మేడ్తాలో పుట్టడం మేవాడలో పెళ్లయ్యాక ఉండటం, వ్రజభూమిలో కొన్నాళ్లు గడపటం, శేషజీవితాన్ని ద్వారకలో గిరిధరుని సన్నిధిలో ముగించడం వలన మార్వాడీ, గుజరాతీ, వ్రజ ఈ మూడు స్థానిక భాషలలో ఆమెకు అభినివేశం కలిగింది.

## అనువాదం

రసధ్వనులైన మీరాబాయి గేయాల్ని గేయరూపంలో తెలిగించడం అంతసులభమైన

## విజ్ఞప్తి

# శ్రీవారి ఆలయం, తిరుమల.

తిరుమల శ్రీవారి ఆలయంలోని శ్రీవారి ప్రసాద పణ్యార-ములు, ఆర్జిత చేరుపులు, పడుల ధరలు 27-7-92 నుండి ఈ క్రింది విధంగా వుంటాయి.

భక్తులు ఈ విషయాన్ని గమనించి ఆ యా మొత్తాలు చెల్లించవలసిందిగా విజ్ఞప్తి.

| | | |
|---|---|---|
| 1. పొంగలి | $\frac{1}{4}$ సోల | రు. 225-00లు |
| 2. చక్కెర పొంగలి | ,, | రు. 250-00లు |
| 3. పులిహోర | ,, | రు. 200-00లు |
| 4. దధ్యోదనం | ,, | రు. 100-00లు |
| 5. శాకరి బాత్ | ,, | రు. 250-00లు |
| 6. సీరా | ,, | రు. 450-00లు |
| 7. పాయసం | ,, | రు. 225-00లు |

పనికాదు. డా॥ సి. నారాయణరెడ్డి ఎంతో మధురంగా వాటిని అనువదించారు. ఆయన పదావళిని అనువదించేటపుడు సాధ్యమైనంత వరకు హిందీ మూలాన్నే అనుసరించారు. మూలంలో పాఠభేదాలున్నప్పుడు ఆంగ్లానువాదాన్ని ఆశ్రయించారు. మూలపదావళిలోని ముఖ్య లక్షణమైన గాన యోగ్యతను గుర్తుంచుకొని మాత్రాచ్ఛందస్సులా అనువాదం సాగించారు. మీరాబాయి కృతులలోని భావపుష్టి, శిల్పదృష్టి కొరవడకుండా, తెలుగు నుడికారానికే, ధారాశుద్ధికి, లోపం కలగకుండ వారు చేసిన అనువాదం సహృదయ పాఠకుల మన్ననలను అందుకొంది.

మీరాబాయి పేరు వినగానే భారతీయ భక్తి సాహిత్యం గురించి ఏ మాత్రం ప్రవేశమున్నా మీరాబాయి శ్రీకృష్ణుని ధ్యానిస్తున్న సుందరరూపం కళ్లముందు ప్రత్యక్షమౌతుంది.

క్రింది గీతంలో శ్రీకృష్ణుని కోసం ప్రతిక్షణం పరితపిస్తూ ప్రియుని రాక కోసం నిరీక్షించే భక్తురాలి రూపం కనులకు కట్టినట్లు అవుతుంది.

ప్రియుడా! రా! దర్శనమివ్వు
నీవులేకుండా ఉండలేను
జలంలేని కమలం చంద్రుడులేని రజని
ప్రియురాలు లేని నీవు
ఇలా గనిపించింది నాకు
రాత్రి పూట తిరుగలేను వ్యథా కులితనై
విరహం ప్రాణాలు తీస్తున్నది
పగలు ఆకలి లేదు, రాత్రి నిద్రరాదు
నోటితో చెప్పడం సాధ్యంకాదు
ఎవరితో చెప్పేది ఓ మిత్రుడా?
ఎవరు వింటారు నా మాట?
ప్రియునితో కూడిక వల్లనే తాపహరణం
ఓ అంతర్యామి, ఎందుకు బాధిస్తావ్?
కరుణతో నీవు రా పోతుంది బాధ
జన్మ జన్మలకూ దాసి నీకు మీరా
ఆమె ప్రీతి ఎప్పటికీ నీ యందే.

"ప్రాచీన అర్వాచీన భారతీయ సాహిత్య నిర్మాతలను గురించి తెలిసికోవడం ద్వారా భారతీయ సాహిత్య చరిత్రలోని ప్రధాన ఘట్టాలను సామాన్య పాఠకుడు గ్రహించటానికి వీలుగా జీవితరేఖా చిత్రాలను వెలయించవలె. అలాంటి సాహిత్య నిర్మాతలలో మీరాబాయి ఒకతె. ఆమె జీవిత కథ, సాహిత్య సేవ, భారతీయ వాఙ్మయ వికాసానికి తోడ్పడింది. ఆమె జీవితం కృష్ణభక్తికి పర్యాయపదమైంది. ఆమె గీతాలు పెన్నిధులయ్యాయి. వాటిని ఎందరో గాయకులు గానం చేశారు. చేస్తున్నారు కూడా! ఆమె కవితాశైలి సరళతరం, సులభ సుందరం. ఆ గీతాలలోని గేయాంశమూ, భక్తి పారవశ్యమూ ఎన్నో శతాబ్దాలుగా ఎందరెందరినో ముగ్ధుల్ని చేశాయి. మధ్యయుగానికి చెందిన సూరదాసు విద్యాపతి మొదలైన ప్రముఖ భక్తకవుల కోవకు చెందిన కవయిత్రి మీరాబాయి. ఆమె రాణివాసపు జీవితాన్ని సహర్షంగ త్యజించి, సాధువులతో తిరుగుతూ చివరకు ద్వారకను చేరుకుంది. అయినా, గుజరాతీ మధ్య యుగ వాఙ్మయంలో ప్రసిద్ధి కవయిత్రిగా స్థానం సంపాదించుకుంది." ★

దేవుని దూషించడం కన్నా
పాపం లేదు
మనిషిని హింసించడం కన్నా
నేరం లేదు



(13వ పేజీ తరువాయి)

"విధి చాల సుఖమా
రాముని సన్నిధి సుఖమా" అని ప్రశ్నించాడు.

త్యాగరాజు కానుకలు తీసుకోక పోతే తనకు భుక్తి గడవదేమో నని కాని, రాజు గారికి కోపం వస్తుందేమోనన్న భయం కాని ఆయనకు లేదు. భగవద్గీత బోధించే ముఖ్య సూత్రాలలో నిర్భయత్వం ఒకటి.

అనపేక్ష శ్శుచిర్దక్షః
ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభ పరిత్యాగీ
యో మద్భక్త స్స మే ప్రియః. (12 - 16)

దేని యందూ అపేక్ష లేనివాడు, శుచి అయిన వాడు సమర్థుడు, ఉదాసీనుడు, వ్యథను వదలిన వాడు, ఆడంబర కర్మలను విడిచిపెట్టిన వాడు అయిన భక్తుడు నాకు ప్రియుడు.

ఈ శ్లోకంలో చెప్పిన లక్షణాలన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. ఉదాసీనత కలవాడే దేనిని అపేక్షించకుండా ఉండ గలుగుతాడు. ఈలక్షణాలు సాధించడానికి సమర్థత అవసరం. సమర్థుడైన వాడు ఎన్ని చిక్కు సమస్యలు ఎదురైనా చిరునవ్వుతో ఎదుర్కొంటాడు. మనలో కొంతమంది ప్రతి చిన్న సమస్యకు బెంబేలు పడిపోవటం చూస్తూ ఉంటాం. సమర్థత లేకపోవటమే దీనికి కారణం. అలాగే కొందరు ఏసమస్యలకు భయపడరు. సమర్థుడైన వ్యక్తి సుఖదుఃఖాలను, జయాపజయాలను సమదృష్టితో చూసే యోగి కాగలడు. సమర్థునికి సంఘంలో గౌరవం ఉంటుంది. అసమర్థుడైన రాజుకంటే సమర్థుడైన సేవకునికి ఎక్కువ విలువ ఉంటుంది. ఈ సుగుణాలని కలిగినవాడు కర్మ తత్వాన్ని విడిచి పెట్టగలడు. అన్నీ నేనే చేస్తున్నాను. అనే అహంకారం అతనికి ఉండదు. అటువంటి వాడే భగవంతునికి చేరువ కాగలడు.

ఈశ్లోకంలో మరో గొప్ప విశేషముంది. అపేక్షను, బాధను, అహంకారాన్ని, పదవిని విడిచి పెట్టాలన్నాడు. కాని శుచిగా ఉండాలన్నాడు. దైవ సన్నిధికి శుచిగా వెళ్ళాలని చెపుతాడు. అయితే నిత్యం శుచిగా ఉండాలని శ్రీకృష్ణుని తాత్పర్యం. శారీరక శుచి ఎంత ముఖ్యమో, మానసిక శుచి అంతే ముఖ్యమని పెద్దలు చెబుతారు.

యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాంక్షతి,
శుభాశుభ పరిత్యాగీ
భక్తిమా న్య స్స మే ప్రియః. (12 - 17)

రాగ ద్వేషాలు లేనివాడు ; శోకం, కోరికలు లేనివాడు, శుభాశుభాలను (కర్మ ఫలాలను) వదిలిన వాడు అయిన భక్తుడు నాకు ప్రియుడు.

అనేక మంది భక్తులు ప్రతిరోజు గుడికి వెళ్ళి భగవంతుడికి పూలు, పళ్ళు, తదితర కానుకలు సమర్పించి తమ కోరికలు విన్నవిస్తూ ఉంటారు. కాని కోరికలు లేనివాడు తనకు ఇష్టుడని గీతాచార్యుడు చెబుతున్నాడు.

కోరికలు, శోకం, రాగద్వేషాలు లేని భక్తుడంటే తనకు ఇష్టమని భగవానుడు స్పష్టం చేసాడు.

అడగనిదే అమ్మ అయినా అన్నం పెట్టదుకదా! ఏమీ కోరనిదే భగవంతుడు భక్తులను ఎలారక్షిస్తాడు? భక్తుల కోర్కెలు తీర్చకపోతే భగవంతుడెందుకు? అని కొందరు ప్రశ్నించవచ్చు. కోరికలు కోరకుండా ఉండటం. భక్తుని ఔన్నత్యాన్ని సూచిస్తుంది. ఏమీ కోరకపోయినా భక్తుని అవసరాలను తాను తీర్చుతానంటాడు పరమాత్మ.

అనన్యా శ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్. (9 - 22)

నిరంతరం అనన్య భక్తితో నన్ను కొలచే వారి యోగక్షేమాలను నేను చూసుకొంటాను.

కనుక నిజమైన భక్తులు భగవంతుని ఏమీ కోరనక్కర లేదు. నిర్మలమైన మనసును ఆయనకు అర్పించాలి. ఆయన చెప్పిన సుగుణాలు అలవరచుకోవాలి. అప్పుడు మిగిలినవన్నీ ఆయనే చూసుకొంటాడు. భాగవతంలో ప్రహ్లాద చరిత్రను ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

తుల్య నిందాస్తుతి ర్మౌనీ
సంతుష్టో యేన కేనచిత్,
అనికేత స్థిరమతిః
భక్తిమా న్మే ప్రియో నరః. (12 -19)

శత్రువులను, మిత్రులను, మానావమానాలను, శీతోష్ణ సుఖదుఃఖాలను సమానంగా భావించేవాడు దేనిమీదా ఆసక్తి లేనివాడు నిందాస్తులను సమానంగా చూసేవాడు, మౌని, లభించిన దానితో తృప్తి చెందేవాడు, కర్మఫలితం గూర్చి ఆశలేని వాడు, నిశ్చలమైన మనస్సు కలవాడు అయిన భక్తుడు నాకు ప్రియుడు.

కోరికలు లేనివాడు, అందరినీ, అన్నిటినీ సమానంగా చూసేవాడు అయిన భక్తుడు తనకు ప్రియుడని కృష్ణపరమాత్మ పదేపదే చెపుతున్నాడు. కేవలం కానుకలు అర్పించే వారు, ముడుపులు చెల్లించేవారు భక్తులు కారని పై శ్లోకాల సారాంశం.

నిండు మనసుతో భక్తులు ఏది సమర్పించినా నేను ప్రేమగా స్వీకరిస్తానని పరమాత్మ తొమ్మిదవ అధ్యాయంలో చెప్పాడు.

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతం
అశ్నామి ప్రయతాత్మనః. (9 - 26)

ఆకునుకాని ,పువ్వునుకాని, పండును కాని, నీటినికాని పరిశుద్ధ మనస్సుతో సమర్పించి వట్లైతే నేను దానిని ప్రేమగా స్వీకరిస్తాను.

ఈ అంశాన్ని బలపరిచే పురాణ కథలు అనేకం ఉన్నాయి. రామునికి శబరి పండ్లు సమర్పించింది. కృష్ణుడికి కుచేలుడు అటుకులు కానుకగా ఇచ్చాడు. ఈ ఇరువురికి భగవదనుగ్రహం లభించింది. కనుక భగవంతునికి కానుకల కంటె ప్రేమ ముఖ్యం. దైవ ధ్యానంతో పాటే పై సుగుణాలు అలవరచుకొన్నవాడే నిజమైన భక్తుడు.

భగవంతుని సేవించేవాడు ఎన్ని

ఘోరాలు, నేరాలు చేసినా ఫరవాలేదు అను కోవటం పొరపాటు . అయితే ఒకప్పుడు ఎన్నో అకృత్యాలు చేసి మనస్సు మార్చుకొన్న వ్యక్తి భగవద్భక్తుడై సన్మార్గంలోకి రావడానికి అవకాశం లేకపోలేదు. తొమ్మిదవ అధ్యాయం లోని 30వ శ్లోకం ఈ విషయాన్ని తెలియ జేస్తుంది.

అపి చేత్సుదురాచారో
భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యః
సమ్యగ్వ్యవసితో హి సః. (9 -30)

అనేక దురాచారాలు చేసినప్పటికి అన న్యమైన భక్తితో నన్ను భజించేవాడు సాధువే కాగలడు. అతనికి సద్బుద్ధి కలిగి తీరుతుంది.

ఈ శ్లోకాన్ని సునిశితంగా పరిశీలించాలి. ఎన్నిపాపాలు చేసినా భగవంతుని ధ్యానిస్తే చాలునని ఈ శ్లోక సారాంశం కాదు. ఒక ప్పుడు నేరాలు చేసినా పశ్చాత్తాపం పొంది అనన్యదృష్టితో భగవంతుని ప్రార్థిస్తే సత్పు రుషుడిగా మారుతాడు. ఇదీ దీని భావం.

దీని తరువాత శ్లోకం ఈ భావాన్ని మరింత బల పరుస్తుంది.

క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి. (9 -31)

ఆవిధంగా అనన్య భక్తితో ధ్యానించే వాడు త్వరలోనే ధర్మాత్ముడుగా మారు తాడు. మనశ్శాంతిని పొందుతాడు. నా భక్తుడు ఎన్నడూ నశించడు.

ఒకప్పుడు దుష్టుడైనప్పటికీ భగవంతుని ఏకాగ్రచిత్తంతో కొలిచేవారు కొన్నాళ్ళకు ధర్మాత్ములు కాగలరు. తన భక్తుడు ఎన్నడూ నాశనం కాడని భగవంతుడు భరోసా ఇస్తున్నాడు. భగవంతుని దృష్టిలో భక్తుడంటే భక్తియోగంలో పేర్కొన్న పై సుగుణాలు కలి గిన వాడు. అట్టివాడు చెడిపోవడం అసాధ్యం. ఒకప్పుడు దురాచారుడైన వ్యక్తి కూడా ఈమార్గంలో సాధన సాగిస్తే కొన్నాళ్ళకి సాధువుగా మారగలడని భగవానుడు చెబు తున్నాడు. ఎన్నో నేరాలు, ఘోరాలు చేసి జైలు పాలైన వ్యక్తులు విడుదలైన తరువాత సన్మార్గంలో జీవించడానికి అవకాశం కల్పిం చాలని మానవతా వాదులు చెబుతున్నారు.

ఈ అభిప్రాయానికి శ్రీ కృష్ణుడు చెప్పి అభిప్రాయానికి పెద్దతేడా ఏమీ లేదు.

భక్తియోగంలో చెప్పిన సుగుణాలను అ వరచుకొన్న భక్తుడు భగవంతునికి మాత్రమే కాక సర్వ జనులకు ప్రీతిపాత్రుడు కాగలడ అటువంటి నిజమైన భక్తునికి ఏవిధమైన ఆడ బరం ఉండదు. తనను అందరు గుర్తించాల తపన సైతం అతనికి ఉండదు.

ఈ లక్షణాలను అలవరచు కోవడాని ప్రతి ఒక్కరూ ప్రయత్నించాలి. అప్పుడే మా నవజాతికి పరిపూర్ణ శాంతి, ఆనందం లభిం గలవు. అయితే వీటిని అలవరచుకోవట అంత సులభం కాదు.

దీనికి నిరంతర సాధన అవసర ఇందుకు ఈ శ్లోకాలను పారాయణం అం నిరంతరం మననం చేసుకోవడం అవసర నిజానికి భగవద్గీత పారాయణ గ్రంథం కాద ఆచరణ గ్రంథం. ఇందులో చెప్పిన ఉత్త గుణాలను ప్రతి ఒక్కరూ అలవరచుకొన నాడు మానవ జాతి దుఃఖం నుండి విము పొందుతుంది.

మరొక్క విషయం. 12వ అధ్యాయంలో చెప్పిన లక్షణాలలో ఒకటి, రెండు మినహ మిగిలిన వాటికి భగవంతుని ఉనికితో ఎ సంబంధం లేదు. కనుక దేవుడు లేడన కొనేవారు సైతం ఈ లక్షణాలను అలవ చుకొని మానవ జాతికి మేలు చేయడాని ప్రయత్నించవచ్చు.



ఆత్మశుద్ధిలేని దైవ ప్రార్థన కన్నా
అజ్ఞాని నోట పలికే
ఒక్క రామనామం మిన్న



# శ్రీ సత్యనారాయణ శతకము

(రచయిత్రి:శ్రీమతి పి.వి.శకుంతల; ప్రతులకు :శ్రీమతి పి.భావమ్మ, 13/183 బి.9-3, విజయనగర్‌కాలనీ, కసాపురం రోడ్, గుంతకల్. 515 801; 1/8 క్రౌను-సైజు; పుటలు 22+22; వెల రు.10/-)

"అన్నవరములోని ఆదిదేవ" అన్న మకుటంతో ఆటవెలది పద్యాలలో శ్రీమతి పి.వి. శకుంతల రచించిన శ్రీసత్యనారాయణ శతకం శ్రీ వీరవేంకట సత్యనారాయణస్వామి స్తుతిపరమైన సుందర రచన.

మేరు పర్వతము యొక్క కుమారులు భద్రుడు, రత్నాకరుడు అనేవారు తపస్సుతో శ్రీమహావిష్ణువును మెప్పించి తమ నామములు ధరణిలో కలకాలం పిలిచేటట్లు చేయమని వేడగా నారాయణుడు భద్రుని భద్రగిరిగా, రత్నాకరుని రత్నగిరిగా మార్చి తానే భద్రగిరిలో శ్రీరామచంద్ర మూర్తిగా, రత్నగిరిలో వీర వేంకట సత్యనారాయణుడుగా వెలకొన్నట్లు ఈ శతకంలోని 2, 3, 4, 5 పద్యాలు చాటుతున్నాయి. కొండదిగువ ప్రవహించే నది పంపానది అని, అక్కడి అమ్మవారు అనంతలక్ష్మి యని రచయిత్రి పేర్కొన్నారు.

తెలుగుదేశంలోని ప్రముఖ యాత్రా కేంద్రాలలో అన్నవరం ఒకటి. శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతమునల్పని ఆస్తికగృహం ఆంధ్రదేశంలో లేదనడం అత్యుక్తి కాదు.

మహా మహిమోపేతుడైన సత్యదేవుని స్వరూపరూప గుణ వైభవాలను వెల్లడించే ఈ లఘుకృతిలో నారాయణుని దశావతార చర్యలు, కథలు గాథలు కూర్చబడ్డాయి.

భక్తి జ్ఞాన వైరాగ్య నీతిబంధురమైన ఈ రచన పండిత పామర జన రంజకమని చెప్పటకు వెనుకాడ పనిలేదు.

"నిన్ను చూడగోరి నీమాట వినగోరి
వేలజన్మ లెత్తి వేచినాను
పుణ్యమూర్తి! నిన్ను పొడగాంచు టెప్పుడో
అన్నవరము లోని ఆదిదేవ!"

"అరుగు దెమ్ము వేగ నలసిపోతిర సామి!
జనన మరణ యాత్ర చాలునింక
కరుణ జూపి నన్ను దరిజేర్చుకోవయ్య"

వంటి పద్యములు పాఠకులలో ఉత్కంఠను రేకెత్తిస్తాయి.

"ఎన్ని పేర్ల బిల్తు? నెంతని వేడుదు", "తల్లిదండ్రి గురువు దైవంబు దాతయు", "న్యాయపథమునందు నడచుచు నుండిన, ఖ్యాతి పొందు నరుడు భూతలమున," "తప్పు



జేయువారె ధరణిలో నందరు, తప్పు తెలిసి కొన్న గొప్పగాదె" నీతిబోధకము లైన పద్యము లిట్టివి ఎన్నో కలవు. పాఠకు లాదరించవలసిన చిరుపొత్త మిది.

తప్పొప్పుల పట్టికలో "ధృవు"నకు నకు బదులుగా ధ్రువుడని చేర్చుకొనవలసి ఉంటుంది.

**ముదివర్తి కొండమాచార్యులు**

> సప్తగిరిలో సమీక్షార్థం గ్రంథాలు పంపే రచయితలు తమగ్రంథాల్ని రెండు కాపీలుగా పంపాలి. లేకుంటే సమీక్ష చేయడం వీలుకాదు.
> సమీక్షలు వీలువెంబడి ప్రచురిస్తాము.
>
> సంపాదకుడు

# క్రాంతి పుష్పాలు

(కథ, కవితా, వ్యాస సంకలనం. రచయిత: కానం సుధాకర్ రెడ్డి (కాపురెడ్డి) ప్రచురణ: జాతీయ సాహిత్య పరిషత్తు. కాసురెడ్డిశాఖ, నిజామాబాదుజిల్లా-503 111. ఆంధ్రప్రదేశ్. పుటలు:37. వెల: రూ 5లు.)

ఏదోరాయాలన్న ఉత్సాహం, మరేదో చెప్పాలన్న సామాజిక స్పృహ నేటి యువతలో ఎక్కువగానే వుంది. అది ఆరోగ్యకర పరిణామమే.

రోటరీక్లబ్, జాతీయ సాహిత్య పరిషత్ వంటి సంస్థలు కొత్తగా కలంపట్టి, గళంవిప్పిన యువతను ప్రోత్సహించడం మెచ్చుకోదగ్గ విషయం.

ఇంత చిన్ని పుస్తకంలో కథ, కవిత, వ్యాసం కలగలిపి ముద్రించడం కాకుండా, మరికొంత సమయం తీసుకుని, మరిన్ని కవితలు రాసి ఓ చిన్ని కవితా సంపుటిగా ప్రచురిస్తే బాగుండేదేమో.

కవితల్లో ఈప్రశ్నకు బదులేది; 'వీణ పలికించినా,' 'దండగ బ్రతుకులు'- మూడు రకాల భావనలను వినిపించే ధోరణిలో సాగిన వచన కవితలు.

వీరికవితలు, కథలు, వ్యాసం చదివినప్పుడు - ప్రారంభం కనుక ఎలాగున్నా, కృషి చేస్తే మంచి రచనలు వెలువడడానికి ఆస్కారం వుంది.




✪ ✪ ✪






శ్రీనివాసుని దర్శించ కాముకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాలకోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః ।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః ।

—బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీతమైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

—బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.





'చంద్రశేఖర'

# భార్యాస్థానము

భార్యకు భారతీయ సంస్కృతిలో పరమోన్నత స్థానమున్నది. 'హరిణీ ప్రేక్షణా యత్ర గృహిణీ న విలోక్యతే, సేవితః సర్వసంపద్భిరపి తద్భవనం వనమ్' అని పెద్దలన్నారు. లేడికన్నులవంటి కన్నులు గల గృహిణిలేని భవనము సకల సంపదలతో తులతూగినప్పటికీ వనమేనట. ఈశ్లోకము భారతీయ నాగరికతలో భార్యకున్న ఉన్నత స్థానమును ఎలుగెత్తి చాటుచున్నది.

సహధర్మచారిణీ, పత్ని అనే శబ్దాలు భార్యకు పర్యాయపదాలు. సహధర్మచారిణీ అంటే భర్తను అనుసరించి ధర్మ-కార్యములలో పాల్గొనునది అని అర్థము. పత్ని అంటే పతితో యజ్ఞాది పుణ్యకార్యకలాపములలో పాలుపంచుకొనునది అని అర్థము.

భారతీయ పురాణాలలోని పురంధ్రులందరూ పతిదేవతలే. పూతన, శూర్పణఖ, తాటక వంటి దుష్టస్త్రీలు దానవజాతిలో ఉన్నను వారి సంఖ్య బహు స్వల్పము. మండోదరి, లీలావతి, తులసి, సులోచన వంటి రాక్షసుల భార్యలు కూడ పతివ్రతామతల్లులే.

కావున భారత స్త్రీ ఘనత చెప్పవలెనన్న పతివ్రతా ప్రతాప చరితమును చెప్పిన చాలును. కరకు కరవాలము చేత లేకున్నను పతివ్రతలు తమ పతిభక్తి అను పరమశక్తిచే అమోఘ కార్యములను అవలీలగ సాధించినారు.

పూర్వ మెవరో ఒక కవికి "హుతాశనః చందన పంక శీతలః" అను సమస్యనిచ్చి పూరింపుమ నిరట. అపుడు అతడు వెంటనే.

> సుతం పతంతం ప్రసమీక్ష్య పావకే
> న బోధయామాస పతిం పతివ్రతా,
> పతివ్రతాశాపభయేన శంకితః
> హుతాశనః చందనపంకశీతలః.

**శ్రీ శంకరగంటి రమాకాంత్**

అని పూర్తిచేశారట. ఒక పతివ్రత తనభర్త పవళించి వుండగా అతనికి కాళ్ళు పట్టు చుండినది. తన కొడుకు పొయ్యిలోనికి ప్రమాదవశమున పడుటను ఆమె కన్నులారా చూచినను లేవలేదట. తానట్లు చేసిన తన భర్తకు నిద్రాభంగమగునేమో అని ఆమె శంకించినది. ఆ పతివ్రతామతల్లి శపించు నేమో యని భయపడి ఆ పిల్లవానిని దహించి వేయక అగ్ని మంచిగంధము వలె చల్లని వాడైనాడట - అని ఆశ్లోకమునకు భావము. పతివ్రత తీవ్రప్రభావమును ఈ శ్లోకము సుస్పష్టము చేయుచున్నది.

అత్రి కళత్రము అనసూయ తన్ను పరీక్షింప వచ్చిన ముగ్గురు మూర్తులను ముద్దు బిడ్డలను గావించినది. దమయంతి పతిభక్తి వలననే తన్ను కామించి వెంటబడిన కిరాతుని బూది కావించినది. సావిత్రి అసామాన్యమైన పాతివ్రత్యము వలననే కాలయముని సైతము అవలీలగా గెలిచి మరణించిన తన మగనిని మరల బ్రతికింపజేసికొనినది. పతివ్రతా శక్తి వలననే సుమతి అను సుదతి సూర్యోదయము కాకుం డునట్లు శాపించినది. ఈవిధముగ ఎందరో సతీమతల్లులు మనకు పురాణములో కానవచ్చెదరు.

పతివ్రతామతల్లులకు అసాధ్యమయిన కార్యము లేదు. వారికి సింగము జింక పిల్లతో సమానము. మేరు పర్వతము గులకరాయి వంటిది. విషము పీయూషతుల్యము. సముద్రము పిల్ల కాలువ. వహ్ని జలము. భయంకరసర్పము పుష్పమాలా సదృశము.

మరి పతివ్రత అని ఎవరిని పిలువ వచ్చునో పరిశీలింతము. దానికి సమాధానము మన దేశసాహిత్యములో కలదు. ఒక కవి.



ఆర్తార్తే, ముదితే హృష్టా,
ప్రోషితే మలినా కృశా,
మృతే మ్రియేత యా పత్యౌ
సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా.

అని ఒక శ్లోకములో పతివ్రతా లక్షణమును చెప్పారు. భర్త ఆర్తి పొందగా దుఃఖించునది, భర్త ఆనందించినపుడు ఆనందించునది, భర్త ప్రవాసముపోగా అలంకరించుకొనకుండునది, ఆహారము సరిగా భుజింపక కృశించునది, భర్త మరణించగా అతనితో బాటు మరణించునది అగు స్త్రీ పతివ్రత అనబడునని ఆ శ్లోకభావం.

భర్త ధనమును సంపాదించినపుడు, ధనవంతుడైనపుడు వినయ విధేయతలను చూపుచూ, భర్త ధనహీనుడు కాగానే పరిహాసము చేయుచు, ఛీత్కరించుకొనుచు దూరముగా వెళ్ళునది పతివ్రత కాదు. శ్రీరాముడు తండ్రి మాట జవదాటక రాజ్యమును త్యజించి దండకారణ్యములకు వెళ్ళగా క్రుంగి పోక నిండు కుండవలె సీత అతని ననుసరించి తానుకూడ కానలకు కాపురమునకు వెళ్ళినది. అందుకే ఆమె పతివ్రతలలో తలమానికమై నేటికీ అందరిచే ఆరాధింప బడుచున్నది. అట్లే ద్రౌపది కూడ వనవాసము చేయుచున్న పతులవెంట వెళ్ళి వారికి సేవ చేసినది. విశ్వామిత్రుని అప్పును తీర్చుటకై హరిశ్చంద్రుడు తన్ను విక్రయించినను పల్లెత్తు పలుకాడక భర్తకోసము దాస్యమునుచేసిన చంద్రమతియు ఆ కోవకు చెందిన కోమలియే. కాలును క్రింద పెట్ట నీయక అడుగులకు మడుగులొత్తెడి పలు పరిచారికలు కలిగియుండియు, ఐశ్వర్యమనంతముగ నుండియు తన పతియైన సత్యవంతుడు విధివంచితుడై ఆశ్రమవాసి కాగా తాను కూడా నారచీరలు ధరించి నిరాభరణయై పతిననుసరించి సావిత్రి. ధరిత్రిలో పతివ్రతా చరిత్రమున ఒక నూతనాధ్యాయమునకు నాయికయై భాసిల్లినది. అదే విధముగ తన వల్లభుడు అంధుడగుటచే, అతనికి లేని నయనములు నాకేలనని నేత్ర పట్టమును కట్టుకొని జీవించిన గాంధారి పవిత్రనారి!

భర్త ఏకారణము చేతనైనను తనకు దూరమైనపుడు నిజమైన పతివ్రత అలంకరించుకొనదు. అనగా ఆమె పతి దగ్గర లేనపుడు అలంకారములపై మమకారముచూపదని అర్థము. సీత అశోకవనములో ఉన్నపుడు మలినాంబర ధారిణియై, తైల సంస్కారము లేమిచే చిక్కు పడిన జుట్టుతో, ఉపవాసముండుటవలన కృశించిపోయి ఉన్నదని వాల్మీకి వర్ణించినాడు. 'ప్రోషితే మలినాకృశా' అను పతివ్రతా లక్షణమునకు సీత చక్కని ఉదాహరణ. అట్లే దుష్యంతునికి దూరమై మారీచాశ్రమములో ఉన్న శకుంతలా వేషమును కాళిదాసు.

వసనే పరిధూసరే వసానా
నియమ క్షామముఖీ, ధృతైకవేణిః,
అతినిష్కరుణస్య శుద్ధశీలా
మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి.

అను శ్లోకములో కమనీయముగా వర్ణించినాడు.

శాపవశమున పాండురాజు మరణింపగా అతనితో బాటు సహగమనము చేసిన మాద్రి మాద్రి లేని సతీరత్నము. 'మృతే మ్రియేత యా పత్యౌ' అన్న పతివ్రతా లక్షణమును అక్షరాలా పాటించిన అంగన ఆమె.

సతియును, గుణవతియు, ప్రజా
వతియు, నను వ్రతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టి జూచు నతిదు
ర్మతి కిహముం బరము గలదె మతి పరికింపన్

అని నన్నయ్య భారతములో శకుంతల దుష్యంతునితో అంటుంది. పతివ్రత, గుణ సంపన్న, సంతానవతి, సహధర్మచారిణి అయిన స్త్రీని తిరస్కార భావముతో చూచు దుష్టునకు ఇహపరములు రెండునూ వుండవని దీనిభావం. ఈపద్యము ఈనాటి పురుషులు రుస రుస లాడక చదివి, ఆలోచించి అందలి నీతిని గ్రహించి అక్షరాలా ఆచరించాలి. కట్నములు తేలేదని కర్కశముగా తమ కళత్రములను శిక్షించు కర్కోటకుల పాలిటికిది కశాఘాతము.

భార్య అవసరం భర్తకెంత గలదో తెలిపే పద్యాలు కూడా భారతంలో మనకు కనిపిస్తాయి.

అధిక దుఃఖ రోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవె యెందు
నెవర భార్యా సమేతుడై యున్నవాని
కెంతలయ్యును ఆపద లెఱుక పడవు.
అలసినెడ, డస్సినెడ, నా
కలి దప్పియు నైన యెడల గడుకొని ధరణీ
తలనాథ! పురుషునకు ని
మ్ముల భార్యయ పాచు చిత్తమున దుఃఖంబుల్.

ఈ పద్యాలు నలదమయంతుల కథలోనివి. దుఃఖముతో అలమటించు పతికి భార్య ఔషధమట. భార్య తోడుగా ఉంటే ఎన్ని ప్రమాదాలయిన భర్త ప్రమోదంతో ఎదుర్కొంటాడట. అందువల్లనే పాండవులు ద్రౌపదీ సహాయంతో అడవులలోని ఇదుములను అవలీలగ ఎదుర్కొన్నారు. ఆకలితో దప్పితో బాధపడే పతికి మనసులో కలిగే దుఃఖాన్ని కూడ భార్య దగ్గరుంటే పోగొడుతుందట. 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతక'మ్మని వక్కాణిస్తూ స్త్రీల ఆలోచనలను కొందరు ఖాతరు చేయరు. సుగ్రీవుడు రెండవసారి యుద్ధమునకు రమ్మని వాలిని సవాలుచేసినపుడు పోవలదని భార్యహితవు గరపినది. కాని ఆమె మాటలను పెడచెవిని పెట్టి యుద్ధమునకు సిద్ధపడి రామబాణముచేత హతుడైనాడు వాలి. తనమాట ప్రకారము వానకాలము తరువాత సీతాన్వేషణలో సాయపడటానికి సైన్యముతో తరిలిరాలేదని క్రుద్ధుడై సుగ్రీవుని శిక్షింప వచ్చిన లక్ష్మణుని తార తన బుద్ధి చాతుర్యముతో శాంతపరచిన ఘట్టము రామాయణ పాఠకులకు విశదమే. కాన భార్య కరణమున మంత్రియై వరహాల వంటి సలహాలను సమయోచితముగా ఈయగలదు. స్త్రీలను నీచముగా చూచుట తగని పని.

సంతుష్టో భార్యయా భర్తా
భర్త్రా భార్యా తథై వ చ,
యస్మిన్నేవ కులే నిత్య
కల్యాణం తత్ర వై ధ్రువమ్.

అను శ్లోకము మన అందరికీ ఆదర్శం కావాలి. భార్య వలన భర్త, భర్తవలన భార్య పరస్పరము సంతోషపడు ఇల్లు నిత్య కళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లుతుంది.



( 6వ పేజీ తరువాయి)

చనలకు, ఆదర్శాలకు అవసరాన్ని బట్టి తల వంచదగిన అవకాశాన్ని సృష్టించుకొన్న వ్యవస్థ అది.

మనువు, శుక్రుడు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు వంటి ప్రాచీన రాజధర్మ వ్యవస్థా కోవిదులు రాజాస్థానంలోనున్న పురోహితుని బాధ్యతలను గురించి విస్తృతంగా వివరించి చెప్పినారు. ప్రాచీన భారతీయ రాజ్యవ్యవస్థలో పురోహితుని కున్న స్థానం అత్యుత్తమమైనదని వారి నిర్ణయం. పురోహితుడు కాదగిన వ్యక్తి శాస్త్రజ్ఞుడు గాను, వివిధ విషయ పరిజ్ఞానంలో పరిపూర్ణుడుగాను, నిష్ఠాపరుడైన ధర్మజ్ఞుడుగాను, దైవజ్ఞుడుగాను, అధ్యాత్మవిదుడుగాను, పరాపరా విద్యలలో ఆచార్యుడుగాను, సత్వగుణ సంపన్నుడైన సాత్త్వికుడుగాను, నీతి కోవిదుడుగాను, వ్యవహార కుశలుడుగాను, అన్నిటా మించి నిస్స్వార్థపరుడైన ప్రభుభక్తి పరాయణుడుగాను, అస్త్ర శస్త్ర విద్యలలో సైతం ఆరితేరినవాడుగానుండాలి. అంతేకాక పురోహితుడు కర్తవ్యపరాయణులైన సజ్జనులకు వరదానాలివ్వడంలోను, కర్తవ్యచ్యుతులైన దుర్జనులను శపించడంలో సామర్థ్యమున్న వ్యక్తిగా వుండాలని శుక్రనీతి చెపుతూంది.

పురోధాః ప్రథమం శ్రేష్ఠః
పర్వేభ్యో రాజరాష్ట్రభృత్,
నీతి శాస్త్రాస్త్ర వ్యూహాది
కుశలస్తు పురోహితః
సైవాచార్యః పురోధా యః
శాపానుగ్రహమోక్షయోః.

-- శుక్రనీతి -- 2-79

యాజ్ఞవల్క్యుడు కూడ తన ధర్మశాస్త్రంలో పురోహితుని స్థానం మంత్రిమండలి కగ్రగామిగా, రాజనీతి, దండనీతితో పాటు తన జ్యోతిష పరిజ్ఞానంతో కాలవైపరీత్యాలను, రాజ పరివార శుభాశుభాలను, పరామర్శించ గలిగేదిగా వుంటుందని, మంత్ర తంత్ర ఔషధ ప్రక్రియల ద్వారా రాజ్యానికి, రాజుకు సంభవించు శారీరక - మానసిక ఉపద్రవాలను నివారించ గలిగేదిగా వుండాలని, పురోహితుడు వేద వేదాంగ విదుడై విశేషించి అథర్వ వేదంలో నిష్ణాతుడై వుండాలని చెప్పాడు.

పురోహితం ప్రకుర్వీత
దైవజ్ఞ ముదితోదితమ్,
దండనీత్యాం చ కుశల
మథర్వాంగిరసే తథా.

--యాజ్ఞ్యస్మృతి -- 313

నిజానికి వశిష్ఠుడు భారతీయ సనాతన పురోహిత ధర్మవ్యవస్థ కన్నివిధాల స్ఫూర్తిని సమకూర్చిపెట్టిన మేధావి. భారతీయ చరిత్రలో చారిత్రిక వైవిధ్య - వైరుధ్యాల కతీతం కాక పోయినా ఈ సనాతన జాతి జీవితంలో సుస్థిరమైన అవగాహనకు, సమున్నతమైన సమాదరణకు పాత్రుడైన పుణ్యధనుడు, ప్రాతఃస్మరణీయుడు. ఆయనదొక అద్భుతమైన వ్యక్తిత్వం.



# కొత్త శీర్షిక ప్రారంభం

## పాఠకుల ధార్మిక సందేహాలకు సమాధానాలు

ఎంతో కాలంగా పాఠకులందరూ ఎదురుచూస్తున్న ఈ శీర్షిక జూలై 94 నుండి ప్రారంభమయ్యింది. పాఠకుల ధార్మిక సందేహాలకు ప్రముఖ పండితులు సమాధానాలు ఇస్తారు.

ప్రతినెలా 15వ తేదీలోపు పంపిన ప్రశ్నలకు ఆ మరుసటి సంచికలో సమాధానం ఇవ్వటం జరుగుతుంది. ప్రశ్నలలో ఎటువంటి అవహేళనలకుగాని, దుర్విమర్శలకుగాని తావు వుండరాదు. వీలైనంతమటుకు ప్రతి ప్రశ్నకు ఆయా విషయాలలో నిపుణులైన వారిని సంప్రతించి సమాధానం ఇవ్వవలసి వుంటుంది గనుక, కొంత ఆలశ్యంగా ఒక్కొక్క ప్రశ్న ప్రచురితమయ్యే అవకాశమున్నదని గమనించగలరు.

**ప్రశ్నలు పంపవలసిన చిరునామా :**

సందేహాలు - సమాధానాలు
సంపాదకుడు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి -- 517 507

దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం
## ఆలయ కళ
## తిరుపతి
## SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART
## TIRUPATI

దర్శించండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





# కుమారస్వామి కుర్రతనము

డాక్టర్. టి. ఆర్. కృష్ణన్

రజితాద్రి పైన పార్వతీ పరమేశ్వరు లిరువురును విలాసముగా కబుర్లు చెప్పుకుం టుండినారు. ఒకప్రక్కన వినాయకుడు, మరొకప్రక్క కుమారస్వామి ఇద్దరూ కూర్చొని యుండిరి. ఇంతలో ఎక్కడినుండి ఊడిప డినాడో నారదమహాముసీశ్వరుడు తన మధురగానముతో దంపతుల యెదుట నిలువ బడినాడు.

నారదుడి గానము వినపడుతూనే పార్వతి మాత్రము కొద్దిగ చలించినది. పరమే శ్వరుని పరాకు వదిలిపోయినది. ఈ మహాను భావుడు ఏమి చిక్కు తెచ్చి పెట్టునోయని ఆది దంపతులిరువును హడలు తున్నారు. వారు భావించినట్లుగానే నారదుడు వచ్చినవాడు వచ్చినట్లు ఉండక పార్వతీదేవి చేతిలో అరటి పండు నొకదానిని యిచ్చి, దంపతుల కిరువురి కిని బహు వినయముతో నమస్కరించి, మంద హాసముతో చల్లగా జారుకున్నాడు. ఇకనేం! నాటకమునకు నాంది ప్రారంభమయింది.




నారదమహాముని అట్లా కాలు కాస్త అవతల పెట్టారోలేదో వినాయకుడు కుమార స్వామి ఇద్దరూ ఆ అరటిపండుకోసం చేతులు జాపినారు. ఇందులో ఎవరికి దాన్నివ్వడం? చిన్నపిల్లలాయెను! చెరి పగము తుంచి యస్తేనేమో ఒప్పుకోరు. పండుపండే కావా లంటున్నారు యిద్దరూను. అనుకున్నంతా అయింది. నారదుడు వచ్చినాడంటేనే ఏదో తగువులెచ్చినా డన్నమాటేకదా! అందువల ననే ఆ మహానుభావునకు 'కలహభోజనుడు' అనిపేరు బాగా ప్రసిద్ధికివచ్చింది. ఎవరు పెట్టినారోగాని! దెబ్బలాటే ఆయన భోజనం! పండుకొరకు ఇద్దరన్నదమ్ములు తన్నుకోవడం చూచి ఆదిదంపతుల కేమీతోచలేదు.

చివరకు పార్వతికాస్త ఆలోచించి కుమారులిద్దరినిచూచి, "నాయనలారా! మీరిద్దరూ ఈవిధముగా తగువులాడుకొనడం ఏమీబాగుండడంలేదు. మీకొక చిన్నపోటీని ఏర్పాటు చేస్తాను. అందులో గెలిచినవారికి ఈ పండు ఇస్తాను" అనినది. దానికి ఇద్దరు అన్నదమ్ములూ అంగీకరించినారు. పోటీపరీక్ష ఏమిటో చెప్పమన్నారు. చెప్పడము మాత్రమే కాదు, వేధింపసాగారు తొందరగ చెప్పమని.

పార్వతిదేవి తాను చేయుపోటిపరీక్ష వివరము ఈరీతిగా చెప్పసాగినది. "మీరిద్దరూ ముల్లోకాలచుట్టూ ప్రదక్షిణము చేసిరావలయును. ఎవరుముందు వచ్చెదరో, వాళ్ళు గెలిచినట్లు! సరేనా? వాళ్ళకే ఈ పండు ఇస్తాను" అనినది. పోటీపరీక్ష విన్నదే తడవుగా, కుమారస్వామి ఆరుముఖములు ఆనందంతో విప్పారినవి. వినాయకుడి ముఖం వెలవెల పోయినది. ఆతని గుండెల్లో రాయి పడినది.

విఘ్నేశ్వరుని వాహనము ఎలుక, తన స్థూల దేహానికితోడు దిక్కుమాలిన వాహనం కూడా అట్లానే యేడిచింది! లంబోదరంతో, ఆ చిన్న ఎలుకమీద ఎక్కి ముల్లోకములూ ప్రదక్షిణం చేసి రావలయునన్నచో మాటలా? అదీపోనీ, తనయంతకు తాను ఏదోచేసి రావలయునన్నచో అదొకదారి. తాపగా కావలసినంత వ్యవధి తీసుకుని, ఆ ప్రదక్షిణమేదో పూర్తిచేసి వచ్చేవాడు. మరిపోటీ పరీక్ష! తమ్ముడి వాహనము చక్కటి రంగురంగుల నెమిలి!ఝెంగున ఎగిరి పోగలదుగదా!

కుమారస్వామి కులుకు చెప్పతరము కాదు. "ఎట్లయినా అన్న ఓడిపోతాడు, నేనే గెలిచి తీరుతాను"అని అతనికి అహంకారము పట్టుకొన్నది. ఆ అరటిపండు ఎట్లయినా తనదేనన్న ధీమాతో చకచక ముల్లోకాలను చుట్టిరావడమునకు మొదలుపెట్టినాడు.

వినాయకుడికి తమ్ముడి సంతోషము చూడగానే వెఱ్ఱెత్తినట్లయినది. ఆతడికేమి చేయడమునకును తోచడంలేదు. దిక్కుతోచక వెండికొండ పరిసరములలోనే చతికిలబడినాడు. న్యాయంగా పరీక్షకు నిలబడితే, ఎట్లయినా తనుమాత్రం ఓడిపోయేది ఖాయం! అనవసరముగా, తనదేహమును, ఎలుక మీద పడవేసి, రొప్పుతూ రోజుతూ, ప్రయాణము చేయడము అతగాడికి సుతరామూ నచ్చలేదు. ఎదురుగ్గా ఉండిన ఎలుకను మింగివేయాలన్నంత కోపము పుట్టుకొచ్చినది.

వినాయకుడికి అంతబొజ్జవుండినా అతడు బండఅబ్బాయిమాత్రంకాదు. అతడు అక్కడ కూర్చొని దీర్ఘంగా ఆలోచించగా మెరుపువలె ఒక ఆలోచన తట్టింది. ఆలోచన తట్టిందో లేదో వెంటనే పరుగుతో గబగబా తలిదండ్రులవద్దకు ఆయాసపడుతూ వెళ్లిపోయినాడు. "ప్రపంచము నంతకును మీరే తలిదండ్రులు, అయినందున మీ చుట్టూ ప్రదక్షిణము చేసినచో మూడు లోకములకూడా చుట్టివచ్చినట్లే"నని తలిదండ్రులచుట్టూ తిరిగి వారి పాదములకు భక్తితో సాష్టాంగదండప్ర



ణామము చేసినాడు.

ఎప్పుడయితే వినాయకుడు పార్వతీపరమేశ్వరులకు ప్రణమిల్లినాడో ఆతడు చేసిన యుక్తికి ఆత్మభక్తికీ, పార్వతీదేవి మనస్సు బలే సంతోషముగా పరవళ్ళు తొక్కసాగినది. బొజ్జ గణపయ్య బుద్ధికి ఆమె ముక్కున వేలేసుకొని, ముద్దుగా ఆతని తలనిమారుతూ అరటిపండు ఆతని చేతిలో పెట్టినది! పాపం! కుమారస్వామి నిజంగానే ముల్లోకములకూ చుట్టి వచ్చెడి సమయానికి, వినాయకుడు ఆ అరటిపండును కాస్తా గుటకాయ స్వాహా చేసి కూర్చున్నాడు. కుమారస్వామి, ఆయాసపడుతూ తిరిగి తిరిగి ముల్లోకాల ప్రదక్షిణ పూర్తికాగానే నడవలేక నడవలేక మెల్లగా పార్వతిదగ్గరకువచ్చి అరటిపండుకోసరం చెయ్యిని చాపినాడు. అమ్మప్రక్కన అదివరకే కూర్చొని యుండిన వినాయకులవారు కుమారస్వామిని చూచి ముసి ముసి నవ్వులునవ్వినారు. పార్వతీదేవి చాలావిచారముతో ఆయన పడినబాధకు జాలిపడి అసలు విషయం సావధానముగ వివరించినది.

కుమారస్వామికి కోపమూ, ఆగ్రహము కట్టలు తెంచుకున్నది. కోపంతో వినాయకుడి వైపుచూచి "పిరికి పందవు! న్యాయముగా పరీక్ష గెలువలేక, మన అమ్మా నాన్నలను మోసగించి అరటిపండు ఆరగించినావు" అన్నాడు. పర్వతరాజపుత్రిని, పరమేశ్వరులనుచూచి జాలిగా " అమ్మానాన్నలు మీరు నేను చిన్నకొడుకునన్న ముద్దయినను లేకుండా వాడికి పండును యిచ్చివేసి కూర్చున్నారుగదా? అని వెనుకకు కూడ తిరిగి చూడకుండా, చరచరా ఒక కొండమీదకు వెళ్ళి తన స్థిర నివాసమేర్పరచుకున్నాడు.

ఎంతయినా కన్నకడుపుగదా! పార్వతీదేవి కొడుకును చూడకుండా ఉండలేక పోయినది. దీని కంతటికిని కారణమైన నారద మహామునికి మనస్సులోనే మంగళహారతులు నాలుగు పాడుకొన్నది. పరమేశ్వరుడితో పోరి పోరి చివరి కిద్దరుకూడా కుమారస్వామి వున్న కొండ చేరుకున్నారు. పోయీపోగానే కుమారస్వామిని కౌగిలించుకున్నారు. ఇద్దరూ ఒకే కంఠముతో "వెఱ్ఱివాడా! మామీద అలిగి వెళ్ళిపోయెదవా? పళమ్ నీ. పళమ్ నీ=పండువు నీవే. నీకొక ఫలమేమి చెప్పు? అని సముదాయించినాడు. కుమారస్వామి కుఱ్ఱతనము మాత్రం అతడిని విడిచిపెట్టలేదు. ఆ కొండమీద అలాగే వుండిపోయినాడు. ఆ "పళమ్‌నీ" యే ఈనాటి పళని.

పళనిగురించిన పసందైనకథ ఇది. ఇది దక్షిణభారతదేశంలోవున్న గొప్ప గొప్ప పుణ్యక్షేత్రములలో ఒకటి. కొండమీద కుమారస్వామి కన్నులపండువుగా ముద్దుగా వుంటాడు జీవితంలో ఒక్కసారయినా చూడవలసిన జన్మసాఫల్యము చేయగల సుబ్రహ్మణేశ్వర పుణ్యక్షేత్రము.

(ఆగష్టు । ఆదికృత్తిక సందర్భంగా)

★★★★★



ఇటీవల తిరుమలలో శ్రీమతి పుష్ప శ్రీవత్సన రచించిన
'సద్గురు శ్రీత్యాగబ్రహ్మ పుష్పాంజలి' గ్రంథాన్ని
భారత రాష్ట్రపతి డా॥ శంకర దయాళ్ శర్మ ఆవిష్కరిస్తున్న దృశ్యం.

# ......తిరుమల శ్రీవారి పవిత్రోత్సవాలు......

16-8-94.... మంగళవారం.....అంకురార్పణం

17-8-94.....బుధవారం.......పవిత్రప్రతిష్ఠ

18-8-94.....గురువారం.......పవిత్ర సమర్పణ

19-8-94.....శుక్రవారం.......పూర్ణాహుతి

శ్రావణమాసం
లో
జరుగును



[illegible]



ఇటీవల తిరుమలలో శ్రీమతి పుష్ప శ్రీవత్సన రచించిన
'సద్గురు శ్రీత్యాగబ్రహ్మ పుష్పాంజలి' గ్రంథాన్ని
భారత రాష్ట్రపతి డా॥ శంకర దయాళ్ శర్మ ఆవిష్కరిస్తున్న దృశ్యం

# —— తిరుమల శ్రీవారి పవిత్రోత్సవాలు ——

16-8-94.... మంగళవారం.....అంకురార్పణం

17-8-94.....బుధవారం.......పవిత్ర ప్రతిష్ఠ

18-8-94.....గురువారం.......పవిత్ర సమర్పణ

19-8-94.....శుక్రవారం.......పూర్ణాహుతి

శ్రావణ మాసం లో జరుగును



# వార్తాలహరి

## శ్రీవారికి బంగారు హారం

తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి ఒక కే.జి. బరువు సుమారు 4.5 లక్షల రూపాయల విలువగల బంగారు హారం ఇటీవల కానుకగా లభించింది.

మద్రాసుకు చెందిన ఓ భక్తురాలు ఈ కానుక సమర్పించారని తి.తి.దేవస్థానముల అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి తెలిపారు.

## తిరుమలలో రాష్ట్రపతి

భారత రాష్ట్రపతి శ్రీ శంకర దయాళ శర్మ తమ కుటుంబ సభ్యులతో జూన్ 4 శనివారంనాడు తిరుమలలో శ్రీవారిని దర్శించారు.

ఆలయం వద్ద రాష్ట్రపతికి ఆలయ మర్యాదలతో ఇస్తికఫాల్ స్వాగతం లభించింది. రాష్ట్రపతికి ప్రసాదాలను, శేషవస్త్రాన్ని తి.తి.దేవస్థానం బహూకరించింది.

ఆదివారం తిరుపతి విమానాశ్రయంలో ఆయన విలేకరులతో మాట్లాడారు. శ్రీవారితో తనకు అనుబంధం 38 ఏళ్ళ క్రిందటిదని ఆయన తెలిపారు. ఆయన ఇంతవరకు 38 సార్లు తిరుమలేశుని దర్శించారు.

## శ్రీవారికి స్వర్ణరథం

తిరుమల శ్రీ వేంకటేశ్వరునికి దాదాపు ఒక కోటి 70 లక్షల రూపాయల ఖర్చుతో నూతనంగా స్వర్ణ రథం తయారుచేస్తున్నట్లు తి.తి.దేవస్థానముల అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి జూలై 2 శనివారంనాడు తెలిపారు. రానున్న శ్రీవారి బ్రహ్మోత్సవాలకు ఈ స్వర్ణరథం సిద్ధమౌతుందని, ఈ రథం తయారీకి మైసూరు టేకు విని యోగిస్తారని, దాదాపు 2 లక్షల 60 వేల రూపాయల విలువజేసే 1100 కే.జీల రాగిని, కోటీ 31 లక్షల రూపాయల విలువజేసే 28 కే.జీల బంగారాన్ని ఉపయోగిస్తారని ఆయన తెలిపారు. ఈ రథం 21.5 అడుగుల ఎత్తు, 7.3 అడుగుల వెడల్పు వుంటుందని, శ్రీవారి వెండి రథాన్ని కూడ మరలా బాగుచేయిస్తామని ఆయన తెలిపారు.

## మెటల్ డిటెక్టర్లు

తిరుమలలో భద్రతా ఏర్పాట్లను మరింత పటిష్టం చేసేందుకు, సెక్యూరిటీ ఉన్నతాధికారి శ్రీ జి. సుబ్రహ్మణ్యం సూచనల మేరకు అయిదు మెటల్ డిటెక్టర్లు ఏర్పాటు చెయ్యాలని నిర్ణయించినట్లు తి.తి.దేవస్థానముల అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డి తెలిపారు.

వసతి గృహాల్లో పర్యవేక్షణ ఏర్పాట్లను మరింత మెరుగు పరిచేందుకు అధికారులను నియమిస్తామని, ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు స్వగ్రామమైన వంగరలో రు 15/- లక్షల వ్యయంతో కళ్యాణ మండపాన్ని నిర్మించే కృషిలో వున్నామని, ఈ మండపానికి ప్రధాని తన స్థలాన్ని కేటాయించారని ఆయన తెలిపారు.





## పదవీ విరమణ

అయిదు భాషల్లో వెలువడుతున్న తి.తి.దేవస్థానముల మాసపత్రిక సప్తగిరి సంపాదకుడు శ్రీ కాటపాటి సుబ్బారావు జూన్ 30 గురువారం నాడు పదవీ విరమణ చేశారు.

వీరు 1963 లో తిరుమల తిరుపతి దేవస్థానంలో సంపాదకులుగా అడుగుపెట్టారు. అంతకుముందు వీరు ఆంధ్రపత్రికలో ఉపసంపాదకుడుగా పనిచేశారు.

సంపాదకుడుగానే కాక దేవస్థానం పుస్తకవిక్రయవిభాగానికి ఆఫీసరుగాను, గ్రంథరచయితలకు ఆర్థిక సహాయం అందించే కమిటీకి కన్వీనరుగాను వున్నారు. నాటకాలు, ఇతర రచనలు చేశారు.

బులిటెన్‌గా వున్న సప్తగిరి పత్రిక వీరి ఆధ్వర్యంలోనే అయిదు భాషల్లో విడి విడిగా వెలువడటం ప్రారంభమైంది.

## నూతన సంపాదకుడు

సప్తగిరి మాసపత్రిక నూతన సంపాదకుడుగా (I/c) శ్రీ ఎన్.ఎస్. రామమూర్తి నియమింపబడ్డారు. వీరు జూలై 1 న పదవీ బాధ్యతలు స్వీకరించారు.

శ్రీ ఎన్.ఎస్. రామమూర్తి గత 18 సంవత్సరాలుగా తి.తి. దేవస్థానంలో సంపాదక విభాగంలో పనిచేస్తున్నారు. తమిళపత్రిక ఉపసంపాదకుడుగా పని చేస్తున్న వీరు నూతన సంపాదకులుగా పదవీ బాధ్యతలు స్వీకరించారు.





'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు 30-6-94 న పదవీవిరమణ చేస్తున్న సందర్భంలో జరిగిన వీడ్కోలు సభ.

(పైన) 'ధర్మదీపికలు' సప్తగిరి సంపాదకీయాలసంకలనగ్రంథం తి.తి.దే. ప్రచురణను ఆవిష్కరిస్తున్న దేవస్థానకేంద్రగ్రంథాలయ ప్రధాన సలహాదారులు డా॥ రావుల సూర్యనారాయణమూర్తి. ఆయనకు కుడివైపు శ్రీకాట్రపాటిసుబ్బారావు, దేవస్థానం పి.ఆర్.ఓ. శ్రీ టి.శివాజి. ఎడమవైపున దేవస్థానం రవాణాశాఖ జనరల్ మేనేజరు శ్రీ టి.వి. సుబ్బారెడ్డి.

(క్రింద) శ్రీ కె. సుబ్బారావును సత్కరిస్తున్న దేవస్థానం ఇన్‌చార్జి ప్రెస్ మేనేజరు శ్రీ పి. మోహన్‌రావు.



# తిరుమల శ్రీవారి ఆలయం

## అష్టబంధన బాలాలయ మహాసంప్రోక్షణం
## 7-8-84 నుండి 12-8-84 వరకు

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారిఆలయంలో 8-8-94 నుండి 12-8-94 వరకు ఐదు రోజుల-పాటు 'అష్టబంధన బాలాలయ మహాసంప్రోక్షణం' కార్యక్రమాలు జరుగుతున్న సందర్భంగా తిరుమల శ్రీస్వామివారి సర్వదర్శనవేళలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

**7-8-94 -- ఆదివారం -- అంకురార్పణ**

ఉ॥ 8 గం॥ నుండి సా॥ 6 గం॥ వరకు, సా॥ 7 గం॥ నుండి రా॥ 9 గం॥ వరకు, రా॥ 10 గం॥ నుండి రా॥ 12 గం॥ వరకు,

**8-8-94 -- సోమవారం -- మొదటి రోజు -- కళాకర్షణ**

ఉ॥ 6 గం॥ నుండి మ॥ 12 గం॥ వరకు, మ॥ 1 గం॥ నుండి సా॥ 6 గం॥ వరకు, రా॥ 10 గం॥ నుండి రా॥ 12 గం॥ వరకు.

**9-8-94 -- మంగళవారం -- రెండవ రోజు**

ఉ॥ 5 గం॥ నుండి మ॥ 12 గం॥ వరకు, మ॥ 1 గం॥ నుండి సా॥ 6 గం॥ వరకు, రా॥ 7 గం॥ నుండి రా॥ 12 గం॥ వరకు.

**10-8-94 -- బుధవారం -- మూడవ రోజు -- అష్టబంధనం సమర్పణ**

ఉ॥ 10 గం॥ నుండి సా॥ 6 గం॥ వరకు, రా॥ 7 గం॥ నుండి రా॥ 12 గం॥ వరకు.

**11-8-94 -- గురువారం -- నాల్గవ రోజు**

**శ్రీవారి మూలవరులకు క్షీరాధివాసము మరియు మహాశాంతి తిరుమంజనం**

ఉ॥ 9 గం॥ నుండి మ॥ 3 గం॥ వరకు, రా॥ 10 గం॥ నుండి రా॥ 12 గం॥ వరకు.

**12-8-94 -- శుక్రవారం -- ఐదవ రోజు -- పూర్ణాహుతి**

మ॥ 1 గం॥ నుండి రా॥ 7 గం॥ వరకు, రా॥ 8 గం॥ నుండి రా॥ 12 గం॥ వరకు.

* 9, 10 తేదీల సర్వదర్శన వేళల్లో హారతి, తీర్థం, శఠారి ఇవ్వబడవు.
* 8-8-94 నుండి 11-8-94 వరకు కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, ఊంజల్ సేవ, వసంతోత్సవం, సహస్రదీపాలంకార సేవ మున్నగు ఆర్జిత సేవలు జరుపబడవు.
* 9-8-94 నుండి 12-8-94 వరకు సుప్రభాతం, తోమాల సేవ, అర్చన మున్నగువాటికి ఆర్జిత టిక్కెట్లు అమ్మబడవు.
* 8-8-94 నుండి 11-8-94 వరకు విశేషపూజ, అష్టదళపాదపద్మారాధన, సహస్రకలశాభిషేకం, తిరుప్పావడ మున్నగు ఆర్జితవారోత్సవాలు నిర్వహింపబడవు.

**భక్తులు ఈ మార్పులను గమనించగలరు.**

కార్యనిర్వహణాధికారి,
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

Published on behalf of T.T. Devasthanams by N.S. Ramamurthy, M.A., Editor-Incharge and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



కామధేను విదే! కల్పవృక్ష మిదే!
ప్రామాణ్యముగల ప్రపన్నులకు!

హరినామ జపమే ఆభరణంబులు!
పరమాత్ముని నుతి పరిమళము!
ధరణీ ధరు పాదసేవే భోగము!
పరమం బెరగిన ప్రపన్నులకు!

దేవుని ధ్యానము దివ్యాన్నంబులు!
శ్రీవిభు భక్తే జీవనము!
ఆ విష్ణు కైంకర్యమే సంసారము!
పావనులగు యీ ప్రపన్నులకు!

యేపున శ్రీ వేంకటేశుడే సర్వము!
దాపై యితనివందనమే విధి!
కాపుగ శరణాగతులే చుట్టాలు!
పై పయి గెలిచిన ప్రపన్నులకు!



— అన్నమయ్య అధ్యాత్మకీర్తన: 488, రాగం: లలిత, సంపు: 2 (1981)

# తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి

# బ్రహ్మోత్సవ క్రమము



| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 5-10-94 | బుధ | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 6-10-94 | గురు | వజ్రకవచాద్యాభరణములతో బంగారు తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 7-10-94 | శుక్ర | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 8-10-94 | శని | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 9-10-94 | ఆది | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 10-10-94 | సోమ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | మకరకంఠి శ్రీ లక్ష్మీహారాద్యాభరణాద్యలంకారములతో గరుడోత్సవం |
| 11-10-94 | మంగళ | హనుమద్వాహనం సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 12-10-94 | బుధ | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 13-10-94 | గురు | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 14-10-94 | శుక్ర | పల్లకీ ఉత్సవం, తిరుచ్చి ఉత్సవం తీర్థవారి అవబృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

ఈ పదిరోజులూ తిరుమల ఆస్థానమండపంలో ప్రముఖ పండితులచే ధార్మికోపన్యాసాలు, పురాణప్రవచనాలు జరుపబడతాయి. సంగీత కార్యక్రమాలు, హరికథలు, భజన కార్యక్రమాలు కూడ జరుగుతాయి.




# ఈ సంచికలో... సెప్టెంబరు, 1994

సంపుటి 25 సంచిక 4



గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త-ఇన్‌చార్జి సంపాదకులు
ఎస్.ఎస్. రామమూర్తి, ఎమ్.ఎ.
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎం. విజయకుమార్‌రెడ్డి,
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం॥ చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



ముఖచిత్రం : శ్రీదేవి భూదేవి సమేత శ్రీవేంకటేశ్వరుడు(తిరుమల శ్రీవారి కల్యాణోత్సవం)
2 వ కవరు పేజీ : శ్రీవినాయకుడు రేఖాచిత్రం : జగదీష్
3 వ కవరు పేజీ : శ్రీవామనావతారం-రేఖాచిత్రం: నారాయణగిరిదత్తు
4 వ కవరు పేజీ : శ్రీ అవినాక్షమ్మ దేవాలయం-నారాయణవనం
సెంటర్ స్ప్రెడ్ : అదివో! అలదివో! శ్రీహరివాసము!!!

# సంపాదకీయం

"ఏకం సత్, విప్రాః బహుధా వదంతి" -- పరమాత్మ స్వరూపం ఒక్కటే. కాని ఆ భగవంతుని రూపాలను జ్ఞానులు అనేక విధాలుగా వర్ణించారు. కీర్తించారు. ఇలా ఆధ్యాత్మిక ఉపాసనా ప్రపంచంలో ఎందరో దేవుళ్లు మనకు దర్శనమిస్తారు. ఎందరు దేవుళ్లు వున్నా ఎవరి ప్రత్యేకతలు వారివే. ఎవరి పూజా విధానాలు వారివే. అయినా రూపంలోను, ఆకారంలోను, బుద్ధిలోను, అర్చనావిధానంలోను,... ఇలా అనేక విషయాల్లో తనకంటూ ఒక ప్రత్యేకతనూ, శ్రేష్ఠత్వాన్నీ కలిగినవాడు వినాయకుడు.

వినాయకుడు అంటే విశిష్టమైన నాయకత్వ లక్షణాలు కలవాడని కొందరంటే, ఈయనకు దీటైన నాయకుడు లేనివాడని మరికొందరంటారు. ఈ వినాయకుణ్ణే విఘ్నేశ్వరుడు, గణపతి, గజాననుడు, ఏకదంతుడు, లంబోదరుడు, శూర్పకర్ణుడు, మూషిక వాహనుడు ... ఇలా ఎన్నో పేర్లతో భక్తులు అత్యంత ప్రియంగా పిలుచుకుంటారు.

కొన్ని పూజలూ, వ్రతాలూ కొందరికి మాత్రమే పరిమితం. కొందరి దేవుళ్లను కొందరుమాత్రమే పూజిస్తారు. కాని గణాధిపతి అందరికీ దేవుడు. పిల్లలు, పెద్దలు, పురుషులు, స్త్రీలు, పేదవారు, ధనవంతులు, బ్రహ్మచారులు, సన్యాసులు, యోగులు, విరాగులు,. ఇలా అందరూ గజాననుణ్ణే పూజిస్తారు. అంతమాత్రమే గాక శైవులు, శాక్తేయులు, అద్వైతులు, ద్వైతులు... ఇలా అందరూ వారి వారి ఉపాసనల్లో పూజల్లో తొలిగా విఘ్నరాజును అర్చిస్తారు.

"లక్ష్మీపతిని ప్రార్థిస్తే సంపదను ఇస్తాడు. భూపతిని పూజిస్తే భూముల్ని ప్రసాదిస్తాడు. విఘ్నేశుని స్తుతిస్తే విఘ్నాలనే ఇస్తాడు కనుక నేను విఘ్నాధిపతిని ప్రార్థించనుగాక ప్రార్థించను. అయినా విఘ్నాలు కల్గించవద్దనిమాత్రం స్తుతిస్తాను" అని అన్నాడట చమత్కారంగా ఒకాయన. ఆ శ్లోకమిది.

*భూ నాయకం వా ధన నాయకం వా*
*భజన్ భువం వా ధనమేతిలోకే*
*తద్విఘ్ననాథం న భజామి కిం తు*
*సహస్ర శస్త్రం ప్రణమామి నిత్యమ్.*

గణపతి కేవలం విఘ్నాల్ని తొలగించడమే కాదు. విద్యల్ని ప్రసాదిస్తాడు. సంపదను ఇస్తాడు. సిద్ధిని, బుద్ధిని కలిగిస్తాడు.. ఇలా భక్తుల కోరికలను బట్టి లక్ష్మీగణపతిగా, సిద్ధిగణపతిగా, బుద్ధిగణపతిగా, సస్యగణపతిగా (పంటల దైవం).. ఇలా ఎన్నో పేర్లతో దర్శనమిచ్చినా, గణేశుని స్థూలరూపంలో మాత్రం ఎక్కువ మార్పు కనపడదు.

బానకడుపు, చేట చెవులు, చీమకళ్లు, ఏనుగుతొండం, పొట్టికాళ్లు, విరిగిన దంతం, మూషికవాహనం.. వినాయకుని ఈ బాహ్య రూపానికీ, ఆయనకున్న మేధాశక్తికీ, సునిశితబుద్ధిసూక్ష్మతకూ ఎంతో తేడా గోచరిస్తుంది. తల్లిదండ్రులకు ప్రదక్షిణంచేస్తే ముల్లోకాలు యాత్ర చేసిన ఫలం దక్కుతుందనే సూక్ష్మబుద్ధితో గణాధిపత్యాన్ని పొందాడు. తద్వార ప్రత్యక్ష దైవతాలైన తల్లిదండ్రుల్ని పూజించి ఇష్టార్థ సిద్ధిని పొందండి - అన్న సందేశాన్ని, ఈ పార్వతీపుత్రుడు తెలియజేశాడు.

ఆత్మసౌందర్యాన్ని గుర్తించక, గుర్తించలేక కేవలం బాహ్యరూపాన్ని మాత్రమే చూసి పరిహసించే చందమామలాంటివాళ్లకు శృంగభంగం తప్పదనికూడ ఈ లంబోదరుడు దివ్యోపదేశం ఇచ్చాడు.

దేవుడి పూజకు అందరూ అర్హులే - అన్నదానికి ప్రత్యక్షర సత్యంగా అందరిచేతా పూజలందుకుంటూ, గడ్డిపోచ మొదలుకొని జిల్లేడు, ఉమ్మెత్త ..... ఇలా కనపడిన ఆకులు, అలములు, పూలు, పండ్లూ...ఇలా సర్వవస్తువులకూ తనపూజలో అర్హత కలిగించి, సృష్టిలోని ఏ వస్తువునూ హీనంగా చూడకూడదన్న దివ్యజ్ఞానాన్ని సైతం ఈ బుద్ధి గణపతి ప్రసాదిస్తున్నాడు.

తన జ్ఞానదంతంతో, సర్వధర్మసముచ్చయమైన మహాభారతానికి వ్రాయసకాడై శాశ్వతంగా దానిని మనకందించిన శ్రీ మహాగణపతిని, అందరికీ విద్యాబుద్ధులు ప్రసాదించాలనీ, పాడి పంటల్ని వర్ధిల్ల చేయాలనీ, లోకకల్యాణ కారకములైన పనుల్ని నిర్విఘ్నంగా నెరవేర్చాలని మనసారా ప్రార్థిద్దాం.

*భవ సంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణమ్*
*విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజ మహం భజే.*

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః




మానవుడు తను అనుకున్న కార్యము నిర్విఘ్నముగ జరగడమునకు గణపతిని పూజించడము భారతీయులకు అనాదిగా సంప్రదాయము. ఆరీతిగా పూజించనియెడల కోపంవచ్చి వినాయకుడు ఆపనిని జరగకుండా చేసేవాడట! ఏమనగా - విఘ్నములు ఆయన చేతులలో వున్నవి.

ఈ విషయమును మనసులో ఉంచుకొని ఒక మహాపండితుడు 'భూనాయకుణ్ణి కొలచినచో భూమిని దానం చేసేవాడు. ధనాధిపతిని కొలిస్తే ధనము దానం చేస్తాడు. విఘ్ననాయకుని కొలిస్తే విఘ్నములే ప్రసాదిస్తాడు. అందువలన నేను ఆయనను సేవించను, కాని మాజోలికి రావలదని వేయి నమస్కారాలు చేస్తాను" అని వినాయకుని స్తుతించినాడు.

కార్యారంభంలోనే కాక ఏ దేవతను పూజించదలచినను ముందు ఈ వినాయకునికి పూజ జరుగవలసినదే! ఇట్లా సర్వదా, సర్వత్రా ఈ పూజ జరుగుతున్నా భాద్రపద శుద్ధ చవితినాడు యావద్భారతమూ విశిష్టంగా పూజ జరుగుతుంది. ఆరోజు ఆయన జన్మదినం కాబట్టి.

వినాయకుని జన్మను గురించి అనేక గ్రంథాల్లో అనేక రీతులుగా చెప్పబడివున్నవి. వాటిలో పార్వతీదేవి పిండిబొమ్మను చేసి ప్రాణం పోయించడం, శివుడు కోపించి తలను ఎగురగొట్టగా ఏనుగుతలను పెట్టించడం, ఎలుక వాహనంకావడం, చంద్రుడు నవ్వగా కోపించడం, తత్ప్రభావమువలన శ్రీకృష్ణుడికి నీలాపనింద రావడం - ఇత్యాది అందరూ చెప్పుకునే కథ బహుళ ప్రచారంలో వున్నది.

వినాయకుడు శాశ్వత బ్రహ్మచారి. 'సిద్ధి బుద్ధి ప్రియా' అని అతడిని పిలవడంవల్ల సిద్ధి బుద్ధి అని ఇద్దరు భార్యలు అతనికి ఉన్నారని కొందరు చెప్పెదరు. సిద్ధి అంటే కార్యసిద్ధి అనీ, బుద్ధి శబ్దముల స్త్రీ లింగములు కావడంతో సిద్ధి బుద్ధులు వినాయకుడి భార్యలు అని ఊహించి వుండవచ్చునేమోనని కొందరి అభిప్రాయముగా నున్నది. వినాయకుణ్ణి కొలిచేవారికి కార్యసిద్ధి అవుతుందని, గొప్పబుద్ధి కలుగుతుందని గ్రహించవలయును. అందుచేతనే గణపతి విద్యార్థులు తప్పక కొలచవలసిన వేల్పని విద్యాధి దేవతయనీ శాస్త్రఘోష. ప్రాచీనపద్ధతులు అనుసరించెడి విద్యార్థులు వినాయకుని భాద్రపద శుద్ధ చవితినాడు తప్పక పూజించెదరు.

ఆరోజు మొదలు తొమ్మిది రోజులు వైభవంగా పూజలు చేసి విద్యా చర్చలు, మహోపన్యాసాలు, కాలక్షేపములు మొదలైనవి జరిపించెదరు.వసంత నవరాత్రులు, దేవీ నవరాత్రులు వలెనే ఈ వినాయక నవరాత్రులునూ ప్రసిద్ధమైనవిగావున్నవి.

సెప్టెంబరు 9న, వినాయకచవితి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.

సం॥

వినాయకుని స్వరూపం చాలావింత, వికృతంగా వుంటుంది. ఏనుగుతల, ఏకదంతం శూర్పకర్ణాలు, లంబోదరం, పాములను పొట్టకు చుట్టబెట్టుకోవడం మొదలగునవి అన్నీ విచిత్రం ఇట్టివానికి ఎలుక వాహనం కావడం మరీ విచిత్రము!

దీనినిబట్టి చూచినచో ఈ దేవుడు పంటల వేల్పని కొందరు చెప్పడం చూస్తే నిజమేమో ననిపిస్తుంది. తొండంతో సహా గజశిరస్సు - ధాన్యం కోతలయ్యాక వరిమోపును తలపై పెట్టుకొని పోతున్న కర్షకుని

సూచిస్తున్నాడని కొంద రనెదరు. ఏక దంతం చేను కోసే కొడవలికి గుర్తుంటారు. చెవులు ధాన్యం తూర్పారబట్టె చేటలకు ఉప లక్షణములు అని తెలుపుతారు. లంబోదరం ధాన్యపు గాదెల చిహ్నం అని ఊహించినారు. అతనికి నివేదించే కుడుములు, ఉండ్రాళ్ళు వరిపంటనే సూచిస్తాయని వారి ఉద్దేశం. పాములు పంటలను అపహరించే ఎలుకలు లేకుండ గమనించెద వంటున్నారు. ఎలుక వాహనం కావడంవలన - దాన్ని అణిచి వేసి తన స్వాధీనంలో వుంచుకోవడం అని గ్రహించమంటారు.

వినాయకుడి ఏనుగుతల బుద్ధికిన్నీ, వాహనమైన ఎలుక శ్రద్ధకున్నూ, చిహ్నములని కొందరి అభిప్రాయం.

పరమేశ్వరుడు విఘ్నరాజును గణాధి పత్యమును అనుగ్రహించగా, బ్రహ్మదేవుడు అణిమాదులైన అష్టసిద్ధులనూ ఇచ్చినాడట! గణాధిపతి బ్రహ్మ చేసిన ఉపకారాన్ని గురించి సంతోషించి ఏం కావాలో కోరుకొమ్మని అడి గాడట!

అప్పుడు బ్రహ్మ తను చేసే సృష్టికార్య క్రమానికి ఎటువంటి విఘ్నమూ కలుగకుండా వుండేటట్లు వరమివ్వాలని కోరగా వినాయ కుడు 'అలాగే'నని వరమిచ్చినాడట! దీనివలన మనకర్థమగునదేమంటే బ్రహ్మ అంతటివాడు అనగా దేవతలలోనే శ్రేష్ఠుడైనటువంటివాడే వినాయకుడిని వరము కోరుతుంటే ఎంత విలువో!

గౌతమ బుద్ధుడికి వినాయకుడనే పేరు వుందు. అతడు ఒక జన్మలో ఏనుగుగా ఉండి నట్లు మనకు జాతకకథల వలన తెలియుచు న్నది. మాయాదేవికి వచ్చిన స్వప్నంలో శ్వేత గజ సమాచారం కనబడుచున్నది. వీటన్నిం టినిబట్టి చూచిన యెడల వినాయకపూజా, అదీ బౌద్ధమతపు భావంవల్ల వైదిక మతంలో ప్రవేశించినట్లు కొందరు భావిస్తున్నారు. కానీ ఆరీతిగా భావించేది విదేశీయులు మాత్రమే. యథార్థంగా బౌద్ధమతము రాకముందు ఎన్నో వేల సంవత్సరాలకు ముందే వైదిక మతంలో వినాయకుడి సమాచారం కనపడుతున్నది.

అందుచేత ఈ పాశ్చాత్యుల ఊహాపోహలు నిరాధారమని చెప్పవలసివస్తున్నది.

మన మత కథలకు ఖగోళ విషయాలలో సంబంధం కల్పించడం కూడా ఉన్నది. అది చాలావరకు యుక్తియుక్తంగానే కనబడుతుంది. సాధారణంగా భాద్రపద శుద్ధ చవితినాడు హస్తా నక్షత్రం వుంటుంది. హస్తానక్షత్రం ముంజేతి ఆకారంలో ఉంటున్నది. ఆనాడు సూర్యోదయాత్పూర్వమే వినాయక నక్షత్రము ఉదయిస్తుంది. అందువలన అతనికి హస్తిత్వం సంభవిస్తుంది. దాన్నిబట్టే వినాయకుడికి గజత్వం కల్పితమైనది. ఆనాటి చంద్రుణ్ణి - ఊహించి చూచిన బోసినోటితో నవ్వుతున్నట్లు కనబడుతుంది.

వినాయకుని చూసి చంద్రుడు నవ్వుతున్నాడని గ్రహించబడి వుంటుంది. దీనిని అనుసరించే చంద్రుణ్ణి చూడకూడదనే శాపం, శమంతకమణి వృత్తాంతం కూర్చబడినది.

శమంతకమణి కథలోని సింహం సింహరాశి. ఆ రాశిలోవున్న సూర్యుడే శమంతకమణి. జాంబవంతుడే పాశ్చాత్యులు తెలిపే గ్రేట్ బేర్ - అనగా పెద్ద ఎలుగుబంటు.

ఈవిధంగా వివిధ కోణములలో చూచినచో వినాయకుడి వృత్తాంతం వేర్వేరు రీతులలో గోచరిస్తుంది. ఏవిధంగా చూచినా వినాయకుడు మాత్రం అందరికీ ఆరాధ్యుడైన వేలుపు. వినాయకచవితి పవిత్రమైన పర్వదినము. అందరూ తప్పక ఆరాధించవలసిన దైవము అని అనక తప్పదు.

వినాయకుని గురించి ఎవరెన్ని విధములుగ ఊహించుకున్నను భారతదేశములో ముఖ్యంగా తమిళనాడులో వినాయకుని దేవాలయములు అసంఖ్యాకంగా కనిపిస్తాయి. తమిళులకు వినాయకుని మీద వున్నంత భక్తి విశ్వాసములు మరెవరికిని లేవనవచ్చును కూడ.. వినాయకుడి గుడి కనుపించడముతో తమిళ సోదరుడు కాలికి గల జోడు వదలి చక్కగ నమస్కరించి, గుంజిళ్ళు కూడా తీసిగాని మరి కదలనివారు కో కొల్లలు.

సుమారు పదునాలుగువందల సంవత్సరములకు ముందు ఈ వినాయక దేవాలయములు ఇంతవిరివిగ నున్నట్లు కనబడదు. అపుడు కుమారస్వామి ఆరాధనలే ఎక్కువగా వున్నట్లు తోచుచున్నది.

పల్లవ చక్రవర్తియైన నరసింహవర్మ బాదామి (అప్పుడు వాతాపి) పట్టణము ముట్టడించి పులకేశిని జయించి విజయచిహ్నంగ రాజధాని అయిన కంచిలో వినాయక మందిరం నిర్మింపచేసినాడు. ఆనాటి



నుండి తమిళనాడులో వినాయక పూజలు అడుగడుగునా జరుగనారంభించినవని చరిత్రకారులు తెలియజేస్తున్నారు.

ప్రాచీనతమిళ వీరశైవ సాహిత్యములోను వినాయకునిప్రశంస కనుపించకపోవడము ఈ సత్యమునకొక నిదర్శనమని వారు తెలుపుచున్నారు.

సాధారణంగా రాజులు తమ శత్రువులను జయించినతరువాత వారు బిరుదులు ధరించడము, విజయచిహ్నంగ వారి వారి కులదైవములయొక్క మందిరములను నెలకొల్పడము అనూచానంగా వస్తున్న ఆచారము.

ఆంధ్రభోజుడైన శ్రీ కృష్ణదేవరాయలు సింహాచలవిజయము తరువాత తన రాజధానియైన విజయనగరములో ఉగ్ర నరసింహ విగ్రహమును, తిరువనంతపురము జయించిన తరువాత అనంతశయనమందిరమును నిర్మింపచేసినాడు.

వినాయకుడు భక్తుల భావాలను, ఊహలను అనుసరించి వివిధరూపాలను స్వీకరించినాడు. శిల్పులును భక్తులఅభీష్టముల మేరకు తమ తమ కళావిన్యాసములతో మరికొన్ని అందాలను మలచి దిద్దినారు. ఏనుగు స్వభావము, ప్రవర్తన మొదలైనవాటిని ముఖ్య భావాలుగ భావించి విగ్రహములను తయారు చేసినారు.

ప్రస్తుతము వినాయకుని వివిధ స్వరూపములను గురించి తెలుసుకుందాము.

దేవాలయములలో రూపమండపములలో వినాయకుని ప్రతిష్ఠించవలయునని మత వాస్తు సంప్రదాయము ఏర్పడినది. ఈ విగ్రహములలో స్థానక మూర్తులు, ఆసనమూర్తులు, నృత్యమూర్తులు, మొదలగునవి ఆగమ శాస్త్రములలో కనబడుచున్నది.

ఆసన మూర్తులకు "ఆసనం పద్మం, మూషికం, ఒక్కొక్కప్పుడు సింహం. స్థానక మూర్తులలో ద్విభంగి, సమభంగి మూర్తులు కూడా ఏర్పడినవి. ఆసనమూర్తులలో ఎడమ కాలుముడిచిన తరువాత కుడికాలు మడిచి ఎడమ తొండమీద పెట్టవలయును. కాని, వినాయకుడు లంబోదరుడు కావున ముడవడం సాధ్యంకాదని శిల్పులు, కుడికాలును ఆసనంమీద కుక్కుటాసనం వాడు గండరించడము సాంప్రదాయమయినది.

ఏనుగు తన తొండం ఒక్కక్షణమైనా నిశ్చలంగా వుంచదు. నిరంతరం కదలుతూ దేనినైనా పుణుకుతూ వుంటుంది. కనుక

(41 వ పేజీలో)



శ్రీ చెంగల్ రెడ్డిగారితో బహుమతి స్వీకరిస్తున్న చి॥ ఆర్. సంధ్యారాణి




## తిరుపతిలో సుప్రభాతం పోటీలు

తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆళ్వారు దివ్య ప్రబంధ ప్రాజెక్టు ఆధ్వర్యంలో తిరుపతి పాఠశాలలోని విద్యార్థినీ విద్యార్థులకు ఇటీవల సుప్రభాత పోటీలు నిర్వహింప బడ్డాయి.

94 జూలై 2 వ తేదీన తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో తి.తి.దేవస్థానం ధర్మకర్తలమండలి ఛైర్మన్ శ్రీ ఆకేపాటి చెంగల్ రెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొని సుప్రభాతపోటీలో విజేతలైన విద్యార్థినీ విద్యార్థులకు బహుమతులందజేస్తూ, చిన్నపిల్లలకు సుప్రభాతం, భగవద్గీత వంటివి కంఠస్థం చేయించి వారిని ఆధ్యాత్మిక మార్గంవైపు మళ్లించే బాధ్యత తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు వుందని చెప్పుతూ, అలా చేస్తే వారి జీవితాలు బాగుపడతాయన్నారు.

అంతకుముందు ఆళ్వారు ప్రాజెక్టు డైరెక్టరు డా॥ మేడసాని మోహన్ సభను ప్రారంభిస్తూ ఆళ్వారు దివ్యప్రాజెక్టు కార్యక్రమాల ద్వారా, ఆళ్వారులు కీర్తించిన నాలుగువేల పాశురాలను ఆ యా వైష్ణవ దివ్యక్షేత్రాల్లో విస్తృత ప్రచారం చేస్తున్నట్లుగా వివరించారు.

ఈ సుప్రభాత పోటీల్లో సీనియర్సులో శ్రీ పి. ప్రసాద్ 10వ తరగతి, (యస్.వి. ఓరియంటల్ హైస్కూల్, తిరుపతి,) మొదటి బహుమతి; శ్రీ జి. రామయ్య (9వ తరగతి యస్.వి. ఓరియంటల్ హైస్కూలు, తిరుపతి,) రెండవ బహుమతిని., కుమారి ఎస్. నీలిమ (9 వ తరగతి ఆదర్శ విద్యాలయం, తిరుపతి,) రెండవ బహుమతిని., శ్రీ కె. విజయానంద్ (9 వ తరగతి శ్రీహర్ష ఉన్నతపాఠశాల, తిరుపతి,) మూడవ బహుమతిని పొందారు.

అలాగే జూనియర్సులో కుమారి వి. ఉషామాధురి (8 వ తరగతి శ్రీ గోవింద రాజస్వామి హైస్కూల్, తిరుపతి,) మొదటి బహుమతిని., కుమారి ఎం. నీలిమ ( 8 వ తరగతి ఆదర్శవిద్యాలయం, తిరుపతి,) రెండవ బహుమతిని., కుమారి. సి. పావనీ దేవి ( 7 వ తరగతి శ్రీ గోవిందరాజస్వామి హైస్కూలు, తిరుపతి,) మూడవ బహుమతిని., కుమారి ఆర్. సంధ్యారాణి ( 8 వ తరగతి యస్.వి. హైస్కూలు, తిరుమల) మూడవ బహుమతిని పొందారు.

వీరందరికీ శ్రీ ఎ. చెంగల్ రెడ్డి వేంకటేశ్వరస్వామి వారి వెండి డాలర్లు, గీతాపుస్తకాలు, యోగ్యతాపత్రాలు బహూకరించి ఆశీర్వదించారు.

ఈ సుప్రభాత పోటీలకు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన ఉపాధ్యాయులు శ్రీ పి.సి. గోపాలాచార్యులు, శ్రీ ఐ. శేషాద్రి అయ్యంగారు, శ్రీ పి.ఆర్. రంగరాజన్, శ్రీ కె. శింగరాచార్యులు, శ్రీమతి వి. వసంత మున్నగువారిని కూడ శ్రీ చెంగల్ రెడ్డి దుశ్శాలువలతో సత్కరించారు.

చివరగా ఆళ్వారు దివ్య ప్రబంధ ప్రాజెక్టు సూపరింటెండెంటు శ్రీ ఆర్. వెంకటరమణారెడ్డి గారి వందన సమర్పణతో నాటి సభ ఘనంగా ముగిసింది.



### విజ్ఞప్తి

ధర్మప్రచార వార్తలు ప్రచురణకుగాను తప్పక తెలుపు నలుపు ఫోటోలు జత-పరచాలి. కలర్ ఫోటోలు అంగీకరింపబడవు, ప్రచురింపబడవు.







(గత సంచిక తరువాయి)

మత్తమాతంగ హయ భట మహితు లగుచు
సర్వదిశల భీమములు శస్త్రాలు దాల్చి
దైత్యవీరులు హనుమపై దాడిచేయ
వారలను చంపి కపి చేరె తోరణమ్ము.

సంగరంబున మానిత సైన్యపతుల
వానరుడు ద్రుంచజేసిన వార్త నెరిగి
రావణుండు క్రోధమును వైరమ్ము కాంచి
శూరమణి సుతు నక్షకుమారు పంపె.

వ్యోమవీథిని పావని పోరుసలిపి
సుతుని అక్షకుమారుని హత మొనర్ప
గుండె చెదరంగ దుఃఖించి కోపమంది
ఇంద్రజిత్తును పంపె దైత్యేశు డపుడు.

రావణుని పుత్రు డమితపరాక్రముండు
దారుణమహోగ్ర దుర్వారతప మొనర్చి
బ్రహ్మ మెప్పించి పడసెను వరము లెన్నొ
అన్యదుష్ప్రాప మతని మహాస్త్ర బలము.

# రావుల రామాయణము

అసమధైర్యము వహియించి అని కతండు
వినుతవీర్యవంతులు వెనువెంట రాగ
రథముపైని విహాయసపథము బట్టి
ఎడతెరపిలేక కురియించె ఇషుచయంబు.

చేతులాడక బాలుని చీల్చిచెండ
హనుమ చేయుచు సింహమహారవంబు
చేతిదెబ్బలతోడ విచిత్రసరణి
నేలగూల్చెను రథమును నింగినుండి.

కార్ముకమ్ముతో నెదిరింప గాంచి హనుమ
స్వీయపరికరము బలము చింతజేసి
వేగముగ మింటిపైనుండి విసరికొట్ట
దైత్యు డతడు చచ్చె బంధనము లూడి.

హనుమ ఆతని గాంచి దేహమ్ము పెంచి
యుద్ధ మొనరించె బాణాల కోర్చుకొనుచు
ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము నేయ లొంగె
అనిలతనుజాతుడు పితామహాస్త్ర మహిమ.

త్రాళ్ల దైత్యులు కట్టిన తత్క్షణంబె
పట్టువదలెను బ్రహ్మాస్త్రబంధ మెల్ల
రాక్షసులు తన కడచేర్చ రావణుండు
క్రూరముగ చూచె వానరవీరవరుని.

రాక్షసాధిపరూప దర్శనముతోడ
వానరుని మది నిట్టి భావాలు తోచె
"దశముఖుడు హారకంఠుడు శశిముఖుండు
సకల శుభకర మహిత లక్షణయుతుండు.

డాక్టర్
శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి



ఏమి రావణు? డా రూపమేమి? అతని
ధైర్యమదియేమి? అతని సత్త్వం బదేమి?
ఏమి ఆతని తనుకాంతి? ఏల డొక్కా
ఇతని యెడ ధర్మమున్న దేవతల గూడ."

అపుడు మంత్రిసత్తముని ప్రహస్తు నరసి
కపిని ప్రశ్నింపు మనియె రాక్షసవిభుండు;
ఆంజనేయున కా మంత్రి అభయ మొసగి
అతని ప్రశ్నించె నిట్లు సత్యంబు పలుక.

"నీవు కపిమాత్రుడవు కావు నిక్క మరయ
ఏల వచ్చినాడవు? పంపి రెవరు నిన్ను?
వానరా! వచింపుము పొంద బంధముక్తి
ప్రాణములు నీకు దక్క వబద్ధమాడ."

వానరుడు దైత్యవిభునకు పలికె "దనుజ
రాజ! నా రాక నీదు దర్శనము కోరి
సాగె సమరమ్ము; అస్త్రశస్త్రాలు నన్ను
బంధితుని చేయలే విది బ్రహ్మవరము.

వాయుసూనుడ నే నాంజనేయు డనెడి
వానరుడ నిన్ను కనుగొన వచ్చినాడ
రాజకార్యంబు సాధింప రావణేశ!
అస్మదీయహితోక్తుల నాలకింపు.

అవనిజాతను వెదకెడు యత్నమందు
నలుదెసలకు మా విభుడు వానరుల బంపె;
భ్రాతృసముడు సుగ్రీవుడు పలుకు మన్న
పలుకు లాలించి సుఖముగ బ్రదుకు మీవు.

'బ్రహ్మకును మనుమండవు ప్రాజ్ఞ డవును
అన్యభార్యను హరియింప న్యాయ మగునె?
రామచంద్రుని దివ్యశరాల మ్రోల
నిఖలలోకాల నెవడేని నిలువ గలడె?

అవనిజాతను రాముని కప్పగించి
శరణు వేడు' మటంచు మా దొర వచించె;
దారుణంబుగ లంకలో దాచినట్టి
శోకవహ్నిని సీతను చూచినాడ.

బూది గావింప నేర్తు నీ పురము నెల్ల
సమ్మతింపడు రాముడు సలుప నట్లు
కోరె సీతాపహారిని కూల్ప తానె
లేసిహో నాకు నీ పొక లెక్కకాదు.

కాళరాత్రిగ వైదేహి కాంచుమయ్య!
ఆమెకతమున నీ బ్రదు కస్తమించు;
కానరాడు రామసము డే కాలమందు
నృపతిసింహుడు సర్వలోకేశు డతడు."

అంత సురవైరి రోషతామ్రాక్షు డగుచు
పుణ్యు హనుమంతు చంపగ బూనినంత
భాషణ మొనర్చె నిట్లు విభీషణుండు
ధర్మపథవర్తి రావణుతమ్ము డతడు.

"రాజధర్మవిశారద! రాక్షసేంద్ర!
దూతవధ నీచ; మిది లోకదూషితంబు
తగిన రీతి నొనర్పుము దండనమ్ము
ప్రాజ్ఞు లెవ్వేళ దుష్క్రోధవశులు గారు.

క్రోతి నీ విట్లు వధియింప కోపమంది
రామలక్ష్మణుల నెవండు రణ మొనర్ప
తెచ్చు? యుద్ధావకాశంబు తెలిసి వదల
దైత్యవీరు లెల్లరు నిరుత్సాహపడరె?"

రాక్షసాధిపుడైన ఆ రావణుండు
భ్రాతను విభీషణుని గాంచి పలికె నిట్లు
"తోచు మేలుగ నాతని తోక గాల్చి
నాల్గుదిక్కుల ద్రిప్పగ నగరమందు."

శీఘ్రముగ జీర్ణవస్త్రాలు చేరవేసి
గట్టిగా వాలమునకును చుట్టి భటులు
తైలమును సాంద్రముగ జల్లి దానిపైన
నిప్పు వైచిరి వీథుల ద్రిప్ప నెంచి.

స్వామి కార్యార్థ మతడు కష్టాలు సైచి
వీధి వీథుల తిరిగెను వేడ్కమీర
సీత కా వార్త రాక్షసస్త్రీలు చెప్ప
వీతిహోత్రుని ప్రార్థించె వెలది యిట్లు.

"దయితు దైవమ్ముగా నేను తలతు నేని
నేను సాధ్వీమతల్లినై నిలుతు నేని
కరుణ నా పైని. ప్రియునకు కలద యేని
హనుమ యెడ చల్లదనమూను మగ్నిహోత్ర!

వహ్ని వెలుగుచు హనుమంతు వాలమందు
సీత కోరిన యట్లయ్యె శీతలుండు;
జ్వలను డటు చల్లనౌట కాశ్చర్యమంది
జానకీరాములను కపి సంస్తుతించె.

కనికర మొకింత మదిలేక కాల, చేత
వావ మోదెను హనుమ రాక్షసగణమ్ము
ఇట్లు భావించె మదిని కపీశు డంత
తనదు మహనీయ భావికర్తవ్య మెలమి.

"సలిపినాడను పూర్ణనాశనము వనము
చంపినాడను వీరరాక్షసగణమ్ము;
సమయ జేసితి నొకవంతు సైన్యమందు
మిగిలె దుర్గవినాశమే నగరిలోన.

భవనముల నెల్ల కాల్చంగ వహ్నిచేత
తల్లడిల్లిరి పిల్లలు తల్లులెల్ల;
ప్రజలు ప్రాణాలు కోల్పోవ భస్మమయ్యె
పురము సర్వము; భయపడె భూతతతియు."

లంక దహియించి తోక చల్లార్చుకొన్న
హనుమ కసురుల రోదనధ్వనులు వినగ
భయము భ్రాంతియు జనియించె పడతి సీత
భస్మమై యుండునో! అని, వహ్ని శిఖల.

పరిపరివిధాల సీతకై పరితపించు
హనుమ చారణవాక్యాల నాలకించి
సీత, జగదేకపతిసతి క్షేమ మెరిగె
సంతసించె మహాసాధ్వి శక్తి దలచి.

"ఎంత ఘోరము తప్పెనో ఎరిగినాడ
కాలునెడ వహ్నికీలల కాంత సీత
కార్యహాని యొనర్చుటే గాక నేను
స్వామి హనన పాపమ్మును సలిపి యుందు."

అట్లు యోచించి ఆనందమంది హనుమ
సీత నిక రామచంద్రుని చేర్ప దలచి
ముదిత దర్శించి శింశుపామూలమందు,
పలికె "కనులార నినుగంటి భాగ్యవశత."

పలికె హనుమతో వైదేహి భర్తృభక్తి
"కార్య మీడేర్ప జాలు దొక్కడవె నీవు
కాని దైత్యసంహార మిక్ష్వాకువిభుడు
సలిపి సన్నుతి గాంచుట సముచితంబు."

హనుమ పుడమి పుత్రికి మ్రొక్కి అధికభక్తి
స్వామిసందర్శనాపేక్ష వొకలింప
అతిమనోహరమగు అరిష్టాద్రి నెక్కి
కడలి దాటంగ నెగిరెను గగనమునకు.

కళల కిరవైన పురిని వికల మొనర్చి
ప్రథితరాక్షసవిభునకు బాధ గూర్చి
సీత కభయ మొసంగి ఆశీస్సు లంది
గాలికొమరుడు వెడలెను కపుల గలియ.

(సశేషం)

గత సంచిక తరువాయి

# శ్రీ కృష్ణసూరి చరితము

## (శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై ప్రభావము)

### అభయప్రదరాజు

వాదికేసరి అళగియ మణవాళ జీయ్యరు వీరివలననే ఉజ్జీవించి రనుట క్రింద తెలుప నున్న కథాముఖమున తెలియుచున్నది. ఈ జియ్యరు పూర్వాశ్రమమున (గృహస్థులుగా నున్నప్పుడు) పెరియవాచ్చాన్ పిళ్ళైకు మహానస కైంకర్యము (వంటచేసి పెట్టుట) చేయుచుండిరి. అప్పుడు పెరియవాచ్చాన్ పిళ్ళై గారిని సేవింపవచ్చిన కొందరు విద్వాంసులు ఒక ప్రక్క వసించుచు ఒక గ్రంథమును విమర్శించుకొనుచుండిరి. వీడి (పాచకులు) అదియేమి శ్రీకోశము అని వారి నడిగిరి. నిరక్షరకుక్షి యగు వీరు గ్రంథము పేరు చెప్పినను తెలిసికొనలేని 'ముసలకిసలయము' (ఉలక్కై క్కొళుందు రోకటి చిగురు) వంటి జ్ఞానము కలవారని ఎత్తి చూపి పరిహసించుటకై గ్రంథము పేరు 'ముసలకిసలమమ్' (ఉలక్కై క్కొళుందు) అని చెప్పిరి. యథాశ్రుతగ్రాహి (చెప్పినది చెప్పినట్లే గ్రహించెడి అమాయకుడు) ఐన వీరు వాస్తవముగానే ఆపేరుగల గ్రంథమునే వారు పరిశీలించుచున్నారని తలచి పెరియవాచ్చాన్ పిళ్ళై యొద్ద "ఆ విద్వాంసులు నేనడుగగా తాము ముసలకిసలయ గ్రంథమును పరిశీలించుచున్నట్లు చెప్పినారు; అది యెవ్వరు రచించినది?" అని యడిగిరి. కృష్ణసూరి వాస్తవ వృత్తాంత మెరిగి "అట్టి పేరు గల గ్రంథము లేదు. నీ బుద్ధి రోకటి చిగురు వంటిదని (మతిమంతుని కుశాగ్రబుద్ధి అని, మందమతిని ముసలాగ్రబుద్ధి యనియు పరిహసించుట స్మరణీయము ) నీవు తెలివి లేనివాడవని పరిహసించు చున్నారు." అని మనఃఖేదముతోడ పలికిరి. అది వినిన అళగియమణవాళర్ కృష్ణసూరి శ్రీపాదములను గట్టిగా పట్టుకొని "దాసుని (నన్ను) ఎట్లైనను పండితునిగా చేయవలెను." అని వేడుకొనిరి. అభయప్రదరాజు (కృష్ణసూరి) వారిని లేవనెత్తి ప్రేమతో కౌగలించుకొని అభయప్రదానముచేసి ఆ దినము మొదలుకొని అక్షరాభ్యాసముతో తొడగి పలుశాస్త్రములందు పారము చెప్పి, సంస్కృతద్రావిడ భాషల యందలి లక్ష్య లక్షణగ్రంథములందు వారిని పారంగతులనుగా నొనర్చిరి. వరదరాజన్

**శ్రీ యస్.సి.వి. నారసింహాచార్య**

అను పూర్వాశ్రమనామధేయము గల వీరు 'ముసలకిసలయమ్ 'అనుపేర ఒక గ్రంథము రచించి పరిహసించిన పండితులు తలవంచుకొనునట్లు చేయుచు వారికే దానిని చూపిరి. ఇదియే ఆకథ. వాదికేసరి రచించిన 'తత్త్వ నిరూపణమ్' అనుగ్రంథారంభమున నున్న ఈ శ్లోకము వైభావము తెల్పుచున్నది.

> అభయప్రద నామానం
> అస్మద్గురు మహం భజే,
> యత్కటాక్షా దయం జంతు-
> రపునర్జన్మతాం గతః.

(అజ్ఞుడ నగు నేను పశుతుల్యుడను ఎవ్వరి కటాక్ష ప్రసారము వలన జన్మరాహిత్యము (మోక్షము) పొందితినో అట్టి మహిమాన్వితమైన అభయప్రదులను నామ ధేయముగల మా యాచార్యులకు మ్రొక్కులిడుదును. )



భగవద్విషయమునకు చెందని, ఆధ్యాత్మికము గాని బాహ్యావిషయములను వర్ణించునప్పుడు కూడ శ్రీకృష్ణసూరి వ్యాఖ్య అద్భుతమై యుండును. అట్టిదే ఒక ఉదాహరణము నివేదింపబడుచున్నది.

పెరియతిరుమొళియందు తిరునఱైయూరు విషయకమైన పాశురములలో "మెన్ మలర్ మేల్ కళియావండు కళ్ళుణ్ణక్కామర్ తెన్ఱల్ అలర్ తూ్ఱ్ట నఱిర్వాయ్ముల్లై మఱువలిక్కుమ్ నఱైయూర్" అనునదొక్కటి (6-4-7) (మెత్తని యలరులపైనున్న కైపెక్కిన తుమ్మెద మధుపానము (మధువన తేనె, మద్యమును) చేయగా కోర్కెలు పెంచెడి తెమ్మెరలు పూలను విరజిమ్మగా (సువాసనలు విసరగా) చల్లని మొల్లలు చిరునగవు లొలయించిన తిరునఱైయూరు" అనునది సంగ్రహ భావము) ఇది ఉద్యానవనములందు సాధారణముగ కన్పట్టెడు వృత్తాంతమే. భ్రమరములు మధుపానము చేయుటయు చల్లగాలులు వీచుటయు మొల్లలు మొగములు విచ్చుట యును స్వభావోక్తియే. కాని ఇట శబ్దార్థసంఘటనా సౌందర్యము జూచి మేధావి పెరియవాచ్చాన్ పిళ్లై తమ వ్యాఖ్యానము చమత్కారముగ వ్రాసినారు.

"మెన్ మలర్మేల్ ఇత్యాది - కణ్డవిడ మెల్లాం పరప్పు మాఱ పూత్తు క్కిడక్కుమితే. అదిలే మధు పానాన్త్తమాక క్కిట్టిన వండుకాళ్ అత్తె క్కిట్టి ప్పెట్ర హర్షత్తావే కళిత్తు నిషిద్ధసేవై పణ్ణంవారైప్పోలే మధుపానత్తై ప్పణ్ణిట్రిన. అత్తైక్కణ్డ తెన్ఱల్ నాట్టిలే

పళియై త్తూ్ఱ్ట్రిట్రు. అత్తైక్కణ్డ తెన్ఱల్ నాట్టిలే పళియై త్తూ్ఱ్ట్రిట్రు. అత్తైక్కణ్డ ముల్లై, పురుంద ప్రమాదత్తైయును సంఘిత్తు 'అదుదాన్ అప్పడి చ్చెయ్ కిఱదు, ఇదుదాన్ ఇప్పడి శెయ్యక్కడవదో' ఎన్ఱు వాయ్ విట్టు చ్చిరిక్కమాట్టామై స్మితం పణ్ణిట్రు."

"ఇచ్చట నచ్చట యనక కన్నచోట్లెల్ల పూచియున్న దన్నమాట. అందు మధుపానార్థమై డగ్గరిన తుమ్మెదలు చేరి పొందిన హర్షము చేత మద మెక్కి నిషిద్ధసేవనము (మధు (మద్య) పానము) చేయువారివలె మధుపానము చేసినది. అదిచూచిన మలయ మారుతము దేశమున దోషప్రఖ్యాపనము చేసినది. అదిగాంచిన మొల్ల చొచ్చిన పొరపాటు ననుసంధించి 'అది యేమో అట్లు చేసినది పో, ఇదియు నిట్లు చేయవలెనా' అని నోరు తెరచి పెద్దగా నవ్వలేనందున మందస్మిత మొనర్చినది" - ఇది కృష్ణసూరి వివరణ

పైవాక్యముల తాత్పర్యమిట్లు తెలియనగును - భ్రమరముల మధుపానము (మధు శబ్దమునకు తేనె అనియు మద్యమనియు రెండర్థములు) చేసిన వనియు మందమారుతము దోషోద్ఘాటన చేసినదనియు మొల్లపూవు చిరునగ వొలయించిన దనియు మూలమున నున్నది. ఇచట "అలర్ తూ్ఱ్టుదల్" అనుమాట గమనింపదగినది. దీనికి పుష్పములు (వాసన) వెదజల్లుట అను నర్థమే గాక, తప్పులు చాటిచెప్పుట అనునర్థముకూడ నున్నది. ఇది గమనించి ఆచార్యులవారు సమాసోక్త్యలంకారచ్ఛాయలో రసవత్తరముగా ఒక అర్థవిశేషము నిట్లు వెలువరించినారు. తుమ్మెద (దండు) అను పదముతో వైష్ణవుడు అను నర్థము సూచింపబడినట్లు గ్రహింపవలెను. అతడేదో విధివశమున కల్లుత్రాగవలసివచ్చినదట. అది చూచి యొకడు 'కల్లు ద్రావినాడు కల్లు త్రావినాడు' అని ఆ తప్పును 'దండోరా' వేయదొడగినాడట. ఆరెంటిని చూచిన యొక సాత్త్వికుడు, ఏదో దుర్విధి వశమున ఒకవేళ అకృత్యము చేయవలసివచ్చినదే పో, దానిని గురించి ఈ రీతిగా నొక్కడు తప్పులు చాటింపు వేయవలెనా? అజ్ఞాన తిమిరావృతమైన ఈ జగమందు ఇట్టిది సహజమేకదా? అని మిన్నకుండరాదా? అని అట్టహాసము లేక నోరు విప్పి పెద్దగా నవ్వలేక, ఇది లోకపరిపాటియే అని మందస్మితము చేసినాడట. ఎట్టివానికైనను ఒక నిషిద్ధకృత్యము చేయవలసివచ్చుట సహజమనియు దానినిగూర్చి ఒకడు తప్పులు పట్టుటయు సహజమే యనియు, ఇది యేమి ప్రమాదము? దీనికెంత ప్రచారమేల? అని కొందరు అనుభవజ్ఞులు సరిది చెప్పుటయు కద్దు అనియునిట్లు లౌకిక సన్నివేశమును బోధించునట్లు వ్యాఖ్యానించుట విలక్షణ మేధా విలాసము. ఇది యొక ఉదాహరణమాత్రమే. ఇట్టివెన్నో!

శంగనల్లూరులో (స్వగ్రామము) వీరికి సంబంధించిన చరిత్ర అధికముగ ప్రచారములో లేదు. వీరు కుటుంబముతోడ తిరుమల (తిరుపతి) యాత్రగా విజయము చేసినా రనియు, అచట తిరుమల వేంకటేశ్వరుల నుండి శ్రీనివాస విగ్రహమొక్కటి పొందినారనియు ఆ విగ్రహమును శంగనల్లూరులో ప్రతిష్ఠించి రనియు ఆయూరి చరిత్ర చెప్పుచున్నది. శ్రీరామచంద్రుని పాణి గ్రహణము చేసిన పిమ్మట మిథిలకు చనిన సీతాదేవి వలె తమ జననీ జానకులకు చరమ కైంకర్యములు ముగించుకొని శ్రీరంగమునకు వచ్చి నంబిళ్లై శ్రీపాదముల నాశ్రయించిన పిమ్మట - "తెరిత్తెళుది వాశిత్తుం కేట్టుం వణంగి వళిపట్టుం పూజిత్తుం పోక్కినేన్ పోదు" (నాన్ముగన్ తిరువందాది)- తెలిసి, వ్రాసి, చదివి, విని, మ్రొక్కి, కైంకర్యము చేసి, పూజించియు కాలము వెళ్లబుచ్చితిని - అని తిరుమళిశైయాళ్వారు నుడివిన రీతిగ నంబిళ్లై శ్రీచరణముల పజ్జ సకలార్థములు ఆకర్ణించుటయందును వారి యాజ్ఞ చొప్పున వారినుండి వినిన వానిని తేర్చి వ్యాఖ్యాన రూపముగ వ్రాయుట యందును, వారు పరమపదించిన తరువాత వీడక్కుత్తిరు వీధి పిళ్లై మున్నగు సబ్రహ్మచారులను (సహాధ్యాయులను) చేర్చుకొని శ్రీరంగమునందు దర్శన నిర్వాహము (మతప్రచారము) చేయుట యందే కాలమంతయు కడపుచుండుట వలనను వీరు శంగనల్లూరుకు మరలి రాలేదని తలపవచ్చును.

శ్రీరంగమున వీరు వసించిన కాలము, ముందు వెనుకల నెప్పుడు గాని లేనంతటి మంచి ప్రశాంత కాలముగా నుండినది. శ్రీభగద్రామానుజాచార్యుల కాలమందు, భట్ట పరాశరుల కాలమందును పాలకుల ఉపద్రవము మెండై యుండెను. పిళ్లైలోకాచా

(39వ పేజీలో)



# దేవతలారా! దీవించండి!

శ్రీ నదాథూరు జగన్నాథాచార్యులు

## 15. నాగదేవత

నాగులయొక్క ఉత్పత్తి కశ్యపుని రెండవ భార్య అయిన కద్రువ వలన జరిగినది. ఈనాగులయొక్క నివాసస్థానము పాతాళ లోకము దీనినే నాగలోకం అనికూడ అందురు.

అనంతం వాసుకిం శేషం
పద్మనాభం చ కమ్బలమ్,
శంఖపాలం ధృతరాష్ట్రం
తక్షకం కాళీయం తథా.

ఏతాని నవ నామాని
నాగానాం చ మహాత్మనామ్,
సాయం కాలే పఠేన్నిత్యం
ప్రాతఃకాలే విశేషతః,
తస్యవిషభయం నాస్తి
సర్వత్ర విజయీభవేత్.

1. అనంత. 2. వాసుకి. 3. శేష. 4. పద్మనాభ. 5. కమ్బలమ్. 6. శంఖపాల. ధృతరాష్ట్ర. 8. తక్షక. 9. కాళీయ. అను ఈనవ నాగదేవతలను నిత్యం స్మరించుట వలన విషభయం లేక సర్వత్ర విజయము కలుగును.

అకారణంగా సర్పములను సంహరించుట, హింసించుట చేసిన దోషం కలుగుతుంది. మంచి జాతిగల సర్పమైతే ఈదోషం ఏడుతరాల వరకు బాధిస్తుంది. ఈనాగదోషం వలన సంతానహీనులగుట. కుష్ఠు, బొల్లి, మొదలగు వ్యాధులను పొందుట జరుగును. ఈ నాగదోష పరిహారార్థము నాగదేవతా ప్రతిష్ఠ, నాగదేవతాపూజ చేసు



# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కామకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడ ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాల కోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణ మితి శ్రుతిః |
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః |

— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీతమైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

'చంద్రశేఖర'

కోవలెను. నాగులచవితికి నాగదేవతకు పాలుపోసి పూజించిన సామాన్యమైన నాగ దోషములు తొలగిపోతాయి.

జరత్కారుర్జగ ద్గౌరి
మనసా శిద్ధయోగినీస
వైష్ణవీ నాగభగినీ
శైవీ నాగేశ్వరీ తథా.
జరత్కారు ప్రియాస్తీక
మాతా విషహరేతి చ,
మహాజ్ఞానయుతా చైవ
సా దేవీ విశ్వపూజితా.
ద్వాదశైతాని నామాని
పూజా కాలే తు యః పఠేత్,
తస్య నాగభయం నాస్తి
సర్వత్ర విజయీ భవేత్.

అని ప్రతినిత్యం నాగదేవతను ప్రార్థించాలి.

## 16. సత్యనారాయణస్వామి

ధ్యాయే త్సత్యం గుణాతీతం
గుణత్రయ సమన్వితమ్,
లోకనాథం త్రిలోకేశం
కౌస్తుభాభరణం హరిమ్.

అన్నవరం నందు వెలసి అర్చామూర్తిగా పూజింపబడుచున్న స్వామి సత్యనారాయణ స్వామి. స్కాందపురాణము ప్రకారం విష్ణుమూర్తి అవతారమే ఈసత్యనారాయణ స్వామి. ఈస్వామిని పూజించుచు చేయు వ్రతమునకు సత్యనారాయణ వ్రతము అని పేరు. గృహప్రవేశకాలంలోను, కష్టములు సంభవించినపుడు, దరిద్రముతో బాధపడుతున్నప్పుడు ఈ వ్రతాన్ని చేసుకోవలెను. ఎప్పుడైనా మంచిరోజు చూసుకొని ఈవ్రతాన్ని చేసుకోవచ్చును. లేదా వైశాఖ, మాఘ, కార్తీక మాసములలో ఒక శుభదినమున ఆచరించవలెను. ఈవ్రతమువలన ధనధాన్య సమృద్ధి శుభము కలుగును.

## 17. శ్రీవేంకటేశ్వరస్వామి

తిరుమలలో అర్చామూర్తిగా వెలుగొందుచున్న స్వామి శ్రీవేంకటేశ్వరస్వామి. ఈ





స్వామి గురించి వేంకటాచల మాహాత్మ్యములో వివరింపబడినది. ఆర్థిక, గ్రహబాధలు కలవారు శనివారమున ఈస్వామిని ఉపాసించవలెను. ఈస్వామిని పూజించుచు చేయు వ్రతమునకు శనివారవ్రతము అని పేరు. ఈస్వామిని భక్తితో కొలిచి, తలనీలాలు సమర్పించి మొక్కుబడులు తీర్చుకొన్నవారికి సకలసంపదలుగల్గును.

శ్రియః కాంతాయ కళ్యాణ
నిధయే నిధయేఽర్థినామ్,
శ్రీవేంకటాచల నివాసాయ
శ్రీనివాసాయ మంగళమ్.

## 18. షోడశ మాతృకలు

గౌరీ పద్మా శచీ మేధా
సావిత్రీ విజయా జయా,
దేవసేనా స్వధా స్వాహా
మాతరో లోకమాతరః.
ధృతిః పుష్టిస్తథాతుష్టి
రాత్మనః కులదేవతాః.

1. గౌరి. 2. పద్మా. 3. శచి. 4. మేధా. 5. సావిత్రి. 6. విజయ. 7. జయ. 8. దేవసేన (షష్టి). 9. స్వధా. 10. స్వాహా. 11. మాతరః. 12. లోకమాత. 13. ధృతి. 14. పుష్టి. 15. తుష్టి. 16. కులదేవత. ఈ షోడశ మాతృకలను యజ్ఞ యాగాదులలోను వివాహాది శుభకార్యములలోను అభ్యుదయము కొరకు పూజించుదురు.

పరమాత్మునియొక్క శక్తులు 7.

అవి

శ్రీర్లక్ష్మీశ్చ ధృతిర్మేధా
పుష్టిః శ్రద్ధా సరస్వతీ,
మాంగల్యేషు ప్రపూజ్యన్తే
సప్తైతాఘృత మాతరః.

1. శ్రీదేవి. 2. లక్ష్మి. 3. ధృతి. 4. మేధా. 5. పుష్టి. 6. శ్రద్ధా. 7. సరస్వతి, వీరిని సప్త ఘృతమాతృకలు అందురు. కళ్యాణ దాయకము, మంగళప్రదము కలుగుటకు వీరిని పూజించుదురు.

దశ మహావిద్యాధి దేవతలు

1. కాళీ. 2. తారా. 3. ఛిన్నమస్త. 4. శ్రీవిద్య. 5. భువనేశ్వరీ. 6. త్రిపుర భైరవి. 7. ధూమవతి. 8. బగళాముఖీ. 9. మాతంగీ. 10. కమల వీరిని పూజించుట వలన విజయము, ఐశ్వర్యం, అనంతకీర్తి లభించును.

## 19. ధన్వంతరి

స వై భగవతః సాక్షాత్
విష్ణో రంశాంశ సమ్భవః,
ధన్వంతరీతిఖ్యాత
ఆయుర్వేద దృగ్విజ్యభాక్.

పురాణములనుబట్టి ఈధన్వంతరి విష్ణువుయొక్క అంశతో సర్వ ఓషధులు కలిగిన

కలశమును చేత ధరించి క్షీరసాగర మదన సమయమున క్షీర సాగరమునుండి ఉద్భవించెను. దేవతలకు వైద్యుడై చికిత్స చేయుచు పేరుపొందెను. తన ఆయుర్వేద విద్యను విశ్వామిత్రుని కుమారుడైన సుశ్రుతునికి ఇంకా వందమంది మునికుమారులకు ఉపదేశించెను. తాను "ధన్వంతరీ సంహిత" అనుగ్రంధమును లోకోపకారమునకై రచించెను. అందు రోగములు – వాటిలక్షణములు, చికిత్స మొదలైన అంశములు గలవు. ఈయన తర్వాత అశ్వనీ కుమారులు దేవతలకు వైద్యులయిరి. వీరిద్దరు అన్నదమ్ములు తమకున్న అనుభవముతో గొప్పకీర్తి పొందిరి. వీరు "అశ్వనీకుమార సంహిత" రచించిరి. వీరుదేవాసుర సంగ్రామములో గాయపడిన దేవతలకు చికిత్సచేసిరి. ఇంద్రునికి కూడ చికిత్సచేసిరి. చంద్రుని క్షయరోగమును, పూషా అనుదేవతకు దంతములను, భగ అనుదేవతకు నేత్రములను బాగుచేసిరి. చ్యవనుని ముసలితనమును పోగొట్టిరి. ఈఅశ్వనీ కుమారులు దధీచి మహర్షి ద్వారా బ్రహ్మవిద్యను పొందిరి. వీరిని పూజించుట వలన రోగవిముక్తి, ఆరోగ్యప్రాప్తి కలుగును.

## 20. దక్షిణామూర్తి

విశ్వం పశ్యతి కార్యకారణతయా
స్వస్వామి సంబంధతః,
శిష్యాచార్యతయా తథైవ
పితృ పుత్రాద్యాత్మనా భేదతః,
స్వప్నే జాగ్రతి వా య ఏష
పురుషో మాయా పరిభ్రామితః,
తస్మై శ్రీగురుమూర్తయే నమ
ఇదం శ్రీదక్షిణామూర్తయే.

దక్షిణ భారతంలో ప్రసిద్ధిపొందిన స్వామి ఈదక్షిణామూర్తి. ఆదిశంకరాచార్యస్వామి వారు దక్షిణామూర్తి స్తోత్రమును కూడ రచించిరి. ఈదక్షిణామూర్తి 4 విధములైన విగ్రహరూపములో దర్శించవచ్చును.

1. వీణాధరమూర్తి. 2. యోగమూర్తి. 3. జ్ఞానమూర్తి. 4. వాఖ్యానమూర్తి. శంకరాచార్య తమ అద్వైత తత్త్వమును ఈ దక్షిణామూర్తినే ఆదర్శముగా తీసుకొని బోధించిరి. ఈయనను పూజించుటవలన ఆధ్యాత్మిక ఉన్నతి, శాంతి లభించును.

## 21. కార్తికేయస్వామి

కార్తికేయుడు శివుని కుమారుడు. వాహనము నెమలి. భార్యదేవసేన. 1. మురుగన్.



2. కుమారస్వామి, 3. స్కంధ. 4. షణ్ముకస్వామి. 5. సుబ్రహ్మణ్యస్వామి. అనుపేర్లు గూడ గలవు. ఇతనిని పూజించుట వలన, ఉపాశించుటవలన ఉన్నతపదవి, యుద్ధమునందు జయముకలుగును. అర్చామూర్తిగా ఉత్తర భారతంలో కాశ్మీరులోను, దక్షిణ భారతంలో మద్రాసు కన్యాకుమారి ప్రాంతంలోను విశేషముగా ఆరాధింపబడుచుండెను.

సిందూరారుణకాన్తి మిన్దువదనం
కేయూర హారాదిభి ర్దివ్యై
రాభరణై ర్విభూషితతనుం
స్వర్గస్య సౌఖ్యప్రదమ్,
అమ్భోజాభయ శక్తి కుక్కుట
ధరం రక్తాంగరాగాంశుకమ్
సుబ్రహ్మణ్య ముపాస్మహే
ప్రణమతాం భీతి ప్రణాశోద్యతామ్.

## 22. సాలగ్రామమూర్తి

విష్ణుమూర్తి వృంద అను పతివ్రతయొక్క శాపము వలన సాలగ్రామ శిలగా మారెను. వృంద కూడ తులసిగా జన్మించి విష్ణుమూర్తికి ప్రియుత్వము కలిగించెను. హిమాలయ మద్యభాగములోనున్న సాలగ్రామశిఖరమును ముక్తినాధక్షేత్రం అని పిలుచుదురు. విష్ణువు యొక్క గండ స్థలమునుండి ఉద్భవించినది గండకి అనుపేరుగలనది. ఈనదిలో సాలగ్రామ శిలలు దొరకును. ఇవి సాక్షాత్తు నారాయణ స్వరూపమైనవి. వీటియొక్క ఆకృతి, చక్ర చిహ్నములు, భేదములనుబట్టి దామోదర, వాసుదేవ, నృసింహ, లక్ష్మీనారాయణ, వామన, మత్స్య, సుదర్శన, సీతారామ, మొదలైన సాలగ్రామములు కలవు. వీటిని సమసంఖ్యలోనే పూజించాలి. కానిరెండు సాలగ్రామములను మాత్రమే పూజించరాదు. ఒక్కటే సాలగ్రామమును పూజింపవచ్చును. ఈశాలగ్రామములను స్త్రీలు పూజింపరాదు. స్త్రీలు పూజింపవలసివచ్చినచో పురోహితుని చేతగాని, బ్రాహ్మణునిచేతగాని పూజింపచేయవలెను.

వ్రతము, దానము, ప్రతిష్ఠ, శ్రాద్ధము మొదలైన సత్కర్మలలో ఈ సాలగ్రామపూజ విశేష ఫలము నిచ్చును. వీటిని గూర్చి భవిష్యత్, పద్మ, స్కంధ, వరాహ, బ్రహ్మవైవర్త, దేవీభాగవతాది పురాణములలో తెలుపబడినది. ఈ సాలగ్రామ పూజవలన మోక్షప్రాప్తి కలుగును.

సాలగ్రామ శిలాచక్రే
భువనాని చతుర్దశ,
యస్మాత్ తస్మాత్ శివం మేస్యాత్
తతః శాన్తిం ప్రయచ్ఛ మే.

అని చెప్పి సాలగ్రామమును శ్రోత్రియుడై బ్రాహ్మణునకు దానముచేసి అనంత పుణ్యఫలము కలుగును.

(33వ పేజీలో)

# ముఖాముఖి



మనిషిని మనిషిగా చూపించే దర్పణం భగవద్గీత!
సమస్యా విషవలయాలనుండి రక్షించే దివ్యకవచం భగవద్గీత!



గర్భస్థ శిశువునకు నాభి ఎలాంటిదో
సమాజానికి ప్రేమమూర్తి అయిన స్త్రీ అలాంటిది!



సమాజంలోని విద్వేషాలకు, అలజడులకు కారణం రాజకీయమే! మతం కానే కాదు.

## శ్రీనివాసుని పద సన్నిధిలో
## శ్రీశ్రీశ్రీ చినజీయరుస్వామి



శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయరుస్వామి 1994 జూలై 22 వ తేదీనుండి తిరుపతిలో చాతుర్మాస్య దీక్షను పాటిస్తూ వున్నారు.

ఈ సందర్భంగా శ్రీ జీయరుస్వామి, తి.తి.దేవస్థానం ధర్మప్రచార పరిషత్ ఆధ్వర్యంలో అన్నమాచార్య కళామందిరంలో 94 జూలై 27 నుండి ప్రతిరోజూ సాయంత్రం "శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ గీతాప్రవచనం" అనే ధార్మిక కార్యక్రమాన్ని నిర్వహిస్తూ వున్నారు.

1994 అక్టోబరులో బ్రహ్మోత్సవాల అనంతరం తిరుమల క్షేత్రంలో శ్రీ చిన జీయరు స్వామివారు "శ్రీ విష్ణుసహస్రనామకుండ మహాయజ్ఞం" నిర్వహించనున్నారు.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని తి.తి.దేవస్థానం మాసపత్రిక 'సప్తగిరి', జూలై 29 శుక్రవారంనాడు శ్రీమన్నారాయణ చినజీయరు స్వామివారితో సమావేశం జరిపింది. 'సప్తగిరి' పాఠకులకు మంగళాశాసనం చేస్తూ ఆశీస్సులు అందించవలసినదని అభ్యర్థిస్తూ వారితో ఇంటర్వ్యూ కావించింది.

శ్రీజీయరుస్వామివారు స్వహస్తాలతో అందరకు పవిత్ర మంగళాశీర్వచనాలను ప్రసాదిస్తూ తమఅమూల్య-సందేశాన్ని అనుగ్రహించారు.

ఇంటర్వ్యూ విశేషాలు పక్కపుటలో...

# ఇంటర్వ్యూ : సప్తగిరి

## సమాధానాలు : శ్రీ శ్రీ శ్రీ చినజీయరుస్వామి

* ప్రశ్న:

పుణ్యశ్రీచరణులైన శ్రీ స్వామివారు తిరుమలక్షేత్ర ఔన్నత్యాన్ని శ్రీ స్వామివారి మహిమను గూర్చి తెలుపగోరుతున్నాము?

* * శ్రీ జీయరుస్వామి:

భగవత్తత్త్వం ఒక జీవనది. మానవులు ఆ నదీజలాన్ని త్రాగటానికి సేవించటానికి వీలుగా సహజంగా ఏర్పడ్డ రేవులే ఈ దివ్య క్షేత్రాలూ, తీర్థాలూను. అఖండంగా, అనంతంగా వ్యాపించివున్న భగవత్తత్త్వం ఈ క్షేత్రాల్లో ప్రస్ఫుటంగా వెల్లడవుతూ వుంటున్నది. అట్టి పరమాత్మతత్త్వాన్ని ఉపాసించి భక్తులెల్లరూ సులభంగా తరించవచ్చు.

ఈ శ్రీనివాసుణ్ణి గూర్చి పరమ వైష్ణవ భక్త శిఖామణులైన ఆళ్వారులు, కర్ణాటక హరి దాసులు, తాళ్లపాక కవులు, ఇలా ఎందరో కీర్తించారు. గానం చేశారు.

* తిరుమల యాత్రికులకు భక్తులకు తమ సందేశాన్ని సెలవియ్యండి!

* * భక్తితో యాత్రచేసినా, దీక్షతో క్షేత్రానికి వచ్చినా లేదా సరదాగా పిక్నిక్‌కు వచ్చినా, తిరుమల క్షేత్రానికి రావటం అందు వెలసి వున్న పరదైవం శ్రీనివాసుణ్ణి దర్శించటం అనేది గొప్ప అదృష్టం! మహద్భాగ్యం కూడా. కాని, ఒక్కవిషయం. ఎంతటి నైపుణ్యంకల డాక్టర్లైనా, సర్జన్లు అయినా, ఆపరేషన్ థియేటరులోనికి వెళ్లటానికి కాళ్లకున్న జోళ్లు తీసివేయటం, కాళ్లూ, చేతులు డెట్టాలుతో పరిశుభ్రం చేసి కోవడం.... ఇల్లాంటి కొన్ని కనీస నియమాలు తప్పనిసరిగ విధిగా పాటించాలి! పాటిస్తారు కూడ. అప్పుడే వారు చేపట్టిన ఆపరేషన్ విజయవంతమవుతుంది. అలాగె వేంకటాచల క్షేత్రానికి రావటం - కారణం ఏదైనా కావచ్చు. యాత్రికులు, భక్తులు, పర్యాటకులు.... ఇలా అందరూ ఆక్షేత్ర పవిత్రతకు భంగం కలగని రీతిలో సంచరించాలి. క్షేత్ర నియమాల్ని విధిగా పాటించాలి. అప్పుడే వారి యాత్ర ఫలవంతమవుతుంది. ఆవిధంగా శ్రీనివాస పరమాత్ముని సంపూర్ణ అనుగ్రహానికి పాత్రులవుతారు.

* తిరుమల క్షేత్రంలో "శ్రీ విష్ణుసహస్రనామ కుండ మహాయజ్ఞం" లోకకాంతికై నిర్వహించనున్నారు కదా! తిరుమలలోనే చేయటానికి గల ప్రత్యేక కారణం ఏదైనా వుందా?

* * పరమ పవిత్రమైన దివ్యభూమి తిరుమల కొండ. శ్రీనివాసస్వామి సన్నిధిలో ఏ సత్కార్యం చేసినా ఫలితం అత్యధికంగా వుంటుంది. అంతేగాక ఈక్షేత్రంలో ఈ మహాక్రతువును నిర్వహించవలసినదిగా ఆ వేంకటాచలపతి సంకల్పం కల్గించాడు. ఆ స్వామివారి ఆజ్ఞానుసారమే ఈ కార్యం నిర్వహింపబడుతున్నది.

గతంలో 1972 లోను 1980 లోను రెండు పర్యాయాలు ఈ క్షేత్రంలోనే ఇలాంటి క్రతువు నిర్వహింపబడింది. మళ్లీ 1994 అక్టోబరులో మూడవసారి నిర్వహింపబడుతున్నది.

* మహిళా లోకానికి తమరిచ్చే దివ్య సందేశం?

* * గర్భస్థ శిశువుకు నాభి ఎలాంటిదో సమాజానికి స్త్రీమూర్తి అలాంటిది! పుట్టుకతోనే కొన్ని విశిష్ట లక్షణాలు, ప్రత్యేకమైన ఉన్నతమైన అర్హతలు కలదై వుంటుంది స్త్రీమూర్తి. తన బిడ్డలకు ప్రేమను పంచుతుంది. ప్రేమించడం నేర్పుతుంది. ఇలాంటి ప్రేమకు నోచుకోకుండ పెరిగిన పిల్లలు ప్రేమ, జాలి, కరుణ లేని కర్కశహృదయులై సమాజానికి ఉపయోగపడక పోవటం అటుంచి, కనీసం తమకైనా ఉపయోగపడకుండా పోవడం జరుగవచ్చు. అందువల్లనే కుటుంబ సభ్యులను ముఖ్యంగా బిడ్డలను తీర్చిదిద్దే బాధ్యత ప్రేమమూర్తి అయిన స్త్రీకి ఎంతైనా వుందని గ్రహించాలి. స్త్రీ తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించాలి. ఆ కర్తవ్యాన్ని నిర్వహించే విషయంలో ఆమెకు తక్కిన అందరూ తగిన విధంగా తోడ్పడాలి.

* సనాతన ధర్మాన్ని ఒందలి అమూ

## స్త్రీ తన బిడ్డలను ప్రేమిస్తుంది, ప్రేమించడం నేర్పుతుంది!

శ్రీవేంకటాచలక్షేత్రంలో స్వయంభువై వెలసివున్న పరమాత్మ శ్రీనివాసుడు. శ్రీ అంటే తల్లి. దయా స్వరూపిణి, ప్రేమ స్వరూపిణి అయిన శ్రీమహాలక్ష్మియే ఆమె. ఆమెను నివాసంగా కలవాడే "శ్రీ-నివాసః" - అంటే శ్రీనివాసుడు. శ్రీస్వామి వారి హృదయం మీద ముందుకు వొచ్చుకొని వచ్చి ఆసీనురాలయింది ఆ అమ్మ! భక్తులందరి, బిడ్డలందరి ప్రార్థనల్ని ముందుగా ఆ తల్లి వింటుంది, వెంటనే ఆ తండ్రికి వినిపిస్తుంది! ఆమెను కాదనలేక, ఆమెమాటకు కట్టుబడి శ్రీనివాసపరమాత్మ భక్తులకోరికలను తీరుస్తున్నాడు. వరాలను గుప్పిస్తూ వున్నాడు. పాపాలను పోగొడుతూ వున్నాడు. సకల సంపదలను ప్రసాదిస్తూవున్నాడు.

ల్యాంశాలను గూర్చి ప్రజానీకానికి ఎలా ప్రబోధించాలో ఏవిధంగా ప్రచారం సాగించాలో సెలవిస్తారా?

* * సనాతన ధర్మప్రబోధానికి సమర్థులైన ప్రచారకులు కావాలి. తాత్త్వికమైన ఐతిహాసికమైన విజ్ఞానంలో సుశిక్షితులైన వారు సనాతన ధర్మాన్ని ప్రచారం చెయ్యాలి. అలాంటివాళ్లే చక్కగా ప్రచారం చెయ్యగలరు. నిర్మాణాత్మకంగా ప్రచార కార్యక్రమాలు చేపట్టాలి. వాళ్లు అప్రామాణికతలను నిస్సందేహంగా ఖండిస్తూ ప్రామాణికంగా ప్రచారం చెయ్యాలి.

* నేటి సమాజం మీద ధార్మిక విద్యా ప్రబోధాల ప్రభావం ఎంతవరకు వుంటుంది?

* * ధార్మిక విద్య లేదా ధార్మిక ప్రబోధం మనిషిని తనవైపు (తన్నుతాను) ఆలోచించుకొనేట్లు చేస్తుంది. వ్యక్తి తనవిధిని (Duty) సక్రమంగా నిర్వహించేట్టు చేస్తుంది. వ్యక్తికి సంతృప్తిని, నిస్స్వార్థాన్ని ప్రసాదిస్తుంది. అందుమూలంగా ఇతరులకు సహాయపడటం నేర్పిస్తుంది.

* ఆధునిక నాగరికతా ప్రభావంవల్ల నేటి యువతరం అశాంతికి లోనవుతున్నది. వారిపట్ల మీరిచ్చే సందేశం ఏమిటి? వారికి సంబంధించిన కార్యక్రమాలు ఏవైనా ఉన్నాయా?

* * యువతలో కూడ ఆధ్యాత్మిక చింతన, భక్తి అంతర్లీనంగా దాగివుంది. ఆలోచనా సరళి వుంది. వారిని సరియైన మార్గంలో పెడితే వాళ్లు బాగుపడ తారు. సమాజమూ బాగుపడుతుంది. ముఖ్యంగా యువతకు జీవితలక్ష్యం ఏమిటో నిర్ధాంపజేయాలి. అందుకు తగినట్లుగా మానసిక ధైర్యం కలిగించాలి. ఆధ్యాత్మిక, సాంస్కృతిక రంగాల్లో, ప్రజా సంక్షేమ సహాయ కార్యక్రమాల్లో పాల్గొనటంలో తగిన ప్రోత్సాహం అందివ్వాలి. వాళ్లు రాజకీయాలకు దూరంగా ఉండేట్టు చూడాలి.

ప్రియ భగవద్బంధువుల్లార!
శ్రీమతే నారాయణాయనమః!
అనేక మంగళాశాసనములు!

ఈ చాతుర్మాస్య సమయం శ్రీనివాసుని సన్నిధిలో జరగడం ఒక విశేషం. సహస్ర కుండ యాగము మహాక్రతువని జరిపించు కోవటానికి శ్రీనివాసుడు ఈ అవకాశాన్ని మాకు ప్రసాదించాడు.

ఈ సందర్భంగ శ్రీనివాసుని దివ్యగ్రంథాలతో నడుస్తున్న మాస పత్రిక "సప్తగిరి" పంచభాషా మాసపత్రిక తన రజతో త్సవాన్ని జరుపుకున్న విషయం తెలిసి, పురంతో ఎంతో కాలం ఈ పత్రిక ద్వారా ధర్మాన్ని, పరమాత్మ సందేశాన్ని అందుకొనే ఉత్సాహంతో దీన్ని పోషించే శ్రద్ధాళువులున్నందుకు ఎన్నో అభినందించాలని అనిపించింది.
కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీనివాసుడు, లీలావిశేషం వలన ప్రజలందరి మనోభావాలు పదిల పరచుకొనేట్లు "సప్తగిరి" మరింత నూతన తేజస్సుతో, తన సౌందర్యాన్ని మీకందించాలని పత్రిక కార్యవర్గానికి మంగళాశాసనం చేస్తున్నాం.
- శ్రీమన్నారాయణ -
ఇట్లు (త్రి. చి. జీయరు)

మేము 'వికాస తరంగిణి' అనే సంస్థను యువతకోసమే నడుపుతున్నాం. వారిలో ధార్మిక చైతన్యం కలిగిస్తున్నాం. ఇటీవల విజయవాడలో గీతాప్రవచన; విష్ణు సహస్రనామం పారాయణ కార్యక్రమాల్లో లక్షకు పైగా జనం పాల్గొన్నారు.

ఆ సమయంలో సుమారు పదివేలమంది యువతీయువకులు స్వచ్ఛందంగా పెక్కు సేవాకార్యక్రమాల్లో పాల్గొన్నారు.

* ధార్మిక పత్రికలు జన సామాన్యానికి ఎంతవరకు ఉపయోగపడుతున్నాయి?

* * ధార్మిక ప్రవచనాలకంటే, ప్రబోధాల కంటే కూడ ధార్మిక పత్రికలు సామాన్య ప్రజలకు ధర్మం - నీతి - సంస్కృతి - పూజలు - ఇలాంటి వాటికి సంబంధించిన విజ్ఞానాన్ని సదవగాహనను అందిస్తూ ధార్మిక వికాసానికి చేయూతనిస్తూనే వున్నాయి. సమస్యల్లో మునిగివున్న మానవునికి కొంతమేర ఉపశమనాన్ని, ధైర్య స్థైర్యాలను అందిస్తున్నాయి.

'భక్తినివేదన' అనే ఆధ్యాత్మిక వేదాంత మాసపత్రికను మేం నడుపుతున్నాం. ధార్మిక చైతన్యాన్ని కలిగిస్తున్నాం. ఈ ధార్మిక పత్రికల పట్ల ఆదరణ బాగానే వుంది.

* నేటి సమాజంలో నెలకొనివున్న విద్వేషాలకు, అలజడులకు కారణం మతమా?

రాజకీయమా? ఆర్థిక సామాజిక కారణాలా? లేక అజ్ఞానమంటారా?

* * ప్రధానకారణం రాజకీయమే! మతం కానే కాదు. రాజకీయవాదుల ఆలోచనా సరళిలో మార్పు రానంతవరకు ఈ పరిస్థితి మారదు. ప్రజల్లో ఆర్థిక సామాజిక పరిస్థితులు మెరుగ్గానే వున్నాయి. మనవాళ్లు తెలివిగలవాళ్లే!

* వివిధ రాష్ట్రాల దేవాదాయశాఖలు, ధర్మప్రచార విషయమై ఎటువంటి పాత్రను నిర్వహిస్తూవున్నాయి?

* * కేంద్ర ఎన్నికల సంఘం, కేంద్ర ఆడిట్ అకౌంటెంటు జనరల్ శాఖ వంటి స్వయం ప్రతిపత్తి కలిగిన సంస్థలమాదిరే రాష్ట్రదేవాదాయశాఖలకు, దేవస్థానాలకు స్వయం పరిపాలనా సౌలభ్యం కలిగిన స్వేచ్ఛ వుంటే బాగుంటుంది.

* భారతీయ సంస్కృతిని - సనాతన ధర్మాన్ని పరిరక్షించే సందర్భాల్లో నేడు పీఠాధిపతులు, మఠాధిపతులు... సమైక్యంగా కృషి చేస్తూ వున్నారా! గతంలో అలాంటి సందర్భాలున్నాయా?

* * సిద్ధాంతపరంగా ఎవరిమార్గాలు వారివి. ఎవరి ధర్మాన్ని వారు నిర్వహించటం పరమకర్తవ్యంగా భావిస్తాం. అయినా హిందూ ధర్మ పరిరక్షణావసరాలనుబట్టి అందరం ఒక వేదికపై కలుస్తాం. గతంలో వేదసమ్మేళనంలోను, వేదసదస్సులోను కలిశాం.

ఇదికాక విశాలమైన భారతదేశం విభిన్న సంస్కృతులు - నాగరికతలు - భాషలు కలిగివున్నా ఈ అందరినీ ఒక్క దైవశక్తి మాత్రమే సమైక్యంగా కలుపుతున్నదని భావిస్తున్నాం. ఆ దైవశక్తియే మన భారతీయ సనాతన ధర్మాన్ని పరిరక్షిస్తుంది.

* స్వామీ! తమరు సీతానగరంలో నిర్వహిస్తున్న వేదవిశ్వవిద్యాలయాన్ని గూర్చిన వివరాలు తెలియజేస్తారా?

* * వేద విశ్వవిద్యాలయంలో ఋగ్వేదం, యజుర్వేదం, అథర్వణ వేదం - ఈ మూడు వేదాలు బోధించడం జరుగుతున్నది. మొదటి దఫాలో ముగ్గురు అథర్వణ వేద పండితులు ఉత్తీర్ణులై వచ్చారు. వారిలో ఒకరు భద్రాచలంలోను, మరొకరు తిరుమల ధర్మగిరి వేదపాఠశాలలోను వేద పండితులుగా పనిచేస్తున్నారు. మేం నిర్వహిస్తున్న సీతానగర వేద విద్యాలయంలో వేదాలేగాక స్మార్తం, ఆగమాలు కూడ చెప్పుతున్నాం. వీటితోపాటు ఆధునిక విజ్ఞానం కూడ బోధిస్తూ వుండటం ఒక ప్రత్యేకత!

ఈ విద్యాలయం నిమిత్తంగా ప్రతినెలా 40 వేల రూపాయలకు పైబడే ఖర్చు పెడుతున్నాం. ఈ పాఠశాలకు నిధులు భక్తాదులనుంచి సమకూరుతున్నాయి. కొంత తిరుమల తిరుపతి దేవస్థానం కూడ ఇవ్వటం జరుగుతున్నది. ఇక ఈ విద్యాలయంలో చేరటానికి అర్హతలు వయస్సు 8 ఏండ్లు వుండాలి. మంచి ధారణ, ఉచ్చారణ కలిగి వుండాలి. కేవలం బ్రాహ్మణులేకాక పై అర్హత కలిగిన ఇతరులను కూడా చేర్చుకుంటున్నాం.

**తిరుమలక్షేత్ర నియమాల్ని పాటించాలి. పవిత్రతకు భంగం కలిగించని రీతిలో నడచుకోవాలి. అప్పుడే తిరుమల యాత్ర ఫలవంతమవుతుంది. ఆ రీతిగా శ్రీనివాస పరమాత్ముని సంపూర్ణ అనుగ్రహానికి పాత్రులవుతారు.**

* తమ ఆధ్వర్యంలో "శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ - గీతాప్రవచనం" విస్తృత ప్రచారాన్ని పొందుతున్నాయి. సామాన్య జన బాహుళ్యానికి వీటి గొప్పదనాన్ని వివరించండి!

* * మనిషిని మనిషిగా చూపించే దర్పణం భగవద్గీత! సమస్యా విషవలయాల నుండి రక్షించే దివ్యకవచం భగవద్గీత! భగవంతుడు చెప్పింది భగవద్గీత. భక్తుడు చెప్పింది విష్ణు సహస్రనామం. ఆధ్యాత్మిక వాఙ్మయ సారాంశం విష్ణుసహస్రనామం. భగవద్గీత కంటే విష్ణు సహస్రనామం గొప్పది! ఎంచేతంటే భగవద్గీత ఒకచక్కెరడబ్బాలాంటిది! ఆ డబ్బాకున్న మూత తీసి అందించిన చక్కెరే ఈ విష్ణు సహస్ర నామం. సమస్యలకు పరిష్కార సూచన భగవద్గీతలో కన్పిస్తుంది. సమస్యలను పరిష్కరిస్తుంది విష్ణు సహస్రనామం. ఇవి రెండూ ఇంత గొప్పవి కాబట్టే వీటికి మతత్రయపరంగా వ్యాఖ్యానాలు, భాష్యాలూ వెలిశాయి!

* చివరి అభ్యర్థన స్వామీ!

తిరుమల తిరుపతి దేవస్థానంలో పని చేస్తున్న ఉద్యోగస్థులకు ఒక సందేశం - ఒక దివ్యోపదేశం అనుగ్రహించండి!

* * శ్రీనివాస పరమాత్మ తనకూ, భక్తులకూ మధ్య కొంతమంది సేవకులను, సంరక్షకులను నియమించుకున్నాడు. ఎక్కడినుంచో, ఎక్కడెక్కడి నుంచో వెదకి వెదకి ఏరికోరి తగిన వారిని నియమించుకున్నాడు. ఎందుకని?

తన దర్శనకోసం శ్రమపడి వచ్చే భక్తులకు సేవ చెయ్యటానికి, ఆదరణను అందించటానికి, ప్రేమను పంచటానికి.

మరి శ్రీనివాసుని కుటుంబ సభ్యులైన దేవస్థానం ఉద్యోగులంతా భక్తులకు తిరుమల యాత్రలో మధురదివ్యానుభూతులు కలిగేట్లుగా ప్రవర్తించాలి! మెలగాలి! అప్పుడు తిరుమల అపరవైకుంఠంగావెలుగొందుతుంది!!

జై శ్రీమన్నారాయణ!!!

**ఇంటర్వ్యూలో పాల్గొన్నవారు :**
ఎన్. ఎస్. రామమూర్తి,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం,
ధారా సుబ్రహ్మణ్యం.

*

# సందేహాలు? సమాధానాలు!

నిర్వహణ: ఎల్లోరా

ప్రశ్న:-

మనం నిష్ఠలో పూజించే "సాలగ్రామము"ను గురించిన పురాణగాథ ఏమైనా వుందా?

- రాణీగోపాలం, నరేంద్రపురవాడ.

**సమాధానం :**

హిమాలయ ప్రాంతంలో ఒక నది వుంది. దాని పేరు గండకీనది. ఈ నదిని గురించి ఒక పురాణ గాథ ఏమిటీ అంటే - శివుని వరప్రసాదంవలన తులసి గండకీనదిగా యేర్పడింది.

మీరడిగిన "సాలగ్రామము" అనే నల్లని రాళ్లు (సాలగ్రామం అని పేరు) ఈ నదిలోనే ప్రత్యేకంగా దొరుకుతాయి.

ఇక మీ సందేహం - ఈ సాలగ్రామ శిలలకు పురాణ వివరణ ఏమైనా వుందా? అని కదా!

శివుడు జగన్మోహినితో చేరి రమిస్తూండడం, ఆ సమయంలో జగన్మోహినికి రతి శ్రమవల్ల చెమటలు ఎక్కువగా పట్టడం జరిగిందట. ఆ చెమటయే గండకీనదిగా ఆవిర్భూతమయిందనీ, ఆ నదిలో వజ్రమయ కీటకములు ఉద్భవించాయనీ, వాటివల్ల ఏర్పడిన శిలారూపాలే "సాలగ్రామాలు"గా పిలువబడి, పూజలందుకొంటున్నాయనీ స్కాందపురాణ ప్రవచనం (పూర్వగాథాలహరి - 132 వ పేజీ). చూడండి రాణీ గోపాలంగారూ - సాలగ్రామశిలలో శివం వుందన్న నమ్మకంతో వాటికి పూజాస్థానం కల్పించారు. భక్తి మనసులో తాదాత్మ్య భావన చెందాలే కాని, ఏ శిలలోనైనా మన భక్తిని, ఆలోచననిబట్టి-- కళాసృష్టిని ఆవిష్కరించుకోగలిగితే శిలలైనా, మలలైనా ఆరాధనా రూపంలో సాక్షాత్కరిస్తాయి - అంతే!

ప్రశ్న:

భారతయుద్ధభూమిలో అర్జునునికి శ్రీకృష్ణభగవానుడు గీత ఉపదేశించాడని అంటారు. యుద్ధం పదిరోజులపాటు జరిగాక భీష్మాచార్యులు అంపశయ్యను అలంకరించాడనీ, అప్పుడు ధర్మరాజుకు విష్ణుసహస్రనామ స్తోత్రం వివరించాడనీ చెబుతారు. పైగా గీతకూ, విష్ణుసహస్రనామానికీ భావసామ్యం కనిపిస్తుంది.

ఇంతకీ ఈ భావసామ్యంలోని అనంతార్థాన్ని వివరించగలరని ఆశ!

-- బి. అవధాని, లంకల గన్నవరం

**సమాధానం**

శ్రీకృష్ణభగవానుడు కురుక్షేత్రంలో గీతను ఉపదేశించిన మాట వాస్తవం. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రానికీ, భగవద్గీతకు భావ సామ్యం కలిగినమాట అక్షరాలా నిజం.

**పాఠకుల ప్రశ్నలకు ప్రముఖ పండితులు, కవి, పత్రికారచయిత శ్రీ ఎల్లోరా సమాధానాలు ఇచ్చారు.**

ఎందుచేతనంటే అటు భీష్మాచార్యులు గాని, ఇటు అర్జునునికిగాని గీతోపదేశంలోని ప్రబోధం తెలియనివారుకారు. కానైతే, అర్జునునికి బంధుజనం కనిపించింది. జరిగే రక్తపాతాన్ని తలచుకొని అస్త్రసన్యాసంకు తలబడ్డాడు. అందుకు ఏనాడో ఎందరికో వినిపించిన గీతను మళ్లీ వినిపించాడు నల్లనయ్య.

గీతను, విష్ణు సహస్రనామావళిని వ్యాసులవారే అక్షరనిక్షిప్తం చేశారు కనుక రెండింటినీ చూసినప్పుడు భావసామ్యం గోచరించడంలో ఆశ్చర్యం లేదు.

ముఖ్యంగా మనం పురాణ సత్యాన్వేషణ చేస్తే కురుక్షేత్రంలో గీతోపదేశం చేసినది మొదటిసారికాదు. శ్రీకృష్ణుడు సాంఖ్య యోగం, కర్మయోగం వివరించి జ్ఞానయోగ ప్రారంభమునకు ముందు ఈ యోగమును "నేను సూర్యునకు తెలిపాను. ఆతడు మనువునకూ, మనువు ఇక్ష్వాకునకూ వెల్లడించారు. ఇలా పరంపరాప్రోక్తమైన దీనిని రాజ ఋషులు ఎరుగుదురు. ఇది కాలము గడచినకొలదీ నష్టపడింది. పురాతనమైన ఈ యోగమును రహస్యమైనను నీవు భక్తుడవనీ, చెలికాడవనీ ఉపదేశిస్తున్నాను" అని చెప్పటలో ఇది యుద్ధరంగముననే ప్రారంభించబడలేదని చెప్పవచ్చు.

చూడండి - గీతలోనే-

ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్మనవే ప్రాహ
మను రిక్ష్వాకవేఽ బ్రవీత్
ఏవం పరంపరాప్రాప్త
మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా
యోగో నష్టః పరన్తప
స ఏ వాయం మయా తేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి
రహస్యం హ్యేతదుత్తమమ్.

అ.4. --భగవద్గీత

ముందు వెనక ఎలావున్నా చీకటినుంచి, అజ్ఞానంనుంచి జ్ఞాన సూర్యోదయాన్ని దర్శించి తరించండని ఉపదేశించడమే ఆ రెండింటి సారాంశం - ఉపదేశ ప్రబోధం.



# తిరుమల శ్రీవారి శుక్రవారాభిషేకం

జూలకంటి బాలసుబ్రహ్మణ్యం



ప్రతి శుక్రవారం ఉదయం శ్రీ వేంకటేశ్వర స్వామివారికి జరిగే విశేష సేవ 'అభిషేకం'. ఈ అభిషేకం శ్రీ వైకుంఠంనుండి వక్షఃస్థలలక్ష్మితోకూడ స్వయంభువుగా వెలసిన శ్రీ స్వామివారి మూలమూర్తికి జరుప బడుతుంది. ఎలాంటి ఆభరణాలు గానీ, అలంకరణలుగానీ లేకుండ శ్రీ స్వామివారి మూలవిరాట్టు దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని సుమారు ఒకగంటసేపు దర్శింప వీలుకలిగే ఈ శుక్రవారాభిషేకోత్సవం అనేక మంది భక్తులను విశేషంగా ఆకర్షిస్తోంది.

ప్రతి శుక్రవారంనాడు విశేషోత్సవంగా జరుపబడే ఈ అభిషేకం తిరుమలలో ప్రాచీన కాలంనుండే ప్రారంభింపబడిందని తెలుస్తోంది. క్రీస్తుశకం 614లో పల్లవరాణి 'సామవై '(పేరిందేవి) తిరుమల ఆలయానికి "భోగ శ్రీనివాసమూర్తి" వెండి విగ్రహాన్ని సమర్పించిన రోజు శుక్రవారం అయినందువల్ల ఈ భోగమూర్తితోపాటు అటు మూలమూర్తికి అభిషేకం జరుపబడిందట! అప్పటినుంచి శుక్రవారాలు కలిపి వచ్చిన విశిష్ట పర్వదినాల్లో అభిషేకాలు జరుగుతూ వుండేవి. కాలక్రమేణ పదహైదు రోజుల కొకసారి శుక్రవారంనాడు అభిషేకం జరుపబడేది. రానురాను విజయ నగరరాజులకాలంలో ప్రతి శుక్రవారం అభిషేకం జరగడానికి ఏర్పాటయింది

మరోవిషయం. భగవద్రామానుజులవారు క్రీస్తుశకం 11వ శతాబ్దంలో శ్రీస్వామివారి వక్షస్థలంలో అలంకారంగా ఉండేట్లు "బంగారు అలమేలుమంగ"ను సమర్పించిన రోజుకూడా శుక్రవారమే ఐనందున ఆనాడు అభిషేకాలు ఘనంగా జరిగాయి. ఆనాటి నుండి శుక్రవారంనాడు మూలమూర్తికి అభిషేకం అయిన అనంతరం బంగారు అలమేలు మంగతాయారుకు కూడ ప్రత్యేకంగా అభిషేకం జరుపబడునటుల నిర్ణయించడం చేత, తిరుమలదేవాలయంలోని పూజా కార్యక్రమాలలో ఈ శుక్రవారాభిషేకం ఒక విశిష్టతను సంతరించుకొన్నదని చెప్పవచ్చు.

> తిరుమల పుణ్యక్షేత్రంలో ప్రతి శుక్రవారంనాడు సుప్రభాతానంతరం పునుగు, జవ్వాది, కస్తూరి....... మున్నగు సుగంధ ద్రవ్యాలతోగూడిన మంగళాభిషేకం శ్రీవేంకటేశ్వరస్వామి వారిమూలమూర్తికి వైభవంగా జరుగుతుంది. ఈ శుక్రవారాభిషేకంలో మాత్రమే, సుమారు ఐదువేలఏండ్లనాడు, స్వయంభువుగా వెలసిన శ్రీ స్వామి వారి దివ్యమూర్తిని ఎలాంటి ఆభరణాలూ అలంకారాలూ లేకుండా యథాతథంగా దర్శింపవచ్చు. ఇలా శ్రీస్వామివారితోపాటు, ఆయన వక్షఃస్థలంలో కొలువై వున్న శ్రీమహాలక్ష్మిని కూడ నయనానందకరంగా దర్శింపజేసే శుక్రవారాభిషేకాన్ని గూర్చి వివరంగా తెలియజేసే ఈవ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.
>
> సం||

ప్రతిరోజు మాదిరే, శుక్రవారంనాడు తెల్లవారుజామున 'సుప్రభాతం' జరుగుతుంది. ఈ సుప్రభాతసేవకు ఆర్జిత భక్తుల్ని అనుమతిస్తారు. ఆ తర్వాత తోమాలసేవ చాల క్లుప్తంగా జరిగిన తర్వాత కొలువు, అర్చన (అష్టోత్తరం) ఏకాంతంగా నిర్వహిస్తారు. అటుపిమ్మట మొదటి గంట నైవేద్యం జరుగుతుంది. నివేదన అయిన వెంటనే అభిషేకానికి సిద్ధం చేస్తారు.

## అభిషేకానికి సిద్ధం

తెల్లవారుజామున సుమారు నాలుగు గంటల వేళ పవిత్రబ్రాహ్మముహూర్తంలో అర్చకస్వామి తొలుత శ్రీస్వామివారికి పాదనమస్కారం చేసి, అభిషేకానికి అనుమతి నివ్వుమని ప్రార్థించి, సంకల్పం చేస్తారు. పిదప శ్రీస్వామివారికి అష్టోత్తర శత నామార్చన చేస్తారు. ఆ తర్వాత స్వామివారి నొసటన వున్న సన్నని పచ్చకప్పురపునామాన్ని బాగా తగ్గించి సూక్ష్మంగా నామ మాత్రంగా ఉంచుతారు. ఆభరణాలన్నిటిని, పట్టువస్త్రాలను తీసివేస్తారు. స్నాన వస్త్రంగా తెల్లని కౌపీనాన్ని (గోణాన్ని) ధరింప జేసి దంత ధావన అర్ఘ్యపాద్యాచమనాది ఉపచారాలు సమర్పించి తిరువేంకటేశునకు శిరసాదిగా పునుగు తైలాన్ని అలది అభిషేకానికి సిద్ధమై వుంటారు.

ఇంతలో పరిచారకులు రెండు పెద్ద వెండిగంగాళాల్లో ఆవుపాలను, రెండు వెండిగంగాళాల్లో బంగారుబావిజలాన్ని నింపి సిద్ధంగా వుంచుతారు. ఒక వెండి బిందెలో ముందురోజు తెచ్చిన 'ఆకాశగంగాతీర్థం' కూడా తయారుగా వుంచుతారు.

## 'పరిమళం'తో....జియ్యంగార్లు..

ఇంతలో జియ్యంగార్లు, ఏకాంగి, అధికారులు ఆచార్యపురుషులు, వేదపండితులు, ఆర్జిత సేవాపరాయణులగు భక్తులు విమాన ప్రదక్షిణంలో శ్రీ యోగనరసింహస్వామి ఆలయం ప్రక్కన గల 'పరిమళంఅర' దగ్గరకు చేరుకుంటారు.

అప్పటికే పరిమళంఅరలో సిద్ధంచేసి వుంచిన శ్రీస్వామివారినామానికి ఉపయోగించే పచ్చకర్పూరం, కస్తూరివున్నవెండి గిన్నెను జియ్యంగారు; కుంకుమ పువ్వును కలిపిన నలుగుబిళ్లలు, చందనం బిళ్లలు వున్న వెండిగిన్నెను దేవస్థానం అధికారులు; పట్టు వస్త్రాలను సమర్పింపదలచిన భక్తుడు ఆ వస్త్రాలుఉంచినవెండిపళ్లేన్ని; ఆ యా ఆర్జితభక్తులు తాము చెల్లించిన రుసుమును బట్టి గంబూరా (పచ్చ కర్పూరం) గిన్నె., పునుగుగిన్నె - కస్తూరిగిన్నె ...ఇలా ఆయా గిన్నెలను స్వీకరిస్తారు. మంగళవాద్యాలు మ్రోగుతూ వుండగా అందరూ పరిమళం గిన్నెలతో, ఛత్ర చామర మర్యాదలతో వేద పండితులు శ్రుతి సుభగంగా పారాయణం చేస్తూవుండగా శ్రీస్వామివారికి "పరిమళం" తీసికొనివెళ్లే ఉత్సవం ప్రారంభమవుతుంది. వీరంతా వెండివాకిలి ముందర ఉన్న ధ్వజ స్తంభానికి ప్రదక్షిణంగావచ్చి, తర్వాత విమాన ప్రదక్షిణం చేస్తూ వచ్చి శ్రీవారిసన్నిధి చేరుకొంటారు.

జియ్యంగార్లు, ఏకాంగులు మాత్రం కులశేఖర పడిదాటి గర్భాలయంలోనికి వెళ్లుతారు. మిగిలిన అధికారులు భక్తులు తమ గిన్నెలను అర్చకులకు అందించి కులశేఖరపడి (గర్భాలయం గడప) నుండి బంగారువాకిలి దాటి గరుడాళ్వారువరకు వరుసగా మధ్యలో దారి వదలి పురుషులు ఒకవైపు, స్త్రీలు ఒకవైపు ఒకరివెనుక మరొకరు బారులుగా కూర్చుంటారు.

## అభిషేక ప్రారంభం

అర్చక వరుడు వేదమంత్రోచ్చారణ చేసే సమయాన శ్రీస్వామివారివైపు తన శ్వాస పారకుండా, నోటి తుంపురులు పడకుండా ఒకపట్టుపెల్లాను తలకు, నోటికి, ముక్కుకు అడ్డంగా రమణీయంగా చుట్టుకొని శ్రీ శ్రీనివాసస్వామివారిపాదాలకు నమస్కరించి వక్షఃస్థలలక్ష్మీదేవిఅమ్మవారికి నమస్కరించి అభిషేకానికి అనుమతినిమ్మని ప్రార్థించి, అభిషేకం చేయటానికి అనువై ఎత్తుగావున్న పీఠాన్ని ఎక్కి (భక్తులకు ఇబ్బంది లేకుండా) శ్రీవారి వైకుంఠహస్తం దగ్గర నిలుస్తారు.

అలనాడు ఆ శ్రియఃపతికైంకర్యంలో సేవలందించే భాగ్యాన్ని పొందిన భగవ



శ్రీ వేంకటేశ్వరస్వామి వారి మూలమూర్తి
చిత్రం : శ్రీ పి. నారాయణగిరిదత్తు

ద్రామానుజులవారికి ప్రతినిధిగా శ్రీమాన్ పెద్దజియ్యంగార్, అర్చకస్వామివలెనే నోటికి, ముక్కుకు పట్టు వస్త్రాన్ని చుట్టుకొని శ్రీ స్వామివారిమూలమూర్తి విగ్రహం ఎదుట ఒక వారకు నిలిచి వుంటారు.

### ఆకాశగంగాతీర్థం

తొలుత జియ్యంగారు భక్తి ప్రపత్తులతో బంగారుశంఖంతో ఆకాశగంగాతీర్థాన్ని అర్చకులకు అందిస్తారు. అర్చకులు ఆ బంగారు శంఖంలోని ఆకాశగంగాతీర్థాన్ని శ్రీస్వామివారి శిరస్సుపై పోస్తూ, "హరిః ఓం సహస్ర శీర్షా పురుషః" అని పురుషసూక్తాన్ని ప్రారంభించగా, కులశేఖరపడి ఇవతలవున్న వేదపండితులు పురుషసూక్తాన్ని అందుకొని గట్టిగా పఠిస్తూ వుంటారు. ఈ అభిషేక సమయంలో చివరివరకు వేదపండితులు పురుష సూక్తం, శ్రీసూక్తం, భూసూక్తం మొదలైన పంచసూక్తులు, పంచోపనిషత్తులు వరుసగా పారాయణం చేస్తూనే వుంటారు.

శ్రీస్వామివారికి ఎదురుగా కులశేఖరపడి నుండి బంగారువాకిలి దాటి గరుడాళ్వారు వరకు బారులుతీరి కూర్చున్న భక్తులు, భూలోక వైకుంఠమయిన ఈ తిరుమల క్షేత్రంలో స్వయంభువై నిలిచిన దివ్యమూర్తి ఈయనే కదా! అని కన్నులార తిలకిస్తూ అర్చకస్వామి చేస్తున్న ఆకాశగంగా తీర్థాభిషేకాన్ని తామే చేస్తున్నట్లుగా అనుక్షణం భావిస్తూ ఆనందంతో తన్మయులవుతూ ఉంటారు. అంతలో..

### క్షీరాభిషేకం

ఆకాశగంగాతీర్థంతో అభిషేకం ముగిసిన వెంటనే జియ్యంగారు వెండిగిన్నెలో ఆవు పాలను అందిస్తారు. అర్చకులు వాటిని స్వీకరించి మొదట శ్రీస్వామివారి కిరీటంపై అభిషేకిస్తారు.

ఆహా! ఏమా దివ్యసౌందర్యం! ఆ నల్లని మేనుమీద తెల్లనిచిక్కని గోక్షీరం చారలు చారలుగా జాలువారుతూ వుండగా వింత వింతలుగా కాంతులీనుతూవున్న శ్రీవారి ముఖ సౌందర్యాన్ని భక్తులు పారవశ్యంతో మైమరచి దర్శిస్తూ వుంటారు.

జియ్యంగారు అందించిన ఆవుపాలతో అర్చకులు శ్రీస్వామివారి కిరీటం, శంఖ చక్రాలు, కటివరద హస్తాలు, నందకఖడ్గం, వక్షఃస్థలలక్ష్మి ... ఇలా అన్నిచోట్ల విడి విడిగా అభిషేకిస్తారు. శ్రీస్వామి వరద, వైకుంఠ హస్తాల్ని అభిషేకించినపుడు ఆక్షీరాన్ని ప్రత్యేకంగా సేకరించి, అభిషేకానంతరం భక్తులకు తీర్థంగా ఇస్తారు.

### బంగారుబావి జలంతో

ఈవిధంగా రెండు గంగాళాల ఆవు పాలతో అభిషేకం పూర్తికాగానే బంగారుబావి శుద్ధజలంతో అభిషేకం జరుగుతుంది. ఇలా కొంతసేపు శుద్ధజలంతో అభిషేకం జరిగిన తరువాత అర్చకులు, జియ్యంగార్లు అందించిన పసుపుముద్దలను శ్రీస్వామివారి వక్షఃస్థల లక్ష్మీదేవికి సమర్పించి (ఒత్తి) ఇస్తారు. వక్షఃస్థల అమ్మవారిరూపం పడిన ఆ పసుపు ముద్దలను అర్చకులు కళ్లకద్దుకొని అక్కడి మండే అందరికీ చూపిస్తారు.

### పరిమళంతో నలుగు (ఉద్వర్తనం)

ఆటుతర్వాత శ్రీస్వామివారి కౌపీన వస్త్రాన్ని తీసివేసి జియ్యంగార్ అందించిన పరిమళం (పచ్చ కర్పూరం + చందనం + కుంకుమపువ్వు - ఈమూడింటి మిశ్రమం)తో అర్చకులు శిరసాదిగా శ్రీస్వామివారి మేను అంతటా చక్కగా అలదుతారు. ఇలా నలుగు పెట్టటాన్నే 'ఉద్వర్తనం' అని అంటారు. ఈ పరిమళాన్నే "పులికాపు" అనికూడ అంటారు.

మూలమూర్తికి మెల్లగా మెల్లమెల్లగా పరిమళాన్ని పూస్తూ నలుగు పెడుతూవున్న అర్చకస్వామివారిభాగ్యం ఏమని వర్ణించగలం?

ఒకప్పటి త్రేతాయుగంలో బాలరామునికి కౌసల్య నలుగుపెట్టివున్న దృశ్యం! అలాగే ద్వాపరయుగంలో చిన్నికృష్ణునికి ఆనాడు యశోద నలుగుపెట్టిన దృశ్యం! ఇత్యాది దృశ్యాలు యథాశక్తి భావించదగినవే కాని, ఈనాటివారెవ్వరికీ తిలకించడానికి వీలులేనివి కదా! అయినా భూలోక వైకుంఠమైన తిరుమల పుణ్యక్షేత్రంలో ఆనాటి త్రేతాయుగ ద్వాపరయుగాలనాటి నీలమేఘ శ్యాములైన రామకృష్ణులే ఈనాటి ఘనవేంకటేశుడై నిలిచి భక్తులందరి ఎదుటా నలుగుపెట్టించుకుంటూ వున్నప్పుడు చూచినవారికి ఆ అనివి తీరుతుంది!

మెత్తగా, సుతిమెత్తగా స్వామివారి కన్నులను (కంట్లో పడకుండా) అలదుతూ, చెక్కిళ్లను నిమురుతూ.... చేతులకు, కాళ్లకు, భుజాలకు...ఇలా ఒళ్లంతా నలుగు పెడుతూ ఆనందిస్తున్న అర్చకస్వామి సాక్షాత్తు కౌసల్యా యశోదల అంశయే అని చూపరులకు స్ఫురిస్తూ వుంటుంది! ఆ సమయంలో అక్కడ చేరిన ప్రతిభక్తుడూ తానే స్వామివారికి నలుగుపెడుతున్నట్లుగా అనుభూతి పొందుతాడు. ఆ సమయంలో ఆ నలుగు పరిమళపు సువాసనలు గుప్పు గుప్పున ఆనంద నిలయం అంతా వ్యాపించి, ఆవాతావరణాన్ని మరింత పునీతం చేస్తుంటాయి.

ఇలా తెల్లని నలుగు మైపూతలో సొంపు లీనే నల్లని స్వామివారిదివ్యమంగళమూర్తిని, శ్రీ వేంకటేశ్వర స్వామివారిలంతరంగిక భక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులు ఈ రీతిగా ప్రస్తుతించారు:

### శుక్రవారాభిషేక దర్శనం

**కంటి శుక్రవారము గడియ లేడింట**
**అంటి అలమేల్మంగ అండనుండే స్వామిని.**
**సొమ్ములన్నీ కడ బెట్టి సొంపుతో గోణముగట్టి**
**కమ్మని కదంబము కప్పు పన్నీరు**
**చెమ్మతోన వేష్టువలు రొమ్ముతల మొలచుట్టి**



# TIRUMALA TIRUPATI DEVASTHANAMS, TIRUPATI



Visit TIRUMALA !



*DURING*

## SRI VENKATESWARA SWAMY BRAHMOTSAVAM

**PROGRAMME**

| Date | Morning Festival | Evening Festival |
|---|---|---|
| 5-10-94 | — | Ankurarpanam |
| 6-10-94 | Dwajarohanam | Sesha Vahanam (Big) |
| 7-10-94 | Sesha Vahanam (Small) | Hamsa Vahanam |
| 8-10-94 | Simha Vahanam | Muthyapu Pandili Vahanam |
| 9-10-94 | Kalpavriksha Vahanam | Sarvabhoopala Vahanam |
| 10-10-94 | Mohini Avataram | **GARUDASEVA** with Lakshmi haram & Makara Kantika |
| 11-10-94 | Hanumantha Vahanam | Vasantotsavam (Evening) Gaja Vahanam (Night) |
| 12-10-94 | Sooryaprabha Vahanam | Chandraprabha Vahanam |
| 13-10-94 | **RADHOTSAVAM** | Asva (Horse) Vahanam |
| 14-10-94 | Pallaki Utsavam, Tiruchi Utsavam and Teerthavari | Avarohanotsavam |

- There will be Unjal festival in the evenings.
- Kalakshepams, music and discourses will also be held by eminent scholars and artistes
- Festival Programmes will be announced sufficiently in advance every day.

# A HEALING TOUCH

## T. T. DEVASTHANAMS INTRODUCES
## SRI BALAJI AROGYAVARAPRASADINI SCHEME

For ages, Tirumala, the abode of Lord Venkateswara, has been a great centre of pilgrimage Thousands of devotees visit the sacred hills every day and offer their solemn prayers to the Lord for their spiritual and physical well-being

Alleviating human suffering has been a part of dedicated efforts of TTD to the mankind TTD already manages a Leprosorium, centre for physically handicapped, a poor home and also a central hospital To provide the most advanced medical technology to the needy, the TTD has launched another monument, a blessing from the Lord by opening Sri Venkateswara Institute of Medical Sciences -- a sophisticated super speciality centre on the lines of AIIMS of New Delhi & JIMPER of Pondicherry and PGI of Chandigarh Total well being of man is the aim of Sri Venkateswara Institute of Medical Sciences, which apart from offering service, training and education in medical sciences, also encourages Research and development

The doors to such a state of the art technology should be open to our poor and disabled brethren

With a view to achieving this, Sri Venkateswara Institute of Medical Sciences has introduced a New scheme Balaji Arogyavaraprasadini Scheme To accomplish the goal of proving the sophisticated medical technology to every individual at an affordable rate, we invite the generous co-operation of philanthropists and the general public

### The Scheme in essence:

A donor can make an endowment of Rs 1000/- or multiples thereof / Rs 1 lakh / Rs 5 lakhs / Rs 10 lakhs to T T Devasthanams which will in turn contribute matching grant The entire amount will be deposited in fixed deposit in a nationalised Bank and the interest accrued on it will be utilised for providing free medical services to the poor and the needy

A Chair in Sri Venkateswara Institute of Medical Sciences will be named after the donor who contributes Rs 10 lakhs or above These endowment chairs are purely research oriented

* Donations can be made by any individual / family / company / firms etc
* The name of the donor who endows Rs 5 lakhs or more will be displayed prominently in the Reception hall of the hospital
* The discharge ticket of the benefited patient will carry the name of the donor

### Additional Benefit and facilities :

* Donations to Sri balaji Arogyavaraprasadini`Scheme are exempted from Income Tax under 80 (G)
* Paid rooms / Air conditioned rooms will be allotted to family members of the donor in the hospital
* Paid rooms can be named after donors who contribute a sum of Rs 5 lakhs or above
* By paying Rs 5 lakhs and above, a donor may sponsor one operation per year
* Donors can sponsor feeding of the In-patients and out-patients They may also sponsor a travel fellowship for the faculty per year

All donations, by D.Ds drawn in favour of The Executive Officer, T T Devasthanams, Tirupati-517 501 (Andhra Pradesh) should reach the Director, Sri Venkateswara Institute of Medical Sciences, Tirupati along with the following particulars

* Name and address along with the latest passport-size photographs of the family members of the donor who contributes Rs 1 lakh or more
* Name and address of the person to whom Income Tax Exemption Certificate is to be issued

The donors are also welcome to offer equipment, vehicles etc to SVIMS or even sponsor health camps in rural areas, if they so desire Further details can be had from

**The Executive Officer**
**T.T. Devasthanams, Tirupati**
**or**
**The Director**
**Sri Venkateswara Institute of Medical Sciences, Tirupati**

**EXECUTIVE OFFICER**

తుమ్మెదమైచాయతోన నెమ్మదినుండే
స్వామిని.

పచ్చ కప్పురమె నూఱి పసిండి గిన్నెలనించి
తెచ్చి శిరసాదిగ దిగనలఁది
అచ్చెరపడిచూడ అందరికన్నుల కింపై
నిచ్చమల్లె పూవువలె నిటుతానుండే స్వామిని.

తట్టు పునుఁగె కూర్చి చట్టలు చేరిచి నిప్పు
పట్టి కరగించి వెండిపళ్ళాల నించి
దట్టముగ మేనునిండ పట్టించి దిద్ది
బిట్టు వేడుక మురియుచుండే బిత్తరిస్వామిని.

ఇలా శ్రీస్వామివారి శుక్రవారాభిషేక సమయంలో తాళ్లపాకవారు దగ్గరవుండి నలుగు పాటలు, అభిషేకపాటలు గానం చేసేవారు. ఇలా 15వ శతాబ్దంనాటి అభిషేకాదులను వర్ణిస్తూ తాళ్లపాక కవులు అనేక కీర్తనలు రాశారు.

నలుగుమైపూత పూర్తి అయిన వెంటనే శ్రీస్వామివారికి బంగారుతట్టతో పచ్చకర్పూరపు హారతి ఇవ్వబడుతుంది. ఆ కర్పూర హారతి వెలుగులో శ్రీస్వామి ముఖం, కిరీటం, శంఖ చక్రాలు, వరద కటి హస్తాలు, పాదాలు, నందకఖడ్గం, వక్షఃస్థలలక్ష్మి.... ఇలా ఆ పాద మస్తకం స్వామివారి అంగాంగముల సౌందర్యాన్ని భక్తులు తదేకంగా కన్నులార్పకుండా దర్శిస్తారు. ఆ హారతిని దూరం నుంచే భక్తులందరికి చూపిస్తారు.

## శ్రీపాదతీర్థం

ఆ తర్వాత శుద్ధజలంతో స్వామివారికి అభిషేకం చేస్తారు. ఆ అభిషేక జలంతో కలిసి కిందికి జాలువారుతున్న పరిమళాన్ని శంఖ చక్రాలు, వైకుంఠ వరద హస్తాలు ఇలా అన్ని అంగములనుండి క్రిందకు జాలువారుతూ వున్న పరిమళ తీర్థాన్ని విడి విడిగా పాత్రలలో సేకరించి అర్చకులు, జియ్యంగార్లు, అధికారులు, పరివారకులు ఆనవాయితీ ప్రకారం వారివారికి వచ్చే తీర్థభాగాలను స్వీకరిస్తారు. అందులో వైకుంఠ వరద హస్తాల నుండి జారే పరిమళతీర్థ భాగాన్ని భక్తులకు తీర్థంగా ఇస్తారు.



## శ్రీవారినామం

శ్రీవేంకటేశ్వరునికి వారానికి ఒక్కసారిమాత్రమే, అంటే ప్రతి శుక్రవారంనాడు అభిషేకానంతరం ఊర్ధ్వపుండ్రాలు సమర్పిస్తారు. ఈ నామం సమర్పణంలో 16 తులాల పచ్చకర్పూరం $1\frac{1}{2}$ తులం కస్తూరి వినియోగమవుతుంది. శుక్రవారంనాడు అలంకరించిన ఈనామం మళ్లీ గురువారంనాడు మాత్రమే సడలించబడుతుంది. అందుకే ప్రతి గురువారంనాడు భక్తులకు "శ్రీవారినేత్ర దర్శనం" కలుగుతుంది.

శ్రీవారి బ్రహ్మోత్సవాలలో మాత్రం ఈనామం సమర్పణం రెట్టింపవుతుంది. అంటే బ్రహ్మోత్సవాలకు ముందువచ్చే శుక్రవారం - బ్రహ్మోత్సవం మధ్యలో వచ్చే శుక్రవారం - బ్రహ్మోత్సవం అయినతర్వాత వచ్చే శుక్రవారం - ఇలా మూడు - లేదా నాలుగు శుక్రవారాల్లో శ్రీవారినామానికి 32 తులాల పచ్చకర్పూరం 3 తులాల కస్తూరి వినియోగింపబడుతుంది. అంటే మామూలు శుక్రవారాల కంటే రెట్టింపన్నమాట. అందువల్లే ఈ శుక్రవారాలను రెట్టింపు శుక్రవారాలని రెట్టవారాలని అంటారు.

ఇలా శ్రీస్వామివారి మూర్తియందు శిర సాదిగా జలాభిషేకంతో జాలువారుతున్న పరిమళ తీర్థాన్ని "శ్రీపాదతీర్థం" అంటారు. ఈ శ్రీహరిపాదతీర్థం అద్భుతమయిన మహిమ గలది. ఈ తీర్థమహిమను గూర్చి పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా కీర్తించినాడు:

### శంకరాభరణం

శ్రీహరి పాద తీర్థంబే చెడని మందు
మోహపాశాలు గోసి మోక్షమిచ్చేమందు.

కారమై కంటగించని కడుఁ జల్లని మందు
నూఱని కాచని యట్టి మున్నని మందు
కోరికతో వెలవెట్టికొని తే వల్లనిమందు
వేరు వెల్లంకులు కూర్చనట్టి వెందువోని మందు.

గుఱుతైనరోగములు గుణముచేసే మందు
దురితములు పెడఁబాపే దొడ్డమందు
నిరతము బ్రహ్మాదులు నేఁథుపుతో సేవించే మందు
వరకము సారనట్టి నయమయిన మందు.

పాంకముతో భయములు పొందనియ్యని మందు
మంకు బుద్ధులు మాన్పి మన్నించే మందు
పంకజాక్ష వేంకటరమణ ప్రపన్నునిమందు
సెంకించక తనదాసులఁ జేపట్టేమందు.

ఇలాంటి అద్భుతమైన శ్రీపాదతీర్థాన్ని అర్చకస్వాములు పాత్రలలో సేకరించిన తర్వాత మరికొంతసేపు శుద్ధజలంతో అభిషేకం చేస్తారు.

### శ్రీ మహాలక్ష్మికి మంగళస్నానం

ఆ తర్వాత వెండిగిన్నెలో నీళ్లలో కలిపిన పసుపుతో శ్రీస్వామివారి వక్షస్థలంపై శ్రీవత్సచిహ్నంగా కొలువైవున్న శ్రీ మహాలక్ష్మిఅమ్మవారికి అభిషేకం చేస్తారు. ఈ సమయంలో ఒకపరిచారకుడు భక్తులను ఉద్దేశించి బిగ్గరగా "ఇపుడు శ్రీస్వామివారి వక్షస్థలంలోని శ్రీ మహాలక్ష్మి అమ్మవారికి పసుపుతో తిరుమంజనం (అభిషేకం)జరుగుతున్నది. కన్నులారా దర్శించి ఆనందించండి" అని హెచ్చరిక చేయటంతో, భక్తులలో ఒక విధమైన కలకలం బయలుదేరి, అందరూ తలలు నిక్కించి పసుపుతో అభిషేకింపబడుతున్న శ్రీనివాసునివక్షఃస్థలంమీదిలక్ష్మిఅమ్మవారిని కన్నులారా దర్శిస్తారు. శ్రీవారిన ల్లని మేనిమీద పసుపుపచ్చని అభిషేకజలంతో మరింత స్పష్టంగా దర్శనమిస్తూ, శోభాయమానంగా ప్రకాశిస్తూ వున్న అమ్మవారిని రెప్పవాల్చక తిలకిస్తారు.

"తల్లీ! జగన్మాతా! నివు వైకుంఠం నుండి తరలి రావటం వల్లే కదా! ఇటు నీ దర్శనంతోపాటు శ్రీవారిదర్శనభాగ్యం మాకు కలిగిందికదా! ఈ తిరుమలక్షేత్రం కలియుగ వైకుంఠంగా విరాజిల్లుతోంది కదా!



అమ్మా! తిరుమలస్వామి నాగాభరణాలు ధరించి వున్నందువల్ల శివుడేమో? పద్మ పీఠంలో నిలిచి వున్నందువల్ల బ్రహ్మదేవుడేమో? శుక్రవారంనాడు అభిషేకం జరుగుతున్నది గాన శక్తిదేవత ఐన పార్వతియా? లేక కుమారస్వామి అవతారమా?....... అని ఇలా అనేక విధాలుగా అల్పజ్ఞులమైన మేము సందేహిస్తూ వుండగా ఓ పద్మావతీ! ఓ అలమేలుమంగా!! నీవు శ్రీస్వామివారి వక్షఃస్థలంలో కొలువైవుండి వింతవింతశోభలతో దర్శనమిస్తున్నందువల్లనే మా సంశయాలన్నీ పటాపంచలయినాయి. ఈ తిరుమలప్పుదు శ్రీ మహావైకుంఠం నుండి భువికి తరలివచ్చిన సాక్షాత్తు శ్రీమహా విష్ణువే! అని రూఢి అవుతున్నది తల్లీ!" - అని భక్తితో, ఆనందంతో ప్రార్థిస్తూవుండగా హరిద్రాభిషేకం పూర్తి అవుతుంది. హరిద్రాభిషేకానంతరం అమ్మవారికి శుద్ధజలంతో అభిషేకం చేస్తారు.

### ఆకాశగంగా తీర్థం

ఇలా బంగారుబావిజలంతో శ్రీస్వామివారిని శిరసాదిగా పాదపర్యంతం అభిషేకించిన పిమ్మట చివర్లో మళ్లీ బంగారు శంఖంతో ఆకాశగంగాతీర్థంతో అభిషేకించి, ఆ జలాన్ని పాత్రలలో సేకరిస్తారు.

ఎన్నో జన్మల సుకృతఫలంచేత శ్రీనివాససార్వభౌముని అభిషేకకైంకర్యంలో స్వయంగా పాలుపంచుకొన్న అర్చకస్వామి అంతవరకు తాను నిలిచివున్న పీఠంనుండి దిగి, తొలుత ఆ తీర్థజలాన్ని తన శిరస్సుపై చల్లుకొని, తర్వాత జియ్యంగార్లు, ఏకాంగి, ఆచార్య పురుషులు., అధికారులు. భక్తులు.. ఇలా.. అక్కడ చేరివున్న అందరిమీదా "పూతోభవ" అని అంటూ ప్రోక్షిస్తారు.

ఈ అభిషేకతీర్థం యొక్క స్పర్శతో మా జన్మలు ధన్యములయ్యాయని ఎవరికి వారు స్వామిని చూస్తూ స్తుతించేటంతలో కులశేఖరపడిచెంత తెరవేయబడుతుంది. ఆ సమయంలో వేదమూర్తులు వేదపారాయణాన్ని పూర్తిచేస్తూ "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అని స్వస్తి వాచనం పలుకుతారు.

### నీరాట్టం (దివ్యప్రబంధం) గానం

అనంతరం తెరలోపల ఆనందనిలయంలో అర్చకులు పట్టిగుడ్డతో తడిలేకుండా శ్రీస్వామివారిని తుడుస్తూవుండగా శ్రీ జియ్యంగార్ ద్రావిడ వేదంలోని 'నీరాట్టం' పదిపాశురాల గానం ప్రారంభించగా, కులశేఖరపడి ఇవతలవున్న శ్రీవైష్ణవ ఆచార్య

పురుషులు ఆ గానాన్ని అనుసంధానిస్తూ ఆ పది పాశురాలను శ్రవణ పేయంగా పరిస్తారు.

"నాయనా చిన్నికృష్ణా! నీకు చక్కగా లాల (నీళ్లు) పోసి ముద్దుగా అలంకరించాను. మళ్లీ మట్టిలోకి వెళ్లకు! వెళ్లి ఆడుకోవద్దు! ఒళ్లంతా దుమ్ము పూసుకోవద్దురా! నా నల్లని కన్నయ్యా!! -- అని మురిపెంగా యశోదాదేవి లాలిస్తూవున్న సుకుమారభావాలు ఉట్టిపడే పలుకులతో కూడిన తమిళ పాశురాలగానం సాగుతూవుండగా, లోపల అర్చకులు స్వామివారికి తడినంతా తుడిచి ఇరువదినాలుగు (24) మూరల సరిగంచు పెద్దపట్టువస్త్రాన్ని అంతరీయం (ధోవతి)గాను, పన్రెండు (12) మూరల పట్టువస్త్రాన్ని ఉత్తరీయంగాను రమణీయంగా ధరింప జేస్తారు. ఆ తర్వాత అర్చకులు సాలగ్రామమాల, లక్ష్మీహారం, ఇత్యాది ఆభరణాలను క్లుప్తంగా స్వామివారికి అలంకరిస్తారు. ఒకపట్టువస్త్రాన్ని శిరస్సుకు కిరీటం వలె చుట్టి అలంకరిస్తారు. శ్రీవారి ఫాలప్రదేశంపై పలుచగా పచ్చకర్పూరం కస్తూరిలతో ఊర్ధ్వపుండ్రాన్ని సుతారంగా తీర్చి దిద్దుతారు.

ఇలా అర్చకస్వామి అలంకరిస్తూవుండగా జియ్యంగార్ ఆలవట్టం (పట్టు విసనకర్ర)తో స్వామివారికి విసురుతూ సేవచేస్తారు. ఇలా లఘువుగా అలంకరణ ముగిసేటప్పటికి దివ్యప్రబంధపారాయణ పూర్తి అవుతుంది. వెంటనే శ్రీవేంకటేశ్వరస్వామి వారికి వెన్న, పంచదారను నివేదన చేసి తాంబూలం సమర్పించి బంగారు తట్టలో "పచ్చకర్పూర హారతి" సమర్పిస్తారు. ఈ హారతి జరుగుతూ వుండగా కులశేఖరపడి తెరను తీస్తారు.

## శ్రీవారి మహాప్రసాదం

అంతవరకు బారులుతీరి కూర్చొని శ్రీ స్వామివారి దివ్యమంగళమూర్తి సౌందర్యాన్ని దర్శించటానికి ఎదురుచూస్తూవున్న భక్తుల్లో ఒకవిధమైన ఉత్సాహము బయలుదేరి, అందరూ లేచి నిలబడి కర్పూరహారతి వెలుగుల్లో శ్రీవారి సౌందర్యాన్ని కన్నులారా తిలకించి అనిర్వచనీయమైన సంతృప్తిని శాంతిని ఆనందంతోకూడిన దివ్యానుభూతిని పొందుతారు.

అభిషేకం పూర్తి అయినందువల్ల జియ్యంగారు, అధికారులు, ఆచార్యపురుషులు బయటికివచ్చి, బంగారువాకిలి దగ్గర నిల్చొని వుంటారు. ఆ సమయంలో బారులు తీరి నిలిచివున్న భక్తులు క్రమంగా స్వామి వారికి దగ్గరగావెళ్లి దర్శిస్తూ జరుగుతూ వుండగా అర్చకులు శ్రీస్వామివారి అభిషేక తీర్థాన్ని అందరిపైనా ప్రోక్షిస్తారు. ఆ పవిత్ర

> **అభిషేకంలో....**
>
> శ్రీవేంకటేశ్వర స్వామి వారికి ప్రతిశుక్రవారంనాడు జరిగే అభిషేకంలో 84 తులాల పచ్చ కర్పూరం, 36 తులాల కుంకుమ పువ్వు, 1 తులం కస్తూరి $1\frac{1}{2}$ తులం పునుగు తైలం, 8 ఫలాల పసుపుపొడి వినియోగిస్తారు.

తీర్థంతో పునీతులైన భక్తులు స్వామివారి (తొడుగు లేకుండా వున్న) నిజపాదాలనుండి కిరీటం దాకా సందర్శిస్తూ ఆ చోటు వీడటానికి మనసొప్పక, చిఱుహాసంతో ప్రకాశిస్తూవున్న శ్రీనివాసుని ముఖారవిందాన్ని మరల మరల వెనక్కు తిరిగి చూస్తూ, బంగారు వాకిలి వద్దకు రాగా, ఆలయాధికారులు వారలకు "శ్రీపాదరేణువు-చందనం" అనబడే "శ్రీవారి మహా ప్రసాదా"న్ని అందజేస్తారు. దానిని అత్యంత భక్తితో కళ్ల కద్దుకొని స్వీకరించిన భక్తులు ఇంకా వెలుపలికి వచ్చి శ్రీ స్వామివారి క్షీరాభిషేకతీర్థాన్ని కూడ స్వీకరించి పరమపవిత్రులై, ఆనంద నిలయవిమానప్రదక్షిణం చేస్తూ, కోటి దివ్యకాంతులీనుతున్న బంగారు విమానాన్ని విమానవేంకటేశ్వరుని శిరసెత్తి చూచి, రెండుకన్నులు చాలక చేతులెత్తి నమస్కరిస్తూ మళ్లీ ఎప్పుడో ఈ దర్శన అవకాశం కలిగేది అనుకొంటూ ముందుకుసాగి హుండీలో మ్రొక్కులు చెల్లించుకొని విష్వక్సేనులకు శ్రీరామానుజులవారికి, యోగనరసింహస్వామికి వందనాలు సమర్పించి వెండివాకిలిదరిన స్వామివారికి సాష్టాంగపడి, బయటికి నడచి శ్రీస్వామివారి ప్రసాదాన్ని మనసారా స్వీకరించి మనోరథం సిద్ధించిన మహదానందంతో భక్తులు తమ తమ బసలకు చేరుకొంటారు.

శ్రీవేంకటేశ్వరస్వామివారికి ప్రతిశుక్రవారంనాడు జరిగే అభిషేకోత్సవంలో తగిన ఆర్జితరుసుమును క్రింది రీతిగా చెల్లించి భక్తులు పాల్గొని దర్శించవచ్చు.

1. పూరాభిషేకం - రు.750/- లు ఒక్కరికి మాత్రమే.

   ఈ టికెట్టు తీసుకొన్నవారు మిగుల దగ్గరగాఉండి అభిషేకాన్ని దర్శించవచ్చు. అభిషేకానంతరం వీరికి 2 చిన్నలడ్లు, 2 వడలు ప్రసాదంగా ఇస్తారు.

2. పునుగు గిన్నె - రు.300/- లు ఒక్కరికి మాత్రమే.

   ఈ టిక్కెట్టు తీసికొన్నవారిని,పై పూరాభిషేకం భక్తులవెనుక ఆసీనుల్ని చేస్తారు. వీరికి ఒక చిన్న లడ్డు, ఒక వడ ప్రసాదంగా ఇస్తారు.

3. కస్తూరి గిన్నె - రు.150/- లు ఒక్కరికి మాత్రమే.

   వీరు పునుగుగిన్నె సమర్పించిన భక్తుల వెనుక కూర్చొనివుంటారు. వీరికి ఒకచిన్న లడ్డు ఒక వడ ప్రసాదంగా ఇస్తారు.

ఈ అభిషేకసేవలో పాల్గొనే భక్తులలో, శ్రీస్వామివారిమూలమూర్తికి ధరింపజేసే పట్టువస్త్రాలను కానుకగా సమర్పింపదలచినవో, వారు 12 x 2 గజముల కొలత గల ధోవతి (పట్టు మేల్‌ఛాత్), 6 x 1 గజముల కొలతగల పట్టుఉత్తరీయాన్ని ఇవ్వవచ్చు. లేదా వీటిధర రు. 12,250/- లు (ఈ రుసుములు కాలానుగుణంగా మారుతూ

వుంటాయి) డిమాండు డ్రాఫ్టుగా పంపవచ్చు ఈపట్టు వస్త్రాలను గృహస్థు పాల్గొన్న రోజున వారిపేరిట, అభిషేకానంతరం మూలవరులకు అలంకరింప జేస్తారు.

అభిషేకసేవలో 10 ఏండ్లలోపు పిల్లలను అనుమతించరు.

అభిషేకంలో పాల్గొనదలచిన భక్తులు, తమకు నచ్చిన రుసుమును

పూరా అభిషేకం = రు. 750/-లు ఒక్కరికి మాత్రమే.

లేదా

పునుగు గిన్నె = రు. 300/-లు. ఒక్కరికి మాత్రమే.

లేదా

కస్తూరి గిన్నె = రు 150/-లు. ఒక్కరికి మాత్రమే.

ఈ మొత్తాన్ని డిమాండు డ్రాఫ్టుగా "ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి.దేవస్థానములు, తిరుపతి" వారిపేర ఏ జాతీయబాంకులోనైనా సరే తీసి, దానిని, దాదాపు ఒక్క సంవత్సరం ముందుగానే "పేష్కారు, తిరుమలశ్రీవారిఆలయం,తిరుమల-517 504" వారికి పంపుతూ, తమకు కావలసిన శుక్రవారాభిషేకపుతేదీని ఖాయపరచుకోవచ్చు. సదరు తేదీ అనుమతిని "ధ్రువపత్రం" ద్వారా భక్తులకు ముందుగానే తెలియజేయబడుతుంది. అయినా ఈ శుక్రవారాభిషేక సేవలో, అప్పటికివున్న అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

అభిషేకంలో పాల్గొనడానికి అనుమతి లభించిన భక్తులను ఆ శుక్రవారం తెల్లవారుజామున 3-30 గంటలకు "వైకుంఠం క్యూ కాంప్లెక్సు" ద్వారా మాత్రమే ఆలయంలోనికి ప్రవేశింప జేస్తారు.

ఈ అభిషేకానికి భక్తులు స్నానం చేసి శుచిగా శుభ్రమైన వస్త్రాల్ని ధరించి పవిత్రంగా రావాలి. పురుషులు ధోవతి, ఉత్తరీయం మాత్రమే ధరించాలి. ఈసేవలో పదేండ్లలోపు పిల్లలను అనుమతించరు.

శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూలవిరాణ్మూర్తి యొక్క అపూర్వ దివ్యసౌందర్యాన్ని సుమారు ఒక గంటపాటు సందర్శింప జేసే ఈ శుక్రవారాభిషేకం దేశంనలుమూలల నుండి ఎందర్నో భక్తులను విశేషంగా ఆకర్షిస్తూవున్నది. నిజంగా ఈ దర్శనావకాశం అనేక జన్మల పుణ్య ఫలితంగా లభిస్తుందనడం ముమ్మాటికీ సత్యమైన మాట!

## నిజపాద దర్శనం

ప్రతి శుక్రవారం అభిషేకం పూర్తిఅయిన తర్వాత అభిషేక ఆర్జిత సేవా భక్తులు శ్రీ స్వామివారిని దర్శించి వెళ్లిన తర్వాత "నిజపాద దర్శనం" అనే సేవ ప్రారంభమవుతుంది.

అభిషేకానంతరం, కేవలం వస్త్రాలంకారంతోను, ఒకటిరెండు ఆభరణాలతోను, పాదాలపైన ఎలాంటి తొడుగులేకుండా నిజపాదాలతో దర్శన మిస్తున్న స్వామివారిని ఈ సమయంలో చూడవచ్చు. దీనినే "నిజ పాద దర్శన" సేవ అంటారు. ఇలా అభిషేకానంతరం దివ్య తేజస్సుతో ప్రకాశిస్తూవున్నట్టి ఎలాంటి తొడుగూ లేనట్టి నిజపాదాలతో దర్శన మిస్తున్న శ్రీ స్వామివారిని ఆపాదమస్తకం కన్నులారా తిలకించి ధన్యులవుతారు. ఇలా బంగారుకవచం లేని శ్రీస్వామివారి నిజపాదాలను అభిషేక దర్శనంలో గాని, లేదా అభిషేకానంతరం జరిగే ఈ "నిజ పాద దర్శనం"లో కాని మాత్రమే దర్శించే భాగ్యం కలుగుతుంది. ఇక మిగిలిన అన్ని వేళల్లో శ్రీవేంకటేశ్వరస్వామివారి పాదాలు బంగారు తొడుగుతో విరాజిల్లుతూ వుంటాయి.

ప్రతి శుక్రవారం అభిషేకానంతరం జరిగే "నిజ పాద దర్శనం"లో పాల్గొనదలచిన భక్తులు రు 100/- లు (ఒక్కరికి మాత్రమే) డిమాండు డ్రాఫ్టును ఏ బ్యాంకులోనైనా సరే, "ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి." వారిపేర తీసి, దానిని, "పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల-517 504" వారికి 90 రోజులు ముందుగా పంపుతూ కావలసిన తేదీ (శుక్రవారం)కి అనుమతి పొందవచ్చు. అనుమతిని ముందుగానే భక్తులకు "ధ్రువపత్రం" ద్వారా తెలియ జేయబడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టిమాత్రమే వీలు కల్పించబడుతుంది.

'నిజపాద దర్శనం' ఆర్జిత భక్తులను ప్రతి శుక్రవారం తెల్లవారుజామున 5-30 గంటలకు "వైకుంఠం క్యూ" ద్వారా మాత్రమే శ్రీవారి ఆలయంలోనికి అనుమతిస్తారు.

వీరంతా అభిషేకానంతరం జరిగే శ్రీ స్వామివారి నిజ పాద దర్శనసేవలో పాల్గొని, శ్రీ స్వామివారిని ఆపాదమస్తకం దర్శించి తీర్థం స్వీకరించి వెళ్లిన తర్వాత కులశేఖర పడివద్ద తెరలు వేస్తారు.

ఆ పిదప, శ్రీ స్వామివారికి ఊర్ధ్వ పుండ్ర సమర్పణ, వస్త్రాంకరణ, ఆభరణాల అలంకరణ జరుగుతుంది. పిదప శ్రీ స్వామివారి వక్షః స్థలంలో అలంకరించిన బంగారు అలమేలు మంగకు అభిషేకం జరుగుతుంది. ఈ కార్యక్రమాలన్నీ ఏకాంతంగా జరుగుతాయి. అభిషేకానంతరం బంగారు అలమేలు మంగను శ్రీవారి వక్షఃస్థలంలో అలంకరించిన తర్వాత శ్రీస్వామివారికి కిరీటాన్ని అలంకరిస్తారు. ఇలా అన్నీ అయినతర్వాత శ్రీ స్వామివారికి తోమాలసేవ, అర్చన, నివేదన జరుగుతాయి. పిదప సర్వాభరణ భూషితుడైన శ్రీ స్వామివారు సూర్యకోటి ప్రకాశంతో దర్శనమిస్తూ భక్తులను అనుగ్రహిస్తాడు.

కందర్పకోటిసదృశం కమనీయవేషం
ముక్తావళీలలితకంఠ ముదారహారమ్
పీతాంబరద్యుతివిరాజితదివ్యదేహం
శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్



# శ్రీవేంకటేశ్వరస్వామివారిఆలయం, తిరుమల.

## శ్రీ బాలాలయ అష్టబంధన మహాసంప్రోక్షణం
## 7-8-94 మొదలు 12-8-94 వరకు

శ్రీవైకుంఠ విరక్తాయ
స్వామిపుష్కరణీతటే
రమయా రమమాణాయ
వేంకటేశాయ మంగళమ్.

అఖిల చరాచర ప్రపంచమునకు హేతుభూతుడై శ్రీవైకుంఠవిరక్తుడై శ్రీదేవీ సంయుతుడై శేషాద్రియందు స్వామిపుష్కరణీ తీరమందు అర్చారూపియై విజయంచేసిన శ్రీశ్రీనివాసునిమహావైభవము చూచి తరింపనివాని జన్మమేల? అన్నట్లు కలియుగ ప్రత్యక్ష దైవము శ్రీ శ్రీనివాసుడనుచు, వేద ఉపనిషత్పురాణములు నినదించు చున్నవి. శ్రీమత్పారమాత్మికోపనిషత్తు సకల వేదార్థసారభూతము "రయిఃకకుద్మాన్" అను మంత్రములో శ్రీస్వామివారి కరుణారసప్రపూర్ణత గోచరించును. శ్రీ వైఖానసమంత్రప్రశ్నములో నీ యుపనిషత్తునకు ప్రత్యేకస్థానము కలదు. అట్టి శ్రీ విఖనసమహామునిచేత నాదిలో అర్చింపబడి కాలక్రమముగా నాశాఖీయుల చేతనే శ్రీ మద్వైఖానస భగవచ్ఛాస్త్రోక్తముగా పూజించ బడుచున్న పరమపురుషుడు శ్రీ శ్రీనివాసుడు. అట్టి మహిమ గల్గిన శ్రీవారు పంచబేరాత్మకముగా ధ్రువ, కౌతుక, ఉత్సవ, స్నపన బలిబేరములను పేళ్ళతో శ్రీ ఆనందనిలయమునం దుపస్థితమై యున్నది. శ్రీ శ్రీనివాసుడు స్వయంవ్యక్తమూర్తి. ఇందు ప్రధానబేరమైనది- ధ్రువబేరము.

అనంత కళామయుడైన శ్రీవారికి శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రము ననుసరించి కొన్ని కొన్ని సందర్భములందు అష్టబంధనము చేయవలసి యున్నది. ఏతత్ కార్యసమీక్షయే ఈవ్యాస పరమార్థము.

శ్రీవారి దేవాలయ మందలి ఆధ్యాత్మిక రహస్యమొక్కటి గలదు. అదే మన ఆలయ నిర్మాణము ఆగమశాస్త్ర రీతిగ ఆధ్యాత్మిక ప్రమాణమై యున్నది.

"ధ్వజం జీవమిత్యాహుః" అను ప్రమాణ వాక్యము ననుసరించి శరీరమునకు ప్రాణమెట్టిదో ఆలయమునకు ధ్వజమట్టిది. శరీరమునకు వలనే, ఆలయమునకు పంచకోశములున్నవి. మానవుడు ఆలయమునకు గల హ్యా ప్రాకారాదులను జుట్టివచ్చుటయే అన్నమయ కోశమును దాటివచ్చుట. ప్రాకారాంతమున గల ధ్వజమును బలిపీఠమును దర్శించి స్వామి కీర్తిపతాకను దర్శించుట ప్రాణమయ కోశమును గమించుట. పరివార దేవతాదుల దర్శనము ముఖమంటప ఆస్థానమంటప, పాకమంటపాదుల వీక్షణము మనోమయ కోశమును దాటుట. స్వామివారి అంతరాళమునుచేరుట విజ్ఞానమయ కోశమును చేరుట. అనంతరము పరమాత్మయందంతర్లీనత నంది, అనన్యాశ్రయత్వ, అనన్యశరణ్యత్వ, అనన్య సేవ్యత్వమును స్వీకరించుటయే ఆనందమయ కోశము చేరుట. "ఆ" సమస్తాత్ అనుటచే అచట అంతయూ ఆనందమే. "సదా పశ్యన్తి సూరయః" అను



**శ్రీ అర్చకం రామచంద్ర దీక్షితులు**

శ్రుతి. నిత్య సూరులనవరతము నట్టి స్థితి ననుభవింతురని నుడువు చున్నది. కనుకనే కాబోలు శ్రీవారి నిలయము ఆనంద నిలయ మయ్యెను. ఇది అన్వర్థము. పంచకోశాత్మకమైన జీవుడొక్కొక్క కోశమును విడిచి ముక్త్యర్థమును గమించి స్వామి యందు లయమొందుటయే ఆనందము. తన్నిరూపణమే శ్రీవారి ఆనంద నిలయము. జన్మరాహిత్యమును కోరు భక్తజన సందోహమునకు కొంగుబంగారము శ్రీవారి ఆనందనిలయము. శ్రీవారి ఆలయ నిర్మాణము ఆగమశాస్త్ర రీతిగానే యుండడం విశేష విషయము.

కొన్ని వేల సంవత్సరముల చరిత్ర కలిగిన శ్రీస్వామివారి కిట్టి మహత్తరమైన అష్టబంధన కార్యక్రమము లెన్నియో పర్యాయములు జరిగి యుండినట్లు ప్రమాణములున్నవి. ఇదివరలో 1958 వ సంవత్సరము '1970, సం॥ మరియు 1982 వ సంవత్సరములందు ఈ అష్టబంధన కార్యక్రమములు జరిగిన అనంతరము 1994 వ సంవత్సరం ఆగష్టునెల 7-8-94 మొదలు 12-8-94 అనగా శ్రావణ శుద్ధ పంచమి శుక్రవారం ఉదయం 9.20 నిముషముల శుభ కన్యాలగ్నమందు శ్రీవారికి బాలాలయ అష్టబంధన మహా సంప్రోక్షణ జరుపుటకు భగవదనుగ్రహముతో నిర్ణయింపబడి వైభవముగా జరిగినది.

శ్రీవారి గర్భాలయ మందు ధ్రువపీఠమునకు పద్మబంధమునకును గల బంధము క్లేశమైనపుడు శక్తి తరగుటయు దాని అష్టబంధన విధానముచే బంధింప చేయుటయు ఆగమ శాస్త్రసమ్మతము. దీనిని అష్టబంధన మందురు. ఇందు లక్క, గుడము, తేనె

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః' అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- మాంసాహారాన్ని భుజించకండి.
- ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- పొగత్రాగకండి.
- వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజే.

మైనము, గుగ్గిలములను సమాన భాగములుగా మిశ్రీకృతము గావించి దీనికి రెండింతలు సజ్జరసమును దానికి సగము గైరికము పచ్చకర్పూరమును కలిపి దీని యన్నింటిని సగభాగమును తెల్లమును(సున్నం)చేర్చి లోహపాత్ర యందుంచి పక్వము నొనర్చిగానీ అపక్వముగాగానీ పీఠరంధ్రబంధమొనర్చుటయే అష్టబంధనమని శ్రీవైఖానసశాస్త్రకర్తలలో నాకరగు శ్రీమరీచిమహర్షివారియభిసంది. శ్రీవారికి ఈ శీతలబంధము చేయుట సంప్రదాయముగ నున్నది. ఇట్టి విశేష భగవత్కార్యములు ఇదివరలో మూడు పర్యాయములు 1. ఆనందనిలయ విమాన సంప్రోక్షణ, 2. అష్టబంధన సంప్రోక్షణ 3. ధ్వజస్తంభ సంప్రోక్షణ క్రమముగా విజయవంతముగా నిర్వహించిన మా తండ్రిగారు శ్రీమాన్ అర్చకం శేషాచలం దీక్షితులువారు చిరస్మరణీయులు.

ప్రస్తుతము వారి కుమారులు శ్రీవైఖానస ఆగమరత్న అర్చకం రామచంద్ర దీక్షితులు, వారి సహోదరులు శ్రీమాన్ అర్చకం దొరస్వామి దీక్షితులు, శ్రీనివాస నరసింహదీక్షితులు నేటి ఈ మహత్తరవైదికకార్యక్రమము నిర్వహించినారు.

శ్రీవారి బాలాలయ అష్టబంధన మహాసంప్రోక్షణ కార్యక్రమము 7-8-94 ఆదివారం ఉదయం శ్రీవారి ప్రార్థనసూక్తం ఆచార్య ఋత్విగ్వరణముతో నారంభించబడినది. సాయంత్రము శ్రీవిష్వక్సేనుల వారు తిరువీధుల వేంచేసి వసంత మంటపమునందు ఆస్థానములో నున్న సమయమున మృత్సంగ్రహణము నొనర్చుకొని అనంతరము ఆలయమునందు లోకశాంతి కొరకు సంకల్పము, గావించబడి అంకురార్పణము గావించబడినది.

8-8-94 సోమవారము. యాగశాల యందు శాలావాస్తు అకల్మష హోమములు జరిపి ఋత్విక్-పావనార్థము పంచగవ్య ప్రాశనము జరుపబడినది. ఆరాత్రి శ్రీవారి ధ్రువ మూర్తియందలి చతుర్వింశజ్జీవకళలను బీజా

క్షరసంయుతముగా మహాపీఠమొనర్చి నవరత్న శోభితమై స్వర్ణప్రతిమలు గలిగి పవిత్ర తీర్థముతోనున్న రజితకుంభము నందు ఆవకర్షణము గావించుట. శ్రీవారి సర్వాంగములందున్న చతుర్వింశజ్జీవకళలను శ్రీవైఖానస ఆగమ శాస్త్రానుసారము ప్రధానాచార్యుడు ఇతర ఆగమాచార్యులు ఈకార్యక్రమము బీజాక్షర సంయుతమైన మహామంత్రానుష్ఠాన పూర్వకముగా దీనిని నిర్వర్తించుట ఇందలి విశేషము. అనంతరము యాగశాల యందు వేదవిదుల వేదనిస్వనము ఘోషించుచుండగా అధికార అనధికారులు వేదపండితులు ఆగమ శాస్త్రకోవిదులు పండితులు వెంటరాగా ప్రధానాచార్యుడు ఈ రజితమహాకుంభమును శిరస్సు నందుంచుకొని ప్రదక్షిణముగ యాగశాల యందు పంచాగ్నుల మధ్యమందుగల ప్రధాన వేదికపై ప్రతిష్ఠింపచేసి న్యాస పూర్వకముగా ఆరాధించినారు.

ఇదే సమయమున ఆలయతదితర పరివార దేవతామూర్తులకున్న నియమితులగు ఋత్విక్కులు వివిధ దేవతామూర్తులైన విష్వక్సేనులు, పోటుతాయార్లు, పడిపోటు తాయార్లు, గరుడాళ్వారులు,శ్రీ నరసింహ స్వామివార్లు, శ్రీ వరదరాజస్వామివారు, శ్రీ బేడి ఆంజనేయస్వామివార్లు, శ్రీ భాష్యకార్లు ఆయా విమానములకునూ ప్రత్యేకముగా కళాపకర్షణము జరిగింపబడి యాగశాల యందా మహాకుంభముల ఆయా వేదికల మీద అలంకరింపబడినవి. యాగశాలయందు ప్రధాన వేదిక ఉపవేదిక సహితముగా అష్టమంగళ పంచాయుధాలచే అలంకరించబడి ఈ మహాకుంభములకు నొక మాత్ర ప్రకాశము కల్గింపబడినది. అనంతరము అన్ని మహాకుంభములకును రాజోపచారములతో విశేషారాధనములు జరిగినవి. తదుపరి గార్హపత్యాన్వాహార్య వసత్థ్యా 'సభ్య పౌండరీకాదులును పంచాగ్నుల యందు ఈంకారాది హోమములు, మూర్తి హోమములు నిర్వహింపబడినవి.

నాటినుండి ప్రతిదినము ఉదయం, సాయంత్రములందు సర్వాగ్ని కుండములందు విశేష హోమములు నిర్వర్తించారు. యాగశాలయందు వేంచేసియున్న శ్రీ మలయప్ప స్వామివార్లకు శ్రీ కోదండరామస్వామివార్లకు శ్రీకృష్ణస్వామివార్లకు తదితర ఆలయ పరివారదేవతలకు విశేషార్చనలు విశేష నివేదనములు ఆగమ కోవిదులైన ఆచార్యఋత్విక్కులు నిర్వహించినారు.

రెండవదినము 9-8-94 మంగళవారం ఉదయం, సాయంత్రములందు యాగశాల యందు సర్వాగ్ని కుండములందు సామాన్య విశేష హోమములు నిర్వర్తించ బడినవి. అన్ని వేదికల నలంకరించిన దేవతారజిత మహాకుంభములకు విశేషార్చనలు విశేష నివేదనములు రాజోపచారములు నిర్వర్తించినారు.

10-8-94 బుధవారము ఉదయం విశేష హోమముల సర్వాగ్ని కుండములందు నిర్వహించబడి అష్టబంధన విశేష సామగ్రులను అర్చించి వెన్నెతో మర్దించి పక్వము గావించి స్నాపనాచార్యులు వేదయుక్తముగా శ్రీవారికిని పరివార దేవతాధ్రువబేరములన్నింటికినీ అష్టబంధనము సమర్పించినారు.

ఆరోజు సాయంత్రము యాగశాల యందు అన్ని హోమకుండలము లందు సామాన్య విశేష హోమములు నిర్వర్తించబడి ఆయా వేదికలపై రజిత కుంభ మందలి దేవతామూర్తులకు విశేషార్చనలు విశేష నివేదనములు నిర్వహించినారు.

11-8-94 గురువారము ఉదయము మామూలు మేరకు అన్ని హోమకుండము లందు విశేష హోమములు నిర్వహించి బింబశుద్ధికై జరిగెడు శాస్త్రసిద్ధి కార్యములు అధివాసములు అన్ని ధ్రువబేరములకు జరుపబడి సాయంత్రము అన్నిహోమకుండము లందు విశేష హోమములు జరిగి మహాశాంతి హోమకుండమునందు పూర్ణాహుతి హోమము పూర్తియైన అనంతరము ప్రధాన పరివార మహాశాంతి కుంభములతో ప్రదక్షిణముగా శ్రీవారి గర్భాలయము నందు మహాశాస్త్ర చతుర్దశకలశ తిరుమంజనము శ్రీవారికిన్ని ఇతర పరివార దేవతాధ్రువబేరములకు జరుపబడి ఆ రాత్రి విశేషముగా శ్రీవారికి శయనాధి వాసము నిర్వర్తించబడినది. అధివాసములు బింబశుద్ధి కొరకు నిర్వర్తింపబడెదు సంస్కార విశేషము. అధివాసానంతరము తత్తదధివాస హోమము లాయాహోమకుండములందు నిర్వర్తించ బడిననే కానీ ఈ ఫలము సిద్ధింపదు. ఆ హోమ విధుల నిర్వర్తించ బడిన బింబములకొక మాత్ర స్ఫూర్తి అపూర్వ ప్రకాశము సిద్ధించుననుటను ఆగమ శాస్త్రము నిర్దేశించినది.

12-8-94 శుక్రవారము పదవ దినము అనగా సుముహూర్తమున ఉదయం 9.20 నిముషములు శుభకన్యాలగ్నమందు సర్వగ్రహములు శుభఫలావాప్తికై సిద్ధపడుచుండ శ్రీ మదానందనిలయవాసుడైన శ్రీశ్రీనివాసునకు మరియూ పరివార దేవతా మూలముగా మహాసంప్రోక్షణ కార్యక్రమము నిర్వహింపబడినది. అనంతరము శ్రీవారికి విశేష తిరువాభరణములు అలంకరించబడి విశేష నివేదనములు అక్షతారోపణములు జరిగి, ఏతెంచిన ఆచార్య ఋత్విక్ సంఘమునకు బహుమానములు భూరి దక్షిణలు ఒసగబడినవి. ఈమహత్తర వైదిక కార్యక్రమములు శాస్త్రోక్తముగా నిర్వహించుటకు విచ్చేసిన ఆగమ విద్వాంసులు, పండిత ప్రవీణులు శ్రీమాన్‌వేదాన్తం దేశికభట్టాచార్యులు పర్యవేక్షణము, ఈకార్యక్రమమునకు ధనవ్యయమునకు వెనుదీయక భక్తి శ్రద్ధలతో ప్రోత్సాహము నందించిన తి.తి.దే ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్ రెడ్డిగారిని, కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి గారిని, తమ తమ అర్హతానుగుణముగా ఈ మహత్తర కార్యక్రమమున సేవచేసి తరింతుమన్న భావనతో శ్రమతీసుకొన్న నితరులను, పై కార్యక్రమము విజయవంతముగా శ్రీమద్వైఖానస ఆగమశాస్త్రవిధిని నిర్వహించుటకు శ్రీ శేషాచలపతి అనుగ్రహించి సంపూర్ణంగా నెరవేర్చినారు.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

విద్యే సౌందర్యం     విద్యే దైవం

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని *"ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటీ, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్."* వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి

(16వ పేజీ తరువాయి)

## 23. కామధేనువు (గోవు)

ఆవు సాక్షాత్తు దైవస్వరూపము. రోజూ ఆవుయొక్క ముఖముకంటే పృష్ఠభాగమును చూచిన శుభము కలుగును. గోదానమువలన పుణ్యలోకప్రాప్తి కలుగుతుంది. గోవుయొక్క పాలు, పెరుగు, నెయ్యి, పేడ, మూత్రం వీటిని పంచగవ్యములు అందురు. వీటిని మంత్ర పూర్వకముగా ప్రాశన చేయుటచేత శరీర శుద్ధి కలుగుతుంది. గోవును ప్రతి శుక్రవారం పసుపు, కుంకుమలతో పూజించిన అష్టైశ్వర్యప్రాప్తి కలుగును.

యా లక్ష్మీః సర్వభూతానాం
సర్వదేవే ష్వవస్థితా,
ధేనురూపేణ సా దేవీ
మమపాపం వ్యపోహతు.

నమోగోభ్యః, శ్రీమతీభ్యః,
సౌరభేయీభ్య ఏవ చ,
నమో బ్రహ్మసుతాభ్యశ్చ
పవిత్రాభ్యో నమో నమః.

అని గోమాతను ప్రార్థించాలి.

## 24. గాయత్రీదేవి

ముక్తా విద్రుమ హేమ నీల ధవలచ్ఛా
యై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తా మిన్దునిబద్ధ రత్నముకుటాం
తత్త్వార్థ వర్ణాత్మికామ్,
సావిత్రీం వరదాభయాంకుశకశాః
శుభ్రం కపాలం గద్దాం
శంఖం చక్రమథారవిన్ద యుగళం
హస్తై ర్వహన్తీం భజే.

గాయత్రీదేవి అయిదు ముఖములు కలిగి రత్నహారాది భూషణములను ధరించి కమలముపై విరాజమానమై యుండును. ఈమెకు 10 చేతులు 2 చేతులు వరద, అభయ ముద్రలు కలిగి మరో రెండు చేతులతో పద్మములను ధరించి, మిగిలిన హస్తములలో శంఖం, చక్రం, కశా, అంకుశం, ఉజ్జ్వల పాత్ర, రుద్రాక్షమాల కలిగియుండును.

తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్.

ఇది గాయత్రి మంత్రము. ఇది 24 అక్షరాలు కలిగియున్నది. ఈమంత్రానికి ద్రష్ట విశ్వామిత్రుడు. ఈ గాయత్రి మంత్రము 3 పదములుగా విభజింపబడినది. అందుచేత ఇది త్రిపద గాయత్రి అని పిలువబడుచున్నది. ఈ మంత్రము 3 స్వరూపములను కలిగి ఉంటుంది (సత్త్వరజస్తమో గుణములు) అందుచేత ఇది త్రిగుణాత్మకమైనది. ఈ గాయత్రిని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు యజ్ఞోపవీతధారణ కలిగిన ప్రతివారు తప్పక సంధ్యావందనములో జపించాలి. ఈ గాయత్రి ఉపాసనవల్ల సర్వ కోరికలు నెరవేరును.



## 25. గోదాదేవి

నీళాతుఙ్గస్తనగిరితటీ సుప్త
ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశత
శిర స్సిద్ధ మధ్యాపయన్తీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం
యా బలా త్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇద మిదం
భూయ ఏవాస్తు భూయః.

ఈమె పెరియాళ్వారుల తులసీ వనమునందు భూదేవి అంశతో కలియుగము 98వ సంవత్సరమున శ్రీవిల్లి పుత్తూరు నందు జన్మించెను. ఈమె సీతవలెనే భూమియందు అయోనిజగ ఉద్భవించి అర్చామూర్తి భగవానుడైన రంగనాథునే వివాహము చేసుకొన్నది. పూర్వము గోపికలు శ్రీకృష్ణుని భర్తగా పొందగోరి కాత్యాయనీ వ్రతమాచరించి తమ మనోభీష్టములను నెరవేర్చుకొన్న విధముగనే ఈమె కూడ శ్రీ మహావిష్ణువుని వివాహమాడగోరి ధనుర్మాసవ్రతము ఆచరించి, గోపికలు ఒకరినొకరు లేపుకొని తెల్లవారు ఝామునే శ్రీకృష్ణపూజ చేసినట్లు భావించి తానుకూడ 30 పాశురములతో తిరుప్పావు నురచించి, రోజుకొక్క పాశురమును పాడి, ఈధనుర్మాసవ్రతముచేసి రంగనాథుని భర్తగా పొందినది. గో అంటే వాక్కులు అనికూడ అర్థము కలదు. ద అంటే ఇచ్చినది. అంటే వాగ్రూపమైన మాలతో (పాశురములు) భగవానుని పూజించుటచేత గోదా అనుపేరు కలిగినది. తండ్రికి పూల మాలలో కట్టుటకు సహకరిస్తూ ఆకట్టిన మాలలను తాను ధరించి అందముగానున్నదీ లేనిదీ చూసుకొని మళ్ళీ యథాప్రకారం బుట్టలో తండ్రికి తెలియకుండా పెట్టుచుండెడిది. ఒకరోజున తండ్రిచూసి ఈమెను మందలించి, కట్టినమాలలను పారవేసి మళ్ళీ వేరే మాలలనుకట్టి స్వామికి అర్పించగా, స్వామికి సంతోషము కలుగలేదు. "గోదాదేవి ధరించి తీసిన మాలలే తీసుకొనిరా" అని ఆజ్ఞాపించారు. ఆవిధంగా తానుధరించి విడిచిన మాలతో స్వామిని బంధించుట చేత ఈమెకు శూడి కొడుత్త నాచ్చియార్ అను తమిళ నామము కలిగినది. ఈమె గురించి తెలుపు ప్రబంధము ఆముక్తమాల్యద. శ్రీవైష్ణవ దేవాలయము లలో అర్చామూర్తిగా నేటికీని ధనుర్మాస దీక్షకు కారణమై విరాజిల్లుచున్నది.

వివాహము కాని కన్యలు నియమముగా ఈ ధనుర్మాసవ్రతమును 30 దినములు ఆచ



# ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకు సెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

**కార్యనిర్వహణాధికారి,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తిరుపతి.**

రించి, గోదాదేవిని, స్వామిని పూజించిన తప్పక వివాహము జరుగును.

యస్య త్రయ స్త్రింశ త్ దేవా
అఙ్గే గాత్రా బిభే జిరే
తాన్ వై త్రయ స్త్రింశత్ దేవా
నేకే బ్రహ్మావిదో విదుః.

ఇక్కడ దేవతలందరికీ ప్రభువు అయిన శ్రీమన్నారాయణుని అంగీ దేవతగాను మిగిలిన 3 కోట్ల ముప్పది మంది దేవతలను శ్రీమన్నారాయణుని యొక్క అంగదేవతలు గాను విజ్ఞులు చెప్పుదురు. ఇదే విషయాన్ని భగవంతుడు భగవద్గీతలో అర్జునునికి ఉపదేశిస్తూ

కామై స్తై స్తై ర్హృత జ్ఞానః
ప్రపద్యన్తేఽన్య దేవతాః,
తం తం నియమ మాస్థాయ
ప్రకృత్యా నియతా స్వయా.

"మానవులు ఇది కావాలి, అదికావాలి అంటూ మతి పోగొట్టుకొని రకరకాలైన దేవతలను భజిస్తున్నారు. రకరకాలైన వ్రతాలను ఆచరిస్తున్నారు. తమ తమ గుణాల వల్ల ప్రేరేపింపబడుతూ వాటికి తగినట్లుగా చేస్తున్నారు. తమకు నచ్చిన దేవతా స్వరూపాలను వాళ్ళు నిర్మించుకొంటూ భక్తితో పూజిస్తున్నారు. ఆ భక్తిశ్రద్ధలను కూడ నేనేవాళ్ళకు ఇస్తున్నాను. దానితో వాళ్ళు ఆ యా దేవతలను ఆరాధించి ఫలితాన్ని పొందుతున్నారు. కాని ఆదిత్యులు, వసువులు, రుద్రులు, అశ్వినులు, మరుత్తులు, వీరుగాక ఇంతవరకు చూడని రకరకాలైన దేవతారూపాలు నాలోనే ఉన్నాయి. సమస్తము నేనే. ఇట్లా నన్ను తెలుసుకొని "సర్వం శ్రీకృష్ణార్పణమస్తు" అంటూ పూజించువాడు నన్నే పొందగలడు. అతనికి మరుజన్మలేదు." అని బోధించెను. కాబట్టి శ్రీమన్నారాయణుడు భక్తజన సంరక్షణార్థము అర్చామూర్తిగా 108 దేవాలయములలో వేంచేసియున్నాడు. వీటిని అష్టోత్తర శత దివ్య దేశములు అందురు. ఈదివ్య దేశములలో వేంచేసియున్న స్వాములను జీవితములో ఒక్కసారైనా యాత్రచేసి దర్శించుకొన్న ఎడల సర్వపాపములను పోగొట్టుకొని, మోక్షమును పొందుదురు.

రంగనాథస్వామి, వరదరాజస్వామి, వేంకటేశ్వరస్వామి, నరసింహస్వామి, సీతారామచంద్రస్వామి, శ్రీకృష్ణ పరమాత్మ, అనంత పద్మనాభస్వామి, సంపత్ కుమారస్వామి - ఇట్లా ఎన్నో నామ రూపాలతో అర్చామూర్తిగా ఆ యా దివ్యదేశములలో వేంచేసి యున్న స్వామిని సేవించి, పూజించి, తరించండి. భగవానుడు చెప్పచున్నాడు:-

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః.

ఇతరమైన సర్వధర్మాలనూ చింతలేకుండా తోసివేయి. నన్ను శరణుపొందు. పాపాలన్నింటి నుంచీ నేను నిన్ను విడిపిస్తాను. దుఃఖించకు.

మనం చేసిన పాపాలను తొలగించుకోవడానికి శరణాగతి యేమందు. అందుచేత భక్తితో భగవంతుని పూజించి, శరణాగతిచేసి తరించాలి.

---సమాప్తము---





# సత్యతపుడు

వింధ్యాటవిలో ఒక బోయవాడుండేవాడు. పరమదుర్మార్గుడు. బాటసారులను దోచుకొని వారిని నిర్దాక్షిణ్యంగా చంపేవాడు. వాడు ఒకనాడు అడవిలో సంచరిస్తూ 'అరుణి' అను మునిని చూసి "నిన్ను చంపుతా"నని ఆయుధం తీశాడు.

అరుణి బోయవాడిని చూసి కొంచమైన భయపడక శివనామం జపించాడు.

బోయవాడు ముని నిర్భయత్వానికి ఆశ్చర్యపోయి-

"నేనెందరినో చంపాను. నీవలె చావుకు భయపడని వాడిని ఇంతవరకూ చూడలేదు. ఇక మీదట నేను పాపము చేయను. నాకు ముక్తిమార్గం చెప్పమని" అన్నాడు.

అరుణి వాడితో మాట్లాడక అక్కడ నుండి లేచి వెళ్ళిపోయాడు. బోయవాడు కూడా మునివెంట బయల్దేరాడు. శిష్యునివలె మునికి సేవ చేయసాగాడు. అరుణి మాత్రం బోయవాడితో మాట్లాడలేదు. వారికి మార్గ మధ్యంలో ఒక పులి ఎదురు వచ్చి అరుణిపై దూకబోయింది. అరుణి భయపడి బిగ్గరగా 'నారాయణ' 'నారాయణ' అన్నాడు.

బోయవాడు పులిని ఎదుర్కొని చంపి మునిని కాపాడాడు.

పులి మృతదేహం వెంటనే మానవ రూపు ధరించి వారికి నమస్కరించి-

శ్రీ శావి . ఎన్ . అవధాని

"నేను దీర్ఘబాహుడను రాజును. సకల విద్యలు నేర్చుకున్నాను. విద్యకు వినయం అవసరం. కాని నేను విద్యాధికుడననే గర్వంతో విద్యా వేత్తలను నిందించాను. బ్రాహ్మణులను దూషించాను. వారు నన్ను 'పెద్దపులివి' కమ్మని శపించారు. వారిని శాపవిమోచనం తెలియ చేయమని వేడుకున్నాను. "నీవు ఒక బ్రాహ్మణుని చంపబోవునపుడు అతడు 'నారాయణ' 'నారాయణ' అంటాడు. 'నారాయణ' నామం విన్న నీకు నిజరూపు వస్తుంది అన్నారు. నాటి నుండీ నేను పులినై యీ అడవిలో సంచరిస్తున్నాను. మీ దయవల్ల నేటితో నాశాప విమోచనమైంది" అని చెప్పి దీర్ఘబాహువు వెళ్ళిపోయాడు.

పులి బారి నుండి కాపాడినందుకు బోయవాడిని తన శిష్యుడిగా అంగీకరించాడు అరుణి.



# కొత్త శీర్షిక ప్రారంభం

## పాఠకుల ధార్మిక సందేహాలకు సమాధానాలు

ఎంతో కాలంగా పాఠకులందరూ ఎదురుచూస్తున్న ఈ శీర్షిక జూలై 94 నుండి ప్రారంభమయ్యింది. పాఠకుల ధార్మిక సందేహాలకు ప్రముఖ పండితులు సమాధానాలు ఇస్తారు.

ప్రతినెలా 15వ తేదీలోపు పంపిన ప్రశ్నలకు ఆ మరుసటి సంచికలో సమాధానం ఇవ్వటం జరుగుతుంది. ప్రశ్నలలో ఎటువంటి అవహేళనలకుగాని, దుర్విమర్శలకుగాని తావు వుండరాదు. వీలైనంతమటుకు ప్రతి ప్రశ్నకు ఆయా విషయాలలో నిపుణులైన వారిని సంప్రతించి సమాధానం ఇవ్వవలసి వుంటుంది గనుక, కొంత ఆలస్యంగా ఒక్కొక్క ప్రశ్న ప్రచురితమయ్యే అవకాశమున్నదని గమనించగలరు.

**ప్రశ్నలు పంపవలసిన చిరునామా :**

సందేహాలు - సమాధానాలు
సంపాదకుడు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి — 517 507

"నీవెప్పుడూ సత్యమునే పలుకుము. శకట వృక్ష ఫలములు తినకుము" అని చెప్పి మంత్రోపదేశం చేశాడు.

ముని ఉపదేశం పొంది తపస్సు చేయడం ప్రారంభించాడు బోయవాడు.

అయితే అతనికి అడవిలో ఎటుచూసినా శకట వృక్షములే తప్ప మరి ఏ వృక్షములూ కనిపించలేదు. అందువల్ల అతడు నిరాహారుడై ఘోర తపస్సు చేశాడు.

ఒకరోజు దుర్వాసముని వాని వద్దకు వచ్చాడు.

బోయముని దుర్వాస మునికి నమస్కరించి తన ఆతిథ్యం స్వీకరించమన్నాడు.

"ఈ కూటికి లేనివాడు తన కెటువంటి ఆతిథ్య మివ్వకలడో చూద్దా"మని దుర్వాస ముని అంగీకరించాడు.

బోయముని ఈశ్వరుడిని ప్రార్థించగా శివుడు ప్రత్యక్షమై ఒక మణి పాత్రను యిచ్చి "ఇది నీవు కోరిన ఆహారపదార్థాలు యిస్తుంది" అని చెప్పాడు.

ఆ పాత్ర సహాయంతో దుర్వాసమునికి సకల పిండి వంటలతో భోజనం పెట్టాడు బోయముని. దుర్వాసముని తృప్తి చెంది-

"నీవు 'సత్య తపుడ' వే" అని దీవించి వెళ్ళిపోయాడు.

నాటినుండీ బోయ మునికి 'సత్య తపుడు' అనే పేరు వచ్చింది.

సత్యతపుడు ఒకనాడు అడవిలో సమిధలు కోస్తుండగా ప్రమాదవశాత్తు కత్తి తగిలి అతని చేతి వేలొకటి తెగి క్రింద పడింది. కాని వెంటనే ఆ వేలు అతని చేతికి యథాస్థానంలో అతుక్కుంది. చెట్టుపై వున్న కిన్నెరలు యీ వింత చూసి ఇంద్ర సభలో దేవేంద్రునితో చెప్పారు.

సత్యతపుణ్ణి పరీక్షించ తలచి ఇంద్రుడు, ఉపేంద్రుడు వచ్చి బోయవాడు, పంది రూపాలు ధరించారు.

పంది బోయవాడు తరుముతున్నట్లు భయం నిటిస్తూ పరుగు పరుగున వచ్చి సత్యతపుడు ఆశ్రమంలో దాగుంది.

పంది వెంటనే బోయవాడు కూడా వచ్చి "స్వామీ నాచేత కొట్టబడ్డ పంది ఒకటి మీ ఆశ్రమంలోకి వచ్చింది. అది ఏమయిందో చెప్పండి" అన్నాడు.

ఇది సత్య తపుడుకి విషమ పరీక్ష తెలిసిన విషయం చెప్పకుంటే అసత్య దోషం వస్తుంది.

వ్రత భంగం అవుతుంది. చెప్తే పంది ప్రాణాలు కోల్పోతుంది. దాని మరణానికి తాను కారకుడౌతాడు. సత్యతపుడు కొంత ఆలోచించి -

"స్వామీ! పందిని చూసింది కన్ను అయితే అది మాట్లాడలేదు. చెప్ప కల్గింది నోరు. కాని అది చూడలేదు. చూడ లేని నోరు చూసినట్లు ఎట్లు చెప్ప కలదు?" అన్నాడు.

సత్యతపుడి సత్యదీక్షకు తెలివికి మెచ్చుకొని ఇంద్రుడు, ఉపేంద్రుడు తమ నిజరూపాలు ధరించి అతనిని ఆశీర్వదించి వరాలు ఇచ్చి వెళ్ళారు.



## సద్గురు స్తోత్రమంజరి

(పేరు: శ్రీ సద్గురు స్తోత్రమంజరి. రచయిత: శ్రీ స్వామి సర్వేశ్వరానంద వెల తెలుపబడలేదు. ప్రతులకు: రచయిత, కళ్యాణాశ్రమం, శ్రీచంద్రపురం, పల్లవాడ పోష్టు, వయా మాదరపాకం, చెంగల్పట్టుజిల్లా, తమిళనాడు. పిన్ కోడ్ నెం.601 202) సమస్త ప్రాణికోటిలో మానవజన్మం ఉత్తమమైంది. ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాల్ని సాధించినప్పుడే దానికి సార్థకత చేకూరుతుంది. ఈ పురుషార్థాల్లో నాల్గవదైన మోక్షాన్ని సాధించటానికి ఆధ్యాత్మిక సంపద అవసరం. దాన్ని పొందటానికి గురువు సహాయంకావాలి. అందుకే అతడు త్రిమూర్త్యాత్మకుడనీ, అజ్ఞానమనే చీకటిని పోగొట్టే వెలుగులాంటివాడనీ పెద్దలు ప్రస్తుతించారు.

గురుశబ్దానికివ్వబడిన నిర్వచనాన్ని సార్థకం చేసిన సద్గురుదేవులు శ్రీ కల్యాణ దాసుగారు ఆమహనీయుని శిష్యకోటిలో ఒకరైన స్వామి సర్వేశ్వరానందగారు తన గురుదేవుని మాహాత్మ్యాన్ని ప్రశంసిస్తూ రచించిన స్తోత్రమంజరి ఈ పుస్తకం.

వృత్త నియమ, సంఖ్యానియమ, మకుట నియమ, రస నియమాల్ని కల్గివుండటం శతక లక్షణమని సాహితీ మర్మజ్ఞుల అభిప్రాయం. ఈ నియమాలన్నీ దీనిలో లేకున్నా, అష్టోత్తరశతనామావళి ననుసరించి 108 పద్యాలే వుండటంచేత ఒకవిధంగా దీన్ని భక్తిశతక సాహిత్యంలోనిదిగానే పరిగణింపవచ్చు. గురునియొక్క ప్రాభవం, శిష్యునికుండవలసిన లక్షణాలు, శిష్యులు గురువు దయను పొందవలసిన అవసరం ఈ పుస్తకంలో చక్కగా వివరించడం జరిగింది.

స్వామి సర్వేశ్వరానందగారి వృత్తరచనా ప్రావీణ్యం ప్రశంసార్హం. "మనుజుల శాశ్వతంబయిన (22)" "కాయము చిక్కిపోయె (80)" మున్నగు పద్యాల్ని తిలకిస్తే పోతన, ధూర్జటి మొదలైన ప్రాచీనకవుల ప్రభావం ఈ కవిగారి మీద అతివేలమని చెప్పటానికి అనుమాన మక్కరలేదు. "అశాశ్వతమేను (12), మూర్ఖతనము (16) ఇత్యాది సమాన వ్యాకరణ దోషణాలూ, ఛందో భంగానికి గురైన పద్యాలూ, (2,8,21,39 - పద్యాల్లో చందస్సు తప్పింది) ముద్రా రాక్షసాలూ, శేషతలము, అకాలరుద్రుదు, మున్నగు అర్థ దోషాన్నిచ్చే ప్రయోగాలూ - ఈ స్తోత్ర మంజరిలో అచ్చటచ్చటా కనపడుతూవున్నా, ఇందులోని ధారాశుద్ధి విషయవైదగ్ధ్యం, మనోజ్ఞమైన శైలి - చదువరిని ఇట్టే ఆకట్టుకొంటాయి. (స్త్రీలను గర్హించే 12వ పద్యం ఈ పుస్తకానికి మచ్చగా వుండనక తప్పదు.)

ఛందో బద్ధమైన పద్యరచనే మృగ్యమైన ఈ దినాల్లో ఇలాంటి పద్యరూప స్తోత్రమంజరి పాఠకులకందడం హర్షించతగిన విషయం.

డి.నాగసిద్దారెడ్డి



సప్తగిరిలో సమీక్షార్థం గ్రంథాలు పంపే రచయితలు తమగ్రంథాల్ని రెండు కాపీలుగా పంపాలి. లేకుంటే సమీక్ష చేయడం వీలుకాదు.

సమీక్షలు వీలువెంబడి ప్రచురిస్తాము.

సంపాదకుడు

## ఆర్షేయ వాస్తు విద్యారహస్యమ్

[ఆర్షేయ వాస్తు విద్యారహస్యమ్. రచన: శ్రీరామకవచం వేంకటేశ్వర శర్మ. పుటలు 297, వెల -45 రూపాయలు. గ్రంథం దొరకు చిరునామా - శ్రీరామకవచం వేంకటేశ్వర శర్మ. నెం:3-353 విజయలక్ష్మీపురం, 4.వ. క్రాసురోడ్, బాపట్ల - 522 101, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.]

"భూరేవ ముఖ్య వస్తుస్యాత్ తజ్జాతాని
యాని హి,
ప్రాసాదాదీని వాస్తూని వస్తుత్వా ద్వస్తు
సంశ్రయాత్
వస్త్వాన్యేవ హి తాన్యేవ ప్రోక్తా న్యస్మిన్
పురాతనైః"

అని మయమతము (2,2,3) లో పేర్కొన్నారు. అంటే భూమే ప్రధాన వస్తువు. దీనిలో ఉత్పన్నములగు ప్రాసాదాదులు వస్తు సంశ్రయము లగుటవే వాస్తువు లగుచున్నవి.

ఇక్కడ వాస్తుని గురించి చెప్పేముందు మైత్రాయణీయ సంహిత (1-6-12) లో ఒక వివరణగా ఓ గాథ వుంది.

అదితి అన్నము వండి దేవతలకు నివేదించి, శేషభాగాన్ని తాను భుజించింది. అప్పుడు ఇద్దరు పుత్రులు కలిగారు. తిరిగి ఆమె మరల అలాగే చేయగా మరొక ఇద్దరు పుట్టారు. మూడవసారి అలాగే చేయడం ఇద్దరు జన్మించడం జరిగింది. నాల్గవసారి ముందుమాదిరిగా కాకుండా ఆమెముందే భుజించి శేషభాగాన్ని దేవతలకు నివేదించింది - ఫలితంగా రెండు గర్భాండాలు ఉత్పత్తి అయి, ఒకటి సజీవంగానూ, రెండవది మృతముగానూ కనిపించింది.

కాని, అందులోంచే మార్తాండుడు జన్మించాడు. మొదటి ఏడుగురు - మిత్ర

వరుణ, ధాత, అర్యమన్, అంశ, భాగ, ఇంద్ర నామాలు కలిగిన ఆదిత్యులు. శేషించిన ఎనిమిదవ ఆదిత్యుడు మార్తాండుడు. ఈ మార్తాండుని ఆకారము చతురంగా వుంటుంది. ఇదే వాస్తువు అని సంప్రదాయంగా చెప్పబడుతూంది.

**అందుకే--**

"అష్టౌ పుత్రా సో అదితే
ర్యే జాతా స్తన్వస్పరి.
దేవాన్ ఉప ప్రైత్సప్తభిః
పరా మార్తాండ మాస్యత్"

--అని ఋగ్వేదం (10-72-8) లో పేర్కొనబడింది.

వాస్తు శాస్త్రం యావత్తు ఆర్ష ధర్మాన్ని అనుసరించిన మంత్ర క్రతువు. దీనికి ఎవరూ పెడర్థాలూ, పెడమార్గాలూ - కొత్త ప్రయోగాలు చేయడానికి వీలులేదు.

అది నిర్దుష్టమైన ఒకశాస్త్రం!ఆర్ష ధర్మ వాస్తు శాస్త్ర సంచయం!

కాలంతోపాటు కొన్ని కొన్నింటిలో - అనుసరించే పద్ధతుల్లో చిన్న చిన్న మార్పులు వున్నా, వాస్తు శాస్త్ర అనుసరణం ఒకటే.

శ్రీరామకవచం వేంకటేశ్వరశర్మ అనేక శాస్త్రబద్ధమైన వివరణలతో ప్రతివిషయాన్నీ కూలంకషంగా గ్రంథంలో చర్చించారు. వాస్తు నిర్ధారణలో శాస్త్రబద్ధతకు లోపం కలిగితే జరిగే అనర్థాల నుంచి ప్రతి చిన్న విషయాన్ని వివరించి, విడమర్చి చెప్పడంలో రచయిత శాస్త్రజ్ఞానం అర్థంచేసుకోవచ్చు.

చివరగా ఒకమాట- ఇంతమంచి రచనలో ఎదుటి వారిని ఎత్తిపొడుస్తూ - విమర్శలు గుప్పించడంలోని ఔచిత్యం ఏమిటో బోధపడదు.

ఏది ఏమైనా వాస్తుపద్ధతులమీద ఆర్ష వాస్తు రహస్యాలనెన్నింటినో పరిశోధనాత్మకంగా రూపొందించిన ఈ గ్రంథం బహుధా ప్రశంసనీయం.

ఎల్లోరా



(12 వ పేజీ తరువాయి)

ర్యులు వేదాంత దేశికులు మున్నగువారి జీవన కాలమునకు తరువాత కూడ తురుష్కుల వలన పెద్ద ఆపదలు సంభవించెనని తెలియు దుము. ఇట్టి యంతరాయములు లేకుండ కృతయుగ మారంభించినట్లైయుండి మహా నంద సాగర ముప్పతిల్లుట వలన ఈ మహా చార్యులు ప్రబంధార్థ వైశిష్ట్యములు నిండుగా గలిగిన మెండైన గ్రంథములు ప్రసాదింపగలి గిరని తెలియు చున్నది.

దివ్యప్రబంధములకు వ్యాఖ్యాన రచనా కైంకర్యమందు ఇంకను కొంద రాచార్యులు పూనిక గొనినారు కాని సంపూర్ణముగా నాలుగు వేల పాటలకు (నాలాయిరమ్) వ్యాఖ్య వ్రాయుట యనెడు గొప్పదనము ఈ కృష్ణసూరి కొక్కరికే ధక్కినది. ఈ విషయము 'ఉపదేశ రత్నమాల' యందు-

నంజీయర్ శెయ్‌ద వియాక్కి యైకళ్ వాలి రండిర్కు
ఎంజామై యావైక్కు మిళ్లై యేల్, తమ్ శీరాల్
వైయ గురివిర్ తంబి మన్ను మణ వాళముని
శెయ్యుమవై తానుమ్ శిల
(మణవాళ మహామునులు ఉపదేశరత్తిన మాలై) -47

నంజీయర్ రచించిన వ్యాఖ్యలు కొన్ని ప్రబంధములకే ఉన్నవి. సందేహములు తీర్చెడి సంకోచ రహితములైన వ్యాఖ్యాన ములు అన్నిప్రబంధములకు లేవు. పిళ్లై లోకాచార్యులవారి తమ్ములైన, దివ్యప్రబం ధములందు ప్రావీణ్యముగల అళగియప్పెరు మాళ్‌నాయినారు తమ జ్ఞానాది గుణగరివతో రచించిన వ్యాఖ్యలైనను 'కణ్ణి నుణ్ శిరు త్తాంబు', 'తిరుప్పావై ' అను ప్రబంధములకే ఉన్నది.

పెరియవాచ్చాన్ పిళ్లై పిన్బుళ్ల వైక్కుమ్
తెరియ వియాక్కియైగళ్ శెయ్‌వార్ - అరియ
అరుళిచ్చెయ ల్పొరులై యారియర్‌కట్కు
ఇప్పోదు
అరుళిచ్చెయ లాయ్‌త్తఱిందు
(ఉపదేశ రత్తినమాలై - 46)

అభయప్రద రాజని పొగడిక గన్న పెరి యవాచ్చాన్ పిళ్లై 'తిరువాయ్ మొళి' (శ్రీము ఖసూక్తి)కే కాక తక్కుంగల ( మూడు వేల) ప్రబంధములకును స్ఫుట బోధకము లైన వ్యాఖ్యానములు రచించిరి. తన్మూలముగ అర్వాచీనాచార్యులకు, స్వయంకృషితో నెరుగ నసాధ్యములైన దివ్యప్రబంధ సమగ్రార్థములు వారి యనుగ్రహము వలన పొంది; బాగుగా తెలిసి చక్కగా పరులకు బోధింప అనుకూల్య మేర్పడినది.

వీరికి ఔరసపుత్రులులేరు. మేన ల్లుడై దత్తపుత్త్రులైన నాయనారాచ్చాన్ పిళ్లై వీరినుండి సకలవేద్యార్థములు గ్రహిం చినారు. వీరుగాక 'పన్నీరాయిరప్పడి' (12వేల గ్రంథము) వ్యాఖ్యానము నన్నుగ్ర హించిన వాదికేసరి అళగియమణవాళ జియ్యరును, అహోబిలమఠ స్థాపకులైన ఆది వణ్‌శఠకోప జియ్యరుకు పరమాచార్యులైన శ్రీరంగాచార్యులును, పరకాలనల్లాన్ రహ స్యము,'మైవణ్ణన ఱుంగుంజి' అను తిరునె డుందాండకమందలి ఒకే ఒకపాశురమునకు అతివిస్తృత వ్యాఖ్యానము, 'ఆచార్య హృద యము'నకు మొట్టమొదటి వ్యాఖ్యానము - మున్నగు దానిని ప్రసాదించిన పరకాలదాసులు మున్నగువారు వీరికి శిష్యులై యుండిన దాని పిరియ తిరుముడి యడైవు మొదలైన గ్రంథ ముల నుండి తెలియుచున్నది. వీడక్కుత్తిరు వీధి పిళ్లైయు నంబిళ్ల కాలమునకు తరువాత పెరియ వాచ్చాన్ పిళ్లైవద్ద కొన్ని అర్థవిశేషము లను తెలిసికొనినట్లు 'ఆచార్యసమ్మతి' అనెడి తమ రహస్యగ్రంథమున తెలియజేసినట్లుగా భగవద్విషయ వ్యాఖ్యానమునందు సూచింప బడినది. · పిన్బళగియ పెరుమాళ్ జియ్యరు కూడ నంబిళ్లై కాలమునకు తరువాత వీరి నాశ్రయించి యుండినట్లుగ పెరియ తిరు ముడి యడైవు చెప్పుచున్నది. ఇందుచేత నంబిళ్లై కాలమునకు తరువాత శ్రీరంగ మందు దర్శన నిర్వాహము చేయుచుండిన వారు ఈ మహాచార్యులే (కృష్ణసూరి) యని తెలియుచున్నది.

పెరియాళ్వార్ తిరుమొళి యందు నాలుగు నూర్ల పాశురములకు మాత్రమే ఈయాచార్యులువారి వ్యాఖ్యానము లుప్తమై యుండినదనియు, మణవాళ మహా మునులు (రమ్య జామాతృముని) పలువురి ప్రార్థనను మన్నించి ఆ కొరతను తీర్చినారనియు సంప్రదాయజ్ఞులు పెద్దలు చెప్పుదురు.

సముద్రము రత్నాకర మని పేరు వడ సిన యట్లు ఈ కృష్ణసూరి లెక్కకు మిక్కిలైన విశిష్టార్థ రత్నములకు నిధియని ప్రశస్తి పొంది నారు. ఆ యర్థ విశేషానుభవమే ఆచార్యుల మహిమాను భవమగును. పెరియవాచ్చాన్ పిళ్లైగారి గంభీర సూక్తులు అమృతముకంటె అధిక మధురములైనవి. ఈ యాచార్యు లవతరింప కుండిరేని శ్రీవైష్ణవ ప్రపంచము నకు మహానందానుభవము మిక్కిలి తక్కువై పోయి యుండెడిది. అపార పారావారము కంటె విస్తృతమైన కృష్ణసూరి చరిత్రము నుండి ఒక బిందువే ఇక్కడనుభవింప బడినది. వ్యాఖ్యాతృ చక్రవర్తియైన వీరి గ్రంథములందు న్నట్టి ప్రతివాక్యము వీరు సకల శాస్త్రగ్రంథ పారంగతులనియు, ఆళ్వారుల యనుగ్రహ బలమువలన సంశయలేశ శూన్యమైన బుద్ధివై భవము గలవారనియు పరమ రసికులనియు, పరమకారుణికులనియు చాటి చెప్పుచున్నది.

"యస్య దేవే పరాభక్తిః
యథా దేవే తథా గురౌ,
తస్యైతేఽకథితా హ్యర్థాః
ప్రకాశంతే మహాత్మనః."

[ఎవ్వనికి, దేవునిమీద ఎట్టి దృఢభక్తి నెలవుకొనియున్నదో అట్టిదేయగు భక్తి దేవ సమదుగా భావింపబడిన గురువుమీద కూడ నుండునో, అట్టి మహాత్మునకు గురువులు బోధింపని యద్భుతార్థములు, శ్రద్ధాప్రభావ ముచేత ప్రకాశింపగలవు, స్ఫురింపగలవు]

అనెడి శ్వేతాశ్వత రోపనిషదుపదేశ వాక్య మునకు (6-63) వీరు సరియైన లక్ష్యమౌ దురని తలతును. ఏలన? పూర్వాచార్యులు బోధింపని యచుంబిత రహస్యార్థములు కోకొ ల్లలుగా కరుణా కాలమేఘమగు వీరు వర్షిం చుట వలన వీరు 95 సంవత్సరముల కాలము జీవించినారని పెరియ తిరుముడి యడైవు నందుండుటచేత వీరి తీర్థము (శ్రాద్ధది

వము) దుందుభి నామసంవత్సరమున (క్రీ.శ. 1262) అని తలపదగియున్నది.

వెనరు:

శ్రీ వైష్ణవ సంప్రదాయమున నాలాయిర దివ్య ప్రబంధములలో సామవేద సారమని ఆరాధింపబడు తిరువాయ్‌మొళికి (శఠకోప సహస్రము) ఉన్న స్థానము అన్నిటిమిన్న. దాని వ్యాఖ్యానాల రూపమైన భగవద్విషయము లేకున్న వైష్ణవమే ఉండదనవచ్చును. అట్టి తిరువాయ్ మొళిని కాపాడి మనకు ప్రసాదించిన మహానుభావులను స్మరించి తరింతముగాక!

"పిళ్ళాన్ నంజీయర్, పెరియవాచ్చాన్ పిళ్లై, తెళ్ళార్ వడక్కుత్తి రువీధి ప్పిళ్ళై, మణవాళ యోగి తిరువాయ్ మొళియై కాత్త గుణవాళరెన్రు నెంజే కూఱు" - (ఉపదేశరత్తినమాలై)

(1) ఆరాయిరప్పడి (6వేల గ్రంథము) వ్యాఖ్యరచించిన తిరుక్కురుకైప్పిరా్ పిళ్లాన్, (2) ఒన్పదినాయిరప్పడి (9 వేలగ్రంథము) వ్యాఖ్యానము వ్రాసిన నంజీయర్ వారు, (3) నంబిళ్లై ఆజ్ఞ మేరకు ఇరువత్తు నాలాయిరప్పడి (2 4 వేల గ్రంథము) వ్యాఖ్య గూర్చిన పెరియవాచ్చాన్ పిళ్లై, (4) ముప్పత్తారాయిరప్పడి (36వేల గ్రంథము) వ్యాఖ్యా కర్తలగు మహాజ్ఞాని వీడక్కుత్తిరువీథి ప్పిళ్లై, (5) పన్నీరాయిరప్పడి (12వేల గ్రంథము) వ్యాఖ్యారచయితలగు అళగియమణవాళ జియ్యరు - వీరు ఏవురను తిరువాయ్ మొళిని కాపాడిన మహోదార గుణశోభితులని ఓ హృదయమా! నుదువుము.

ఇటీవల (11-9-93తేదిన) శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆళ్వార్ దివ్య ప్రబంధ ప్రాజెక్టుద్వారా శ్రీ పెరియవాచ్చాన్ పిళ్లైగారి అవతార మహుత్సవము జరిపినారు. ఆవ్యాఖ్యాతృ శిరోమణికి శ్రీవైష్ణవలోక మెంతయో ఋణపడి యున్నదని తెలిసి ఆయుత్సవము చూచిన యుత్సాహముతో, వారి మహిమ నుగ్గడించుచు, తెలిసినంతలో, వ్యాసము వ్రాసి తన్మూలమున వారి సేవ చేసికొనవలెనను కోర్కెతో నిట్లు చేసితిని.

[శ్రీమాన్ యస్. కృష్ణస్వామి అయ్యంగారు (సుదర్శన పత్రికాధిపతి), శ్రీమాన్ కాంచీ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్యులును వ్రాసిన తమిళ వ్యాసములనుండి సంగృహీతము]



(7 వ పేజీ తరువాయి)

తొండం ఫలానా దిక్కునే తిరిగి వుండవలెనని చెప్పడం కష్టము. అందువలన కుడివైపో, ఎడమవైపో తిరిగినట్లు చెక్కడం సాధార ణంగా అగపడుతుంది. కుడివైపు తొండం తిప్పిన వినాయకుని 'వలంబురి' వినాయకు డని, ఎడమవైపు తొండం త్రిప్పిన వినాయక విగ్రహమును 'ఎలంబురి' వినాయకుడని వ్యవ హరించడం అమలులోనికి వచ్చినది.

వినాయకుడు ఎన్నడు శివగణనాయ కుడయినాడో ఆనాడే శివ స్వరూపమును కూడ పొందక తప్పదు కదా! అతనిలాగే త్రినేత్రుడు, నాగయజ్ఞోపవతి, అనేక భుజ శోభితుడు, కాగలిగినాడు.

చతుర్బాహు, షడ్బాహు, అష్టబాహు, దశ బాహు షోడశబాహువులుగల విగ్రహములూ వున్నవి. కాని సాధారణంగా చతుర్బాహువే. వయోవస్థా భేదములను బట్టి వినాయక విగ్ర హములు ప్రధానంగా ఈక్రింది విధములుగా కనబడుతుండును.

1. బాలగణపతి. 2. తరుణ గణపతి. 3. భక్త గణపతి. 4. వీర గణపతి. 5. శక్తి గణపతి. 6. లక్ష్మి గణపతి 7. ఉచ్ఛిష్ట గణపతి. 8. మహా గణపతి. 9. ఊర్ధ్వ గణపతి. 10. పింగళ గణపతి. 11. హేరంబ గణపతి 12. ధ్వజ గణపతి. 13. ఉన్మత్త గణపతి. 14. విఘ్నరాజ గణపతి. 15. ప్రసన్న గణపతి. 16. నృత్య గణపతి. 17. హరిద్రా గణపతి. 18. బాలచంద్ర గణపతి. 19. శూర్పకర్ణ గణపతి. 20. ఏకదంత గణపతి. ఈ రూపభేదములే కాక మరియు ఏబదియారు విధములున్న వని స్కాంద పురాణాంతర్గత కాశీఖండము తెలుపుచున్నది.

ఇక ఈ విశిష్ట నామములుగల వినాయక ఆకారము లెట్లుండునో వివరము.

1. బాల గణపతి:- బాలస్వరూపము, చతుర్బాహువులు, గజశిరస్సు, ఆమ్ర, కేళీ, పనస ఫలములు, చెరుకు ముక్క. ఒక్కొక్క చేతిలో వుండును. శుండాగ్రంతో వెలగపండు పట్టుకొనివుండును. ఉదయభానుని వర్ణ శరీరముగలవాడు.

2. తరుణ గణపతి:- యువకుడు. ఆరు భుజములు గలవాడు. పాశము, అంకుశము. వెలగ, నేరేడు, పండ్లు, వెదురుగడ, నూవులు చెరొక చేతపట్టుకొనివుండును. దేహవర్ణము ఎరుపు.

3. భక్త గణపతి :- చతుర్బాహువులు, నారికేళము ఆమ్రఫలము చక్కెరగడ్డ, పర మాన్నంగిన్నె చెరొక చేతిలో వుండును. శరీరరంగు శరదృతుచంద్రధవళం.

4. వీర గణపతి:- షోడశ బాహు వులు, ౧ వేలాఖుడు, ౨ శక్తి, ౩ ధనస్సు, ౪బాణములు, ౫ ఖడ్గము, ౬ ఖేటకము, ౭ ముద్గరము, ౮ గద, ౯ అంకుశం, ౧౦ పాశం, ౧౧ శూలం, ౧౨ పరశువు, ౧౩ ధ్వజం, ౧౪ జలకలశం, ఒక్కొక్కటి ఒక్కొక్క చేతిలో వుండును. మిగిలిన రెండు చేతులు అభయ, వరద. హస్తములు.

5. శక్తిగణపతి :- విఘ్నేశ్వరుని ఒంటరి వాడుగ చూడడం భక్తులకు ఇష్టంలేకపోయి నది. అందుచేత ఒకరు ఇద్దరు భార్యలను ముడివేసి ఒకసంసారగాడుగా చేశారు. శక్తి లేకుండా స్వామి, సంపూర్ణుడు కాడు. గనుక శక్తి గణపతి అవతరణ జరిగినది. కొంత కాలమునకు దీనిలో వామాచారము చేరినది. శృంగారం రంగరించుకున్నది. శక్తి గణపతి విభేదాలే లక్ష్మి గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, మహాగణపతి, ఊర్ధ్వగణపతి, పింగళ గణపతి మొదలగునవి.

6. లక్ష్మి గణపతి:- ఎనిమిది చేతులు, చిలుక, దానిమ్మ, పద్మము, స్వర్ణ కలశము, అంకుశము, పాశము, కల్పకలత, బాణము కురళం, చెరుకు చేతిలో ధరించివుండును. తెల్ల రంగు శరీరము. ఈలక్షణము.

మరొక గ్రంథము ప్రకారము:- చతు ర్బాహువులు, త్రినేత్రములు, దంతం, చక్రం, అభయముద్ర మూడు చేతులలో, నాల్గవ చేతిలో లక్ష్మిని ఆలింగనం చేసుకున్నట్లు వుండవలయును. స్వర్ణవర్ణం. లక్ష్మి వినాయ కుని కుడిచేతిలో ఆలింగనం చేసుకొన్నట్లు, ఎడమ చేతిలో తామర మొగ్గ పట్టుకున్నట్లు వుండవలయును.

7. ఉచ్ఛిష్ట గణపతి:- సత్వరసిద్ధికి ఈయ నను పూజింపువారు. ఆరు భుజములు. కమలం, దానిమ్మ పండు, వీణ, వరివెన్నులు చేత్తో పట్టుకోవలయును. ఆరవ చేతిలో దేవిని ఆలింగనం చేసుకున్నట్లు వుండవల యును. ధనుర్బాణములు, పాశాంకుశాలను ధరింపవలయునని మంత్రమహార్ణవ గ్రంథం. దేవి దిసమొలలో రతాతుర అయినట్లుండవ లయును. ఉత్తర కామిగా ప్రకారం నాలుగు చేతులు విగ్రహమయితే, పాశాంకుశేక్షుఖం డములు చెరొక చేతిలో వుండవలయును. నాలుగవచేయి దేవికళా స్థానాలను తాకుచు న్నట్లు ఉండవలెను. దేవి దిగంబరలయి, సర్వాభరణ భూషిత అయివుండవలయును. ఈమెపేరు విఘ్నేశ్వరి.

8. మహాగణపతి:- పది చేతులు, కమలము, దానిమ్మ పండు, రత్నఖచితకల శము, గద, దంతం, ఇక్షుఖండం, వరివెన్నులు, పాశం, చెరొక చేతిలో వుండవలయును. దేవి ఎడమ తొడమీద ఆసీనురాలు కావలయును.

9. ఊర్ధ్వ గణపతి:- షడ్భుజములు. కల్హారం, వరివెన్నులు, చెరుకు ధనుస్సు, బాణం, దంతం చెరొక చేతిలో వుండ వలయును. ఆరవచేతితో శక్తిని ఆలింగనం చేసుకోవలెను. బంగారుశరీరవర్ణం. శక్తి రంగు మెరుపుతీగరంగు.

10. పింగళ గణపతి:- ఈ విగ్రహ మునకును ఆరుచేతులు. మామిడిపండు. కల్పక వృక్ష పుష్పగుచ్ఛం, చెరుకు, మోదకం, గంధ్రగొడ్డలి ధరించి వుండవలయును. దేవి ప్రక్కననే వుండవలయును.

వినాయకప్రతిష్ఠావిధి అను ఆగమ గ్రంథ రీతిగా:- శక్తి గణపతి పద్మాసనుడై వుండవ లయును. శక్తి ఆకుపచ్చరంగులో, ఆయన నడుముమీద చేయివేసి, ఆలింగనము చేసి కోవలయును. కాని, ఇరువురి కటిపశ్చాద్భా గములు ఒకదానికొకటి తగలరాదు. వినా యకుని రంగు సంధ్యారుణం. పాశ వజ్రాలు

ధరించవలయును భయంకర రూపంలో కను పించవలయును.

11. హేరంబ గణపతి:- ఈ విగ్రహము గణపతి విగ్రహములన్నిటిలోను విలక్షణమైనది. దానికి అయిదు గజశిరస్సులుండవలెను. నాలుగు శిరస్సులు నాలుగు దిక్కులను చూడవలయును. అయిదవది ఆకసము వంకచూపు వుండవలయును. ఎనిమిది చేతులు, పాశం, దంతం, అక్షమాల, పరశువు, ముద్గరం, మోదకం, వరదాభయ ముద్రలు ఒక్కొక్క హస్తంలో వుండును. మేలిమి బంగారము వర్ణము.

12. ప్రసన్న గణపతి:- స్థానక విగ్రహము. ఏ భంగిమలోనైనను వుండవచ్చును. పద్మాసనంలో వుండును. ఉదయసూర్య వర్ణము. ఎర్రని వస్త్రములు. చతుర్భుజములలో పాశము, అంకుశము, వరద - అభయముద్రలుండవలయును.

13. ధ్వజ గణపతి:- నాలుగు చేతులలో పుస్తకము, అక్షమాల, దండము, కమండలము, వేరొకచేతిలో తీవ్రదృష్టి వుండునట్లుగా నుండును.

14. ఉన్మత్త గణపతి:- త్రినేత్రుడు. ఎర్రనిరంగు శరీరము. పాశము, అంకుశము, మోదకము, పూర్ణపాత్ర, దంతము వేరొక చేతిలో నుండి, పద్మాసనుడై యుండును. మదించిన ధోరణిలో కనబడవలయును.

15. విఘ్నరాజ గణపతి:- ఎనిమిది చేతులు. శంఖం, చెరుకు, విల్లు, పుష్పబాణములు, దంతము, పాశము, అంకుశము, గరిక మరొక చేతిలో వుండును. మేఘవర్ణ శరీరము గలిగి యుండవలయును.

16. నృత్త గణపతి:- ఎనిమిది చేతులు, పాశము, అంకుశము, మోదకము, కురారము, దంతము, వలయము, అంగుళీయము, వేరొక చేతిలో ఎనిమిదవ చేయి. నృత్య భంగిమలో వుండి, ఎడమకాలు కొద్దిగా ఎత్తినట్లు, కుడికాలు వంచి వుండవలయును. పద్మాసనంలో వుండవలయును.

17. హరిద్రా గణపతి:- దీనినే క్షిప్ర గణపతియని, రాత్రిగణపతియని కూడా పిలిచెదరు. నాలుగుచేతులు, పాశము, అంకుశము, మోదకము, దంతము, త్రినేత్రములు, పసుపురంగు, పసుపు వస్త్రములు ధరింప చేయవలయును.

18. బాలచంద్ర గణపతి:- దర్శి అనే ముని శాపమువలన చంద్రుడు కళా హీనుడు అవుతూవచ్చినాడట! వినాయకుడు అతని ఫాలముమీద తిలకంగా ధరించి, శాపవిముక్తుణ్ణి చేసినాడు. అందువల్ల బాలచంద్రుడయినాడని బ్రహ్మాండ పురాణము చెప్తున్నది. సత్యమునకు ఇది శివుని బాల చంద్రలక్షణే ననవలసివస్తున్నది.

19. శూర్పకర్ణ గణపతి:- అగ్ని ఎవరి శాపంవలననో తేజోవిహీనుడై ఆరిపోసాగినాడట. విఘ్నేశ్వరుడు తన చేటలవంటి చెవులతో విసరి మరల ప్రజ్వరిల్ల చేసినాడు. అంతతో అగ్నిదేవుడు కాపాడబడి పూర్వ పుతేజస్సు వేడి సంపాదించుకున్నాడట! అందువలన శూర్పకర్ణుడయినాడు.

20. ఏకదంత గణపతి:- బ్రహ్మాండ పురాణము ననుసరించి వినాయకుడు పరశురామునితో జరిగిన పోరులో కుడిదంతం పోగొట్టుకున్నట్లు కనబడుతుంది. కాని శిల్పములలో ఎక్కువగా ఎడమ దంతము మాత్రము లేనట్లు చిత్రించి యుండడము గోచరమవుతుంది.

ఆంధ్రదేశంలో ఇటీవల, కట్టిన ఆనకట్ట ద్వార మునిగిపోయిన ప్రాచీన క్షేత్రమయిన అలంపురంలో వుండిన విఘ్నేశ్వరుని పొట్టవాల గొప్పది కావడం చేత కళ్ళు ముడుచుకొనలేక పోయినాడు. లేపాక్షిలోని వినాయక విగ్రహము కేవల గణపతి. ఏలననగా అచటి విగ్రహమునకు వామాచారము బొత్తిగా అంటిన జాడలేదు. విజయనగర చక్రవర్తుల కాలములోని వారి రాజ్య వైభవముల వలెనే వినాయక విగ్రహములు కూడా బృహదాకారములు చెందినవయినవి. హేమకూటము మీద వున్న వినాయకుడు 'కడలేకాళుగణప్ప' - అనగా పెసరగింజ వినాయకుడు! ఈ శబ్దం వినగానే వినాయకుడు ఎంత చిన్నవాడైనాడో ననిపించక తప్పదు! పాపం! దీని ఎత్తు కేవలం ముప్పదిరెండుగులు మాత్రమే! ఒకపెద్ద రాతిగుండునే వినాయకుడుగా శిల్పులు శృంగారంగా మలచినారు. కర్నాటక వాగ్గేయకారుడైన శ్రీపురందర దాసులవారు ఈ వినాయకుడినే "హేమకూట సింహాసన లంబోదర లకుమికర" అని తమ పిళ్ళారిగీతంలో స్తోత్రము చేసి తరించినారు.

ఇదే హేమకూట పరిసరములలోనే మరి యొక వినాయకుడు 'సాసివికాళు గణప్ప'- అనగా ఆవాలు గింజ వినాయకుడు కూడా వున్నాడు! ఈ ఆవాలు గింజ వినాయకుడు ఎంత చిన్నవాడనగా కేవలము రెండు నిలువు లెత్తు మాత్రమే! సరేనా, ఆ పేర్లకు, ఆ ఆకారమునకు, ఆదేవునికి మాత్రమే చెల్లేటటువంటి విశేషము ఏమో ఎవరు చెప్పగలరు?

ఉన్మత్త, (ఉచ్ఛిష్ట) విగ్రహము కేరళలోని శంకరాచార్యుల జన్మ స్థానమైన 'కాలడి' లో గలదు. ఉచ్ఛిష్ట గణపతికిగల ఉత్తమ దృష్టాంతము కుంభకోణములోని నాగేశ్వరాలయంలో చూడవచ్చునని తెలియవచ్చుచున్నది.

హేరంబ గణపతి విగ్రహము నాగపట్టణములోని నీలాయతాక్షి దేవాలయములోను, తిరువత్తియూరులోనూ వున్నది. ప్రసన్న గణపతి విగ్రహము తంజావూరు జిల్లా పట్టీశ్వరంలోనున్నది. నృత్త గణపతి విగ్రహము కర్నాటక రాష్ట్రములో హళేబేడు హుయిసలేశ్వర దేవాలయములో వున్నది. ఇది చాలా అందమైన ముద్దులు మూట గట్టించెడి విగ్రహము. దీనిని క్రీస్తుశకము పదకొండు వందల ఇరువది ఒకటవ సంవత్సరములో హొయసల విష్ణువర్ధనమహారాజు ప్రతిష్ఠించినాడు. లక్ష్మీ గణపతి విగ్రహము తిరునల్వేలిజిల్లా తెన్‌కాశి లోని విశ్వనాథస్వామివారి మందిరములో నున్నది. ఈ విగ్రహమును పదునాలుగు వందలనలువదియారవ సంవత్సరములో అరికేసరిపరాక్రమపాండ్యదేవుడనెడి పాండ్యరాజుచేత ప్రతిష్ఠింపబడినది.

ఈ విగ్రహములను, ఇవి ధరించెడి ఆయుధములను పరిశీలించినచో భక్తుల, శిల్పుల ప్రభావము ఎంత కలదో మాపరులకు విశదమవుతుంది.



# సత్యమేవ జయతే!




సత్యస్య వచనం శ్రేయః - అను సూక్తి ననుసరించి సత్యమునే మాట్లాడుట శ్రేయస్కరమని చెప్పబడుతూంది. ఉత్కృష్టమైన మానవజీవితంలో సత్యము పలకడమన్నది అతి మహత్తరమైనది. సత్యమే మానవునకొక అమూల్యభూషణము. ఈ ప్రపంచాన్ని సృష్టించింది "సత్యమే" - అని అంటారు అరవిందులు.

బాల్యము నుండీ మనిషి సత్యము పలకవలెనన్న వాని తల్లి-దండ్రులు గురువులు తదితర పెద్దలు యావన్మందీ సత్యము పలుకుట యందు కృత నిశ్చయులై తామాచరిస్తూ పిల్లలనాచరింపజేయుటయందు ఆసక్తి కలిగియుండు టత్యంత ఆవశ్యకము. బాల్యము నుండీ కొందరు అసత్యమును అనాయాసముగా పలికెదరు. ఈ దురభ్యాసమును వారినుండీ వారి తల్లి-దండ్రులు గురువులు పెద్దలు తప్పించు యేర్పాటు చేయవలెను. అట్లు చేసిననాడు సమాజ కళ్యాణమునకు మానవోన్నతికి అనుకూలముగా వుండును.

సత్యహరిశ్చంద్రునిగాథ నెరుగని వారుండరు. హరిశ్చంద్రనాటకమును బాల్యమందే గాంధీగారు చూచి ప్రభావితులైనారు. తత్ఫలితముగ ఆజన్మాంతము సత్యపాలనయందు దీక్ష వహించి లోకాన ఆదర్శనీయులై నిల్చిరి.

సత్యమునకు ధర్మమునకు ఎంతో సంబంధమున్నది. ధర్మము లేనిచోట సత్యము నిలవదు. సత్యము లేనిచోట ధర్మముండదు. ఈ రెండింటి యొక్క ఆచరణము ఉత్తమ మానవ జీవితమునకు మూలము.

"నుత జలపూరితంబులగు నూతులు నూరిటి
కంటె సూనృత
వ్రత యొక బావిమేలు; మరిబావులు
నూరిటికంటె యొక్కస
త్క్రతువది మేలు; తత్క్రతు శతంబున కంటె
సుతుండుమేలు త;
త్సుత శతకంబు కంటె నొక సూనృత
వాక్యము మేలు చూడగన్."

ఉప్పునీటితో నిండిన నూరు నూతులకంటె ఒక తీయని జలము దిగుడు బావిమేలు. అట్టి నూరు బావులకంటే ఒక క్రతువు మేలు. అట్టి క్రతువులు నూరిటికంటే ఒక సుతుడు మేలు. అట్టి నూరుగురు సుతులకంటే ఒక్క సత్యవాక్యము మేలని - నన్నయగారి భారత అరణ్య పర్వమందలి దుష్యంతుని సభాస్థలిలో శకుంతల నోటి ద్వారా పలికించిన సత్యము యొక్క మహత్తు పై విధముగా పేర్కొనబడినది.

శ్రీ చెళ్ళపిళ్ళ సన్యాసిరావు

"సత్యం వద ధర్మం చర" అన్న వేద వాక్యములో సత్యమును పలుకుము. ధర్మముగా నడువుము అనిచెప్పబడుతూంది. "ఓం తత్ సత్యం ఓం తత్ సర్వం" అంటూ సత్యమే పరబ్రహ్మ స్వరూపమని చెప్పబడుతూంది.

సత్యమునెరిగి తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించేవాడు మంచి చెడులకు అతీతుడని భగవద్గీత చెప్తూంది.

సత్యం - శివం - సుందరం - తో వ్రాయబడిన కావ్యములలో సత్యమే ప్రధానమై నిలుస్తుంది.

"నానృతాత్ పాతకం పరమ్"- అను సూక్తి ప్రకారము అసత్య మాడుటకంటే ఘోర పాప మింకొకటి లేదని చెప్పబడుతూంది.

"అద్భిః గాత్రాణి శుధ్యంతి
మనస్సత్యేన శుధ్యతి"

అను సూక్తి ప్రకారం ఉదకముచే శరీరము శుభ్రమగును. సత్యముచే మనస్సు శుద్ధమగునని చెప్పబడుతూంది.

ఎంతవారికైనను వాచా దోషము పనికి రానిది మాటనిచ్చి దాటుట కూడనిది. హేయ మైనది. కావుననే కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులుగారు గయోపాఖ్యానం నాటకంలో కృష్ణునితో అర్జునుని ముఖతః "అనిన మాటను దప్పు టనుచితంబని కదా!" యనెడి సీస పద్యములో ఇలాచెప్పబడింది.

ఆడిన మాటను తప్పుట దోషమని యెరిగిన దశరథుడు కాలధర్మము నొందెను. హరిశ్చంద్రుడు కాటికాపరిని కొలిచెను. శిబి చక్రవర్తి తన మేని కండలు చెండి ఇచ్చెను. బలి చక్రవర్తి పాతాళమునకు నెట్టి వేయ బడెను. ధర్మరాజు తన సోదరులతో సర్వ సంపదలను బాసి కష్టములను భావించెను.

"అంగీకృతం, సుకృతినః, పరిపాలయన్తి"- సత్పురుషులు తాము గావించిన వాగ్దానములను పాలింతురని స్పష్టమౌతూంది.

# రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు- ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయుటం వలన ఉపయోగం వుండదు.
- రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.

సంపాదకులు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి - 517 507

"యత స్సత్యం తతో ధర్మః
యతో ధర్మ స్తతో జయః"

ఎక్కడ సత్యమున్నదో అక్కడ ధర్మముండును. ఎక్కడ ధర్మముండునో అక్కడనే విజయ ముండునని తెలియబడుతూంది.

శుక్రనీతి యీ విధంగా చెప్పబడింది.

"వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్త మానభంగమందు
చకిత గోకులాగ్ర జన్మ రక్షణమందు
బొంకవచ్చు నఘము పొంద దధిప!"

పై నుదహరించిన సందర్భాలలో అసత్యము పలికినను పాపము చెందదని చెప్పబడింది.

సత్యమైనను అప్రియమైనచో పలుకరాదనియు ప్రియమైనను అసత్యము పలుకరాదనియు చెప్పబడుతూంది.

"సత్యేన ధార్య తే పృథ్వీ"

సత్యము వలననే యీ లోకము నడుచుచున్నదని గ్రహించవలెను.

"సత్యేశ మా భాం
సకలార్థ సిద్ధిః"

సత్యపద వర్తనము వలనను కష్టించి కృషి గావించుట వలనను సర్వ శుభములు సిద్ధించునని తెలియజేయబడుచున్నది.

"సర్వం సత్యే ప్రతిష్ఠితమ్"

ఈ లోకమున సమస్తమును సత్యము నందే ప్రతిష్ఠించబడి యున్నది.

కావున సర్వజనులును సత్యభాషణ మందు ప్రీతి కలిగి సర్వదా ఆచరించెదని కోరుకుందాం.



# కొలనుపాక సోమేశ్వరాలయం

ఆంధ్రదేశంలో శ్రీశైలశిఖరానికి ప్రశస్తి ఉన్నట్లే కొలనుపాకలోని సోమేశ్వరాలయంలో ఉన్న శివలింగాన్ని పూజిస్తే పునర్జన్మ ఉండదని ఈ ప్రాంతంలో ప్రతీతి. ఈ శివలింగంపై వేయిలింగాలు చెక్కబడి ఉండడం ఓ విశిష్టత. కొలనుపాకలో చాళుక్యుల కాలంలో ప్రాచుర్యంలో ఉన్న జైనం అంతరించి తరువాతి కాలంలో శైవం వ్యాప్తిలోకి వచ్చింది. జైన మతానుయాయులైన రాష్ట్రకూట మండలేశ్వరులకు, శైవమతానుయాయులైన చాళుక్య కాకతీయరాజులకు తరుచు యుద్ధాలు జరిగాయని, శైవులే విజయం సాధించి కొలనుపాకను బలమైన శైవకేంద్రంగా అభివృద్ధి పరచారని చరిత్ర చెబుతున్నది. కాకతీయుల కాలం నాటికి కొలనుపాక ప్రముఖ శైవమత స్థావరంగా వృద్ధి పొందింది.



నల్లగొండ జిల్లా ఆలేరుకు 5 కి.మీ.ల దూరంలోఉన్న కొలనుపాకలో స్వయంభూసోమేశ్వరుని ఆలయం కాకతీయుల శిల్ప కళారీతిని పుణికి పుచ్చుకున్నది. ప్రధానాలయానికి వెళ్ళేముందు ఎత్తైన ముఖద్వారం ఉంది. చుట్టూరా శిలా ప్రాకారం నిర్మింపబడింది. ఇందలి గర్భగుడిలో శ్రీ సోమేశ్వరస్వామివారు లింగాకారంలో వెలసి ఉన్నారు. ఈ లింగంనుండే జగద్గురువు రేణుకాచార్యులు - అవతరించి వీరశైవ ధర్మాన్ని నలుదెసలా వ్యాప్తి చేసినట్లు పురాణ కథ ప్రచారంలో ఉంది. ఈ ఆలయంలో చండికాంబ సమేతుడై సోమేశ్వరుడు లింగాకారంలో వేంచేసి ఉన్నాడు. సహస్రలింగ, రుద్రమునీశ్వర, కుమారస్వామి, వీరభద్ర, ఉగ్రగండ సోమేశ్వర, అంబిక, మల్లికార్జున, సిద్ధేశ్వర కాశీఅన్నపూర్ణావిశ్వేశ్వరుల ఆలయాలు దీనిని నానుకొని చుట్టూరా నెలకొని ఉన్నాయి. సప్తమాతృకలు, అష్ట భైరవులు, నవగ్రహాలు, దశవినాయకులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశ నందీశ్వరులు, పంచాచార్య లింగములు, దీప స్తంభాలు, గోపురాలు, కోనేరులు - ఇవన్నీ సోమేశ్వరస్వామి ఆలయశోభను ఇనుమడింప జేస్తున్న మూర్తులు.

**శ్రీ తిరునగరి శ్రీనివాస్**

కాకతీయులకాలంలో కొలనుపాక ఒక నియుక్త మాండలికునిచే పరిపాలింపబడిందని,




ఆ సమయంలో గణపతిదేవచక్రవర్తి అతని సోదరి మైలాంబ ఈ సోమేశ్వరాలయంలో సహస్ర లింగేశ్వర ప్రతిష్ఠ చేసినారని శాసనాల వల్ల తెలుస్తున్నది. రుద్రమ దేవి కాలంలో కొలనుపాకను పాలించిన చాళుక్య ఇందుశేఖరుడు. తన లెంక పోతనాయకునితో కలిసి సోమేశ్వరునికి భూదానం చేసినట్లు మరోశాసనంలో చెక్కబడింది. చాళుక్యులు కాలాముఖశైవాన్ని స్వీకరించిన పిదప కొలనుపాకలో ఈ మతానికి విశేష ఆదరణ లభించింది. ఇక్కడ సోమేశ్వరుడు ప్రధాన దైవం. సోమేశ్వరునినే సోమనాథుడని వ్యవహరిస్తారు. ప్రధానాలయం చుట్టూ ఎన్నో శివలింగాలు దర్శనమిస్తాయి. ఈశాన పండితుడు, గోకర్ణరాశి పండితుడు, శ్రీ కంఠ పండితుడు, రామేశ్వర పండితుడు శైవ ప్రధానాచార్యులు సోమేశ్వరుల అర్చనా కార్యక్రమాలు నిర్వహించే వారని శాసనంలో ఉంది. వీరిలో చివరి గురువు శ్రీ రామేశ్వర పండి

## తిరుమల తిరుపతి దేవస్థానములు

# అభిషేక సేవలు

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆరు ఆలయాల్లో వారానికొకసారి జరిగే అభిషేక సమయంలో భక్తులు ఒక్కొక్కరు రు. 5-00లు టికెట్టు చెల్లించి అభిషేక దర్శనం చేసికొనవచ్చును.

1. శ్రీ వేదనారాయణస్వామి ఆలయం,
నాగలాపురం.
2. శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం,
నారాయణ వరం.
3. శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం,
కార్వేటి నగరం.
4. శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం,
అప్పలాయగుంట.
5. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం,
మంగాపురం.
6. ఆలయ సముదాయం,
ఋషీకేష్.

భక్తులు, యాత్రికులు ఈ విశేష సేవను దర్శించి కృతార్థులగుదురు గాక!

తి.తి. దేవస్థానములు, తిరుపతి.

తుడు శ్రీశైలమునకు చెందిన పర్వతావళికి చెందిన వాడు. అతడే కొలనుపాక సోమేశ్వర లింగాన్ని సేవించిన వారికి పునర్జన్మ ఉండదని ప్రబోధించి ప్రచారం కావించాడు. ఈ ఆలయంలోని శాసనాలు చరిత్ర పరిశోధకుల కెంతగానో ఉపకరించాయి. స్వర్గీయ ఆది రాజు వీరభద్రరావు 'తెలంగాణా శాసనములు' అనే గ్రంథంలోను, శ్రీ బి.ఎన్. శాస్త్రి 'నల్లగొండ జిల్లా సర్వస్వము' అనే పుస్తకంలోను వీని గూర్చి విపులంగా రాశారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖ వారి రక్షణలో ఈ శాసనాలు ఉన్నాయి. సోమేశ్వర స్వామి ఆలయాన్ని దర్శించే యాత్రికులు ఒక క్రమంలో అమర్చబడి ఉన్న ఈ శాసనాలను చూసి చదివేందుకు ప్రయత్నిస్తారు. ఇందలి విగ్రహాలు, శిల్పాల వివరాలు తెలుపుతూ పురావస్తు శాఖవారు క్రింద తెలుగులో పరిచయాలతో కూడిన చిన్న బోర్డులను అమర్చారు. ఇంతటి ఆధ్యాత్మిక, చారిత్రక ప్రాధాన్యాన్ని సంతరించుకున్న సోమేశ్వరాలయంలో శ్రీ చండికాంబ సహిత సోమేశ్వర జగద్గురు రేణుకాచార్య లింగోద్భవ మూర్తి బ్రహ్మోత్సవ రథోత్సవాలు చైత్రబహుళ తదియ మొదలు పంచమి వరకు ప్రతిసంవత్సరం వైభవంగా జరుగుతున్నాయి. తెలంగాణాలోని భక్తులు ముఖ్యంగా శైవులు తండోపతండాలుగా ఈ ఉత్సవాలలో పాల్గొనేందుకు తరలివస్తారు. చైత్ర బహుళ చవితి నాటిరాత్రి జరిగే రథోత్సవం కళ్ళారా చూస్తే జన్మ తరిస్తుందని ఆస్తికుల అచంచల విశ్వాసం. ఇంతటి మహత్తరమైన ప్రాచీనాలయ జీర్ణోద్ధరణ కోసం భక్తులు విరాళాల రూపంలో ముందుకు రావాలని దేవస్థాన కమిటీ విజ్ఞప్తి చేసింది. ఈ ఆలయ ఉద్ధరణకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని కొలనుపాక ప్రజలు కోరుతున్నారు. చారిత్రకంగాను, ఆధ్యాత్మికంగాను ప్రాధాన్యత సంతరించుకున్న దీ సోమేశ్వరాలయం. నేటికీ భారతదేశంలోని చరిత్రకారులు, పరిశోధకులు, యాత్రికులు సంవత్సరం పొడవునా కొలనుపాకకు వచ్చి సోమేశ్వరాలయాన్ని దర్శిస్తుంటారు, చరిత్రను అధ్యయనం చేస్తుంటారు. *

# పుష్కరిణి శుద్ధి

తిరుమల శ్రీవారి పుష్కరిణిని అధునాతన పద్ధతుల్లో శుద్ధిచేసేందుకు తి.తి.దేవస్థానం సన్నాహాలు ప్రారంభించింది. రోజు వేలాదిమంది భక్తులు స్నానం చేస్తున్నందున ఈ నీరు పరిశుభ్రంగా వుండేందుకు దేవస్థానం అన్ని ప్రయత్నాలు చేస్తోంది. ఈ కార్యక్రమము కోసం తి.తి.దేవస్థానం 27 లక్షల రూపాయలు కేటాయించింది. నీరు పరిశుభ్రంచేసేందుకు 15 నుంచి 20 హార్స్ పవర్‌గల మోటార్లతో చెక్క బల్లలమాదిరిగా నీటిమీద తేలియాడే పరికరాలను ఉపయోగించబోతున్నారు. ఇవి నీటిలోనికి ఆక్సిజన్ పంపింగ్ చేస్తాయి. ఈ కార్యక్రమాన్ని దేవస్థానం ఉన్నతాధికారులు పర్యవేక్షిస్తారు.

## తిరుమలలో దేవాదాయశాఖమంత్రి

రాష్ట్ర దేవాదాయశాఖమంత్రి శ్రీ కె. యానాది రెడ్డి జూన్ 25 శనివారం ఉదయం తిరుమలలో శ్రీవారిని దర్శించారు. వీరికి ఆలయ డిప్యూటీ ఇ.ఓ. శ్రీ వాసుదేవన్, పేష్కార్ శ్రీమునిరత్నంనాయుడు స్వాగతం పలికారు. దర్శనానంతరం మంత్రి శ్రీవారి పోటు (వంటశాల) దర్శించారు.

## కళను ప్రోత్సహిస్తాం జె.ఇ.ఓ

తిరుమల తిరుపతి దేవస్థానంలో పని చేసే ఉద్యోగులు తమ విధులు తాము నిర్వహిస్తూనే నాటక కళపై ఉత్సాహం చూపడం ముదావహమని, ఉద్యోగ సంఘాలవారు పౌరాణిక నాటకాలు ప్రదర్శిస్తే అందుకు తి.తి. దేవస్థానం ప్రోత్సాహం వుంటుందని తి.తి.దేవస్థానముల సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ సత్యనారాయణ తెలిపారు. జూలై 4 రాత్రి దేవస్థానం హెల్త్ వర్కర్స్ యూనియన్ ఆధ్వర్యంలో ప్రదర్శింపబడిన 'శ్రీకృష్ణ శయ్యాగారం', 'సత్యహరిశ్చంద్ర' నాటికను సంయుక్త కార్యనిర్వహణాధికారి దర్శించారు.

# వార్తాలహరి

## ధర్మకర్తల మండలి నిర్ణయాలు

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి సమావేశం జూలై 28, 29, గురు, శుక్రవారాల్లో దేవస్థానం అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆ సమయంలో వివరాలను జూలై 30 శనివారంనాడు అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి తిరుపతిలో విలేకరుల సమావేశంలో తెలిపారు.

* శ్రీవారి ఆర్జిత సేవల్లో ఉపయోగించే ప్రసాదాలను ఆలయంలోపల, ఇతర ప్రసాదాలను ఆలయం వెలుపల తయారుచేయాలని తాత్కాలికంగా నిర్ణయించారు.

* ప్రస్తుతం లడ్డులు తయారుచేస్తున్న మంటపం పడగొట్టి అందులోనికి వచ్చే సామాన్లను, స్తంభాలను ఉపయోగిస్తూ 70 లక్షల రూపాయల వ్యయంతో పునర్నిర్మించాలని తీర్మానించారు.

* శ్రీరామానుజులవారి మేనమామ, గురువు అయిన తిరుమలనంబి విగ్రహాన్ని తిరుమలలో ప్రతిష్ఠించాలని తీర్మానించారు.

* శ్రీకాళహస్తిలో కన్నప్పకంటి ఆస్పత్రి వద్ద 10 గదులు, గుంటూరుజిల్లా మంగళగిరి, కృష్ణాజిల్లా వేదగిరిలో నాలుగేసి గదులు నిర్మించాలని తీర్మానించారు.

* దేవస్థానం ఆర్జితం వసతుల కల్పన, రిజర్వేషను తదితర వ్యవహారాలకు కంప్యూటర్లు ఉపయోగించాలని నిర్ణయించారు. 70 లక్షల రూపాయల వ్యయంతో చేపడుతున్నారు.

## హైడ్రాలిక్ బ్రేకులు

తిరుమలలో శ్రీవేంకటేశ్వర స్వామివారికి తయారయిన బంగారు రథానికి హైడ్రాలిక్ బ్రేకులు ఏర్పాటు చేశారు. ఈ హైడ్రాలిక్ బ్రేకులకు సుమారు రు 30,000లు. ఖర్చు అయింది. అంతేగాక ఈ బ్రేకులను ఓగించే చట్రానికి సుమారు 1.5 టన్నుల బరువు కలిగిన, కర్రతో తయారుచెయ్యబడి ఒక లక్ష రూపాయల ఖర్చు అయింది.

వీటిని హైదరాబాదులోని భారత హెవీ ఎలక్ట్రికల్ లిమిటెడ్ సంస్థ ఒక నెల సమయంలో నిర్మించింది. పై సంస్థ మేనేజరు. శ్రీ ఎం.ఎస్. మూర్తి, శ్రీ ఎ.పి. ప్రసాద్ ఇంజనీర్ శ్రీ ఎం. విఠల్‌రావు ఈ నిర్మాణాన్ని పర్యవేక్షించారు.





## తిరుమల శ్రీవారికి పుష్పపల్లకి

94 జూలై 16 న దక్షిణాయన పుణ్యకాలంలో తిరుమల శ్రీస్వామివారికి ఆణివార ఆస్థానం అత్యంత వైభవంగా జరిగింది. పూర్వం ఆరోజున శ్రీస్వామివారి వార్షిక లెక్కలు ప్రారంభమయ్యేవి. అందువల్ల శ్రీ స్వామివారికి ఆణివార ఆస్థానంలో, ఆదాయవ్యయాలు, ఉత్సవాలు, విశేషాలు విన్పింపబడ్డాయి. కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తిగారికి, శ్రీమాన్ పెద్ద జియ్యంగారికి వారివారి మొహరుల తోనూ "లచ్చన" అనబడే దేవస్థానం ఓగాలగుత్తిని ఇచ్చి, శరారి సత్కారాలు జరిగాయి.

ఆ సాయంత్రం వైభవంగా తీర్చిదిద్దిన పుష్పపల్లకిలో శ్రీదేవి-భూదేవి సహిత శ్రీమలయప్ప స్వామివారికి తిరుమల పురవీధుల్లో ఊరేగింపు జరిగింది.

## అన్నదానం హుండీ

తిరుమలలో భక్తులకు నిత్యాన్నదానం చేసే భవనంలో 94 జూలై 3 వ తేదీన హుండీని ఏర్పాటు చేశారు. యాత్రికులు, భక్తులు తామూ నిత్యాన్నదానంలో కొద్దో గొప్పో సమర్పించి పాలు పంచుకోవడానికి వీలుగా ఈ హుండీని ఏర్పాటుచేశారు. ఒక్కవారం రోజులలోనే ఈ హుండీద్వారా రు 29,270.15, ల మొత్తము వసూలు అయిందనీ, భక్తులు నిత్యాన్నదానానికని సమర్పించిన ఈమొత్తాన్ని నిత్యాన్నదాన మూలధనంగా చేర్చబడుతుందని నిత్యాన్నదాన ట్రస్టు కార్యదర్శి, డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ పట్టాభిరామిరెడ్డి తెలియజేశారు.

## సహస్రకుండ మహాయజ్ఞం

తిరుమల పుణ్యక్షేత్రంలోని గోగర్భం తీర్థం సమీపంలో 94 అక్టోబరు 14 నుండి 28 వరకు 15 రోజులపాటు "శ్రీవిశ్వశాంతి సహస్రకుండాత్మక శ్రీవిష్ణు మహాయాగం" నిర్వహించనున్నట్లు శ్రీశ్రీశ్రీ తిదండి శ్రీమన్నారాయణ చిన జీయరుస్వామివారు తెలియజేశారు. 94 జూలై 22 వ తేదీనుండి తిరుపతిలో చాతుర్మాస్య దీక్షలో వున్న శ్రీ చిన జీయరుస్వామివారు, జూలై 27 నుండి దేవస్థానం ధర్మప్రచారపరిషత్ ఆధ్వర్యంలో, తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో ప్రతి రోజు సాయంత్రం "శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ - గీతాప్రవచనం" ధార్మిక కార్యక్రమాల్ని నిర్వహిస్తూ వున్నారు. తిరుమలలో జరుపనున్న ఈ మహాయజ్ఞానికి యజ్ఞభూమి సిద్ధమౌతున్నదని, లోకశాంతికై చేయబడే ఈమహాత్కార్యంలో అందరూ పాల్గొనవలసిందని శ్రీశ్రీశ్రీ చినజీయరుస్వామి తెలియజేశారు.



Published on behalf of T T Devasthanams by N.S. Ramamurthy, M.A., Editor-Incharge and
Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



విశ్వరూప మిదివో విష్ణురూప మిదివో
శాశ్వతులమైతి మింక జయము మా జన్మము

కొండవంటి హరిరూపు గురుతైన తిరుమల
పండిన వృక్షములే కల్పతరువులు
నిండిన మృగాదులెల్ల నిత్యముక్త జనములు
మెండుగఁ బ్రత్యక్షమాయ మేలువో నా జన్మము



మేడవంటి హరిరూపు మించైన పైఁడి గోపుర-
మాడనే వాలినపక్షు లమరులు
వాడలఁ గోనేటి చుట్ల వైకుంఠనగరము
యీడ మాకుఁ బొడచూపె ఇహమేపో పరము.

కోటిమదనులవంటి గుడిలో చక్కనిమూర్తి
యీటులేని శ్రీ వేంకటేశుఁ డితడు
వాఁటపు సొమ్ములు ముద్రవక్షపుటల మేల్మంగ
కూటువై నన్నేలితి యెక్కువవో నా తపము.

--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 409,
రాగం : భైరవి, సంపుటం : 3 (1986)

ఇహ పరాలను రెండిటినీ ప్రసాదించే తిరుమలక్షేత్ర మహిమనూ, దేవాదిదేవుడైన శ్రీవేంకటేశుని దివ్యమంగళమూర్తిని వర్ణిస్తున్న ఈ పాట 94 అక్టోబరు బ్రహ్మోత్సవాల సందర్భంగా

## తిరుమల తిరుపతి దేవస్థానములు
## తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

**విద్యే సౌందర్యం** **విద్యే దైవం**

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని *"ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటి, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్."* వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి




గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యస్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రచురణకర్త-ఇన్ ఛార్జి సంపాదకులు
ఎమ్.ఎస్. రామమూర్తి, ఎమ్.ఏ
ఫోను. 22294
ఉపసంపాదకులు
పి. శైలకుమార్, ఎమ్.ఏ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఏ.,
ముద్రాపకులు
ఎం. విజయకుమార్‌రెడ్డి,
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# విషయ సూచిక...అక్టోబరు, 1994

సంపుటి 25 సంచిక 5

# సంపాదకీయం

వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన

తిరుమల వెంకన్న వేడుకలు మళ్లీ వచ్చాయి! అందరికీ ఆత్మానందాన్ని పంచిపెట్టే ఆనందనిలయుని ఉత్సవాలు మళ్లీవచ్చాయి! పండితులనుంచి పామరులదాకా అందరినీ అలరించే పరంధాముని పదినాళ్ల పరవడి దినాలు మళ్లీవచ్చాయి! నిత్యం కొత్తదనంతో నయన మనోహరంగా దర్శనమిస్తూ సర్వత్రా దివ్యమైన ఆధ్యాత్మిక తేజస్సును వెలార్చే శ్రీవేంకటేశుని ఉత్సవాలు మళ్లీ వచ్చాయి!

అనాదిగా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి బ్రహ్మదేవుడు ఈ ఉత్సవాలను చేసినందువల్ల వీటిని "బ్రహ్మోత్సవాలు" అని పండితులు పరమానందంతో పేర్కొంటే, పామరులు "బెమ్మతిరునాళ్లం"టా అని చిందులేస్తూ సంబరపడిపోతారు.

నిజమే మరి! బ్రహ్మాండనాయకుని బ్రహ్మోత్సవాలు అంటేనే ఒక బ్రహ్మానందం! తిరుమలప్పని తిరునాళ్లు అంటేనే ఒక తన్మయత్వం! వేంకటేశుని ఉత్సవాలు అంటేనే ఒక కొత్త ఉత్సాహం!.... ఒక మైమరపూ .. ఒక ఆత్మతృప్తీ..!

పూర్వం, ఏలోకంలో ఎవరికి ఏకష్టం వచ్చినా, ఏ నష్టం వాటిల్లినా, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు, సనక సనందనాది యోగులు... మునులు... అందరూ వైకుంఠానికి వెళ్లి శ్రీ మహావిష్ణువునకు మొరపెట్టుకొనేవారట! కాని భూలోకవాసుల అదృష్టం, మహద్భాగ్యం ఎంతటిదో మరి! అందులోను ఈ కలియుగంలోని మానవులకోసం సాక్షాత్తు ఆ వైకుంఠనాథుడు భూలోకానికి ఏతెంచాడు. ఇదెంతటి ఆశ్చర్యమో! అంతేకాదు ఆ మానవులందరి వేం = పాపాలను, కటః = నశింపజేసే 'వేంకటపతి'ని తానంటూ సాక్షాత్తు ఆ మహావిష్ణువు చాటుకున్నాడు. ఇదెంతటి పరమాద్భుతం! అలా చాటుకొనడమే కాదు. "కలౌ వేంకటనాయకః" అంటూ ఈ కలియుగంలో ఏకైక నాయకుడుగా ఆ శ్రీనివాసుడు ప్రసిద్ధిపొంది, భక్తులపాలిటి కొంగుబంగారమై, కోరినవారి కల్ప తరువై, సేవచేసినవారి చేతిమాణిక్యమై, భావించువారి పరబ్రహ్మమై, కావలెనన్నవారికి మనోరథసిద్ధినిచ్చే గురుతైన దైవమై, పూజించేవారిని రక్షించే వజ్రకవచమై, భక్తిసేసినవారి భవరోగ వైద్యుడై, తన్మయించి నుతించిన వారి ఆనందరూపుడై ప్రకాశిస్తూ దివ్యదర్శనం ప్రసాదిస్తూ వున్నాడు. ఆ భక్తులనుంచి తృణమో పణమో స్వీకరించి వారిని పాపవిముక్తుల్ని చేస్తూ వున్నాడు!

భక్తులనుండి స్వీకరించిన ఆ ధనాన్ని, ఒకవైపు తన భక్తుల సౌకర్యాలకే వినియోగిస్తూ, మరోవైపు నిత్యాన్న దానాలు, వేదపాఠశాలలు, కళాశాలలు, శరణాలయాలు వైద్యశాలలు, అడవుల పెంపకం, కల్యాణ మండపాలనిర్మాణం, ఆలయాల పునరుద్ధరణ, జీర్ణోద్ధరణ ఇలా ఎన్నో విధాలుగా లోక కల్యాణకారకాలైన పనులు నిర్వహిస్తూ నిరంతరం "మానవుల్ని ఉద్ధరిస్తున్న మాధవుడు"గా ప్రసిద్ధిపొందిన జగత్కల్యాణచక్రవర్తి తిరుమల శ్రీవేంకటేశ్వరుడు.

కనుకనే ఆస్వామికి జరుగుతున్న ఈ పదినాళ్ల పండుగలు అందరికీ పండుగలు! ఆనందనిలయుని ఆనందోత్సవాలు అందరికీ పరమానందదాయకాలు! అందుకే సప్తగిరీశుని ఉత్సవ సంరంభ సౌరభాలు దశ దిశలా వ్యాపిస్తూ ఎందరినో ఆకర్షిస్తూవున్నాయి. ఒక్క మానవులే కాదు. బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు, దిక్పాలకులు, సూర్య చంద్రాది దేవుళ్లు, అనంత గరుడ హనుమంతాది విష్ణుభక్తాగ్రేసరులు... ఇలా ఎందరో కల్యాణ పరంపరలను వర్ణించే ఈ కొండలరాయని కోలాహలంలో పాల్గొని భక్తితో తమ వంతు సేవలందిస్తారు.

ఈ ఏడాది మరొక్క విశేషం! ఈ బ్రహ్మోత్సవం చివరిరోజునుంచి 15 రోజులపాటు తిరుమల శ్రీనివాసుని సన్నిధిలో శ్రీశ్రీశ్రీ శ్రీమన్నారాయణ చిన జీయరుస్వామివారి పర్యవేక్షణంలో "శ్రీ విశ్వశాంతి సహస్రకుండాత్మక శ్రీవిష్ణుమహాయాగం" లోకశాంతికై నిర్వహింప బడుతూంది.

మమారు ఈ నెలరోజులపాటు తిరుమలక్షేత్రంలో నిర్వహింపబడే లోక కల్యాణదాయకములైన తిరుమల శ్రీనివాసుని మహత్త్వపూర్ణమైన "బ్రహ్మయజ్ఞం"లోను, ఆ శ్రీవారి సన్నిధిలో నిర్వహింపబడుతున్న "శ్రీమహావిష్ణుయాగం"లోను మనందరం భక్తిప్రపత్తులతో పవిత్రంగా పాల్గొందాం. పాలు పంచుకుందాం. మనందరి పరమ కర్తవ్యంగా తిరుమలలో ఆ క్షేత్రనియమాల్ని విధిగా పాటిద్దాం! ఆ క్షేత్ర పవిత్రతను రక్షిద్దాం.

తద్వారా నిత్యకల్యాణచక్రవర్తియైన ఆ సప్తగిరీశుని సంపూర్ణ అనుగ్రహానికి పాత్రులమవుదాం!

వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

# విజయదశమి

శ్రీ డి. నాగసిద్దారెడ్డి

ఆరోగ్యమూ, ఆర్థికమూ, వివాహమూ, ఉద్యోగమూ, చదువూ వగైరా ఏదో ఒక సమస్యలో సతమతం కాని వ్యక్తి సమాజంలో లేడు. ఆ సమస్యల వల్ల సంభవించే అలజడినీ, ఆందోళననీ ఒక రోజైనా దూరంచేసికొని బంధుమిత్రులతో, కుటుంబంతో సంతోషంగా గడపటానికీ, జాతి సమైక్యతకూ పండుగలు మనకు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. పండుగ అనగానే అప్పుచేసైనా పప్పుకూడు తినాలనే ఆకాంక్ష లేని మనిషి అరుదుగా కనపడవచ్చునేమో!

ఉత్సవమూ, ఆనందమూ అనే అర్థాలు కలిగిన ఈ పండుగలు ప్రాచీన కాలంనుంచీ కూడ జాతి జీవితంతో పెనవేసుకుపోయాయి. ప్రపంచంలోని ప్రతి జాతిలోనూ, ప్రతి మతంలోనూ కూడ పండుగలున్నాయి. మనదేశంలోని వివిధ రకాల పండుగల్ని గూర్చి స్మృతిగ్రంథాల్లోనూ పురాణాల్లోనూ వర్ణించడం జరిగింది. ఏ పండుగ ఎప్పుడు వస్తుందో, దాన్ని ఏ విధంగా జరుపుకోవాలో నిర్దేశిస్తూ అనేక గ్రంథాలు సైతం వెలువడ్డాయి. పండుగ దినాల్లో పార ప్రవచనం తగదని కూడ హారీతస్మృతి ఇలా పేర్కొంటూవుంది.

"మహానవమ్యాం, ద్వాదశ్యాం,
భరణ్యామపి పర్వసు,
తథాక్షయ తృతీయాం
శిష్యాన్నాధ్యాపయేద్విజః."

"మాఘమాసేతు సప్తమ్యాం
రథాఖ్యా యాంతు వర్జయేత్,
అధ్యాపనం సమభ్యంజన్
స్నానకాలేచ వర్జయేత్."

ఈ పండుగల్ని ప్రధానంగా జన్మదినోత్సవాలు-- (శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమి, గాంధీజయంతి మొ॥నవి.) ప్రకృతి సంబంధమైన ఉత్సవాలు-- (ఉగాది, సంక్రాంతి, రథసప్తమి మొ॥నవి.) వైష్ణవ మతానికి చెందినవి-- (అనంత పద్మనాభవ్రతం, వైకుంఠ ఏకాదశి మొ॥నవి.) శైవమతానికి సంబంధించినవి-- (వినాయకచతుర్థి, శివరాత్రి, దేవీ నవరాత్రులు మొ॥నవి.) స్త్రీలకు మాత్రమే పరిమితమైనవి-- (వరలక్ష్మీవ్రతం, తులసీ వ్రతం మొదలైనవి) అని వింగడింపవచ్చు. కాలక్రమంలో ఈ పండుగల్ని వర్ణ వర్గ విభేదం లేకుండా సర్వులూ జరుపుకొంటున్నారు. ఏ పండుగ ఏ పరమార్థ సాధనకోసం ఉద్దేశించినా దాని అంతిమలక్ష్యం ప్రజానీకానికి ఆనందాన్ని ప్రసాదించడమే.

ఈ పండుగలలో ఆసేతు హిమాచలం ఆనందంగా అందరూ జరుపుకొనే పండుగ విజయదశమి. ఆశ్వయుజమాసం శుద్ధ



# ఆనంద నిలయా!



శతకోటి భాను తేజ - హృదయ నివాసా
పరిపూర్ణ కరుణా కటాక్షా శ్రీ వేంకటేశ ||

అతిలోక కరుణార్ద్ర అంతరంగమ్ముతో
భువనముల వెలిగించు శ్రీ చరణ కాంతులతో
హిమ శైలము కన్న చల్లని ప్రేమతో హిమ||
జగములను పాలించు జగదేక రక్షా శత||

అక్షయ రూపా - ఆదిత్య వర్ణ
జ్ఞాన సుగంధా - ఆత్మానందా అక్షయ||

ఆది మధ్యాంత - ఆనంద నిలయా
ఆత్మాధి పతే - ఆత్మారామా శత||

—— శ్రీశ్రీశ్రీ భగవతి విజయేశ్వరీ దేవి

'చంద్రశేఖర'

పాడ్యమి నుంచీ నవమిదాకా జరుపబడే దేవీ నవరాత్రులు లేదా శరన్నవరాత్రులు కూడ దీనికి అనుబంధంగానే వస్తాయి. ఈ రెండు పండుగలూ విభిన్నాలే అయినా వరుసగా ఒక దాని వెంబడి మరొకటి రావటంమూలాన ఈ రెంటినీ కలిపి విజయదశమి, దసరా, దశరా అని వ్యవహరిస్తున్నారు. పాడ్యమినుంచీ దశమిదాకా ఈ పండుగను దేశమంతటా ముఖ్యంగా బెంగాలు రాష్ట్రంలో మహావైభవంగా జరుపుకొంటారు. ఒకరకంగా చెప్పాలంటే ఇది ఆంధ్రదేశంలో ఆడపడుచులకు అత్యంత ఉల్లాసాన్ని ప్రసాదించేదని చెప్పవచ్చు. రకరకాల బొమ్మలు పెట్టి బొమ్మలకొలువు చేయడం, ఇరుగుపొరుగుల్నీ బంధుమిత్రుల్నీ పిలిచి తాంబూలా లివ్వడం వగైరా కార్యక్రమాలతో వారు చాలా హడావిడిగా వుంటారు.

దశరా పండుగ దేవీ నవరాత్రులతో ప్రారంభమవుతుందని చెప్పానుకదా! ఆది శక్తి పాడ్యమినుండి నవమిదాకా 9 దినాలూ 9 అవతారాలెత్తి దుష్టసంహారం చేసిందట! సృష్టి స్థితిలయకారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సైతం ఈ మహాశక్తికి లోబడినవారేనని మార్కండేయాది పురాణాలు పేర్కొంటున్నాయి. విష్ణుదేవుని యోగనిద్రామూర్తి అయిన ఈ పరాశక్తికి మహామాయ అని పేరు. ఈ దేవి 9 దినాలూ వరుసగా ఎత్తిన అవతారాలివి.

1. మహాకాళి;
2. మహిషాసురమర్దని;
3. చాముండేశ్వరి;
4. మహామాయ;
5. రక్తదంతి;
6. శాకంభరి;
7. దుర్గ;
8. మాతంగి;
9. భ్రమరి.

విష్ణుదేవుడు మధుకైటభులనే రాక్షసుల్ని సంహరించే సందర్భంలో--

నీవ సావిత్రివి నీవ సంధ్యవు దేవి
నీవె తల్లివి సుమ్ము నిఖిలమునకు,

(41 వ పేజీలో)

## పాదయాత్ర

94 ఆగస్టు 17న తమిళనాడు పెరంబూరునుండి 1100 మంది భక్తులు తిరుమలక్షేత్రానికి పాదయాత్ర చేశారు. కాలినడకనే యాత్రచేసిన వీరికి శ్రీ టి. పార్థసారధి రామానుజదాసుగారు ఆధ్వర్యం వహించారు. వీరు గత ఇరవై ఏళ్ళుగా తిరుమల పాదయాత్రలు చేస్తూ, రామానుజదాసుగా, సంకీర్తన కళానిధిగా భక్తశిఖామణులుగా ప్రసిద్ధిపొందారు. పాదయాత్రతో తిరుమలచేరి ఈ భక్తబృందానికి దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్ రెడ్డి, సెంట్రల్ లైబ్రరి సలహాదారులు డా॥ రావుల సూర్యనారాయణమూర్తి, రికార్డింగు ప్రాజెక్టు అధికారి శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు తదితరులు స్వాగతం పలికారు. ఈ భక్తబృంద నిర్వాహకులైన శ్రీ టి. పార్థసారధి రామానుజదాసు గారిని శ్రీ చెంగల్ రెడ్డి శేషవస్త్రంతో సత్కరించారు.



## ధర్మ ప్రచార కార్యక్రమాలు

కర్నూలుజిల్లా ఆలమూరు గ్రామంలో డి.పి.పి. ఆధ్వర్యంలో ఇటీవల జరిగిన కుంకుమార్చన దృశ్యం






మచిలీపట్నం ఎస్.వి. భక్తసంఘంవారి ఆధ్వర్యంలో జరిగిన హయగ్రీవ జయంతిలో ప్రసంగిస్తున్న శ్రీ వి. అనంత పద్మనాభాచార్యులు.



## గోపూజ

94 ఆగస్టు 29న తి.తి. దేవస్థానంవారి డైరీఫారంలో గోపూజ, గోపాలకృష్ణుని పూజ వైభవంగా జరిగాయి. వేదమంత్రాల పారాయణలు సాగుతుండగా, బాజభజంత్రీలు మోగుతుండగా, తొలిగా గోపూజ జరిగింది. తర్వాత గోవులనుండి పాలను పితికి, వాటిని శ్రీకృష్ణస్వామికి నివేదించి పూజించారు. ఈ గోపూజ కార్యక్రమంలో, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయరుస్వామి, దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి, దేవస్థానం కార్య నిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, దేవస్థానం డైరీఫారం సూపరింటెండెంటు డా॥ కొండారెడ్డి ఇంకా ఇతర దేవస్థానం అధికారులు, వందలాదిమంది భక్తులు పాల్గొన్నారు.

ఈ సందర్భంలో జరిగిన సమావేశంలో శ్రీ చినజీయరుస్వామి శ్రీకృష్ణస్వామిని గూర్చి ప్రసంగించారు.

## శ్రీ కృష్ణసూరి జయంతి

94 సెప్టెంబరు 4న తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో ఆళ్వారు దివ్య ప్రబంధ ప్రాజెక్టు ఆధ్వర్యంలో శ్రీ కృష్ణసూరి జయంతి ఉత్సవం జరిగింది. ఈ సందర్భంగా శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయరుస్వామి సందేశమిస్తూ ఆళ్వారుల పాశురాలకు విపుల వ్యాఖ్యానాన్ని సంతరించిన మహనీయుడు శ్రీకృష్ణసూరి అనీ, వీరినే 'పెరియ వాచ్చాన్ పిళ్లై' అని అంటారనీ, ఈయన వ్యాఖ్యానాలను చదివితేనే పాశురాలు సరిగ్గా అర్థం అవుతాయని తెలియజేస్తూ, ఈ పాశురాలను, వ్యాఖ్యానాలను ఆళ్వారు ప్రాజెక్టువారు తెనిగించి, అందివ్వాలని కోరారు.

అంతకుముందు ప్రాజెక్టు ఆఫీసరు శ్రీ శౌరిరాజన్ ప్రాజెక్టు నివేదికను తెలియజేస్తూ స్వాగతం పలికారు. ఆ తర్వాత తి.తి. దేవస్థానం ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి ప్రసంగిస్తూ, శ్రీ జీయరుస్వామివారే పాశురాలను, వాటి వ్యాఖ్యానాలను తెనిగింపజేసే బాధ్యత స్వీకరించి, మాకు అందచేసినట్లయితే, వారికి అన్నివిధాల సంపూర్ణ సహకారం అందివ్వగలమనీ, వాటిని ప్రచురించగలమని తెలియజేశారు.




మంతాడ శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాల సందర్భంగా → శ్రీమతి వి. భాగేశ్వరి బృందంవారి భక్తిరంజని కార్యక్రమం.

# శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర వైభవము

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయరుస్వామి:

భారతీయ సంస్కృతికి ఇతిహాసాలు రెండు. శ్రీ వాల్మీకి మహర్షి ప్రణీతమైన శ్రీమద్రామాయణము, శ్రీవేదవ్యాస భగవానుడు అనుగ్రహించిన శ్రీమద్భారతం. శ్రీమద్భారతానికి రెండింటివల్లనే గౌరవం అని పెద్దలయొక్క శ్రీసూక్తి. అందు మొదటిది శ్రీకృష్ణ భగవానుడు అనుగ్రహించిన శ్రీమద్భగవద్గీత, రెండవది శ్రీ భీష్మ పితామహుడు లోకానికి ప్రసాదించిన శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము. ఈ రెండింటిలో మొదటి దానిని శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశం చేసి సంజయుని ద్వారా లోకానికి అందించాడు. రెండవదానిని భారత సంగ్రామానంతరం అంపశయ్యపై పడియుండిన భీష్మ పితామహునిద్వారా శ్రీకృష్ణపరమాత్మ పాండవులకు ఉపదేశం చేయిస్తూ లోకాన్ని తరింపచేశాడు. ఈ రెండింటిలో భగవద్గీత కంటే శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రం వల్లనే సులభంగ తరింపవచ్చని శ్రీకృష్ణుని అభిమతం.




ఈ భావాన్ని శ్రీకృష్ణుడే స్వయంగా వ్యక్తం చేసాడు భీష్మ పితామహుని దగ్గర. శ్రీకృష్ణుడు పాండవులనందరినీ తీసుకొని భారత సంగ్రామానంతరం అంపశయ్యపైనున్న భీష్మ పితామహుని దగ్గరకు వస్తాడు. ధర్మరాజుకు కల్గిన ధర్మ సంశయములను తీర్చమని శ్రీకృష్ణుడు భీష్ముని కోరుతాడు. తనకు అవేవీ జ్ఞాపకంలేవు, చెప్పేశక్తి లేదు అంటాడు భీష్ముడు. అతనికి తెలిసినవన్నీ జ్ఞాపకం వచ్చేటట్లు పూర్వపు శక్తి కలుగునట్లు, నోటనీరూరునట్లు, దేహబాధ తెలియనట్లుగ శ్రీకృష్ణుడు వరాలిస్తాడు. ఆశ్చర్య- ఆనందాలతో భీష్ముడు "అన్ని వరాలు నాకిచ్చి నాచే చెప్పించడ మెందుకు కృష్ణా! నీవే చెప్పవచ్చు కదా!" అని ప్రశ్నిస్తాడు. భారత సంగ్రామములో ఇరుసేనలను ఆపి మరీ చెప్పాను "భగవద్గీత" నంతాను. విన్న అర్జునునికి అది ఏ మాత్రం పట్టలేదు. అప్పుడు నాకు ఆచార్య లక్షణాలు లేవు. అతనికి శిష్య లక్షణాలు పూర్తిగ లేకపోవడమే దానికి కారణం. పైగా

> 94 సెప్టెంబరు, తిరుపతిలో చాతుర్మాస్య దీక్ష పాటిస్తున్న సందర్భంలో శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ చిన జీయరుస్వామి అనుగ్రహించిన ఉపదేశ వ్యాసాన్ని 94 అక్టోబరు 14 విజయదశమి సందర్భంగా ప్రచురిస్తున్నాం.
>
> సం॥

పరమాత్మను నేనే కనుక తనను గూర్చి తనే చెప్పుకొంటే అందరికీ అసూయ కల్గిస్తుంది. ఒక తత్త్వాన్ని గురించి తత్త్వ దర్శనం చేసినవారు చెప్పాలేకాని తనను గూర్చి తానే చెప్పుకోరాదు కద, భగవద్గీతలో తత్త్వమైన నా ప్రభావాన్ని నేనే కీర్తించుకోవడంచేత అర్జునునికి ఏమాత్రం ఎక్కలేదు. భీష్మ పితామహా! నీవు తత్త్వ దర్శనం చేసిన ఆచార్యుడవు. నీ నుంచి తెలుసు కోవాలని పాండవులు కోరుతున్నారు. వారికి తత్త్వమును, హితమును ఉపదేశము చేయుము అంటాడు శ్రీకృష్ణుడు.

దాహం కల్గిన వానికి సముద్రం తనలో నీరు నిండా ఉన్నా ఇవ్వటానికి వీలులేదు.

ఇచ్చిన త్రాగడానికి పనికిరావు. ఆ నీటినే మేఘము గ్రహించి వర్షంగ కురిపిస్తేనే త్రాగ వీలవుతుంది. నేను సముద్రము లాంటి వాడిని. నాలో గుణప్రవాహాన్ని గ్రహించిన నీవు మేఘము లాంటివాడవు కనుక పితామహా! నీవే వీరికి ఉపదేశించి ఆర్తిని తీర్చుము అని భీష్ముని ప్రోత్సహిస్తాడు. భీష్ముడు పాండవులకు ఉపదేశం చేస్తుంటే తాను కూడా చేతులు కట్టుకొని విని, అది అట్లే అని ఆమోదిస్తాడు కూడ. అందుచేత దీనికి ప్రభావ మధికము.

ముందుగ సామాన్య ధర్మాలను గురించి ధర్మరాజు అనేక సమాధానములు పొందెను. ఆపై "జన్మనెత్తిన ఏ జీవి అయినా ఈ సంసార చక్రమునుండి బయట పడాలంటే తెలియవలసిన తత్త్వమేది? ఈ జీవులపుడు ఎక్కడ చేరుతారు? ఆ చేరడానికేమి చేయాలి? ఎవరిని స్తుతిస్తే అర్చిస్తే మానవులు కోరిన సుఖాలన్నీ పొందుతారని తాతా! నీవు భావిస్తున్నావో దానిని అనుగ్రహించు" అని ధర్మరాజు ప్రశ్నిస్తాడు. సర్వజగత్కారణమైన సర్వలోకేశ్వరుడయిన శ్రీమన్నారాయణుని 'స్తువన్' స్తోత్రము చేయుచు' 'తమేవ చ అర్చయన్' అతనినే ప్రేమతో పూజిస్తే 'సర్వదుఃఖాతిగో భవేత్' అన్ని దుఃఖములను దాటి పోవచ్చునయ్యా. ఆ పుండరీకాక్షుని అర్చించడమే 'ధర్మః అధికతమో మతః' అన్ని ధర్మాలలోకి శ్రేష్ఠమైన ధర్మమని నా అభిప్రాయం. అంతేకాదు అతని నామములను కీర్తిస్తే సకల పాపాలు పోతాయి. పవిత్రులౌతారు. ఏ కోరిక కోరినా అవన్నీ లభిస్తాయి. దీనిని మించిన గొప్ప మంత్రము మరొకటి లేదు. వేయి నామాలు కల మూలమంత్ర మీ స్తోత్రము. ఈ వేయిమంత్రాలు ఎక్కడివో తెలుసా? నేను కల్పించలేదు. "గౌణాని విఖ్యాతాని ఋషిభిః పరిగీతాని"=శ్రీమన్నారాయణుని గుణముల ననుభవించిన ఋషులు, ఆ అనుభవసారంగా ఒక్కొక్క నామాన్ని దర్శించి ఆనందించగా అక్కడక్కడగల ఆ ఋషుల వాగమృతం కలిసి పరీవాహమై లోకములో మనం కూడా పాడగలిగేటట్లు శ్రీవ్యాసభగవానుడు సేకరించి కృపచేయగా నేను దర్శించాను.

నీవడిగావు గనుక సర్వజీవులు ఉజ్జీవించడానికని చెప్పుచున్నాను వినుము అని భీష్ముడు ఉపదేశిస్తాడు. అట్టి మహాభారతసారము, పరమఋషులచే దర్శితము, శ్రీ భీష్మ పితామహునికి అభిమతము, శ్రీ వేదవ్యాస ఉపదేశలబ్ధము, భగవద్గీత కంటే శ్రేష్ఠము. ఎందరో ఆధునికులు గూడ ఇదే సకల శ్రేయస్సంధాయకమని స్వీకరించిన ఈ శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్రాన్ని మనమూ నిత్యం పాడి కోరినవన్నీ పొందుదాము.

మహాభారతసారత్వాత్
ఋషిభిః పరిగానతః,
వేదాచార్య సమాహారాత్
భీష్మోత్కృష్ట మతత్వతః
పరిగ్రహాతి శయతో
గీతాద్యైకార్థ తశ్చ సః
సహస్రనామ్నా మధ్యాయః
ఉపాదేయతమో మతః॥

1. మహాభారత సారమగుట వలనను,
2. ఋషిపుంగవులచే ప్రీతితో వాడబడిన నామములగుట వలనను,
3. వాటినుండి తీసి వ్యాసమహర్షిచే స్తోత్ర రూపముగా కూర్చబడుట వలననూ,
4. భీష్మ పితామహునిచే దీని పరనము తన కత్యంతాభిమత ధర్మముగా పరిగణింపబడుటవల్లను,
5. సమస్త ప్రామాణికులచేతను సకల గ్రంథములచేతను, శ్రద్ధా భక్తి పురస్సరముగా పరిగ్రహింపబడుట వల్లను,
6. భగవద్గీతాది బహు గ్రంథార్థములతో నేకీభవించు అర్థముల బోధించుట వలనను, మనకు ఈ సహస్ర నామ స్తోత్ర పరనము అత్యావశ్యకమని నిర్ణయింపబడెను.






ఈశాన స్సర్వ విద్యానా
మీశ్వరస్సర్వ భూతానాం
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోధిపతి
ర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివామ్॥

పిపీలికాది బ్రహ్మపర్యంతం ఉండే ఆత్మ ఒక్కటైనను సృష్టిలో విభిన్నమగు జీవరాసులేర్పడి వాటి కర్మానుభవమును బట్టి సుఖ దుఃఖములతోకూడి ఉపాధులేర్పడినవి. ఈ ప్రపంచమందు పంచభూతములు విజృంభించి అరిష్టములు రాకుండుటకున్ను, ఆధ్యాత్మిక అధి భౌతిక అధిదైవికములైన దుఃఖముల నుండి వైదొలగి శాంతి సౌఖ్యములు కలుగుటకున్ను, బ్రహ్మాది స్థావరాంతం పశవః పశూనాం అధిపతిఃరుద్రః అనుటచే మానవులకు పశుత్వవిమోచనములగుట ఐహికాముష్మిక ఫలప్రాప్తికిన్ని, ధనకనకవస్తు వాహనాద్యష్టైశ్వర్యములకు, స్వర్గాదిపుణ్యలోకప్రాప్తికి, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాది చతుర్విధ మోక్షప్రాప్తికొఱకు భగవదారాధన ముఖ్యము. ఈశ్వరానుగ్రహాదేవ పుంసామ ద్వైతవాసనా అని చెప్ప బడినది. దేవతారాధనకొఱకు దేవాలయ నిర్మాణము దేవతామూర్తులస్థాపన వాటికి నిత్య నైమిత్తిక యజనములుసల్పుట కొఱకు వేదములు - ఆగమములు ఉత్పన్నమైనవి. వీటివలన ఆలయసంబంధమగు కర్షణాది ప్రతిష్ఠాంతము - ఉత్సవాదిప్రాయశ్చిత్తాంతములు క్రియకలాపములు జరుగవలసి ఉన్నవి. ఆగమశాస్త్రానుసారంగా ఆలయములు దృఢముగాను ప్రశస్తముగాను, మనోహరముగాను, విశాలముగాను నిర్మించవలయును. సృష్టిస్థితి సంహార తిరోధానానుగ్రహ కారకుడైన పరమేశ్వరుని జగన్మాత పార్వతితో సహా ప్రతిష్ఠించి అపురూప శిల్పకళాప్రాభవంగా షట్చక్ర యోగ సౌందర్యముగా పూజింపవలయును. అట్లు చేయుటచే దేశపూర్వేషాం దశా పరేషాం తద్వంశానాం అన్నట్లు పదితరముల పూర్వులును పది తరముల తర్వాతివారును తరింతురు-

ఆలయస్య తు నిర్మాణం
పూజా చవివిద్మ పునః
ఆగమోక్తవిధానేన
కారయేద్ధర్మపాలకః.

ఆలయ నిర్మాణమునకు ముందు గర్భన్యాసము కర్షణ లగాయితు ఆద్యేష్టకోపదానము అత్యేష్టకోపదానం వఱకు ఆగమ సంప్రదాయం అనుసరించియే చేయవలయును. రాగములేక విగ్రహమందున్న కళ జీవునిగాను, ఉపాధి సూక్ష్మజీవంగాను ఆలయం స్థూలశరీరంగాను వర్ణింపబడినది. త్రిఘంటవేదిక పంచఘంట వేదిక నవఘంటవేదిక కపోతవేదిక ద్రవిడం నాగరం వేసరం వేదీ భద్రము, సుభద్రము పుష్పకం స్వస్తికం ఈ మొదలుగాగల విధులతో ఆలయనిర్మాణం జరుగుచున్నది- ఆలయం శిఖరము గర్భాలయ - అంతరాళములు, మంటపాదులు ప్రాకారములు - రాజగోపురము ధ్వజము - బలిపీఠములు ఇత్యాద్యంగములతోకూడిన ఆలయం ప్రతిష్ఠకు ముఖ్యము. ఆలయంలేని గ్రామంలో ఉండరాదని శాస్త్ర ప్రమాణములున్నవి--

దేవస్థానం వినా యత్ర
ఏకకాలం న వాసయేత్,
నిత్యపూజావిహీనేతు క్రుద్ధాః
పీడాం కరోతి హి.

గ్రామనిర్మాణమునకు ముందుగానే ఆలయ నిర్మాణం జరగాలి--

శిలామృద్దారుచిత్రేషు
దేవతా యత్రకల్ప్యతే,
ఆకల్పిత స్వయంజ్యోతి
రాత్మానో దేవతా హి సా.

అగ్ని ఇమిడియున్నను మధనముచే అగ్ని ఉత్పన్నమైనట్లు, కుండయందు అగ్నియున్నను వాయువుచే ప్రజ్వలింప బడినట్లు, విశ్వబ్రహ్మచే చెక్కబడిన శిలామూర్తుల యందు ఆచార్యుడు పుణ్యాహవాచన, పంచగవ్యమార్జన చేతను ఉపనిషత్తులతోడను జలాధివాస క్షీరాధివాస, పుష్పాధివాస ధాన్యాధివాసము పంచశయ్యాధివాసములొనర్చి శాంతి దిశా తత్వాను సంధాన హోమములు చేసి సాంగ యుక్తమగు నవరత్నములను యన్త్రమును మూర్తిని ఉంచి కళాన్యాసం చేసి షణ్ణవతి (96) ఓషధులతో మంత్రయుతముగా భావనయైన నదీజలములతో కుంభాభిషేకంచేసి ఆ పరమేశ్వరుని--

యావచ్చంద్రశ్చ సూర్యశ్చ
యావత్తిష్ఠతి మేదినీ,
తావ దత్ర త్వయాదేవ
స్థాతవ్య మిహమందిరే.

అని ప్రార్థనచేసి మంత్రరూపమున ఆ మూర్తియందు ఆచార్యుడు ఆత్మశక్తిని ప్రతిష్ఠించి ప్రకాశింప చేయుటయే ప్రతిష్ఠ యందురు. అప్పుడు దేవత్వము స్థిరీకరింపబడును. సర్వులకు పూజలు ప్రార్థనలు చేయుట యోగ్యత కల్గును. ఈప్రతిష్ఠ పంచ దిన, నవదిన, దీక్షావిధులతో చేయవలయును - ఆచార్య సంకరం పనికిరాదు -

దేవపూజాంవిధిం కుర్యాత్
బ్రాహ్మణాశ్చ విశేషతః,
సర్వాఘ నాశనం కుర్యాత్
పుత్ర పౌత్రాభి వృద్ధయే.

చరం స్థిరంచ కర్తవ్యం
ద్వివిధం పరికీర్తితమ్,
చరం గృహేషు కర్తవ్యం
స్థిరం దైవాలయేషు చ.
గృహేష్వత్ర గుణాధిక్యం
స్థానేష్వేవ చ పూజయేత్,
ఆత్మార్థం చ పరార్థం
యజనం హి విశేషతః.

ఆలయపూజలు ఆగమవిధి ననుసరించి శైవ వైఖానస పాంచరాత్ర బ్రాహ్మణుల చేతనే చేయింపవలయును. అట్లొనర్చినచో సర్వ పాపములు తొలగి పుత్ర పౌత్రాభివృద్ధి కలుగును - ఆత్మార్థ పూజలు (చరం) గృహమునందు చేయుటవలన కుటుంబవృద్ధి కలుగును. పరార్థ పూజలు (స్థిరం) ఆలయములో చేయుటవలన గ్రామాభివృద్ధికి తోడ్పడును -

అంతర్యాగం చేసి బహిర్యాగం చేయరాదు.

1. అంతర్యాగమన మానసికపూజ తన హృత్పద్మమందు పరమశివుని ఆహ్వానం చేసి తాను ఆరాధన దైవము ఒకటిగా మనస్సుచే ఉపచారములు కల్పనచేసి సమర్పణ చేయునది -
2. బహిర్యాగము:- కరచరణాద్యవయవములచే చేయునది-

శ్రీ బోధాయనులవారు చెప్పినట్లు, న్యాసమందు బాహ్యపూజకుముందు మానసిక పూజను చెప్పుచు నారుద్రోరుద్రమర్చయేత్. అనిన్నీ అథాతః పంచాంగ రుద్రాణాం న్యాసపూర్వకం జపహోమార్చనాభిషేక విధిం వ్యాఖ్యాస్యామః అని బాహ్య పూజను గురించి చెప్పిరి - ఇంక శివపూజాఫలం -

ధన్యం యశస్కరం
చాయుర్వర్ధనం పుత్రసిద్ధిదమ్
భుక్తిముక్తిప్రదం
సర్వయజ్ఞదాన ఫలప్రదమ్.

శివపూజాఫలముచేతనే ఇంద్రునకు స్వర్గాధిపత్యం విష్ణువునకు రాక్షస సంహారశక్తి బ్రహ్మకు సృష్ట్యాధిపత్యం సిద్ధించినట్లు చెప్పబడినది- శ్రీరాముడు రావణ సంహార పాప విమోచనార్థం శివ ప్రతిష్ఠలు చేసినట్లు మార్కండేయులు శివానుగ్రహంచేతనే చిరంజీవి అయినట్లు శాస్త్రప్రమాణములు చెప్పుచున్నవి. శివునకు నమస్కరింపక పూజింపక భుజింపరాదని ప్రమాణములున్నవి. పూజావివిధ పునః- ఉపచార భేదములు పెక్కులు కలవు - ఉత్సవములలోకూడ భేదములున్నవి. ఈఉత్సవములను వాహనాదుల పై దేవతామూర్తుల ననుసరించి యథా వైభవముగా గ్రామోత్సవము చేసినచో గ్రామమునకు క్షేమము. నిత్యార్చనాది కైంకర్యములు . శాంతి కుంభాభిషేకాదులు ఆగమములలో చెప్పినట్లు చేసినచో అర్చకులకు ఆచార్యులకు యజమానులకు గ్రామమునకు శుభము చేకూరును. శివానుగ్రహప్రాప్తికి పాత్రులయ్యెదరు--

# వాసుదేవ మాహాత్మ్యము

డా॥ విష్ణుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రీ

శ్లో సనాది మహర్షులిట్లనిరి:

ఓ బ్రహ్మదేవా? భగవంతుని కథను ఎంత విన్నను మాకు తృప్తి కలుగుటలేదు. వాసుదేవుని మహిమను తాము ప్రశ్నించి యుంటిరి. కాని అందలి రహస్యమును విస్తరించి చెప్పుడు అన బ్రహ్మదేవుడిట్లనెను.

ఓ ముని శ్రేష్ఠులారా? పరమసారము యిన అనంతవాసుదేవుని మహిమ భూలోక వాసుల కందనిది. ఆదికల్పమందు అవ్యక్తజన్ముడ నగునేను విశ్వకర్మను పిలిచి ఇట్లంటిని అతడు దేవశిల్పిశ్రేష్ఠుడు విశ్వకర్మలందరికి అగ్రేసరుడు. ఓ విశ్వకర్మా నీవు వాసుదేవుని ప్రతిమను శిలామయమయిన దానిని చేయుము. దానిని దర్శించి ఇంద్రాది దేవతలు మనుష్యాది భూలోకవాసులు దానవుల వలన రాక్షసులవలన కలుగు భయము తొలిగి స్వర్గమునుపొంది సుమేరుశిఖరమున ఎల్లకాలము ఆవాసుదేవుని ఆరాధించి ఏ అడ్డును లేక నివసించగలరు.

బ్రహ్మ ఆజ్ఞను శిరసావహించి విశ్వకర్మ వెంటనే ఒక వాసుదేవ ప్రతిమను తయారుచేసెను. ఆ ప్రతిమ శంఖచక్ర గదలతోను శ్రీవత్స చిహ్నము వనమాలయుం దాల్చి తెల్లతామర పూవులవంటి నేత్రములు కల్గి కిరీటము భుజకీర్తులు ధరించి పీతాంబరములోను మణికుండలములతోను మెరయుచున్నది. అట్టి సుందరాతి సుందరమగు వాసుదేవ విగ్రహమును బ్రహ్మదేవుడనగు నేను రహస్యమంత్రములచే ఒక లగ్నమందు ప్రతిష్ఠచేసితిని. ఆసుముహూర్తమునకు దేవేంద్రుడు ఐరావతమెక్కి బ్రహ్మస్థానమునకేగి స్నానదాన తర్పణాదులనాచరించి ఆ వాసుదేవ విగ్రహమును గొప్పగా పూజించి తన నగరమునకు తిరిగివచ్చెను. ఆచటకు ఒకానొకప్పుడు వృత్రాసుడు వచ్చి త్రికరణ శుద్ధి కలవాడైన ముచిమున్నగు రాక్షసులను చంపి ముల్లోకములను పరిపాలించెను.

త్రేతాయుగము రాగా మహా బలసంపన్నుడగు రావణాసురుడు పుట్టెను. పదివేల సంవత్సరములు నిరాహారముగ జితేంద్రియుడై ఉగ్రతపస్సును ఆచరించెను దానికి సంతుష్టుడనయిన నేను (బ్రహ్మదేవుడు) రావణుని కోరిక మేరకు, దేవతలకు దైత్యులకు నాగులకు రాక్షసులకు నీవు అవధ్యుడవగుదువని వరమిచ్చితిని యమకింకరులకు గూడ అవధ్యుడాయెను. వాని కుమారుడు ఇంద్రజిత్తు ఇంద్రుని గెల్చి స్వర్గ రాజ్యమును పొందెను. రావణుడు అమరావతిని స్వాధీనం చేసుకుని ఇంద్రభవన మందున్న వాసుదేవ విగ్రహమును దర్శించి రావణాసురుడు తాను అంతకముందు గెల్చితెచ్చిన వజ్రవైడూర్య రత్న మాణిక్యాదుల చేత పూజించి ఆ వాసు దేవ విగ్రహమును విమానముమీద లంకకు తెచ్చుకొనెను.

అపుడు మంత్రియు నగరాధ్యక్షుడున యియున్న ధర్మమూర్తి యగువిభీషణుడు నారాయణ పరాయణుడగుటచే ఇంద్రభవనమునుండి తెచ్చిన ఆవిష్ణుమూర్తి విగ్రహమును చూచి ఆశ్చర్యపడి తలవంచి నమస్కరించి సంతుష్టాంతరంగుడై ఇపుడు నాజన్మ ధన్యమయ్యె ఇపుడు నాతపస్సు ఫలించినది అని మరిమరి మ్రొక్కి పెద్దన్నయగు రావణుని దర్శించి దోసిలొగ్గి ప్రభూ? ఈవిగ్రహమును నాకు ప్రసాదించుము దీనినారాధించి సంసార సముద్రమును దాటెదను అని ప్రార్థించగ రావణాసురుడు తీసుకోమని ఇచ్చెను ఇస్తూ ఈవిగ్రహముతో నేనేమి చేయుదును సమస్తసృష్టికర్తయగు బ్రహ్మనారాధించి ముల్లోక విజయమును పొందితిననెను. విభీషణుడు ఆ వాసుదేవమూర్తిని, గ్రహించి నూట ఎనిమిది సంవత్సరములు పూజించి జరామరణములులేని స్థితిని (చిరంజీవత్వమును అణిమాది విభూతులను పొందెను. రావణ సంహారానంతరము శ్రీరామచంద్ర ప్రభువు విష్ణుభక్తుడగు విభీషణునకు లంకారాజ్యాధిపత్యము నొసగెను. అంత విభీషణుడు సకల భోగభాగ్యములను అనుభవించెను. ఇదంతయు వాసుదేవారాధనా ఫలము.

మరియు శ్రీరామచంద్రమూర్తి రావణ సంహారానంతరము ఆవాసుదేవమూర్తిని తీసుకొని పుష్పక విమానముపై తెచ్చి అయోధ్యలో తన సోదరులతో కంపి అత్యంత భక్తితో ఆ వాసుదేవ మూర్తినారాధించి పదకొండువేల సంవత్సరములు అయోధ్యను పరిపాలించి ఆవాసుదేవ విగ్రహమును సముద్రున కిచ్చెను. ఇచ్చి ఇట్లనెను ఓ వారిధీ నీవు ధన్యుడవు ఈ మూర్తి రక్షణ నీపని నీవు సర్వరత్ననిధివి అని శ్రీరామచంద్రుడు అనుగ్రహించెను.

ద్వాపరయుగమురాగా భూదేవి ప్రార్థనానుసారము ఆమెకు కల్గిన దుఃఖమును పోగొట్టదలచి జగన్నాథుడు వసుదేవ కులమందు వాసుదేవుడుగ అవతరించి రాముడు సముద్రమందుంచిన వాసుదేవ విగ్రహమును సర్వలోకక్షేమముకొరకు సముద్రునిచే నీళ్ళనుండి పైకి లేవనెత్తించెను. అస్థలము అప్పటనుండి పురుషోత్తమ క్షేత్రమని ముక్తి క్షేత్రమని ప్రఖ్యాతిచెందినది. అట్టి వాసుదేవ మూర్తిని భక్తితో త్రికరణ శుద్ధితో ఆరాధించిన భక్తులు దశాశ్వమేధ రాజసూయమహాయాగ ఫలమునొందుదురు. ఆమీద కామగ విమానమెక్కి విష్ణులోక మేగుదురు.

కలియుగమురాగా "కలౌ వేంకటనాయకః" అని ఆవాసుదేవమూర్తి తిరుమలలో మనలందరకు ప్రత్యక్షముగ ఆరాధ్యమగుట మహాభాగ్యము. ఆమూర్తినారాధించి మావవాళి తరించుగాక!



# శ్రీ వేంకటేశ్వరస్వామి మేలుకొలుపు (ద్విపద)



కృతికర్త : తాళ్లపాక పెదతిరుమలాచార్యులు

పరిష్కరణ : ఆచార్య కె.జె. కృష్ణమూర్తి



శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి తెలుగులో వెలువడిన స్తుతి రచనల్లో ఈ "మేలుకొలుపు ద్విపద"-- అగ్రగణ్యమైనది. ఇది శ్రీస్వామివారి సుప్రభాతసేవాకాలాల్లో గానం చేయటానికి ఉద్దిష్టమైన రచనగా తోస్తున్నది.

ఈ స్తోత్రంలో శ్రీకృష్ణావతారానికి సంబంధించిన ప్రముఖ గాథలు, అందులోనూ ఆ లీలామానుష విగ్రహుని పరాక్రమ హేలలు, అనుగ్రహ మహిమలు, శృంగారలీలలు-- మహా భాగవతపురాణ దశమ స్కంధంలో గల కథాక్రమాన్ని అనుసరించి-- సమ పాళంగా, సొంపుమీర ప్రశంసింపబడినాయి. ఈ స్తుతిలో సంగ్రహంగా చిత్రితమైన "స్వామి కొలువు" వర్ణనలో తిరుమల దేవాలయంలో ప్రతి ఉదయం కొనసాగే "శ్రీవారి ఆస్థానం (కొలువు)" యొక్క విశేషాలు చూచాయగా ప్రతిఫలించి వున్నాయి. ఇది ఈ కృతియందలి మరో విశేషం!

సుగృహీత నామధేయులు, పండిత ప్రభాకరులు కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు, తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు రచించిన ఈ లఘుకృతిని, ఈ మహాకవి (తాళ్లపాక పెదతిరుమలాచార్యులు) రచించిన "శ్రీ వేంకటేశ్వర వచనములు"-- అనే గ్రంథం చివర అనుబంధంగా "శ్రీ వేంకటేశ్వర ప్రభాత స్తవము" అనే పేర 56 ద్విపదలతో 1945లో ప్రకటించారు. ఈ స్తోత్రానికి సంబంధించిన వ్రాతప్రతులు రెండిటిలో ఇటీవల అదనంగా ఎనిమిది ద్విపదలు లభించాయి; అంతేగాక మరికొన్ని చక్కని పాఠాంతరాలు సైతం వాటిలో గోచరించాయి. ప్రకృతం ఆ రెండు వ్రాతప్రతుల ఆధారంతో ఈ "మధుర కవితాకృతి" ఈ రీతిని పరిష్కృతమై ప్రమరితమైంది. ఇందులో మొత్తం 64 ద్విపద లున్నాయి.

"మేలు కొనుము!"-- అనే మనోహరమైన మకుటంతో, అడుగడుగున భక్తి పారవశ్యాన్ని ప్రసాదించే సుశ్రావ్య సంబోధనలతో, ప్రతి పంక్తి "వరకవిత్వవాణీవీణా నినాదం"గా విలసిల్లుతూవున్న ఈ మనోజ్ఞద్విపదకృతి ప్రతి దినమూ ప్రాతర్వేళలో పారాయణం చేయదగిన సుందరస్తుతి!





శ్రీగురుం డర్థితో శేషాద్రియందు
యోగనిద్రా కేళి నున్న యత్తఱిని

వనజాసనాది దేవత లేగు దెంచి
వినుతించి రప్పు డవ్విధమెట్టిదనిన--

## బ్రహ్మాది దేవతల వినుతి

శ్రీకర! వేంకటక్షితిధరావాస!
నాకేశనుత! రమానాథ! మేల్కొనుము!

వసుదేవ దేవకీ వరగర్భజాత!
కిసలయాధర! రామకృష్ణ! మేల్కొనుము!

తపము పెంపున యశోదానందులకును
కృపతోడ శిశువైన కృష్ణ! మేల్కొనుము!

పూతనా కైతవ స్ఫురిత దుర్వార
చైతన్యహరణ ప్రశస్త! మేల్కొనుము!

అజిముజి శకటాసురాంగంబులెల్ల
విఱుఁగఁదన్నిన యదువీర! మేల్కొనుము!

సుడిగాలి రక్కసు నుక్కంగఁ బట్టి
కెడపిన యదుబాలకృష్ణ! మేల్కొనుము!

ఆననంబునఁ దల్లి కఖిల లోకములు
పూని చూపిన యాది పురుష! మేల్కొనుము!

మద్దులఁ గూల్చి యున్మదవృత్తి మెఱయు
ముద్దుల గోపాలమూర్తి! మేల్కొనుము!

వరగర్వఘనబకవైరి! మేల్కొనుము!
ఖరధేనుకాసురక్రకచ! మేల్కొనుము!

అద్రిరూపంబైన యఘదైత్యుఁ జంపి
రౌద్రంబు మెఱయు భూరమణ! మేల్కొనుము!

చతురాననుఁడు వత్సనమితి దాఁచినను
ప్రతి యొనర్చిన పరబ్రహ్మ! మేల్కొనుము!

కాళియఫణి ఫణాంగణ నృత్యరంగ
లాలిత చరణవిలాస! మేల్కొనుము!

గురుతర గోపాల గోపికాయాస
తరణ! గోవర్ధనోద్ధరణ! మేల్కొనుము!

వనజాక్ష! అక్రూరవరద! మేల్కొనుము!
వినయ వాక్యోద్ధవ వినుత! మేల్కొనుము!

కోక లిమ్మన్నఁ, గైకోకున్నఁ బట్టి
చాకి వధించిన సరస! మేల్కొనుము!

చతుర మాలాకార శరణ! మేల్కొనుము!
అతుల కుబ్జామనోహరణ! మేల్కొనుము!

అరుదరుదనుచు నింద్రాదులు పొగడ
ద్విరదంబుఁ గూల్చిన ధీర! మేల్కొనుము!

జెట్టి పోరునఁ గిట్టి చీరి చాణూరు
చట్టలు వాపిన శౌరి! మేల్కొనుము!

శాసించు జగదేక శరణుండ! కాల
కంసుని తలగుండుగండ! మేల్కొనుము!

మానిత సామ్రాజ్యమందరి నుగ్ర
సేను నిల్పిన ధర్మశీల! మేల్కొనుము!

పరలోక గతుఁడైన బాలునిఁ దెచ్చి
గురున కిచ్చిన జగద్గురుఁడ! మేల్కొనుము!

ముర నరకాసుర ముఖ్య దానవులఁ
బొరిగొన్న యదురాజపుత్ర! మేల్కొనుము!

జలభేది భేదించి పారిజాతంబు
నిలకుఁ దెచ్చిన జగదీశ! మేల్కొనుము!

బాణ బాణాసనోద్భట భీమబాణ
పాణి ఖండన! చక్రపాణి! మేల్కొనుము!

రాజసూయమున శూరతఁ జైద్యుఁ దునిమి
పూజ లందిన జగత్పూజ్య! మేల్కొనుము!

ఇంపునఁ బృథుకంబు లిడిన కుచేలు
సంపన్నుఁ జేసిన చతుర! మేల్కొనుము!

సదమలానంద! నిశ్చలమూలకంద!
విదురుని విందు! గోవింద! మేల్కొనుము!

వీరకౌరవ సభ విశ్వరూపంబు
ధీరతఁ జూపిన దేవ! మేల్కొనుము!

కురుసైన్య విదళనాకుంతితోత్సాహ
భరిత! పాండవపక్షపాత! మేల్కొనుము!

చండభారతరణచాతుర్యధుర్య
గాండీవి సారథ్యకరణ! మేల్కొనుము!

దారుణ భూభార తరణావతార!
భూరిప్రతాపవిస్ఫురణ! మేల్కొనుము!

భోజ కన్యాముఖాంభోజ ద్విరేఫ!
రాజీవ నయనాభిరామ! మేల్కొనుము!

వరరూపవతి జాంబవతితోడి రతుల
నిరతిమై నోలాడు నిపుణ! మేల్కొనుము!

మంజుల సత్యభామా మనస్సంగ
రంజిత గాత్రసంరంభ! మేల్కొనుము!

లలిత కాళిందీ విలాస కల్లోల
కలిత కేళీలోల ఘనుఁడ! మేల్కొనుము!

తారుణ్య మిత్రవిందా కుచమధ్య
హార సంయోగవిహార! మేల్కొనుము!



చారు సుదంతా విశాలాక్షి కుముద
సార[ప్రభా పూర్ణచంద్ర! మేల్కొనుము!

భద్రా నఖాంకుర బాలచంద్రాంక
ముద్రిత కటితటీముకుర! మేల్కొనుము!

లక్షణా పరిరంభ లక్ష్మీతోదార
వక్షో విశాలకవాట! మేల్కొనుము!

శ్రీధర! గోపికాచిత్తాబ్జ భృంగ
రాధా మనోహర! రమణ! మేల్కొనుము!

వేడుకఁ బదియారువేల కామినులఁ
గూడి పాయని పెండ్లికొడుక! మేల్కొనుము

కలిత నక్రగ్రాహ గంభీర జలధి
వలయిత ద్వారకావాస! మేల్కొనుము!

అతుల గీతాసూక్తిహార! మేల్కొనుము!
ధృతమణి మకుట ప్రదీప్త! మేల్కొనుము!

జలదనీలశ్యామ! జగదభిరామ!
వెలయ మేల్కొను'మని విన్నవించినను.

## నిత్య వైభవము -- స్వామికొలువు

వీనులఁ గదిసిన విరికన్నుఁ దమ్మి
కొనలను నమృతంబు గురియ మేల్కాంచి

సరసిజాక్షుఁడు దేవ సంఘంబుమీఁదఁ
గరుణా కటాక్ష వీక్షణము నిగుడ్చి,

శ్రీ వేంకటాచల శిఖరమధ్యమున
సౌవర్ణమణిమయ సౌధంబు చెంతఁ

బూగ చంపక కుంద పున్నాగ వకుళ
నాగరంగ ప్రసూన విరాజమాన

తరులతా పరివేష్టితంబైన యట్టి
నిరుపమ కోనేటి నిర్మలాంబువుల

హరి మజ్జనంబాడి, హైమాంబరంబు
ధరియించి, దివ్యగంధము మేన నలఁది

నవరత్నమయ భూషణంబులు వెట్టి
వివిధ సౌరభముల విరులోలి ముడిచి

ధారుణీసురులకు దానముల్ చేసి
చేరి యక్షతలను శిరసునఁ దాల్చి

వినుతులు గావించు విబుధుల మునుల
మనవులు విని, వారి మన్నించి యునిచి

అగణిత రత్నసింహాసనాసీనుఁ
డగుచు మేరువుమీఁది యభ్రంబుఁ బోలి,

కరకంకణోజ్జ్వల క్వణనంబు లెసఁగ
సరసిజముఖులు వింజామర లిడఁగ

బంగారు గుదియలఁ బడవాళ్లు దొరల
భంగించి వడి బరాబరి సేయుచుండ

నారద వీణా నినాదముల్ చెలఁగఁ
జారణ సుర సిద్ధ సంఘముల్ గొలువ

నానాప్సరోమణీ నాట్యముల్ మెఱయ
మానవేంద్రులు మహామహులు సేవింప

ఘనతర నిత్య భోగంబులతోడ
నను దినంబును మహాహ్లాదంబు నిగుడఁ

గోరిన వారికిఁ గోర్కె లొసంగి
యీరీతి జగముల నేలుచునుండు.

## కృతికర్త -- ఆశంస

అని భక్తిఁ దాళ్లపాకన్నమాచార్య
తనయ తిమ్మార్యుండు తగఁ బ్రస్తుతించె

నేఁచి యీ కృతి ధరణీశుల సభల
నాచంద్ర తారార్కమై యొప్పుఁ గాత!!!

(గత సంచిక తరువాయి)

రామదూత దాటెను వార్ధి శ్రమము లేక
కపివరుడు మహేంద్రాద్రి డగ్గరిలు నపుడు
వేసె నొక మహానాద ముల్లాస మంది
ఉప్పరము గాంచ వనచరు లొక్క మొగిని.

మారుతి మహేంద్రగిరికి క్షేమముగ రాగ
వానరులు సముత్సాహసంపన్ను లగుచు
క్రందుగా "జే" యనంగ తా వందనాలు
హనుమ చెల్లించె వారల కమితభక్తి.

సంతసం బంది వచియించె అంతరాన
ఆంజనేయుడు వైదేహి కంజలించి
"వ్యోమపథమున చనుచుండ నొక్కచోట
అనుపమ నగంబు మైనాకు డడ్డువచ్చె.

అట్లు నా దారి కడ్డమై అడరు గిరిని
విఘ్నముగ నెంచి మార్కొన, ప్రియము మీర
మానుషాకృతి మైనాక మహీధరంబు
సాయ మొనరింప వచ్చిన జాడ దెలిపె.

# రావుల రామాయణము

'చూచితిని సీత" నని వాయుసుతుడు పలుక
ఎగిరి గంతులు వేసిరి ఎల్ల కపులు
ఆంజనేయుని కొనియాడె నంగదుండు
సముడె లేడంచు నతనికి శౌర్యమందు.

అనియె జాంబవంతుం "డహో! అనిలతనయ!
అప్రమేయమహాశక్తి నలరు హనుమ!
సీత నే రీతి గంటివో చెప్పుమయ్య!
తలపవచ్చును భావికర్తవ్య మపుడు."

అంగదుని జాంబవంతుని అరసి హనుమ
లంక గాంచిన తీరు కూలంకషముగ
చెప్ప సమయాన విస్మయచిత్తు లగుచు
కపివరులు కూరుచుండిరి విపులశిలల.

అద్రి వీడ్కొని పయనించునట్టి వేళ
కామరూపిణి సురస నా కంట బడియె
నన్ను మ్రింగ దలంప ఆ నాగమాత
సూక్ష్మరూపాన నోటను జొచ్చినాడ.

వెలది తన నోటినుండి నే వెలువడంగ
చూచి ఆశీర్వదించెను శుభ మెసంగ;
అబ్ధిజలముల నుండి భయంకరముగ
మింటి కెగసి సింహిక నన్ను మ్రింగజూచె.

భీమరాక్షసి నొనరించి పిండి పిండి
అమరుల ప్రశంస ముదముతో ఆలకించి
వారిధి తరించి అవలీల చేరి లంక
అరసినాడ కుబేరు విఖ్యాతపురము.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి

'చంద్రశేఖర్'

రాక్షసేశ్వర పాలిత రమ్యనగరి
రక్షసేయు లంకను గెల్చి రాత్రివేళ
ఘోరరావణు పురిలోన వెదకి తుదకు
శింశుపావృక్ష సన్నిధి సీతగంటి.

మలినసంవీత అతిదీన నెలత సీత
అతిశయంబగు శోకంబు నంది కుంద
కాంచితి అశోకవనిని రాక్షసవిభుండు
చంపుటకు గడువీయ మాసద్వయంబు.

రామభద్రుండు ధర్మసంరక్షకుండు
జయము గాంచు నటంచు త్రిజట వచించె;
అవనిజకు రాము నంగుళీయక మొసంగ
రామునకు సీత నిజ శిరోరత్న మిచ్చె.

సమరకాంక్షతో వనము నాశంబు చేయ
ఘోరరూపుల రాక్షసవీరవీరుల
పంప నాపైకి దైతేయవల్లభుండు
పరిఘతో చంపినాడను పనలు పెట్టి.

అంత బంధించె నన్ను బ్రహ్మాస్త్రమహిమ
బలయుతుం డింద్రజిత్తు రావణసుతుండు;
రామదూతగ తెలిపియు రావణుండు
అల్పబుద్ధితో నను జంప ఆజ్ఞచేసె.

తమ్ముడు విభీషణుండను ధార్మికుండు
నీతి కాదని వచియించె దూత జంప;
త్రిప్ప దైత్యులు తోకకు నిప్పుపెట్టి
కాల్చివేసితి పురమెల్ల కరుణవీడి.

అవనిజనె కాదు కాల్చ దయ్యగ్ని నన్ను
మరల జానకి గని అనుమతిని పొంది
తీవ్రవేగాన వారాశి తిరిగి దాటి
చేరితిని; కార్యసరణి యోచింప దగును.

ఒక్కడనె చాలుదు విరోధి నుక్కడంప
జాంబవంతు డైనను వాని జంపివేయు
అంగదకుమారు డేనియు హత మొనర్చు
కపు లిరువు రోపుదురు వైరి గండడంప.

అతులితబలుండు శ్రీరాము డలరుగాత!
అమితబలుడగు లక్ష్మణుం డలరుగాత!
అతిబలుండైన సుగ్రీవు డలరుగాత!
పవనపుత్రుడ రామసేవకుడ నేను.

దుఃఖములు దైత్యకాంతల దూషణములు
పైపగా సాధ్వి కేరీతి శక్య మగును?

బయలుపడుటకు రావణుబారినుండి
సీత ప్రాణాలు త్యజియింప సిద్ధపడియె.

శోకదేవతగా మారె సుదతి సీత;
మహిత రామసుగ్రీవుల మైత్రి దెలిపి
ఊరడించితి నెట్టెట్లొ మీర లింక
సిద్ధపడుడయ్య కార్యసంసిద్ధికొఱకు."

"సీతతో రాముదర్శింప శ్రేయ" మనుచు
వాలిసుతు డభిప్రాయము వ్యక్తపరచె
విషయ మెరిగించి రాము నభీష్టసరణి
నడువ దగునని జాంబవంతుడు వచించె.

ఆత డనినట్లు రఘురాము నరయ దలచి
సమధికోత్సాహభరితులై సాగుచున్న
వానరులు దారిలో మధువనము కనిరి
రాజమాతులుచే అభిరక్షితంబు.

తేనియలు గ్రోల వేడగ వానరాళి
ఆంజనేయుడు వారి కిట్లభయ మొసగె
"రామకార్యము సిద్ధించె క్షేమమయ్యె
తనివి తీరగ మధువును త్రావుడయ్య."

వనట దధిముఖు డుద్యానపాలకుండు
"ధ్వంస మొనరించిరి కపులు వని"నటంచు
విన్నవింప సుగ్రీవుడు వేడ్కనతని
పలుకులకు సంతసిల్లె కోపంబుగనక.

"దధిముఖా! కార్యసఫలత దలతు నేను
లేనిచో చేయ రట్టులు వానరాళి
హనుమ సాధింపలేని కార్యంబె లేదు
వారలను వేగిరమె చూడ గోరుచుంటి."

మధువనికి బోయి వచియించె దధిముఖుండు
అంగదుని గాంచి భక్తితో అంజలించి
"రాజు సుగ్రీవు డిపుడు మీ రాకకొరకు
వేచియున్నాడు శీఘ్రమే వెడలుడయ్య."

నమ్రుడై అంగదుండు వానరుల కనియె
"మీకు కృతకృత్యులకు చెప్ప నాకు దగునె?
ఇపుడు సుగ్రీవు సన్నిధి కేగదగును;"
అనిన వారెల్ల యువరాజు నాజ్ఞ చనిరి.

ప్రస్రవణగిరి జాయావిరహ నిమగ్ను
రాము గాంచి సుగ్రీవు డూరడిల జేసె
"కలికి జానకి ప్లవగులు కానకున్న
గడువు దాటిన పిదప నా కడకు రారు.

మనసు రంజిల్ల జేయు నా మధువనమ్ము
పాడొనర్ప సహింపడు వాలిసుతుడు
దనుజసంఘ విరామ! కోదండరామ!
కరువలిసుతుండు సీతను గాంచియుండు."

శుభఫలావాప్తికి ప్రకృష్ట సూచనముగ
కిలకిలార్భటి తొలుత సుగ్రీవు జేరె;
వచ్చి రచటికి కొంతసేపటికి వారు
అగ్రభాగాన నిలుచుండె అంగదుండు.

ఆంజనేయుడు రాముని కంజలించి
శిరము వాలిచి "కంటిని సీత నేను
కంటి దేవిని కనులార గంటి" ననగ
మారుతి గనె రాముడు బహుమానదృష్టి.

అడిగె శ్రీరామచంద్రుడు హనుమ జూచి
"ఎచట నున్నది వైదేహి? ఎట్టులుండె
ఆమె భావంబు నాపట్ల? ఆంజనేయ!
విపులముగ నీవు చెప్పుమా వినగ వలతు."

సీత దలచి శిరము వంచి చెప్పె హనుమ
"అబ్ధి శతయోజనాయత మ్మట్టె దాటి
చొచ్చి శోధించి రావణాసురుని పురము
అవనిజను గంటి నే నశోకాంతరమున.

నన్ను నమ్మె మీ కులమును సన్నుతింప;
దైత్యపీడ కడుంగడు దాపురింప
మరణ మొక్కటె తన కిక శరణ మంచు
నిర్ణయంబును గైకొన్న నెలత గంటి.

నీవు పెంపొందితి వని సుగ్రీవుమైత్రి
రామదూతగ చెప్పి సర్వంబు నేను
నీదు ముద్రిక నిచ్చితి నెమ్మితోడ
ముదమునందె కడుంగడు ముదిత సీత.

రమ్యమైన చూడామణి రమణి యిచ్చి
చిత్రకూట వాయసకథ చెప్పు మనియె;
కోరె మణిశిలాతిలకమ్ము గుర్తుచేయ
నెలకు మించి బ్రదుక నని తెలుపు మనియె."

శోకమంది చూడామణి చూచినంత
రామచంద్రు డనియె మణిరత్న మిద్ది
శక్రు డిచ్చె మా తండ్రికి సరసమైత్రి
తండ్రి సీతకు నిచ్చె ఉద్వాహవేళ.

(సశేషం)

# సంకీర్తనల్లో సప్తగిరీశుడు

వివా వేంకటేశం నవాథో నవాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ.



అంటూ కళ్యాణమూర్తిగా వెలసిన తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామిని తలుచుకోనివారుండరు. వివిధమైన భక్తిమార్గాల ద్వారా అందులోను దైవదత్తమైన 'సంగీత మార్గాన్ని' ఎన్నుకొని ఆ బాటలో భగవంతుణ్ణి ధ్యానించి అయనను చేరిన పరమభక్తశిఖామణులైన సంగీతవాగ్గేయకారులెందరో ఉన్నారు.

**శ్రీమతి ద్వారం వి.జె. లక్ష్మి**

శ్రీస్వామివారిని తమ సంగీత (రచనా) మాలలతో అలంకరించిన వాగ్గేయకారులెందరో జన్మించారు. ఈ వాగ్గేయకారులు. వివిధరకాలైన కీర్తనలతో స్వామివారిని కీర్తించారు.

ఆళ్వారులు -- పాశురాలతో, అన్నమాచార్యుడు -- సంకీర్తనలతో, పురందరదాసు మొదలైన దాసకూటమికి చెందినవారు దేవరనామాలతో సంగీత త్రిమూర్తులు త్యాగరాజస్వామి ముత్తుస్వామి దీక్షితర్ శ్యామాశాస్త్రి -- కృతులతో, కీర్తనలతో కీర్తించారు.

రామస్వామి దీక్షితర్, స్వాతి రామస్వామి దీక్షితర్, సుబ్బరాయశాస్త్రి, మానాంబు చావడి వేంకటసుబ్బయ్యర్, రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, వీణ కుప్పయ్యర్, తిరువొత్తియూర్ త్యాగయ్యర్, ముత్తయ్య భాగవతార్, పాపనాశం శివన్, మైసూరు వాసుదేవాచార్, మైసూరు సదాశివరావు, ధర్మపురిసుబ్బరాయర్, వీణ శేషన్న, పల్లవి గోపాలయ్యర్, తిరుపతి నారాయణస్వామి, మొదలైనవారు వర్ణం, కృతి, పదం,

సప్తగిరీశుడు సంగీతప్రియుడు. "కౌసల్యా సుప్రజారామా!....." అంటూ ప్రతిరోజు మేల్కొల్పులు పాడించు కోవటమేకాక "జో అచ్యుతానంద జోజో......" అంటూ జోల పాడించుకుంటూ ప్రతిరాత్రి యోగనిద్ర-కుపక్రమిస్తూ వున్నాడు తిరుమల గోవిందుడు. ఇలా గాన ప్రియుడైన శ్రీనివాస పరంధాముని గురించి ఆళ్వారుల దగ్గర నుంచి ఎందరో గానం చేశారు. మరెందరో కీర్తించారు... సంకీర్తనల్లో, పదకవితల్లో కీర్తింపబడిన సప్తగిరీశుని గూర్చి సంగ్రహంగా తెలియజేసే ఈ వ్యాసం అక్టోబరు 5 నుంచి జరుగుతున్న బ్రహ్మోత్సవాల సందర్భంగా ప్రచురిస్తున్నాం.

సం॥

జావళీ, తిల్లానాలనే వివిధ సంగీత రచనాసుమాలతో స్వామిని ఆరాధించారు.

వాగ్గేయకారుల జీవితాల్లో స్వామిని సందర్శించిన సంఘటనలు, కష్ట సమయాల్లో స్వామి వారందరినీ ఆదుకొన్న సంఘటనలు ఎంతో హృద్యంగా నిలిచాయి.

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అన్నమాచార్యులు చిన్ననాటనే ఇల్లువదలి స్వామిని దర్శించాలనే కాంక్షతో స్వామి వారికొండనెక్కుతూ దారిలో సొమ్మసిల్లగా, అలమేలుమంగమ్మ తానే స్వయంగా వచ్చి భోజన సదుపాయం చేసి, ఆ బాలుడు అలసిపోకుండా కాపాడారట! అన్నమయ్య స్వామివారి సేవలోనే తన జీవితాన్ని గడుపుకున్న భాగ్యశాలి. ఆయన నాడు స్వయంగా ప్రతిదినమూ చేయించిన 'కళ్యాణోత్సవాల సేవ' ఈనాటికీ, ఎప్పటికీ చిరస్థాయిగా నిలిచివుంది వుంటుంది. నేడు కూడా అన్నమాచార్యుల వారి తరువాతి తరాలవారు సంప్రదాయంగా వంశపారంపర్యంగా ఆ సేవలో పాల్గొంటున్నారు. ఇది అన్నమయ్య చేసుకున్న పుణ్యం, ఆ వంశం వారి భాగ్యఫలం. శ్రీ స్వామివారి, శ్రీఅమ్మవారి దేవాలయాల్లో 'ఊంజల్ సేవా' సమయాల్లో అన్నమయ్య కీర్తనలు గానం చేసే సంప్రదాయం నేటికీ ఉన్నది. 32,000 సంకీర్తనలతో స్వామిని కొలిచిన అన్నమయ్య వాగ్గేయకారముద్ర 'వేంకటేశ', 'వేంకటాద్రి', 'వేంకటాచల' వంటి 'వేంకట' ముద్రలతో కన్పట్టుతుంది.

జన బాహుళ్యంలో సుపరిచితాలైన అన్నమయ్య కీర్తనలు కోకొల్లలు.

'కొండలలో నెలకొన్న కోనేటిరాయుడు వాడు', 'అదివో అల్లదివో శ్రీహరివాసము', 'నారాయణతేనమోనమో', 'ఎంతమాత్రమున నెవ్వరు తలచిన', 'ఇతనికంటె ఘనులిక లేరు'--ఇలా వందలాది కీర్తనలు సుప్రసిద్ధాలు.

ప్రత్యేకంగా బ్రహ్మోత్సవాలు వర్ణింపబడిన ఈ అన్నమయ్య కీర్తన ఎంత హృద్యంగా వుందో గమనించండి!

తిరువీధుల మెరసీ దేవదేవుడు
గరిమల మించిన సింగారములతోడను॥

తిరు [illegible]పై వేగి దేవుడిదే తొలినాడు
సిరుల రెండవనాడు శేషుని మీద
మురిపేనామూడోనాడుముత్యాలపందిరి క్రింద
తొలి నాలుగోనాడు పూవు కోవెలలోనూ॥

గ్రక్కున ఐదవనాడు గరుడునిమీద
ఎక్కెను ఆరవనాడు ఏనుగుమీద
చొక్కమై ఏడోనాడు సూర్యప్రభలోనను
ఎక్కెను తేరును గుఱ్ఱమెనిమిదోనాడు॥

కనకపుటందలము కదిసి తొమ్మిదోనాడు
పెనచి పదోనాడు పెండ్లిపీట
ఎనసి శ్రీవేంకటేశుడింతి అలమేల్మంగతో
వనితల నడుమనూ వాహనాల మీదనూ॥

అన్నమయ్యనోట - ప్రతికీర్తన ఒక ఆణిముత్యంగా వెలువడింది. శ్రీవారి, అమ్మవారి కృపాకటాక్షాలవల్ల శృంగార, అధ్యాత్మ, తత్త్వాలతో ఈ కీర్తనలు భాసిల్లాయి.

'కర్ణాటక సంగీత పితామహుడిగా', 'ఆది గురువు'గా సంగీత ప్రపంచంలో చిరస్థాయిగా నిలిచిపోయిన పురందరదాసు 4,75,000 కీర్తనలతో భగవంతుణ్ణి కొలిచిన దాస చక్రవర్తి. ఈయన రచనలను 'దేవరనామాల'నీ, 'పదగళు' లనీ అంటారు.

దురితవ్రాత లెల్లను బరిమాల్పెడి
హరిగుణములబాడుచు నెపుడున్
బరవశుడై వెలయు పురం
దరదాసుని మహిమములను దలచెద
మహిలోన్.

పురందరదాసు గొప్పతనాన్ని గూర్చి 'ప్రహ్లాద భక్తివిజయం' అనే రచనలో త్యాగరాజస్వామి చెప్పిన మాటలివి.

వేంకటేశ్వరుని సేవించి, వరప్రసాదంగా కల్గినందువల్ల పురందరదాసుకు తల్లిదండ్రులు 'వరదప్ప శ్రీనివాస' అని నామకరణం చేశారట. 'తిమ్మప్ప', 'శీనప్ప', 'తిరుమలయ్యప్ప' అని కూడా పిలుస్తుండేవారు.

యుక్తవయస్సులో శీనప్ప కోట్లాది ధనాన్ని ఆర్జించి మిక్కిలి పిసినారిగా ఉండేవాడు. ఈయన భార్య సరస్వతీబాయి గొప్పనలు కలిగిన వ్యక్తిత్వాలు ఆధ్యాత్మిక చింత భగవంతుడు మెచ్చి శీనప్పకు కనువిప్పు కల్గి స్తాడు. అప్పటినుండి భగవద్దాసుడై 'పురం దరదాసు'గా 'భక్తితత్త్వాన్ని' తన రచనల ద్వారా ప్రజానీకానికి అర్థమయ్యేటట్లు ప్రచారం చేశాడు. ఈయనను నారదాంశ సంభూతుడిగా భావిస్తారు. వీరి దేవరనామాలలో ఒకటి.

వేంకటాచల నిలయం వైకుంఠ పురవాసం
పంకజనేత్రం పదమపవిత్రం శంఖచక్ర ధర
చిన్మయరూపం॥

అంబుజోద్భవ వినుతం అగణితగుణధామం
తుంబురు నారద గాన విలోలం॥

ఇటువంటిదే----

పన్నగాద్రిపతి నమగె నీ గతి
ఎంబువ మతి యరితు ఈ స్థితి॥

వైకుంఠవాస వరమందహాస భక్తరుల్లాస
లక్ష్మీవిలాస మానవ వేష మంజుళ భాష
విమత విశేష కౌస్తుభ భూష॥

శంకిసుతిరలు సాకువభావ
సంఖ్యెయు బల్ల పురందర విఠల॥

'పన్నగాద్రివాస! నీవేగతియని మదిలో నమ్మినాను. లక్ష్మీరమణ! భక్తవరద! మందహాస! వైకుంఠవాస! మానవవేష! తేనెవలె పలుకు కౌస్తుభాభరణుడగు నిన్ను స్మరించుచుండగా పురందర విఠలుడవగు నీకే నన్ను కాపాడుట తెలియును'.

సంగీత త్రిమూర్తులలో మొదటివాడైన త్యాగరాజస్వామి కూడా శ్రీవేంకటేశ్వరుని గూర్చి గానంచేసిన మధుర సంఘటన ఉన్నది.

తన శిష్యులతోకూడి త్యాగరాజస్వామి తిరుపతివచ్చి, ఏడుకొండలూ ఎక్కి, స్వామి వారి దర్శనానికి వచ్చిన సమయానికి తిరువారాధనకో, ఆరగింపువేళయౌట వల్లనో, తెర వేయబడినదట! త్యాగరాజస్వామి బాధతో, శ్రీవారిని చూడాలనే తపనతో, ఆలస్యమే మాత్రమూ భరించలేక, 'ఓస్వామీ! తిరుపతి వేంకటరమణా! నాలో మత్సరమనే తెరను

(29వ పేజీలో)

# సందేహాలు? సమాధానాలు!

నిర్వహణ: ఎల్లోరా

ప్రశ్న :

పూర్వకాలంనుంచీ మన ఇళ్లలో జరిగే వివాహాలలో కొన్ని సంస్కృత మంత్రాలు చదువుతూ - 'నాతిచరామి', 'నాతి చరితవ్య' అనే కొన్ని సంస్కృత సూక్తుల్లాంటివి చెబుతుంటారుకదా! ఏమిటి వీటి అర్థం? ఆ సూక్తులూ, వాటి అర్థాలూ చెబుతారా?

సమాధానం

సంప్రదాయబద్ధంగా పూర్వం జరిపే వివాహాలలో పెళ్లినాటి ప్రమాణాలవంటివి దాంపత్యంలో అనుమానాలూ, ఆటంకాలూ లేకుండా ఆ జంట మధ్య ప్రేమపారిజాతాలు విరిసి విప్పారడంకోసం కొన్ని సూత్రాలను నిబద్ధీకరించారు. ఇవి హృదయమంత్రాలు! ధర్మసూత్రాలు!

ధర్మేత్వయా

ఏషా నాతిచరితవ్యా

అంటే ధర్మాన్ని అనుసరించేటప్పుడు నీవు ఈమెను అతిక్రమించి చరింపరాదు దానికి బదులుగా - 'నాతి చరామి' అంటే అతిక్రమించడం గాని, ధర్మాన్ని తప్పడంగాని చేయను.

అర్థేత్వయా ఏషా

నాతి చరితవ్యా

అర్థాచరణమున నువ్వు భార్యను అతిక్రమించి నడవరాదు.

నాతి చరామ - అతిక్రమించను

కామేత్వయా ఏషా

నాతి చరితవ్యా

ఆమెతో నీవు కామాచరణ సమయంలో అతిక్రమించరాదు.

నాతి చరామి

అటువంటి సమయంలో అతిక్రమించి చరించను.

ప్రశ్న :

రాముడు దేముడైతే మాంసభక్షణ నేరం కాదా?

--జి. పెద్దిబొట్లు, మాచవరం.

సమాధానం

మీరు వాల్మీకి రామాయణాన్ని ఆధారం చేసుకొని ప్రశ్నిస్తున్నారు. సీతారామ లక్ష్మణులు అరణ్యవాస సమయంలో వేటాడి మాంసభక్షణ చేసినట్లు చెప్పడం గురించికదా మీప్రశ్నలోని అంతరార్థం.

మీ ఆలోచనలో దేముళ్లు, మాంసభక్షణ చేయరాదని అనుకుంటాను.

దేవుడు ఒక మతానికి, జాతికీ లేదా ఆచారానికి సంబంధించినట్లుగా భావించ రాదు.

దేవుని అంశ ఏ వర్గంలోవున్నా మానవ శరీరరూపంలో దిగి రావచ్చు-- అలాటి క్రమాన్నే అవతారం అంటున్నాం. దేవుళ్లు అవసరాన్నిబట్టి జంతువుల రూపం ధరించింది దైవాంశచేతనే కదా?

రాముడు క్షత్రియవంశంలో జన్మించాడు. క్షత్రియులకు వేట, మాంసభక్షణము వారి ఆచార సంప్రదాయాలు. అందుకే రాముని ఆహార విహారాలు అలా జరిగాయి. ఇందువలన రాముని దైవత్వానికి, శక్తులకు ఏం అడ్డు రాలేదు కదా?

ఇంతకీ అవతారపురుషుడైన రాముడు ఏం తిన్నాడన్నది కాదు ముఖ్యం-- ఏం చేశాడు? ఏం సాధించాడన్నదే ప్రధానం

ప్రశ్న :

సప్త ఋషుల పేర్లు, వారి భార్యలపేర్లూ తెలుపగలరా?

డి. సర్వేశ్వరరెడ్డి, దందేకొండ.

సమాధానం

మనువులు 14 మంది-- చతుర్దశ మనువులు. సప్త ఋషులు ఒక్కొక్క మనువు కాలంలో మారుతూ వుంటారు. ప్రస్తుతం జరుగుతూ వున్నది వైవస్వత మన్వంతరం!

దీని ననుసరించి ఇప్పటి సప్త ఋషులు వీరు.

1. కశ్యపుడు -- భార్యలు అదితి, దితి మొదలైన 13 గురు.
2. అత్రి -- భార్య అనసూయ.
3. భరద్వాజుడు -- భార్య వీర.
4. విశ్వామిత్రుడు -- భార్య పేరు ఎచ్చటా కనపడ్డం లేదుకాని మేనకతో సంబంధం సుప్రసిద్ధం.
5. గౌతముడు -- భార్య అహల్య.
6. జమదగ్ని -- భార్య రేణుక.
7. వశిష్ఠుడు -- భార్య అరుంధతి.

ప్రశ్న :

దేవతలు ఉన్నారని పురాణాల్లోనూ, వేదాల్లోనూ వివరించారుకదా! దేవతలంటూ వుంటే ఎవరికైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా కనిపించారా? ఇంతకీ ఈ దేవతలనేవారు ఎక్కడున్నట్లు?

సమాధానం

చూడండి! మనిషి వినిపించడు -- మనసు కనిపించదు.

చూడడం, వినడం, అనుభవించడం-- ఒకటికాదు సరికదా-- ఒకటే అనుకోడం పొరపాటు.

ఈ 'కనబడటం' అనే దానిని రెండుగా విభజిద్దాం! ఒకటి కంటికి వస్తు రూప రంగు, విస్తీర్ణ రూపాలలో మాత్రమే తెలుస్తుంది. అలాగే రెండవది-- కనబడ్డదానిని బట్టి అంచనా వేయడం-- గ్రహించడం అన్న మాట. అంటే దీనిని బట్టి మిగిలిన విషయాలన్నీ కనబడతాయి.

దేవతలు కూడా ఇంతే. ఉదాహరణకు : ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటూన్నారనుకొందాం. వారికి కనిపించేది ఏమిటి ఒకరి శరీరాలు ఒకరికి కనిపిస్తాయి. మనష్యులు కనబడరు-- శరీరమంతా వ్యాపించి వుంటారు ఇక్కడ మనం గమనించవలసింది మనం మాట్లాడేది మనష్యులతోనే గాని శరీరాలతో కాదని.

మనుష్యులు శరీరాల్లో ఎలా కనబడకుండా వుంటారో దేవతలుకూడా అన్ని వస్తు గుణ విషయాలలోనూ కనపడకుండానే వారి వారి పనులను వాళ్లు నిర్వర్తిస్తూ - కర్తవ్యతా నిర్వహణను కొనసాగిస్తూంటారు.

మనలోని శక్తులను నడిపేవాడుండాలి కదా? అంటే ప్రజ్ఞ కావాలి.

ఒక్కమాటలో చెప్పాలంటే-- మనలోవి ప్రజ్ఞలను నడిపించేవాడు-- అతడే దేవత!

# శ్రీ కొల్లూరు మూకాంబికాలయం



శ్రీ చక్రాంకిత బిందు మధ్యనిలయాం
పీతాంబరాలంకృతం
శంఖం చక్రవరాభయం చ దధతీం
బాలేందు మౌళిం శుభాం
సింహస్యోపరి సంస్థితాం త్రినయనాం
మూకాసురచ్ఛేదినీం
శ్రీకోలాపుర వాసినీం భగవతీం ధ్యాయామి
మూకాంబికామ్॥

అంటూ శంకర భగవత్పాదులచే ప్రస్తుతింపబడిన ఆదిశక్తి వెలసిన దివ్యక్షేత్రం కొల్లూరు మూకాంబికా క్షేత్రం.

కర్ణాటక రాష్ట్రంలోని దక్షిణ కన్నడజిల్లాలోని కొల్లూరు అత్యంత రమణీయ ప్రాంతం. ప్రశాంతవాతావరణముగల ఈ క్షేత్రం ఆధ్యాత్మిక ఉపాసనకు, శ్రీవిద్యోపాసకులకు కేంద్రముగా ప్రసిద్ధమైనది.

ఈ క్షేత్ర ప్రశస్తిని గురించిన గాధలెన్నో వున్నాయి. ప్రాచీన కాలంలో కోల మహర్షి ఈ క్షేత్రమున తపస్సు చేశాడట! సంతుష్టుడైన పరమేశ్వరుడు ప్రత్యక్షమై, భక్తుని అభీష్టమేమో తెలుపమన్నాడట. 'పరమేశ్వరా, లోకకళ్యాణార్థమై నీవు సదా ఇక్కడే వుండవలసినదని అర్థించాడట. అందుకు సమ్మతించిన భగవానుడు, 'ఓ భక్తాగ్రణీ, నీకోరికమేరకు, ఈ క్షేత్రము పరమపవిత్రమై సిద్ధిదాయక మగునన్నాడట. అయినా కోల మహర్షికొక పార్థివలింగమును ప్రసాదించాడట. ఆ లింగమును పూజించుటవల్ల, ఆదిమహాలక్ష్మి ప్రత్యక్షమై ఈ క్షేత్రములో నివాసమేర్పరచు కొనునని ప్రకటించాడట. అప్పటినుండి ఈ క్షేత్రమునకు కోలాపురి అనుపేరు ప్రాచుర్యమైనదంటారు.

అసురగురువైన శుక్రాచార్యులచే మంత్రోపదేశమందుకున్న, కంహాసురుడు అను రాక్షసుడు మహాభైరవిని ఆరాధించి, పురుషులచే మృత్యువుకు గురికాకుండునట్లు వరము పొందాడట. కంహారుడు తన గురువైన శుక్రాచార్యులకు కోలాపురిలో ఒక ఆశ్రమము నిర్మింపచేశాడట. ఆదైత్యరాజు విజృంభించి ఇంద్రాది దేవతలను జయించి, ఆ క్షేత్రములో ఎవ్వరూ ప్రవేశింపకూడదని ఆదేశించాడు.

**శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

కోలమహర్షి, కంహాసురుని బాధలకు తాళలేకపోయాడు. సమీపంలోని కోటవాద్రిలో తపస్సు చేయసాగాడట దేవతలు త్రిమూర్తులను శరణువేడగా త్రిమూర్తులు, తమశక్తులను ఏకంచేసి భైరవిని సృష్టించి కంహాసురుని వధించునట్లు ఆదేశించారట. దేవి యుద్ధసన్నద్ధమై, కంహాసురుని ఎదుట నిలిచి 'రాక్షసా, పురుషులచే చావులేకుండా వరము పొందినందున, పరాశక్తిరూపిణిగా, నీవద్దకు వచ్చాను. నీతో యుద్ధము చేయను. నీ కోరికమేరకు అమరత్వం కొరకు తపస్సు చేయుము' అని అంతర్హితురాలైనదట.




కంహాసురుని సోదరి అయిన మయ అను దైత్య స్త్రీ కుమారుడే మహిషాసురుడు. దేవి చాముండేశ్వరియై, భక్తుల అభీష్టం మేరకు మహిషాసురి వధించిన స్థలము కొల్లూరుకు చేరువగా వున్నది.

కంహాసురుడు ఘోర తపస్సు తర్వాత పరమేశ్వరుణ్ణి సాక్షాత్కరింప చేసుకున్నాడు. రాక్షసు డే వరమును కోరునో అని దేవతలందరూ భయపడ్డారు. శ్రీదేవి వాగ్దేవియై కంహాసురునికి మాటలు లేకుండా చేసినదట. పరమేశ్వరుడు కంహాసురుణ్ణి వరము కోరుకోమన్నాడట. మాటలు రానందున కంహారుడు మూకాసురుడైనాడట. చివరకు మహాశక్తిచే మరణం చెందినాడట. చివరికా రాక్షసుడు దేవిని ప్రార్థిస్తూ ఆమెను ఆశ్రయించాడట. ఆమె అనుగ్రహంతో మరల మాటలాడ సాగాడట. తన పేర, శ్రీమాతను మూకాంబికాదేవిగా, ఆ క్షేత్రంలోనే వుండమని అర్థించాడట. దేవి అనుగ్రహించింది. శ్రీదేవి మూకాంబికాదేవిగా విఖ్యాతిగాంచినదట.

పరమశివుడే అచ్చట శ్రీ చక్రమును చెక్కినాడట. ఆదిశక్తి భక్తాభీష్ట ప్రదాయినియై వెలసింది.

ఆది శంకరులు మూకాంబికా దేవిని స్తుతిస్తూ శ్లోకములు రచించారు.

కొల్లూరు క్షేత్రములో అయిదు నదులున్నాయి. వాటిలో ప్రధానమైనది, సౌపర్ణికా నది. సమీపంలోనే శుక్ల తీర్థం గోవిందతీర్థం అను పుణ్య తీర్థములున్నవి.

కొల్లూరు మూకాంబికాలయ ప్రాంగణములో సుబ్రహ్మణ్యస్వామి, ప్రాణ లింగేశ్వర,

పంచముఖ గణపతి, క్షేత్ర పాలకుడైన వీరభద్రస్వామి ఆలయాలున్నాయి.

ప్రతిదినము మూడువేళలా సంప్రదాయ పద్ధతిలో అర్చనలు జరుగును. లలితకళోపాస కులు తమ కళాభిజ్ఞతను దేవి సముఖమున ప్రదర్శించటం పరిపాటి. ప్రసిద్ధ చిత్రకారుడు రాజారవివర్మ, సంగీత కళానిధి చెంబై వైద్యనాథ భాగవతార్, నాట్య కళాకోవిదుడు గురుగోపనాథ్ దేవి అనుగ్రహమును పొంది నవారే.

ఈ క్షేత్రము పడమటి కనుమలలో అరణ్యము మధ్యనున్నప్పటికీ, రాకపోక లకు సౌకర్యములున్నవి. మంగళూరులో షిమోగా, సాగర పట్టణములనుండి బస్సులలో ప్రయాణం చేయవచ్చు. యాత్రికులకు దేవాలయ సత్రములలో వసతి లభిస్తుంది. దేవతార్చనకు నియుక్తులైన 16 మంది అర్చకుల ఇళ్ళలోకూడా యాత్రికులు విశ్రమించి భోజన సౌకర్యములు పొందవచ్చును.

కొల్లూరుకు 10 కిలోమీటర్ల దూరంలో దేవి మూకాసురుని సంహరించిన ప్రదేశము న్నది. దీనిని మారణస్థల (కట్టె) అంటారు. ఇక్కడ మూకాంబికా రథోత్సవం మార్చి నెల చివర వైభవంగా జరుగును.

పరశురామ క్షేత్రంగా ప్రశస్తిగాంచిన పడమటి కనుమల ప్రదేశం దక్షిణ కన్నడ జిల్లాలోని సప్తమహాక్షేత్రములుగా క్రిందిస్థలములు ప్రసిద్ధమైనది.

1) ఉడుపి 2) శంకరనారాయణ 3) కోటేశ్వర 4) కుంభాసి ఉద్భవ గణపతి 5) గోకర్ణము ఆత్మలింగదర్శనం 6) కుక్కె సుబ్రహ్మణ్యం 7) కొల్లూరు మూకాంబికా క్షేత్రం.

భారతదేశమందలి 18 శక్తిపీఠములలో ఒకటిగా ప్రశస్తి నార్జించిన దీ క్షేత్రం.

'శ్రీ కోలాపుర వాసినీం భగవతీం ధ్యాయామి మూకాంబికాం'





సరస్వతి నమస్తుభ్యమ్ వరదే కామరూపిణీ
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతిమేసదా!
(అక్టోబరు 11 సరస్వతీపూజ సందర్భంగా)

# బ్రహ్మాండ నాయకుని బ్రహ్మోత్సవాలు

భక్తానుకంపీ గరుడధ్వజస్తత్-
స్కంధం సమారుహ్య కిరీటకుండలీ
పీతాంబరశ్చారు సుమందహాసః
శ్రీ కౌస్తుభశ్చక్ర వరాఽభయాంకితః

ఆ దేవుడు భక్తులందరి మీదా ఎల్లప్పుడూ చాల దయ కలిగి వుంటాడు! ఆ దేవదేవుడు భక్తసంరక్షణలో తనకు సాటి ఎవరూ లేరంటూ గరుడకేతనాన్ని ఎగుర వేస్తాడు! సర్వజగన్నియామకుడైన దేవాది దేవుడు ఆశ్రితరక్షణలో అహరహం అప్రమత్తంగా వుంటూ గరుడునిపై విహరిస్తూ వుంటాడు! ఇంకా ఆ పరంధాముడు తేజో విరాజమానములైన పట్టు పీతాంబరాల్ని రత్న కిరీటకుండలాల్ని, కౌస్తుభమణిని శంఖ చక్రాలను ధరించి, కటి వరద హస్తాలతో నిలిచివుండి భక్తుల కోసం ఎదురు చూస్తూ చెరగని చిరుమందహాసంతో ఆహ్వానిస్తూ వుంటాడు! సర్వ సంపత్ప్రదాత అయిన ఆ పరమాత్మ ఎప్పుడూ తన దగ్గరే, తనహృదయం మీదే మహాలక్ష్మిని నిలుపుకొని తన భక్తులను సకల సంపన్నులనుగా చేస్తూవుంటాడు!!

మరి! ఇలాంటి దేవుడూ, మొక్కిన వెంటనే కొండలంత వరాలను గుప్పించెడి దేవుడూ, ఆశ్రితరక్షకుడూ ఆపద్బంధువూ అయిన దేవుడు ఎక్కడైనా వున్నాడా! అంటే ఎక్కడా లేదు! లేదు! లేనే లేదు!-- అనే మాట ఘంటాపథంగా అంతటా వినవస్తున్నది! ఈమాట నిజమే! నిజమే!

కాదు కాదు! అది పొరపాటు మాట! అలాంటి దేవుడు వున్నాడయ్యా వున్నాడు! నిండుగా వున్నాడు! దండిగా వున్నాడు! అలాంటి భక్తవత్సలుడు, పరమదయానిధి అయిన దేవదేవుడు ఒక్కడే ఒక్కడు! ఒకే ఒక్కచోట మాత్రమే ఉన్నాడు! ఎక్కడో కాదు! కనపడని ఏ లోకంలోనో కాదు. ఇక్కడే! ఆధ్యాత్మిక సుక్షేత్రమయిన ఈ భారతావని లోనే! అందులోను సుసంపన్నమయిన సుందరాంధ్ర భూమిలోనే వెలసివున్నాడు! - అనేమాట కూడా ఢంకామ్రోగినట్లు సర్వత్రా వినపడుతున్నది! - మరి! ఈ మాట కూడా ముమ్మాటికీ నిజం! నిజం!

ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసులు, జ్ఞానులు ఇలా అందరూ, అదిగో! అటు వేంకటాద్రి శిఖరాలవైపు దృష్టి సారించండి! ఆ పర్వతసానువులకు పరుగులు పెట్టండి! అక్కడ సప్తగిరులు కోట గోడలవలె చుట్టూ దర్శనమిస్తాయి! ఆ గిరి శిఖరాల మధ్య, కోటి దివ్యకాంతులతో వింత వింతలుగా ప్రకాశిస్తూవున్న "ఆనందనిలయం" అనే బంగారు మేడ కన్నులు మిరుమిట్లుగొలిపేలా గోచరం అవుతుంది! సూర్యకోటి తేజంతో అద్భుతంగా వెలిగిపోతూవున్న ఆ బంగారు భవనంలో భక్త సంరక్షణా శీలుడైన అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు కొలువు దీరి నిలిచివున్నాడు! ఆ పురుషోత్తముని దివ్యమంగళమూర్తి యొక్క జగన్మోహన సౌందర్యాన్ని ఆపాదమస్తకం నిలువెల్ల కన్నులు చేసికొని ఆ కన్నుల కరవెల్ల తీరునట్లుగా దర్శించండి! పునీతులు కండి! ఇష్టార్థ సిద్ధిని పొందండి!!

**శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

*94 అక్టోబరు 5 నుండి 14వ తేదీ-వరకు పదిరోజులపాటు తిరుమలలో జరుగుతున్న శ్రీవేంకటేశ్వరస్వామి-వారి బ్రహ్మోత్సవాల సందర్భంగా ఈ వ్యాసం ప్రచురితం.*

*సం॥*

మూకారబ్ధం కమపి బధిరా శ్లోకమాకర్ణయంతి
శ్రద్ధాళుస్తం విలిఖతి కుణి శ్లాఘయా
వీక్షతేంఽధః
అధ్యారోహత్యహహ! సహసా పంగు
రప్యద్రిశృంగం
సాంద్రాలస్యా శిశుభరణతో మంద
మాయాతి వంధ్యా

శ్రీనివాసుని కరుణవల్ల మూగవాడు శ్లోకాన్ని స్ఫుటంగా చదువుతూ వున్నాడు! ఆ శ్లోకాన్ని చెవిటివాడు బాగా వింటూవున్నాడు! ఇక మొండి చేతులవాడు ముత్యాలల్లే రాస్తూవున్నాడు! ఆ రాస్తూన్న శ్లోకాన్ని గుడ్డివాడు చూస్తూ 'అద్భుతం పరమాద్భుతం' అంటున్నాడు! ఇక కుంటివాడు శేషాచల పర్వతాన్ని అవలీలగా ఎక్కుతూవున్నాడు! అంతమాత్రమేనా! కాదుకాదు! పుట్టుగొడ్రాలు తనబిడ్డను ఎత్తుకొని మురిపెంగా గోముగా ముద్దాడుతూ తిరుమల గోవిందుణ్ణి దర్శించడానికి కొండ నెక్కుతూ మెల్లగా నడచి వస్తున్నదట!!

ఇలాంటి పరమాద్భుత వరప్రదాతయైన ఈ దేవుణ్ణి భక్తకోటి సప్తగిరీశుడనీ, శ్రీనివాస ప్రభువనీ, వేంకటరమణుడనీ, సంకట హరణుడనీ, గోవిందుడనీ, తిరుమలేశుడనీ, వేంకటాచలపతి అని, శేషాచలపతి అనీ, బాలాజీ అనీ . . . ఇలా తమకు నచ్చిన, తాముమెచ్చిన ఎన్నో పేర్లతో. . . ఎన్నెన్నో పేర్లతో. . . మరెన్నో పేర్లతో ఆర్తిగా గొంతెత్తి పిలుస్తూ, ఆర్ద్రంగా మనసారా స్మరిస్తూ మైమరచి పోతూ వుంటారు. ఇలా ఎన్నెన్నో పేర్లతో పిలువబడుతున్న ఓ తిరుమల స్వామీ! "యోఽసి సోఽసి" - నీవు ఎవడిగా అయివున్నావో! వాడివిగానే అయివున్నావు - అంటే నీకు సాటి నీవే! కాని మరొకరు లేరంటూ వేంకటేశ్వరుని పొగడుతూ పులకించి పొంగి పోతూ వుంటారు భక్తలోకం!

# BRAHMOTSAVAM OF LORD VENKATESWARA

## AT TIRUMALA



## FROM OCTOBER 5 TO 14, 1994

ఇలా మానవమాత్రులేకాక, బ్రహ్మాది దేవతలు సయితం, కోరినవారి కల్పతరువు, పట్టిన చేతివారి చింతామణి భక్తులపాలిటి కొంగు బంగారం అయిన తిరుమలేశుణ్ణి గూర్చి

వృష శైలాధిప ఏవ దైవతం నః
వృషభాద్రీశ్వర ఏవ దైవతం నః
ఫణిశైలాధిప ఏవ దైవతం నః
భగవాన్ వేంకట ఏవ దైవతం నః

అని అహరహం కీర్తిస్తూ, బంగారువాకిలి వద్ద పడిగాపులు కాస్తూ, ఆ ఘన వేంకటేశుని దర్శనం కోసం వేచి వుంటారని ప్రతీతి!

ఉత్తమోత్తమమైన శ్రీమహావైకుంఠాన్ని వదలి భక్తులను, ఆశ్రితులను అనుగ్రహించడానికి భూలోకం వచ్చిన సాక్షాత్ శ్రీమహావిష్ణువే ఈ వేంకటేశ్వరుడు. ఈస్వామి భక్తుల చేత తృణమో పణమో దానం పుచ్చుకొని వారిని పాపాలనుండి విముక్తుల్ని చేస్తాడు. వారినుంచి ఒకటి తీసుకొని దానికి వేయి రెట్లుగ అనుగ్రహిస్తాడు! భక్తులకు కల్యాణప్రదములైన శుభపరంపరలు కల్గించటానికే వారిచేత ఉత్సవాలు చేయించుకుంటాడట! ఊరేగింపులు చేయించుకుంటాడట! కల్యాణోత్సవాలు జరిపించుకొంటాడట! ఆ జగత్కల్యాణచక్రవర్తి అయిన శ్రీనివాసపరమాత్మ చేయించడమేకాక, తన ఉత్సవాలను చూచిన వారి పాపాలు కూడా పటాపంచలవుతాయని భరోసా ఇచ్చాడు!

అందువల్లేనేమో! సృష్టికర్త మొదలుకొని సామాన్య మానవులదాకా తిరుమల వేంకటేశ్వరస్వామివారికి ఉత్సవాలు, ఊరేగింపులు, ఆరాధనలు, నివేదనలు... ఇలా తమ తమ ఇష్టానుసారం చేయిస్తారు. మొక్కులు సమర్పించుకొంటారు.ఇక్కడ అందువల్లే ఎప్పుడూ ఏదో ఒక వేడుక సాగుతూనే వుంటుంది.

ఈ వేంకటాద్రి పుణ్యక్షేత్రంలో ఏడాది పొడవునా ప్రతిరోజూ పచ్చతోరణాలే! ప్రతి రోజూ పండుగనే! ప్రతిపూటా పిండి వంటలే! పరమాన్నాలే! పాయసాలే! ఆహాహా! అలంకారప్రియుడూ, నైవేద్య ప్రియుడూ, మీదుమిక్కిలి అత్యంత భక్తప్రియుడూ అయిన శ్రీ తిరుపతి వేంకటరమణునిది ఎంతటి భోగం! ఎంతెంతటి వైభోగం!! కనుకనే సర్వదేవతలకూ, సిద్ధులకూ, పరమ యోగులకూ సాధకులకూ, ఆలవాలమై నిరంతరం నిరంతరాయంగాభక్త జన సందోహంతో కిటకిట లాడుతూ ఈ దివ్యక్షేత్రం "నిత్య(చ్చ)ల కల్యాణం పచ్చలతోరణం"గా భాసిల్లుతూ ఉంది!

ఏడుకొండలవానికి ఏడాది పొడవునా ఎన్నో ఉత్సవాలు జరిగినా, ఊరేగింపులు నిర్వహింపబడినా, వాటి అన్నింటిలోను, సంవత్సరానికొకసారి వరుసగా పదినాళ్లపాటు జరిగే "బ్రహ్మోత్సవాలు" తిరుమలక్షేత్ర చరిత్రలోనే అత్యంత ప్రాముఖ్యాన్ని, ప్రాచుర్యాన్ని సంతరించుకున్నాయి!

సాక్షాత్తు శ్రీవేంకటాచలపతి బ్రహ్మదేవుణ్ణి పిలిచి లోకకల్యాణం కొరకు తనకు ఉత్సవాలు నిర్వహించి ఘనంగా నివేదనాదులు చేయవలసిందని ఆజ్ఞాపించాడట! శ్రీనివాసుని ఆనతి ప్రకారమే,ఆస్వామి తిరుమల దివ్యస్థలంలో ఆవిర్భవించిన కన్యామాసం (ఆశ్వయుజం) లోని శ్రవణ నక్షత్రం నాటికి ముగిసేట్లుగా తొమ్మిది రోజుల ముందునుంచి బ్రహ్మదేవుడు ఉత్సవాలను ఘనంగా నిర్వహించాడట. అందువల్లే ఇవి "బ్రహ్మోత్సవాలు"గా ప్రసిద్ధి నంది నాటినుండి నిరాఘాటంగా నిరాటంకంగా కొనసాగుతూనే వున్నాయి. అంతేగాక సాక్షాత్తు "పరబ్రహ్మ స్వరూపుడైన" శ్రీనివాసదేవునికి జరుపబడుతున్న ఉత్సవాలు కనుకే బ్రహ్మోత్సవాలని పేరు కలిగిందని కూడా ప్రచారం.

అధికమాసం వచ్చిన సంవత్సరంలో ఈ బ్రహ్మోత్సాలు రెండుమార్లు జరుపబడుతాయి. ఒకటి యథాప్రకారంగా కన్యామాసంలోను, రెండవది దసరా నవరాత్రులలోను, ఇలా రెండు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. మొదటి బ్రహ్మోత్సవాన్ని వార్షిక బ్రహ్మోత్సవమనీ, రెండవది నవరాత్రి బ్రహ్మోత్సవమని అంటారు. కాని నవరాత్రి బ్రహ్మోత్సవంలో మాత్రం ధ్వజారోహణం వుండదు. ఇక మిగిలిన ఉత్సవాలూ, ఊరేగింపులు అన్నీ సమానమే.

బ్రహ్మదేవుడు ప్రారంభించిన ఈ పది నాళ్ల ఉత్సవాలను కాలక్రమేణ ఎందరో రాజులు, రారాజులు, తమ విజయపరంపరలకు గుర్తుగా తిరుమల స్వామివారికి బ్రహ్మోత్సవాల పేరిట చేయించారు. ఇలా ఏర్పాటు చేయబడిన బ్రహ్మోత్సవాలు, నెలకొకటి వంతున ప్రతిఏటా పది లేదా పన్నెండు బ్రహ్మోత్సవాలు జరిగేవట! ఆ రాజ్యాలూ ఆ రాజులూ అర్థాంతరంగా ముగిసినట్లే, వారు ఏర్పాటు చేసిన ఆ ఉత్సవాలు అర్థాంతరంగానే నిలిచి పోయాయి!

కాని సుమారు ఐదువేల ఏండ్లనాడు శ్రీనివాస ప్రభువు ఆనతిమేరకు, సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు జగత్కల్యాణంకోసం నిర్వహించిన ఉత్సవాలు మాత్రం అఖండంగా అంగరంగ వైభవంగా, వైభోగంగా నేటికీ కొనసాగుతూ కొండలరాయుని కొండంత వైభవాన్ని దశ దిశలా చాటుతున్నాయి. అందుకే బ్రహ్మోత్సవం జరిగే పదిరోజుల్లో ఉదయం, సాయంత్రం ఉత్సవానికి ముందుగా బ్రహ్మదేవుడిరథం వెళుతూవుంటుంది. ఖాళీగావున్న ఈ రథంలో నిరాకార నిర్గుణ రూపంతో బ్రహ్మ వేంచేసి ఈ ఉత్సవాలకు ఆధ్వర్యం వహిస్తాడు. కాని ఒక్క రథోత్సవంనాడు మాత్రం బ్రహ్మదేవుడు తనరథాన్ని దిగి స్వయంగా శ్రీస్వామివారి రథాన్ని లాగుతాడని ప్రసిద్ధి. అందువల్ల శ్రీస్వామివారి రథోత్సవానికి ముందుగా బ్రహ్మదేవుడి రథం వుండదు. ఈ ఉత్సవాల్లో బ్రహ్మదేవుడే కాక ఆదిశేషుడు, గరుడుడు, హనుమంతుడు, సూర్యుడు, చంద్రుడు మున్నగు దేవతలు, మృగేంద్రుడు, గజేంద్రుడు, దేవతావృక్షమైన కల్పతరువు ఉచ్చైశ్రవము ఇత్యాది దేవతాంశ గలిగినవి శ్రీస్వామివారికి స్వయంగా వాహనాలుగా పాల్గొని సేవలందిస్తున్నందువల్లనూ, సకలదేవతలు, దిక్పాలురు ఆహ్వానింపబడి, ఇలా ఈ ఉత్సవాల్లో సర్వదేవతాసాన్నిధ్యం విశేషంగా ఉండటం వల్లనూ తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలు అత్యంత విశిష్టతనూ దివ్యత్వాన్ని పొందాయని చెప్పటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు.

## ఆలయశుద్ధి - అలంకరణ

బ్రహ్మోత్సవాలు ధ్వజారోహణం నుంచి ప్రారంభమై ధ్వజావరోహణంతో ముగిసే పది నాళ్ల వేడుకలు. ఈ వేడుకలు ప్రారంభించ టానికి ముందే శ్రీ స్వామివారి ఆలయాన్ని పూర్తిగా, విధిగా శుద్ధి చేస్తారు. 'కోయిల్ ఆళ్వారు తిరుమంజనం' అనే పేరుతో పెద్ద ఎత్తున బ్రహ్మోత్సవాలకు ముందు వచ్చే మంగళవారం రోజున సుగంధ ద్రవ్యా లతో తిరుమల ఆలయ శుద్ధి అత్యంత ఉత్సాహంగా నిర్వహించబడుతున్నది. ఆ తర్వాత శ్రీస్వామివారి ఆలయాన్ని నయ నాభిరామంగా సుమనోహరంగా విద్యుద్దీపా లతోనూ, పూలపందిళ్లతోను, మామిడాకు తోరణాలతోను అలంకరిస్తారు.

## అంకురార్పణ

ఆ తర్వాతి కార్యక్రమం అంకురా ర్పణ. ధ్వజారోహణకు ముందురోజు సాయం కాల సమయంలో శ్రీస్వామివారి సేనాపతు లైన విష్వక్సేనులవారు ఆలయానికి నైరుతి మూలలో వున్న వసంతమండపానికి ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా తరలి వెళ్లి, అక్కడ భూమి పూజ వగైరాదులు చేసి మృత్సంగ్రహణం చేసి ప్రదక్షిణంగా వచ్చి ఆలయంలో ప్రవేశిస్తారు. ఇక ఆరాత్రే బ్రహ్మోత్సవాలకు నవధాన్యాలతో అంకురా ర్పణం (బీజావాపం) చేస్తారు.

## ధ్వజారోహణం

ఇక ఆ మరునాటి ప్రధాన కార్య క్రమమే ధ్వజారోహణం. వైఖానసాగమం ప్రకారం గరుడ కేతన ప్రతిష్ఠ, కంకణధారణ, ఆలయ ఆవరణలోను, బయటమట్టూ అష్ట దిక్కుల్లోను బలిని వేస్తూ, శ్రీస్వామివారు ఉభయదేవేరులతోనూ, ఆలయ పరివార దేవ తలతో ఊరేగుతూండగా దిక్పాలురు, ఆహ్వా నింప బడతారు. పిదప ఆలయంలోని బంగారు ధ్వజ స్తంభం వద్ద సర్వదేవతలను ఆహ్వానించిన అనంతరం, అర్చకస్వాములు గరుడకేతనాన్ని (గరుత్మంతుని బొమ్మ చిత్రిం పబడిన జెండా) వేదగానాల మధ్య మంగళ వాయిద్యాలు మోగుతుండగా ధ్వజస్తంభంపై శ్రీదేవి భూదేవి సమేత శ్రీ శ్రీనివాస ప్రభు వులవారి సమక్షంలో అత్యంత వైభవంగా ఎగుర వేస్తారు. ఈ సందర్భంలో ముద్గ లాన్నం (పెసర పులగం) నివేదింపబడుతుంది. ఈప్రసాదాన్ని స్వీకరిస్తే సంతానభాగ్యానికి నోచుకోని స్త్రీలు సంతానవతులవుతారని ప్రతీతి! ఇలా ధ్వజారోహణం అయిన వెంటనే ఆరాత్రే శ్రీస్వామివారికి బంగారు పెదశేష వాహనంపై ఊరేగింపు జరుగుతుంది.

## పెదశేష వాహనం
## చినశేష వాహనం

సర్వజగన్నియామకుడైన శ్రీవేంకట ప్రభువునకు దేవేరులతో కూడ ఏడుపడగెల బంగారు శేషునిపై గ్రామోత్సవం జరు గుతుంది. ఆమరునాటి ఉదయం చిన్న శేషునిపై శ్రీస్వామివారికి మాత్రమే ఊరే గింపు జరుపబడుతుంది.

ఓ భక్తులారా శ్రీమహావైకుంఠంలో పాలసముద్రంలో శేషపాన్పుపై పవ్వళించి వుండగా, నన్ను శ్రీదేవి భూదేవులు సేవిస్తూ వుంటారు. ఆ నా రూపాన్ని మహాత పస్సంపన్నులైన సనకసనందనాది మహర్షులు మాత్రమే దర్శిస్తారు. అయితే మీకోసమే ఆశే షునితోకూడ ఇక్కడికి తరలివచ్చాను. ఆశే షుడే ఈశేషాచలం. ప్రత్యేకంగా ఈ బ్రహ్మో త్సవ సమయంలో ఉభయదేవేరులతోకూడి శేషునిపై దర్శన మిస్తున్న నన్ను కన్నులారా తిలకించి కామితార్థములను పొందవలసినదని శ్రీస్వామివారు భక్తులకు వరప్రదానం చేస్తూ శేషునిపై ఊరేగుతారు.

## హంసవాహనం

రెండవరోజు రాత్రి బంగారు హంసవాహ నంపై శ్రీస్వామివారు ఒక్కడే వీణాపాణియై, విజ్ఞానవల్లియైన చదువుల రాణికి ప్రతిరూ పంగా భక్తజన సందోహానికి దర్శనమిస్తూ ఆనంద సందోహంలో ముంచెత్తుతారు.

'భక్తులారా! మీ మానసహంసల్ని నా పరం చెయ్యండి మిమ్మల్ని పరమ హంసలుగా మార్చి ఆనందమయ కోశంలో ప్రవేశింపచేసి పునరావృత్తిరహిత కైవల్యాన్ని ప్రసాదిస్తానని శ్రీ ఆనంద నిలయుడు దివ్యదర్శనం ప్రసా దిస్తారు.

## సింహ వాహనం

మూడవనాటి ఉదయం సింహవాహ నంపై శ్రీనివాసుడొక్కడే ఊరేగింప బడ తాడు. ' మృగాణాంచ మృగేంద్రోహం' అని మృగరాజైన సింహం నా అంశే తన శ్రీకృష్ణుని వచనం. మృగరాజైన సింహం గాంభీర్యానికి శౌర్యానికి ప్రతీక! కాని హింసే ప్రధానం కాబట్టి అది సింహమయింది. అలాంటి సింహం పై దర్శనమిస్తున్న స్వామివారు "భక్తులారా! మీకు ఎవరిచేతనైనా హింసలు బాధలు కలిగినట్లైతే నన్ను శరణు వేడండి, వారిపాలిటి సింహస్వప్నమై మిమ్మల్ని రక్షి స్తాను" అని అభయమిస్తారు.

## కల్పవృక్షం

నాల్గవనాటి ఉదయం కల్పవృక్ష వాహ నంపై శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీ మలయప్పస్వామి పురవీధుల్లో సంచరిస్తారు.

"అదేదో కల్పవృక్షమట! దేవలోకంలో వుంటూ దేవతల కోరికలన్నీ తీరుస్తుందట! మరి ఆ దేవలోకం ఎక్కడో తెలియదు. అందలి కల్పవృక్షం సంగతి అసలే తెలియదు అని చింతించవలసిన పనేలేదు. నేను మీ పాలిటి కల్పవృక్షాన్నై ఈ వేంకటా చల క్షేత్రంలో దర్శనమిస్తున్నాను. మీమీ కోరికలన్నీ తీరుస్తానని" శ్రీవేంకటేశ్వరుడు భక్తులకు భరోసా ఇస్తున్నట్లు వుంటుంది.

## సర్వ భూపాల వాహనం

నాల్గవ నాటిరాత్రే సర్వ భూపాల వాహనం. ఇది ఒక బంగారు మండపం. సర్వశోభాయమానంగా అలంకరింప బడ్డ స్వర్ణ మండపం మధ్యలో ఉభయదేవేరులతో కూడి వున్న శ్రీనివాస పరాత్పరుడు కొలువై ఊరే గుతూ దివ్యదర్శనమిస్తాడు. ఈసర్వభూపాల వాహనంలో సర్వజగత్ప్రభువైన శ్రీవేంకటపతి మహాదర్పంగా ఉంటారు! ఆసమయంలో ఎవరు ఏది అడిగినా, వెంటనే ప్రసాది

స్తారు."ఓ భక్తులారా! మీ హృదయం కూడ స్వచ్ఛమైన స్వర్ణమండపమే. అందులోనన్ను ప్రతిష్ఠించుకోండి! అప్పుడు మీకు అన్నీ సిద్ధి స్తాయని" స్వామి దివ్య ప్రబోధం చేస్తూ ఊరేగుతారు.

## మోహినీ అవతారం

ఐదవనాటి ఉదయం శ్రీస్వామివారు మోహినీ రూపం దాల్చి దంతపు పల్లకి నెక్కి దర్శనమిస్తారు. ఆసమయంలో ఏవరీ సౌంద ర్యరాశి! ఈ మెరుపుతీగ!అని శ్రీదేవి భూదే వులు ఆ అందాలరాశిని చూచి అసూయ పడతారు. ఆ తళకు బెళకులు, నడకల హొయలు మైమరచి చూస్తూ అంతలోనే తేరుకొని "ఓహో జగన్నాటక సూత్రధారు డైన మనస్వామే ఈజగన్మోహిని కదా అని ముసి ముసి నవ్వులతో సంతృప్తి పడతారట శ్రీనివాసుని దేవేరులు.

శ్రీవేంకటేశ్వరుడు మోహిని అవతా రంతో దంతపు పల్లకిలో ఆసీనులై అమృత కలశాన్ని చేతబూని "మానవులారా దాన వులవలె బాహ్య సౌందర్యానికి భ్రమపడి భ్రష్టు చెందవద్దు. సర్వాంతర్యామిగా వున్న నన్ను గుర్తించి కొలువండి! అమృతత్వాన్ని సులభంగా పొందండి! అన్న దివ్యసందేశాన్ని ఇస్తాడు స్వామి.

## గరుడోత్సవం

బ్రహ్మోత్సవాలలో ఐదవనాటి రాత్రి జరిగే బంగారు గరుడోత్సవ ప్రాధాన్యం ఇంతింతని వర్ణింపలేనిది! వర్ణింప రానిది! ఆరోజు ఆనందనిలయంలోని మూలవిరాట్టు నకు అలంకరించే మకర కంఠి లక్ష్మీహా రది విశిష్ట ఆభరణాలు శ్రీ స్వామివారి ఉత్సవమూర్తికి అలంకరిస్తారు. అనాడే తమిళనాడు లోని శ్రీవిల్లిపుత్తూరు నుంచి అక్కడి గోదాదేవికి అలంకరించిన పూల మాలను గరుడోత్సవం నాటికి తిరుమలకు తెచ్చి శ్రీస్వామివారలకు అలంకరిస్తారు. ఆ రోజే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున ముఖ్యమంత్రి సమర్పించిన నూతన పట్టు వస్త్రాలను కూడ స్వామివారికి అలంకరిస్తారు. మద్రాసునుంచి మిరాశిదారులు కాలినడకల పదిరోజులు ముందుగానే బయలుదేరి కొత్త గొడుగులను దారిలో ఊరూరా పూజలం దుకొంటూ, సరిగ్గా గరుడోత్సవం నాటికి తిరుమలకు తెస్తారు. ఆ కొత్త గొడుగు లను ధరించి, బంగారు గరుడనిపై వేంచేసి తిరుమల పురవీధుల్లో అశేష భక్తజనం మధ్య శ్రీవారు చిరునవ్వు చిందిస్తూ ఊరేగుతారు.

సాక్షాత్తు వేదమయుడూ, అప్రతిహత శౌర్యవంతుడు, బలవంతుడు అయిన గరుడ నిపై శ్రీనివాసదేవుడు విహరించడం బ్రహ్మో త్సవాలలో వాహనసేవలలో కెల్ల పరాకాష్ఠ!

'ఓ భక్తులారా! సర్వకాల సర్వావస్థల యందు మీరక్షణకై శంఖచక్రాది ఆయుధా లతో గరుడున్ని అధిరోహించి అప్రమత్తుడనై వుంటాను. నన్ను శరణువేడండి! మీ రక్షణ భారమంతా నాకు వదిలివేయండి' అంటూ ప్రబోధిస్తున్న శ్రీస్వామివారి బంగారు గరు డోత్సవ దర్శనం సర్వపాపహరం! సర్వసంప త్కరం! సర్వశ్రేయోదాయకం!

## హనుమద్వాహనం

ఆరవనాటి ఉదయం శ్రీనివాసుడు హనుమంతునిపై ఊరేగుతూ భక్తులకు దర్శ నమిస్తాడు. "త్రేతాయాం రఘునందనః! - అని ప్రసిద్ధినందిన ఆ రాముణ్ణే నేనే. అందుకే ప్రతినిత్యం కౌసల్యా సుప్రజారామా... అని ఆ రాముని పేరుతో మేలుకొలుపులు పాడించు కుంటూనే వున్నాను. నేడు మీ భాగ్యవశంచేత 'కలౌ వేంకటనాయకః' అన్న ప్రశస్తినంది ఈ అంజనాద్రిపై దర్శనమిస్తున్నాను. అనాటి హనుమంతునిపై వున్న నన్ను దర్శించి తరిం చండి" అన్న దివ్యసందేశం ప్రసాదిస్తారు స్వామి.

## గజవాహనం

ఆరవనాటి రాత్రి గజేంద్రునిపై శ్రీ తిరుమలస్వామి ఊరేగుతూ దర్శనమిస్తారు.

"ఈగజేంద్రుడు మహాబలవంతుడు. కాని అహంకారంతో బలగర్వంతో ఉన్మత్తుడై తిరి గాడు. శత్రువులబారిపడి, తనశక్తియుక్తుల మీద ఆధారపడి పోరాడి చివరికి నన్ను శరణు పొందినాడు. నాచేత రక్షింపబడ్డాడు. అందువల్ల భక్తులారా! మీరక్షణకై నిలిచి వున్న నన్ను శరణువేడుడి. ఏమరక నన్ను కొలువుడు" అని భక్తులకు దివ్యదర్శనం అనుగ్రహిస్తాడు.

## సూర్యప్రభ - చంద్రప్రభ

ఏడవనాటి ఉదయం సూర్యప్రభవాహనం పైనా, ఆరాత్రి చంద్రప్రభ వాహనంపైనా వెలుగులన్నిటికి వెలుగైన శ్రీ వేంకటపతి తిరుమల వీధుల్లో వింత వింత కాంతులతో దర్శనమిస్తారు.

"జ్యోతిస్వరూపాల్లో సూర్యుణ్ణి నేనే, నక్ష త్రాల్లో చంద్రుణ్ణి నేనే. సకలప్రాణికోటికి ఆత్మను నేనే సకల చరాచర ప్రపంచాలు నా ప్రకాశంతోనే వెలుగుతున్నాయి" అని చెప్పుతూ శ్రీ స్వామి దివ్యదర్శనమిస్తాడు.

## రథోత్సవం

బ్రహ్మోత్సవాల్లో ఎనిమిదవరోజు ఉదయం జరిగే విశేష ఉత్సవం రథోత్సవం. తిరుమల రాయనికి జరిగే ఉత్సవాల్లో అన్నింటికంటే రథోత్సవం విశిష్టంగా, అత్యంత వైభవంగా ఆనందదాయకంగా వుంటుంది.

రథస్థం కేశవం దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే

అన్నట్లుగా తిరుమల శ్రీనివాసుని దర్శ నంతో తమ జన్మపరంపర నశించిందన్న భక్తి విశ్వాసాలతో శ్రీ స్వామివారి రథంయొక్క పగ్గాలను లాగుతూ "గోవిందా! గోవిందా!" అంటూ గోవిందనామస్మరణచేస్తూ రథోత్స వంలో స్వయంగా పాలు పంచుకునే భక్త జనుల ఆనందం వర్ణనాతీతం!

ఓ మానవులారా! మీ శరీరమే ఒక దివ్యరథం అందున్న ఆత్మే నేనై వున్నాను. ఇక గుర్రాలు మీ ఇంద్రియాలు. మీ బుద్ధే సారధి. మీ మనస్సే పగ్గాలు. మీ శరీరం లోని ఆత్మ స్వరూపంగావున్న నన్ను గుర్తించి

మనోనిగ్రహంగా జీవితయాత్ర సాగించండి. గమ్యం చేరుకొని ముక్తి బొందగలరని స్వామి రథోత్సవం ద్వారా దివ్య జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాడు!

## అశ్వ వాహనం

ఎనిమిదవనాటి రాత్రి శ్రీస్వామివారు శిరస్త్రాణాన్ని దాల్చి, చేతఖడ్గం బూని అశ్వంపై సంచరిస్తాడు! రాష్ట్రంవై అశ్వః! అన్నట్లుగా జగమే ఒక గుర్రం. సర్వజగన్నియామకుడను నేనే అని శ్రీనివాసప్రభువు భక్తులకు తెలియజేస్తూ అశ్వవీరుడుగా దివ్యదర్శనమిస్తాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తూ రాబోయే కల్కిని కూడ నేనే అని భవిష్యత్సూచన చేస్తాడు శ్రీస్వామి.

## చక్రస్నానం

ఆ మరునాడు అంటే తొమ్మిదవ రోజు ఉదయం శ్రీ వరాహస్వామి ఆలయ ప్రాంగణంలో శ్రీదేవి భూదేవీసహిత శ్రీమలయప్ప స్వామివారిని, శ్రీ చక్రత్తాళ్వారుతో కూడ వేంచేపు చేయించి, పంచామృత స్నపన తిరుమంజనం జరుపబడుతుంది. ఆతర్వాత శ్రీసుదర్శనచక్రత్తాళ్వారులను శ్రీస్వామిపుష్కరిణిలో ముంచి పవిత్రస్నానం చేయిస్తారు. అదేసమయంలో వేలాదిమంది భక్తులు పవిత్రపుష్కరిణిలో మునకలిడి పునీతులవుతారు.

## ధ్వజావరోహణం - వీడుకోలు

ఇక తొమ్మిదో రోజు రాత్రే ధ్వజావరోహణ కార్యక్రమం! ఆరాత్రి పదినాళ్ల బ్రహ్మోత్సవాలకు వచ్చిన దేవతలకు, దిక్పాలురకు వీడ్కోలు ఇవ్వబడుతుంది. బంగారు ధ్వజస్తంభంపై ఎగురవేసిన గరుడ కేతనాన్ని శాస్త్రోక్తంగా, మంగళ తూర్యరవాలు మోగుతుండగా, వేదగానాలమధ్య అవరోహణం చేస్తారు. ఈ కార్యక్రమంతో పదినాళ్ల పాటు కొనసాగుతున్న బ్రహ్మాండనాయకుని బ్రహ్మోత్సవాలు వైభవోపేతంగా ఘనంగా మంగళప్రదంగా పరి సమాప్తమవుతాయి.

ఈ బ్రహ్మోత్సవ సమయంలో ఏడు కొండల్లో ఒకవైపు గోవిందలు పెడుతూ కొండలెక్కే భక్తజనం... మరోవైపు భక్తితో చిందులేస్తూ భజన చేసే భజన బృందాలు... ఇంకోవైపు కోలాట నృత్యాలు... చెక్కభజనలు... హరికథలు... బుర్ర కథలు... పగటివేషాలు... పవిత్రపుష్కరిణిలో స్నానాలు... దర్శనాలు, నున్నటి గుండ్లతో ముఖం నిండా పట్టెనామాలతో సాక్షాత్తూ నామాలవాని నడుస్తున్న ప్రతిరూపాలుగా, కన్పట్టే భక్తాగ్రేసరులు... సాక్షాత్తు లక్ష్మీస్వరూపాలు కన్పడుతూ స్వామికి నీరాజనాలిస్తున్న పుణ్యస్త్రీలు, నిత్యాన్నదానాలు... ప్రసాద వితరణలు... యాత్రికులసేవలో అహరహం కృషి చేస్తున్న దేవస్థానం ఉద్యోగ బృందాలు.. రక్షక భటులు... స్కౌట్లు, గైడ్లు.. ఆరోగ్యాధికారులూ.. అర్చకస్వాములు, ధార్మిక ప్రసంగాలు.. ఇలా ఎందరో.. ఎందరెందరో.. మరెందరో.. ఎన్నోవిధాలుగా.. మరెన్నో విధాలుగా విధినిర్వహణలో మునిగిమున్నా.. వీరందరి దృష్టీ, ధ్యేయం, గమ్యం ఒక్కటే అని తెలియజేస్తున్నట్లుగా ఆనంద నిలయం నుంచి శ్రుతి కింపుగా వినవచ్చే వేదాల నాదాలు.. ఇలా తిరుమల పర్వత సానువులంతటా ఒక ఆధ్యాత్మిక తేజస్సు నిండి ప్రకాశిస్తూ వుంటుంది.

ఈ పదినాళ్ల పండుగల్లో తిరుమల పుణ్యక్షేత్రం అంతటా స్వాగతతోరణాలతో, ఆలయప్రాకారాలు, మండపాలు, పుష్కరిణి, సత్రాలు, ఆస్థానమండపం, వైకుంఠం క్యూ, అన్నదానం కాంప్లెక్సులు.. ఇలా సర్వే సర్వత్రా విద్యుద్దీపాలతో శోభాయమానంగా అలంకరింప బడుతుంది. కన్నులకు మిరుమిట్లు గొలిపే విద్యుత్ కాంతుల్లో తిరుమల కొండలు, ఆ కొండలమధ్య వింత తేజస్సులతో వెలిగిపోతున్న ఆనందనిలయ దృశ్యం కన్నులారా చూచి తీరవలసిందేకాని వర్ణింప సాధ్యం కానిది!

తిరుమల బ్రహ్మోత్సవంలో మరో ప్రత్యేకత పుష్పాలంకరణ! దేవస్థానం వారి పుష్పవనాలశాఖ, తిరుమల శ్రీస్వామివారి కైంకర్యాని కవసరమయ్యే పూలను పూయించి సరఫరా చేయడమేగాక, తిరుమల అంతటా, గీతోప దేశం గజేంద్ర మోక్షం, అన్నమయ్య, త్యాగయ్య, శ్రీవేంకటేశ్వరస్వామి... మున్నగు చిత్రాలు రంగు రంగుల పుష్పాలతో తీర్చి దిద్దిన తీరు... డోలోత్సవ మండపం, శ్రీవారి ఆలయం లోపలా, బయటా సుగంధ పరిమళాలు వెదజల్లుతున్న పుష్పజాతులతో చేసిన అలంకారాలు, కళా నైపుణ్యాలూ... చూపరుల నిట్టే ఆకర్షించి నిలిపి ఆనందజగత్తులో విహరింప జేస్తాయి.

ఇలా అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని బ్రహ్మోత్సవాల్లో మనసారా, తృప్తిదీరా పాల్గొన్న భక్తజనం సప్తగిరీశుని స్వర్గమంది రాన్ని మళ్లీ దర్శించే భాగ్యం ఎప్పుడా అని ఆర్తితో ఆనందంతో, ఆర్ద్ర నయనాలతో స్వగృహాలు చేరుకుంటారు. తమ జీవితంలో ఒక కొత్త అనుభూతినీ ఆత్మతృప్తినీ, ఆనందాన్నీ పొందుతూ, తిరుమల పుణ్యక్షేత్రంలో గడిపిన దివ్య క్షణాలను మహాభాగ్యంగా తలుస్తూ, మధురస్మృతులుగా పదిల పరచుకుంటూ ఇలా ప్రార్థిస్తారు.

జాంబూనదాభం గుణిభిర్వరేణ్యం
వక్షః స్థలే దక్షకుచోర్ధ్వభాగే
శ్రీవత్సలక్ష్మ్యంకిత దివ్యరూపం
శ్రీవేంకటాధీశమహం ప్రపద్యే

బంగారువంటి మనోహరమైన కాంతి కలవాడూ, బ్రహ్మాది దేవతలచే స్తుతింప బడువాడూ, తన వక్షఃస్థలంలో కుడిచనుపై భాగంలో శ్రీ లక్ష్మి స్వరూపమైన 'శ్రీవత్సం' అను దివ్యమంగళ చిహ్నాన్ని కలిగివుంటూ, ఎక్కడా ఏలోకంలోనూ కానరాని విగ్రహ సౌందర్యంతో ప్రకాశిస్తూవున్న శ్రీవేంకటాచలపతిని శరణువేడెదను!!!



(20వ పేజీ తరువాయి)

త్తొల్లగించు తండ్రీ!' అని ప్రార్థించారట. భాగ్యమిచ్చారట! తొలగించి స్వామి దర్శన

త్యాగరాజస్వామి తనలోని చెడు లక్షణ లను పోగొట్టమని వెంకటేశ్వరుణ్ణి కోరడం, పరమ భాగవతోత్తముడిగా ఆయనను సాక్షాత్కారింపజేసింది ఈ కీర్తన.

### గౌళీపంతురాగం - ఆదితాళం

తెర తీయగరాదా నా లోని
తిరుపతివేంకటరమణ మత్సరమను॥

పరమపురుష ధర్మాది మోక్షముల
పారద్రోలుచున్నది వాలోని ॥తెర॥

వాగురయని తెలియక మృగ మదగణములు
వచ్చి తగులు రీతి యున్నది
వేగమె నీమతమునమసరించిన
త్యాగరాజనుత మదమత్సరమను ॥తెర॥

మత్స్యము ఆకలిగొని గాలముచే
మగ్నమైన రీతియున్నది
అచ్చమైన దీపసన్నిధిని మరు
గిడబడి చెఱచినట్లున్నది ॥తెర॥

ఇరవొందగ భుజియించు సమయమున
ఈగ తగులు రీతియున్నది
హరిధ్యానము సేయువేళ చిత్తము
అంత్యజువాడకు బోయినట్లున్నది ॥తెర॥

ఇంకొక కీర్తనలో యోగుల హృదయము లలో నివసించువాడును, శేషాచలమునందు నెలకొనియున్నవాడును ఐన శ్రీవేంకటేశ్వరుని వైభవాన్ని పొగుడుతూ 'నిన్ను చూచుటకు పదివేల కన్నులు కావలెనయ్యా!స్వామీ! ఓ వేంకటేశా! అని భక్తితో అన్నారు త్యాగరాజస్వామి.

ఇంకొక కీర్తనలో 'నిన్ను చూడని బ్రతుకొక బ్రతుకా? సత్సంగతి లేని జీవనము ఇతరులను బాధించుటకు తప్ప వేరే ప్రయోజనం లేనిది. అటువంటి జన్మ నాకువద్దు, నన్ను కరుణించి దర్శనమివ్వు తండ్రీ!' అని వినతాసుత వాహనుడైన వేంకటేశ్వర స్వామిని త్యాగరాజస్వామి ప్రార్థించారు.

'సాధించెనే ఓ మనసా' అనే ఆరభిరాగ పంచరత్నంలో త్యాగయ్య--

'శ్రీవేంకటేశ స్వప్రకాశ సర్వోన్నత సజ్జన మానస నికేతన కనకాంబరధర లసన్మకుట కుండలవిరాజిత హరేయనుచు నే పొగ డగా గోపాలుడు మానవేంద్రుడయిన రామచంద్రుడు తగు మాటలాడెనే!' -- అన్నారు.

సంగీత త్రిమూర్తులలో రెండవవాడైన శ్రీముత్తుస్వామి దీక్షితర్ అపరిమితమైన వేద శాస్త్ర పురాణాగమ, సంగీత, సాహిత్య, యంత్ర, మంత్ర, జ్యోతిషాది శాస్త్రాలలో దిట్ట.

వాగ్గేయ కారులందరిలో ఎక్కువగా క్షేత్ర పర్యాటనంచేసి, ఆయా క్షేత్రాల్లోని దైవాలం దరిమీద కృతులు రచించినవారు దీక్షితర్.

శ్రీవేంకటేశ్వరుని చల్లని చూపును ఎంతో మనోహరంగా, మృదుమధురంగా 'వేంకటేశ నయనం' అని చంద్రుడితో పోల్చారు తన 'చంద్రం భజ మానస' అనే నవగ్రహకృతిలో. చంద్రుడంతటి చల్లని కరుణావీక్షణం కల్గినవాడని ఆ తండ్రిని కొనియాడారు.

సంస్కృతభాషలో రచించిన వీరి కృతులు ఎంతో ప్రచారంలో ఉన్నాయి.

### 'పద్మావతీ రమణుణ్ణి కీర్తించిన పాట
### రాగం పూర్ణచంద్రిక - ఆది

శంఖచక్ర గదా పాణిమహం వందే శ్రీ
శార్ఙనందక కౌస్తుభధారిణం ॥వందే॥

పంకేరుహచరణం! పద్మావతీ రమణం!
సంకటాపహరణం! సదాభక్తభరణం॥
కుంకుమ పంకిల గాత్రం! పంకజ విశాలనేత్రం!
శంకర సన్నుతిపాత్రం! వేంకటవరదక్షేత్రం॥

గజేంద్ర సంరక్షణం! గరుడవాహవిచక్షణం!
అజేంద్రాది విలక్షణం! అమృత సార భక్షణం!
అజామిళ ప్రభృత్యనేక దాసాళి సంతరణం!
భజే పూర్ణ చంద్రికాంగ గురుగుహాంతః కరణం॥

కుజాద్రిగృహవిదితం!
విరజానదీతటస్థితం!
సజాతీయాదిరహితం
నిజానందబోధ హితం॥

రెండు, మూడు భాషల్లోని పదాలతో అర్థవంతంగా సాగే రచనను 'మణిప్రవాళం' అని అంటారు. ఇట్టి మణిప్రవాళ రచనగా ఆర్తితో సాగిన ఈ రచనను చూడండి.

### (కాశిరాగం - ఆదితాళం)

వేంకటాచలపతే నిను నమ్మితి
వేగమే నను రక్షింపుమయ్యా॥

పంకజాసన ప్రముఖాది వినుత
పదమునాశ్రయించిన వారికెల్ల!

సంకటములు దీర్చి సంపదలిచ్చి మంగళం
పొందుదియు పులివళత్తిర్పిళంగుం॥

శ్రీనివాస, శేషాచలమునుంచి,
శ్రీఘ్రయ్ వందు, అంఘ్రిని క్షేత్రనాస
మొసగి, గోకర్ణ క్షేత్రములో నెలకొని, మృకండు
మునేశు
మొదలాన భక్తావాం అభయవర ప్రదాన
చతురంబుజపతే
దయానిధే ప్రత్యక్షముగా, నిందమానిలత్తి
విన్ మహిమై యనేకం॥

..............................................................

దైవాంశ సంభూతుడైన శ్యామశాస్త్రి సంగీతచరిత్రలో అద్భుతమైన రచనాపాట వంలో చిరస్థాయిగా నిలిచిపోయారు.

తిరువాన్కూరు సంస్థానాన్ని పాలించిన స్వాతి తిరునాళ్ మహారాజు స్వయంగా గొప్ప విద్వాంసుడు సంగీత త్రిమూర్తులకు ఈయన సమకాలికుడు. అతిచిన్నవయసులోనే అమితమైన పాండిత్యాన్ని సంపాదించిన ఈయన రచనలు ప్రత్యేకమైన బాణీలో ఉండడం గమనార్హం.

### (ఆరభిరాగం - ఆది)

శ్రీరమణ! విభో! కలయామి భవన్తమయే
శ్రితపాలనలోలుప! మాధవ!
నక్రభీతిహర! నాగభోగశయ! ॥శ్రీరమణ॥

భూరి కరుణాకర! పూతనాశకట ధేనుకాదిహర!
వేణుగానపర! చారుపింఛధర! ॥శ్రీరమణ॥

సంగీతశిరోమణి రామస్వామిదీక్షితర్ కర్ణాటకసంగీత చరిత్రలో ప్రముఖులు. వాగ్గే యకారులైన ముత్తుస్వామిదీక్షితర్, చిన్నస్వామిదీక్షితర్, బాలస్వామిదీక్షితర్‌లను సుపుత్రులుగా పొందిన అదృష్టవంతులు. తన కుమారుడైన చిన్నస్వామి దీక్షితర్‌కు కంటిచూపుపోయిన సమయంలో వేంకటేశ్వరస్వామిని వేడుకొంటూ 'ఇంకా [illegible] న్నను' అనే కీ[illegible]నం చేసినారట! ఆ స్వామి కరుణవల్ల చిన్నస్వామికి పోయిన కంటిచూపు తిరిగి వచ్చిందట!

శ్యామశాస్త్రులవారి కుమారుడైన సుబ్బరాయశాస్త్రి, త్యాగరాజస్వామివారికి ప్రియ శిష్యుడు. తన సంగీతరచనలతో గురువైన త్యాగరాజస్వామిని మెప్పించిన ఘనుడు, గొప్ప వాగ్గేయకారుడు. సుబ్బరాయశాస్త్రి అపురూపమూ మిక్కిలి రక్తిరాగమూ ఐన హమీర్ కళ్యాణిలో 'వేంకట శైలవిహార' కృతిని వేంకటేశ్వరుని పై రచించారు.

సంగీత త్రిమూర్తుల తరువాత కాలంలో గల సంగీత రచనలలో 'వర్ణం' ఎక్కువ ప్రచారంలోనికి వచ్చింది. 'వేంకటేశ' ముద్రతో వర్ణాలు రచించిన వారిలో మానాంబుచావడి వేంకట సుబ్బయ్యర్, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, పల్లవి గోపాలయ్యర్, 'శ్రీనివాస' ముద్రతో రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్ ము॥ వారు ముఖ్యులు.

## హంసధ్వని రాగవర్ణం - ఆదితాళం

మానాంబు చావడి వేంకట సుబ్బయ్యర్

జలజాక్ష నిన్నెడబాపి చాల మరులు కొన్నదిర
చెలియవేం రావదేమిరా చెలుడైనశ్రీవేంకటేశ
నీసాటిదొర వే గావర.

పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ రచనల్లో వర్ణాలు, కృతులు, జావళీలు, తిల్లానాలు కూడ మిక్కిలి ప్రచారంలోనికి వచ్చాయి. 'వరద వేంకటేశ,' 'ఆది వేంకటేశ,' 'వేంకటేశ' ముద్రలతో వీరు అనేక రచనలు చేసి, త్యాగరాజు ముఖ్యశిష్యులలో ఒకరిగా ప్రీతిపాత్రులైనారు.

## వర్ణం రాగం కన్నడ ఆదితాళం

వర్ణం ॥ప॥ సామి ఇది వేళగాదురా
సద్దు సేయకురా

అ॥ప॥ ఏమో యని ఎంచకు శ్రీవేంకటేశ
ఈ మేను నీ సొమ్ముగాద॥
చ॥ దాని దీనివలె నన్నెంచకు॥

'కమనీయ శుభగాత్రుని'గా స్వామిని వర్ణించే ఈ అపురూప రాగ కీర్తన చూడండి

## సింగ[illegible] రాగం ఆదితాళం

ప॥ కరుణించుటకిదె సమయమయ్య
కరిరక్షక నాకలి దీర్చవయ్య॥
అ॥ప॥ ధరలో నీవంటి దైవము లేదని
పరమానందముతో భజించితిని॥

త్యాగరాజస్వామివారి శిష్యపరంపరలో సుప్రసిద్ధులైన గాయకులు, వాగ్గేయకారులు రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్. 'శ్రీనివాస' ముద్రతో వీరు కృతులు, వర్ణాలు రచించారు.

## మోహనరాగవర్ణం - ఆదితాళం

ప॥ నిన్ను కోరియున్నానురా నిఖిలలోకనాయక॥
అ॥ప॥ నన్నుపాలింప సమయమిదే నామీద కృపజూడరా॥
చ॥ సన్నుతాంగ శ్రీనివాసా॥

'సరగున పాలింప సమయమురా నీకు
సాటి ఎవ్వరున్నారు రా సరసిజనేత్రా!'

అంటారు శ్రీనివాసయ్యంగార్ కేదారగౌళరాగంలో 'సరగునపాలింప' అనే కృతిలో (ఆదితాళం)

ఆతర్వాత 'వేంకటేశ్వర పంచరత్నాలు' రచించిన వీణకుప్పయ్యర్ త్యాగరాజ శిష్యపరంపరకు చెందిన గొప్ప వాగ్గేయకారుడు, గాయకుడు. ఈ వేంకటేశ్వర పంచరత్నాలుగా ప్రసిద్ధిపొందిన ఐదు కృతులూ వేంకటేశ్వర స్వామి వారిపై రచింపబడ్డాయి.

మమ్ముబ్రోచు -- సిమ్హేన్ద్రమధ్యమము--ఆది
నన్నుబ్రోవ -- ముఖారి--ఆది
సరోజాక్ష -- సావేరి--ఆది
నీవేదిక్కని -- దర్బారు--ఆది
బాగుమీర -- శంకరాభరణం--రూపకం

ఇదేబాటలో ఆధునిక యుగంలో స్వామివారిపై కృతులు చేసి ధన్యులైన తిరుపతి నారాయణ స్వామి, కోటీశ్వరయ్యర్, ముత్తయ్య భాగవతార్‌లవంటి వాగ్గేయకారులు ఎందరో మనభారతదేశంలో జన్మించారు.

తిరుపతి వాస్తవ్యుడైన తిరుప[illegible]స్వామిపై కొన్ని యణ స్వా[illegible]మైన కృతులను, జావళీలను రచించారు. ఈయన వాగ్గేయకారముద్ర 'తిరుపతి'

## చక్రవాకము
## రాగము - రూపకతాళము

ప॥ వినరాద నా మనవి - వినతాసుతవాహన॥
అ॥ప॥ కన్నతండ్రి నీ వనుచు
కాచి నే వేడితే ॥వినరాద॥
చ॥ దారిగానని వాని దూరనాడుటలేద
తిరుపతి పురవాస వేంకటేశ ఈశ ॥వినరాద॥

నిర్గుణుడవో గుణుడవో చెప్పమంటున్న ఈకీర్తన--

## మలయమారుతం
## రాగం - రూపక తాళము

ప॥ నిర్గుణుడో గుణుడో నీవు
నిజముగ దెల్పవయ్య॥
అ॥ప॥ దేవా సద్గుణుడన - తెల్లముగ నశ్వరాము॥
చ॥నీవు నిర్గుణుడవైన - నిఖిలమెట్లుగల్గెరాము
భోగీంద్రశయన
తిరుపతి పురవాస దేవ వేంకటేశ ఈశ
॥నిర్గుణుడో॥

'నాహం వసామి వైకుణ్ఠే,
న యోగి హృదయే, రవౌ!
మద్భక్తా యత్ర గాయన్తి
తత్ర తిష్ఠామి !నారదా!'

అని నారద పరివ్రాజకోపనిషత్తులో శ్రీమన్నారాయణుడే స్వయంగా ప్రవచించినట్టు, సంగీతప్రియుడైన వేంకటేశ్వరస్వామి ప్రతినిత్యం అన్నమయ్య మేలుకొలుపును, సుప్రభాతగీతం ఇలా సంగీతగానాన్ని వింటూ నిద్రలేస్తూ వున్నాడు! ఇలాగే రాత్రి ఏకాంత సేవానంతరం మళ్లీ అన్నమయ్య లాలిపాట వింటూనే నిద్రలోకి జారుకుంటున్నాడు శ్రీనివాసుడు. నిజంగా ఇది ఎంత ఆశ్చర్యం!.

* * *

# తిరుమలలో వసతి

* తిరుమలలో యాత్రికుల కోసం ఉచితంగా లభించే సత్రాలు చాలా వున్నాయి. ఈ గదులలో కరెంటు, నీళ్ళు కూడ ఉచితం. అయితే ఈ గదులలో మంచాలు పరుపులు తదితర సౌకర్యాలు వుండవు. ఇందులో వసతి కావలసినవారు బస్టాండు దగ్గర వున్న కేంద్ర విచారణ కార్యాలయాన్ని సంప్రదించాలి.

* ఫర్నిచరు తదితర సౌకర్యాలతో వసతి కావలసినవారు తిరుమలలోని అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుకు (రిసెప్షన్-1) వారిని సంప్రదించాలి. లేదా కనీసం 30 రోజుల ముందుగా జాతీయం చేయబడిన ఏ బ్యాంకు నుంచి అయినా కార్యనిర్వహణాధికారి, తి.తి. దేవస్థానములు వారి పేరు మీద రు.100/- కు డిమాండు డ్రాఫ్టు తీసుకొని వారికి వసతి కావలసిన తేదీ వివరాలతో అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (రిసెప్షన్-1), తిరుమల--517 504 వారికి పంపాలి.

రు.100/- డి.డి.ని కార్యనిర్వహణాధికారి, తి.తి. దేవస్థానములు వారి పేరు మీద తీసుకొని వివరాలతో దానిని అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (రిసెప్షన్-1) తిరుమల--517 504 వారికి పంపాలి.

* సౌకర్యాలతో వసతి ఈ క్రింద సూచించిన సర్వీసు చార్జీలతో (ఒక రోజుకు) లభిస్తుంది.

I హిల్ వ్యూ సగం కాటేజీలు, శంకుమిట్ట, శేషాద్రినగర్, అంజనాద్రినగర్, గరుడాద్రినగర్ కాటేజీలు.

| | |
|---|---|
| ఒక భాగం (గీజరు లేకుండా) | రు.15/- |
| హెచ్.వి.డి.సి. ఒక సూటు గీజరుతో | రు.50/- |
| హెచ్.వి.సి. అతిథిగృహం పెద్ద సూటు గీజరుతో | రు.30/- |
| హెచ్.వి.సి. అతిథిగృహం చిన్న సూటు గీజరుతో | రు.25/- |

* ముందుగా రిజర్వేషను చేసుకొనవచ్చును.

II మంగళంబావి కాటేజీలు, టి.బి.సి. 3 వ వరుస మొ॥

| | |
|---|---|
| టి.బి. కాటేజీలు గీజరుతో A, B భాగములు ఒక్కొక్కటి | రు.50/- |
| టి.బి. కాటేజీలు గీజరుతో C, D భాగములు ఒక్కొక్కటి | రు.60/- |
| వి.వి.సి. | రు.150/- |
| ఎమ్.బిసి. గీజరుతో ఒక్కొక్కటి | రు.50/- |
| టి.బి.సి. సూటు గీజరుతో | రు.30/- |
| ఎ.టి.సి. ఒక్కొక్కటి | రు.30/- |
| ఎ.టి.సి. సూటు | రు.15/- |
| ఎస్.వి. అతిథిగృహం, ఎన్.జి.జి.హెచ్.I, II, III మూలలోవున్న ఒక్కొక్కసూటు | రు.150/- |
| ఆర్.బి.జి.హెచ్., ఎస్.ఎన్.జి.హెచ్., ఎస్.వి. అతిథిగృహం, ఎన్.జి.జి.హెచ్. ఒక్కొక్కసూటు | రు.100/- |

* రిజర్వేషను పద్ధతి లేదు.

| | |
|---|---|
| IV ట్రావెలర్స్ బంగళా లోపలి కాటేజి | రు.150/- |
| స్పెషల్ టైపు కాటేజీ (నారాయణగిరి) 2 నుండి 4, 6 నుండి 11, 14 నుండి 18 | రు.350/- |
| ఎన్.జి.సి. 5, 12, 13 | రు.500/- |
| హెచ్.ఆర్.జి. కాటేజి ఒక్కొక్క భాగం ఏ.సి.తో | రు.400/- |
| V మోది భవన్ ఒక్కొక్క సూటు ఏ.సి.తో | రు.250/- |
| శ్రీనికేతన్ అతిథిగృహం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| ఇందిరా అతిథిగృహం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| బాలకుటీర్ ఒక్కొక్క సూటు ఏ.సి.తో | రు.250/- |

| | |
|---|---|
| శ్రీనివాసనిలయం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| శ్రీ లక్ష్మినిలయం ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| గోదావరి సదన్ ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.500/- |
| గాంబుల్ అతిథి గృహం | రు.250/- |
| పద్మావతి అతిథిగృహం (మాస్టర్ సూటు) | రు.1500/- |
| " ఒక్కొక్క సూటు | రు.500/- |
| విద్యాసదన్ మాస్టర్ సూటు | రు.1500/- |
| " ఇతర సూట్లు | రు.500/- |
| గోకులం అతిథిగృహం (టి.బి.సి. దగ్గర) ఒక్కొక్కసూటు ఏ.సి.తో | రు.1000/- |

ముందుగా రిజర్వేషను పద్ధతి లేదు. వీలునుబట్టి కేటాయిస్తారు.

**పెళ్ళి మండపాలు** ఉదయం గంll 8 నుంచి ఉదయం గంll 8 వరకు

| | |
|---|---|
| శంకుమిట్ట కాటేజీలు తూర్పునెం.272, 260, 266, 267 | రు.100/- |
| టి.బి. కాటేజీలు నెం.71, వరుస III నెం.136, 152 | రు.100/- |
| రుయా కాటేజి, గోగినేని కాటేజి, ఎ.టి.సి. నెం.99 | రు.100/- |
| చిదంబరం చెట్టియార్ కాటేజి | రు.100/- |
| శ్రీ సీతారామ కల్యాణ మండపం | రు.1000/- |

* రిజర్వేషను కొరకు డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (ఆర్), తి.తి. దేవస్థానములు, తిరుమల వారిని సంప్రదించాలి.

నిబంధనలు

* రోజు అనగా కేటాయించిన సమయం నుంచి 24 గంటలు
* కోరిన చోట వసతి లభించని సందర్భంలో మరొకచోట వసతి ఏర్పాటు చేస్తారు. ఎక్కువ చెల్లింపు జరిగివుంటే వసతి సర్వీసు చార్జీలు పోను మిగిలినది తిరిగి ఇస్తారు.
* రిజర్వేషను ఒకరోజుకు మాత్రమే చేయబడుతుంది. రిజర్వేషను చేయించుకున్నవారు ఆ రోజు రాకపోతే రిజర్వేషను రద్దవుతుంది. రిజర్వేషను చార్జీలను తిరిగి ఇవ్వటంగాని, తరువాత రోజుకు జమ చేసుకోవడంగాని జరగదు.
* గడవుకు మించి బస చేసిన సందర్భాలలో అపరాధ రుసుముగా అద్దెకు మూడురెట్లు మొత్తం వసూలు చేస్తారు.
* ఇక్కడ సూచించబడ్డ రుసుములు మార్చబడే అవకాశం వుంది.

## తిరుపతిలో వసతి

| | | |
|---|---|---|
| 1. | ఎస్.వి. అతిథిగృహం గది ఒకరోజుకు | రు.100/- |
| 2. | అలిపిరి అతిథిగృహం గది ఒకరోజుకు | రు.75/- |
| 3. | మొదటి కొత్త సత్రం -- సింగిల్ రూము | రు.50/- |
| | డబుల్ రూము | రు.100/- |
| | 4 పడకలు గలది | రు.100/- |
| 4. | పద్మావతి అతిథిగృహం (ఏ.సి. గదులు) | |
| | సింగిల్ రూములు (9, 10) | రు.100/- |
| | రెండు పడకలు గలవి | రు.150/- |
| | రెండు పడకలు గలది మొజాయిక్‌తో గదులు 11,12,15,17 | రు.200/- |
| | రెండు పడకలు గలది సూపర్ మొజాయిక్‌తో గది నెం.16 మరియు 18 | రు.250/- |

ఐ దేశీ పాలకులు కొందరు తమకు జన్మనిచ్చిన దేశంకంటే మిన్నగా భారతభూమిని ప్రేమించారు. హైంద వుల ఆచార విశ్వాసాలపట్ల గౌరవం కలిగిన కొందరు తమ క్రింది ఉద్యోగుల అభీష్టాన్ని మన్నిస్తూ వచ్చారు.

మద్రాసు గవర్నరుగావున్న కొల్లెట్ అను తెల్లదొర వద్ద వీరయ్య అనే దుబాసీ వుండే వాడు. అతడు కాంచీపురంలోని వరదరాజ స్వామి భక్తుడు. తరచూ స్వామి దర్శనంకోసం కంచికి వెళ్తూ వుండేవాడు. వీరయ్య నిర్మింప తలపెట్టిన వరదరాజస్వామి మందిరానికి గవ ర్నరు విశేషంగా ధనం సమకూర్చారు. మద్రా సులో కొల్లెట్ పేరిట ఏర్పడిన ప్రాంతం కాలక్రమేణ కాలాడి పేటగా మారింది.

అలాగే చెంగల్పట్టు జిల్లాకలెక్టరుగా వున్న లైనల్ ప్రైస్ మధురాంతకంలో రామమందిర నిర్మాణానికి కారకుడైనాడు. మధురాంతకం చెరువుకట్ట ప్రతి ఏటా వర్షాకాలంలో తెగి విశేష నష్టం కల్గించసాగింది. దాని మరమ్మ త్తులు ఎంతశ్రద్ధగా చేసినా ఫలితం లేకపో యింది. చివరకు చెరువుకట్ట నిర్మాణం సక్ర మంగా పూర్తిఅయిన రామమందిరం నిర్మించ గలనని కలెక్టర్ మొక్కుకొన్నాడు. చెరువుకు ఏర్పడిన గండి నుండి ప్రవహించే నీటిమీద శ్రీరామచంద్రప్రభువు నిలిచివున్న దృశ్యం కలెక్టరును సంభ్రమాశ్చర్యాలలో ముంచింది. చెరువు కట్ట మరమ్మత్తు జయప్రదంగా ముగి సింది. మరునాడే కలెక్టరు శ్రీరామ మందిర నిర్మాణానికి పూనుకొనినాడు. మధురాంత కంలో నాటి కలెక్టరు వేయించిన శిలాశాసనం నేటికీ నిలిచివున్నది.

దత్తమండలాలకు (రాయలసీమ) తొలి కలెక్టరు (1800 - 1807) తరువాత మద్రాసు రాష్ట్రానికి గవర్నరుగా మరణపర్యంతం (1827) పనిచేసిన సర్ థామస్ మన్రో భారత దేశాన్ని ప్రజలను ప్రేమించినంతగా మరొక విదేశీయపాలకుడు ప్రేమించలేదంటే అతిశయోక్తి కాదు.

ఇంగ్లండులోగల తన బంధువులకు తరచూ లేఖలు వ్రాస్తూ వుండేవాడు మన్రో 12-12-1819న వ్రాసిన లేఖలో "నాకు ఈ దేశ వాతావరణం మనదేశపు దాని కంటే చాలా ఇష్టమైనది" అని వ్రాశాడు మన్రో. మరొకలేఖలో (18.10.1826 తేది గలది) "నేనీ దేశాన్ని వదలి వెళ్లడానికి త్వరపడుతున్నాను. కానీ నాహృదయం చాల క్షోభిస్తున్నది. నా జీవితంలో చాలభాగం ఇక్కడే గడచిపోయింది. ఇది నా స్వంతదేశం కాకపోయెనే అని చింతిస్తూ వుంటాను" అని వ్రాశాడు.

# థామస్ మన్రో దైవభక్తి

## శ్రీ రావినూతల శ్రీరాములు

ఒకానొక సమయంలో మన్రో కడుపు నొప్పితో విపరీతంగా బాధపడుచుండేవాడు. తిరుపతి వేంకటేశ్వరస్వామికి మొక్కుకొనగా ఆతని జబ్బు నయమైనదట! స్వామివారికి భూములు ఈనాముగా సమర్పించుకొన్నాడు. శాశ్వతంగా నైవేద్యం సమర్పించాడు. ఈనా టికీ "మన్రో తళిగ" అని మన్రో పేరి టనే తిరుమలలో స్వామివారికి కైంకర్యం చేయబడుతూ గంగాళం ప్రసాదం భక్తులకు ఉచితంగా పంచబడుతున్నది.

మన్రో అనంతపురం కేంద్రంగా ఏడు సంవత్సరాలు దత్తమండలాల ప్రధాన కలెక్ట రుగా పనిచేశాడు.

ఆప్రాంతంలోని పలు గ్రామాలలో మన్రో గూర్చిన విశేషాలు ప్రచారంలో వున్నాయి.

తాడిపత్రిలోని చింతలవెంకటరమణ స్వామి ఆలయం పూజాదికములు పరమత స్థుల దాడి ఫలితంగా సక్రమముగా జరుగుట లేదు. మన్రో, పరిస్థితిని చక్కదిద్ది స్వామి వారి నిత్యపూజలు నిరాటంకంగా జరుగునట్లు ఏర్పాటు చేశారు.

అనంతపురం పట్టణానికి అనతి దూరంలో గల శింగనమల బ్రాహ్మణులఅ గ్రహారం. అక్కడిపంట చెరువు చాలపెద్దది. శ్రీరంగ రాయలు పాలనలో నిర్మితమైనది. ఒక సంవత్సరం వర్షాభావంతో చెరువు ఎండి పోయి తీవ్రమైన కరవు ఏర్పడింది.

బ్రాహ్మణబృందం కలెక్టరు మన్రోతో తాము వరుణదేవుని ప్రీతికై సప్తాహం సంక ల్పించామని అందుకు కావలసిన ధన సహాయం చేయమని కోరారు. మన్రో అంగీ



## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః' అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార-వ్యవహారాలను విధిగా పాటించండి.
- సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- మాంసాహారాన్ని భుజించకండి.
- ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- పొగత్రాగకండి.
- వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- శ్రీవారి మంత్ర దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ఆలయ ప్రాంగణంలో ఉమ్మి వేయటంవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజకే.

కరించి ఒక షరతు విధించాడు. సప్తాహం పిమ్మట వర్షం కురవక పోతే బ్రాహ్మణ మాన్యాలన్నీ ప్రభుత్వం వశపరచుకొంటుం దనీ! బ్రాహ్మణసంఘం అందుకు అంగీకరించింది.

వరుణ సప్తాహం వైభవంగా జరిగింది. కానీ అనుకొనినట్లు వర్షం కురవలేదు. భీతావహులైన బ్రాహ్మణసంఘం తమ భూముల మీద ఆశ వదలుకున్నారు. శింగనమల లోనే జన్మించిన చిదంబరస్వామి పెనకచర్లలో వుండేవాడు. ఆయన గొప్ప అవధూత. బ్రాహ్మణసంఘం ఆయనను శరణు వేడింది.

స్వామి శింగనమల చేరుకున్నాడు. చెరువు గట్టున గల ఆంజనేయస్వామి దేవాలయంలో మూడు దినాలు తీవ్ర తపస్సు చేశాడు. మూడవ నాటి సాయంత్రం వర్షం లేకనే చెరువు నిండి పొర్లి ప్రవహించసాగింది. పరిసర గ్రామాల వారు సైతం ఈ వింత చూడడానికి తండోప తండాలుగా రాసాగారు.

ఈవార్త కలెక్టరు మన్రో చెవికి సోకింది. వెంటనే తనగుర్రంమీద శింగనమల విచ్చేసి తటాకాన్ని చూచి ఆశ్చర్యపోయినాడు. ఇది దివ్యశక్తి ప్రభావం అని నమ్మి అందుకు కారకులైన అవధూత చిదంబరస్వామిని తన గుర్రం మీద ఎక్కించి ఊరంతా మెరవణి చేయించాడు. స్వామికి మోకరిల్లి ఆశీస్సులందుకొనినాడు.

గతంలో వివిధ దేవాలయాలకు ఆయా కాలాల్లో రాజులు సామంతులు మొదలగు వారు సమర్పించుకొన్న భూములపై ఆధిపత్యం కొనసాగించవలెనా లేక రద్దు చేయవలెనా అనే అంశం పరిశీలించుటకు మన్రో పూనుకొనినాడు. స్వయంగా పెక్కు దేవాలయాలు దర్శించి నిర్ణయాలు తీసికొనినాడు.

సుప్రసిద్ధ లేపాక్షిదేవాలయాన్ని తొలుత దర్శించాడు. ముందుగా వీరభద్రమూర్తిని చూచాడు. -- మీసాలు ఖడ్గము ధరించి గంభీరాకృతి కలిగిన మూల విరాట్ మన్రోకు సద్భావం కలిగించలేదు. ఈయన కోపిష్ఠి స్వామి. వీరికి ఎలాంటి ఈనాములు వుండ

రాదని పేర్కొనినాడు. అదే ప్రాంగణంలో వున్న శ్రీరాముని విగ్రహంపట్ల ఆయన ప్రసన్నుడైనాడు. ఈస్వామి సాధుశీలి. వీరికి భూములు వుండవచ్చునని తీర్మానించాడు మన్రో.

కదిరి పట్టణం సందర్శించిన సమయంలో జరిగిన సంఘటన.

మన్రో దినచర్యలో సాయం వ్యాహ్యాళి ఒకటి. ఒక చిరుతపులి పొదలమాటున నుండి వచ్చి మన్రోపై ఉరికింది. కానీ ఎలాంటి హాని తలపెట్టక వెనుదిరిగినది. మన్రో కలత చెంది అక్కడి పురోహితుని పిలిపించి జరిగిన సంఘటన భావం వివరించమని కోరాడు. ఆతడు చిరుత రూపంలో కదిరి లక్ష్మీనరసింహుడే తమకు దర్శనమిచ్చినారు. స్వామివారి ఈనాము భూముల రద్దుకూడదని హెచ్చరిక చేసినారని తెలిపాడు.

మన్రో మరునాడు ఆలయంలో స్వామిని దర్శించి ఈనాముల రద్దు తలపెట్టక వెళ్లిపోయారు.

మంత్రాలయంలో మన్రోకు కలిగిన అనుభవం బళ్లారి గెజిట్‌లో సైతం ప్రకటించబడింది.

రాఘవేంద్రస్వామి బృందావనం సమీపించగనే మన్రో తన పాదరక్షలను వదలి పాదచారి యైనారు. తలపై టోపీని తొలగించి వినయపూర్వకంగా బృందావనానికి అంజలి ఘటించాడు.

రాఘవేంద్రులు బృందావనం నుండి కదలివచ్చి మన్రోతో ఆలయ భూముల గురించి సంభాషణ జరిపారు. పరిచారకు లెవ్వరికీ స్వామివారి దర్శన భాగ్యంకానీ వారి సంభాషణ కానీ లభ్యం కాలేదు. మన్రో దివ్యాంశ కలవాడని చెప్పటకు ఇది ఒక ఉదహరణ.

తన బస చేరుకొనిన మన్రో మంత్రాలయ మఠమునకు చెందిన ఈనాముల రద్దు ఉత్తర్వును ఉపసంహరిస్తూ ఉత్తర్వు చేశారు.

తన కొసగబడిన మంత్రాక్షతలను ఆనాటి తన భోజనంలో వినియోగించమని మన్రో ఆదేశించారు.

## సత్పురుష లక్షణం

**సూర్యుడు కోరకుండానే తామర పుష్పాలను వికసింప చేస్తున్నాడు. అలాగే చంద్రుడు కూడ కలువలను విచ్చుకునేట్లుగా చేస్తున్నాడు. ఇక మేఘుడు అయాచితంగానే నీటిని వర్షిస్తున్నాడు. ఇలా సత్పురుషులు ఎప్పుడూ పరోపకారం చెయ్యడానికి సిద్ధంగా వుంటారు గదా!**



కడపజిల్లాలో సైతం మన్రోకు దివ్య దర్శనాలు కలిగినవి.

ఒక దేవాలయం అర్చకస్వామి తమ మాన్యాలను రద్దు చేయవలదని మన్రోకు మనవి చేసాడు.

"మీ దేవుడు అంత శక్తి సంపన్నుడు అయితే నాకు దర్శనం చేయించు" అని మన్రో అధికార దర్పంతో అర్చకుని అపహాస్యం చేసాడు. అర్చకస్వామి గాఢ భక్తితో దేవాలయంలోని స్వామికి సాగిలపడినాడు.

చిత్రంగా తెల్లనిగుర్రంపై ఊరేగింపుగా వెడుతున్న దేవుడు మన్రో నేత్రాలకు ఒక్కింత దూరంలో గోచరమైనాడు.

మన్రో అర్చకస్వామి అభ్యర్థన మన్నించి స్వామివారి ఈనాముల జోలికి పోలేదు.

కడపజిల్లా వేంపల్లి సమీపానగల గండి ఆంజనేయక్షేత్రం పరమపావనమైనది. వాయు క్షేత్రంగా ప్రసిద్ధిగాంచినది. పాపాఘ్ని నది రెండు కొండల నడుమగా ప్రవహిస్తూ కనుల విందు చేస్తూవుంటుంది.

ఆ బాటపై మన్రోబృందం వెడుతుండగా ఆశ్చర్యకరంగా కొండ శిఖరాలు రెంటిని కలుపుతూ బంగారుతోరణమొకటి మన్రో కనులకు దర్శనమిచ్చింది.

ఎంత సుందరదృశ్య మిది! అని మన్రో సంభ్రమాశ్చర్యాలు ప్రకటించాడు. ఆతని పరివారంలో ఏ ఒక్కనికి అది గోచరం కాలేదు. పూర్వం శ్రీరాముడు ఇదే బాటగుండా లంకాపురికి వెళ్తుండగా వాయుదేవుడు బంగారుతోరణం కట్టినట్లు స్థలపురాణం తెలుపుచున్నది. ఈ యుగంలో తిరిగి ఆ బంగారు తోరణాన్ని దర్శించగల భాగ్యం మన్రోకు లభించింది. పరివారకుడొకడు అదృశ్యం ఒక మహాపురుషుని అస్తమయానికి సూచన అని తెలిపాడు.

ఆ మహాపురుషుడు మన్రో యే అని తరువాత సంఘటనలు రుజువు పరచినాయి.

1827లో మద్రాసు గవర్నరుగా వున్న మన్రోకు తన పూర్వ మిత్రులను (దత్తమండలాల రైతులు) దర్శించాలని కోరిక కలిగింది. అనంతపురంజిల్లా గుత్తి చేరగానే ఆయనకు కలరా వ్యాధి సోకింది. ఆయన లక్ష్యపెట్టకుండా కర్నూలుజిల్లా పత్తికొండలో మకాం పెట్టారు. వ్యాధి తీవ్రమై అక్కడే 1827 జూలై 6న అంతిమశ్వాస విడిచాడు.

తమ పెన్నిధిని కోల్పోయినట్లు చెన్న రాజధాని ప్రజానీకం శోక తప్తులైనారు.

పూర్వ జన్మలో మాండవ్యమునే ఇప్పుడు మన్రోగా జన్మించాడని పండితులు తలపోశారు.

అప్పట్లో దత్తమండలాల ప్రజలు తమ బిడ్డలకు మన్రోలప్ప. మన్రోలమ్మ అని నామకరణం చేసికొనేవారు.





# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కాంక్షించి వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలు పంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించబడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాల కోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః।

—బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక గుణాతీత మైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

—బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

చంద్రశేఖర

## శ్రీ చక్రపూజ
## శ్రీ దేవీ శరన్నవరాత్రి పూజ

[సంపాదకులు : శ్రీ సాయి సుధాకర పూర్ణానంద స్వామి -- ప్రతులకు : సంపాదకులు, సెక్టర్-8, నెం.26, ముప్పలవాని పాలెం, విశాఖపట్నం--530 017 -- సైజు : $\frac{1}{8}$ డెమ్మీ, పేజీలు : 81 -- వెల : 10/- (పది రూపాయలు)]

"సర్వే వై దేవా దేవీముపతస్థుః కాసిత్వం మహాదేవి; సాబ్రవీత్ అహం బ్రహ్మస్వరూపిణీ" అను శ్రుతి ప్రమాణాన్ని బట్టి శ్రీవిద్య అంటే బ్రహ్మవిద్య అని అర్థం. వ్యక్తంగా వుండే జగత్తుకు శక్తియని, అవ్యక్తంగా వుండే మూలతత్వానికి శివుడని శ్రీవిద్యా పరిభాష. సూర్యుని నుండి సూర్యశక్తిని విడదీయలేనట్లు శివ-శక్తులను విడదీయలేము. కాబట్టే 'శక్తి శక్తిమతో రభేధః' అన్నారు. శక్తిమంతుడగు శివుని శక్తియే జగన్మాత. మూలప్రకృతి, మహామాయ, శ్రీ అనేది ఆ శక్తికి పర్యాయపదాలు. ఈ శక్తి స్వరూపంలోని బ్రహ్మ మాతృమూర్తిగ ఆరాధింపబడి "భోగమోక్షకరీ విద్యా' అని ఇహంలో సుఖజీవనం, పరంలో మోక్షాన్ని సమకూరుస్తుంది. ఈ శక్తిస్వరూప ఆరాధనా విధానాన్ని శ్రీవిద్య అన్నారు.

"ద్వేవావ బ్రహ్మణో రూపే" అని మైత్రాయణీ శ్రుతిలో చెప్పినట్లు బ్రహ్మ రెండు విధాలు. దీనిని జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు బ్రహ్మ సూత్ర ఆనందమయాధికరణ భాష్యంలో "ద్విరూపం హి బ్రహ్మావగమ్యతే, నామరూపభేదోపాధి విశిష్టం, తద్విపరీతం చ సర్వోపాధివివర్జితం" బ్రహ్మ రెండు రూపాలలో తెలియబడుతూంది. అందొకటి నామ-రూప-ఉపాధులతో కూడుకొన్న రూపం. రెండవది దానికి విరుద్ధమగు ఏ ఉపాధులు లేనిది" అని బ్రహ్మకు గల రెండు రూపాలను విశదపఱిచియున్నారు. వారే అంతరధికరణ భాష్యంలో - "స్యాత్పరమేశ్వరస్యాపీచ్ఛావశాన్మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్" - భక్తుల - సాధకుల సాధనా సౌలభ్యం కోసరం, సాధకుల అనుగ్రహించుట కోసరం పరమేశ్వరుని ఇష్టానుసారమే మాయామయ శరీర ధారణ జరుగుతుంది" అని చెప్తూ సోపాధిక బ్రహ్మ (ఉపాధితో కూడినది) ఉపాస్యమని, నిరుపాధికబ్రహ్మ జ్ఞేయమని చెప్పియున్నారు.

జగద్రూపమైన బ్రహ్మ సృష్టి - స్థితి - లయ - తిరోధాన - అనుగ్రహభేదాలతో అనేకవిధాల వుండును. కాబట్టే అట్టి బ్రహ్మ, బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి మొదలైన రూపాలతో వుండునని సాంప్రదాయకులు చెప్తున్నారు. "యతీనాం మంత్రిణాం చైవ జ్ఞానినాం యోగినాం తథా, ధ్యాన పూజా నిమిత్తం హి తనుర్గృహ్ణాతి మాయయా." అని సుప్రభేదాగమం చెప్తోంది. కాలమాధవీయంలో కూడ ఇదేవిషయం చెప్పబడియుంది.




ఇట్లు శ్రీవిద్యా పరబ్రహ్మవిద్యయే యని తేటతెల్లమైంది.

"పుం రూపం వా స్మరేద్దేవీం, స్త్రీరూపం వా విచిన్తయేత్। అథవా నిష్కలం ధ్యాయేత్సచ్చిదానందలక్షణమ్।" అంటూ దేవీధ్యానం స్త్రీ రూపంలో కాని, పురుషరూపంలో కాని, నిష్కలమైన సచ్చిదానంద రూపంలో కాని చేయవచ్చున్నది శాస్త్రం. ఈ విధంగా చిద్రూపిణియగు పరాదేవి సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపిణి యనియు, శ్రీ శబ్ద వాచ్య అనియు తేలినది. ఈ శ్రీవిద్య నిష్కామోపాసకులు బ్రహ్మతత్త్వానుభూతిని ఇస్తుంది. సకామోపాసకులకు వారి వారి అభీష్టాలను తీర్చు కల్పవృక్షం.

శ్రీవిద్య అనగానే అది శాక్తమనీ, క్షుద్ర విద్య అని కొందరి అభిప్రాయం. కానీ అది సరికాదు. "శ్రీ షోడశాక్షరీ విద్యా శ్రీవిద్యేతి ప్రకీర్తితా"- అని షోడశాక్షరి విద్యయే శ్రీవిద్య. పంచదశాక్షరి విద్యకూడ శ్రీవిద్యయే. ఉపనిషద్బ్రహ్మయోగి గారు "నిష్కామానామేవ శ్రీవిద్యాసిద్ధిః, న కదాఽపి సకామానామ్" అంటూ కోరికలతో ఉపాసించువారికి శ్రీవిద్యాసిద్ధి కలుగదని హెచ్చరించియున్నారు. ఈ శ్రీవిద్యోపాసకులకు దేవ్యుపనిషత్తు, భావనోపనిషత్తు మొదలైనవి ముఖ్యగ్రంథాలు.

శ్రీవిద్యలో శ్రీ చక్రపూజ ముఖ్యమైనది. "సర్వతంత్రాత్మికే, సర్వమంత్రాత్మికే..." అని శ్యామలా దండకంలో చెప్పినట్లు శ్రీవిద్య యంత్రాత్మకము, తంత్రాత్మకం కూడ. ... యంత్రాలలో శ్రీ చక్రం ... ముఖ్య యంత్రం, శ్రీవిద్యోపాసకులకు శ్రీచ... ముఖ్యసాధన. ఈ శ్రీచక్రం "... చక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః ...త్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః" ... తొమ్మిది చక్రాలతోకూడిన శ్రీ చక్రం ... శక్తుల శరీరం. "బిందు త్రికోణ ... దశారయుగ్మం, . . . . శ్రీ చక్ర... ముదితం పరదేవతాయాః" అని అన్నారు. ఈ శ్రీ చక్రంలో బిన్దువు, త్రికోణం, అష్టకోణం, దశకోణాలజంట, చతుర్దశకోణం, అష్టదలం మేఖలాత్రయం, నాలుగు ద్వారాలు, తొమ్మిది చక్రాలు వున్నాయి. ఇందు త్రికోణం అష్టకోణం, రెండు దశకోణాలు చతుర్దశకోణం అనేవి శక్తి చక్రాలు. అష్టదళం, షోడశదళం, మేఖలాత్రయం, భూపురత్రయం అనే శివచక్రాలు, ఇలా ఈ తొమ్మిది చక్రాలతో కూడిన శివశక్త్యాత్మకం శ్రీ చక్రం.

ఈ శ్రీ చక్ర మధ్యభాగంలో బిందువు వుంది. ఈ బిందువుతో కలిపి శ్రీచక్రం 44 కోణాలు కలిగి వుంది. "జ్ఞాతా స్వాత్మా భవేత్ జ్ఞాన మర్ఘ్యం జ్ఞేయం హవిః స్థితం శ్రీచక్ర పూజను లేషామేకీకరణమీరితమ్" అంటూ సాధకుని వివిధ ఆత్మవిభాగాలను, శ్రీ చక్రంలోని ఆవరణలకు ఐక్యత చెప్పబడింది. ఇట్లు శ్రీ చక్రం దేవియొక్క ప్రతీకం, ఈ శ్రీ చక్రపూజ శ్రీవిద్యలో ఒక ముఖ్య సాధన.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లువలెనే విద్యుత్ శాతం వచ్చిడీలో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

**కార్యనిర్వహణాధికారి,**

**తిరుమల తిరుపతి దేవస్థానములు,**

**తిరుపతి.**

శ్రీవిద్యా సంపుటితమైన శ్రీసూక్తం పదిహేను ఋక్కులతో, పదిహేను కళలతో విరాజిల్లుతూంది. శ్రీకళ, పరాకళ, శ్రీకామదాకళ మొదలైనవి 15 కళలు శ్రీవిద్యా కళలు. ఇట్టి 15 కళలతో గల శ్రీవిద్యయే శ్రీ సూక్తంలో శ్రీరూపిణిగ వర్ణింపబడింది.

ఇట్టి శ్రీ సూక్తం, బహ్వృచోపనిషత్, త్రిపురా ఉపనిషత్తు, దేవ్యుపనిషత్తులలోని మంత్రాలతో, - సూక్తాలతో శ్రీ చక్రపూజా విధానం ఈ గ్రంథంలో శ్రీ సాయిసుధాకర్ పూర్ణానందస్వామి వివరించారు. ఈ గ్రంథం నిత్యం శ్రీ చక్రపూజచేసే శ్రీ విద్యోపాసకులకు చాల ముఖ్యమైనది. ఈ శ్రీ చక్ర పూజావిధానాన్ని పెద్ద అక్షరాలతో నిర్దుష్టంగా ఇందు పొందుపఱచడం విశేషం. ఈ గ్రంథంలో గ్రంథ సంకలిత శ్రీవిద్యోపాసకులకు మరో ముఖ్యమైనదగు దేవీ శరన్నవరాత్రుల వ్రతాన్ని గురించిన మాహాత్మ్యాన్ని, తెలుపుటేగాక, వేదోక్త క్రమంలో శ్రీదేవీ శరన్నవరాత్రుల పూజా విధానం కూడ ప్రకటించి శ్రీవిద్యోపాసకులకు చాల మేలు చేశారు. శ్రీవిద్యోపాసకులందరివద్ద ఉండ తగిన గ్రంథమిది.

— "స్వామి"

### సుశ్లోక లా(రా)ఘవం

[సుశ్లోక రాఘవం - పంత విఠ్ఠల విరచితం; ప్రకాశకులు : శ్రీ కాసుల విశ్వనాథశాస్త్రి; ప్రతులకు : శ్రీమతి ఎ. రాజేశ్వరి, తాళ్ల బస్తి, కబాడి గూడ, హైదరాబాదు--80; వెల : 40/-.]

మహారాష్ట్రదేశీయుడైన పంతవిఠ్ఠలకవి సుశ్లోకలా(రా) ఘవం అనే ఈ కావ్యాన్ని శాలిశక 1775 లో (1833 క్రీ. శ.) రచించాడు. ఇది సంస్కృత భాషలో ముక్తకాలుగా వ్రాసిన 550 శ్లోకాలు గల చక్కని శ్లేష కావ్యం. ముక్త రచన అయినా దీనిలో కవి అభిరుచిని బట్టి, స్వభావాన్ననుసరించి, విషయ దృష్ట్యా కొన్నిచోట్ల సమన్వయం కనిపిస్తూంది.

కవి రామభక్తుడు. కావ్య నామంలోనే ఈ విషయం స్ఫురింపజేశాడు. దానభక్తికి సంబంధించిన చక్కని శ్లోకాలెన్నో శ్లిష్ట కవితా బంధాలుగా ఈకావ్యంలో కనిపిస్తాయి. కావ్యం మొత్తం మీద భక్తి, జ్ఞాన, వైరాగ్యాలకు, లోకరీతి నీతులను వర్ణిస్తూ నడిచింది. కవికి ప్రాచీన భక్తులు, సాధకులు, భగవద్దాసులు అయిన మహనీయులపట్ల అతీతమైన ఆదరాభిమానాలు, శ్రద్ధాభక్తులు ఉన్నాయి. ఆకారణాన్ని ఇందులో సమర్థ రామదాసు, తులసీదాసు, కబీరు వగైరాల ప్రశంస లెన్నో వినిపిస్తాయి. మహారాష్ట్ర ప్రాంతపు కవులు, అక్కమహాదేవి వంటి కవయిత్రులు కూడ ప్రశంసింపబడ్డారు. కవితలో ప్రాచీన సంస్కృత కవులైన వామన మయూరాదులు కూడ కీర్తింపబడ్డారు. గీత, ఉపనిషత్తులు వంటి గ్రంథాలలోని వాక్యాలు కొన్ని సందర్భానుసారంగా శ్లోకాలలో చేర్చి ఉద్ధరించబడ్డాయి.

ఈ కవి చిత్ పావన బ్రాహ్మ కులీనుడు. ఇతని కవిత అల్మార్థం వ్రాసిన దేకాని ఏరాజాశ్రయం లోనో నిల్చి వ్రాసినది కాదు. శ్లేష లేని శ్లోకం మచ్చుకు ఒకటి కూడా దొరకదు. సందర్భానుసారంగా శ్లేషతోపాటుగా తదితర శబ్దాలంకారాలు అర్థాలంకారాలు కూడ వాడి కవి ప్రతిపద్యచమ్కృతిని సాధించాడు. శబ్దాలకున్న నానార్థాలతోపాటు, సంస్కృత భాషా సహజమైన సంశ్లేష విశ్లేషణశక్తిని కూడా యధేచ్ఛగా వాడి ఈ కవి శ్లేషచమత్కారాన్ని మనోహరంగా నిర్వహించాడు. శబ్దంలోని అక్షరాల మార్పు, విడుపు, విలోమరీతిలో పేరుపు, మధ్యలో విరుపు వంటి వెన్నో పద్ధతులు వాడి అనూహ్యమైన రీతిలో శ్లేషార్థాలు తీసి చూపాడు.

శ్రీ డా॥ ఆదరానుపల్లి యజ్ఞరాములు, డా॥ కుడ్లకుంట అలహసింగరాచార్యులు గ్రంథాన్ని చక్కగా అనువదించడమేకాక, శ్లేషను వివరిస్తూవచ్చారు.

సాహిత్యాభిమానులంతా చదివి ఆనందించ దగిన గ్రంథం.

ముట్నూరి సంగమేశం

# అన్నీ ఆయనే

శ్రీమతి ఎస్. విజయలక్ష్మి - బొంబాయి



వేంకటేశ్వర స్వామివారు మా కుటుంబాన్ని ఎల్లప్పుడు ఆదుకుని మా కష్టాల్ని గట్టెక్కిస్తున్నారు.

ఈ సంఘటన జరిగి చాలా కాలం అయింది. నాభర్త కేంద్రప్రభుత్వానికి చెందిన ఒక సంస్థలో డాక్టరుగా పనిచేస్తూ ఉండే వారు. హఠాత్తుగా ఆయనకు కుడిచేయి స్వాధీనం తప్పింది. అది పక్షవాతం కాదని డాక్టర్లు తేల్చారు. అన్ని రకాల పరీక్షలు జరిగేయి కానీ డాక్టర్లు ఒక నిర్ణయానికి




రాలేకపోయేరు. అంటే అసలు చేయి పడిపో వటానికి కారణం ఏమిటో ఎవ్వరికి అంతు పట్టలేదు. ఈ కేసుని ఒక న్యూరో సర్జనుకి రిఫర్ చేస్తే, ఆయన ఒక చిన్న ఆపరేషన్ లాంటిది మెడ వెనుక చేస్తే ఏ సంగతీ అంతు పట్టవచ్చునని అన్నారు. న్యూరో సర్జన్ వేరే హాస్పిటల్ నుంచి వారంకి ఒక సారి పనిచేస్తున్న డిఫెన్స్ హాస్పిటల్‌కి వస్తూ ఉండేవారు. ఆపరేషన్ చేసే రోజు రానే వచ్చింది. ఈయనను సిద్ధం చేసి ఆప రేషన్ చేసే సమయానికి ఫోను వచ్చింది. ఆపరేషన్ చేసే సర్జను కొన్ని అనివార్య కారణాల వల్ల రాలేరనీ ఆపరేషన్ కాన్సిల్ చేయమని వెంటనే ఇంటికి పంపేశారు. ఆ మరుసటి రోజు నామనస్సు బాగులేక క్రింది అంతస్థులో ఉన్న మా స్నేహితుల ఇంటికి వెళ్ళేను. ఆపరేషన్ వాయిదా పడినందుకు ఆమె చాలా విచారం వ్యక్తపరిచారు. ఆ రోజే మా ఇంటినుండి ఉత్తరం వచ్చింది గోత్రనామాలనీ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆల యంలో పూజ చేయిస్తామనీ వెంటనే నక్షత్రం వగైరా రాయమనీ ఈ సమాచారం మాటల సందర్భంలో ఆమెతో అన్నాను. అంతే ఆమె ఒక్కసారి ఇల్లు దద్దరిల్లేటట్లు గర్జిస్తున్నట్టుగా 'ఏం పూజ చేయిస్తావు' 'ఏం పూజ' అని నాకు అర్థంకాలేదు. ఏమీ తోచలేదు. కళ్ళు





ప్పగించి ఆమెనే చూస్తున్నా. ఆమె ముఖం ఎర్రగా కంది పోయింది కళ్ళవెంట నీళ్ళు అలా కారుతున్నాయి మనిషి ఉగ్రంగా ఉంది. ఈమె ఎందికిలా మారిందోనని అర్థంకాక అయోమయ అవస్థలో ఉన్న నాకు "నా కొండకి రాకుండా ఏంపూజ చేయిస్తావు" అన్నీ మళ్ళీ గద్దించి అడిగే సరికి కొంత అర్థం అయి భయంతో వణక సాగాను. ఇంట్లో ఎవ్వరు లేరు. నేను ఆమె అంతే. ఇంతలో ఆమె మేనకోడలు బయట నుంచి వచ్చి ఇదంతా చూసి విని - వెంకటేశ్వర స్వామివారు వంచేసారు. "వస్తానని చెప్పి నమస్కారం చేయి" అన్నది వెంటనే ఆమె సోఫా పై తలవాల్చేసింది. వెంటనే లేచి అసలు ఏమీ కానట్లు మామూలుగా అయిపో యింది. నేను వెంటనే ఆమె దగ్గర సెలవు తీసుకొని ఇంటికి వచ్చి నా భర్తకు ఈ సమా చారం తెలియపరిచాను. ఆయన "అవును నేను నా మెడిసిన్ ఆఖరి సంవత్సరములో మొక్కుకున్నాను. అన్ని సబ్జక్టు మొదటి ఛాన్సులోనే పాసు అయితే, కొండకు వచ్చి

తలనీలాలు ఇస్తానని. కానీ ఇప్పటి వరకూ ఆ మొక్కు తీర్చనే లేదు అని" "నా చేయి నాకు ఇచ్చేస్తే నేను వెంటనే తిరుపతి వెళ్తాను" అని అంటూ చేయి పైకి ఎత్త ప్రయత్నించాడు. అంతే మెల్లగా చేతిలో చలనం వచ్చి చేయి పైకి ఎత్తగలిగాడు ఆయనంతట ఆయనే. మేము ముందు నమ్మలేక పోయేం. కానీ పూర్తిగా కదలిక వచ్చేసింది. మా కళ్ళ ఎదుట సాక్షాత్తుగా జరిగిన సంఘటన ఇది. శ్రీస్వామివారి మహత్యాన్ని ఇలా కళ్ళ ఎదురుగా చూడగలిగేం అంటే ఆయనేకాదు మేమంతా ఎంతో అదృష్టవంతులం అనుకున్నాం. స్వామిని అందుకే అపార దయాసముద్రుడంటారు. ఏ డాక్టర్లు, ఏ మందూ నయం చేయలేని జబ్బుని తృటిలో మాయంచేసి తన మహాత్మ్యాన్ని చూపించాడు. ఇది అక్షరాలా నిజంగా జరిగిన సంఘటన. అదీ ఒక డాక్టరుకు అందులోనూ డిఫెన్సు సర్వీసులో ఉన్న ఒక డాక్టరుకు జరిగింది. ఇక ఇక్కడ ఒక చిన్న విషయం-- నమ్మిన వారికి ఆయనే అన్నీ-- ఆయనే డాక్టరు ఆయనే ప్లీడరు ఆయనే అన్నీ.

ఇది జరిగిన కొంతకాలానికి-- నా కుడి కాలిపై తెల్లని మచ్చ ఒకటి కనిపించింది. ఎందుకైనా మంచిదని డాక్టరుకి చూపించేను. ఆయన పరీక్షచేసి ఇది చాలా ఘోరమైన చర్మవ్యాధి అన్నట్లుగా తెల్పేడు. అయినా మందులు వాడితే తగ్గిపోతుందని ధైర్యం చెప్పి ఆ మచ్చ ఉన్న భాగంలో కొంత చర్మం తీసి పరీక్షకని పంపేరు.

అదంతా జరుగుతున్న సమయంలో నా మనస్సుకి తోచిందేవిటంటే-- "ఇదంతా వట్టిది నాకేం వ్యాధి లేదు, నేను పరిపూర్ణ ఆరోగ్యవంతురాల్ని" అని. అదే ఆ డాక్టరుకి చెప్పేను. మీ అభిప్రాయానితో ఏకీభవించ లేక పోతున్నా. నేను డాక్టరుని కాదు, కానీ నాకెందుకో అనిపిస్తూంది నాకు అలాంటిది ఏమీ లేదని. బహుశా ఆ డాక్టర్లు మనసులో నవ్వుకొని ఉంటారు. కానీ ఎందుకో దేముడు-- నా స్వామి నాకు ధైర్యం చెబుతున్నట్లు అనిపించింది. ఏ సంగతి రిపోర్టు వస్తేకానీ తెలియదు. నేను స్వామికి మొక్కుకున్నా తలనీలాలు ఇస్తానని. అప్పుడే కొండకి వెళ్ళి స్వామివారి దర్శనం చేసుకుని కాలినడకన వెళ్ళేదారిలో శ్రీ నరసింహస్వామివారి ఆలయం ఉంది. టి.టి.డి. వారు దాన్ని ఇప్పుడిప్పుడే అంతా బాగుచేయించి పునరుద్ధరించేరు. ఈ కోవెల, ఈ స్వామి మహత్యం చాలా గొప్పది. గొప్ప మహత్యం గల స్వామి కొండ ఎక్కుతూ వీరి దర్శనం చేసుకొని ముందుకు వెళ్తే అన్నీ సిద్ధిస్తాయి. ఇది నా అనుభవం. ఈ దర్శనాలన్నీ చేసి వచ్చేను కనుక, నాకు మనస్సులో గట్టి నమ్మకం కలిగింది. నాకు భగవంతుడు ఈ విధంగా దీవిస్తాడా? లేదు ఇదంతా వట్టిదని అయినా మొక్కుకున్నాను. "స్వామీ! నీకు నా తలనీలాలు ఇస్తానని, రిపోర్టు రాగానే నీ దర్శనానికి వస్తానని". ఇదే ఒక డాక్టరు చదువుతున్న మా స్నేహితుల కూతురైన ఓ అమ్మాయితో చర్చిస్తుండగ-- స్వామి నాపై వచ్చి నాలో నేనే మాట్లాడుకుంటున్నట్లు-- ఈమెకి ఏం జబ్బూ లేదు. ఇది నూటికి నూరుపాళ్ళు నిజం అని చాలా ధైర్యంతో కూడిన ఒక దివ్యవాణిగా మాటలు వెలువడ్డాయి. నేను మామూలుగానే ఉన్నాను. కానీ ఆ మాటలు నేను అన్నవి కావు. వారం తరువాత రిపోర్టు వచ్చింది. నాకు అలాంటి చర్మవ్యాధి ఏదీలేదని రిపోర్టులో తేలింది. ఇది జరిగి నాలుగు నెలలు అయింది. వెంటనే నేను తిరుపతి మళ్ళీ వెళ్ళి దైవదర్శనం చేసుకున్నాను. నా కాలిపై మచ్చ ఎలా మటుమాయం అయిందో నాకే తెలియదు.

✡

( 6 వ పేజీ తరువాయి)

నీవ సర్వంబును నిర్మింతు సతతంబు
నీవ యీ విశ్వంబు నెమ్మిఁదాల్తు,
లీల నింతయు నీవ పాలింతు కరుణచే
సకలంబు తుది నీవ సంహరింతు,
సృష్టి రూపవును సుస్థితిరూపవును నీవ
సంహృతి రూపవు జనని నీవ
శ్రీయు బుద్ధియు ధృతియును హ్రీయు నీవ
పుష్టియును శాంతియును నీవ తుష్టివీవ
ఈశ్వరియు నీవ జగములకెల్ల మోహ
రాత్రి కాల రాత్రివి మహారాత్రి నీవ.

--మార్కండేయ -- 6-40

అని బ్రహ్మచేత ప్రార్థింపబడి ప్రసన్నయై మహాకాళిగా అవతరించి విష్ణువుకు తోడ్ప డిందట. ఇది మొదటి అవతారం. ఈశ్వ రుని కోపాగ్ని నుంచీ పుట్టి సింహవాహనా రూఢయై లోకకంటకుడైన మహిషాసురుణ్ణ చంపిన మహిషాసురమర్దని రెండవ అవ తారం. పార్వతి గంగాస్నానం చేయబోయే సమయంలో ఆమె శరీరంనుంచీ ఉద్భవించి శుంభనిశుంభులు, చండముండులు, రక్త బీజుడు అనే దానవుల్ని సంహరించిన మూడవ అవతారం చాముండేశ్వరి. విష్ణుదేవుని ఆదే శానుసారం వ్రేపల్లెలో నందుని ఇంట జన్మించి తన్ను చంపటానికి ప్రయత్నించిన కంసుణ్ణి 'నిన్ను చంపే మహాత్ముడు క్షేమంగా వున్నాడు' అని హెచ్చరించి అదృశ్యమైన మహామాయ నాల్గవ అవతారం.

విప్రచిత్తు మొదలైన రాక్షసుల్ని దంతా లతో చీల్చి చంపిన రక్తదంతి అవతారం ఐదవది. దనుజ సంహార సమయంలో ఆదేవి పండ్లు దానిమ్మ పువ్వుల లాగా ఎర్రగా ఉన్నా యని మారనకవి వర్ణిస్తాడు. ఆరవ అవతారం శాకంభరి. ఒకప్పుడు అనేక సంవత్సరాలు లోకంలో కరువు సంభవించి ప్రజలు ఆకలితో అలమటిస్తూ వుండగా దేవి వారికి ఆహారంగా ఆకులలములు ప్రసాదించి ఆదుకొన్నదట. ఏడవ అవతారంలో దుర్గముడనే దనుజుణ్ణి చంపి దుర్గాదేవిగా పిలువబడింది. ఎనిమిదవ అవతారం మాతంగి. మతంగ మహాముని కుమార్తెగా ఉదయించి రక్కసుల్ని మట్టు పెట్టడంతో ఈ పేరున వ్యవహరించబడింది. లోక భయంకరుడైన అరుణుడనే రాక్షసుణ్ణి చంపటానికి తొమ్మిదవ అవతారంగా భ్రమ రాకారం (తుమ్మెదరూపం) ధరించడంతో భ్రమరి అనే పేరు పొందింది.

ఈ విధంగా తొమ్మిది అవతారాలు వరుసగా ధరించి దుర్మార్గుల్ని చెండాడిన ఈ దేవి వింధ్యవాసిని, భీమా, అంబికా, పార్వతి మున్నగు పేర్లతో కూడ ఆరాధింప బడుతూవుంది. శాంతి కర్మలలోనూ, గ్రహ పీడలలోనూ, బాలగ్రహాలు సోకినప్పుడున్నూ ఈ మహాదేవిమాహాత్మ్యాన్ని పఠించినట్ల యితే సమస్త శుభాలూ సమకూరుతాయి. తన్ను పూజించిన వారిని ఆ తల్లి ఏ విధంగా కాపాడుతుందో ఆమే ఈ విధంగా సెలవి చ్చింది--

"నా మాహాత్మ్యము విన్న మానవులకున్ సమ్యక్ శుభోత్పత్తి, సంగ్రామజేయపరాక్రమంబు, ప్రతి పక్షవ్రాతనాశంబు, సుశ్రీమాంగళ్యము గల్గు వంశములు పచ్చిలమ్ములన్ సమ్మదశ్రీమించన్ విలసిల్లు పుత్రుడు గుణశ్రేష్ఠుండు పుట్టున్ కడున్."

--మార్కండేయ 6-236.

ఈ నవరాత్రోత్సవం తర్వాత జరుపుకొనే పండుగ విజయదశమి. ఈ పండుగకు ఈ పేరు రావటానికి రెండు కథలు ప్రచా రంలో వున్నాయి. మొదటి కథ శ్రీరాము నికి సంబంధించింది. రెండవకథ అర్జునునికి సంబంధించింది. శ్రీరాముడు రావణునితో యుద్ధం చేసేటప్పుడు వాని తలల్ని ఖండించే కొద్దీ అవి తిరిగి మొలుస్తూ వున్నాయట. వాణ్ణి సంహరించే మార్గం తెలియక రాముడు నిద్రలో వున్న దేవిని పూజించాడట. రామ ప్రార్థనకు ప్రసన్నమైన దేవి మేల్కొని ఆయ నకు విజయం కలిగేటట్లుగా దీవించిందట. దేవి అనుగ్రహానికి పాత్రుడైన శ్రీరాముడు రావణుణ్ణి దశమినాడు చంపి, శమీవృక్షాన్ని పూజించి పుష్పక విమానంలో అయోధ్యకు ప్రయాణమయ్యాడట. దేవి మేలుకొన్న దినం ఆశ్వయుజ శుద్ధపాడ్యమి అనీ, రావణ సంహారం దశమినాడు జరిగిందనీ ఆ కార ణంగానే దేవిని పాడ్యమినుంచీ పూజించడం మొదలుపెట్టి దశమితో శమీవృక్షపూజానం తరం పరిసమాప్తిని పొందించటం జరుగు తుందనీ, దశమినాడు రామునికి విజయం సిద్ధించటంతో విజయదశమిగా ఈ పండుగను వ్యవహరిస్తారనీ అభిజ్ఞులంటున్నారు.

రెండవకథ ఈ విధంగా వుంది. అజ్ఞాత వాసానంతరం అర్జునుడు ఉత్తరగోగ్రహణ సమయంలో శమీవృక్షంమీద నిక్షిప్తంచేసిన గాండీవాన్ని స్వీకరించి కౌరవుల్ని ఓడించి విజయాన్ని పొందాడట. దశమినాడీ కార్యం జరగడంతో విజయదశమి అని ఈ పండుగను వ్యవహరిస్తారట. అర్జునునకు విజయుడనే పేరుండటంకూడ ఇందుకు కారణం. శమీవృ క్షాన్ని పూజించే సందర్భంలో పఠించబడుతూ వున్న క్రింది శ్లోకాల్లో అర్జునుణ్ణీ, రాముణ్ణీ పేర్కొనడంవల్ల పై కథలు కల్పించబడ్డాయని విజ్ఞుల ఊహ-- ఆ శ్లోకాలివి--

శమీ శమయతే పాపం
శమీ శత్రు వినాశనీ,
అర్జునస్య ధనుర్ధారీ
రామస్య ప్రియవాదినీ.

కరిష్య మాణ యాత్రాయాం
యథాకాలం సుఖం మయా,
తత్ర నిర్విఘ్న కర్త్రీత్వం
భవ శ్రీరామ పూజితే.

ఈ కథలు ఎలా వున్నా ఆశ్వయుజ శుక్ల పక్ష దశమీ సాయంకాలాన్ని విజయ కాలమని వ్రతగ్రంథాలు పేర్కొంటున్నాయి.

ఆశ్వినస్య సితే పక్షే
దశమ్యాం తారకోదయే
సకాలో విజయో నామ
సర్వ కామార్థ సాధకః.

ఆశ్వయుజ శుద్ధ దశమీ దినంనాటి సాయంకాలానికి విజయకాలమని పేరు. ఆ కాలంలో పూజలు చేసేవారు సమస్త కార్యా ల్లోనూ విజయాన్ని పొందగలరట.

ఈ కారణంగా దీనికి విజయదశమి అని పేరు వచ్చిందని జ్యోతిష్కుల అభిప్రాయం.

ఈ పండుగ సమయంలో శమీవృక్షాన్ని (జమ్మిచెట్టు) పూజించడంలోని రహస్యాన్ని సుప్రసిద్ధ విమర్శక పండితులు శ్రీ సురవరం

ప్రతాప రెడ్డి ఈవిధంగా ఊహిస్తున్నారు. "అతి ప్రాచీనకాలంలో ఆర్యుల దేవతలలో 'అపరాజితాదేవి' ముఖ్యదేవత. పరాజయం లేని దేవత అని ఈ పదానికర్థం. నవ మీశేషయుక్తమైన దశమీ దివసంలో అప రాజితాదేవిని పూజిస్తే ఆమె విజయాన్ని ప్రసాదిస్తుంది. ఈ విజయదశమి క్షత్రి యుల పండుగ కావడంతో రాజులు యుద్ధ

## పయనమాయెను

పయనమాయెను స్వామి పసిడి రథంబున
పరమ భక్తులపాలి భాగ్యమై తనరుచు. ॥పయన॥

దినకరకోటి దివ్యతేజముతోడ
కనులకు మిరుమిట్లు గొలుపు కాంతులతోడ
వనజలోచనుడు వరదహస్తముతోడ. ॥పయన॥

వజ్రకిరీటము శిరమున మెఱయగ
తిరుమణి నుదుటను దీప్తిమంతముగాగ
ఉరమున శ్రీలక్ష్మి యున్నతముగ నొప్ప
కరుణార్ద్రహృదయుడు కమనీయ మూర్తియై. ॥పయన॥

కౌస్తుభమణి రత్నకాంచనహారంబు
లురమున శృంగార భరముగ వెలయగ
కరముల శంఖ చక్రంబుల వరకాంతి
సురమునివరకోటి కానంద మొదవగ. ॥పయన॥

* * *

వెడలెను శ్రీహరి వేంకట రమణుడు
కనక రథంబున కళ్యాణ మూర్తియై. ॥వెడలెను॥

శ్రీదేవి భూదేవి చిరునగు మొగముల
చెలువుమీరగ ఇరుచెంతల జేరగ
భక్త జనుల కనుల పండువై భాసిల్ల
ముక్తిని సమకూర్చు మోహనాకారుడు. ॥వెడలెను॥

భవుడాదిగా శుక బ్రహ్మేంద్రాదులు
పరిపూర్ణ భక్తులు ప్రార్థన సేయగ
గరుడ విష్వక్సేన తుంబురు నారద
సనకాది మునులు సన్నుతి సేయగ. ॥వెడలెను॥

వేద నాదముల వినుతులు వెలయగ
భజన బృందముల వైభవమలరగ
మంగళ వాద్యముల్ మధురమై తనరగ
పురవీధులందున పుండరీకాక్షుడు. ॥వెడలెను॥

శ్రీ బుర్రి చెంగారెడ్డి

యాత్రకు బయలుదేరేటప్పుడు విజయాధిదే వత అయిన అపరాజితాదేవిని దశమినాడు పూజించి జైత్రయాత్రకు బయలుదేరేవారు. 'అపరాజిత' అనే శబ్దానికి వైద్య గ్రంథాల్లో 'శమీ వృక్ష భేదము' అనే అర్థం వుంది. (శబ్ద కల్పద్రుమము) అపరాజితాదేవిపూజ తర్వాతి కాలంలో శక్తిపూజగా పరిణమించిన ప్పటికీ దాని పర్యాయపదం యొక్క అర్థమైన శమీ వృక్షపూజకూడ తరువాతి కాలంలో ఏర్ప డివుండవచ్చు. జనసామాన్యంలో అపరాజితా దేవి పూజలేనందువల్ల తత్పర్యాయపదార్థమైన శమీ వృక్షానికి పూజచేయడం ఆచరణలోనికి వచ్చివుంటుంది." (హిందువుల పండుగలు - 46వ పేజీ) ఈ ఊహ సమంజసమూ సయుక్తికమూ సముచితమూ అని చెప్పవచ్చు.

ఇది శరత్కాలంలో వచ్చే పండుగ. ఈ కాలంలో వర్షాలుండవు. ఎండగానీ, చలి గానీ అధికంగా వుండకపోవటంతో ప్రయా ణాలకు ఈ కాలం చాల అనుకూలం. రాజులు యుద్ధయాత్రలకు ప్రధానంగా ఈ కాలాన్నే ఎన్నుకొనేవారట. ఈ పండు గనాడు మనంచేసే ఆయుధపూజ, శమీ పూజ, గ్రామ పొలిమేరల్ని కోలాహలంగా దాటిరావటం ఇవన్నీ రాజులు యుద్ధానికి వెళ్లేముందు చేసే సన్నాహాలకు సంకేతాలే. ఒకప్పుడిది క్షత్రియుల పండుగే అయినా (ఆశ్వయుజ పాడ్యమినాడు ప్రారంభించి 9 దినాలు వరుసగా దేవీపూజచేసి, పదవ దినం శమీవృక్షపూజానంతరం రాజులు యుద్ధానికి బయలుదేరేవారట.) ఈ నాడు సర్వప్ర త్తులవారూ విజయాకాంక్షతో ఈ దశమి రోజు తమకు జీవనాధారాలైన ఉపకరణల్ని పూజించడం జరుగుతూ వుంది. నూతనంగా ప్రారంభించే సమస్త కార్యాలకూ ఈ విజయ దశమి ప్రశస్తమైందని మన విశ్వాసం. ఇది కార్యాచరణకు ఆత్మస్థైర్యాన్నీ, నమ్మకాన్నీ ప్రసాదిస్తుందనడంలో సందేహమేముంది?

సర్వ మంగళ మాంగళ్యే
శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి
నారాయణి నమోస్తుతే.

మన భారతీయ సాహిత్య భాండాగారంలో ఎన్నో సామెతలు, సూక్తులు వున్నాయి. ఈ లోకోక్తు లన్నింటికి మూలం దైవభాష సంస్కృతమే. సప్రమాణంగా ఒక మాటచెప్పాలంటే ఛందోబద్ధమైన సంస్కృత శ్లోకాన్ని ఉదాహరించటం మన వారి ఆచారం. ఏదైనా చర్చల్లో తర్జన భర్జనలు జరుగుతూంటే ఏ గ్రంథంలోని శ్లోకమైన ఉదాహరిస్తే ప్రమాణంగా అందరూ ఆమోదిస్తారనేది మన అనుభవంలోని విషయమే.

## 1. వినాశకాలే విపరీతబుద్ధిః

న నిర్మితో నైవ చ దృష్ట పూర్వం
న(శూయతే హేమమయః కురంగః
తథాపి తృష్ణా రఘునందనస్య
వినాశకాలే విపరీతబుద్ధిః.

బంగారు లేడి ఉండదని తెలిసినా శ్రీరాముడు తృష్ణవల్ల వినాశం తెచ్చుకొన్నాడు.

## 2. ఋణాను బంధ రూపేణ.....

ఋణాను బంధ రూపేణ
పశుపత్ని సుతాలయాః,
ఋణక్షయే క్షయం యాంతి
తత్ర కా పరిదేవనా?

పశువులు, భార్య, గృహం, ఋణానుబంధం వల్ల వస్తాయి. ఋణం తీరినప్పుడు మనల్ని విడిచి వెడతాయి. వీటికై విచారించడం దేనికి?

## 3. బుద్ధిః కర్మానుసారిణీ

కిం కిం న కుర్యాత్ ప్రాజ్ఞోఽపి
ప్రేర్యమాణః స్వకర్మభిః,
ప్రాగేవ హి మనుష్యాణాం
బుద్ధిః కర్మానుసారిణీ.

తన కర్మ వల్ల ప్రేరేపించబడిన మనిషి ఏమి చేయలేడు? బుద్ధి మనిషిని కర్మననుసరించి నడిపిస్తుంది.

## 4. అతివినయం ధూర్తలక్షణం

ముఖం పద్మదళాకారం
వచ శ్చందన శీతలమ్,
హృత్కర్తరీ సమంచాతు
వినయం ధూర్త లక్షణమ్.

తామర రేకులవంటి ముఖము, మంచి గంధమువలె చల్లనైన పలుకులు, కత్తెరతో సమానమైన మనస్సు, మిక్కిలి వినయపు మాటలు-- ధూర్తులకుండే లక్షణాలు.

## 5. వసుధైక కుటుంబకం

అయంనిజః పరశ్చేతి
వికల్పో లఘుచేతసామ్,
ఉదారచరితానాం తు
వసుధైకకుటుంబకమ్.

స్వపర భేదం చిన్న మనస్సు కలవారికి మాత్రమే ఉంటుంది. ఉదార హృదయులకు లోకమంతా ఒకే కుటుంబముగా గోచరిస్తుంది.

## 6. దండం దశగుణం భవేత్

విశ్వామిత్రా హి పశుషు
కర్దమేషు జలేషు చ
అంధే, తమసి వార్ధక్యే
దండం దశగుణం భవేత్.

పక్షులు, కుక్కలు, శత్రువు, పాము, పశువులయందు, బురదయందు, నీటియందు, చీకటిలో, కళ్లు కనిపించనప్పుడు ముసలి తనమునందు ఉపయోగించటానికి దండం (కర్ర) పది లాభాలు కల్గి వున్నది.

## 7. బాలానాం రోదనం బలమ్

పక్షిణాం బల మాకాశం
మత్స్యానా ముదకం బలమ్,
దుర్బలస్య బలం రాజా
బాలానాం రోదనం బలమ్.

పక్షులు ఆకాశంలో, చేపలు నీటిలో బలాన్ని కలిగివుంటాయి. బలహీనుడికి రాజు అండబలము-- చిన్న పిల్లలు 'ఏడుపు' ఆయుధంగా అన్నీ సాధించే బలం కల్గివుంటారు.

# ఆర్షవాక్కు

## 8. ధనమూల మిదం జగత్

వేదమూల మిదం బ్రాహ్మ్యం
భార్యామూల మిదం గృహమ్,
కృషిమూల మిదం ధాన్యం
ధనమూల మిదం జగత్.

వేదము వల్ల బ్రాహ్మణత్వం, భార్యవల్ల గృహం, వ్యవసాయం వల్ల ధాన్యం, ధనం వల్ల ఈ జగత్తూ ఆధారపడి వున్నాయి.

## 9. దుష్టం దూరేణ వర్జయేత్

శకటం పంచహస్తేషు
దశహస్తేషు వాజినమ్,
గజం హస్తసహస్రేషు
దుష్టం దూరేణ వర్జయేత్.

ఐదు అడుగుల దూరంగా బండికీ, గుర్రానికి పది అడుగుల దూరంలోనూ, వేయి అడుగులదూరంగా ఏనుగుకీ వుండాలి. కాని దుష్టులకి వీలైనంత దూరంగా వుండాలి.

## 10. పుస్తకం, వనితా విత్తం పరహస్తం గతం గతమ్

పుస్తకం వనితా విత్తం
పరహస్తం గతం గతః,
అథవా పునరాయాతి
జీర్ణం భ్రష్టా చ ఖండశః.

ఇతరుల పాలైన పుస్తకం, స్త్రీ, ధనము ఈ మూడూ పోయినట్లే లెక్క! అలాకాక తిరిగివస్తే పుస్తకం చిరిగి శిథిలమై, స్త్రీ భ్రష్టురాలై, ధనము కొంతభాగంగా మాత్రమే రాగలదు.

ఇలా ఎన్నో సామెతలు సంస్కృత వాఙ్మయంలో వున్నాయి. మన దైనందిన జీవనంలో అడుగడుగునా హెచ్చరిక చేస్తూ ఉద్దేశిస్తూ వుంటాయి.

✡ ✡ ✡

శ్రీమతి భమిడిపల్లి విజయలక్ష్మి

# జిహ్వాకో రుచి

శ్రీ బులుసు జీ. ప్రకాష్

'జిహ్వాకో రుచి' అన్నారు పెద్దలు. ఒకరికి ఓ కూర ఇష్టమైతే, వేరొకరికి ఇంకో కూర ఇష్టం. ఒకరికి పులుసు ఇష్టమైతే, ఇంకొకరికి చారు ఇష్టం. కొందరికి రెండూ ఇష్టమే!

కొందరికి సాహిత్యం ఇష్టమైతే మరి కొందరికి సంగీతం ఇష్టం. అందరికీ అన్నీ ఇష్టం అనే మాట అనలేము. అందుకే 'లోకోభిన్న రుచిః' అన్నారు. వారి వారి అభిరుచిని బట్టి, అవగాహనను బట్టి ఎవరికి అనుకూలంగా వారు భాష్యం చెప్పుకుంటారు. అర్థం చెప్పుకుంటారు.

అయితే భగవద్భక్తులైన భాగవతులు మాత్రం, మానవుని సకల ఇంద్రియాలు భగవదర్చనకే అని చెప్పారు. అందులోకీ 'జిహ్వ' యొక్క ప్రాముఖ్యం మరీ ఎక్కువ.

'శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' అని పోతనామాత్యుడు ప్రహ్లాదునిచేత అనిపించాడు.

దాక్షిణాత్య విష్ణుభక్తులలో పన్నిద్దరాళ్వారులున్నారు. అందులో కేరళను పరిపాలించిన కులశేఖరాళ్వారు ఒకరు. ఆయన విరచించిన 'ముకుందమాల' అనే స్తోత్రంలో-- 'జిహ్వే! కీర్తయ కేశవమ్' అని ఒకచోట అన్నారు. 'ఓ నాలుకా! కేశవునే కీర్తించు' అని అర్థం.

భక్త కవి అయిన కూచిపూడి సిద్ధేంద్ర యోగి 'పిబరే రామరసం, హే రసనే!పిబరే రామరసం!' అని గానం చేశారు. 'ఓ నాలుకా! రామసుధారసాన్నే గ్రోలు' అన్నారు. ఈ రామరసం ఎటువంటిది? 'శుక శౌనక కౌశిక ముఖ పీతమ్'- - శుకుడు, శౌనకుడు, విశ్వామిత్రుడు మొదలైన ఋషులచే త్రావబడ్డది.

మరో భక్తకవి నారాయణ తీర్థులవారు 'బ్రూహి ముకుందేతి, రసనే! పాహి ముకుందేతి' అని గానం చేశారు. 'ఓ నాలుకా! ముకుందా! అని పలుకు. రక్షించు ముకుందా! అని పలుకు!' అన్నారు.

అయితే పూర్తిగా జిహ్వతో ఏది రుచి చూడకుండా తిండీ తిప్పలూ మానేసి, ఈ భౌతిక ప్రపంచంలో జీవించడం సాధ్యమా? అని మనలో కొందరు అనుమానించవచ్చు. దానికి 'లలితా మర్యాదుడైన ప్రహ్లాదుడు' ఒక ఉదాహరణ.

"పానీయంబులు త్రావుచున్,
గుడుచుచున్, భాషించుచున్,
హాసలీలా నిద్రాదులు సేయు-
చున్, దిరుగుచున్, లక్షించు-
చున్, సంతత శ్రీ నారాయణ
పాదపద్మ యుగళీ చింతామృతా-
స్వాద సంధానుండై..."

ఆ విధంగా వుండడానికి అందరూ ప్రయత్నం చేయాలి.



# యువవాణి

## మీరూ రాయండి!

*అడుగడుగున గుడి వుంది*
*అందరిలో గుడి వుంది .... అన్నాడొక కవి*

పవిత్రమైన ఈ భారతావనిలో ఎన్నెన్నో ప్రాచీన ఆలయాలు. అద్భుతమైన కళా నైపుణ్యం, అనంతమైన చరిత్రగల ఆలయాలు ఎన్నో! వాటి గురించి తెలుసుకోవాలని అందరికీ ఉంటుంది.

## అందుకే మీరూ రాయండి!

మీ సమీపంలో ఉన్న దేవాలయాల చరిత్ర, విశేషాలు, స్వామివారి మహిమలు మీరూ రాయండి.

ప్రచురించిన ప్రతి రచనకు తగిన పారితోషికం ఉంటుంది.

నలుపు, తెలుపు ఫొటోలు జతచేయటం, కవరు మీద, రచనమీద 'మన దేవాలయాలు' శీర్షికకు అని రాయటం మరువకండి.

మీ రచనలు పంపవలసిన చిరునామా.

సంపాదకులు, సప్తగిరి మాస పత్రిక
తి.తి. దేవస్థానములు, తిరుపతి - 517 507.

దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం



## ఆలయకళ

## తిరుపతి

# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART

## TIRUPATI

తరించండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50





చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల

శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





'చంద్రశేఖర్'



## తిరుమలలో ప్రధాని

# వార్తాలహరి

భారత ప్రధానమంత్రి శ్రీ పి.వి.నర సింహారావు ఆగష్టు 30, మంగళవారం నాడు తిరుమలలో శ్రీవారిని దర్శిం చారు. ప్రధానికి ఆలయ మహద్వారం వద్ద తి.తి.దే. అధ్యక్షులు శ్రీ ఎ.చెంగల్ రెడ్డి, కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి. ఎల్.ఎన్.మూర్తి, ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ ప్రకాష్ అగర్వాల్, శ్రీ టి.టి.వాసు, శ్రీ శ్రీరామమూర్తి, శ్రీ ఎన్.శేషగిరిరావు, దేవాదాయశాఖ కమి షనర్ శ్రీ వినాయక్, రాష్ట్ర సహ కార శాఖమంత్రి శ్రీ ఆర్.చెంగారెడ్డి, ఇన్‌ఛార్జి మంత్రి శ్రీ జి.వెంకటరెడ్డి, తదితర అధికార ప్రముఖులు స్వాగతం పలికారు.



ప్రధాని శ్రీవారి ఆలయంలో దాదాపు పది నిముషాల సేపు గడిపారు. శ్రీవారి దర్శనానం తరం వకుళాదేవిని, విమాన వేంక టేశ్వరుని, యోగనరసింహస్వామి ఆల యాన్ని దర్శించారు.

అనంతరం రంగనాయక మండ పంలో వేదపండితులు ప్రధానిని ఆశీ ర్వదించారు.

తర్వాత ప్రధానికి తి.తి.దే. అధ్య క్షులు శ్రీ ఎ.చెంగల్ రెడ్డి, ప్రధాని వెంట ఉన్న ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజ యభాస్కరరెడ్డికి, దేవస్థాన కార్యనిర్వ హణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్.మూర్తి శ్రీవారి ప్రసాదాలు అందజేశారు.

# తిరుమలలో రాష్ట్రపతి

భారత రాష్ట్రపతి శ్రీ శంకర దయాళ్ శర్మ సతీసమేతంగా సెప్టెంబరు 1 గురువారం నాడు తిరుమలలో శ్రీవారిని దర్శించారు.

ఆలయ మహద్వారం వద్ద రాష్ట్రపతికి రాష్ట్ర ఉపముఖ్యమంత్రి శ్రీ కోనేరు రంగారావు, మంత్రి శ్రీ ఆర్. చెంగారెడ్డి, తి.తి.దే. అధ్యక్షులు శ్రీ ఎ.చెంగల్ రెడ్డి, కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్.మూర్తి, పార్లమెంటు సభ్యులు శ్రీ మాగుంట సుబ్బరామి రెడ్డి, ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ శ్రీరామమూర్తి, శ్రీ ఎన్.శేషగిరి రావు తదితర అధికార ప్రముఖులు ఘనంగా స్వాగతం పలికారు.

రాష్ట్రపతి శ్రీవారి సన్నిధిలో దాదాపు 10 నిమిషాలు గడిపారు. గర్భగుడి చుట్టూ ఆయన ప్రదక్షిణం చేశారు. అనంతరం శ్రీవారి హుండీలో కానుకలను సమర్పించారు.

తరువాత తి.తి.దే. అధ్యక్షులు శ్రీ ఎ.చెంగల్ రెడ్డి రాష్ట్రపతికి పరకామణిని చూపించారు.

రంగనాయక మండపంలో రాష్ట్రపతి దంపతులను వేదపండితులు ఆశీర్వదించారు.

## సెప్టెంబరు 2 శుక్రవారం

రాష్ట్రపతి సెప్టెంబరు 2 శుక్రవారం నాడు శ్రీవారి సుప్రభాత సేవలో, శ్రీవారి అభిషేకలో పాల్గొన్నారు. పిదప శ్రీవారి అర్చన, తోమాలసేవలో కూడా ఆయన పాల్గొన్నారు.



రాష్ట్రపతి భార్య శ్రీమతి విమలా శర్మ తమ మనుమరాళ్లతో కలిసి తెల్లవారు జామున తడిబట్టలతో స్వామి వారి చుట్టూ ప్రదక్షిణం చేశారు.

## తిరుచానూరులో

రాష్ట్రపతి శ్రీ శంకరదయాళ్ శర్మ సెప్టెంబరు 2 శుక్రవారం తిరుచానూరులో శ్రీ పద్మావతీ అమ్మవారిని దర్శించారు. దర్శనానంతరం తిరిగి ఆయన తిరుమల వెళ్లారు.

సాయంత్రం సహస్ర దీపాలంకరణ సేవలో పాల్గొని, తిరిగి శ్రీవారిని దర్శించారు.

## సెప్టెంబరు 3

సెప్టెంబరు 3 శనివారం నాడు రాష్ట్రపతి శ్రీవారిని దర్శించారు. సుప్రభాతం, తోమాలసేవల్లో ఆయన పాల్గొన్నారు.

అనంతరం ఆయన ఢిల్లీ వెళ్ళారు.





## కళాకారుడికి డాక్టరేట్

తిరుమల తిరుపతి దేవస్థానం, సప్తగిరి మాసపత్రికలో ఆర్టిస్టుగా పనిచేస్తున్న శ్రీ జగదీశ్వరన్‌కు అమెరికాలోని కాలిఫోర్నియా అంతర్జాతీయ విశ్వవిద్యాలయం ఇటీవల డాక్టరేట్ డిగ్రీ ప్రదానం చేసింది.

శ్రీ జగదీశ్వరన్ "మానిలన్" అన్న కలం పేరుతో తమిళంలో ఎన్నో గ్రంథాలు రాశారు. ఆయన గత 15 సం॥ రాలుగా తి.తి.దే.లో పని చేస్తున్నారు. ఆయన న్యూఢిల్లీ ఆథర్స్ గిల్డ్‌లో సభ్యులు గాను, స్థానిక ప్రెస్‌గిల్డ్‌కు సంయుక్త కార్యదర్శిగాను ఉన్నారు.

## ధర్మకర్తల మండలికి నూతన సభ్యుడు

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలికి నూతన సభ్యుడుగా మద్రాసుకు చెందిన ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ టి.టి.వాసు నియమితులయ్యారు. ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ రామానుజం, గోవారాష్ట్రానికి గవర్నరుగా నియమితులు కావడం వల్ల ఈ ఖాళీ ఏర్పడింది. శ్రీవాసు ఆగష్టు 29న ధర్మకర్తల మండలి సభ్యునిగా ప్రమాణ స్వీకారం చేశారు.




Published on behalf of T T Devasthanams by N S. Ramamurthy, M.A., Editor-Incharge and.
Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, Manager, TTD. Press, Tirupati - 517 507



ఇంతదేవుఁ డింక వేఁడీ యెంచి చూపుఁడా
చెంతనుండితే రక్షించు చేకొని కొలువరో!

వేసితే వేయురూపులు విశ్వరూపమితడు
శ్రీసతీశుఁ డిందరిలో శ్రీమంతుడు
భాసురపు భూమి మోచే బలవంతుఁడిన్నిటాను
దాసులైతే మన్నించు నీదైవముఁ గొలువరో!

గుట్టున బ్రహ్మాండాలు కుక్షిలో నించినవాడు
అట్టె దేవతల మొర లాలించేవాఁడు
చిట్టకపు దానవుల చించి చెండాడేటివాడు
ఇట్టె శరణంటే గాచు నీతని గొలువరో!



కాలముఁ గర్మము మాయ గల్పించిన యట్టివాఁడు
ఆలించి సర్వజీవుల అంతర్యామి
వాలి శ్రీవేంకటపతై వరము లిచ్చేటివాడు
యేలీలగొల్చిన మెచ్చు నీ విభుఁ గొలువరో!

—అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 116,
రాగం : దేసాక్షి, సంపుటం : 2 (1981)

రండి! దర్శించండి!

# శ్రీ పద్మావతి అమ్మవారి బ్రహ్మోత్సవాలు

## తిరుచానూరు



29-11-1994 .............................. ధ్వజారోహణం

4-12-1994 .............................. గరుడోత్సవం

6-12-1994 .............................. రథోత్సవం

7-12-1994 .............................. చక్రస్నానం

చంద్రశేఖర్.




# విషయ సూచిక...నవంబరు, 1994

సంపుటి 25 సంచిక 6



విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.

# సంపాదకీయం

"సాధనమున పనులు సమకూరు ధరలోన" అన్న మాట నాటికి నేటికి ఏనాటికీ సత్యం. ఐహికమైనా ఆముష్మికమైనా సాధన లేనిదే ఏదీ సాధ్యంకాదు. సర్వ ప్రాణి కోటికి సమంగా వర్తిస్తుందిది.

ఆకలి తీర్చుకోవటానికి ఆహారం సేకరించుకుంటుంది చీమ. పుల్లా పుడకా ముక్కున పట్టితెచ్చి ముద్దుగా గూడు కట్టుకుంటుంది పక్షి.

అన్నిటినీ చూస్తూకూడా అజ్ఞానంలో పడి అల్లాడిపోతున్నాడు నూరేళ్ళ అల్పాయుష్కుడైన మనిషి.

కారు చీకట్లో చిన్నదీపం వెలిగించుకుని ఆ చిరువెలుగులో సుదూరం ప్రయాణం చేసేవారు కొందరు. నడిమింట సూర్యుడు వర్తిస్తూవున్నా కళ్ళు మూసుకుని అయ్యో నాకేం కనిపించడంలేదు అని అల్లాడేవాళ్ళు మరికొందరు.

ఒకరు ఉన్నతులు మరొకరు ఉన్మత్తులు.

ఏ పేరుతో పిలిచినా, ఏ రూపంలో కొలిచినా భగవంతుడు సర్వవ్యాపకుడు, సర్వస్థితి కారకుడు. ఆది అంతములేని ఆయనను గురించి అంతా తెలుసుకోవటానికి మహర్షులకే సాధ్యం కాలేదు, ఇక సామాన్య మానవులెంత.

సర్వవ్యాపకుడు సర్వకారకుడు సర్వసాక్షీభూతుడు కదా అని ఉపేక్షిస్తే ఆయన గురించి ఏమీ తెలుసుకోలేం. గాలి అంతటా వ్యాపించి వుంది. అలా అని ఉష్ణమండలంలో కూర్చుని ఉడుకెత్తి పోతోంది బాబో అనుకునేవాడికి వేడి తప్ప మరేమీ వుండదు. తన ప్రయత్నంతో విసురుకునే వాడికి చల్లదనం ఇస్తుంది.

మకరి బారిన పడ్డ కరి 'నీవు దప్ప మరో దిక్కులేదు' అని దీనంగా ప్రార్థించినపుడే ఆయన లక్ష్మితో సరససల్లాపాలు వీడి సాగి వచ్చాడు. ఆ పరంధాముడి పాదస్పర్శకు ప్రతి ప్రాణి ఆరాట పడటం అత్యంత సహజం. అందుకు ఆళ్వారులు సూచించిన మార్గం అనుసరించడం అత్యుత్తమం.

వేదవేదాంగ సారాన్ని, విష్ణు స్వరూపాన్ని దివ్యక్షేత్ర దర్శనం వల్ల లభించిన పారమార్థిక అనుభవాన్ని "దివ్యప్రబంధ" రూపంలో మానవాళికి అందించిన మహనీయులు ఆళ్వారులు.

ఆ దివ్య ప్రబంధాన్ని విన్నా, చదివినా, అర్థం చేసుకున్నా ముక్తి లభిస్తుందనటం నిస్సందేహం.

మొదల్ ఆళ్వారులైన పొయిగై ఆళ్వార్, పేయాళ్వార్, పూదత్త ఆళ్వార్ తిరుమంగై ఆళ్వార్, తిరుప్పాణి ఆళ్వార్ల జయంతి ఈనెలలో వస్తోంది. ఒకేసారి ఇందరి ఆళ్వార్ల జయంతి రావడం విశేషం.

చేత వెన్న ముద్ద రీతిగా విష్ణుసారాన్ని మనకందించిన ఆళ్వార్లను కేవలం జ్ఞాపకం చేసుకోవడంగాకుండా, వారు అందించిన అమర సందేశంలో అణువంత అయినా మనం తెలుసుకునే ప్రయత్నం చేస్తే అదే మనకు శక్తి, జీవన్ముక్తి.

అందరం ఆ సాధన చెయ్యాలని, అందుకు దగ్గ సంపత్తి ఆ సప్తగిరీశుడు మనకు అనుగ్రహించాలని మనస్ఫూర్తిగా ప్రార్థిద్దాం.

కృష్ణం వందే జగద్గురుమ్

# దీపావళి దివ్య దీప్తి

"సుచంద్ర"

విజ్ఞులైన మన ప్రాక్తన మనీషులు మన పర్వదినాల అంతరార్థాలను ఐహాపర సాధకంగా మలచి చిరకాలం భారతీయులకు ముక్తి సౌధసోపానాలను నిర్మించారు. దుష్టత్వ నిర్మూలన జరిగినపుడు ప్రాణికోటి ఆనందోల్లాస భరితం అవుతుంది. అంతవరకూ ఆవరించిన చీకట్లను తొలగించుకొని వెలుగుల దీపికలను వెలిగించి, తమకా వెలుగు కలిగించిన భగవానుని నుతిస్తారు. ఈ అంతర్యంతోనే ఆబాల గోపాలానికి ఆమోద ప్రమోదాల ప్రతీకగా దీపావళి పండుగ వైదికకాలంనుండీ భారతావనిలో జరుపబడుతున్నది. ఈ దీపావళి వెనుకవున్న మహిత నేపథ్యాన్ని వీక్షిద్దాం.

రాక్షససంహారం జరిగినపుడు లోకంలో ధర్మం నిలబెట్టబడుతుంది. రాక్షసులు రెండు రకాలుగ వుంటారు. జాతి రీత్యా రాక్షసులు, వృత్తి రీత్యా రాక్షసులు. మొదటివారిని రాక్షసులనీ, రెండవవారిని నరరూప రాక్షసులనీ అంటారు. రామాయణంలో రావణాదులు తొలిజాతివారు. భారతంలో కౌరవులు మలిజాతివారు. ఇరువురినీ శిష్టరక్షణ, దుష్టశిక్షణ బాధ్యత స్వీకరించిన భగవానుడే భస్మంచేశాడు. చేయించాడు. దైవీశక్తులపై ధ్వజమెత్తటమే ఈ రెండు జాతుల వారి లక్ష్యం. తొలిజాతి వారు ముఖ్యంగా మంత్రాలకు భయపడేవారు. మంత్రాలలో రక్షోఘ్న మంత్రాలు వీరిని నాశనం చేయకుండావీరు తపస్సు చేసి ఆ మంత్రాలను సాంగోపాంగంగ నేర్చేవారు. సాధారణ వేద వేత్తలయిన ఋషులప్పుడు వీరినేమీచేయలేక పోవటంతో భగవానుడవతారాలనెత్తి వీగిని మట్టుబెట్టవలసి వచ్చేది. దీపావళి పండుగ అంతర్యం భగవంతుడొనర్చిన అలాంటి దుష్ట నిర్మూలనా కార్యక్రమమే. నరకుడు కడు దుష్టుడై కాంతలను చెఱబట్టాడు. అందుచేత ఆ దుష్టునికి స్త్రీశక్తి సగమార్గాన్ని గోచరింపజేసేటందుకు శ్రీకృష్ణుడు నరకసంహారంలో సత్యభామగా ద్వితీయుడై ఎవరు త్రవ్విన గోతిలో వారే పడతారన్న ఆర్యోక్తిని సార్వకాలికం, సార్వజనీనం చేశాడు.

భంగ్యంతరంగా దసరా, దీపావళి పర్వదినాలు రెండూ స్త్రీశక్తి కలిమినీ, బలిమినీ భాస్వద్రూపంతో చూపినట్టివి. "యత్ర స్త్రియః పూజ్యఃనే తత్ర దేవాః





హస్త భోజన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. యముడు దీపావళినాడు భూలోకంలో వున్న తన సోదరి యమున ఇంటికి వచ్చి ఆమె చేతి భోజనం చేసి ఆశీర్వదిస్తాడన్న నమ్మకంతో సోదరులు భగినీ హస్త భోజనం చేసి ఆమెను సత్కరిస్తారు. దీపావళి పండుగల్లోని స్త్రీ ప్రతిపత్తిని పెంచే మరో అంశం ఇది. దీపావళి పండుగ దివ్య దీప్తికి వైజ్ఞానికులు కూడ ఒక చక్కని పరమార్థాన్నేర్పరచారు. నాడు నరకుడనే ఉపగ్రహం భూమిచుట్టూ తిరుగుతూ, భూ కక్ష్యలోనికి వచ్చి, భూమిని ఢీకొంటుండగా, శ్రీ కృష్ణుడు తన ప్రజ్ఞతో దాన్ని ఆకాశంలోనే పేల్చి వేయగా, వాతావరణపు రాపిడికి అది అంటుకుని ఆకాశంలో వెలుగులు విరజిమ్మిందనీ, ఆ వెలుగుల జిలుగులే దీపావళి కాంతులని విశ్వాసం

కారణాల తోరణాలేవైనా కార్యం ఆవిర్భవించినట్లు, దీపావళి మానవునికి కోటి వెలుగుల జ్వాలా దీపమై, అంతరంగాన్ని అరిషడ్వర్గ విజయంగావించి, అభ్యుదయ జ్యోతి సదా వెలిగించుకొమ్మని సదా, సర్వధా బోధించే వెలుగుల దీపకళిక. దానికి స్వాగత జ్యోతులు సమర్పిద్దాం.




నందంతే" అన్న ఆర్యోక్తికి భిన్నంగా స్త్రీలను గౌరవించి, పూజించక పోతే ఆమె ప్రళయ రూపిణియై నరక సదృశులను నరికి వేస్తుందని నేటి కాలంలో వారికి గూడ చేదయిన హితవు పలుకుతుంది.

ఈ పవిత్ర భావన దృష్టిలో ఉంచుకొని దీపావళి నాడు నిర్ణీతమైన సంప్రదాయాలలో సంపన్నిధియైన లక్ష్మీ పూజనం, భగినీ హస్త భోజనం లాంటి వాటిని యేర్పరచారు. జలాలల్లో, తైలంలో నిత్యం లక్ష్మీదేవి అధివసించి వుంటుందని పురాణశక్తి. అందుచేత దీపావళినాడు లక్ష్మీ పూజను ఆధ్యాత్మిక పరంగా గూడ రూపొందించారు.

'వైరాగ్యతైల సంపూర్ణే
భక్తివర్తి సమన్వితే'
ప్రబోధపూర్ణ పాత్రేతు
జ్ఞప్తి దీపం విలోకయేత్.

ప్రబోధమన్న పాత్రలో వైరాగ్యమనే నూనెపోసి, భక్తి అనే వత్తి వెలిగిస్తూ, జ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయాలన్న భావనతో ధీమాన్యులు ముముక్షువులుగా రూపొందటానికి యత్నిస్తే, సామాన్యులు దీపావళి సందర్భంగా తైల దీపాలను వెలిగించి, గృహ ప్రాంగణాలలోనూ, నదీ ప్రవాహాలలోనూ వాటిని వదలి లక్ష్మీదేవి అనుగ్రహానికి యత్నిస్తారు. గ్రామసీమలలో ప్రజలు దివిటీలు వెలిగించి, "యమాయ ధర్మరాజాయ, మృత్యవే చాంతకాయ చ" అన్న ఆర్యోక్తి ననుసరించి అపమృత్యు, నరక నివారణార్థం యముని ప్రార్థిస్తారు. తద్వారా చిరకాలం తాము సత్యధర్మ దీక్షతో మనుగడ సాగించాలని ఆశిస్తారు.

దీపావళి సందర్భంగా ముఖ్యంగా భారత దేశంలోని ఉత్తరప్రాంతాలలో యమ ద్వితీయ అనే వేడుకను భగినీ



కలుషభంజనుడై భక్తులపాలిటి కొంగు బంగారంగా ప్రసిద్ధికెక్కి సమ్మోహింపజేస్తూవున్న శ్రీవేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో అనాదిగా ఎప్పటినుంచో ఏనాటినుంచో పరంపరగా సాగుతున్న బ్రహ్మోత్సవాలు మళ్లీ వైభవంగా ప్రారంభమయ్యాయి! మరొక్కమారు జగత్కల్యాణచక్రవర్తి అయిన శ్రీనివాసుని బంగారు ధ్వజస్తంభంపై గరుడకేతనం ఎగిరింది! సమస్త చరాచర సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు నిర్వహిస్తున్న బ్రహ్మాండనాయకుని ఉత్సవాలకు ఇంద్ర, అగ్ని, యమ, నిర్‌రుతి, వరుణ, వాయు, కుబేర ఈశానాది దిక్పాలురతోపాటు ఎందరో........మరెందరో.... . ఆహ్వానింపబడ్డారు. భక్తులు, యోగులు, మునులు, స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు.... ఇలా లక్షలాది యాత్రికజనం ఏతెంచి ఏడుకొండలవాని వైభవాన్ని కన్నులారా తిలకించారు. తృప్తిగా ఆనందించారు.

ఆ సందర్భంలో తిరుమలక్షేత్రం అంతటా ఒక విన్నూతతేజం ఆవరించింది! ఎక్కడ చూచినా అలంకారాలే! అందాలే! ఎక్కడ చూచినా వింత వింత సొబగులే! ఎక్కడ తిలకించినా భక్తజనసందోహమే! యాత్రికుల కోలాహలమే! ఎక్కడ వీక్షించినా సంబరమే!...... సంతోషమే. నూతనోత్సాహమే! . ఎవరినోట విన్నా గోవిందుని నామసంకీర్తనే! ఎవరికంట చూచినా ఆనందబాష్పాలే! ఎవరి హృదయాల్ని తడిమినా మధుర స్పందనలే!....... ఇలా.......ఇలా.

వేయి విధాల పొంగులై పారిన కొండలరాయుని కరుణారసప్రవాహంలో భక్తకోటి హృదయం ఆర్ద్రమై ఆనందపు టంచుల్ని తాకింది! ఆనందనిలయం చుట్టూరా అవ్యక్తమైన అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక తేజస్సు ఆవరించి అందరినీ అలరించింది!

94 అక్టోబరు 5 నుంచి 14 వరకు పదినాళ్లపాటు ఎందరినో ఎన్నోవిధాల సమ్మోహనపరచి మధురానుభూతుల్ని ప్రసాదించిన తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాల సంక్షిప్త నివేదికను చదవండి! ఆనందనిలయుని ఆనందోత్సవాల్లో పాల్గొన్న అనుభూతిని పొందండి! ఆనందించండి!

# పదినాళ్లూ పండుగలే!

## (బ్రహ్మోత్సవాల నివేదిక *5-10-94 నుండి 14-10-94*)

ఆరోజు.... కలియుగ భూలోక వైకుంఠమయిన తిరుమలక్షేత్రం వింత వింత సోయగాల్ని సంతరించు కొని వినూత్నకాంతులతో వెలుగు తున్న ఆనందప్రదమైనరోజు!

ఆరోజు... అదే! శ్రీ భావ నామ సంవత్సరం భాద్రపద మాసం చివరిరోజున అంటే 1994 అక్టోబరు 5వతేదీ బుధవారంనాడు పవిత్ర బ్రాహ్మ ముహూర్తమైన తెల్లవారుజా మున

కౌసల్యా సుప్రజారామా!
పూర్వా సంధ్యా ప్రవర్తతే!
ఉత్తిష్ఠ నరశార్దూల
కర్తవ్యం దైవమాహ్నికమ్

అని సుప్రభాత గీతాన్ని వింటూ శ్రీ వేంకటేశ్వరుడు మేల్కొన్న అత్యంత శుభప్రదమైనవేళ!...

ఆ వెంటనే బంగారు సింహాస నంలో కొలువుదీరిన బ్రహ్మాండ నాయ కునకు ఆనాటి పంచాంగశ్రవణంతో పాటు మరునాటినుంచి పదినాళ్లపాటు జరిగే బ్రహ్మోత్సవాలనుగూర్చి అత్యం తభక్తిప్రపత్తులతో సిద్ధాంతి తెలియ జేశారు. అంతే! జగత్ప్రభువైన శ్రీని వాసుని చూపు పక్కనే వున్న సేనాపతి విష్వక్సేనుని వైపుమరలింది.

[illegible]

ఆ వెంటనే విష్వక్సేనుడు చేతులు కట్టుకొని లేచినిలబడి "చిత్తం ప్రభూ! దేవరవారి బ్రహ్మోత్సవాలకు అన్నీ సిద్ధం చేశాం! తిరుమల నగరమంతా సర్వశోభాయమానంగా అలంకరించాం! ఈ సాయంత్రం అంకురార్పణ! రేపు ధ్వజారోహణ! ఇంద్రాది దిక్పాలరకు ఆహ్వానాలు అన్నీ సిద్ధం చేశాం ప్రభూ! శ్రీవారి భక్తులకు ఎలాంటి ఇబ్బందిలే కుండా, కలుగకుండా అన్ని ఏర్పాట్లు చేశాం!

# శ్రీవారి స్వర్ణరథం

ఆనందనిలయ విమానాన్ని తలపించే తిరుమల శ్రీవారి బంగారు రథం ఎత్తు 21.6 అడుగులు. ఈ స్వర్ణరథం నిర్మాణంలో 780 కిలోల రాగిని 28 కిలోల బంగారాన్ని ఉపయోగించారు.

ముందుగా చెక్కరథం తయారయిన తరువాత తమిళనాడుకు చెందిన చేతిపనుల అభివృద్ధిసంస్థ "పూంపుహార్" రథాన్ని రాగిరేకులతో తాపడం, ఆపైన బంగారు రేకులను తాపడం వంటి పనులను రెండు సంవత్సరాల ఆరునెలల్లో పూర్తిచేసింది. ఈ కార్యక్రమాన్ని శ్రీముత్తుకుమారస్వామి స్థపతి పర్యవేక్షించారు. వీరికి తంజావూరు, మధుర, మద్రాసునుంచి వచ్చిన ఆరుగురు శిల్ప నిపుణులు సహాయపడ్డారు.

ఈ బంగారు రథానికి హైదరాబాదు బి.హెచ్.ఇ.ఎల్. కంపెనీవారు రు.30 వేల ఖర్చుతో హైడ్రాలిక్ బ్రేకులను అమర్చారు. అంతేగాక ఈ బ్రేకులను బిగించే చక్రానికి లక్షరూపాయల విలువగల 1.5 టన్నుల కర్రనుపయోగించారు.

ఈ స్వర్ణ రథం తయారీని ప్రత్యేకాధికారి శ్రీ సేతురామన్ పర్యవేక్షించారు.

94 అక్టోబరు 11 వ తేదీన తొట్టతొలిసారిగా ఉభయదేవేరులతో కూడిన శ్రీనివాససార్వభౌముడు అధిరోహించి ఊరేగిన ఈ స్వర్ణరథం విలువ 2.5 కోట్ల రూపాయలు.

శ్రీనివాసప్రభువు చిరుమందహాసంతో మెచ్చుకోలుగా చూస్తూ, "విష్వక్సేనా! మన"సుదర్శనుడు" కూడా అండగా ఎలాంటి ఆటంకాలు రాకుండా భక్తులను రక్షిస్తూవుంటాడు" అని కొలువు చాలించాడు.

## అంకురార్పణ (5-10-94)

ఆ సాయంత్రం 7 గంటలకు విష్వక్సేనుడు, శంఖచక్రగద ఖడ్గాది ఆయుధాలను ధరించి సిద్ధమై, సర్వసన్నద్ధమై ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా, వృషగజతురగపదాది భక్త బృందాలు ముందు నడవగా, వేద నాదాలమధ్య, భేరీలు మోగుతుండగా శ్రీస్వామివారి ఆజ్ఞ గైకొని ఆలయాన్ని వీడి ప్రదక్షిణంగా ఊరేగుతూ నైరుతిమూలలో వున్న వసంత మండపాన్ని చేరుకొన్నాడు. అక్కడ భూమి పూజచేసి, మృత్సంగ్రహణంచేసి, తిరిగి ఆలయాన్ని చేరుకొని బ్రహ్మోత్సవాలకుగాను అంకురార్పణ చేశారు... ఇక తరువాయి కార్యక్రమం మరునాడు జరిగే ధ్వజారోహణం!

ఆ మరునాడు ధ్వజారోహణంతో ప్రారంభమయ్యే బ్రహ్మోత్సవాలకు పరుగులు వెదుతున్న జనం... అదిగో...

అదిగో! అల్లదిగో! .... గోవిందా! ఏదుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా! అంటూ ఎలుగెత్తి ఆర్తితో గోవిందుణ్ణే పిలుస్తూ తిరుమలగిరి శిఖరాలను అధిరోహిస్తున్న భక్తజన బృందాలు!

ఇదిగో... ఇటువైపు... దేశం నలుమూలల నుండీ

వరములు కొటారుగా వక్కణించి పెంచే కొండ!
పరగు లక్ష్మీకాంతు సోబనపుగొండ
కురిసి సంపదలెల్ల గుహలనిండిన కొండ
విరివైన దిదివో శ్రీవేంకటపు గొండ

అని తిరుమల పర్వతసానువులను, తిరుమలేశుని వేనోళ్ల కీర్తిస్తూ గానం చేస్తూ వస్తున్న పరమభక్తులైన వాగ్గేయకారుల ఆనందసందోహం!

వేంకటాచలానికి సమమైన క్షేత్రం, అలాగే శ్రీ వేంకటేశ్వరునికి సాటిరాగల దేవుడు ఈ బ్రహ్మాండ భాండాలలో ఎక్కడాలేదు. కానరాదు అని అంటూ వీనుల విందుగా శ్లోకాలు వల్లిస్తూ వస్తున్న పండిత కవుల సమూహాలు. అదిగో!

వీరినందరినీ సాదరంగా ఆహ్వానిస్తూ, ఆహ్లాదపరుస్తున్న "శ్రీవారి బ్రహ్మోత్సవాలు" వంటి స్వాగత తోరణాలతో తిరుమల పుణ్యక్షేత్రం అత్యంత కోలాహలంగా వుంది. అంతమాత్రమేకాదు. తిరుపతి అలిపిరి నుండి తిరుమల శ్రీవారి ఆలయం వరకు ఆలయ ప్రాకారాలు, మండపాలు సత్రాలు... ఇలా సర్వేసర్వత్రా మిరుమిట్లు గొలిపే నక్షత్రాల్లాంటి విద్యుద్దీపాలతో అలంకరింపబడి చూపరులను తన్మయింపజేసి మైమరపించింది. ఇంకా దేవస్థానం విద్యుత్ శాఖ శ్రీస్వామివారి డోలోత్సవమండపం పైన ఏర్పాటుచేసిన ఎత్తైన శ్రీరామ పట్టాభిషేకం ఆలయ

(43వ పేజీలో)

# భగవంతునికై బ్రతుకు!

నుబది నాలుగు లక్షల జీవరాసులలో ఉత్తమోత్తమమును, అత్యంత పవిత్రమును, అపరిమిత ప్రయోజనకారియును అగు మానవునకు ప్రియాతిప్రియములు ప్రాణములు. ప్రాణములతో జీవించుట కంటె ప్రియానుభవము వేఱొండు లేదు. గాన నవియే ఆతనికి ఆశయును; ఆశయమునునై అత్యంత ముఖ్యాచర్యగా విలసిల్లిన దనవచ్చును. అటులైనను తాము సంపూర్ణ జీవితమును, జీవితమున నెవ్విధమైన కొరత లేక, ఆనందముగ బ్రతుకుచున్నామని చెప్ప గల ధైర్యసాహసములు చాలమందిలో వ్యక్తమగుటలేదని తెలియుచున్నది. అనేకమంది మానవుల కసలు సంపూర్ణజీవనమననేమియో అవగాహన కాకుండగనే తమ బ్రతుకులంత మొందుట జరుగుచున్నందున, మరల మరల జన్మించి, జన్మసంపూర్తికై వెతలనొందుటయు నగుచున్నది. అయినను మాయయొక్క ప్రభావముచే తమలక్ష్యమును మరచి, అధికమానవులు ఆహార నిద్రాభయ మైథునములలో మునిగి, అవియే తమశరణ్యము; అవియేతమ గతియునని తలంచి, రాత్రింబవళ్లు వాటిలో బడి తమసర్వశక్తి సామర్థ్యములను వ్యర్థబుచ్చి తత్ఫలితముగ తిరిగి తిరిగి జననమరణ చక్రములో తగుల్కొను చున్నారు.

పరిపూర్ణానందము వెల్లివిరియ బ్రతుకుటకై పరమేశ్వరునిచే ప్రసాదింపబడిన పవిత్రావకాశములు పలువిధములుగనున్నను చాల మందివాటిని సద్వినియోగపరచక, తాము జీవించవలసిన జీవితములో కొలదిగ మాత్రమే బ్రతికి, శేషజీవితమును వ్యర్థకార్యములకును, వృథాపూర్వకసంకల్పములకును వినియోగించుచున్నారు. ఎంతకాలము తీరని కోరికలతో మానవులు వ్యథలు చెందుచుందురో, అంతవరకు వారి జీవితములు అర్థరహితములుగను, పేలవముగను, స్వప్నసదృశముగను మిగిలిపోవును.

సంపూర్ణజీవితమననేమి?

మానవజన్మ నెత్తినందులకు మనమా జన్మకుతగిన సత్యధర్మ దయాదాక్షిణ్యములతో మంచిగను, నీతినిజాయితీలతోను జీవించుచు; బుద్ధిని వికాసమునొనరించుకొని, యెన్నియో తెలియనివిషయములను గ్రహించుచున్నాము. తోటిమానవులను ప్రేమించుచు వారి ప్రేమాదరణలకు పాత్రులమగు చున్నాము. ఆకలివేసినప్పుడు భుజించుచున్నాము. చేయవలసిన కర్తవ్యకార్యములను

**స్వామి సర్వేశ్వరానందగిరి**

కాలానుసారముగ క్రమముతప్పక ఒనరించు చున్నాము. నిద్రపోవలసిన సమయమున హాయిగా పరుండి నిద్రించుచున్నాము. ఈవిధముగ అన్నియును సక్రమముగ యిచ్ఛాప్రకారము జీవితమున జరుగుచున్నవిగాని, ఒక్క మరణ విషయమున మాత్రమటుల జరుగుటలేదేమోననియనిపించుచున్నది. మనలో చాలమంది మనకు యిష్టములేకుండగనే మరణించుట జరుగుచున్నది గదా! మనకు మరణేచ్ఛగలుగకముందే; మరియు చావునకు సంసిద్ధులముగలేక ముందుగనే మనలోచాలమందికి మరణ మాసన్నమగుచున్నటుల అవగాహనమగుచున్నది.

"అమృతం చైవమృత్యుశ్చ
సదసచ్చాహం" (భ.గీ. 9-19శ్లో.)
"అమృతమునేనే! మృత్యువునేనే!
సదసత్తులునునేనే!"



దర్శించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయ కళ తిరుపతి

# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

తరలిరండి!

కాలము:
ఉదయం 8గం.
నుండి రాత్రి 8గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు.1.00
పిల్లలకు రు.0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





'చంద్రశేఖర్'

అని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడానతిచ్చెను. అట్టిపవిత్రమును, అమృతస్వరూపమునునైన మృత్యువును భయంకరముగను, అసహజముగను, అపవిత్రముగను చిత్రించుకొని మనమెందులకు భయవిహ్వలురమగుచున్నాము?

స్వార్థపూరితులమై మనము మనకొఱకే బ్రతుకుచుంటిమిగాని; నిస్స్వార్థులమై జగత్కళ్యాణమునకును, జగన్నాథునికైయ్యును జీవించుటలేదు. కనుకనే భయాందోళనలు మనలను చుట్టుముట్టుటకు కారణమనుటలో ఎట్టి అతిశయోక్తియును లేదు. మనకీ మానవ శరీరమును, దానికనువైనధీశక్తిని, వివిధమానవ సామర్థ్యములను, మానసిక వికాసమును ప్రసాదించిన పరమేశ్వరుని మఱచి ప్రవర్తించుటయే మరణమనిన భయాందోళనల పాలగుటకు కారణము.

జీవితమునఎన్నియో సందర్భములలో మనమాశించి నటుల అనుకూలింపకుండుట గమనించుచున్నాము. మన ఆశలు, ఆశయములు భంగమైనపుడు సహజముగ అధైర్యవంతులమై కృంగికృశించుచుందుము. అట్టి పరిస్థితులలో నిరాశా నిస్పృహలు మన మేలునకే కలిగియుండవచ్చుననెడి యోచనయైన కలుగక, పైపెచ్చు నిత్యబుద్ధముక్త స్వరూపుడైన పరమేశ్వరునే నిందించునట్టి ప్రబుద్ధులు గూడగలరు. మన సకల ప్రాణములను వినియోగించి యొక సత్కార్యమునొనరించి సఫలతకై పెనుగులాడుచుందుము. అటులొనరించినను ఆకార్యము ఫలించక పాడైనచో; మనమెందులకునూ కొరగాని వారముగా నెంచుకొని కృశించిపోవుట జరుగుచుండును. మనభవితవ్యముపైన, భగవదేచ్ఛపైన అకుంఠిత శ్రద్ధావిశ్వాసములు లేకపోవుటవలననే యిటుల తటస్థించుచున్నదని మనము గ్రహించవలసియున్నది.

అపజయములుగను, అడ్డంకులు గను మనమెంచు ఘటనలు విశ్వేశ్వరుని దృష్టిలో విజయవంతములుగ గణింపబడుటయు గలదు. విధివిధానమును గ్రహించగల్గెడి విశాల బుద్ధి కొరవడుటచే మనకు గలిగెడి మేలు కీడులను మదింపు వేసుకొనుటలో స్వార్థవశులమై సహజముగ మోసపోవుట మన అందరిజీవితములలో జరుగుచున్నది. మనమనోరథములు కూలిపోవునపుడెల్ల కలతజెంది కరుణామయుడగు సర్వేశ్వరుని నిందించుట మంచిదికాదు. మన మీలోకమున అడుగిడకమునుపే మనకెల్లరును వారివారి కర్మఫలానుగుణ్యముగనొక ఉచిత స్థానమును నిర్ణయించిన పరమేశ్వరుని తత్త్వమును గ్రహించుట సామాన్యముకాదు.



మనభవితవ్యమును నిర్ణయించునది మన యిచ్ఛకన్న వేఱొకరు గలరనియు; విశ్వమున గల సకలజీవులను నియమించి శాసించు ఆ విశ్వనాథుడే మన అందరకు భాగ్యవిధాతయని అత్యంత దృఢముగ విశ్వసించుచో, మనకేతెంచు కష్టనష్టములకు, దుఃఖములకు, బాధలకు, చివరకు మృత్యువునకు సైతము వెఱువక, కృంగికృశించక, అంతయును అంత్యమున మనమంచికే, ఆత్మకళ్యాణార్థమే కలుగు ననెడి తృప్తి ఆనందము, శాంతిసామరస్యములు కుదిరి, భవిష్యత్తు అత్యంత ఆశాజనకముగ తిలకించగలుగుదుము.

ప్రాపంచిక మానవులు సహజముగ వాంఛించు అధికారప్రతిష్ఠలు, కీర్తిగౌరవములు, ధనధాన్యములు, పెద్దపెద్దభవంతులు జీవితములో ఒనగూడినచో, తమకుమించిన అదృష్టవంతులు లేరనెడి అహంకారముతో గర్వాంధులై పట్టపగ్గములు లేక చరించుదురు. అటుల జరుగక; దారిద్ర్యము, లోకమంతయు వెక్కిరించివెలివేయుట, దేశాంతరప్రవాసము, బంధుమిత్రుల వియోగము, దారాపుత్రులు తిరస్కరించుట, ఆరోగ్యమడుగంటుట మున్నగు అష్టకష్టములు సంప్రాప్తించుచో, తామత్యంత దురదృష్టవంతులమనియు, ప్రపంచమునకెవ్విధముగను పనికిరానివారమనియు నెంచికొని కృంగిపోవుచుందురు. కరుణామయుడగు సర్వేశ్వరునిచే నిర్ణయింపబడినటుల జీవితము జరుగగలదని తృప్తిజెందక, ఆశాపాశబద్ధులై, అత్యంత విశ్వాస హీనులై; ప్రాపంచిక మానవుల తలంపులు, మాటలు ప్రమాణముగ గ్రహించుటవలననే యిటుల జరుగుచున్నదని యెఱుంగవలయును.

దైవమును నిందించుట; లోకము కఠినముగ వర్తించున్నదని తలపోయుట; మరియు పూర్వజన్మపాపఫలమిట్లున్నదని పరితపించుట - యివేవియును మనలనుద్ధరించునవికావు. పైపెచ్చు మనలోని అహంకారము మరింత బలపడి మనస్సును మలిన పరచు ప్రమాగము కూడ గలదు.

ఆత్మనివేదన అత్యంత ఆనందదాయకమును, అంత్యమున జన్మరాహిత్యస్థితిని గలిగించుననియు గుర్తించి వర్తించువారు ధన్యులు. మనయిచ్ఛను పరమేశ్వరుని దివ్యేచ్ఛతో పరిపూర్ణముగ త్యాగమొనర్చి, విశ్వేశ్వరుడెటుల వినియోగించుకొనునో అద్దానికి పూర్తిగా లోబడి ప్రవర్తించుచోనట్టి ఆత్మార్పణయే అత్యంత సార్థకమై వర్థిల్లగలదు. మనమే వృత్తి నవలంబించుచున్నను, ఏ వ్యాపారము నొనరించుచున్నను; లేక యే ఉద్యోగము నిర్వహించుచున్నను, అయ్యది విశ్వేశ్వరుని విహితమని విశ్వసించి త్రికరణశుద్ధితో నాచరించ గలిగినచో నట్టి జీవితము

యథార్థముగ విశ్వనాథునివాసమైన వారణాశి క్షేత్రమే కాగలదు. ఎన్నడు మనజీవితములో అడుగడుగునను అనంతుని సంకల్పములు గోచరించునో; నాడే దృఢమైన ధైర్యస్థైర్యనిగ్రహములు, శాంతి సామరస్యములు సిద్ధించి మన బ్రతుకులు మంగళమయములై విరాజిల్లగలవు.

అలవాట్లు, అభ్యాసములు, స్వధర్మ నిర్వహణలు మనలనెంతవరకు ఆత్మవిదులుగను, లోకహితైషులుగను నొనరించగలుగునో, అంతవరకే మన బ్రతుకుయొక్క విలువ గాన, అనుదినమును భగవంతునికై బ్రతుకుట అభ్యసించుదముగాక!

"సర్వేశ్వరా! సర్వకాల సర్వావస్థలయందును నీ సత్య సంకల్పమేనెరవేరుగాక!" యనినిరహంకారముతో నియమ పూర్వకముగ ప్రార్థించుడు. ప్రతిదినము ఉదయసాయం సంధ్యా సమయములలో మనమెంతమేరకు ఈశ్వరేచ్ఛను గుర్తించి ఆతని సత్యసంకల్పములో మన ఆలోచనలు, అలవాట్లు త్యాగమొనరించగలిగితిమో ఆత్మపరిశోధన యొనరించుకొను టెంతయో ప్రయోజనకరము కాగలదు. ఆవిధముగ ఎల్లవేళలయందును భగవంతునికై బ్రతుకువారి బ్రతుకులేధన్యము!

> అనుక్షణం గోవిందనామ పఠనం
> మోక్ష మార్గానికి సుగమ సారం



# నాగుల చవితి

శ్రీ డి. శ్రీనివాస దీక్షితులు

భారత దేశంలోని స్త్రీలు విశేషంగా ఆచరించే పండుగల్లో "నాగచవితి" (నాగుల చవితి) పండుగలు పేర్కొనదగినవి. నాగపూజ లేక సర్పపూజ అతి ప్రాచీన కాలం నుండీ ఆచరింపబడుతోందని చెప్పటానికి ఈ పండుగలే సాక్షులు. అంతేకాదు.. శ్రావణపూర్ణిమనుండి మార్గశిర శుద్ధపంచమి వరకు (లేక పూర్ణిమ వరకు) ప్రతిరోజూ సాయంకాలం నేతితో కలిపిన పేలపిండిని నాగులకు బలివెయ్యడమే "నాగబలి" అని ప్రాచీన శ్రౌత - గృహ్య సూత్రాల్లో వివరింపబడింది. తైత్తిరీయంలో కూడ నాగపూజ ప్రస్తావింపబడింది. ఇక పురాణాల సంగతి సరేసరి. ఈ ప్రమాణాలు చాలు... సర్పపూజ ప్రాచీనమైనదని చెప్పటానికి!

నాగులకూ, ఆంధ్రులకూ అవినాభావ సంబంధం అలనాటి నుండి వుంది. అందు చేతనే ఆంధ్రదేశంలో ఈ నాగపూజకు ప్రాముఖ్యం మెండు. 'నాగులు' అంటే--

నాగులు సాధారణ సర్పాలు కావు. ఇవి "కద్రువ" సంతానమని సుప్రసిద్ధ సంస్కృత కోశకారుడైన అమరసింహుడు తన అమర కోశం (ప్రథమకాండం, భోగివర్గం)లో సూచించాడు. అందుకే వాటిని "కాద్రవేయాః" (కద్రువ కుమారులు) అని ఆయన వ్యవహరించాడు. బ్రహ్మ కుమారుడయిన మరీచి మహర్షికి జన్మించిన కశ్యపప్రజాపతి పన్నెండుమంది దక్షప్రజాపతి కుమార్తెలను పరిణయమాడినాడు. వారిలో "కద్రువ" ఒకతె. ఈమె నాగమాత.

'నాగ' శబ్దాన్ని నిర్వచిస్తూ నిఘంటు కారుడైన వి.యస్. ఆప్టే పండితుడు--

A snake in general; particularly the Cobra.

—The S.S.E. Dictionary, p.283

"కోబ్రా"కే నాగపదం వర్తిస్తుందని విశ్లేషించాడు. 'కోబ్రా' Cobra అంటే--

"Poisonous snakes of Asia and Africa"

—Oxford Dictionary, p.160

"ఆసియా మరియు ఆఫ్రికా ఖండాల్లో కనిపించే విషం కలిగిన త్రాచు పాములు" అని ఆక్స్‌ఫర్డ్ నిఘంటువు వివరించింది. కోబ్రా స్వరూపాన్ని--

"Any of a genus (Naja) of very poisonous snakes of Asia and Africa having around the neck loose skin which is expanded into a hood when the snake is excited."

—Webster's New World Dictionary, p.272

అని వెబ్‌స్టర్ నిఘంటువు వర్ణించింది. ఆసియా - ఆఫ్రికా ఖండాల్లో నివసించే గొప్ప విషం కలిగిన సర్పజాతికి చెందిన త్రాచుపామే కోబ్రా. దీనికి మెడపై పెద్ద పడగ వుంటుంది. ఈ కోబ్రాకు కోపం వచ్చినప్పుడు విశాలమవుతుంది. ఇది పాశ్చాత్యుల వివరణ! ఇక మన ప్రాచీనుల విశ్లేషణ--

మానవముఖం, పాముతోక కలిగి దేవతా స్వరూపంతో పాతాళంలో నివసించే పాములు "నాగులు" అని భాగవతం అభివర్ణించింది. తోకలు కలిగి మానవాకారంలో మసలే త్రాచు పాములే "నాగులు" అని సర్ప సంప్రదాయం!

ఈ నాగులు ఎనిమిది. వీటినే "అష్టనాగులు" అంటారు. అవి:



నవంబరు 7 నాగుల చవితి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.

—సం॥

## తిరుమల తిరుపతి దేవస్థానములు -- తిరుపతి

### సప్తగిరి మాస పత్రిక

* సప్తగిరి మాసపత్రిక తెలుగు, తమిళం, ఆంగ్లం, కన్నడం, హిందీ భాషల్లో వెలువడుతోంది.
* అన్ని పత్రికలలోను అభ్యంతరంకాని వ్యాపార ప్రకటనలు అంగీకరింపబడతాయి.
* ప్రకటనలు ఇవ్వదలచినవారు-- "సంపాదకుడు, సప్తగిరి, తి.తి. దేవస్థానములు, తిరుపతి" వారిని నేరుగాగాని, తపాలద్వారగాని సంప్రదించవచ్చును.
* సప్తగిరికి ప్రకటనలను సేకరించటానికి ప్రత్యేక ప్రతినిధులు ఎవ్వరూ లేరు.

### ప్రకటన రేట్లు

(విడివిడిగా ఒక్కో భాషా పత్రికకు)

| | | |
|---|---|---|
| పూర్తి పేజీ | : | 3000 రూ. |
| అర్థ పేజీ | : | 1600 రూ. |
| పావు పేజీ | : | 900 రూ. |

సంవత్సరానికి (12 సంచికలకు) ఇచ్చే ప్రకటనలపై 15%
ఆరునెలలకు (6 సంచికలకు) ఇచ్చే ప్రకటనలపై 10%
రాయితీ ఇవ్వబడును.

### సాంకేతిక వివరణ

| | | |
|---|---|---|
| పేజీ సైజు | : | 27.5 సెం.మీ x 21.5 సెం.మీ |
| ముద్రణ సైజు | : | 24.0 సెం.మీ x 19.0 సెం.మీ |
| మొత్తం కాలములు | : | 3 |

గమనిక : కారణాలు తెలుపకుండానే ప్రకటనలను తిరస్కరించటానికి, అంగీకరించటానికి సంపాదకుడికి పూర్తి అధికారం వుంది.

ఇతర వివరాలకు :

సంపాదకుడు (సప్తగిరి)
తి.తి. దేవస్థానములు
తిరుపతి-517 507
ఫోన్ : 22294

1. అనంతుడు (ఆదిశేషుడు);
2. వాసుకి;
3. తక్షకుడు;
4. శంఖపాలుడు;
5. కులికుడు;
6. పద్ముడు;
7. మహాపద్ముడు;
8. కర్కోటకుడు.

### నాగుల మహిమ

అష్టనాగుల్లో మొదటివాడైన అనంతుడు విష్ణుమూర్తికి పానుపు. పరమేశ్వరుని కంఠమాల నాగరాజు. అందుకే ఆయన నాగాభరణుడయ్యాడు. పార్శ్వనాథ తీర్థంకరునికి శిరోభూషణం నాగరాజు. అందుకే శ్వేతాంబర జైనులు శ్రావణశుద్ధపంచమినాడు "నాగపంచమీ" వ్రతాన్ని, మార్గశీర్ష శుద్ధ పంచమినాడు "నాగదీపావళి"ని ఆచరిస్తారు. నాగుబాము మనోవిజ్ఞానశాస్త్రంలో కామానికి సంకేతం.... యోగశాస్త్రంలో కుండలినీ శక్తికి గుర్తు. జానపదుల కల్పనలో రోగనివారక శక్తికి ప్రతీక. అనేక గిరిజన జాతుల కులదేవత. వర్షానికి, పంటలకు అధిదేవత. పుత్ర సంతానాన్ని ప్రసాదించే దేవత!

ప్రాచీన అనార్యజాతికి జాతీయ చిహ్నం ఈ నాగుబాము అని పురావస్తు శాస్త్ర వేత్తల వాదం. వారి వాదానికి ప్రబల సాక్ష్యం మొహంజదారొ శిథిలాలలో లభించిన నాగ చిత్రాలున్న ముద్రికలు.

### నాగపంచమి

ఈ పండుగను శ్రావణ శుద్ధ పంచమి నాడు జరుపుకొనడం ఆంధ్రదేశంలో ఆచారం, పంచమి నాగులకు బలవర్ధకమైన తిథి.

"ఉపోష్యా పంచమీ సమ్యక్
నాగానాం బలవర్థనీ."

అని ధర్మశాస్త్రం. అంతే కాదు...

"శ్రావణే మాసి పంచమ్యాం
శుక్లపక్షే నరాధిప!
సాపి పుణ్యతమా ప్రోక్తా
గ్రాహ్యా సా గతి కామ్యయా."

అని 'నాగపంచమి' ప్రస్తుతించబడింది. మోక్షగాములైన వ్యక్తులకు శ్రావణశుద్ధ పంచమి పరమపవిత్రమైన తిథి.

అందుచేత నాగపంచమినాడు ప్రాతః కాలంలోనే భక్తులు తలంటిస్నానంచేసి నాగ విగ్రహాలకు (ప్రతి గ్రామంలోనూ దేవాల యాల ఆవరణంలో వేపచెట్టు లేక రావి చెట్టు క్రింద నాగవిగ్రహాలు ప్రతిష్ఠింపబడి వుంటాయి. ప్రధానంగా శివాలయాల్లో) పాలు, కొబ్బరి, ముడి నువ్వులు, అన్నం, పాయసం, చిమ్మిరి, చలిమిడి నైవేద్యం పెడ తారు.

"విశేషస్తు, పంచమ్యాం
పయసా పాయసేన చ."

తరువాత పుట్టలవద్దకు పోయి పుట్టలో పాలుపోసి ప్రదక్షిణాలు చేస్తారు.

ఈ నాగపంచమిని వైష్ణవులు "గరుడ పంచమి"గా జరుపుకుంటారు. గరుడ పురా ణంలో గరుడపంచమి ప్రస్తావింపబడింది.

## నాగుల చవితి

ఈ పండుగను కార్తీక శుద్ధ చవితినాడు జరుపుకుంటారు. ముఖ్యంగా ఈ పండు గకు కోస్తాతీరం ఆటపట్టు. శ్రీనాథుడు కాశీఖండంలో...

"చలి ప్రవేశించు నాగుల చవితి నాడు" అని వర్ణించాడు. ఈ పండుగను కూర్మ పురాణం వివరించింది. వరాహపు రాణం నాగుల చవితిని "శాంతివ్రతం" అని పేర్కొంది. స్కందపురాణంలో కూడ దీని ప్రసక్తి కనిపిస్తోంది. ఇక వ్రతాన్ని ఆచరించే విధానంలో నాగుల చవితికి, నాగ పంచమికీ భేదమేమీ లేదు.

## వివిధ మాసాల్లో.....

ఈ నాగపూజ వివిధ మాసాల్లో ఆచరింప బడేదనటానికి ఆనవాళ్లుగా వివిధపురాణాలు వ్రతగ్రంథాలు మన ముందు నిలుస్తాయి.

చైత్రశుద్ధ పంచమి నాటి నాగపూజను దేవీపురాణం, స్మృతికౌస్తుభం ప్రస్తావిస్తే.... వైశాఖశుద్ధ చతుర్థిని "నాగచతుర్థి"గా వ్రత గ్రంథాలు నిర్ధారించాయి. శ్రావణపూర్ణిమ నాడు 'నాగబలి'ని స్మృతికౌస్తుభం, శ్రౌత గృహ్య సూత్రాలు నిర్దేశించాయి. భాద్రపద శుద్ధపంచమినాడు "నాగదష్టోద్ధరణ పంచమీ" వ్రతాన్ని భవిష్యోత్తర పురాణం వివరించింది. దీనినే "శాంతి పంచమీ వ్రతం" అని కూడ వ్యవహరిస్తారు. నాగుపాము కాటుకు గురైన వ్యక్తి మరణించిన తర్వాత నాగలోకానికి చేరి పిదప విషములేని పాముగా జన్మిస్తాడట. అట్టి వ్యక్తి ముక్తి పొందాలంటే ఈ వ్రతమే శరణ్యం.

మార్గశీర్ష శుద్ధ పంచమినాడు "నాగ పూజ"ను ధర్మసింధువు, స్మృతికౌస్తుభం విధించాయి. దీనికి "దక్షిణాదిలోనే ప్రసిద్ధి"-- అని ధర్మసింధువు.

ఫాల్గుణ శుద్ధ పంచమినాడు "అనంత పంచమీ" వ్రతాన్ని ఆచరించాలని స్కాందపు రాణంలోని ప్రభాస ఖండం ప్రవచించింది.

## వివిధ ప్రాంతాల్లో....

బెంగాలులో నాగపంచమినాడు సర్ప రాణి "మనసాదేవి"ని పూజించటం ఆన వాయితీ. రాజస్థాన్‌లో పురాణకాలంనాటి నాగరాజులను సంస్మరిస్తూ పండుగ జరుపు కుంటారు. చైనాదేశంలో కూడ నాగపూజ నిర్వహింపబడటం ఈ పండుగ విశ్వవ్యాప్తికి తార్కాణం!



# యాత్రికులకు సదవకాశం!!

## ఆలయ దర్శనం



శ్రీ గోవిందరాజస్వామి ఆలయం!
స్వామి, శ్రీరామానుజులవారు
ప్రతిష్ఠించినది.



శ్రీ కోదండరామాలయం!
స్వామికి వరప్రసాది
అని పేరు.



శ్రీ కళ్యాణ వెంకటేశ్వరస్వామి!
-శ్రీనివాస మంగాపురం
పద్మావతితో వివాహానంతరం
కొన్ని నెలలు నివసించిన పుణ్యక్షేత్రం



శ్రీ కపిలేశ్వరస్వామి!
తిరుపతిలోని ఏకైక శివాలయం
కపిల మహర్షి అర్చించినది.



శ్రీ అగస్త్యేశ్వరాలయం-తొండవాడ.
కళ్యాణీ తటాన ఉన్న పురాతన దేవాలయం



శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం! తిరుచానూరు
శ్రీనివాసుని రాణి పద్మావతి
అర్చామూర్తిగా వెలకొన్న దేవాలయం





బయలుదేరు స్థలం:-
తిరుపతి లోని దేవస్థానం
రెండవ ధర్మసత్రం
బయలుదేరు వేళలు:-
ఉదయం: 6గం॥కు, 10గం॥కు
సాయంత్రం: 3గం॥కు




టిక్కెట్టు వెల:
పిల్లలకు : రూ. 10/-
పెద్దలకు : రూ. 20/-
ప్రతిచోటా ప్రత్యేక
దర్శన సౌకర్యం కలదు

CHANDRASEKHAR




— డా॥ యం. పరాంకుశరావు

తులసీ వనము, తులసీ పత్రపూజ, తులసీ తీర్థము, తులసి ప్రసాదము మరియు బృందావనము మొదలగునవి మన ఆరాధనా పద్ధతులలో తులసికి కల ప్రాముఖ్యతను తెలియచేయును. తులసి లేని పత్రపూజ లేదు. తులసి విష్ణువుకు అత్యంత ప్రీతి పాత్రమైనది. తులసికి కల ఔషధీయ విలువ ఎన్నో.

### పరిచయము:

తులసిని సంస్కృతములో "సురసా" మరియు "విష్ణుప్రియ" అని అంటారు. తులసి వివిధ భాషలలో ఈ క్రింది విధముగా పిలువబడుతుంది.

తెలుగు: తులసి; మంచి తులసి:
హిందీ: తులసి.
కన్నడము: శ్రీతులసి
తమిళము: తులశి
ఆంగ్లము: Sacred Basil ; Holy Basil.

ఇది చిన్న మొక్క. దీనిని ఎరుగనివారుండరు; ప్రతి ఇంటిలో దీనిని పెంచవలెనని పెద్దలు అటారు. తులసి చిగుళ్ళను తులసి దళాలు అంటారు. తులసి దళాలను మరియు పత్రాలు మరియు గింజలు చికిత్సలో ఉపయోగించబడును. తులసి ఆకులు కొద్దిగా కారము మరియు చేదు రసములను కలిగి యుండును. ఆకులు మరియు మొత్తము మొక్క తీక్షణమైన మంచి వాసనను కలిగి యుంటాయి. ఆకులు, కాడలు కేవలము ఆకుపచ్చగా ఉంటే సాదాతులసి లేక లక్ష్మీతులసి అంటారు. అవే కొద్దిగా నల్లటి రంగు కలిగి ఉంటే విష్ణుతులసి లేక కృష్ణ తులసి అంటారు. తులసి చెట్టు ఉన్నచోట దోమలు విషక్రిములు ఎక్కువగా రావు. అందువలననే ప్రతి ఇంటిలో తులసి చెట్టు ఉండడము ఎంతో అవసరము.

### ఉపయోగాలు:

శరీరములో శ్లేష్మమును ; జ్వరములను; పోగొట్టును; గుండెకు బలమునిచ్చును. చర్మవ్యాధులను హరించును; మూత్రములో వేడిని తగ్గించి శక్తిని కలుగచేయును.

### వాడే విధానములు:

*1.* ప్రతిరోజూ 5 తులసి దళములను ఉదయముననే సేవించుచుండిన ఎడల ఆరోగ్యమును కాపాడును. ఇట్లు అందరూ చేయవచ్చును. స్నానము చేయగానే దేవాలయములలో ఉదయము తులసి ప్రసాదము ఇవ్వడములోని ఆంతర్యము ఇదే.

2. తులసి చెట్టుగాలిని పీల్చడము వలన లేక దాని గాలి సోకుచుండిన అంటువ్యా

అత్యంత ప్రాచీన వైద్యం అయిన ఆయుర్వేదం గురించి విననివారు వుండరు. ఆధునికులకు సాధ్యంకాని ఎన్నో జబ్బులను నయంచేసే రహస్యాలు ఆయుర్వేదంలో వున్నాయి. ఇది కేవలం ఐహికానికే కాక భక్తితో ముడిపడిన వైద్యం.

అందుకే సప్తగిరి పాఠకుల సౌకర్యార్థం నవంబరు 1 ఆదివైద్యుడైన శ్రీ ధన్వంతరి జయంతి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాం.

సం॥

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- పాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- మాంసాహారాన్ని భుజించకండి.
- ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- పొగత్రాగకండి.
- వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయుటవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజకే.

ధులు రాకుండా కాపాడును. బృందావనము చుట్టూ ప్రదక్షణాలు చేయడము వలన దాని గాలి మనకు సోకే అవకాశము ఎక్కువ.

3. ఆకు రసముతో ఒకటి లేక రెండు టీ స్పూనుల ప్రమాణంలో తేనె కలిపి రోజుకు 2 నుండి 3 సార్లు సేవించుచుండిన జలుబు, దగ్గు తగ్గిపోవును. గొంతులో అడ్డుపడుచున్న కఫము సులభముగా వెలువడును.

4. ఆకు రసమును నిమ్మరసములో కలిపి పైన పూయుచుండిన తామర మరియు ఇతర చర్మవ్యాధులు తగ్గిపోవును.

5. గింజలను కొద్దిగా పొడిచేసి 2 నుండి 3 గ్రాముల ప్రమాణములో రెండు గంటలు నీటిలో నానబెట్టి, తగినంత శర్కర కలుపుకొని తాగినచో అతి వేడి తగ్గి, మూత్ర విసర్జన సులభమగును.

ఇంతేగాక తులసి స్వరసము అనేక ఆయుర్వేద ఔషధములతోపాటు అనుపానముగా వాడబడుతుంది. దీనికి గుండెను ఉత్తేజ పరిచేశక్తి ఉంది. మరణాసన్నమైన వ్యక్తికి తులసితీర్థమును ఇవ్వడము వలన కొద్దిగా ఉత్తేజనను కలిగించి తద్వారా అతనికి చివరి క్షణాలలో భగవంతుని స్మరణకు తేవడము జరుగుతుంది. తులసికి ఇన్ని ఉపయోగాలు ఉన్నవి కాబట్టే అది పవిత్రమైనదిగా భావించబడింది.

దేవుని దూషించడం కన్నా
పాపం లేదు
మనిషిని హింసించడం కన్నా
నేరం లేదు



# కృషి

— శ్రీమతి వి.విజయలక్ష్మీరెడ్డి




ఏలాంటి కార్యాన్ని సాధించాలన్నా, ఎవరికైనా 'కృషి' అవసరము. కృషి అంటే ఏమిటో దీపం చక్కగా బోధిస్తుంది. తన శరీరాన్ని, తనవత్తిని, తనలోని శక్తినీ నిరంతరం దహించి వేయడం చేతనే 'దీపము' అంత ప్రకాశవంతంగా వెలుగుతూంది. కారు చీకట్లను తొలగించగలుగుతుంది.

నిరంతర 'కృషి'లో ఆ దీపం తన శరీరాన్ని ఆహుతి చేస్తుంది. ఒక నిముషం అది బద్ధకం పూనితే ఒక్క నిముషం శరీరాన్ని దాచదలిచితే, అంతా అంధకారమవుతుంది. తేజోహీనమవుతుంది. పరాజయం, విఫలత్వం సంభవిస్తుంది. కనుక నీవు అభివృద్ధి పొందాలంటే, జయభేరి మ్రోగించాలంటే, అది నీ నిరంతర కృషి వల్ల, నీ కార్యకలాపాలద్వారా, నీ నిత్య అవిశ్రాంత జీవనం వల్ల, నీదేహాన్ని, నీ కండరాలను దగ్ధీభూతం చెయ్యాలి. వాటిని సంతత కర్మానలంలో కాల్చివెయ్యాలి - పేల్చివెయ్యాలి. అప్పుడే నీవు సాధించదలచుకున్నది సాధ్యమవుతుంది. కృషిలేనిది ఏచిన్న కార్యాన్నీ సాధించలేము.

"యోజనానాం సహస్రంతు
శనైర్గచ్ఛేత్ పిపీలికా,
అగచ్ఛన్ వైనతేయోపి
పదమేకం నగచ్ఛతి"

చీమ చిన్నదైనా మెల్లగా నడుస్తూ ఎన్ని వేలమైళ్ళైనా వెళ్లగలదు. గరుత్మంతుడు శక్తిగలవాడైనా, వేగం కలవాడైనా కదలకుండవుంటే ఒక్క అడుగైనా ముందుకు వెళ్లలేదు. కాన ప్రయత్నం చేసిన వానికే ఫలం దక్కుతుంది. అందువలన ప్రయత్నించి నిరంతకృషిచేస్తే అన్ని విజయాలు అందుబాటులో వుంటాయి.

మనకు నదీప్రవాహమేం బోధిస్తుంది? కృషి - నిరంతరకృషి - ఎడతెగని కర్మనిష్ఠ! అనే అది బోధించేది. దీపం మనకు దృష్టిని ప్రసాదిస్తుంది. అది దాని వత్తినిగాని, చమురునుగాని దాచుకోవడం లేదు. వత్తీ, చమురు దాని బాహ్యశరీరము. అవి నిరంతరం దహింపబడుతూండడం వల్లనే ఈ తేజం ఆవిర్భవిస్తూంది. దీపం మనకేమి బోధిస్తుంది? నీ లోభంవల్ల, సోమరితనం వల్ల నీవొక్క నిముషం సంకోచించావా, బద్ధకించావా, నీబాహ్యశరీరం దాచుకున్నావా, ఆ నిముషములోనే నీ కాంతి నశిస్తుంది అని. అలాగే విషయ సౌఖ్యాలకు దైహిక సుఖాలకు మరిగి, కాయాన్ని కష్టపెట్టకుండా కాపాడుకుంటే వారికిక ఆశలేదు.

యువవాణి

అందుకే అంటారు - జడత్వం లేక సోమరితనమే మృత్యువు. చైతన్యమే ప్రాణం. కార్యసిద్ధి కావాలంటే నిరంతర చైతన్యాన్ని అలవరచుకోవాలి. తనశక్తిని దాచుకోవాలనుకునేవాడు నిర్భాగ్యుడు - శక్తిని దాచుకొనే సోమరి భ్రష్టుడవుతాడు. నదిలా నిరంతరం ప్రవహిస్తూ వృద్ధి చెందుతూ పరిస్థితులకు తగినట్లు ప్రవర్తిస్తూ నిరంతర కృషి చెయ్యాలి. 'కృషి' - కృషి' ఇదే కార్యసిద్ధికి ప్రథమ సూత్రం.

మనిషి తన నిరంతర కృషిని సాగిస్తూ

# హెచ్చరిక.....

రాష్ట్రంలోను, రాష్ట్రేతరమైన కొన్ని ప్రాంతాలలోను కొందరు వ్యక్తులు తాము తి.తి. దేవస్థానం ఏజెంట్లమని, తిరుమలనుంచి శ్రీవారి ప్రసాదాలను, క్యాలండర్లను, ఆర్జితసేవ టికెట్లను తెప్పించి ఇస్తామని నమ్మించి అధిక మొత్తంలో ప్రజల నుంచి సొమ్ము వసూలుచేసి మోసం చేస్తున్నట్లు మా దృష్టికి వచ్చింది.

ఇది పచ్చి మోసం తప్ప మరేం కాదు.

తిరుమల శ్రీవారి భక్తులందరూ ఈ విషయాలను గమనించి మోసపోరాదని తెలియజేస్తున్నాము.

* శ్రీవారి ప్రసాదాలు తిరుమలలో తప్ప మరెక్కడా అమ్మబడవు.
* శ్రీవారి ఆర్జితసేవల టికెట్లు తిరుమలలో ఆర్జితం ఆఫీసులో లభిస్తాయి. అలాకాక ముందుగా కూడ ఆ యా సేవకు తగినంత రుసుమును డి.డి. ద్వారా పంపి మీరే ఖరారు చేసుకోవచ్చు. (అయితే కనీసం రెండు నెలల ముందుగా మీరు తేదీ ఖరారు చేసుకొని డి.డి. పంపవలసి వుంటుంది).
* దళారీలను నమ్మకండి.
* తిరుమల తిరుపతిలలో వున్నప్పుడు మీకు ఏదైనా ఇబ్బంది కలిగితే సమీపంలోని తి.తి.దే. అధికారిని కలవండి.
* దూరప్రాంతాలవారు ఆ ప్రాంత సమీపంలోని తి.తి.దే. సమాచార కేంద్రాన్నో, కళ్యాణ మండపంలోని అధికారులనో కలిసి అన్ని వివరాలు తెలుసుకోవచ్చు.

సంపాదకుడు

వుండాలి. దానిఫలం కోసం ఎలాంటి ఆదుర్దాను పెట్టుకోకూడదు. భవిష్యత్తును గురించి, జయాపజయాల గురించి విచారించ కూడదు. కృషి చెయ్యడమే మనధర్మం. కృషి కోసమే మనం కృషిచెయ్యాలి. చేసిన దానికి అసంతృప్తి పడవలసిన అవసరంలేదు. చేయ బోయేదానికి సంశయం వద్దు. ప్రస్తుతాన్నే పరిగణిస్తూ కృషిచెయ్యాలి. భూమిలో సజీవంగా వున్న విత్తనాన్ని గాలి,నీరు మట్టి మొదలైనవన్నీ వాటంతటవే స్వయంగా అనివార్యమైన ఆకర్షణ సూత్రం వల్ల వచ్చి చేరుతూ తగిన దోహదాన్ని యిస్తున్నవి. ఇలాగే ప్రకృతి, ప్రసన్నతతో చేసే కృషికి తప్పక సర్వసహాయం చేస్తుంటుంది. మన కున్నదాన్ని విశ్వాసంతో ఉపయోగించడమే నూతన జ్ఞానార్జనానికి మార్గమనే సామెత వుంది.

విజయానికి ఆరవప్రాణం ఆత్మవిశ్వాసం - కృషి. ఏనుగు సింహానికన్నా చాల రెట్లు పెద్దది. సింహంకన్న ఏనుగు ఎంతో బలమైంది. అయినా సింహమొక్కసారి గర్జించేసరికి ఏనుగుల గుంపులు కకావికల వుతాయి. ఈశక్తి సింహానికెక్కడిది? అదే 'ఆత్మశక్తి'. ఆత్మశక్తిని విశ్వసించి పనిచేసే వాడికి విజయం ఎల్లప్పుడు లభిస్తుంది.



# సందేహాలు? సమాధానాలు!

నిర్వహణ: ఎల్లోరా

ప్రశ్న:-

శ్రీకృష్ణుని అష్టభార్యలలో రుక్మిణీ, సత్య భామ, జాంబవతుల వివాహాలు లోకవిదితమే. కాని, మిగిలిన ఐదుగురి వివాహాల గురించి వివరించకోరుతున్నాను. 'నీల' అష్టభార్యలలో ఒకతె కాదా?

- కొడవంటి రామకృష్ణ.
హైదరాబాదు.

సమాధానం :

మన పురాణాలలో అన్నీ ఒకే రకంగా వున్నట్లు కనిపించడం లేదు.

పారిజాతాపహరణం భాగవతం, హరివం శాలలో పేర్కొన్న దానినిబట్టి చూస్తే-

రుక్మిణి, జాంబవతి, సత్యభామ, మిత్ర విందా, భద్ర, కాళింది, సుదంత, లక్షణలు ఎన మందుగిరినీ పారిజాతాపహరణం పేర్కొంది.

అయితే-భాగవతంలో రుక్మిణి, జాంబ వతి, సత్య, మిత్రవింద, కాళింది, సుదంత, లక్షణ, నాగ్నజితిగా వివరించబడింది.

మరి హరివంశంలోనైతే-రుక్మిణి, జాంబ వతి, సత్య, మిత్రవింద, కాళింది, సుమంత, లక్షణ, నీల.

ఏతావాతా మనకు తేలింది నాగ్నజితి, నీల ఒకరేనేమో అనిపిస్తుంది. కారణం-

రెండు కథలలోనూ పొగరుబోతు ఎద్దుల కథే ప్రధానం కావడం గమనార్హం!

ప్రశ్న:

నిజంగా శివుడు దిగంబరుడేనా?

--వెంకయ్యనాయుడు
లంకలదిన్నె.

సమాధానం:

అయ్యా! ఈ అనుమానం ఎందు కొచ్చింది! ఇటువంటి విషయాలను భక్తి, ధార్మికావగాహనతో చూడాలి.

అంబరాంబరుడు శివుడు! అంటే-ఆకా శమును వస్త్రముగా ధరించినవాడు అను కోవాలి. సృష్టికర్త అయిన శుభంకరునికి వస్త్రధారణ ఏమిటి? అలంకరణలు ఏమిటి? ఆ దిగంబరుడే విభూతిలో వున్న సత్య శివ సుందరాకారుడు-

దిక్-అంబరుడు అందాం, అంటే దిక్కు లనే అంబరంగా కలిగినవాడని అర్థం.

సమస్త చరాచర కోటిలోనూ తానే లయాన్వితుడై, ఆత్మస్వరూపుడై, సృష్టిలయ కారుడైన శంకరునికి వేరే అంబరాలెందుకు? ఆడంబరాలెందుకు చెప్పండి.

జగమెరిగిన జంగమయ్యకు వేరే వస్త్ర ధారణ కావాలా?

"హరహరా మహాదేవ" అని ఆయనను ముక్తికోసం భక్తితో అర్చించడం తప్ప-భక్తుని హృదయంలో మరో శబ్ద విన్యాసం ఇమడ రాదు - అమరరాదు కదండీ!



## పాఠకుల ధార్మిక సందేహాలకు సమాధానాలు

ఎంతో కాలంగా పాఠకులందరూ ఎదురుచూస్తున్న ఈ శీర్షిక జూలై 94 నుండి ప్రారంభమయ్యింది. పాఠకుల ధార్మిక సందేహాలకు ప్రముఖ పండితులు సమాధానాలు ఇస్తారు.

ప్రతినెలా 15వ తేదీలోపు పంపిన ప్రశ్నలకు ఆ మరుసటి సంచికలో సమాధానం ఇవ్వటం జరుగుతుంది. ప్రశ్నలలో ఎటు వంటి అవహేళనలకుగాని, దుర్విమర్శలకుగాని తావు వుండరాదు. వీలైనంతమటుకు ప్రతి ప్రశ్నకు ఆయా విషయాలలో నిపుణులైన వారిని సంప్రతించి సమాధానం ఇవ్వవలసి వుంటుంది గనుక, కొంత ఆలశ్యంగా ఒక్కొక్క ప్రశ్న ప్రచురితమయ్యే అవకాశమున్నదని గమనించగలరు.

ప్రశ్నలు పంపవలసిన చిరునామా :

సందేహాలు - సమాధానాలు
సంపాదకుడు
సప్తగిరి
తి.తి. దేవస్థానములు
తిరుపతి -- 517 507



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్‌ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.




తిరుమల నిలయుడైన శ్రీవేంకటేశ్వర స్వామి లీలలు అపూర్వం, అద్భుతం. నమ్మినవారికి కొంగు బంగారం. స్వామివారి లీలలు వర్ణించటం ఆదిశేషునికైనా శక్యంబు గాదు గదా!

1991 సం॥లో నేను కండ్ల అనారోగ్యంతో తీవ్రమైన బాధలు పడ్డాను. కళ్ళు ఎర్రబడి పోటుతో ఎందరో కండ్ల వైద్యులకు చూపించాను. ప్రయోజనం కనిపించలేదు. నాలుగు నెలలు మానసిక బాధతో కృంగిపోయాను. కండ్ల ఎరుపు తగ్గినా ఒక కంటిలో ఎన్నో చుక్కలు వచ్చాయి. మరలా కంటి వైద్యులకు చూపించాను. ఏవో మందులు వాడమన్నారు. కాని తగ్గలేదు. ఎంతో బాధపడ్డాను.

అప్పుడు దిక్కుతోచక మా ఇంటి ఇలవేలుపు శ్రీ వేంకటేశ్వరుని, స్వామీ! నీ మహత్తువల్ల చుక్కలు పోవాలి. నా అపరాధములు మన్నించు. ప్రతిరోజూ నిన్ను కొలుచుకొంటాను స్వామీ. ఈ చుక్కలు పోతే నీ కొండకు వచ్చి మొక్కు ఇచ్చుకుంటాను అని దీనుడినై మనసారా ప్రార్థించాను.

అంతే చిత్రముగా సుమారు నెలరోజుల నుంచి ఉన్న చుక్కలు రెండురోజులలో పోయినవి. ఈ అద్భుత అనుభవం ఎలా వర్ణించి వ్రాయాలో తెలియదు. సర్వదా ఆ శ్రీనివాసుని అనుగ్రహమునకు పాత్రుణ్ణి కావాలని స్వామివార్ని మనసారా వేదుకొంటున్నాను.






1990 మే 9వ తారీఖు. మేమందరము ఆరోజు కొత్తగా కట్టిన ఒక పెంకుటింటిలో ఉన్నాము. ఆ ఇంటి గోడలు ఇంకా పూర్తిగా సిమెంటు చేయలేదు. ఆ ఇంటిలో మాతోపాటు కొంతమంది ఉన్నారు. ఆ రోజు పెనుతుఫానుకావటంచేత మేమంతా ఆ ఇంటిలో ఉండవల్సి వచ్చినది. రాత్రి 9 గంటలవరకు ఎలాగో గడిచింది. తర్వాత గాలి ఎక్కువైంది. వెంటనే మేము ఉన్న ఇంటి పెంకులమీద ఒక చెట్టుకొమ్మ విరిగిపడింది. పెంకులు పగిలి లోపలకు నీరు రావటం మొదలైంది. మా తమ్ముడు భయపడి నీరుకారిపోయాడు. చూస్తే జ్వరం వచ్చినది. ఆ సమయములో బయటకి వెళ్ళటానికి వీలులేదు. భయంకరమైన పెనుతుఫాను. మాకెంతో భయం వేసింది. అప్పుడు ఆపద్బాంధవుడు, భక్తరక్షకుడు అగు శ్రీ వేంకటేశ్వరుని మనస్ఫూర్తిగా వేడుకున్నారు మా నాన్నగారు. ఈ ఆపదనుండి బయటపడితే తిరుమల కొండకు వస్తామని మొక్కుకున్నారు. కొద్దిసేపటికి మా తమ్ముడు లేచి మాట్లాడటం మొదలుపెట్టాడు. అంతే మాకెంతో సంతోషం వేసింది. ఆ రాత్రి అంతా వేంకటేశ్వరుని నామస్మరణతో గడిపారు మా నాన్నగారు. తెల్లవారినాక కొద్దిగా తుఫాను తగ్గింది. మేము వెంటనే ఒక అద్దె డాబాలో చేరినాము.

అలా కొద్దికాలం గడిచిన తర్వాత మా అన్నయ్యకు కాలుకు పెద్దగాయం అయింది. నడవలేని పరిస్థితి ఏర్పడింది. డాక్టరుకు చూపిస్తే చాలా ఆలస్యంగా తగ్గుతుంది అన్నారు. మరల శాంతమూర్తి, కారుణ్యమూర్తి, భక్తులపాలిట కల్పవృక్షం, కలియుగ దైవం అయిన ఆ వేంకటేశ్వరస్వామిని వేడుకున్నాము. మా అన్నయ్య కొద్దిగా నడవటం మొదలుపెట్టాడు. వెంటనే డాక్టరు సలహా తీసుకొని మా అన్నయ్య కాలికి కట్టుకట్టి తిరుమలకు బయలుదేరినాము. తిరుమల చేరి తలనీలాలర్పించి ఆ మహానుభావుని దర్శనం చేసుకొని మనస్ఫూర్తిగా నమస్కారాలుచేసి, మరల నీ సేవ చేసుకునే భాగ్యం ప్రసాదించమని వేడుకొని తిరిగివస్తూ ఇంకా కొన్ని పుణ్యక్షేత్రాలు దర్శనం చేసుకొని ఇల్లు చేరినాము. కొద్దిరోజుల్లోనే మా అన్నయ్య కాలి బాధ తగ్గింది. ఆ వేంకటేశ్వరుని లీలలు చెప్పలేనివి. ఏ సమయంలో భక్తులను ఆదుకోవాలో ఆయనకు తెలుసు. ఆ మహానుభావుని నామస్మరణ వలనే సర్వ పాపాలు హరించుకుపోతాయి. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, ఆది మధ్యాంతరహితుడు అగు శ్రీ వేంకటేశ్వరుడే దిక్కులేని వారికి దిక్కు.

"ఆరోగ్యాన్ని యౌవనాన్ని జీవితానందాన్ని శక్తిని పొందగోరేవారు ఉపవాసముచేసి తీరవలె. ఉపవాసం వల్ల మానవుడు నైతికాధ్యాత్మికంగా ఎదిగి తీరును.



# సజీవ శిల్పకళకు ప్రతిబింబం
# హళేబీడు

దక్షిణ భారతావనిలో ధార్మికమయిన ఒడుదుడుకులు ఎక్కువగా లేని కారణంగ కళలు బాగా అభివృద్ధి చెందాయి. రాజకీయ పరిణామాలు ఎన్ని ఉన్నప్పటికీ, ప్రభువులందరు సంస్కృతికి ప్రతిబింబములైన కళలకు చేయూతనిచ్చి ఆదరించారు. ముఖ్యంగా ఆలయ నిర్మాణాలద్వారా సర్వకళలను ఉజ్జీవింప చేశారు. వానిలో శాశ్వతంగా నిలిచివుండే 'శిల్పకళ' ఒకటి. అలాంటి సజీవ శిల్పకళ మూర్తీభవించిన ఆలయాలలో హళేబీడులోని హోయసాలేశ్వరాలయం ఒకటి.

### ఐతిహాసిక వివరాలు

హళేబీడు కర్నాటక రాష్ట్రంలో బేలూరుకు 17 కి.మీ. దూరంలో ఉంది. దీని మొదటిపేరు ద్వారసముద్రం. ఈ నగరం 12, 13 శతాబ్దాలలో హోయసాల సామ్రాజ్యానికి రాజధానిగ వర్ధిల్లింది. విష్ణువర్ధనుని మనుమడైన రెండవ వీరబల్లుని శాసనసమయంలో తూర్పు పశ్చిమ సముద్రములు, కావేరీ కృష్ణానదుల మధ్యవరకు వీరి సామ్రాజ్యం విస్తరించి, హొయసాలుర విజయపతాకం గగనవీధికి చేరింది. 12వ

**మేజర్ షేక్ మౌలాలీ**

శతాబ్దంలో నిర్మించబడిన ఈనగరం 150 సంవత్సరముల అనంతరం క్రీ.శ. 1311లో మాలికాఫర్ చేత దోచుకోబడి సర్వసంపదలు కోల్పోయింది. 1326లో మహమ్మద్ బిన్ తుగ్లక్ ఈనగరమును తిరిగి దోచుకున్నాడు. మూడవ బల్లుని మరణానంతరం ఈనగర వైభవం కాలగతిలో కలిసిపోయి నేడు ఒక కుగ్రామంగ మిగిలింది.

17వ శతాబ్దిలో విజయనగర చక్రవర్తులు తమ రాజధానిని బేలూరుకు మార్చి, ద్వారసముద్రమును పునరుద్ధరించి 'హళేబీడు'గా పిలువసాగారు.

### హోయసాలేశ్వర ఆలయం

'హళేబీడు' అనగానే కళాహృదయులకు స్ఫురించేది హోయసాలేశ్వరాలయం. విష్ణువర్ధనుని ప్రధానాధికారులలో ఒకడయిన కేతుమల్లుడు ఈమందిర నిర్మాణం గావించాడు. ఆలయనిర్మాణానికి 105 సంవత్సరముల కాలం పట్టినది.

ఈ నిర్మాణం రెండు ఆలయముల సముదాయం. ఉత్తరదిశలో శాంతలేశ్వరుడు, దక్షిణ దిశలో హోయసాలేశ్వరుని ఆలయాలు నిర్మించబడినాయి. ఈరెండు ఆలయాలు వరండా ద్వారా కలుపబడినాయి. అయితే అక్కడక్కడ కొంత శిల్పం పూర్తికాకుండనే



## కళావని

వదలివేయబడింది. ఆలయాల మండపములలో వివిధాభరణ భూషితంగా మల్చబడిన నందులున్నాయి. ఒకనందికి వెనుకభాగంలో సప్తాశ్వములు, అరుణదేవునితో సుశోభితమై ఒప్పారు సూర్యభగవానుడు దర్శనమిస్తాడు.

### వాస్తు - శిల్పకళావిన్యాసము

హోయసాలేశ్వరాలయం నక్షత్రాకారంలో నిర్మించబడింది. భారతీయ శిల్పకళావిన్యాసంలో దీనికిదే సాటి. బేలూరు చెన్నకేశవాలయం కంటె శిల్పములు పెద్దవిగను, కళ మరికొంత మెరుగులు దిద్దుకొని శతాబ్దాల తరబడి ఎందరో ఐతిహాసికులను, కళాకారులను, శిల్పులను, మేధావులను ప్రపంచం నలుమూలల నుండి ప్రతినిత్యం ఆకర్షిస్తు

# KARVETINAGAR
# SRI VENUGOPALASWAMI TEMPLE

### A SYMBOL OF VIBRANT FAITH

*Faith is the source of light*
*Faith is the all-pervading wisdom*
*So declare the sages and saints*

It is the abiding faith of the devout that made the Temple of Sri Venugopalaswami an edifice of everlasting glory.

The Deity - Sri Venugopalaswami - was the patron God of the Karvetinagar rulers whose immeasurable love for the Lord finds its eloquent expression in the hymns composed in a bygone epoch.

Towering above the dusky hills and the green valley below, the temple presents a spectacular view.

The exquisitely carved sculptures, intricately designed pillars and elaborately decorated mandapas are indeed a connoisseur's delight.

The graceful forms of Lord Venugoplaswami and His consorts - Sri Satyabhama and Sri Rukmini captivate our hearts. The Deity -known as bounteous *Kalpavriksha* - bestows His blessings on all those who pray to Him.

The celebrated poet Sarangapani who was the court-poet of the rajas of Karvetinagar, declares unequivocally that the easiest means for salvation in the Kaliyuga is the darsan of Sri Venugopalaswami. It is said Thyagaraja the renowned composer, attained bliss after worshipping Lord Venugopala

The *darshan* of Sri Venugopalaswami is an exhilarating spiritual experience. The Lord, one of the most delightful manifestations of Sriman Narayana, is a veritable Kalpavriksha

Karvetinagar is located on Puttur - Chittoor road, about 25 Kilometres away from Tirupati The Temple is being kept open for worship from early hours of the morning to late hours of the night.

* * *



Srivaru with Muthyalakavacham.



# TIRUMALA TIRUPATI DEVASTHANAMS
## DONATION SCHEME FOR ACCOMMODATION AT TIRUMALA





Tirumala, the abode of Lord Venkateswara, is the holy of holies visited by millions of Devotees round the year.

Primed to meet the needs of visiting pilgrims, T.T.Devasthanams have been constructing cottages and Guest Houses, at Tirumala under donation Scheme.

The following categories of accommodation are now available under the donation scheme.

- C & D portions first floor Seshadri Nagar Cottages and Anjanadri Nagar Cottages.
  Donation : Rs. 1,50,000/-
- C & D Portions 1st Floor Garudadri Nagar Cottages
  Donations : Rs. 2,25,000/-
- Saptagiri Block No. 4 & 5 (Kaveri & Alaknanda) furnished suites.
  Donation Rs. 1,50,000/-
- Sapthagiri Block No.3 (Thungabhadra Block) unfurnished tenament.
  Donation Rs. 40,000/-
- Small Dormitory halls in Varahaswamy Guest House.
  Donation : Rs. 3,00,000/-
- Big Dormitory Halls in Varahaswamy Guest House.
  Donation : Rs. 6,00,000/-
- Spl. Type Cottages at Surapuram Thota.
  Donation Rs. 5,00,000/-




The Donor may send an application, specifying the category of accommodation, to the Chief Accounts Officer, T.T.Devasthanams, K.T. Road, Tirupati- 517 507 along with a Demand Draft drawn in favour of the Executive Officer, T.T.Ds.

BENEFITS :

- The donor will be provided with free accommodation at the donated or any other cottage/ suite for 60 days a year.
- This privelege is however restricted to 15 years in the case of institutions and large companies.
- A plaque displaying the donors name and place will be erected on the donated cottage/suite.
- Preference will be given to the family members of the donor in allotment.
- We appeal to the devotees to donate generously to the scheme for providing accommodation to the devotees at affordable rates.



Further details regarding location and plinth area can be had from Executive Engineer V T.T.Devasthanams, Tirumala.

Executive Officer,
T.T.Devasthanams



న్నాయి. ప్రసిద్ధ ఐతిహాసిక శాస్త్రవేత్త అయిన ఫెర్గూసన్ ఈఆలయాన్ని భారతీయ వాస్తు - శిల్పకళకు ప్రతిబింబంగా పేర్కొన్నాడు.

సాత్వికతకు, ప్రకృతిశోభకు సంకేతమైన లతాగుల్మముల జిలుగులతోను; పరాక్రమానికి సంకేతమైన గజకేళి, సింహకేళి, అశ్వకేళి తోను; స్వయం సమృద్ధికి, పసిడిపంటలకు, క్షీరసమృద్ధికి సంకేతమైన గోసముదాయం తోను; ప్రజల ఆనందమయ కళాత్మక వాతావరణమును సూచించు వివిధ లాస్య భంగిమలతోను; దుష్టదమనానికి సంకేతమైన మకరపంక్తులతోను; జ్ఞానసంపత్తికి నీరక్షీర వివేక సూచకమయిన హంసహంసీగణములతోను; వేదసారమునకు, భారతసంస్కృతికి ప్రతిబింబములయిన రామాయణ, భారత, భాగవతాది వివిధ పురాణ కావ్యముల కథా సన్నివేశములతోను హోయసాలేశ్వరాలయ కుడ్యములు అణువణువు అలరారుతుంటాయి.

'వల్లశేణపురాళ్ళు వెన్నలాగ అలనాటి శిల్పుల చేతుల్లో కరగి ప్రవహించి అతి సుకుమార శిల్పస్వరూపాలు పొందాయి!' అనే అనుభూతి కల్గుతుంది. యాత్రికులలో "ఈ శిల్పములు శిలానిర్మితములు కావు, మైనం



శిల్పస్వరూపం పొందింది!" అని భ్రాంతి చెందేవారు కూడ కలరు. అంతటి మహత్తర శిల్పకళానికేతనం ఈమందిరం.

అయితే చాల శిల్పములు విధర్మీయుల దండయాత్రలలో వికృతం చేయబడినాయి. విజయనగర ప్రభువులు ఆ శిల్పములను వీలైనంతవరకు పునర్నిర్మాణం చేయించారు. రాష్ట్రకూటులు తొమ్మిదవ శతాబ్దంలో నిర్మించిన చెరువు ఈ ఆలయమునకు సమీపంలో ఉంది.

## ఇతర ఆలయములు

హోయసాలేశ్వరాలయంతోపాటు కేదారేశ్వర, శ్రీరంగనాథ మొదలైన ఆలయములు హళేబీడులో ఉన్నాయి. వీనిలో కేదారేశ్వరాలయం చాలవరకు శిథిలం కాగా, ఆ శిల్పములను పురావస్తు ప్రదర్శనశాలలో చేర్చారు.

బేలూరు, హళేబీడు హోయసాలుర వాస్తు-శిల్ప కళావిన్యాసానికి చక్కని దర్పణములు. అందులో హళేబీడు గీటురాయి. ప్రతి ఒక్కరు తప్పక దర్శించవలసిన ప్రదేశం.



## తిరుమల తిరుపతి దేవస్థానములు
## తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

విద్యే సౌందర్యం — విద్యే దైవం

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని "*ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటీ, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్.*" వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి

# ఉపదేశామృతం

సమరోన్ముఖంగ, సంచలితచిత్తంతో, కర్తవ్యం తెలీక నిలబడ్డాడు సవ్యసాచి. అతని దైన్యావస్థను అసహాయతను గుర్తించి శ్రీకృష్ణుడు గీతోపదేశం చేశాడు. అట్టి దశలో పద్దెనిమిది అధ్యాయాల తత్త్వోపదేశం చేసిన అనంతరం అర్జునునికి మళ్లీ చేయవలసిన కర్తవ్యం ఏదో తెలీక సంధిగ్ధావస్థ వచ్చింది. శౌరి చిరునవ్వుతో "సర్వధర్మాన్ పరిత్యజ్యా, మామే ఏకం శరణం వ్రజాత్, అహంత్వాం సర్వ పాపాభ్యో మోక్ష యిష్యామి మాశుచః" అనే అనునయ వాక్యాలతో ఆదరించి మనస్థైర్యాన్ని కలిగించి శత్రు మర్దనానికి సన్నద్ధుని కావించినాడు.

ఈ సన్నివేశాల వలన కృష్ణసఖునికి గీతోపదేశ వివరణ లేవీ బుద్ధి కందలేదట. కాబట్టి సందర్భాని కోసరం సహనంతో వేచియున్నాడు అర్జునుడు. ధర్మరాజు ధరణిని సుఖ శాంతులతో పాలిస్తున్నప్పుడు అత్యంత భయ విశ్రంభాలతో శ్రీకృష్ణుని చూచి మెలమెల్లగ ప్రశ్నించాడు.

డా॥ పుల్లూరి ఉమ

"అనికి తొడంగునప్పుడు,
మదాత్మకలందిన కొన్ని తత్త్వబో
ధనమహనీయ వాక్యములు
దాత్తకృపం దగ నీవు చెప్పితే
మనమున లోకి యర్థములు మాధవ!
విస్మృద జాలనైతిన
విమత వదస్సుధా రసము
వీనుల వింకొక మాటు వింపతే

అశ్వ. ప్రథ.153

"యుద్ధానికి సిద్ధంగ నున్నప్పుడు, మనసు కలతవెందినప్పుడు తత్త్వబోధ చేశావు కదయ్యా కృష్ణ! ఇది యేటి న్యాయం?" అని బావతో చనువుగ ప్రాధేయ పడినాడు పార్థివుడు. "కాబట్టి ఆనాటి బోధనల్ని మళ్లీ ఒకసారి వచస్సుధారసంతో నింపరాదా" అని ప్రార్థించాడు. ఆ మాటల్ని విన్న కృష్ణుడు.

"అనిన నగుచు నొకకేల,నతని కౌగిట చేర్చి
బుద్ధి తత్త్వ విహీనుండును శ్రద్ధారహితుడు నైతివి దూటి,ముకుంది
దిట్టుంను నాతని తోన్"

చిరునవ్వుతో నొక చేత్తో అర్జునుణ్ణి కౌగలించుకుని "అట్టి సందర్భంలో తాత్త్విక చింతనలోని అనవధానత వల్ల నామాటలు వినకుంటివికదా!" అని చనువుతో మందలించి మళ్లీ ఇలా అన్నాడు "ఆనాటి వాక్యాలు బ్రహ్మపద వేదనమునకు పరమ హేతు భూతములు. ఆ మహార్థములందు బుద్ధి నిల్పనైతివికదా" అని వాపోవుతూ భక్తునకు మళ్లీ తత్త్వ జ్ఞాన స్థిరీకరణ గావించాడు.

భగవద్గీతలోని తత్త్వార్థ భావాలకు అంతర్లయాపాదికిని ఉపదేశించాడు. సారాన్ని సంగ్రహించి చెప్పాడు మాధవుడు. అది ఉపదేశామృతం మయింది.

బ్రహ్మదేవుడు ఆదిసృష్టి తత్త్వానికి స్రష్ట. ఆ సృష్టికి చేతన కలిగించాడు. అదే ప్రధాన తత్త్వం. చేతనానంతరం దాన్ని 'క్షరం ' అన్నారు. దానికి ఇతరమైన తత్త్వం 'అక్షరం'. ఈ క్షరాక్షర మిధున సంభూతమే జీవరాశి. ఇయ్యది బీజం. శ్రుతి ప్రమాణకమైనది.

తత్త్వజ్ఞాన జిజ్ఞాసువునకు ప్రథమ మృదు మనఃస్థితి వైరాగ్యం.

సుఖ దుఃఖాలు అశాశ్వతాలు. శరీరం మలినయుక్తం. సకల పదార్థాలును నశ్వరాలే. కర్మపరిపాకం జాడ్యంతో కూడిందని ఊహించు కోవాలి. తన్ను ఆవరించే మోహావేశాన్ని దూరం చేసి మోక్షప్రాప్తితో చింత కలిగి సంసార సాగరంలో మునుగకుండ వుండాలి. ప్రాణికి జరామరణాలు అనివార్యాలని అవి ప్రకృతి సహజాలని గ్రహించి



వాని వలన సంభవించే దుఃఖానికి విసిగి మానవుడు పరమపథానికై వెదుకుతాడు.

ఇట్టి భావాలు కలిగిన వాడే విరక్తుడు. మోక్షప్రాప్తియందు మనసులో ఏర్పడు ప్రాథమిక దశయిది.

అట్టి విరక్తుడు నియమంచే పవిత్రమైన చోట కూర్చొని మనస్సులో చింతలేక, యెప్పటి కప్పుడు తోచే ఆలోచనలనన్నింటికి వణగ ద్రొక్కియుండాలి. వాడు నిరాశ్రయుడు, సర్వులకు మిత్రుడు. కామక్రోధ హీనుడుగ శమదమాది దుర్వాశేష్మడుగ నుంటాడు. వానిలో మానాభిమాన రాహిత్యం వుంటుంది. ఈ ఏకాగ్రత భావం వలన పై దశల్లో రూపొంది సర్వభూతాత్మక దర్శనాన్ని పొందగలడు. ఏకాంతిక ప్రదేశంలో ఏకాగ్రభావం అనేది వైరాగ్యదశ కనంతరం లభ్యమయ్యే ద్వితీయ సోపానం. బహిదంత శ్శత్రు నాశనం చేసే శమదమాది గుణం దీనికి మూలం.

అలాంటి వాళ్లకు లాభాలాభాలు ప్రియ ద్వేషాలు సుఖదుఃఖాలు సమానం. ధర్మశీలుడుగ, నిశ్చలాత్మనుపొంది, త్రివర్గొచ్చ రహితుడై అవ్యయ పదాన్ని పొందగలడు. అంటే సంకల్ప వర్జితం తృతీయదశ కావచ్చు. అభ్యాసనియతి దీనికి మూలం.

ఇయ్యది యౌదికదశ, ముంజగర్భమగు ఇషీకమును వలె తనువులో వెదకుట యోగుల విధ్యుక్త ధర్మము. అంటే శరీరము ముంజ దర్భలతో కూడిన పొదవంటిది. ఆ పొదలో మంచి చిత్తరువు వ్రాసే కుంచె అంటే ఇషీకమును వెదకి పట్టడం వలె తనువు వలన జీవాత్మను నిశ్చయపరచి తెలిసికోవాలి అనేది తాత్పర్యం. ఆవిధంగా తెలుసుకున్న యోగి వరునకు జనన మరణ గతులు తొలగిపోతాయి.

జరామరణాలు లేనివాడైన ఆముక్తుడు హర్షశోకాలు లేక బ్రహ్మచర్య వ్రతం వలన సద్భక్తులకు ముక్తి మార్గాన్ని చూపగలడు. ఆ యోగికి శస్త్రహతి, జలబాధ, అగ్నిదహనాది వికారాలు వుండవు. కాని అనుష్ఠాన క్రమం అనివార్యంగ అభ్యసించాలి.

తనకు తెలిసిన మార్గంలో మనస్సును అంతర్వర్తిగ నిలిపి బాహ్యాగతిన వెడలనీయక నిలపాలి. దంతాలు, జిహ్వా, కుత్తుక, తాలుతలం, కంఠనాళం, హృదయం, యివన్ని యెచ్చట స్థిరంగ వుంటాయో అచ్చటే వాటిని నిలపాలి. పాలకడవను పెక్కు పశువులమధ్య నిలిపి కాపాడేటట్టు మనస్సువలన ఆత్మను వెదకాలి. ఈ ప్రయత్నాలు చేయుటంచే వివేకం వలన, ఎల్లప్పుడు వెలిగే బ్రహ్మమును యోగి చూడగలడు.

ఇది చక్షురాది ఇంద్రియాలకు గ్రాహ్యం కాదు. సమస్త మాలిన్యక్షాళనంతో మనస్సు ప్రదీప్తమై ఆత్మను దర్శించగలడు. అన్నిచోటులయందు, శిరస్సు, లోచనాలు, పదములు హస్తములు నియతత్వంచే ఉజ్జ్వలంగ వెలగడాన్ని యోగి చూడగలడు. ఇట్టి దర్శనం వలన చీకటి దూరమౌతుంది. ఇదే బ్రహ్మవిద్యా రహస్యం. "అని చెప్తూ కృష్ణుడు అర్జుననితో" పాండవమధ్యమా! అనాడు రథస్థుడుగనున్న నీకు నీ యర్థజాతాన్నే వినిపించాను. ఇయ్యది గ్రహించడానికి జాతి నియతిలేదు. ఈబ్రహ్మవిద్యను సందేహం కలవారికి, అకృతాత్ములకు, శ్రద్ధారహితులకు తెలుపలేదు.

శ్రద్ధాసక్తితో లౌకిక కాంక్షల వీడి యీయుపాయాన్ని ఆచరిస్తే సందర్శన భాగ్యాన్ని పొందగలరు" అని ముగించాడు.







## రాయలసీమలో రంగస్థలం

[రచన: డా॥ పోతుగుంటి వెంకట సీతారామయ్య; $\frac{1}{4}$ డెమ్మీ సైజు, 458 పేజీలు. వెల: 250/రూ. ప్రతులకు: పి. శ్యామలమ్మ, 1-6-742 ఇందిరానగర్ - తిరుపతి (ఆంధ్రప్రదేశ్)]

ప్రకృతినేర్పే పాఠాలలో నటన ప్రథమ పాఠం! పశుపక్ష్యాదులు, అనేకానేక జీవాలు తమకు తెలియకుండానే ప్రకృతిలోని అంద చందాలకు, ప్రకృతిలోని సహజలక్షణాలకు స్పందించి నటించడం నేర్చుకొంటాయి.

మనిషికూడా అదే స్పందనతో కూని రాగాలు తియ్యడం, గెంతులూ చిందులూ వేయడం - ప్రకృతిలోని ఆనందానుభూతు లను తన నిత్యకృత్యాలకు అద్దుకొని ఆనం దించడం - మనిషికి పుట్టుకతోనే అబ్బిన వరం!

మనిషిలోని నటనాశక్తి అలా అలా చిగు రించి, మొగ్గతొడిగి ఒక కళాత్మకమైన నాట కీయానుభవం రూపుదిద్దుకొంటుంది.

ప్రకృతిలోని సుందరమైన వాతావరణం చూసి నెమలిపింఛం విప్పి నృత్యం చేయడం, చిటపటచినుకుల్లో తడుస్తూ గెంతులు వేస్తూ ఆహ్లాదంతో నృత్యం చేసే మనిషీ - ఇలా నటన మనిషికి తెలియకుండానే ప్రకృతి నేర్పే తొలిపాఠాలు!

అలా మనిషిలోని కళాతపస్వి కన్ను తెరచిచూసిన దృశ్యాలను తనలో ఆవిష్క రించుకొని హావభావాలను నటనరూపంలో ప్రదర్శించడం మనిషిచేసిన, చేసుకున్న గొప్ప పుణ్యఫలం.

ఏ ప్రక్రియకైనా - నాటకీయత ముఖ్యం - అందుకే "నాటకాన్తం హి సాహిత్యమ్" అన్నారు.

ప్రపంచ పరివ్యాప్తంగా నాటకరంగం ప్రాచీనకాలం నుంచి ఆధునిక కాలం వరకూ అనేక మార్పులూ చేర్పులూ చేసుకుంటూ వచ్చింది.

సంస్కృత నాటకాలనుంచి ఇంగ్లీషు నాటకాలు, ఇలా అనేక దేశాలలో, అనేక భాషల్లో అనేక కొత్త కొత్త ఆలోచనలతో నాటకరంగం తీర్చిదిద్దబడింది.

గ్రీకునాటకాల చరిత్ర నుంచి జీవనాటిక ప్రయోక్త బ్రెట్ వరకూ నాటక పరిణామం పరి కిస్తే అన్ని ప్రక్రియలకంటే నాటకం ప్రధాన మైనదీ - సమాజాన్ని విడమరచి చూపగలిగేది అన్నది అక్షరసత్యం.

"ప్రపంచంలో ప్రప్రథమంగా వెలువడిన రూపకాలు సంగీత, సాహిత్య, నృత్య సమ్మి శ్రితాలు కావడంవల్ల - ఆదిమానవుని ఆలా పన, హృదయస్పందననుండి వెలువడిన పలు కులు, ఆవేశపూరితమైన చిందులు నుండే రూపకం వెలువడిందని ప్రొఫెసర్ మౌల్టన్ సిద్ధాంతీకరించాడు.

"సర్వకావ్యాలకు వృత్తులు మాతృకలని భరతముని సిద్ధాంతం. ఈవృత్తులు నాలుగు విధాలు. 1. భారతీవృత్తి, సాత్త్వతీ వృత్తి, ఆరభటీవృత్తి, కైశికీవృత్తి.

అంతేవరుసగా - వాచికం, ఆంగికాభి నయం, సాత్త్వికాభినయం, ఆహార్యం.

ఒకనాడు రత్నాల సీమగా ఖ్యాతిగాంచిన రాయలసీమ నేడు రాళ్లసీమగా కళ్లముందు కనిపిస్తూంటే కళ్ళు చెమరుస్తాయి.

అయితే - రాళ్లసీమ నుంచే నట రత్నాలు వెలువడిన తీరూతెన్నూ చూసినప్పుడు -ఆచ రిత్రను చదివినప్పుడు భేష్! రాయలసీమ నటరత్నమా! అని ముక్కున వేలు వేసుకోవ కతప్పదు.

రాయలసీమలో ఆ వాడన, ఈ గడపనా - అక్కడక్కడా కవిశేఖరులు, నటశేఖరులూ పుట్టి పుట్టెడుకీర్తినీ, బండెడు ఖ్యాతినీ ఆర్జించిన మహనీయులెందరో?




వారందరినీ చూడాలనీ, వారి కవితా సౌరభాలను ఆస్వాదించాలనీ, వారి వారి నటనా కళావిన్యాసాన్ని కనులార గాంచితరిం చాలనీ ఎన్ని గుండెలు గుసగుసలాడాయో, మరెన్ని కళ్లు ఎదురుచూశాయో కదా!

అటువంటి నటమూర్తుల కృషికి అక్షర రూపం కల్పించి- ఒక పరిశోధనాత్మక గ్రంథంగా "రాయలసీమలో రంగస్థలం" ను వెలయించిన డా॥ పోతుగంటి వెంకట సీతా రామయ్య కృషి బహుధా ప్రశంసనీయం - అభినందనీయం.

ఇందులో నాటిక చరిత్ర, పరి ణామం, కాలానుగుణ్యంగా రంగస్థలంలో వచ్చిన మార్పులు, జానపదకళా రూపాలు, పౌరాణిక, సాంఘిక నాటకాల పరిశీలనంతో రంగరించిన ఈబృహత్ గ్రంథంలో రాయలసీ మలోని నటులను గురించీ, వారి గొప్పతనాన్ని గురించీ రాయడం, వారివారి ఫోటోలతో సహా ప్రచురించడం గ్రంథానికి అలంకార ప్రాయ మైంది.

ఈ గ్రంథానికి ఆముఖం రాస్తూ ప్రసిద్ధ సాహితీవేత్త డా॥ డి. నాగసిద్దారెడ్డి "రాయల సీమలో పుట్టిన చిగురు కొమ్మైన చేవ అన్న అల్లసాని పెద్దన సూక్తిని సార్థకం చేస్తూ కవులు, గాయకులు, అవధానులు, విమ ర్శకులు, పండితులు, రాజకీయచతురులు, త్యాగులు, భోగులు, యోగులు, నటులు - ఎందరోజన్మించి, సాంఘిక రాజకీయ, సారస్వత, కళారంగాల్లో చిరయశస్సు నార్జిం చారు" అన్నారు. అక్షరాలా నిజం!

శ్రమపడి విషయ సేకరణ చేసి, చక్కని గ్రంథాన్ని రచించిన డా॥ పోతుగంటి వెంకట సీతారామయ్య ని మనసారా అభినందించాలి.



# అమరావతి

గుంటూరు పట్టణానికి సుమారు 22 కి.మీ దూరంలో కృష్ణానది ఒడ్డున ఉన్న పుణ్యక్షేత్రం అమరావతి. ఇక్కడ అమరలింగేశ్వర స్వామి ఆలయం ఉన్నందున దీనికి అమరావతి అని పేరు వచ్చింది.

పూర్వం రాజా వెంకటాద్రినాయుడు తన స్వంత గృహనిర్మాణం నిమిత్తం త్రవ్వకాంలో అమరావతి క్షేత్రం అవశేషాయి బయల్పడ్డాయి. ఇక్కడి అమరలింగేశ్వర స్వామి ఆలయం ఆంధ్రలోనే ప్రసిద్ధి పొందినది. ఈ ఆలయం చాలా విశాలంగా ఉంటుంది. ఇక్కడ అమరలింగేశ్వరుడి లింగాకారం చాలా ఎత్తుగా ఉంటుంది. అందువల్ల ఆలయ గర్భగుడి నేలనుండి ఎత్తుగా ఉంటుంది. ఈక్షేత్రం బయటపడ్డ తర్వాత రాజా వెంకటాద్రినాయుడు ఈ ఆలయ అభివృద్ధికి ఎంతో

జాగృతీ కిరణ్

కృషి చేశాడు. ఈ ఆలయంలో ఒక చెట్టు ఉన్నది. దీనికి కోర్కెలు తీర్చే చెట్టని పేరు ముఖ్యంగా పెళ్ళి కావలసిన వాళ్ళు పిల్లలు కలగనివాళ్ళు ఈ చెట్టుకు చిన్న గుడ్డ ఉయ్యాలలాచేసి కడతారు. అలాచేస్తే వాళ్ళ కోర్కె నెరవేరుతుందని ప్రజల నమ్మకం.

అమరావతి బౌద్ధ హిందూ మతాల సంస్కృతి వైభవాలకు ప్రతీకగా నిలుస్తుంది. ఈ గ్రామంలో 1700 చ॥ అ॥ స్థలంలో శిథిల శిల్పాలు లభ్యమయినాయి. గౌతమ



కోర్కెలు తీర్చే చెట్టు





మ్యూజియం లోపలి భాగం



బుద్ధుని జీవిత విశేషాలు, బోధనలు శిలా రూపంలో లభ్యమయితే వాటిని ఇక్కడ ఒక మ్యూజియంలో భద్రపరిచారు. ఆంధ్రదేశ చరిత్రలోనేకాక, భారతదేశ శిల్ప చరిత్రలో ఇక్కడి శిల్పకళ సువర్ణ అధ్యాయాన్ని సృష్టించింది. అమరావతిలో లభ్యమయిన శిల్పాలను ప్రపంచంలో చాలా మ్యూజియాలలో భద్రపరిచారు.

ఈ ఆలయం శాతవాహనుల కాలంలో నిర్మింపబడినది. అమరావతి శిల్ప చిత్రాలలో ఎక్కువభాగం బుద్ధుని జన్మకథ, జీవిత



సంగ్రహ విషయాలను తెలియజేస్తాయి. ఈ శిల్పాలలో స్త్రీ చిత్రరచన చాలా అద్భుతంగా సాగింది. ఒక స్త్రీ చిత్రాన్ని పోలిన మరో స్త్రీ చిత్రం ఇక్కడ లభించదు. స్త్రీల అలంకరణ ఆభరణాలు, మొ|| ప్రత్యేకంగా చాలా చక్కగా కన్పిస్తాయి. శిల్పాలలో రసానికి తగ్గ భావాలు స్పష్టంగా చెక్కబడ్డాయి.

కృష్ణాపుష్కరాల తర్వాత అమరావతి ఆలయం కొత్త అందాలను సంతరించుకున్నది. చక్కటి స్నాన ఘట్టం నిర్మించబడినది. అమరావతికి దగ్గరలో వైకుంఠపురం అని ఒక ఊరు ఉన్నది. ఇది ఒకప్పుడు అగ్రహారంగా ఉండేది. ఇక్కడ కొండమీద సహజ సిద్ధమయిన పంచముఖ నరసింహ స్వామి ఆలయం ఉన్నది. ఈ కొండ ప్రక్కనుండి కృష్ణానది ప్రవహిస్తూ ఉంటుంది. ఈ కొండమీదనుండి చూస్తే కృష్ణవేణి కడురమ్యంగా కన్పిస్తుంది. ఇక్కడ స్వామి రూపం గుహలో ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్‌లో అమరావతి ఒక చూడ చక్కని ప్రదేశం. భక్తి ముక్తి దాయకం. ✤



# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కాంక్షించి వచ్చే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బాగుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు. ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించుకుంటున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించబడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాల కోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగలనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణ మితి శ్రుతిః।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః।

— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీత మైనదో వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

చంద్రశేఖర్



# కార్తీక మాసాచరణము

— శ్రీ పాటిల్ నారాయణరెడ్డి



కార్తీకమాసపు పౌర్ణమి దినమున చంద్రుడు కృత్తికా నక్షత్రము నందుండును. అందుచేత ఈ మాసమును కార్తీకమాసమన్నారు. ఈ మాసమునకు దామోదరుడు అధిపతి. ఈ మాసమునకు ఒక విశేష స్థానము కల్పించటమైనది. కార్తీక శుద్ధపాడ్యమి మొదలుకొని, కార్తీక బహుళ అమావాస్యవరకు ఒకనెల 'సంజ దీపము' అని ప్రతి నిత్యము నూనెదీపమును వెలిగించుట ఒక ఆచారముగా వచ్చినది. దీనినే కార్తీకదీపము అని అందురు. అంతేగాక ఈ మాసమునందు సౌరమానరీత్యాతులామాస ముండుటచే ఈకాలమందు ఏదో ఒక పుణ్యనదియందు స్నాన మాచరించవలెనని చెప్పి దీనికి తులాస్నానము అని అన్నారు. ఈ కార్తీకమాసమందు వచ్చు శుద్ధ ద్వాదశియని ఉత్థానద్వాదశిని చెప్పి ఈ దినాన ఉసిరిక కొమ్మను తెచ్చి నాటి తులసీ పూజచేయుటయేగాక ఉసిరిక కాయను భోజనమునకు ఉపయోగింపవలయును.

గ్రీష్మ తాపము కాని, వర్షాకాలపు చిరాకుగాని, హేమంతములోని చలిగాద్పులుగాని లేకుండ శరదృతువు ఎంతో హాయిగా ప్రశాంతముగా నుండును. రైతులకు కొంత పంట చేతికివచ్చి, మరికొంత రాబోతున్న సమయము ఇది. అందుకనే మానవుడు తన ఉల్లాసమును శరత్తులో ఎక్కువగా వెల్లడించుకొనుచు చాలాపండుగలు చేసికొనును.

శరత్తు ఉత్తరభాగములో వచ్చు కార్తీక మాసము నెలరోజులు పర్వదినాలుగానే భావింతురు. 'న కార్తీక సమో మాసో' అనగా కార్తీక మాసముతో సమానమైన మాసము లేదనుచు అత్రిమహర్షి అగస్త్యుల వారితో అన్నట్లు తెలియుచున్నది.

నదీస్నానము, ఉపవాసము, పురాణపరనము (శ్రవణము), దీపారాధన, దీపదానము, సాలగ్రామపూజ, దైవపూజ, వనభోజనములు కార్తీకమాసములో నిర్వర్తించవలసిన ముఖ్య విధులుగా చెప్పబడుచున్నవి.

కార్తీకశుద్ధ పాడ్యమినాడు దీపావళియని, ఆ దినమున బలిచక్రవర్తి భూమిని సందర్శించుననియు, అందుచేత దీపములను అంటించి సంతోషపడుటయేగాక ఈ దినమున ఒక పెద్ద సంబంభంగా పండుగని ఆచరించుట అనాదినుంచి వచ్చినది. ఈ పండుగకు మరియొక ప్రాధాన్యమిచ్చినారు. ఇది క్రొత్త అల్లుళ్ళ పండుగని చెప్పి దీపావళి మొదలగుటకు ముందే అనగా నరక చతుర్దశి వెనుక దినమైన 'నీరు నింపు' పండుగ వేళకు క్రొత్త అల్లుడు మామగారి ఇంటికివచ్చి, ఈ సంతోషసమారంభములందు భాగము వహించవలెను. మొత్తమునకు కార్తీకమాసమనగా ధార్మికముగా (కార్తీక దీపములు వెలిగించుట, ఉత్థాన ద్వాదశి ఆచరించుట), పారమార్థికముగా (తులాస్నానముచేయుట), ఆధ్యాత్మికముగా (వ్యాసపూర్ణిమాచరణ), లౌకికముగా (అల్లుండ్లు పాల్గొనుట), సాంస్కృతికముగా (బాణసంచాప్రేల్చుట, మంటలు వేసియు సంతోషపడుట) అను ఆచరణములు కూడియున్నవి.

## తిలతైల దీపము

ఈ కార్తీక మాసమునందు సూర్యుడు తులారాశి, వృశ్చికరాసులందుండును. రవి వృశ్చికరాశిని విడుచుటకు మొదలే కార్తీక మాసము పోయి, మార్గశిర మాసము వచ్చి యుండును.

రవి తులారాశి నుండి వృశ్చికరాశికి ప్రవేశించుకాలమునుండి (అనగా కార్తీకమాసమునుండి) పగలు తక్కువై, రాత్రికాలము ఎక్కువగును. ఈ కాలములందు సూర్యోదయము నిదానముగాను, సూర్యాస్తమయము త్వరగాను అగుటచే పగటికాలము తక్కువగా నుండును. మరియు ఈ నెలయందు వాతావరణమున వ్యత్యాసము జరిగి చలి మొదలగుటచే మానవుని దేహము నందుండు ఉష్ణము కొద్దిగా వ్యత్యాసము పొందును. ఎప్పుడు దేహపు ఉష్ణాంశమున వ్యత్యాసము అగునో అప్పుడు దానికి సంబంధించిన ఉపద్రవములు మొదలగును. వీనిని సాధ్యమగునంతవరకు నిగ్రహించుటకు సాయంత్రము పూట తైల దీపములను వెలిగించవలయును. తిలనుండి తైలము, అనగా నువ్వుల నూనెతో దీపారాధన గావించవలయును. నువ్వులు శనిగ్రహమునకు చెప్పబడిన ధాన్యము. మూలవ్యాధి, స్త్రీల రజస్సు దోషములకు మంచి పరిణామకారి. ఈ తిలతైలము మానవుని ఆరోగ్యానికి మంచిది. ఈ తైలమునుండి దీపములు వెలిగించిన వీనినుండి వెలువడు ధూపము వాతావరణమును శుద్ధిచేయుటయే గాక ఉష్ణాంశమును ఎక్కువ చేయును. ఈ దీపమును చూచుచుండుటచే కన్నులకు చాలమంచి జరుగును. కంటి నరములపై మంచి ప్రభావముపడి బలమును పుంజుకొనును. దృష్టిదోషము పరిహారమగును.

## ఉసిరిక

ఉసిరికయందు తీపు, పులుపు, కారము, చేదు, వగరు రుచులు గలిగి ఒక్క లవణ రసము (ఉప్పు) లేనిదిగా యున్నది. జీర్ణ శక్తిని పెంపొందింప జేయును. శరీరపు ఉష్ణమును తగ్గించును. కండ్లమంటలు, పాదముల మంటలు బాగా తగ్గును. వీర్యవృద్ధిని కలిగించును. మంచి రుచిని పుట్టించును. దాహమును పోగొట్టును. మంచి పుష్టి నొసంగును. మధుమేహ రోగులకు మంచి హితకారి. పులుపు రసముగలదగుట వలన వాతమును, మధుర శీతగుణముల వలన పిత్తమును, రూక్ష కషాయ గుణము వలన కఫమును హరించును. అందువలన ఉసిరిక త్రిదోష హరము. మంచి రసాయన ద్రవ్యము. దీనిని బీదలపాలిట 'సంజీవిని' అని పిలువబడుచున్నది. ఉప్పగా నుండు నీటి బావిలోనికి ఉశిరిక చెట్టు కట్టెలను వేసినచో బావిలోని నీరు ఉప్పు తనము తగ్గి త్రాగుటకు యోగ్యమగునని తెలుపబడియున్నది.

న్యాయముగా ఉసిరికకాయను ఏదో ఒక రూపములో మానవుడు తన ఆరోగ్యమును కాపాడుకొనుటకై ప్రతిదినము ఉపయోగింపవలసియున్నది. కాని ఇది అందరికి అన్ని కాలములలోను సాధ్యమగుటలేదు. గాన కార్తీకమాసమునందుగాని తప్పక ఉపయోగించాలని ధార్మికముగా నియమము చేసినారు. ఎందుకన కార్తీక మాసమునందు వాతావరణ ప్రభావమునుంచి ఉష్ణాంశము తక్కువై త్రిదోషములు వికృతి పొందును. మరియు దీని పరిణామముగా మానవుని పిత్తకోశముపై ఎక్కువై పిత్తోష్ణ సంబంధమైన అనేక ఉపద్రవములు సంభవించును. వీటి పరిహారము కొరకు ఈ నెలయందు ఉసిరిక కాయను సేవించియే తీరవలెనని నియమము గావించినారు. ఉసిరిక కొమ్మను తెచ్చి బృందావనము నందుంచి పూజ చేయుటచే బృందావనమునందలి తులసియొక్క వాసన మరియు ఉసిరిక కొమ్ముతో దాని వాసనయు కలిగి మనము పీల్చుకొందుము. ఈ రెండు కూడ సాక్షాత్ సంజీవని వంటివి. దీనితో త్రిదోషములను స్వాధీనములోనికి తెచ్చుకొనుటకు వీలగును.

## నదీస్నానము

ఈమాసమందు (తులామాసమందు) ఏదో ఒక పుణ్యనది యందు స్నానము చేయవలెను.

గంగేచ యమునేచైవ
గోదావరీ సరస్వతీ
నర్మదా సింధు కావేరి
జేస్మిన్ సన్నిధిం కురు.

మన ఈ సప్తనదుల యందు మనుష్యుని ఆరోగ్యమునకు కావలసిన ఔషధ గుణములు ఎక్కువగా నున్నవి. మిగిలిన నదులు అసంఖ్యాకముగా నున్నప్పటికి ఈ సప్తనదుల యందున్న గొప్పగుణములు ఈ మిగిలిన నదులలో చాల తక్కువ అని చెప్పవచ్చును. కార్తీకమాసమునందు వాతావరణపు మార్పుచే జనింపబోవు చిన్నచిన్న ఉపద్రవములను నాశనము చేయు గుణము ఈ ఏడు నదుల నీటియందున్నవి. ఇంకొక్క విషయము దేహములో ఉత్పాదనమగు విద్యుత్తు ఈ నెలలో వాతావరణ ప్రభావముతో ఎక్కువగా విసర్జనముకాదు. దీనిని తప్పించి ఎక్కువ ఉత్పాదనమగు విద్యుత్ సరియగు పరిమాణములో విసర్జనము జరుగుటకు నదీస్నానము తప్పక ఆచరించవలెనని నియమము గావించినారు. ఈ రెండు కారణములచే ఈనెల యందు పుణ్యనదీ స్నానమును తప్పక ఆచరించవలెనని నియమము గావించినారు.

## వ్యాస పూర్ణిమ

కార్తీక శుద్ధ పౌర్ణమి దినమును వ్యాస పౌర్ణమి అన్నారు.

ఈ దినము చంద్రుడు కృత్తికా నక్షత్రము నందుండును. రవి కూడ వృశ్చికారాశియందు విశాఖా నక్షత్రము లేక అనూరాధ నక్షత్రము నందుండును. కృత్తికా నక్షత్రము రవియొక్క నక్షత్రము. కృత్తికానక్షత్రమునకు అగ్ని. అధిదేవత రుద్రుడు.

విశాఖా నక్షత్రము గురునక్షత్రము. విశాఖా నక్షత్రమునకు ఇంద్రాణి అధిదేవత. గురువునకు బ్రహ్మ, విష్ణు అధిదేవతలు. అనూరాధ నక్షత్రము శని నక్షత్రము. ఈ నక్షత్రమునకు మిత్ర అధిదేవత. శనికి యమ అధిదేవత. రవి జ్యేష్ఠా నక్షత్రమునకు వచ్చునప్పటికి, కార్తీక మాసము ముగిసి మార్గశిర మాసము మొదలగును.

రవి పైన చెప్పిన నక్షత్రములందు సంచ

రించు నపుడు ఈ నక్షత్రములకు మరియు అధిదేవతలకు చెప్పబడిన గుణముల ప్రభావము మనుష్యునిపై పడవలయును. అదే కాలమునందు చంద్రుని ప్రభావము అత నుందు నక్షత్ర ప్రభావము అధిదేవత ప్రభావము కూడ మనుష్యునిపై బడును.

చంద్రుడు మనఃకారకుడు. రవి, చంద్రుడు, భూమి కేంద్రమునకు 180 డిగ్రీలు వచ్చినపుడు అనగా పౌర్ణమి దినమున ఈ ప్రభావము సంపూర్ణముగా మనుష్యునిపై బడును. అగ్నినక్షత్రమైన కృత్తికానక్షత్రము నందుండు చంద్రునిచే బహిర్గతమగు కిరణములు విశాఖ, అనూరాధ, మరియు జ్యేష్ఠా నక్షత్రము లందు రవి నుండి బహిర్గతమగు కిరణములు మనుష్యుని ఆరోగ్యముపై అందును మనస్సుపై సంపూర్ణ ప్రభావము చూపించును.

కృత్తికా నక్షత్రము నందుండు చంద్రుని మూలకముగా (కృత్తికకు - అగ్ని అధిదేవత. నక్షత్రాధిపతి రవికి రుద్రుడు అధిదేవత. రుద్రుడు లయకారకుడు) పంచేంద్రియములకు (తమ కారకుడైన రవి, విశాఖ నక్షత్రము నందుండు నపుడు విశాఖ నక్షత్రమునకు ఇంద్రాణి అధిదేవత. ఇంద్రాణి అనగా పంచేంద్రియములు అని అర్థము) కలుగు తొందరలను ఉపద్రవములను నివారించును (అనగా ఆరోగ్యమునకు ముఖ్యమైన హృదయపు పనిని నియంత్రించు మూలకముగా). అనూరాధ నక్షత్రము శని నక్షత్రము అధిదేవతమిత్ర. మిత్ర అనగా సూర్యుడు. సూర్యుడు జగత్ చక్షువు. శనికి అధిదేవత యమ. యమ అనగా నియంత్రించువాడు అని అర్థము. యమ హృదయమునకు అధిదేవత. అందుచే సరియైన క్రమ పద్ధతిలో హృదయమును నియంత్రించు మూలకముగా ఆరోగ్యము ఒక స్థితికి (జ్యేష్ఠా నక్షత్రానికి అధిదేవతయైన బుధుని అధిదేవత విష్ణువు. విష్ణువు స్థితి కారకుడు) తీసికొనివచ్చు మూలకముగా దేహమునకు ఒక తేజస్సును (జ్యేష్ఠా నక్షత్రమునకు ఇంద్ర అధిదేవత. ఇంద్ర అనగా స్ఫుర ద్రూపి అని అర్థము) ఇచ్చునదే ఈ

**శ్రీ పద్మావతీ అమ్మవారికి**

# తిరుప్పావడ సేవ

తిరుపతి సమీపం తిరుచానూరు లోని
శ్రీ పద్మావతీ అమ్మవారికి ఆర్జిత తిరుప్పావడ సేవను
ఇటీవల ప్రారంభించారు

ఈ తిరుప్పావడ సేవ ప్రతి గురువారము ఉదయం గం.11-00ల నుండి మధ్యాహ్నం గం.12-00ల వరకు నిర్వాహిస్తారు. రు.3000లు చెల్లించి గృహస్థులు ఈ సేవలో పాల్గొన వచ్చును.

వివరములకు

అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్
శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు.

వ్యాస పూర్ణిమ దినాన పుణ్యనదియందు స్నానముచేసి, పారమార్థికమును యోచించు దిశయందు మనస్సును లగ్నము చేయు కొరకు విశేష జపము, పూజ మొదలగునవి ఆచరించవలెనని నియమము చేసినారు.

శరదృతువులో రెండవనెల కార్తీకము. సూర్యుడు తులారాశిలో యున్నపుడు నదీ జలాల్లో పుణ్యస్నానమాచరించిన సమస్త పాపాలు ప్రక్షాళన మగుననియు సుస్థిరమైన ఆరోగ్యము, సుదీర్ఘమైన ఆయువు కలుగును. అందువల్ల కృత్తికా నక్షత్రము అస్తమించకుండు సూర్యోదయమునకు ముందు కార్తీక స్నానమాచరింతురు. వర్షాకాలములో అప్పటి వరకు భూమిపైబడిన వర్షపునీరు భూమిలోనికి ఇంకుచు బలమైన అయస్కాంత మండలమును సృష్టించునని భౌతిక శాస్త్రము తెలుపును. ఈ అయస్కాంత ప్రభావము ప్రవహించు నదులలో వర్షాకాలము తర్వాతవచ్చు కార్తీక మాసములో అధికముగా ఉండునని, అయస్కాంతమండల ప్రభావమువల్ల అనేక వ్యాధులు పోవునని దీనినే మ్యాగ్నెటో థెరపి అని అందురని తెలియుచున్నది.

కార్తీకమాసములో రాత్రివేళలందు భూగర్భ జలములో శక్తివంతమైన అయస్కాంత మండలముండునని శాస్త్రజ్ఞులు నిర్ధారించిరి. ఫలితముగా చీకటి ఉండగానే నదీప్రవాహమునకు ఎదురుగా ఉదరభాగమువరకు మునిగి ఉండునట్లు సుమారు 15 నిమిషాలు కార్తీక స్నానముచేసిన ఉదరసంబంధమైన వ్యాధులు సులభముగా నయమవునని శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిరి. నదీప్రవాహములలో శరదృతువులో ఔషధుల సారము ఉండునని కృష్ణయజుర్వేదము.

ఈ కార్తీక మాసమందు [illegible]సము దీపములను అంటించుట కార్[illegible] పాడ్య[illegible] నుండి మొదలగును. [illegible] ఈ దినమునకు దీపావళి అన[illegible] [illegible]పములు సమూహంగా నుంచు[illegible] [illegible]దే దీపావళి పండుగ అన్నారు. ఈ [illegible] [illegible]నమందు క్రొత్త అల్లుళ్ళు మామగా[illegible] [illegible]టికివచ్చి ఈ పండుగ యందు పాల్[illegible] [illegible].

అల్లుడు రావలయునన్న ఏదో ఒక విశేష ముండవలెను. అం[illegible]చేత ఈ పండుగ యందు వచ్చునట్లుగా [illegible] - ఆచారము వచ్చినది. ఈ పండు[illegible] [illegible] ఉగాది, నవరాత్రి మొదలగు పండు[illegible]. [illegible]దుకు రాకూడదు?

## నిత్యాభిషేకం

తిరుపతి కపిలతీర్థంలోని శ్రీ కపిలేశ్వరస్వామివారికి నిత్యాభిషేకం సేవను నూతనంగా ప్రారంభించారు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు సంవత్సరానికి రు.42-00లు చెల్లించాలి.

శాశ్వతంగా చేయించదలచుకున్న వారు రు. 500 + 42 లు చెల్లించాలి.

సంవత్సరానికి రెండు పర్యాయములు, ఇద్దరు వ్యక్తులను ఈ సేవను దర్శించటానికి అనుమతిస్తారు.

---

మనదేశమందు సుమారు నూటికి 80 మంది వ్యవసాయము చేసెడివారు. స్వాభావికముగా వర్షకాలమందు వ్యవసాయపు పనులు విడిచి మానుగారి ఇంటిలో సుఖ సంతోషాలతో కాలక్షేపము గావించినచో వ్యవసాయపు పనులు ఎట్లు జరగాలి? శరత్ ఋతువు మొదలయిన తర్వాత వ్యవసాయపు పనులు ఎక్కువగా నుండవు. మార్గశిర మాసపు దినానికి పంటలు కోతకు వచ్చును. పుష్య మాసము 'సుగ్గి' కాలము. ఈ సుగ్గి (పంటలు పండి రైతుకు, కూలీలకు ధన ధాన్యము చేతికి అందు కాలము) కాలానంతరమే అనగా మాఘమాసము నుండి జ్యేష్ఠమాసమువరకు వివాహముల కాలమన్నారు. ఇది అయిన తరువాత మరల కొంత విరామము రైతులకు దొరకునది వర్షాకాలము తర్వాతనే "విశాఖాంత్యం మేఘం" అన్నారు. అనగా విశాఖ వర్షమే కడపటి వర్షము అని. ఈ కాలమునకు అనగా అప్పటికి కార్తీకమాసము మొదలగును. అందుచేత ఈనెల యందు వచ్చు పండుగకు కార్తె అళ్ళుళ్ళ పండుగ అన్నారు.

ఈ బాణాసంచా నుండి ఇంకొక ముఖ్య ఉపయోగమున్నది. శరదృతువనగా వర్షము అయిపోయిన తర్వాతికాలము ఈ కాలము నుండి చలి ప్రారంభమగుననియు తెలియవలెను. ఈ చలికాలమునందు ఉత్పన్నమగు పురుగు పుట్రలు, రోగాణువులు, వీనిని నాశనము చేయునదే బాణసంచా ఉపయోగము.

### కార్తీక సోమవారము

కడపటిదిగా ఈ కార్తీక మాసమునందు వచ్చు సోమవారములందు 'కార్తీక సోమవారము' అని ప్రత్యేకపూజ, ఎక్కువగా దీపములు వెలిగించుట చేయుదురు.

సోమవారము చంద్రుని వారము. చంద్రుడు మనఃకారకుడు. అందు చేత మనఃకారకుడైన చంద్రుని వారమందు (దినమందు), చంద్రుని ప్రభావము మనస్సు పైనను, దేహము పైనను ఎక్కువగా నుండును. అదే సమయమందు రవి నుండి వచ్చు చెడ్డ ప్రభావముండును. గాన అనగా ఆ చెడ్డప్రభావమును నివారించు ఉద్దేశముతో ఈ దినమునందు (సోమవారమందు) స్నానము, జపము, పూజ, ఉపవాస నియమము మరియు ఎక్కువగా దీపములు వెలిగించుట మొదలగు కార్యక్రమములు ఆచరణలో నియమము చేసినారు. జపముచే మనస్సుపైన, పూజచే శరీరము పైన మరియు ఆహార నియమమునుండి ఆరోగ్యముపైన మంచి ప్రభావము పడును.

కార్తీక సోమవారమున సామాన్యముగా ఈశ్వర పూజకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడినది.

శివుడు లయకారకుడు. మానసిక మరియు దైహిక ఆరోగ్యమునకు ఈ మాసమునందు కొద్దిగ తొందరలు జరుగును. దీనిని నివారించు కొనుటకు లయమునకు కారకుడైన శివుని ఈ దినములందు పూజించుట. అనగా లయమునకు సంబంధించిన శక్తిని నివారించి, సృష్టి, స్థితులకు సంబంధించిన శక్తిని సాధించునదే ఈ క్రియల పరమార్థము.

చంద్రునికి పార్వతి అధిదేవత. రవికి రుద్రుడు అధిదేవత, ప్రకృతి, పురుషుడు వీరిద్దరికి సంబంధించిన వారము సోమవారము. అనగా పార్వతి పరమేశ్వరుల వారము. అందుచే ఈ దినమున ఈశ్వరునికి ప్రత్యేక పూజలు సలుపుట ఆచారమై యున్నది.



## హిందూ వివాహం

అవివాహిత అయిన కన్య ఈశ్వరుడ్నే భర్తగాను, వివాహిత అయిన పిమ్మట భర్తనే ఈశ్వరుడుగాను ఎంచుకోవాలి అన్నారు. మన మతంలో వివాహం కేవలం ఒడంబడిక contract కాదు. ఆత్మోన్నతికి ఏర్పడిన సంస్కారం.

—కంచిపరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి

సేకరణ : శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారి "నడిచేదేవుడు" గ్రంథం నుండి.

# చింతన

భోజరాజు ఆస్థానంలో ఎందరో కవు లుండేవారు. తనదగ్గర కొచ్చిన ఏ కవిని ఉత్తచేతులతో పంపేవాడు కాదు భోజరాజు. అందువల్ల ఆ రోజుల్లో ఏమాత్రం పాండిత్యమున్న వ్యక్తైనా రాజుగారి కొలువు కోసం ప్రాకులాడేవాడు. ఐతే అంతో ఇంతో కవిత్వం తెలిసిన ఒక బీదవాడు పిరికితనం వల్ల రాజాశ్రయానికి నోచుకోలేక పోయాడు. ఫలితంగా దారిద్ర్యాన్ని అనుభవించాడు.

భార్యా బిడ్డల క్షుద్బాధను చూడలేక ఒకరోజు మరో మార్గంలేక దొంగతనం చేయ డానికి సిద్ధపడ్డాడు ఆ వ్యక్తి. సామా న్యులను దోచుకోవడం వల్ల కొంతకాలం సుఖంగా గడచి పోతుందేమోగాని జీవిత మంతా సుఖంగా జరగదు. కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలి. దోచితే రాజుగారి ఖజా

**దూరి వెంకటరావు**

నాయే దోచాలి అనుకుని ఆ రాత్రి కోటవద్ద కెళ్ళాడు. తన తెలివితేటలతో ద్వారపాలకుల కళ్ళల్లో కారం కొట్టి లోనికి ప్రవేశించగలి గాడు. ఇక మహారాజావారి శయనమందిరం లోకి జొరబడాలంటే గోడకు కన్నం వేయుక తప్పదు. ఎలాగో శ్రమపడి తను దూరగలంత కన్నం త్రవ్వి లోపలకెళ్ళబోయాడు. అంతలో సందడి అవడంతో పైకి రాలేక లోనికి పోలేక మధ్యలోనే ఉండిపోయాడు.

భోజరాజు తన సతీమణితో శయనమం దిరంలోకి అడుగుపెట్టాడు. రాజదంపతుల్ని చూసిన ఆ కవి గుండెలు దడదడా కొట్టు కున్నాయి తనకిక మరణగండన తప్పదను కున్నాడు.

భోజరాజు కూడా కవి అవడం వల్ల తన గొప్పతనాన్ని మహారాణీ వారికి పద్య రూపంలో వివరించాడు. రూపవతి గుణవతి అయిన అర్ధాంగి లభించడం తన అదృష్టమని



మొదటి పాదంలో పేర్కొన్నాడు. తన కీర్తి ప్రతిష్ఠల్ని విశ్వమంతా వ్యాపింపజేసే గాయ కులు, కవులు తన ఆస్థానంలో వుండటం గర్వింపదగ్గ విషయమన్నాడు రెండోపాదంలో. ఇక సమయానుకూలంగా చక్కని సలహా లిచ్చే మంత్రివర్యులుండటం, రాజ్యాన్ని కంటికి రెప్పలా కాపాడే అతిరథ మహారథులుండటం తన ఘనతగా మూడో పాదంలో పేర్కొ న్నాడు.

ఈ భోగభాగ్యాలన్నీ అశాశ్వతమని, శాశ్వ తానందానికి ఆధ్యాత్మిక చింతన ఒక్కటే మార్గమంటూ అప్రయత్నంగా నాలుగో పాదం పూర్తిచేసి నాలుక కరచుకున్నాడు గోడ కన్నంలో పొంచివున్న ఆ కవి.

తను, తన భార్య తప్ప ఇంకెవ్వరూలేని ఆప్రదేశంలో మూడవ వ్యక్తి మాటలు విని ఆశ్చర్యపోతూ శయన మందిరమంతా గాలిం చాడు భోజరాజు. గోడమధ్య పొంచివున్న ఆ కవిని చూసి బయటకు రమ్మని సైగజేసాడు.

దిక్కుతోచని కవి మహారాజుగారి పాద ములపై సాష్టాంగపడి "ప్రభూ! నన్ను క్షమించండి. ఆకలితో అలమటిస్తున్న ఆలు బిడ్డలకు అన్నంపెట్టలేని ఈ నిర్భాగ్యుడు మీ కోశాగారాన్ని దోచుకోడానికి సాహసించా అంటూ భోరున విలపించాడు.

"మానవోత్తమా! మహోపకారి నా కళ్ళు తెరిపించావు. నేను ... ఈ భోగభాగ్యాలు, అందుకుంటున్న ... ష్ఠలు శాశ్వతమని భ్రమించి గర్విస్తున్నా ... ఒక్క ఆధ్యాత్మిక చింతనవల్లే శాశ్వతానందం సాధ్యమన్న నగ్న సత్యాన్ని చెప్పి నాకు కనువిప్పు కలిగించావు. నీకు నేనెంతిగానో ఋణపడివున్నాను" అంటూ ఆ కవిని ధనరా సులతో ఘనంగా సత్కరించాడు భోజరాజు. ఉరికంబ మెక్కవలసి వస్తుందని భావించిన ఆ పేదకవి ఊహించని విధంగా లభించిన సిరి సంపదలకు ఉప్పొంగి పోయాడు. ఆ సంపదతో కేవలం ఐహిక సుఖాలు అనుభ వించక మానవులకు, మాధవుడికి కూడ సేవలు చేసి తరించాడు.



# కోరికలపై విజయము

శ్రీ ముదుంబై వేంకటాచార్యులు

ఈ లోకం చాలా మధురమైనది; ఇందులో ఉండి విశేష ధన కనక వస్తు వాహనాలు సంపాదించాలి; వాటితో సుఖపడాలి అనుకుంటారు చాలామంది. కాని సుఖానికి ఇంకా ఇంకా దూరమౌతూనే ఉంటారు. ఎందువల్ల?

## కోరికల స్వభావం

కోరికలకు ఒక పరిమితి ఉండదు.

సర్పిషా కాష్ఠ భారేణ
వర్ధతేఽగ్ని శిఖాయధా
ఉపభోగేవ కామేవ
హ్యాశా చో పరి వర్ధతే.

నేతిచేతా కట్టెలచేతా జ్వలించిన అగ్ని, అంతకంతకు పెరిగేటట్లు, కామభోగంచే భోగ ఆశ అంతకంతకు వృద్ధి అవుతుందే తప్ప, తగ్గదు. సముద్రానికి నిండడం అనేది ఎలా లేదో, అలాగే కోరికలకు తీరడం అనేది లేదు.

తృష్ణాఖని రగాధేయం,
దుష్పూ రాకేవ పూర్యతే
యా మహద్భరపి క్షిప్తైః,
పూరణైరేవ ఖన్యతే.

తృష్ణ అను గొయ్యి పెద్ద అగాధం. దీన్ని నింపడం సాధ్యంకాదు. చిత్రమేమంటే, దీనిని నింపడాని కుపయోగించిన వాటిచేతనే ఇది మరింత లోతుగా త్రవ్వబడుతుంది.

తీరిన కోరికలవల్ల తృప్తికలగడంలేదు. సఫలమైన కోరికలు మరిన్ని కోరికల పుట్టుకకు కారణమై మరింత అసంతృప్తికి లోను చేస్తు న్నాయి. ఎండమావులను చూచి భ్రమించి పరుగెత్తే మృగం లాగ, మనిషి సుఖాన్వేషణలో కోరికల వెంట పరుగెత్తి అలసి సొలసి మరణిస్తున్నాడు. "Man is dying in the pursuit of happiness." నిజమైన సుఖమేదో తెలుసుకోలేకపోతున్నాడు; సుఖాన్వేషణలోనే జీవితం అంతమవుతోంది. చివరకు ఎవరికొరకు జీవితమంతా శ్రమించాడో, వారి చేతనే అనాదరింపబడి, నిరాశ నిస్పృహలకు లోనవుతున్నాడు. మహా సామ్రాజ్యాన్ని జయించిన అలగ్జాండరు, చనిపోతూ తన శవపేటికకు రెండు రంధ్రాలు చేయించి తన హస్తాలను వాటినుండి బయటకు పెట్టించమన్నాడట! ఎంతటి ధనవంతుడైనా సామ్రాజ్యాధిపతియైనా రిక్తహస్తాలతోనే ఈ ప్రపంచాన్ని విడిచిపెడతాడని ప్రపంచానికి చాటడానికి కాబోలు. చివరకు నిరాశ నిస్పృహలకు దారితీసే ఈ కోరికలకు మూలం ఏమిటి?

## కోరికలకు కారణం

ఆత్మకు కలిగిన ప్రకృతి సంసర్గంచే పురుషుడు ప్రకృతి గుణాలైన సత్త్వరజస్తమో గుణాలచే బంధింపబడ్డాడు. ఈ బంధనమే సంసారహేతువు; కోరికలకు మూలం. సత్త్వగుణంచే కలిగిన కోరికలలో సుఖాశక్తితోపాటు జ్ఞానశక్తి కలసి ఉండడంవల్ల తీవ్రబంధనంకాదు. రజో గుణంచే వ్యక్తులయందు విషయాలయందు వస్తువులయందు వ్యామోహం కలుగుతుంది. ఆ వ్యామోహంచే కలిగిన కోరికలు తీర్చుకోడానికి విశేష శ్రమ పడతాడు. తమోగుణం గలవాడు వ్యర్థమైన కోరికలతో ఉండి సోమరితనం వల్ల ప్రయత్నశీలుడు కాడు. రజో గుణం వల్లనే లోభము మోహము ఉద్రేకము యత్నశీలత కలుగుతాయి. తీవ్రమైన కోరికలకు మూలం రజో గుణమే.

## కోరికల ఫలితం

కోరికలన్నీ ఎవరికీ తీరవు. సంపాదించాలనుకున్నదంతా సంపాదించలేరు. రజోగుణి ఇలా అనుకుంటాడు. "ఈ గృహ క్షేత్రాదికాలన్నిటిని నా సామర్థ్యంచే నేను సంపాదించాను. నేనింకా నాకోరికల న్నిటిని తీర్చుకోగలను." సాత్త్వికులైన వారు తాము సాధించిన వాటిని భగవంతుని సహాయంతో సాధించామనుకుంటారు. తాము ఇంకా చేయవలసినవి భగవంతు డనుగ్రహిస్తే చేయగలమని భావిస్తారు.

కోరికలు మనస్సుకు ఇంద్రియాలకు సంబంధించినవి. ఇంద్రియ సుఖాలను కోరుతూ ప్రపంచ లంపటులవడం, అతీంద్రియ సుఖాన్ని కోరే ఆధ్యాత్మిక సాధకుల కవరోధం. ప్రాపంచిక సుఖాలనే కోరేవారు తమపరిమితమైన శక్తితో అపరిమితములైన కోరికలను సాధించలేరు. ఈ కోరికలు ఇంద్రియ మనోబుద్ధులచే ఆత్మ జ్ఞానము నావరించి జీవుని భ్రమింపజేస్తున్నాయి. ఇవి తీరడానికి ప్రతిబంధకమైన వ్యక్తులపైనా పరిస్థితులపైనా కోపం కలుగుతుంది. దానిచే పాపకార్యాచరణకు కూడా పూనుకుంటాడు. అందుచే ఈకోరికలు తీర్చుకోవాలనే ప్రగాఢమైన వాంఛ (అనగా కామము) సాధకునికి ప్రబల విరోధి. ఈ కామము వలన ఆత్మజ్ఞానము మరుగుపడుతోంది. సంస్కార జనితమైన స్వభావంచే, ఈ అజ్ఞాన ఆవరణ, మూడు రకాలుగా ఉంటుంది. సాత్త్వికుల కామవాసనలు బహు తక్కువ సాంద్రత కలిగి పొగచే ఆవరించబడిన అగ్నిలాగ ఉంటాయి. అలాగే రాజస తామస ప్రకృతులు కలవారి కామవాసనలు సాంద్రతరముగాను సాంద్రతమముగాను ఉంటాయి. అందుచే విస్తారమైన కోరికలు ఆత్మజ్ఞానాన్ని కలుగనియ్యవు. ఇవి జీవుని స్వస్వరూప దర్శనానికి విరోధి ఈ కామము అనాదిగా ఉండి జీవన్ముక్తి పర్యంతము విడువదు కాబట్టి నిత్యవైరి.

కోరికల విషయమైన చింతన వలన ఆ కోరికలయందు రాగము, రాగము వలన

కామము, కామము వలన క్రోధము, క్రోధము వలన అవివేకము, అవివేకము వలన స్మృతి భ్రమణము, దానివలన బుద్ధి నాశము దాని వలన సర్వనాశనము కలుగుచున్నవి. బీజప్ర దంగా మనసులో కోరిక పడితే, మఱ్ఱి విత్తనం గోడపైపడి గోడను బ్రద్దలు కొట్టినట్లు, ఈ విషబీజం మనిషిని నాశనం చేస్తుంది.

అలవికాని కోరికలతో, ఆశలతో అజ్ఞానం వల్ల అన్యాయార్జనకు ఒడికడతారు. ఆ ధన గర్వంతో, తమంతటి ప్రయోజకులు లేరను కుంటూ, దంభము దురభిమానము మదము మొదలగు గుణాలతో ప్రవర్తిస్తారు; దుష్క రమైన కోరికలను పూరింప ప్రయత్నిస్తారు. ఆ ధ్యేయాన్ని చేరలేక నిరాశ నిస్పృహలచే ఆవరించబడి మరణ పర్యంతము విడువని అశాంతికి లోనవుతున్నారు.

## కోరికలపై విజయ సాధన

మనం ఈ ప్రపంచానికి ఇప్పుడే రాలేదు. మనకు అనేక జన్మలు గడిచాయి. గత జన్మ లలో మనం సరియైన పురుషార్థ సాధన చెయ్యలేదు కాబట్టి ఇంకా ఈ లోకంలో ఉండి యాతనలు పడుతున్నాం. ఇంకా అహం కార మమకారాలను విడువక కోరికల సుడి గుండంలోపడి దరి కానక కొట్టుకుంటున్నాం.

కాబట్టి ఈ కోరికలపై విజయం సాధిం చాలి. కొంత శాస్త్ర జన్య జ్ఞానంగల సాధకునైనా, ఇంద్రియాలు బలంగల వవ డంచే, వాని మనస్సును కలవరపఱచి దానిని కల్లోలితం చేస్తున్నాయి. కోరికల ఫలితంగా కలిగే కామక్రోధలోభాలు మూడూ, నరక ద్వారాలు. ఇంద్రియాలు మనస్సు బుద్ధి, ఈ కామనల కాశ్రయాలు. కాబట్టి సాధకుడు తొలుత ఇంద్రియాలను అదుపు చెయ్యడా నికి ప్రయత్నం ప్రారంభించి క్రమంగా జ్ఞాన నాశకము, పాపాచరణ ప్రేరకము, అయిన ఈకామాన్ని జయించాలి. ఎప్పుడు శబ్ద స్పర్శ రూప రస గంధాదులైన ఇంద్రియ విషయాలు ప్రలోభపెట్ట జూస్తాయో అప్పుడు కూర్మము తన ఇంద్రియములను లోనికి తీసుకొనేటట్లు,

## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది నియమాలు పాటించ వలసిందిగా మనవి చేస్తున్నాం!!

- రచనలు కాగితానికి ఒక వైపునే వ్రాయాలి
- సాధ్యమైనంత వరకు స్పష్టంగా అర్థమయ్యేలా వ్రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమే అనీ మరే పత్రికకు పంపలేదనీ హామీపత్రం జతపరచాలి.
- కలంపేరు వాడినప్పటికి రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు అడ్రసు తెలియపరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షికపేరు రచన మీద కవరు మీద వ్రాయాలి.
- రచనల పరిశీలనకు రెండు మూడు మాసాలు పట్టవచ్చు– ఈ లోపల ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయుటం వలన ఉపయోగం వుండదు.
- రచన ప్రచురణకు అంగీకరిస్తే ఆ విషయం మేమే తెలియజేస్తాము.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు తప్పని సరిగా నలుపు, తెలుపు ఫొటోలు జత చేయవలసి ఉంటుంది. ఈ శీర్షికలో ఫొటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- సంక్రాంతి, దీపావళి లాంటి పండగల సంచికలకు రచనలు పంపేవారు. కనీసం రెండు నెలలకు ముందుగా వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్థం కాని రచనలు త్రిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జత చేయవలసి ఉంటుంది.
- ప్రచురణకు చిత్రాలు, స్కెచ్‌లు పంపేవారు డ్రాయింగు, పేపరు మీద, ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి.




## రచయితలకు గమనిక

'సప్తగిరి'లో సమీక్ష చేయుటకు రచయితలు తమ గ్రంథాల్ని రెండు ప్రతులుగా పంపవలెను. లేనిచో సమీక్ష చేయబడవు

'సంపాదకులు'

ఆ యా ఇంద్రియాలను ఆయా విషయాల నుండి, బుద్ధియొక్క ప్రేరణచే మరల్చి ఆత్మయందు నిలుప ప్రయత్నించాలి.

మేకకు ఎంత కడుపునిండా మేపినా, లేతపరిగడ్డి తెచ్చి దగ్గర పెడితే మూతి మెదు పుతూనే ఉంటుంది. కడుపు నిండిన తరు వాత మంచి పదార్థం తెచ్చిపెట్టి నోరు మెదప బోయే సమయానికి నోటిమీద కొడుతూ ఉంటే, నోరు ప్రక్కకు త్రిప్పేసుకుంటుంది. అలా కొంతకాలం దానికి అలవాటు చేస్తే, కడుపునిండిన తరువాత లేతగడ్డి పెట్టబో యినా ముఖం తిప్పేసుకుంటుంది.

అందుచే ధర్మబద్ధమైన పరిమితమైన కోరికలు తీరిన తరువాత, యితర కోరిక లపై మనసు పోకుండా, యింద్రియాలను నిగ్రహించి అదుపులో ఉంచుకోవాలి. ఆ విధంగా చేస్తూ నెమ్మదిగా ఆ కోరికల అల్ప త్వాన్ని గ్రహించే విధంగా (మనం విచక్షణా జ్ఞానం కలవాళ్లం కాబట్టి) బుద్ధిచే మనస్సును నియంత్రించాలి. (మేకకు ఆ బుద్ధి లేదు కాబట్టి దానికి దండనే సాధనం.) ఈవిధంగా విచక్షణా జ్ఞాన యుక్తమైన బుద్ధిచే మన సును, దానికి శుభాశ్రయమైన భగవంతుని యందు (భక్తి యోగముచే గాని ఫలసంగరహి తమగు కర్మలు చేయుటచే గాని) ఆశ్రయము కల్పించి, వశము చేసికొని, అడప శక్యముకాని ఈ కామరూపమైన జ్ఞాన యోగ శత్రువును జయించాలి. ఆత్మ నాశ్రయించిన మన స్సుచే జ్ఞానానంద రూపమైన ఆత్మానందము ననుభవించుచు, కోరికల నన్నిటిని పూర్తిగా విడిచిన వాడే జ్ఞాని. అతడే స్థిత ప్రజ్ఞుడు. ఈ స్థితి, సాధన కాలంలో ప్రయత్న సాధ్యము. సాధన చేయగా చేయగా కలిగే సిద్ధావస్థలో స్వాభావికమైపోతుంది.

కోరికలతో నిండిన మనసుకు నిలకడ ఉండదు; అట్టి మనసు గలవానికి ధ్యానం కుద రదు. శాస్త్రజన్యజ్ఞానం కలిగి సాధనచేసే వాని ఇంద్రియములు మనస్సు కూడా, కోరికల బలంచే కలవరపఱచబడుతూనే ఉంటాయి. కాబట్టి వాటిని బుద్ధిచే వశం చేసుకోడానికి ప్రయత్నిస్తూ, మనసును సకల కళ్యాణగు ణాకరుడైన భగవానునిపై లగ్నం చెయ్యాలి. బుద్ధిచే మనసును అదుపులో ఉంచుకొని సాధన కుపక్రమించిన వానికి క్రమంగా ఇంద్రి యజయం, కోరికల ఉదృతం తగ్గడం, జరు గుతుంది. ఇంద్రియాలపై అదుపు, సాధన సాఫల్యానికి దోహదం చేస్తుంది. సాధన దశనుండి సాఫల్య దశ వరకు ఆత్మానందర సానుభూతిలో అభివృద్ధి కలుగుతుంది.

## సాధన ఫలం

అట్టి అభివృద్ధి పొందినవాడు శాంతిస్వ రూపు డవుతున్నాడు. విషయాసక్తుడు అట్టి శాంతిని పొందజాలడు. నదులు సముద్రమున ప్రవేశిస్తున్నా, వాటిచే సముద్రం ఏవిధంగా తన స్వభావంలో మార్పులేకుండా, పొంగు కృంగులు లేకుండా, ఉంటుందో అలాగే ఈశాంతి స్వరూపునిలో కూడా జీవితానుభ వాలు ప్రవేశించి తమ స్వరూపాన్నే కోల్పో తాయి; అతడి శాంతికి మాత్రం భంగం రాదు. నదులు, తనలోనికి రావాలని సముద్రం కోరదు. ఆ విధంగానే వ్యక్తికి కూడా పాపపుణ్య రూప ప్రారబ్ధ వశంచే సుఖ దుఃఖ రూప విషయానుభవం కలుగుతుంది. కాని నదుల ప్రవేశంతో సముద్ర స్వభావం మారనట్లు ఈ శాంతి స్వరూపుడు సహజ ఆనంద స్థితిలో అచంచలంగా ఉంటాడు.

మనం ఈ తాత్కాలిక జీవితం నుండి మనసు మళ్లించాలి. అంటే అన్నిబం ధాలూ త్రెంపుకొని సన్యసించ నక్కరలేదు. ఈ సంఘంలో ఉంటూనే సంఘ మాలి న్యాన్ని అంటుకోకూడదు. పళ్లెంలోని తేనెను అంచున ఉండి సేవిస్తూ ఎగిరిపోవాలను కున్నప్పుడు రెక్కలకు తేనె అంటుకోకుండా ఎగిరిపోవాలి. అది "కర్మసు కౌశలం." అలా కాకుండా అత్యాశతో అంతా జుఱ్ఱుకోవాలని పళ్లెం మధ్యలో వ్రాలితే, యిక అది ఎగర లేదు. అక్కడే దాని అంతం. అందుచే ఈ ప్రపంచంలో కూరుకుపోకుండా ధర్మబద్ధమైన కర్మలు చేయవచ్చు; కర్తవ్యాలు నిర్వహిస్తూనే దైవస్మృతిలో ఉంటూ మోక్షాన్ని బడయ వచ్చు.

జ్ఞానం వలన మోక్షకాముల మౌతాము. మనం ఆత్మస్వరూపుల మన, పరమాత్మవలెనే మనం కూడా జ్ఞానానంద స్వరూపులమనీ, మనకు నిత్య ఆనంద ధామము పరంధామ మనీ, దానికై జీవన్ముక్తులమై మనం శాశ్వత ఆనందధామం చేరగలమనీ - తెలుసుకోవ డమే జ్ఞానం. దానికై ప్రయత్నించడమే సాధన. ఆవిధంగా సాధన చెయ్యనివాడు కోరికలకు వశుడై పాప సంకల్పాలు కలవాడై జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడు. వానికి ఇక్కడా అక్కడాకూడా శాంతిలేదు. జ్ఞానం వలన కాకుండా కోరికలను బలవంతాన అణిస్తే, అది వేరే మానసిక రుగ్మతలకు దారితీస్తుంది. భగవంతునితో సంబంధ జ్ఞానం తెలిసినవానికి భక్తి కలుగుతుంది.

ఎవరు యితర చింతలు లేనివారై ఏపని చేస్తున్నా భగవంతుని యందు మనసుంచి నిరంతరస్మరణ చేస్తారో వారికి జీవన్ముక్తి అనెడి యోగమును, ప్రాప్తించిన దానిని రక్షించుట అనెడి క్షేమమును అనుగ్రహించు బాధ్యతను భగవానుడే వహించుచున్నాడు.

రజో గుణ కార్యాలైన చిత్తవిక్షేపాలు లేని వాడు పాపాల నుండి విముక్తి పొంది బ్రహ్మ భావాన్ని పొందుతాడు. రాగద్వేషాలు లేని వ్యక్తి జీవించడానికి అవసరమైన విషయాలను అనుభవించినా మనసును యింద్రియాలను స్వాధీనం చేసుకున్నవాడవడం చే, నిత్యం చిత్తప్రసాదాన్ననుభవిస్తున్నాడు. చిత్తం నిర్మ లమైన వానికి దుఃఖాలన్నీ నశిస్తాయి. ఎవడు కోర్కెలను జయించి అహంకార మమకార శూన్యుడై జీవిస్తూ ఆత్మానందము అనుభవి స్తున్నాడో అతడు శాంతిని పొందుతున్నాడు.

ఇట్లు సర్వమును భగవంతునియందు సమర్పించుట అనెడి అనుసంధానముతో కూడిన మనస్సు కలవాడైనచో, ఇష్టానిష్ట ఫలములనిచ్చు కోరికల కర్మబంధములనుండి విడువడి భగవంతుని పొందగలడు. ఈ బ్రాహ్మస్థితిని పొందినవాడు తిరిగి మోహము పొందడు. దీర్ఘకాలం సాధనచేసి మరణకాలా నికైనా ఈస్థితిని చేరుకున్నవాడు, శాశ్వత ఆనంద ధామం పొందుతాడు. తిరిగి జన్మిం చడు.

కోరికలు, వాటివల్ల జనించే కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలే, భగవంతునికి మనకు మధ్యనున్న దట్టమైన తెర. ఈ తెరనే తొలగించమని త్యాగరాజస్వామి వేంకటేశుని వేడుకున్నాడు. మనం కూడా మన సాధనకు భగవత్కృప తోడుకాగా, ఆతెరను తొలగించు కొని, వేంకటేశుని సాలోక్య సామీప్య నిత్యర సానుభూతిని పొందుదుము గాక. ★

(గత సంచిక తరువాయి)

హనుమ వచియించె రాఘవు డడిగినంత
"అమితసత్త్వవంతుండు మహాస్త్రవిదుడు
రాము డేల సైరించును రాక్షసాళి
శీలవంతు డయ్యు" నని ప్రశ్నించె సీత.

"రా డదేల సౌమిత్రి పరంతపుండు
రణమునం దసురుల జంప భ్రాతృనాజ్ఞ
వీరు లిరువురు న న్నిట్లు వీడిరేల?"
అనుచు కన్నుల నీరిడె నవనితనయ.

సమరరంగాన రావణుసంహరించి
వేగమే నన్ను గొనిపోవ వేవిధాల
రామవిభునకు చెపుమ; వారాశి దాటి
వార లెట్టులు వత్తురో వానరేంద్ర!'

కార్యసిద్ధికి తగుదు వొక్కడవె నీవు
కాని రాముడు చనుదెంచి కదన మందు
మార్తురం గూల్ప గడియించు మాన్యయశము
అట్లు చేయింప దగును నీ వతనిచేత."

# రావుల రామాయణము

అంత చెప్పితి "శ్రీరాము డనవరతము
తల్లి! నిన్నే తలంచును తల్లడిల్లు
అన్న వెతచూచి లక్ష్మణుం డహరహంబు
చెప్పగారాని దుఃఖము చెందుచుండు.

వ్యథలు విడువుము శ్రీరాము డరుగుదెంచి
అరిని క్రూరుని రావణాసురుని ద్రుంచి
దానవేశ్వరపురము దగ్ధంబు చేసి
మాత! కొనిపోవు నిన్ను సాకేతపురికి.

రామలక్ష్మణు లిరువురి క్షేమ మడిగె
కీశవిభుడైన సుగ్రీవు క్షేమ మడిగె
ననుచు తవ మాటగా చెప్పి 'హనుమ! ఇంక
ప్రోత్సహింపుము నన్ను గొంపోవునట్లు.

చెప్పినాడను నే నంత సీత కిట్లు
"అమితతేజుండు సుగ్రీవు డాజ్ఞసేయ
యుద్ధమునకు సంసిద్ధులై యున్నవారు
వానరుల విక్రమంబు చెప్పంగ దరమె!

అందరును వీర్యశౌర్యధైర్యాదు లందు
నాకు మిన్నలు, కొందరు నాకు సములు,
పంద, బదు గొక్కడును లేదు ప్లవగులందు
తల్లి! సాగర మవలీల దాట గలరు.

కపిబలము లంక జొచ్చి రాక్షసగణంబు
తుత్తుమురుసేయ రావణు దునుమ విభుడు
శీఘ్రమే రాంవగల వభిషిక్తు నతని"
అనగ శ్రీరామ! సీత ప్రశాంతి నొందె.

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి

'చంద్రశేఖర్'

శ్రీకరము చెప్ప మారుతి సీత జాడ
ప్రీతినందుచు రాము డీ రీతి నుడివె
తలచుటకు ఏ దశక్యమొ ధరణి నట్టి
అబ్ధిలంఘన మొనరించె ఖ్యాతబలుడు.

నియతకార్యంబు గావించి ప్రియము గూర్చు
అనిలతనయున కొసగెద అఖిలమట్లు
పరమసంతోషమున పరిష్వంగ సుఖము
అంచు పరిరంభణ మొనర్చి అనియె నిట్లు.

"తీరె తన్వి నన్వేషించు భారమిపుడు
పారమే లేని వార్ధి నే భంగి మనము
గడచుటెటోయెట్లు జానకి కనుటొ?"యనుచు
దాశరథి మది శోకసంతప్తు డయ్యె.

రామచంద్రునితో కపిరాజు పలికె
"చింత వీడుము కార్యసంసిద్ధి యగును
సత్వరము లంక జేరంగ జలధిమీద
సేతువును గట్టు టెట్లొ యోచింపు మయ్య."

రామచంద్రు డవార్యపరాక్రముండు
వాక్యవిదుడగు హనుమతో పలికె నిట్లు
"కాంచినాడవు లంక; దుర్గమ్ము తీరు
రావణాసురు బలము బీరమ్ము చెపుమ."

"పలికె శ్రీరామచంద్రుతో పవనసుతుడు
రమ్యములు దృఢములగు ద్వారాల తోడ
అలరు లంకాపురము పరిఖావృతమ్ము
దక్షరాక్షసకోటి సంరక్షితమ్ము.

కపులు వార్ధిని దాటిన క్షణమునందె
భగ్నమైనట్లు భావింపవచ్చునయ్య
పంక్తికంధర దోర్దండ పాలితమ్ము
బహుశతఘ్ని సురక్షిత పట్టణమ్ము."

ప్రేమ, సుగ్రీవుతో నిట్లు రాము డనియె
"తనరు ఉత్తరఫల్గునీ తార నేడు
యోచన మొనర్ప శుభముగ తోచు నాకు
ఈ ముహూర్తాన సేనతో నేగ మనకు.

శత్రునిచయము చెడుగులు పలుపవచ్చు
నీలు డేగుత ముందుగ నిపుణమతిని
పర్యవేక్షణ చేయుచు పథమునెల్ల
సాగ వెనుకను వానరశౌర్యనిధులు.

ఆహవమునకు వత్తు నుత్సాహ మిడుచు
అంజనేయు భుజాలపై అధివసించి;
అంగదు భుజాలపై నెక్కి అరుగుదెంచు
అనుగు తమ్ముడు కపులు త న్ననుసరింప."

శౌర్యధనులైన రామలక్ష్మణుల వెనుక
కదలె సుగ్రీవు నానతి కపులసేన;
తరులు గిరులు ఝరులు మహోద్ధతిని దాటి
చేరి రెల్లరు వార్నిధి తీరమునకు.

పూజితుండగు రాముండు పొలుపుమీర
వానరాధిపతిని గాంచి పలికె నిట్లు;
"ఉదధి దాటంగ సేయుద మూహ మనము
సేన విడియింపు మిచ్చట వానరేశ!"

విడిసె నట్టులె సైన్యము కడలి దరిని;
మోహవశుడౌచు స్మరియించి ముదిత సీత
ప్రథిత రఘుకులతిలకుండు వంత నొందె
వ్యర్థమగుచుండె ఆమె యౌవన మటంచు.

లంక దగ్ధ మొనర్చి నిశ్శంక జనిన
ఆంజనేయుని సాహస మ్మాత్మ నెంచి
సిగ్గు చెందుచు కొంచెము శిరము వంచి
రాక్షసులతోడ వచియించె రావణుండు.

"వచ్చి వానరుం డొక డనివార్యగతిని
వనిత సీత గని అశోకవనము నెల్ల
భగ్న మొనరించి లంకను పాడుచేసి
వీరులను గూల్చె; వీక్షించినారు కాదె!

రాము డెటులైన దాటి వారాశినిట్టె
కోట్లకొలది కోతులమూక గూడివచ్చు;
కాచు టెట్టులో మనము లంకాపురమ్ము
మంత్రణముచేసి చెప్పుడు మాన్యులార!"

పలికి రప్పుడు రాక్షసప్రవరు లిట్లు
"ప్రథిత మయ్యె లోకాల నీ బాహుబలము
రాజవర! నీకు యుక్తమే రామభీతి?
ఇంద్రజిత్తు వారల వశియింప జేయు."

అంత వనియె విభీషణుం డంజలించి
"రావణా! రామపత్ని పరమపవిత్ర
జనకజాతను విడిచిపుచ్చంగ మేలు
కలహము తొలంగి మోదంబు కలుగు దాన.

మానితుడు రాఘవుండు ధర్మానువర్తి
వీర్యవంతు డా ఇక్ష్వాకువిభుడు పోర
తలపడిన వీర లెవ్వరు నిలువలేరు
శౌర్యమండితం బిక కపిసైన్య మరయ."

ఆ విభీషణు పొమ్మని అవమతించి
జానకీమోహితుండు దుశ్చరితుడైన
విభుడు దశవదనుం డేగె వినుతసభకు
వెంట జనుదేర శూరులు వేలకొలది.

అచట వాహినీపతిని ప్రహస్తు నరసి
రావణుడు నగరంబును రాత్రి పగలు
రక్షణముసేయ శాసించి, రణములోన
దాశరథుల నోడించుట తథ్య మనియె.

కుంభకర్ణుండు వచియించె కోపమంది
"రాముడు నరుడు కాడు పరాత్పరుండు
చేటు గూర్చితి లంకకు సీత దెచ్చి
స్వాస్థ్య మొనగూర్చెదను నీకు పగర జీల్చి

అంజలించి మహాపార్శ్వు డనియె నిట్లు
"సీత గూడి సుఖింపు నిశ్చింత నీవు
ఈశ్వరేశ్వరా! భయమేమి ఇంద్రజిత్తు
కుంభకర్ణుండు నే నుండ కుందనేల?"

అతని కొనియాడి రావణుం డనియె నిట్ల
"ఓ మహాపార్శ్వ! విను మునుపొక్కసారి
బ్రహ్మగృహసమీపాన అంబరతలాన
అప్సరస పుంజికస్థల అరుగుచుండె.

పోవనీయక భోగించి మోహవశత
వనిత నంతట విడక వివస్త్రచేయు
విషయ మెరిగి విరించి శపించె నన్ను
కోపమున గాంచి, ఈ రీతి ఘోరభంగి.

'కాంత నెవతెనేని బలిమి కలిసితేని
నేలబడు నూరుముక్కలై నీ శిరమ్ము'
అందుచే శయ్యకును దార్చనైతి సీత
రాము డెరుగడు నాదు పరాక్రమంబు."

కుంభకర్ణాది దైత్యముఖ్యుల దశాస్యు
రోషముల గాంచి పలికె విభీషణుండు
"సీత సర్పమ్ము; కీశులు చేరకుండ
రాము నాశ్రయింపుము నీవు భామ నొస

ఆ విభీషణుతోడ ప్రహస్తు డనియె
"రావణేశుండు కనియె వరాలు మున్ను
దైత్య దానవ యక్షు లితని జయింప
వలను గాకుండ రాముడు వలతి యగు

(వశేష

( 8 వ పేజీ తరువాయి)

మహాప్రదక్షిణ మార్గాల్లో చుట్టూ ఏర్పాటు చేసిన దశావతారాలు ఆల యానికి ఉత్తరవైపున వరాహస్వామి ఆలయం దగ్గర ఎత్తైన పద్మావతీ శ్రీని వాసుల రూపాలు, దక్షిణాన గరుడవా హనుడైన శ్రీవేంకటేశ్వరుడు, వైకుంఠ క్యూ ఆవరణలోని పచ్చికబయలులో ఆనందనిలయ విమానంలో వేంకటేశ్వ రుడు - శ్రీవారి ఆలయం గోపురాలు ప్రాకారాలు - పుష్కరిణి - సత్రాలు, బస్టాండు - తిరుమల టోలుగేటుదగ్గరి శ్రీవారి విశ్వరూపం... ఇత్యాది రూపా లెన్నో కన్నులు చెదిరిపోయేలా విద్యు ద్దీపాలతో నిర్మించిన సుందర చిత్ర ణలు చూపరులను ఆకర్షించి, తిరుమల శ్రీనివాసుడే ఈ దివ్యతేజోరూపాల్లో ప్రకాశిస్తూ వున్నాడా అన్నట్లుగా భక్తి ప్రపత్తుల్ని పెంచాయి.

ఇక దేవస్థానం ఉద్యానవన శాఖ అలంకరణల ద్వారా తిరుమల క్షేత్ర సౌందర్యాన్ని ఇబ్బడిముబ్బడిగా పెంచింది. ఆలయంలోని పందిళ్లు ఆలయ ప్రవేశద్వారంలోను, ఆలయా నికి ఎదురుగా, ఆర్ష సదస్సుభవనంపైన దశావతారాలు, కొలువు మండపంపైన పక్కలా, అక్కడ ఏర్పాటుచేసిన గోపా లకృష్ణుని మూర్తి, వరహస్వామిమూర్తి, పుష్కరిణిచెంత ఏర్పాటుచేసిన 20 అడుగుల ఎత్తైన గీతోపదేశం (విశ్వ రూపం) మూర్తి, ఆస్థానమండపాలు... ఇలా సర్వత్రా సుమనోహరంగా రంగు రంగుల పూలతో చేసిన అలంకా రాలు ఒక ఎత్తుకాగా, వారే ప్రతిరాత్రి శ్రీవారి వాహనానికి ముందు అదే వాహనాన్ని పుష్పాలంకరణలో తీర్చిది ద్దినతీరు మరొక ఎత్తుగా భాసించి యాత్రికుల ఆనందింపజేసింది.

ఇక ఆరోగ్యశాఖవారు క్షేత్రం అంతటా కాలువలూ, రోడ్లు, వీధులు, సత్రాలు, కాటేజీలు శుభ్రం చేయడం లాంటి కార్యక్రమాలద్వారా తిరుమల క్షేత్రాన్ని పరిశుభ్రంగా వుంచడం యాత్రికులను ఎంతో ఆహ్లాదపరచింది.

ఇలా ఒకవైపు పరిశుభ్రత, పుష్పా లంకరణ, విద్యుదలంకరణలో తిరు మల సర్వాంగసుందరంగా వెలుగుతూ, బ్రహ్మోత్సవాల్లో పాల్గొనడానికి వచ్చే వేలాదిమంది శ్రీవారి భక్తులకు దేవ స్థానం ఉద్యోగులు సాదర పూర్వక మైన ఆహ్వానంతోపాటు విషయవి వరణల్ని ఇస్తున్న శుభ సమయంలో ధ్వజారోహణం వైభవంగా ప్రారంభమ య్యింది.

## ధ్వజారోహణ (6-10-94 )

అక్టోబరు 6వతేదీ గురువారం మధ్యాహ్నం 2 గం॥ నుండి 4 గం॥ వరకు శ్రీవారి ఆలయం గరుడ కేతన ప్రతిష్ఠ, యాగాలు జరిగాయి. పిదప బంగారువాకిలి దగ్గర ఉభ యనాచ్చియారులతోకూడిన శ్రీమల యప్పస్వామి విశేషంగా అలంకరింప బడ్డారు. ఆచార్యస్వాములు బ్రహ్మో త్సవాల నిర్వాహకులుగా కార్యనిర్వహ ణాధికారి శ్రీ డి.వి.[illegible] ఎస్. మూర్తిచేత సంకల్పం [illegible], దీక్షాకం కణాల్ని చేశారు. అనం[illegible] శ్రీస్వామి వారి అనుజ్ఞచేత ఆచా[illegible]లు విమాన ప్రదక్షిణం అష్టదిక్కు[illegible] బలిని సమ ర్పించుకుంటూ బ[illegible]దేరారు. ఆ వెనువెంటనే శ్రీదేవి భూదేవి సమేత శ్రీశ్రీనివాసప్రభువు, తనపరివారమైన విష్వక్సేనుడు, [illegible]నుడు, అనం తుడు, గరుడుడు మున్నగు వారితో బయలుదేరాడు. గరుడకేతనం కూడ శ్రీస్వామివారికి అభిముఖంగా ఊరేగిం

## ఫలపుష్ప వనమూలికల ప్రదర్శన

తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాల సందర్భంగా తిరుమల శంకు మిట్ట ముళ్లగుంతతోట ప్రాంతంలో దేవస్థాన ఉద్యానవనాల శాఖ -- ఆయుర్వేద [illegible]శాలవారు ఫలపుష్ప [illegible]మూలికల ప్రదర్శనను ఏర్పాటు చేశారు. 94 అక్టోబరు 6వ తేదీ సాయంత్రం 4 గంటలకు దేవస్థాన ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్ రెడ్డి [illegible] ప్రారంభించారు. వీరితోపాటు జాయింట్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ [illegible] నారాయణ, చీఫ్ ఇంజనీరు శ్రీ ఆంజనేయులునాయుడు, గార్డెన్ అడ్వయిజరు శ్రీ తమ్మన్న, జాయింట్ డైరక్టరు శ్రీ నారాయణరెడ్డి పాల్గొన్నారు.

ఈ ప్రదర్శనలో కూరగాయలతో, పూలతో శ్రీవేంకటేశ్వరస్వామి, గణపతి, ఆనందనిలయం, శంఖచక్రాలు, శ్రీవారినామాలు, కిరీటాలు మున్నగు విగ్రహాలు -- మూర్తులు తయారుచేసి, ఏర్పాటుచేసిన తీరు చూపరులను ఎంతో ఆకర్షించింది. అంతేగాక ఆ హాలులో అక్కడక్కడా పుష్పాలతో ఏర్పాటుచేసిన గరుడుని మూర్తి, గోపురం ఇత్యాది నిర్మాణాలు కళాత్మకంగా వుండి చూపురులకు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

ఇక ఆయుర్వేద కళాశాలవారు ప్రత్యేకంగా వనమూలికలను ఔషధాలను వాటి ఉపయోగాలు యాత్రికులకు వివరించారు.

చబడింది. ఇలా ఆలయం వీడి అష్టది క్కుల్లో బలినిసమర్పిస్తూ దిక్పాలురను ఆహ్వానిస్తూ, ఛత్రచామర, మంగళ వాద్య సహితంగా రధగజ, తురగ పదాది సమేతంగా వేదమంత్రోచ్చా రణల మధ్య భక్తులకు దర్శనమిస్తూ అందరినీ ఆహ్వానించిన అనంతరం, ఈ ఉత్సవం ఆలయంలోని ధ్వజస్తంభం వద్దకు చేరుకొంది. ధ్వజస్తంభం దగ్గర శ్రీమలయప్పస్వామి పర్యవేక్ష ణలో పూజలు జరిపి, గరుడునికి పెసరపులగం నివేదించి, మంత్రపూ ర్వకంగా పద్నాలుగులోకాలవాసులను ఆహ్వానిస్తూ గరడకేతనాన్ని బంగారు ధ్వజస్తంభంపై వైభవంగా ఎగురవేశారు.

ఈ ధ్వజారోహణ కార్యక్రమంలో కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.యల్. ఎన్. మూర్తి, దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్ రెడ్డి, జాయింట్ ఇ.ఓ. శ్రీ సి.హెచ్. సత్యనారాయణ, ఆలయ డిప్యూటీ. ఇ.ఓ. శ్రీ వాసుదేవన్, దేవస్థానం పౌరసంబంధాధికారి శ్రీ టి. శివాజి ఇంక ఇతర అధికారులు అనధికారులు భక్తులు పాల్గొన్నారు.

అనంతరం శ్రీస్వామివారు (మూల మూర్తి) పూలంగి అలంకరణలో భక్తు లను పులకింపజేశారు. పిదప ఆ రాత్రి 9 గంటలకు పెదశేషవాహనం ఊరేగింపు జరిగింది.

### పెదశేషవాహనం

వీడు గదే శేషుడు శ్రీవేంకటాద్రి శేషుడు
వేడుక గరుడనితో బెన్నుద్దైనశేషుడు
వేయిపడిగెల తోడ వెలసిన శేషుడు
చాయమేని తళుకు వజ్రాల శేషుడు
మాయని శిరసులపై మాణికాల శేషుడు
యేమెడ హరికి నీడై యేగేటి శేషుడు.

ఇలా బంగారు శేషునిపై ఉభయ దేవేరులతో వేంచేసివున్న శ్రీస్వామి వారు మహాదర్పంగా భక్తులకు దర్శన మిస్తూ, సకల సార్వభౌమోచిత మర్యా దలతో ఊరేగుతుండగా, శ్రీస్వామివా రికి ఎదురుగా, అభిముఖంగా ఉద్యాన వనశాఖ చక్కగా పుష్పాలంకరణతో తీర్చిదిద్ది ఏర్పాటుచేసిన "శేషశాయి మహావిష్ణువు" విగ్రహమూర్తి ఎందరినో ఆకర్షించి జోతలందుకుంది. చివ రకు స్వామి భక్తులందరిచేత మొక్కు లందుకొని ఆలయం ప్రవేశించడంతో తొలినాటి కార్యక్రమాలు ముగిశాయి.

## రెండోరోజు 7-10-94

యథాప్రకారంగా ఆలయకార్యక్ర మాలన్నీ సుప్రభాతంతో ప్రారంభమ య్యాయి. శ్రీస్వామివారి మూల మూర్తికి శుక్రవారాభిషేకం వైభవంగా జరిగిన తర్వాత విశేష ఆభరణాలతో వజ్రకిరీట, శంఖ, చక్ర, మకరకుండల, కటివరదహస్తాలతో విశేషంగా అలంక రించారు.

పిదప ఉదయం 9 గంటలకు శ్రీమలయప్ప స్వామివారొక్కరే వెండి చిన్నశేషునిపై పురవీధుల్లో ఊరేగుతూ దర్శనమిచ్చారు.

ఆ సాయంత్రం శ్రీస్వామివారొ క్కరే డోలోత్సవంలో పాల్గొని వేలాది మంది భక్తులకు దర్శనమిచ్చారు. ఇక ఆరాత్రి హంసవాహనం.

"కడువేడక వేంకటగిరి మీదట
నొడలు వెంచె నిదె యొక హంసా"

ఆ రాత్రి 9 గంటలకు శ్రీ స్వామివారు ఒక్కరే బంగారుహంస నెక్కి చదువుల తల్లి సరస్వతిదేవికి ప్రతిరూపమా అన్నట్లుగా వీణాధారియై భక్తజనాళికి దర్శనమిచ్చారు. ఈ వాహనముందు పుష్పాలతో తీర్చిదిద్దిన 'హంస' వాహనం కూడ కడు మనో హరంగా దర్శనమిచ్చి ఆహ్లాదపరచింది.

## మూడోరోజు (8-10-94)

బ్రహ్మోత్సవాల్లో మూడోనాటి ఉదయం 9 గంటలకు శ్రీమలయప్ప స్వామివారు సింహవాహనాన్ని ఎక్కి యోగ (ధ్యాన)ముద్రలో దర్శనమి చ్చారు. సంసారమే ఒక సింహం. దాన్ని ధ్యానంతోనే అణచిపెట్టి పయ

### మహనీయుల సందేశం

తి.తి. దేవస్థాన ఆళ్వారు దివ్యప్రబంధ ప్రాజెక్టు, ధర్మప్రచార పరిషత్, దాస సాహిత్య ప్రాజెక్టు బ్రహ్మోత్సవాల సందర్భంగా పదిరోజులపాటు తిరుమల ఆస్థానమండపంలో వేదపారాయణలు, గీతాపారాయణ, భజనలు, ధార్మికోపన్యాసాలు, హరికథలు, పురాణ ప్రవచనాలు ఏర్పాటు చేశారు.

అంతేకాదు శ్రీశ్రీశ్రీ విద్యానందగిరిస్వామి, శ్రీశ్రీశ్రీ విద్యాప్ర కాశానందగిరిస్వామి, శ్రీశ్రీశ్రీ ప్రసన్నానందగిరిస్వామి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరుస్వామీ, శ్రీశ్రీశ్రీ రాజమాతాదేవి (బండ్లమాంబ), శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మున్నగు మహాత్ముల దివ్య సందర్శనం చేయించడంతోపాటు వారి అమూల్య సందేశాలను భక్తులకు అందించే ఏర్పాటు చేశారు.

వించవచ్చన్న దివ్యసందేశంతో దర్శనం ఇచ్చాడు స్వామి.

ఆనాటి మధ్యాహ్నం ఉభయ దేవేరులతో కూడిన శ్రీమలయప్పకు రంగనాయకుల మండపంలో 'స్నపన తిరమంజనం' అనబడే పంచామృత [illegible] నం చేయించబడింది.

అనంతరం ఆరాత్రి [illegible] నుండి 8 గం॥ వరకు ఆలయం వెలుపలగల కొలువు మండపంలో సహస్రదీపాల వెలుగుల మధ్య శ్రీస్వామివారు దేవేరులతోకూడి డోలలో ఊగారు. అన్ని వెలుగులకు వెలుగును తానే నన్న దివ్యసందేశంతో స్వామివారు మరింత ప్రకాశంతో దర్శనమిచ్చారు.

ఆరాత్రి 9 గంటలకు దేవేరులతో కూడివున్న శ్రీనివాసప్రభువు ముత్యాల పందిరి వాహనంపై దర్శనమిచ్చారు. మీ హృదయాల్ని కూడ కడిగిన ముత్యంవలె వుంచుకోండి. తద్వారా దైవసాన్నిధ్యం కరతలామలకం అవుతుందన్న జ్ఞానోపదేశంచేస్తూ శ్రీవేంకటేశ్వరుడు ముత్యపుపందిరిలో ప్రకాశించాడు.

## నాల్గోనాడు (9-10-94)

తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాల్లో నాల్గవనాటి ఉదయం 9 గంటలకు సర్వజగన్నియామకుడైన శ్రీనివాసుడు దేవేరులతోకలసి కల్పవృక్షవాహనంపై దర్శనమిచ్చారు. భక్తులారా! మీమీ కోరికలన్నీ తీర్చే మీపాలిటి కల్పవృక్షాన్ని నేనే! ఇదిగో దర్శించండి అంటూ భక్తులచేత మొక్కులందుకున్నాడు.

ఆమధ్యాహ్నం సర్వసంపత్ప్రదాత అయిన శ్రీనివాసునికి తిరుమంజనం, ఆ సాయంత్రం కొలువు మండపంలో ఊంజల్ సేవ వైభవంగా జరిగాయి.

## దివ్యప్రబంధం — వేదాలు

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి ఉత్సవాలకు ముందుగా వైష్ణవాచార్యులచే దివ్యప్రబంధపారాయణం జరుగుతుంటుంది. అలాగే శ్రీస్వామివారికి వెనుకవైపు వేదపారాయణ జరుగుతుంటుంది. వేదాలు అపౌరుషేయాలు కదా! దివ్యప్రబంధాలు పరమభక్తులైన మానవులచే రచించబడినవి కదా! అలాంటప్పుడు శ్రీస్వా[illegible] ముందు వేదాలు, వెనుక దివ్యప్రబంధాలు వుండవలెనని ఆలోచన కలుగుతుంటుం[illegible] కాని అది సరికాదు.

శ్రీవేంకటేశ్వరుడు భక్తప్రియుడు. [illegible] పరమభక్తాగ్రేసరులైన వైష్ణవులు పాడుతూ పోతుండగా భక్త పక్షపాతి, భక్త [illegible] శ్రీస్వామి, వారి వెంట పరుగిడతాడట!

ఇక శ్రీస్వామిని స్తుతించే వేదాలు శ్రీవేంకటేశ్వరుని ఆశ్రయించి వుండి వెనుకనే వెంట నడుస్తాయట!

తమిళనాడు శ్రీవిల్లిపుత్తూరు నుండి గోదాదేవికి అలంకరించి పూలమాలలు చిలుకలు, తిరుమలకురాగా, వాటిని గౌరవంగా ఆహ్వానిస్తూ శ్రీవారి సన్నిధిలో సమర్పించారు.

ఆరాత్రి బంగారు సర్వభూపాల వాహనంలో సర్వజగత్ప్రభువైన వేంకటేశుడు దేవేరులతోకూడ దర్శనమిచ్చి భక్తులనలరింపజేశాడు.

## ఐదోనాడు (10-10-94)

బ్రహ్మోత్సవాలలో ఐదవనాటి ఉదయం శ్రీస్వామివారు బంగారు చిలుకను ధరించి వయ్యారంగా జగన్మోహిని రూపం దాల్చారు. ఈ రూపాన్ని చూస్తూ, తళతుబెళకుల ఈ మెరుపుతీగ, ఈసుందరీమణి ఎవరా! ఈమెను మానినీమానసచోరుడైన మనస్వామి చూస్తే ఇంకేమైనా వుందా అంటూ శ్రీదేవిభూదేవులు గాభరాపడ్డారు. అంతలోనే శ్రీస్వామివారి చిరునవ్వుతో తేరుకొని "ఓహో ఈయన మనస్వామే! అమృత మథనంనాటి రూపంలో దర్శనమిచ్చాడంతే! అని సంతృప్తి పడుతుండగా దంతపు పల్లకి నెక్కి ఊరేగుతూ భక్తులను సమ్మోహన పరచారు.

"నీవన నెవ్వరు నే నన నెవ్వరు
నీవే నైనై యుందు చిలుకా
శ్రీవేంకటాద్రిపై చిత్తములో నుండి
సేవించుకొను గట్టి చిలుకా"

అంటూ బంగారుచిలుక ద్వారా, జీవాత్మలనే చిలుకలను తనవైపు మరల్చుకుంటున్న శ్రీ జగన్మోహినీ అవతారంతోపాటు మరొకపీఠంపై శ్రీకృష్ణస్వామి కూడ ఊరేగింపబడ్డాడు.

## శ్రీవారికి పట్టువస్త్రాలు

ఆ సాయంత్రం 4 గంటలకు, గరుడోత్సవ సందర్భంగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరుపున రాష్ట్ర దేవాదాయశాఖమంత్రి శ్రీ కలికి యాద[illegible] రెడ్డి శ్రీవేంకటేశ్వరస్వామివారికి పట్టు వస్త్రాలను సమర్పించారు. తిరుమల సన్నిధివీధిలోని శ్రీ బేడి ఆంజనేయ

## ఆదాయం

94 అక్టోబరు బ్రహ్మోత్సవాల సందర్భంగా హుండీద్వారా, ప్రత్యేక ప్రవేశం, ఆర్జితసేవలు, ప్రసాదాల అమ్మకంవల్లా మొత్తం 2,73,64,731-05 రూపాయలు ఆదాయం వచ్చినట్లుగా టి.టి. దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్రెడ్డి తెలిపారు. [illegible] గత సంవత్సరంకంటే ఈసారి సుమారు 72 లక్షల మొత్తం అధికంగా వచ్చిందని, అలాగే ఈ సంవత్సరం 7,43,032 మంది భక్తులు తిరుమల శ్రీవారిని దర్శించారని, గత సంవత్సరం కంటే సుమారు ఈసారి 2,70,941 భక్తులు పెరిగారని శ్రీ చెంగల్ రెడ్డి తెలియజేశారు.

స్వామి ఆలయం నుండి సంప్రదాయసిద్ధంగా వెండిపళ్లెంతో వస్త్రాలను తలపై పెట్టుకొని, ఛత్రచామర మంగళవాద్య సమేతంగా ఊరేగింపుగా వెళ్లి శ్రీ యానాదిరెడ్డి శ్రీస్వామివారికి వస్త్రాలు సమర్పించారు. అనంతరం శ్రీస్వామివారికి పూజలు జరిపి, తీర్థ ప్రసాదాలు స్వీకరించారు. ఈ ఊరేగింపులో దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ. చెంగల్ రెడ్డి, ఇ.ఓ. శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, జె.ఇ.ఓ. శ్రీ సి.హెచ్. సత్యనారాయణ, ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఆంజనేయులునాయుడు, ఛీఫ్ సెక్యూరిటీ ఆఫీసరు శ్రీ నారాయణ, పి.ఆర్.ఓ. శ్రీ టి. శివాజి ప్రభృతులు పాల్గొన్నారు.

## కొత్తగొడుగులు

ప్రతి సంవత్సరం మాదిరిగానే సంప్రదాయసిద్ధంగా గొడుగుల మిరాశిదారులు మద్రాసునుండి కాలినడకన శ్రీస్వామివారి గరుడోత్సవ సమయానికి (రాత్రి 8 గంటలకు) తొమ్మిది గొడుగులను ఊరేగింపుగా తీసుకొని వచ్చారు. వీరికి దేవస్థానం వారు ఆలయోచిత మర్యాదలతో తిరుమల డోలీమండపం దగ్గర [illegible] ఇచ్చారు. [illegible]వాహనుడైన శ్రీవేంకటేశ్వరస్వామి ఈ కొత్తగొడుగులను ధరించి ఊరేగింపులో పాల్గొన్నారు.

## గరుడవాహనం

తిరుమల శ్రీనివాసుని వాహన సేవలలో కెల్ల అత్యంత విశిష్టమైందిగా ప్రసిద్ధికెక్కింది బ్రహ్మోత్సవాల్లో ఐదవనాటి గరుడోత్సవం. ఈరోజు ఆనందనిలయంలోని మూలవిరాట్టుకు అలంకరించే మకరకంఠి, లక్ష్మీహారాది విశిష్ట ఆభరణాలు, ఊరేగింపుగా తీకుకొనివచ్చి శ్రీనివాసస్వామికి అలంకరించారు. అంతకుముందురోజున వచ్చిన శ్రీవిల్లి పుత్తూరు గోదాదేవి ధరించిన మాలను కూడ శ్రీవారికి అలంకరింపజేశారు. అనంతరం మద్రాసునుంచి వచ్చిన కొత్తగొడుగులను ధరించి తిరుమల పురవీధుల్లో సంచరిస్తూ దర్శనమిచ్చాడు గరుడవాహనుడు.

ఈ బంగారు గరుడవాహనానికి ఎదురుగా ఉద్యానవనశాఖ తీర్చిదిద్ది ఏర్పాటుచేసి ఊరేగించిన 20 అడుగుల ఎత్తైన పుష్పాలంకరణతో గరుడవాహనం, భక్తులను ఆశ్చర్యంతో ఆనంద పరచింది.

సుమారు లక్షన్నరకుపైగా భక్తజనం గరుడ వాహనుడైన శ్రీతిరుమలేశుని దర్శించి పునీతులయ్యారు.

దేవస్థానం అత్యున్నత అధికారులెందరో పాల్గొని పర్యవేక్షించిన ఈ గరుడోత్సవంలో ఎన్నో భక్త బృందాలు, భజన బృందాలు పాల్గొన్నాయి. ఆకాశవాణి అన్నికేంద్రాలు గరుడోత్సవాన్ని ప్రత్యక్షవాఖ్యానాన్ని ప్రసారం చేశాయి.

### ఆరోనాడు (11-10-94)

[illegible]దయం 9 గంటలకు శ్రీవేంకటప్రభువు ఒక్కరే హనుమంతునిపై ఊరేగుతూ తానే త్రేతా యుగంనాటి శ్రీరామచంద్రుణ్ణి అంటూ వేంకటాద్రి రామునిగా దర్శనమిచ్చాడు.

ఆ సాయంత్రం 4 గం॥ కు దేవేరులతోకూడిన ఘనవేంకటేశునకు వసంతోత్సవం వైభవంగా జరుపబడింది. అనంతరం శ్రీవారిని విశేషంగా అలంకరించారు.

## బంగారుతేరు

బ్రహ్మోత్సవాల్లోనేగాక తిరుమల పుణ్యక్షేత్ర వైభవ చరిత్రలోనే సువర్ణాధ్యాయంగా నిలిచిన ఘట్టం శ్రీవారి బంగారుతేరు. శ్రీ భావనామ సంవత్సరం ఆశ్వయుజమాసంలో వార్షిక బ్రహ్మోత్సవాల సందర్భంగా తొట్టతొలిగా జరిగిన శ్రీనివాసుని బంగారు రథోత్సవం లక్షలాది మంది భక్తులనాకట్టుకొని మైమరపించింది.

బ్రహ్మోత్సవంలో ఆరవనాటి సాయంత్రం వసంతోత్సవంలో పాల్గొన్న శ్రీ స్వామివారు ఉభయదేవేరులతో కూడి శుభముహూర్తంలో బంగారు రథాన్ని వేలాది భక్తుల జయ జయ ధ్వానాలమధ్య అధిరోహించారు.

ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా, సకల సార్వభౌమోచిత రాజ మర్యాదలతో, వృషగజ, తురగ పదాతి భక్త బృందాలు ముందు నడు

స్తుండగా దివ్యప్రబంధ, వేదపారాయణలద్వారా కీర్తిస్తుండగా ఆ శ్రియః పతి ఆసాయంకాలం 5 గం॥- 6 గం॥ మధ్య ఆలయం మహాప్రదక్షిణ మార్గంలో కనక రథంలో మహాద ర్భంగా ఊరేగుతూ భక్తుల గోవిందనామాల ఘోషణల మధ్య అత్యంత వైభవంగా దర్శన మిచ్చారు.

తిరుమల శ్రీ వేంకటేశ్వరునకు తొలిసారిగా జరిగిన బంగారు రథోత్సవంలో దేవస్థానం ఛేర్మన్ శ్రీ ఎ. చెంగల్ రెడ్డి, ఇ. ఓ. శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, జె.ఇ.ఓ. శ్రీ సి.హెచ్. సత్యనారాయణ ఇంకా ఇతర అధికారులు, అనంతపురం డి. ఐ.జి. శ్రీ పి.వి.వి. సత్యనారాయణ, జిల్లా ఎస్.పి. శ్రీ కోటేశ్వరరావు, ఎ.ఎస్.పి, శ్రీ ఎస్.కె. జయచంద్ర తదితరులు పాల్గొన్నారు.

ఆ రాత్రి శ్రీ స్వామివారు ఒక్కరే గజవాహనంపై ఊరేగుతూ దర్శనమిచ్చారు.

## ఏడోనాడు (12-10-94)

ఏడవనాడు ఉదయం వజ్రకవచధారియైన శ్రీనివాసుడు సూర్యప్రభవాహనంపై కన్నులపండువు చేశాడు.

ఆ మధ్యాహ్నం 2 గంటలకు శ్రీనివాసదేవునికి దేవేరులకు స్నపన తిరుమంజనం ఘనంగా జరిగింది.

ఆ సాయంత్రం 7 గం॥లో శ్రీమలయప్పస్వామికి ఊంజల్ సేవ జరిగింది. అనంతరం ఆరాత్రి 9 గంటలకు ముత్యాల కవచధారియైన శ్రీనివాసుడు చంద్రప్రభవాహనంపై దర్శనమిచ్చారు.

## ఎనిమిదోనాడు (13-10-94)

బ్రహ్మోత్సవాల్లో అత్యంత విశిష్టమైన దినం ఇది. సంప్రదాయసిద్ధంగా ఈ రోజు కొయ్యతేరులో ఊరేగుతూ దర్శనమివ్వడం ఆనవాయితీ!

ఇటీవలే అత్యవసర ప్రాతిపదికపై చురుకుగా పునర్నిర్మించి శోభాయమానంగా అలంకరించిన చెక్కరథంపై శ్రీదేవి భూదేవి సమేత శ్రీ వేంకటేశ్వరుడు తెల్లవారుజామున 2-10 నుండి 2-20 గంటలమధ్య కటకలగ్నంలో అధిరోహించినాడు. ఆతెల్లవారుజామున 5-50 గంటలనుండి 8 గంటల వరకు సాగిన రథోత్సవాన్ని వేలాదిమంది

### వైద్య సహాయం

తి.తి. దేవస్థానంవారు శ్రీవారి బ్రహ్మోత్సవాల సందర్భంగా యాత్రికులసేవలో అహరహం "అశ్వినీ ఆసుపత్రి" సిద్ధంగా వుండడమేగాక, తిరుమలలో వైకుంఠం క్యూకాంప్లెక్సు, పి.పి.సి. షెడ్లు, కల్యాణకట్ట, మున్నగుచోట్ల వైద్య సహాయం ఏర్పాట్లు చేశారు.

వీటితోపాటు ఆయుర్వేద మందుల వితరణ కార్యక్రమంకూడ మురుగ్గా సాగింది.

భక్తులు గోవిందా! గోవిందా అంటూ తిలకించారు. రథాన్ని లాగారు.

రథస్థం కేశవం దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే

అన్నట్లుగా వారి వారి జన్మ పరంపర నశించిందన్న తృప్తితో ఆనందంతో భక్తజనులు పాల్గొన్నారు.

దేవస్థానం ధర్మకర్తలమండలి సభ్యులు శ్రీ జి. శ్రీరామమూర్తి, రిటైర్డింగుప్రాజెక్టు అధికారి శ్రీ కె. శ్రీనివాసులుశెట్టి రథంపైన ఎక్కి మైకుద్వారా శ్రీవారి రథోత్సవ ప్రాధాన్యాన్ని వివరించారు.

ఆసాయంత్రం శ్రీవారికి ఒక్కరికే ఊంజల్ సేవ జరిగింది. అనంతరం ఆరాత్రి 9 గంటలకు అశ్వవాహనంపై శ్రీ వేంకటేశ్వరుడు రాబోయే కల్కిని నేనే నన్నట్లు సూచనచేస్తూ దర్శనమిచ్చాడు.

## తొమ్మిదోనాడు (14-10-94)

బ్రహ్మోత్సవాల్లో తొమ్మిదోరోజు చివరిది. ఆరోజు ఉదయం 5-30 గంటలకు శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పకు దంతపు పల్లకిలో నాలుగువీధుల్లో ఊరేగింపు జరిగింది. అనంతరం శ్రీస్వామివారలకు నువ్వులనూనె, పసుపుతో నలుగు పెట్టబడింది. దీన్ని చూర్ణాభిషేకం అంటారు. ఆతర్వాత శ్రీ స్వామివారలు, శ్రీ చక్రత్తాళ్వార వెంటరాగా ఆలయప్రదక్షిణంగా శ్రీవరాహస్వామి ఆలయం చేరుకొన్నారు. అచట శ్రీస్వామివారికి దేవేరులకు, చక్రత్తాళ్వారునకు స్నపన తిరుమంజనం జరిగిన పిదప శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారును కోనేట్లో స్నానం చేయిచారు. ఈ చక్రస్నానం సందర్భంగా వేలాదిమంది భక్తులు పుష్కరిణిలో పవిత్రస్నానాలు చేశారు.

ఆసాయంత్రం బంగారు శ్రీ పీఠంపై (తిరుచ్చి) ఉభయదేవేరులతో కూడిన శ్రీనివాసచక్రవర్తి పురవీధుల్లో సంచరిస్తూ రాగా, ఆచార్యపురుషులు ఆయాదిక్కుల్లో దిక్పాలురకు బలిని సమర్పించి వీడ్కోలు చెప్పారు. ఆతర్వాత ధ్వజస్తంభం దగ్గరికి శ్రీస్వామివారు చేరుకోగానే, శ్రీవారిసమక్షంలో ధ్వజస్తంభంపైవున్న గరుడకేతనాన్ని పూజాదులు నిర్వహించి అవరోహణ చేశారు. ఆగరుడకేతనాన్ని

శ్రీస్వామివారిదగ్గర ఉంచారు. పిదప బ్రహ్మోత్సవ నిర్వాహకులుగా బద్ధకంక ణులైన శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి బ్రహ్మోత్సవాలు నిర్విఘ్నంగా సాగినం దుకు శ్రీస్వామివారిని ప్రార్థిస్తూ తమ కంకణాన్ని వదలిపెట్టారు.

అనంతరం బంగారువాకిలి దగ్గర శ్రీస్వామివారికి ఆస్థానం జరిగింది. అనంతరం ఆచార్యపురులు ఆలయం లోనికి వెళ్లి శ్రీవారికి (మూలమూర్తి) పాదనమస్కారం చేసి బ్రహ్మోత్స వాలు దిగ్విజయంగా జరిపినందులకు అనేకవిధాల ప్రార్థించడంతో బ్రహ్మో త్సవాలు మంగళప్రదంగా సమాప్తమ య్యాయి.

ఆతర్వాత బ్రహ్మోత్సవాలను ఘనంగా నెరపిన ఆచార్యులకు అర్చ కస్వాములకు బహుమాన పూర్వకంగా సత్కరించబడి, మేళతాళాలతో ఛత్రచా మర మర్యాదలతో "తిరుమాళిగ" అన బడే వారి ఇంటికి ఆలయప్రదక్షిణంగా సగౌరవంగా సాగనంప బడినారు.

## ఉపసంహారం

ఇలా అలనాడు కలియుగం నాటి తొలినాళ్లలో బ్రహ్మదేవుడు చేసిన ఉత్స వాలు పరంపరగా కొనసాగుతూ 94 అక్టోబరు 5 నుండి 14 వరకు పదినా ళ్లపాటు, తిరుమల శ్రీవారి బ్రహ్మో త్సవాలు ఘనంగా జరిగాయి.

ఈ పదిరోజుల్లో లక్షలాది మంది భక్తులు అత్యంతభక్తి ప్రపత్తులతో పాల్గొ న్నారు. ఒకవైపు గోవిందలు పెడుతూ కొండలెక్కే జనం... మరోవైపు భక్తితో చిందులేస్తూ భజనచేసే భజన బృందాలు... ఇంకోవైపు కోలాట నృత్యాలు... చెక్కభజనలు హరిక థలు... బుర్రకథలు... పగటివే షాలు... పురాణాలు... పవిత్రపు ష్కరిణిలో స్నానాలూ... దర్శనాలు... నున్నటిగుండ్లతో పట్టెనామాలతో వెలు గుతున్న భక్తులూ, నీరాజనాలిస్తున్న పుణ్యస్త్రీలూ నిత్యాన్నదానాలూ - ప్రసాద వితరణలూ... యాత్రికుల సేవలో అహరహం శ్రమిస్తున్న దేవ స్థానం ఉద్యోగులు... స్కౌట్లు, గైడ్లు... రక్షకభటులు... ఆరోగ్యాధికారులు, అర్చకస్వాములు... వేదమంత్రాలు... భక్తిసంగీతాలూ... కన్నులు చెదిరిపో యేలా విద్యుద్దీపాలతో రూపొందించిన అద్భుతమూర్తులు... ఇంకోవైపు పుష్పా లతో తీర్చిదిద్దిన చిత్రాలు, మూర్తులు - ఉద్యానవనాలు, ఇలా ఎందరెం దరో ఎన్నోవిధాల ఎన్నోచోట్ల వారి వారి కార్యక్రమాల్లోమునిగివున్నా వీరం దరి ధ్యేయం, దృష్టి గమ్యం ఒక్కటే అన్నట్లు మిరుమిట్లు గొలుపుతున్న ఆనందనిలయ విమానం నుంచి శ్రుతి కింపుగా వినవచ్చే మంత్రాల నాదా లను... చెవులారా వింటూ, కన్ను లారా తిలకిస్తూ భక్తజనం తామంతా మరొక అద్భుత ప్రపంచంలో విహ రిస్తున్నట్లుగా, తమవంతు భాగ్యంగా కలియుగవైకుంఠని బ్రహ్మోత్సవాల్లో పాల్గొనడంవల్ల తమ భాగ్యం పండిం దని ఆనందపడ్డారు! సంబరపడ్డారు! సంతోషపడ్డారు!

> ## అభినందన
>
> 94 అక్టోబరు బ్రహ్మో త్సవాలు అత్యంత వైభవంగా, ఘనంగా, నిర్విఘ్నంగా సాగాయని, అనూహ్యంగా లక్షలాది భక్తులు పాల్గొన్న ఈ బ్రహ్మోత్సవంలో దేవస్థానం ఉద్యోగులు, వైద్య శాఖ, ఉద్యానవనశాఖ, విద్యుత్ శాఖ, ఆరోగ్యశాఖ, స్కౌట్లు, గైడ్లు, పోలీసులు, ఆకాశవాణి, ఆర్.టి.సి. వారు ఇలా ఎందరెందరో.... మరెం దరో తమ తమ అమూల్య సేవలందించారని దేవస్థానం ధర్మ కర్తలమండలి అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి సంతోషాన్ని వ్యక్తం చేస్తూ అందరినీ అభినందించారు.

శ్రీమహాలక్ష్మి స్వరూపురాలైన పద్మావతిని తనకంటె వేరుగా ఉంచ కుండా తన వక్షఃస్థలంలోనే ధరించిన ఆశ్రియఃపతి, తమకు సర్వసంపదలను, సర్వసౌఖ్యాలను కలిగించడానికే తమ కోసం, ఆనందనిలయాన్ని వీడి వచ్చి పదిరోజులపాటు కన్నులారా దర్శనమి చ్చాడని మనసారా స్తుతిస్తూ, నోరారా కీర్తిస్తూ ఆ మధుర క్షణాల్ని స్మరించు కుంటూ భక్తజనం గృహోన్ముఖుల య్యారు. కనుకనే భక్తలోకంచేత అల మేలుమంగపతి ఇలా స్తుతింప బడ్డారు.

కామధేనుః కల్పవృక్షః
చింతామణి రితి త్రయమ్
వేంకటేశ త్వమేవాసి
శేషాగే సర్వదానతః

ఓ శ్రీనివాసప్రభూ! దేవలోకం ఎక్కడుందో మాకు తెలియనే తెలి యదు. మరి ఆ లోకంలోని కామ ధేనువు, కల్పవృక్షం, చింతామణి - ఇవి మూడు సర్వాభీష్టములను తీరుస్తా యట! ఆ మూడు వస్తువులును నీవే అయి, ఈ వేంకటాచలంపై మాకు ప్రత్యక్షంగా దర్శనమిస్తూ సంపూర్ణంగా అనుగ్రహిస్తున్నావు కదా!



Published on behalf of T.T Devasthanams by N.S. Ramamurthy, M.A., Editor-Incharge and
Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507



అందుకే నేఁ జింతించెదను అచ్యుత! నీ శరణాగతుఁడ
సందడి నాభవ మిందువల్లనే సఫలంబాయనయ్యా.

వొక నీ నామము వొగిఁ దలంచిన
అకలంకంబగు నా పాపంబులు అన్నియుఁబారణోసేసె
అకటా తక్కిన అనంతనామములు
వొకట నుపవాసములున్న వొయయ్యా.

హరి! నీపాదము లవిరెండే
పరమును నిహమును నాకొసఁగెను పయిపైఁ గృపతోడ
ధర నీ యనంత కరములు తామేమి-
సిరు లిత్తమనుచు చెలఁగీనయ్యా.

ఇల నీదాస్యం బిది యొకటే
సిలుగుల భవముల జిలుగు మాన్పెనదె చిత్తము తహదీర
యెలమిని శ్రీవేంకటేశ్వర నీవిదె
తలఁపునఁ బాయక దక్కితివయ్యా.



--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన : 376,
రాగం : దేవగాంధారి సంపుటం : 2 (1981)

# మార్పు

ధనుర్మాసం సందర్భంగా 16-12-94 నుండి 14-1-95 వరకు తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి సర్వదర్శనం వేళల్లో స్వల్ప మార్పులు చేశారు. యాత్రికులు ఈ విషయం గమనించి దేవస్థానంతో సహకరించ విజ్ఞప్తి.

## 16-12-94 న సర్వదర్శనం:

ఉదయం 6-30 నుండి ఉదయం 11-00 గంటల వరకు; మధ్యాహ్నం 1-00 నుండి రాత్రి 7-00 గంటల వరకు; రాత్రి 9-00 నుండి రాత్రి 11-00 గంటల వరకు.

* అవసరాన్ని బట్టి రాత్రి 11-00 తర్వాత కూడ సర్వదర్శనం వుంటుంది.

## మంగళవారాలు -- సర్వదర్శనం

ఉదయం 7-00 నుండి రాత్రి 7-00 గంటల వరకు; రాత్రి 8-00 నుండి రాత్రి 10-30 గంటల వరకు.

* అవసరాన్ని బట్టి రాత్రి 10-30 తర్వాత కూడ సర్వదర్శనం వుంటుంది.

## బుధవారాలు -- సర్వదర్శనం

ఉదయం 8-00 నుండి రాత్రి 7-00 గంటల వరకు; రాత్రి 8-00 నుండి రాత్రి 10-30 గంటల వరకు.

* అవసరాన్ని బట్టి రాత్రి 10-30 తర్వాత కూడ సర్వదర్శనం వుంటుంది.

## గురువారాలు -- సర్వదర్శనం

ఉదయం 8-00 నుండి రాత్రి 7-00 గంటల వరకు; రాత్రి 9-00 నుండి రాత్రి 10-30 గంటల వరకు (పూలంగి సర్వదర్శనం).

* అవసరాన్ని బట్టి రాత్రి 10-30 తర్వాత కూడ సర్వదర్శనం వుంటుంది.

## శుక్రవారాలు -- సర్వదర్శనం

ఉదయం 8-30 నుండి రాత్రి 7-00 గంటల వరకు; రాత్రి 9-00 నుండి రాత్రి 10-30 గంటల వరకు.

* అవసరాన్ని బట్టి రాత్రి 10-30 తర్వాత కూడ సర్వదర్శనం వుంటుంది.

## శని, ఆది, సోమవారాలు -- సర్వదర్శనం

ఉదయం 7-00 నుండి రాత్రి 7-00 గంటల వరకు; రాత్రి 8-00 నుండి రాత్రి 10-30 గంటల వరకు.

* అవసరాన్ని బట్టి రాత్రి 10-30 తర్వాత కూడ సర్వదర్శనం వుంటుంది.

ఈ మార్పులు 16-12-94 నుండి 14-1-95 వరకు మాత్రమే వర్తిస్తాయి.




గౌరవ సంపాదకులు
శ్రీ డి.వి.యల్.యన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
ఫోను. 22591.
ప్రమరణకర్త-ఇన్‌ఛార్జి సంపాదకులు
ఎస్.ఎస్. రామమూర్తి, ఎమ్.ఎ
ఫోను. 22294
ఉపసంపాదకులు
సి. శైలకుమార్, ఎమ్.ఎ.,
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎమ్.ఎ.,
ముద్రాపకులు
ఎం. విజయకుమార్‌రెడ్డి,
ఫోను. 22340
విడిప్రతి - రు. 2-00
సం|| చందా - రు. 24-00
అన్నివివరాలకు:
సంపాదకులు,
సప్తగిరి, తి.తి. దేవస్థానం,
తిరుపతి. ఫోను. 22294.



# విషయ సూచిక...డిసెంబరు, 1994

సంపుటి 25 సంచిక 7



ముఖచిత్రం : శ్రీ పద్మావతీ అమ్మవారు — చిత్రం: వెంగారెడ్డి.
2 వ కవరుపేజీ : శ్రీ సరస్వతీమూర్తిగా పద్మావతీ అమ్మవారు
3 వ కవరుపేజీ : ఈశ్వరుడు, (కపిలతీర్థం తెప్పోత్సవంలో)
4 వ కవరుపేజీ : శ్రీ పద్మావతీ అమ్మవారి పుష్కరిణి, తిరుచానూరు.
సెంటర్ స్ప్రెడ్ : కపిలతీర్థం జలపాతదృశ్యం, తిరుపతి

# సంపాదకీయం



అనాయాసేన మరణం
వినాదైన్యేన జీవనం.



స్త్రీ పురుష భేదంలేకుండా మానవజన్మ ఎత్తిన ప్రతి ఒక్కరూ మానసంలో కోరుకునేది ఇదే. అంతిమంలో ఆయాసంలేని మరణం సంభవించాలి అని, అంతవరకు దైన్యం లేని జీవనం సాగాలి అని.

అయితే యంత్రనాగరికత పెరిగిపోతున్న ఈ రోజుల్లో, మానవులమధ్య సంబంధాలన్నీ వ్యాపారాత్మకాలై, మమతలు, అనుబంధాలు కాసులరాసులతో తూచుకుంటున్న ఈస్థితిలో అతిసాధ్యమా అన్నది ప్రశ్న. అంతులేని ప్రశ్న.

సంయమన చిత్తంతో వెతకగలిగితే సమాధానంలేని ప్రశ్నలు ఉండవు. అమావాస్య చీకట్లో కూడ నక్షత్ర కాంతి దర్శనం అవుతుంది.

దైనందిన జీవిత సమస్యలన్నిటికీ సమాధానం గీత -- పరమాత్ముడు పార్ధసారధియై ప్రవచించిన శ్రీమద్భగవద్గీత. నారాయణుడు నరుడికి వినిపించిన సర్వవేదసారం.

ఆహవ రంగంలో అక్షౌహిణుల సైన్యం ఆయుధాలతో మొహరించి వుండగా, పార్థుడు గాండీవాన్ని ప్రక్కకు పడవేయగా, పరమాత్ముడు సవ్యసాచికి సక్రమ మార్గం నిర్దేశించడానికి ఉపదేశించాడు గీత.

అర్థంచేసుకోగలిగితే మానవజీవనమే ఓ యుద్ధరంగం. కష్టాలు, నష్టాలు, సమస్యలు, సందేహాలు చుట్టూ మొహరించి వున్న సైన్యం. అంతరంగపు ఆత్మ రథం. దాని సారథి పార్థ సారధి. అయితే ఆయనను నమ్మి పగ్గాలు ఆయనకు అప్పగించాలి మనిషి.

అనన్యా శ్చింతయం తోమాం యే జనాః పర్యుపాసతే
తేషా నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అన్నాడు ఆ సర్వ సృష్టికారకుడు.

అనన్య చిత్తంతో నన్ను ధ్యానించే భక్తుల యోగక్షేమాల్ని నేనే వహిస్తాను అన్న హామీ ఇచ్చాడు.

ఆ నమ్మకంతో, ఆ ధైర్యంతో, ఆ గీతా ప్రవచనబలంతో ముందుకు సాగగలిగితే ఆనందం తప్ప విషాదం వుండదు. ఆశే తప్ప నిరాశ వుండదు.

అన్నిటికీ కారకుడైన ఆయన మన జీవిత రథాన్ని నడిపించడం కంటే వేరే ఇంకేం కావాలి.

మనిషి ఆ జ్ఞానాన్ని పొంది, ఆ పరమాత్మున్ణే ఆశ్రయించాలి. ఆయన్ను ప్రార్థించాలి.

ఈ కలికాలపు యంత్ర జీవనంలో మనం సర్వం పరిత్యజించిన మహర్షులమే కానక్కరలేదు. ఆత్మబలం కోసం అడవులకు పారిపోనక్కరలేదు.

కాస్త ప్రశాంత చిత్తంతో సర్వవేదసారం అయిన గీతను పఠించగలిగితే చాలు. అన్ని శ్లోకాలను ఆసాంతం అర్థంచేసుకోలేకపోయినా, కొన్ని శ్లోకాలనైన కొంతైనా అర్థం చేసుకుంటే చాలు.

అంతే. జీవితానికి ఓ అర్థం లభిస్తుంది. పరమార్థం తెలుస్తుంది.

కృష్ణాయ వాసుదేవాయ హరయేపరమాత్మనే
ప్రణతక్లేశ నాశాయ గోవిందాయ నమోనమః

# శ్రీపాదవల్లభుడు

శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామీజీ

ఇప్పటికి సుమారు 550 సంవత్సరాల క్రిందట మన ఆంధ్రదేశంలోని పిఠాపురంలో శ్రీ దత్తాత్రేయస్వామివారు "శ్రీపాదవల్లభుడ"నే పేరుతో అవతరించి కొన్నివేల మంది భక్తులకు ముక్తి కలిగించాడు.

## శ్రీపాదవల్లభుడు

పూర్వం పిఠాపురంలో 'రాజశర్మ' అనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు వేదవేత్త. ధర్మశీలుడు. ఆయన ధర్మపత్ని పేరు సుమతి. నిజంగానే వెనుకటి పతివ్రతయైన సుమతి మళ్లీ ఇలా అవతరించిందేమో అనిపించేది. ఆవిడ సత్ప్రవర్తన, పతిభక్తి, చూస్తున్నవాళ్లకి.

ఆదంపతులెంతో అన్యోన్యంగా, ధర్మపరాయణంగా ఉండేవారు. అయితేనేమి ఈ పాడు సంసారంలో లోటులేని ఇల్లే ఉండదు కదా! ఆ దంపతులకెంతోమంది సంతానం కలిగినా ఎవరూ మిగల్లేదు, ఇద్దరు తప్ప. ఆ ఇద్దరిలో ఒకడు కుంటి, రెండోవాడు గ్రుడ్డి.

ఇక ఆ దంపతులకు మిగిలిన సుఖమేమిటో మనం చెప్పక్కరలేదు. గుండెలమీద ఈ అగ్ని గుండాలని పెట్టుకొని ఆ దంపతు లలాగే కాలక్షేపం చేస్తున్నారు.

కాని, ఎంత దుఃఖం ఉన్నా ఆ దంపతులు ఏనాడూ తమ నిత్యానుష్ఠానాలు మానుకోలేదు. ఈశ్వరుడి మీద నింద వేయలేదు. ఎలా కుదిరిందో కాని, వారికి దత్తస్వామి మీద భక్తి బాగా కుదిరింది.

ఒక రోజున వారింట్లో తద్దినం వచ్చింది. వంటలవుతున్నాయి. బ్రాహ్మణులింకా రాలేదు. ఇంతలో వాకిట్లో కొక యతి వచ్చి 'భవతి భిక్షాం దేహి' అన్నాడు. ఆ గొంతు విని ఆ ఇల్లాలు, ఎందుకోగాని ఉలిక్కి పడ్డది. ఇంటాయన దొడ్లో ఉన్నాడు. ఇక వ్యవధి లేదు. ఏమైతే అదయిందనుకొని, గబగబ వెళ్ళి యతికి భిక్షం వేసింది సుమతి. అవును మరి, ఆమె కళ్ళకెదురుగా దత్తస్వామి దివ్యతేజస్సులతో కనిపించాడు.

స్వామి గుట్టు బయటపడిపోయింది. ఇక స్వామి ఏం చేస్తాడు? ఆనందంతో, నిజంగానే స్వస్వరూపంతో సాక్షాత్కరించాడు ఆ




తల్లికి. ఆమె పాదాభివందనం చేసింది. వరం కోరుకో మన్నాడు స్వామి.

స్వామి ఆడదానికి సంతానాన్ని మించిన వర మేముంది? నా కడుపు ఎన్నో సార్లు కాలనే కాలింది. కాలకుండా మిగిలిపోయిన రెండు సందర్భాలూ మాకు ఆరని అగ్ని గుండాలే అయినాయి. స్వామీ! కంటే నీలాంటి కొడుకుని కనాలి. అనసూయమ్మ నోచకుండా నోము. ప్రభూ! దయకలిగితే ఈ నా ఆడియాస తీర్చు" అన్నదామె దీనంగా.

స్వామి సన్నగా నవ్వాడు.

"అమ్మా! నా భక్తుల ఆశలు ఆడియాసలెలా అవుతాయి? నీ కోరిక తప్పక తీరుతుంది. విశ్వవంద్యుడైన కొడుకు పుడతాడు. మీకు. కాని, తల్లీ! అతని మాటకు

94 డిశంబరు 17న శ్రీదత్తాత్రేయ జయంతి సందర్భంగా ప్రచురితం.

సం॥

వచ్చే సంచికలో ప్రారంభం

## తిరుమల సమయాచారములు

ధారావాహికం

తిరుమల తిరుపతి ఆలయాల్లో జరిగే ఉత్సవాలు, ఊరేగింపులు, వాటిచరిత్ర, దివ్యప్రబంధ పారాయణ మొదలగు విషయాలను వివరించే 'తిరుమల సమయాచారములు' వచ్చేసంచిక జనవరి 95 నుండి ధారావాహికంగా ప్రారంభిస్తున్నాం.

ఇది ప్రముఖ పండితులు, సంస్కృతాంధ్రాంగ్ల భాషా నిష్ణాతులు శ్రీ ఎస్.పి.వి. నరసింహాచార్య తెనిగించిన రచన.

సంపాదకుడు

## సబ్సిడీ ధరపై మైకుసెట్ల పంపిణీ

తిరుమల తిరుపతి దేవస్థానంవారు 50 శాతం సబ్సిడీ ధరపై ఆంధ్ర రాష్ట్రంలోని అన్ని ఎండోమెంటు ఆలయాలకు ఒక మైకుసెట్టు, ఒక టేపురికార్డరు, క్యాసెట్లు పంపిణీ చేస్తున్నారు.

---

ఇందుకుగాను సబ్సిడీ ధర: రు. 3370-00

ఈ మైకుసెట్టు, టేప్‌రికార్డరు, క్యాసెట్లు పొందగోరు ఆలయాల వారు రు. 3,370-00లకు డిమాండు డ్రాఫ్టు తోపాటు తమ ధరఖాస్తును సంబంధిత ఎండోమెంట్స్ శాఖ అసిస్టెంటు కమీషనరు ద్వారా ఈ క్రింది వారికి పంపాలి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ఎదురులేకుండా ఉన్నంత కాలమే నీ దగ్గరుంటాడు. మరి జాగ్రత్త" అని చెప్పి స్వామి అక్కడే అంతర్ధానం అయిపోయాడు.

ఇల్లాలు జరిగినదంతా భర్తకు చెప్పింది. "స్వామి స్వయంగా వచ్చాడు కదా అని అలా చేశాను. మరి శ్రాద్ధం చెడిపోయిందేమో!" అన్నది.

ఆ విప్రుడు ధర్మసారం తెలిసినవాడు. జరిగిన దానికి బాగా సంతోషించి, భార్యను అభినందించాడు. "సాక్షాత్తుగా స్వామే వచ్చి భిక్ష స్వీకరిస్తే ముల్లోకాలూ తృప్తిపడిపోయినై గదా! ఇక పితృ దేవతలకు లోటా, అదేమీలేదు. అయినా, లోకాచారం ప్రకారం మళ్ళీ వంటచేసి శ్రాద్ధం గడుపుకుందాం" అని అన్నాడు ఆ భక్త విప్రుడు.

ఆ తరువాత కొద్దికాలానికే వారి కొక పుత్రుడు కలిగాడు. జాతకాలు తెలిసిన వారంతా ఆ జాతకం చూసి తల్లక్రిందులైపోయారు. సాముద్రికం తెలిసినవారు ఆ పసికందు పాదాల్లోని అద్భుత చిహ్నాలు చూసి తబ్బిబ్బైపోయారు. చివరకు, పాద చిహ్నాలనుబట్టే, ఆ పిల్లవాడికి 'శ్రీపాదు'డని పేరు పెట్టారు. తల్లితండ్రులు.

ఆ పిల్లవాడు శుక్ల పక్షపు చంద్రుడిలా ఎదిగి వచ్చాడు. ఏడవ ఏట వడుగు చేసి వేదాధ్యయనంలో పెట్టారు. అన్నీ ముందే వచ్చినవాడికి ఈ చదువుల నాటకం యెంత సేపు ఇతనికి పాఠాలు చెప్పలేక గురువులు తల్లక్రిందులయ్యేవారు. చతుర్దశ విద్యలూ ఆ బాలుడి వెంటపడి తిరిగినై.

మెల్లగా పెళ్ళి సంబంధాలు చూడసాగారు, తల్లితండ్రులు. అది చూసి శ్రీపాదుడు వారితో "అమ్మా నాన్నా! మీరా ప్రయత్నం పెట్టుకోకండి. భూమిమీదగల స్త్రీల నందరిని తల్లుల్లాగా భావిస్తున్నాను. యోగినై, తపస్వినై ఉత్తమమార్గ మవలంబించడమే నా కోరిక. నా వల్ల మీరు కూడ ధన్యులవుతారు. న న్నభ్యంతర పెట్టకండి" అన్నాడు.

అది విని ఆ తల్లి గుండె గుభేలు మంది. అయినా, స్వామి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చి తను కాదంటే వెళ్ళిపోతాడని భయపడి కళ్ళనీళ్ళు పెట్టుకొని యిలా అంది:

"నాన్నా! నీమీదనే కదా మేం ఆశలు పెట్టుకున్నది. మేమా కాటికి కాళ్ళు చాచు కున్నాం. నీ అన్నలా అట్లా ఉన్నారు. నువ్వేదో ఆధారమవుతావని ఆశ పడుతూంటే మమ్మ ల్నిలా నట్టేట ముంచి పోతావా?"

అది విని శ్రీపాదుడు నవ్వి అన్నల వంక చూసాడు. ఆ చూపులలో యేమి అమృతా లున్నాయో, ఎవరికి తెలుసు? తక్షణంలో కుంటి అన్నకు కుంటితనం పోయింది. గ్రుడ్డి అన్నకు చూపు వచ్చింది. అంతేకాదు, ఇద్ద రికీ విద్యావివేకాలు తక్షణం ప్రకాశించినాయి. వారిద్దరూ వచ్చి తమ్ముడిలో స్వామి రూపం చూసి, పాదాల మీద వ్రాలారు.

శ్రీ పాదుడు తల్లితండ్రులవైపు తిరిగి, "అమ్మా, నాన్నా! అన్న లిద్దరూ విద్వాంసు లయ్యారు. వారి వంశం అంతా ధర్మప రాయణమే అవుతుంది. సుఖంగా ఉంటుంది. ఇక మీకు భయం లేదు. ఇక నాకు సెల విప్పించండి" అన్నాడు.

వారు అతని మాటలకు ఎదురు చెప్పలేక పోయారు.

స్వామి తక్షణం బయలుదేరి తీర్థాటనం చేస్తూ దారిన బహుకాలంగా తన్ను సేవి స్తున్న భక్తుల కనేకులకు యోగసిద్ధిని ప్రసా దిస్తూ, బదరికాశ్రమాన్ని దర్శించి, చివరకు గోకర్ణక్షేత్రం చేరాడు. అక్కడ మూడేళ్ళుండి వేలాది భక్తులను ఉద్ధరించి, మళ్ళీ బయలుదేరి శ్రీశైల మహాక్షేత్రానికి చేరాడు.

స్వామి శ్రీశైలంలో నాలుగు నెలలుండి మెల్లగా కృష్ణా తీరాన్ననుసరించి, రాయచూ రికి దగ్గరలో గల 'కురుగాడి' అనే గ్రామం చేరాడు.

ఇక ఆయన అక్కడే స్థిరంగా నిలిచిపో యాడు. అక్కడ ఆయన చేసిన భక్తరక్షణ లీల లనేకం.

ఒకప్పుడు ఒక భక్తుడు స్వామికి సమ ర్పిద్దామని కొన్ని వేల రొక్కం తీసుకొని వస్తూంటే, దారిలో దొంగలు అతని తల బద్ధలుకొట్టి, చంపేసి, డబ్బు లాక్కున్నారు. అప్పుడా స్వామి స్వయంగా శూలధారియై వచ్చి, ఆ దొంగల్ని స్వయంగా సంహరిం చటమే కాక, చచ్చిన భక్తుణ్ణి తన భస్మ ప్రభావం చేత మళ్ళీ బ్రతికించాడు.

ఒకప్పుడు ఒక చాకలి భక్తుడు తన్ను విశే షంగా సేవిస్తూ లోలోపల తన దారిద్ర్యానికి బాధపడుతూంటే, వాడికి మహారాజత్వం వరంగా ఇచ్చాడు స్వామి. దానికి వాడు స్వామి సాంగత్యం లేకుండా పోతుందని బాధపడితే, మరుజన్మలో ఆ మహారాజత్వం వచ్చేటట్టూ, తను అప్పుడు కూడా వేరే అవతారం ఎత్తి వాడికి దర్శనం యిచ్చేటట్టూ వరం ఇచ్చాడు.

ఇలా ఎన్నని చెబుతాం!

అన్నిటికన్నా చిత్రం ఒకటుంది. ఒక రోజున స్వామి కృష్ణా తీరంలో ఉండగా, ఒక ముసలి విధవావిడ, దున్నలాంటి యువకుడు ఒకడు, ఏడుస్తూ యేట్లోకి నడుస్తున్నారు.

అంతలో స్వామి దృష్టి వాళ్ళమీద పడింది. ఇక నేముంది, వాళ్ళ దృష్టికూడా స్వామి మీదపడింది.

వారు ఒక్కక్షణం తటపటాయించి, వెనుకకు వచ్చి స్వామికి నమస్కరించారు. "అయ్యా! తమరు మహాత్ములు, దైవస్వ రూపులు. మేము తెలిసి, తెలిసి గతిలేక ఆత్మహత్యకు ఒడిగడుతున్న పాపులం. మాకు సద్గతి కలిగేట్టు వరం ఇవ్వండి" అంది ముస లావిడ.

స్వామి నవ్వాడు.

"దానికేమిగాని, ముందీ ఆత్మహత్యకు కారణం చెప్పండి" అన్నాడు స్వామి.

ముసలావిడ తన గోడు చెప్పింది.

ఆవిడ భర్త మహావిద్వాంసుడట. లేక లేక ఆ ప్రక్కమున్న వాడు, వాళ్ళకు కలిగాట్ట. కాని వాడుట్టి శుద్ధ మొద్దట. వీడి దిగులుతోనే తండ్రి గతించాట్ట. కనీసం ముష్టెత్తుకో వడమైనా చాతకాని కొడుకు కోసం ఈ ముసలావిడ తన వైధవ్యాన్ని కూడా మరచి, వీడికోసం ముష్టెత్తుకోవల్సి వస్తోందట. ఊరి వారంతా పిల్లి తెగ తిట్టిపోస్తున్నారట. ఆ బాధ పడలేక తల్లీ, కొడుకు యిద్దరూ ఆత్మహత్య చేసుకుందామని నిశ్చయించుకు న్నారట. అదీ కథ. అంతా చెప్పి, ఆ తల్లి మొత్తుకుంటూ, "స్వామీ! పుడితే మీలాంటి కొడుకు పుట్టాలి. లేకపోతే గొడ్డుమోతుగానే చావాలంతేగాని, పాడు సంతానం ఎందుకు? స్వామీ! నా కిదొక్కటే ఈ జన్మలో వాసనా శేషం. నాకు వచ్చే జన్మలో అయినా విశ్వమ ద్యుడైన పుత్రుడు కలిగేట్టు అనుగ్రహించు. నాకిక మరణించడానికి అనుమతి ఇవ్వు" అంది.

అదివిని స్వామి నవ్వి

"అమ్మా! దీనికింత ఖంగారెందుకు: శని ప్రదోష శివారాధన వ్రత'మని ఒకవ్రతం ఉంది. ఆ వ్రతం ఆచరించబట్టే కదా, పూర్వం యశోదమ్మ కృష్ణ భగవానుణ్ణి కన్నది. కనుక నువ్వు ఆ వ్రతం చెయ్యి. నాలాంటి కొడుకే పుడతాడు నీకు" అన్నారు.

స్వామి భవిష్యత్తు సూచనగా చెబుతు న్నాడు. ఆ సంగతి ఆవిడకూడా గ్రహించింది. కాని ఆవిడకు దుఃఖం ఆగక మరణిస్తానని అంటోంది. దాంతో స్వామికి కరుణ పొంగి ఆ మొద్దబ్బాయి నెత్తిన చెయ్యిపెట్టారు.

తక్షణమే వాడు చతుర్వేదమంత్రాలు ధారాపాతంగా పఠించసాగాడు. తల్లి నివ్వెర బోయింది. స్వామి పాదాల మీద వ్రాలింది. స్వామితల్లి కొడుకు లిద్దర్నీ ఇతోధికంగా దీవించి శని ప్రదోష పూజ మరచిపోవద్దని హెచ్చరించి పంపేశాడు.

అలా అద్భుతాలన్నీ ప్రదర్శిస్తున్న ఆ స్వామిని సాక్షాద్విష్ణు స్వరూపుడిగా గ్రహించి, జనం అంతా 'శ్రీపాద శ్రీవల్లభు'డని పిలువ సాగారు.



## అఖండ ఆరాధనోత్సవం

తిరుపతి శ్రీ మారుతీ త్యాగరాజ గానసభవారి ఆధ్వర్యంలో స్థానిక కపిల తీర్థంరోడ్డులోని శ్రీ ఆంజనేయస్వామి ఆలయంలో 94 సెప్టెంబరు 25, 26 తేదీలలో శ్రీ సద్గురు త్యాగరాజస్వామి వారి త్రయోదశ వార్షిక అఖండ ఆరాధనోత్సవాలు జరిగాయని పై సంస్థ అధ్యక్షులు శ్రీ ఎ. నాగరాజాచార్య తెలియజేశారు.

సెప్టెంబరు 24వ తేదీ సాయంత్రం 6 గంటలకు జరిగిన సభలో ప్రసిద్ధ సంగీత విద్వాంసులు, తి.తి.దేవస్థానం సంగీతకళాశాల ప్రిన్సిపాల్ శ్రీ నూకల చినసత్యనారాయణ సంగీతకచ్చేరి జరిగింది. వీరికి శ్రీ పుదుక్కోటై రామనాథన్ & వయొలిన్ పైనా శ్రీ. ఎం.వి. ఉదయశంకర్ మృదంగంపైనా సహకరించారు. ఈ సభలో ముఖ్యఅతిథిగా పాల్గొన్న కేంద్రీయ విద్యాపీఠం వైస్‌ఛాన్సలరు డా॥ యస్.బి. రఘునాథాచార్య




శ్రీ నూకల చినసత్యనారాయణను "సంగీత సార్వభౌమ" బిరుదుతో సత్కరించారు.

సెప్టెంబరు 25వ తేదీ ఆదివారం ఉదయం 6 గంటలకు శ్రీ త్యాగరాజస్వామివారికి పంచామృతాభిషేకం పూజలు జరిగిన అనంతరం ఊరేగింపు జరిగింది. శ్రీ త్యాగరాజస్వామివారి చిత్రపటం ఊరేగింపుతోపాటు, శ్రీ నూకల చినసత్యనారాయణ త్యాగరాజు వేషంలో పాల్గొనటం విశేషం. ఈ ఉత్సవంలో ఎందరో అనేకులు విద్వాంసులు పాల్గొన్నారు. పిదప ఉదయం 8 గంటలకు ప్రారంభమైన అఖండ త్యాగరాజ సంగీతకచ్చేరి మరునాడు 26వతేదీ ఉదయం 8 గంటల వరకు నిరవధికంగా 24 గంటలపాటు కొనసాగింది. ఈ అఖండగానంలో ఆచార్య పశుపతి, శ్రీ వి.యల్. జానకిరామన్, శ్రీ బాలకృష్ణప్రసాద్ ఇతర అన్నమాచార్యప్రాజెక్టు కళాకారులు, సంగీతకళాశాల విద్వాంసులు, మహిళావిశ్వవిద్యాలయంలోని సంగీతశాఖవారు అనేకులు పాల్గొన్నారు. చివరగా పూజ మంగళ హారతులలో ముగిసిన ఈ కార్యక్రమంలో ప్రసంగిస్తూ కావలసిన సౌకర్యాలు కలిగించిన తి.తి.దేవస్థానం వారికి శ్రీ ఎ. నాగరాజచార్య కృతజ్ఞతలు తెలియజేశారు.

## శ్రీనివాస పవిత్రమాల

తిరుమలలోని ఓంకార నిలయం భక్తసమాజంవారు "శ్రీ శ్రీనివాస పవిత్రమాల" అనే దీక్షావ్రత నియమముతో శ్రీ వేంకటేశ్వరస్వామివారిని నెలరోజుల పాటు ఉపాసించే కార్యక్రమం చేపట్టారు.

ఈ కార్యక్రమం 13-12-94న ప్రారంభమై శ్రీ వైకుంఠ ఏకాదశి మరుసటి ద్వాదశి రోజైన 12-1-95న సమాప్తం అవుతుందని వారొక ప్రకటనలో తెలిపారు.

ఈ వ్రతదీక్షలో పాల్గొనదలచిన భక్తులు ఈ క్రిందిచిరునామాకు సంప్రదించి వివరాలు తెలుసుకొనవచ్చును.

ఓంకార నిలయం
టి.టి.బి. 77
తిరుమల - 517 504

## గోవిందమాల

12-1-95 వైకుంఠ ఏకాదశికి 60 రోజులు లేదా 42, 30, 21, 7 రోజులు ముందుగా గోవిందమాల వ్రతం ప్రారంభ మవుతుందనీ, 11-1-95న గోవిందరాజస్వామి ఆలయంలో "యాగ పూజ"తో కంకణములు ధరిస్తారనీ 12-1-95న తుంబురు తీర్థంలో వ్రతం ముగుస్తుందని కార్యదర్శి ఓ ప్రకటనలో తెలిపారు.

వివరాలకు :
కార్యదర్శి
గోవిందమాల భక్తసమాజం
నెం.2, టి.టి.డి. మొదటి కొత్త సత్రం
తిరుపతి.



# రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే

శ్రీ గొడవర్తి శ్రీరామమూర్తి
(తి.తి.దేవస్థానం ధర్మకర్తల మండలి సభ్యులు)

వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన
వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి.

వేంకటాచలానికి సమానమైన క్షేత్రం బ్రహ్మాండంలో మరొక్కటిలేదు. వేంకటేశ్వరునితో సమానమైన దైవం ఇంతకుమునుపు లేదు, ఇకముందు వుండబోదు-- అంటూ ఈ క్షేత్రాన్నీ, ఇక్కడ నెలకొనివున్న దైవతాన్ని పెద్దలు కీర్తించారు.

వేంకటాద్రిని గురించిన ప్రశంస బ్రహ్మాండ వరాహ భవిష్యోత్తరాది పురాణాలలో కన్పిస్తుంది. ఆళ్వారులు నాలాయిర దివ్య ప్రబంధంలో పాపాన్ని దహించే ఈ తిరువేంగడం యొక్క మహిమనూ, శ్రీనివాసుని ప్రభావమునూ మిక్కిలి శ్లాఘించారు. వేదాంత దేశికులు శ్రీనివాసుని కరుణ అనే చెరకురసం కలకండగా ఘనీభవించి తిరుమల రూపంలో ఉన్నదన్నారు. ఇక్కడి పశువులు, పక్షులు, వృక్షాలు దేవతాస్వరూపాలే అనీ, వేదాలే ఈ పర్వతశిలలై వెలుగులు చిందుతున్నాయనీ అన్నమాచార్యులవారు శేషగిరిని వర్ణించారు.

సర్వదేవతా సమన్వయ స్వరూపుడైన శ్రీవేంకటేశ్వరస్వామి వారిని వర్ణమత విభేదం లేక ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు-- ఇలా సకల జనులు తండోపతండాలుగా వచ్చి నిత్యం సేవిస్తుంటారు.

సర్వధర్మాన్ పరిత్యజ్య
మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః.

--మోక్షసాధనాలైన సకలోపాయాలనూ వదలి నన్నొక్కణ్ణే శరణుపొందు. నేను సకల పాపాలనుంచి నిన్ను విముక్తుణ్ణి చేస్తాను. దుఃఖించవద్దు-- అని అర్జునుణ్ణి ఓదార్చిన శ్రీకృష్ణ పరమాత్ముడే ఈ రూపంలో ఇక్కడ వెలసి భక్తజనానీకానికి సకల సౌభాగ్యాలు ప్రసాదిస్తున్నాడు. అఖిలాండనాయకుడైన శ్రీనివాసుడు తన పాదాలు ఆశ్రయించినవారికి సంసారం నడుములోతే సుమా అంటూ అభయహస్తముద్రతో, కటి హస్త ముద్రతో భక్తులకు కనువిందుచేస్తూ అండదండలుగా నిలిచివున్నాడు.

బ్రహ్మదేవుడు ప్రారంభించిన నవరాత్ర మహోత్సవాలు సుఖప్రదమైన శరత్కాలంలో ఏటేటా స్వామివారికి వైభవోపేతంగా జరు



గుతూనే వున్నాయి. లక్షలాది భక్తులు అనువత్సరం ఈ ఉత్సవ దినాల్లో వచ్చి శ్రీస్వామివారిని సేవించుకుంటూ వుంటారు. ఈ ఉత్సవాలలో ప్రశస్తమైన గరుడసేవ, రథోత్సవం తిలకించి ప్రజలు ధన్యులవుతుంటారు.

తిరుమల తిరువీథులలో దేవేరులతో శ్రీస్వామివారు తిరుగాడే మంగళప్రదమైన రథోత్సవం దర్శించడానికి రెండుకండ్లు చాలవు.

రథస్థం కేశవం దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే.

--రథంలో వేంచేసియున్న శ్రీవేంకటేశ్వరుని దర్శించినవారికి పునర్జన్మ వుండదు. మన జీవితాలకు సాఫల్యం కల్గించే పుణ్యమైన రోజది. ఆనందకందమైన శుభదిన మది.

కలియుగ ప్రత్యక్ష దైవం శ్రీవేంకటేశ్వరుడు.

కరుణా స్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు.

ఆశ్రితుల అభీష్టాలు నెరవేర్చే కల్పవృక్షం, కామధేనువు శ్రీ వేంకటేశ్వరుడు.

సకల కష్టాలు నివారించి శాంతి సౌఖ్యాలిచ్చే భగవంతుడు శ్రీ వేంకటేశ్వరుడు.

ఎన్ని మార్లు సేవించినా, ఎన్నిసార్లు దర్శించినా తృప్తి కలిగించని అమృత స్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు.

ఇట్టి మహానుభావుడు గనుకనే--

శ్రీ శ్రీనివాసః కులదైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమం ధనం నః
శ్రీ శ్రీనివాసః పరమాగతి ర్నః

శ్రీనివాసుడే మన కులదైవం. శ్రీనివాసుడే మనకు నిధి నిధానాలు. శ్రీనివాసుడే మనకు దిక్కు అంటూ ఆ మహాస్వామిని విశ్వసించి మనం భక్తితో కొలుస్తుంటాము.

స్వామీ! నీ పాదపద్మాలకు నమస్కారంచేసి నీకు సేవచేయాలనే కోరికతో దూరతీరాలనుంచి వచ్చాను. నీవు నిత్యసేవకు ఏ ఫలం అనుగ్రహిస్తావో ఆ ఫలమే జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు నేను చేసిన స్వల్పసేవకు అనుగ్రహించు.

మహాప్రభూ! అజ్ఞానకృతమైన నా దోషాలను మన్నించు అంటూ మనం ఆ లోకస్వామిని వేడుకుందా ము. ☆



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం
# తిరుచానూరు

## నిత్యపూజానివేదనలు

సుప్రభాతం: ఉ. 5-00 గం. నుండి 5-30 గం. వరకు
సహస్రనామార్చన: ఉ. 5-30 గం. నుండి 6-00 గం. వరకు
శుద్ధి, మొదటిగంట: ఉ. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: ఉ. 6-30 గం. నుండి 11-30 గం. వరకు
శుద్ధి, రెండవగంట: ఉ. 11-30 గం. నుండి 12-00 గం. వరకు
సర్వదర్శనం: మ. 12-00 గం. నుండి సా. 6-00 గం. వరకు
శుద్ధి, మూడవగంట: సా. 6-00 గం. నుండి 6-30 గం. వరకు
సర్వదర్శనం: సా. 6-30 గం. నుండి రాత్రి 8-45 గం. వరకు
శుద్ధి రాత్రి 8-45 గం. నుండి 9-00 గం. వరకు
ఏకాంతసేవ: రాత్రి 9-00 గం. నుండి 9-30 గం. వరకు

## శుక్రవారాలలో

అభిషేకం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(రూ. 100-00 టిక్కెట్‌తో ఒక్కరికి మాత్రమే ప్రవేశం)*
అభిషేక దర్శనం: ఉ. 9-00 గం. నుండి 10-00 గం. వరకు
*(ఒక్కొక్కరికి రూ. 5-00 టిక్కెట్)*

## ఆర్జిత సేవలు

| | | |
|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం | ... | రూ. 63-00 |
| గజవాహనం | ... | రూ. 32-00 |
| తిరుప్పావడ | ... | రూ. 3000-00 |
| డోలోత్సవం | ... | రూ. 150-00 |

## ఆర్జిత ప్రసాదాలు

| | | |
|---|---|---|
| దోసె | ... | రూ. 100-00 |
| దధ్యోదనం | ... | రూ. 75-00 |
| పులిహోర | ... | రూ. 100-00 |
| పొంగలి | ... | రూ. 200-00 |
| చక్కెర పొంగలి | ... | రూ. 200-00 |
| కేసరి బాత్ | ... | రూ. 300-00 |
| శాకరిబాత్ | ... | రూ. 250-00 |
| సీరా | ... | రూ. 400-00 |

*ఇవేగాక, భక్తాదులు రూ. 1-50 టిక్కెట్‌తో తమ గోత్ర, నామాదులతో అమ్మవారికి అష్టోత్తరశతనామ పూజ చేయించవచ్చును.*

(గత సంచిక తరువాయి)

పలికెను విభీషణుండు విస్పష్టభంగి
“అరయ రామచంద్రుండు మహారథుండు
శక్తు డంచిత రఘువంశ సంభవుండు
అతని గెలువ నెవ్వరికి శక్యంబు కాదు.

రావణుం డింద్రజిత్తును రాక్షసాళి
కుంభకర్ణుండును నికుంభ కుంభులేని
జానకీవల్లభున కెందు సాటిరారు;
దుర్నివారంబు రామభద్రుని శరాళి.

రావణుసుతుండు సమరదుర్జయు డత
మేఘనాదుడు దౌష్ట్యము మేరమీర
భాషణ మొనర్చినంత, విభీషణుండు
పలికె నిట్లు మరొకమారు తెలియజెప్ప.

“బాలుడవు ప్రేలుచుంటివి ప్రల్లదాలు
మూఢుడవు బుద్ధి పక్వత పొందలేదు
రాక్షసాన్వయనాశము రాముచేత
కలిగెడి నటంచు చెప్పగ తెలిపె మాకు.

# రావుల రామాయణము

ప్రోత్సహింతు రదేటికో పూని సఖులు
అతని వారించుటకు మారు అనికి నెపుదు
స్వీయబల మెంచి మీరు వచింపుడయ్య!
రాక్షసకుల రక్షణమును రాజహితము.”

విమలమతి బృహస్పతి ఆ విభీషణునకు
ఇట్లు వచియించె బాలిశుం డింద్రజిత్తు
“నీచత వచింపగా నీవు, చూచుచుంటి
భీతులను జేయ మమ్ముల నీతి యగునె?

త్రిభువనేశు పురందరు, దేవపతిని
నేలపై పడద్రోయంగ ఆలమందు
పరుగుదీసిరి నను గాంచి సురలు భీతి
నాకు లెక్కయె హీనుల, నరుల గెలువ?”

ధర్మశీలుడు శౌర్యనిధాన మతడు
వింటి నెక్కిడ ఎదురొడ్డు వీరు డెవడు?
జనకజాతను రామచంద్రున కొసంగి
మేలు గాంచుద మికనైన మేఘనాద!”

కాలమహిమ! రావణు డనె కాంచి అనుజు
“జ్ఞాతు లెప్పుడు క్రూరులు స్వార్థపరులు
లోభి! సైపకున్నావు నా వైభవమ్ము
దూరముగ నాకు నీ విక తొలగిపొమ్ము.”

వెంట నల్వురురాగ విభీషణుండు
ఎగసి గగనంబునకు అన్న కిట్టు లనియె
“హితము చెప్పంగ నీవు గ్రహింపవైతి
పోయివచ్చెద శుభమును పొందుమయ్య.”

డాక్టర్
రావుల సూర్యనారాయణమూర్తి

రాము డున్నట్టి చోటికి రాగ నతడు
మేరుశిఖరమ్ము కైవడి మింట మెరయు
దైత్యు నరపి సుగ్రీవుడు త్వరితగతిని
తనదు సేనకు చూపె నుత్తర పుదిశను.

శాత్రవుగ నెంచి వారట చర్చ సలుప
వినిచె నిట్లు సౌమ్యుండు విభీషణుండు
"సోదరుండను రావణాసురున కేను
అరుగుదెంచితి రాముని శరణువేడ."

కాంచి రామచంద్రుని వచియించె నిట్లు
వానరపతి సుగ్రీవుడు వాక్యవిదుడు
"మనల చంపవచ్చె నితండు మాయచేత
దండన మొసంగ మేలని తలతు నేను."

ప్రముఖవానరులం గాంచి రాఘవుండు
వినుత సత్య పరాక్రమధనుడు పలికె
"ఇట్టి సమయాల మిత్రుల హితము వినుట
మేలుగ దలంతు; చెప్పుడు మీర లింక."

అమితహర్షమ్ముతో కపులాడి రిద్ది
"తమదు సౌహృదమునకు నిదర్శనమ్ము
పరమధర్మాత్ముడవు నీవు పంకజాక్ష!
నీ వెరుంగని దేది ఈ నిఖిలజగతి?"

అంగదుడు జాంబవంతుడు అమితభక్తి
పలికి రిట్టులు శ్రీరామభద్రు గాంచి
"కీడు సేయు రిపుల పరీక్షింపవలయు
వెంటనే తగ దీతని విశ్వసింప."

ఆంజనేయుడు మధురవాక్యాల నుడివె
"రామ! బుద్ధి నెవ్వరు సరిరారు నీకు
తోప దాతని ముఖములో ద్రోహచింత
ఆతని స్వీకరించుట యుక్త మని తలంతు."

సమ్మతి రఘురాముడు సుప్రసన్ను డనియె
"వైరియో దుష్టుడో నన్ను కోరి రాగ
వా డెవదు కాని వీడని వ్రతము నాది"
అంత సుగ్రీవు డనియె భాష్యంబు సలిపి.

"కష్టకాలాన అన్ననే కరుణమాలి
విడ నీత డింకెవ్వని కూడి మనును?"
అంత రామభద్రుదు మందహాస మొలుక
అతనితో దెల్పె సూక్ష్మరహస్య మిట్లు.

"జ్ఞాతులను దెబ్బతీతురు సమయ మెరిగి
ధారుణీశులు నమ్మరు వారి నెపుడు;
రావణుని లంక మనము కోరంగలేదు
కాంక్ష ఆతని కట్టిది కలిగె నేమొ?

తెగువ రాజ్యాశ వచ్చిన దీర్ఘదర్శి
పండితుడు కాన మనకు గ్రాహ్యుం డితండు
భ్రాత కీతడు నిజముగా భీతినంది
వచ్చినట్టులు తోచును స్వరము వినగ.

దైత్యు డిత డన్నవీడిన ధర్మమరయు
భ్రాతలందున భరతుని వంటివాడు
పితకు ననువంటి ప్రేమంపుసుతుడు
హితుడు
నీకు సాటి మిత్రుడు లేరు నిఖిల జగతి."

తోడనే లక్ష్మణస్వామితోడ లేచి
విన్నవించె సుగ్రీవుడు విభున కిట్లు
"పంపగా భ్రాత ఏతెంచె; చంపు మనల
రాక్షసుని చంపగాదగు నీక్షణంబె."

మరల రామభద్రుడు పద్విమర్శ చేసి
వానరపతి సుగ్రీవుతో పలికె నిట్లు
"ఈతని గుణాగుణము లవి ఎట్టులున్న
చీమకాలంత అపకృతి చేయలేడు.

చాలు క్షణము నా చిటికెన వ్రేలితోడ
దనుజ దానవ యక్ష సంచయము చంప
గౌరవింపగ వలసిన తీరు తెలుపు
పరమశాత్రవు నేన్ని, పావురపు గాథ.

మున్ను తనపెంటి వధియించి బోయవాడు
శరణమంద కపోతంబు పరమకరుణ
స్వీయ మాంసరక్తాలతో న్యాయ మొప్ప
వ్యాధు నాకలిదీర్చి మర్యాద సలిపె.

అనుపమ తపస్వి కణ్వమహర్షి సుతుడు
కందుమౌని రచించిన కణ్వగీత
'శరణుకోరగ సాయము సలుప డెవడొ
పుణ్య మతనిది శరణార్థి పొందు' ననియె.

దాని పాటింతు కాన సత్కార మొసగ
ఆ విభీషణు కొనిరమ్ము ధీవిశాల!

శరణు జొచ్చినచో బద్ధశత్రు వనక
అట్లె రావణాసురునేని ఆదరింతు."

వానరపతి సుగ్రీవుడు పలికె నిట్లు
"రామ! లోకనాథుడవు ధర్మజ్ఞు డీవు
సహజదయతోడ జూతువు సర్వజనుల
అమలుడు విభీషణుం డంచు ఆత్మ తెలుపు."

అభయమంది నల్వురు భృత్యు లనుసరింప
ధరణిపై డిగ్గి రాఘవు చరణములకు
భక్తి నొనరించి సాష్టాంగ వందనమ్ము
పలికెను విభీషణుండు ప్రపన్ను డగుచు.

"రావణుండు లంకేశుడు భ్రాత నాకు
వచ్చినాడను నాదు సర్వమ్ము వీడి
రాఘవా! సర్వభూతశరణ్యు నిన్ను
శరణు వేడంగ; ఆతడు పరిభవించె.

అనియె శ్రీరాము డాతని ననునయించి
"తెలుపు మిక రావణుని బలాబలము లెల్ల"
భీతి విడనాడి ఘనుడు విభీషణుండు
తేట పరచె శ్రీరాముడు తెలిసికొనగ.

"ప్రాణికోటి కవధ్యుడై ప్రబలు నట్లు
రావణుండు విరించి వరాల నందె
రావణుని తమ్ము డాత డగ్రజుడు నాకు
కుంభకర్ణుండు రణముల ఘోరబలుడు.

సైన్యపతి ప్రహస్తుడు మహాశక్తిశాలి
మేఘనాదుడు దశముఖు మేటికొడుకు
తాను కానరాకుండ శాత్రవుల గూల్చు
వరముగనె అగ్నిహోత్రునివలన నితడు.

కామరూపులు లంక రక్కసులు తలప
మేటి శౌర్యశాలులు పదికోటు లరయ
రావణుండు భంజించె సంగ్రామమందు
సురల; లోకపాలుర గెల్చె సులభసరణి."

సర్వ మూహించి శ్రీరామచంద్రు డనియె
"సకలబంధుసమేతుని చంపకుండ
రావణుని, నిన్ను సలుపక రాజుగాగ
తిరిగి వెడలను సాకేతపురికి నేను."

(సశేషం)



## హిందీ తెలుగు సాహిత్యాలలో

# భ్రమరగీత పరంపర

డా॥ ఎం.బి.వి.ఐ.ఆర్. శర్మ

మద్భాగవతంలోని దశమ స్కంధంలో 47వ అధ్యాయంలో ప్రప్రథమంగా 'భ్రమరగీత' ప్రసంగం ఉంది. అందులో శ్రీకృష్ణుని మిత్రుడైన ఉద్ధవుడు ఒకరోజున కృష్ణుని కలుసుకుంటాడు. ఇష్టాగోష్ఠి అయిన తరువాత కృష్ణుడు తన మిత్రుని ద్వారా వ్రజభూమియందున్న యశోదానందులకు, గోప గోపీ జనానికి ఒక సందేశం పంపుతాడు. ఉద్ధవుడు గొప్ప జ్ఞాని, నిర్గుణోపాసకుడు, యోగాభ్యాస రతుడు. అతడు ముందుగా నందునివద్దకేగి శ్రీకృష్ణుడు పరమాత్మ అనీ, సమస్త జీవాత్మల యందు తానే ఉన్నాడనీ, ఆయనకు ఉత్తమ, అధమ సమ అనే భేద భావం ఏమీ లేదనీ, ఆయనకు తల్లిదండ్రులుగాని, మిత్రులుగాని, శత్రువులుగాని, ప్రియులుగాని, అప్రియులు గాని ఎవరూలేరనీ, సత్త్వరజోతమో గుణములతో సంబంధం ఏమీ లేదనీ, ఆయన సమస్త భూతములయందు వ్యాపించి ఉన్నాడనీ, అందువలన ఆయన వియోగం వలన దుఃఖించటం అజ్ఞానమనీ చెప్తాడు.

తరువాత ఉద్ధవుడు గోపికల దగ్గరకు వెళ్తాడు. కృష్ణుని వలెనే నీలమేఘ వర్ణం కలిగిన శరీరం, కృష్ణునివలెనే వేషభూషణాలు ధరించిన ఉద్ధవుని చూచి గోపికలు ఉత్సుకతతో అతని చుట్టూ చేర్తారు. తమ ప్రియుని యోగక్షేమాలు తెలుసుకోవాలని వారు తహతహ లాడ్తారు. కృష్ణుడు వ్రజ భూమిలో ఉండగా అతనితో కలిసి గడపిన ఆనందకరమైన రోజులను జ్ఞాపకం చేసికొని, ఆయన గుణగణవర్ణన చేస్తూ వారు విలపిస్తారు. ఆ సమయంలోనే ఒక భ్రమరం ఎక్కడనుంచో ఎగురుతూవచ్చి గోపికల ముఖ కమలాలచుట్టూ భ్రమణం చేస్తుంది. గోపికలు ఆ భ్రమరంలోనే కృష్ణునియొక్కయు, ఉద్ధవుని యొక్కయూ సామ్యాన్ని చూచి, తమను ఇన్నాళ్లుగా వియోగ దుఃఖసాగరంలో ముంచిన కృష్ణునితో చెప్పవలసిన దెప్పి పొడుపుమాటలను ఆ భ్రమరాన్ని సంబోధించి చెప్తారు. ఆ భ్రమరం నిర్మోహి అనీ, నిష్ఠుర హృదయం కలిగినదనీ, దాని ప్రేమ ఉత్త బూటకమనీ ఉపాలంభాన మాటలు పలుకుతారు. విరహ విదగ్ధలైనవారి ఉపాలంబన పూరిత వాక్యాలే భ్రమరగీతలు. వీని ఉద్దేశ్యం జ్ఞానమార్గంకంటె ప్రేమ మార్గమే గొప్పదనీ, మస్తిష్కంకంటే హృదయమే గొప్పదనీ, నిర్గుణోపాసనకంటే సుగుణోపాసనయే శ్రేష్ఠమైనదని నిరూపించటమే. కాని భాగవతంలో భగవంతుడు నిరాకారుడనీ, నిర్గుణుడనీ ప్రతిపాదింపబడింది. జ్ఞాన, భక్తి, కర్మ, మార్గాలను సమన్వయ పరచటమే వ్యాసభగవానుని ఉద్దేశ్యం.

హిందీ సాహిత్యంలో భక్తకవి సూర్‌దాస్ రచించిన 'సూర్ సాగర్'లో 'భ్రమరగీత'కు ఒక విశిష్టమైన స్థానం ఉంది. అందులో కావ్య సౌందర్యంతోబాటు సగుణ భక్తి యొక్క ప్రాధాన్యతకూడా విశదపరుపబడింది. వానిలో అత్యంత స్వాభావికత, రోచకత, మార్మికత కనబడుతాయి. కేవలం సందేశం విన్నంతమాత్రంచేతనే గోపికలు శాంతించటం మనోవైజ్ఞానిక దృష్టితో చూస్తే చాలా అస్వాభావికంగా కనబడుతుంది. పైగా భాగవతంలో ముఖ్యంగా గోపికలు శ్రీకృష్ణుని దెప్పిపొడవటమే ఎక్కువగా కనబడుతుంది. వారి మాటలలో వారియొక్క



కృత శ్రీమద్భాగవతపురాణానికి అనుకరణ. ఇందులోగూడా భ్రమరగీత ప్రసంగం ఉంది. ఉద్ధవుని ఉపదేశం విన్న తరువాత గోపికలు విరహాతురలైనారు. కాని ఉద్ధవుడు శ్రీకృష్ణుని వద్దనుండి తెచ్చిన ఉపదేశాన్ని విని తమ విరహవేదనను మరచి పోయినారు. ఆ సందర్భంలో పోతన-- "అని దుఃఖార్ణవమగ్నం బయిన గోపకులంబునుద్ధరింపుము రమానాథయని గోపికలు వగచి తదనంతరంబయిన కృష్ణ సందేశంబువలన విరహవేదనలు విడిచి యుద్ధవునిం బూజించిరి" అని వ్రాశాడు. ఇది మూల గ్రంథానికి అనువాదం.

జ్ఞానపీఠ బహుమతి గ్రహీత స్వర్గీయ విశ్వనాథ సత్యనారాయణ సంస్కృత భాగవతంలోని భ్రమరగీతలను ఆధారంగా చేసికొని 'భ్రమరగీతలు' అనే ఖండకావ్యాన్ని నూరు పద్యాలలో వ్రాశారు. ఇందులో జ్ఞానమార్గం యొక్క విశిష్టతే ప్రతిపాదింపబడినదని వేరుగా చెప్పనక్కరలేదు. సమర్థుడైన ఈ కవి శ్లేషద్వారా గోపికాహృద్గత మధుర భావాలను చక్కగా విశ్లేషించి తన ప్రతిభతో తన మౌలికాభిప్రాయాలను ప్రదర్శించాడు. ఈ ఉద్ధవుడు పరమాత్మ తత్వాన్ని గోపికల ద్వారా తెలిసికుంటాడు. ఇది మూలంకంటె వేరైనభావం. శ్రీమద్భాగవతంలో చెప్పబడిన ఆధ్యాత్మిక విషయాన్ని కావ్య సౌందర్యమనే మూసలో పోసి దానికి ఒక క్రొత్తరూపాన్ని ఇచ్చాడు. వీరి గోపికలు భ్రమరాన్ని ఇట్లా దెప్పిపొడిచారు. "ఓ భ్రమరమా! ఓ శృంగారపురుషుడా! నీవు మా ఇండ్ల దగ్గరకువచ్చి ఎందుకు తిరుగుతున్నావు? నీవు ఉద్యానవనంలోకి పోయి అనేక సుకుమార కుసుమాల మకరంద మాధుర్యాన్ని ఆస్వాదించేవాడివి. గ్రామీణులమైన మేము నాగరికుల మోసాలను తెలిసికొనలేము. శ్రీకృష్ణుడు ఇదివరకే మమ్ములను మోసపుచ్చి మధురానగరానికి వెళ్లాడు. ఇప్పుడు ఈ సందేశాన్ని పంపించి ఇంకా మోసగించాలని తలుస్తున్నాడు. నగరవాసులు తమ ఆచార వ్యవహారాలలోను, వేషభూషణాదులలోను చాలా ఠీవి చూపిస్తారు. వారు గ్రామీణ ప్రజల హృదయాలలోని మార్దవాన్ని తెలిసికొనలేరు. మేము మోసపోకూడదు. నగరాలలో ఎందరో భోగ కాంతలు ఉంటారు. వారంతా కృష్ణునికి తగినవారే. వారిని వదలిపెట్టి మాదగ్గరకు ఈ సందేశం పంపటం మమ్ములను ఇంకా ఏడిపించటానికే.

"శ్రీకృష్ణుడు మమ్ములను వదలిపెట్టి మధురానగరానికి వెళ్లినప్పుడు మాకు చాలా దుఃఖం కలిగింది. విరహవేదనవల్ల మా హృదయాలు గాయపడినాయి. క్రమక్రమంగా ఆ గాయాలు మానటం ప్రారంభించినాయి. ఇప్పుడు ఈ ఉద్ధవునిద్వారా సందేశం పంపించి ఆ గాయాలమీద ఉప్పుచల్లాడు. అసలే మేము లజ్జా విహీనులమని అనుకొంటున్నాము. అందుకనే ఉద్ధవుని ఇక్కడకు రానిచ్చాము. మా భర్తలు వస్త్రధారణ నిరాడంబరంగా చేసికొంటారు. కృష్ణుడు ఇక్కడ ఉన్నప్పుడు వారివలెనే సాధారణమైన వస్త్రాలు ధరించేవాడు. కాని ఇప్పుడు నగరవాసి అయి అసాధారణమైన వస్త్రాలు ధరించటం ప్రారంభించాడు. ఈ ఉద్ధవుడు కూడా అట్లాగే ఆడంబరంగా వస్త్రాలు ధరించి వచ్చాడు.

అతనిని చూచిన తరువాత హృదయ భారము ఇంకా యెక్కువైంది. గర్విష్ఠియైన భ్రమరమా! శ్రీకృష్ణుడు అంధకారంలో ఉండి వేణువును వాయించి నప్పుడు ఆతని వంటరితనాన్ని పోగొట్టడానికి మేము ఆతని దగ్గరకు వెళ్లేవాళ్లం. అటువంటి మమ్ములను ఆయన మరచిపోయినాడు. ఆయన మా ఇండ్లలోదూరి, కుండలలోని పాలు వంచుకొని త్రాగుతూ ఉంటే మా అత్తలు వెళ్లి యశోదతో ఫిర్యాదులు చేసేవారు. యశోద అతనిని కొట్టకుండా ఉండటానికి అతనిని మేము రక్షించేవాళ్లం. కాని అతడు ఆ విషయాలన్నీ మరచిపోయినాడు. మేము కేవలం పల్లెటూరివాళ్లం. ఆయన మా హృదయాలలో ఎట్లా ప్రవేశిస్తాడు?

"కప్పపు మ్రోతలో శ్రుతినిగర్చి
ప్రభుండరు దెంచి పాడు నిం
డ్లప్పల సన్నగా తెలియునట్లు
సెల్లనగ్రోవి యూద మా
కప్పల నిప్పలందెలియు కక్కుట
వెన్నయు పడ్డ గుర్తులే
కప్పలనేమి యైతియెపుడయ్యది
యేమై పోయెషట్లదా!"

అటువంటి దశలో కృష్ణుడు మాపైన మన్మథబాణాలు వేసి మమ్ములను విరహపీడితులుగా చేశాడు. మమ్ములను దీనురాళ్లనుగాచేసి మధురానగరానికి వెళ్లిపోయినాడు. ఇదెమైన న్యాయమేనా? మేము రెంటికి చెడిన రేవడులమైనాము. ఆయనంటే మమ్ములను మరచిపోయినాడు, గాని మేము ఆయనను మరువలేకుండా ఉన్నాం. ఆయన గోధూళివేళ ధూళిధూసరిత శరీరుడై ఆవులను తోలుకొని ఇంటికి వచ్చేటప్పుడు ఎంత శోభాయమానంగా ఉండేవాడో ఆ రూపాన్ని మేము మరచిపోగలమా! మేము పెరుగు చిలికేటప్పుడు అలవాటుప్రకారం జారిపోయే మా పమిట చెంగులను సరిచేసుకుంటూ కృష్ణుడు ఎక్కడ ఉన్నాడా అని వెతికి వెతికి నిరాశచెందుతున్నాం. మా పమిట చెంగులు పట్టుకొనిలాగే ఆ కొంటె కృష్ణుడు ఇప్పుడు ఇక్కడ లేడుగదా! మేము విలపిస్తూ యశోద దగ్గరకు వెలితే పుత్రవియోగంతో ఆమె ఇంకా ఎక్కువగా రోదిస్తూ ఉంటుంది.

"మేఘాలు కారుచీకట్లు కమ్మి, మెరుపులు మెరుస్తూ, గర్జిస్తూ ఉండి కుండపోతగా వర్షం కురుస్తూ ఉంటే మేము అడవుల్లోకి పరుగెత్తుకు వెళుతున్నాం. ఎందుకో తెలుసా? నల్లని మేఘాలను చూస్తే మాకు ఆ నల్లనయ్య మేను జ్ఞాపకం వస్తుంది, వర్షపు ధారల ధ్వనులు వింటూ ఉంటే ఆయన మురళీ నినాదం వినవస్తుంది. కోయిల కుహూ కుహూలను విని కన్నయ్యే వాటిని పంపాడేమో అని మాకు అనిపిస్తూ ఉంటుంది. మధురమైన పిక కూజితములను విని మేము మా ప్రియుని తలచుకొని మైమరచి ఉంటే మా అత్తలు, భర్తలు కోపోద్రిక్తులౌతున్నారు. విరహతాపంతో ఒక ప్రక్క మేము దహించుకుపోతూ ఉంటే మరో ప్రక్క మా భర్తలు

(33వ పేజీలో)

ప్రశ్న:

నదులచరిత్రలు అనేక విధాలుగా వింటూంటాం. మాప్రాంతం గోదావరితీరం! ఆ నదిని గురించిన పురాణగాథ వుంటే వివరించగోరుతున్నాను.

--గుత్తుల సబ్బన్న
ఇసుకపూడిప్రాంతం.

# సందేహాలు? సమాధానాలు!

నిర్వహణ: ఎల్లోరా

సమాధానం:

ప్రతినదికీ ఒకపురాణగాథవుంది - గ్రామాలకు స్థలపురాణాలు వున్నట్లుగానే! కృష్ణకు ఓచరిత్ర, కావేరికి ఓగాథ, గోదావరికి మరో పురాణగాథ వున్నాయి.

ఒకానొక సమయంలో పెద్దకరువు సంభవించిందట. తినడానికి తిండికరువయిందట. ఆ సందర్భంలో మునులందరూ బయులుదేరి గౌతమముని ఆశ్రమానికి వచ్చారట - అక్కడి పరిస్థితులనుచూసి ఆశ్చర్యపోయారు. అంతటా కరువు విలయతాండవం చేస్తూంటే - ఎటుచూసినా పచ్చ రంగా మారిన పరిస్థితులలో - గౌతముని ఆశ్రమ పరిసరాలు మాత్రం పచ్చగా పెరిగి, పంటలు సమృద్ధిగా పండుతున్నాయట. దీనికికారణం లేకపోలేదు - గౌతముని తపశ్శక్తి పొందిన, సంపాదించిన వరప్రభావములే దీనికి కారణం అయివుంటుంది.

గౌతముని గొప్పతనం అంతా-వచ్చినవారికి దానంచేయడం, మృష్టాన్నభోజనంపెట్టడంలోనే వుంది.

ఒరులకలిమికి పొర్లి ఏడ్చేవాళ్లూ అప్పుడూ ఉన్నారు, ఇప్పుడూ వున్నారు- అటువంటివారు నరుడైనా నారాయణుడైనా, ఋషి అయినా మునీశ్వరుడైనా సుఖం వుంటుందని నేననుకోను.

అక్షరాలా అలాగే జరిగింది! మునుల్లోని కొందరు ఓర్వలేనితనంతో ఒక మాయగోవును సృష్టించిపంటనుమేసి భ్రష్టుపట్టించమని పంపారట - ఆమాయ గోవుచెప్పినట్లే చేనును మేసినంతమేస్తూ ధ్వంసంచేసేసింది - అది గౌతమునికంటపడింది - పచ్చని గౌతముని హృదయంలో మంటలు ప్రజ్వరిల్లాయి.

పాపం గౌతమముని గోవును కొట్టడానికి మనసొప్పక, మంత్రజలాన్ని గోవుమీద చల్లాడట. ఇంకేముంది రెండు జలబిందువులు ఒంటిమీదపడగానే గోవు గిలగిలలాడుతూచచ్చి నేల కూలిందట.

గౌతముని ఇంట భోజనాలకు కూర్చున్న ఈ మునులు అదనుచూసి - "ఛీ! ఛీ!! ఇలా గోవధ చేసినవాని ఇంట భోజనం చేయడం ఏమిటి? అంటూ లేచారుట!

ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ, ఏదో పెద్ద ఆలోచనచేస్తూన్నట్లు నటిస్తూ- 'గంగ'ను కనుక ఇక్కడకు రప్పించగలిగితే నీపాతకముపోతుం'దని సూచించారుట!

అప్పుడు గౌతముడు ఘోరతపస్సు చేయడం, శివుడు ప్రత్యక్షం అవడం జరిగిందట - ఏంకావాలో కోరుకోమని ఆ భోళా శంకరుడు అడగడం - గౌతముడు తన సమస్యను వివరించడం జరిగిందట.

శివుడు తన జటలోనుంచి ఒకటి తీసి ఇచ్చి - 'దీనిని పిండు, గోవు బ్రతుకుతుం'దని చెప్పాడట.

కావలసింది అదేకదా - గౌతమముని ఆప్రకారమే చేశాడట. వెంటనే గోవు బ్రతికి స్త్రీ రూపంలో వెళ్లిందనీ పురాణగాథ.

అయితే గోదావరి అనిపేరెందుకొచ్చిందంటే - గోవును బ్రతికించడం జరిగింది కనుక గోదావరి అనీ, గౌతముని కృషివల్ల జలసమృద్ధి కలిగింది కనుక 'గౌతమి'అనీ ప్రసిద్ధ నామాలుగా పిలువబడుతున్నాయి.

ప్రశ్న:

మన హిందూ సంప్రదాయంలో ఇన్ని రకాల దేవాలయాలు, ఇంతమంది దేవుళ్లూ, దేవతామూర్తులూ ఎందుకు? ఇతర మతాలలో ఒక్కరేకదా?

డి. నారాయణ,
బాపట్ల.

సమాధానం:

చూడండి! మన మతధర్మాలూ, ఆచరణలూ - క్రతువిధానంవేద, ఉపనిషత్, పురాణ విహితమైన ఆర్ష సంప్రదాయం.

ఈ సంప్రదాయం వేదకాలం నుంచీ విధివిహితంగా - అనూచానంగా - ఆచరింపబడుతూన్న మహోత్కృష్టమైన జ్ఞానోపాసనా సంహిత!

మన కుటుంబంలో ఒక్కరినేకని ఒక్కపేరుతోనే సంతృప్తిపడడంలేదు కదా? పుట్టిన పిల్లలందరికీ మనకు తోచిన - బాగున్న పేర్లుపెట్టి, గారాబంగా పిలుచుకోగాలేంది,

మన దేముడికి రకరకాల పేర్లు పెట్టి పిలుచుకుంటూ - స్మరించుకొంటూ - పూజించి భక్తికి, ముక్తికి మార్గాన్వేషణ చేయడంలో తప్పేమిటంటారు?

ఏమతాన్నో చూసి - మన సంప్రదాయాలకు, నమ్మకాలకు - ఆచరణకు తిలోదకాలు ఇవ్వవలసిన అవసరం ఏముందంటారు?

ఇంతకీ ఇన్నికోట్లజనానికి ఇంతమంది దేవుళ్లువుంటే తప్పేమిటి? చెప్పానుగా ఒకసారి - దేముడన్నవాడొక్కడే - అనేక నామాలతో పిలుచుకొంటున్నాం అంతే!

"ఏకం సత్ విప్రాఃబహుధా వదన్తి" - ఏ పేరున పిలిచినా, ఏతీరున కొలిచినా, ఏపూవున అర్చించినా - ఓయని పలికే సర్వాంతర్యామి ఒక్కడే! మీరు నమ్మిన ఆ ఒక్క దేముడినీ మీకు తోచిన పేరుతో పిలవండి-

మీపూజలను బట్టీ, మీ ఉపాసనా బలాన్ని బట్టి, మీ పూర్వజన్మ సుకృతాన్నిబట్టీ 'ఓ'యని పలకడం - నేనున్నానని కనిపించనిరూపంలో - వినిపించని శబ్దంలో దర్శనభాగ్యం కలగడం జరుగుతుంది!

ఆ భాగ్యం మీరు అనుసరించే, ఆచరించే, అనువర్తించే ధర్మాచరణం మీద ఆధారపడి వుంటుంది!



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం

## ఒక విజ్ఞప్తి

విద్యే సౌందర్యం        విద్యే దైవం

1993లో తిరుమల తిరుపతి దేవస్థానముల వజ్రోత్సవ సందర్భంగా తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. భాగవతాంకితంగా ఈ పవిత్ర పరిశోధనా కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. ప్రాచీన ఆధునిక వాస్తు శిల్ప ప్రమాణాల రీత్యా అతి విశాలమైన భవనం ఈ గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రంకై నిర్మింపబడింది. ఇదో గ్రంథ రత్నాకరం. ప్రాచీనుల ఉత్తమ ఆలోచనా విధానాలను ఆవిష్కరించేందుకు, అందరికీ పంచేందుకు అలభ్యమైన ఎన్నో గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు, భగవద్గీత ఇలా ఎన్నో గ్రంథాలు ఈ గ్రంథాలయంలో పదిలపరచబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం సనాతనధర్మం, తత్త్వశాస్త్రం, సంగీతం, భారతీయ సంస్కృతి మొదలైన విషయాలమీద పరిశోధన చేయటానికి చక్కని అవకాశం కలిగిస్తుంది. అంతేకాక అలభ్యంగాను, అముద్రితంగాను వున్న భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను, సంస్కృత మూల గ్రంథాలను వాటి అనువాదాలను ప్రచురించాలని ఆశయం. ముద్రణా విభాగం కూడ ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ గ్రంథాలయాన్ని భారతీయ సంస్కృతీ ఆలయంగా, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా తీర్చిదిద్దాలన్నదే మా ఆశయం. ఈ భారీ పథకం పూర్తవటానికి అందరి సహాయ సహకారాలు ఎంతో అవసరం.

ఈ బృహత్తర కార్యానికి ప్రజలు, సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, దాతలు ఇతోధికంగా పుస్తకాల రూపంలో కాని, ధనరూపంలో గాని సహాయం అంద చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. వ్యక్తులు, సంస్థలు తమ వద్దవున్న విలువైన భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలను ఈ గ్రంథాలయానికి బహుమతిగా ఇవ్వవచ్చు.

దయతో మీ విరాళాలను పుస్తకాల రూపంలో గాని, ధనరూపంలో/డిమాండుడ్రాఫ్టుద్వారా గాని *"ఆఫీసరు ఆన్ స్పెషల్ డ్యూటి, శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం మరియు పరిశోధనా కేంద్రం, తిరుపతి-517 502 ఆంధ్రప్రదేశ్."* వారికి పంపండి.

*విద్య సౌందర్యాన్ని ఇస్తుంది! అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! విద్య గురువులకు గురువు! అన్య ప్రదేశాల్లో విద్య బంధువులా సహాయం చేస్తుంది! పాలకుల వద్ద గౌరవం లభించేలా చేస్తుంది! విద్యలేని వాడు వింత పశువు!!*

--భర్తృహరి

# వైకుంఠము ఎంత దూరము?

**శ్రీ రావి--ఎస్--అవధాని**

పూర్వము అవంతీ నగరాన్ని ధర్మపాలుడు అను రాజు పాలించేవాడు. అతడు గొప్ప విష్ణు భక్తుడు. నిరంతరం హరి నామాన్ని జపించేవాడు. తన ప్రజలను కన్న బిడ్డలవలె చూస్తూ వారికి ఏ విధమైన ఇబ్బందులు కలుగకుండా అవసరాలకు ఆదుకునేవాడు.

ప్రజలలో దైవభక్తిని పెంపొందింప చేయ డానికి ఎంతో కృషి చేశాడు.

ధర్మపాలుడి కొలువులో ఎందరో పండితులు, కవులు, గాయకులు వుండేవారు. కళాకారులను ప్రోత్సహించేవాడు.

ఒకరోజు ధర్మపాలుడు తన కొలువులో వున్న పండితులను, కవులను, సభికులను ఉద్దేశించి--

“స్వర్గము ఎంత దూరంలో వుంది? వైకుంఠవాసుడు మనకు ఎంత దూరంలో వున్నాడు?” చెప్పండి అన్నాడు.

రాజుగారి ప్రశ్న పండితులకు చేతి నిండా పని. గణకులు వెంటనే చకచకా లెక్కలు వేశారు.

“దశకోటి యోజనాల దూరంలో వుంది స్వర్గం” అన్నారొకరు.

“ప్రభూ! వైకుంఠము మనకు శతకోటి యోజనాల దూరంలో వుంది” అన్నారింకొకరు.

“కాదు ప్రభూ! సహస్ర కోటి యోజనాలు” అన్నారు వేరొకరు.




ఈ విధంగా ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా చెప్పారు. రాజుగారు ప్రతి ఒక్కర్ని వారే విధంగా దూరం నిర్ణయించారో అడిగి తెల్సుకొన్నారు.

రాజుగారికి ఏ ఒక్కరి సమాధానము సంతృప్తి కల్గించలేదు. రాజుగారి వదనంలో ప్రసన్నత లేదు. సభాభవనం నిశ్శబ్దంగా వుంది.

ఆ సమయంలో ఒక మూలనుండి పకాలున నవ్విన నవ్వు వినిపించింది.

రాజుగారు ఆ నవ్వు వచ్చిన వేపు చూసేరు. సభికులు త్రుళ్ళి పడ్డారు. భటులు ఆ నవ్విన వ్యక్తిని పట్టుకొని రాజుగారి ముందుంచారు. అతడు ఎవరోకాదు రాజుగారి చాకలి పేరిగాడు.

# అంజనాసుతుడు

శ్రీ జె. మునుస్వామి

అంజనాసుతుడని అనిలాత్మజుండని
విశ్వముకొనియాడ వెలుగువాడు
శ్రీరామసేవచే చిరయశంబును గాంచి
మహిమాన్వితుం డౌచు మసలువాడు
సూర్యపుత్రుండైన సుగ్రీవు మంత్రియై
బుద్ధిసంపన్నుడైపొలుచువాడు
ఆర్యాతనూభవునర్కవంశస్థుల
బద్ధసఖ్యులజేసి ప్రబలువాడు

హరికుమారుడు నశియింప హరిసుతునకు
హరివిభుత్వముచే జిక్కునట్లుజేసి
ఏనుతు డగువాడు లోకాల్ప్రీతినేలు
చారుతరమూర్తి హనుమంత చక్రవర్తి

భాస్కర శిష్యుడై భాస్వత్స్వరూపుడై
విజ్ఞానజలధివై వెలసినావు
భూతప్రేతములకు భువి పిశాచములకు
భయదాయకుండవై పరగినావు
నిరుపమ భక్తుడై నిస్తుల హృదయుడై
నిఖిలవంద్యుండవై వె గడునీవు
భక్తబాంధవుడవై పరమపవిత్రుడై
వరము లొసంగుచు వరలుదీవు

రామభజన సాగెడిచోట రక్తిమీర
నతశిరస్కుడై నిలుచు గుణాఢ్యుడీవు
అంజనాత్మజ నీకు నే నంజలింతు
చారుతరమూర్తి! హనుమంతచక్రవర్తి

తిరుమలయందున తిరుపతి పురమున
పలుచోట్ల వెలసిన పవనతనయ!
నీమందిరంబులు నిస్తులమైయుండ
నీసేవచేతురు నిఖిలజనులు
నీపదాంబుజములు నిరతము గొల్చుచు
సన్నుతి జేతురు సాధుజనులు
భావిబ్రహ్మ వటంచు భక్తు లందరు నిను
పాడియాడుచునుంద్రు పరవశించి

ఆదిశేషుని కైనను ఆజునికైన
అమరగురునికైనను కొనియాడ నగునె
నీదుమహిమాతి శయములు నిర్మలాత్మ
చారుతరమూర్తి! హనుమంత చక్రవర్తి!

త్యాగరాజాదుల రాగమాలికలందు
రంజిల్లుచుండెదు రామభక్త!
అన్నమయ్యాదుల అనుపమ కృతులందు
సర్వదా నెలకొన్న సౌమ్యమూర్తి!
రామాలయంబున రామమందిరముల
స్థిరముగా నెలకొన్న దివ్యమూర్తి!
సంస్మరించెదువారి స్వాంతంబునందున
సతతము నెలకొను సదయహృదయ!

తులసిదళములతోనె ప్రీతుండ వగుచు
యాచకుల కోర్కె లిచ్చెదు అభయదాత!
నమ్రతా పూర్వకంబుగా నతులసేతు
చారుతరమూర్తి! హనుమంతచక్రవర్తి!

భారతదేశాన ప్రఖ్యాతి గాంచిన
వాయుపుత్రుడ నీకు వందనంబు
సీతను చూడంగ శ్రీరాము పంపున
వనధి దాటిన నీకు వందనంబు
లంకకు నేగి యాలంకిణి గూల్చిన
వనవిహారుడ నీకు వందనంబు
ఆ అశోకంబున అక్షయు జంపిన
వానరవర! నీకు వందనంబు

స్వయముగా భక్తుడై భక్తసమితి నెల్ల
కావి రక్షించుచుందువు కరుణతోడ
నీదుమహిమల నెన్నంగ నెవరితరము
సకలసద్గుణ! హనుమంతచక్రవర్తి!

డిసెంబరు 15 హనుమద్వ్రతం సందర్భంగా

సం॥

పేరిగాడు లెంపలు వేసుకొని వినయంగా చేతులు జోడించి రాజుగారికి నమస్కరించాడు.

"నా ప్రశ్నకు సమాధానం నువ్వు చెప్పగలవా?" అన్నారు రాజుగారు మందహాసంతో

"చిత్తము ప్రభూ! ఏలినవారి సెలవైతే మనవి చేస్తాను" అన్నాడు.

వాడి ధైర్యానికి సభికులందరూ ఆశ్చర్యపోయారు. "సరె, చెప్పు" అన్నారు రాజుగారు.

"వైకుంఠము -- విష్ణుమూర్తి మనకి కూతవేటు దూరమండి" అన్నాడు.

"కూతవేటు దూరమా? అంటె మన పిలుపు వినిపించేటంత దగ్గరలో వున్నాడా శ్రీమహావిష్ణువు" అన్నారు పండితులు హేళనగా.

"అవునండీ సాములూ, మరి గజరాజు అదేనండీ గజేంద్రుడు దప్పికై సెర్లో దిగితే మొసలి దాని కాలట్టుకుంది గదండి. మొసలికాడ ఏనుగు బలం సాల్లేదండి. అప్పుడు గజేంద్రుడు విష్ణుమూర్తిని రచ్చించమని కేకెట్టిందండి. వైకుంఠం నుండి విష్ణుమూర్తి వచ్చి చక్రం అడ్డేసి మొసల్ని సంపి ఏనుగుని రచ్చించాడు గదండి. అంటే వైకుంఠం విష్ణుమూర్తి గజరాజు పిలుపు వినబడే అంత దూరం గదండి. అంటే కూత వేటుదూరం అన్నమాట."

అంతేగాదండి. నిండు సభలో దుశ్శాసనుడు సీరలూడదీస్తుంటే 'సామీ రచ్చించు' అంటూ ద్రౌపది కేకెట్టే వెంటనే సీరలిచ్చి రచ్చించేడు గదండి అంటే భగవంతుడు కూతవేటు దూరంలో గదండి వుండేది అన్నాడు చాకలి పేరిగాడు.

పేరిగాడి జవాబుకి రాజుగారెంతో మెచ్చుకొని వాడికి కానుకలిచ్చి సత్కరించేరు.

"విన్నారా! భక్తుని మొర ఆలకించడానికి భగవంతుడు తన భక్తులు పిలిస్తే పలికేటంత దగ్గరలోనే వుంటాడు" అన్నారు రాజుగారు.






# పశుపక్ష్యాదుల భక్తి

శ్రీ ఎర్రోజు వెంకటేశ్వర్లు
శ్రీ శారదాకృష్ణ

ప్రపంచ సాహిత్యంలోనే మొదటిది ఐన ఋగ్వేదంలో సరమా(దేవశుని)పణి లాంటి ప్రసిద్ధ సంవాద సూక్తాల్లో పశుపక్ష్యాదుల ప్రసక్తి, ప్రశస్తి కనిపిస్తుంది. భారతీయ సాహిత్యంలో కలకంఠి, గజగామిని, గానకోకిల, కవిశార్దూల అవధానకేసరి మొ॥ పోలికలు వాటి విశిష్టతను నిరూపిస్తాయి. అవి మానవులకు సహాయ సహకారాలందించడం ప్రాచీనకాలం నుంచే కనిపిస్తుంది. రాజులకు పక్షులు రాయబారాలు నడిపాయి. పశుసంతతి సైన్యంలో సహాయపడ్డాయి. శివాజీ కోటనాక్రమించు సమయంలో "యశ్వంత్" అనే ఉడుము మరువరాని సహాయం చేసింది. ఆవుపాలిస్తూ, శునకం ఇంటి కాపలా కాస్తూ మానవ జీవన గమనానికి తోడ్పడుతూ వస్తున్నాయి. మహాభారత, భాగవత, రామాయణాదుల్లో పరోపకారులుగాను, ధర్మ, న్యాయబద్ధులుగాను వాటిస్థానాన్ని పదిలపరచుకున్నాయి.

పశుపక్ష్యాదుల్లో ఎన్నో సుగుణాలతోపాటు విశిష్టమైన భక్తి కూడా లేకపోలేదు. మన ప్రాచీన గ్రంథాల్లో భక్తితో తరించి ముక్తిపొందిన పశుపక్ష్యాదులు ఎన్నో ఉన్నాయి.

"భజన్తే ఇతి భక్తాః" అని వ్యుత్పత్తి. ఎవ్వరైతే భగవంతుణ్ణి ఏదో విధంగా ఆశ్రయించి సేవిస్తుంటారో వాళ్లే భక్తులని అర్థం.

వేదమంత్రాల్లో భక్తి శబ్దం ఉన్నది. భగవంతుణ్ణి పూజించమని, సేవించమని ఋగ్వేదంలో ఉంది. వ్యాకులతలేని మనస్సుతో సదా భగవంతుని దివ్యనామాన్ని స్మరిస్తూ భగవంతునికి అంకితమైపోవడమే భక్తి అని నారదభక్తి సూత్రాలు చెప్పాయి. నిరంతరం భగవంతుణ్ణి హృదయంలో నింపుకొని ఆరాధించడమే భక్తి అని భగవద్గీత చెప్తుంది. భగవద్గీతలోని భక్తి యోగంలో శ్రీకృష్ణుడు భక్తుని గురించి ఇలా చెప్పాడు.

మత్కర్మకృన్మత్పరమో
మద్భక్తః సంగవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు
యః స మామేతి పాండవ॥

(భక్తియోగం 55 )

చదవండి! చదివించండి!!

# సప్తగిరి

## చందాదారులకు మనవి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్యాత్మిక సచిత్ర మాస పత్రిక 'సప్తగిరి'. తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఆంగ్లం మున్నగు ఐదు భాషల్లో విడి విడిగా నెల నెలా వెలువడుతున్న పత్రిక 'సప్తగిరి'. ఆధ్యాత్మిక వ్యాసాలు - పండుగలు - పిల్లల కథలు - వేంకటేశ్వర లీలలు - మన దేవాలయాలు ఇలా ఎన్నో విషయాలతో, విశేషాలతో మీ ముందుకు వస్తున్న పత్రిక 'సప్తగిరి.'

**మీరు 'సప్తగిరి' పత్రిక క్రొత్త చందాదారునిగా నమోదు చేయించుకోదలచారా?**

అయితే క్రింది సూచనలను జాగ్రత్తగా గమనించండి.

1. సంవత్సర చందా రు. 24-00లు మాత్రమే. ఈ చందాను ఎన్ని ఏండ్లకైనా ముందుగనే కట్టవచ్చును.
2. తమ చందా మొత్తాన్ని "ఎడిటరు, సప్తగిరి, తి.తి. దేవస్థానములు, తిరుపతి" వారి పేర మనియార్డరు గానీ, డిమాండు డ్రాఫ్టుగానీ, పోస్టలు ఆర్డరు గానీ పంపవచ్చును. (చెక్కులు అంగీకరింపబడవు).
3. మీకు ఏ భాషా సప్తగిరి కావలెనో స్పష్టంగా రాయండి.
4. మీ పూర్తి చిరునామాను విడి విడి అక్షరాలలో స్పష్టంగా రాయండి.
5. చందా పంపిన మరుసటి నెలనుండి మీకు సప్తగిరి పంపబడుతుంది.
6. చందా మొత్తాన్ని పంపిన 30 రోజులలోగా మీకు సప్తగిరి రానిచో, ఎం.ఓ. రసీదు నంబరు లేదా డి.డి. నంబరు, పంపిన తేదీ వగైరా వివరాలతో, మీ పూర్తి చిరునామాతో స్పష్టంగా రాయండి.

**మీరు ఇంతకు ముందే చందాదారులా? అయితే క్రింది సూచనలను గమనించండి.**

1. మీ చందా ముగియుటకు ఒక నెల ముందుగానే సప్తగిరి పత్రికలో తెలియజేస్తున్నాం.
2. మీ చందా ముగిసిపోయే నెలకు - ఒక నెల ముందుగనే చందా మొత్తాన్ని పంపి మీ చందాను పునరుద్ధరించుకోండి.
3. మీ చిరునామాలో మార్పుగాని, మీరు చందా పంపటంగాని చేసే టప్పుడు, మీ చందా నంబరుతో కూడ పూర్తి చిరునామాను తెలపండి.

నిజమైన భక్తుడెప్పుడూ నేను మహాభక్తుణ్ణని డాంబికాలు పలకడు. తాను ఏది చేస్తున్నా భగవదర్పణంగా చేస్తాడు. దేవుడే అందరికి పరమగతి అని భావిస్తాడు. లోకంలో ప్రతిజీవిలోను పరమాత్మనే దర్శిస్తూ, అందరితో స్నేహంగా ఉంటాడు. అలాంటి వాడే నాకు పరమభక్తుడు.

ఆంధ్రమహాభారతంలో ఆదిపర్వం ద్వితీయాశ్వాసంలో గరుడుడు తల్లి శాపవృత్తాంతం తెలుసుకొని, ఆమె ఆశీస్సులు తీసుకొని అష్టకష్టాలుపడి, అమృతం తెచ్చి ఇచ్చి, తల్లికి దాస్యవిముక్తి కలిగించాడు. అతని ధైర్యాన్ని మెచ్చుకొని విష్ణువు ప్రత్యక్షమై ఏంకావాలో కోరుకొమ్మన్నాడు. గరుడుడు. "నిన్నధిక భక్తి గొలుచుచునునికి"ని (1-2-106) కోరి విష్ణువు వాహనమై సేవిస్తూ తరించాడు.

గరుడుడు పక్షియే అయినా మానవుల్లాగా తల్లి రుణం తీర్చుకునేందుకు శాంతియుతంగా పోరాడి, తనతల్లిని దాసితనం నుంచి విడిపించాడు. కాబట్టి పక్షిజాతికే కాక తరతరాల మానవజాతికి కూడా ఆదర్శప్రాయుడైనాడు. మాతృభక్తిని, దైవభక్తిని కలిగి వెలిగినాడు గరుత్మంతుడు.

హంస సరస్వతికి, నంది శివునికి, సింహం పార్వతికి, మూషికం గణపతికి, నెమలి కుమారస్వామికి ఇలా పశుపక్ష్యాదులు దేవతలకు వాహనాలై, భక్తులై తరించాయి.

రామాయణంలో జటాయువు (పక్షి) ఒక విశిష్టమైన పాత్ర. రావణుడు సీతను ఎత్తుక పోవుచున్నప్పుడు జటాయువు రావణుని ఎదుర్కొనే ప్రయత్నంలో రెక్కలు పోగొట్టుకొని, ఆ వార్తను రామునికి తెలిపేందుకోసం భక్తితో రామనామ జపం చేస్తూ ప్రాణాలతో ఉన్నది. రాముని దర్శనమైన తర్వాత సీత జాడ చెప్పి, తృప్తిగా కన్ను మూసింది. జటాయువు పరమభక్తిగల పక్షి మాత్రమేగాదు రామునిచేతనే దహనసంస్కారాలు పొందిన భాగ్యచరిత కూడా రామునిపై ఆ పక్షివాత్సల్య భక్తిని కురిపించినది. జటా

యువు దైవోపకారిగా, అధర్మం సహించనిదిగా కనిపిస్తుంది.

జటాయువు సోదరుడు సంపాతి అనే పక్షి కూడా రామభక్తి గలదే. ఆంజనేయ, అంగదులకు సీత జాడ దొరకక ప్రాయోపవేశం చేసుకోవాలనుకొన్న సమయంలో సంపాతి పరిచయమై, సీతజాడ, లంకామార్గం చెప్పి, వాళ్ల ప్రాణాలను రక్షిస్తుంది. అధ్యాత్మ్య రామాయణంలో రామ దర్శనం కాకున్న, రామభక్త దర్శనం కూడా ముక్తినిస్తుందని చెప్పబడింది. అట్లే సంపాతి రామభక్తులైన ఆంజనేయ, అంగదుల దర్శనం పొంది, ముక్తిని పొందింది.

కిష్కింధకాండలో పరిచయమైన ఆంజనేయుడు వానరుడైనను రాముడే తన ప్రాణంగా, రామనామమే తన ఊపిరిగా చేసికొని, రామభక్తుల్లోనే అగ్రస్థానం పొందాడు. రామకార్యసాఫల్యానికి ప్రధాన కారకుడయ్యాడు. అందుకే రామునితోపాటు, ఆంజనేయుడు కూడా తరతరాలుగా పూజింపబడుతున్నాడు. సుగ్రీవుడు రామభక్తుడై రామ కార్యానికి తోడ్పడి తరించాడు. ఈవిధంగా వానరులంతా రామభక్తులై తరించారు. రంగనాథ రామాయణంలో సృష్టించబడిన ఉడుతాభక్తికూడా మరువరానిది. అందుకే ఉడుతాభక్తి సహాయం అనే నానుడి లోకంలో ప్రచారం పొందింది.

భక్తపోతన అనువదించిన భాగవతంలో కూడా పశు పక్ష్యాదుల భక్తి కనిపిస్తుంది. భాగవతం అష్టమస్కంధం గజేంద్ర మోక్షం ఘట్టంలో మొసలిచే పట్టుబడి, నానాకష్టాలు పొందుతున్న ఏనుగు "అల వైకుంఠ పురంబులో... ఉన్న విష్ణుమూర్తిని" నీవే తప్ప ఇతః పరంబెరుగ... అని ఎలుగెత్తి విష్ణువును భక్తితో స్తుతిస్తూ ఆత్మనివేదనం చేసుకుంటుంది. విష్ణుమూర్తి తన భక్తుని ఆర్తనాదం విని.

సిరికింజెప్పడు శంఖ చక్ర
యుగముం జేదోయి సంధింపడే
పరివారంబును జేర దభ్రగపతి
బన్నింపడాకర్ణికాంతర
తర ధమ్మిల్లము జక్కనొత్తడు
వివాద ప్రోత్థిత శ్రీకుచోపరి
చేలాంచలమైన వీడడు
గజప్రాణావనోత్సాహియై

(8-96)

వచ్చి, మొసలి బారినుంచి ఏనుగును కాపాడి ముక్తిని ప్రసాదిస్తాడు. ఇందులో ఏనుగుది ఆత్మనివేదన భక్తిగా కనిపిస్తుంది.

తెలుగు ప్రబంధాల్లోను అక్కడక్కడ పశు పక్ష్యాదులభక్తి కనిపిస్తుంది. పాండురంగ మాహాత్మ్యంలో కాకి, హంస, మొదలగునవి కేవలం పాండురంగని కథ వినడంవల్ల మోక్షాన్ని పొందుతాయి.

ధూర్జటి రచించిన శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యంలో శ్రీ కాళము, హస్తి ఈ మూడును ఎప్పుడు శివుణ్ణి సేవించి తరించాయి.

కృతయుగంలో శ్రీ అనే సాలెపురుగు. గజవనంలోని లింగమును సేవిస్తూ ఉండేది. ఆ వనంలోని మారేడుచెట్టు నాశ్రయించి ముప్పొద్దుల మారేడు ఆకులతో పూజిస్తూ, శరీర, ఆత్మ శుద్ధి కలదై భగవంతుని ప్రాకారాది వివిధ మందిరాలను నిర్మిస్తూ ఉండేది. సాలె పురుగు వివిధ విధాల పూజిస్తూండగా, దాని భక్తికి మెచ్చి, శివుడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకొమ్మనగా సాలె పురుగు "నాకీ భవదుఃఖంబు లేక... లోకంబెన్నడు నెరుగని కైవల్యమే" (ద్వితీయాశ్వాసం 105) కావాలని కోరి పొందింది. కీటక మైనను శివుణ్ణి భక్తి ప్రపత్తులతో కొలిచి ముక్తిని పొందింది.

(ఈ కావ్యములోనే ద్వితీయాశ్వాసంలో గజం, పాము కూడా శివుణ్ని పూజించాయి) త్రేతాయుగంలో ఒక పాము ప్రతిరోజు పాతాళంబు నుంచి వచ్చి శివునికి మాణిక్యాదులతో శివార్చన చేస్తుపోయేది. తర్వాత ఒక ఏనుగు శివార్చన చేసేటందుకు వచ్చి, కైతకీ నదిలో స్నానంచేసి, అడవంతా వెదకి శాఖలతో వివిధ పుష్పాలతో పాముపెట్టిన మణులు తీసివేసి, తొండముతో నీరుతెచ్చి, అభిషేకించి శివున్ని పూజించేది. తర్వాత పామువచ్చి, శివునిపైనున్న తీగలు, పుష్పాలు తీసి పూజించెడి శివునిపై వాటిని అలాపెడ్తున్నందుకు బాధపడి, ఎవరు పెడ్తున్నారో తెలియక పరస్పరం కోపించుకునేవి. ఒకనాడు పాము సూక్ష్మరూపం దాల్చి, మాణిక్యాదులు తీస్తున్న ఏనుగు తొండంలో దూరింది. అది ఆ బాధ భరించలేక కొండకు తలబాదుకొని ఏనుగు, తర్వాత పాము మరణించాయి. అప్పుడు శివుడు ప్రత్యక్షమై మీ కోరికలేమి అనగా... ఈ సంసార పయోధిలోపడి, దేహముమీద ఆశలు మానలేక పోతున్నాం.

"దేవా మమ్ము రక్షించి
మిథ్యాసౌఖ్యంబు చాలు
నిత్యసుఖ మిమ్మా
యంచు బ్రార్థించి"

(2-154)

ఆ పాము, గజము కైవల్యప్రాప్తిని పొందాయి.

ఈవిధంగా పశుపక్ష్యాదులు భక్తితో దేవతలను త్రికరణశుద్ధిగా సేవించి తరించాయి. భక్తికి జాతి, కుల మత భేదాలు లేవు. తిర్యక్కులు కూడా పరమాత్మ అభిముఖులౌతాయని పై వాటి ద్వారా తెలుస్తుంది.

జీవాత్మ, పరమాత్మలను అనుసంధానం చేసేది భక్తి ఒక్కటే. జీవాత్మ అంటే ప్రతిప్రాణిలో ఉండేది. పరమాత్మ అంటే నిరాకారుడు, నిర్గుణుడు, సర్వవ్యాపి అయిన భగవంతుడు, అట్టి పరమాత్మను చేరడమే జీవాత్మ లక్ష్యం. ఈ ఆత్మకు పశుపక్ష్యాదులు అనే వివక్ష ఉండదు. అందరిలోనూ ఉంటుంది ఆత్మ. అందువల్ల జన్మనెత్తిన ప్రతి జీవి బ్రహ్మానందాన్ని పొందాలంటే భక్తియే సోపానం. కాబట్టి మానవుల్లోనే కాక పశుపక్ష్యాదుల్లోను భక్తిప్రపత్తులను చూపించారు భక్తకవులు.



# నాదలోలుడై

శ్రీమతి యస్. అన్నపూర్ణ

అది ప్రశాంత కుటీరం. పచ్చని ప్రకృతి హృద్యంగాను, రమణీయం గాను ప్రశాంతతోను నిండి శ్రుతిపక్వమైన తంబురా శుభనాదంతో, చిన్నికృష్ణుని పాల రాతి విగ్రహం ముందు ముచ్చటగా అలంక రించిన రంగవల్లుల సౌరభంతో భక్తి భావాన్ని వెదజల్లుతోంది.

బయట కోలాహలం గమనించిన శాంతమ్మ కుటీరంనుండి వెలుపలికివచ్చి అల్లం తదూరంలో నడిచివస్తున్న ఒక మహావ్యక్తి మీద దృష్టిని నిలిపింది. కాషాయాంబరధారి. చేతిలో తంబురా, చిడతలు పట్టి, వుంఛవృత్తిని తలపింపజేస్తూ - దేదీప్యమానమైనటువంటి అవ్యక్తమైనటువంటి ఆధ్యాత్మిక కాంతులు వెదజల్లుతూ అపర త్యాగరాజస్వామియా అన్నట్లు నడచి వస్తూవున్న ఆ 'నాదయోగి'కి సాష్టాంగ ప్రణామంచేసి తనభక్తి భావాన్ని వ్యక్తం చేసింది శాంతమ్మ. అప్రయత్నంగా తనూ 'పంచరత్నాల'తో గొంతు కలిపింది. జోలెలో భిక్షవేసి లోపలికి వెళ్ళింది ఆబృందం నిష్క్రమించగానే.

చెప్పతల్లీ! సందేహ మెందుకమ్మా! అన్నస్వామి అనునయ వాక్యాలలో కొంత ధైర్యం వచ్చింది శాంతమ్మకు. భారమైనకంఠ ధ్వనిలో మెల్లగా "స్వామీ! నామనస్సు ఎంత ప్రయత్నించినా కేంద్రీకృతం కావటంలేదు. మనస్సు ప్రశాంతస్థితిలోని తెచ్చుకోడానికి మార్గం బోధించండి" గుండెలోతులలోనుండి వెలువడిన యీ మాటల వెనుక పరిస్థితి యిట్టే గ్రహించారు సూక్ష్మగ్రాహి అయిన నాదయోగి. చిరునవ్వుతో యిలా అన్నారు. అందుకే మనస్సును కోతితో పోల్చారు తల్లీ! ఒక పట్టాన దాన్ని పట్టుకొని స్వాధీనపరచు కోడం చాలకష్టం. మనసు, మాట రెండూ ఒకే త్రాటిపై నడిపించుకో గలగడమే ధ్యానా వస్థ వెళ్ళి ప్రశాంతంగా సాధనచేయండి. 'శాంతం' అనేది ఒకచోట కొనుక్కునేది గాదమ్మ! మనసులో నీ మనసే స్వస్థతచే కూర్చుకోవాలి. స్వామి ఆశీస్సులందుకొని కుటీరానికి నడిచింది శాంతమ్మ.




ఏబై ఏండ్లు పైబడ్డ శాంతమ్మ ఆ గ్రామంలోనే అందరికీ 'తలలో నాలుక'గా మసలుకుంటూ సంగీత భిక్షపెట్టి విద్యార్థి నులను ఆదరించి తనకు చేతనయినంతలో పోషిస్తూవుంది. ముఖ్యంగా బాలపాఠాలు, అభ్యాసగానం పునాదితో విద్యార్థినులు వారి వారి యోగ్యతలను సంపాదించుకొని పైకి రావడానికి ఆలంబనమైంది. వివాహం అంటే ఏమిటో తెలియని వయస్సులో మెట్టినింట్లో అడుగిడింది. తరువాత తనను తృణీకరిం చిన భర్తకు దూరంగా వుంటూ ఆధ్యాత్మిక చింతనలో కాలం గడుపుతూ సంగీత సరస్వతి ఆదరణలో ఒంటరి బ్రతుకును దూరం చేసి కోడానికి ప్రయత్నిస్తూవుంది. అయినా అడు గడుగున ఎదురౌతున్న వైరాగ్యభావం, నిస్స త్తువ, నిరాశ ఆమెను ఆవహిస్తున్నాయి. కాని స్వామీజీ గ్రామంలో అడుగిడినప్పటినుండి మనస్సులో ఈ రకమైన చింతకు అసలు చోటు పెట్టకుండా ఒకరకమైన ప్రశాంతతను అలవాటుపడి స్థిమితపడుతోంది శాంతమ్మ.

గతాన్ని గురించి ఆలోచిస్తూన్న శాంత మ్మను స్వామీజిరూపు కళ్లల్లో మెదిలింది. తలపండిన వృద్ధులు పండిన మనస్సు, పండిన శిరోజాలు, మూర్తీభవించిన గాన మూర్తి, కళ్లల్లో చెప్పలేని ఆకర్షణ, పసిత నంనుండీ ఎన్నెన్నో బిరుదులు, ప్రశంసలు, గౌరవ పురస్కారాలు అందుకున్న వయో వృద్ధులయిన స్వామీజి సతతము తన గాన మాధుర్యాన్ని ప్రపంచానికి అందజేసి తరింప జేస్తూ వుంటారు. గ్రామ గ్రామానికి వెళ్లి అక్కడ సంగీతాభివృద్ధిని గురించి చర్చిస్తూ తగిన ప్రణాళికలను ఆ ప్రదేశపు సంగీత

# A HEALING TOUCH

## T. T. DEVASTHANAMS INTRODUCES SRI BALAJI AROGYAVARAPRASADINI SCHEME

For ages, Tirumala, the abode of Lord Venkateswara, has been a great centre of pilgrimage. Thousands of devotees visit the sacred hills every day and offer their solemn prayers to the Lord for their spiritual and physical well-being.

Alleviating human suffering has been a part of dedicated efforts of TTD to the mankind. TTD already manages a Leprosorium, centre for physically handicapped, a poor home and also a central hospital. To provide the most advanced medical technology to the needy, the TTD has launched another monument, a blessing from the Lord by opening Sri Venkateswara Institute of Medical Sciences -- a sophisticated superspeciality centre on the lines of AIIMS of New Delhi, JIPMER of Pondicherry and PGI of Chandigarh. Total well being of man is the aim of Sri Venkateswara Institute of Medical Sciences which apart from offering service, training and education in medical sciences also encourages Research and development.

The doors to such a state of the art technology should be open to our poor and disabled brethren.

With a view to achieving this, Sri Venkateswara Institute of Medical Sciences has introduced a New scheme Balaji Arogyavaraprasadini Scheme. To accomplish the goal of proving the sophisticated medical technology to every individual at an affordable rate, we invite the generous co-operation of philanthropists and the general public.

**The Scheme in essence:**

A donor can make an endowment of Rs 1000/- or multiples thereof / Rs 1 lakh / Rs 5 lakhs / Rs 10 lakhs to T.T. Devasthanams which will in turn contribute matching grant. The entire amount will be deposited in fixed deposit in a nationalised Bank and the interest accrued on it will be utilised for providing free medical services to the poor and the needy.

A Chair in Sri Venkateswara Institute of Medical Sciences will be named after the donor who contributes Rs 10 lakhs or above. These endowment chairs are purely research oriented.

- Donations can be made by any individual / family / company / firms etc
- The name of the donor who endows Rs 5 lakhs or more will be displayed prominently in the Reception hall of the hospital
- The discharge ticket of the benefited patient will carry the name of the donor

**Additional Benefit and facilities :**

- Donations to Sri balaji Arogyavaraprasadini Scheme are exempted from Income Tax under 80 (G)
- Paid rooms / Air conditioned rooms will be allotted to family members of the donor in the hospital
- Paid rooms can be named after donors who contribute a sum of Rs 5 lakhs or above
- By paying Rs 5 lakhs and above, a donor may sponsor one operation per year
- Donors can sponsor feeding of the In-patients and out-patients. They may also sponsor a travel fellowship for the faculty per year

All donations, by D Ds drawn in favour of The Executive Officer, T T Devasthanams, Tirupati-517 501 (Andhra Pradesh) should reach the Director, Sri Venkateswara Institute of Medical Sciences, Tirupati along with the following particulars

- Name and address along with the latest passport-size photographs of the family members of the donor who contributes Rs 1 lakh or more
- Name and address of the person to whom Income Tax Exemption Certificate is to be issued

The donors are also welcome to offer equipment, vehicles etc to SVIMS or even sponsor health camps in rural areas, if they so desire. Further details can be had from

**The Executive Officer**
**T.T. Devasthanams, Tirupati**
**or**
**The Director**
**Sri Venkateswara Institute of Medical Sciences, Tirupati**

**EXECUTIVE OFFICER**

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

# Sri Venkateswara Vanabhivriddhi Scheme

## An Appeal . . .

*He that planteth a tree is the servant of God*
*And Provideth a kindness for many generation*
*And faces that he, hath not seen shall bless him*

Sacred Forests of Tirumala are the precious gift of Lord Venkateswara to mankind. With a view to safeguarding its unique yet delicate ecological condition, Tirumala Tirupati Devasthanams have introduced a series of exciting schemes called **Sri Venkateswara Vanabhivriddhi Schemes.** The Schemes seek to provide a rare opportunity to the public for participation in a massive plantation project implemented by the Forest Department of T T Devasthanams.

The salient features of Sri Venkateswara Vanabhivriddhi Schemes are:

**VRIKSHA SAMVARDHANAM :** Under this Scheme, about one acre of land will be brought under plantation

**Benefits :**

- Plantation will be named after the donor or person of his choice
- Every year free accommodation on 2 ordinary days at Tirumala for 10 years
- One paid special darshan every year for 5 persons for 10 years

**Donation :** Rs 15,000

**VRIKSHA PRASADAM :** The Scheme is proposed for raising 100 fruit and flowering seedling every year

**Benefits :**

- Distribution of one hundred seedlings, both fruit bearing and flowering in the donor's name every year.
- Two days free stay at Tirumala every year on any ordinary days for 10 years.
- One paid special darshan every year for five persons for 10 years.

**Donation :** Rs 10,000.

**SMARAKA VANALU :** Under this scheme 10 saplings of selected species will be planted in a grove and maintained for five years.

**Benefits :**

- The grove will be named after the donor.
- Every year paid special darshan for five persons for five years.

**Donation :** Rs 2,000.

**VANA SAMRAKSHANA BHAGA SWAMYAM :** is proposed to protect and improve the natural forest cover on Tirumala hills.

**Benefits :**

- Diplay of the donor's name.
- Paid special darshan for five persons for one year.

**Donation :** Rs 1,000.

**ADHYAYANA VANALU :** Plantation and maintenance of a variety of species will be taken up under this scheme in the proposed botonical garden at Tirumala.

**Benefits :**

- Display of donor's name near the plant.

**Donation :** Rs. 500.

**VRIKSHA DATTATA :** is a bold scheme featuring adoption and plantation of avenue trees on the ghat road and at Tirumala.

**Benefits :**

- Display of donor's name.

**Donation :** Rs 250.

We appeal to all devotees to donate liberally and help us to preserve the priceless forest wealth of Tirmala - The Abode of LORD VENKATESWARA

Please send your donations by Demand draft to the **The Executive Officer, T. T. Devasthanams, TIRUPATI - 517 507.**

**EXECUTIVE OFFICER**

విద్వాంసులకు అందజేస్తూ యీ విధంగా సంగీత ప్రపంచం అంతా విస్తరింపజేసే మహాతపస్వి. ఆ లక్ష్యంలో భాగమే యీ గ్రామ దర్శనంగూడ. నిరంతరం ఆధ్యాత్మిక చర్చలలోను, సంగీత గోష్ఠులతోను స్వామీజి బసచేసిన నిలయం భక్తి భావ సమన్వయం చిందిస్తూ వుంటుంది. ప్రతిగ్రామంలోను 2 నెలలు మకాంవేస్తూ ఈ లోపలనే సంగీతాభివృద్ధికి తోడ్పడుతూ ఈ వయస్సులో గూడ చెరగని తరగని చిరునవ్వుతో శ్రమిస్తూ వుంటారు.

ప్రశాంత సాయం సమయం స్వామి వారి పాదాలచెంత శాంతమ్మ కూర్చుని వుంది. "స్వామి! ఒక్క సందేహం!" "అడుగమ్మా! సంశయిందేనికి" స్వామి! మనోధర్మ సంగీతం సంగీత మహాసంద్రంలోనే ఒక మహారత్నం అంటారు. మరి అది సాధ్యం చేసుకోడానికి నాబోటివారు అర్హులేనా స్వామి! వయస్సు దాటిపోతుంది గదా! దాన్ని అభివృద్ధి చేసుకోడానికి అర్హత గూడ వుండాలి గదా!

ఇదామ్మా! నీసందేహం! విను బాల్యంలో ఏపాటి శ్రమ అయినా చేయడానికి శరీరంలోని అన్ని అవయవాలు స్వాధీనంలోవుండి లొంగుతాయి. వయస్సు మీరినకొద్దీ గాత్రధర్మం మొండికేస్తుంది. అయినా పట్టుదలవుంటే లభించనిది ఏదీ లేదమ్మా! "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్!" అన్నారు. శ్రమయేవ జయతే అన్నారు. ఇంక ఈ సందేహాలన్నీ పెట్టుకోక స్థిరచిత్తంతో సాధన చేయు తల్లీ! స్వామి! మీరు నిజంగా భగవత్స్వరూపులు. నాబోటి సామాన్యురాలికి గూడ ప్రోత్సాహమిచ్చి ఎంతో ఆదరిస్తున్నారు. మీ ఆశీస్సులలో నాచేతనయినంత కృషి చేస్తాను స్వామి!

మర్నాడు సాయంత్రం గ్రామస్థులు "నాద యోగి" సంగీతప్రదర్శన ఏర్పాటు చేశారు. ఆ సంగీతఝురి 3 గంటల పాటు ప్రజల్ని ఆనంద భక్తి పారవశ్యాలలో తన్మయం చేసింది. "నాదలోలుడై" కీర్తనతో ప్రారంభం అయిన ఆ పాండిత్య ప్రదర్శన అనేక రాగాల్లో అనేకమైన లయ విన్యాసంతో శ్రోతలను ఉర్రూతలూగించింది.

మర్నాడు సాయంత్రం స్వామీజి బసకు వెళ్లిన శాంతమ్మ తను బాలకృష్ణునిపై వ్రాసుకున్న కవితను వినిపించింది. అమ్మా! ఏది రాసిన భగవంతునికి ఆశ్రితభావంలో వ్రాయి. ఇది నీకు భగవంతుడిచ్చిన వరప్రసాదం తల్లీ! సద్వినియోగం చేసికో! అనుగ్రహం స్వామీ! "పిల్లన గ్రోవిని తానూదుతూ నడచిన పాదాలు అల్లన గనినంతనె అవి మోక్షమిచ్చు పాదాలు" అమ్మా! నీవు మనసు పండినదానివనడానికి నిదర్శనం ఈ రెండు వాక్యాలూ నమ్మ! "మోక్షమిచ్చు సాధాలు" అనే మాట మనస్సు పరిపక్వస్థితిలో వుంటే గాని బయటకు రావమ్మ! లేదు స్వామి! నిత్యరూప ఎవరి పాండిత్యమేమి నడచురా! అని త్యాగరాజస్వామి నాబోటి వారికనులు తెరిపించునుగదా స్వామి!

రెండు మూడు రోజులుదాక స్వామీజి దగ్గరకు వెళ్లలేదు శాంతమ్మ. వాకబుచేసినా ఒళ్లు తెలియని జ్వరంతో బాధపడుతున్నట్లు తెలిసింది. స్వామీజి స్వయంగా కుటీరానికి బయలుదేరారు. "అమ్మా!" అనే పిలుపు విని ఆశ్చర్యంతో మెల్లగాలేచి బయటకువచ్చిచూసిన శాంతమ్మ ఎదురుగా సాక్షాత్కరించిన నాద యోగినిచూసి భక్తి తన్మయతలో చేతులు జోడించిచూస్తూ వుండిపోయింది. అమ్మా! ఆకలిగావుంది. నాకేం సమర్పించకుంటావు? తండ్రీ! అపరాధం స్వామి! నాకింతవరకు ఆ ఆలోచనే రాలేదు. ఆశీనులైన స్వామీజి ముందు మామిడిపండ్లు, పాలు సమర్పించి భక్తితో ప్రణమిల్లింది శాంతమ్మ. అమాయకపు, అజ్ఞానపు భక్తురాల్ని స్వామి! నాది శబరిభక్తి. అమ్మా! కదుప్రీతితో సమర్పించుకున్న నీ నైవేద్యం ఎంతో రుచికరంగా మధురంగాను వుంది తల్లీ! స్వామి! మీరు ఊరకే అట్లు అంటున్నారుగాని మీకు రుచులేమిటి తండ్రీ! మీకున్న రుచి ఒకటే! అది నాదరుచి. ఇవన్నీ మీకు నిమిత్తమాత్రమే! అమ్మా! శరీరానికుండే రుగ్మతలు వస్తూనేవుంటాయి. అది శరీరధర్మం. మనసుకు మాత్రం ఏ రుగ్మతకూ, ఏ మలినాన్ని అంటనీయకుండా ప్రశాంతచిత్తంతో ధ్యానం చేస్తుందు తల్లీ! ఆత్మకు ఏదీ అంటదు. శరీరమే పరిశుద్ధాత్మతో ముడిపడినపుడు యింక గమ్యం సుగమం! నేను బయలుదేరేరోజు రేపే! భగవంతుడు నన్ను యీ సంగీత సేవా కార్యానికి వినియోగించాడు. అపని నేటితో పూర్తిఅయి రేపు నేను బయలుదేరుతున్నానమ్మా! స్వామి! గద్గద కంఠంతో శాంతమ్మ కన్నీరు మున్నీరుగా పసిపిల్ల వలె రోదిస్తూ అన్నది. స్వామి! మీరు వెళ్లవద్దు. మీరు ఏ తోడూలేని నాకు భగవంతునిలా, తండ్రిలా, ఒక పెద్దలా తోడుగా నీడగా వున్నాను. మీరు వెళ్లితే నేనా ఖాళీ బస చూడలేను తండ్రీ!

అమ్మా! ఈ ప్రపంచం నీదనే భ్రమలో పడిపోతున్నావు. ఏవస్తువూ యిందులోనిదికాదమ్మా! అంకిత భావంలోను, కార్యదీక్షలోను పనిచేసే వ్యక్తులకు దేవుడు తన సముఖంలో వాడి వాడి నామం లభిస్తాడమ్మా! అలా ఆయన దివ్యసముఖంలో మన పేర్లుగూడ వుండవద్దా తల్లీ! మాయ కమ్మినట్లు ప్రాపంచిక దృష్టితో ఎందుకు చూస్తున్నావు? అమ్మా! ఈ బేల తనంమాని అనాధలకింత సేవచేయి. సంగీత సేవాభావంతో మోక్షమార్గాన్ని అధిరోహించ ప్రయత్నించు. నేనొక వేళ ఈలోకాన్నే వదలివెళ్లిపోతే అప్పుడు ఏంచేస్తావు! అమ్మా! ప్రపంచంలో ఏ జీవికీ లేని ఔన్నత్యం మానవునికుందమ్మా! అందులో మన సంగీత ప్రపంచ జీవులకు సునాదోపాసన ద్వారా మోక్షమార్గాన్ని అధిరోహించ అవకాశం వుందమ్మా! ఇక నేను బయలుదేరుతూ ధైర్యంగావుండు, భగవంతుడు నీకు మంచి చేస్తాడు అంటూ నిష్క్రమించారు స్వామిజి.

....తంబురా తీగలు సరిచేసి వాటి శ్రుతి చేసింది. సవ్యమైన నాదం ఆవరణంతటా ఆవరించింది. శ్రీకృష్ణ విగ్రహం ముందు వెలిగించిన అగురు ధూపం సువాసనలు వెదజల్లుతుండగా ఆ పవిత్రమైన వాతావరణంలో - స్వామిజి ఒకనాడు అన్న వాక్యాలు జ్ఞప్తికివచ్చాయి.

అమ్మా! హాయిగా యీ శ్రుతి నాదం విను. ఎంతకమ్మగావుందో! ఇంక ఒంటరితనం ఏమిటమ్మా! యింక ఏబాధ, ఏ ఒంటరితనమూ మనల్ని బాధించదమ్మా!

స్వామిజీ! మనసారా హృదయంలో ధ్యానించి కృతజ్ఞతా భావంతో నమస్కరించింది శాంతమ్మ. ✡

# శిక్షించని స్వామి

శ్రీ కె. ఆదినారాయణ, శ్రీకాకుళం.



ఆది పర్వదినం, 1992 ఫిబ్రవరి మూడోతేదీ నా శ్రీమతికి నాకు అనారోగ్యం కారణంగ, ఆ మహోదయ కాలంలో, దగ్గరలోనున్న సముద్ర స్నానానికి వెళ్లలేక పోయాము. ఇంటికి రాగానే అకస్మాత్తుగా, నాకు కుడికాలు, చెయ్యి పనిచేయటం లేదు. ఆ వెంటనే క్షణాల్లో నోరుకూడా పడి పోవటం, మాట కూడా రాకపోవటం, మూతి వంకరలు తిరిగిపోవటం, పరిస్థితి ప్రమాదకరముగా పరిణమించింది. ఇంట్లో వుండే మా అత్తగారు వెంటనే వెంకటేశ్వరునికి మొక్కుకొని నా అల్లుడికి బాగుంటే నీ కొండకు వస్తాడు స్వామీ అంటూ ముడుపు వేయటమే కాదు, మరుసటి రోజు వెండి కడియం కూడా కుడి చేతికి కట్టింది వైజాగ్ వెళ్లి పదిరోజులు చికిత్స చేసుకుని, ఆరోగ్యం కుదుటపడిన పిమ్మట, ఇంటికి చేరుకున్నాను.

క్రమంగా పరిస్థితులు, ఆ వేంకటేశ్వరుని దయవలన చక్కబడటం, నేను యధా ప్రకారం స్కూలుకు వెళ్లిపోవటం జరిగింది. కాని స్వామి మొక్కు సంగతి మరచిపోయాను. మారెండో పాపకు, తలనిండ పెద్ద పెద్ద కురుపులు లేచి విపరీతంగా, అల్లరి పెట్టడం ప్రారంభించింది. డాక్టరు వద్దకు వెళితే కొప్పు తీస్తేగాని చికిత్స చేయటం జరగదని చెప్పడంతో క్షురకుని పిలిచి నెమ్మదిగా మీద కొప్పు తీసి వేయమన్నాను. కత్తి పట్టుకున్న అతను కొప్పుతీయటానికి, మాపాప తలను నీళ్లలో కడుగుతూ తడిమి చూశాడు. నన్ను చూసి, బాబూ, మీపాపకు కొప్పులోన జటలు కట్టివుంది. మీకేమైనా మొక్కువుందేమో గుర్తుకు తెచ్చుకోండి, నా కాళ్లు, చేతులు వణుకుతున్నాయి. నేను కొప్పు తీయలేను అంటూ వెళ్లిపోయాడు.

అప్పుడు గుర్తుకు వచ్చింది. నాకు బాగులేనపుడు మా అత్తగారు మొక్కుకున్న విషయం. ఏం చేయాలో పాలుపోక ఆ రాత్రి ఎప్పటికో నిద్రపోయాను. సాక్షాత్తు ఆ వేంకటేశ్వరస్వామి స్వప్నంలో సాక్షాత్కరించి-- పెట్లో డబ్బువుండి కూడా నావద్దకు ఎందుకు రావటంలేదు అంటూ హెచ్చరించిన వైనం నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తి వేసింది. నా శ్రీమతితో ఈ విషయం చెప్పి వెంటనే ఇంట్లో వున్న పైకము తీసుకుని, మా పాపతో, తిరుపతి బయలుదేరాను. గూడూరు చేరేవరకు మా పాప విపరీతంగా అల్లరి చేయటం ప్రారంభించింది. తలమీద కురుపులు నుండి




చీము, రక్తం కారటం, విరబోసుకున్న కొప్పుతో చూడటానికి భయంకరంగా వుంది. గూడూరులో బండి దిగి నేరుగా తిరుమలవెళ్లే బస్సు ఎక్కినాము. ఉదయం 10 గంటలకు కొండమీదకు చేరకున్నాం. విశ్రాంతి గృహం కూడా తీయకుండ, వెంటనే క్షౌరశాలకు వెళ్లాం. అక్కడ క్షురకునితో చూడు బాబూ, మాపాపకు తలనిండ కురుపులే కాస్తా జాగ్రత్తగా కొప్పు తీయి, అసలే చిన్నపిల్ల అన్నాను. "కురుపులు వున్నవాళ్లకు కొప్పు ఎలా తీయాలో మాకు తెలుసు, మీరంతగా చెప్పాలా" అంటూ, పీటమీద కూర్చోపెట్టి, కొప్పుమీద నీళ్లు చల్లి బాగా కడిగి, చాకుతో కొప్పుతీయటం ప్రారంభించాడు. నేను ఆత్రతగా చూస్తూనే వున్నాను. వాడు కొప్పు తీస్తూనే వున్నాడు. ఆశ్చర్యం కొప్పు తీయటం అయిపోయింది. ఒక్క కురుపుగాని, అసలు అవి వుండే మచ్చలు కూడా లేవు. నున్నగా వుంది. అతను నావైపు ఎగాదిగా చూసి, "ఏం బాబూ! నీకు హాస్యం ఆడటానికి ఎవరూ దొరకలేదా! నన్ను హడలు కొట్టించేశారు కదండీ" అన్నాడు. "ఏమయ్యా! నీతో వేళాకోళం ఆడవల్సిన అవసరం నాకేముంది" అని జరిగింది చెప్పాను. దానికి అతను "అంతా ఆ ఏడుకొండలవాడి మహిమ." ఆ తండ్రి మొక్కు మరచిపోతే, ఏదోవిధంగా తన చెంతకు రప్పించుకుంటాడు బాబూ, ఈ రోజు శనివారం చాలామంచిరోజు. వెళ్లండి బాబు ఎళ్లి ఆ స్వామి దర్శనం చేసుకోండి. అతని మాటలకు అవును, ఆపదలువస్తే స్వామీ అని మొక్కుకొని, అవి తీరిపోతే మరచిపోవటం మానవనైజం. తండ్రీ నా కళ్లు తెరిపించావు. గూడూరు వరకు మాపాప తలలో ఉన్న కురుపులు, చీము, రక్తం తిరుమల చేరుకున్న పిదప మాయంకావటం - నీలీల కాక మరేమిటి స్వామి? అనుకుంటూ ఆ స్వామిని తనివితీరా దర్శించి వెంటనే నేరుగా కాళహస్తి చేరుకుని కాళహస్తీశ్వరుని దర్శనం చేసుకుని, ఆదివారం విజయవాడ చేరుకుని దుర్గమ్మను దర్శనం చేసుకుని ఎంతో ఆనందంగా ఇంటికి చేరుకున్నాము.



# యామునాచార్యుల మహిమ

శ్రీ ఆర్. వెంకట రమణారెడ్డి

విగాహే యామునం తీర్థం
సాధు బృందావన స్థితం।
నిరస్త జిహ్మగ స్పర్శే
యత్రకృష్ణః కృతాదరః॥

తమ భోదనల ద్వారా, రచనల ద్వారా, జీవనవిధానాల ద్వారా తాము తరించడమే కాక, సామాన్యులను గూడ తరింపజేసిన ఆళ్వారులు, ఆచార్యులు జన్మించి ప్రపంచానికి మోక్షమార్గాన్ని ప్రసాదించారు.

జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు, ఈ ముగ్గురును సత్యములే అని ప్రతిపాదించు 'విశిష్టాద్వైత' ఉత్తర మీమాంసా దర్శనమును, బహుధా ప్రచారముచేసి, లోకోత్తర కళ్యాణానికి, తన జీవన సర్వస్వాన్ని ధారబోసిన "భగవద్రామానుజులకు, అనేక విధాలుగా, మార్గదర్శకుడు, పరమగురువు అయిన మహాత్ముడే శ్రీ యామునాచార్యులు. అనగా ఆళవందార్లు మరియు ఇంకొక నామధేయం యమునాత్తురైవన్. శ్రీ యామునాచార్యులు, గొప్ప శ్రీవైష్ణవ సిద్ధాంత ప్రచారకులు, పండితోత్తములు యోగీశ్వరుడు, రచయిత అయిన శ్రీనాధమునిఆచార్యుల వారి మనుమడు.

ఉత్తరదేశయాత్రలు చేయు సందర్భముగా, శ్రీకృష్ణ నివాసస్థానంగా, హిందువుల విశ్వసించు మధురానగరంలో (ఉత్తరప్రదేశ్ లోనిది) యామునాచార్యులు తండ్రిగారైన 'ఈశ్వర మునికి' కలలో ప్రత్యక్షమై శ్రీవిష్ణువు శ్రీ వైకుంఠములో తనకు దివ్యరత్న సింహాసనమును అర్పించి నిత్య కైంకర్యములు చేయు నిత్యసూరి నీకు కుమారునిగా ఉదయించుచున్నాడని చెప్పెనట. అందువలననే, తరువాత కొంతకాలానికి, అనగా క్రీ.శ. 918 వ సంవత్సరము తమిళనాడులోని దక్షిణ ఆర్కాటు జిల్లాకు చెందిన "కాట్టుమన్నార్ కోయిల్" అని నామముగల "వీర నారాయణ పురమునందు, శ్రీ యామునాచార్యులవారు అవతరించారు. వీరి అవతారం గూర్చి వీరి తాతగారైన 'శ్రీనాధ మునులు" తన శిష్యుడైన 'ఉయ్యకొండార్' అనే పుండరీకాక్షులకు తెలియపరచి, తన మనుమడికి, సకాలంలో శ్రీవైష్ణవ మతాన్ని భోదించి, మతాన్ని ఉద్ధరించే బాధ్యతను ముందుగనే ఏర్పాటు చేశారు. అయినను, శ్రీ ఉయ్యకొండార్ 'మహానుభావులకు గాక ఇతని శిష్యుడైన 'మణక్కాళ్ నంబి' అనే 'శ్రీరామమిశ్రులకు' శ్రీ యామునాచార్యుల వారికి వారి తాతగారు నిర్దేశించిన జీవిత లక్ష్యాన్ని అందజేయు అవకాశం కలగడం విధి విచిత్రము.

పూవు పుట్టగనే పరిమళించు విధాన, శ్రీ యామునాచార్యులకు పిన్నవయస్సులోనే ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదము లందును, షడ్దర్శనములైన, సాంఖ్య, యోగ, న్యాయ వైశేషిక, పూర్వ, ఉత్తర మీమాంసాదుల యందును, ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండ్యూక, తిత్తిరి, ఐతరేయం, ఛాందోగ్య బృహదారణ్య అను దశోపనిషత్తుల యందును, వేదాంగములైన శిక్ష, వ్యాకరణ, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పముల యందును, ధర్మశాస్త్రముల యందును, శ్రుతులయందును, పదునెనిమిది స్మృతులైన, మను, అంగిరస, ఉశన, సంవర్త, బృహస్పతి, కాత్యాయక, దక్ష, వ్యాస, యాజ్ఞవల్క్య, శాతాతు యందును, రామాయణ, మహాభారత, భాగవత ఇతిహాసముల యందును, పదునెనిమిది పురాణములైన, బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, లింగ, వరాహ నారదీయ, మార్కండేయ, అగ్ని, భవిష్య, బ్రహ్మవైవర్త, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ పురాణముల యందును, తంత్రముల యందును, దివ్య ప్రబంధముల యందును, పురుషార్థములయందును, స్తోత్ర సాహిత్యముల యందును, విశేషప్రజ్ఞను పొందినారనుటలో సందేహములేదు.

అందుచేతనే శ్రీ యామునాచార్యులు, తన గురువు గారైన 'మహాభాష్యభట్టు' గారి వద్ద గురుకుల వాసం చేయునప్పుడు "అక్కియాళ్వాన్" అను విద్వజ్జన కోలాహలుడునే రాజాస్థాన ప్రాపకం పొందిన ఆస్థానపండితుడు, ఇతర పండితులవద్ద పన్ను వసూలు చేయు సందర్భముగా, వచ్చిన రాజభటులకు

"నవయం కవయాస్తు కేవలం
నవయం కేవల తంత్ర పారగాః
అపితు ప్రతివాది వారణ
ప్రకటాటోప విపాటన క్షమాః.

అనియు

"ఆశైలాదద్రి కన్యాచరణ
కిసలయన్యా సధన్యోప కంఠాత్
ఆరక్షోనీత సీతాముఖ
కమల సముల్లాస హేతోశ్చ సేతోః
ఆచ ప్రాచ్య ప్రతీచ్య
క్షితిధర యుగళాదర్క చంద్రావతంసా
న్మీమాంసా శాస్త్ర యుగ్మ
శ్రమ విమల మనా మృగ్యతాం
మాదృ శోన్యః.

అని ఆక్షేపించ గలిగారు.

అలా ఆక్షేపించడమేకాక, నిండుసభలో, రాజు, రాణీ గార్ల సమక్షములో, అంతవరకు పన్ను చెల్లిస్తూ అసంతృప్తితో బాధపడు ఇతర పండితులు షెహభాష్, అమనట్లుగా, శ్రీ అక్కియాళ్వాన్ పాండిత్యాన్ని పూర్వపక్షం చేసి, రాజుగారితో పందెం వేసిన మహారాణివారు ఆమందానందము చెందునట్లుగా చేసి, అర్థ సింహాసనాన్ని అధిష్టించి రాజు కాగలిగాడు.

రాజరిక మనుభవించుచుండినను, తన జీవిత లక్ష్యము అది కాదనే అసంతృప్తితో వ్యథచెందు సందర్భములో 'శ్రీరామమిశ్రుల' ఆకుంఠిత దీక్షా దక్షతతో, భగవద్గీతా రహస్యాలను, శ్రీవైష్ణవ సాంప్రదాయం ప్రకారం అభ్యసించి, తమ తాత ముత్తాతలు, నిర్దేశించిన కర్తవ్యాన్ని నెరవేర్చు దృఢ చిత్తంతో, సన్యసించి, యతీంద్రుడై, మతప్రతిష్ఠాపన కోసం, భగవత్ కైంకర్యం కోసం తన శేష జీవితాన్ని

# తిరుమల తిరుపతి దేవస్థానములు

# అభిషేక సేవలు

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆరు ఆలయాల్లో వారానికొకసారి జరిగే అభిషేక సమయంలో భక్తులు ఒక్కొక్కరు రు. 5-00లు టికెట్టు చెల్లించి అభిషేక దర్శనం చేసికొనవచ్చును.

1. శ్రీ వేదనారాయణస్వామి ఆలయం, నాగలాపురం.
2. శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం, నారాయణ వరం.
3. శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం, కార్వేటి నగరం.
4. శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం, అప్పలాయగుంట.
5. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం, మంగాపురం.
6. ఆలయ సముదాయం, ఋషీకేష్.

భక్తులు, యాత్రికులు ఈ విశేష సేవను దర్శించి కృతార్థులగుదురు గాక!

తి.తి. దేవస్థానములు, తిరుపతి.

వెచ్చించి, తరించి మనలను తరింప చేసిన మహనీయుడు శ్రీ యామునా చార్యుల వారు.

శ్రీ యామునాచార్యులవద్ద, శ్రీ మద్రామానుజుల మేనమామ యగు శ్రీశైల పూర్ణులు, శ్రీ వరదరాజస్వామి అంతరంగ భక్తులగు కాంచీపూర్ణులు, శ్రీరంగనాథ భక్తులైన పెరియనంబి, తిరుక్కోష్టి యుద్ నంబి, అంతేకాక, హరిజనుడైనప్పటికిన్ని భగవత్ భక్తితో, కైంకర్యముతో పరిపూర్ణుడైన మారనేర్నంబి మున్నగు మహాపండితు లెందరో శిష్యులుగా భాసిల్లారు.

శ్రీ యామునాచార్యులవారు 1) శ్రీస్తుతి 2) స్తోత్రరత్నం 3) గీతార్థ సంగ్రహం 4) ఆగమ ప్రామాణ్యం 5) సిద్ధిత్రయం 6) పురుష నిర్ణయం 7) మాయావాద ఖండనమను అనేక గ్రంథముల రచించి మనకందించినారు.

మరియు తిరుమల శ్రీవారి ఆలయంలో రోజూ తీర్థ కైంకర్యము చేయడానికి, తన శిష్యుడైన శ్రీ తిరుమలనంబిని నియమించి, తరువాత, శ్రీ తిరుమనంబి స్వామి సేవ చేయుటయేకాక, తన మేనల్లుడైన, భగవత్ రామానుజులను పిలిపించి, తిరుమల ఆలయంలోని మూలవర్లు శ్రీ మహావిష్ణు అవతారమైన శ్రీనివాసుడే అని నిర్ణయం చేయడానికి దోహదపడిన మహనీయుడు.

ఇంతియేకాక, తన అవతార సమాప్తి యందును, తన తరువాత, శ్రీవైష్ణవ సిద్ధాంతాన్ని ప్రచారముచేయడానికి భగవత్ రామానుజులను, బద్ధ కంకణున్ని చేయడానికి, తన కుడిచేతి వ్రేళ్ళు మూడింటిని ముడుచుకొని, శ్రీ రామానుజులు చేత, తాను (1) బ్రహ్మ సూత్రాలకు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రకారము శ్రీభాష్యం వ్రాయగలననీ (2) ఆళ్వారుల సాంప్రదాయాన్ని నిలబెట్టగలననీ (3) తన తర్వాత గూడ సమర్థుడైన ఆచార్యులను పీఠానికి వారసునిగా నిలుపగలననీ ప్రతిన పూనించుకొని గానీ, ముడుచుకున్న తన వ్రేళ్ళను, సవరించుకోలేని మహానుభావుడు శ్రీ యామునాచార్యులవారు. ✪

# భక్తిమార్గంలో భారతీయ స్త్రీలు

శ్రీమతి డి. భారతి

కర్మ జ్ఞాన భక్తిమార్గాలలో భక్తిమార్గం సులభమైంది, అందరికీ అందుబాటులో ఉండేదనే విషయం జగత్ప్రసిద్ధం. ఒక్కో సందర్భాన్ని బట్టి భక్తి అంటే ప్రేమ, దయ, సేవ, వినయం అని అనేకార్థాలను చెబుతుంటారు. భారతదేశ చరిత్రలో భక్తిమార్గాన భగవంతుని సన్నిధి చేరినవారిలో స్త్రీలు చాలామంది ఉన్నారు. భగవంతుని చేరుకోవటానికి భక్తిమార్గం ప్రధానమైనది. ఇంట్లోను, సమాజంలోను, కేంద్రబిందువుగా నిలబడిన స్త్రీ తన కుటుంబసభ్యుల అభివృద్ధికోసం, దేశాభ్యుదయం కోసం జీవితం సాగిస్తూ ఉంటుంది. సహనానికి ప్రతీక అయిన మహిళ భక్తిమార్గప్రచారంలో పురుషులకెవ్వరికి తీసిపోలేదు. అంతేకాదు పురుషులకంటే ఒక అడుగు ముందే ఉందనడానికి మన చరిత్రలో ఎన్నో ఆధారాలున్నాయి. ప్రతి కుటుంబానికి స్త్రీ మకుటంలేని మహారాణి కాబట్టి సమాజంలో స్త్రీలద్వారా త్వరత్వరగా భక్తి మార్గవికాసం కలగడానికి అవకాశం ఎక్కువ ఉంది. భక్తికి సత్యం ధర్మం, శాంతి, ప్రేమ అనేవి నాలుగు స్తంభాల్లాంటివి.




"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ"

మోక్షసాధన సామగ్రిలో భక్తి చాలా శ్రేష్ఠమైందని, దానిద్వారా మనిషి సమగ్రతను, సంపూర్ణ వ్యక్తిత్వాన్ని పొందుతాడు అని పెద్దలు చెబుతారు. భగవంతుని పొందటానికి విభిన్న దశలవారికి వేర్వేరు మార్గాలు సూచింపబడినాయి. అవి. (1) నిష్కామ కర్మ (2) ఆత్మజ్ఞానము (3) భగవద్భక్తి. కర్మ, జ్ఞాన, భక్తి యోగాలు భగవంతుడి అనుగ్రహం పొందటానికి కావలసినవి. భక్తిని తొమ్మిది విధాలుగా భాగవతం విభజిస్తోంది:

శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మ నివేదనమ్॥




ఈ నవవిధ భక్తిమార్గాలలో ఆత్మనివేదన భక్తి కంటే శరణాగతి చాలా ముఖ్యమైంది. ఈ మార్గాన్ని ఆశ్రయించిన గోపికలు శ్రీకృష్ణభక్తులై ఆయననే తన సర్వస్వంగా భావించి మధురభక్తితో ముక్తిని పొందారు. గోపికలు సర్వస్వం పరమాత్మకే అంకితం చేశారు.

స్త్రీలు సనాతనకాలం నుంచి ఆధ్యాత్మిక రంగంలో మార్గదర్శకులుగా నిల్చారు. స్త్రీల భక్తివికాసం వేదకాలంనుండి, పురాణకాలం నుండి చారిత్రక యుగంలో, ఆధునికయుగంలోను కనిపిస్తుంది. గృహిణిగా, తల్లిగా,

కోడలిగా, చెల్లిగా, అత్తగా తీర్చిదిద్దుతుంది స్త్రీ. భక్తిమార్గం సమాజవికాసానికి తోడ్పడి మానవునికి ముక్తిని ప్రసాదిస్తుంది.

స్త్రీ సాధించనిదంటూ లేదు. స్త్రీ శక్తిస్వరూపిణి. పరమాత్మ భగవంతుడు సమస్త శక్తి స్వరూపం. ఆదిశక్తి పార్వతికూడా మోక్షప్రదాయిని అని ఆధ్యాత్మ రామాయణంలో చెప్పబడింది. మానవులు తరించటానికి మోక్షానిచ్చే ఉపాయం చెప్పమని పార్వతి శివుని అడిగింది. అప్పుడు శివుడు శ్రీరామనామాన్ని ఉపదేశించాడు.

"శ్రీరామ రామ రామేతి
రమే రామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం
రామనామ వరాననే॥"

శ్రీరామ నామాన్ని జపిస్తే మోక్షాన్నిస్తుందని పెద్దలు చెబుతారు.

పార్వతి శివుడికోసం కఠినమైన తపస్సు చేసి శివుని మెప్పించి వివాహం చేసుకొన్నది. ఇది పార్వతి శివభక్తికి మంచి నిదర్శనం.

వేదకాలంలో స్త్రీలు సభలలో పాల్గొని వేదాంతాది శాస్త్రాల చర్చల్లో పాల్గొనేవారు. జనకుని సభలో యాజ్ఞవల్క్యుడితో వేదాంత చర్చల్లో వాదించింది గార్గి. యాజ్ఞవల్క్యునికి ఇద్దరు భార్యలు. రెండో భార్య మైత్రేయి. యాజ్ఞవల్క్యుడు తనకున్న సమస్త ధనాన్ని భార్యలకు పంచి ఇవ్వాలని అనుకున్నాడు. అప్పుడు మైత్రేయి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి ఇవ్వమని భర్తను కోరింది. స్త్రీలలో ఆధ్యాత్మిక తత్త్వాన్ని సృష్టించింది మైత్రేయి.

సతీఅనసూయ :

ఈమె అత్రి భార్య. భర్తనే దైవంగా భావించి భక్తితో ఆరాధిస్తే పొందేశక్తి ఈమె లోకానికి తెలియ చెప్పింది. ఈమె సీతకు పాతివ్రత్యాన్ని బోధించింది. ఈ పాతివ్రత్యంతోనే లంకలో రావణుణ్ణి ఎదిరించగల్గింది సీత.

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి
- మీ ప్రయాణానికి కావలసిన టిక్కెట్లను, తిరుమలలో వసతిని ముందుగా ఏర్పాటు చేసుకోండి.
- శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీ వరాహస్వామిని పూజించండి.
- స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి
- ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి.
- ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ 'ఓం శ్రీవేంకటేశాయ నమః అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- తిరుమల సమీపంలోవున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని వలసిన సమాచారంకోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

## తిరుమలలో చేయకూడనివి

- విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద వుంచుకోకండి.
- మాంసాహారాన్ని భుజించకండి.
- ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి
- పొగత్రాగకండి.
- వసతి సౌకర్యంకోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ఆలయంలో సాష్టాంగ దండప్రణామాలు చేయకండి.
- వీధి వర్తకులనుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశములతో తిరుమలకు రాకండి.
- శ్రీవారి దర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయుటలవంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ఆచార వ్యవహారాల ప్రకారం అలయ్యార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజకే.

## సీతాదేవి :

రామాయణకాలంలో స్త్రీలు భక్తిప్రపత్తులతో ఉండేవారు వారిలో శ్రీరాముని భార్య సీతాదేవి పతివ్రతా శిరోమణి. భర్త అడుగు జాడల్లో నడచుకొన్నది. భర్తే దైవంగా భావించింది. ఈమెను రావణుడు మోహించి లంకకు ఎత్తుకుని పోయాడు. అయినా సీత అతనికి లొంగక తన పాతివ్రత్యాన్ని లోకానికి తెలియజేసింది. రాముడు లోకాపనిందకోసం సీతాదేవిని అగ్నిప్రవేశం చేయమనగా సీత నిస్సంకోచంగా అగ్నిప్రవేశం చేసిన మహాసాధ్వి. ఎన్నికష్టాలయినా భరించి భర్తతో అడవులకు వెళ్ళింది. భర్త ఎక్కడ ఉంటే అక్కడే స్వర్గం అని భావించింది సీత. సకల భోగభాగ్యాలను వదలి అడవులకు వెళ్ళి నార చీరలు ధరించింది. పతిభక్తితో ఈమె స్త్రీలకు ఒక ఆదర్శాన్నందించింది.

## కౌసల్య :

ధశరథుని భార్య. శ్రీరామచంద్రునకు తల్లి. త్రేతాయుగంలో స్త్రీలు ధర్మానికి అన్నివిధాలా కట్టుబడి ఉండేవారు. కౌసల్య తన మందిరంలోనే నిత్యం పూజాది కార్యక్రమాలు నిర్వహించేది. ఈమె భక్తితో భగవంతుని పూజిస్తూ పుత్రుని ఎడబాటును సహింపగల్గిందని రామాయణం చెబుతున్నది.

## అరుంధతి :

వశిష్ఠుని భార్య. వశిష్ఠుడు ఇసుకను అన్నంగా మార్చగల శక్తి ఉన్న స్త్రీని వివాహం చేసుకోవాలని చూసాడు. అప్పుడు అరుంధతి భగవంతుని భక్తితో ప్రార్థించింది. ఈమె భక్తికి ఏకాగ్రతకు భగవంతుడు మెచ్చి ఇసుకను ఉడికించి అన్నంగా మార్చగల శక్తినిచ్చాడు.

## శబరి :

బోయకులంలో పుట్టింది శబరి. గురు భక్తి కలిగి నిష్ఠతో ఉండేది. శ్రీరామచంద్రుణ్ణి భగవంతునిగా గుర్తించింది. రామునిరాక కోసం గాయిత్రీ ఉపాసనం చేస్తూ ఉత్కంఠతో ఎదురుచూసింది. ఆశ్రమాన్ని ముగ్గులతో అలంకరించింది. ఫలాలను ప్రేమతో రామునికోసం దాచి ఉంచింది. పండ్లు తియ్యగా ఉన్నవో లేవో కొరకి చూసి ఎంగిలి పండ్లను ప్రేమతో శ్రీరామచంద్రుని కందించింది. ప్రేమస్వరూపి అయిన రాముడు వాటిని ఆనందంగా స్వీకరించాడు. ఈమె భక్తికి ఇది చక్కని నిదర్శనం. శబరి స్త్రీలకు భక్తిగాథల నెన్నో ఉపదేశించింది.

రాముని దర్శించి అతని పాదాలదగ్గర ప్రాణాలు విడచిన మహాభక్తురాలు ఆమె.

## ద్రౌపది :

పాండవుల పత్ని ద్రౌపది. ఈమె చాలా భక్తురాలు. శ్రీకృష్ణుని భగవంతునిగా ఆరాధించింది. ద్రౌపది వస్త్రాపహరణం జరిగినపుడు ద్రౌపది శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించింది. కృష్ణుడు ఆమెను రక్షించాడు. ధర్మం ఎప్పుడూ మంచి వైపే ఉంటుందని లోకానికి చాటిచెప్పిన స్త్రీ ద్రౌపది. ఇంక కుంతి, సత్యవతి, సుభద్ర, గాంధారి వీరందరూ కూడా శ్రీకృష్ణుని భక్తులే.

## రుక్మిణి :

ఈమె శ్రీకృష్ణుని తన సర్వస్వంగా ఆరాధించింది. తన భక్తిద్వారా పరమాత్మనే గెలుచుకుంది. ఈమె ఒక్క తులసీదళంతో కృష్ణుని అనుగ్రహం పొందింది. ఈమె శక్తి స్వరూపిణి అయిన ఈశ్వరిని ప్రార్థించి ఆమె ఆశీస్సులందుకొంది. రుక్మిణి నిరహంకారి.

## సత్యభామ :

శ్రీకృష్ణుని మధురభక్తితో ఆరాధించింది. యశోద కూడా కృష్ణుని భగవంతునిగా గుర్తించ లేకపోయింది. కానీ సత్యభామ కృష్ణుడు చేసిన మహిమలకు అతనిని భగవంతునిగా గుర్తించింది. ఆయన తన ఒకడికే స్వంతమని మొదట భావించిన తరువాత ఆయన సర్వలోకనాథుడైన పరమాత్మ అని గుర్తించ గలిగింది.

## గోపికలు :

మధురభక్తిలో అన్నీ మరచిపోయి శ్రీకృష్ణుని మెప్పించి ముక్తిని పొందారు. గోపికలతో కృష్ణుడాడిన రాసక్రీడలన్నీ భక్తిక్రీడలే. సమస్త సంసారబంధాల్ని తెంచుకుని నీవే సర్వస్వం అని శరణు వేడినవారు గోపికా స్త్రీలు. "గోపిక" అంటే గొల్లతనం కలది. గొల్లతనం అంటే అజ్ఞానం. గోపికలు కృష్ణునికి చాలా దగ్గరగా ఉండేవారు. మనసా, వాచా, కర్మణా సాత్త్విక గుణంకల్గి భగవంతుని ఆరాధించేవారు. భగవంతుని యందే తప్ప వేరే దానియందు మనస్సు నిలపలేక అతడే సర్వస్వము అనే భావన కల్గి ఉన్నారు గోపికలు. ద్వాపరయుగంలో గోపికలు అన్నాహారాలు మాని ఆత్మనివేదన భక్తితో కృష్ణుని పూజించారు.

## గోదాదేవి :

ఈమె విష్ణుభక్తులైన పన్నిద్దరు ఆళ్వారులలో ఏకైక మహిళ. ఈమె ఆండాళ్ అనికూడా పిలువబడుచున్నది. ఈమె వైష్ణవ భక్తురాలు. శ్రీ విల్లిపుత్తూరులోని విష్ణువునకు మహాభక్తుడు విష్ణు చిత్తుడు. ఆయనకు అనేకరకాల పుష్పాలతో శోభించే నందనవనం ఉన్నది. ఈయనను పెరియాళ్వారు అని కూడా అంటారు. ఒకనాడు తులసి వనంలో అద్భుతకాంతితో వెలుగుతూ ఒక శిశువు కనపడింది. ఆ శిశువును తీసి కొని "గోదా" అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచాడు. భూ దేవ్యంశతో అవతరించిన గోదాదేవి వనంలోని పూలను కోసి వాటిని మాలగా కట్టి ముందుగా తాను ధరించి విష్ణువునకు సమర్పించేది. విష్ణువు ఆ మాలలను ప్రీతితో స్వీకరించేవాడు. గోదాదేవి "తిరుప్పావై" అనే గ్రంథం వ్రాసింది. ఈమెకు తిరు వేంగడనాథునిపై ఎంతో భక్తి ఉండేది. శ్రీ వేంకటేశ్వరుని దర్శనమునకై నిత్యము తహ తహ లాడేది. గోదాదేవి 140 గాథలు గల "నాచ్చియార్ తిరుమొళి" అనుకృతిని కూడా రచించి ఎనలేని కీర్తి పొందింది. ఈమె వటపత్రశాయినే ధ్యానించి, ప్రేమించి, ఆరాధించి అతనిలోనే ఐక్యమైన ప్రేమమూర్తి. ఈమె మధురభక్తి వర్ణనాతీతం. భగవంతుని అనుగ్రహం పొందాలనే తపనతో పాడిన పవిత్ర పూమాల "తిరుప్పావై".

## హెచ్చరిక.....

రాష్ట్రంలోను, రాష్ట్రేతరమైన కొన్ని ప్రాంతాలలోను కొందరు వ్యక్తులు తాము తి.తి. దేవస్థానం ఏజెంట్లమని, తిరుమలనుంచి శ్రీవారి ప్రసాదాలను, క్యాలండర్లను, ఆర్జితసేవ టికెట్లను తెప్పించి ఇస్తామని నమ్మించి అధిక మొత్తంలో ప్రజల నుంచి సొమ్ము వసూలుచేసి మోసం చేస్తున్నట్లు మా దృష్టికి వచ్చింది.

ఇది పచ్చి మోసం తప్ప మరేం కాదు.

తిరుమల శ్రీవారి భక్తులందరూ ఈ విషయాలను గమనించి మోసపోరాదని తెలియజేస్తున్నాము.

* శ్రీవారి ప్రసాదాలు తిరుమలలో తప్ప మరెక్కడా అమ్మబడవు.
* శ్రీవారి ఆర్జితసేవల టికెట్లు తిరుమలలో ఆర్జితం ఆఫీసులో లభిస్తాయి. అలాకాక ముందుగా కూడ ఆ యా సేవకు తగినంత రుసుమును డి.డి. ద్వారా పంపి మీరే ఖరారు చేసుకోవచ్చు. (అయితే కనీసం రెండు నెలల ముందుగా మీరు తేదీ ఖరారు చేసుకొని డి.డి. పంపవలసి వుంటుంది).
* దళారీలను నమ్మకండి.
* తిరుమల తిరుపతిలలో వున్నప్పుడు మీకు ఏదైనా ఇబ్బంది కలిగితే సమీపంలోని తి.తి.దే. అధికారిని కలవండి.
* దూరప్రాంతాలవారు ఆ ప్రాంత సమీపంలోని తి.తి.దే. సమాచార కేంద్రాన్నో, కళ్యాణ మండపంలోని అధికారులనో కలిసి అన్ని వివరాలు తెలుసుకోవచ్చు.

సంపాదకుడు

ఇహలోక సంపదను, శ్రీప్రదమగు భగవచ్చింతనను అందించే వ్రతమే "తిరుప్పావై వ్రతము". ఇది మార్గశిరమాసంలో ఆచరింపబడుతుంది. ఉపనిషత్తుల రహస్యాన్ని, నాలుగు వేదాల తత్త్వాన్ని పురాణ సారాన్ని ప్రతిపాదిస్తూ, గీతామృతంలో మంచి "తిరుప్పావై" అని దివ్యప్రబంధాన్ని అందించింది గోదాదేవి.

**మీరాబాయి :**

శ్రీకృష్ణుని భక్తితో పూజించి తన జీవితాన్ని ఆయనకే అంకితం చేసింది. ఎప్పుడూ మందిరంలో కూర్చుని కృష్ణుణ్ణి భక్తితో కొలుస్తూ ఉండేది. మధురభక్తితో కృష్ణుని మీద భజనలను లోకానికందించింది. ఈనాడు మీరాభజన్ లోకప్రసిద్ధమైంది.

**జానాబాయి :**

ఈమె భక్తితో పండరీనాథుని పూజిస్తూ పిడకలు చేసుకుని బ్రతికే స్త్రీ. ఒకసారి తన పిడకలు వేరే ఆవిడ తీసుకొని అవి నావేనని వాదించింది. ఈ పిడకలు నీవేనని ఏమిటి ఆధారం అని అన్నది. అప్పుడు జానాబాయి ఆ పిడకల్లో పండరీనాథుని నామ సంకీర్తనం వినిపిస్తుంది. వినమని సమాధానం చెప్పింది. ఆమె వినగా నిజంగానే పండరీనాథుని నామ సంకీర్తనం వినిపిస్తుంది. కర్మద్వారా భగవంతునికంకితమై భక్తితో జీవితం గడపవచ్చునని స్త్రీలకు చాటిచెప్పిన పరమసాధ్వి జానాబాయి. భక్తి మార్గంలో నడచి పరమాత్మను మెప్పించి సేవలు చేయించుకున్న స్త్రీలలో పండరీబాయి, సతీసక్కుబాయి, సంతోషిమాత మొదలగువారు కూడా పరమ భక్తులు.

ఆధునికకాలంలో పతిభక్తిలో మిన్నమైన స్త్రీలలామ శారదామాత. ఈమె రామకృష్ణ పరమహంస భార్య. భర్తనే దైవంగా భావించి అతని అడుగుజాడల్లో నడచికొని భక్తిమార్గాన్ని లోకానికి చాటిచెప్పి చెప్పిన వనితారత్నం శారదాదేవి. ఈమె భక్తిని, జ్ఞానాన్ని స్త్రీలకు బోధించింది.

వేదకాలంనుండి ఆధునికకాలం వరకు భక్తితత్త్వం స్త్రీల ద్వారా వికాసం పొందుతూనే ఉంది. స్త్రీత్వం భక్తి వికాసానికి ఒక అర్హత. భక్తిమార్గప్రచారం స్త్రీల ద్వారా జరిగితే త్వర త్వరగా సమాజంలో వికాసం ఏర్పడుతుంది.

కుటుంబవ్యవస్థలో సమాజవ్యవస్థలో మహిళకు సంక్రమించిన స్థానం అద్వితీయం. కుటుంబసభ్యుల మంచిచెడ్డలను గమనిస్తూ వారి అభివృద్ధికి దోహదం చేసే వ్యక్తిగా తల్లిగా, భార్యగా, ఆడపిల్లగా, కోడలుగా స్త్రీమూర్తి ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకుంటోంది. కుటుంబసభ్యుల మనస్సులను, హృదయాలను భక్తిమయ భావనలతో తీర్చిదిద్ది వారి జీవితాలకు ఒక అర్థాన్ని పరమార్థాన్ని సంపాదించే శక్తి భారతీయ స్త్రీకి తరతరాల నుంచి సంక్రమించింది. కుటుంబంలోలాగాక ఈ సమాజ గమనానికి భక్తివికాసానికి, ఆధ్యాత్మక చింతనకు యుగయుగాలలో భారతీయ మహిళలు అందించిన సేవలు ప్రసంసనీయమైనవి.

"యత్ర నార్యస్తు పూజ్యన్తే
రమన్తే తత్ర దేవతాః"

(16వ పేజీ తరువాయి)

క్రోధాగ్నితో దహించుకు పోతూ ఉన్నారు. ఇందుకు కారకుడు ఆ గోపీమనోహరుడే.

"అంతగ మామలున్మగలు నత్తలు
తత్కథలాడుకొంచు దా
మంతట వాపి వేసెదరు యక్కట
యేదుట కేగినంత, మే
మంతగ నేమి చేసితి మయా
యఘముల్ తొలిజన్మవాని దే
వెంతట నింటగూడ వెలిపెట్టెదు
వంతవి, మోయి, షట్పదా!"

"ఓ భ్రమరమా! ఈ విధంగా నీకు మా గోడు వినిపించటంవల్ల ఏమి ప్రయోజనం ఉంది? మా పరిస్థితి చాలా క్లిష్టమైనది, అతి సుకుమారమైనది. మా మనస్సులను మోహనాంగుడగు కృష్ణునికి అర్పించాం, శరీరాలను మాత్రం మా భర్తలకు అప్పగించాం. మా భర్తలు మమ్ములను క్షమిస్తారు. కాని మా అత్తలు మాత్రం మా మనస్సులను పరీక్షిస్తారు. ఆయన మా కోరికలు నెరవేర్చడు; మేము అన్నివిధాల దుఃఖాలపాలైనాం. శ్రీకృష్ణవియోగం వల్ల మా గోవులన్నీ బక్కచిక్కిపోయినాయి. అట్లాగే మేముకూడా బహు క్షీణించిపోయినాం. మా మానసచోరుడు మమ్ములకు వదలిపెట్టి వెళ్లినప్పటి నుండి మా పరిస్థితి ఇట్లాగే ఉన్నది.

"ఓ మధుపమా! వసంతం రాగానే నీ మనస్సు నవవికసిత సుమనములయందు లగ్నమౌతుంది. ఇదివరకు నీవు స్పృశించి వదలి పెట్టిన కుసుమాలతో నీకేం పని? అన్ని విధాల మేము ఇక్కడ యిక్కట్లపాలైనాం. మా ఇండ్లు మాకు నరకప్రాయాలైనాయి. వనంలోకి పోతే వనమాలియొక్క వియోగంతో పీడింపబడుతున్నాం. అచ్చటి ప్రకృతి శోభ మా విరహ వేదనను ఉద్దీప్తపరుస్తూ ఉంది. ఉన్న ఈ ఏడుపు చాలక ఈ ఉద్ధవుడు తెచ్చిన సందేశం ఒకటి. ఇంతకంటె మమ్ములను ఒక్కసారి చంపి పారేస్తే సంతోషిస్తాం. ఎవరికోసం ఈ సందేశం? పల్లెటూళ్లో పడి ఉండే మాకు ఇదేమి అర్థమౌతుంది? "వెళ్లి ఆ నగరవాసులకు వినిపించు.

"కృష్ణుడు మధువైరి. ఆయనకు తియ్యందనం గిట్టదు. ఆయన కేవలం శారీరకంగానే గాదు, మానసికంగా కూడా నల్లనివాడు. ఆయన ఉత్త మోసగాడు. మాకు ఇప్పుడీ విషయం తేటతెల్లమైంది. ఇదంతా తెలిసి కూడా చిన్నప్పటినుంచీ మేము ఆయనను ప్రేమిస్తున్నాం మేము ఆయన మనస్సులోకి ఎక్కటం లేదు; మేము బాధ ఇంకా భరించలేం."

ఈ విధంగా గోపికల ఉపాలంభన వాక్యాలను చెప్పిన తరువాత కవి వారి ద్వాదశ అనంగదశలను (దృక్, మనస్సంగత్వం, సంకల్పం, ప్రలాపం, జాగరణ, కార్శ్యం, ఆర్తి, లజ్జారహితం, సంజ్వరం, ఉన్మాదం, మూర్ఛ, మరణం) వర్ణించాడు. ముముక్షువులైన గోపికలు తమ విరహానుభూతిని ఒక ఉత్సవంగా చేసుకున్నారు. అందులో విషాదంగాని, దుఃఖం గాని లేదు. క్రమక్రమంగా వారికి పరమాత్మ యొక్క తత్త్వం బోధపడింది.

చివరకు గోపికలు ఉద్ధవునితో, "మేము స్త్రీలముకాదు, మాకు విరహము లేదు; ఇక నీ సందేశం ఎందుకు? శ్రీకృష్ణుడు సచ్చిదానంద స్వరూపుడు. ఆయన మా మనస్సులను తనమీద లగ్నమయ్యేటట్లు ఎందుకు చేసుకున్నాడు? మాలో రజోగుణము లేదు, తమోగుణము లేదు. కాని మాకు ఏ ఆలోచన వచ్చినా ఆయనను తలచుకుంటాము. ఆయన మాకు జ్ఞానాన్ని ప్రసాదించాడు. చిన్నతనంలో ఆయన వనంలోకి వెళ్లి దాగుకునేవాడు. ఆయన ఎక్కడైనా దారితప్పిపోతాడేమోనని మేము భయపడేవాళ్లం. ఆయన పరమాత్మ అని మాకు అప్పుడు తెలియదు. ఇప్పుడు ఆయన మధురానగరంలో దారి తప్పి తిరుగుతున్నాడు. ఆయన త్రైగుణ్య నిష్ఠుడు. ఆయన ఈశ్వరుడు. మేము జీవులం. ముక్త జీవుల స్వామి వేరు, లోకేశ్వరుడైన స్వామి వేరు.

దేవాలయాలలో మూలవిరాట్టు ఉంటాడు. ఉత్సవ విగ్రహాలను చలిచప్పరాలలో కూర్చుండబెట్టి ఊరేగిస్తారు. మా హృదయాలు చలిచప్పరాలు. మూలవిరాట్టుయొక్క ఉత్సవ మూర్తి మా హృదయాలలో కూర్చొని ఊరేగుతున్నాడు. మధురలో ఊరేగేవాడు మూలవిరాట్టు. ఆతడు ప్రజ్ఞానిరత స్వరూపుడు. బ్రహ్మచైతన్యమూర్తి. ఆ మూర్తి సమస్త జీవరాసులయందు వ్యాపించి ఉంటుంది. ఆ మూర్తి మా హృదయాలలో బంధింపబడి ఉండటానికి ఇష్టపడదు. అందువలన విశాలమైన నగర వీథులలో ఊరేగుతూ ఉన్నాడు.

ఈ విధంగా గోపికలు తమకు ఉపదేశించటానికి వచ్చిన ఉద్ధవునికి భగవత్తత్వాన్ని బోధించి పంపుతారు.

హిందీ తెలుగు సాహిత్యాలలో భ్రమర గీత పరంపర ఇట్లు కొనసాగినది. ఎవరికి ఏ పద్ధతి, అనగా నిర్గుణపద్ధతిగాని, సగుణ పద్ధతి గాని, నచ్చితే దానిని అవలంబించి పునీతులై మోక్షార్హులు అగుదురుగాక! 

## నిత్యాభిషేకం

తిరుపతి కపిలతీర్థంలోని శ్రీ కపిలేశ్వరస్వామివారికి నిత్యాభిషేకం సేవను నూతనంగా ప్రారంభించారు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు సంవత్సరానికి రు.42-00లు చెల్లించాలి.

శాశ్వతంగా చేయించదలచుకున్న వారు రు. 500/- + 42/-లు చెల్లించాలి.

సంవత్సరానికి రెండు పర్యాయములు, ఇద్దరు వ్యక్తులను ఈ సేవను దర్శించటానికి అనుమతిస్తారు.

దర్శించండి! తరించండి!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం ఆలయ కళ తిరుపతి

# SRI VENKATESWARA MUSEUM ON TEMPLE ART TIRUPATI

కాలము:
ఉదయం 8 గం.
నుండి రాత్రి 8 గం.
వరకు

ప్రవేశ రుసుము:
పెద్దలకు రు. 1.00
పిల్లలకు రు. 0.50

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శన శాల





శ్రీ గోవిందరాజ స్వామి వారి ఆలయానికి ఉత్తరం వైపున తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురావస్తు ప్రదర్శన శాల ఉంది.

ఇందులో వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్ప ప్రమాణ శాస్త్రము, శిల్ప శాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, ఆయుధాలు, శాసనాలు, సంగీత సాధనాలు మొదలైన ఎన్నో విషయాలు చూడవచ్చు. 8వ. శతాబ్దం నుంచి నేటి వరకు లభించిన ఎన్నో అపూర్వ శిల్పాలు ఛాయాచిత్రాలు దారు మూర్తులు కూడ ఇందులో దర్శించవచ్చు.





'చంద్రశేఖర్'



# హనుమంతుని బుద్ధిబలం

బులుసు - జీ - ప్రకాష్

ఆంజనేయుడు ఫలభ్రాంతి చేత సూర్య బింబాన్ని మ్రింగబోగా, ఇంద్రుడు వజ్రాయుధం చేత పడగొట్టినాడు. వజ్రాయుధం వలన ఎడమచెంపపై దెబ్బ తిన్నవాడవడం వలన 'హనుమంతు' డని పిలువబడినాడు.

"తతశ్శైలాగ్ర శిఖరే
వామో హను రభజ్యత
తతోహి నామధేయం తే
హనుమానితి కీర్త్యతే"

హనుమంతుడు బాల్యంలో ఏ సూర్యుని ఫలభ్రాంతిచేత మ్రింగబోయినాడో ఆ సూర్యుని వద్దనే సకలశాస్త్రాలను అభ్యసించినాడు. అతనిని నవ వ్యాకరణ పండితుడని కూడా పిలుస్తారు. బుద్ధిబలంలోనూ, కీర్తి, ధైర్యం, నిర్భీతి, వాక్చతురతలోనూ హనుమంతుడు గొప్ప దిట్ట అని ఖ్యాతిగాంచినాడు.

హనుమంతుని బుద్ధిబలానికి నిదర్శనాలు చాలా వున్నవి. పంపాసరోవర తీరంలో రామలక్ష్మణులను చూడగానే, వాలియే ఈ రూపంలో వచ్చినాడేమో అని సుగ్రీవుడు భయపడి, తన సర్వసైన్యంతోను ఋశ్యమూక గిరి మీదికి పారిపోయినాడు. ఋశ్యమూక గిరిమీదికి వాలి వస్తే మరణిస్తాడు. కనుక సుగ్రీవుడు భయపడవలసిన అవసరంలేదు. కాని, మతిస్థిమితం లేకపోవడం వలన సుగ్రీవుడు దుఃఖిస్తుండగా - హనుమంతుడు - "ఇది ఋశ్యమూక పర్వతం. ఇక్కడికి వాలి వస్తే నశిస్తాడు. నీ చిత్త చాంచల్యం వలన నీ కోతి బుద్ధి చూపుతున్నావు" అంటాడు. తను కోతి అయివుండి, ఎదుటివానిని కోతిబుద్ధి చూపుతున్నావన్నప్పుడు మనకు నవ్వు రాక మానదు.

"సంభ్రమస్త్యజ్య తామేషః
సర్వైర్వాలికృతే మహాన్
మలయోయం గిరివరో
భయం నే హాస్తి వాలినః
అహో! శాఖామృగత్వం తే
వ్యక్త మేవ ప్లవంగమ
లఘు చిత్త తయాత్మానం
న స్థాపయసి యో మతౌ"

వచ్చిన రామలక్ష్మణులను చూచి, వారిని కలుసుకుని, వారెవరో తెలుసుకొనమని, సుగ్రీవుడు తన మంత్రి అయిన హనుమంతుని పంపినాడు. హనుమంతుడు కామరూపి అవడం వలన ఒక సన్న్యాసి వేషంలో రామలక్ష్మణుల సమక్షానికి వెళ్లినాడు. సన్న్యాసి గృహస్థులకు శాస్త్రరీత్యా నమస్కరించకూడదు. ఐనా రామలక్ష్మణుల అందచందాలకు ముగ్ధుడై, వారికి నమస్కరించి, తను సన్న్యాసి వేషంలో వున్నట్టు మరచి, తనను గూర్చి వారితో ఇట్లు చెప్పినాడు:

"ధర్మాత్ముడగు సుగ్రీవుడు మీచెలిమి కోరుచున్నాడు. ఆ సుగ్రీవుని సచివుడనగు నేను వానరుడను. పవన పుత్రుడను. సుగ్రీవుని కార్యసిద్ధికోసం భిక్షురూపంలో వున్నాను. ఋష్యమూక గిరినుండి వస్తున్నాను. నేను కోరిన రూపాన్ని ధరించగలను. అనంతమైన దూరం ప్రయాణించగలను"

సుగ్రీవ సచివుడైన హనుమంతుని ఋజు, హితవాక్యాలకు - అతడు వేదోక్తంగానూ, వ్యాకరణయుక్తంగానూ ఆడిన మధురభాషణాలకు రాముడు ముగ్ధుడైనాడు. చతుర్వేదాలలోనూ, వ్యాకరణంలోనూ ఆయనకు గల పాండితిని ప్రశంసించాడు.

పిమ్మట హనుమంతుడు రామలక్ష్మణులను చూచి, తామెవరో, ఎందుకీ పంపా సరసీరానికి విచ్చేసినారో, తమ చరిత్రను తెల్పుమని కోరినాడు. ఇందుకు లక్ష్మణుడు తామిద్దరమూ అయోధ్యాపతి అయిన దశరథుని పుత్రులమని, తండ్రి ఆజ్ఞానుసారము అరణ్యవాసానికి రాగా, రావణుడు సీతను అపహరించినాడని, రావణుని వధించి సీతను చెరనుండి విడిపించే ప్రయత్నంలో సుగ్రీవుని మైత్రిని కోరుచున్నామని చెప్పినాడు. ఈ సమాధానం విన్న హనుమంతుడు మిక్కిలి ఆనందించినాడు. "బుద్ధిసంపన్నులూ, క్రోధేంద్రియాలను జయించినవారూ అయిన ఇట్టి సజ్జనుల స్నేహమే సుగ్రీవునికి వాంఛనీయము. అదృష్టం వలనే ఇట్టివారు సుగ్రీవునికి లభించినారు" అని తనలో తలపోసినాడు.

"ఈ దృశా బుద్ధి సంపన్నా
జిత క్రోధా జితేంద్రియాః
ద్రష్టవ్యా వానరేంద్రేణ
దిష్ట్యా దర్శన మాగతాః"

రామబాణం చేత వాలి వధింపబడగా, వాలి భార్య అయిన తార చాలా దుఃఖించింది. ఆమె దుఃఖోపశమనానికి హనుమంతుడు గొప్పతత్త్వాన్ని బోధించినాడు: "ప్రాణి జ్ఞానాజ్ఞానాలచే చేసుకొన్న స్వకర్మ ఫలితాలకు తగినట్టుగా సుఖదుఃఖాలను అనుభవిస్తుంది. అలాగే వాలి కూడా తను చేసుకొన్న కర్మవల్లనే మృతి చెందేదు. నీ ఆత్మను గురించి విచారించవలసిన నువ్వు, ఇంకొకరి ఆత్మ గురించి విచారింపడం ఎందుకు? నీటి బుడగ వంటి ఈ కాయంకోసం ఒకరికై నొకరు శోకింప పనిలేదు. అందరి శరీరాలు నశ్వరాలే!"

వాలి మరణానంతరం సుగ్రీవుడు కిష్కింధకు రాజైనాడు. సకల భోగాలను అనుభవిస్తూ మైకంలో పడి, రాముడు తనకు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం మరచినాడు. రాముడు క్రోధోద్రిక్తుడై సుగ్రీవుని పిలుచుకు రమ్మని లక్ష్మణుని ఆజ్ఞాపించక పూర్వమే భోగ లాలసత్వంలో మునిగిన సుగ్రీవుని హనుమంతుడు మేల్కొల్పినాడు. "రాజ్యము, కీర్తి, వంశాను క్రమంగా రావలసిన సిరి, నీకు లభించినవి. నీకు ఈ రాజ్యలక్ష్మి యశస్సులు లభించ డానికి హేతుభూతుడైన రాముని కార్యం మాత్రం మిగిలిపోయినది. అది నువ్వు తక్షణమే నెరవేర్చాలి. మిత్రుడు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం కాలానుగుణంగా ఎవడు చేస్తాడో, అట్టి సాధువర్తనుని రాజ్యం కీర్తి ప్రతాపాలతో అభివృద్ధి చెందుతుంది" అని తన ధర్మశాస్త్ర బద్ధమైన మంత్రాంగాన్ని ఉపదేశించినాడు.



తరువాత అశోకవనంలో సీతాదేవిని చూచినాడు. కాని ఆమె సీత అని అతనికేం తెలుసు? ఇందుకు సీతాదేవి విలాపాంలో వున్న విన్యాసాల ద్వారా ఆమె రాజపుత్రిక అయి వుండాలని నిశ్చయించినాడు. సీతాదేవి రోదిస్తూ నిట్టూర్పు విడిచింది. నేలను స్పృశించింది. రాజలక్షణాలు కలిగివున్న చిహ్నాలుండడం వలన దేవతాస్త్రీ మాత్రము కాదు. ఇదికాక సీతాదేవి అవయవాలన్నిటా శుభప్రదమైన సాముద్రిక లక్షణాలు కనబడ్డం వలన ఒక మహారాజుకు రాజ్ఞి అని, రాజపుత్రి అని గ్రహించినాడు. తను సీతాదేవిని చూచి, తనకు సాముద్రిక శాస్త్రంలో గల ప్రవేశాన్ని బట్టి సీతను పోల్చుకున్నానని చెప్పినాడు.

"రోదనాదతి నిశ్వాసాద్
భూమి సంస్పర్శనాదపి
నత్వాం దేవీం అహం
మన్యే రాజ్ఞః సంజ్ఞావ ధారణాత్

వ్యంజనాని చ తేయాని
లక్షణాని చ లక్షయే
మహిషీ భూమి పాలస్య
రాజకన్యాసి మే మతా"

ఒకనాడు శ్రీరాముడు హనుమంతుని చూచి - 'నీ వెవ్వరవు?' అని ప్రశ్నించగా, హనుమంతుడు తనకు గల అద్వైత పరతత్త్వజ్ఞానాన్ని ప్రదర్శించినాడు:

"దేహ బుద్ధ్యా తు దాసోస్మి
జీవ బుద్ధ్యా త్వదంశకః
ఆత్మ బుద్ధ్యా త్వమేవాహమ్
ఇతి మే నిశ్చితా మతిః"

'శారీరకంగా చూస్తే నీకు దాసుడను. జీవునిగా చూస్తే నీలో కళను. ఆత్మబుద్ధితో చూస్తే నువ్వే నేను అని నా నిశ్చితాభిప్రాయం'

నేటి ప్రతి భారతీయుడు శత్రువులను భేదించడంలో అసమాన పరాక్రమశాలి, మహాబలి అయిన వీరహనుమంతుని స్ఫూర్తిగా తీసుకోవాలి.



## దయా శతకము

(సమర్పణ : శ్రీ శారదాకుమార్, ప్రాప్తి-స్థానము : శ్రీ ఎస్.వి. నరసింహారావు, 24/574, శ్రీశారదా విహార్, మూలపేట, నెల్లూరు--524 003 -- వెల : రూ. 10-00.)

భగవంతుడు సకల కల్యాణ గుణ నిలయుడు. అన్ని గుణాలలోనూ దయాగుణం మిన్న. జ్ఞానం, బలం, ఐశ్వర్యం మొదలైన భగవద్గుణాలు దయాగుణం ఉండడంవల్లనే గుణాలుగా రాణిస్తున్నాయనీ, అది లేకపోతే అవి దోషాలుగా పరిణమిస్తాయనీ శ్రీ వేదాంతదేశికులు అభివర్ణించారు.

భగవంతుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి దయాగుణాన్ని శ్రీవేదాంతదేశికులు 108 శ్లోకాలలో అత్యద్భుతంగా వర్ణించారు. ఈ రచనలో ఎన్నో విశిష్టాద్వైత రహస్యాలు దాగి వున్నాయి. ఈకృతి దయాశతకంగా ప్రసిద్ధమై భక్తుల నందరికీ అనుసంధేయమైన గ్రంథంగా రూపొందింది.

శ్రీదేవి, భూదేవిలాగా భగవద్దయను కూడా ఒక దేవిగా రూపణంచేస్తూ శ్రీదేశికులవారు ఈ శతకాన్ని భక్తలోకానికి ప్రసాదించారు. భక్తికంటే ప్రపత్తే భగవత్ప్రాప్తికి సులభోపాయమని ఆచార్యులు సెలవిచ్చి వున్నారు. శ్రీకృష్ణభగవానుడు చరమశ్లోకంలో ప్రపత్తియొక్క ప్రాముఖ్యాన్ని విశదీకరించాడు.

ప్రపత్తియే 'శరణాగతి, భరన్యాసం, భరసమర్పణం' అని అనేకవిధాల వ్యవహరింపబడుతున్నది. ప్రపత్తి ప్రాధాన్యాన్ని వివరించే గ్రంథాలలో దయాశతకం అగ్రశ్రేణికి చెందినది.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు దయాశతకాన్ని విపులమైన ఆంధ్రవివరణంతో ప్రకటించి వున్నారు.

సాహిత్యంలోనూ, వేదాంతంలోనూ అభిరుచికల్గి సమాజసేవలో పొరవగల శ్రీశారదాకుమార్ ఈ శతకాన్ని మరొకరూపంలో ఇప్పుడు ప్రచురించడం ముదావహం.

పారాయణ చేసుకొనే భక్తులకు ఉపయోగపడే విధంగా ఈ గ్రంథంలో మొదట మూల శ్లోకాలను ముద్రించారు. తరువాత ప్రతి శ్లోకాన్ని వివరిస్తూ శ్లోకంతోపాటు అందలి క్లిష్ట పదాలకు అర్థాలు వ్రాశారు. అవసరమైనచోట విశేషాంశాలు కూడా వివరించారు. శిష్టవ్యావహారిక భాషలో వివరణ పరమ రమణీయంగా కొనసాగింది.

ఒక విశిష్టమైన ప్రాచీనకృతిని చక్కని వివరణతో పాఠకుల కందించిన శ్రీశారదా కుమార్ అభినందనీయులు.

--సముద్రాల లక్ష్మణయ్య




### జిడ్డుకృష్ణమూర్తి జీవితము -- భాషణము

(గ్రంథకర్త : శ్రీ జె. శ్రీరఘుపతిరావు -- గ్రంథం లభించుచోట్లు : 1. ఎస్.కె. గార్గి, ఆత్మారామ ఆశ్రమం, గౌతమీనగర్, కోవూరు--534 350; 2. బ్యాక్ పబ్లికేషన్స్, నెం.5-294/డి, మునిరెడ్డినగర్, తిరుపతి--517 502 — వెల : 10 రూ॥/)

శ్రీ జె. శ్రీరఘుపతిరావుది తాత్త్విక దృక్పథం. ప్రపంచ ప్రబోధకుడుగా ప్రసిద్ధికెక్కిన జిడ్డుకృష్ణమూర్తి తత్త్వం వారినెంతో ఆకర్షించింది. అందుకే కృష్ణజీవాఙ్మయాన్ని సమగ్రంగా సేకరించి సమ్యక్ దృష్టితో పరిపూర్ణావగాహనకు ప్రయత్నించారు. వారిజీవన దర్శనాన్ని, వారి తత్త్వంలోని నవ్యతనూ నాణ్యతనూ, కృష్ణజీ జీవితంలోని వెలుగునూ తనకు అవగాహన అయినంతమేరకు వివిధ గ్రంథాలుగా వెలువరించారు. ప్రస్తుతం "జిడ్డుకృష్ణమూర్తి జీవితము--భాషణము" అనే గ్రంథంలో అన్ని అంశాలను క్రోడీకరించి సంగ్రహంగా కృష్ణజీ జీవితాశయం ఎటువంటిదో, వారి భాషణములలోనే శ్రీరఘుపతిరావు వెల్లడించారు.

ఈ గ్రంథంలో ప్రప్రథమంగా జిడ్డు కృష్ణమూర్తి తాను అడయారుకు వెళ్లడం, అక్కడ అనిబిసెంట్, నారాయణయ్యను ఒప్పించి ప్రత్యేక శిక్షణ ఇప్పించడం, అటుపై కృష్ణజీ తమ్ముడు నిత్యానందతో ఇంగ్లాండులో విద్యాభ్యాసం గావించడం, కాలిఫోర్నియాలోని ఓహైలోయలో ఉన్నప్పుడు నిత్యానందకు ఊపిరితిత్తులు దెబ్బతినడం, అదే సందర్భంలో ఆవేదన, అపస్మారకస్థితి, పలవరింతలు చివరకు వెన్నుపూసలో నిప్పులాంటి వ్యథ, స్పృహను కోల్పోయిన స్థితిలో బుద్ధ దర్శనం, నాటినుంచీ నిశ్చలతా, గాంభీర్యం, తేజస్సు, దీక్షవంటి విశిష్ట లక్షణాలు కృష్ణజీలో పాదుకోవడం, ఇలా పరివర్తనకు తోడు ఎంతో ప్రీతిపాత్రుడైన తమ్ముడు మరణించడం, దానితో గురువులపై విశ్వాసం సడలి హృదయం బ్రద్దలై గొంతుమూగవోయి ఆవేదన కట్టలు త్రెంచుకొని పెల్లుబకడం, ప్రపంచ బోధకుడని అనిబిసెంట్ ప్రకటించగా చివరకు కృష్ణజీ అనిబిసెంట్ లెడ్ బీటర్ మొదలైన వాళ్లతో పూర్తిగా తెగత్రెంపులు చేసుకొని సంపూర్ణస్వేచ్ఛతో సర్వస్వతంత్రుడు కావడం, అనేకసార్లు ప్రపంచపర్యటనలు చేసి, ప్రబోధాల సారాన్ని ప్రపంచమంతటా ప్రవచించి 1986 ఫిబ్రవరి 16 తను త్యాగం కావించడం, ఆ మరుసటిదినమే అడయారుదినం కావడం ఆశ్చర్యం.

ఇలా కృష్ణజీ జీవితంలోని ప్రముఖ సన్నివేశాలను రచయిత ఎంతో సంగ్రహంగా ప్రతిపాదిస్తూ పరివర్తనవంటి అతిముఖ్యవిషయాలకు కొంత ప్రాధాన్యం ఈగ్రంథంలో కల్పించాడు. ఇక కృష్ణజీ ప్రసంగాలలో అతి ప్రధానమైనది

## రచయితలకు విజ్ఞప్తి

* మావద్ద కవితలు పద్యాలు అసంఖ్యాకంగా వున్నాయి. వీటి ముద్రణ పూర్తికావటానికి కొంతకాలంపడుతుంది. అందువల్ల తిరిగి మేము ప్రకటించేంతవరకు కవితలు, పద్యాలు పంపవద్దని మనవి.
* మవదేవాలయాలు శీర్షికకు కొందరు రచయితలు నలుపు తెలుపు ఫోటోలు లేకుండా వ్యాసాలు పంపుతున్నారు. ఆ వ్యాసాలు ప్రచురించటానికి అవకాశం లేదని గమనించప్రార్థన.
* కొందరు రచయితలు కొంతకాలవ్యవధితో తాము అంతకుముందు పంపిన వ్యాసాలనే మళ్లీ పంపుతున్నారు. అలా పంపవద్దని, అది మమ్మల్ని అపోకర్యానికి గురిచేస్తుందని మనవి.
* ఒకేరచన రెండు రెండు కాపీలుగా కొందరు పంపుతున్నారు. సమీక్షకు పంపే గ్రంథాలు తప్ప, రచనలు అలా పంపవలసిన అవసరంలేదు. గమనించప్రార్థన.

సంపాదకుడు

ఆయన 1929 ఆగష్టు 3వ తేదీ ఆమెన్ (హాలెండ్)లో ఇచ్చిన సత్యానికి మార్గంలేదు. (Truth is pathless land) అనే ప్రసంగం. ఇందులో నిజమైన స్వేచ్ఛ అంటే ఏమిటి? సంస్థలనేవి ఎలా ప్రతిబంధకాలై సత్యదూరములవుతాయో చాలా చక్కగా వివరిస్తూ కృష్ణజీ తాను తారాపరిషత్తును రద్దుచేయడానికి, ఆయన పేరుతో ఉన్న అన్ని ఆస్తులకు సంబంధంలేదని ప్రవచించడంలోని పరమార్థాన్ని సహేతుకంగా సమస్త బంధాలనూ విడిపించుకొన్నవైనం ఆ ఉపన్యాసంలో అభివ్యక్తం చేసినట్లు శ్రీరఘుపతిరావు కళ్లకు కట్టినట్లు చక్కగా వక్కాణించారు. సంస్థలూ అధికారం, రక్షణ ఆత్మాహుతివల్ల యధార్థ మైత్రి కలుగుతుందనీ, ఆ మైత్రి ఆత్మావగాహనవల్లనే సిద్ధిస్తుందనే కృష్ణజీ అభిప్రాయాన్ని రఘుపతిరావు చక్కగా ఆవిష్కరించారు.

బ్రాక్‌వుడ్‌పార్క్‌లో చెప్పిన ఆత్మపరిశీలనా ప్రసంగాన్ని కూడా రచయిత 'తనలో తాను' అనే పేరుతో ప్రకటించారు. ఈర్ష్యా, ప్రేమా, బంధమూ అనే విషయాలను స్పష్టీకరించడానికి భార్యాబంధాన్ని దృష్టాంతంగా గ్రహించిన కృష్ణజీ అభిప్రాయాన్ని రచయిత వివరిస్తూ--అందులో ఒంటరితనం కూడా ఎలా బంధమౌతుందో, అది వారసత్వమా సహజాతమా అనే ప్రశ్నకు సమాధానం అలాగే ఆలోచనకూ ఒంటరితనానికీ జ్ఞాపకాలకూ ఉన్న సంబంధం, పరిమితికాని ప్రయత్నం లేని ఆలోచన కాలాతీతమై బంధరాహిత్యాన్ని కలిగిస్తుందని, బంధం లేనిదే ప్రేమ అనీ, ప్రేమ అనుసరింపబడేదికాదనీ, అలా వెంటబడితే అదీ ఒక ప్రతిఫలం అవుతుంది అనే కృష్ణజీ అభిప్రాయాల్ని రఘుపతిరావు చాలా సునిశితంగా పరామర్శించి తెనిగించారు.

ఇక ఐక్యరాజ్య సమితిలో కృష్ణజీ ప్రపంచశాంతిని గురించి కృష్ణజీ ఇచ్చిన ప్రసంగం కూడా ఈ గ్రంథంలోనే వివరింపబడింది. ఇంతేకాకుండా 'ప్రవచనసారం' అనే శీర్షిక క్రింద రెండుపుటల్లో సంస్థలు, వ్యక్తిత్వం, స్వేచ్ఛ, ఆలోచన అనే విషయాలకు సంబంధించిన మూలసూత్రాలు సంగ్రహంగా తెలుపబడ్డాయి. ఇది మేరీ లట్యెన్స్ కోరికమేరకు కృష్ణజీ వ్రాసి ఇచ్చిన విషయం.

గ్రంథం చివర 37 "నవీన నిర్వచనాలు" ఆంగ్లపాఠంతోకూడా తెలుగులో వివరింపబడ్డాయి. అటుపై "కృష్ణసూక్తము" అనే పేరుతో 100 సూక్తులు తెనిగింపబడ్డాయి. చిట్టచివరగా కృష్ణజీ ఎనిమిది ఆంగ్లవ్యాక్యాలు సత్యము, ఆలోచన, స్వేచ్ఛ, విశ్వాసం, సంస్థలు, ప్రశాంతి, అవగాహన, మానవత అనే వాటిపై ఆయన అభిప్రాయాలు సూత్రప్రాయంగా తెలుపబడ్డాయి. సంగ్రహప్రాయంగా కృష్ణజీ జీవితాన్ని ఆయన అభిభాషణల్ని తెలుసుకోవడానికి ఈ గ్రంథం ఎంతో ఉపయోగకారి, 48 పుటల ఈ గ్రంథం తొలిపుటలో 'అతడె జిడ్డు కృష్ణమూర్తి' అనే గేయంలో కృష్ణజీ విశిష్ట వ్యక్తిత్వం వివరించబడింది. ప్రతి జిజ్ఞాసువూ ఈ గ్రంథాన్ని తప్పక చదివితీరాలి.

డా॥ మల్లెల గురవయ్య

☆ ☆ ☆

### వసుధైక కుటుంబకం

అయంనిజః పరశ్చేతి<br>
వికల్పో లఘుచేతసామ్,<br>
ఉదారచరితానాం తు<br>
వసుధైకకుటుంబకమ్.

స్వపర భేదం చిన్న మనస్సు కలవారికి మాత్రమే ఉంటుంది. ఉదార హృదయులకు లోకమంతా ఒకే కుటుంబముగా గోచరిస్తుంది.

# శ్రీనివాస! నిన్ను చేరికొలుతు!

శ్రీ కె.సి. జయచంద్రశాస్త్రి

కలియుగాన నీవు పలుకుదైవము గాన,
కలరె నీకు సాటి కామితార్థ
ములనొసంగి మమ్ము బ్రోవుము దయ
మీఱ
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

నాదు పాపరాశి నశియింపగాఁ జేసి
భక్తిభావ మెదను పాదుకొల్పి
ముక్తిపదము నిమ్ము మొనగాడ వని నమ్మి
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

భక్తజనము బ్రోవ వైకుంఠమును వీడి,
చేరినాడ నీవు శేషగిరిని;
నీదుదయను పొగడనేర్వఁ డెవ్వండును
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

అప్పులందు జనన మందెను నీ సతి
కాన నప్పులందు కాంక్ష నీకు;
అప్పు లీకు మాకు నతుల సంపద లిమ్ము
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

కపిల పుట్టమీద ఘనమైన పాదుగుంచి,
పాలుగార్చ బ్రావి బలముగల్గి
జగతిరక్షకొరకు సలుపగా తప మీవు
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

గుఱ్ఱమెక్కి నీవు కొరడాను ఝళిపించి
వేట కొరకు వేడ్క వెడలునపుడు
పారవశ్యమంది వకుళాంబ తిలకింప,
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

భార్యమీద నలిగి పర్వతాగ్రము నెక్కి
యొంటినుండ దగునె జంటవీడి
అమ్మగారితోడ హాయిగ నుండుమీ
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

భుక్తిముక్తినిచ్చి పోషించుదైవమై
యాపదలను బాపి యనుదినమ్ము
బ్రోచువాడ వనుచు పూనిన భక్తితో
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

జనులు పాపకార్యసక్తులై రేగిరి,
నీతి, నియతి లేక నెగడుచుండ్రు;
మంచి బుద్ధినిచ్చి మన్నించి బ్రోవుము
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

వడ్డికాసులెల్ల భక్తలోకమునుండి
సంగ్రహించి బొక్కసమ్ము జేర్తు;
వక్షి దెరచి దాని వ్యయమునుఁ జూడుము,
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

ప్రతిదినమ్ము పెండ్లి పైపైని మఱిపెండ్లి
సలుపుకొనుచు నీవు సంతసించు
నట్టివేళఁ జూచి యనుపమభక్తితో
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

బూటకమ్ములాడి పొరిఁబొరి నమ్మించి
ప్రజలమోసపుచ్చు పలవలకును
తగినబుద్ధిచెప్పి తగవున నిల్పుమీ
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

కూడుగుడ్డలేక కొందలపడుచుండు
పేదసాదులయెడఁ బ్రీతి గలిగి
సాయపడగఁ జేయు సంపన్నులగువారి
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

ఆడువారి బ్రతుకు లధ్వాన్నమై పోయె,
క్షణము గడుపుటెల్ల గండమాయె
నీచ కీచకులకు నేర్పవా నీతిని,
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

పగటివేళనైన పడతులు వెఱతురు
సంచరింప వీథిఁ జంకుపడుచు
ఏమికాల మిద్ది? యించుక పరికింపు
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

పదవిచేత మిడిసిపడునట్టి వారిని
పలుకుబడిని ప్రజకు బాధగొల్పు
వారి శిక్షసేయవలె నంచు గోరుచు
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

ఆలుమగల కరిది యయ్యెను ప్రేముడి
తల్లిదండ్రులయెడఁ దరలె భక్తి,
చక్కఁజేయుమంచు సరగున గరుణించి
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

మాయమాటలను నమాయక జనమును,
మోసగించునట్టి మూర్ఖు లిపుడు
ప్రబలినారు వారి బంధింపు మని కోరి
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

సాధురక్షసేయు సమయమ్ము కాదేమి?
దుష్టశిక్షసేయు దొసఁగదేమి?
ఊరకుంట దగునె ఓస్వామి నీ కంచు
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

కనికరించువారె కరవైరి కలిలోన,
స్వార్థపరులె నేడు స్వాములైరి,
మార్చు మయ్య వీరి మనసును యుక్తితో
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

సాధువర్తనమ్ము, సజ్జన సంగమ్ము,
మమతలేమి, సమత, మాన్యచరిత
దైవభక్తి, ప్రజకు దైవాఱఁ జేయుము
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

నీతి, నియతి, శాంతి, నిత్యసౌఖ్యము లిచ్చి
భరతభూమి యిడమ బాయజేసి
దయను బ్రోవ గల్గు దైవముగా నమ్మి
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

ఓర్పు నేర్పు గలిగి యూర్జిత భక్తితో
నిన్నుఁ గొల్చు బుద్ధి నెగడఁ జేసి
సాధుబాధమాపి సౌఖ్యమ్ము ప్రజకిమ్ము
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.

ఆట వెలది లిచ్చి యానంద మొదగూర్చు
నందుకొనుము ప్రీతి నందుకొనుమ
మమ్ము ప్రీతితోడ మనుపుమం చని నేను
శ్రీనివాస! నిన్ను చేరికొలుతు.





# శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం

శ్రీనివాసుని దర్శించ కాంచుకొని వుండే భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని కల్పించే ఈ పథకంలో పాల్గొనే వారందరికీ జనరూప జనార్దన పూజాఫలం దక్కుతుంది.

భక్తులకు వినతి

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. అందుకే అన్నదాతా సుఖీభవ! అని అన్నారు. మన దేశంలో ఆకలిగొన్న వారికి పేదవారికి అన్నదానం చెయ్యటమన్నది కేవలం సేవ మాత్రమే కాదు. వేద కాలం నుండి వస్తున్న పవిత్ర సంప్రదాయం. అన్నదానం చేసిన వారికి దివిజుల సరసన చోటు లభిస్తుందని పెద్దలంటారు. అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారందుకే.

శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాన పథకం ద్వారా తిరుమలకు వచ్చే భక్తులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించాలన్నది దేవస్థాన ఆశయం. ఈ పథకం 1985 లో ప్రారంభమైనప్పటి నుండి దేశం మొత్తం అపూర్వాదరణ లభించింది. ఎందరో దాతలు తమ సహాయాన్ని ఈ పథకానికి అందించారు.

ఈ పథకం క్రింద అందిస్తున్న భోజనం ఎంతో బావుందని కూడా ప్రజలు మెచ్చుకుంటున్నారు ఎందరో భక్తులు ఈ అన్నదాన సౌకర్యాన్ని వినియోగించు కుంటున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలుపంచుకోవాలని, తమ సహాయాన్ని అందించాలనే ఉద్దేశంతో దేవస్థానం విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించింది. భక్తులు రు.1000/- నుంచి రెట్టింపు సంఖ్యలలో ఎంత మొత్తాన్నయినా అన్నదాన పథకానికి ఇచ్చి, ఇది కలకాలం నిర్వహించడానికి దోహదం చేయవచ్చు.

ఎంతో దూరం నుంచి ఎన్నో కష్టాల కోర్చి తిరుమలకు వస్తున్న భక్తుల పట్ల ఆర్ద్ర భావంతో ఈ నిత్యాన్నదాన పథకంలో మీరూ భాగస్వాములై అన్నదానం చేసి ఆదుకున్నామన్న పవిత్ర తృప్తి మీ మనసుకు మిగులనివ్వండి.

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః ।
తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః ।

— బోధాయన ధర్మసూత్రం

ఆహారం జీవ శక్తి అని, అంతర్గత శక్తి అని వేదాలు ప్రవచిస్తున్నాయి. భౌతిక సుఖాతీత మైనది వెలలేని కొలమానం అన్నదానం. అందుకే అన్నదానం చేయాలి

— బోధాయన ధర్మసూత్రం

వందనములతో........

మీ

శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

**అన్నదానంతో ఆదుకోండి**
**ఆత్మతృప్తిని అందుకోండి!**

చంద్రశేఖర

వేనామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నాకీపుణ్యము గట్టితి వింతేయయ్యా!

గోవిందా! ఏడుకొండలవాడా! వెంకట రమణా! గోవిందా! గోవిందా అని అహరహం లక్షలాది భక్తులతో ఆర్తిగా ఆనందంగా పిలువబడే స్వామి తిరుమల శ్రీవేంకటేశ్వరుడు. అమాయకభక్తులు గోవిందా! అంటేనే పరమానందం ఆ వెర్రిగోపాలునికి! ఆపద్బాంధవా! అంటేనే పరమోత్సాహం ఆ ద్రౌపదీ మానసంరక్షకునికి! అనాథరక్షకా! అంటేనే ఎక్కడలేని ఆవేశం కరిరాజవరదుడయిన ఈ ఆనందనిలయునికి! బ్రహ్మాండనాయకునికి అనంతమైనలీలలను, మహిమలను, భక్తప్రియత్వాన్ని చాటే పేర్లు ఎన్నో ఎన్నెన్నో! అవి ఎన్నో ఎవరికీ తెలియదాయె! అయినా వాటి అన్నింటిలోకి ఓ వేయిపేర్లు అంటే ఆస్వామికి భలే ఇష్టమట! అని తానే చెప్పుకొన్నాడు మరి! ఒకప్పుడు భక్తుడైన భీష్మాచార్యుల చేత తనవేయినామాలను "పాండవుల"కు వినిపింపజేశాడు. వాటిని విన్నా, చదివినా స్మరించినా సకల సంపదలు కలిగి చివరకు మోక్షం కలుగుతుందని కూడ భరోసా ఇచ్చాడు శ్రీకృష్ణపరమాత్మ! మళ్లీ ఈనాడు వేంకటాద్రి గోవిందుడు, పరమ వైష్ణవాచార్యశ్రేష్ఠులయిన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరు స్వామివారిచే తన సన్నిధిలోనే "పాండవులు" నివసించిన గోగర్భతీర్థం దగ్గర సర్వ సంపత్కరములైన తనవేయినామాలను వినిపింపజేశాడు. కేవలం వినిపింపజేయడమేకాదు. ఆ ఆచార్యుల పర్యవేక్షణలో ఆ వేయి నామాలను అను-సంధానింపజేస్తూ వేయి కుండాల ద్వారా 'స్వాహాహా'అంటూ స్వాహాకారాలతో విశ్వశాంతికై హోమాన్ని నిర్వహింపజేశాడు తిరుమల గోవిందుడు.

ఆ సమయంలో ఇటు భక్తులపాలిటి కొంగుబంగారమై ఆనందనిలయంలో అర్చామూర్తిగా వింత వింత తేజస్సులతో దర్శనమిస్తున్న శ్రీవేంకటేశ్వరుడే అటు గోగర్భతీర్థం చెంత వేయి హోమగుండాల్లో వేయివెలుగులతో జ్యోతిస్వరూపంగ ప్రకాశిస్తూవున్న శుభ సమయంలో తిరుమలక్షేత్రం వినూత్న కాంతులతో గోచరించింది.

# ఏడుకొండలవాని అండన
# వేయికుండాల యాగం



ఆరోజు... శ్రీభావనామసంవత్సరం ఆశ్వయుజశుద్ధ దశమిశుక్రవారం. విజయదశమి పర్వదినం. ఆనాడు కలియుగవైకుంఠం తిరుమలక్షేత్రం పదినాళ్లపాటు జరుగుతున్న బ్రహ్మోత్సవాలతో అనంతమయిన ఆధ్యాత్మిక తేజస్సుతో అత్యంత కోలాహలంతో భక్తుల సంబరాల సందడితో వెలిగిపోతూవున్న రోజు!

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

ఆరోజు అవభృథోత్సవానంతరం (చక్రస్నానం) జగత్కల్యాణ చక్రవర్తి అయిన శ్రీవేంకటేశ్వరుడు, అష్టదిక్పాలురకు, బ్రహ్మాదిదేవతలకు సనక సనందనాది యోగులకు... బహుమానపురస్సరంగా వీడ్కోలు చెపుతూవున్న శుభవేళ అది!

> 94 అక్టోబరు 14 నుండి 28 వరకు తిరుమలలో జరిగిన "విశ్వశాంతి సహస్ర కుండాత్మక శ్రీమహావిష్ణుయాగం" సంక్షిప్త నివేదికను చదవండి!

ఆనందనిలయుడు అడిగినదే తడవుగా భక్తులకోరికలన్నింటినీ తీరుస్తున్న విజయపర్వకాల సమయం అది!

94 అక్టోబరు 14వతేదీ సాయంత్రం 4 గంటల సమయంలో అలాంటి మంగళప్రదమైన సుముహూర్తంలో ద్వాదశోర్ధ్వపుండ్రాలతో, త్రిదండియై, చిన్మయహాసం వెలార్చుతూ శ్రీశ్రీశ్రీ త్రిదండి చినజీయరుస్వామి ఒకవైపు భక్తబృందం 'జై శ్రీమన్నారాయణ' అంటూ జేజేలు పలుకుతుండగా, మరోవైపు "విశ్వం,విష్ణుర్వషట్కారో.."అంటూ విష్ణుసహస్రనామపారాయణం చేస్తుండగా క్షేత్రసంప్రదాయం ప్రకారం తొలిగా శ్రీ వరహాస్వామి సన్నిధి కేతెంచారు. ఆ రోజు సాయంకాలం "హే జ్ఞానప్రిరావ్, హే వరాహ భగవన్! బ్రహ్మోత్సవ ముగింపు జరుగుతున్న ఈ విజయపర్వకాలంలో మా ద్వారా చేయ



కంకణ ధారణ చేస్తున్న ఇ.ఓ. శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి

సంకల్పించిన విశ్వశాంతియాగానికి అనుమతి నిచ్చి సక్రమంగా నిర్వహించుమో దేవా!" అని పూజాదికములు నిర్వహించి సాగిల పడి శ్రీవరాహస్వామి అనుమతిపొందినారు. అక్కడినుంచి బయలుదేరి శ్రీవేంకటేశ్వర స్వామివారి దగ్గరికి వెళ్లి యాగానికి అనుమతి నిమ్మని ప్రార్థించినారు అక్కడ అనుమతి తీసికొని, తిరుమల జీయర్లు, వెంటరాగా, దేవస్థానంవారు సమర్పిస్తున్న పట్టువస్త్రాలను కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి. ఎల్.ఎన్. మూర్తి వెండితట్టలో తలపై వుంచుకొని నడుస్తుండగా, ఛత్రచామర మంగళవాద్య పురస్సరంగా, భక్త, శిష్య బృందాలతో ఆలయ మహాప్రదక్షిణంచేస్తూ విష్ణుసహస్రనామ పారాయణలతో గోగర్భం డాం దగ్గర ప్రత్యేకంగా నిర్మించిన యాగశాలకు చేరుకొన్నారు.

అక్కడ ప్రవచనమండపంలో తొలిగా విష్వక్సేనపూజ జరిగింది. పిదప ప్రధాన యజ్ఞాచార్యులుగా శ్రీ చిలకమర్రి శ్రీనివాసాచార్యులు, బ్రహ్మగా శ్రీ మరింగంటి రంగాచార్యులు, ప్రధానయజమానులుగా శ్రీ డి.వి.యల్.ఎన్. మూర్తి, శ్రీ ఎ.చెంగల్ రెడ్డి గారలు దీక్షావస్త్రాల్ని ధరించి కంకణ ధారణ చేశారు. అనంతరం వరుసగా భూమిపూజ మృత్సంగ్రహణం, అంకురార్పణం, ద్వారదేవతాపూజ, అష్టదిక్కుల్లో బలినివేదన ఘనంగా జరిగాయి. ఆ తర్వాత ప్రసాదవితరణ జరిగింది. ఈసందర్భంలో శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామి యజ్ఞ ప్రాశస్త్యాని గూర్చి ప్రసంగిస్తూ "యజ్ఞముల వలన వానలు కురుస్తాయి. పంటలు పండుతాయి వాతావరణము పరిశుద్ధమవుతుంది. చూసిన పాల్గొనిన భక్తులందరూ నిర్మ చిత్తులై సుఖశాంతులతో జీవించ గలుగుతారనీ, ఈమహిమాన్వితమైన యాగం ఇతరచోట్లకంటే అత్యంత పవిత్రమైన తిరుమలక్షేత్రంపై చేయుట ఎన్నోరెట్ల అధిక ఫలవంతమవుతుందని, భక్తులందరూ సావకాశంగా పాల్గొని ఆధ్యాత్మికోత్తేజాన్ని పొందగలరని" చెప్పారు.

15-10-94 వతేదీ శనివారం ఉదయం 11 గంటల సమయంలో శ్రీ త్రిదండి చినజీయరుస్వామి ఆకాశగంగా తీర్థాన్ని సేకరించి ఆనందనిలయుని సన్నిధినుండి మూలట్టురాట్టు అనుమతితో, ప్రధానయజ్ఞాచార్యులు తలపై ధరించి, ఆలయమహాప్రదక్షిణం చేస్తూ యాగశాల ప్రవేశించారు. యాగశాలలో శాంతిపారం, స్వస్తివాచనం, ఋత్విక్కులకు

## కలియుగవైకుంఠం

పూర్వం ఒకప్పుడు ఋషులు చేసిన యజ్ఞంవల్లే శ్రీమహావిష్ణువు శ్రీవైకుంఠాన్నివదలి, భూలోక వైకుంఠమయిన తిరుమలలో స్వయంభువుగావెలిసి దర్శనమిస్తున్నాడు. అనాది నుంచి ఎందరో ఋషుల యజ్ఞవాటికలకు, తపోభూములకు నిలయం వేంకటాచలం.

అలాగే దశరథుడుచేసిన పుత్రకామేష్టి యాగంవల్లే మహావిష్ణువు శ్రీరామునిగా అవతరించాడు.

## యజ్ఞోవై విష్ణుః

అనగా యజ్ఞమే విష్ణుమూర్తి. యజ్ఞపురుషుడే విష్ణుమూర్తి అని అర్థాలు. వేదపురుషుడే విష్ణు సహస్రనామాలలో వర్ణించబడ్డ యజ్ఞపురుషుడు.

### యజ్ఞాలు

1. తపోయజ్ఞం. 2. యోగ యజ్ఞం. 3. స్వాధ్యాయయజ్ఞం 4. జ్ఞానయజ్ఞం 5. వాగ్యజ్ఞం 6. ద్రవ్యయజ్ఞం. అని. ఈ యజ్ఞం యొక్క స్వభావాన్నిబట్టే హవిస్సు మారుతూవుంటుంది.

### యజ్ఞఫలం

యజ్ఞంవల్ల వర్షం కలిగి ప్రజలు సుఖంగా జీవిస్తారు. యజ్ఞం ద్వారా పరస్పరం శ్రేయస్సు పొందవచ్చునని భగవద్గీత చెపుతున్నది. సర్వకర్మ పరిత్యాగంతో యజ్ఞం చేస్తే దాని పరమార్థం సిద్ధిస్తుంది.

పంచగవ్యప్రాశనం జరిగింది. పిదప ఋత్విగ్వ రణం, యజ్ఞానికి ప్రారంభసూచకంగా ధ్వజా రోహణం, బలిసమర్పణం, మహాకుంభస్థాపన, మండలపూజాకార్యక్రమాలు నిర్వహింప బడ్డాయి. పిదప ఆ మధ్యాహ్నం ఒంటి గంట సమయంలో అగ్నిమథనం జరుపబడి ప్రధాన హోమగుండాలను వెలిగించారు. ఆత ర్వాత ప్రధాన హోమవేదికచుట్టూవున్న 1008 గుండాలను వెలిగించారు.

మరునాడు 16వ తేదీన అన్ని గుండాలలో అగ్నిసమర్పణ పూర్తి అయిన తదుపరి ఋత్విక్కులకు దీక్షావస్త్రసమర్పణ, స్థాన నిర్దేశము వగైరా కార్యక్రమాలు అయిన తర్వాత అఖండ విష్ణుసహస్రనామపారాయణ, అఖండ నామ సంకీర్తన, గీతాపారాయణ, వేదపారాయణలు ప్రారంభింపబడినాయి.

దీనిలో 14 నుండి 16 వరకు ప్రధాన యాగానికి సంబంధించిన ప్రాథమికాంశాలు అన్నీ పూర్తిచేయబడ్డాయి.

17 వతేదీ సోమవారం ఉదయం 9-30 గంటలకు ఋత్విక్కుల వేదమంత్రాలమధ్య, విష్ణు సహస్ర పారాయణలు సాగుతుండగా, మంగళతూర్యరవాలు మోగుతుండగా ఘనంగా విశ్వశాంతియాగం ప్రారంభమైంది. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నజీయరు పర్యవేక్షణలో జరిగిన ఈకార్యక్రమానికి తిరుమల శ్రీ పెద్దజీయరు విచ్చేయగా శ్రీ త్రిదండి జీయరు స్వామి ఘనంగా స్వాగతమిచ్చారు. ఈ యజ్ఞారంభ కార్యక్రమంలో దేవస్థానం ఛైర్మన్ శ్రీ ఎ.వెంగల్ రెడ్డి, ఇ.ఓ. శ్రీ డి.వి. ఎల్.ఎన్.మూర్తి, జె.ఇ.ఒ. శ్రీ పి.హెచ్.సత్యనారాయణ, పి.ఆర్.ఓ. శ్రీ శివాజి తదితరులు పాల్గొన్నారు.

ఈకార్యక్రమంలో శ్రీ త్రిదండి చినజీయరుస్వామి భక్తులకు విష్ణుసహస్రనామపారాయణ పుస్తకాలను ఉచితంగా వితరణచేస్తూ తొలిగా శ్రీవెంగల్ రెడ్డిగారికి, శ్రీ డి.వి.ఎల్. ఎన్.మూర్తిగా అందజేశారు. పిదప విష్ణు సహస్రనామ మంత్రాంతో 1008 హోమగుండాల్లో అగ్న్యారాధన, హోమాలు జరిగాయి. ప్రత్యేకంగా ఈరోజు ఇష్టిమండపంలో 'సుదర్శనేష్టి' యాగం సర్వవ్యాధి నివారణకు, ఆరోగ్యానికి నిర్వహింపబడింది.



ప్రధాన వేదికపై హోమగుండంలో అగ్నిస్థాపన



విష్ణుసహస్రనామస్తోత్రం మొదటి ప్రతిని అందుకుంటున్న శ్రీ ఎ. వెంగల్ రెడ్డి



## యాగశాల - కుండాలు

తిరుమలలో జరిగిన సహస్రకుండాత్మక యాగం కోసం ఒక విశిష్టరీతిలో యాగశాల నిర్మింపబడింది.

మధ్యలో ప్రధాన యాగశాలావేదిక. ఆవేదికపై శ్రీమహావిష్ణువు యొక్క పంచాయుధాలు శంఖం, చక్రం, గద, వనమాల, పద్మం ఆకారాలతో కూడిన హోమగుండాలతోపాటు నాలుగుమూలల్లో వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపాలకు సంబంధించిన నాలుగు హోమగుండాలు వెరసి, 9 హోమగుండాలతో అలరారుతూ వుండగా, మధ్యలో ఎత్తైన వేదికపై తూర్పుముఖంగా శ్రీచినజీయరుస్వామి ఇష్టదైవమైన శ్రీసీతారామలక్ష్మణులు కొలువైవుంటారు. వీరికి ఎదురుగా గరుడధ్వజం ఎగురవేయబడింది. ఆ గరుడధ్వజదండానికి ఒకవైపు శ్రీరామానుజ జీయరుస్వామి, మరోవైపు విష్వక్సేనులవారు మధ్యలో శ్రీరామానుజులవారి శిలా విగ్రహాలు మండపానికి అభిముఖంగా ప్రతిష్ఠింపబడ్డాయి.

ఈ ప్రధాన యాగవేదికకు ఎనిమిది దిక్కుల్లోను తూర్పున - చతురస్రకుండం. ఆగ్నేయం - యోనికుండం, దక్షిణం - ధనుష్కుండం, నైరుతి - షట్కోణకుండం, పడమర - వర్తులాకారకుండం , వాయవ్యం - పంచాశ్రకుండం, ఉత్తరం - త్రిభుజాకారకుండం, ఈశాన్యం - అష్టాశ్రకుండాలు. ఏర్పాటు చేయబడ్డాయి. ప్రతి దిక్కులోను ఒక్కొక్క శాలలో 14 కుండాలు వంతున 9 శాలలు నిర్మింపబడ్డాయి. మొత్తం 72 శాలల్లో 1008 హోమగుండాలు ఏర్పాటు చేయబడ్డాయి.

ఇవికాక వీటి అన్నింటికి తూర్పున ప్రత్యేకంగా వర్తులాకారం కలిగిన ఇష్టిమండపంలో 12రోజులపాటు ఇష్టియాగాలు చేయడానికి గాను ఆయా ఆకారాల్లో 12 హోమగుండాలు ఏర్పాటు చేయబడ్డాయి.

ఈ విశ్వశాంతి యాగం సందర్భంగా శ్రీ చినజీయరుస్వామి పర్యవేక్షణలో సుమారు 50 మందికి సామూహిక ఉపనయనాలు జరుపబడ్డాయి. ఈ కార్యక్రమాన్ని శ్రీ కొండూరు సుదర్శనాచార్యులు నిర్వహించారు.

ఈరోజు ఉదయం 11గంటలకు శ్రీ త్రిదండి చినజీయరుస్వామి వేలాదిమంది భక్తులచే శ్రీవేంకటేశ్వరాష్టోత్తర శతనామపూజను సామూహికంగా చేయించారు. ఇదేపూజ 20, 22 తేదీల్లోకూడ నిర్వహింపబడింది.

ఆ మధ్యాహ్నం 1గంటకు జరిగిన తదీయారాధనలో వేలాదిమంది భక్తులకు అన్నదానం జరిగింది. ఈ అన్నదానకార్యం అన్ని రోజుల్లోను, పగలు, రాత్రి రెండుపూటలా జరుపబడింది.

మళ్లీ ఆ సాయంత్రం పారాయణలు, హోమాలు జరిగిన అనంతరం ఆరాత్రి9 గంటలకు తిరుమల ఆలయ నాలుగుమాడవీధుల్లో శ్రీనివాసునికి హనుమంతవాహనంపై ఊరేగింపు జరిగింది ఊరేగింపుకు ఇరువైపులా భక్తులు జ్యోతులు వెలిగించిపట్టుకొని, విష్ణు సహస్రనామ పారాయణచేస్తూ వుండటం ఆనందంగా నయనమనోహరంగా వుండింది. ఈ ఊరేగింపులో వేలాదిమంది ఋత్విక్కులు. భక్తులు పాల్గొన్నారు.

18వ తేదీ మంగళవారం సహస్రకుండాల హోమంతోపాటు ప్రత్యేకంగా "వాసుదేవేష్టి" యాగం దీర్ఘాయువు, విఘ్ననివారణ కోసం జరుపబడింది. పూజానంతరం శ్రీ చినజీయరుస్వామి సుమారు 15వేలమంది భక్తులకు తీర్థాన్నిచ్చారు.

ప్రవచన మండపంలో శ్రీ మరింగంటి రంగాచార్యులు వేంకటాచలక్షేత్రవైభవాన్ని - ఆక్షేత్రంలో జరుగుతున్న యజ్ఞవైభవాన్ని వివరించారు.

పిదప జరిగిన సామూహిక శ్రీ లక్ష్మి అష్టోత్తర శతనామ పూజను శ్రీ త్రిదండి జీయరుస్వామి నిర్వహిస్తూ, "శ్రీ అంటే దయ, ఆమె కరుణాస్వరూపిణి అయిన అమ్మ, లక్ష్మీదేవి శ్రీస్వామివారి హృదయం మీద ఆసీనురాలైవుందని, భక్తుల ప్రార్థనల్ని

ముందుగా తాను విని, స్వామికి వినిపించి, అనుగ్రహింపజేసే తల్లి ఆమె. అలాటి అమ్మను ధరించిన స్వామివారిని కలిపి మనం పూజించుకుందాం" అంటూ భక్తులచే పూజ చేయించారు. ఇదే పూజ 21, 25, 27 తేదీలల్లో నిర్వహింపబడింది.

19 వతేదీ ఉదయం పారాయణ, హోమాదులతోపాటు ప్రత్యేకంగా "శ్రీవైష్ణ వేష్టియాగం" జరుపబడింది.

ప్రవచన మండపంలో ఇదేరోజు ఉదయం 10 గంటలకు శ్రీ చినజీయరుస్వామి వేలాది మంది భక్తులచేత శ్రీరామాష్టోత్తర శతనా మపూజ చేయిస్తూ రాముడు సకల సద్గుణా భిరాముడని వివరించారు. ఇదేపూజ మళ్లీ 23 వతేదీ నిర్వహింపబడింది.

20 వ తేదీ గురువారం ప్రత్యేకంగా 'వైభ వేష్టి' యాగం పెద్దలు తరించడానికుద్దేశించి చేయబడింది.

ఆ సాయంత్రం తిరుమల శ్రీనివాసు నికి బంగారు రథోత్సవం వైభవంగా జరిగింది. శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పస్వామి బంగారు రథంలో వేలాదిమంది భక్తులు విష్ణు సహస్రనామపారాయణలు, గోవిందనామాలు చేస్తుండగా ఊరేగి భక్తులనలరించారు.

21 వతేదీ శుక్రవారం ప్రత్యేకంగా జరిగిన వైనతేయేష్టి' యాగంలో 36 మంది భక్తులు పాల్గొన్నారు. దీనిలో విదేశీయులుకూడ పాల్గొనడం విశేషం.

22 వతేదీ ప్రత్యేకంగా జరిగిన "లక్ష్మీ నారాయణేష్టి" యాగంలో రాష్ట్రమంత్రి శ్రీ పురుషోత్తమరావు పాల్గొంటూ దేశక్షేమం కోసం ఇలాంటి యాగాలు అవసరమనీ, ఇంతటి మహత్తర యజ్ఞం నిర్వహిస్తున్న శ్రీచినజీయరుస్వామిని కొనియాడారు.

ఈరోజు జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో తిరుమలశ్రీనివాసుని కైంకర్యంలో పాలుపం చుకునే తిరుమలనంబి వంశీకులైన శ్రీవే దాంతం రామానుజస్వామిని శ్రీ చినజీయ రుస్వామి సత్కరించారు.

23 వతేదీ ఆదివారంనాడు ప్రత్యేకంగా విద్యాప్రాప్తికోసం "హయగ్రీవేష్టి" జరిగింది.



భక్తులకు తీర్థమిస్తున్న శ్రీ చినజీయరుస్వామి

ఈరోజు కరీంనగరుకు చెందిన భక్తులు 108 బంగారు కమలాలు సమర్పించగా వాటితో శ్రీ త్రిదండి చినజీయరుస్వామి తమ ఇష్టదైవాలైన శ్రీ సీతారామలక్ష్మణు లకు అష్టోత్తర శతనామ చేశారు. ఈ

## విష్ణుయాగంలో

**ఈ సహస్రకుండాత్మక విష్ణుయా గంలో సుమారు 3 వేలమందికి పైగా ఋత్విక్కులు, 2 వేలమం దికిపైగా స్వచ్ఛంద వాలంటీర్లు పాల్గొన్నారు.**

**ప్రతిదినం రెండుపూటలా సుమారు 25 వేలమందికి ఈ యాగంలో అన్నదానం చేయబడింది.**

**రోడ్లు ఊడవటం, పారిశుద్ధ్యం, వడ్డించటం, పాత్రలుతోమటం, పాదరక్షలు భద్రపరచటం, సామా నులు భద్రపరచటం వగైరా పను లన్నీ శ్రీ జీయరుస్వామి భక్తులైన వాలంటీర్లే నిర్వహించారు.**

స్వర్ణపుష్పార్చన సామూహికంగా ప్రతిరోజూ 27 వరకు నిర్వహింపబడింది.

ఆ రాత్రి 9 గంటలకు తిరుమలపుర వీధుల్లో శ్రీవేంకటేశ్వరస్వామికి గరుడోత్సవం వైభవంగా జరిగింది. ఈగరుడోత్సవంలో ఉద్యానవనశాఖ ఏర్పాటుచేసిన పుష్పాలంక రణ గరుడవాహనం ఎందరినో ఆకర్షించింది. ఈ ఊరేగింపులో దేవస్థానం అత్యున్నత అధికారులతోపాటు శ్రీ చినజీయరుస్వామి పాల్గొన్నారు.

24 వ తేదీ సోమవారం జరిగిన 'నృసిం హేష్టి' యాగంలో రాష్ట్రమంత్రి శ్రీ గెద్దన్న, మాజీమంత్రి శ్రీ పి. నరసారెడ్డి, తి.తి.దేవ స్థానం బోర్డు సభ్యులు శ్రీ జి.శ్రీరామమూర్తి, శ్రీ వెంకటరమణారెడ్డిలు పాల్గొన్నారు.

పిదప ప్రవచన మండపంలో శ్రీ చిల కమర్తి శ్రీనివాసాచార్యులు ప్రసంగిస్తూ కలి యుగంలోనే ఇది పెద్దయాగమని వివరిం చారు.

పిదప సామూహికంగా జరిగిన స్వర్ణ పుష్పార్చనలోను శ్రీకృష్ణాష్టోత్తరశతనామపూజ లోను వేలాదిమంది భక్తులు పాల్గొన్నారు.



యజ్ఞంలో ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి

25 వతేదీ మంగళవారం 'పరమేష్టి' యాగం సర్వరోగనివారణకోసం నిర్వహింపబడింది.

ఆతర్వాత జరిగిన కార్యక్రమంలో శ్రీరంగప్రియ రామానుజ జీయరు సందేశమిస్తూ యాగాలు వేదశాస్త్రసమ్మతాలనీ, ప్రపంచాన్ని సస్యశ్యామలంగా సుసంపన్నంగా తీర్చిదిద్ద డానికి ఇటువంటి యాగాలు ప్రధానపాత్ర వహిస్తాయని, ఇలాంటి సహస్ర కుండాత్మక యాగం సర్వజనసమ్మతంగా నిర్వహించడం ఎంతో సంతోషించతగునని అన్నారు. ఆతర్వాత మైసూరు పరకాలమఠం జీయరుస్వామి ఇలాంటి మహత్కార్యాలు దీక్షాదక్షతలు కలిగిన శ్రీ చినజీయరువంటి వారికి మాత్రమే సాధ్యాలని కొనియాడారు. పిదప యాగ నిర్వాహకసమితి తరుపున శ్రీ పరకాలస్వామిని శ్రీ ఎ. వెంగల్ రెడ్డి, శ్రీరంగప్రియరామానుజీయరుస్వామిని శ్రీ డి.వి.ఎల్.ఎన్.మూర్తి, తిరుపతిలోని చిన్నజీయరుస్వామిని, బోర్డుసభ్యులు శ్రీ జి.రామమూర్తి సన్మానించారు.

## పుస్తక విక్రయశాల

తి.తి.దేవస్థానం వారి ధార్మిక విక్రయశాల యాగశాలవద్ద ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడింది. భగవద్గీత రామాయణం, పోతనభాగవతం, అన్నమాచార్యకీర్తనలు మున్నగు పుస్తకాలు అమ్మబడ్డాయి.

ఇవేగాక ఈయాగ సందర్భంగా శ్రీశుక బ్రహ్మాశ్రమం, శ్రీమళయాళస్వామి ఏర్పేడు, ఇంకా ఇతర ధార్మిక సంస్థలు పుస్తకశాలలు తెరచి యాగంలో ధార్మిక గ్రంథాల్ని అమ్మాయి.

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్నజీయరు రచించిన అనేకానేక గ్రంథాలు రామానుజవాణి ట్రస్టు విక్రయించింది.

## ఆధ్యాత్మిక ప్రవచనాలు

యాగశాలవద్ద విశాలమైన ప్రవచన మండపంలో ప్రతిరోజు ఉదయం సాయంత్రం ధార్మిక ప్రవచనాలు కొనసాగినాయి. శ్రీ త్రిదండి చిన్నజీయరుస్వామి, శ్రీ న.చ. రఘునాథాచార్యులు, శ్రీ ఎస్.టి.సి. రామచంద్రాచార్యులు, శ్రీ భాష్యం అప్పలాచార్యులు, శ్రీపాల్వంచ గుదిమెళ్ల నృసింహాచార్యులు, తి.తి.దేవస్థానం ఆళ్వారు ప్రబంధ ప్రాజెక్టు తరుపున శ్రీ శౌరిరాజన్, శ్రీ లక్ష్మీనరసింహభట్టర్, శ్రీ కిడాంబి వేంకటేశాచార్య మొదలగు పండిత ప్రముఖులు, వేదాలు - ఉపనిషత్తులు - ఇతిహాసాలు - పురాణాలు - ఆగమాలు - ఆళ్వారుల వైభవం - మున్నగు అనేకానేక విశేషాలను వివరిస్తూ, ఆళ్వారులు పాశురాలతో సోపపత్తికుడా వివరించారు. విమర్శించి విడమర్చి చెప్పారు.

వీటితోపాటు తి.తి.దేవస్థానం ధర్మప్రచారపరిషత్ వారు, తిరుమల ఆస్థానమండపంలో ఈయాగ సందర్భంగా ప్రతిరోజు భజన, సంగీతం, హరికథ, పురాణప్రవచనం, ధార్మికోపన్యాసం, నాట్యం మున్నగు కార్యక్రమాలు ఏర్పాటుచేశారు.

## గ్రంథావిష్కరణలు

శ్రీవిష్ణుయాగం సందర్భంగా రామానుజవాణి ట్రస్టు ఆధ్వర్యంలో, శ్రీ త్రిదండి శ్రీ చినజీయరు రచించిన శ్రీగీతా వ్యాఖ్యాన గ్రంథాన్ని శ్రీ భాష్యం అప్పలాచార్యులు రచించిన "తిరుప్పావై" గ్రంథాన్ని ఆవిష్కరింపవారు.

26 వ తెది బుధవారం జరిగిన "వైయూహేష్టి" యాగంలో మాజీముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.రామారావు, ప్రధానమంత్రి ప్రధాన సలహాదారు శ్రీ పి.వి.ఆర్.కె.ప్రసాద్, రాష్ట్ర మంత్రి ఎం.నరసింహారెడ్డి ప్రభృతులు పాల్గొన్నారు.

27 వ తేదీ గురువారం జరిగిన "విష్వక్సేనేష్టి" యాగంలో ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి పాల్గొన్నారు. వీరితో పాటు రాష్ట్రమంత్రులు శ్రీ చెంగారెడ్డి, శ్రీ ఎం.నరసింహారెడ్డి, మాజీమంత్రి జె.సి. దివాకరరెడ్డి, శ్రీ గంగులప్రతాపరెడ్డి మున్నగువారు వున్నారు.

ఆ తర్వాత జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ విజయేంద్రసరస్వతిస్వామి, అహోబలం 45వ పీఠాధిపతి శ్రీ అళగియసింగరుస్వామి, మైసూరు పరకాల జీయరుస్వామి, శ్రీ రంగప్రియ రామానుజ జీయరుస్వామి ఒకేవేదికపై చేరి శ్రీ త్రిదండి రామానుజ చినజీయరు స్వామి నిర్వహిస్తున్న విష్ణుయాగం ఎంతోగొప్పదనీ, ఇకముందు ఇలాంటి మహత్కార్యాలకు తామంతా సహకరించగలమని సందేశమిచ్చారు.

27 వ తేదీ రాత్రి యజ్ఞనిర్వాహక సమితి తరుపున వాలంటీర్లకు మెమెంటోలు బహూకరించబడ్డాయి.

28 వ తేదీ శుక్రవారం ఉదయం విశ్వశాంతిని చేకూర్చే "శ్రీమన్నారాయణేష్టి" యాగం జరిగింది. ఆ తర్వాత 1008 హోమ గుండాల్లో మహాపూర్ణాహుతి, ఇష్టి మండపంలో మహాపూర్ణాహుతి అయిన తర్వాత ప్రవచనమండపంలో శ్రీ సీతారాములకు శాంతి కల్యాణం వైభవంగా జరిగింది. పిదప యాగంలో పాల్గొన్న ఋత్త్విక్కులకు యాగం నిర్వాహక సమితి తరుపున శ్రీ డి.వి.ఎల్. ఎన్.మూర్తి పారితోషికం అందజేశారు. ఈ విష్ణుయాగం ముగింపు సందర్భంగా శ్రీ డి.వి. ఎల్.ఎన్.మూర్తి ఒక ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు.

ఇదే సమయంలో శ్రీరంగంలోని రంగనాథస్వామికి అలంకరించిన పుష్పవస్త్రం, పుష్ప కిరీటం, సింహాద్రిక్షేత్రం శ్రీ నృసింహ స్వామివారినుండి మాలలు శ్రీ త్రిదండి చిన జీయరుస్వామికి మంగళాశాసనపూర్వకంగా అలంకరించబడ్డాయి.

అనంతరం ఆరాత్రి 8 గంటలకు శ్రీ వరాహ పుష్కరిణిలో శ్రీ జీయరుస్వామి, ఋత్త్విక్కులు చేసిన అవభృథస్నానంతో "విశ్వశాతి సహస్రకుండాత్మక శ్రీ మహావిష్ణు యాగం" కల్యాణప్రదంగా సమాప్తమయింది. అనంతరం శ్రీ జీయరుస్వామి శ్రీ వరాహస్వామిని, శ్రీనివాసస్వామిని దర్శించి యాగాన్ని నిర్విఘ్నంగా, ఘనంగా నెరవేర్చినందులకు అనేకానేక భక్తిపూర్వక నమస్కారాలుచెస్తూ ప్రార్థించారు.

## మ్యూజియం

తి.దేవస్థానం ఎస్.వి.మ్యూజియం వారు ఈ యాగ సందర్భంగా ఒక ప్రదర్శనశాలను నిర్వహించారు. శ్రీవేంకటేశ్వరుని నూతనవజ్రకిరీటానికి నమూనాగా ఉపయోగపడిన రాగికిరీటం, 16 వ శతాబ్దానికి చెందిన ఆళ్వారుల పంచలోహ విగ్రహాలు అష్టభుజ వరాహమూర్తి విగ్రహం, కుంభకోణం భక్తులు శ్రీస్వామివారికి సమర్పించి వెండి ఆవూ-దూడ, యజ్ఞం రూపకల్పన ఇత్యాదులెన్నో చోటుచేసుకున్న మ్యూజియం వేలాది మందిని ఆకర్షించింది.

## ఆసుపత్రి

ఈ యాగం జరిగేచోట తి.తి.దేవస్థానంవారు అహరహం పనిచేసే 4 పడకల అత్యావసర ఆసుపత్రిని ఏర్పాటుచేశారు. వీటితోపాటు వేలాదిమందికి మందులు ఇచ్చారు.

## ఆయుర్వేదమందులు

తి.తి.దేవస్థానంవారి ఆధ్వర్యంలో డా॥ బాలరాజమహర్షి ఈయాగం సందర్భంగా అజీర్ణం, కండ్లకలక, ఆస్మా, కీళ్లనొప్పులు మున్నగు బాధలతో వున్న సుమారు 15 వేల మందికి ఉచితంగా ఆయుర్వేదం మందులు వితరణ చేశారు.
ఈ సందర్భంగా తి.తి.దేవస్థానం ఆయుర్వేద కళాశాలవారు 250 మూలికలను, 350 మందు మొక్కల నమూనాలను సేకరించి ప్రదర్శించారు.





# తిరుమలలో ప్రధాని



భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు నవంబరు 9 బుధవారంనాడు తిరుమలలో శ్రీవారిని దర్శించారు. ఆలయంవద్ద వారికి ఆలయమర్యాదలతో 'ఇస్తికపాల్' స్వాగతం లభించింది.

ఆలయంలో ప్రధాని దాదాపు 20 నిమిషాలు గడిపారు. అర్చకులు ప్రధానికి శ్రీవారి వైభవం గురించి వివరించారు.

అనంతరం దేవస్థానం అర్చకులు ప్రధానికి శ్రీవారి శేష వస్త్రాన్ని బహూకరించారు. ఆపై ప్రధాని ఆలయ ప్రదక్షిణ చేశారు. విమాన వేంకటేశ్వరస్వామిని దర్శించారు. పిదప రంగనాయకుల మండపంలో ప్రధానిని వేదపండితులు ఆశీర్వదించారు. దేవస్థానం అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి ప్రధానికి శ్రీవారి ప్రసాదాలను అందజేశారు.

ఆలయమహద్వారంవద్ద ప్రధానికి రాష్ట్ర దేవాదాయశాఖ మంత్రి శ్రీ కలికి యానాదిరెడ్డి, దేవస్థానం అధ్యక్షులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి తదితర అధికార ప్రముఖులు స్వాగతం పలికారు.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీలో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తేది 6-3-82న తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల: రూ. 900 అవుతుంది. కనుక తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

**కార్యనిర్వహణాధికారి,**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

Published on behalf of T.T. Devasthanams by N.S. Ramamurthy, M.A , Editor-Incharge and
Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, Manager, T.T.D. Press, Tirupati - 517 507

